SAMULA
SRIMADANDHRA RUGVEDA SAMHITA
V VOLUME
10 Mandala

Compiled and Edited
*by*
Brahmarshi
Vangmaya Mahadhyaksha
**Dr. VADLAMUDI GOPALAKRISHNAIAH**
"Kala-Prapoorna"

*Telugu Translation*
by
Kavyateertha
**NEMANI VENKATANARASIMHA SASTRY**
*and*
Brahmarshi
Vangmaya Mahadhyaksha
**Dr. VADLAMUDI GOPALAKRISHNAIAH**
"Kala-Prapoorna"

T. T. D Religious Publication Series No. 108
*First Edition*
Copies : 2000
Price Rs. 100.

*Published by*
**Sri Ch. VENKATAPATHI RAJU.** I.A.S.
*Executive Officer,*
Tirumala Tirupathi Devasthanams
TIRUPATHI
Andhra Pradesh
INDIA




*Printed At :*
**M/s Jyothi Creations (Printers)**
6-6-100. Devinagar, Kavadiguda
SECUNDERABAD-500 003.
ANDHRA PRADESH

# విషయ సూచిక

# విజయీ భవ!

కమలాఽఽకుచ చూచుక కుంకుమతో
నియతాఽరుణితాఽతుల నీల తనో!
కమలాఽఽయతలోచన! లోకపతే!
విజయీ భవ! వేంకట శైలపతే!॥

కమల=వద్మములయొక్క, ఆకుచ = బీజ కోశముల మీద వున్న - అనగా - దుద్దుల పైన వున్న, చూచుక=కింజల్కములమీదకల, కుంకుమతః=ఎర్రని పుప్పొడిరజమువల్ల,నియత=ఎల్లప్పుడూ, అరుణిత = ఎర్రగా చేయబడిన, అతుల=సాటి లేని, నీలతనో!=నీలిమ వర్ణంతో వున్న శరీరం కలవాడా! అని అసలైన అర్థం. అంటే-"నీలిమవర్ణంతోవున్న సాటిలేని నీ శరీరం ఆపాదమస్తకమూ నియత పూజలో ఉపయోగింపబడే అరుణవర్ణ పద్మ కింజల్కాల పుప్పొడితో యెర్రగా వుంటుం"దని తాత్పర్యం. సాంప్రదాయ సిద్ధంగా గతానుగతికంగా చెప్పుకొంటున్న "శ్రీదేవియొక్క చనుమొనల యందలి కుంకుమ పూవు రంగువలన" అన్న అర్థంలో బొత్తిగా ఔచిత్యం లేదు. చనుమొనల మీది కుంకుమ, ముఖం-వక్షస్థలం-హస్తతలాదులమీద అంటుకొనడానికి అవకాశం వున్నదిగాని పాదాలు-ఊరువులు-ఉదరంవంటివాటిమీదా, మిగిలిన శరీరమంతటా అంటుకొనే అవకాశంలేదు. అందువల్ల యీ గతాఽనుగతికాఽర్థంలో సార్థకతగాని ఔచిత్యంకాని అణుమాత్రమైనా లేదు.

బ్రహ్మర్షి
వాఙ్మయమహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణ
"కళా-ప్రపూర్ణ"



# ముందు మాట

భారతీయజీవనానికి ఆత్మజిజ్ఞాస మూలతత్వం. భారతీయతత్వం ప్రజాసంబంధి; గుహాంతరాలను ఆశ్రయించేదికాదు. బ్రహ్మజిజ్ఞాస మానవజీవితాన్ని ఆధారంగాచేసుకుని వివిధశాస్త్రసీమలనూదాటి, మళ్ళీజీవితరంగంలోనే ప్రవేశించింది. పరమసత్యాలన్నీ ఆత్మసంబంధాలుకావడంవల్ల ప్రజల నిత్యజీవితం వాటిని అనుసరించి సంస్కారం పొందాలి.

మనకు లభించిన వైష్ణవీయమానసిక రచనల్లో వేదాలే ప్రాచీనతమాలు. అత్యంతప్రాచీన ఆర్షవిజ్ఞాన విషయాలనుగురించి ఊహించడంలో ప్రమోదావహాలైన సంగతులన్నిటినీ సమగ్రంగా ప్రదర్శించేవి వేదాలు. భారతీయవిజ్ఞానస్వరూపానికి సంబంధించిన స్పష్టజ్ఞానం కావాలంటే వేదమంత్రార్థాలను విధిగా అభ్యసించాలి.

ఆర్యులు తమ తొలి నివాసాలనుంచి భరతవర్షానికివచ్చిననాటి బుద్ధివికాస యుగానికి చెందినవే ప్రస్తుతం మనకు తెలిసిన వేదాలు. దైవావేశంతో తాము పాడుకున్నగీతాలను ఆర్యులు అమూల్యధనరాశిగా సంకలనంచేసి కాపాడుకోవలసివచ్చింది. తాము ప్రవేశించిన కొత్తదేశంలో ఆదినివాసులైన వివిధదేవతోపాసకులతో సంపర్కం సంభవించడమే దీనికి కారణం. ఋగ్వేదం అలాంటి గీతాసంకలనం.

వేదాలు నాలుగు. అవి ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం. సామవేదం మినహా మిగిలిన మూడూ నామరూపభాషాభావాలలో సామ్యంకలిగివున్నాయి. జగద్రహస్యార్థాన్ని గ్రహించి, ప్రకటించే వుద్దేశంతో సాగిన ఈ వేదమంత్రాల రచన, సంకలనాల మధ్య కొంతకాలం గడిచివుంటుంది. వేదమంత్రాలలో గోచరించే మనః ప్రవృత్తి ఒకరకానికే చెందిందికాదు. ఆకాశంలోని సౌందర్యాల్నీ భూమిమీదవున్న అద్భుతాలనూ తిలకించి, ధ్యానించి మంత్ర రచనతో వేదర్షులు తమ హృదయభారాన్ని తేలికపరచుకున్నారు.

ప్రతివేదానికీ మంత్రాలు, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు అనే నాలుగు భాగాలున్నాయి. మంత్ర సంపుటినే సంహిత అంటారు. సంహిత కాలాన్ని మాక్సుముల్లర్ మహాశయుడు ఛందోయుగం, మంత్రయుగం అని విభజించాడు. ఆయన అభిప్రాయంప్రకారం మొదటియుగంలో మంత్రాలు రచించబడ్డాయి. ఈ గీతాలను రచించింది సృజనాత్మకమైన కవితాప్రతిభతో కూడినశకం. అప్పట్లో యజ్ఞాలస్మరణే లేదు. దేవతలకు ప్రార్థనలే సమర్పించబడ్డాయి. ఇక రెండోది గీతాలను సంపుటిచేసిన యుగం. ఆనాడు వారు వాటిని యేవరుసలో కూర్చారో! అలాగే ఈనాటికీ నిలిచి వున్నాయి. అనంతరం యజ్ఞభావాలు క్రమేపీ తలెత్తాయి.

వేదాలన్నిటిలోనూ ప్రధానమయింది ఋగ్వేదం. నిరాడంబరమైన ఒకకాలానికీ, జాతికీ చెందినమతమే ఋగ్వేదమని స్థూలంగా చెప్పవచ్చు. ఋగ్వేదంలో జగద్వస్తు దర్శనంవల్ల తలెత్తిన కఠినప్రశ్నల పరంపరలకు సమాధానంగా కవితావేశపరులైన వ్యక్తుల మహోత్తేజక ప్రసంగాలున్నాయి. ఋగ్వేద మంత్రజాలమంతా సతార్కికమూ, సుప్రసన్నతామయమూ అయిన మానస ప్రదర్శనమే. ఋగ్వేద మంత్రాలలో ఎక్కడా "ప్రపంచం భ్రాంతి, అసత్యం" అనే భావానికి ఆధారాలు లేవని మనకు తెలుస్తున్నది. ఋగ్వేద సంహితకు సంబంధించి "ఖిల"సూక్తాలతోసహా 1041 సూక్తాలూ, "ఖిల"మంత్రాలతోసహా 10,836 మంత్రాలూ వున్నాయి.

ఋగ్వేదంలాంటి మహోద్గ్రంథాన్ని తెలుగులోకి అనువదించడానికి అభినవ భగీరథ తపస్సు అవసరం. అనువాదకుడికి సంస్కృతభాషావైదుష్యమూ, తెలుగులో ప్రతిభావ్యుత్పత్తులూ, వేదాలకు సంబంధించిన సాంగోపాంగమూ, సర్వతోముఖమూ అయిన ఉపజ్ఞ వుండాలి. అదృష్టవశాత్తూ అన్ని అధికారాలూవున్న కావ్యతీర్థ, శ్రీనేమాని వెంకటనరసింహశాస్త్రిగారు ఈ గ్రంథాన్ని సుమారు అయిదు దశాబ్దాలకు పూర్వమే ఆర్షతపోదీక్షతో అసమగ్రంగా అనువదించారు. శ్రీ నేమానివారు అనువదించకుండా విడిచిపెట్టినభాగాలను పూరించడమేకాకుండా దీన్ని సుపరిష్కృతం

చేసి సమూలంగారూపొందించే బాధ్యతనుకూడా బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, "కళా-ప్రపూర్ణ" డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి అప్పగించడం జరిగింది. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి సంకలన-పరిష్కరణ-పూరణలతో గతంలో "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" నాలుగు సంపుటాలు వెలువడ్డాయి. నాల్గవ సంపుటం అష్టమాష్టకం లోని ప్రథమాధ్యాయంతో ముగిసింది. ఈఅయిదవ సంపుటంలో మిగిలిన ఏడు అధ్యాయాలూ వున్నాయి. శ్రీనేమాని వారు సాయణాచార్య భాష్యానుసారంగా సప్తమాధ్యాయం అసంపూర్ణంగా వ్రాసి అష్టమాధ్యాయం అనువదించలేదు. ఈ భాగాన్ని పూరించడంతోపాటు అష్టమాష్టకం అనేక గూఢవిషయాలకు ఆలవాలమన్న దృష్టితో ప్రతిమంత్రానికి వైజ్ఞానికంగా రెండు అర్థాంతరాలను బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, "కళా-ప్రపూర్ణ" డాక్టర్ వడ్లమూడి గోపాల కృష్ణయ్యగారు విరచించారు.

ఆంధ్రపాఠకమహాశయులకు "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"ను అయిదు సంపుటాలలో సాధ్య మైనంత నిర్దుష్టంగా, సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది అందించడం జరిగింది. ఈ సందర్భంలో అవిరళకృషి చేసిన బ్రహ్మర్షి, వాఙ్మయమహాధ్యక్ష, "కళా-ప్రపూర్ణ" డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి మా హృదయపూర్వక మైన అభివందనాలు.

ఇంతవరకూ ప్రచురించబడ్డ సంపుటాలలాగే ఈ చివరిసంపుటంకూడా ఆంధ్రప్రజల ఆదరాభిమానాలు చూరగొనగలదని ఆశిస్తున్నాము.

ఈ "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" ఐదవసంపుటానికి తమ అమూల్య "సందేశం" యిచ్చిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి శ్రీనందమూరి తారకరామారావుగారికి, "పరిచయము" వ్రాసిన భారత ప్రభుత్వ విదేశాంగశాఖామంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారికి, "ఆముఖం" వ్రాసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయశాఖామంత్రి శ్రీకోళ్ళ అప్పలనాయుడుగారికి మా హార్దిక మైన కృతజ్ఞతాభివందనాలు.

సిహెచ్. వేంకటపతిరాజు. ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి :
జూన్ 16, 1989



జాత్యభిమానజాడ్యములు
చావక పట్టి మతంబు పేరుతో
నిత్యము మానుషావళిని
నీచపు ద్వేషము పెంచుచుండి దు
ష్కృత్యము లాచరించు మత
జీవుల నాశముఁ గోరుచుంట నే
సత్య విదూర జాతిమత
సంగతులన్ వచియింపఁబో నికన్ ॥ 5

కులతత్వాంధత మత్సరావృత మహో
త్క్రాంతాళి జీవించుటన్
గలలోనైనను గోరనట్టి గుణ స
న్మాన్యుండ నే నౌట మత్
కుల గోత్రమ్ములు బైటఁబెట్ట నిఁక వం
ద్యుల్ నేఁటి చారిత్రికుల్
విలిఖింపంగను వాని నెత్తకుఁడు నే
వే నోళ్లఁ బ్రార్థించెదన్ ॥ 6

........త్రికరణ శుద్ధిగా సర్వ సమానత్వముం గోరి మదీయ జాతి మత కుల గోత్రాదులన్ వచియింపక యయ్యవి మానవజాతికి నస్వాభావికంబు లని నిశ్చయించుకొని...................॥ 8

("మానవుఁడు"-పసితనము కావ్యావతారికనుంచి : 1953 ప్రచురణ.)

చూడు-సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత : ఐదవ సంపుటం. పీఠిక. 17వ పేజీ.

# దేవ వేదము

"ఋగ్వేదాలోకమున
దిగ్వలసిత కాలమూల దీప్తులు కల్గున్
ఋగ్వేద దివ్యదృష్టిని
దిగ్వలసన కాలరహిత దీప్తులు వెల్గున్॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



# నిత్య సత్య సూక్తి

—"మన వేదాలు ప్రాచీన భారతీయ విజ్ఞాన నిధానాలు. భారతదేశ అత్యంత ప్రాచీన సంస్కృతీ చరిత్రలకు దర్పణం వంటివి. తన ప్రాచీన సంస్కృతీ చరిత్రల పురావైభవాన్ని విస్మరించే జాతి పతన స్థితికి అభిముఖమైనట్లే। అందువల్ల మన గౌరవాన్ని మన కీర్తిప్రతిష్ఠలను దశదిశలా వ్యాపింప జేయాలంటే మన ప్రాచీన వేద విజ్ఞాన సంస్కృతులను పునరుద్ధరింప జేయవలసిన అవసరం యెంతైనావున్నది"—

శక్తి స్వరూపిణి
శ్రీమతి ఇందిరా ప్రియదర్శిని

మహాయోగినీమోహిని
వేదవిజ్ఞానాభ్యుదయభావాఽంతర్వాహిని
కృష్ణలీలాతరంగిణి
శ్రీమతి ఇందిరాప్రియదర్శిని
ప్రియ పుత్రుడు



నవభారత భాగ్యాభ్యుదయ విధాత
రాజకీయ సంస్కృతీ జ్ఞాన విజ్ఞాన రాగరంజితుడు

**శ్రీ రాజీవ్‌గాంధి**

**మన ప్రధాని**

తెలుగు జనులకు భాగ్యవిధాత
తెలుగు వెలుగులకు నేత



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
నటసార్వభౌమ
డాక్టర్ నందమూరి తారకరామారావు
"కళా-ప్రపూర్ణ"

# సందేశం

డాక్టర్ యన్. టి. రామారావు
"కళా-ప్రపూర్ణ"
ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

మనప్రాచీన భారతీయ సంస్కృతికి ప్రతిబింబాలుగా, మన అనర్ఘ సంపదలుగా విరాజిల్లేవి చతుర్వేదాలు. ప్రపంచ వాఙ్మయ చరిత్రలో శిఖరాగ్ర కిరీటంలో అనర్ఘ మణిదీపాలు మన పవిత్ర వేదాలు. మన భారతీయ బ్రహ్మర్షులు వేదర్షులు తమ దివ్యశక్తులతో గుర్తించగా ఆవిష్కరించబడిన ఈ అనంత వేద సంస్కృతి మనజాతికి వెన్నెముక వంటిది. "లోకాస్సమస్తాస్సుఖినో భవంతు" అని అత్యంత విశాల దృక్పథంతో తమదేశపు మానవాళి సుఖాన్ని మాత్రమే కాక-భూమండలంలో వున్న మొత్తం మానవకోటి సుఖసంతోషాలనేకాక-విశ్వసృష్టిలోవున్న సమస్తలోకాల సుఖాన్నీ మన మహర్షులు మనసారా వాంఛించారు.

మన వేద వాఙ్మయాన్ని పరమవైజ్ఞానిక దృక్పథంతో మన మహర్షులు ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వ వేదాలుగా విభజించిపెట్టారు. ప్రతి వేదాన్నీ బహుశాఖలుగా వేదవ్యాసుడు విభజించి, ఆ బృహత్తర గ్రంథాలను కొన్ని కొన్ని భాగాలుగా కొన్నికొన్ని వర్గ విభజనలతో శాశ్వతంగా నిలిచేటట్లు వంశాలవారీగా-కుటుంబాలవారీగా ప్రతిష్ఠాపన చేయడంలో ప్రముఖమైనపాత్ర వహించాడు. అనేక శాఖలుగా అవతరించిన వేదాల్లో-యెంత భద్రపరచుకుంటూపోయినా-నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు వేదశాఖలు విలుప్తమయ్యాయనే చెప్పవచ్చు. ప్రత్యేకించి సహస్రశాఖాత్మకంగా విభజించిన సామవేదశాఖల్లో మనకు మూడునాలుగు శాఖలుకూడా లభించలేదు. గ్రహాలన్నింటిలోకి గ్రహరాజు సూర్యుడైనట్లు వేదాలకు మణికిరీటంగా సౌరమండలాల విజ్ఞానపరమై అఖండ ఆదిత్యజ్యోతిగా ఋగ్వేదం విరాజిల్లుతున్నది.

స్వాతంత్ర్యానంతరం మనప్రాచీన భారతీయ సంస్కృతీ వికాసానికి అనేక రకాలుగా కృషిచేయడం జరుగుతున్నది. అయినా యీకృషి బహుముఖంగా జరిగిందనికాని, జరగవలసిన తీరులో సక్రమంగా సవ్యంగా జరుగుతున్నదని కాని, మనం భావించే అవకాశం తక్కువగా వున్నది. ఏదియేమైనా "తెలుగుదేశం" ప్రభుత్వం మన సంస్కృతీ వికాసానికీ, పురోభివృద్ధికీ తద్రూపంగా మన ప్రాచీన ఆర్షవిజ్ఞాన సంస్కృతీ సంపదలను మూడుపూవులూ ఆరు కాయలుగా పుష్పించి ఫలించే విధంగా అభివృద్ధి పరచాలని దృఢ సంకల్పంతో వున్నది. తెలుగు విశ్వవిద్యాలయాన్ని పెట్టినట్లుగానే వేద విశ్వవిద్యాలయాన్ని కూడా స్థాపించాలని నేను దృఢ సంకల్పంతో వున్నాను.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు మన ఆర్ష సాంప్రదాయాలను సంస్కృతులను ఆర్ష విజ్ఞానాన్ని, విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించే పథకాలను పెక్కింటిని లక్షలాది రూపాయలను వెచ్చించి అమలుపరుస్తున్నారు. మన రాష్ట్రంలో అనేక సంస్కృత పాఠశాలలకు, కళాశాలలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గ్రాంట్లు నివ్వడం రూపంగా సంస్కృత విద్యాభ్యాసాన్ని ప్రోత్సహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానంవారుకూడా వేదాల సంరక్షణకు-ప్రాచీన భారత సంస్కృతీ పరిరక్షణకూ-పరివ్యాప్తికీ-అనేకమంది వేద శాస్త్ర సాహిత్య పండితులను ఆదరించి పోషిస్తున్నారు. మన ఆర్ష సాహిత్య విజ్ఞాన సంస్కృతీ ప్రచారానికి అనేకాలైన గ్రంథరాజాలను వెలువరించుతున్నారు. ఈ పథకాలకు శిఖరాయమానంగా మూలంతోసహా ఋగ్వేదం ఆంధ్రానువాదాన్ని "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"గా పరి

శోధనాత్మక దృక్పథంతో మూల ఋగ్వేదానికున్న పాఠాంతరాలతో సహా ప్రచురిస్తున్నారు. సుమారు అరవైసంవత్స రాల క్రిందట ఋగ్వేదాన్ని పద్య గద్యాత్మకంగా అనువాదం చేయాలని కావ్యతీర్థ శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి గారు మధ్యమధ్య కొన్ని ఋక్కులనూ, సూక్తాలనూ, చివరి అధ్యాయాన్నీ, అనువదించకుండా విడిచిపెట్టినా - వారు సాయణ భాష్యాన్ని అనుసరిస్తూ చాలావరకూ ఆంధ్రీకరించారు. బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య-"కళా-ప్రపూర్ణ"గారి సలహా మేరకు శ్రీనేమానివారి ఆంధ్రానువాద గ్రంథాన్ని మూల ఋగ్వేదంతో సంకలితం చేసి విడిచిపెట్టబడిన భాగాలను పూరించి ప్రచురించాలనే నిర్ణయానికి వచ్చి ఆబాధ్యతను వాఙ్మయ మహాధ్యక్షులమీదనే పెట్టడం సంతోషకరంగా వుంది.

మొదట ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను నాల్గు సంపుటాలుగా ప్రచురించాలనుకున్నా "ఋగ్వేదంలోని అష్టమాష్టకం నిగూఢ విషయాలతో నిండి నిబిడీకృతమై వుం"దన్న డాక్టర్ వడ్లమూడివారి పరిశోధ నాంశాలతో అర్థాంతరాలతో యిది ఐదు సంపుటాలుగా అవతరిస్తున్నది. డాక్టర్ గోపాలకృష్ణయ్య వేద ఖగోళాది అనేక శాస్త్రాలలో అగాథమైన పరిశోధనలు చేసిన కాకలుతీరిన పండితపరిశోధకులు. అనేక "ఖిల" మంత్రాల రూపంలో "ఖిల" సూక్తాల రూపంలో మంత్రసూక్తాలు విడిపోయి అసమగ్రంగావున్న ఋగ్వేదాన్ని ఆయా మంత్రసూక్తాలతో సుసమగ్రం చేస్తూ ఋగ్వేదంలో సముచితమైన స్థలాలలో కలిపిన శ్రీ వడ్లమూడివారి తపశ్శక్తి మహనీయమైనది.

లోగడ ప్రథమ ద్వితీయ మండలాలతో వున్న ప్రథమ సంపుటమూ, తృతీయ చతుర్థ, పంచమ, షష్ఠమండ లాలతోవున్న ద్వితీయ సంపుటమూ, సప్తమ, అష్టమ మండలాలతోవున్న తృతీయ సంపుటమూ, నవమ మండలం తోనూ దశమ మండలంలోని అష్టమాష్టగతమైన ప్రథమాధ్యాయంతోనూ వున్న "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" నాలుగు సంపుటాలూ వెలువడినాయి. ఇప్పుడు దశమ మండలంలోని అష్టమాష్టక గతమైన ద్వితీయాధ్యాయం మొదలు అష్టమాధ్యాయాంత్యంవరకూవున్న అయిదవ సంపుటం వెలువడుతున్నది. ఈ "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"ను ప్రచురించినట్లే తిరుమల తిరుపతి దేవస్థానంవారు "సమూల శ్రీమదాంధ్ర శుక్ల యజుర్వేద సంహిత" "సమూల శ్రీమదాంధ్ర కృష్ణ యజుర్వేద సంహిత", "సమూల శ్రీమదాంధ్ర సామ వేద సంహిత", "సమూల శ్రీమదాంధ్ర అథర్వవేద సంహిత" గ్రంథాలనుకూడా వెలువరించగలరని ఆశిస్తున్నాను.

ఆబిడ్స్:-
హైదరాబాదు

యన్. టి. రామారావు
ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

# పరిచయం

శ్రీ పి. వి. నరసింహారావు
విదేశాంగశాఖామంత్రి
భారత ప్రభుత్వము

వేదములు మనప్రాచీన భారతీయ మహర్షులు ద్రష్టలుగా అవతరింపచేసిన అపౌరుషేయ మహా సంపదలు "అనంతా వై వేదాః" అని వేదమే పేర్కొన్నట్లు వాస్తవమునకు వేదములనంతములు. అనంతములైన యీ వేదములలో మనకు లభ్యమైనవి కొన్ని మాత్రమే. మొదట వేదమొక్కటిగానే అవతరించగా దానిని చతుర్వేదము లగు ఋగ్వేద-యజుర్వేద-సామవేద-అథర్వ వేదములుగా వేదవ్యాస మహర్షి విభజించి ప్రచారక ప్రవక్త అయినట్లు ప్రసిద్ధికలదు. వేదమునునాల్గు వేదములుగా విభజించి ప్రచార మొనరించిన తొలి మహర్షి పైలమహర్షి యని కొందరు భావింపగా కపిల మహర్షియని కొందరు తలంచినారు. ఏకైక మైన వేదము చతుర్వేదములుగా విభజితమైనప్పటికిని చతుర్వేదములు సైతము మహత్తరాలైన బృహత్తర గ్రంథాలుగా నుండి అధ్యయన అధ్యాపనలకు క్లిష్టముగా నున్నందువల్ల మనమహర్షులే ప్రాచీన కాలములో ఋగ్వేదమును 21 శాఖలుగను, యజుర్వేదమును 101 శాఖలుగను, సామవేదమును సహస్రశాఖాత్మకములు గను, అథర్వవేదమును నవసంఖ్యా పరిమిత శాఖలుగను విభజించి వివిధ శిష్యబృందములకు ఒక్కొక్క శాఖవంతున బోధించి విభిన్న శాఖలను పరివ్యాప్తి చెందించి ప్రచార మొనరించిరి. 21 శాఖలుగా విభజితమైన ఋగ్వేద శాఖలలో ఐతరేయశాఖ-శాకలశాఖ-పౌష్యిమశాఖ అన్న త్రివిధనామాలతో నిర్దిష్టమై నఒకేఒక సంహితాగ్రంథము మనకు లభ్యమై విస్తృత ప్రచారము పొందినది. అత్యంత ప్రాచీనకాలమునుంచి ఒక్క ఋగ్వేదమేకాక మిగిలిన వేదశాఖలు కొన్ని మాత్రమే గురుశిష్య పరంపరగా అధ్యయన అధ్యాపనలతోగూడ సురక్షితముగా నిలిచియున్నవి. "వేదాలు కేవలము గురుశిష్య పరంపరలో అధ్యయన అధ్యాపనల రూపములో మాత్రమే కాక-ఆదినుండియు వేదముల లేఖనమునకు సంబంధించిన లిపి యేర్పడియున్నదనియు-కాగా పుస్తకరూపములో వ్రాసియుంచుటద్వారా కూడా మన మహర్షులు రక్షించినా"రనియు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ప్రథమ సంపుటమునకు వ్రాసిన పీఠికలో వివరించినారు. దీనివల్ల ప్రాచీన భారతీయ ఆర్ష వాఙ్మయ వ్యవస్థ యెంత స్థిరముగా వెలుగొందినదో మనమూహించ వచ్చును.

ప్రస్తుతము భారతదేశములో విస్తృత ప్రచారములోనుండి మన కుపలభ్యమానమైన ఋగ్వేద ఐతరేయ శాఖ కాత్యాయనముని సంపాదితమైనది. అధ్యయన రూపముగానే కాక గ్రంథరూపమున గూడ ఋగ్వేదములోని సూక్తములకు-అధ్యాయములకు-అష్టకములకు-మండలములకు ఒకానొక క్రమవ్యవస్థ నేర్పరచిన వ్యక్తులలో కాత్యాయన మహర్షి ఒకరు. అనంతమైన వేదమునకు ఆద్యంతములు పేర్కొనుట సాధ్యముకాకున్నను అధ్యయన అధ్యాపనలకు ఏదోఒక క్రమవ్యవస్థ ఆవశ్యకము. అందువల్ల సకారణముగానే ప్రాచీనులొక క్రమమేర్పరచిరి. సృష్టివ్యవస్థకు మూలము అగ్ని కాబట్టి అగ్నిసూక్తమాదిగా ఋగ్వేద శాకలశాఖను ప్రాచీనులు రూపొందించినారు. ఈ ఋగ్వేద శాకల శాఖకు కాత్యాయనముని సంకలిత సంహితకు పూర్వమే సాంఖ్యాయన మహర్షి ఒక సంహితను, బాష్కలమహర్షి మరొక సంహితను, శౌనకమహర్షి వేరొక సంహితను, రూపొందించినట్లు కొన్ని వివరాలతో డాక్టర్ గోపాలకృష్ణయ్య గారు ప్రథమ సంపుటమునకు వ్రాసిన పీఠికలో వివరించినారు. ఈ విషయము లన్నింటిని పరిశీలించగా చరిత్రకారు లూహించిన కాలమునందే కాక అత్యంత ప్రాచీన వేదకాలములోనే భారతీయుల లేఖనా స్వరూపమైన 'లిపి' చాల సువ్యవస్థితమై యున్నదని చెప్పక తప్పదు. లిపి-లేఖన వ్యవస్థయే లేనిచో ఋగ్వేదమందలి ఒకేఒక శాఖకు ఇన్ని సంహితలు యేర్పడి యుండెడివికావు. కాగా వేదకాలమున లిపి వున్నదని నిస్సందేహముగా చెప్పవచ్చును.

యాస్కాచార్యుని నిరుక్తము వేదపదార్థములకు స్వచ్ఛమైన దర్పణము వంటిది. భాష్యకర్త లందరిలో సాయణాచార్యులు, స్కందాచార్యులు ప్రసిద్ధులు. ఆంధ్రుడై పుట్టి పెరిగి క్రీస్తుశకము 15వ శతాబ్దములో నున్న సాయణాచార్యులు రచించిన వేదభాష్యము ఒక్క ఆంధ్రదేశమునందేకాక ఆసేతు హిమాచల పర్యంతము పూర్వము నుంచి నేటివరకును విస్తృత ప్రచారము నొంది పరమ ప్రామాణికమై శిరోధార్యముగా భావింపబడుచున్నది. ఆదునిక యుగములో ఆర్ష సంస్కృతీ ప్రచారమునకు వేదవాఙ్మయ ప్రచారమునకు శ్రీదయానంద సరస్వతి చేసిన సేవ అమూల్యమైనది. శ్రీ దయానంద సరస్వతి విరచించిన వివిధ వేదభాష్య విమర్శనాది గ్రంథములు భారతదేశమందంతటను వివిధ దేశ భాషలలో ననూదితములై బహుళ ప్రచారము నొందినవి.

ఆధునిక యుగములో లోకమాన్య శ్రీ బాలగంగాధర తిలక్-డాక్టర్ రాయల్-శ్రీ ధీరేంద్రనాథ మహోపాధ్యాయ-శ్రీ పి. సి. సేన్‌గుప్త-శ్రీ సి. ఆర్. దత్తు-వి. వి. కేత్కర్-రాహుల్ సాంకృత్యాయన మొదలైన భారతీయులు శ్రీ జాకోబ్, డాక్టర్ ఫర్నెల్, డాక్టర్ వింటర్నిట్జ్, ప్రొఫెసర్ మాక్సుముల్లర్, హెచ్. జి. వెల్స్ ప్రభృతి పాశ్చాత్య పండిత పరిశోధకులు వివిధ దృక్కోణాలతో పరిశోధనలు చేసి విమర్శనా పూర్వకమైన పెక్కు రచనలు చేసినారు. వేదాలను సేకరించి భద్రపరచి పండితులతో సుపరిష్కృతము కావించి, ప్రచురించి విస్తృతముగా పండిత ప్రజలకందించుటకు కృషిచేసిన విదేశీయులలో మాక్స్‌ముల్లర్ ప్రథముడు. వేద విజ్ఞానముమీద, వేదసంస్కృతిమీద, వేదములమీద మాక్స్‌ముల్లర్‌కున్న గౌరవ మపారమైనది.

ప్రాచీన కాలమున చతుర్వేదములకు నెందరెందరో పండితులు భాష్యములు రచించిరి. కాని యవియన్నియు వివిధ భారతీయ భాషలలోనికి అనూదితములై, ప్రకటితములై సులభముగా ప్రజల కందుబాటులోనికి రావలసిన యవసర మెంతయును కలదు. విశ్వశాంతి సౌభాగ్యాలకు పెట్టని కోటలుగా వెలుగొందు బహుముఖమైన వేదవిజ్ఞాన రహస్యములు ప్రజల కందుబాటులో లేకుండ పోయినందువల్లనే మన అమూల్యమైన ప్రాచీన భారతీయ సంస్కృతి దెబ్బతిన్నది. సాహితీ సంస్కృతులు ప్రజలకు దూరమైనచో జాతి నిర్వీర్యమైపోవును. అందువల్ల వేదములను వివిధ దేశభాషలలోని కనువదించి ప్రజల కందించుట చాల అవసరమని ఈ శతాబ్దములోనే అనేకులు గుర్తించిరి. తత్ఫలితముగా అనేకులు ఆంగ్లభాషలో విజ్ఞాన ప్రదములైన విమర్శాగ్రంథములు వ్రాయగా శ్రీ దయానంద సరస్వతి హిందీలో పెక్కు గ్రంథములు విరచించిరి.

ఇట్టి యావశ్యకతను 50 సంవత్సరాలకు పూర్వమే గుర్తించి కావ్యతీర్థ శ్రీనేమాని వేంకట నరసింహశాస్త్రి గారు ఋగ్వేదమును చాలవరకు సాయణ భాష్యానుసారముగా లలిత పద సంకలితమైన పద్య గద్యాత్మకముగా నాంధ్రీకరించిరి. శ్రీ నేమానివారు 1882 ప్రాంతములో జన్మించి 1932లో హఠాత్తుగా కీర్తిశేషులయిరి. శ్రీశాస్త్రిగారు సంస్కృతాంధ్ర, ఆంగ్ల, హిందీ, ఒరియా భాషలలో మంచికవి, పండితులు, విమర్శకులు, పరిశోధకులు. వారు దాదాపు ఆరు సంవత్సరములపాటు రాత్రింబవళ్ళు కృషిచేసి బహుగ్రంథ పరిశీలనతో "శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" అన్న పేరుతో ఋగ్వేద శాకల శాఖను చాలవరకు ఆంధ్రీకరించిరి. మధ్యమధ్య వివిధ సూక్తములలోని కొన్ని కొన్ని ఋక్కులు, కొన్నికొన్ని సూక్తములు ప్రమాదవశమునను - కొన్ని ఋక్కులు, సూక్తములు దుర్గ్రాహ్యములుగా నున్నందువల్లను ఆంధ్రీకరింపక విడిచిపెట్టిరి. వారు కీర్తిశేషులైన తరువాత వారి యాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతులు రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయములో భద్రపరచబడగా వాటిని స్వీకరించి తిరుమల తిరుపతి దేవస్థానమువారు మూలవేదముతోసహా యీ ఆంధ్ర ఋగ్వేద సంహితను బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష బిరుదాంకితులు, నాకు చిరపరిచితులు నగు మిత్రులు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ" గారిచేత సంకలనము చేయించి పరిష్కరింపించి లుప్తభాగ పూరణములు చేయించి ప్రకటించుట ముదావహమైన విషయము.

డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు సుప్రసిద్ధ పండిత పరిశోధకులు. గత ముప్పది సంవత్సరములుగ వివిధ శాస్త్రములలోను బహుముఖమైన వేదవిజ్ఞానములోను నవిశ్రాంతముగా పరిశోధన లొనరించుచున్న మేధావి. పైగా అత్యంత హృదయంగమమైన లలిత కవిత రచయించగల మహామనీషి. కావ్యతీర్థ బిరుదాంచితులైన శ్రీనరసింహశాస్త్రి గారి ఆంధ్ర ఋగ్వేదమును పరిష్కరించి శేషభాగ పూరణముచేసి మూల ఋగ్వేదముతో సంకలనముచేయు బాధ్యతను వారు వివిధ దృక్కోణములలో చక్కగా నిర్వహించి యీ బృహత్తరమైన "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"ను నాలుగు సంపుటాలలో రూపొందించినారు.

మూల ఋగ్వేదము సంపూర్ణముగా తెలుగులిపిలో ప్రచురణమగుట యిదే ప్రథమము. మూల ఋగ్వేదమును రూపొందించుటలో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వివిధ ముద్రిత ప్రతులను వ్రాతప్రతులను తులనాత్మకముగా పరిశీలించి పాఠాంతరములను ఆయా సందర్భములలో ఫుట్‌నోట్‌లలో నిచ్చిరి. వేదము పదములమీదనేకాక సుప్రతిష్ఠితమైన స్వరవ్యవస్థపై సైతము నాధారపడియున్నది. స్వరము మారినచో నర్థము మారునని తత్ఫలితము కూడ భిన్నమగునని ప్రాచీన మహర్షులు చెప్పిరి. ఒక్క ఋగ్వేద శాకలశాఖకే బాష్కల సంహిత - సాంఖ్యాయన సంహిత-శౌనక సంహిత-కాత్యాయనముని సంహిత అని నాలుగు భిన్న సంహిత లేర్పడినప్పుడు శబ్దముల విపరిణామములలోనే కాక స్వరముల విపరిణామములలో గూడ, మహర్షులలోనే అభిప్రాయ భేదములున్నవను స్పష్టము ఈ వేద స్వర శబ్దవ్యవస్థల విషయమై మన మహర్షుల అడుగుజాడలలో ఆచరణపూర్వకముగా బహుముఖమైన పరిశోధనలు జరుపవలసి యున్నది. ఈ పరిశోధనలలో నార్ష విజ్ఞానపు నిగ్గులు తేల్చుటకు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారిచ్చిన వివిధ పాఠాంతరము లెంతైనను నుపయుక్తములు కాగలవు.

వేదాలంకార విషయమై డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు ప్రథమసంపుటము పీఠికలో వ్రాసిన విషయములు మౌలికములు. మనకున్న అలంకార శాస్త్రములు తెలుగు వ్యాకరణ దీపమువలె చాల చిన్నవి. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు చెప్పిన విధముగా వేదాలంకారాల విషయమై అంతరాంతరాలలోకి వెళ్ళి పరిశోధనలు చేయవలసి యున్నది.

సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత చతుర్థ సంపుటమునకు వ్రాసిన పీఠికలోను, దశమ మండలములోని 61వ సూక్తములోని 3వ ఋక్కునకు వ్రాసిన సువిస్తృత వివరణాత్మకమైన భాష్యములోను డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వేద ఖగోళాది విజ్ఞానములదృష్ట్యా అష్టమము మర్మస్థాన మన్న దృక్పథముతో బహుముఖాలుగా గుహ్యాతిగుహ్యములైన పెక్కు రహస్యాంశములు బైటపెట్టినారు. వీటిని పరిశీలించగా డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి బహుముఖ వేదవిజ్ఞాన పరిశోధనలన్నియు వెలుగు చూడవలసిన యవసర మెంతేని కలదని తేటతెల్లమగుచున్నది. .

ఆధునిక యుగములో ఖగోళశాస్త్రము కొత్తమలుపు తిరిగి ఆధునిక విజ్ఞాన బలముతో గ్రహాంతర యానమునకు మార్గమును సుగమము చేసినది. ఇది యెంతయు ప్రశంసనీయము. గర్వకారణము. మన వేదర్షులు తమ తపస్సుతో ఔషధీ మంత్ర యోగాది విద్యలతో ఒక్క భూమ్యాకర్షణశక్తికి మాత్రమేకాదు, యే గ్రహాకర్షణ శక్తులకు సైతము లోబడక వాటి ఆకర్షణ శక్తిని సైతము అరికట్టి కేవల మానసిక శక్తితో గ్రహాంతరయానమును నిత్యకృత్యముగా నొనరించుకున్నట్లు చరిత్రయు వేదవిజ్ఞానములును చాటుచున్నవి. ఇటువంటి బహుముఖమైన వేద విజ్ఞానములో అసాధారణమైన పరిశోధనలు చేసి మహత్తర భారతీయ వేద విజ్ఞానమును ప్రపంచము ముందుంచవలసిన అవసర మెంతయు గలదు. ఈ దృష్ట్యా మూల వేద మంత్రశబ్ద-నిశ్శబ్ద శక్తులమీద బహుముఖాలుగా ఆచరణ పూర్వకముగా పరిశోధనలు చేయుట కీ మూల ఋగ్వేద మెంతయు నుపయుక్తము కాగలదు

తిరుమల తిరుపతి దేవస్థానమువారు హిందూధర్మ ప్రచారమునకు బహుముఖాలుగా కృషి చేయుచున్నారు. అనేక గ్రంథములను ప్రచురించి చౌకధరలకు ప్రజల కందించుచున్నారు. వేదముల ప్రచారమునకు కూడ అనేక విధముల కృషిచేయుచున్నారు. వేదపండితులకు గౌరవ వేతనము లిచ్చి పోషించుట, వేద విద్యార్థులకు ఉపకార వేత

నములిచ్చి వేదాభ్యాసమును ప్రోత్సహించుటయే కాక, ఆధునికతా ప్రభావమున క్రమక్రమముగా క్షీణించుచున్న వేదాధ్యయన వ్యవస్థను దృష్టిలో పెట్టుకొని వివిధ వేదములను సస్వరముగా ప్రామాణికులైన పండితులచేత చదివించి టేప్‌రికార్డ్‌కూడా చేయించి ముందు తరాలవారి కోసమై పరిశోధనల నిమిత్తమై భద్రపరచుచున్నారు. చివరికి వేదముల నన్నింటిని నాంధ్రీకరింపజేసి సమూలముగా ప్రచురించి యేవిధమైన లాభాపేక్షయేకాదు తాముపెట్టిన పెట్టుబడినైనను తిరిగి రాబట్టవలయునను దృష్టికూడ లేకుండ చాల తక్కువ వెలకు ప్రజలకందునట్లు చేయవలయునను సంకల్పముతో నీకృషికి సమకట్టినారు. ఇందుకు ప్రతిఫలముగానే యీ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను ప్రకటించుచున్నారు. మొట్టమొదట నాలుగు సంపుటాలలో ఈ ఋగ్వేద సంహితను ప్రకటించవలయునని నిర్ణయించుట జరిగినది. కాని నవమ దశమ మండలాలతో నాల్గవ సంపుటము దాదాపు 1700 పుటల బృహద్గ్రంథముగా రూపొందునని భావించియు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు అష్టమాష్టకము గుహ్యాష్టకమనియు నందులో ననేక రహస్యములు కోకొల్లలుగా నిండి నిబిడీకృతమై యున్నవనియు నభిప్రాయపడిన మాట ననుసరించి యీ అష్టమాష్టకములోని వివిధ సూక్తములకు నాంధ్రమున నర్థాంతరములు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారే వ్రాయుట ఉత్తమమని భావించినందువల్లను, నీఋగ్వేద సంహితను నయిదు సంపుటములుగ వెలువరించుటకు తిరుమల తిరుపతి దేవస్థానమువారు నిర్ణయించుట జరిగినది.

లోగడ ప్రథమ, ద్వితీయ మండలములతోనున్న ప్రథమ సంపుటము; తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలములతో నున్న ద్వితీయ సంపుటమును; సప్తమ, అష్టమ మండలములతో నున్న తృతీయ సంపుటమును; నవమ మండలముతోను దశమ మండలములోని 61వ సూక్తము వరకు-అనగా అష్టమాష్టకములోని తొలి అధ్యాయంతోను కలిపి చతుర్థ సంపుటముగాను వెలువడినవి. దశమ మండలములోని అష్టమాష్టకములోగల ద్వితీయాధ్యాయం మొదలు అష్టమాధ్యాయాంత్యం వరకునున్న అయిదవ సంపుటము యిప్పుడు వెలువడుచున్నది. ఈ అష్టమాష్టకంలోగల సమస్త సూక్తగతాలైన ఋక్కులన్నింటికిని అర్థాంతరములుగా బహుముఖమై పరమవైజ్ఞానిక రూపములైన విశేషములను డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు దైవీయమైసత్యప్రతిబింబకాలుగా విరచించిరి. అందుకు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారికి వేదవిజ్ఞాన శాస్త్ర సాహిత్య విజ్ఞానమండలి ఋణపడిన దనుటలో సందేహము లేదు.

ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను ప్రచురించినట్లే సమూల శ్రీమదాంధ్ర శుక్ల-కృష్ణ-యజుర్వేద సంహితలను, సమూల శ్రీమదాంధ్ర సామవేద కౌథుమ-జైమిని-రాణాయనీయ శాఖ సంహితలను కూడ ప్రామాణిక గ్రంథములుగ ప్రకటించవలసిన అవసరము యెంతయు కలదు. ఏవో చిన్న చిన్న భాగములు తప్ప అథర్వ వేదము యింతవరకును మూల గ్రంథమే ముద్రితము కాలేదు. దాదాపు పదునైదు సంవత్సరములకు పూర్వము ఒరిస్సా రాష్ట్రములో ఒక అథర్వ వేద లిఖిత ప్రతి లభ్యమైనట్లు పత్రికలలో వార్త వచ్చినది. ఈ లిఖితప్రతి ఒరిస్సా ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో భద్రపరుపబడి వున్నది. దీని నాంధ్రీకరింపచేసి అముద్రితముగనున్న మూల గ్రంథముతోపాటు ముద్రించి ప్రకటించవలసిన అవసర మెంతేని కలదు. తిరుమల తిరుపతి దేవస్థానమువారు యీ కర్తవ్య నిర్వహణలో కృతార్థులై విజయవంతులు కాగలరని హృదయపూర్వకముగా నాశించుచున్నాను.

9-మోతీలాల్ నెహ్రూ మార్గ్
క్రొత్త ఢిల్లీ.

ఇట్లు
పి. వి. నరసింహారావు
విదేశాంగశాఖామంత్రి
భారత ప్రభుత్వం.

సాహిత్య విజ్ఞాన సౌరభేయి

విమర్శనాక్షీరార్ణవ రాజహంస



బహుభాషాకోవిద

శ్రీ పి. వి. నరసింహారావు

భారత విదేశాంగశాఖామంత్రి

లైన "ఖిల" మంత్ర సూక్తాలను డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు అనేక తాళపత్ర గ్రంథాలు పరిశోధించి తొలిసారిగా ఋగ్వేదంలో యే యే మంత్ర సూక్తాలు యే యే ప్రదేశాలలో ఉండాలో అక్కడ కలిపి మూల ఋగ్వేదాన్ని సుసమగ్రం చేశారు. శ్రీనేమానివారు అనువదించకుండా విడిచిన అనేక ఋక్కులను, సూక్తాలను, అష్టమాష్టకములోని సప్తమాధ్యాయ శేషభాగమును, అష్టమాధ్యాయమును అసాధారణంగా అనువదించి పూరించారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ సంపుటాలలో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు అనేక వేద విజ్ఞాన విషయాలు తెలియజేశారు. ప్రత్యేకించి చతుర్థ సంపుటంలో అష్టమాష్టకంలోని ప్రథమాధ్యాయంలో గల "ఆరోదసీ అపృణాదోత" అన్న మంత్రమును పురస్కరించుకొని సృష్టి సిద్ధాంతముతో సహా బహుముఖమైన విజ్ఞాన విషయాలను అగాథమైన పరిశోధనలతో లోకంముందు వుంచారు. అష్టమాష్టకం అత్యంత నిగూఢ విజ్ఞాన విషయాలతో నిండివున్నదని డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు నిరూపించుతూ యీ అష్టకంలోని మంత్రాలన్నింటికీ అత్యంత విజ్ఞానాత్మకమైన రెండు అర్థాలను ప్రతిబింబిస్తూ అమేయమైన కవితాధారతో వివిధ పద్యాలు విరచించారు. అష్టమాష్టకంలోని ద్వితీయాధ్యాయంతో ప్రారంభమై అష్టమాధ్యాయంతో ముగిసిన ఈ "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" అయిదవ సంపుటం అశేష విషయాలతో కవి పండిత వైజ్ఞానిక ప్రపంచమునకు జ్ఞాన విజ్ఞానాల భిక్ష పెట్టుననడంలో సందేహంలేదు.

శ్రీనేమానివారు తమ "శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"ను ఆంధ్రదేశంలోవున్న ఆంధ్రులకు అంకితం యిస్తూ వ్రాసిన పద్యాలలోని రెండవ పద్యంలో

"....మా ఆంధ్రదేశంబునందుఁ గల్గు, నూతన సుశక్తి పుత్రుఁడు పూత మతిని
నన్నుఁ దనియింపఁజేయుచున్నాఁడు తెనుఁగు, వేదమును నాదరింపఁడే! వేయిపాళ్ళ"

అని తమ గ్రంథభవిష్యత్తు తమకు ముందుగా తెలిసినట్లే విరచించిన విధంగా "నూతన సుశక్తిపుత్ర"డైన డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి అతిపవిత్రమైన మేధాసంపదతో నూటికినూరుపాళ్లేకాదు వేయిపాళ్లు యీ గ్రంథం సురక్షితమై సుసమగ్రమై సమూలమై సుపరిష్కృతమై తెలుగువారి ఇలవేల్పైన ఏడుకొండలవాని కరుణాకటాక్షాలతో అఖిలాంధ్రావళికీ అంకితంగా వెలుగు చూడడం మహాద్భుతమైన విషయం.

ఆర్ష విజ్ఞానానికి అత్యంత ప్రాధాన్యము నిచ్చి దాన్ని ప్రజలలోనికి తీసికొని వెళ్ళడానికై తిరుమల తిరుపతి దేవస్థానములవారు అత్యంత భక్తి శ్రద్ధలతో చేస్తున్న బహుముఖమైన సేవలతో దైవీయమైన పవిత్ర కార్యక్రమాలకు సార్థకత లభిస్తున్నది. అందుకు తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

హైదరాబాదు
18-2-1989

కోళ్ళ అప్పల నాయుడు
దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం



కావ్యతీర్థ
శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి



బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
“కళా-ప్రపూర్ణ”

# వంధుర స్మృతి!

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

"అఖిలాంబ"-"విశ్వనాథయ్య"ల కావిర్భవించియు
"ముత్తులక్ష్మి"-"నటరాజన్"నా నలరు నమ్మమ్మ తాతలకు
దత్త పుత్రుం డౌచుఁ దనరు"ఎన్. రమేశన్"
"త్రిపురసుందరి" సతిగఁ దేజరిల "సిద్ధార్థ"-
"ఆనంద్"-"ఆదిత్య"-"జయేంద్ర" లలరఁబుత్రులుగాఁగ
దేవ దేవుని పూజ దివ్యమ్ముగాఁ జేసి
ఆర్షవిజ్ఞానమ్ము నౌదలన్ దాల్చుచున్
ధన్యుఁడయ్యెను నన్నె దైవమ్ముగాఁ దలఁచె ॥

వేదవిజ్ఞానంపు వెలుఁగులన్ జూపుచున్
ఆ దివ్య దైవాల అతిలోక శక్తులన్
ఋషుల మార్గాలలోఁ గృషి చేసి పయనించు
నా పరిశోధనా నవ్య పథాఽఽవళులు
అద్భుతావహము లని అమృతాత్ముఁడ నని
ఆత్మలో నానంద మంది "రమేశన్"
"వేదవిజ్ఞానాల విమల రూపములైన
మీ పరిశోధనల్ మిన్నంటి వెల్గఁగా
వేద చతుష్టయము విలసిల్లవలయు" నని
ప్రత్యవాయము లేని సత్యవాక్యమ్ముగా
నన్ను వేఁడుచు దివ్య నర నారాయణ
హృదయుఁడై ఋషి వదగుఁడై తనరారె ॥

ఆ॥ వె॥ శాసనాలలోనఁ జారిత్రికరతుల
స్థూపముల నపూర్వ దీపము లగు
శతశతాబ్దగతులఁ జక్కని శిల్పాల
శోధనము లొసఁగె నగాధముగను ॥

క॥ ఘనమౌ నజయ్య శక్తుల
ననంత వేద పురుషుఁడుగ నవతరణ మ్మొఁ
దిన దివ్యదేవ రూపుఁడ
నని నా కీ వేద మొసఁగి అమరుం డయ్యెన్ ॥

# దివ్యదీప్తి!

బ్
వాఙ్మయ
డాక్టర్ వడ్లమూ
“కళా–

ఆ॥ వె॥ “దేవినేని”వంశ దివ్య సంజాతుఁడౌ
“సీతారామ”యాఖ్య శీతకరుఁడు
తిరుమల తిరుపతి సుదేవళ పాలనాఁ
ధ్యక్షుఁ డయ్యె ధర్మయజ్ఞ మహిమ ॥

శ్రీదేవీవిషమవృత్తము॥
“వేంకట్రామయ–అన్నపూర్ణ”లకు విశ్వేదేవ సందీప్తి క్షే
మంకారిత్వ మనంతరూపగతి ధీమాహాత్మ్య మోంకారమై
అంకమ్మై “శశిరేఖ” ధర్మసతి సౌహార్దాఽఽత్మతన్ నిల్వఁగా
“వేంకట్రావు” సుపుత్రుఁడై “విజయ”తో విజ్ఞానులన్ వైద్యుఁడై
శ్రీంకారాతి సుపుత్రియై సిరులమై “శ్రీదేవి–కోటీశ్వరుం”
డంకాంకాంక గణాంక సనాథనాథలన్ నన్యోఽన్యత్వ మొప్పార నా
టంకం బేమియు లేక అజయ్యుఁడై వెలుఁగు “సీతారామ”యాఖ్యుం డిలన్ ॥

ఆర్షశ్రీవిషమవృత్తము॥
ఆర్షవిజ్ఞానమ్ము నౌదలన్ దాల్చుచున్ – గర్షణార్థిక మహాగణక పరీక్షకుఁడై
వర్షిత సద్భక్తి భావ సద్ధృదయతఁ బ్రి – కర్షతన్ వర్ధిల్లుఁ గ్రాలు “సీతారామయ” ॥

రామశ్రీవిషమవృత్తము॥
హృచ్చిన్మయానంద మొప్పారఁగా నిత్య – సచ్చిదాత్మీయతలు సత్య సేవ్యమ్ములై
నిచ్చలున్ వర్తిల్ల నెగడొందు “దేవినేని” – సచ్చరితవంశ్యుండు చాగు “సీతారామయ

అష్టపదకందము॥
ప్రాచీనమ్మౌ భారత – ధీచరితశ్రీ సుసంస్కృతికి మహితపు ట
ర్వాచీనమ్మౌ విజ్ఞత – సేచన మొనరించుచుండు “సీతారామ”
య్యాచార్యుండో అనఁగా – వీచఁగఁ బ్రాణాఽనిలములు విపులాంధ్రోర్విన్
తూచా తప్పక వాక్కుల – నాచరణమ్మందు నిలుపు నమృతహృదయుఁడై ॥

మాతామహుఁ డంచుఁ జేతావనిగఁ “బ్రవీణ్”
మా పితామహుఁ డంచు మహితగతి “జయరామ్”
బహుముఖాఽభ్యుదయాలఁ బ్రపంచమున వెల్గ
మనుమలై వంశాల మహిత గతి నిల్పఁగా
“సీతారామయ్య” సచ్చిదానందుఁడై నిల్చు ॥

అష్టపదకందము॥
ఇల్లును నొళ్ళును నుల్లము – మళ్ళిన వయసునఁ బవిత్ర మాన్యము లౌచున్
గుళ్ళగ “సీతారామయ” – యెల్ల లెనయనట్టి విశ్వ హృద్దేవళమై
కల్లయుఁ గపటము లేకయె – చిల్లలిత సమూలమైన శ్రీమదృగ్వే
దోల్లసితమ్మై ఆంధ్రము – వెల్లివిరియ దివ్య దీక్ష నిర్వర్తించెన్ ॥



శ్రీ దేవినేని సీతారామయ్య

అధ్యక్షులు :

తిరుమల తిరుపతి దేవస్థానముల

ధర్మకర్తల మండలి



శ్రీ చింతలపాటి వేంకటపతిరాజు ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వాహణాధికారి-

సభ్యులు-కార్యదర్శి

**తిరుమల తిరుపతి దేవస్థానముల**

ధర్మకర్తలమండలి

# విజయపతాక!

బ్రహ్మర్షి
వాఙ్మయమహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

ఉ॥ చింతలపాటి వంశజుఁ డశేష విశేష మహా సేవనా
శాంత గభీర సజ్జనుఁడు చాలగ నేర్మియు నోర్మియున్ జనా
క్రాంత నితాంత దేవళములన్ బ్రభు సేవల పాలనాదక్షతన్
జింతలు లేని రీతిఁ బరిశీలనఁజేయుచు నేలుచుండెడున్ ॥

క॥ అంతర్గతి నాత్మీయత
నెంతేని మదీయమైత్రి నెనసిన చెలుఁడౌ
"మంతెన తిరుపతిరాజు"కు
దాంతుఁడు జామాతగాఁగఁ దగవరియయ్యెన్ ॥

చ॥ చటుల మహావిభూతిమయ క్షాత్రిత శైత్యత సత్య మొచు "వేం
కటపతిరాజు" చంద్రుఁడయి క్రాల "సుభద్ర"యె భద్రపత్నిగా
నటు నిటు రెండు వంశములు నాత్మ పవిత్రత మైఁ దరించఁగా
నిటలమునన్ అదృష్ట గణనీయ సురేఖను బ్రహ్మ వ్రాసెలే ॥

తే॥గీ॥ భవ్య భవ పుణ్య ఫలముగ వరలు "సుబ్బ
రాజు-బుచ్చివెంకాయమ్మ"ల ప్రియ సుతుఁడు
తిరుమల తిరుపతి సుదివ్య దేవళముల
కార్య నిర్వహణపు టధికారి యొచుఁ
గ్రాలు "చింతలపాటి వేంకటపతి" సుత
"గౌరిగాయత్రి"గా వెల్గ జ్ఞానరతులఁ
బరఁగ "నాశ్లేషవర్మ"గా సత్ప్రభల సుతుఁడు
తోడునీడగను "సుభద్ర" యెడుగడగ
వరలు నాంధ్రప్రదేశ్ ప్రభుత్వ "ప్రధాన
కార్యదర్శి"గ సత్కీర్తి గన్న మామ
"యం.టి. రాజు"కు దీటుగా దంట యొచు
వేంకటేశుం డొసంగు నభీప్సితముల ॥

అష్టపదకందము॥

సహన మ్మొక శాక్తేయపు
మహనీయ విశాల శుభ్ర మాహాత్మ్యముగా
సహరహము వెంట నంటఁగ
నిహపరముల "వేంకటపతి" నెల్లఁడు కావన్
గహన సురూప మ్మొచును
సహస్ర రాత్రిమయ కాల యజ్ఞగతుల మద్
విహితమ్మొ ఋగ్వేదము
మహితమ్ముగ వెల్వరించు మాన్యుం డయ్యెన్ ॥

# అభినందన!

బ్రహ్మర్షి
వాఙ్మయమహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

క॥ "తుమ్మల" వంశీకుండై
పెమ్మెగ సుబ్బయ్య కృష్ణవేణుల సుతుఁడై
చిమ్మిన స్వచ్ఛశీతుండౌ
ముమ్మూర్తుల మహిత రామమోహనరావే! ॥

శా॥ ఎండోమెంటు కమీషనర్‌గ జగ నెం
తే దివ్య దేవాలయాల్
నిండన్ గుండెలఁ బ్రాక్తనంపుఁ బ్రతిభన్
దీప్తిన్ బ్రవర్ధిల్లలే!
దండాల్ పెట్టుచు ధర్మ పత్నిగను "ర
త్నాబాయి" వర్తిల్లఁగన్
మెండౌ సంతతి విద్యలన్ విహితమై
మేల్ మేటి ధన్యమ్మగున్ ॥

తే॥గీ॥ శ్రీమహాశ్వేత రూపము చెలఁగు రీతి
నతి పవిత్ర హృదయమున ఆస్తికుఁడయి
దైవకృప నున్నతంపు సుస్థాన మొందె
రామమోహనుఁ డత్యవిరామ కృషుల
రాష్ట్రమునఁ బరిశ్రమల డైరక్టరగుచు
సేవ లొనరించు నిరతమ్ము సిరులు నిండ ॥

ఆ॥వె॥ పరఁగు "రామలక్ష్మి" - వరలు "కృష్ణారెడ్డి"
తల్లిదండ్రు లౌచుఁ దనరఁ బుట్టి
"జంకి బాపురెడ్డి" సాహిత్య సౌహిత్య
పరుఁడు గాఁగఁ గీర్తి వడసినాఁడు ॥

క॥ "రాజేశ్వరి" సహచరిగా
భ్రాజిత జీవనపు ధర్మ భాగస్వామ్యం
బోజోగుణ రూపగ రా
రాజితుఁడై బాపురెడ్డి రాణించు సదా! ॥

క॥ ఉన్నత విద్యలు చదివియు
నెన్న విదేశమ్ముల బహుకృతి సత్కారాల్
చెన్నొందంగ నవార్డుల
మిన్నంటెను బ్రభుతలో కమీషన రగుచున్ ॥

క॥ మధురములౌ సుకవితల వి
విధములుగ వెలయఁగఁ జేసి ద్విగుణాఽన్విత
ప్రథ వెలుఁగ బాపురెడ్డి వి
తథ రహితుండై వరలును ధన్యాత్ముండై ॥



శ్రీ తుమ్మల రామమోహనరావు ఐ. ఏ. ఎస్.
కమీషనర్ :
దేవాదాయ ధర్మాదాయశాఖ- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.
సభ్యులు :
తిరుమల తిరుపతి దేవస్థానముల
ధర్మకర్తల మండలి
13-2-1988 వరకు



"కవిరాజ శిఖామణి"
డాక్టర్ జె. బాపురెడ్డి ఐ. ఏ. ఎస్.
కమీషనర్ :
దేవాదాయ ధర్మాదాయశాఖ-ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.
సభ్యులు :
తిరుమల తిరుపతి దేవస్థానముల
ధర్మకర్తల మండలి
13-2-1988 నుంచి
5-6-1989 వరకు



శ్రీ సి. ఆనందరావు
న్యాయ వ్యవహారాలు-
వాణిజ్యపన్నులశాఖామంత్రి
సభ్యులు :
తిరుమల తిరుపతి దేవస్థానముల
ధర్మకర్తల మండలి
15-2-1989 వరకు



శ్రీ జి. నాగిరెడ్డి
చిన్నతరహా నీటిపారుదల-
చేనేతపరిశ్రమలశాఖామంత్రి
సభ్యులు :
తిరుమల తిరుపతి దేవస్థానముల
ధర్మకర్తల మండలి
15-2-1989 వరకు

## తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తలమండలి సభ్యులు



శ్రీ ఎస్. ఆర్. లక్ష్మీనారాయణ



శ్రీ సి. ప్రభాకర రెడ్డి ఎమ్. ఎల్. ఏ.



శ్రీ బి. రామచంద్రరాజు



శ్రీ ఉండ్రు కృష్ణారావు ఎమ్. ఎల్. ఏ.

## తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తలమండలి సభ్యులు



డాక్టర్ ఎన్. దేవనాథన్



శ్రీమతి వరదా సరోజ ఎమ్. ఎల్. ఏ



శ్రీ యల్. వి. రామయ్య



శ్రీ ఇసుకపల్లి లక్ష్మినరసింహశాస్త్రి

# తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తల మండలి



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

ఈ ఐదవ సంపుటము

బ్రహ్మర్షి

[illegible]

"కళా-ప్రపూర్ణ"

## డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి

షష్ట్యబ్ద పూర్తి

"విభవ" నామ సంవత్సర

ప్రచురణ





ఆర్షవిజ్ఞానాభిమాని

ప్రాచీన భారతీయ సంస్కృతీ ప్రతినిధి

శాంతి అభ్యుదయ సత్య ధర్మ సౌజన్యమూర్తి

ఆర్థిక గణాంక విశేష పరీక్షక మహామేధావి

తిరుమల తిరుపతి దేవస్థానముల

ధర్మకర్తలమండలి

అధ్యక్షులు

## శ్రీ దేవినేని సీతారామయ్యగారి

సమాదరణతో

## సముహాల

## శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

ఈ ఐదవ సంపుటము

ఆవిష్కృతము



# ఆశీస్సు!

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

౧

ఉద్యోగ విధి యన్న ఊసునే మరచుచున్
రాత్రింబవళ్ళు విశ్రాంతి లేకుండంగ
ఈ "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత"
అవతరించుటలోన అహరహము దీక్షన్
సంస్కృతాంధ్రాల సుసంపన్న పాండితీ
గరిమ మీఱంగ నిత్య గవేషణా కృషితోఁ
బరిశ్రమించిన నా ప్రథమ సుత "జయశ్రీ"
"అట్లూరి" వంశజుఁడు అనురాగపూర్ణుండు
"సత్యనారాయణ" సహకరింపఁగఁ బతిగ
మూడేండ్లు నిండకయె ఆడుచున్ బాడుచున్
బహుముఖ విషయాలఁ బ్రజ్ఞలన్ జూపుచున్
మాటలన్ మార్చుచున్ మంచి కవితల నల్లు
చిన్నారి "శ్రీగౌరి" సిరిగాఁగఁ జెన్నొంద-
నా అర్థాంగి "శశికళ" నానావిధాల శ్రమించి
సంస్కృతాంధ్రాఽమృత సాహిత్య గగనాన
దినమణిగ శశికళగఁ దేజరిల్లుచును
నిర్గుణ నిరాకార నిరంజన నిర్వికల్పమౌ
నా పరంజ్యోతినే అర్చనల్ చేసిరి
అమృత రూపమ్మౌచు నమరదీపమ్మైన
దేవ వేదము దివ్య దీప్తులన్ వెల్గఁగా॥

౨

ఋగ్వేద సంహిత కృషి నొనర్పంగ
ఉద్యోగ మని యేమియున్ లేకపోయినన్
దేవదేవుని పాద దివ్యభక్తిని మించి
సంస్కృత సాహిత్య స్వరూప "సత్యశ్రీ"
విదుషీమణి నా ద్వితీయ పుత్రికయు
ధర్మపత్నిగ "రాధ" తగు నా తొలి సుతుఁడు
సరదాగ గేయాల సహజ కవితల నల్లు
సతము "శివరామకృష్ణ సత్యమహాఫణి"
"శ్రీనిధి" సంపదగఁ జెల్వొంది వర్ధిల్లఁ-
గవితలున్ వ్యాసాలు నవిరళమ్ముగ వ్రాయు
నా ద్వితీయసుతుఁడు నవ రచయితగా
వరలు "(వేంకటరమణ హరిహర) రాజఫణి"
విసుగు విరామాలు నన లేమియున్ లేక
ప్రతిఫలాఽపేక్ష లేపాటియున్ లేకుండ
అవసర సమయాల ననుదినమ్మును నాకు
సకల విధాలుగా సహకరించిరి గాన
దీర్ఘాఽఽయురారోగ్య దివ్య సౌభాగ్యాలు।
భోగ భాగ్యాఽఽవళులు పొలుపొంద సర్వదా।
అందరిన్ బ్రోచుతన్ అమృత కృపాదృష్టి
నఖిలేశ్వరుండైన ఆ దేవదేవుండు ॥

సంకలనము - పరిష్కరణము

బ్రహ్మర్షి

వాఙ్మయ మహాధృతి

# డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"

★

**ఆంధ్రానువాదము**

కావ్యతీర్థ

## శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి

బ్రహ్మర్షి

వాఙ్మయ మహాధృతి

# డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"




# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## అంకితము

## ఆంధ్రులకు


కావ్యతీర్థ

**నేమాని వేంకట నరసింహశాస్త్రి**

బ్రహ్మర్షి

వాఙ్మయ మహాధ్యక్ష

**డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య**

"కళా-ప్రపూర్ణ"


**1**

సీ॥ ఐతరేయ బ్రాహ్మణాది వర్ణిత వైభవోపేత దేశమై యుండె నెద్ది ?
రాజనరేంద్ర సంపూజిత పద నన్నయ కవి భూషిత మౌచు నమరె నెద్ది ?
కృష్ణరాయని పేరఁ గృతులు రచించిన కవ్యష్టకముతోడఁ గ్రాలె నెద్ది ?
కావ్య నిర్మాణ సంకల్పన చణులైన కవివతంసులనెల్లఁ గలిఁగె నెద్ది ?
గీ॥ యఖిల జనులకుఁ గ్రొత్తదైనట్టి శక్తిఁ, బుట్టఁజేసిన గ్రంథముల్ పొందె నెద్ది ?
యట్టి మా యాంధ్రదేశమునందుఁ గలుఁగు, నాంధ్రులకు దీని నర్పింతు నంకితముగ ॥

**2**

సీ॥ రాజరాజ నరేంద్ర తేజః ప్రసక్తిచే నన్నయ ఫణితులు మున్నె వెలిఁగె
శ్రీరామ మహిమంబుచేతఁ బోతనమంత్రి భాగవతం బిలఁ బాదుకొనియెఁ
గృష్ణరాయనివల్లఁ గీర్తి గాంచిన పెద్దనాదుల కృతు లెల్ల నతిశయించెఁ
గడు రెడ్ల సంపద కలిమిచేఁ దెన్గున శ్రీనాథ కావ్యంబు శ్రీలు గాంచె
గీ॥ నట్లు మా యాంధ్ర దేశంబునందుఁ గల్గు, నూతన సుశక్తి పుత్రుఁడు పూతమతిని
నన్నుఁ దనియింపఁజేయుచున్నాఁడు తెనుఁగు, వేదమును నాదరింపఁడే! వేయి పాళ్ళు ॥

కావ్యతీర్థ

**నేమాని వేంకట నరసింహశాస్త్రి**

3

ఆ॥ వె॥ దేవ వేద వేద దేవైక్యమై వెల్గు, వేద మనువదింప వాద మగునె ?
శబ్ద మనువదించు శబ్ద శక్తుల నెవ్వఁ, డనువదించునోయి ! యమృత గతిని ॥

4

సీ॥ ప్రభవించి వేలేండ్ల విభవమ్ముతో నుండి శుక్ల శక్తిని మహాశోభ నొంది
యల ప్రమదాత్యము లలరార సృజన శక్త్యతివిపుల గతి సహస్ర వత్స
రాబ్దు లెన్నెన్నియో ! యధిగమింపఁగఁ బృథ్విపైఁ బ్రజోత్పత్తి సుప్రాభవముగ
నా పైని నాంగిరుఁ డవతరించుచు నాంధ్రజాతికి మూలమై చదలు నంట
గీ॥ వేద విద్య విస్తృతి దీప్త విమల శక్తి, దీర్ఘతముఁ డాదిగ మును లుదీర్ణతగను
నాంధ్రులకును మత్కృత సుకృతాంధ్రదేవ, పద్య పారిజాతాల నర్పణ మొనర్తు ॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



# సమరాల

# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—ద్వితీయోఽధ్యాయః

### సూక్తమ్—62

ఋషిః - నాభానేదిష్ఠో మానవః

దేవతా—విశ్వే దేవాః; 1-6-అంగిరసో వా; 8-11-సావర్ణేర్దానమ్

ఛందః—జగతీ; 5, 8, 9-అనుష్టుప్; (ప్రగాథః-6-బృహతీ, 7-సతో బృహతీ);

10-గాయత్రీ; 11-త్రిష్టుప్

(1) యే యజ్ఞేన దక్షిణయా సమక్తా[1] ఇన్ద్రస్య సఖ్యమమృతత్వమానశ ।

తేభ్యో భద్రమంగిరసో వో[2] అస్తు ప్రతి గృభ్ణీత మానవం సుమేధసః ॥ 636

(2) య[3] ఉదాజన్ పితరో గోమయం వస్వృతేనాభిన్దన్ పరివత్సరే వలమ్ ।

దీర్ఘాయుత్వమంగిరసో వో[2] అస్తు ప్రతి గృభ్ణీత మానవం సుమేధసః ॥ 637

(3) య[4] ఋతేన సూర్యమారోహయన్ దివ్యప్రథయన్ పృథివీం మాతరం వి ।

సుప్రజాస్త్వమంగిరసో వో[2] అస్తు ప్రతి గృభ్ణీత మానవం సుమేధసః ॥ 638

---

1. సమక్తాఽఇన్ద్రస్య, 2. వోఽఅస్తు, 3. యఽఉదాజన్. 4. యఽఋతేన. (వ్రా. ప్ర.)

(4) అయం నాభా వదతి వల్గు వో గృహే దేవ పుత్రా[1] ఋషయ స్తచ్ఛృణోతన ।
సుబ్రహ్మణ్యమంగిరసో వో[2] అస్తు ప్రతి గృభ్ణీత మానవం సుమేధసః ॥ 639

(5) విరూపాస[3] ఇదృషయ స్త ఇద్గమ్భీరవేపసః ।
తే[4] అంగిరసః సూనవస్తే అగ్నేః పరి జజ్ఞిరే ॥ 640

(6) యే[5] అగ్నేః పరి జజ్ఞిరే విరూపాసో దివస్పరి ।
నవగ్వో ను దశగ్వో[6] అంగిర స్తమః సచా దేవేషు మంహతే ॥ 641

(7) ఇన్ద్రేణ యుజా నిః సృజన్త వాఘతో వ్రజం గోమ న్తమశ్వినమ్ ।
సహస్రం మే దదతో[7] అష్టకర్ణ్యః శ్రవో దేవేష్వక్రత ॥ 642

(8) ప్ర నూనం జాయతామయం మనుస్తోక్మేవ రోహతు ।
యః సహస్రం శతాశ్వం సద్యో దానాయ మంహతే ॥ 643

(9) న తమశ్నోతి కశ్చన దివ[8] ఇవ సాన్వారభమ్ ।
సావర్ణ్యస్య దక్షిణా వి సిన్ధురివ ప్రథే ॥ 644

---

1. పుత్రాఽఋషయ, 2. వోఽఅస్తు, 3. పాసఽఇదృషయ స్తఽఇద్గమ్భీరః, 4. తేఽఅంగిరసః సూనవస్తేఽఅగ్నేః, 5. యేఽఅగ్నేః, 6. దశగ్వోఽఅంగిర స్తమః, 7. దదతోఽఅష్ట, 8. దివఽఇవసా. (వా్ర. ప్ర.)

(10) ఉత దాసా పరి విషే స్మద్దిష్టి గో పరీణసా ।
యదుస్తుర్వశ్చ మామహే ॥ 645

(11) సహస్రదా గ్రామణీర్మా రిషన్మనుః సూర్యేణాస్య యతమానైతు దక్షిణా ।
సావర్ణేర్దేవాః ప్ర తిరన్త్వాయుర్యస్మిన్నశ్రాన్తా[1] అసనామ వాజమ్ ॥ 646



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—ద్వితీయాధ్యాయము

### సూక్తము—62

ఋషి—నాభానేదిష్ఠుఁడు†
దేవత—1-6-విశ్వే దేవతలు, 7-వైశ్వదేవి, 8-11-సావర్ణమహాదానము‡

(1)*ఉ॥ హవ్యవిశేషదక్షిణల నందుచు మీరు మహేంద్రు సఖ్యమున్
భవ్యతరంబుగాఁగ నివి భాసిలుచుం గడు దేవతాత్వమున్
నవ్యవిధిన్ వహించుచు మనంబునఁ దృప్తినిఁ బొందుచుంటచే[1]
భవ్యము కల్గుఁగాక![2] ననివారిత రీతిని మీకు[3] దేవతల్! ॥ 1414

---

1. శ్రాన్తాఽఅసనామ (వ్రా.ప్ర.)

† నాభానేదిష్టుఁడు, (వ్రా.ప్ర.పా. 15b సంఖ్య గల సంపుటములోఁగల ఋషి దేవతల పట్టికలోని పాఠము.)

‡ ఈ 62 వ సూక్తమునకు శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత వ్రాతప్రతి 13-వ సంపుటములోఁ బై విధముగాను, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతలపట్టికలో "విశ్వేదేవతలు, అగ్నికిరణములు, విశ్వేదేవతలు, సవర్ణి యౌదార్యము" దేవతలుగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

* రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. బొందియుండుటచే, (తా. పా.), 2. కల్గుగాక యనివారిత, (వ్రా.ప్ర.పా.), 3. మీకు నిచ్చలున్, (తా. పా.).

*తే॥ నన్ను గ్రహియించియున్నచో నన్నలార!
నేను యజ్ఞముఁ జేయంగఁజాలఁగలను
కనుక నోయంగిరస్సులు! మనువునైన
నన్ను దరిఁజేర్చుకొనుఁడు ! సంపన్నులార !॥ 1415

2,3 *సీ॥ పణి నీతమౌ[1] ధేనుధనమును గిరినుండి యంగిరసుల్ ! మీర లందినారు!
సంపూర్ణ మైనట్టి సత్రాంతమున ధేను హర్తను బలు మీర లడఁచినారు!
సత్యభూతంబైన సవనంబుచే దివిపేర్చిరకుండగు సూర్యుఁ బెట్టినారు!
సవనాప లొనరించి సర్వభూమిని మీరు సుప్రసిద్ధంబుగఁ జూపినారు!
గీ॥ దీర్ఘమాయుస్సు మరి సదా తేజరిల్లు,సుప్రజయు మంగళంబునుఁ జూపు కర్మ
కలుగుఁగావుత! మీ కిల వెలుఁగు మనువు,నైన నను సంగ్రహింపుఁడీ! యార్యులార!॥ 1416

4 *చ॥ సురవరపుత్రులార ! యతిసూక్ష్మమతుల్ ఋషివర్యులార ! మీ
సురుచిరగేహమందు శుభసూచక వాక్యము నుచ్చరింతు నా
పరమవచస్సు మీరు బహుభంగుల వీనుల నాలకింపు[2] చీ
స్థిరమగు బ్రహ్మవర్చసముఁ[3] జెందుచు నన్నుఁ బరిగ్రహింపుఁడీ !॥ 1417

5, 6 *సీ॥ అంగిరోఋషివరు లధికరూపంబులఁ జెందినారలు తుష్టిఁ జెందినారు !
ఘను లంగిరస్సులు గంభీరకర్మలఁ బొందినారలు కీర్తిఁ బొందినార
లంగిరోఋషివరు లగ్నికిఁ బుత్రత్వ మొందినారు ప్రతిష్ఠ[4] నొందినార
లంగిరోమునివరు లగ్నివల్లన్ జన్మ మందినారు ప్రసిద్ధి నందినార
గీ॥ లట్టి యగ్ని[5] నవగ్వుఁ డౌనట్టి యగ్ని,యిల దశగ్వుఁడుగన్ వెల్గి యెల్ల సురల
తోడఁ గూడిన యా యగ్ని తుష్టి నాకు,ధనము నొసఁగుచునున్నాఁడు ధర్మబుద్ధి ॥ 1418

(7) *చ॥ ఇలఁగల కర్మజాలము వహించెడు నంగిరసుల్ మహేంద్రుతోఁ
జెలిమినిఁ బొంది[6] యశ్వములఁ జెన్ను[7] వహించెడు ధేను సంతతిన్
విలసితమౌ ధనంబు నతివిస్తృత కర్ణ వరీత గోవులం
గలుగగఁజేసి నాకుఁ గడు గౌరవముం గలిపింతుగా కొగిన్ ॥ 1419

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. పణినీతమైనట్టి ధనమున ఘన యంగిరసుల్. (తా. పా.), 2. నాలకింపుఁడీ (తా. పా.), 3. శ్రీఘ్రముబొందును నన్గ్రహింపుడీ, (తా, పా.), 4, ప్రతిష్ఠ, (వ్రా.ప్ర.పా.), 5. లట్టినగ్ని, (వ్రా.ప్ర.పా.), 6. జెలిమినిబూని, (తా. పా.), 7. జెన్నుదొరంగని, (తా. పా.).

(8)*గీ॥ ఎవ్వఁ డశ్వంబులన్ మరి యెవ్వఁ డాల
నీ ఋషికి దాన మొసఁగునో ! యెలమి నట్టి
మనువు వృద్ధినిఁ గాంచును ఘనతవలన
జల సమాక్లిన్న బీజంబు చాడ్పున భువి ॥ 1420

(9)*గీ॥ దివి సముచ్ఛ్రిత మైనట్టి తేజమునను
వెలుఁగు నాదిత్యు కైవడి వెలుఁగునట్టి
మనువు దానంబు నొసఁగెడు మాడ్కి నెవఁడు
దాన మీయంగఁగలవాఁడు ధరణియందు ॥ 1421

*గీ॥ అట్టి సావర్ణిమనువు తా సందఁజేయు
దక్షిణయుఁ [1]బృథ్విమీఁద నితాంత వ్యాప్త
మగుచు విలసిల్లు[2] స్రవియించు తగిన సింధు
వవని విస్తీర్ణ మగుచుండునట్లు తలఁప ॥ 1422

(10)*గద్యము॥
కళ్యాణాదేశులు, బహుగవాదియుతులు పేర్ష్యవత్స్థితులు నగు యదుతుర్వాశు లనెడి
రాజర్షులు మనువు భోజనమునకుఁ బశువుల నొసంగిరి ॥ 1423

(11)*సీ॥ కమనీయ గో వాతగన్ గాల్రిలు మనురాజు మమ్ముల హింసింపమానుగాక !
కర్మనేతల మమ్ముఁ గడు ధనంబున నతఁ డంచితంబుగనుఁ బూజించుఁగాక !
వాని దక్షిణ సూర్యుఁ బోని లోకత్రియమందుఁ బ్రసిద్ధమై యమరుఁగాక !
వాని కిందాద్రిదులు వలయు జీవనమును సదయచిత్తముల నిచ్చెదరుగాక !
గీ॥ యిట్టి మనురాజు చెంత మే మెల్లఁ
గర్మ ములనుఁ జేయుచు నత్యంత మోద మలర
సర్వ లక్షణ గోవుల[3]సంఘములను
బొందఁగల్గుదు మిప్పు డానంద మొప్ప ॥ 1424

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. బృథ్విమీదను దరచు వ్యాప్త, (తా. పా.), 2. మగుచునుండెను, (తా.పా.), 3. గోవుల సకలవిధుల. (తా.పా.).

## సూక్తము—62

ఋషి—నాభానేదిష్ఠుఁడు
దేవత—1-6-విశ్వే దేవతలు, 7-వైశ్వదేవి,
8-11-సావర్ణమహాదానము

### అర్థాంతరము—1

(1)†తే॥గీ॥ శత సహస్రాధిక సుయజ్ఞ సంపదలను
నిందుఁ జే యజ్ఞమునఁ దృప్తి నెనయఁగలఁడొ :
అట్టి సద్యజ్ఞమున సఖ్య మంది యమర
శక్తుల జనాళి దేవానురక్త మగుత :॥ 1425

†తే॥గీ॥ అంగిరస శక్తి సృష్టిలో నాదృతమయి
సర్వ సర్వేశ శక్తుల సఫల మగుచు
సద్భుతావహ మేధా సహాయ మలర
మానవులు మహా మానవ మాన్యుల గతి
వెల్గ స్వీకరింపుఁడు : ధన్య వినుతి మీఱ
నిత్య సత్యత వెలయంగ నిర్మలముగ ॥ 1426

† (2) గోమాయు శక్తులను గోమయము తుంచ
గోవర్ధనము పగిది గోత్రమ్ము నిలుప
నాభి శక్తులు విపుల నవ్య రక్తుల మించ
నానా భువనములు నాగలై వెలయ
అతిలోక శక్తుల నతిదీర్ఘ మౌచు
నాయు రారోగ్యమ్ము నలరంగ నిలువ
నిత్యనూతన మైన నిండు మేధస్సుతో
నిత్యమై సత్యమై నిస్తుల వీర్యమై
విశ్వదేవుని విపుల విశ్వాత్మ మీరంగ
నశ్వరమ్మై జనత అశ్విగా ధార్యమౌ
సర్వ లోకమ్ములున్ శర్వ మహమ్ములై
పర్వాళి పర్వ సఖర్వమ్ముగా నొప్ప
సన్మానముల మీరు సత్యసంధతతో
స్వీకరింపుఁడు ! సదా సచ్చిదానందాళి ॥ 1427

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) సూర్యుఁడే రథ మొాచు శోభ మీఱంగ
దివ్యమై నవ్యమై భవ్యమై వెలుఁగు !
సత్య శక్తులె సృష్టి స్రష్టలను నిలుపు !
భూ భువన జాలాల భా భవ్య లోకాలఁ
బణ్యారములు లేని పుణ్యాళి లోకాళి
ధన్యాళితో మాన్య జన్యాళితో లోల
సద్గతులు చెలఁగంగ దుర్గతులు తొలఁగంగ
స్వర్గ నిసర్గతల్ మార్గమ్ములై నిల్చు
సన్మానముల మీరు సత్యసంధతతో
స్వీకరింపుఁడు ! సదా సచ్చిదానందాళి ॥ 1428

†(4) దేవ సంతతి నవ్య దివ్య శక్తులు మీఱ
శీతలోష్ణాదులు విశీర్ణత వెలయ
మూలమై ధామమై ఆలవాలమ్మై
కాలమై నాభమై మాల జాలమ్మై
అబ్దమై శబ్దమై బుద్బుదము కాక
నిశ్శబ్ద శక్తులే నిగ్రహింపంగ
అబ్రహ్మ కుబ్రహ్మ దుర్బ్రహ్మ కాక
సుబ్రహ్మలై వెల్గ సూర్యాంగిరసులు
సన్మానముల మీరు సత్యసంధతతో
స్వీకరింపుఁడు ! సదా సచ్చిదానందాళి ॥ 1429

(5)†క॥ నానావిధ రూపమ్ముల
జ్ఞానావృతమై గభీర కాలాంతకమై
మానితు లగు నాంగిరసులు
ప్రాణములై వెలయుచుంద్రు ప్రావృట్ఛక్తిన్ ॥ 1430

(6)†క॥ దశదిశలను బుసబుస మని
వశరహితగతి మెయి నగ్ని బహు రూపాళిన్
నశరీర నగుణ నవికా
ర శక్తు లెనయుదు రంగిరస్సులు వెలుచన్ ॥ 1431

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) ఇంద్రునితో సహా సాంద్రశక్తులు వెలయ
సర్వ లోకాలలో సత్కాంతి పుంజాల
వేలాదిగా వెల్గు విపులాష్టవసువుల
మూల్య మమూల్యమై మూలమై నిలువ
ధరియించి భరియించి వరియించి మించు
విశ్వదేవత లౌచు శాశ్వత గతిగ
నశ్వరమ్మై శక్తు లనశ్వరమ్మౌచు
విశ్వాత్మగా నిల్చు శ్రీ విష్ణుమాయగా ॥ 1432

†(8) సృష్టి సద్యోజాత పిష్ట పేషణ లోక
శత సహస్రమౌ తేజ శ్శక్తు లెసయంగ
నిత్యమ్ము జనియించు సత్యపరత్వాన
రాగానురాగాల రాగ రంజిత మౌసు ॥ 1433

†(9) దివ్య శక్తిగ వెల్గు దేదీప్యమానమై
వెల్గుచున్ జీకట్ల వేకార్చి పోకార్చి
సూర్యకాంతిని మించు నార్యకాంతుల సౌరు
సింధువై సంధియై బంధువై మీఱు ॥ 1434

†(10) గోవ్యమై రూవ్య సారూవ్యమై ప్రావ్యమై
వైరూప్యతల్ వెలయఁ బ్రాభవముతో నిల్చు
సృష్టిశక్తులు మహాశ్లిష్టతల్ పొలయ
వ్యష్టి సమిష్టులన్ స్పష్టమ్ముగా వెలయు ॥ 1435

†(11) మహా సహస్రమై మహిమాన్వితమ్మై
సూర్యకాంతులు వెలుఁగ సూరి మను వౌకండె
వివిధ దేవాళుల వేవిధమ్ముల నర్చ
చేసి ధన్యత నొంది చెందుఁ బుణ్యగతుల
నశ్రాంత గతితో నవిశ్రాంత మతితో
విశ్రవణమ్మైన విపుల శక్తులు వెలయ
లోకాలఁ గాలాల కాలవాలము కాక
వేల బద్ధమ్మౌచుఁ గాలమై మాలయౌ ॥ 1436

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—62

ఋషి—నాభానేదిష్ఠుఁడు

దేవత—1-6-అశ్వనీదేవతలు, 7-వైశ్వదేవి, 8-11-సావర్ణమహాదానము

## అర్థాంతరము—2

†(1) అమృతసిద్ధిని గోరి అమల యజ్ఞము చేసి
అగ్నిరూప మ్మైన అసమానశక్తితో
భద్రితలు వెలయంగఁ బరమ పరిశుద్ధతన్
ఇంద్రిశక్తులు మీఱ నతంద్రిరక్తులు చీర
అద్భుత మేధతో అపరిమిత యుక్తులన్
అంగిరస్సుల నగ్ని అమరత్వమును నిచ్చు ॥ 1437

†(2) అతిలోక శక్తితో నసమాన గోమయము
అణుధూళి దుశ్శక్తు లసలు రూపమె మాయ
దీర్ఘాయు వభివృద్ధి దివ్యమై భవ్యమై
నవ్యశక్తుల బ్రితుకు నానా మహమహితాల
నద్భుతమేధతో నపరిమిత శక్తులన్
అంగిరస్సుల నగ్ని అమరత్వమును నిచ్చు ॥ 1438

†(3) నిత్యమౌ సత్యము నిఖిల లోకావళిని
మేర లెన్నో మీఱి సౌర శక్తుల నిల్పి
దివ్యమౌ మాతృ భూ దీధితులు వెలయ
నధిరోహణము లొప్ప నతిరోహణము లొప్ప
నద్భుతమేధతో నపరిమిత శక్తులన్
అంగిరస్సుల నగ్ని అమరత్వమును నిచ్చు ॥ 1439

†(4) ఈ నాభి వలయాల నే చేటు విలయాలు
దేవ పుత్రిల నవ్య దివ్య శక్తులతోడ
ఒకదానివెంట వే రొకటి వచ్చుచునుండ
మంచిచెడులను మలచి ప్రిపంచాన వ్యాపించి
భూ నభోఽంతరాళ భా నాభ మతివేల
జగజంత తేజాల జగ మెల్ల వెలుఁగుగా
నద్భుతమేధతో నపరిమిత శక్తులన్
అంగిరస్సుల నగ్ని సమరత్వమును నిచ్చు ॥ 1440

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

†(5) అతిగభీరమ్మైన అతిలోక కర్మలన్
ఆతివేల రూపాల నతిదృష్టు లమర
ఆ అంగిరస శక్తు లమరంగ నగ్నులై
ఉత్పన్న మగుచుండు నుల్లోల గతు లెనయ ॥ 1441

†(6) బహు రూపములు మీఱ నహరహము వెల్గు
దివి భువుల రవి శశుల దేదీప్యమానమై
నభమందు దశదిశల నవ కాంతు లెనయ
నంగిరస్సులు తమము నంతరింపఁగఁజేయు
దేవశక్తుల మహిత దివ్యత్వ మెనయ
సత్య శక్తుల నిలుచు సకలమ్ము వెలుచ ॥ 1442

†(7) అశ్విశక్తులు వేల లధిగమించుచు వెల్గ
గోళాలు వేలాది గుండ్రమ్ముగాఁ దిరుగ
నింద్రశక్తులు రెండు నీరేడు లోకాల
అష్టవసువులతో సమిష్టిగా వెల్గొందు ॥ 1443

†(8) హెచ్చు లొచ్చులు చాల నెన్నెన్నొ లోకాల
శత సహస్రాధికశక్తి కిరణావళుల
సత్పదార్థము సృష్టి సకలమ్ము వ్యాపించి
మించి వెలుఁగొందునులె సంచితములు పొంద
మంచిచెడులను మంచి పెంచి చెడులను దుంచి
న్యూనరాహిత్యమున ననూనమ్ముగా నిల్చు ॥ 1444

†(9) లోకాల చీకట్ల పోకార్చు సూర్యాళి
అత్యుచ్చ గతి మీఱ మృత్యంతరము దూరు
సావర్ణ్యములు తీర సారసింధువె యగుచు
దక్షిణదిశలోన నక్షీణతను నణఁచుఁ
బార మపారమై సారవంతమ్మైన
సమ మనమ మ్మగుచు సంపదలు నిల్చు ॥ 1445

†(10) అత్యుత్తమమ్మైన అతిలోక లోకాల
యదు తుర్వశు లెల్ల మది ముదము సందుదురు
మంచి పనులను ఘనత మించు గోవుల రీతి
నణుధూళి నశియింప నరివర్గములఁ దుంచు ॥ 1446

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) వేలువేలుగ వెలయు వేలాది లోకాల
సూర్యశక్తిని గాంతి శోభిల్లు రీతిగా
సర్వానవర్ణులౌ సకల దేవాళులు
అతిలోక శక్తులన్ గతి మించు ప్రీతి మించ
నాయువున కాయువై దాయమై న్యాయమై
యతమాన శక్తితో జతమానమై వెలుఁగు ॥ 1447

## సూక్తమ్—63

ఋషిః—గయః ప్లాతః
దేవతా—విశ్వే దేవాః ; 15-16-పథ్యా స్వస్తిః
ఛందః—జగతీ ; 15-త్రిష్టుబ్వా ; 16-17-త్రిష్టుప్

(1) పరావతో యే దిధిషన్త[1] ఆప్యం మనుప్రీతాసో జనిమా వివస్వతః ।
యయాతేర్యే నహుష్యస్య బర్హిషి దేవా[2] ఆసతే తే అధి బ్రువన్తు నః ॥ 647

(2) విశ్వా హి వో నమస్యాని వన్ద్యా నామాని దేవా[3] ఉత యజ్ఞియాని వః ।
యే స్థ జాతా[4] అదితేరద్భ్యస్పరి యే పృథివ్యాస్తే మ[5] ఇహ శ్రుతా హవమ్ ॥ 648

(3) యేభ్యో మాతా మధుమత్ పిన్వతే పయః పీయూషం ద్యౌరదితిరద్రిబర్హాః ।
ఉక్థశుష్మాన్ వృషభరాన్ త్స్వప్నస[6]స్తాగ్ం ఆదిత్యాగ్ం అను మదా స్వస్తయే ॥ 649

(4) నృచక్షసో[7] అనిమిషన్తో అర్హణా బృహద్దేవాసో[8] అమృతత్వమానశుః ।
జ్యోతీరథా[9] అహిమాయా అనాగసో దివో వర్ష్మాణం[10] వసతే స్వస్తయే ॥ 650

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ధిషన్తఽఆప్యం, 2. దేవాఽఆసతే తేఽఅధి, 3. దేవాఽఉత, 4. జాతాఽఅదితే, 5. మఽఇహ,
6. స్వప్నస్తాగ్ంఽఆదిత్యాగ్ంఽఅను, 7. చక్షసోఽఅనిమిషన్తోఽఅర్హణా, 8. దేవాసోఽఅమృత,
9. రథాఽఅహిమాయాఽఅనాగసో, 10. వర్ష్మాణం. (వా.ప్ర.).

(5) సమ్రాజో యే సువృధో యజ్ఞమాయయురపరిహ్వృతా దధిరే దివి క్షయమ్ ।
తాగ్ం[1] ఆ వివాస నమసా సువృక్తిభిర్మహో ఆదిత్యాగ్ం[2] అదితిం స్వస్తయే ॥ 651

(6) కో వః స్తోమం రాధతి యం జుజోషథ విశ్వే దేవాసో మనుషో యతి ష్ఠన ।
కో వోఽధ్వరం తువిజాతా[3] అరం కరద్ యో నః పర్షదత్యంహః స్వస్తయే ॥ 652

(7) యేభ్యో హోత్రాం ప్రథమామాయేజే మనుః సమిద్ధాగ్నిర్మనసా సప్త హోతృభిః ।
త[4] ఆదిత్యా అభయం శర్మ యచ్ఛత సుగా నః కర్త సుపథా స్వస్తయే ॥ 653

(8) య[5] ఈశిరే భువనస్య ప్రచేతసో విశ్వస్య స్థాతుర్జగతశ్చ మన్తవః ।
తే నః కృతాదకృతాదేనసస్పర్యద్యా దేవాసః పిపృతా స్వస్తయే ॥ 654

(9) భరేష్విన్ద్రం సుహవం హవామహేంఽహోముచం సుకృతం దైవ్యం జనమ్ ।
అగ్నిం మిత్రం వరుణం సాతయే భగం ద్యావాపృథివీ మరుతః స్వస్తయే ॥ 655

(10) సుత్రామాణం పృథివీం ద్యామనేహసం సుశర్మాణమదితిం సుప్రణీతిమ్ ।
దైవీం నావం స్వరిత్రామనాగసమస్రవన్తీ మా రుహేమా స్వస్తయే ॥ 656

---

1. తాగ్ంఽఆవివాస, 2. ఆదిత్యాగ్ంఽఅదితం, 3. జాతాఽఅరంకరద్, 4. తఽఆదిత్యాఽఅభయం,
5. యఽఈశిరే. (వా.ప్ర.)

(11) విశ్వే యజత్రా[1] అధి వోచతోతయే త్రాయధ్వం నో దురేవాయా[2] అభిహ్రుతః ।
సత్యయా వో దేవహూత్యా హువేమ శృణ్వతో దేవా[3] అవసే స్వస్తయే ॥ 657

(12) అపామీవామప విశ్వామనాహుతి మపారాతిం దుర్విదత్రామఘాయతః ।
ఆరే దేవా ద్వేషో[4] అస్మద్యుయోతనో రు ణః శర్మ యచ్ఛతా స్వస్తయే ॥ 658

(13) అరిష్టః స మర్తో విశ్వ[5] ఏధతే ప్ర ప్రజాభిర్జాయతే ధర్మణస్పరి ।
యమాదిత్యాసో నయథా సునీతిభి రతి విశ్వాని దురితా స్వస్తయే ॥ 659

(14) యం దేవాసోఽవథ వాజసాతౌ యం శూరసాతా మరుతో హితే ధనే ।
ప్రాతర్యావాణం రథమిన్ద్ర సానసిమరిష్యన్తమా రుహేమా స్వస్తయే ॥ 660

(15) స్వస్తి నః పథ్యాసు ధన్వసు స్వస్త్య ప్సు వృజనే స్వర్వతి ।
స్వస్తి నః పుత్రకృథేషు యోనిషు స్వస్తి రాయే మరుతో దధాతన ॥ 661

(16) స్వస్తిరిద్ధి ప్రపథే శ్రేష్ఠా రేక్ణస్వత్యభి యా వామమేతి ।
సా నో[6] అమా సో అరణే ని పాతు స్వావేశా భవతు దేవగోపా ॥ 662

---

1. యజత్రాఽఅధి, 2. రేవాయాఽఅభిహ్రుతః, 3. దేవాఽఅవ, 4. ద్వేషోఽఅస్మద్యు, 5. విశ్వఽఏధతే,
6. సా నోఽఅమాసోఽఅరణే. (వ్రా.ప్ర.)

(17) ఏవా ప్లతేః సూనురవీవృధద్వో విశ్వ[1] ఆదిత్యా అదితే మనీషీ।
ఈశానాసో నరో[2] అమర్త్యేనాఽస్తావి జనో దివ్యో గయేన॥ 663

## సూక్తము—63

ఋషి—ప్లాతుఁడైన గయుఁడు†
దేవత—పథ్యాస్వస్తిదేవతలు, విశ్వే దేవతలు†

(1)*సీ॥ దూరదేశమునుండి[3] చేరి యేరు మనుష్య బంధుత్వమునుఁ గడుఁ బడయువారొ!
హవ్యదాతలతోడ నతిసఖ్యము[4] నొనర్ప నెవ్వరు వాదింప నేగువారొ!
మానవ[5]ప్రీతులై మనుజగణంబుల నెవ్వరు ధరియించి నెగఁగువారొ!
యల యయాతి నృపాల యజ్ఞంబునం దెవ్వ రొనరంగ నుపదేశ మిందువారొ!
గీ॥ యట్టి దేవత లెల్ల రత్యాదరమున, సురుచిర ధనాదికం బెల్లఁ గరము మాకు
నొసఁగుచున్ మమ్ముఁ గడుఁగడు నుచితరీతి,నిలను సంతతమతిని బూజింతురాక!॥ 1448

(2)*క॥ ఓ సురలారా! యుష్మ
ద్భాని శరీరములు లోక[6]వంద్యము లగుచున్
వాసిగ యజ్ఞార్హములై[7]
భాసిలుచున్నవి విశేష భాగ్యం బలరన్॥ 1449

*గీ॥ దివమునుండి మరియు దీప్తాంతరిక్షంబు
నుండి పృథ్వినుండి [8]మెండు ప్రీతిఁ
బుట్టి మీరు సురలు! పూర్ణేష్టులకు వచ్చి
యాలకింతురాక! లీల పిలుపు॥ 1450

(3)*గీ॥ అఖిల నిర్మాతృ సర్వం[9]సహాదిదేవతలకు
క్షీరంబు స్రవియించు జలద మాల
వలనఁ బరివృఢమౌ[10] దివి వలసినంత
మధుర పీయూష మిడును నే విధమునైన॥ 1451

---

1. విశ్వేఽఆదిత్యాఽఅదితే, 2. నరోఽఅమర్త్యేనా. (వ్రా.ప్ర).

† వ్రాతప్రతి 13వసంపుటములోను, 15b సంఖ్యగలసంపుటములోని ఋషిదేవతలపట్టికలోను ఋషి "గయుడు" గాను, వ్రాతప్రతి 13వ సంపుటములో దేవత "పథ్యా స్వస్తిదేవతలు, వైశ్వదేవతలు"గాను, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతలపట్టికలో "విశ్వేదేవతలు, పథ్యాస్వస్తి"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

3. ఎవరు దూరమునుండి యేగుదెంచి మనుష్య, (తొ.పా.), 4. నత్యంత సఖ్యంబు, (తొ.పా.), 5. మనుజ సంప్రీతులై,(తొ.పా.), 6. వంద్యములు గదా!(తొ.పా.), 7. యజ్ఞార్హములను, (తొ.పా.), 8. యుచిత రీతి, (తొ.పా.), 9. సర్వంసహాఖ్య దేవతలకు, (తొ.పా.), 10. పరివృఢయౌ. (తొ.పా.)

*గీ॥ వృష్టిఁ గల్పించువారిని విపుల బలము
గలుగువారిని గర్మలఁ గలుగువారి
నదితిపుత్రుల స్వస్తికై[1] యతిశయించు
నంతరాత్మమ![2] స్తుతియింపవలయు నీవు ॥ 1452

(4)*గీ॥ అనిమిషులు కర్మదర్శులు ఘనులు సురలు
లోక పరిచరణార్థ మలోల మైన
యమరణత్వంబుఁ బ్రీతితో నఖిల విధులఁ
బొందినారలు ధన్యతఁ జెందినారు ॥ 1453

*గీ॥ దీవ్యమాన రథాఢ్యులు తేజరిల్లు
ప్రజ్ఞఁ గలవారు మరియును బాపరహితు
లైన యాదిత్యులు దివంబునందు స్వస్తి
కొఱకు వసియించుచున్నారు[3] మెరసిమెరసి ॥ 1454

(5)*గీ॥ సహజ తేజో విరాజితుల్ సరస బుద్ధు
లిష్టికిన్ వచ్చుచున్నారు పుష్టిఁ గోరి[4]
వా రహింసితులై దివిఁ జేరి యచట
నమరుచుండెద[5] రెప్పుడు సముచితగతి ॥ 1455

*గీ॥ అధికు లగు నదితి[6]పుత్రుల నదితిదేవి
హవ్యరూపాన్నము లమరి నవ్యనుతుల
స్వస్తికై యంతరాత్మమా! చాల భక్తి
సన్నుతింపుము! సజ్జను లెన్నునటుల ॥ 1456

(6)*గద్యము॥
ఓ దేవతలారా! మిముల నేనుఁదక్క నితరుఁడెవ్వఁడును స్తుతింపలేఁడు. మీ రే స్తోతను సేవించెదరు? జ్ఞాతలగు నో విశ్వేదేవతలారా! మీ రెందరైయున్నారు? దాత్రాది విభాగమున సహజ జనములుగల దేవతలారా! మీ నిమిత్తమే యజమానుఁడు స్తుతులచేతను హవిస్సులచేతను యజ్ఞము నలంకరించుచున్నాఁడు? అట్లెవ్వఁడునుఁ జేయఁజాలఁడు. ఏ యజ్ఞము మా స్వస్తి కొఱకు మములఁ బాపమార్గమునుండి తప్పించునో[7] యట్టియజ్ఞము నెవఁ డాచరింపఁగలఁడు? ॥ 1457

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. స్వస్తికై యతిశయముగ, (తా.పా.), 2. స్తుతియింపుమయ్యనీవు, (తా.పా.), 3. కూర్మి మిగుల, (తా.పా.)
4. పుష్టికొఱకు, (తా.పా.), 5. నమరుచున్నార లేవేళ సముచితముగ, (తా. పా.), 6. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణము ప్రయుక్తమైనది. 7. తప్పించెదరో! (వ్రా.ప్ర.పా.)

(7)*గీ॥ హవ్య సమ్యక్ ప్రదీపాగ్ని యఖిల మనుజ
ముఖ్యుఁడై సన్మనస్సున మోద మలర
నఖిల మానవ గణము ననాద్యమైన
యజ్ఞ మొనరించియుండెఁ దాఁ దజ్ఞుఁడగుచు ॥ 1458

*గీ॥ అదితి పుత్రులైన యమరులారా! మీరు
మాకు సుఖము నిచ్చి మాకు స్వస్తి
నొసఁగి మరియు మాకు నుచితములౌ సువ
థములఁ జూపవలయుఁ దక్షణంబ ॥ 1459

(8)*గీ॥ స్థావరంబునకున్ మరి జంగమమున
కఖిల లోకంబులకు[1] నెవ్వ రధిపు లగుచు
నున్నవారలో! యా యమరోత్తము లిఁక
వేదితలు జ్ఞానవంతులు విశ్వమందు ॥ 1460

*గీ॥ ఉక్తగుణములఁ గలిగిన యో మహాత్మ
లార! కృతపాపముననుండి యకృతపాప
చయమునుండియు [2]సర్వదా స్వస్తిఁ గోరు
మమ్ముఁ దప్పింపుఁడీ! మీరు నెమ్మి మీర ॥ 1461

(9)*గీ॥ పాపమోచకు [3]స్వాహ్వాను వాసవాఖ్యుఁ
బరమ సంగ్రామములయందుఁ గరముఁ బిలుతు
మమర సంబంధు సుకృతుని [4]నన్యజనునిఁ
బిలువఁగలవార మగుదుము [5]ప్రీతి మేము ॥ 1462

---

*రచయిత,—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

1. వ్రాతపతి 13వ సంపుటము 87వ పుటలో నీ పద్యములో "నెట్టి యమరులీశుఁ డున్నవారలో యా యమరోత్తములు కడు," అన్నపాఠము వ్రాసికొట్టివేయఁబడినది. తరువాత మూఁడవపాదము "లగుచునున్నారో: యటువంటి యమరు లఖిల" అని వ్రాయఁబడి కొట్టివేయఁబడినది. కాని పైనపేర్కొన్న పాఠము సరైనదిగా గుర్తింపఁబడినది. ఈ పాఠమే మేము వ్రాసిన వ్రాతప్రతిలో గ్రహీతమైనది. (చూ. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత: వ్రాతప్రతి ACC No. 3784-CALL No. T 25 - 40 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం-పరిశోధనాలయం-హైదరాబాద్.) 2. నిప్పుడే స్వస్తికొఱకు, (తొ.పా.), 3. సుహవుని, (తొ.పా.), 4. నాభగాఖ్యు, (తొ.పా.), 5. లలితనుతుల. (తొ.పా.)

*గీ॥ అగ్ని మిత్రుని వరుణుని నల భగాఖ్య
దేవతను ద్యోభువంబులఁ బావనాత్మ
లౌ మరుత్తుల స్వస్తికి నన్న లాభ
మునకుఁ బిలిచెద మిప్పుడు మొనసి మేము ॥ 1463

(ద్యులోకము నౌకారూపమున స్తుతింపఁబడుచుండెను.)

(10)*గద్యము॥
సుష్ఠుత్రాయంతియు, విస్తృతయుఁ, బాపరహితయు, శోభన సుఖయుక్తయు, అదీనయు, సుప్రణేత్రియు, దేవసంబంధినియు, జలాహరణశీల దాగయుక్తయు, నవినశ్వియు నగు నావ వలె నున్న దివమును లవినాశముకొఱకు (దేవత్వప్రాప్తికి) మే మెక్కఁగలము ॥ 1464

(11)*గీ॥ అఖిల భజనీయులార ! మా యవనమునకు
మీరు మాతోడ భాషించి మిగుల హింసఁ
జేయు దుర్గతి[1] మూలానఁ జెచ్చెర మముఁ
బ్రీతిఁ [2]బాలించెదరుగాక ! ఖ్యాతి మెఱయ ॥ 1465

*గీ॥ అట్టు లొనరించి యున్నచో నమరులార !
స్తోత్రముల విను చున్నట్టి సురల మిమ్ము
స్వస్తికై పిల్చి మే మెల్ల సన్నుతులను[3]
వైరి బాధా విముక్తినిఁ బడయఁగలము ॥ 1466

(12)*సీ॥ అమరులు ! మా కగు నఖిల రోగాదుల దూరంబుగా వేగఁ ద్రోలుఁ డీరు !
దేవతోత్తములార ! దేవతాహ్వానంబుఁ జేయని వారినిఁ జెండుఁ డీరు !
మరియు లోభముఁ గల్గు మనుజుల బుద్ధిని సన్మార్గవర్తిగ సలుపుఁ డీరు !
పాపంబుఁ గోరెడు వైరి దుర్బుద్ధిని ఖండించుచున్ ఖ్యాతిఁ గలుగుఁ డీరు !
గీ॥ ద్వేష్ట లగు సర్వశత్రులఁ దివిరి మీరు, మమ్ము విడిచెడు వడువున నెమ్మిఁ జేయుఁ
డిట్టు లొనరించి పుడమి మా కెల్ల సౌఖ్య, మనమ కళ్యాణమునకయి యొనఁగుఁ డీరు॥ 1467

(13)*చ॥ పనిఁగొని మీర లే మనుజు పాపములం బడఁగొట్టి నీతిచే
తనుఁ గడు స్వస్తిఁ గల్గఁగ నితాంతము సత్పథమందు నుంతు రా
మనుజుఁ డహింసితుం డగుచు మాన్య పశు ప్రముఖాదులం గడున్
ఘనముగ వృద్ధిఁ బొంది కుతుకంబునఁ దాఁ బ్రజతోడఁ గూడెడున్ ॥ 1468

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. దుర్గతు లెల్లను, (తొ.పా.), 2. బాలింపవలయు విఖ్యాతి మెఱయ, (తొ.పా.), 3. నన్నుతుని బిలిచెదము మేము స్వస్తి కొఱకు, వైరివల్లను రక్షణఁ బడయఁగలము. (తొ.పా.)

3)

(14)*గీ॥ అన్నలాభంబునకు నెట్టి యరదము రణ
మందు శూరగణం బుంచు నట్టి యరద
మును ధనంబునకై పుణ్యమూర్తులార!
మీరు సంప్రీతిఁ గాపాడఁ జేరుఁ డిచట ॥ 1469

*గీ॥ కల్యమందునె యనికయి కదలునట్టి
భువిని హింసల నే వేళఁ బొందనట్టి
యధిక భజనీయ మైనట్టి యరదము తగ
నెక్కెదము మేము క్షేమంబు నెల్లఁ బొంద ॥ 1470

(15)*సీ॥ ఓ మరుత్తులు ! మీర లుదక దేశములందుఁ గళ్యాణమును మాకుఁ గలుగఁజేసి
యుదకహీనంబులై యున్న దేశములందుఁ గళ్యాణమును మాకుఁ గలుగఁజేసి
యప్పులయందున నాయుధబలమందుఁ గళ్యాణమును మాకుఁ గలుగఁజేసి
సూను కృచ్ఛ్రిరత్న యోనులందు విశేష కళ్యాణమును మాకుఁ గలుగఁజేసి
గీ॥ [1]యిల వెలుంగుచునున్న మా కెట్టులైన, స్వస్తి నొసఁగుచు మా ధేను వర్గమునకు
మంగళంబు నొసంగుఁడు! మాన్యులార!, [2]వివిధ రక్ష లొసంగుడు! వేల్పులార! ॥ 1471

(16)*చ॥ గమ:నముఁ జేయువారలకు గౌరవ మార్గమునందు [3]స్వస్తిఁ దా
నొన:రఁగఁ జేసిచేసి కడు సుచ్ఛ ధనంబును గల్గి యజ్ఞ క
ర్మను:గని పృథ్వి సంతతము మా గృహరాజము నేలుఁగాకఁ బ్రీ
తిని:మముఁ గాచుఁగాక ! సువిధిన్ బరికించుచు [4]నెల్ల వారలన్ ॥ 1472

*గీ॥ ఎట్టి పృథ్వికి దేవాళి యెల్ల విధుల
నవన కర్తలుగా నుందు రట్టి పృథ్వి
యరమణస్థలి రక్షింప నమరుగాక !
సురుచిర నివాస మగుఁగాకఁ గరము పృథ్వి ॥ 1473

(17)*గీ॥ అఖిల దేవతలార ! యో యతిదిదేవి !
ప్రాజ్ఞుఁ డైనట్టి గయుఁ డను పండితవరుఁ
డిట్టి విధమున సన్నుతి నెలమిఁ జేసి
వృద్ధిఁ బొందించె మిమ్ముల వేడ్క మీర ॥ 1474

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. యిట్టు లొనరించి మరియు మా కెట్టులైన, (తా. పా.), 2. వివిధరీతుల మాకెల్ల విశ్వమందు, (తా. పా.),
3. స్వస్తిఁదా, నొనరఁగఁజేసి శ్రేష్ఠమయి యుచ్చధనంబును, (తా. పా.), 4. నెల్లభంగులన్. (తా.పా.).
:ఈ పద్యములో "మ-న"లకుఁ బ్రాస మైత్రి పాటింపఁబడినది.

*గీ॥ మనుజ ధర్మరహిత జనముస నపు లెల్ల
రిల ధనేశు లగుచు రెల్ల వేళ
గయునివలన దేవగణ మభీష్టతమయి
లోకమందు వెలుఁగు [1]భీకరముగ ॥ 1475

## సూక్తము—63

ఋషి—ప్లాతుఁడైన గయుఁడు

దేవత—పథ్యా స్వస్తిదేవతలు, విశ్వేదేవతలు

### అర్థాంతరము—1

†(1) అతిదూర లోకాల ననంత గ్రహ నక్షత్రాలు
పరిసరించుకాంతులను నమించు దాంతులను
జ్ఞానరూపము లెల్ల జతన మందుచు విరియ
బర్హిస్సులై నిలిచి బార్హస్పత్య గతి వెలయ
యమము లవి కలియ నియమముల్ నిలువంగ
జనన మరణావళులు జతన మొందుచు నుండు ॥ 1476

†(2) విశ్వాంతరాళాన విపుల రవి గోళాలు
విమల యజ్ఞముల గతి నమలానలానిలముల
వెల్లివిరియఁగఁజేయ విశ్వకాంతులు వెలయుఁ
బ్రకృతినంపద లెల్లఁ బ్రాకృతములై నిలుచు
అవితథమౌ శక్తి నహాకృతగతి రక్తి
జన్యమై గణ్యమై జగతిలో వెలుఁగొందు
పంచభూతావళులు ప్రాణులను నిలుపంగ
సృష్టిమూలంబౌచు సృష్టశక్తుల నిచ్చు
వ్యష్టినమిష్టులను బిష్టపేషణ మట్లు
దివ్యదేవావళుల నవ్యశక్తులు మీఱ
భవ్య భవ భోగాల గవ్యామలరాగాల
లోకాల ప్రాకామ్య రాకాసి ఘూకాళి
శోకాలఁ బోకార్చు సుకృత హవ్యామృతము
హవ మౌచు నవ మౌచు హైహయులను మించు ॥ 1477

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ప్రకటముగ. (తా.పా.)
†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) ఒకవంకఁ జాలుగా వే రొకవంక నీరుగా
జోరుగా వానలై జాలువారంగ
మధువుగా మధువులకు మధువుగాఁ గురియ
దివి భువి లోకాల దివ్యశక్తులతోడ
ఆదిత్యు కృపమీర ససుమోద మొంద
వృషభరాశుల శక్తు [1]లుషసులై పొడవ
నాయురారోగ్యము లలరారుచుండు
నంతర్గతభాగ్య మభ్యుదయ మందు ॥ 1478

†(4) ఆకసమునఁ బదునొకం డాదిత్యు లలర
సమలమై అమరమై అమృతమౌ శక్తులను
ఆదిశేషువు మాయ లద్భుతముగా నిలువ
వెలుఁగులకు వెలుఁగులే వేవెల్గులట్లు
ఫణి ఫణాగ్రము మీఁది మణి గణము వెల్గ
అచ్చర లద్భుతాత్మత ననిమిషులై చూడఁ
గామరూపము లొప్పఁ గర్మ సాక్షులుగా
బృహద్దేవత లెల్ల మహితులై నిల్చెదరు ॥ 1479

†(5) ఆదిత్యదేవతలు అసమాన గతుల
నాదరింపఁగఁ దలఁచి అఖిలాండములను
పిండాండ బ్రహ్మాండభాండాల నిలుచు
వివిధదేవావళులు విపుల జనావళులు
పలువిధప్రాణులు చెలువొందు కణావళులు
జీవకణములు నిర్జీవకణములును
యజ్ఞశక్తులు మీఱ సుజ్ఞానగతి మేర
లజ్ఞానముల వీడి ప్రజ్ఞానముల వాఁడి
విశ్వమ్ము వ్యాపింప విశ్వశాంతులు విరియ
నశ్వజాలాదిత్య శాశ్వతత్వము మీఱ ॥ 1480

†(6) దివి భువి లోకాల దివ్యశక్తులు వెలయఁ
బంచభూతా లవ్వి పంచీకృతము కాఁగ
పలువిధ శక్తులన్ అలవోకలై కూడి
ఒకదానిలోనొకటి ఒదిగొదిగినిల్చుచున్

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఇక్కడ ఋ-ఉ లకు యతి. (చూ. పీఠిక)

విడివడుచుఁ గలివడుచు విపుల విశ్వము నిండి
దుష్కర్మలన్ విలిచి దుష్ఫలములన్ దుడిచి
మానవుల్ దేవతలు మరి వేరు ప్రాణులన్
విశ్వసంక్షేమాల విమలాశ్వయజ్ఞాల
నెరపుచున్ బరపుచున్ నెరజాణతనములను
విశ్వలీలలతోడ విశ్వాత్మ వెలుఁగొందు ॥ 1481

†(7) ఆదిత్యశక్తులు అద్భుతాభయ మొసఁగ
అమలకాంతులై నిత్య హవ్యమై నవ్యమై
అఖిలవిశ్వము నొంద నలరారు ప్రాణుల
అగ్ని హృదయము లెల్ల నమృతమై విరియ
సన్మార్గముల నిల్పి సత్పదార్థము వెలయ
నఖిల జీవావళులు సమిత తృప్తిని చనిసి
అది సృష్టి సహజమై మది స్రష్ట నైజమై
అదవదలు లేకుండ సదమలమై నిలుచు ॥ 1482

†(8) ఈ జగమ్మునఁ గల్గు నీరేడు నేడేడు
నగణితముగా నిలుచు అఖిల లోకాలను
చరము నచరములౌచు నలరారు సృష్టిలో
విశ్వాన సత్వాలఁ గ్రతము విశృతమ్ముగా సకృత
దేవాళులు రక్షిత దివ్య శక్తులు మీఱ
సేశ్వరశక్తితో నెసలారుఁ బ్రిభలతో ॥ 1483

†(9) అనలమ్ము ననిలమ్ము నా జలము వెలుఁగు
మృత్ప్రియమై నిలుచు మేర లెనయని సృష్టి
పుణ్యకర్మలు పాపపరిపాక కర్మలున్
క్షాళనమ్మై పూర్ణ పూర్వకర్మ పుణ్యావళిగ
నెలవొంద "స్వాహ"గా నిత్యశక్తులతోడ
సుకృతమయమై నట్టి సుహవము చేయ
దివ్య దేవావళుల నవ్యశక్తులు మించి
జనుల దుష్కర్మల నిందరి జవశక్తు లణఁగించు ॥ 1484

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"



†(10) అతివిశాల మ్మగుచు నతిలోక శక్తి
నిరపాయగతి నింగి నెనరుమై దాఁటించుఁ
పాపపుణ్యము భ్రష్టు పట్టించు రీతి
సర్వశుభసంజాత శర్మ లెల్లను బర్వ
నాశనము నెరుఁగని నవ్య నావయె దివ్య
దేవవాహన మౌచు దీప్తులన్ మీఱ
సృష్టికిఁ బ్రతిసృష్టి చేయు సురవరులు
నరులు ఋషు లమర్త్యులు నసురాళి కుంప
స్వస్తి కోరుచు సృష్టి సంచలనాత్మతన్
వెలుఁగుచుందురు మహా విజ్ఞతల్ మెరయ ॥ 1485

†(11) త్రేతగాఁ ద్రివిధమై జ్ఞాత విశ్వమ్ము
సృష్టి స్థితి లయ [1]రూప చేష్టతన్ బొంద
వ్యష్టి సమిష్టులను నష్ట మనష్టమున్
దైవీయమై నిలువ దాక్షిణ్యశక్తులన్
స్వస్తియే లక్ష్యమై సత్యమై నిలువ
దైవీయమౌ నావ తరణమై వరలు ॥ 1486

†(12) విశ్వాంతరాకాశ విపుల పంచభూతాళి
ప్రవహించు నీరము పగిదిఁ దేజాలు
వెలుఁగొందుచున్ నిలుపు మంచిచెడ్డల
మంచిని వంచించ మలఁగు నెపుడున్ చెడులు
చెడుల ధ్వంసము చేయఁ జెన్నొందులే! మంచి
పడుగుపేకగ నిలుచు పలు కష్టసుఖములన్
కష్టముల్ పాపముల్ భ్రష్టమ్ము కాఁగఁ
బుణ్యకార్యము లెల్లఁ బుష్టిగాఁ దుష్టిగా
పణ్యారము మీఱ గణ్య మగణ్యమై
ధన్యమై వెలుఁగొందు జన్య మజన్యమై ॥ 1487

†(13) ధర్మమ్ము తా మించి అధర్మమ్ము వంచి
విశ్వ మంతట శుభము విమలమై వెలయ
సర్వారిష్టముల్ నిర్వాసమై పోవ
సునీతి సుధర్మమ్ము సుష్టుగా వెలుఁగ
యమ నియమావళులు యతి శక్తి నిలువ
దురితాల నాదిత్యుఁ డతిముఱిగఁ ద్రుంచు ॥ 1488

---

†రచయిత :—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఋ-రూలకు యతి. (చూ. పీఠిక.)

†(14) వివిధ మరుత్తులు విశ్వాస వ్యాపించి
అష్టవసువుల శక్తు లాకసము నింద
దైవీయమై నిలిచి తలపంచకుంద
శూర హిత బలవర్ధ ధార లౌరయంగ
నతిలోక శక్తితో నఖిల గాములుగా
దివ్య దేవావళులు దేజరిల్లంగ
నింద్రశక్తుల సుఖము లెసఁగ మెసఁగంగఁ
బంచభూతము లెల్ల వరలుచు నుండు ॥ 1489

†(15) విమలమై విపులమౌ విశ్వాళి మరుదాళి
ఆత్మ శుభమున నిలిచి అమలోపకాళి
ఆకసమ్మున నగ్ని నఖిల మృత్పదార్థాల
జనకశక్తుల నిల్చి జన్యశక్తుల నిల్పి
సర్వభూతావళులు శర్మమ్ములన్ నిలువ
సృష్టియే స్వస్తిగా సృష్టగా నిలుచు ॥ 1490

†(16) దేవగుప్తమ్మైన దివ్య నవ శక్తులు
స్వస్తిగా దాక్షిణ్యమూర్తులన్ వెలుఁగ
వామశక్తులు సృష్టి భ్రష్టు పట్టింప
స్వావేశమున నిలువ సంహరించునులే!
శ్రేష్ఠమై విశిష్టమౌ శీల సంపద లెల్ల
భవ శుభ సుఖములఁ బరిఢవిల్లఁగఁజేయు ॥ 1491

†(17) విశ్వాన ఆదిత్య విపుల శక్తులు నిండి
విమలమై విస్తృత శమ దమ గుణములన్
దివ్యమ్ముగా నిలువఁ దేజరిలు గోశాల
నరవరులన్ సైత మిరవొంది సురరూపి
అమర్త్య శక్తు లవి అమరమై వెలుఁగ
నీశానుఁడే సర్వ జగదీశుఁడై నిలుచు ॥ 1492

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—63

ఋషి—ప్లాతుఁడైన గయుఁడు

దేవత—పథ్యా స్వస్తిదేవతలు, విశ్వేదేవతలు

### అర్థాంతరము—2

(1)†క॥ ఒధిసాగర మప్పులతో
మథిత మ్మగుచు నవనీత మహిత జరితమై
బుధవర్గము సేవింపఁగ
నధికృతమై నిలుచు బుద్ధి అభివృద్ధి గలిస్ ॥ 1493

†క॥ సహుష వ్యవస్థ ఫలగతి
మహనీయత వెల్లివిరియ మర్మరహితమై
అహమహమికతోఁ బ్రిముదిత
వహనీయమ్మై నిలుచును బ్రావృట్క్రియలన్ ॥ 1494

(2)†గీ॥ విశ్వవిశ్వాత్మ ప్రాకృతవిస్తృతమయి
దేవదేవుల యజ్ఞాల దివ్యగతుల
నగ్ని కీలల ధూమ్ర ధూమాళు లెల్ల
శాంతిసంధాయకములయి కాంతు లీను ॥ 1495

†గీ॥ అదితిశక్తులు పృథ్వుల నతకరించి
జన్యజననీయ ఘనతర శక్తు లెనయ
విస్తృతమ్ముగ వ్యాపించి విమలగతులఁ
బ్రాప్తప్రాప్యమ్ములను నెల్లఁ బ్రిబుత నెఱపు ॥ 1496

(3)†శా॥ ఆదిత్యుండు మహాద్భుతంబయిన మాహాత్మ్యంబు వర్ధిల్లఁగా
మోదామోద పరావృతంబగు జగత్పూర్ణ ప్రభల్ వెల్గఁగన్
బోధిన్ సృష్టికి ఛత్రమై వరమహారోదోఽంతరౌన్నత్యమున్
నాదారూఢ సదాత్మతన్ నిలుచులే! నవ్యాదృతిన్ నిత్యతన్ ॥ 1497

(4)†మ॥ అనిమేషస్థితి నంతరిక్షమున సర్వారూఢతన్ వెల్గుచున్
ఘనరూపమ్ములఁ గామరూప వశతన్ గాంధర్వ మృద్బుక్కుగా
ఫణిమాణిక్య మహాఽమృతోద్భరితమై భాసించుచున్ జ్యోతిషీ
ప్రణవవ్యక్త సదా మహామహిత శోభానాద మొప్పన్ గదా ! ॥ 1498

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) ఆదిత్యశక్తితో నదితి వర్ధిల్ల
నఖిల లోకావళుల కాధారభూతమై
అభినవమ్ముగ నిత్య మభివృద్ధి చెందు
సృష్టిలో సర్వమ్ము నిష్టిగా జరుగు
వ్యష్టిగా సమిష్టులనుఁ బుష్టితో నిలుచు
దివు లెల్ల నవ్యత దివ్యత్వ మెనయు
సర్వ సృష్టిని సదా సచ్ఛక్తు లుండు
నంద మొలికెడి చిదానందమ్ము నిండు ॥ 1499

†(6) విశ్వమ్ము నెవ్వఁడు విస్తృతపరచె?
దేవావళుల నెవఁడు తేజరిల్లఁగఁజేసె?
మానవాళుల కెవఁడు మనుగడ లొసఁగె?
నధ్వరాళుల నెవ్వఁ డలరించె శాంతి?
నా దేవదేవుండె అలరించు సృష్టి
యతిమతి ధృతి మీఱ నతిలోక పుష్టి ॥ 1500

†(7) సప్తాగ్ను లవి వెల్గ సర్వ దిక్కులను
అభయమ్ము సుపథాల నద్భుతముగా నిల్వ
ఆకర్షణ శక్తుల కలవి కాకుండ
సర్వసుఖములఁ గూర్చి సకల శుభాలు
నలరంగ పిరియంగ నణిముఱుల్ లేక
ఆదిత్యుఁ డొసఁగూర్చు నపిరళ గతితో ॥ 1501

†(8) విశ్వమ్ము వ్యాపించు విపుల జగత్తులో
భువనాల భవనాల నవ శక్తు లెనయఁ
గృత మొౘు సురల కకృత మొౘు నిలిచి
స్వస్త్యర్థమై సర్వ శర్మమ్ము లలర
నీశ్వరుండై సర్వలోకేశ్వరుండై
మేలెంచి సృష్టించి పాలించుచుండు ॥ 1502

†(9) పంచభూతావళులఁ బరగు విశ్వాలఁ
బృథివిలోఁ బృథివిగా నుదకాల నుదకముగ
అనలాన ననలముగ ననిలాన ననిలముగ
గగనాన గగనమై కలివిడిగ నిలిచి
దైవీయమౌ సుకృతి ధన్యతల్ గూర్చ
మురిపించి మరపించి తరియించు బ్రతుకు
ఐది మహాయజ్ఞమై అలరారుచుండు
జనత సంక్షేమాల సర్వేందుఁ డొసఁగు ॥ 1503

---

†రచయిత :——వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(10)†క॥ ద్యావా పృథ్వ్యలను బృహ
న్నావగ దైవీయ శక్తి తనరారంగా
బ్రావృణ్మయ సుత్రాములు
సేవముగా వెల్గుచుండు నిర్మల గతిమై ॥ 1504

(11)†క॥ సత్య స్వరూప విస్తృత
నిత్యత్వగ విపుల విశ్వ నిస్తుల గతులన్
బ్రిత్యభిహూత యజ్ఞమ్ముగ
వృత్యంతర దేవహూతి దీప్తులు నిలుచున్ ॥ 1505

(12)†క॥ విశ్వ మనాహూతి శక్తుల
నశ్వరమై నిశ్చలామృతాద్భుతమయుమై
శశ్వన్నిత్య శుభావృత
పాశ్వ సురూపమయ సప్త వర్ణము లలరున్ ॥ 1506

(13)†శా॥ ఆదిత్య ప్రభ లెల్ల విశ్వమున నిత్యానందతన్ సత్యమై
మోదాఽఽమోద మహాప్రపంచిత పరామూర్తి ప్రకాశమ్ముగా
నాదాత్మోజ్జ్వల శక్తి సర్వ దురితాల్ నాశమ్ము కాఁగన్ అరి
ష్టాదుల్ పూర్తిగ నాశ మౌచు మహితాద్యప్రాభవ మ్మౌనులే! ॥ 1507

(14)†క॥ దేవతల శూర శక్తుల
నే వేళన్ మహిత పూర్ణ హృదయ మరుత్తుల్
వేవేలై విశ్వమ్మునఁ
బ్రావృట్కాలమ్ము మొదలు పరఁగుత నెపుడున్ ॥ 1508

†(15) మట్టి మంచిగ వెలిఁగి మనుగడల్ కూర్చు
నీరు నిర్మల మౌచు నింపు ప్రాణము లిచ్చు
వెలుఁగులు తమసుల విధ్వంస మొసరించు
సర్వతోముఖమైన జ్ఞాన భిక్షను బెట్టు
వేలాది మరుదాళి వేల లెవియును లేక
లోకాల ప్రాణాల లోలమై నిలుపు
ఆకస మ్మది శూన్య మంతరిక్షమ్ము కాక
నంతయు నొకటంచు నలరించు విశ్వమ్ము
సృష్టిలో సృష్టిగా వ్యష్టిలో వ్యష్టిగా
నా సమిష్టిని నిలుచు నా సమిష్టిమైఁ దనరి
సర్వ శుభములఁ గూర్చు సకల సృష్టినిఁ జూడ
సుఖ సంపదలు రహి నఖర్వమ్ములై నిలుచు ॥ 1509

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(16)†ఆ॥వె॥ దేవ గోప్య మౌచు దివ్యత్వ మలరార
స్వస్తు లెల్ల విరియ సకలమునకు
సర్వ రక్ష కాఁగఁ బర్వ స్వావేశమ్ము
అరణ మగుచు యజ్ఞ మలరుఁగాక! ॥ 1510

†ఆ॥వె॥ శ్రేష్ఠ మైన వామ శీల శక్తులు మించ
దుష్ట శక్తు లెల్ల దూర మగును
స్వస్తి పుంజ మెల్ల సర్వవిశ్వము నిండి
విశ్వ శాంతి నొనఁగి వెలయుచుండు ॥ 1511

(17)†తే॥గీ॥ విశ్వ మెల్లను నాదిత్య విమల కాంతు
లమల శక్తుల మూర్తుల నమర మౌచు
నీశ్వరీయమ్ము కాఁగను నెనఁగుచుండు
దివ్య లోకాలను నమర్త్య దీప్తు లెసయ ॥ 1512

† జనలోక నరలోక ఘన సురలోక
భువనాళి దివ్యాళు లవినాశ గలిగఁ
బ్లుత మట్లు త్రైరూప గతి సృష్టి స్థితుల
లయరూప మందంగ రాజిల్లుచు డు ॥ 1513

## సూక్తమ్—64

ఋషిః—గయః ప్లాతః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—జగతీ ; 12-16-17-త్రిష్టుప్

(1) కథా దేవానాం కతమస్య యామని సుమన్తు నామ శృణ్వతాం మనామహే ।
కో మృళాతి కతమో నో మయస్కరత్ కతమ [1]ఊతీ అభ్యా వవర్తతి ॥ 664

---

†రచయిత :—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

1. కతమఽఊతీఽఅభ్యా. (ప్రా.ప్ర.)

(2) క్రతూయన్తి క్రతవో హృత్సు ధీతయో వేనన్తి వేనాః పతయన్త్యా దిశః ।
న మర్డితా విద్యతే [1]అన్య ఏభ్యో దేవేషు [2]మే అధి కామా అయంసత ॥ 665

(3) నరా వా శంసం పూషణమగోహ్యమగ్నిం దేవేద్ధమభ్యర్చసే గిరా ।
సూర్యామాసా చన్ద్రమసా యమం దివి త్రితం వాతముషసమక్తుమశ్వినా ॥ 666

(4) కథా కవిస్తువీరవాన్ కయా గిరా బృహస్పతిర్వావృధతే సువృక్తిభిః ।
అజ [3]ఏకపాత్ సుహవేభిరృక్వభిరహిః శృణోతు బుధ్న్యో౩ హవీమని ॥ 667

(5) దక్షస్య వాదితే జన్మని వ్రతే రాజానా మిత్రావరుణా వివాససి ।
అతూర్తపన్థాః పురురథో [4]అర్యమా సప్తహోతా విషురూపేషు జన్మసు ॥ 668

(6) తే నో [5]అర్వన్తో హవనశ్రుతో హవం విశ్వే శృణ్వన్తు వాజినో మితద్రవః ।
సహస్రసా మేధసాతావివ త్మనా మహో యే ధనం సమిథేషు జభ్రిరే ॥ 669

(7) ప్ర వో వాయుం రథయుజం పురంధిం స్తోమైః కృణుధ్వం సఖ్యాయ పూషణమ్ ।
తే హి దేవస్య సవితుః సవీమని క్రతుం సచన్తే సచితః సచేతసః ॥ 670

---

1. విద్యతేఽఅన్యఽఏభ్యో, 2. మేఽఅధికామా అయంసత, 3. అజఽఏకపాత్, 4. రథోఽఅర్య, 5. తే నోఽఅర్వన్తో. (వా్ర.వ్ర.)

(8) త్రిః సప్త సస్రా సద్యో మహీరపో వనస్పతీన్ పర్వతాగ్ం [1]అగ్నిమూతయే ।
కృశానుమస్తౄన్ తిష్యం సధస్థ [2]ఆ రుద్రం రుద్రేషు రుద్రియం హవామహే ॥ 671

(9) సరస్వతీ సరయుః సిన్ధురూర్మిభిర్మహో మహీరవసా యన్తు వక్షణీః ।
దేవీరాపో మాతరః సూదయిత్న్వో ఘృతవత్ పయో మధుమన్నో [3]అర్చత ॥ 672

(10) ఉత మాతా బృహద్దివా శృణోతు నస్త్వష్టా దేవేభిర్జనిభిః పితా వచః ।
ఋభుక్షా వాజో రథస్పతిర్భగో రణ్వః శంసః శశమానస్య పాతు నః ॥ 673

(11) రణ్వః సందృష్టౌ పితుమాగ్ం [4]ఇవ క్షయో భద్రా రుద్రాణాం మరుతాముపస్తుతిః ।
గోభిః ష్యామ యశసో జనేష్వా సదా దేవాస [5]ఇళయా సచేమహి ॥ 674

(12) యాం మే ధియం మరుత [6]ఇన్ద్ర దేవా అదదాత వరుణ మిత్ర యూయమ్ ।
తాం పీపయత పయసేవ ధేనుం కువిద్గిరో [7]అధి రథే వహాథ ॥ 675

(13) కువిదంగ ప్రతి యథా చిదస్య నః సజాత్యస్య మరుతో బుబోధథ ।
నాభా యత్ర ప్రథమం సంనసామహే తత్ర జామిత్వమదితిర్దధాతు నః ॥ 676

---

1. తాగ్ంఽఅగ్ని, 2. సధస్థఽఆ రుద్రం, 3. మన్నోఽఅర్చత, 4. పితుమాగ్ంఽఇవ.
5. దేవాసఽఇళయా, 6. మరుతఽఇన్ద్ర దేవాఽఅదదాత, 7. గిరోఽఅధిరథే. (వా.ప.)

(14) తే హి ద్యావాపృథివీ మాతరా మహీ దేవీ దేవాఞ్జన్మనా యజ్ఞియే [1]ఇతః ।
ఉభే బిభృత [2]ఉభయం భరీమభిః పురూ రేతాంసి పితృభిశ్చ సించతః ॥ 677

(15) వి షా హోత్రా విశ్వమశ్నోతి వార్యం బృహస్పతిరరమతిః పనీయసీ ।
గ్రావా యత్ర మధుషుదుచ్యతే బృహదవీవశన్త మతిభిర్మనీషిణః ॥ 678

(16) ఏవా కవిస్తువీరవాగ్ం [3]ఋతజ్ఞా ద్రవిణస్యుర్ద్రవిణసశ్చకానః ।
ఉక్థేభిరత్ర మతిభిశ్చ విప్రో ఽపీపయద్గయో దివ్యాని జన్మ ॥ 679

(17) ఏవా ప్లతేః సూనురవీవృధద్వో [4]విశ్వ ఆదిత్యా అదితే మనీషీ ।
ఈశానాసో నరో [5]అమర్త్యేనాఽస్తావి జనో దివ్యో గయేన ॥ 680

## సూక్తము—64

ఋషి—ప్లాతుఁడైన గయుఁడు
దేవత—విశ్వే దేవతలు

(6)*గద్యము॥
యజ్ఞమునందు మా కృతంబు లగు స్తోత్రంబులు దేవతలలో నెవనికి వినఁదగినవి ? వాని నెట్లుచ్చరింపఁగలము? మాపై నెవఁడు దయఁ గనుపరుచును? మా కెవ్వఁడు సుఖమును బుట్టించును ? మా రక్షణమున కెవఁడు వచ్చుచున్నాఁడు ? ॥ 1514

---

1. యజ్ఞియేఽఇతః, 2. బిభృతఽఉభయం, 3. వీరవాగ్ంఽఋతజ్ఞా, 4. విశ్వఽఆదిత్యాఽఅదితే,
5. నరోఽఅమర్త్యేనా. (వా.ప.)

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(2)*గద్యము॥
మా హృదయములయందు నిహితము లగు ప్రజ్ఞలు అగ్నిహోత్రాదికమును జేయఁ
గోరుచున్నవి. కాంతప్రజ్ఞలు దేవతలను గోరుచున్నవి. ఏ దేవతలకంటె నన్య
దేవుఁడు ఈ కామములకు సుఖయిత కాఁడో! యట్టి యింద్రాదులయందు
నా కామములు నియమింపఁబడుచున్నవి ॥ 1515

(3)*సీ॥ ఘనుఁడు నరాశంసుఁ డనువాని నాత్మ మా ! యభినుతించుట నీకు నధికముగద !
స్తోతలకున్ ధన స్తోమంబు నొసఁగెడు పూష నుతించుటఁ [1]బూజ్యముగద !
యన్య గమ్యుఁడు గాక నన్యం దీపితు నగ్ని వాక్కులఁ జెప్పుట పాడియగద !
చంద్రమస్సును సూర్యు నరస వాక్కులతోడ స్తుతియించుటయె నీకు సొగ సగుఁగద !
గీ॥ దివమునందున్న యమలోక దీప్తుఁడైన,నింద్ర వాయువు కల్యంబు నెల్ల రాత్రి
నశ్వులను దేవతాతతి నాదరమున, స్తోత్రముల వేఁడుటయ నీకు సూటియు నగు ॥ 1516

(4)*సీ॥ అధికకాంతప్రజ్ఞుఁ డౌ యసలుం డెట్లు బహువిధ స్తుత్యుఁడై పరఁగుచుండు
నల బృహస్పతి యను నమరవరుం డెట్లు వాక్కున నభివృద్ధిఁ బడయుచుండు
నజుఁ డేకపాత్తను నమరుఁడు సూక్తుల నభివృద్ధిఁ బొందుచు నమరుచుండు
దేవతావరు లెల్లఁ బావన స్తుతులచే వృద్ధిని బొందుచు వెలుఁగుచుండు
గీ॥ రా యహిర్బుధ్న్యుఁ డనునట్టి యమరవరుఁడు,నయితమును మా కృతంబులౌ సకలమంత్ర
రాజముల నెల్ల వినుఁగాక ! భ్రాజమాన, మానసంబున సతతముఁ బూని [2]కరుణ ॥ 1517

(5)*గీ॥ అదితిపుత్రి జన్మమందు దీపించెడు
పవలు రాత్రి నీవు పరమ నిష్ఠ
సుప్రజాతమందు శోభించు సంధ్య నీ
వతిశయముగఁ జేరి యమరుచుంటి ॥ 1518

*గీ॥ చీఁకటులఁ గొట్టు సూర్యుని శీఘ్రగలిని
బెక్కు కర్మములందునఁ జక్కఁగఁ బ్రీతి
దినము సప్తరసంబుల ఘనతఁ గాంచి
సప్త హోతగ వెలుఁగంగఁ జాలుచుండె ॥ 1519

(6)*గద్యము॥
ఆహ్వానమును వినుచున్నయట్టివి, బలము గలవి, మితమార్గము గలవియు నగు
నింద్రాశ్వములు మా యాహ్వానమును వినుఁగాక! ఆ యశ్వములు యజ్ఞమునందు
వలె సహస్ర సంఖ్యాక ధనంబు నొసఁగు నవియై స్వయముగ నా పిలుపు
నాలించునుగాక! ఆ యశ్వములు సంగ్రామములయందు శత్రువులనుండి
మహాధనమును నపహరించుచున్నవి ॥ 1520

*రచయిత,—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి
1. బూషను నుతియింపఁబూజ్యము గద! (తా.పా.), 2. దయను. (తా.పా.)

(7)*ఉ॥ జ్ఞానయుతుల్ సుచేతసులు [1]సర్వసురల్ దగు యజ్ఞకర్మఁ దా
మూనుచు నుంటచేత [2]వివిధోత్తమ కర్మల సన్మహేంద్రుఁ డా
మానిత వాయుదేవుఁ డసమానుఁడు పూష ధనంబు ప్రీతితో
దాన మొసంగి [3]మాకు ఘనతం గడు మిత్రులుగా వెలుంగుతన్ ! ॥ 1521

(8)*సీ॥ ఏకవింశతి సంఖ్య[4]నెసఁగుచునున్నట్టి యల సరస్వత్యాది లలిత నదుల
జలముల చమసాది చారు పాత్రంబుల పర్వతంబుల హోమ పావకు ఘను
సోమపాలకుఁ గడు సోమాభిషవమునకయి పిల్తు మింకను నాళగముల
విడుచు గంధర్వులఁ గడు సోమ రక్షణమునకు నక్షత్రంబు మోద మొసఁగు
గీ॥ హవ్యము నొసంగునట్టి యా యమలు రుద్రుఁ,డనెడు వానిని [5]నింకను నమరవరుల
యజ్ఞమందున నుతులచే నతిశయమునఁ, బిల్వఁగలవార మగుదుము పేర్మి మేము ॥ 1522

(9)*గీ॥ సుందర తరంగ మాలికా శోభితాత్మ
లౌ సరస్వతి మొద లగు నచ్ఛ నదులు
మా కృతం బగు యజ్ఞంబు [6]మరపు లేక
తాము రక్షింతురుగాక ! విస్తార [7]మహిమ ॥ 1523

*గీ॥ ప్రేరణముఁ జేయు దేవతల్ ప్రేమఁ జూపు
మాత లగు నదులు లోకానఁ [8]బూత లగుచుఁ
దమ [9]సుధా మధు జలమును దాము మాకు
నిచ్చెదరుగాక! సర్వము మెచ్చునటుల ॥ 1524

(10)*గద్యము॥
మహాదీప్తి గల దేవమాత మా యాహ్వానమును వినుసుగాక! ఇంద్రాదులతోడను వారి పత్నులతోడను గూడు త్వష్ట మా వచస్సును వినునుగాక! ఇంద్రుఁడు తత్సహాయుఁ డగు వాజుఁడు, రథస్పతి, మరుద్గణము, స్తుతించుటకు మమ్ముల రక్షింతురుగాక ! ॥ 1525

(11)*చ॥ సురుచిరమౌ మరుద్గణము చూపునకుం గడు రమ్య మౌచు సుం
దర మగు [10]నన్నమున్ వరెసు దస్యుల స్తోతల కెల్ల వాసమౌ !
[11]నరయ మరుత్సుబుద్ధి యనయంబు శివప్రద మౌసుగాన మే
మరమర వీడి సన్నుత గవాదులఁ గీర్తినిఁ బొందకుందుమే! ॥ 1526

---

1. సర్వసురల్ రవి యజ్ఞ కర్మఁదా, (తౌ.పా.), 2. వివిధోత్తమ కర్మమహేంద్రుఁడింక నా, (తౌ.పా.), 3. మాకు నిరతంబు సఖిత్వముఁబూసఁగాపలెన్, (తౌ.పా.), 4, సంఖ్యఁబ్రకటంబుగఁగల్గు, (తౌ.పా.), 5. నటువంటి యమర వరుల (తౌ.పా.), 6. మూసకుండ, (తౌ. పా.), మరువకుండ, (మ. పా.), 7. విస్తారరక్ష, (తౌ. పా.), 8. బూతము లయి, (తౌ.పా.), 9. తమ సుమధురంపు జలమును దరచు మాకు, నిచ్చుఁగాపుత, (తౌ. పా.), 10. నన్నమాత్రము విధంబున, (తౌ.పా.), 11. నరయఁగ వారి బుద్ధి యనయంబు శివంబు నొసంగుఁగాన మే, మరమరలేక, (తౌ.పా.).

*క॥అటుపిమ్మట సురలారా!
వటుతరమౌ నన్న మెల్లఁ బట్టుచుఁ జేతస్
దిటముగ మిమ్ముల భక్తిని
నెటులో పొందంగఁగలము హెచ్చగునటులన్ ॥ 1527

(12)*ఉ॥క్షీరముతోడ ధేనువును [1]శ్రీలు చెలంగఁగఁ దృప్తిఁజేయున
ట్లారసి మమ్ము దేవగణమా! [2]కృప మాపయిఁ జూపి మా మతిన్
మీరలు సత్ఫలాఢ్యముగ మిక్కిలిఁ జేయుచు మా సుయజ్ఞముం
జేరఁగఁ దల్చుచున్ రథము శీఘ్రమె యెక్కుఁడు! సంతసంబునన్ ॥ 1528

(13)*గద్యము॥
దాంధవునకు విషయభూతులుగ మమ్మెట్లు సేయువలయునో! య ట్లో మరుత్తులారా!
బహువిధములఁ దెలిసికొనుఁడు! ఏ దేశమునందుఁ దొలుత హవ్యముతోఁ గూడు
కొనెదమో! యా దేశమందు నదితి మాకు మనుష్యులతో బంధుత్వమును
గలుఁగఁజేయుఁగాక! ॥ 1529

(14)*గీ॥ఇష్టి కర్తలౌ లైనవి సృష్టి నెల్లఁ
బుట్టఁజేయుచుఁ బ్రీతినిఁ బొందునవియు
గొప్పవియునైన దివి భువి తప్పకుండ
జన్మమున [3]సురలఁ బొందును జారు రీతి ॥ 1530

*గీ॥పెక్కు విధములచేత సంప్రీతి మీఱ
జనుల సురలను ధరియింపఁజాలుచుండి
దేవతలఁ గూడు దివి భువి పాపనోద
కంబులను దాల్చుచుండు ముదంబు హెచ్చ ॥ 1531

(15)*గద్యము॥
మహాత్ములకుఁ బాలయిత్రి, పర్యాప్తస్తుతి, దేవస్తోత్రకారిణి యగు వాక్కు పరణీయ
పశ్వాది సహిత ధనమును బొందుచున్నది. సోమమును గలుగఁజేయు గ్రావ ఆ
వాక్కువలన స్తుతింపఁబడుచున్నది. స్తుతిమంత మగు నా యజ్ఞమును స్తుతులచే
దేవతలు కోరుచున్నారు ॥ 1532

---

* రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. జెన్నువహించెడురీతి చేయున ట్లారసి, (లొ.పా.), 2. కృప మాకు నొసంగు సన్మతిన్, (తొ.పా.),

3. ఇక్కడనింద్ర గణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(16)*చ॥కవి యయి సంస్తవంబులఁ బ్రకల్పనఁ జేయుచు యజ్ఞ వేదియై
నవవిధమౌ ధనంబుల ననంతముగా గ్రహియింపఁ గోరుచున్
బ్రవిమల మేధ గల్గు గయ పండితపర్యుఁడు శస్త్ర సూక్తులన్
వివిధ సురాళిఁ బ్రీతి నభివృద్ధిగఁ జేయును భక్తియుక్తుఁడై ॥ 1533

(17)*గీ॥అఖిల దేవతలార! యో యదితి దేవి!
ప్రాజ్ఞుఁడైనట్టి గయుఁడను పండితవరుఁ
డిట్టి విధమున సన్నుతి నెలమిఁ జేసి
వృద్ధిఁ బొందించె మిమ్ముల వేడ్క మీఱ ॥ 1534

*గీ॥మనుజధర్మరహిత జనముచే నరు లెల్ల
రిల ధనేశు లగుదు రెల్ల వేళ
గయునిచేత దేవగణ మభిష్టుతమయి
లోకమందు వెలుఁగు [1]భీకరముగ ॥ 1535

## సూక్తము—64

ఋషి—ప్లాతుఁడైన గయుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

(1)†గీ॥యామముల దివ్య దేవాళి నాప విహిత
సార్థకత్వము వెలయ విశాల హృదయ
పర మృణాళి తంతువుల వివరము గతి
సర్వ లోకాలు వరఁగును జగమునందు ॥ 1536

†(2)క్రతువులే క్రతువులను గమ్రమ్ముగాఁజేయ
సర్వ దిశలను వేన శక్తు లవి పరలంగ
ధీమంతమై హృదయ దీప్తులు వెలయంగ
దేవతల దయార్ద్ర నవ నయన దీధితులు
సుకృతుల కామ్యాళి శోభ లవి మీఱు
శాంతి సౌభాగ్యాల కాంతి కర్మలు గెలుచు ॥ 1537

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఁబ్రాకటముగ, (తా.పా.).
† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3)దినమణుల కాంతులు తేజరిల్లంగ
శశికళల చలువల చంద్రికలు విరియ
ద్వైత మద్వైతమై ద్వైతాఽద్వైతమై
యమ నియమముల ననిలము లుషసుల్
అత్యమల వాక్చక్షు లలరార నగ్నులన్
దివులందు దేవాళి దివ్యదీప్తుల మీఱ
నరవరులు పూజించి వరలుదు రమరులై
పూర్వ జన్మల అఘము పూర్తిగా నశియింప ॥ 1538

†(4)దివ్యశక్తులు దివ్య దేవాళిఁ గలిసి
శబ్ద శక్తుల బృహస్పతి బుద్ధి విరియ
నాదిశేషువు నుడుల కాలవాలముగా
నేకపాదుండైన యేకైకుఁ డజుఁడు
కవి కాఁగ రవి గాఁగఁ గామ్య కర్మములన్
ఋచ్ఛక్తు లలరార రూఢమై వెలుఁగు ॥ 1539

†(5)తిమిర పుంజము గొట్టు దీధితి సూర్యుండు
వెన్నంటి వెంటాడి వెలయ రేఁబవళులు
సప్తానలమ్ములు సప్త హోతలును
సర్వ సత్కర్మలన్ జదలంటఁ బొగలు
అఖిల లోకావళులు నలరారు శాంతి
ననిలమై జల మౌచు నల దక్షతల్ మీఱ
సృష్టియే పరిత మౌచుఁ జెలువొంద నెల వొంద
రాజుగా రాణిగా రంజిల్లుచుండు ॥ 1540

†(6)వేలాది మేఘాల వెల్తురుల్ మెఱయఁ
గాల వర్షమ్ములు కామ్యముల్ గురియ
ఘనమైన సమిధల దనరాశి లవితథ
విశ్వ యజ్ఞమ్ములన్ నశ్వర దీప్తులు
నిత్యోత్సవములుగా నిర్మలముగా నిలువ
జ్ఞాన విజ్ఞానాల పరిజ్ఞానమై వెలుఁగు ॥ 1541

†(7)వాయు పుంజము లెల్లఁ బ్రాణమై నిలువఁ
బూషణుని దేవుని బూర్గ సవితృసి
జేతన సహితమౌ సిత సఖ్య మెనయ
ఆ ద్విరథము పైని నద్వితీయముగఁ
గరితువు లలరారంగ మతి శక్తు లెల్ల
నొక్కచోఁ బుంజమై యొదిగి యుండునులే ! ॥ 1542

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-పరిపూర్ణ"

†(8)సప్తాగ్ను లెనయంగ సప్తానిలము లమర
సప్త కుల గిరు లెనయ సుప్తమ్ము కాకుంత
మూఁడేడులౌ నదుల్ ముప్పిరిగొఁ బార
నేకవింశతి రీతు లెనఁగంగ నెనయంగ
రుద్ర శక్తులలో నరుద్రమై రుద్రీయ
భద్ర శక్తు లవి అక్షుద్రమై హవనమౌ ॥ 1543

†(9)ఒకవంక సరస్వతి ఒకవంక సరయూనది
వే రొకవంక సింధువు పారుచుండఁగఁ బ్రీతి
జల మాతృ దేవతగ నలరారు దేవియే
అలలతో వెలయంగ అమృతమౌ గతి మీఱ
నేరులై హోరులన్ వేలాశులను నెరసి
శబ్ద శక్తుల నెగసి శక్తిగా రూపొందు ॥ 1544

(10)†గీ॥ఆ మరుద్గణ మాకాశ మావహించి
విమల తేజాలఁ బ్రసరించి విస్తృత మగు
దివ్య ధామాల నా విధాతృ జనిత సక
లావనుల నిండి చరమును నచర గతుల
సర్వ దేవాధిదేవుల శక్తి పుంజ
ముద్ధృతమ్మయి వాఙ్మయ భద్ర మగుచు
మాతృదేవిగ వెల్గుచు మహిత మైన
త్వష్టృదేవుని కృపమీఱఁ దనియుఁగాక ! ॥ 1545

†(11)ఆ మరుద్గణశక్తి అఖిల లోకాలకు
నానుపానువు లౌచు నావరించుచును
ప్రాణపుంజము నిచ్చి సుప్రభావముల
రుద్రమయ శక్తులే పరభద్ర గతులై
నరవరుల సురవరుల పరమపదచరుల
రమణీయ కమనీయ శమధామ దమధామ
ప్రమదాళి వరలంగఁ బ్రముదాల నెరవంగ
నిత్య సత్యమ్మౌచు నెసరొందుచుండులే ! ॥ 1546

(12)†క॥అనలానిల సంయోగపు
ఘన సలిలము లోకములను గడు గుహ్యతర
ప్రణవామృత శక్తులతోఁ
దనరారును నాలఁ బాలు తనరెడి భంగిన్ ॥ 1547

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(13) అజ్ఞాన దుర్జ్ఞాన విజ్ఞాన సుజ్ఞాన
పరిజ్ఞానములలోన నా అజ్ఞతను వీడి
దుర్జ్ఞానమును బట్టి తుత్తునియలగఁ దునిమి
ఆ సుమనోరూప మలరార మరుదాళి
చిచ్ఛక్తి సచ్ఛక్తి శ్రీల నామములతో
జల శీతలోష్ణాల జరిత శక్తులు పురుల
సంగాంగ భంగాంగ రంగేశు లలరంగ
సన్యోఽన్య జన్యాఽన్య ధన్యాత్మతలు చెలఁగు ॥ 1548

†(14) సృష్టియే యిష్టిగాఁ జెలఁగుచు నుండ
వ్యష్టి సమిష్టులను బుష్టి పదార్థములు
సర్వ లోకంబులన్ సహజమ్ముగా వెలసి
మాననీయగ సర్వమాతగా నిలిచి
సజ్జన్మ పునర్జన్మ సన్మనో గతుల
మన్మనో రతు లవి మహితమై వెలయు ॥ 1549

†(15) అతి విశాల మ్మైన అఖిల విశ్వాన
శబ్ద శక్తులు వివిధ శస్త్రాస్త్రములుగ
సచ్చిదానందాల సదమల గతులన్
బొందుచున్ సమ్మోద మొందుచున్ పరల
మధుమంతమై సర్వ మర్మముల నొసఁగు
సత్పతి సహితమై శర్మాళి నొసఁగు ॥ 1550

†(16) దివ్యమై భవ్యమై నవ్యమై వెలయు
శుక్రి శక్తుల సవక్రి పరాక్రమపు
విక్రమమ్ములతోడి విష్ణు శక్తులు పెరియ
ఋతమైన జీవన మమృతమయమై నిలుప
సూక్తులతో సుమతి సువిశాల గతి ఔప్ప
సర్వ శుభములతో సకల సంపదలతో ॥ 1551

†(17) అమృతత్వమున జగతి నఖిలమ్ముగా నిండి
దివ్య శక్తులతోడఁ దేజరిల్లుచు మిగుల
సీశానుఁడై మహిత ఋత్విజుండై వెలుఁగు
నాదిత్యుఁడై మహాయజ్ఞ శక్తిని నిలుప
జ్ఞాతమై దేవాళి జ్ఞాన స్వరూపాల
నదితి ప్రతికృతిగాఁగ నలరారుచుండు ॥ 1552

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—61

ఋషి—ప్లాతుఁడైన గయుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

(1)†భుజంగప్రయాతము ॥*

సదా సృష్టిలోనన్ బదార్థాల మూర్తిన్
నిదానూప లోకాల్ ముదా లొంప దేవుల్
విదారించి రక్షఃపదాళుల్ నశింపన్
ప్రదాతృత్వ మొప్పన్ సదా౽౽ప్తృత్వ మొప్పన్ ॥ 1553

†(2) యజ్ఞమ్ములే యజ్ఞ మలరింప నొసరింప
విజ్ఞానమయమైన వేతృత్వ మెసయంగ
నజ్ఞాన తిమిరాలఁ బ్రజ్ఞానమున డుల్చి
సుజ్ఞాన దేవాళి విజ్ఞతల్ మెరయంగ
దశదిశల ధీమతుల వశమైన నవ శక్తు
లశనిపాతమునైనఁ గసిమసిగ మసిమసిఁగ
నశియింపఁగాఁజేసి నిశ్నైన నిత్యమై
వసమించు వెల్గు లవి ప్రసరింపఁగాఁ జేయు ॥ 1554

(3)†భుజంగప్రయాతము॥*

నరాళుల్ జగాలన్ జరా మృత్యు శక్తుల్
పరాభూత మౌచున్ మురారీడ్య బల్మిన్
గిరా రూప దీప్తిన్ గరాళుల్ జనింపన్
సురాళుల్ ముదానన్ బరా రూప మొందున్ ॥ 1555

(4)†భుజంగప్రయాతము॥*

జగా లెల్ల వెల్గున్ సిగారించుచుండన్
దగారించు కాంతుల్ వ్యగాహ్యంబు లౌచున్
అగాధంపు సృష్టిన్ ప్రగాఢంపు శక్తుల్
మగాఁడై యజుండే జగా సొంపు నింపున్ ॥ 1556

(5)†భుజంగప్రయాతము॥*

మహామారుతాలే పహారించు నగ్నుల్
నిహారంపు నీరాల్ సహాయమ్ము కాఁగన్
పహారా సురాళుల్ మహా లొప్ప సర్వం
సహా లెల్ల నిల్వన్ విహారా లొనర్చున్ ॥ 1557

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*ఈ "భుజంగ ప్రయాత" వృత్తము ప్రాసయతి సహితము.

(6)†భుజంగప్రయాతము॥*

అసాధారణమ్మౌ ప్రసాదమ్ము పోలెన్
సుసారంపు భక్ష్యాల్ సుసాధ్యమ్ము లౌచున్
సుసాన్నాయ్యమున్ దా ససాఫల్యమ్ము దేవుం
డసాంగత్వ సాంగత్య సామీప్య మొందున్ ॥ 1558

(7)†భుజంగప్రయాతము॥*

నిరాకార మౌచున్ బరాంకోటు లొప్పన్
జరా మృత్యు రాహిత్య రాడ్రూప దీప్తుల్
పరార్థ్యంపు శక్తుల్ పరాక్రాంతు లౌచున్
పరాస్తమ్ము కాకుండ రాణించు మించున్ ॥ 1559

(8)†భుజంగప్రయాతము॥*

అజాగర్యరూపం బజాగ్రద్వ్యవస్థన్
అజాడ్యమ్ముగా నిత్య జాత్యమ్ము గాఁగన్
సుజాగర్యమౌ దివ్య జాతమ్ము మూఁడే
ళ్ళ[1] జాతీయ నక్షత్ర జాతంపు మిన్నే
టి జాలమ్ము మీఱంగ జాజ్వల్యమానం
బజాతమ్మునై యొప్పు జాబిల్లి తాల్పై
అజార్య మ్మజాత్య మ్మజావన్య దీప్త్యత్
సజాల మ్మజాలమ్ము జాంపత్య మౌతన్ ! ॥ 1560

(9)†భుజంగప్రయాతము॥*

వితానాలు వీవన్ సతా లౌచు నంతర్
గతాస్వీత వాణీ ప్రతాచ్ఛన్న సింధూ
రతా దేవి నీరాల్ సుతాచ్ఛల్య సచ్చిద్
వితానూర మౌచున్ సతామిన్ర దీప్తుల్
సుతారాధిపత్యాలు తారాంకిత మ్మౌ ॥ 1561

(10)†భుజంగప్రయాతము॥*

విశాలాఽనిలాల్ వే ప్రశాంతాగ్ని దీప్తిన్
వృశాంకూర శక్తిన్ నిశాంతేంద్రధర్మాల్
భృశాలైన దేవాళి శామాత మాదౌ
నశాకల్య శాకల్య శాంతాతిర క్తిన్

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*ఈ "భుజంగ ప్రయాత" వృత్తము ప్రాసయతి సహితము. 1. మూఁడేళ్లు—3×7=21

రసాశిన్ సురాత్వష్ట కాధిష్ఠ శ్రౌతా
చ్ఛ శాబ్దాతివాక్యాల్ సుశాస్త్రాలు కాఁగన్
గశా రూప స్తోత్రాద్య శారీర రక్షన్
అశాంతుల్ నశింపన్ బ్రశాంతుల్ ఫలించున్ ॥ 1562

(11)†భుజంగప్రయాతము॥*
ఆసాధారణమ్మౌ ప్రసాదాఽనిలమ్మౌర్
నసాంద్రోచ్ఛమౌ స్వచ్ఛ సారూప్య గోపుర్
రసావిష్ట మృష్టాన్న సాంగత్య హస్తాల్
సునాతత్య శక్త్యా శ్యసాధారణమ్మౌ ॥ 1563

(12)†భుజంగప్రయాతము॥*
అమోఘంపు శక్తుల్ సుమోదాలు కూర్చన్
బ్రమోదోల్లసద్దేవ మోక్షాచ్ఛ మోచున్
ఆమోహోన్నతోద్వేల మోదాఽంతరాః
వ్యామోహ ప్రచిన్మోద మోహోః సుమించున్ ॥ 1564

(13)†భుజంగప్రయాతము॥*
నిరాకారరూప మ్మురాతి ప్రజాశిన్
బరాభూతమున్ జేసి రాజించు నియ్యు
ర్వరాక్యాది గోశాల రాజిల్లు బంధు
త్వ రాడ్దేవ మాతా స్వరాడ్రూప శక్తిన్
జరాశుల్ శరాన్యాశి రాగానురాగాల్
కరాశిన్ మరుత్తుర్ నరాల్ తేజ మొప్పన్
సురాష్ట్రాల ప్రాణ్యాళి రాజించుచుండన్
బరాంకోటి జీవాళి రాజిల్లఁజేయున్ ॥ 1565

(14)†భుజంగప్రయాతము॥*
చిదానందరూప మ్ముదారాఽచ్ఛశక్తిన్
సదా దేవ జాతమ్ము దార్ఢ్య ప్రభక్తిన్
వ్యదాత్రాది సావత్య దాక్షిణ్య సృష్టిన్
నదాలున్ నదుల్ ప్రాణ్యుదాశుల్ మహేష్ట్యా

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
ఈ "భుజంగ ప్రయాత" వృత్తము ప్రాసయతి సహితము.

శే దాపించు సర్వమ్ము దాసార్థ సేవన్
అదాస్య ప్రదాంత్యచ్చ దాక్షాయణుల్ స
ర్వ దావంత మోహాది దారిద్ర్య రాహి
త్య దాక్షిణ్య శక్తిన్ ముదానన్ వసించున్ ॥ 1566

(15)†భుజంగప్రయాతము॥*
అవాఙ్మానసాచ్ఛాంత వాచస్పతీ మా
త వాతూల సంజాత వాగర్థ సంస్తు
త్య వారాహి సద్వారి వాహాళి వారుల్
అవారమ్ము కాఁగా నవార్ధక్య సంసా
ర వారాశి నీదంగ వాప్పృత్త సోమ
మ్ము వాసంతమై పార వాల్లభ్య మొందున్ ॥ 1567

(16)†భుజంగప్రయాతము॥*
మహావాక్య రీతిన్ సహాయమ్ము గాఁగన్
మహాహార్దమౌ శబ్ద హారమ్ము వెల్గన్
అహారీత స్తోత్రాళి హారీ సువర్ణాల్
సుహార్దత్వ మొప్పన్ నహార్యత్వ మెస్నున్ ॥ 1568

(17)†భుజంగప్రయాతము॥*
అనాధార మౌచున్ అనాధీయ శక్తిన్
వినా క్షుద్రశక్తుల్ ప్రణామాల్ ప్రవృత్తిన్
మనాగ్దృష్టి స్తోత్రాల్ సనాథప్రవృత్తిన్
జనాళుల్ పౌనర్భవ్ అనాదీయ సంవ
ర్తనావృష్టి సార్థమ్ము నాకార మౌలేః ॥ 1569

## సూక్తమ్—65

ఋషిః—వసుకర్ణో వాసుక్రః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—జగతీ ; 15-త్రిష్టుప్

(1) అగ్నిరిన్ద్రో వరుణో మిత్రో [1]అర్యమా వాయుః పూషా సరస్వతీ సజోషసః ।
ఆదిత్యా విష్ణుర్మరుతః స్వర్బృహత్ సోమో రుద్రో [2]అదితిర్బ్రహ్మణస్పతిః ॥ 681

†రచయిత :—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*ఈ "భుజంగ ప్రయాత" వృత్తము ప్రాసయతి సహితము.

1. మిత్రోఽఅర్యమా, 2. రుద్రోఽఅదితి. (ప్రా.ప్ర.)

(2) ఇన్ద్రాగ్నీ వృత్రహత్యేషు సత్పతీ మిథో హిన్వానా తన్వాఽ సమోకసా ।
అన్తరిక్షం మహ్యా పప్రురోజసా సోమో ఘృతశ్రీర్మహిమానమీరయన్ ॥ 682

(3) తేషాం హి మహ్నా మహతామనర్వణాం స్తోమాగ్ం [1]ఇయ్యర్మ్యృతజ్ఞా ఋతావృధామ్ ।
యే [2]అప్సవమర్ణవం చిత్రరాధసస్తే నో రాసన్తాం మహయే సుమిత్ర్యాః ॥ 683

(4) స్వర్ణరమన్తరిక్షాణి రోచనా ద్యావాభూమీ పృథివీం స్కమ్బురోజసా ।
పృక్షా [3]ఇవ మహయన్తః సురాతయో దేవాః స్తవన్తే మనుషాయ సూరయః ॥ 684

(5) మిత్రాయ శిక్ష వరుణాయ దాశుషే యా సమ్రాజా మనసా న ప్రయుచ్ఛతః ।
యయోర్ధామ ధర్మణా రోచతే బృహద్ యయోరుభే రోదసీ నాధసీ వృతౌ ॥ 685

(6) యా గౌర్వర్తనిం పర్యేతి నిష్కృతం పయో దుహానా వ్రతనీరవారతః ।
సా ప్రబ్రువాణా వరుణాయ దాశుషే దేవేభ్యో దాశద్ధవిషా వివస్వతే ॥ 686

(7) దివక్షసో [4]అగ్నిజిహ్వా ఋతావృధ ఋతస్య యోనిం విమృశన్త [5]ఆసతే ।
ద్యాం స్కభిత్వ్యగప [6]ఆ చక్రురోజసా యజ్ఞం జనిత్వీ తన్వీఽ ని మామృజుః ॥ 687

---

1. స్తోమాగ్ంఽఇయర్మ్యృతజ్ఞాఽఋతా, 2. యేఽఅప్స, 3. పృక్షాఽఇవ, 4. దివక్షసోఽఅగ్నిజిహ్వాఽఋతావృధఽఋతస్య, 5. శన్తఽఆసతే, 6. పఽఆ చక్రురోజసా. (వా.ప.)

(8) పరిక్షితా పితరా పూర్వజావరీ [1]ఋతస్య యోనా క్షయతః సమోకసా ।
ద్యావాపృథివీ వరుణాయ సవ్రతే ఘృతవత్ పయో మహిషాయ పిన్వతః ॥ 688

(9) పర్జన్యావాతా వృషభా పురీషిణేన్ద్రవాయూ వరుణో మిత్రో [2]అర్యమా ।
దేవాగ్ం [3]ఆదిత్యాగ్ం అదితిం హవామహే యే పార్థివాసో దివ్యాసో [4]అప్సు యే ॥ 689

(10) త్వష్టారం వాయుమృభవో [5]య ఓహతే దైవ్యా హోతారా [6]ఉషసం స్వస్తయే ।
బృహస్పతిం వృత్రఖాదం సుమేధసమిన్ద్రియం సోమం ధనసా [7]ఉ ఈమహే ॥ 690

(11) బ్రహ్మ గామశ్వం జనయన్త [8]ఓషధీర్వనస్పతీన్ పృథివీం పర్వతాగ్ం [9]అపః ।
సూర్యం దివి రోహయన్తః సుదానవ [10]ఆర్యా వ్రతా విసృజన్తో [11]అధి క్షమి ॥ 691

(12) భుజ్యుమంహసః పిపృథో నిరశ్వినా శ్యావం పుత్రం వధ్రిమత్యా [12]అజిన్వతమ్ ।
కమద్యువం విమదాయోహథుర్యువం విష్ణాప్వం విశ్వకాయావ సృజథః ॥ 692

(13) పావీరవీ తన్యతురేకపాదజో దివో ధర్తా సిన్ధురాపః సముద్రియః ।
విశ్వే దేవాసః శృణవన్ వచాంసి మే సరస్వతీ సహ ధీభిః పురంధ్యా ॥ 693

---

1. జావరీ౽ఋతస్య, 2. మిత్రో౽అర్యమా, 3. దేవాగ్ం౽ఆదిత్యాగ్ం౽అదితిం, 4. దివ్యాసో౽అప్సు యే, 5. యఽఓహతే, 6. హోతారా౽ఉషసం, 7. ధనసా౽ఉ౽ఈమహే, 8. యన్తం౽ఓషధీ, 9. పర్వతాగ్ం౽అపః, 10 దానవ౽ఆర్యా, 11. జన్తో౽అధి, 12. మత్యా౽అజిన్వతమ్. (వా.వ.)

(14) విశ్వే దేవాః సహ ధీభిః పురంధ్యా మనోర్యజత్రా [1]అమృతా ఋతజ్ఞాః ।
రాతిషాచో అభిషాచః స్వర్విదః స్వఁర్గిరో బ్రహ్మ సూక్తం జుషేరత ॥ 694

(15) దేవాన్ వసిష్ఠో [2]అమృతాన్ వవన్దే యే విశ్వా భువనాభి ప్రతస్థుః ।
తే నో రాసన్తా [3]మురుగాయమద్య యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 695

## సూక్తము—65

ఋషి—వాసుక్రుఁడైన వసుకర్ణుఁడు†
దేవత—విశ్వే దేవతలు

(1)*గద్యము॥
అగ్ని, యింద్రుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు, అర్యమ, వాయువు, పూష, సరస్వతి, ఆదిత్యులు, విష్ణువు, మరుత్తులు, దివి, సోముఁడు, రుద్రుఁడు, బ్రహ్మణస్పతి, సంగతు లగుచు నంతరిక్షమును స్వమహిమచేఁ బూరించుచున్నారు ॥ 1570

(2)*గద్యము॥
యుద్ధములయందు శారీరకబలముచేత శత్రువులను జంపువారు, సమానస్థానము గలవారు నగు నింద్రాగ్నులు, ఉదకమును బ్రేరేపించు సోముఁడును, నంతరిక్షమును స్వమహిమచేఁ బూరించుచున్నారు ॥ 1571

(3)*గీ॥సహజమహిమ మహాత్ములు శత్రువులకుఁ
బొందరానట్టివారలు పూర్ణ యజ్ఞ
వృద్ధులయినట్టి సురలకు నిష్టికర్త
నేను సుస్తోమములఁ గూర్తు నిశ్చయముగ ॥ 1572

---

1. జత్రాఽఅమృతాఽఋతజ్ఞాః, 2. వసిష్ఠోఽఅమృతాన్, 3. మురుగాయ. (వ్రా.ప్ర.)
†వసుకష్టుఁడు, (వ్రా.ప్ర.పా. 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలోని పాఠము).
*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥మిగుల రూపముఁ గల్గిన మేఘ జలము
సమరు లిచ్చుచునున్నారు కరము వారె
సఖులుగా వెల్గి జనముల సంఘమందు
ధనము నిత్తురుగాక! మా కనయముఁ గడు ॥ 1573

(4)*గద్యము॥
స్వస్వకర్మమందు నేత యగు నాదిత్యుని, ద్యావాభూముల మధ్యనుండు తేజస్సులను, దివిని, భువిని, విస్తీర్ణాంతరిక్షమును దేవతలు స్వబలమున ధరించుచున్నారు. మరియు దరిద్రులకు ధనములు వలె స్తోతలను ధనాదులచేఁ బూజించుచున్న సుదానులు మనుజునకు ధనము నొసంగువారు నగు నీ దేవతలు ఈ యజ్ఞమందు వినుతింపఁబడుచున్నారు ॥ 1574

(5)*సీ॥అంతఃకరణ ధర్మమందైన నెవ్వార లే ప్రమాదంబును నెరుఁగకుండు
రెవ్వారి దేహంబు లెంతయు సహజ ప్రకాశంబుచేఁ దృప్తిఁ గలుఁగుచుండు
నెవరి యాధీనంబు నెక్కువఁ బొందుచు దివి భువి యే వేళఁ దేజరిల్లు
సఖిల లోకమునకు నత్యంత మెవ్వరు సమాశ్రిట్టులై తాము సాగుచుండ్రు
గీ॥స్తోత్రములఁ జేయుచుండెడు సూరి వర్గ, మునకు ధనము నొసంగుచు మోద మందు
నట్టి మిత్రునకున్ వరుణాఖ్యునకును, హవ్యదానంబుఁ జేయుఁడీ! యార్యులార! ॥ 1575

(6)*ఉ॥క్షీరము లోనుగాఁగలవి శీఘ్ర మొసంగుచు నాశ్రితాళికిన్
క్షీరము లిచ్చి కర్మలకు సేమము గూర్చెడు నేత్రి యౌచుఁ దాఁ
జేరుచు గోవు యజ్ఞమును జేరిన పిమ్మట మత్స్తుతాత్మయై
కోరెడు వార లందరికిఁ గోర్కెలు నా కవనంబు నిచ్చుతన్! ॥ 1576

(7)*గీ॥దివము వహియించువారలు దీవ్య దగ్ని
ముఖులు యజ్ఞ ప్రవృద్ధులు పూర్ణయజ్ఞ
సుస్థలిం జూచుచుం గడుఁ జోద్య మలర
నంతట వసించుచున్నార లధిక ప్రీతి ॥ 1577

*ఉ॥ఆ సుర లే ద్యులోకమును సంతటఁ దాల్చుచు నైజ శక్తిచే
భాసురమౌ జలంబు ప్రతిభాంచిత మౌనటు గల్గఁజేయుచున్
దోసము లేని యజ్ఞమును దుష్టిని బుట్టఁగఁజేసి పిమ్మటన్
వాసిగ హవ్యమున్ మిగుల భక్షణఁజేసిరి సంతసంబునన్ ॥ 1578

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(8)*ఉ॥అంతట వ్యాప్తిఁ గాంచి మరి యన్నిటికిం దలిదండ్రు లౌచు స
త్యంతము పూర్వమందు ఘనతన్ జననంబును గాంచు రోదసుల్
సంతస మొప్పఁగా జరుపఁజాలినయట్టి పవిత్ర యజ్ఞమం
దెంతయు వేడ్కతోడ నివసించుచు నుండును నెంచి చూడఁగన్ ॥ 1579

*గీ॥కడు సమాన కర్మకలనఁ గల్గిన రోద
సులు మహాత్ములైన సురలఁ గొల్వ
క్షరణవత్పయస్సుఁ జాల నొసంగుచుఁ
బ్రతిభఁ గాంచుచుండెఁ బ్రబల శక్తి ॥ 1580

(9)*గీ॥కావు నేత్తలు జలమును గల్గువార,
లౌ మహేంద్రుఁడు వాయువు సోమము గల
వరుణముఖులును నిజమైన పరమ మహిమ
చేత సంతట నుందురు ప్రీతు లగుచు ॥ 1581

*గీ॥అదితి నాదిత్యవరులను నంతరిక్ష
జాతు లైనట్టి సురలను బూత దివిజు
లైన వారలు భూజాతు లైన సురలఁ
బిలుచుచున్నార మిట్టిని లలిత సూక్తి ॥ 1582

(10)*గద్యము॥
ఓ మేధావులారా! ఏ సోము మీ కళ్యాణమునకుఁ ద్వష్టృపత్నీభుతులను బొందుచున్నదో!
బృహస్పతిని, సువ్రిజ్ఞవృత్రఖాదయిత యగు నింద్రుని బొందుచున్నదో! యా
సోమమును ధనమును భజించుచున్న మేము ధనమును యాచించుచున్నాము॥ 1583

(11)*సీ॥అఖిల వర్ధన సాధనాస్నంబు సృజియించు నమరుల యాచింతు మధిక ధనము
నశ్వాది పశువుల నధికము గల్పించు నమరుల యాచింతు మధిక ధనము
నోషధీ తతులను నోపి సృష్టించెడు నమరుల యాచింతు మధిక ధనము
భూమి పర్వతములఁ బుట్టించుచుండెడు నమరుల యాచింతు మధిక ధనము
గీ॥అంతరిక్షంబు దివియందు నమరు సూర్యుఁ, బుడమిపై శ్రేష్ఠతరములౌ పూజ్య కర్మ
ములను విధియించు నమరుల లలిత ధనము, మేము యాచించెదము కడు నీమ మలర॥ 1584

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

(12)*సీ॥పూర్వోదధిన్ బద్ధ మజ్యూని మీరలు [1]కాపాడుచుం గడుఁ గాఁవిలినారు
బధ్నిమతీస్త్రీకిఁ బావన పుత్రుని నొసఁగుచు సంప్రీతి నొప్పినారు
విమదునకున్ యోగ్య వేస పుత్రిక నిచ్చి విపుల యశస్సున వెలసినారు
విశ్వకాయునకయి విష్ణ్వాప్వ పుత్రుని నిచ్చి లోకమునందు నొసఁగినార
గీ॥లంతటన్ వ్యాప్తిఁ జెందుచు సమరునట్టి, యశ్విదేవతలార! యో యమరులార!
యఖిల విషయంబులన్ మము నతిశయ మగు,నంతనంబునఁ గాపాడ నరవి రండు!॥ 1585

(13)*సీ॥ఆయుధములఁ గల్గి యమరెడు వాక్కు నా యంచిత సుతుల నాలించుఁగాక!
నేకపాత్తజుఁ డను భీకర సురవర్యుఁ డంచిత సుతుల నాలించుఁగాక!
సువిశాల సింధువు శోభిల్లుచున్ ఖ్యాతి నంచిత నుతుల నాలించుఁగాక!
యంతరిక్షోద్ధ మౌ [2]నప్సంచయం బెల్ల నంచిత సుతుల నాలించుఁగాక!
గీ॥కర్మసహిత సుదేవతాగణము మరియు, బహువిధ ప్రజ్ఞఁ గలుఁగుచుఁ బావన యగు
నల సరస్వతి నాదైన యమల వాక్య, ములను వినెదరుగాక! సమ్మోద మలర ॥ 1586

(14)*గద్యము॥
కర్మసహితులు ప్రజ్ఞానయుతులు మనుష్య యజ్ఞ యష్టవ్యులు, మరణధర్మ రహితులు,
సత్యవాగులు, దీయమాన హవిస్సును సేవించువారు ఆభిముఖ్యముగా యజ్ఞమును
బొందువారు, స్వర్గలంభకులు నగు నింద్రాది దేవతలు మా స్తుతులను,
మహాన్నమును, స్తోమమును సేవింతురుగాక! ॥ 1587

(15)*గద్యము॥
"ఏ దేవతలు సర్వలోకములను స్వతేజస్సుచేఁ బరితిష్ఠించుచున్నారో! యా దేవత లీ
దినమున మాకుఁ బరిభూత యశస్సు గల అన్నమును నొసఁగెదరుగాక!
ఓ దేవతలారా! మీరు మమ్ము సర్వదా రక్షింతురుగాక!" అని వసిష్ఠ
కులజుఁ డగు ఋషి దేవతలను నమస్కరించెను ॥ 1588

## సూక్తము—65

ఋషి—వాసుక్రుఁడైన వసుకర్ణుఁడు

దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—1

†(1) అంతరిక్షము నిండి ఆదిత్యుఁ డలరు
అగ్నియు నింద్రుండు నల్ల వరుణుండు
మిత్రుండు నర్యముఁడు మిన్ను వాయువులు
పూష సర్వస్వమున్ బృహత్సోముండు

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. కాపాడి కడుఁగడుఁ గోరిలినారు, (తా.పా.), 2. యంతరిక్ష భవంబులైన యప్సంచయ మంచిత. (తా.పా.)

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సదితి మరుత్తులు నా విష్ణు రుద్రులున్
బ్రహ్మణస్పతితోడ( బరఁగు నోషధులు
బ్రహ్మాండ భాండాన( బర్వ్యాప్తి నొందు
విశ్వ దేవుల శక్తు లశ్వర మ్మగుచు ॥ 1589

†(2) చంద్ర శక్తుల ప్రగతి సలిలమ్ము పొంగ
నిందాగ్ని బలములే యీ జగము నింప
నరివీరవరులను బరిమార్చుచుండు
ఆకసమ్మును నింపు నసమాన మహిమలన్
చద లెల్ల వ్యాపించి జలనాభినే మ్రింగు
వృత్రమూర్తిని దుంచి శాత్రవుల( దునిమి
వాయు ప్రభావాన వర్షముల్ కురియ
నిందాగ్ని శక్తులే సాంద్ర మతంద్రమై
వినిమయమ్మై యింద్రధను వౌచు వెలసి
భంగుభంగుల రంగురంగు లవి రంగార
నింగిలో విల్లుగా వంగి నిండారఁగా(
బ్రకృతిరూపాలకే ప్రాణములు లేవంగ
ఉసు రిచ్చి బల మిచ్చి మిసిమింత వన లిచ్చి
వసు శక్తులను నింపి వర్ధిల్లఁగాఁజేయు ॥ 1590

†(3) మృతరహిత గతిమీఱ నతులితమౌ శక్తి
వైరివీరుల నణఁచి పారమ్ము తుద ముట్ట
నాకసమ్మే ఒక్క ఆర్ణవమ్మై వెలయ
అద్భుత జ్ఞానాన నా యజ్ఞ శక్తులే
ప్రకృతిగ రూపొంది ప్రాకృతమై నిలువ
సృష్టికార్యము మహాసృష్టకార్య మ్మౌచు(
జిత్ర విచిత్రమౌ చిన్మయ రూపాల
అర్ణవమ్మై అమృతార్ణవమ్మై శ్రీల
ఋతమైన జలశోభ భృత మౌచు భృశమౌచు
సతతమ్ముగా సృష్టి సంపదల్ పొలుచు ॥ 1591

†(4) కొన్ని భూమిగ నిలువఁ గొన్ని పృథ్విగ వెలయ
నిత్యమౌ మేల్మిగా నిండు బంగారుగా
నాదిత్యమండల మ్మలరారుచుండఁగా
నిత్య యౌవన రూప మత్యద్భుతమ్ముగా

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సుత్తమమ్మౌ దేవతోత్తమ బల్మిమై
దివు లెల్లను నిండి భువు లన్నియు నిండి
దివ్య పృథ్వులు నిండి నవ్యత్వ మెనయ
దేవ మానవ ప్రాణి జీవాళు లెల్ల
సకల చరాచర సర్వ సర్వంసహలు
అంతరిక్షములోన నభ్యుదయమై నడచు ॥ 1592

†(5)అతిలోక శక్తిగా ఆ మానసము వెలయ
వరుణులు సూర్యులు వరలుచుండంగ
అంత మెనయని ఆ అనంతాకాశమున
సకల దశదిశ రూప సామ్రాజ్యమున వెల్గి
శిక్ష కక్షలఁ గ్రమశిక్షలను దిరుగాడు
రోదసీ కుహరాన నాధసిగ దోగాడు
నిలు వెల్ల నిశి నిండు నిశి సహిత నిశి రహిత
గతుల వెల్గుల వేగ్రలఁ గాగ్రలెడు గోళాలు
కర్మధర్మమ్మైన నర్మకర్మ మ్మౌచు
నర్మధర్మ మ్మౌచు ధర్మకర్మ మ్మౌచు
నిత్యకామ మ్మగుచు సత్యధామ మ్మగుచు
సృష్టులన్ స్థితి గతుల నష్ట లయాలతో ॥ 1593

†(6)లోకాలు జగములో లోలుపతమై తిరుగ
ననలాళి అనిలాళి వినువీథి సలిలాళి
అంతరిక్షములోని అఖిల పృథ్వులు కూడ
దుగ్ధాళి ముగ్ధమై దుర్విదగ్ధము కాక
క్రమగతుల నొప్పారు నమరాళితోఁగూడ
సృష్టి విశిష్టతల్ వ్యష్టి సమిష్టులన్
దశదిశల వెలుఁగొందు నిశి పవళులలోన
విశదశక్తులు వెలయఁ బ్రశమన రహితాన
ససినిండు పసరాలు పస లొలుకు పాలతో
వసు శక్తు లొప్పంగ వర్ధిల్లఁగాఁజేయు ॥ 1594

†(7)నిత్యసత్యాలైన నిఖిలాగ్ని నాళికలు
ఋతములై కృతములై మృతి రహిత భృతములై
సర్వలోకావళి సఖర్వగతులను నిండఁ
బ్రజ్ఞానములు గొప్ప యజ్ఞాఽనలము లౌచు

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సుజ్ఞానములతోడి విజ్ఞతాఽనిలము లెగయ
హవ్య శక్తులు దివ్య నవ్య రక్తుల మెరయ
భవ్య మూర్తుల నెనఁగి నవ్యజీవన మొనఁగు
నరు లెల్ల సుర లెల్ల వరదులై పరలంగ ॥ 1595

†(8)అంతరిక్షము నిండి అఖిలమ్ము నిండి
వింత వెలుఁగుల కాంతు లెంతగానో విరియ
సంత మెనయని రీతి సంతసము వెలయించు
సత్యమే జన్యమై జననేంద్రియమ్మై
దివి భువుల నిండుచున్ దివ్యశక్తులు వెలయ
సలిల శక్తులు నిలువ జల దేవతలె పిలువ
భర మౌచుఁ గర మౌచుఁ బరిమిత రహితమై
ప్రకృతి మాతగ నిల్చి సుకృతి పితగాఁ బురుష
శక్తు లవి వెలయంగ రక్తు లవి విరియంగఁ
బంచ భూతము లెల్ల నించు మంచిని బెంచి ॥ 1596

†(9)పర్జన్యమే ఒక్క పవిమల శంఖమై
దుర్జయమ్మై వరుణాఽఽర్జవమ్మై కరము
ఆదిత్య రూపాల నంతరిక్షము నిండి
రోహిణి మృగశిర లారోహణము లౌచు
వృషభ శక్తులు మీఱఁ బృథువులు దివు లెల్ల
వరుణుండు మిత్రుండు వరవాయు దేవతల్
అర్యమేంద్రునితోడ ననలాల సలిలాల
నఖిలాండ పిండాండ బ్రహ్మాండ భాండాల
యజ్ఞకర్మలు నిండి ప్రజ్ఞానముల మెండు
సుజ్ఞానముల చండు విజ్ఞానములు పండు ॥ 1597

†(10)అమలవాయుపూర్ణ మౌచు నమృతశక్తి నిండియుండ
దివ్యమైన దైవశక్తి తేజరిలుచు నుషస్సులను
వృత్రఖాద్యుఁడైనయట్టి బృహస్పతి ఘన బలమ్ము
అఖిలాఖిల వృక్షములను అసమశక్తు లలరుచుండ
సోమ మెల్ల నిండియుండు సృష్టిలోన సమిష్టి గతిగ
సీమ మలర నేమ మెనయ నింగి నేలలందు వరల ॥ 1598

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11)ఘనశక్తి ఘనశక్తి కడు నిండు నెల్లెడలఁ
దుష్టి వర్ధన మౌచుఁ బుష్టివర్ధన మౌచు
నన్నశక్తులు మీఱు నన్నింటను జగతిఁ
గాంతితో దాంతితో శాంతితోఁ గాంతిగా
ఘనమైన ధన ముండు ననుపమ ధన ముండు
ఓషధులలో నుసురు లొగిడి మడుగుచు నుండు
భూ పర్వతాళులను బూర్ణశక్తుల నుండు
అఖిలాంతరిక్షాన నమర లోకాలలో
అఖిల లోకాలలో ఆ సూర్య శక్తులను
అమరియుండును ధనము లమలమ్ము లై నిలిచి ॥ 1599

(12)†సీ॥కాంతి లేకుండఁగాఁ గామించి భక్షించు కాశక్తులను దున్ఁచి గాఁలినారు
ప్రకృతి శక్తుల రూపు భ్రష్టమ్ము కాపించు కాపౌరుషత్వమ్ముఁ గాల్చినారు
పురుష శక్తులలోని వరప్రకృతుల నిల్పి లోక వ్యవస్థను సాకినారు
విశ్వ కామ మ్మౌచు విశ్వాత్మగా నిల్చు విష్ణ్వాత్మ శక్తిని విమల గతిని
గీ॥నిల్పిన మహాఽశ్విదేవతాఽనీకమా! మ,హా విశాల విశ్వమ్మును హాయి మీఱ
రక్షసేయుచునుంచురు రమ్యగతుల,సృష్టికిన్ స్థితి లయముల సిరుల నిలిపి ॥ 1600

(13)†సీ॥అస్త్ర శస్త్రాలలో అఖిల వాక్కులు నిల్చు నమలమై ఆకాశ మంటుచుండు
నొంటికాలినె లేచి మింటి కెగురు దేవ దేవు దివ్య సుశక్తి తేజరిల్లు
నతివిశాలమ్మైన అమలమౌ జలశక్తి అఖిలాండ పిండ బ్రహ్మాండ మెనయు
నమృతాగ్ని వాయ్వాళు లమిత శక్తుల నిండి అంతరిక్షమ్మున నమరియుండు
గీ॥దేవ దేవాళి కర్మలే దివ్యమైన, వాణివాక్కుగ వెలయుచు వరలుచుండ
శబ్దజాలమ్ము వినుచుండి శక్తు లెనయ, నిల్పుచుండునుగాక! వినిర్మల గతి ॥ 1601

†(14)అమరులై అమలులై అఖిలమ్ము లొందుచున్
గర్మలుగ వెలుఁగొంది కర్మలతో నిండి
విజ్ఞాన ప్రజ్ఞాన సుజ్ఞానములఁ బండి
అజ్ఞానములఁ బాపి అసమాన శక్తులన్
యజ్ఞ యష్టవ్యులై యజ్ఞయజ్ఞము లొంది
సత్యవాక్కుల నెనసి నిత్యవాక్కుల నెనఁగి
స్వర్గమ్మునే పొంది నిసర్గముగ స్వర్గ సు
లోకాఽతీతమై లోలుపత్వము మీఱ
నిందాది దేవాళి యినుమడించునుగాక!
విష్ణ్వాదిదేవాళి తృష్ణ[1] వెల్గునుగాక! ॥ 1602

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. "విష్ణ్వా-తృష్ణ" ఇక్కడ సంయుతాఽసంయుత ప్రాస విశేషముగాఁ బ్రయుక్తమైనది.



†(15)సర్వభూతావళుల సర్వలోకావళుల
వ్యాపించి దీపించి రూపెంచి కోపించి
తేజమ్ము విలసిల్ల జేజేలు వెలుఁగంగ
వెలుఁగొందు దేవాళి కలకాలము శుభాలఁ
జెలఁగంగ జగములను జెలువమ్ముతో నింపి
కాపాడుచుండులే! కరుణమై సృష్టిలో ॥ 1603

## సూక్తము—65

ఋషి—వాసుక్రుఁడైన వసుకర్ణుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

†(1)అన్యోఽన్య సంబంధ బంధానుబంధాల
అగ్ని రుద్రులు మిత్రు లర్యముల్ వరుణులున్
వాయు పూషలు సరస్వతీ సజోషసులు
ఆదిత్య విష్ణువు లఖిల మరుదావళులు
ఇంద్రాఽదితిసురల్ బృహత్సోమముల్ వెలుఁగంగ
బ్రహ్మణస్పతితోడఁ బరఁగుచుందురు సదా ॥ 1604

†(2)జలనాభి వంచించు జల్పుఁడౌ వృత్రుని
వధియించు నింద్రాగ్ని వరదేవ శక్తులే
అంతరిక్షము నెల్ల సతిలోక శక్తులన్
సోమశక్తులు విరిసి శుభకరమ్ముగ నెరపి
మహితమై విహితమై మాన్యమై వెలయు
ప్రకృతి పురుషుల శక్తు లకృత్రిమమ్ములై
అవితథ రూపాన నకలుషముగా నిలిచి
మిథునమ్ముగతి దోప మిన్నెల్ల వెలుఁగు ॥ 1605

†(3)సృష్టియజ్ఞములోన స్రష్ట ప్రజ్ఞలు మీఱ
అఖిలాండ పిండాండ బ్రహ్మాండములు నిండి
మహితమై సుహితమై మర్మశక్తులు వెలయ
సత్యమే సత్యమై నిత్యమ్ముగాఁ బరమ నిత్యమ్ముగా నిలిచి
మిన్నులో మన్నులో మిన్నేట మున్నీట నఖిల జలాలను
ననలాల ననిలాల ఘనజన్యు శక్తులను
వ్యష్టి సమిష్టులన్ బ్రకృష్ట సత్యజ్ఞతలఁ
జిత్రమై వెలుఁగొందు సృష్టి వ్యవస్థలో ॥ 1606

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4)అఖిలాంతరిక్షమును నావరించిన సర్వ
లోకాల భూతాల లోలుపత్వము మీఱ
దేవాళులను గూడ దివ్యశక్తులు వెలయ
ధరియించు నా దేవధర్ముండు సత్యాత్మ
సృష్టిలో సంపదలఁ జెలువంపఁగాఁజేయు
శుభ సుఖమ్ములఁ గూర్చి నభ మెల్ల నిండు ॥ 1607

†(5)రోదోఽంతరాళాన రూఢశక్తుల వెలసి
మిత్ర వరుణాదుల నమేయశక్తిని హృదిని
నర్మధర్మమ్మైన ధర్మబద్ధ మ్మౌచుఁ గర్మబద్ధ మ్మౌచు
సర్వథా వెలుఁగొందు సర్వ సృష్టిని సదా ॥ 1608

†(6)సకల లోకాలలో సాంద్రమై రహి మించు
సర్వ జల శక్తులను సదమలత్వము మీఱ
వరుణ బలములను వారుణత్వము వెలయ
దుష్కృతులఁ దునుమాడు నిష్కృతులు నిండంగ
నతిపవిత్రత నిలుపు నా మలములఁ దుడిచి
దేవాభిషేకాల దివ్యమ్ముగా నిలుచు ॥ 1609

†(7)అగ్నులై వెలుఁగొందు నగ్ని సత్యావళులు
సత్యమే యోనిగా సత్యమే జన్మగా
సత్యమే జాలిత సత్యమై నిత్యమై
వ్యష్టి సమిష్టులను సృష్టిలో విలసిల్లు ॥ 1610

†(8)సత్యనాథుఁడు నిత్య సత్యనాథుఁడు సృష్టి
ఋత యోనిగా వెలసి ధృత శక్తులను నిలిచి
దివి భువుల భూతాల దీప్తములుగా నిలిపి
చంద్రశక్తులు జగతిఁ జదలంటఁగా మీఱ
క్షీరనీరాలతో క్షేమమ్ముగా నుండుఁ
బార మెనయని శక్తి భద్రమ్ముగా నుండు ॥ 1611

†(9)పర్జన్యయుతమైన వాయు మేఘావళులు
ఇంద్ర వాయువులను నిన మిత్ర వరుణులన్
అదితిని నాదిత్యు నర్యమావళులను
అఖిల సృష్టిని గూడ నతిపవిత్రముగాఁగ
సర్వప్రాణుల జలము సప్రాణముగ నిల్పు
సచ్ఛక్తులన్ నించు సదమలముగా నుంచు ॥ 1612

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10)ఆ సోమ శక్తులే అఖిల సృష్టిని బుష్టి
కలిగించు వెలిఁగించు నల ఉషస్సులకు
వృత్రఘాతుండైన యింద్రునకు బృహస్పతికి
వాయు శక్తుల మించు నాయుష్షగ్ని మ్మోచు
నింద్రియాళుల నెల్ల హృదయాన బంధించు
దైవీయమౌ శక్తి దార్ఢ్యమ్ముగా నిల్చు ॥ 1613

†(11)సర్వ లోకావళుల శర్మతేజః పుంజ
సంజాతమై జగతి కంజాతజుని బ్రహ్మ
తేజమై వ్యాపించి దివ్యౌషధీ వనస్పతుల
సౌర శక్తులు నిండి సకలమ్ము వెలుఁగఁగా
వైష్ణవీయమ్మైన వైభవమ్మున జలము
పశదిశల విలసిల్లి దార్ఢ్యమ్ము సమకూర్చు ॥ 1614

†(12)విశ్వ సంక్షేమాల నశ్వశక్తులు వెలుఁగఁ
గాంతి విరహితమైన భ్రాంతి శక్తులు పోవఁ
బ్రకృతి మాతకు నమల సుకృత పుత్రుం డౌచు
విధిగాఁగ జనియించి ప్రథితమ్ముగా నిలిచి
విష్ణుమహితత్వాన విస్తృతముగా వెలసి
సృష్టికే ప్రాణమై స్రష్టకే ప్రాణమై
నిత్య యౌవన శక్తి సత్యమై వెలయంగఁ
గృత్యమౌ యజ్ఞాలఁ గీలలై విలసిల్లు ॥ 1615

†(13)విశ్వదేవత లెల్ల విమలమై వెలయ
నేకపాద్‌దేవుండు నైకైక రూపాల
రవి శక్తిఁ బవి శక్తి శివ శక్తి నవ శక్తి
నిఖిలాంబుధులు నిండి నఖిలాంబువులు నిండి
ఆ సరస్వతిగాఁగ నఖిల జ్ఞానము నింపి
కర్మ బంధువుగాఁగ ధర్మసింధువు నిల్చు ॥ 1616

†(14)విశ్వదేవత లెల్ల విమలమౌ ధీ శక్తి
నమృత హృచ్ఛక్తులను ననృత నాశ మ్మొనర్చి
నిత్య సత్యమ్మైన సత్యపూర్ణ జ్ఞాన
విజ్ఞానముల మీఱఁ బ్రజ్ఞానములతోడి
వేద సూక్తాలతో వేద నాదాలతో
భేదాలనే డుల్చి మోద మొందుచు నుండు ॥ 1617

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15)సర్వ భువనాలలో సకల దేవావళుల
నమృత శక్తులతోడ నమల విశ్వము నించి
వెలుఁగొందు నా దేవవేద్యుఁడు దేవుండు
దేవాళి దేవుఁడు దేవుందు వేదాః
సకల సన్మంగళాల్ సంపదలు సమకూర్చి
సృష్టి సర్వస్వమును శ్రేష్ఠతను గాపాడు ॥ 1618

## సూక్తమ్—66

ఋషిః—వసుకర్ణో వాసుక్రః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—జగతీ, 15-త్రిష్టుప్

(1) దేవాన్ హువే బృహచ్ఛ్రవసః స్వస్తయే జ్యోతిష్కృతో [1]అధ్వరస్య ప్రచేతసః ।
యే వావృధుః ప్రతరం విశ్వవేదస [2]ఇన్ద్రజ్యేష్ఠాసో అమృతా ఋతావృధః ॥ 696

(2) ఇన్ద్రప్రసూతా వరుణప్రశిష్టా యే సూర్యస్య జ్యోతిషో భాగమానశుః ।
మరుద్గణే వృజనే మన్మ ధీమహి మాఘోనే యజ్ఞం జనయన్త సూరయః ॥ 697

(3) ఇన్ద్రో వసుభిః పరి పాతు నో గయమాదిత్యైర్నో [3]అదితిః శర్మ యచ్ఛతు ।
రుద్రో రుద్రేభిర్దేవో మృళయాతి న స్త్వష్టా నో గ్నాభిః సువితాయ జిన్వతు ॥ 698

(4) అదితిర్ద్యావాపృథివీ [4]ఋతం మహదిన్ద్రావిష్ణూ మరుతః స్వర్బృహత్ ।
దేవాగ్ం [5]ఆదిత్యాగ్ం అవసే హవామహే వసూన్ రుద్రాన్ త్సవితారం సుదంససమ్ ॥ 699

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. జ్యోతిష్కృతోఽఅధ్వ, 2. వేదసఽఇన్ద్రజ్యేష్ఠాసోఽఅమృతాఽఋతా, 3. గయమాదిత్యైర్నోఽఅదితిః,
4. పృథివీఽఋతం, 5. దేవాగ్ంఽఆదిత్యాగ్ంఽఅవసే. (వా.ప.)

(5) సరస్వాన్ ధీభిర్వరుణో ధృతవ్రతః పూషా విష్ణుర్మహిమా వాయురశ్వినా ।
బ్రహ్మకృతో [1]అమృతా విశ్వవేదసః శర్మ నో యంసన్త్రివరూథమంహసః ॥ 700

(6) వృషా యజ్ఞో వృషణః సన్తు యజ్ఞియా వృషణో దేవా వృషణో హవిష్కృతః ।
వృషణా ద్యావాపృథివీ [2]ఋతావరీ వృషా పర్జన్యో వృషణో వృషస్తుభః ॥ 701

(7) అగ్నీషోమా వృషణా వాజసాతయే పురుప్రశస్తా వృషణా [3]ఉప బ్రువే ।
యావీజిరే వృషణో దేవయజ్యయా తా నః శర్మ త్రివరూథం వి యంసతః ॥ 702

(8) ధృతవ్రతాః క్షత్రియా యజ్ఞనిష్కృతో బృహద్దివా [4]అధ్వరాణామభిశ్రియః ।
అగ్నిహోతార [5]ఋతసాపో అద్రుహో ఽపో అసృజన్ను వృత్రతూర్యే ॥ 703

(9) ద్యావాపృథివీ జనయన్నభి వ్రతా [6]ఽఽప ఓషధీర్వనినాని యజ్ఞియా ।
అన్తరిక్షం స్వ౧రా పప్రురూతయే వశం దేవాసస్తన్వీ౩ ని మామృజుః ॥ 704

(10) ధర్తారో దివ [7]ఋభవః సుహస్తా వాతాపర్జన్యా మహిషస్య తన్యతోః ।
ఆప [8]ఓషధీః ప్ర తిరన్తు నో గిరో భగో రాతిర్వాజినో యన్తు మే హవమ్ ॥ 705

---

1. కృతోఽఅమృతా, 2. పృథివీఽఋతా, 3. వృషణాఽఉప, 4. దివాఽఅధ్వరాణా, 5. హోతారఽఋతసాపోఽ అద్రుహోఽపోఽఅసృజన్ను, 6. వ్రతాపంఽఓషధీ, 7. దివఽఋభవః, 8. ఆపఽఓషధీః. (వ్రా.ప్ర.)

(11) సముద్రః సిన్ధూ రజో [1]అన్తరిక్షమజ ఏకపాత్ తనయిత్నురర్ణవః ॥
అహిర్బుధ్న్యః శృణవద్వచాంసి మే విశ్వే దేవాస[2] ఉత సూరయో మమ ॥ 706

(12) స్యామ వో మనవో[3] దేవవీతయే ప్రాంచం నో[4] యజ్ఞం ప్ర ణయత సాధుయా ।
ఆదిత్యా రుద్రా వసవః సుదానవ [5]ఇమా బ్రహ్మ శస్యమానాని జిన్వత ॥ 707

(13) దైవ్యా హోతారా ప్రథమా పురోహిత [6]ఋతస్య పన్థామన్వేమి సాధుయా ।
క్షేత్రస్య పతిం ప్రతివేశమీమహే విశ్వాన్ దేవాగ్ం [7]అమృతాగ్ం అప్రయుచ్ఛతః ॥ 708

(14) వసిష్ఠాసః పితృవద్వాచమక్రత దేవాగ్ం [8]ఈళానా ఋషివత్ స్వస్తయే ।
ప్రీతా [9]ఇవ జ్ఞాతయః కామమేత్యాఽస్మే దేవాసోఽవ ధూనుతా వసు ॥ 709

(15) దేవాన్ వసిష్ఠో [10]అమృతాన్ వవన్దే యే విశ్వా భువనాభి ప్రతస్థుః ।
తే నో[11] రాసన్తామురుగాయమద్య యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 710

---

1. రజోఽఅన్తరిక్షమజఽఏకపాత్, 2. దేవాసఽఉత, 3. మనవోఽదేవ, 4. నోఽయజ్ఞం, 5. సుదానవఽఇమా, 6. పురోహితఽఋతస్య, 7. దేవాగ్ంఽఅమృతాగ్ంఽఅప్ర, 8. దేవాగ్ంఽఈళానాఽఋషివత్, 9. ప్రీతాఽఇవ, 10. వసిష్ఠోఽఅమృతాన్, 11. నోఽరాసన్తాఽమురుగాయ. (వా.ప్ర.)

## సూక్తము—66

ఋషి—వాసుక్రుఁడైన వసుకర్ణుఁడు†

దేవత—విశ్వే దేవతలు

(1)*గీ॥అఖిల తేజస్సునకుఁ గర్త లైన యట్టి
మిగుల నన్నంబుఁ గలుఁగుచు మెలఁగు నట్టి
యుత్తమ జ్ఞాన వృద్ధులై యున్న యట్టి
యమరులను బిల్చెదను నేను యజ్ఞమునకు ॥ 1619

*గీ॥ఇంద్ర నేతృకు లగు వార లెల్ల ధనము
గలుఁగువారలు మరణము గలుఁగనట్టి
వారు యజ్ఞముచే వృద్ధిఁ బడయు వార
[1]లగుచు నమరాభివృద్ధిని నందఁగలరు ॥ 1620

(2)*చ॥హరివిభు చోదితాత్ములయి యా వరుణాసుమతి ప్రసక్తి, నే
సురుచిర సన్మరుద్గణము సూర్యుని లోకముఁ బొందియుండెనో!
యరి గణ నాశకం బయిన యట్టి మరుత్తతి సన్నుతింతు మా
దరమున వానికై జనులు తప్పక యిష్టి నొనర్తు రీ మహిన్ ॥ 1621

(3,4)*సీ॥వసువులతోఁ గూడి వాసవుం డస్మద్గృహంబుఁ బాలించుచు నమరుఁగాక!
నాదిత్యసహితయౌ నదితి మాకు సుఖంబు ననమాన కరుణతో నొసఁగుఁగాక!
[2]నిజపుత్ర పూజ్యుఁడై నిలుచు నా రుద్రుండు ప్రీతి మమ్ముల సుఖపెట్టుఁగాక!
దేవపత్నులతోడఁ జెరుగు త్వష్టయు నస్మదభ్యుదయంబున కమరుఁగాక!
గీ॥యదితి, దివి, భువి, నాదిత్యు నగ్ని నింద్రు, నల మరుత్తుల నిజ మహిమాంచితులను
గర్మభూషిత సవితను గరము భక్తిఁ, బిలిచెదము మేము రక్షను గలుఁగఁగోరి ॥ 1622

(5)*గద్యము॥
[3]ప్రజ్ఞాయుక్తుఁ డగు సరస్వంతుఁ డనెడు దేవుఁడు, ధృతకర్మ గల వరుణుఁడు, పూష, మహత్వయుక్తుఁ డగు విష్ణువు, వాయువు, అశ్వులు స్తోతల కన్నదాత లగు విశ్వే దేవతలు శత్రుహంత లగు దేవతలు మాకుఁ ద్రికక్ష మగు గృహమును నిచ్చెదరుగాక! ॥ 1623

---

†వ్రాతప్రతి 13వ సంపుటములోను, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలోను నీ సూక్తమునకు "వసుకర్ణుఁడు" ఋషిగా శ్రీ నేమానివారు వ్రాసిరి.

* రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. లగుచు (నమరులు) దేవత లభివృద్ధి నందఁగలరు, (తా.పా.), 2. "నిజ పుత్రకులు తన్ను భజియించు రుద్రుండు ప్రీతి మమ్ముల సుఖపెట్టుగాక, (తా.పా.), 3. ఇంద్రాది దేవతలు ప్రజాయుక్తుఁ డగు. (తా.పా.).

(6)*సీ॥అస్మత్కృతంబైన యజ్ఞ కర్మము కామ వర్షితమై కడు వరలుఁగాక!
స్తుతి కారకులు సురల్ తత ధన మీయంగ సదయాత్మలై నిలిచెదరుగాక!
సద్వర్యు లెల్లరు హవ్యాభివృద్ధికై [1]నిరతము దీక్షఁ బూనెదరుగాక!
రోదసీ ద్వితయ మామోదము గలుఁగుచుఁ గోరికలను మాకుఁ గూర్చుఁగాక!
గీ॥నిలను బర్జన్యదేవుఁడు కలుఁగు కామ,ములను గలిఁగించుఁగాక! మా వెలమి మీర
సకల వర్షణ శీల సం స్తవపరులును, మొగి ధనవర్షులై వెలయుదురుగాక! ॥ 1624

(7)*గద్యము॥
వర్షణశీలులు బహుప్రస్తుతులు నగు నగ్ని సోములను నన్నలాభమునకు
ఋత్విజులు యజ్ఞ హవిర్మూలమునఁ బూజించుచున్నారు. ఆ యిరువురు
దేవతలు మాకుఁ దిర్యక్కంబ మగు గృహమును నిచ్చెదరుగాక! ॥ 1625

(8)*సీ॥బలవిరాజితులయి వెలుఁగు వా రెవ రన్న సకల దేవత లని చాటవలయు
యజ్ఞ నిష్కృతులయి యమరు వా రెవ రన్న సకల దేవత లని చాటవలయుఁ
దేజస్కులై కడుఁ దిరుగు వా రెవ రన్న సకల దేవత లని చాటవలయు
యజ్ఞాభిసేవకు లగుదు రెవ్వ రటన్న సకల దేవత లని చాటవలయు
గీ॥నవల హోత లహింస్యులు ఘనులు సత్య, భాక్కులైనట్టి దేవతల్ పరమ ప్రీతి
తోడ సంగ్రామమందునఁ దుష్టిఁ గలుఁగ, నప్పుల నొసంగియున్నవా రతిశయముగ ॥ 1626

(9)*గీ॥దివిని భూమిని లక్షించి దివ్య సహజ
కర్మమున నప్పులను మరి కర్మ కర్త
ములుగ నున్నట్టి వృక్షముల్ మోద మలరఁ
బుట్టఁజేసిరి దేవతల్ [2]పూర్ణశక్తి ॥ 1627

*గీ॥శత్రు బాధా నివారణ శక్తికొఱకు
నంతరిక్షంబు వ్యాపించి యమరు లెల్ల
స్వీయ తనువులయందు సుశ్రీలు చెలఁగ
యజ్ఞము నలంకరించినా రాదరమున ॥ 1628

(10)*గద్యము॥
ద్యులోక ధారయితలు, సత్య భాసమానులు, వజ్రాద్యాయుధయుక్తహస్తులు నగు
దేవతలు, శబ్దకర్త లగు వాత పర్జన్యులు, అప్పులను, నోషధులను, మా
వాక్కులను, వృద్ధిఁ బొందింతురుగాక! దాత యగు భగుఁడు,
అర్యమ, అగ్ని, వాయువు, సూర్యుఁడు, ఈ దేవత లెల్లరు
మా యాహ్వానము నంగీకరింతురుగాక! ॥ 1629

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. (ఎప్పుడు) నిరతము దీక్షఁబూనెదరుగాక, (వ్రా.ప్ర.పా.), 2. దేవతల్ మొట్టమొదట. (తొ.పా.).

(11)*గద్యము॥
స్యందమానోదకము గల సింధు వను నది, ద్యావాభూములకు మధ్య నున్న
మధ్యమలోకము అజాయమానుఁ డగు నేకపాత్తను దేవుఁడు, మేఘుఁడు,
అంతరిక్షభవుఁ డగు నహి యను దేవుఁడు, వీరందరు నా వక్తవ్య
స్తోత్రములను బ్రత్యేకము వినెదరుగాక! మరియుఁ బ్రాజ్ఞు
లగు విశ్వే దేవతలు నా స్తోత్రములను వినెదరుగాక! ॥ 1630

(12)*క॥మనుజుల మగు మే మో సుర
గణములు! యజ్ఞంబు మీకుఁ గల్పింతుము మా
ఘన యజ్ఞంబును మీరలు
కని ప్రాచీనముగ దానిఁ గల్పింపుఁ డొగిన్ ॥ 1631

*గీ॥రుద్ర పుత్రకులార! సుభద్రమూర్తు
లైన యాదిత్యవరులార! యఖిల భవ్య
దానులార! వసూత్తముల్! తగిన స్తోత్ర
ములను వినియుఁడు! మీరలు లలిత రీతి ॥ 1632

(13)*గీ॥పూర్ణహోతల, ముఖ్యులఁ, బూతల, మరి
దేవ సంబంధవర్తులఁ, దేజరిల్లు
శుభపురోహితవర్యుల, సురల, నేను
హవ్యములఁ జేతఁబట్టుచు ననుసరింతు ॥ 1633

*గీ॥చెంత వసియించుచున్నట్టి క్షేత్రపాలు
రమృతులై యప్రమాదులై యమరు నట్టి
సర్వదేవతలను మేము సరస రీతి
ధనము యాచించెదముగదా! తత్పరమతి ॥ 1634

(14)*గీ॥అల వసిష్ఠకులోత్పన్ను లైన యట్టి
పూర్వు లైనట్టి ఋషులను బోలి తమకుఁ
దండ్రియైన వసిష్ఠుని ధర్మ మూని
స్తవముఁ జేయుచునున్నారు ధన్యులు తగ ॥ 1635

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥స్వజనముల కెల్లఁ బ్రీతులు, సకల ధనము
నెట్లు ప్రేరణఁ జేయుదు రట్లు హవ్య
దానమున మధుర హవ్య సుదానమునను
ధనము ప్రేరణఁ జేయుఁడీ! ఘనులు మీరు ॥ 1636

(15)*గద్యము॥
"ఏ దేవతలు సర్వలోకములను స్వతేజస్సుచేఁ బ్రతిష్ఠించుచున్నారో! యా దేవత లీ
దినమున మాకుఁ బ్రభూత యశస్సు గల యన్నము నొసంగెదరుగాక!
దేవతలారా! మీరు మమ్ము సర్వదా రక్షింతురుగాక!" అనివసిష్ఠ
కులజుఁ డగు ఋషి దేవతల నమస్కరించెను ॥ 1637

## సూక్తము—66

ఋషి—వాసుక్రుఁడైన వసుకర్ణుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

†(1)ఏ దేవదేవుండు నింద్రులకు నింద్రుఁడో!
యే దివ్య దేవతలు ఇన కాంతి కాంతులో!
ఏ భవ్య దేవతలు ఎల్ల కాంతుల నెసయు
అనృతత్వరహితమై అమృతత్వసహితమై
ఋతు మూలమై నిత్య ఋత మూలమై నిలిచి
విశ్వవేద్యమైన ఆ విశ్వదేవతలు
అధ్వరమ్ముగ సృష్టి అధ్వమ్ములను నడుపు
నవ్య శక్తుల విమల విశ్వ శాంతిని గూర్చు ॥ 1638

†(2)తేజస్సులోఁ బుట్టి తివిరి జలముగ నిలిచి
సౌర శక్తులు నిండ మారుతములై వెలసి
ఆ మనోబుద్ధులను ఆత్మగతితో నడపి
సృష్టి యజ్ఞమ్ముగా [1]సూర్యశక్తులు విరియు
సుద్ది విద్దెలు లేక హద్దు పద్దును లేని
అరి వీర శక్తులను ననుపమమ్ముగఁ గనుము ॥ 1639

†(3)అష్ట వసుశక్తులను నా యింద్రదేవుండు
రుద్రుండు భద్రుండు నా రుద్రరుద్రుండు
నాదితేయుల మూల ప్రోది సుఖ శుభాళి
త్వష్ట నాథులతోటి నష్ట మేమియు లేక

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. "సృ-సూ"లకు యతి (చూ. పీఠిక.)

యిష్ట పూర్తము చేయు నెసఁగి అదిత్యుండు
నఖిలమ్ము రక్షించు నా విష్ణువై వెలసి
అమల శుభములఁ గూర్చు నమర సుఖములఁ గూర్చు
నమృతత్వ మొసఁగూర్చు నతిలోక శక్తులన్ ॥ 1640

†(4)సత్య పథమున నిలిచి సర్వలోకావశుల్
దివి భువులతో సకల రవి గణంలతో సహా
ఆ బ్రహ్మలే కాక అఖిల రుద్రులు కూడ
ఇంద్రాగ్నిమరుదాళి యెల్ల వసు సంపదలు
ద్వాదశాదిత్యులున్ ధన్య దేవావళులు
ఆ విష్ణు కృప మీఱ నాజ్ఞ మీఱక నిలుచు ॥ 1641

†(5)ఆ దివ్య దేవతలు నా విశ్వ దేవాళి
వరుణాగ్ని మరుదాళి వర పూష దేవుండు
విశ్వదేవత లెల్ల నమృత శక్తులు మీఱ
నా అంతరిక్షాన నలరారుచుండంగ
మూఁడు కాలాలలో నేడుగడగా నిలిచి
విష్ణువే కాపాడు విమల వ్రతములతోడ ॥ 1642

†(6)దివి భువులు దేవాళి దివ్య సత్య స్థితిని
యజ్ఞ యజ్ఞముగాఁగఁ బ్రజ్ఞాన సృష్టిలో
వెలుఁగు చీకట్లతో విజ్ఞానమయముగా
వర్జనీయము కాని వర్జస్క శక్తిగా
ఘర్జితము కాకుండ నిర్జితము కాకుండ
వానదేవుఁడుగాఁగ వాంఛితములను దీర్చు ॥ 1643

†(7)రవి చంద్ర తేజాలు రాణించు వృష్టిగా
భావి కాల మ్మెల్ల వర్తమాన మ్మొచు
వర్తమాన మ్మెల్ల వరలు భూత మ్మొచుఁ
బ్రతి భూతమును గూడ వర్తమాన మ్మొను
వర్తమానము వరఁగు భావి కాలము కాఁగ
నొకరి కొక కాల మింకొకరి కొక కాలముగ
నాకాశమున వాయ్వాదు లలరుచు నుండు
ననిలాన నాకన మ్మనలాదు లుండు
ననలాన నాకాశ మనిలాదు లుండు
సలిలాన నాకాశ మనిలానలములున్
జాలు మృద్భూతమ్ము సరవిగా నుండుఁ
బృథ్విలో నితరమౌ [1]భూతమ్ము లుండుఁ

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. "బృ-భూ"లకు యతి. (చూ-పీఠిక.)

పంచభూతాలతోఁ బరఁగు నీ విశ్వమ్ము
దేవ యజ్ఞముగాఁగ దివి భువుల వరల
సృష్ట కర్మముకాఁగ సృష్టి ధర్మ మ్మౌను
వ్యష్టి సమిష్టుల సమిష్టి కర్మ మ్మౌను ॥ 1644

†(8)క్షాత్ర తేజశ్శక్తి సంవర్ధకము గాఁగ
సృష్టి నొక స్థితి శక్తి శ్రీమహావిష్ణువై
జిష్ణుఁ జేరుచు వృత్రుఁ జెండాడి పవి శక్తి
నగ్ని యజ్ఞపు శక్తి నసుర శక్తులఁ దునిమి
సృష్టిలో వృష్టు లవి తుష్టిగా వర్షింప
సత్యమే నిత్యమై సర్వ లోకా లలరు ॥ 1645

†(9)అంతరిక్షమ్ములో అఖిల లోకాలతో
దివి భువుల సన్నిటన్ దేజరిల సుర నరులు
నిత్య నవ్యము కాఁగ నింగి చంద్రిక లెల్ల
దివ్యౌషధావళుల భవ్య భాగ్యము చేయ
విశ్వ శాంతికి యజ్ఞ విమల శక్తులు నింపి
పవలు రాత్రులు నడుపు నవిరళము కృష్ణుండు ॥ 1646

†(10)ఆకాశ గుణమైన ఆ శబ్ద శక్తితో
సలిలాన ననిలాన వెలి చాంద్ర సౌరాది
గ్రహ రాజి వెలుఁగు లవి బహుముఖమ్మై విరియఁ
బంచ భూతాలతో నించు మొయిళులు నింగి
సంచరించుచు వృష్టి నంచితముగాఁ గురియ
నోషధీ లత లెల్ల [1]వృక్షజాలముతోడ
యజ్ఞాగ్నులను వెలుఁగు హవిషాలలోఁ గరుగు
దివిలోను భువిలోను దివ్య మహిమలఁ బెరుగు ॥ 1647

†(11)దశ దిశల వెలుఁగొందు నసమాన సూర్యాళి
అంతరిక్షములోన నా సింధు సలిలముల
నా పాల కడలిలో నలరారు దేవుండు
ఆ దేవ దేవునికి నలరొందు నాభిలో
నెలవొందు కమలాన నలువ నల్ మోములన్
ఒంటి కాలిని మింటి నంటుచున్ నిల్వంగ

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. "ఓ - ఋ" లకు యతి. (చూ. పీఠిక.)

నక్షరమ్మై శక్తు లర్ణవములై నిలుచు
విశ్వ దేవత లెల్ల నశ్వరగతి వెలయ
నఖిల వాగమృతాదు లాదిశేషపు నిష్ఠ
నాస్వాదనము చేయ నా కోటి నోళులన్ ॥ 1648

†(12)ఆదిత్య దేవుండు నా బ్రహ్మ రుద్రులున్
అష్ట వసువులతోడి నా వాసవుండు
దుష్ట రాక్షస జాతిఁ దునుమాడుచుంద్రి
శిష్టులౌ రాక్షసులఁ జేరఁ దీయుదురు
సుర నర సర్వస్వ వర ప్రాణి జాలాల
విజ్ఞాన యజ్ఞాల ప్రజ్ఞాన పుంజాల
మమతతో లోకాల మంచినే పెంచుచున్
సచ్చిదానందాల సర్వమ్ము నలరింత్రు ॥ 1649

†(13)దేవదేవావళుల దివ్య పురోహితుఁడు
సర్వాదినిన్ నిత్య సత్య స్వరూపమ్మై
విశ్వ దేవత లెల్ల శాశ్వతానందాన
క్షేత్ర క్షేత్రజ్ఞులుగ క్షేత్రపతిగా నిలిచి
సాధు మార్గాలలో సత్య నైసర్గతలు
యజ్ఞ రూపాలలో నమృతాల నొసఁగంగ
నమృతాలు తొలఁగంగ నలరారు సచ్ఛక్తి
నాది పురోహితుం డా ఋత రూపుఁడుగ ॥ 1650

†(14)విశ్వ శాంతికి యజ్ఞ విమల శక్తుల దివ్య
దేవాళు లొనఁగఁగాఁ దేజరిలు శబ్దాలు
తండ్రి యానతి తలను దాల్చు పుత్త్రుం డట్లు
దేవర్షి మంత్రాల దివ్య శక్తుల కెల్ల
నఖిల సృష్టియు శిరము లవనతము కావించి
ఔ ననుచు నౌ ననుచు నౌదలను దాల్చుచున్
గోరికల యూరికలు కొమరొంపఁగా నిల్వఁ
బ్రీతితో జ్ఞాతమౌ విమల సంపద లొందు ॥ 1651

†(15)జ్ఞాన విజ్ఞానాలఁ జడి లంటు దేవాళి
విశ్వాస నమృతత్వ విమల శక్తుల నింపి
లోక కళ్యాణాల లోలుపత్వము మీఱ
విశ్వ దేవావళిగ శశ్వత్పథ మొసఁగి

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శాశ్వత గతిఁ జూపు సచ్చిత్తులను నెరపి
ఆద్యంతములు లేక ఏకరూపమై నిలిచి
ఆకార రహితమై అకలంకమై నిచ్చ
లానందమును నొసఁగు నమృతమ్ముగా నెసఁగు ॥ 1652

## సూక్తము—66

ఋషి—వాసుక్రుఁడైన వసుకర్ణుఁడు
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—2

†(1) అఖిల దేవావళులు యజ్ఞ యజ్ఞాలతో
బ్రహ్మలను నలరించి రాగిల్లు భువనాల
రంజిల్లఁగాఁ జేసి రంగు రంగుల కాంతి
పుంజాలతో నభము రంజితముగాఁ జేసి
ఇంద్రాదులను గూడి చంద్రేష్టితో సృష్టి
విశ్వ దేవత లెల్ల విమలామృత శక్తి
నిరతమ్ము సృష్టిలో నిండు శుభములు గూర్చ
జోత లిడ జ్యోతులే ప్రీతిగా రక్షించు ॥ 1653

†(2) సృష్టిలోపల నిత్య స్రష్ట యజ్ఞమ్ముగా
వ్యష్టిగా సర్వ సమిష్టిగాఁ పుష్టిగా
సూర్యేంద్రవరుణాది సురకాంతి పుంజాల
మరుదాళి శక్తులను మనసులు వర్తించు
ఆ చంద్రకాంతులున్ అద్భుతముగాఁ బ్రోచి
మనసు బుద్ధుల నడుపు మర్మ శక్తులతోడ ॥ 1654

†(3) వసు శక్తు లన్నింటి వాసవుఁడు కాపాడ
నఖిల లోకావళుల నాదిత్యుఁ డేలఁగా
ఆ దేవ మాతయే అదితి నా వెలుఁగొంద
రుద్రరుద్రులు మహారుద్రుండు భద్రులై
మూఁడు నాభుల నిలిపి ముప్పిరిగ సౌఖ్యాళి
సౌర సంపద లెల్ల సర్వ శుభములఁ గూర్చు ॥ 1655

†(4) అష్ట వసు సంపదలు నాదిత్య సవితలున్
రుద్రేంద్ర మరుదాళి [1]పృథ్వి ద్యో లోకాలు
సత్య మాధారముగ సర్వలోకావళులు
విష్ణుదేవుని శక్తి విలసిల్లుచుండులే! ॥ 1656

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. "రు-ఋ"లకు యతి. (చూ. పీఠిక.)

†(5) ముక్కాలములయందు దిక్కాలముల నిలిపి
వరుణ పూషలు నల్ల వాయుదేవాపశులు
బ్రహ్మలున్ ఆ పరబ్రహ్మలున్ వెలుఁగొంద
విశ్వ దేవత లెల్ల విష్ణుదేవుని గూడి
క్రమశిక్షణలు తనర సక్రమ రక్షణలు వరల
నంతరిక్షములోన నలరారుచుండులే! ॥ 1657

†(6) వర్ష మూలకమైన వర వర్ష శక్తియే
యజ్ఞమ్ముగా నిలుచు యజ్ఞ శక్తిగ వెలుఁగు
యజ్ఞ హవిస్సుగా యజ్ఞ దేవత కాఁగఁ
బర్జన్యమై నిలిచి వర దివులు భువు లెల్ల
వరలంగ వెలుఁగొందు హర్షాల వర్షాల
ఋతుమతిగ నెలవొందు ఋత మతిగఁ జెలువొందు ॥ 1658

†(7) అంతరిక్షములోన నగ్ని సోములు కలిసి
వర్ష మూలక శక్తు లార్షేయమై వెలయ
మూఁడు కాలాలలో మూఁడు నాభులతోటి
వేసవి కాల మవితథ వర్షా కాలమున్
శీతా కాలమ్ము చెలువొంద మూఁడిటికి
వర్షమే వలితమై హర్షమే ఫలితమై
సృజన శక్తులు సృష్టి వ్యాజనమ్ములై వెలయ
దేవాళి యజ్ఞమ్ము దివ్యమ్ముగాఁ జేయు ॥ 1659

†(8) యజ్ఞమే సుకృతిగా యజ్ఞమ్మె నిష్కృతిగ
మతి బద్ధులై సువ్రతబుద్ధులై నిలిచి
సత్యమే బ్రతుకుగా సత్యమే జన్మగా
అంతరిక్షములోని అధ్వ రణ రంగాన
నాభి శక్తుల రూప నాశనమ్మును గోరు
శత్రు తండాలైన వృత్రరాక్షస బృంద
దుర్మార్గ వర్తులన్ దున్మాడి ఘాతాత్రస
హాయి సమకూర్చుచున్ హర్ష వర్షము నిలిపి
దివ్య దేవత లెల్లఁ దేజరిల శక్తులన్
సృష్టి జనన శక్తి స్రష్టకే జయ మౌను ॥ 1660

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) అఖిల స్ఫార శక్తులన్ అంతరిక్షము నింపు
దివి భువులు నింపురా! దిశ లెల్ల నింపురా!
ఋక్కులే అగ్నులై రిక్కలే వెలుఁగులై
వన్నె వన్నెల మిన్ను వెన్నెలల చలువలై
విజ్ఞాన ప్రజ్ఞాన సుజ్ఞాన యజ్ఞాల
ఓషధీ శక్తు లవి ఉత్పన్న మగుచుండు
సృష్టిలో సంజనన శ్రీవిభవమే నిండు
దేవాళి శక్తులన్ దీప్తిమై నెలకొంచు ॥ 1661

†(10) అక్షర శక్తులన్ అక్షర శక్తులన్
వాయు ధూమాలతో వర్ష పర్జన్యాలు
జల శక్తులను నింప నెల వౌచు నోషధులు
అగ్నిమూర్తులు సర్వ మక్షయముగా నిల్చు
నాధారమాత్రమై ఆకర్షణా శక్తి
అఖిలాఖిలములైన యెల్ల యిటు లోకాలు
సూర్యాదిగోళాలు సురనరుల లోకాలు
సర్వ శుభములఁ గూర్చు సంపదల నొసఁగులే! ॥ 1662

†(11) నదు లెల్ల నుదధులన్ సదసమ్ముగాఁ జేరి
ఆల్లోల ఉల్లోల కల్లోల పటకాల
సాంగత్య మొందుచున్ సమ్మేళనము పొందు
రీతిగాఁ బ్రత్యణువు సృష్టిలో గగనాన
ఏకపాద్బ్రహ్మలో ఏకమై పోవురా!
ఆదిశేషువుతోటి అర్ణవ శక్తిలో
వాక్ప్రవణాలుగా వరలు దివ్యత్వాల
విశ్వ దేవత లెల్ల వెలుఁగొందుచుండురా! ॥ 1663

†(12) బ్రహ్మేంద్రరుద్రాళి వరలు నాదిత్యులున్
దివ్య దేవులు జగతి దేదీప్యమానమై
నిత్య నవమై నిల్చి నిండు తేజఃపుంజ
మొసఁగి యీ విశ్వాన రస శక్తులను నిల్పి
సృష్టి ప్రక్రియ లెల్ల వ్యష్టి సమిష్టిగాఁ
దృష్టిగాఁ బుష్టిగా నష్టిగా నెరపులే! ॥ 1664

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(13) విశ్వ దేవత లెల్ల సశ్వర శక్తులన్
అగ్ని పౌరోహిత్య మలరార సృష్ట్యాది
ఋతు చక్రమున్ నిల్పి పృథ్వ్యాది ప్రకృతుల
జన్య శక్తుల నింపి జనన శక్తుల నెరపి
సత్వ రూపముతోటి సత్య సంధత వెలయ
సన్మార్గముల సృష్టి శాంతి శుభములఁ గూర్చు ॥ 1665

†(14) దివ్య దేవర్షాళి దేవాళి వాక్కులను
అష్ట వసువులు నిలిచి అఖిలమ్ము వ్యాపించు
స్రష్ట ఆజ్ఞను తలను సృష్టి వాల్చెడు ఖాతి
నన్యోఽన్యతలు మీఱ నన్న దమ్ముల వోలె
నందరున్ ఒక తల్లి కావిర్భవించు గతిఁ
బంచ భూతము లెల్లఁ బరఁగుచుండును సదా ॥ 1666

†(15) విశ్వ భువనాలలో సశ్వరమ్మౌ నమృత
శక్తి విలసిల్లఁగా సకల దేవావళులు
సర్వ సంక్షేమములు సమలంకృతములుగా
నఖిల లోకావళులు నానంద సుఖములను
ననుభవించెడు నిచ్చ లంతరంగము నిండ
సృష్టి ప్రక్రియలోన స్రష్ట లక్ష్యము పండు ॥ 1667

## సూక్తమ్—67

ఋషిః—అయాస్య ఆంగిరసః
దేవతా—బృహస్పతిః
ఛందః—త్రిష్టుప్

(1) ఇమాం ధియం సప్తశీర్ష్ణీం పితా న [1]ఋతప్రజాతాం బృహతీమవిన్దత్ ।
తురీయం స్విజ్జనయద్విశ్వజన్యో ఽయాస్య [2]ఉక్థమిన్ద్రాయ శంసన్ ॥ 711

(2) ఋతం శంసన్త [3]ఋజు దీధ్యానా దివస్పుత్రాసో [4]అసురస్య వీరాః ।
విప్రం పదమంగిరసో దధానా యజ్ఞస్య ధామ ప్రథమం మనన్త ॥ 712

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. పితా నఽఋత, 2. అయాస్యఽఉక్థ, 3. శంసన్తఽఋజు, 4. పుత్రాసోఽఅసురస్య. (వా.ప్ర.)

(3) హంసైరివ సఖిభిర్వావదద్భిరశ్మన్మయాని నహనా వ్యస్యన్ ।
బృహస్పతిరభికనిక్రదద్గా ¹ఉత ప్రాస్తౌదుచ్చ విద్వాగ్ం ²అగాయత్ ॥ 713

(4) ఆవో ద్వాభ్యాం పర³ ఏకయా గా గుహా తిష్ఠన్తీరనృతస్య సేతౌ ।
బృహస్పతిస్తమసి జ్యోతిరిచ్ఛన్నుదుస్రా⁴ ఆకర్వి హి తిస్ర ఆవః ॥ 714

(5) విభిద్యా పురం శయథేమపాచీం నిస్త్రీణి సాకముదధేరకృన్తత్ ।
బృహస్పతిరుషసం సూర్యం గామర్కం వివేద స్తనయన్నివ ద్యౌః ॥ 715

(6) ఇన్ద్రో వలం రక్షితారం దుఘానాం కరేణేవ వి చకర్తా రవేణ ।
స్వేదాంజిభిరాశిరమిచ్ఛమానోఽరోదయత్ పణిమా గా ⁵అముష్ణాత్ ॥ 716

(7) స ⁶ఈం సత్యేభిః సఖిభిః శుచద్భిర్గోధాయసం వి ధనసైరదర్దః ।
బ్రహ్మణస్పతిర్వృషభిర్వరాహైర్ఘర్మస్వేదేభిర్ద్రవిణం వ్యానట్ ॥ 717

(8) తే సత్యేన మనసా గోపతిం గా ⁷ఇయానాస ఇషణయన్త ధీభిః ।
బృహస్పతిర్మిథోఅవద్యపేభిరుదుస్రియా ⁸అసృజత స్వయుగ్భిః ॥ 718

---

1. దద్గాఽఉత, 2. విద్వాగ్ంఽఅగాయత్. 3. పరఽఏక, 4. దుస్రాఽఆకర్విహితిస్రఽఆవః, 5. గాఽఅముష్ణాత్,
6. సఽఈం, 7. గాఽఇయానాసఽఇషణయన్త, 8. స్రియాఽఅసృజత. (వా.ప.).

(9) తం వర్ధయన్తో మతిభిః శివాభిః సింహమివ నానదతం సధస్థే ।
బృహస్పతిం వృషణం శూరసాతౌ భరేభరే [1]అను మదేమ జిష్ణుమ్ ॥ 719

(10) యదా వాజమసనద్విశ్వరూపమా ద్యామరుక్షదుత్తరాణి సద్మ ।
బృహస్పతిం వృషణం వర్ధయన్తో నానా సన్తో బిభ్రతో జ్యోతిరాసా ॥ 720

(11) సత్యామాశిషం కృణుతా వయోధై కీరిం చిద్ధ్యవథ స్వేభిరేవైః ।
పశ్చా మృధో [2]అప భవన్తు విశ్వాస్తద్రోదసీ శృణుతం విశ్వమిన్వే ॥ 721

(12) ఇన్ద్రో మహ్నా మహతో [3]అర్ణవస్య వి మూర్ధానమభినదర్బుదస్య ।
అహన్నహిమరిణాత్ సప్త సిన్ధూన్ దేవైర్ద్యావాపృథివీ ప్రావతం నః ॥ 722

## సూక్తము—67†

ఋషి—అంగిరః పుత్రుఁడు అయాస్యుఁడు‡
దేవత—బృహస్పతి

(1)*గద్యము॥
కర్మదాతృలు[4] సప్తశిరస్థానీయులు నగు మరుత్తులచేఁ గూడునట్టియు యజార్థముత్పన్నమైన మహాతనువును, అస్మత్పిత యగు నంగిరస్సు పొందెను. (కర్మధ్యాత యగు బృహస్పతిని పుత్రునిగాఁ బడసెను) అటులనే సప్తనుగూడఁ గాంచెను. సర్వజన హితుఁడై యాశ్వరునికొఱకు స్తోత్రము పఠించెను॥ 1668

---

1. భరేఽఅను, 2. మృధోఽఅప, 3. మహతోఽఅర్ణవస్య. (వ్రా.ప్ర.)

† ఈ సూక్తసంబంధమున నితిహాస మొకటి కలదు. పూర్వకాలమందు అంగిరస్సను ఋషి బృహస్పతి పుత్రునిగాఁ బడసెను. అతఁడు దేవతలకు హితోపదేశముఁ జేయఁగోరి యింద్రునకుఁ బురోహితుండయ్యెను. ఒక సమయమున వాని గోవులను నపహరించుకొనిపోయి పణు లను నసురులు బలపురమును జేర్చిరి. అచ్చటఁ దమోవృతము లగు మూఁడు స్థానములయందు దాచియుంచిరి. పిమ్మట వాని వెదకుటకు నింద్రప్రేరితుఁడై బృహస్పతి మరుత్తులతో నక్కడకు వచ్చెను. గుహాస్థితము లగు గోవులను దర్శించుటకు సూర్యుని బుట్టించి బలాసురుని వాని యనుచరు లగు పణులను జంపి గోవులను గొనితెచ్చెను. (నే. వేం. న. శా.)

‡ "అంగిరస పుత్రుఁడు అయాస్యుఁడు"గా వ్రాతప్రతి 13వ సంపుటములో వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "అయాస్యుఁడు" ఋషిగా శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

4. కర్మదాతృయు సప్తశిరస్థానీయులగు. (వ్రా.ప్ర.పా.)

(2)*గీ॥ ఋతముఁ బల్కుచుఁ గళ్యాణ వృద్ధిఁ గోరి
[1]మెలఁగుచున్నట్టి సర్వదా లలిత కీర్తి
వెలయుచున్నట్టి వర్జిజ్ఞచే వెలయునట్టి
యగ్నికిం బుట్టినార లా యంగిరసులు ॥ 1669

*గీ॥ అంగిరస్సూచకం బైన యట్టి యజ్ఞ
ధారకం బగు పదము నా వీరు లెల్లఁ
దాల్చుచు మొదట దానిని దగిన విధిని
సంస్తవము చేయుచున్నారు [2]సత్కృతుల ॥ 1670

(3)*ఉ॥ స్తోతలతోడఁ గూడుకొని సుందర వాక్కుల నుచ్చరించుచున్
బ్రీతి నొసంగు నిష్టి శుభ రీతిఁ బ్రవృత్తముగాఁగ యజ్ఞ వి
ఖ్యాతులతోడ సామమును గానము చేయుచు సర్వవేద యా
భూతలమందు దేవతలఁ బొందుచుఁ దా వినుతించు [3]వారలన్ ॥ 1671

(4)* గద్యము॥
పణు లపహరించుకొనిపోయి తమోవృత త్రిస్థానములయందున్న గుహయందుంచఁబడిన
గోవులను రెండు స్థానములనుండి తప్పించెను. (ఆవిషయమునే చెప్పుచున్నాఁడు.)
బృహస్పతి ఆ తమస్సునందు జ్యోతిని బుట్టింపఁ గోరుచు నక్కడఁగల
గోవులను బైటఁబడునట్లు చేసెను ॥ 1672

(5)*గీ॥ అతి పరాఙ్ముఖ మైనట్టి యసుర పురము
గొట్టి మేఘాసురునితోడఁ గూడఁ గల్గు
సూర్యులను బుట్టఁజేయు చపార్య రీతి
గోవులను బైటఁబడఁజేసెఁ గోవిదుండు ॥ 1673

*గీ॥ శబ్దమును జేయుచున్నట్టి సకల దివము
పగిది నున్నట్టి యల బృహస్పతి విశేష
మర్చసేయుని సూర్యుని నతిశయించి
తెలిసికొనియుండఁడే! తేటతెల్లముగను ॥ 1674

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. కర్మయందు ధ్యానించుచున్నట్టి యధికదీప్తి, (తా.పా.), 2. సరస రీతి, (తా.పా.),
3. వినుతించుచుండెడున్. (తా.పా.)

(6)*గీ॥ అధిపుఁడైన బృహస్పతి యాలఁ ను
నట్టి బలుఁ డను నసురునిఁ బట్టి కినుక
నాయుధ కరంబు వలె నున్న శబ్దమునను
సంహరించెను నెక్కువ శక్తిఁ బూని॥ 1675

*క॥ శరదాభరణ మరుత్తుల
పరమ సఖిత్వమును గూడి పణిని మునిమి యే
యరమర లేక బృహస్పతి
వెలువన గోవులను దెచ్చె విశ్వము మెచ్చన్॥ 1676

(7)*గీ॥ సత్య బలు లౌచు సఖు లౌచు నిత్య దేవ
మాను లౌచు ధనంబున మాన్యు లౌచు
నున్న యట్టి మరుత్తుల నోలి కూడి
ధేను హారకుఁ బరిమార్చె [1]దివ్య మూర్తి॥ 1677

*గీ॥ స్తోత్రపతియౌ బృహస్పతి యాత్మ వర్ష
మును నొసంగెడు వారలు పూత జలముఁ
జేయువారు మహేష్టినిఁ జేరు వార
లౌ మరుత్తుల బల వైరి ననిపినాఁడు॥ 1678

(8)*గీ॥ ధేనువులఁ బొందఁగోరుచు [2]దివ్య మహిమ
సత్య మానసమును గల్గు సన్మరుత్తు
లాత్మ సంబంధి కర్మల నల బృహస్ప
తిని నొనర్చిరి గోపతిగను ముదాన॥ 1679

*గీ॥ అసుర రక్ష్యము గోతతి నా మరుత్తు
లందినారలు కావున నట్టి వాని
గూడుకొనుచు బృహస్పతి కూర్మి ధేను
గణము వెడలెడు నట్టులు కలుఁగఁజేసె॥ 1680

---

* రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. మాన కతఁడు, (తా.పా.), 2. దివ్యతనము. (తా.పా.).

(9)*చ॥ హరి వలె నంతరిక్ష తలమందున శబ్దముఁ జేయుచుండి తా
గరము సమస్త రామములఁ గల్పనఁ జేయుచు జేత యైన నా
వరమ బృహస్పతిన్ మిగుల భక్తిని శూరుల మైన మేము సా
దరమున సన్నుతించెదము తత్పర బుద్ధిని యుద్ధభూములన్ ॥ 1681

(10)*చ॥ అతిశయ రూపముం గలుఁగు నన్నము నెప్పుడు పొందునో! బృహ
స్పతి యల గో కదంబము నభస్సును జేరునొ! యెప్పు డా బృహ
స్పతి విభు నప్పుడే సురల సంఘము హెచ్చుగఁ జేయుచుండి స
న్మతి గొని జ్యోతిఁ గాల్చు చభిమానముతో వినుతించుచుండెడున్ ॥ 1682

(11)*గీ॥ అమరవరులార! మీరు మా యన్నధాన
మునకు మా స్తోత్రమును సత్యముగ నొనర్పుఁ
డింక మీ [1]గమనములచేత నెలమి నాకు
సవనము నొసంగుదురుగాక [2]సతిశయించి ॥ 1683

*గీ॥ సకల హింసితుర్లెల్ల స్వశక్తి వీడి
నష్టపడుదురుగాక! విస్పష్ట రీతి
ననెడు నా వాక్కు మీరలు వినుఁడు! విశ్వ
ప్రీణయితృలు! రోదసుల్! ప్రీతి మెఱయ ॥ 1684

(12)*గద్యము॥
ఈశ్వరుఁడు, మహత్వయుక్తుఁడు నగు బృహస్పతి యుదకము గల మేఘుని శిరస్సును ఛేదించెను. అహంతవ్యుఁడు, అబ్వారకుఁడు నగు శత్రువును జంపెను. సప్త సంఖ్యాకము లగు గంగాది సప్త నదులను సముద్రుని బొందునట్టులు చేసెను. ఓ ద్యావా భూములారా! దేవతతోఁ గూడి మమ్ము రక్షింపుఁడు! ॥ 1685

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నిందరణమునకు మారుగా "ఫల"ము గాని "నహ"ము గాని ప్రయుక్తమైనట్లు భావింపనగును.
2. నొసంగుదురుగాక యతిశయించి. (వ్రా.ప్ర.పా.)

## సూక్తము—67

ఋషి—అంగిరః పుత్రుఁడు అయాస్యుఁడు

దేవత—బృహస్పతి

### అర్థాంతరము—1

†(1) విశ్వ సంక్షేమమును విహితమ్ముగాఁ గోరు
ధీమంతు లెల్లను నీమహా శక్తులను
నింపి శక్తులతోటి యీప్సితముల్ తీర
సప్త సహితమైన సత్య శక్తులు నిలువఁ
బ్రగతిలో సర్వమ్ము సుగతులన్ బొందఁగా
నగణిత దీధితుల జగజంత లౌచురులెః ॥ 1686

†(2) ఋజువైన ఋత శక్తి [1]ద్యో పృథ్వీ లోకాల
నసుర శక్తుల గెలిచి అమృత శక్తుల నిలిపి
అగ్ని రూపాలలో యజ్ఞాలలో వెలిఁగి
బుద్ధిమత్త్వము మీఱ శుద్ధతత్త్వము పార
సత్వశక్తిని నీయ సర్వోన్నతమ్ముగాఁ
జిద్గగన చంద్రికగఁ జెలఁగుచుండును సదా ॥ 1687

†(3) ఆకసమ్మున నున్న ఆ పాల కడలిలో
ఆలవోకగా నీవు నా రాజహంస గతి
క్షీర శక్తిని పొంది పార మెసయని బుద్ధి
వీర శూర సుధీర విజ్ఞాన మూర్తిగాఁ
ప్రజ్ఞాన మూర్తిగా సుజ్ఞాన స్ఫూర్తిగా
నుచ్చోచ్చ విద్యలను నిచ్చలముగా నేర్చి
ఆ బృహస్పతి వోలె నా దివ్య దేవతల
గురు మూర్తిగాఁగ సద్గురు మూర్తిగా వెల్గ
దేవ మానవ ప్రాణి జీవ జాలము తగును
భిన్న శక్తులు వెలయ నభిన్న శక్తులు కలియ ॥ 1688

†(4) ఏకైకమై వెలుఁగు ఋత శక్తి విడనాడి
అనృతమ్మే బ్రతుకుగా నా ద్వంద్వ గతి నిండ
నా నిందమతి పండ గోవిందు నుతి వీడి
దివ్య తేజము వీడి తిమిరాంధతను గూడి
అదె బ్రతుకు వారధిగ ఆ అధోగతి పొందు
నతి నికృష్టమ్మైన ఆత్మహత్యమౌ జీవి ॥ 1689

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. "ఋ-యో"లకు యతి. (చూ. పీఠిక.)

†(5) అంతరిక్షము నుండి అనంత యానమ్ముతో
అరుణుఁడై సూర్యుం డుదయించ శక్తులు విరియఁ
గర్భాశ యమ్మా నగ్ని కాంతి కిరణాలతో
ఉదయ మధ్యాహ్నాల నొయగు సాయంవేళ
ఆ వంక నీ వంక నన్ని వంకలఁ గూడ
బాలాతపమ్ముగా జ్వాలాతపమ్ముగా
వృద్ధాతపమ్ముగాఁ బ్రవృద్ధాతపమ్ముగాఁ
బ్రాక్రశ్మిమాలలోఁ బ్రాగల్భ్య మొప్పంగ
దశ దిశల వెలుఁగొందు నిశి దినమ్ముల నిచ్చు
అంతుపంతూ లేని ఆ కాల జలధిలో
అనవరత మ్మీఁదు సందానక పింఛాంశ
మఖిలమ్ము నాయకోను నాలించుఁ బాలించు ॥ 1690

†(6) రవి పవి కిరణాల రాజించు నిందుఁడుండు
రక్షితుండై సురల రాజుగా వెలుఁగొంది
బరకాయ మనరాని పర బ్రహ్మ శక్తులను
స్వస్తి స్వకీయమై ప్రస్తూయమానమౌ
సర్వ మరుదావళుల సత్ప్రాణ శక్తులన్
దన యిచ్చమే మహా ఘన రూపమై వెలయు ॥ 1691

†(7) సత్య రూపంబులో సర్వపరమై నిలుచు
నిత్యపరమై నిల్చు నిర్నిద్ర పర శక్తి
విష్ణువే చెలువొంది వృషపతిగ వెలుఁగొందు
భర్గుఁ డౌచు సదా నిసర్గ సంసర్గుఁడై
బ్రహ్మణస్పతి కాఁగ బ్రహ్మలకె బ్రహ్మగా
వారాహ వర్గుఁడై పార మెనయని రీతి
సకల లోకావళుల సర్వంసహాల నెల్ల
స్నేహ రూపమ్ముగాఁ జెలువొందఁ గాపాడు
స్థితి శక్తి వెలుఁగొందు మతి శక్తి వెలుఁగొందు
ఋత శక్తి నెలవొంద భృత శక్తు లిరవొంద ॥ 1692

†(8) హృత్సత్య శక్తులను సత్సర్గ మహిత గతి
సర్వ లోకాలకును సకలాధిపతిగాఁగ
నచ్చ స్వరూపాన స్వచ్ఛంద శక్తితోఁ
బ్రకృతి పురుషుల మహా ప్రాభవ మ్మొప్పంగ

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నఖిల మరుదావళులు సలవోకగా సృష్టి
ఆన్యోఽన్యతలు మీఱ నమృతమయమై నిలుచు ॥ 1693

†(9) ఆ సింహ శక్తితో సమర శుభావళుల
నంతరిక్షమునుండి అమృతప్రియాన
సర్వతోముఖముగా సద్దిషణలే వెల్గ
నా బృహస్పతి గాఁగ సతిలోక శక్తులన్
జయ శీలురను బట్టి జగ మెల్ల సద్వృష్టిఁ
గరువలితో సర్వ కళ్యాణములు తనరు ॥ 1694

†(10) విశ్వ మెల్లనుగూడ విపరీత వేగాన
నుత్తమోత్తముఁ డౌచు నుత్తర దిక్కులో
వెలుఁగొందు విష్ణులోఁ గలియఁ బయనించులేః
జ్యోతులై వెలుఁగొందు శూన్య మశూన్యమౌ
వివిధ గోళము లెల్ల విశ్వ లోకము లెల్ల
నల విష్ణు పేదలోఁ దెలివొందఁగా నిలుచు
నభ్యుదయ మార్గాల నభివృద్ధి చెందులేః
అగ్ని జలాదులన్ అన్నప్రదాతయౌ ॥ 1695

†(11) రోదోఽంతరాళాన నాఁడ వేదము తొప్ప
విశ్వమ్ముగా నిలిచి విశ్వాత్మగా నిలిచి
జల నాభి సలిలముల జతనమ్ము కావింప
సత్య స్వరూపమ్ము నిత్యమై వెలయంగ
జనన విజ్ఞానాల ధ్యాన రూపము వెల్గఁ
దనకుఁ దానై నిలుచు తరణిగా వరలులేః ॥ 1696

†(12) సూర్య కిరణావళుల శుభ్ర శక్తులు మీఱ
జల నాభి సలిలముల సప్త సింధువు లెల్ల
ఉరవళ్ళ పరవళ్ళ ఉరుకులను నెత్తుచున్
మహిమాన్వితమ్మైన మహితార్ణవము చేరి
యింద్రశక్తిని దలను నెనలేని రీతిలోఁ
దాల్చి అర్బుదముల దైవీయ ప్రాభవము
దివి భువుల నన్నిటను దేదీప్యమానమై
అహస్సుగన్ మహస్సుగా నాదిశేషువు కాఁగ

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

అఖిల లోకములందు సజ్ఞాన తిమిరాల
నాశనము కావించు ననన్య దీధితు లిచ్చు
జిష్ణు రూపమ్మైన విష్ణు లీలగ సర్వ
లోక వంద్యమ్మౌచు రోదోఽంతరము నిలుచు ॥ 1697

## సూక్తము—67

ఋషి—అంగిరఃపుత్రుఁడు అయాస్యుఁడు

దేవత—బృహస్పతి

**అర్థాంతరము—2**

†(1) అగ్నితేజమ్ముతో నావిర్భవించులేః
అఖిల విశ్వమునందు నమల మేధోరాశి
అల్ల బృహస్పతి యెల్ల విశ్వ ప్రశాంతి
సౌఖ్య సౌభాగ్యాళి సంక్షేమముల నింప
శబ్ద శక్తులను నిశ్శబ్ద శక్తుల నిల్పి
దేవ దేవుని నుతుల దివ్యత్వమును గూర్చు ॥ 1698

†(2) సత్య శక్తిని నగ్ని సర్వ విశ్వము నిండు
నది అంగిరో రూప మంది ప్రజ్ఞానమౌ
యజ్ఞములలో నిలిచి అజ్ఞతను దొలఁగించి
విజ్ఞాన సుజ్ఞాన ప్రత్యభిజ్ఞానమౌ ॥ 1699

†(3) వేదమే గీతమై వేదమై గీతమే
సర్వ శుభములఁ గూర్చు సద్భాగ్య పుంజాల
దేవ దేవుని మహిత తేజోఽనుసంధాన
దివ్య సంస్తుతులతో దేదీవ్యమానమై
విశ్వ సంక్షేమాల విమల యజ్ఞములోన
నాద శక్తులు మహామోదమ్ములను గూర్చు ॥ 1700

†(4) సౌర సంశక్తుల నపార కాంతులు వెలుఁగ
లోకాల చీకట్లఁ బోకార్చి బ్రతుకులకు
జవ జీవ శక్తులను నవ నవ్యముగ నిత్య
భవముగా సమకూర్చి ప్రాణికోట్లను సృష్టిఁ
బరఁగునట్లుగఁజేయు మరు లెనయఁగాఁ జేయు
మూఁడు కాలాలలో నేడుగడగా నిలుచు ॥ 1701

---

†రచయిత :—వాఙ్మయ మహోద్యమ, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) నాథ శక్తుల పొంగి రోధ కదిల్లతలఁ
గాలు మేఘావళులఁ గనుమరుగుగాఁ జేసి
సృష్టి సవ్యవస్థలు క్లిష్ట గతులను నిండఁ
జేయు దుశ్శక్తులను బెండాడి ప్రాణ శక్తి
లోక సంక్షేమాల లోలుపత్వము మీఱు
వర్షాది ప్రకృతులను హర్షమ్ముగాఁ జేయు ॥ 1702

†(6) పంచభూతావళుల సంచితము లట్టుగా
శబ్ద శక్తులు మీఱ సర్వ విశ్వమ్మునే
అణువులోఁ బెట్టి నగు నాడించ నౌసురా!
చిద్గగన చంద్రికలు చెన్నొంద మిన్నంద
శబ్ద గుణక మ్మైన సకలమౌ నాకాశ
మవకాశ మీయంగ నమర హృచ్ఛక్తులే
అఖిల మూల మ్మౌను నా నాదములు నిండి
శబ్ద నిశ్శబ్దాల సంపదలు తన రొందు ॥ 1703

†(7) ఆ మరుత్తుల మీఱు ననమాన శక్తులను
సత్యమే బల మౌచు సర్వస్వ మౌచుఁ
బంచ భూతములందుఁ బ్రాణముల్ నిలుపు
జల బలము ఘన బలము జ్వలితాగ్ని బలము
అన్న మాహారమై యా మృతుల ముప్పు
తరిగిపోయిన బలము విరిగిపోయిన బలము
పణ మౌను బ్రకృతిలో బలి యౌను వికృతిగా
నా శక్తి మీఱఁగా నజయ్య గతి తోప
సమ్మతమ్ముగ మీటి ఆ లోక కంటకం
బగు దుష్ట శక్తులన్ హత మార్చు నబ్రముగ ॥ 1704

†(8) సకల లోకావళులు శర్వ శర్మంబులను
దీపింపఁజేయఁగా నేపొందఁజేయఁగా
సమర శక్తుల నిల్పి అతిలోక విభవాల
సన్మతి పతి శక్తి సత్య శక్తులతోడ
శబ్ద శక్తులతోప సర్వ గోళాదులున్
బ్రకృష్టతరమైన ప్రకృతి జాల మ్మెల్ల
మహిత రూపాలలో సహజ సంపద లగుచు
మంచి చెడులను గూర్చు సంచితములై నిలిచె ॥ 1705

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) అంతరిక్షములోన నతిలోక మైన
కాంతి శక్తులు వెల్గఁ గామ్యముల్ తీర
మతి శక్తి విరియంగ ఋత శక్తి మెఱయ
సర్వశ్రేష్ఠం బౌచు శౌర్య తేజోరూప
సింహరాశ్యధిగత శ్రీలు చెలువొంద
నిర్వక్ర విక్రమ మ్మవక్ర చక్ర గతి
హరి శక్తి వెలుఁగొందు నజిముఖి కాఁగ
వర మౌచు సురవర వర మౌచు నిలుచు ॥ 1706

†(10) సురవరుల్ సద్బుద్ధి నిరవొంది నిలువ
ఋషి మునుల నన్నింటఁ దేజరిల్లంగ
నల్ల బృహస్పతి కాఁగ నా దేవతా శక్తు
లలరంగ విరియంగ నద్భుత గతిగ
సన్నోదకంబులు సంవోక కాఁగా
మహిమాన్వితము లౌను మనుగడల్ నిలుచు ॥ 1707

†(11) విశ్వ శాంతిని గోరి విమల దేవాళి
విశ్వశక్తుల మెచ్చ సమరమౌ గతుల
సర్వ లోకావళికి శర్మముల్ కలుగ
విశ్వ సృష్టిని బ్రకృతి విశిష్ట యజ్ఞాలన్
నిత్యమ్ము చేయుచున్ సత్య పథాలలో
సృష్టి ధర్మము నెరవు స్రష్ట కర్మను నిలుపు ॥ 1708

†(12) ఆకాశమున గంగ అమృతమ్ముగను
సప్త సింధువు లట్లు గుప్తంబు లౌచు
నర్ణవమ్మునఁ గలిసి యర్ణవం బగు రీతిఁ
బ్రకృతి పురుషుల శక్తి ప్రకృతిలోఁ గలియు
నప్రాకృతమ్మైన ఆ ప్రకృతి శక్తి
పురుష శక్తికి లోఁగి మెఱుఁగొందినట్లు
జలనాభినే మింగు ఘన శత్రువులను
ఛేదించు దేవుండు ఛిన్న మగు రీతి
వర్ష ఋతువుల నిచ్చి హర్ష క్రతువుల గూర్చి
వృష్టి సమిష్టులను సృష్టినే నిల్పును
అది బృహస్పతి శక్తి ఆది దేవుని శక్తి
మతి బృహత్తర ముక్తి మహిమాన్వితాసక్తి ॥ 1709

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్ —68

ఋషిః—అయాస్య ఆంగిరసః
దేవతా—బృహస్పతిః
ఛందః—త్రిష్టుప్

(1) ఉదప్రుతో న వయో రక్షమాణా వావదతో [1]అభ్రియస్యేవ ఘోషాః ।
గిరిభ్రజో నోర్మయో మదన్తో బృహస్పతిమభ్యర్కా [2]అనావన్ ॥ 723

(2) సం గోభిరాంగిరసో నక్షమాణో భగ [3]ఇవేదర్యమణం నినాయ ।
జనే మిత్రో న దంపతీ [4]అనక్తి బృహస్పతే వాజయాశూఁరివాజౌ ॥ 724

(3) సాధ్వర్యా[5] అతిథినీ రిషిరాః స్పార్హాః సువర్ణా [6] అనవద్యరూపాః ।
బృహస్పతిః పర్వతేభ్యో వితూర్యా నిర్గా [7] ఊపే యవమివ స్థివిభ్యః ॥ 725

(4) ఆప్రుషాయన్ మధున [8]ఋతస్య యోనిమవక్షిపన్నర్క [9]ఉల్కామివ ద్యోః ।
బృహస్పతిరుద్ధరన్నశ్మనో గా భూమ్యా [10]ఉద్నేవ వి త్వచం బిభేద ॥ 726

(5) అప జ్యోతిషా తమో [11]అన్తరిక్షాదుద్నః శీపాలమివ వాత [12]ఆజత్ ।
బృహస్పతిరనుమృశ్యా వలస్యాభ్రమివ వాత [13]ఆ చక్ర ఆ గాః ॥ 727

---

1. దతోఽఅభ్రి, 2. ర్కాఽఅనావన్, 3. భగఽఇవే, 4. దంపతీఽఅనక్తి, 5. సాధ్వర్యాఽఅతిథినీ, 6.సువర్ణాఽఅనవద్య, 7. నిర్గాఽఊపే, 8. మధునఽఋతస్య, 9. క్షిపన్నర్కఽఉల్కా, 10. భూమ్యాఽఉద్నేవ, 11. తమోఽఅన్తరిక్షా, 12. వాతఽఆజత్, 13. వాతఽఆ చక్రఽఆ గా. (ప్రా.ప్ర.)

(6) యదా వలస్య పీయతో జసుం భేద్ బృహస్పతిరగ్నితపోభిరర్కైః ।
దద్భిర్న జిహ్వా పరివిష్టమాదదావిర్నిధీగ్ంరకృణోదుస్రియాణామ్ ॥ 728

(7) బృహస్పతిరమత హి త్యదాసాం నామ స్వరీణాం సదనే గుహా యత్ ।
ఆణ్డేవ భిత్త్వా [1]శకునస్య గర్భముదుస్రియాః పర్వతస్య త్మనాజత్ ॥ 729

(8) అశ్నాపినద్ధం మధు పర్యపశ్యన్మత్స్యం న దీన[2] ఉదని క్షియన్తమ్ ।
నిష్టజ్జభార చమసం న వృక్షాద్ బృహస్పతిర్విరవేణా వికృత్య ॥ 730

(9) సోషామవిన్దత్ స స్వః సో[3]అగ్నిం సో అర్కేణ వి బబాధే తమాంసి ।
బృహస్పతిర్గోవపుషో వలస్య నిర్మజ్జానం న పర్వణో జభార ॥ 731

(10) హిమేవ పర్ణా ముషితా వనాని బృహస్పతినాకృపయద్వలో గాః ।
అనానుకృత్యమపునశ్చకార యాత్ సూర్యామాసా మిథ [4]ఉచ్చరాతః ॥ 732

(11) అభి శ్యావం న కృశనేభిరశ్వం నక్షత్రేభిః పితరో ద్యామపింశన్ ।
రాత్ర్యాం తమో[5] అదధుర్జ్యోతిరహన్ బృహస్పతిర్భినదద్రిం విదద్గాః ॥ 733

---

1. శకునస్య, 2. న దీనఽఉతని, 3. సోఽఅగ్నిం సోఽఅర్కేణ, 4. సామిథఽఉచ్చరాతః,

5. తమోఽఅదధు. (వా.ప.)

(12) ఇదమకర్మ నమో[1] అభ్రియాయ యః పూర్వీరన్వానోనవీతి ।
బృహస్పతిః స హి గోభిః సో [2]అశ్వైః స వీరేభిః స నృభిర్నో వయో ధాత్ ॥ 734

## సూక్తము—68

ఋషి—అంగిరః పుత్రుఁడు అయాస్యుఁడు†

దేవత—బృహస్పతి

(1)*గద్యము॥
ఉదకోద్గమయిత లగు పక్షులు సస్యములఁ బడకుండఁ గాపాడఁ గృషీవలు లెట్లు శబ్దమును జేయుదురో! మాటిమాటికి ధ్వనిని జేయుచున్న అభ్రము లెట్లు ఘోషించునో! మేఘములనుండి నిర్గతము లగు నప్సమూహములు ఎట్లు శబ్దాయమానము లగుచుండునో! యట్లు స్తోతలు బృహస్పతిని స్తుతించుచున్నారు ॥‡ 1710

(2)*గద్యము॥
అంగిరఃపుత్రుఁడై స్వతేజస్సుతోఁ గూడుకొనుచు, భగుని వలె నున్న బృహస్పతి స్తుతి ప్రేరకుఁ డగు స్తోతను గోవులతోఁ గూర్చుచున్నాఁడు. మిత్రుఁడు స్వరశ్మలను నెట్లు సంయోజనము చేయునో! యట్లు అతఁడు జాయాపతులను సమకూర్చుచున్నాఁడు. (స్వసామర్థ్యమున నక్కడ స్థాపించుచున్నాఁడు.) ఓ బృహస్పతీ! వ్యాప్తము లగు స్వరశ్మలను! సంగ్రామమందు అశ్వములనుz ప్రేరేపించునటుల స్తోతలయందుఁ జేర్చుచున్నాఁడు॥ 1711

(3)*గద్యము॥
కళ్యాణవయోనేత్రులు సతత గామినులు ఏషణీయలు శోభన శుక్లాది వర్ణోపేతలు వర్ణస్య రూపలు నగు గోవులను నుసీదములనుండి యవలను దెచ్చి జల్లునట్లు పర్వతమునుండి దోలుకొనివచ్చి సమీప స్థలమందుఁ బొందించుచున్నాఁడు ॥ 1712

(4)*గద్యము॥
ఉదకమునఁ బృథ్విని దడుపుచు నుదక యోని యగు మేఘమును జెదరఁజేయుచు అర్చనీయుం డగు బృహస్పతి ద్యోలోకమునుండి యుల్కను వలె బలాధిష్ఠిత మగు శిలోచ్చయమునుండి గోవులను నూర్ధ్వముగాఁ బొందించెను. పర్జన్యుఁడు వృష్ట్యుదకమున భూమిని భేదించునట్లు గోవుల డెక్కలచే భూమిని విభిన్నముగాఁ గావించెను ॥ 1713

---

1. నమోఽభ్రి, 2. సోఽశ్వైః. (వ్రా.ప్ర.)

† వ్రాతప్రతి 13వ సంపుటము 119వ పుటలో ని సూక్తమునకుఁ ఋషి "అంగిరః పుత్రుఁడు ఆయాస్యుడు" అని వ్రాసి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అయాస్యుఁడు" అని శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

‡ సూ.68.ఋ1.సస్యములు_కృషీవలులు. ఈ మంత్రమువల్ల నింక మరికొన్ని మంత్రములవల్లను ఆర్యుల నాఁడు భూమి సస్యపూర్ణ యగునట్లు కృషీవలులు వ్యవసాయవిద్యలో నారితేరినవారుగా నున్నట్లును గ్రహింపఁదగును గాని వారికి సేద్యముఁజేయుట దెలియకపోవుటచే నాహారార్థము పచ్చిమాంసమును సంపాదించి తినుచుండినట్లు వేదమం దెచ్చటను గానరాదు. (నే.వేం.న.శా.)

z యుద్ధసమయములందు అశ్వముల నుపయోగించుచుండి రనుటకు సూచన యిందుఁ గలదు. (నే.వేం.న.శా.)

(5)†గీ॥ వాయు వుదకమునుండి శైవాల మెల్లఁ
బోవు నట్టులు సేసెడు పోల్కి నా బృ
హస్పతియు సూర్యు మూలాన నంతరిక్ష
తలమునుండి తమస్సును దరిమె కాదె! ॥ 1714

గీ॥ వాయు వంతరిక్ష వారిదమును నెట్లు
చెదరఁ జేయు నట్లె శ్రీబృహస్ప
తియును గోగణంబు తివిరి గోత్రమునుండి
బైటఁబెట్టి వానిఁ బారఁదోలె ॥ 1715

(6)*గద్యము॥
అగ్నివత్తపన శీలము లగు నర్చనీయ రశ్ములచే హింసకుం డగు బలాసురుని
యాయుధమును నెపుడు భేదించునో! జిహ్వా దంతముల మూలమున
భక్ష్యములను నములునట్లు పర్వతమునఁ బణిపరివృతుం డగు
బలాసురు నెపుడు భక్షించునో! యపుడు బృహస్పతి గోవు
లావిర్భూతము లగున ట్లాచరించెను ॥ 1716

(7)*చ॥ క్షితిధరమందు శబ్దమును జేసెడు గోవుల పేరు నా బృహ
స్పతి విని, పక్షి యండమును బ్రద్దలఁ జేయుచు దాని గర్భముం
బతితము చేయునట్టు లల పర్వతముం దెగఁగొట్టి యందులోఁ
బతితము లైన గోవులను బైటను బెట్టఁడె! నిస్పృహోయుఁడై ॥ 1717

(8)*గీ॥ శుష్క జలమందు నివసించు చేర నెట్లు
చూడఁగల్గుదు రట్టులే సూరి యౌ బృ
హస్పతియు నశ్మ పిహితమౌ నాల పంక్తి
గాంచఁగల్గెను సంతుష్టి కలుఁగునటుల ॥ 1718

*గీ॥ శాఖినుండి రమ్య చమస పాత్రిం బెట్లు
దీయఁబడునొ! యట్లె తివిరి మౌని
శబ్ద శక్తివలనఁ జంపి బలాసురుఁ
గొండనుండి తీసె గోగణంబు ॥ 1719

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

(9)*గద్యము॥
బృహస్పతి పర్వతవివరమందుఁ గల గోవులను దర్శించుటకు నుషస్సును
నాదిత్యుని బొంది యర్చనీయ తేజస్సుచేతఁ దమస్సును బటాపంచలు
కావించెను. పిదపఁ బళు పరివృత బలునియొక్క పర్వతమునుండి
గోవులను మజ్జను[1] వలె నతిక్లేశమున నుద్ధరించెను ॥ 1720

(10)*గీ॥ పద్మ పత్ర సమూహంబు పరమ హిమము
వలన ముషితంబు లెట్లొః యా పగిది బలుని
వలన గో ధన చయములు పరము ముషిత
ములుగ నయ్యెను జగతిని ముదము వీడి ॥ 1721

*గీ॥ రాత్రియుం బవలు రవి శశుల్ రహిని నను
కృత్య కర్మను నెద్దాని గీర్తిఁ జేయుదురొః
బృహస్పతి యా కర్మ జరిపి బలుని
వలన గోవులఁ బొందెను బరమ తుష్టి ॥ 1722

(11)*గీ॥ శ్యామ వర్ణంబు గలిఁగిన యశ్వము నెటుః
స్వర్ణ భూషల భూషింతుర సకల పాల
యితలు, నక్షత్రముల దివ మెల్ల వెల్గఁ
జేసినారలు సంతత శ్రీల సురలు ॥ 1723

*గీ॥ అద్రిఁ గొట్టి బృహస్పతి యాలఁ బొందు
నపుడె సురలు తమస్సును నమల రాత్రి
యందు నునుచుచు జ్యోతి నహస్సునందు
స్థాపనముఁ జేసినారలు సకల విధుల ॥ 1724

(12)*గద్యము॥
ఏ బృహస్పతి యనుక్రమమున నాభిముఖ్యముగా ఋక్కులను జెప్పుచున్నాఁడోః యా
బృహస్పతియే గవాద్యశ్వములతోఁ గూడుకొనునట్టియుఁ బుత్ర సహిత మైనట్టియు
నన్నమును నొసంగుఁగాకః బృహస్పతికొఱకు నీ నమస్కారము నొనర్చెదము ॥ 1725

---

*రచయితః—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. "మజ్జానమ్" అని భాష్యము. (నే.వేం.న.శా.)

## సూక్తము—68
ఋషి—అంగిరఃపుత్రుఁడు అయాస్యుఁడు
దేవత—బృహస్పతి
## అర్థాంతరము—1

†(1) ఉదకమ్మునకు వయసు ఉప్పొంగుచుండుఁ
గెరటాల పరటాలఁ గెరలు నా వయసు
అభ్ర జాలము వయసు లబ్రమ్ము గొలుపు
నురుములకు మెరుపులకు నుండు నా వయసు
గిరి వయసు తరు వయసు సరిగమలు పలుకు
రక్షగాఁ గవచముగ రవి వయసు వెలుఁగు
నాకసమ్మున వయసు అనురాగములఁ బెంచుఁ
బంచ భూతాల్ వయసు సంచితము కాఁగ
నంచితముగా నొప్పు నఖిలాండములను
విశ్వ సృష్టియె గొప్ప విస్తారమై నిలువ ॥ 1726

†(2) రవి కాంతి పుంజాలు రమణి రమణులుగా
అల్లిబిల్లిగఁ గలియ నాలు మగ లట్లు
సర్వ లోకావళుల శబ్ద జాలము నిలిచి
ప్రకృతి పురుషుల రీతి వరలుచు నుండు
నగ్ని శక్తులు సృష్టి నద్భుతముగా వెలుఁగ
బుద్ధి కది ప్రతీకగా బద్ధమైయుండు
నా బృహస్పతి శక్తు లలరారుచుండు
వాక్పతిగాఁగఁ బితగాఁగ వరలుచు నుండు ॥ 1727

†(3) నిత్య సంచలనమై నిర్నిద్ర గతి తోప
సర్వ శుభములఁ గూర్చు సత్య శక్తులతోడ
సప్త వర్ణావళుల సప్త రుచు లొప్ప
శబ్ద శక్తులు నిల్చి నిశ్శబ్ద శక్తులు వెలుఁగు
నవవద్య రూపాల ననియత దీపాల
నచ్ఛమై స్వచ్ఛమౌ నవరంజి స్వర్గమై
అచల బుద్ధిని సృష్టి యవగతుల నిల్పి
పంచభూతావళుల బంధించు సంచితముగ ॥ 1728

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) సుప్తోపితమ్ములను సప్తానిలములు లేపి
 స్రవింపఁజేయుచున్ జాగు మొయిళుల నెల్లఁ
జెల్లచెదురుగఁ జేయు నుల్లమ్ము రాజిల్ల
 దివ్య శక్తుల మీఱు దేవలోకాఽఽవళుల
నుండి వెల్వడు నుల్క లుండుండి పడుచుండి
 వివిధ గోళాలకు విస్తృముగాఁ దిరుగు
నూర్ధ్వ గతులను దిరుగు నుచ్చ శక్తుల నిచ్చుఁ
 జలన శక్తుల నొసఁగు జ్వలన శక్తుల నొసఁగు
సలిలాలతో భూమి విలుచుఁ గణములు కాఁగ
 గో కాంతి శక్తులను గుధరమ్ములే ప్రీదులు 1729

†(5) గాలి నీటలనుండి జ్వాలలే జనియించు
 నర్కులే దేవులై యద్భుత కాంతులన్
అంతరిక్షములోను నఖిల లోకాలలో
 నంధకారము డుల్చు నా వెల్గు వెల్గులే
మేఘాళి పంజాలు మిన్నులను జెదరునటు
 చక్ర శక్తుల మీఱు సౌర శక్తులు పరల
నన్యోఽన్య సంబంధ అనుబంధ బంధాలఁ
 బంచ భూతావళులు వరలుచుండంగా ॥ 1730

†(6) సూర్యాతపమ్ముతో సురిగి జల మింకు గతి
 నావిరిగ రూపొంది అల్ల మొయిళుల ప్రగతి
నగ్న్యర్క శక్తులను నా తపశ్శక్తులను
 మతి పతి బలములే గతి తప్పకయె నిల్చు
నుత మార్గముల నిల్చు ఋత మార్గముల నిల్చు
 జిహ్వా రుచు లెఱుఁగఁగాఁ జెలఁగు శబ్దావళుల
భావ స్వభావాలు పరఁగు గుణ రుచి జాల
 మా ప్రజ్ఞానముల నిల్పి అద్భుత గతి నొసఁగు । 1731

†(7) అండమ్ము వగులుచు నా నిసువు వెడలు గతి
 బ్రహ్మాండ భాండమ్ము పగిలినట్లుగ సకల
రోదోఽంతరమునుండి లోక గోళాల్ గిరులు
 నావిష్కృత మ్మగును నద్భుత మ్మగు రీతి

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

అహరహము గుహనుండి రహి మించు శబ్దాలు
ధ్వనులఁ బ్రతిధ్వనులఁ దనరారు రీతిగా
రోదసీ సదనమ్ము నాదాల నినదించు
శబ్ద శక్తుల సృష్టి సర్వమ్ము చరియించు
నాద బ్రహ్మములోన నర్తించు నర్మ గతి
వర్తించు ధర్మ గతిఁ బ్రవర్తించు మర్మ ధృతి
సర్వదా బుద్ధిలో సచ్చిదానందాలు
రమియింపఁ జతి గతిగ రవళింప ప్రీతి గతిగ ॥ 1732

†(8) పంచ భూతాలలో సంచితమ్మై సహజ
మధు రూపమున నిల్చి మహితామృతము సదా
అంతర్గతులతోడ నఖిలమ్మునను నిండు
నిండు జలధిని జేప మెండుగాఁ దిరుగు నటు
ప్రకృతి రూపాలలో సుకృత శక్తులు నిలుచు
వికృతి రూపాలలో సకృత శక్తుల నిలుచు ॥ 1733

(9)†క॥ అగ్నిని సర్యుని వాయువు
నగ్నముగా వెల్గు నట్టి నానా దిశలన్
భగ్న రహిత గతి గతి ను
ద్విగ్నత లేకయె సుశక్తి విస్తృత మౌలేః ॥ 1734

† తిమిరాల సముదాల దీధితులఁ బరిమార్చి
లోకాలఁ జీకట్లఁ బోకార్చి సతతమ్ము
వెలుఁగు లోక పర్వమై నిలిచి బ్రతుకులఁ గలిపి
మరి పతి శక్తితో సతతమ్ముగా నిలుచు ॥ 1735

†(10) జలములో ననలమ్ము చరియించు రీతిగా
హిమములో నుష్ణమ్ము చెనఁగెడి వగిదిగా
నగ్నిలోపల జలము నావిష్కృత మ్మగును
సూర్యునిలో సలిల మార్ద్ర శక్తిగ నుండుఁ
బంచ భూతాలలో నంచితముగా నలరు
నఖిలమౌ లోకాలు నద్భుతముగా సృష్టి
వృక్ష వర్ణము లగుచు నక్షయత్వము లేని
బుక్షమ్ములై తిరుగుఁ బక్షమ్ములై నుడుఁగు ॥ 1736

†రచయిత :—వాఙ్మయ మహోపాసక, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(11)†క॥ రేయిం బవళుల సూర్యుఁడు
వాయు గతుల ఖర కర తతిఁ బర్వుచు నుండున్
మాయగ రిక్కలు కాంతుల
సోయగముల రెక్క లార్చుచున్ వెలుఁగొందున్ ॥ 1737

†క॥ అఖిలాఽఖిల గ్రహ నక్ష
త్ర ఖగోళ పితరుఁ డెవండొ ! రారా జాతం
డు ఖిల రహితుండు దేవుం
డఖిలుండై విశ్వ సృష్టి నంతయు నడుపున్ ॥ 1738

†(12) ఆ సత్యపర మైన ఆశ్వి పుంజా లెల్లఁ
గర్మ మకర్మమై ధర్మ మర్మ మ్మొచు
ననిల శక్తులతోడ నా జల శక్తులన్
ఆకాశ ధర్మాన నమృత మృచ్ఛక్తులన్
జకర్గనేమి క్రమత నవక్ర గతిమైఁ దిరుగ
నీ విశ్వ సృష్టియే యెనలేక వెలుఁగొందు ॥ 1739

## సూక్తము—68

ఋషి—అంగిరఃపుత్రుఁడు ఆయాస్యుఁడు

దేవత—బృహస్పతి

## అర్థాంతరము—2

†(1) ఆ అతివృష్టుల అల్ల విహంగాళి
జారిఁ బడకుండంగఁ బంటలను గాపాడి
మెరుపులను నురుములను మింటి మేఘావళులు
సంచరించుచు గిరుల సర్వ వనములఁ దడిపి
నదులు నదములలోన రొదతోడి సుడులతోఁ
గెరటాలఁ బరవళ్ళ నురవళ్ళఁ బ్రవహించుఁ
బ్రాణాల దానాల రవి వెలుఁగు శక్తులను
సర్వమ్ము కాపాడు సర్వణము పగిదిగా
వేద విజ్ఞానాల విశ్వేశ్వరుని బొగడి
విమల శుభములతోటి విశ్వ శాంతిని గూర్చు ॥ 1740

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) అక్షయమ్మై పరఁగు నఖిలాఖిల భువనాల
శబ్ద శక్తులు నిండి సకలమౌ విశ్వమ్ము
రోదసీ కుహరాస వేద నాదము నింద
దిన మణుల నిశి మణుల దీధితులు వెలుఁగంగ
రాణ దంపతు లట్లు రాత్రి పవళులు సృష్టి
జన మిత్ర శక్తిగాఁ జద లంటు నశ్వ గతి ॥ 1741

†(3) అది గమన శీలమై మది గమన శీలమై
అదవదలు లేకుండ నతిశుద్ధతల్ వెలయ
ననవద్య రూపమై యాచితము కాకుండ
మేఘ రంజన శక్తి జల సంజనన శక్తి
మెరుపు లురుములతోటి మేఘమాలలు కురియ
గిరి తరుల నుర్వరను నురుకు లిడు జల తతులు
సువర్ణ సుందర మైన సూర్య శక్తిని నడచుఁ
బదిలమై యిరవొందఁ బంచ భూతావళులు ॥ 1742

†(4) సౌర గోళావళులు పార మెనయని శక్తిఁ
బుల్కుపుల్కున రాలు నుల్క లట్లుగ సృష్టి
నఖిల గోళావళుల నన్నిలోకావళుల
జలద మాలలు జలముఁ జెలువొందఁ జేయఁగా
సత్య శక్తుల పరిధి సర్వమ్ము నిండఁగాఁ
బ్రాణ సహిత మ్మౌచుఁ బరగులేః విశ్వమ్ము ॥ 1743

†(5) గాలితో మేఘాలు లీలగాఁ జరియించు
గ్రహ రాజి నక్షత్ర కాంతు లెసఁగును నింగి
నర్వేశు శక్తితో సంచరించుచు నుండుఁ
బంచ భూతము లెల్ల వరల విశ్వమ్ములో ॥ 1744

†(6) జల శక్తి హరియించు సౌర కిరణావళులు
సలిలమ్ములో నగ్ని జ్వలితమై దాఁగొనును
అణు పరమాణువు లా సూర్య గోళాలఁ
జిట పటలఁ బ్రేలుచున్ నిటలాక్షి కణములై
జేజేల వెలుఁగులై చీకట్లఁ బోకార్చు
నగ్ని శక్తులు మీఱు నత్యంత జ్వలితమై ॥ 1745

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) శబ్ద శక్తుల గుహలు సర్వమ్ము నిండఁగా<br>
నండాండముల నిండి అంతర్గతము కాఁగఁ<br>
దరు గిరుల తండాలఁ దనరారు ధ్వని శక్తి<br>
ఉచ్చమై ఒనరురా! ఉపరి తలాలలో<br>
నీచమై నిలుచురా! నిమ్న తలాలలో<br>
ఆ ఉచ్చ నీచములె వ్యత్యస్తమై వరలు<br>
ఉచ్చ నీచము కాక ఒనరు మధ్యమ గతిగ<br>
సృష్టి నైజము కాఁగ స్రష్ట నైజము కాఁగ<br>
నక్షమ్ములను దాఁటు పక్షాల పగిదిగా<br>
నాకర్షణ పరిధు లలవోకగా దాఁటు ॥ 1746

†(8) మొయిళులను దనరారు మూర్తమౌ నీరముగ<br>
సలిలాన దోగాడు జల పుష్పముల భాతి<br>
విశ్వ వృక్షములోన విమలమౌ సోమమ్ము<br>
చంద్ర శక్తులు మీఱ నతంద్ర రక్తులు చీరు ॥ 1747

†(9) ఉష శక్తిలో నుండు నుసురు వాయువులు<br>
నాదిత్య గత మౌను నఖిల వాయువులు<br>
నగ్ని తేజము నొసఁగు నత్యద్భుతముగ<br>
మెరుపులతో వెలుఁగు మేఘ జాలాలు<br>
గోళాల లోకాల గో దీప్తు లెనయ<br>
విశ్వ మెల్లను గాంతి విమల తేజము నిండు ॥ 1748

†(10) హిమ బిందువుల శక్తి నమరమౌ రక్తి<br>
తరు లతల పత్రిలు తనరారు గతిగ<br>
సౌర శక్తిని సృష్టి సర్వమ్ము నడచు<br>
నుచ్చ నీచపు గతుల నుజ్జ్వల శక్తులన్ ॥ 1749

†(11) అఖిల నక్షత్రాల సర్వ శక్తులు విరియఁ<br>
దల్లిగాఁ దండ్రిగాఁ దగు ప్రాణ దాతగా<br>
నిశివేళఁ దిమిరాలు వెసఁ జెదరి పోవంగ<br>
వెలుఁగులకు వెలుఁగైన వేవెలుఁగు వెలుఁ గొసఁగు ॥ 1750

†(12) మేఘగతమై మెఱయు మెఱుపు లట్లుగను<br>
సూర్య గోళాల్ నిండు సౌర్య తేజశ్శక్తి<br>
అక్షర శక్తులన్ అత్యంత గూఢమై<br>
బాఢమై వీర్యమ్ము బ్రహ్మమ్ముగా వెలుఁగు ॥ 1751

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## అనువాకః—6, సూక్తమ్—69

ఋషిః—సుమిత్రో వాధ్ర్యశ్వః
దేవతా—అగ్నిః
ఛందః—త్రిష్టుప్; 1-2-జగతీ

(1) భద్రా[1] అగ్నేర్వధ్ర్యశ్వస్య సందృశో వామీ ప్రణీతిః సురణా[2] ఉపేతయః ।
యదీం సుమిత్రా విశో[3] అగ్ర ఇన్ధతే ఘృతేనాహుతో జరతే దవిద్యుతత్ ॥ 735

(2) ఘృతమగ్నేర్వధ్ర్యశ్వస్య వర్ధనం ఘృతమన్నం ఘృతమ్వస్య మేదనమ్ ।
ఘృతేనాహుత[4] ఉర్వియా వి పప్రథే సూర్య[5] ఇవ రోచతే సర్పిరాసుతిః ॥ 736

(3) యత్ తే మనుర్యదనీకం సుమిత్రః సమీధే[6] అగ్నే తదిదం నవీయః ।
స రేవచ్ఛోచ స గిరో జుషస్వ స వాజం దర్షి స[7] ఇహ శ్రవో ధాః ॥ 737

(4) యం త్వా పూర్వమీళితో వధ్ర్యశ్వః సమీధే[8] అగ్నే స ఇదం జుషస్వ ।
స నః స్తిపా[9] ఉత భవా తనూపా దాత్రం రక్షస్వ యదిదం తే[10] అస్మే ॥ 738

(5) భవా ద్యుమ్నీ[11] వాధ్ర్యశ్వోత గోపా మా త్వా తారీదభిమాతిర్జనానామ్ ।
శూర[12] ఇవ ధృష్ణుశ్చ్యవనః సుమిత్రః ప్ర ను వోచం వాధ్ర్యశ్వస్య నామ ॥ 739

---

1. భద్రాఽఅగ్నే, 2. సురణాఽఉపేతయః, 3. విశోఽఅగ్రఽఇన్ధతే, 4. నాహుతఽఉర్వి, 5. సూర్యఽఇవ, 6. సమీధేఽఅగ్నే, 7. దర్షిసఽఇహ, 8. సమీధేఽఅగ్నేసఽఇదం, 9. స్తిపాఽఉత, 10. తేఽఅస్మే, 11. ద్యుమ్నీవధ్ర్య, 12. శూరఽఇవ. (వా.ప్ర.)

(6) సమజ్యా పర్వత్యా వసూని దాసా వృత్రాణ్యార్యా జిగేథ ।
శూర[1] ఇవ ధృష్ణుశ్చ్యవనో జనానాం త్వమగ్నే పృతనాయూగ్ంరభి ష్యాః ॥ 740

(7) దీర్ఘతన్తుర్బృహదుక్షాయమగ్నిః సహస్రస్తరీః శతనీథ[2] ఋభ్వా ।
ద్యుమాన్ ద్యుమత్సు నృభిర్మృజ్యమానః సుమిత్రేషు దీదయో దేవయత్సు ॥ 741

(8) త్వే ధేనుః సుదుఘా జాతవేదో ఽసశ్చతేవ సమనా సబర్ధుక్ ।
త్వం నృభిర్దక్షిణావద్భిరగ్నే సుమిత్రేభిరిధ్యసే దేవయద్భిః ॥ 742

(9) దేవాశ్చిత్ తే[3] అమృతా జాతవేదో మహిమానం వాధ్ర్యశ్వ ప్ర వోచన్ ।
యత్ సంపృచ్ఛం మానుషీర్విశ[4] ఆయన్ త్వం నృభిరజయస్త్వావృధేభిః ॥ 743

(10) పితేవ పుత్రమబిభరుపస్థే త్వామగ్నే వధ్ర్యశ్వః సపర్యన్ ।
జుషాణో[5] అస్య సమిధం యవిష్ఠోత [6]పూర్వాగ్ం అవనోర్వ్రాధతశ్చిత్ ॥ 744

(11) శశ్వదగ్నిర్వధ్ర్యశ్వస్య శత్రూన్ నృభిర్జిగాయ సుతసోమవద్భిః ।
సమనం చిదదహశ్చిత్రభానో ఽవ వ్రాధన్తమభినద్వృధశ్చిత్ ॥ 745

---

1. శూరఽఇవ, 2. శతనీథఽఋభ్వా, 3. తే. ఽఅమృతా, 4. విశఽఆయన్, 5. జుషాణోఽఅస్య,
6. పూర్వాగ్ంఽఅవనో. (వా.ప్ర.)

(12) అయమగ్నిర్వధ్ర్యశ్వస్య వృత్రహా సనకాత్ ప్రేద్ధో నమసోపవాక్యః ।
స నో[1] అజామీగ్ంరుత వా విజామీనభి తిష్ఠ శర్ధతో వాధ్ర్యశ్వ ॥ 746

## అనువాకము—6, సూక్తము—69

ఋషి—వధ్ర్యశ్వ పుత్రుఁడు సుమిత్రుఁడు†
దేవత—అగ్ని

(1)*గీ॥ అగ్ని సందృష్టు లెల్ల నా జనకునకయి
పరమ కళ్యాణకరములై పరఁగుఁగాక!
వాని ప్రణయన భంగియు భవ్య మౌచు
వెలయుఁగావుత మీ మహా విశ్వమందు ॥ 1752

*గీ॥ యజ్ఞమునుగూర్చి యుపగతు లధిక శోభ
నంబు లగును సుమిత్రు లత్యంత మగ్ని
హవ్యముల వృద్ధిఁ బరచెడు నవసరమున
మేము నుతియింతు మా యగ్ని మిగుల భక్తి ॥ 1753

(2)*గద్యము॥
[2]వధ్ర్యశ్వసంబంధ మగు నగ్నియొక్క ఘృతము హవిర్వర్ధక మగును అన్నము అదనీయ
మగుఁగాక! ఈ యగ్నియొక్క ఘృతము పుష్టికర మగుఁగాక! దేనివలన నగ్ని
పరితుష్టుఁ డగునో! యది పుష్టి. ఆ ఘృతమున నాహుతుం డగు నగ్ని
యత్యంతము స్వతేజస్సుచే విప్రథితుఁ డగుచున్నాఁడు ॥ 1754

(3)*గీ॥ అనల! త్వద్రశ్మిసంఘంబు మనువు హవ్య
ములను వెల్గించె నే రీతి మోద మలర
మిత్రుఁడన్ నేను దదీతి మెఱయునటులఁ
జేసెదను నగ్ని హవ్యము చేతఁబట్టి ॥ 1755

---

1. సనోఽ అజామీగ్ం. (వ్రా.ప్ర.)

† వ్రాతప్రతి 13వ సంపుటము 125వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వధ్యశ్వ పుత్రుఁడు సుమిత్రుఁడు"గను 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "సుమిత్రుడు" ఋషిగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

* రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

2. వధ్యశ్వ సంబంధ మగు. (వ్రా.ప్ర.పా.)

*గీ॥ అట్టి రశ్మిసంఘ మభినవ మగు(గాక
నీవు ప్రజ్వలింపు: పావకుండ:
యస్మదీయ నుతుల నాలించి శత్రుని
నడచి మాకు నీయు మన్న మెలమి ॥ 1756

(4)*గీ॥ తొల్లి పుట్టిన యగ్నినిం దుష్టి మీఱ
నల్ల వధ్ర్యశ్వు(¹ డనువాడు తెల్లముగను
నిన్ను దీపింపజేసెను నీవు నాదు
స్తోత్రముల నాలకింపుమా: సురుచిర గతి ॥ 1757

*గీ॥ అగ్ని: యస్మదీయ యజ్ఞ రక్షకుడవు:
స్వాంగ రక్షకుడవు: సకల మౌడు:
మరియు నట్టి ధనము వెఱవున రక్షింపు
మట్టి ధనము నాకు నమరవలయు ॥ 7518

(5)*గీ॥ పూత బధ్ర్యశ్వ కులమున( బుట్టినట్టి
యగ్ని: యన్నము గలవా(డ వగుము: నీవు
చాల ప్రీతిని గలు(గుచు సకల లోక
గోపయితవయి యుండుము: కూర్మి కలు(గ ॥ 1759

*గీ॥ శత్రు జనముల నెల్లర శక్తి మెఱయ
నభిభవించుచునున్నా(డ వందువలన
జగతి నే వ్యక్తియును నీకు( జేరి యగ్ని:
హింస( జేయకయుండుత మెప్పు డైన ॥ 1760

*క॥ బలవంతుని వలె శాత్రవ
బలమును భయపెట్టి వారి( బరిమార్చుచు నీ
కిల( గల నామము లన్నిటి(
బలికెద నన్నంబు నాకు( బట్టుకొను మొగిన్ ॥ 1761

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఈ సూక్తమునకు ఋషి "వధ్ర్యశ్వపుత్రు(డు సుమిత్రు(డు"గా శ్రీ నేమానివారు వ్రాసిరి. కాని యీ పద్యములో "బధ్ర్యంశు(డను వా(డు" అని శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసిరి. (చూ.వ్రాతప్రతి-13వ సంపుటము. 127పుట.) దీని తరువాతి ఋగనువాదములలో "బధ్ర్యశ్వ" శబ్దమునే శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసిరి. "వబయోరభేదః" అన్న సూత్రము ననుసరించి "వధ్ర్యశ్వ" శబ్దము "బధ్ర్యశ్వ" యగును.

(6)*క॥ జనులకు హిత మగు గో ర
క్షణ ధనమును నొసఁగినావు కఠినాసురులం
గనుఁగొని తత్కార్యంబుల
ఘనముగఁ దొలఁగించి తీవ్రకాదే యగ్నీ! ॥ 1762

*క॥ ఘనుఁ డగు వీరుని మాడ్కిన్
జనులకు చ్యవనుండ వౌదు చాతుర్యముచే
తను సంగ్రామంబులఁ గడు
గనువారిఁ దిరస్కరింపు కనదగ్ని విభూ! ॥ 1763

(7)*సీ॥ అతిసుతిమంతుండవౌ నగ్ని! మాయందు నత్యంత దీప్తితో నమరుమయ్య!
విస్తార రశ్మల వెలయుచు నో యగ్ని! యత్యంత దీప్తితో నమరుమయ్య!
హవ్య యుక్తుండవై యమరెదు నో యగ్ని! యత్యంత దీప్తితో నమరుమయ్య!
దీప్తిమంతులయందు దీపించు నో యగ్ని! యత్యంత దీప్తితో నమరుమయ్య!
గీ॥ మానవాలంకృతుండవై మనెదు నగ్ని!
యమదలను గోరుచున్ వారియందు నీవు
సకల దీప్తిని గలుఁగుచు సకల విధుల
వెలుఁగుచుండుము! కడుఁగడు వేడ్క కలుఁగ ॥ 1764

(8)*గద్యము॥
ఓ జాతవర్జ్ఞుఁడా! పయో దోగ్ధ్రి యగు (హోమసాధన భూత యగు)ధేను వొకటి నీయందుఁ గలదు. అది సంగవర్జితుని వలె నున్న ఆదిత్యునితో సంగతమై యమృతము నొసంగు నట్టి గో రూప మాధ్యమిక వాక్కు విద్యుద్రూపుఁడ వగు నీయందుఁ గలదు· నీవు మా హవ్యముల దీపింపఁజేయఁబడుచున్నావు! ॥ 1765

(9)*గద్యము॥
ఓ జాతవేదుఁడా! నీ మహిమను అమృతు లగు దేవతలు కూడఁజెప్పిరి. మనుష్య సంబంధు లగు ప్రజలు దేవతలతోఁగూడినపు డెవఁ డసురులను జంపుచున్నాడో! యపు డట్టి నీవు సర్వ నేతలతోఁ గర్మ విఘ్నకారులను జయించితివి ॥ † 1766

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

† Refer to the arerinu. (N.V.N. Sastri)

(10)*క॥ పిత పుత్రుని బోషించెడు
వితమున ననలుండ! నిన్ను వేది నునిచి నా
పిత హవ్య సంపదల ని
న్నతిశయముగ వృద్ధిఁజరచె నతిభక్తి మెయిన్ ॥ 1767

*క॥ యువతముఁడ! నా సమిత్తను
సవనమునం బొంది నీవు సకల విధములన్
నివసించు శత్రు మండలి
కవమానము కలుఁగఁజేసి యమరితివిగదా! ॥ 1768

(11)*క॥ ఆ యనలుఁడు పంతంబును
బాయక ఋత్విజులతోడ వైరుల నెల్లన్
నాయము దప్పక దునిమె స
మేయుల మహిమంబు లిట్లు మించుచు నుండున్ ॥ 1769

*గీ॥ స్వీయ తేజస్సునన్ నీవు చిత్రభాను!
కాల్చినాఁడవు సంగ్రామకలన నెల్ల
స్తోత్రవృద్ధుఁడుగా నున్న సుశ్రిక్కఁజేయు
హింసకు నవాఙ్ముఖంబుగా నిడుచుఁ జంపె ॥ 1770

(12)*గీ॥ సకల శత్రుల హరియించు జ్వాలనుఁ దధిక
కాలమునసనుండి బధ్య్రశ్వ కాంత హవ్య
కలనచే దీపితుండయి లలి నమస్సు
వలన స్తోత్రవ్యుఁ డగుచుండు వలసినంత ॥ 1771

*గీ॥ ఓయి! బధ్య్రశ్వ కులజాత! యోయి! యగ్ని!
నీవు మా జ్ఞాతులను మరి నిఖిల విధుల
శ్రద్ధతో హింసఁ గూర్చెడు శత్రువులను
నభిభవింపుము! బిరబిర నతిశయముగ ॥ 1772

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—69

ఋషి—వధ్ర్యశ్వపుత్రుఁడు సుమిత్రుఁడు

దేవత—అగ్ని

### అర్థాంతరము—1

(1)†ఉ॥ విశ్వము సర్వసౌఖ్య శుభ వృత్తిని వ్యాప్తిని జెందు రీతిగా
సశ్వము లెల్ల వెల్గు నల యగ్ని మహాద్భుతరూపముల్ సదా
నిశ్వసితమ్ముగా వరలు నిర్మలమౌ శ్రుతి శబ్ద శక్తులన్
అశ్వజ రూపముల్ హవిసు లన్ని పవిత్రిత నందుచుండెడున్ ॥ 1773

†తే॥గీ॥ అగ్ని యజ్ఞాలు భద్రరూపాళి మీఱ
వాము శక్తులఁ దునుమాడి నీమ మొప్ప
విశ్వజిచ్ఛక్తిని నజయ్య విమల తేజ
మలరు ఘృత మౌను జప తప జ్వలిత ఘనత ॥ 1774

(2)†క॥ అన్న సుశక్తులు పెరుగును
విన్నాణము పెరుగు నగ్ని విస్తృతి లోకాల్
మిన్నంటును దేజస్సులు
కన్నన ఘృణి ఘృత సుశక్తి ఘనతన్ జగతిన్॥ 1775

(3)†క॥ పుల్లన్ బుడకలఁ బుట్టెడు
తెల్లని ఆ అగ్నికన్న దివ్య మ్మౌరా!
ఉల్లపు నిశ్శబ్దాగ్నులు
చిల్లలితము లౌచు నిత్య జీవిక లౌరా! ॥ 1776

†క॥ ఎల్లలు లేకయె వెల్గును
మల్లా గుల్లాల వల్లమాలిన దగురా!
ఉల్లపు నిశ్శబ్దాగ్ని ప్రి
పుల్లమ్మె తగు నజయ్య పూర్ణ సుదీప్తిన్ ॥ 1777

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4)†తే॥గీ॥ సృష్టి యజ్ఞమ్ము కాపించు స్రష్ట శక్తి
కాయువై నిల్చి వెల్గెడు నగ్ని రూప
మాది శక్తిగఁ బంచ భూతాళి మధ్య
నన్నిటను నుండు నతిలోక యజన గతిగ ॥ 1778

†(5) అగ్నితో ఆహార మావిష్కృత మ్మగును
అగ్నియే ఆకలికి నాధారభూత మగు
అగ్ని ఔషధ మగును నాయు జీవ మ్మగును
అగ్నిమూల మ్మగును నాస్థ లన్నింటికిని
అగ్నియే మిత్రుఁడై యలరారుచుండురా!
అది శత్రువైనచో నార్పివేయునురా!
సృష్టి శక్తిని నగ్ని చెలఁగు నంతర్గతిని
అగ్నివల్లను సృష్టి అఖిలమ్ము సున్ నడచు ॥ 1779

(6)†తే॥గీ॥ అగ్ని కుధరాల సంతర్గతాచ్ఛమైన
జ్వలిత చలన ద్రవీభూత సర్వ భక్ష
రక్షకాగ్నియోఁ బ్రాణి జాలము నఖిలము
దహ్యమానమ్ము కాకుండఁ దరణి రూప
శబ్ద నిశ్శబ్ద శక్తులే సర్వ కాల
సర్వమౌ నవస్థలను నఖర్వ గతుల
నగ్నికే దేవతగ నొప్పె అగ్ని యగుచు
నలరు నగ్నిని స్తుతియింప నగునుగాదె! ॥ 1780

†(7) అఖిలాండ పిండాల నన్ని బ్రహ్మాండాల
నల్లిబిల్లిగఁ బట్టి అల్లుకొన్నట్లుగా
నా అగ్ని కాంతుల అమర కిరణావళులు
వ్యాపించు విశ్వాన యజ్ఞ యజ్ఞము కాఁగ
సృష్టి యజ్ఞము కాఁగ స్రష్ట యజ్ఞము కాఁగ
వ్యష్టి సమిష్టుల యజ్ఞ తజ్జ్ఞత లలర ॥ 1781

(8)†శా॥ హృచ్ఛక్తిన్ వెలుఁగొందు నగ్ని జగతిన్ హృద్యమ్ముగా నిల్చుచున్
స్వచ్ఛాత్మన్ బ్రభవించు నిల్చుఁ గదలున్ జాజ్వల్యమానమ్ముగా
నాచ్ఛాదావృత మౌచు ధూళులను మాహాత్మ్యంపు నిశ్చేష్టతన్
ఇచ్ఛా శక్తిగ నీశ్వరీయ మగుచున్ ఈ విశ్వమై వెల్గురా! ॥ 1782

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(9)†శా॥ భవ్యమ్మైన పరా సురాశి కమృత పాత్రియమ్ముగా నిల్చుచున్
గవ్యాశిన్ సకలమ్ము నిండుచును విక్రాంతిన్ సుకాంతుల్ సదా
దివ్యాఽఽరూఢల నిల్చి వెల్గు ననలోద్వేలోల్లతల్ మీఱఁగా
నవ్యత్వమ్ము సునిత్య మౌచుఁ బగు నానా వర్ణ సంకాశమై ॥ 1783

(10)†క॥ తనయుఁడు తండ్రిగ నాత్మీ
య నిగూఢతల నెడతెగని యనుబంధాలన్
అనలము వెలుఁగును గాంతుల
ఘన శక్తుల సృష్టి నిండి కామ ప్రగతిన్ ॥ 1784

(11)†శా॥ కాంతుల్ వేలుగ వెల్గుచుండ జగతిన్ గాంభీర్య దీవ్యచ్ఛటన్
గ్రాంతిన్ విశ్వమునందు వ్యాప్త మవుచున్ రాజించుచున్ బుద్ధి పే
దాంతమ్మై వరలంగ శబ్దమయ మాహాత్మ్యంపు నిశ్శబ్దతన్
శాంతుల్ వర్ధిలు నగ్నిదేవ! అమలాఽఽశా పూర్ణమౌ నీ కృపన్ ॥ 1785

(12)†మ॥ జల నాభిన్ దిగమ్రింగుచున్ జగతిలో సంక్షేమముల్ పోవ సం
కుల శక్తిన్ ఖల వృత్ర నామకుఁడు సంక్షోభమ్ము సృష్టింపఁగా
జ్వలిత మ్మౌచు నజయ్యమైన ఘృణి సచ్ఛక్తుల్ మహా రూపమై
కలగా శత్రుపుఁ ద్రుంచి విశ్వమును సంక్రాంతిన్ బ్రసాదించులే! ॥ 1786

## సూక్తము—69

ఋషి—వధ్ర్యశ్వపుత్రుఁడు సుమిత్రుఁడు
దేవత—అగ్ని

### అర్థాంతరము—2

(1)†క॥ అగ్నిని నాజ్యము కలియఁగ
భగ్నముగాఁ బూర్ణ శత్రు పౌరము దర్శిల్లన్
వ్యగ్నత్వమ్ము నశింపఁగ
నగ్న స్వర వేద ఋగ్ధనమ్ము కతమునన్ ॥ 1787

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†చ॥ అనలము మిత్ర మౌచు నఖిలాఽండపుఁ బిండపు బ్రహ్మ సృష్టులన్
పనరుచు వామ దక్షిణ పథమ్ముల మంత్రజ శక్తి రూపమై
కనఁగ నభద్ర భద్రతలఁ గ్రాలఁగఁ జేసెడి వేద శక్తులే
ఘన సుర శక్తు లౌచుఁ బరకాయ ప్రవేశపుఁ బ్రాణమై తగున్ ॥ 1788

(2)†ఉ॥ గోవుల నేయి స్తుత్య మగు గుప్త సుశక్తుల బైట నగ్నినిన్
జీవికగా మహా నిశిత నిర్మల నిశ్చిత ప్రజ్వలాఽఽత్మగా
నేవము మీఱఁగా నిలుపు నేలను నింగిని బ్రాణ పుంజమున్
దైవ గతిన్ బరాత్పరత ధర్మ రతిన్ నిర వొందఁజేసెడున్ ॥ 1789

(3)†సీ॥ సన్మిత్ర జన్మమే సమిదగా వెలుఁగొంద నగ్న్యనిలమ్ములే అమృత మౌను
నిత్య నవ్య మ్మైన సత్య ఋక్శక్తియే నవ నవ జీవితానంద మొసఁగు
వార్ధక్య రహితమై వర్ధనమ్మౌ నిత్య యౌవన శక్తులే యమ మొసంగు
శక్తియే ధనముగా రక్తియే శోభగా మంత్రాక్షరాశియె మహిత మౌను
గీ॥ శత్రుశక్తి దశ దిశలన్ స్థలము లేక, కక్ష నిర్ధూమ ధామమ్ము గాఁగ నమసి
సృష్ట యజ్ఞ మజయ్యమై సృష్టివెలుఁగ, దేవదేవుని ఋక్కాంతి దివ్య మౌను ॥ 1790

(4)†క॥ అంతర్గతజ మహాగ్ని సు
కాంతులు సమిధల నిలుచుచుఁ గ్రాలెడు భంగిన్
వింతగ సృష్టిని నిలుచు ని
తాంతాఽనిల జల గగన వితతి మృద్ధరమై ॥ 1791

(5)†క॥ భరితమ్మై భూతాఽఽవళి
జరితమ్మై కాల బద్ధ చక్ర క్రమతన్
దరణీయమ్మై సృష్టిని
బరాక్రమత వరలు ననల ప్రాణ సుశక్తుల్ ॥ 1792

(6)†అష్టపదకందము॥
అష్ట వసు తతులు ప్రకృతిని-వ్యష్టి సమిష్టులుగ నిలువఁ బాపాత్ముండౌ
జెష్ట, ససురవృత్రుని, బా-పేష్టుని, జల నాభి హరుని వీరత్వమునన్
బిష్టమ్ముగఁ బేషణముగ-నష్టావృతునిగ నొనరించి నాశము కాఁగన్
సృష్టి క్రమ వ్యవస్థను-బుష్టి వివర్ధన మొసరుచుఁ బూర్ణాఽనలుడే! ॥ 1793

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7)†మ॥ శత సాహస్రిక కాంతి జాలముల శశ్వత్సర్వ దివ్యాత్మతన్
ఋత శక్తిన్ సుర దేవ కాంక్షిత బృహద్ఋక్షాళిగా వెల్గుచున్
నత గో కాంతి సుదీర్ఘ తంతువులు నానా దిక్కులన్ బర్వఁగా
సతతమ్మున్ శ్రుతి రూపిగాఁగఁ బ్రథితన్ శాక్తేయతన్ నిల్పుతన్ ॥ 1794

(8)†క॥ ఋక్సంపద నిత్యమ్మై
వాక్సత్యత వర్ధిలంగ వరలు జలమునన్
స్రిక్సవితాగ్నియె దేవ సు
దిక్ సహిత సమయ విశాల దీప్యచ్ఛటయౌ ॥ 1795

†(9) దివ్య దేవ చిత్తమ్మునఁ దేజరిల్లు నమృతమ్ము
జాతవేదుఁడౌ నగ్నిని సంచరించు నమృతమ్ము
నర సుర వర ఋక్తతలను వరలుసురా! అమృతమ్ము
పుణ్యరూప హృదయమ్మునఁ బొంగి పొర్లు నమృతమ్ము
అంతులేని ఆ కాంతిని నలరుసురా! అమృతమ్ము
మహిమాన్వితమౌ శక్తుల మలఁగుసురా! అమృతమ్ము ॥ 1796

†(10) తండ్రి తనయుం బెంచుఁ దనరారు రీతిగా
నగ్నియే కాంతిగా నలరారుచుండురా!
ఆ సమిధ ప్రాణమ్ము నమృత మౌ రీతిగాఁ
బ్రాగ్దిశను సుదయించు రవి కిరణ శక్తులే
తిమిరాలఁ బోఁదోలు సమరాగ్నులై వెల్గి
ప్రకృతి మర్గుణ తతిని బట్టి నాశముఁ జేయు ॥ 1797

†(11) సుతుని దండ్రి పెంచు రీతి సోముని రవి పెంచు పగిది
ఋక్తతులను నగ్ని పెంచి దిక్తతులను రుగ్ణకలిత
శత్రు తండముల జయించి శశ్వత్సుఖ సంపదాళి
సుమనోరంజిత మగుచున్ సమనస్కృత వెలుఁగొందుచు
సచ్చిత్తులు నానందము సహస్రుగా నా బ్రహ్మగ
ననుభూతికి రా విజ్ఞత అంతరించురా! అజ్ఞత ॥ 1798

(12)†క॥ శాత్రవ తండాధిపుఁ డా
వృత్రుని సంహారకాండ వెస నెఱపెడి సా
విత్రుని దీధితులు పవిగ
మిత్రత విశ్వమున విరియ మించఁగ ఋక్కుల్ ॥ 1799

---

†రచయిత :—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ పద్మమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ అజ శక్తిని ఋక్తతులే
విజాతి శత్రు తతుల బహు వికృత వికార
పు జనన శక్తి హరించుచు
పుజా రహిత దివ్యశక్తి రూప మ్మగులే॥ 1800

## సూక్తమ్—70

ఋషిః—సుమిత్రో వాధ్ర్యశ్వః

దేవతా—ఆప్రీసూక్తం (1. ఇధ్మః సమిద్ధోఽగ్నిర్వా; 2. నరాశంసః; 3. ఇళః, 4. బర్హిః; 5. దేవీర్ద్వారః, 6. ఉషాసానక్తా, 7. దైవ్యా హోతారా ప్రచేతసౌ, 8. తిస్రో దేవ్యః సరస్వతీళాభారత్యః, 9. త్వష్టా, 10. వనస్పతిః, 11. స్వాహాకృతయః.)

ఛందః—త్రిష్టుప్

(1) ఇమాం మే[1] అగ్నే సమిధం జుషస్వేళస్పదే ప్రతి హర్యా ఘృతాచీమ్ ।
వర్ష్మన్ పృథివ్యాః సుదినత్వే[2] అహ్నామూర్ధ్వో భవ సుక్రతో దేవయజ్యా ॥ 747

(2) ఆ దేవానామగ్రయావేహ యాతు నరాశంసో విశ్వరూపేభిరశ్వైః ।
ఋతస్య పథా నమసా మియేధో దేవేభ్యో దేవతమః సుషూదత్ ॥ 748

(3) శశ్వత్తమమీళతే దూత్యాయ హవిష్మన్తో మనుష్యాసో[3] అగ్నిమ్ ।
వహిష్ఠైరశ్వైః సువృతా రథేనాఽఽ దేవాన్ వక్షి ని షదేహ హోతా ॥ 749

(4) వి ప్రథతాం దేవజుష్టం తిరశ్చా దీర్ఘం ద్రాఘ్మా[4] సురభి భూత్వస్మే ।
అహేళతా మనసా దేవ బర్హిరిన్ద్రజ్యేష్ఠాగ్ం[5] ఉశతో యక్షి దేవాన్ ॥ 750

---

1. మేఽఅగ్నే, 2. సుదినత్వేఽఅహ్నాం, 3. మనుష్యాసోఽఅగ్నిమ్, 4. ద్రాఘ్మాసురభి, 5. జ్యేష్ఠాగ్ంఽఉశతో. (వ్రా.వ్ర)

(5) దివో వా సాను స్పృశతా వరీయః పృథివ్యా వా మాత్రయా వి శ్రయధ్వమ్ ।
ఉశతీర్ద్వారో మహినా మహద్భిర్దేవం రథం రథయుర్ధారయధ్వమ్ ॥ 751

(6) దేవీ దివో దుహితరా సుశిల్పే[1] ఉషాసానక్తా సదతాం ని యోనౌ ।
ఆ వాం దేవాస[2] ఉశతీ ఉశన్త ఉరౌ సీదన్తు సుభగే[3] ఉపస్థే ॥ 752

(7) ఊర్ధ్వో గ్రావా బృహదగ్నిః సమిద్ధః ప్రియా ధామాన్యదితేరుపస్థే ।
పురోహితావృత్విజా యజ్ఞే[4] అస్మిన్ విదుష్టరా ద్రవిణమా యజేథామ్ ॥ 753

(8) తిస్రో దేవీర్బర్హిరిదం వరీయ[5] ఆ సీదత చకృమా వః స్యోనమ్ ।
మనుష్వద్యజ్ఞం సుధితా హవీంషీళా దేవీ ఘృతపదీ జుషన్త ॥ 754

(9) దేవ త్వష్టర్యద్ధ చారుత్వమానడ్యదఙ్గిరసామభవః సచాభూః ।
స దేవానాం పాథ[6] ఉప ప్ర విద్వానుశన్యక్షి ద్రవిణోదః సురత్నః ॥ 755

(10) వనస్పతే రశనయా నియూయా దేవానాం పాథ[6] ఉప వక్షి విద్వాన్ ।
స్వదాతి దేవః కృణవద్ధవీంష్యవతాం ద్యావాపృథివీ హవం మే ॥ 756

---

1. సుశిల్పేఽఉషా, 2. దేవాసఽఉశతీఽఉశన్తఽఉరౌ, 3. సుభగేఽఉపస్థే, 4. యజ్ఞేఽఅస్మిన్, 5. వరీయఽఆసీదత,
6. పాథఽఉప. (వా.ప్ర.)

(11) అగ్నే వహ వరుణమిష్టయే న[1] ఇన్ద్రం దివో మరుతో[2] అన్తరిక్షాత్ ।
సీదన్తు బర్హిర్విశ్వ[3] ఆ యజత్రాః స్వాహా దేవా[4] అమృతా మాదయన్తామ్ ॥ 757

## సూక్తము—70

ఋషి—వాధ్ర్యశ్వసుమిత్రుఁడు†
దేవత—ఆప్రీస్సు (1. సమిద్ధుఁడు, 2. నరాశంసుఁడు, 3. ఇళ, 4. బర్హి, 5. దేవీర్ద్వారము, 6. ఉష,
7. ప్రచేతసులు, 8. సరస్వతి, ఇళ, భారతులు, 9. త్వష్ట, 10. వనస్పతి, 11. స్వాహ)†

(1)*గీ॥ అగ్నిః యుత్తర వేదిపై నమరియుండి
యస్మదీయ సమిత్తును నందుకొనుము!
ఘృతముచే నొప్పుచుం గడుఁ గీర్తనీయ
మౌ నమస్సును సేవింపుమయ్య! నీవు! ॥ 1801

*గీ॥ అతిసముచ్ఛ్రితదేశంబు నందుమోయి!
సుక్రతు! వగళులకు నెల్ల సుదిన ధర్మ
మునకునై భక్తి కృతమైన ఘనతరేష్టి
వలన జ్వాలోన్నతత్వంబుఁ బడయుమయ్య! ॥ 1802

(2)*గీ॥ అల నరాశంసుఁ డనునట్టి యగ్ని దేవ
తాగ్రయాయిగ వెల్గుచుఁ దక్షణంబు
వివిధ రూపాశ్వములతోడ విశ్రమింప
నిటకు వచ్చుసుగాకఁ దా నెలమి మిగుల ॥ 1803

*గీ॥ అతఁడు యజ్ఞహితుండయి యమర ముఖ్యుఁ
డవుచు హవ్యము నందించు యజ్ఞ మార్గ
మూలమున స్తోత్ర మూలానఁ జాల హవ్య
మును నొసంగుసుగాకఁ దా మోద మలర ॥ 1804

1. యేనఽఇన్ద్రం 2. మరుతోఽఅన్తరిక్షాత్, 3. విశ్వేఽఆ యజత్రాః, 4. దేవాఽఅమృతా. (వ్రా.వ్ర.)

† వ్రాతప్రతి 13వ సంపుటములో 133వ పుటలో ఋషి "వాధ్ర్యశ్వసుమిత్రుడు" గాను, దేవత "సమిత్తులు" గాను, పేర్కొని 15bసంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "సుమిత్రుఁడు" గాను, దేవత "ఆప్రీసు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(3)*గద్యము॥
సంభృత హవిష్కులగు మనుష్యులు హవిర్లక్షణనిమిత్తము అంత్యంతనిత్యుఁడగు నగ్నిని
స్తుతించుచున్నారు. ఓయగ్నీ! యట్లు నీవు స్తుతింపఁబడినవాడవై వోఢృతమము లగు
నశ్వములతోఁ గూడుకొనిన రథముచే దేవతలను మా యజ్ఞమునకుఁదెమ్ము!
పిమ్మట నీవు హోతవై యీ యజ్ఞమందు విశ్రమింపుము! ॥ 1805

(4)*సీ॥ బర్హి స్సనెడు నగ్ని! యర్హసురాంచిత బర్హిస్సు తత మౌచుఁ బరఁగుఁగాక!
ద్రాఘిమ యుక్తమై తనరారు బర్హిస్సు కడు విస్తృతంబయి గ్రాలుఁగాక!
మా దత్త బర్హిస్సు మానుగ సోమాది వస్తు సంపదలతో వరలుఁగాక!
నయ్యది సురభితో నతిశయముగఁ గూడి శ్రీల వెలుంగుచుఁ జెలఁగుఁగాకఁ!
గీ॥ బూత బర్హి స్సనెడు నగ్ని! ఖ్యాత మాన, సంబునం గోరుచుండెడు సకల దేవ
తోత్తములఁ జాల సంప్రీతి నొంది వివిధ, విధులఁ బూజింపు! వారిని విశ్వమందు ॥ 1806

(5)*గీ॥ ద్వార దేవత లెల్లఁ బ్రధాన దివము
లును సముచ్ఛ్రిత దేశంబుఁ గనుచుఁ బృథ్వి
మాత్రచే మిశ్రితాత్మలై యాత్ర నధిక
విస్తృతలుగా వెలుంగుత! వేడ్క మెఱయ ॥ 1807

*గీ॥ దేవతల నెల్లఁ గాంక్షించు దివ్య యాన
కాములై మహిమచేఁ గడు ఘనతర సుర
యుక్తమై ద్యోతమానమై యుండు రమణ
సాధనంబు ధరింపుఁడీ! సరవి మీరు ॥ 1808

(6)*గీ॥ దుహితలు దివికి మరియును[1] ద్యోతమాన
ములు సురూపములం గల్గి వెలుఁగుతోడ
నుండు పవలును రాత్రియు నొనర యజ్ఞ
మందు విలసిల్లుచురుగాక! [2]నంద మొప్ప ॥ 1809

*గీ॥ కాంక్షితాత్ములార! కమనీయ ధనులార!
దేవతాత్ములార! దినము రాత్రు
లార! మీ సమీపమందు దేవత లెల్ల
హవ్యములను గోరి యమరుచుంద్రు ॥ 1810

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి
1.దివికి దుహితలు మరియును ద్యోతమాన, (వ్రా.వ్ర.పా.యతిభంగము.) 2. గాక యంద మొప్ప. (వ్రా.వ్ర.పా.)

(7)*గద్యము॥
సోమాభిషవమునకు గ్రావ యున్నతమైనపుడు మహాగ్ని హవిర్దీప్తమైనపుడు సోమాది
హవిఃప్రదానమునఁ బ్రీణయితలగు యజ్ఞపాత్రములు యజ్ఞసదనమం దాసాదితము
లైనపుడు దేవతలారా! పురోహితులారా! విద్వత్తములారా! మీ రిపుడు నీ
యిష్టియందు మా కాభిముఖ్యముగా ధనము నిచ్చెదరుగాక! ॥ 1811

(8)*గీ॥ దేవతాత్రయమా! మీకు దీక్ష నిట్టి
యమల బర్హిస్సు విస్తీర్ణ మైన రీతిఁ
జేసినారము కావున శ్రీ లొసంగు
దీనిపై విశ్రమింపుఁడు! స్థిరము కలుఁగ ॥ 1812

*క॥ ఇళయు సరస్వతి భారతి
వెలయుచు మను హవ్యములను వెలసిరొ! యల్లే
లలి మా యజ్ఞంబందున
విలసిత హవ్యములఁ బొంది వెలయుత! వాంఛల్ ॥ 1813

(9)*ఉ॥ దేవుఁడ! త్వష్ట! హవ్యముల దివ్యతరం బగు రూప మంది నా
వీవు సఖుండ వైతివిగదే! యిల మాకు ధన ప్రదుండవై
వావిరి హవ్య సంపదల వర్ధిలఁ గోరుచు రత్నధారివై
దేవ గణంబు కెల్ల నిడు! దివ్యతరాఽన్నము సంతసంబునన్ ॥ 1814

(10)*గీ॥ ఓ వనస్పతి రూపుఁడా! యూప! నీవు
సర్వ మెరుఁగుచు రశనచే సరస రీతిఁ
గట్టఁబడుచుండి దేవతాగణముకొఱకు
నన్నమును బొందఁజేయుమా! యెన్నునటుల ॥ 1815

*గీ॥ అల వనస్పతి దయఁగల్గి మెలఁగుఁగాక![1]
నతఁడు హవ్యంబు నిడుఁగాక! [2]నమరులకయి
రోదసులు దేవతాహ్వాన మాదరమున
నంచితంబుగ రక్షించి యమరుఁగాక! ॥ 1816

---

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. గాక, యతఁడు (వ్రా.ప్ర.పా), 2. గాక, యమరులకయి. (వ్రా.ప్ర.పా.)

(11)*గీ॥ ఇంద్ర వరుణ మరుత్తుల నెలమి నగ్ని
యస్మదిష్టిని బొందించి యమరు మీవు!
యమరు లెల్లరు బర్హిస్సునందు సదయ
విశ్రమింతురుగాక, దా పరిశ్రమమున ॥ 1817

*గీ॥ మరణ ధర్మ రహిత సురవరుల్ స్వాహల
దత్త హవ్యములను దత్క్షణంబు
స్వాత్మ కెల్ల విపుల సకల చాతురిమతో
మదము గూర్తుగాక! ముదము మీర ॥ 1818

## సూక్తము—70

ఋషి—వాధ్ర్యశ్వసుమిత్రుఁడు

దేవత—అప్రిస్సు (1. సమిద్ధుఁడు, 2. నరాశంసుఁడు, 3. ఇళ, 4. బర్హి, 5, దేవీర్ద్వారము. 6. ఉష, 7. ప్రచేతసులు, 8. సరస్వతి, ఇళ, భారతులు, 9. త్వష్ట. 10. వనస్పతి, 11, స్వాహ.)

## అర్థాంతరము—1

(1)†సివంగివృత్తము ॥*
ఈ దైవీయ మహాయజ్ఞమున హృచ్ఛక్తిన్ ఘృతానీకమున్
ప్రాదేశమ్ముగ నిల్పంగ వర రక్షా రూపమై దీపమై
నాదోద్విగ్న మదీయాగ్నిచయ సద్య జ్వాల లాళ్చర్యమై
వేదోక్తిన్ ఋషి స్వర్గాయల సపేక్షన్ దర్శిరీక్ష మ్మగున్ ॥ 1819

†తే॥గీ॥ సమిధ లెల్లను సుస్థానచయము నొందఁ
బగలు సుదినమ్ము కాఁగను వరలుచుండ
దేవ యజ్ఞమ్ము సుక్రతు దివ్య కృతిగ
నూర్ధ్వగతి నొందు సచ్ఛక్తిఁ •బృథ్వినుండి ॥ 1820

†(2) నానావిధ రూపాలను ప్రాణ దాతగా వెలుఁగుచు
దివ్య దేవ యజ్ఞాలను దేజరిలెడు ముమ్మొదటను
ఆ అగ్నియె సృష్టిలోన నఖిల భక్షకముగ నిలుచు
విశ్వ స్వరూప మౌను విమలత్వము నందుచుండు ॥ 1821

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ధృతి"చ్ఛందము (18) •."ఊ-ఋ"లకు యతి. (చూ. పీఠిక.)

(3)†క॥ శశ్వత్సుఖ సంపత్తుల
నశ్వ సమూహములు దిశల నపురూపంబై
విశ్వాత్మగ వెలుఁగొందుచు
శాశ్వతముగ సృష్టిఁ బ్రాణి చయమున నిలుచున్ ॥ 1822

†(4) దివ్య దేవ యజ్ఞాలను దేవేంద్రుని శక్తి మీఱఁ
బ్రాణి మానసంపు శక్తి పరిఢవిల్ల సురభిళముల
శబ్ద శక్తి ముందు నిలిచి అబ్దమ్ముల పగిది హవిసు
లందించెడి ఆ అగ్నియె అలరించును దీర్ఘత మెయి ॥ 1823

(5)†క॥ భువి దివి లోకాంతరములను
వ్యవహిత రహిత గతి నెనసి ప్రాణుల్ హృచ్ఛ
క్తి విలసితమై మహితమౌ
నవిచలితపు నగ్ని యజ్ఞ మచ్యుతమౌలేః ॥ 1824

(6)†శిఖివృత్తము॥*
దివ్య దేవ గణాంతరములు తేజరిల్ల వివిధ యోని
భవ్య మౌచు జగాలను బ్రభావిత మ్మొనరిచి నిత్య
నవ్య సుందర శోభలు ఘనాఘనమ్ము పగిది రూపు
లవ్యయ వ్యయ భావ మహదానుకూల్య ముదము నిచ్చు
గవ్యజాలము విశ్వమునఁ గాంతు లీన వెలుఁగుచుండు
నవ్యమంత్ర పదార్థములు కాంతి దాంతి గుణము లీయ
నవ్యభిన్న సుశబ్ద ఫల శక్తు లక్షయముగ నిల్వ
సువ్యయమ్ముగఁ గాల మతిశుద్ధ సార్థకత లొసంగు ॥ 1825

(7)†తే॥గీ॥ ఊర్ధ్వగతి మీఱ నగ్నులు సుజ్జ్వలముగ
ఘృతము సమిధలు కూడఁగ ఋక్తతులను
నక్షయ మ్మగు నక్షర పక్ష శక్తు
లలర విశ్వ సంక్షేమ మహమ్ము లెసఁగు ॥ 1826

(8)†క॥ భూత భవిష్యత్తుల్ మహి
తాంతరతమౌ వర్తమాన మవితథ కాలం
బేతాదృశ రవి యజ్ఞము
నై తరియించుసులేః అఘచయము రూపాఱన్ ॥ 1827

---

† రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ధృతి"చ్ఛందము (18).

†తే॥గీ॥ సృష్టి బృహదగ్ని గోళమై వ్యష్టిగసు స
మిష్టిగాఁగ దేవాధిదేవేష్టపూర్త
మగునట్లు పురోఽహిత ప్రగతి శక్తి
వెలుఁగుఁగావుత! యజ్ఞాల విమల గతుల ॥ 1828

(9)†తే॥గీ॥ సృష్టి యజ్ఞాల క్రియలను సృష్టి శక్తి
నాంగిరసమూర్తి ఆవిర్భవానుగతిని
ద్రష్టయే కారకత్వంపు దృష్టినుంచి
దేవ మార్గాల విజ్ఞాన తేజములను
సర్వ ద్రవ్యాల ద్రవముల శక్తు లెనయ
నడచులే! సృష్టి విజ్ఞతల్ జడత విడిచి ॥ 1829

(10)†క॥ దివి భువి లోకా లన్నిట
రవి శశి శక్తులను విపుల భ్రాజిత ఘన ది
వ్య వనస్పతి పుంజము భా
రవహమ్మయి భార రహిత కాంతుల నొసఁగున్ ॥ 1830

†తే॥గీ॥ ఘన వనస్పతి పుంజా లఖర్వ గతుల
నఖిల లోకాల భువి దివులందె కాక
వివిధ విమల విపుల శక్తి విస్తృతి మెయి
వృద్ధి నొందుచుఁ బ్రాణుల బుద్ధి నిలుపు ॥ 1831

(11)†క॥ అగ్నిని వరుణుఁడు నిత్యము
భగ్నము కాకుండఁ బట్టి పరఁగుచు దివ్య
స్నగ్న రహిత గతి నంతర్
మగ్నత మెయి ననిల శక్తి మహిత మ్మౌలే! ॥ 1832

†తే॥గీ॥ అంతరిక్షాన విశ్వాస నమల మైన
దివ్య శక్తుల నింపఁజేయు తేజరిలఁగ
నమృత సిద్ధులు మహనీయ యజన రూప
ఫలితమై స్వాహగా హవిర్భరిత మగును ॥ 1833

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-పరిపూర్ణ"

## సూక్తము—70

ఋషి—వాధ్ర్యశ్వసుమిత్రుఁడు

దేవత—ఆప్రీస్సు (1. సమిద్ధుఁడు, 2. నరాశంసుఁడు, 3. ఇళ. 4. బర్హి, 5. దేవీర్ద్వారము, 6. ఉష, 7. ప్రచేతసులు, 8. సరస్వతి, ఇళ, భారతులు, 9. త్వష్ట, 10. వనస్పతి, 11. స్వాహ.)

### అర్థాంతరము—2

(1)†సీ॥ కాలాగ్ని సర్వమ్ము కాలుచుండును సదా విపుల విశ్వమ్మున వివిధ గతులఁ
గాలాగ్ని గోళాలఁ గనలుచుండు మహా జ్వలిత శక్తిని బ్రభా భాసురమయి
కాలాగ్ని సకల చరాలలోఁ దిరుగాడు ప్రాణదాయినిగాఁగ భద్ర గతులఁ
గాలాగ్న్యచర పదార్థాల సర్వాల సంతర్గత మ్మౌచును దనరుచుండుఁ
గీ॥ బగలు రాత్రులఁ గాలాగ్ని వరలుచుండు, దివ్య దేవాళిఁ గాలాగ్ని తేజరిలును
సుకృతి సుదినాలఁ గాలాగ్ని ప్రకృతి యగును, వికటకాలాగ్ని దుర్దినాల్ వికృతియగును॥ 1834

(2)†తే॥గీ॥ విశ్వ రూపాలఁ దేజాలు విపుల మౌచు
దారిఁ జూప సత్యమయ దేవాళి నిత్య
ధర్మ విధులను నెరవేర్చు ధన్య గతుల
దైవ లీలయె యజ్ఞమై తనరుచుండ॥ 1835

(3)† శమీవృత్తము॥*
అగ్ని హవిస్సుగాఁగ జఠరాగ్నిగఁ బ్రాణమయాగ్నిగాఁగ ని
త్యాగ్నిగ మానవాళి సమయాంకిత సర్వవిధాఽల్పప్రాణముల్
నగ్ని మహాప్రాణము లవినాశ మహత్తర శక్తియుక్తమై
భగ్న మభగ్నమై సకల ప్రపంచము విశ్వము నెల్ల నిండులే:॥ 1836

(4)†అష్టపదకందము॥
నిష్క్రియ గతిని హృదయము-దుష్క్రియల నెల్ల విడిచి దుర్జయ జయు లా
విష్కృతముగను మహేంద్ర ప-రిష్కృత విస్మృత సుదీక్ష ఋత హవిసులు వే
దుష్కృతుల నాశ మొనరిచి-నిష్క్రియమౌ ప్రకృతి సద్గుణేంద్రాఽఽదిత్యా
విష్కృత పరివృత క్రియలన్-నిష్కృతి మార్గమ్ము చూపు నితర నిరతతన్॥ 1837

(5)†ఉ॥ కాల రథమ్ము విశ్వమునఁ గ్రాలెడు సర్వ విధమ్ములైన గో
ళాలను బంచభూతమయ రాజిత పృథ్వులు దివ్యలోక జా
లాలను సానుబద్ధత సలంకృత మౌచు దినాలు రాత్రులన్
వేళల సంచరించును వివేక హవిస్సులు విస్తృతమ్ముగాన్॥ 1838

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*పరస్థానవిషమవృత్తము.

†తే॥గీ॥ దేవ గణములు కాలాలఁ దేజరిల్లి
దేవ దేవుని శక్తుల సేవ మెఱఁగి
మహితమౌ ప్రక్రియోద్వేల మాన్యమైన
చక్రనేమి క్రమ గతులన్ జదల నిలుచు ॥ 1839

(6)†తే॥గీ॥ సత్పదార్థమ్మె యోనిగా సర్వ సృష్టి
దివ్య దివ పుత్రిగా దేవి తేజరిల్ల
విశ్వ శిల్పాన సుషసులు విమల తేజ
మొల్కు దైవ లీలగ జగద్యోగ మెప్ప ॥ 1840

(7)†ఆ॥వె॥ ఊర్ధ్వ గతులు మీఱ నుజ్జ్వల శక్తులన్
అగ్ని తేజ మెదలి అనిల ప్రియత
నదితి మూల మౌచు నాదిత్య పాత్రత
యజ్ఞములఁ బురోఽహితాఽర్చిత మగు ॥ 1841

†(8) సృష్టి మాతగ వెలఁగి స్థితి మాతగా నిలిచి
లయ మాతగా సర్వ జయదాత్రిగాఁ జెలఁగి
ఆ త్రిమూర్తులకు ముగు రమ్మల కమ్మగా
మూలపు టమ్మగా ముదిత దేవిగఁ బ్రకృతి
హవిష్మల మ్మౌచు నఖిల ప్రాణుల యజ్ఞ
మచ్ఛమై స్వచ్ఛమై అలరారుతే! జగతి ॥ 1842

†(9) పంచభూత మూల శక్తి వరము నాంగిరసమూర్తి
అపురూపమ్మౌ అందము అద్భుతోజ్జ్వల గతులను
త్వష్ట్ర దేవ దృష్టి శక్తి సృష్టిరూప స్రష్ట శక్తి
దివ్య దేవ దేవుఁడైన దేవు నడుగుజాడలందు
జ్ఞానరూపి నడచినడచి సహభావము పెంపొందఁగ
హవి స్స్వాక సురూపముగఁ బ్రాణదాన మొసఁగుచుండు ॥ 1843

†(10) దివ్యదేవశక్తి నొంచఁ దివిరి వనస్పతులు నిలుచు
ద్యావాపృథ్వుల హవము యజ్ఞియజ్ఞాఽఽశుల వెలఁగు
శబ్దశక్తు లెల్ల విరియ సర్వ శుభ సుఖమ్ము లొంద
సుషోదయ మ్మగును సృష్టి ఉసురు లిచ్చు వినము విడుచు ॥ 1844

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) అఖిలాంతరిక్షాన నలరారురా! అగ్ని
వరుణుండు తనరారు మరుదాళి చెలువారు
మృత్పదార్థము నిల్చు నమృతపదార్థముగ
నిండుగ్రిండు వెలుగొందు నెనలేని శక్తులన్
విశ్వమే యజనమై అశ్వరూపము మీఱ
దేవాళి "స్వాహ"గ దేజరిలు నిత్యమ్ము ॥ 1845

## సూక్తమ్—71

ఋషిః—బృహస్పతిరాంగిరసః
దేవతా—జ్ఞానమ్
ఛందః—త్రిష్టుప్; 9-జగతీ

(1) బృహస్పతే ప్రథమం వాచో[1] అగ్రం యత్ ప్రైరత నామధేయం దధానాః ।
యదేషాం శ్రేష్ఠం యదరిప్రమాసీత్ ప్రేణా తదేషాం నిహితం గుహావిః ॥ 758

(2) సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచమక్రత ।
అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి ॥ 759

(3) యజ్ఞేన వాచః పదవీయమాయన్ తామన్వవిన్దన్నృషిషు ప్రవిష్టామ్ ।
తామాభృత్యా వ్యదధుః పురుత్రా తాం సప్త రేభా[2] అభి సం నవన్తే ॥ 760

(4) ఉత త్వః పశ్యన్ న దదర్శ వాచముత త్వః శృణ్వన్ న శృణోత్యేనామ్ ।
ఉతో త్వస్మై తన్వం౧ వి సస్రే జాయేవ పత్య[3] ఉశతీ సువాసాః ॥ 761

---

1. వాచోఽగ్రం, 2. రేభాఽభి, 3. పత్యఽఉశతీ (ప్రా.ప్ర.)

(5) ఉత త్వం సఖ్యే స్థిరపీతమాహుర్నైనం హిన్వన్త్యపి వాజినేషు ।
అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువాగ్ం[1] అఫలామపుష్పామ్ ॥ 762

(6) యస్తిత్యాజ సచివిదం సఖాయం న తస్య వాచ్యపి భాగో[2] అస్తి ।
యదీం శృణోత్యలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పన్థామ్ ॥ 763

(7) అక్షణ్వన్తః కర్ణవన్తః సఖాయో మనోజవేష్వసమా బభూవుః ।
ఆదఘ్నాస[3] ఉపకక్షాస ఉ త్వే హ్రదా ఇవ స్నాత్వా ఉ త్వే దదృశ్రే ॥ 764

(8) హృదా తష్టేషు మనసో జవేషు యద్బ్రాహ్మణాః సంయజన్తే సఖాయః ।
అత్రాహ త్వం వి జహుర్వేద్యాభిరోహబ్రహ్మాణో వి చరన్త్యు త్వే ॥ 765

(9) ఇమే యే నార్వాఙ్న పరశ్చరన్తి న బ్రాహ్మణాసో న సుతేకరాసః ।
త[4] ఏతే వాచమభిపద్య పాపయా సిరీస్తన్త్రం తన్వతే[5] అప్రజజ్ఞయః ॥ 766

(10) సర్వే నన్దన్తి యశసాగతేన సభాసాహేన సఖ్యా సఖాయః ।
కిల్బిషస్పృత్ పితుషణిర్హ్యేషామరం హితో భవతి వాజినాయ ॥ 767

---

1. శుశ్రువాగ్ంఽఅఫలామ్, 2. భాగోఽఅస్తి, 3. ఆదఘ్నాసఽఉపకక్షాసఽఉ త్వే హ్రదాఽఇవస్నాత్వాఽఉ,
4. తఽఏతే, 5. తన్వతేఽఅప్ర. (వా.ప్ర.)

(11) ఋచాం త్వః పోష॑మాస్తే పుపుష్వాన్ గా॑యత్రం త్వో॑ గాయతి శక్వ॑రీషు ।
బ్ర॒హ్మా త్వో॑ వద॑తి జాత॒విద్యాం॑ య॒జ్ఞస్య॒ మాత్రాం॒ వి మి॑మీత ఉ త్వః ॥ 768

ఇతి
అష్టమోఽష్టకే ద్వితీయోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—71

ఋషి—ఆంగిరస బృహస్పతి†
దేవత—జ్ఞానము

(1)*గద్యము॥

ఓ యంతరాత్మమా! ఇతరవాక్కు నుచ్చరింపకపూర్వమే పదార్థములయందు నామధేయము నునుచు బాలుర యేవాక్కు బ్రేరేపింతురో! ఆ వాక్కు మొదటిది యగుచున్నది. (తాత మొదలగువాక్యమును మొదట బలికి యనంతరము అన్య వాక్కు లుచ్చరించుచున్నారు.) ఈ యవస్థయందుగల బాలురను జూడుము! ఆటులనే ప్రశస్యతమము, పాపరహితము నగు నే వేదార్థ జ్ఞానము గలదో! యా జ్ఞానము గోప్య మైనదియై ప్రేమచే నావిర్భవించు చున్నది. ("వేదాధ్యనన కాలమందు సరస్వతి స్వార్థమును వీరికిబ్రకటించుచున్నది" యని యర్థము)॥ 1846

(2)*గద్యము॥

పురుషుడు శూర్పముచే సక్తువును బవిత్రముగా నెట్లుచేయునో! యట్లు ప్రకృతివల్లను బ్రత్యయమువల్లను శబ్దములను సంస్కరించుచున్న ధీరు లెపుడు ప్రజ్ఞాయుక్త మనస్సుచే వాక్యము నుచ్చరింతురో! యపుడు శాస్త్రాది విషయ జ్ఞానము గలవారై జ్ఞానమును దెలిసికొనుచున్నారు. అట్టి వారి వాక్యమందు లక్ష్మి కళ్యాణి యగుచున్నది ॥ 1847

(3)*గద్యము॥

విజ్ఞాతార్థములు గల విద్వాంసులు వాచోమార్గమును యజ్ఞముచే నతీంద్రియార్థజ్ఞానము గలవారియందు బొందిరి. పిమ్మట నా వాక్కును ఆహరించి బహుదేశములయం దునిచిరి. (అందరి మనుజుల నధ్యయనపరులుగా నొనర్చెను. ఇట్టి వాక్కు శబ్దాయమాన గాయత్ర్యాది ఛందస్సులను బొందినది) ॥ 1848

---

† వ్రాతప్రతి 13వ సంపుటము 137వ పుటలో ఋషి "ఆంగిరస బృహస్పతి" గాను దేవత "పరబ్రహ్మ" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "బృహస్పతి" ఋషిగాను "జ్ఞానము" దేవతగాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(4)*గద్యము॥
ఒకఁడు మనస్సుచేఁ బర్యాలోచనము చేయుచున్నను పర్యాలోచనఫలాభావమువలన వాక్కును
జూడలేకుండ నున్నాఁడు. ఒకఁడు వినుచున్నను శ్రవణఫలాభావమువలన వాక్కును
వినలేకుండ నున్నాఁడు. ఇట్టి యర్థమును విద్వాంసుఁ డనభిహితుఁడై విదిత వేదార్థమును
జెప్పెను. పతిసంభోగ కామ, శోభనవాస యగు జాయ సంభోగము నిమిత్తము ఋతు
కాలమందు భర్తకై తన నెట్లు ప్రకాశింపఁజేయునో! యట్లే యొకనికొఱకు వాక్కు
నాత్మీయ శరీరమును విప్పుజేయుచున్నది ॥ 1849

(5)*గద్యము॥
ఒక్కనినైనను ఋషుని స్థిరపీతునిగాఁ జెప్పుచున్నారు. మరియు నవిజ్ఞాతార్థపురుషుని
ననుసరింపలేరు. (వానిఁ బురస్కరించుకొని సర్వవేదార్థమును విచారించుచున్నారు.)
అవిజ్ఞాతార్థపురుషుఁడు ధేనుత్వ వివర్జిత కామములను బూరింపనది యగు దేవ మనుష్య
స్థానవాక్ప్రతిరూపమాయచేఁ దిరుగుచున్నాఁడు. అఫలము, నపుష్పము గల వాక్కును
వినెను. (వంధ్యావృక్షము కాలమందుఁ బల్లవాదియుక్త మగుచుఁ బుష్పించును
ఫలించును నను భ్రాంతినిఁ బుట్టించుచు నెట్లుండునో! యటులనే వాఁడు
పాఠము నుచ్చరించుచుఁ జరించుచుండును) ॥ 1850

(6)*గద్యము॥
ఎవ్వఁడు సఖీభూత మగు వేదమును బరార్థ వినియోగమున విడుచుచున్నాఁడో! యా పురుషుని
వాక్యమందు భజనీయ మగు నొక యర్థమును లేదు. ఈ పురుషుఁడు వేదవ్యతిరిక్త మగు దేనిని
వినునో! యది వ్యర్థ మగును. ఏ కారణమున సుకృత మార్గమును దెలిసికొనఁడో! యా
కారణమున ననుష్ఠాన మార్గమును గుర్తెరుఁగలేకుండెను. (కావునఁ దదీయశ్రవణము
కూడ నిష్ఫలము) ॥ 1851

(7)*గద్యము॥
అక్షిమంతులు కర్ణవంతులు నగు సఖులు సమానజ్ఞానము గలవారు. వారు ప్రజ్ఞాదులయం
దసమాను లగుచున్నారు. వారిలోఁ గొందరు ఆస్యదఘ్నప్రమాణోదకములు గల
హ్రదములవలెను మరికొందరు కక్షసమప్రమాణోదకములు గల హ్రదముల
వలెను నింకఁగొందరు అక్షోభ్యోదక హ్రదముల వలెను జూడఁబడుచున్నారు॥ 1852

(8)*గద్యము॥
సఖులు బుద్ధిమంతుల హృదయముచేఁ బరికల్పింపఁబడిన మనోగంతవ్య వేదార్థములయందు
గుణ దోష నిరూపణముకొఱకు నెట్లుకలియుచుందురో! యట్లే బ్రాహ్మణ సంఘమందు
అవిజ్ఞాతార్థుఁ డగు నొక పురుషుని వేదితవ్య విద్యలచే విడుచుచున్నారు॥ 1853

(9)*గద్యము॥
ఏ యవిద్వాంసులు అధోభావి యగు నీ లోకమునందు బ్రాహ్మణులతోఁ జరింపరో! యెవరు
దేవతలతోఁ దిరుగరో! వారు వేదార్థ తత్పరులు కారు. ఋత్విజ్ఞులు కూడ వారు కారు.
అవిద్వాంసు లగునట్టివారు అలౌకిక వాక్కును బొంది ఆ పాపకారి వాక్కుచేఁ
గూడుకొని సిర్గిణులయి కృషిలక్షణమును విస్తరింపఁజేయుచున్నారు. (సర్వథా
వేదార్థము జ్ఞేయ మని యర్థము) ॥ 1854

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(10)*గద్యము॥
సమానజ్ఞాను లగు నందరు మనుష్యులు సభను సహించుటకు సమర్థుఁడు, సఖుఁడు, యజ్ఞమునకు వచ్చువాఁడు నగు యశస్వి సోమునివలన సంతసించుచున్నారు. ఆ సోముఁడే కిల్మిషస్పృత్తు.ఆతఁడే యన్నదక్షిణదాత.మరియుఁ బాత్రములయందు నిహితుఁ డగు సోముఁడు వీర్యమును గల్పించుటకుఁ గడు సమర్థుఁ డగువాడు ॥ 1855

(11)*గద్యము॥
ఒకఁడు(హోత)యథావిధికర్మయందు ఋక్కులను బఠించుచుండును. ఒకఁడు(ఉద్గాత) శక్వరములయందు గాయత్రమును గూర్చును.ఒకఁడు(బ్రహ్మ)వేదయిత్రి వాక్కును బలుకును. ఒకఁడు(అధ్వర్యుఁడు) యజ్ఞపాత్ర నత్యంతము నిర్మించును ॥ 1856

ఇయ్యది
శ్రీభారద్వాజ గోత్ర శ్రీవేంకటేశ్వర పౌత్ర
సంగమేశ్వర పుత్ర సీతాంబాగర్భ శుక్తి
ముక్తాయమాన, భగవద్భక్తారాధక
నేమాని వేంకట నరసింహశాస్త్రి
విరచితకృతులలో శ్రీమదాంధ్ర
ఋగ్వేదసంహితయందు
సప్తమాష్టకమున
ద్వితీయాధ్యాయము
సంపూర్ణము

## సూక్తము—71

ఋషి—ఆంగిరస బృహస్పతి
దేవత—జ్ఞానము

### అర్థాంతరము—1

(1)†శా॥ ఆద్యంతమ్ముగ నక్షరమ్ము లవి బార్హస్పత్య సంశక్తులన్
జోద్యమ్మై నర కిన్నరుల్ సురలు నన్యుల్ జన్మ తోడ్తోడనే
వేద్యమ్మై గతిఁ గుక్షి గుహ్యమయి నాభిన్ జెందుచున్ మౌఖికాం
తోద్ద్యోతమ్మయి వెల్వడున్ హరిగ నా"ఉంగా"అనన్ సర్వదా ॥ 1857

(2)†ఉ॥ పాదరసమ్ము వోలె బహు భంగులఁ జంచలతన్ హృదంతరం
బేదుచు నుండుదానిని నహీన మహోత్తమ నిశ్చలాత్మతన్
బ్రోదిని నచంచలత్వమునఁ బొందిక నిల్పుచు వాక్య లక్ష్మినిన్
నాద సునక్ష్య భద్రతలు నవ్యనవమ్ముగ నిత్య మబ్బులే: ॥ 1858

*రచయిత :—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(3)†క॥ మఖములలో నక్షరముల్
ముఖ యంత్రమునుండి వెల్వడున్ సప్తాగ్నుల్
అఖిలాఽనిల సప్తకమున్
అఖనన ఋపి శక్తి నిలుచు నమలత్వమునన్ ॥ 1859

(4)†తే॥గీ॥ అర్ధనారీశ్వరత్వాన సర్ణవాల
శబ్ద మర్థమ్ము సార్థక శక్తి నెఱుఁగ
గనుకలిన్ వినుకలి మెయిన్ గ్రాంత దర్శి
సూక్ష్మ మతిసూక్ష్మమౌ సర్వ సూరి మతిని ॥ 1860

(5)†శా॥ మాయామేయ జగమ్మునన్ ఘుమఘుమల్ మాయమ్ముగాఁ బుష్పముల్
కాయల్ కాయనివై తరుల్ లతలు నే కర్మమ్మునందున్ ఉపా
దేయ మ్మేవిధిఁ గాక వ్యర్థ మవు రీతిన్ వేద వాక్యాల్ సుశ
బ్దాయత్తమ్ము నెఱుంగలేని జడుఁడే వ్యర్థుం డగున్ సర్వదా ॥ 1861

†(6) సద్వాక్యమంత్రాల సన్మైత్రి లేకుండ
వాక్ఛక్తు లెవ్వియున్ వరల వే రీతిగాఁ
బనిలేని పలుకులన్ బలుకుచో విన్నచోఁ
బుణ్యమ్ము దొరకునా? పురుషార్థ మొదవునా? ॥ 1862

(7)†అష్టపదకందము॥
అక్షర శక్తులతో మహ
దక్షరపు బృహత్తర జవ హార్దిక వేగం
బక్షయమై స్థితి గతులన్
గక్షయు నుపకక్షయు శ్రవణ పరీవృతమై
రక్షణఁ గల్పించుచుఁ గడుఁ
బ్రక్షాళన చేయు సకల పాపౌఘమ్మున్
దక్షత వసు సంపత్తుల
దీక్షా హృదయాన మహిత దీప్తులు వెల్గన్ ॥ 1863

†(8) ఆ మనోజవ మెల్ల నమృతమౌ పథమునన్
బ్రాహ్మణత్వపు దివ్య బ్రహ్మజ్ఞతా శక్తు
లతిలోక గతి మీఱ నతివిపులమై నిలువ
హృదయ వేగమ్ముతోఁ జద లధిగమించుచున్
వేద విజ్ఞానంపు విమల శక్తులు నిత్య
సత్యమూర్తిని సఖ్య సాతత్యతను నిల్పు ॥ 1864

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(9)†శా॥ వేదార్థమ్ము మహా సువిజ్ఞతను గాంభీర్యమ్ముతో నిత్యమై
మోదాఽఽపూర్ణ మజయ్యమై ప్రకృతి సన్మూర్తిన్ సుసార్థక్య స
త్త్వోదారాంచిత మౌచు విశ్వజనతా హృత్ప్రేమ సంధానతన్
ఖేదాల్ లేని జగమ్మునందు నిముడన్ విశ్వమ్ము శాంతించులే! ॥ 1865

†(10) పాప పుంజా లెల్లఁ బ్రక్షాళితము లౌను
విపుల విశ్వమునందు వేద విజ్ఞానాల
సఖ్య భావము పెరుగు శాంతి సంధాయకత
సౌభాగ్య సంపదలు సర్వ సౌఖ్యావళులు
సమలంకృతము లౌను సమ సమాజములోన
జగతిలోపల శాంతి జన్యాల విన్యాస
మా వేద తత్త్వజ్ఞు లలరించుచుండఁగా
సోమ శక్తులు వీర్య ధామమ్ములై పరఁగు ॥ 1866

†(11) శక్తి నిచ్చు ఋక్ తతులను స్వరసహితముగాఁ బలుకును
రాగాఽఽలాపన మొసరును నా గాయత్రిన్ శక్వరి తతి
జాతవేద విద్య లొప్పఁ జతుర్ముఖ బ్రహ్మ దాఁగ
యజ్ఞ మంత్ర జాలములను యజ్ఞాధిప విష్ణు నొంప ॥ 1867

## సూక్తము—71

ఋషి—అంగిరస బృహస్పతి

దేవత—జ్ఞానము

## అర్థాంతరము—2

(1)†మానినీవృత్తము॥*
ప్రాణులు తామయి పుట్టిన వెంటనె గ్రక్కున వెల్వడు శబ్దముగా
జ్ఞాన రహస్య సముచ్చయ శక్తులె సంపదగా విలసిల్లి మహా
ధీనిధి గాఁగను వెల్గెడు వేదము దీప్తి స్వయంభువ మౌను జగత్
ప్రాణ సుపుణ్య సమాదృతిఁ గిల్బిష భావ వినాశక మౌనుగదా! ॥ 1868

(2)†కవిరాజవిరాజితవృత్తము॥♦
హృదయ పవిత్రిత హేయపుఁ గల్మష మెంతయుఁ గిల్బిష మంతముగా
నొదవెడి శబ్దము సృష్టిని సాజము నొప్పయి సార్థకతోడ మతన్
ఎడను పవిత్రత యెంతయు నిండఁగ నే విధి సంకము నెదక సత్
పద కలితేందు ఋతాఽఽచ్ఛ మహాఽమృత భవ్య భవాఽనుభవమ్ము జనుల్
ప్రిదలని లక్ష్మిని వేద పద క్రమ విద్యల రక్షను విజ్ఞతమైఁ
బదిల మొసర్చుచు బ్రహ్మ పరాత్పర ప్రజ్ఞ విశారద వర్య మగున్ ॥ 1869

---

†రచయిత :—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ"
*"ఆకృతి"చ్ఛందము (22), ♦"వికృతి"చ్ఛందము (23).

(3)†సుగంధివృత్తము॥*

దివ్య దృష్టి వేద జాల సర్వ దేవ శక్తు లెల్ల సద్
భవ్యమైన జ్ఞాన రూప భావ ప్రాణ తత్త్వ విజ్ఞులన్
సవ్య శక్తి వెల్గుచుండు శబ్ద నాద వేద మోద వా
యువ్య కామరూపమౌ మహా ప్రయోగ విశ్వరూప మౌ ॥ 1870

†స్రగ్విణీవృత్తము॥♦

వేద వాగ్వల్లభా! విజ్ఞతా రూపమౌ
నాద శక్తిన్ సదా నవ్య సందీప్తులన్
ఖేదముల్ దుల్చుచున్ గీష్పదాఽస్వాద మౌ
మోద మందించుమా! మోక్ష సంప్రాప్తిగా ॥ 1871

(4)†మందాక్రాంతావృత్తము ॥*

హృద్వాగ్ దేహాల్ పరమ పరిశోభ్యంబు కాంతిచ్ఛటాఽఽళిన్
సద్వాక్సిద్ధిన్ ముఖ విమల తేజఃప్రశుద్ధిన్ సుబుద్ధిన్
విద్వాంసుండై జగతి రవి సద్విక్రమ క్రాంతి కాంతిన్
ఉద్వేలమ్మై వెలుఁగు ధృతితో గొప్ప వేదర్షి శక్తిన్ ॥ 1872

†కుసుమితలతావేల్లితవృత్తము॥‡

వాక్శుద్ధిన్ సిద్ధిన్ సుశరములు శాపాల్ స్వహస్తాన నిల్పన్
దృక్శక్తిన్ రక్తిన్ శశిగ రవి కాంతిన్ ధరింపంగ నేత్రాల్
దిక్కార్ణమ్మై మంత్ర వితతి ప్రకాంతిన్ శరాలై సుమాళిన్
ఋక్శేషుండై శ్రోతవరుఁ డలరున్ వేద్యుఁడై దివ్య దృష్టిన్ ॥ 1873

(5)†మయూరివృత్తము ॥v

వేద ఘనానకుఁ బ్రాణము శబ్దము విజ్ఞత సార్థకతల్ వెలుఁగొందఁగ నా
మోద ఫలావళి శబ్ద ప్రశక్తుల మూర్తి సురూప కురూపములే వరలన్
చోదిత నిష్కల పూర్ణ జటా ఘన శ్రోత్రప్రియ శ్రోత నిరర్థకతల్ తనరన్
రోదన మౌను మహాటవిలో నవరోహణమౌ శవ వాహికయై విమతిన్
బ్రోదిని వక్త్ర విలోమ గతిన్ అనులోమ రతిన్ బరిశుద్ధ సుసిద్ధులమైన్
వేద ముదాత్తముగా ననుదాత్తము నిశ్చితమౌ స్వరితాళిని సుస్వర సం
వేదితమై వెలుఁగొందుసులే! సముపేత విశాల సుశబ్ద సుశక్తులతో ॥ 1874

(6)†ఘనశ్రీవృత్తము ॥z

అవినాభావ సుశక్తుల వేదము నధ్యయన మ్మొనరించి సదా
నవనీతాఽమృతమై హృది యెల్ల ననంత విశాలపు విశ్వ సుఖాల్
నవతా శాంతి శుభావళి కోరెడి లక్ష్య విశుద్ధిని మీఱఁగ నా
సవితా రూప పవిత్రిత నిల్పెడి శ్రౌతి వెలుంగును దేవుఁడుగా! ॥ 1875

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"అత్యష్టి"చ్ఛందము (17), ♦"జగతీ"చ్ఛందము (12), ‡"ధృతి"చ్ఛందము (18), v"అభికృతి"చ్ఛందము (25), z"ఆకృతి"చ్ఛందము (22).

(7)†శారికావృత్తము ॥*

ఎవని కనులు సార్థకమో! యెవని చెవులు సార్థకమో! యెవని నోరు సార్థకమో!
అవని నతఁడె నేత్రవరుం డతఁడె శ్రవణ సంయుతుఁడౌ నతఁడె సార్థకాస్యుఁ డగున్
భువి నర సుర ప్రాకృతులన్ భువన తతిని జూచి వినంగలుగు మాట లాడఁదగున్
చెవులు కనులు నోరు సదా చెలఁగి పనికిరాక నిరర్థకత నుండి లేని యటుల్
అవిటిమనిసిగాఁగ వృథా వ్యయభరితపు జీవితమౌఁ బనికిరాని "బొంది"యగున్ ॥ 1876

(8)†పరమాణువృత్తము ॥♦

మనసు జవము సమ మపుచునె వివిధ మలినములను విడిచి ఫుడిచి
దినముల సకల నిశితతులను దశ దిశలను వరలు సలిలములు
ననల మనిలములను బృథివి గగన మలరు జగతి నలువ క్రియగ
ననిశము పరిధుల నుపపరిధులను నఖిలముఁ దొలిపలుకయి తగు ॥ 1877

†క॥ సత్యావృతి సంఘము సమ
నిత్య సువిజ్ఞతలను పరజేయుమ్మో సా
తత్వత వర్ధిల్లఁగ నా
మ్నాత్యంధత నాశ మౌను ఋల వేప తతిన్ ॥ 1878

(9)†చిన్మయవృత్తము ॥‡

జన్మ జన్మల పాప సంచయము పోఁగొట్టు
మన్మనో జప వేగ మంత్ర పద వర్ణాల
సన్మనఃపరిపూర్ణ శక్తి జప మొప్పంగఁ
జిన్మయమ్ముగ బ్రహ్మ చిత్త మతిదార్ఢ్యాల
సన్మనీషుల వేద సంగతులు నొప్పారఁ
దన్మయత్వము మీఱ దద్దములఁ బోఁద్రోలి ॥ 1879

(10)†ప్రకృతివృత్తము ॥∨

సుకృత శక్తి దేవాఽమృత సోమ మిచ్చి సృష్టి నిల్పి
వికట పాప పుంజమ్మును వ్రేల్చి కాల్చు పుణ్య మూర్తి
సకల వేద విజ్ఞానిని సర్వ సృష్టి గౌరవించుఁ
బ్రకట దీప్తి దివ్యన్నవరత్న రాజ రక్తి నుంచి
ప్రకృతిమాత పుత్రుండుగఁ బాదపూజ సేయు భక్తి
నకము లేని బంగారపు టక్షరాల పూలు పోసి! ॥ 1880

---

రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*ఉద్ధరమాలావృత్తము(29) ♦ఉద్ధరమాలావృత్తము(27)-సర్వలఘుయుక్తము, ‡"శక్వరీ"చ్ఛందము (14).
∨'అత్యష్టి'చ్ఛందము (17).

(11)†గగనమణివృత్తము॥*

ఋక్కుల [1]శక్తుల్ రూపము గాఁగన్ ఋతమై నిల్చున్
నిక్కపు జన్నాల్ నివ్వెఁఱపాటై నిలుచున్ నింగిన్
దిక్కుల[2] నొడ్డాణమ్మయి దీవ్యత్ పద రక్షమ్మౌ
రిక్కల బ్రహ్మజ్ఞత్వము రేతోఽధ్వర పాత్రమ్మౌ ॥ 1881

ఇయ్యది

విశ్వసృష్టిప్రకృతిమాత్రైకైకపుత్ర

పతకమళ్ళ గోత్ర-వడ్లమూడి కుల సందీప్త-

శ్రీ సుబ్బన్న పౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అద్వితీయ ద్వితీయపుత్ర

శ్రీసరస్వతీమాతృ ప్రియపుత్ర-అపారవేదశాస్త్ర సాహిత్యవిద్యా పారంగత-

అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకికశక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాదిసర్వ దేవతాస్వరూప-విద్వన్మణి పంచముఖాంజనేయోపాసక శ్రీవేదుల రామశాస్త్రి గురువరాభిస్తుత ముఖకలిత గోపాలసుపద-మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమగురువర్యాభినుత "శతవర్షాశీర్వచన రక్షిత అగుణశోభితనిష్కాసహిత శ్రీ మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహినీ హృదయ లక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్వాక్ స్వరూపిణి అమలినపవిత్ర పతిరక్తి భక్తి శక్తి స్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్యచైతన్యవతి, నిర్నిద్రమతి, వినిర్మలగతికలిత,ప్రియశరీరాంతర్విలీనగాన జ్ఞాన ధ్యాన స్వరూపిణీతన్మయి, శివపూజితఫాలచంద్రకళా మూర్తి అకలంక సౌందర్యరాశి-సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త- జయశ్రీ సత్యశ్రీ పుత్రీకారత్నద్వయ అజయ్య జయ విజయ పతాకయుక్త - శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహరరాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య ఛత్రాఽఽవరణయుక్త-పాణినీయాఽష్టాధ్యాయీపూర్వత్రాసిద్ధసూత్రసహితశబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త మహావైయాకరణ వేద వేదాంతకోవిద దశభాషా కవితా విశారద పుంభావశారదా మూర్తి శ్రీ గుండేరావుహర్కారే - సాష్టాంగనమస్కార పూర్వకప్రస్తూయమాన-"శ్రీ వాఙ్మయ మహాధ్యక్ష-ప్రాచీనవై యాకరణానమయ సంప్రదాయ రక్ష - స్ఫోరితానేక జనాభినవోన్మేష శాలికావ్య నిర్మాణశక్తిమన్నికోచనాక్ష - మాధుర్య స్యంది వీర్యవత్తరపద గుంఫాధురీణ - మహీభుగగోచర గాంభీర్యప్రకటనపటిమాపారీణ-కల్పాంతారీణాఽనల్ప కల్పనా భూషణ"- లీలామానుష విగ్రహ - ఆంధ్ర విశ్వకళాపరిషత్ సంభావితచతుర్వింశదధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్ "కళా-ప్రపూర్ణ" సార్థక బిరుద విరాజిత - బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య

సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్త సహిత, సుసమగ్ర

సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు

దశమమండలమున నష్టమాష్టకము నందలి

అర్థాంతరయుక్త ద్వితీయాధ్యాయము

సమాప్తము

---

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*"అతిశక్వరీ"చ్ఛందము (15), 1. శక్తి=గాయత్రీచ్ఛందము. 2. ఒడ్డాణము=శక్వరీచ్ఛందము.



# సమహాల
# శ్రీమదాంధ్రీ ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—తృతీయోఽధ్యాయః

### సూక్తమ్—72

ఋషిః—లౌక్యో బృహస్పతిః, బృహస్పతిరాంగిరసో వా దాక్షాయణీ అదితిర్వా
దేవతా—దేవాః
ఛందః—అనుష్టుప్

(1) దేవానాం ను వయం జానా ప్ర వోచామ విపన్యయా ।
ఉక్థేషు శస్యమానేషు యః పశ్యాదుత్తరే యుగే ॥ 769

(2) బ్రహ్మణస్పతిరేతా సం కర్మార [1]ఇవాధమత్ ।
దేవానాం పూర్వ్యే యుగేఽసతః సదజాయత ॥ 770

(3) దేవానాం యుగే ప్రథమేఽసతః సదజాయత ।
తదాశా [2]అన్వజాయన్త తదుత్తానపదస్పరి ॥ 771

---

1. కర్మారఽఇవా, 2. తదాశాఽఅన్వ. (వా్రి.ప్ర.)

(4) భూర్జజ్ఞ [1]ఉత్తానపదో భువ [2]ఆశా అజాయన్త ।
అదితేర్దక్షో [3]అజాయత దక్షాద్వదితిః పరి ॥ 772

(5) అదితిర్హ్యజనిష్ట దక్ష యా దుహితా తవ ।
తాం దేవా [4]అన్వజాయన్త భద్రా [5]అమృతబన్ధవః ॥ 773

(6) యద్దేవా[6] అదః సలిలే సుసంరబ్ధా [7]అతిష్ఠత ।
అత్రా వో నృత్యతామివ తీవ్రో రేణురపాయత ॥ 774

(7) యద్దేవా యతయో యథా భువనాన్యపిన్వత ।
అత్రా సముద్ర [8]ఆ గూళ్హమా సూర్యమజభర్తన ॥ 775

(8) అష్టౌ పుత్రాసో [9]అదితేర్యే జాతాస్తన్వంస్పరి ।
దేవాగ్ం [10]ఉప ప్రైత్ సప్తభిః పరా మార్తాణ్డమాస్యత్ ॥ 776

(9) సప్తభిః పుత్రైరదితిరుప ప్రైత్ పూర్వ్యం యుగమ్ ।
ప్రజాయై మృత్యవే త్వత్ పునర్మార్తాణ్డమాభరత్ ॥ 777

---

1. భూర్జజ్ఞ౽ఉత్తా, 2. భువ౽ఆశా౽అజాయన్త, 3. దక్షో౽అజాయత, 4. దేవా౽అన్వ, 5. భద్రా౽అమృత,
6. దేవా౽అదః, 7. రబ్ధా౽అతిష్ఠత, 8. సముద్ర౽ఆగూళహ, 9. పుత్రాసో౽అదితే,
10. దేవాగ్ం౽ఉప. (వా.ప.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—తృతీయాధ్యాయము

### సూక్తము—72

ఋషి—లౌక్యుఁడైన బృహస్పతి లేక ఆంగిరసుఁడైన బృహస్పతి
లేక దాక్షాయణియైన యదితి†
దేవత—దేవతలు†

(1)*గద్యము॥
దేవతలయొక్క యే గణము పూర్వ యుగమందుఁ బుట్టి యాగమునందు శస్త్రములు
జ్ఞేయమానము లగుచుండ, నుత్తరయుగమందున్న స్తోతను జూచుచుండునో; అట్టి
యాదిత్యుల జన్మములను మేము చెప్పఁగలము ॥ 1882

(2)*గీ॥ జగతి కర్మారుఁ డెట్టులు తగిన భస్త్రి
చేత నగ్నిని జ్వలియింపఁజేయు నట్టు
లదితియును నిట్టి దేవతాద్యఖిల జన్మ
ములను బుట్టించె లోకాన[1] వెలుఁగునటుల ॥ 1883

*గీ॥ దేవతాది సృష్టి పావన కర్మల
నగత నామ రూప మైన బ్రహ్మ
వలన నామ రూప లలిత దేవాదిక
మతిశయముగఁ బుట్టె నచ్చెరువుగ ॥ 1884

---

† ఈ సూక్తమునకు వ్రాతప్రతి 13వ సంపుటములోని 145వ పుటలో ఋషి "బృహస్పతియో అదితియో"అనియు దేవత "దేవదేవత్వము"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "బృహస్పతి, అదితి" ఋషులుగాను "దేవతలు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. బుట్టించె కాదటె. (తా.పా.).

(3)*గీ॥ ఆది సృష్టియందు నధిక మసత్తున
సత్తు పుట్టియుండె నరస రీతి
నపుడె దిక్కు లెల్ల నావర్భవించెను
వృక్ష సమితి పుట్టె వివిధ గతుల ॥ 1885

(4)*గీ॥ భూమి వృక్ష సమూహంబుఁ బుట్టఁజేసె
భూమివల్లనె దిక్కులు పుట్టె, నదితి
వల్ల దక్షుఁడు జన్మించె వానివలన
నదితి ప్రాదుర్భవించెను నమల రీతి ॥ 1886

(5)*గీ॥ అదితి నీకు దుహిత యగుచు నాదిత్యులఁ
బుట్టఁజేసియుండెఁ[1] బూజ్య దక్ష!
యామె ననుసరించె యమరులు వీరలై[2]
యమృత బంధనమున నమరినారు ॥ 1887

(6)*గీ॥ అమరులార! మీర లంబువునందునఁ
బుట్టి యపుడు మీ[3] పరిపూర్ణ రేణు
వొకటి తీవ్ర మౌచు నుచ్ఛ్ర[4]దివంబును
బొందియుండె[5] మిగుల నంద మొప్ప ॥† 1888

(7)*చ॥ భువన చయంబు మేఘములు పూర్ణతరం బగు వృష్టితోడ[6] ను
త్సవముగ నిండఁజేసెడు విధంబున దేవతలార! మీర లీ
భువనములన్ స్వతేజములఁ బూర్తిగ నింపి జలస్థుఁడైన యా
ప్రవిమల సూర్యుఁ దెచ్చితిరి ప్రాభవ మొప్పెడుఁ బ్రత్యుషస్సునన్ ॥ 1889

(8)*గీ॥ అదితి తనువునుండి యష్ట పుత్రులు పుట్టి
నార లదితి యట్టి వారితోడ
నమరవరులఁ బొంది[7] యష్టమ పుత్రుఁడౌ
సూర్యుమీఁదఁ దాను[8] శోభఁ దేలె ॥ 1890

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†"సృష్టి ప్రారంభమున జల ముండెను. దానియందు అమరులు పుట్టిరి. వారియంశ మొకటి దివమును బొందెను"అను సృష్టి క్రమము చెప్పఁబడెను. (నే.వేం.న.శా.)

1. బుట్టఁజేసెగాదె, (తొ.పా.), 2. యమరులు గల్గుచు నమృత, (తొ.పా.), 3. సంపూర్ణరేణు (తొ.పా.), 4. తీవ్రమౌచు నొనరదివంబును, (తొ.పా.),5. బొందియుండెగాదె యందమొప్ప, (తొ.పా.),6. వృష్టిచేత, (తొ.పా.),7. నమరవరులఁ బొందె నష్టమపుత్రుఁడౌ, (తొ.పా.), 8. సూర్యుమీఁద నునిచి శోభగలుగ, (తొ.పా.), సూర్యుమీఁద నునిచి తాను శోభఁ దేలె. (మ.పా.).

(9)*గీ॥ సప్త పుత్రులఁ గూడుచుఁ జాన యదితి
యుత్తమ యుగంబుఁ బొందె మహోత్తమముగఁ
బ్రాణి మరణాదులకుఁ గడుఁ బ్రభవమున
దివమునన్ సూర్యుఁ దను వానిఁ దెచ్చి పెట్టె॥ 1891

## సూక్తము—72

ఋషి—లౌక్యుఁడైన బృహస్పతి లేక ఆంగిరసుఁడైన బృహస్పతి
లేక దాక్షాయణియైన యదితి
దేవత—దేవతలు

### అర్థాంతరము—1

†(1) ఉత్తర యుగములో నుద్భూతమై యొప్పు
దివ్య దేవాఽఽవళులు దివ్యదృష్టులు మీఱఁ
బూర్వ యుగాలలోఁ బుట్టి పెరిగిన దివ్య
దేవాఽఽళి సంఘాల తీరులెన్నుల నెఱిఁగి
యజ్ఞ యాగాఽఽవళుల ప్రజ్ఞ ప్రభావాల
శస్త్రాస్త్ర శక్తులన్ సంతరించుస్ బ్రభస్
అస్త్రాలుగా దివ్య శస్త్రాలుగా శబ్ద
నిశ్శబ్ద శక్తులే నిండు తేజాలుగా॥ 1892

†(2) అంతర్గత మ్మోచు నగ్ని యుండియుఁ గూడఁ
జల్లని వస్తువుగఁ జెల్లు వాటిని నగ్ని
జాజ్వల్యమానముగ జ్వలియించు నట్లుగా
నన్నియు నగ్నికే ఆహార మౌ రీతి
నత్యపూర్వమ్మైన ఆ ఆది కాలాన
స్రష్టకే తెలియని సృష్టి వ్యవస్థలో
కృష్ణ లీలగ నిలిచి విష్ణు మాయగ వెలిఁగి
సదసత్తు లేకమై సంచరించుచునుండు॥ 1893

†(3) ఆ దివ్య దేవాళి ఆవిర్భవము రాని
ఆ పూర్వ కాలాన సత్యద్భుతమ్ముగా
దిక్కాలములు లేని దివ్య శక్తులు వెలుఁగ
దిక్కాలముల్ పుట్టెఁ దివిరి అసత్తులై
దివి భువులు రవి శశులు తేజరిలు దిక్కాలుస్
వ్యష్టి సమిష్టులుగ సృష్టి రూప మ్మొందె॥ 1894

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఆ పంచ భూతాల నలరారు సృష్టిలో
మృత్భూత మలరారె భూ భువనాలుగా
నుత్తాన పద శక్తి మిత్తి బ్రితుకులతోటి
సద్రూప మౌ నదితి చదలంటు రీతిగా
దక్ష శక్తులు పుట్టి దక్షత్వముం జూపె
దక్ష మూర్తులు దివ్య రక్ష శక్తులు కాఁగ
నఖిలాండములలో సనాదృత మ్మోచు "నసత్"
అధమాధమ మ్మోను నదితి సచ్ఛక్తులన్ ॥ 1895

†(5) సచ్ఛక్తి పుంజాల సదమల శక్తులన్
దివ్య దేవాఽఽవళులు తేజరిల్లుచునుండు
ఋత శక్తి బద్ధమై మృత శక్తి రుద్ధమై
అమృత బంధాలతో నలరారుచుండులేః ॥ 1896

†(6) ఆ పంచ భూతాల నలరారు సృష్టిలో
నలువ సృష్టిగ సర్వ సలిల గోళాల్ తోచు
భ్రాజిష్ణమౌ లీల నా విష్ణు డోలలై
కేళిగా లీలగా హేలగాఁ దనరారు
జల కన్య నృత్యముగ సలిలాల రేణువులు
లాస్యముల్ చేయు సంరంభముల్ మీఱంగ ॥ 1897

†(7) ఆ పంచ భూతాల నా సూర్య పరమైన
ఆ అగ్ని శక్తిలో సన్నియున్ నిండులేః
అఖిల జలధుల జలము లావిరిగ రూపొంద
నా సూర్య శక్తియే అలరించు జలదముల
సకల భువనాఽఽవళుల సలిల శక్తులు విరిసి
సృష్టి లీలగ నిలుచు స్రష్ట కేళిగ నడుచు ॥ 1898

†(8) సుప్తమ్ము లగుచుండు సప్తాఽనిలాలతో
దైవీయమై వెల్గు సత్ ప్రాణ శక్తితో
అష్ట మూర్తుల నిలుచు నా వాయు శక్తులే
ఆ పంచ భూతాల నమలమౌ శక్తులన్
సౌరపరమై వెలుఁగు సప్త కిరణాఽఽవళుల
సంచరింపఁగఁజేయు సంచలింపఁగఁజేయు

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

దశ దిశల వెలుఁగొంచు తరఱు లన్నింటికిన్
ఆకర్షితము కాక అతిలోకమై నిలిచి
దైవీయ శక్తులకుఁ దనరారుఁ బ్రాణమై
దేవ దేవుని లీల దివ్యమౌ నెల వొంచు ॥ 1899

†(9) సద్రూపమౌ నదితి సప్త పుత్రుల వెల్గు
సప్తాఽనలమ్ములన్ సప్తాఽనిలమ్ములన్
ఎడతెగని బంధాల నెనఁగు యోగాలతోఁ
బంచ భూతాలతో వరలులేః ఆ యుగము
అంతయు మృత్యువై ఆకసమ్ముగ నిలుచు
అదితి శక్తుల కద్ది హద్దుగా వెలుఁగొంచు ॥ 1900

## సూక్తము—72

ఋషి—లౌక్యుఁడైన బృహస్పతి లేక అంగిరసుఁడైన బృహస్పతి
లేక దాక్షాయణియైన యదితి
దేవత—దేవతలు

### అర్థాంతరము—2

†(1) అచ్యుతాఽఽవహముగా నయుగ కాలమ్ములో
దేవాఽఽళి సృజియించి దేవదేవుఁడు వెలిఁగె
శబ్ద శక్తులు సర్వ నిశ్శబ్ద శక్తులే
ప్రతివచన మీయంగఁ బ్రతిఫలింపఁగ సృష్టి ॥ 1901

†(2) ఆ శ్రీమహావిష్ణు వల బ్రహ్మణస్పతిగాఁగఁ
గర్మకారుం డౌచుఁ గర్మసాక్షిగ నిలిచి
తొలి సృష్టినే దేవతల సృష్టికిన్ మున్నె
పడుగు పేకలు కాఁగఁ బర్వంగ సృష్టిలో
వెలుఁగు చీకట్లుగా వెలుఁగ సదసదాళి
చిత్రముగ సృష్టించెఁ జిదచిత్తు లలరంగ ॥ 1902

†(3) సర్వ దేవ యుగాఽఽవళికిఁ జాలఁ బూర్వకాలమందె
సదసత్తులు రెండు పుట్టె సరి రవలలుగా
ఏది ముందొ? యేది వెనుకొ? యేరికైన నెరుక పడక
సన్మూల మసత్తనుచు ససన్మూలమే సత్తని
అజ్ఞాన ప్రభావ తిమిర మావహిల్లఁగా జగతిని
దెలివి లేని దేబె ప్రాణి దిక్కులు చూచెడు సట్లుగ
ఉత్తానపుఁ బాదోద్భవి ఉరుకు లిడంగా "గంగ"
దశ దిశలను విశ్వ సృష్టి దశ దశలుగ వెలుఁగొందఁగ ॥ 1903

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) శ్రీమహావిష్ణువే చిద్విలాసుం డౌచు
నుత్తానపాదుఁడై ఉపరితలమున నిలిచి
దిక్కాలములతోటి తేజరిలు లోకాల
సర్వ సృష్టిని నిలిపె సదసన్మయముగా
సచ్ఛక్తి అదితిగా సకలమౌ చిచ్ఛక్తి
దక్షతా రూపమై దివ్య శక్తుల వెలయ ॥ 1904

†(5) సచ్చిత్తులే సృష్టి సంభవించెను దొలుత
శ్రీమహావిష్ణువుకుఁ జెలఁగు దుహితలు కాఁగ
నమృతమౌ బంధాల నా దేవజాలాలు
భద్ర శక్తులు మీఱఁ బ్రభవించి మించఁగా ॥ 1905

†(6) జల పూర్ణమౌ సృష్టి నల నాల్గు భూతాల
సర్వ శక్తుల జలము నృత్య రీతుల నిలువ
సలిలాన దోగాడు సర్వేశ్వరేశ్వరుఁడు
సృష్టి కర్తను గాంచి స్రష్ట స్రష్టగ వెలుఁగు ॥ 1906

†(7) అగ్నిలో జల ముండి అగ్ని జలమున నుండి
ఆ సూర్య శక్తు లవి అలరారునట్లుగా
దివ్య దేవాఽఽళులఁ దేజరిలు భువనాలు
భువనాల దేవాఽఽళిఁ బూజలన్ బొందులే! ॥ 1907

†(8) అతిరహస్యమ్మైన అంతర్గతజ శక్తి
ఆ "సత్తు" అదితిగా నఖిలాండముల నిండి
సప్తాఽనలములతో సప్తాఽనిలములతోఁ
జండ ప్రచండ మార్తాండ సంశక్తులన్
దేవాఽఽళి సర్వమ్ము తిరుగాడుచుండులే!
సూక్ష్మ రూపము లొప్ప శోభిలన్ స్వస్వగతి ॥ 1908

†(9) అనలపరమై ప్రాణ లనిలపరమై నిలిచి
అనలాఽనిల యోగ మల జలముతో మృత్తు
నాకాశములఁ గూడి ప్రాకృతముగా మృత్యు
వర మౌచు వర మౌచుఁ దిరిగి జన్మము నందు
మండు మార్తాండుండు మఱిగి సురిగెడి రీతి
నుదయ మస్తంగతుల నొందు చందాసన్ ॥ 1909

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

దశ దెశల వెలుఁగొందు లరణు లన్నింటికిన్
ఆకర్షితము కాక అతిలోకమై నిలిచి
దైవీయ శక్తులకుఁ దనరారుఁ బ్రాణమై
దేవ దేవుని లీల దివ్యమౌ నెల వొందు ॥ 1899

†(9) సద్యోవమౌ నదితి సప్త పుత్రుల వెల్గు
సప్తానలమ్ములన్ సప్తానిలమ్ములన్
ఎడతెగని బంధాల నెసఁగు యోగాలతోఁ
బంచ భూతాలతో వరలులే! ఆ యుగము
అంతయు మృత్యువై ఆకసమ్ముగ నిలుచు
అదితి శక్తుల కద్ది హద్దుగా వెలుఁగొందు ॥ 1900

## సూక్తము—72

ఋషి—లౌక్యుఁడైన బృహస్పతి లేక అంగిరసుఁడైన బృహస్పతి
లేక దాక్షాయణియైన యదితి
దేవత—దేవతలు

### అర్థాంతరము—2

†(1) అద్భుతావహముగా నయుగ కాలమ్ములో
దేవాళి సృజియించి దేవదేవుఁడు వెలిఁగె
శబ్ద శక్తులు సర్వ నిశ్శబ్ద శక్తులే
ప్రతివచన మీయంగఁ బ్రతిఫలింపఁగ సృష్టి ॥ 1901

†(2) ఆ శ్రీమహావిష్ణు వల బ్రహ్మణస్పతిగాఁగఁ
గర్మకారుం డౌచుఁ గర్మసాక్షిగ నిలిచి
తొలి సృష్టినే దేవతల సృష్టికిన్ మున్నె
పడుగు పేకలు కాఁగఁ బర్వంగ సృష్టిలో
వెలుఁగు చీకట్లుగా వెలుఁగ నదనదాళి
చిత్రముగ సృష్టించెఁ జిదచిత్తు లలరంగ ॥ 1902

†(3) సర్వ దేవ యుగావళికిఁ జాలఁ బూర్వకాలమందె
సదసత్తులు రెండు పుట్టె సరి రవలలుగా
ఏది ముందో? యేది వెనుకో? యేరికైన నెరుక పడక
సన్మూల మసత్తనుచు ససన్మూలమే సత్తని
అజ్ఞాన ప్రభావ తిమిర మావహిల్లఁగా జగతిని
దెలివి లేని దేబె ప్రాణి దిక్కులు చూచెడు నట్లుగ
ఉత్తానపుఁ బాదోద్భవి ఉరుకు లిడంగా "గంగ"
దశ దిశలను విశ్వ సృష్టి దశ దశలుగ వెలుఁగొందఁగ ॥ 1903

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) శ్రీమహావిష్ణువే చిద్విలాసుం డౌచు
నుత్తానపాదుఁడై ఉపరితలమున నిలిచి
దిక్కాలములతోటి తేజరిలు లోకాల
సర్వ సృష్టిని నిలిపె సదసన్మయముగా
సచ్ఛక్తి అదితిగా సకలమౌ చిచ్ఛక్తి
దక్షతా రూపమై దివ్య శక్తుల వెలయ ॥ 1904

†(5) సచ్చిత్తులే సృష్టి సంభవించెను దొలుత
శ్రీమహావిష్ణువుకుఁ జెలఁగు దుహితలు కాఁగ
నమృతమౌ బంధాల నా దేవజాలాలు
భద్ర శక్తులు మీఱఁ బ్రభవించి మించఁగా ॥ 1905

†(6) జల పూర్ణమౌ సృష్టి నల నాల్గు భూతాల
సర్వ శక్తుల జలము నృత్య రీతుల నిలువ
సలిలాన దోగాడు సర్వేశ్వరేశ్వరుఁడు
సృష్టి కర్తను గాంచి స్రష్ట స్రష్టగ వెలుఁగు ॥ 1906

†(7) అగ్నిలో జల ముండి అగ్ని జలమున నుండి
ఆ సూర్య శక్తు లవి అలరారునట్లుగా
దివ్య దేవాఽఽళులఁ దేజరిలు భువనాలు
భువనాల దేవాఽఽళిఁ బూజలన్ బొందులే! ॥ 1907

†(8) అతిరహస్యమ్మైన అంతర్గతజ శక్తి
ఆ "సత్తు" అదితిగా నఖిలాండముల నిండి
సప్తాఽనలములతో సప్తాఽనిలములతోఁ
జండ ప్రచండ మార్తాండ సంశక్తులన్
దేవాఽఽళి సర్వమ్ము తిరుగాడుచుండులే!
సూక్ష్మ రూపము లొప్ప శోభిలన్ స్వస్వగతి ॥ 1908

†(9) అనలపరమై ప్రాణ లనిలపరమై నిలిచి
అనలాఽనిల యోగ మల జలముతో మృత్తు
నాకాశములఁ గూడి ప్రాకృతముగా మృత్యు
వర మౌచు వర మౌచుఁ దిరిగి జన్మము నందు
మండు మార్తాండుండు మఱిగి సురిగెడి రీతి
నుదయ మస్తంగతుల నొందు చందాసన్ ॥ 1909

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—73

ఋషిః—గౌరివీతిః శాక్త్యః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) జనిష్ఠా [1]ఉగ్రః సహసే తురాయ మన్ద్ర [2]ఓజిష్ఠో బహులాభిమానః ।
అవర్ధన్నిన్ద్రం మరుతశ్చిదత్ర మాతా యద్వీరం దధనద్ధనిష్ఠా ॥ 778

(2) ద్రుహో నిషత్తా పృశనీ చిదేవైః పురూ శంసేన వావృధుష్ట [3]ఇన్ద్రమ్ ।
అభీవృతేవ తా మహాపదేన ధ్వాన్తాత్ ప్రపిత్వాదుదరన్త గర్భాః ॥ 779

(3) ఋష్వా తే పాదా ప్ర యజ్జిగాస్యవర్ధన్ వాజా [4]ఉత యే చిదత్ర ।
త్వమిన్ద్ర సాలావృకాన్ త్సహస్రమాసన్ దధిషే[5] అశ్వినా వవృత్యాః ॥ 780

(4) సమనా తూర్ణిరుప యాసి యజ్ఞమా నాసత్యా సఖ్యాయ వక్షి ।
వసావ్యామిన్ద్ర ధారయః సహస్రా ఽశ్వినా శూర దదతుర్మఘాని ॥ 781

(5) మన్దమాన [6]ఋతాదధి ప్రజాయై సఖిభిరిన్ద్ర [7]ఇషిరేభిరర్థమ్ ।
ఆభిర్హి మాయా [8]ఉప దస్యుమాగాన్మిహః ప్ర తమ్రా [9]అవపత్ తమాంసి ॥ 782

---

1. జనిష్ఠాఽఉగ్రః, 2. మన్ద్రఽఓజిష్ఠో, 3. వావృధుష్టఽఇన్ద్రమ్, 4. వాజాఽఉత, 5. దధిషేఽఅశ్వినా, 6. మానఽఋతా, 7. రిన్ద్రఽఇషిరే, 8. మాయాఽఉప, 9. తమ్రాఽఅవపత్. (వా.ప్ర.).

(6) సనామానా చిద్ధ్వసయో న్యస్మా 1అవాహన్నిన్ద్ర ఉషసో యథానః ।
ఋష్వైరగచ్ఛః సఖిభిర్నికామైః సాకం ప్రతిష్ఠా హృద్యా జఘన్థ ॥ 783

(7) త్వం జఘన్థ నముచిం 2మఖస్యుం దాసం కృణ్వాన 3ఋషయే విమాయమ్ ।
త్వం చకర్థ మనవే స్యోనాన్ పథో దేవత్రాంజసేవ యానాన్ ॥ 784

(8) త్వమేతాని పప్రిషే వి నామేశాన 4ఇన్ద్ర దధిషే గభస్తౌ ।
అను త్వా దేవాః శవసా మదన్త్యుపరిబుధ్నాన్ వనినశ్చకర్థ ॥ 785

(9) చక్రం యదస్యాప్స్వా నిషత్తముతో తదస్మై మధ్విచ్చచ్ఛద్యాత్ ।
పృథివ్యామతిషితం యదూధః పయో గోష్వదధా 5ఓషధీషు ॥ 786

(10) అశ్వాదియాయేతి యద్వదన్త్యోజసో జాతముత మన్య 6ఏనమ్ ।
మన్యోరియాయ హర్మ్యేషు తస్థౌ యతః ప్రజజ్ఞ 7ఇన్ద్రో అస్య వేద ॥ 787

(11) వయః సుపర్ణా 8ఉప సేదురిన్ద్రం ప్రియమేధా9 ఋషయో నాధమానాః ।
అప ధ్వాన్తమూర్ణుహి పూర్ధి 10చక్షుర్ముముగ్ధ్యస్మాన్ నిధయేవ బద్ధాన్ ॥ 788

---

1. న్యస్మా ఽ అవాహన్నిన్ద్ర ఽ ఉషసో, 2. మఖస్యుం, 3. కృణ్వాన ఽ ఋషయే, 4. శాన ఽ ఇన్ద్ర, 5. దధా ఽ ఓషధీషు, 6. మన్య ఽ ఏనమ్, 7. ప్రజజ్ఞ ఽ ఇన్ద్రో ఽ అస్య, 8. సుపర్ణా ఽ ఉప, 9. మేధా ఽ ఋషయో, 10. చక్షుర్ముముగ్ధ్వ. (ప్రా.ప్ర.)

## సూక్తము—73

ఋషి—శాక్త్యుఁడైన గౌరవీతి

దేవత—ఇంద్రుఁడు†

(1)*క॥ స్తుత్యుఁడవై జిష్ణుడవై[1]
యత్యధిక శరీర శక్తి నమరెడు నింద్రా!
సత్య మగు బలము[2] గాంచన్
నిత్యారులఁ ద్రుంప శక్తి[3] నిత్యము గనుమా! ॥ 1910

*గీ॥ ధారయిత్రి యదితి [4]ధన్యుఁడౌ నా యింద్రుఁ
దాల్చి యుండు నపుడు దక్షతఁ గని
వృత్ర హననమందు నింద్ర[5] మరుత్తుల
వృద్ధిపరచినారు వేడ్క మెఱయ ॥ 1911

(2)*గద్యము॥
దోగ్ధ యగు నింద్రుని సేస వాని సమీపమందు మరుత్తులతో నివసించెను. ఆ మరుత్తులు పరిభూత స్తోత్రమున వృత్రునిఁ జంప నింద్రుని వృద్ధిఁ బొందించిరి. గొప్ప వ్రజముతోఁ గూడుకొని గవాదు లెట్లు ఆవరణాభావమందు నిర్గమించునో! యట్లు ఆసన్న వారిదమునుండి గర్భభూతోదకములు బైటకు వచ్చెను ॥ 1912

(3)*గీ॥ నీ మహాపాదములు రెండు నిర్మలేంద్ర!
కరము గొప్పవి యగుటసు గ్రాలుచుండు
నట్టి నీవు గతించెడు నపుడు ఋభువు
లెలమి నిను వృద్ధిఁబరచిరి లలిత రీతి ॥ 1913

*గీ॥ దేవతలు వృద్ధిఁ బరచిరి దివ్య! నిన్ను
నీవు సాలావృకంబుల నేఱిమి మెయిఁ
దాల్చుచున్నాఁడ వప్పుడే దర్శనీయు
లైన నశ్వుల మరలించి [6]యట్టి కర్మ ॥ 1914

---

†వ్రాతప్రతి 13వ సంపుటము 147 పుటలో నీ సూక్తమునకు దేవత "మరుత్తు"గాను, 149 పుటలో ఋషి "గౌరవీతి" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "గౌరవీతి" ఋషిగాను "ఇంద్రుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

1. సత్యుఁడవో జిష్ణుఁడ వీక, నత్యధిక, (తా.పా.), 2. బలమునకు మరి, 3. నీవు పోడవవే, (తా.పా.), 4. తగినవానిని నింద్ర, (తా.పా.), 5. వివిధ మరుత్తుల, (తా.పా.), 6. యమరినావు. (తా.పా.).

(4,5)*సీ॥ తగిన యుద్ధముఁ జేరఁ ద్వరమాణుఁ డగుచుండి యజ్ఞంబునకుఁ బ్రీతి నరుగుచుండు
వప్పుడె యశ్వల నమల సఖ్యమునకు వారల వహియించి వరలుచుండు
నిందు్రఁడా! వసువుల నెల్లరఁ జెలిమిని బాయక యే వేళఁ [1]బడయుచుండు!
ధన సమూహంబును చాల్చుచు మాకయి మెచ్చెడు మాడ్కి నీ విచ్చుచుండు
గీ॥ నిందు్రఁడా! యజ్ఞ కర్మకు నేగఁదలఁచు
చున్నయట్టి మరుత్తుల నొంది సకల
ధనము యజమానులకుఁ గడు ధర్మ బుద్ధి
నిచ్చుచున్నాఁడ వందఱు మెచ్చ నిన్ను॥ 1915

*గీ॥ ప్రజలఁ గూడుచు నిందు్రఁడు ప్రబల దస్యు
చేష్టలం గొట్ట దస్యుని జేరి యుండె
గ్లాపయితృల వృష్టులం గడుఁ దమోఽఘ
ములను నశియింపఁజేసి[2] తా ముదితుఁ డయ్యె॥ 1916

(6)*గద్యము॥
ఈ యిందు్రఁడు సమాన నామములు గల వారినిఁ [3]జంపెను. పిమ్మట నిందు్రఁడ వగు
నీ వెట్లుషస్సుయొక్క శకటమును నశింపఁజేసితివో! యట్లు వృతు్రని బరిమార్చితివి!
ఓ యిందు్రఁడా! నీవు దీప్తుల మిక్కిలి వృత్ర వధనుఁ గోరు మరుత్తులతో
వృతు్రని జంపవచ్చి ప్రతిష్ఠానము లగు శరీరములను రమణీయ
మైన వానిని గొట్టితివి!॥ 1917

(7)*గద్యము॥
ఇందు్రఁడా! దాసుని నాశనముఁ జేయు నముచి మనువు నిమిత్తము విగతమాయునిగ
నొనర్చుచు, ఋషి యజ్ఞమును బాడుచేయ సంకల్పించుకొనినయట్టి నముచిని జంపితివి!
నీవు దేవతల మధ్య మనుఋషికొఱకు మార్గములను స్యోనములుగ నొనర్చితివి!॥ 1918

(8)*గద్యము॥
ఓ యిందు్రఁడా! నీ వీ యుదకములను బూరించుచున్నావు! ఇందు్రఁడా! నీవు సర్వమున
కీశ్వరుండవై వజ్రమును హస్తమందు ధరించుచున్నావు! మరియు బలోపేతుఁడ వగు
నిన్ను నందరు స్తుతించుచున్నారు. ఉదకములు గల మేఘములను అధోముఖములుగా
నొనర్చితివి!॥ 1919

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మోయుచుండు, (తొ.పా.), 2. నశియింపఁజేసెను మోదమలర, (తొ.పా.), 3. సమాన నామములు గలవారిగఁ జేసెను. (తొ.పా.). ఈ సందర్భమున శ్రీ నేమానివారు "మూలమును మరల నాలోచింపవలెను", అని వ్రాసి కొట్టివేసిరి. (చూ. వ్రాతప్రతి. 13వ సంపుటము. 151 పుట.)

(9)*క॥ రవి ఘృష్టు లుదకమును గొని
వివిధము లగు ఘనములందు వెలయించును నా
రవినుండి పరల వచ్చుచు
భువనంబును దడుపుచుండుఁ బొలుపారంగన్ ॥‡

1920

*(9) సంస్కృతి ఋక్కునకుఁ బదచ్ఛేదము— "చక్రమ్,యత్,అస్య,అప్స్వ, ఆ,నిసత్తమ్,ఉతో,
ఇతి,తత్అస్మై,మధు,ఇత్,చచ్ఛద్యాత్,పృథివ్యామ్,అతిసితమ్,యత్,ఊధః,
పయః,గోషు,అదధాః,ఓషధీషు.†
భాష్యము— పరమానిత్వే హననార్థమ్ ఉతోచిత్, అపి వా, అస్మై ఇంద్రాయ,
మధ్వితత్ ఉదకమపి చచ్ఛద్యాత్ పృథివ్యామతిషితం విముక్తం యదఘర్మస్థి
ఉదకమస్తి ననాపో గోష్ఠాదిషు వా దధా ఇతి-(దీనికి భాష్యము లేదు•) ॥

---

*రచయిత:——కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

‡ఈ పద్యము ఋగ్వేదము ప్రథమమండలములోఁ గల 164 వ సూక్తములోని "కృష్ణం నియానం హరయః సువర్ణా" ఇత్యాది 47వ ఋక్కునకు శ్రీ నేమానివారు వ్రాసిన యనువాదము. (చూ. సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత-ప్రథమ సంపుటము-530-543 పుటలు.) ఋగ్వేదము పదవ మండలములోని 73వ సూక్తములోఁ గల "చక్రంయద స్యాప్స్వా" ఇత్యాది 9వ ఋక్కులోని భావమును, ఋగ్వేద ప్రథమ మండలములో నున్న 164వ సూక్తములోని "కృష్ణం నియానం హరయా సువర్ణా" ఇత్యాది 47వ ఋక్కు భావమును, సన్నిహితముగా నున్నవని కొందరు విమర్శకులు భావించిరి. అందువల్ల శ్రీ నేమానివారు తమ "శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత"లో "కృష్ణం నియానం" ఇత్యాది ఋక్కునకు వ్రాసిన ఆంధ్రానువాద పద్యమునే యిక్కడ పునరుక్తిగాఁ గలుపుట జరిగినది. శ్రీ నేమానివారు ఋగ్వేద దశమ మండలములోఁగల 73వ సూక్తములోని "చక్రం యదస్యాప్స్వా" ఇత్యాది 9వ ఋక్కునకు సంస్కృత పద విభజనను-సంస్కృత భాషలోనే ఒక భాష్యమును వ్రాసిరేగాని యీఋక్కునకుఁ బ్రత్యేకముగా నాంధ్రానువాదము విరచింపలేదు.

†శ్రీ నేమాని వారిచ్చిన యీ పద విభాగమునకు భిన్నముగా సాయణభాష్య గ్రంథములో నీ ఋక్పద విభాగ మీ క్రింది రీతిగా నున్నది.

"చక్రమ్, యత్, అస్య, అప్ఽసు, ఆ, నిఽసత్తమ్, ఉతో, ఇతి, తత్, అస్మై, మధు, ఇత్, చచ్ఛద్యాత్, పృథివ్యామ్, అతిఽసితమ్, యత్, ఊధః, పయః, గోషు, అదధాః, ఓషధీషు".

•అనఁగా 73వ సూక్తములోని 9వ ఋక్కునకు సాయణాచార్యులు వ్రాసిన భాష్యము లేదని శ్రీ నేమానివారి యభిప్రాయము కానోపును. ఈ దృష్ట్యా యీ 9వ ఋక్కునకు శ్రీ నేమానివారే పద విభజన స్వయముగాఁ జేసి చూపి తామై భాష్యము వ్రాసినట్లు కన్పట్టుచున్నది. సాయణు లీ ఋక్కునకు సామవేదమున వ్రాసిన భాష్య ముప లభ్యమాన మగుచున్నది. అది యీ క్రింద నుటంకింపఁబడుచున్నది.

"అస్యేన్ద్రస్య చక్రమాయుధమప్స్వన్తరిక్ష ఆ సర్వతోనిషత్తం నిషణ్ణమాసీన్మేఘ హననార్థముతో తదపి చాస్మా ఇన్ద్రాయ మధ్వుదకమపి చచ్ఛద్యాత్ వశం నయతి. పృథివ్యామతిషితం విముక్తం యదూధరుదకమస్తి తత్వయో గోష్వోషధీషు చాదధాః అదధాతి".

"చక్రమ్ యదస్యాప్స్వా" ఇత్యాది ఈ ఋక్కుకుఁ గొన్ని ప్రాచీన వ్రాతప్రతులలో నీ క్రింది విధముగా భాష్యము లభించుచున్నది. ఈ భాష్యము పైనుదాహరించిన సామవేద సంహితా సాయణభాష్యమునకుఁ గొంత భిన్నముగా నున్నది. "అస్యేంద్రస్య చక్రమాయుధం యదప్సు అంతరిక్షే నిషణ్ణం ఉతో అపి చ తదాయుధమస్మా ఇంద్రాయ మధు చచ్ఛద్యాత్ వశం నయతి. యత్ పృథివ్యామతిషితం నిమిత్తం ఊధః ఊధసో మేఘాత్ తదుదకం పయః గోష్వోషధీషు చాదధాః స్థాపితవానసి.....పృథివ్యామతిషితం విముక్తం యదూధః ఉదరమస్తి తత్ త్వయా గోష్వోషధీషు చాదధా ఇతి; పరామానిత్వే హననార్థం ఉతో చిర్ అపి వా అస్మా ఇంద్రాయ మధ్విత్ (మధ్వితత్) ఉదకమపి చచ్ఛద్యాత్ వరాన్ ప్రతి (వరాన్ప్రతి నాస్తి-) పృథివ్యా మతిషితం విముక్తం యదు ధర్మస్తి (యదధర్మస్తి-) ఉదక మస్తి ననాపో గోష్ఠాదిషు ఆనిషత్తం ఆసమంతాత్ నిషణ్ణం భవతి రాత్రౌ ఉతో అనంతరం తత్ రశ్మిపృదం అస్మై తుభ్యం మధు జలం చచ్ఛద్యాత్ సమర్పయతి కించ యచ్చక్రం ఊధః రాత్రిరూపం సత్ పృథివ్యాం అతిషితం అతిశయేన బద్ధం భవతి తేన చక్రేణ గోషు ఓషధీషు చ పయః క్షీరం అంబు చ అదధాః ధృతవానసి. అయమర్థః "కృష్ణం నియానం" (ఋ. సం. 1మం. 164సూ.47ఋ.) ఇతి మంత్రే వ్యక్తీకృతః :"—ప.గో.కృ.

(10)*గద్యము॥
ఇంద్రుని జూచి యిట్లభిప్రాయపడిరి. ఇంద్రుఁ డాదిత్యునివలనఁ బుట్టె నని కొంద రనిరి. కాని వీని బలమువలనఁ బుట్టినవానినిగాఁ దలఁచెదను. వీని యోజస్వితృమును గాంచి వీనిని సూర్యోద్భవునిగా నూహించిరి. లేక యింద్రుఁడు క్రోధమువలన జనించెను. కావున శత్రుయుద్ధములయం దుండుసు. వీఁ డుత్పన్నుఁ డగుటచేఁ దన సామర్థ్యము తా నెరుంగుచున్నాఁడు ॥ 1921

(11)*గీ॥ ప్రజ్ఞ యాచించునవి మరి దృష్ట లైన
యవి ప్రియేష్టులు గల్గిన యవియు గంత
లగుచు సుపతనమును గల్గునట్టివి యగు
నంచిదాదిత్య రశ్ములు హరిని జేరు ॥ 1922

*గీ॥ ధ్వాంతమును [1]బరిహరింపుము! ధ్వాంత మెల్ల
నిండఁజేయు మహేంద్రుఁడా! నీవు మమ్ముఁ
బాశ బద్ధుల విడిచెడు పగిది విడువు
మధిక తేజస్సు నొసఁగు మత్యాదరమున ॥ 1923

## సూక్తము—73

ఋషి—శాక్త్యుఁడైన గౌరవీతి

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) ఉగ్ర సాహస శక్తు లుజ్జ్వలముగా వెలుఁగ
బహులాఽభిమానాల బహుళ లక్ష్యము లలర
మంద్ర గతి మీఱంగ మరుదాళి వీవంగఁ
దల్లి ఆశీస్సులే తనరారుచుండంగ
ఆల్ల ధనిష్ఠయె అలర గోకులమై
యింద్ర శక్తుల నిలుపు నిష్ట శక్తులు వెలుఁగ ॥ 1924

(2)†ప్రతిభావృత్తము॥♦
చిచ్ఛక్తి ప్రాముఖ్య చిద్విలాసమ్ములే
హృచ్ఛక్తి నింద్రత్వ హీన రాహిత్యతన్
స్వచ్ఛంపు టచ్ఛంపు శౌర్య సన్మాన్యమౌ
నిచ్ఛాఽన్విత మ్మైన యిష్ట రూపాల్ తగున్ ॥ 1925

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.
♦ జగతీఛందము, (12).

(3)†జయశ్రీవృత్తము॥*
వేలువేలుగ సురలు విమల రోచిస్సులే
క్రాలుచుండఁగ జగతి రమణ దైవీయ మౌ
వేల లొప్పుచు వెలుఁగఁ బ్రతన సర్వేంద్రుఁడే
నేల నింగుల నడుగు నిలుపు విశ్వాత్ముఁడౌ
లీల విష్ణుని కరుణ రిపులఁ దున్మాడులే!
హేల కేశుల ఋతము ఋతముగా నిల్చులే! ॥ 1926

(4)†సత్యశ్రీవృత్తము॥‡
సత్య శబ్దమ్ముతో సఖ్యమై సృష్టియై
నిత్య యజ్ఞమ్ముగా నిర్మోహతన్ మహా
ప్రత్యభిజ్ఞాఽంచితోద్భాసమ్ముగాఁ దగన్
జాత్యమై దేవతా జాత్యమ్మొ శ్రీమహా
సత్యనారాయణస్వా మ్యున్నతుండుగాఁ
ప్రత్యవాయమ్ము లే పాటియున్ లేక సత్
ప్రత్యయ మ్మొప్పంగ రాణించు నింద్రుఁడే! ॥ 1927

†(5) జలద మాలలనుండి జలము జాల్వారునటు
శబ్ద శక్తుల దోష జాలముల్ పోవులే!
ఉరుము మెరుపులు కాఁగ నుజ్జ్వల దీప్తులన్
సన్మంత్ర సచ్ఛక్తి సత్య స్వరూపాలు
నింద్ర శక్తిని నిలిపి యెల్ల తమములఁ బాపి
ఆ మహా మాయలను నంతరింపఁగఁజేయు ॥ 1928

(6)†క॥ అనలాఽనిల యోగమ్ముల
నిన శక్తిని బిడుగు పడుచు నెల్లలు దాఁటున్
ఎన లేని మనశ్శక్తిని
ఘన చిచ్ఛక్తులను బ్రాణి కాంతిన్ మీఱున్ ॥ 1929

(7)† విశ్వ శాంతిని గోరు నశ్వర యజ్ఞాల
శబ్ద శక్తుల సర్వ సంక్షేమ విధ్వస్త
మొనరించు దుష్టాళి నొగి లోక కంటక
మ్మౌ రాక్షసాధముల నతిలోక శక్తితో
సంహార మొనరించు సర్వేశ్వరేశ్వరుఁడు
సాకల్యముగ సర్వ లోకాలఁ గాపాడు ॥ 1930

---

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"అతిశక్వరీ"ఛందము, (15). ‡"జగతీ"ఛందము, (12).

†(8) దివ్య దేవాఽఽవళుల తేజరిలు మహిమలను
శబ్దేశ శక్తులను సర్వ గభస్తులల
సౌరాది గోళాల సందీప్తములఁ జేసి
ఆధిపత్యము మీఱ నపుపులోఁ బెట్ట నగు
బంధింప నౌనులే! బాధ శక్తులు నెగయ
నీ మనశ్శక్తి కది నిలుపు టద్ద మ్మౌను ॥ 1931

†(9) వాయు శక్తులు మీఱ వర్ష ధారలు కురిసి
ఓషి భువుల నీ విశ్వ ధృత వివిధ గోళాలఁ
బంచ భూతాఽఽవళులఁ బరమౌషధీతతులఁ
బ్రాణ సహితము చేసి పంచత్వమును బాపు ॥ 1932

†(10) మహిత శక్తుల దివ్య మాన్య తేజఃపుంజ
మీ విశ్వమున నిండి యెస లేని దీధితుల
గృహములన్ గుహలందు నిహమందుఁ బరమందు
మిన్నులో మన్నులో మున్నీట మిన్నేట
వేద శక్తులు వెలయ విమలేంద్ర వర శక్తి
పెరుగుచుండును సదా వెలుఁగుచుండునుగదా! ॥ 1933

†(11) అతిలోక శక్తులన్ అఖిల లోకాఽఽవళుల
బంధించులే! ఋషులఁ బరిఢవిల్లఁగ దీప్తి
అల్ల విష్ణ్వాదిత్య చిల్లలిత సచ్ఛక్తి
అజయ్యమై అమేయమై అత్యపూర్వతన్ దనర
నిండుగ్రిండు పొందును నెంత లెంతలుగానో!
అగ్ని జల పూర్ణమై అనిల మృదాకాశ
మంది తనరెడి నేత్రి మా శక్తులను నిండు
నాగ్రహోదగ్రమా నమర కరుణాఽమృత మగు ॥ 1934

## సూక్తము—73

ఋషి—శాక్త్యుఁడైన గౌరవీతి

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

(1)†క॥ మహ దుగ్రమ్మౌ శక్తిని
బహు రూపాళి నభిమాన పాలిత దీప్తుల్
అహరహము వెల్లివిరియఁగ
నిహ పర సుఖ సంపదాళు లెసఁగు జయములన్ ॥ 1935

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(2)†హరిహరప్రియవృత్తము॥*

నిద్రాఽతిరిక్తమై నిండు నిర్నిద్రితా
చిద్రూప శక్తులన్ జిద్విలాసమ్ములన్
భద్రాఽన్వితమ్ముగా నవ్యమౌ దివ్యమౌ
విద్రోహి ఆ "ద్రుహో" వీరతల్ రూపఱన్
ముద్రాంకితంపు సంపూర్ణ ముద్రాక్షరాల్
సద్రూప దృష్టులే చాలితమ్మై తగున్ ॥ 1936

†(3) అల్ల సహస్ర దీప్త లన్నిండినిన్ మించి
చిద్రూప శక్తియే వెలు వొందు నిత్యమ్ము
మాన్యమౌ నింద్రత్వ మహిమాన్విత బలము
నర సురుల నేతృత్వ మిరవొందఁగా నిలుపు
అతిలోక వేగాన సదృశ్య శక్తులన్
దివ్య పాదము నిలిపి తేజరిలు లోకాల ॥ 1937

†(4) అనృత రూపాఽఽపదల నావలకుఁ ద్రోయుచున్
సత్య దీపాలతో సఖ్యమ్ము నెఱపుచున్
లెక్కలకు మిక్కిలిగ దిక్కులన్ వసు శక్తు
లష్ట రూపాలలో నపురూపమై నిలువ
సృష్టిలో సంపదలు వ్యష్టి సమిష్టులుగ
శబ్ద శక్తులతోడ సంకలన మ్మొందు ॥ 1938

(5)† వేద మంత్రాక్షర విమల సచ్ఛక్తులే
విశ్వమ్ము వ్యాపించి వెలుఁగుబాటలు చూపు
సతిగమన శీలాన నత్యంత మైత్రిమై
సర్వ శుభములఁ గూర్చి సకల సంపద లిచ్చు!
దుష్ట రాక్షస తతులఁ దునుమాడి కష్టాల
నష్టాలఁ దొలఁగించి నవ శక్తు లొసఁగులేః ॥ 1939

†(6) బద్ధ శత్రువు వృత్రు వ్యర్థ తపసిగఁ జేసి
జల నాభి కాపాడి జ్వలిత శక్తులు నిలిపి
లోక సంక్షేమాల లోలుపత్వము మీఱ
సఖిలాస సనిలాల నల్లాడఁగాఁ జేసి

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"జగతీ"చ్ఛందము. (12).

మరుస్మరేచిగా మహిమాన్వితుండైన
శ్రీమహావిష్ణువే చెలఁగు నక్షర శక్తి
అక్షయమ్మౌ జ్ఞాన మా హృదయ రూపమై
నిత్యోషసుగాఁగ నిఖిలమ్ము వెలుఁగులే! ॥ 1940

†(7) సలిలాల మలినాల నలవోకఁ బోఁగొట్టి
ఆవిరిగఁ జేకొనుచు నల్ల మొయిళుల రూపు
లందఁగా నొనరించి అమల జలముల వృష్టి
లంతటన్ గురియంగ నా దేవదేవుండు
పంచ భూతాఽఽవళుల నంచిత క్రమ గతుల
నధికాధికముగాఁగ నన్యోఽన్య సంబంధ
బంధాలతో మీఱి పర్వి అంతర్గతుల
సర్వాన వ్యాపించుఁ జరముల స్వచరాల ॥ 1941

†(8) ఆకర్షణము చేసి ఆవిష్కృతము చేసి
ఆ కిరణ జాలాలె అన్ని రూపాలలో
మంచి చెడు లన్నింటిఁ జెంచి తుంచుచు నుండఁ
బృథివ్యప్తేజాలు ధృత మరుద్ గగనాలు
అనులోమమై జగతి నవియె విలోమమై
అంతర్గత మ్మౌచు నంతటన్ వెలుఁగొంద
నుత్పత్తు లునుకులును నుత్పాత గతు లొందుఁ
దలఁపులకె అందని దైవీయ మౌ శక్తి ॥ 1942

(9)†క॥ చక్రి క్రమ శక్తులతోఁ
జక్రి మహా తేజ మలరు సర్వాత్మతమై
వక్ర రహిత విక్రమ సువ
రాక్రమతల విశ్వమందు రాణింపంగన్ ॥ 1943

క॥ ఇచ్ఛాగతి భూతాఽఽవళి
స్వచ్ఛలమై నిలిపి చలిత శక్తులు వెలయన్
విచ్ఛిన్న విరహితమయి అ
విచ్ఛిన్నాఽఽజయ్యఁ ధీ గభస్తులు వెలుఁగున్ ॥ 1944

†(10) వేద స్వరూపమౌ విష్ణు శక్తులు మీఱ
రవి శశులు నాదిత్య రాజి గ్రహతతులు
రంజిల్లుచుండులే! కంజాతజుని గూడి
విశ్వ పంజరమందు నశ్వరమ్మౌ సృష్టి

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

పక్షి రెక్కలు నాడ ఋక్షముల్ మిఱుమిట్లు
మినుకు మినుకుల వెలుఁగు మిన్నంటి చెలఁగు
సంకల్పతన్ సర్వ సర్వేశు సవికల్ప
లీల లవి హేలగాఁ గేళిగాఁ దనరారు ॥ 1945

(11)†అష్టపదకందము॥
కదలని చెదరని ప్రిదులని
నదవద లెరుఁగని ముదములు నా ఖేదములున్
నిదురయు మెలకువ శాంతియుఁ
గదనముఁ దెలియని సువర్ణ కాంతులన్ సృష్టిన్
విదిత మ్మవుచున్ గాకయు
నెద నర సుర కిన్నరాదు లింతయు నైనన్
"అది" యని "యిది" యని తెలుపఁగఁ
దుది మొద లెనయని పరాశక్తి తుష్టిన్ బుష్టిన్ ॥ 1946

## సూక్తమ్—74

ఋషిః—గౌరివీతిః శాక్త్యః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) వసూనాం వా చర్కృష[1] ఇయక్షన్ ధియా వా యజ్ఞైర్వా రోదస్యోః।
అర్వన్తో వా యే రయిమన్తః సాతౌ వనుం వా యే సుశ్రుణం సుశ్రుతో ధుః॥ 789

(2) హవ[2] ఏషామసురో నక్షత ద్యాం శ్రవస్యతా మనసా నింసత క్షామ్।
చక్షాణా యత్ర సువితాయ దేవా ద్యౌర్న వారేభిః కృణవన్త స్వైః॥ 790

(3) ఇయమేషామమృతానాం గీః సర్వతాతా యే కృపణన్త రత్నమ్।
ధియం చ యజ్ఞం చ సాధన్తస్తే నో ధాన్తు వసవ్యమసామి॥ 791

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. చర్కృషఽఇయక్షన్, 2. హవఽఏషా. (వా.ప.).

(4) ఆ తత్ త [1]ఇన్ద్రాయవః పనన్తాఽభి య[2] ఊర్వం గోమన్తం తితృత్సాన్।
సకృత్స్వంఀ యే పురుపుత్రాం మహీం సహస్రధారాం బృహతీం దుదుక్షన్॥ 792

(5) శచీవ[3] ఇన్ద్రమవసే కృణుధ్వమనానతం దమయన్తం పృతన్యూన్।
ఋభుక్షణం మఘవానం సువృక్తిం భర్తా యో వజ్రం నర్యం పురుక్షుః॥ 793

(6) యద్వావాన పురు[4]తమం పురాషాళా వృత్రహేన్ద్రో నామాన్యప్రాః।
అచేతి ప్రాసహస్పతిస్తువిష్మాన్ యదీముశ్మసి కర్తవే కరత్ తత్॥ 794

## సూక్తము—74
ఋషి—శాక్త్యుఁడైన గౌరవీతి†
దేవత—ఇంద్రుఁడు

(1)*గద్యము॥
ధనము నొసంగుటకు నిచ్ఛగించుచున్న యింద్రుఁడు ధనలాభమునకుఁగాని యుద్ధాది కర్మకౌఱకుఁగాని ద్యావా పృథ్వులకు సంబంధించిన దేవ మనుష్యులచే నాకర్షింపఁ బడుచున్నాఁడు. సంగ్రామము జేతవ్యము కాఁగా, నెవరు వెడలుచు ధనవంతు లగుదురో! వారిచే నింద్రుఁడు గ్రహింపఁబడును. ఎవరు సుప్రసిద్ధులై హింసను అత్యంత దుర్జయ విషయముగాఁ జేయుచుందురో! వారిచేతనుగూడ నాకర్షింపఁబడును॥ 1947

(2)*గద్యము॥
ఈ యంగిరస్సుల యాహ్వానశబ్దము ఇంద్రునకుఁ బ్రేరకమైనదియై దివమును వ్యాపించెను. ఇంద్ర సంబంధము గల దేవతలు అన్నమును గోరు మనస్సుచేఁ బృథ్వినిఁ బొందిరి. ఆ పృథ్వియందు పణులచే నపహృతములగు గోవులను దేవతలు తమ యభ్యుదయమునకు నాదిత్యుని వలె వరణీయ స్వతేజస్సును బ్రకటింపఁజేసిరి॥ 1948

---

1. ఆతత్తఽఇన్ద్రాయవః, 2. భియఽఊర్వం, 3. శచీవఽఇన్ద్ర, 4. పురంతమం (వ్రా.ప్ర.)

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†వ్రాతప్రతి 13వ సంపుటము 153 పుటలో నీ సూక్తమునకు దేవత "మారుతము"గాను, ఋషి "గౌరవీతి"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "గౌరవీతి" ఋషిగాను, "ఇంద్రుఁడు" దేవతగాను, భావించవలసినట్లు ,, అని డిటో గీతలు శ్రీ నేమానివారు వ్రాసిరి.

(3)*ఉ॥ యాగమునందు నే యమరు లత్యధికంబుగ యాచ్య లౌదురో:
త్యాగము గల్గువార లనయంబును రత్నము ధీ విశేషమున్
యాగముఁ గూర్చి మాకయి సహాయముగా వసురాశి నిచ్చుచో
రాగములోవఁ గూడి సుర రాజుల వేఁడెద మెల్ల భంగులన్ ॥ 1949

(4)*గద్యము॥
ఏ యంగిరస్సులు సకృత్ప్రజాతము, బహ్వోషధి వనస్పతి రూప పుత్రము,బహుకామ వర్షిత్రి యగు భూమిని బరిమాణ రహిత మగు దివమును దోహనముఁ జేసిరో: యట్టి యంగిరస్సులు స్తుతియింపఁబడుచున్నారు.ఆ యంగిరస్సులు పణి ప్రాప్త మగు గోమత్సంఘమును హింసించుటకు నిష్టపడిరి ॥ 1950

(5)*చ॥ నరహితమైన వజ్రము ఘనంబుగఁ దాల్చెడునట్టి శత్రులం
ద్వరితముఁ దుంచునట్టి ధన బంధురుఁడై విలసిల్లునట్టి సుం
దర నుతిఁ గల్గినట్టి హరిఁ దప్పక మీరలు కర్మ కారకుల్
నిరుపమ రక్షణంబునకు నిత్యము వేఁడుఁడు: సంతసంబునన్ ॥ 1951

(6)*గద్యము॥
ఎపుడు అత్యంత ప్రవృద్ధతముం డగు వృత్రుని జంపెనో: శత్రుపురాభిభవిత యగు నింద్రుఁడు అప్పుడు(అనంతరమందే)ఉదకములను బూరించెను. ఆ యింద్రుఁడు శాత్రవాభిభవితయై, సర్వ స్వామియై, బహుధనుఁడై, సర్వ విజ్ఞాత యయ్యెను. "ఇది యగుఁగాక:" "ఇది యగుఁగాక:" యని యే కర్మను గోరుచుందుమో: యా కర్మ నప్పుడే చేయును ॥ 1952

## సూక్తము—74

ఋషి—శాక్త్యుఁడైన గౌరవీతి

దేవత—ఇంద్రుఁడు

### అర్ధాంతరము—1

(1)†స్రగ్విణీవృత్తము॥
ఆదితేయాల వస్వాళి వెల్గొంచుచున్
రోదసిన్ సర్వదా రూఢ శక్త్యావశిన్
బ్రోది నా రోచి సంపూర్ణమై ఉష్ణమౌ
పాదముల్ సూర్యు సుప్రాభవాఽష్టమ్ము లౌ ॥ 1953

†రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

† రోదోఽంతర మెల్లఁ బ్రిడి యజ్ఞాలతో
సచ్ఛమై స్వచ్ఛమై అలరారుచుండఁగా
అష్ట విధములౌ నైశ్వర్య సంపదలు
ఆ వసు రూపాల నంతటన్ వ్యాపించ
సృష్టిలో సిరు లెల్ల వ్యష్టి సమిష్టులుగ
నైజమై నెలవొందు నాల్గు చెరగులలోన
నన్ని గోళాలలో నఖిల భూతాఽఽవళుల
నా దేవదేవుని అపురూపమౌ లీల ॥ 1954

†(2) భువి దివుల నన్నింటిఁ బూర్ణ శక్తులతోడ
దుర్జయ రీతిలో నిర్జితముగాఁ జేయ
లోక భీకర ఘోర రూక్ష రాక్షస జాతి
వైరమ్ము పూని దుర్వార శక్తుల మీఱ
దేవ దేవుఁడు మహా దివ్యత్వమును జూపి
చండ శాసనుఁ డౌచు శత్రు తతిఁ దున్మాడు ॥ 1955

†(3) అఖిల ప్రాణికోటి కెల్ల నా దివ్య దేవతలకు
నందరికిని దండ్రిగాఁగ నలరారెడి ఆ దేవుఁడు
అమృత ధార లందించును సమృత వాక్కు లమరఁజేయు
సప్త వసువు లలరఁజేయు నఖిల రత్నధాముఁ డౌచు
బుద్ధీంద్రియ సంశక్తుల బద్ధమైన యజ్ఞాఽఽవళి
సార్థకమౌ గతులఁ జేయు సకల జనుల రక్షించును
బ్రతుకుబాటలందె కాక బ్రహ్మాండములందె కాక
అఖిల విశ్వమందు శాంతి నలవోకగ వెలయించును ॥ 1956

†(4) అఖిల గోళాఽఽవళుల కాధార భూతమై
సర్వేశు శక్తిగా సాహస్రధారగ వెల్గు
అల్ల విష్ణ్వాదిత్య చిల్లలిత రూపమే
యింద్ర రక్షక మౌచు నీప్సితమ్ముల నొసఁగు
సచ్చిత్తులను నిల్పి మ్రుచ్చు అసత్తునున్
అజ్ఞాతాఽంధత నెల్ల నావలకుఁ ద్రోయులేః ॥ 1957

(5)†క॥ మఖ సహితుండౌ నింద్రుఁడు
సఖి శచి హృదయమును నేలి శమ దమ ధీ శ
క్త్యఖిలము పవి పరమై జగ
తి ఖలుల ముష్కర దనుజ తతిన్ దునుమాడున్ ॥ 1958

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(6)†క॥ జల నాభిని సుష్టోగ్రిత
ఫల శక్తుల విశ్వ సృష్టి సర్వ వినాశ
మ్మలవోకగఁ జేసెడి వృ
త్రి లీలఁ దునుమాడెడి హరి దుర్జయుఁ డౌలే! ॥ 1959

## సూక్తము—74

ఋషి—శాక్త్యుఁడైన గౌరవీతి

దేవత—ఇంద్రుఁడు

**అర్థాంతరము—2**

†(1) అదిత్యు కర్మతో నఖిల వసువులు నడుచుఁ
బంచ భూతము లెల్ల సంచరించుచునుండు
సృష్టిలో నఖిలమౌ సిరి సంపదలు నిలుచు
జన జీవ జాలముల ఘన దేవ జాలముల
సంసార మెల్ల నౌక నంద్రమై నెలవొందు
వెలుఁగు చీకట్లుగా వెలుఁగు మంచి చెడులు ॥ 1960

†(2) అంత మెనయని విషాగ్ని మహా శక్తి
విశ్వ సంక్షోభాల విపులముగ సృష్టించు
నా రాక్షసాధముల నా ధూమకేతువుల
జారి పడకుండంగ భద్రతల్ నమకూర్చి
ఆదిత్యదేవుండు అన్నిటిని రక్షింప
అతిలోకమై వెలయు నమల హృచ్ఛక్తితో
విశ్వ శాంతికె యజ్ఞ మశ్వరమ్ముగఁ జేయుఁ
బ్రత్యవాయము లేని నిత్య సత్యమ్ముగా ॥ 1961

†(3) అక్షరముగా వెడలు సక్షర శక్తులన్
అక్షయమ్మై నిలువ రక్షణ దక్షతల్
యజ్ఞాగ్ని తేజాల సమృత వాక్కులు పుట్టు
నగు సచ్చిదానంద మమృత ధారలె కురియు
నా కంటి మింటిలో నఖిలాండములలోన
నా కళయె తేజముగ నఖిల ధనములు నిలుచు ॥ 1962

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఆ వజ్ర శక్తికే ఆధారభూతమై
అఖిల లోకాంతరముల కాలంబున వ్యాప్తి
విశ్వ సృష్టికి ఒక మహాంశ్రీ కవచ మ్మౌచు
నలరారు నాదిత్యుఁ డల యింద్రుఁడై నిలిచి
సకల దారిద్ర్యాల సర్వంసహారులను
సంహరించును సదా సంక్షేమముల నింపి ॥ 1963

†(5) ఆ శచీంద్రుల శక్తు లమర మై వెలయునటు
దమ రూపమై నిలుచు దక్షత్వమే వెలుఁగ
సర్వ గోళాలపై సంచరించెడి మొయిళు
లనుకూల పవనాల నమృత జల ధారలను
గురియులేః ప్రకృతికిఁ గొమరు ప్రాణము లీయ
శ్రీమహావిష్ణు కృప నెలు వొందఁగా సృష్టి ॥ 1964

†(6) అఖిల లోకాంతరముల నగ్నిలో వెల్గు నటు
లా వృత్ర శక్తు లవి అఖిలమ్ము వ్యాపింప
విష శక్తు లన్నింటి విధ్వస్త మొనరించి
ఆ పంచ భూతాల నమలములుగాఁ జేసి
విశ్వ సంక్షేమాల శశ్వత్ సుఖ తతుల
సచ్చిత్తు లలరార సమలంకృతము చేసి
ఆనందమయములై అన్ని రసములు వెలయ
హాయి లీలలఁ గేళు లాడు నా దేవుండు ॥ 1965

## సూక్తమ్—75

ఋషిః—సిన్ధుక్షిత్ ప్రైయమేధః
దేవతా—నద్యః
ఛందః—జగతీ

(1) ప్ర సు వ [1]ఆపో మహిమానముత్తమం కారుర్వోచాతి సదనే వివస్వతః ।
ప్ర సప్తసప్త త్రేధా హి చక్రముః ప్ర సృత్వరీణామతి సిన్ధురోజసా ॥ 795

(2) ప్ర తేऽరదద్వరుణో యాతవే పథః సిన్ధో యద్వాజాగ్ం [2]అభ్యద్రవస్త్వమ్ ।
భూమ్యా[3] అధి ప్రవతా యాసి సానునా యదేషామగ్రం జగతామిరజ్యసి ॥ 796

1. సు వఽఆపో, 2. వాజాగ్ంఽఅభ్య, 3. భూమ్యాఽఅధి. (వా.ప.)

(3) దివి స్వనో యతతే భూమ్యోపర్యనన్తం శుష్మముదియర్తి భానునా।
అభ్రాదివ ప్ర స్తనయన్తి వృష్టయః సిన్ధుర్యదేతి వృషభో న రోరువత్ ॥ 797

(4) అభి త్వా సిన్ధో శిశుమిన్న మాతరో వాశ్రా[1] అర్షన్తి పయసేవ ధేనవః।
రాజేవ యుధ్వా నయసి త్వమిత్ సిచౌ యదాసామగ్రం ప్రవతామినక్షసి ॥ 798

(5) ఇమం మే గఙ్గే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా।
అసిక్న్యా మరుద్వృధే వితస్తయా ఽఽర్జీకీయే శృణుహ్యా సుషోమయా ॥ 799

†(6) సితాసితే సరితే యత్ర సంగథే తత్రాప్లుతాసో దివముత్పతన్తి।
యే వై తన్వం వి సృజన్తి ధీరాస్తే జనాసో అమృతత్వం భజన్తే ॥ 800

(7) తృష్టామయా ప్రథమం యాతవే సజూః [2]సుసర్త్వా రసయా శ్వేత్యా త్యా।
త్వం సిన్ధో కుభయా గోమతీం క్రుముం మేహత్న్వా సరథం యాభిరీయసే ॥ 801

(8) ఋజీత్యేనీ రుశతీ మహిత్వా పరి జ్రయాంసి భరతే రజాంసి।
అదబ్ధా సిన్ధురపసామపస్తమా ఽశ్వా న చిత్రా వపుషీవ దర్శతా ॥ 802

---

1. వాశ్రాఽఽఅర్షన్తి, 2. ససర్త్వా. (పా.ప్ర.)

† సంస్కృత ఋగ్వేదము దశమ మండలములోని 75వ సూక్తములో ఈ 6వ ఋక్కును బరిశిష్టముగాఁ గొందరు భావింపఁ బ్రక్షిప్తమని కొందఱును, "ఖిల"మంత్రమని మరికొందఱును, సరికపాఠ మని వేరొక కొందఱును భావించిరి. కల్ప సూక్తములలో వినియోగము పేర్కొనఁబడని మంత్రసూక్తాదులు "ఖిల" మంత్ర సూక్తాదులుగా వ్యవహృతములైనట్లు కొందరు తలంచిరి. ఋషి పరంపరలోఁ బదక్రమాది పాఠములు విలుప్తములై విస్మృతములై మూలము మాత్రమే పఠింపఁబడఁగా నది "ఖిల" భాగమునఁబడి నట్లు మరికొందఱు భావించుటయు జరిగినది. కాని "పరశాఖీయం స్వశాఖాయా మపేక్షావశాత్ పఠ్యతే తత్ ఖిల ముచ్యతే ఇతి ఖిల లక్షణమ్" అని ప్రాచీనులు "ఖిల" లక్షణము ప్రవచించిరి ఇతర శాఖాగత మగు మంత్రముగాని సూక్తముగాని సందర్భవశమున నవసరమునొంది స్వశాఖలోనికిఁ బరిగృహీత మైనచో నది క్రమముగా "ఖిల" మంత్రము "ఖిల" సూక్తమనఁబరఁగును. అది సూక్తము మొత్తము కాక తదూన మగు మంత్రములుగఁ బరిగ్రహీత మైనచో "ఖిల" మంత్రము లగును.–వ.గో.కృ.

(9) స్వశ్వా సిన్ధుః సురథా సువాసా హిరణ్యయీ సుకృతా వాజినీవతీ।
ఊర్ణావతీ యువతిః సీలమావత్యుతాధి వస్తే సుభగా మధువృధమ్ ॥ 803

(10) సుఖం రథం యుయుజే సిన్ధురశ్వినం తేన వాజం [1]సనిషదస్మిన్నాజౌ।
మహాన్ హ్యస్య మహిమా పనస్యతే ఽదబ్ధస్య స్వయశసో విరప్శినః ॥ 804

## సూక్తము—75

ఋషి—ప్రియమేధపుత్రుఁడు సింధుక్షిత్తు†

దేవత—నదులు†

(1)*గద్యము॥

ఓ యప్పులారా! మీ మహిమను సింధుక్షిత్తనెడు స్తోతను బరిచరణముఁ జేయు యజమానుని గృహమందుఁ జెప్పఁగలను. ఆ నదులు సప్తయయి పృథ్వియందు, నంతరిక్షమందు, దివమందుఁ దిప్రకారము వ్యాపించెను. ఆ నదుల మధ్యను సింధు వనెడు నది స్వబలమున సర్వ నదుల నతిక్రమించి ప్రవహించుచున్నది ॥ 1966

(2)*గీ॥ సింధు దేవి! నీవు శ్రీ లొసంగెడు నన్న
మును నొసంగఁ బ్రీతి నరుగుచుండు
వందువలన వరుణుఁ డను వాఁడు నీ మార్గ
మును సువిస్తృతముగ నొనరఁజేసె ॥ 1967

*గీ॥ సింధువా! నీవు పుడమిపై శ్రీ లొసంగు
మార్గమునఁ బోవుచుండు వనర్గళముగ
నతి సముచ్ఛ్రిత పథమున నరుగుచుంట
సర్వ జగముల రక్షింపఁజాలుచుందు! ॥ 1968

---

1. నగిషదస్మి. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటములో (155పుట) నీ సూక్తమునకు ఋషి "ప్రియమేధ పుత్రుఁడు సింధుక్షిత్తు"గాను, దేవత "నది"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "సింధుక్షిత్తు" ఋషిగా "నదులు" దేవతగా శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(3)*గీ॥ భూమిపై నిస్వనము( బుట్టుచు దివమంపు
వ్యాప్తి( జెందుచుండె వలసినట్లు
సింధు వూర్మివలన బంధుర వేగంబు(
బొంద(జేయుచుండు( బూర్ణ మహిమ ॥ 1969

*గీ॥ విపుల శబ్దంబు( జేసెడు వృషభ మెట్టు
లరుగుచుండునో! యట్టులే యంతరిక్ష
భాగముననుండి వృష్టులు స్వన మొనర్చు
భంగి సింధువు శబ్దముల్ పరిఢవిల్లు ॥ 1970

(4)*గీ॥ పుత్రకుని మాత లట్టులు పూర్ణ శబ్ద
మును నొనర్చెడు నదు లెల్ల ఘన పయఃపూ
పూర్ణ ధేనువులం బోలి పూత సింధు
వా! నినుం జేరి యున్న వత్సంత పీ[illegible] ॥ 1971

*గీ॥ ఇలను నీతోడ వచ్చెడు నెల్ల నదుల
కంటె ముందుగ( బోవుచు( గ్రాలుచుందు
వప్పుడే యుద్ధకృద్రాజు మెప్పు వడసి
సిచ్యమానుల భటులను జేర్చుచుంటి! ॥ 1972

(5)*గద్యము॥
ఓ గంగ! యమున! సరస్వతీ! శతుద్రి! పరుష్ణి! అసిక్నితో( గూడుకొనిన మరుద్వృత!
"వితస్తా సోమ"లతో( గలసిన ఆర్జీకీయ! సప్త నదు లగు మీరు మా స్తోత్రమును
నాలింపు(డు! ॥ 1973

(6)†క॥ తెలుపౌ నలుపౌ సృష్టిని
లలిత ప్రఫుల్లత సరిత్తు రై శక్తులతో
నలరి దివ మ్ముద్భవ మగు
వలితాఽమృతతను జనతలు భజియించునులే! ॥ 1974

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ పల్లమూాటి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†ఋగ్వేదము దశమ మండలములోని 75వ సూక్తములో 6వ ఋక్కుగా నొక "ఖిల" మంత్రము కలదు. ఈ
ఋక్కును శ్రీ నేమానివా రనువదింపలేదు. ఈ 1974వ పద్యము "ఖిల" మంత్రానువాదము.

(౬)*గద్యము॥
ఓ సింధువా! నీవు క్రిమణీయ యగు గోమతికిఁ బ్రతిస్పర్థినిగాఁ బోవుటకుఁ బరత్వమునుండి
యవరోహించి మొదటఁ దుష్టామ నదిని గలిసికొంటివి. పిదప సమాన రథము నధిరోహించి
వేనితో వెడలుచుంటివో! యట్టి సుసర్తుతోను, రసతోను, శ్వేతితోను, కుభతోను,
మెహత్నుతోను గలిసికొనుచున్నావు! ॥ 1975

(౭)*గీ॥ శ్వేత వర్ణము గలిఁగి విఖ్యాత యగుచు
దీప్యమాన శరీరయై తిరుగుచుండి
మిగుల ఋజు గామినిగఁ దాను మెలఁగు సింధు
వధిక వేగ జలంబుతో నడచుచుండు ॥ 1976

*గీ॥ కర మహింసితయై వేగ కర్మ గలుఁగు
సింధు వశ్వాంగనం బోలి చిత్రి యగుచు
సుందర వపుస్సుతోఁ గూడు సుదతి మాడ్కి
దర్శనీయయు, నగుచుండు ధరణియందు ॥ 1977

(౮)*సీ॥ శోభనాశ్వములతో సొగసొందు సింధువు కడు మధు వృధములఁ గ్రాలుచుండు
శుభకర రథముతో సొంపొందు సింధువు కడు మధు వృధములఁ గ్రాలుచుండు
భవ్య వాసస్సుల భాసిల్లు సింధువు కడు మధు వృధములఁ గ్రాలుచుండు
సౌవర్ణ భూషల చక్కని సింధువు కడు మధు వృధములఁ గ్రాలుచుండు
గీ॥ నన్నముల [1]"నూర్ణ"ములతోడ నమరునట్టి, [1]"సీల" మాంచిత యగునట్టి సింధు వధిక
మధువు నభివృద్ధిఁ జేసెడు మంచి వృక్షములను గప్పుచుఁ దా నిల వెలుఁగుచుండు ॥ 1978

(10)*గీ॥ సుఖముఁ జేయు నట్టి శోభన ద్వారంబు
గల్గు నట్టి యశ్వ కాంత రథముఁ
గూర్చు సింధు రాజ్ఞి కూరిమి మా కిల
నన్న మిడుననుగాక నతిశయముగ ॥ 1979

*క॥ ధన్యాఢ్యహింస్యంబై కడు
ధన్యతమం బైన కీర్తి దాల్చుచు నుండా
మాన్యతమ సింధు యానము
గణ్యం బౌ మహిమచేతఁ గ్రాలుచు నుండన్ ॥ 1980

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఎనిమిదవ (1978)పద్య శేష భాగమునఁ గల (తేటగీతిలో) "ఊర్ణవతి, సీలమ" అను శబ్దములు "ఊర్ణావతి, సీలమి" అను రెండు నదులయి యుండవచ్చు నని గ్రిఫిత్‌గారి యభిప్రాయము. చాయను (సాయణాచార్యులు) వీ రెండును సింధువునకు విశేషణ శబ్దము లనిరి. సింధు నది "సీలమ" యను లతలతోఁ గూడియున్న దనియు, ఆ నదీ ప్రాంతమున రోమము చాల దొరకు ననియు నర్థము సూచించిరి "విలసన్" పండితులు. నే.వేం.న.శా.

## సూక్తము—75

ఋషి—ప్రియమేధ పుత్రుఁడు సింధుక్షిత్తు

దేవత—నదులు

### అర్థాంతము—1

(1)†శా॥ వే పారంగను సప్త సప్త త్రివిధాఽన్వీతమ్ముగా నాకస
మ్మీ పృథ్వుల్ దివి నిండి అప్ వితతి సంప్రీతిన్ మహా సృష్టిలో
నాపూర్ణమ్ముగ వ్యాప్తమౌ చలరి భూతాళిన్ బరిక్రాంతమై
యేపారన్ జల సింధు వౌను జగతిన్ నెంతేని( జక్రమ్ముగాన్ ॥ 1981

†(2) వరుణ ప్రభావాన( బ్రవహించు సింధు నది
భువి దివుల( బుట్టుచున్ బొనరు మేఘాఽఽవళుల
నంతరిక్షములోన నావిష్కృత మ్మోచు
నిమ్న గామిగ నిలిచి నిరతమ్ము( బ్రవహించు
నిత్య ద్రవ రూపమై నత్య జల దీపమై
ప్రత్యవాయము లేని మృత్యువుల మృత్యు వౌ ॥ 1982

†(3) అభ్ర రూపము( దాల్చి అబ్ధమ్ము గొల్పుచున్
దివినుండి భువి దా(క( దేజరిలు శక్తులను
రవి తేజ మలరార నవితథ వృషభ మై
సతత మనంతముగ జలధార లుప్పతిల(
బ్రకృతికే తృప్తిగా( బ్రాణి కోటికి( దృప్తి
నొన(గి తనియించులేః ఉష్ణోగ్రతలు శమయ ॥ 1983

†(4) మాత స్తన్యము నొన(గి మమతమై శిశువును
బెంచు రీతిగ( బ్రేమ పంచు రీతిగను
దేనువులు క్షీరాల దివ్యమ్ముగా నొన(గి
ఆర్ష శక్తుల నిచ్చి ఆలరించునట్లుగా
ఆ సింధు జలములే అజ్ఞానముల( బాపి
ఆయురారోగ్యాల సమ రొంద(గా( జేయు
నపురూప శక్తులన్ అవితథ మౌ రక్తి
నధినేతగా( దనర నాదృతి నలరించు ॥ 1984

†(5) సప్తాఽనలాల గతి సప్తాఽనిలాల రతి
నా జలము సప్త విధ మై తనర(గా( బొనరు
ఆ "గంగ" ఆ "యమున" అల్ల "సరస్వతి"
ఆ "శుతుద్రి" "పరుష్ణి" "అసుక్ని" "మరుద్వృధ"లు

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

"ఆర్జీకయ" నాఁగ నలరు నా సప్త నదు
లఖిల విశ్వము నిండు నా జలముతో మీఱు
ననలాఽనిలము పగిది నా నీర ముసు రొనఁగు
నారోగ్య మొసఁగులేః అమరత్వ మొసఁగులేః ॥ 1985

†(6)• తెలుపు నలుపులె కాక లలి నెరుపు పసుపులున్
ఆకుపచ్చయు ధూమ్రి మలరు తామ్రిము లొప్ప
నన్ని రంగులలోన నా నీర ముప్పతిలు
నాకాశమున నుండు నండాండ పిండాండ
బ్రిహ్మాండముల నిండి పరఁగులే సలిలాలు
అమృతమై తనరారు నఖిల ప్రాణుల నిలుపు ॥ 1986

†(7) రస సంవలితమై వశ శక్తి పూర్ణమై
వక్రి కాంతుల శుక్ల వర్ణాఽన్విత మ్మొచు
నఖిల లోకాలలో నతిసర్ప గతి ధృతుల
శైలజముగాఁ దనరి శైలాఽఽలవాలాలఁ
దరు జాతి పుంజాల నెరి లతా కుంజాల
సిరి ధామములయందు మరు భూములందునున్
సృష్టి సర్వస్వమున వ్యష్టి సమిష్టులుగ
జల బిందు వలరారు సలిలాఽర్ణవము తనరు ॥ 1987

†(8) రోదసీ రత మౌచు ఋజు శక్తి వరలంగ
రంగు రంగుల జలము బంగు బంగుల నురలు
నురలి నేలకుఁ దరలుఁ దరలి పిరిఁదికి మరలు
మరలి సంకుల మెనయ మబ్బులే అబ్రిమై
ఒక టొకటి కొట్టుకొని ఉట్టి పడి మిట్టి పడి
కకవికగఁ బట్టు విడఁ గార జల ధారలై
కాఱు మబ్బులు కూడ నీలు గారుచు నింగి
దిక్కు తోచక సర్వ తేజాలు విడనాడి
తెల్ల మొహములు వేసి తెల్ల తెలి మబ్బులై
వెల్లి వెలిగా చూది పింజములుగా పిడును ॥ 1988

---

†రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•ఇది "ఖిల" మంత్రానువాదము.

†(9) ప్రాగ్దిశల వృగ్దిశల( బ్రవహించు "సింధు" నది
సద్గుణ జాలాల సంతరించుచు నుందు
నానంద మామోద మంతర్గతము కాఁగ
శుభ కరమ్మై నిత్య శోభ దాయిని గాఁగ
రంగారు బంగారు నింగి తేరుల నిండి
విశ్వ కళ్యాణముల నశ్వరముగాఁ జేయు ॥ 1989

†(10) తేజాలె వాజులై దివ్య రథమై కాల
మవ్యయ పథ గతుల నంతర్గతి శక్తి
నఖిలాండములు నిండు సత్యదృత మ్మోను
అహిత రహిత మ్మోను విహిత మై సుహిత మై
ఆ మహా మహిత మై అప్ శక్తు లలరారు
సౌఖ్యాంశ నొసఁగులేః సద్బుద్ధు లొసఁగులేః ॥ 1990

## సూక్తము—75

ఋషి—ప్రియమేధపుత్రుఁడు సింధుక్షిత్తు

దేవత—నదులు

**అర్థాంతరము—2**

†(1) అమర మైన ఋక్ శక్తుల నమల మౌను జలము నింగి
•సూట నల్వదే డగు నా నూతనంపు శక్తు లుండి
విశ్వ సృష్టి జల సంచయ మశ్వమయమై వెల్గును
ఉత్తమ గుణ సదనమ్మై ఓజో గుణ మహిత మౌను ॥ 1991

†(2) ప్రతి గోళమున్ గూడ నతి వృష్టి మిత వృష్టి
అగు ననావృష్టులకు నాకరమ్మై తిరుగు
ఆ వరుణ శక్తు లవి ఆదిత్య దృగ్గతుల
నంతరిక్షము నిండి క్రాంతి జలముల నొసఁగు
జల నాభి సానువులఁ జలితమై విశ్వాన
వివిధ మౌ సలిలాలు వే విధాలుగఁ బారు ॥ 1992

†(3) ప్రకృతి మాతయె స్తన్య వన్యమ్ము లీయఁగా
ఆ మేఘ రాజు లవి అఖిల లోకాఽఽదులన్
వివిధ రుచులను మీఱు విమల జలములఁ గలిసి
వృషభ శక్తుల లేపి తృష తీర్చి విశ్వాన

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•సప్త సప్త త్రేధా=7×7=49×3=147

జ్ఞాన తుష్టుల నిచ్చు రాణించు స్వన రాజి
దివి భువుల తేజాలు దేదీప్యమానమై
సింధు బిందువులందుఁ జెలఁగి మిళిత మ్మౌను
భాను శక్తులు సృష్టి భవ్య భవ భోగాల ॥ 1993

†(4) సైన్యమున కధిపతిగఁ జద లంటు గ్రహరాజు
రిక్క లన్నిటి కాంతి రేఖలను గలుపు గతిఁ
దల్లి పొత్తిళ్లలోఁ దనరారు నిసుపు గతి
నాల పొదుగులలోన నలరారు పాలుగాఁ
బిల్ల నదు లన్నియును దల్లి నదిలోఁ గలియు
జలము జలమునఁ గలిసి జలధిలోపలఁ గలిసి
మంచి నీ రుప్పులై మలఁగి ఉప్పుల నీరె
ఆవిరిగ మబ్బులై ఔను మధు జల రాశి ॥ 1994

†(5) భంగు భంగుల "గంగ" రంగారఁగా నడుచుఁ
గలిసియున్ గలియకయె కదలాడులేః "యమున"
ఉరవళ్ళఁ బరవళ్ళ నురుకు లిడు "సరస్వతి"యె
అత్యధిక జలరాశి నమలమ్ముగాఁ బారు
అల్ల "శుతుద్రి"యె ఉల్లోల కల్లోల
శీఘ్ర గామినిగాఁగఁ జెలు వొందుచుండులేః
వంకరగఁ డింకరగ డొంక లన్నియుఁ జుట్టుఁ
బరమ పవిత్రమై వరలు "పరుష్ణ్య"యె
నశియింపకుండఁగాఁ గృశియించి పస మించి
నీల వర్ణ మ్మౌచు జాలువార "సక్న్య"యె
ఉల్లమ్ము చల్లగాఁ బిల్ల తెమ్మెర లలర
నా "మరుద్వృధ" నది అల్లనల్లనఁ గదలు
నఖిల జలములు కలిసి అతివేల మౌ నదిగ
సృష్టి జల శక్తులే స్రష్టకే నది యౌను ॥ 1995

†(6) ♦రంగు రంగుల జలము రంగారుచుండఁగాఁ
బంచ వన్నెల మించు పంచ భూతాఽఽవళులు
వన్నె వన్నెల మీఱు పున్నెంపు దివ మొదవు
నమృత శక్తులు వెలయ సమరత్వ మమరులేః
తను రూపమై నిలుచు ధన్యమౌ నతిబలము
అధికాధిక మ్మౌచు నంతటను వ్యాపించు ॥ 1996

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦ ఇది "ఖిల" మంత్రానువాదము.

(7)†మ॥ రవి తేజమ్ము వెలుంగ విశ్వమున విభ్రాజమ్ముగా దివ్యమై
సవితా నిత్య నదీ మతల్లు లవి విజ్ఞానాల సందీప్తులన్
జవ సత్వమ్ముల జ్ఞాన రూప ఖనులై సచ్చిద్విలాసమ్ములన్
రవళించున్ విలసన్ననంత మహదానందమ్ము చేకూర్చుచున్ ॥ 1997

†(8) వక్ర రాహిత్యమున సక్రమముగాఁ దిరుగు
విశ్వాన గోళాలు నశ్వమ్ములన్ మీఱఁ
చిత్ర వర్ణాలతోఁ జిత్ర విచిత్రముగ
నా రజో వరాగ మన్ని దిశలను సమరు
నుదయ సంధ్యలలోన నొనరు సాయం సంధ్య
లందు సింధువు బంధువై తనరు మధురముగ ॥ 1998

†(9) స్వర్నదీ సింధు నది స్వచ్ఛ గతులను జార
నకృతాలు వికృతాలు నతిదూరమై పోవ
సుకృతులున్ బ్రకృతులున్ సుమతియుతమై నిలువ
సుగతులే ప్రగతులై సుధగమ్ములై మీఱ
సంచరించెడి విశ్వ సర్వస్వ మరదమై
ప్రాగ్దిశగఁ బయనించి వరలు దశ దిశలందు ॥ 1999

†(10) అంతరిక్షమ్మందు నలరారు జల శక్తి
రవి తేజములఁ గలిసి రాజిల్లుచుండులే!
మహితమౌ మహిమలను మహిమాఽన్వితుండౌ
విశ్వ రూపుం డైన విశ్వేశ్వరేంద్రుండు
శ్రీ మహావిష్ణువే సృష్టి రథమును నడుపఁ
బంచ భూతము లెల్ల వరలుచుండునులే! ॥ 2000

## సూక్తమ్—76

ఋషిః—సర్ప ఐరావతో జరత్కర్ణః
దేవతా—గ్రావాణః
ఛందః—జగతీ

(1) ఆ వ [1]ఋంజస ఊర్జాం వ్యుష్టిష్విన్ద్రం మరుతో రోదసీ [2]అనక్తన ।
ఉభే యథా నో [3]అహనీ సచాభువా సదఃసదో వరివస్యాత [4]ఉద్భిదా ॥ 805

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఆవఽఋంజసఽఊర్జాం, 2. రోదసీఽఅనక్తన్, 3. యథానోఽఅహనీ, 4. స్యాతఽఉద్భిదా. (వ్రా.ప్ర.)

(2) తదు శ్రేష్ఠం సవనం సునోతనాఽత్యో న హస్తయతో [1]అద్రిః సోతరి ।
విదద్ధ్యర్యో [2]అభిభూతి పౌంస్యం మహో రాయే చిత్ తరుతే యదర్వతః ॥ 806

(3) తదిద్ధ్యస్య సవనం వివేరపో యథా పురా మనవే గాతుమశ్రేత్ ।
[3]గోఅర్ణసి త్వాష్ట్రే అశ్వనిర్ణిజి ప్రేమధ్వరేష్వధ్వరాగ్ం [4]అశిశ్రయుః ॥ 807

(4) అప హత రక్షసో భంగురావతః స్కభాయత నిరృతిం సేధతామతిమ్ ।
ఆ నో రయిం సర్వవీరం సునోతన దేవావ్యం భరత శ్లోకమద్రయః ॥ 808

(5) దివశ్చిదా వోఽమవత్తరేభ్యో విభ్వనా చిదాశ్వపస్తరేభ్యః ।
వాయోశ్చిదా సోమరభస్తరేభ్యో ఽగ్నేశ్చిదర్చ పితుకృత్తరేభ్యః ॥ 809

(6) భురన్తు నో యశసః సోత్వన్ధసో గ్రావాణో వాచా దివితా దివిత్మతా ।
నరో యత్ర దుహతే కామ్యం మధ్వాఘోషయన్తో [5]అభితో మిథస్తురః ॥ 810

(7) [6]సున్వన్తి సోమం రథిరాసో [7]అద్రయో నిరస్య రసం గవిషో దుహన్తి తే ।
దుహన్త్యూధరుపసేచనాయ కం నరో హవ్యా న మర్జయన్త [8]ఆసభిః ॥ 811

---

1. యతోఽఅద్రిః, 2. ర్యోఽఅభి, 3. గోఽఅర్ణసిత్వాష్ట్రేఽఅశ్వ, 4. ధ్వరాగ్ంఽఅశి, 5. యన్తోఽఅభితో, 6. సువంతి, 7. రథిరాసోఽఅద్రయో, 8. యన్తఽఆసభిః. (వ్రా.ప్ర.)

(8) ఏతే నరః స్వపసో [1]అభూతన య ఇన్ద్రాయ సునుథ సోమమద్రియః ।
వామంవామం వో దివ్యాయ ధామ్నే వసువసు వః పార్థివాయ సున్వతే ॥ 812

## సూక్తము—76

ఋషి—ఇరావతీపుత్రుఁడు జరత్కర్ణుఁడు†
దేవత—గ్రావలు (రుబ్బురోలు, పొత్రము)†

(1)*గీ॥ గ్రావలారా! మిమ్ముఁ బావనోషస్సుల
నే నలంకరింప నేర్వఁగలను
సోమమున మహేంద్రు సకల మరుత్తుల
రోదసులను గనుఁడు! సాదరముగ[1] ॥ 2001

గీ॥ రోదసులు యజ్ఞగృహమున మోద మలర
మాకుఁ బరిచర్యఁ జేయుచు మనుచునుండె
ధరణి యుద్భేదకం బైన ధనముతోడ
నంచితంబుగ మమ్ముఁ బూరించుఁగాక! ॥ 2002

(2)*గద్యము॥
ఓ గ్రావలారా! మీరు ప్రశస్య మైన సోమమును బైకిఁ దీయుఁడు! గ్రావ దృఢముగ హస్త గృహీతయై అశ్వమును బోలి బలము గలది. అభిషవ ప్రేరకుఁ డగు యజమానుఁడు శత్రువుల కభిభావుక మగు బలమును దేవతలవల్లఁ బొందుచున్నాఁడు ॥ 2003

(3)*గద్యము॥
ఎట్లు మను రాజునకు గమనము వచ్చెనో! (కలుఁగునో!)యట్టి ఈ గ్రావకు నభిషవోపేత మగు నస్మదీయ సోమ యాగాఖ్య కర్మ వ్యాపించుఁగాక! ఆ రీతినే అపహృతాఽశ్వములతోఁ గూడుకొనిన త్వష్టృపుత్రుఁడు హంతవ్యుఁడు కాఁగా అసురాహింస్యములు నధ్వర సాధకములు నగు నుపలములను యజమాను లాశ్రయించుచున్నారు ॥ 2004

---

1. పసోఽఅభూతన యఽఇన్ద్రాయ. (వ్రా.ప్ర.).

† వ్రాతప్రతి 13వ సంపుటములో (161పుట) నీ సూక్తమునకు ఋషి"ఇరావతీ పుత్రుడు జరత్కర్ణుడు"గాను దేవత "గ్రావలు"గాను వ్రాసి, 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "జరత్కర్ణుడు" ఋషిగాను "రుబ్బురోలు, పొత్రము" దేవతగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. "రోదసులను గనుఁడు ప్రీతి". (ఈ సవరించిన పాఠములో గణయతి భంగములు. పై పాఠము తొలిపాఠము.)

(4,5)*సీ॥ అధ్రిలారా! మీర లతిభంజకం బగు కర్మచే రాక్షస గణముఁ గొట్టి
పాప దేవత యజ్ఞ పరమ కర్మను జేరకుండెడు నట్టులు యుక్తిఁ బన్ని
సకల రాక్షసుల హింసామతిన్ శ్రద్ధతోఁ గరము నిషేధించి గ్రావలుచుండి
బహుపుత్రయుతమైన [1]పరమ ధనం బిచ్చి యమర సుశ్లోకము నధిగమింపుఁ
గీ॥ డింక నధ్వర్యువర్యు లహీన కాంతి, వెలుఁగు నాదిత్యుకన్నను బలము గలుఁగు
మీ నిమిత్తము భక్తి నమేయ మైన, సన్నుతిని జేసి నారలు శక్తి కొలఁడి ॥ 2005

*గీ॥ విష్వకం పె నధిక విమలతచే నొప్పి
వాయుమూర్తి కం టెఁ బరమ వేగ
మునఁ జెలంగి పావకునికన్న నన్నంబు
గల్గు శిలల మీరు కనుఁడు! భక్తి ॥ 2006

(6)*గీ॥ కరము కీర్తి వెలుఁగు గ్రావలు! సోమ ర
సము భరించుఁగాక! సముచిత మగు
స్తోత్ర వాక్కువలన శుభ దీప్తి మత్తత
నుంతురుగాక! మమ్ము నొనర మీరు ॥ 2007

*క॥ త్వరమానములై శబ్దము
నిరుపమ మౌనట్టు సేసి నిశ్చయముగ నా
పరమ గ్రావలు మధువును
నురుతరముగ నితురుగాక! నున్నత శీవిన్ ॥ 2008

(7)*గద్యము॥
రంహణవంతము లగు గ్రావలు సోమ రసమును నిశ్శేషముగఁ దీయుచున్నవి. స్తుతి
వాక్కులను గోరుచు సోమ సంబంధి యగు సధోరసమును నగ్నిపైఁ జల్లుటకు
సిద్ధము చేయుచున్న వి. అభిషవ కర్త లగు ఋత్విజులు హవ్యములను
నగ్న్యుపసేచనానంతరము స్వాన్యములచే శుద్ధిఁ జేయుచున్నారు ॥ 2009

(8)*క॥ నరులార! గ్రావలారా!
కర మభిషవ కర్మ మీరు కావింపుఁడు! సో
మ రసంబు నిందునకునై
బిరబిర సిద్ధముగఁ జేసి పేరును గనుఁడీ! ॥ 2010

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. వరధనంబు నొసంగి,(తా.పా.)

*క॥ వననీయ మగుచు నుండిన
ధనమును దేజస్సుకొఱకు ధరియింపుఁడు! స
జ్జన దాన యోగ్య మగు నా
ధనమును బురుషునకు నిండు! తత్పరమతులై ॥ 2011

## సూక్తము—76

ఋషి—ఇరావతీపుత్రుఁడు జరత్కర్ణుఁడు
దేవత—గ్రావలు (రవి చంద్రులు, రజత మేరు గిరులు)

### అర్థాంతరము—1

†(1) ఆ సామ గానాల నమల మేఘాఽఽవళులు
అపురూప శృంగాల నద్రులై రూపొంద
నింద్రుఁ డైనను నృత్య మింపుగా నొనరించు
నల్ల నల్లన వీచు పిల్ల తెమ్మెరలతో
ఆ మేఘముల జలము లమృతమై వర్షించు
హర్ష పులకాఽంకురా లఖిల సృష్టికిఁ గలుగ ॥ 2012

†(2) సవనాగ్ని ధూమాల సన్మంత్ర శక్తులను
రంజిల్లి మేఘాళి రాణ వర్షము నీయఁ
బర్వతమ్ములనుండి ప్రవహించు సలిలములు
ఆపాత మధురమై యమృత వల్లులఁ గూడి
నదులు నదములు నిండి నక్షత్ర పుంజాల
రవి శశి గ్రహ రాజి రమ్య తేజాల్ పడి
అద్భుత గుణ మిచ్చు నఖిల రుజలను బాపు
నఖిల చరాఽచరాల ప్రాణాల నిలుపులే! ॥ 2013

†(3) మనురాజ కృతమైన మహిత సవనమ్ముగాఁ
గాల శక్తులఁ గలిసి గ్రహ ఋక్ష గతు లొలసి
రజత సువర్ణాల రమ్యాద్రి దీధితులు
అంతరిక్షములోనె ఆ వర్ష సలిలాల
నైక్యమై వసుతతికి నవనీతలాపులకుఁ
బ్రాణితతు లన్నిటికిఁ బ్రాణ ప్రదా లౌను ॥ 2014

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఆ సూర్య శక్తులే అఖిల రాక్షస తతుల
సంహార మొనరించి సౌభాగ్యముల నిలుపు
యజ్ఞాఽగ్ని ధూమాల నా వేద మంత్రాల
శబ్ద శక్తుల దివ్య కాంతి శుభముల రూపు
మాపంగ యత్నించు పాపాత్ములను సదా
తున్మాడు దేవుండు సన్మనో గతి మీఱ ॥ 2015

†(5) విద్రూపమై తనరి శ్రీ లొలుకు దివు లెల్ల
నత్యంత విభవాల నాదిత్య విష్ణు దయఁ
దిమిరాలఁ బోఁద్రోలి దేదీప్యమానతల్
తేజరిలు జగతిలోఁ దివిరి దుశ్శక్తులన్
విధ్వస్త మొనరించి విశ్వ శాంతిని గూర్చి
సకల సౌభాగ్యాల నంతరించెడి మహా
సద్యజ్ఞ సంభార కాంతి మంత్రాఽఽవళుల
సత్ఫలితమ్ములే సకల మనుభూతమౌః ॥ 2016

† విశ్వ సృష్టిని వెలయు విష్ణులాగ్ని గోళాలు
ననల గిరి తతులును ననిలాఽన్వితా లగుచు
అద్భుతముగా వెలుఁగు నమరు నదసత్తులకు
నఖిలమున్ గాపాడు నన్నింటి భక్షించు
నగ్న్యనుగ్రహమునన్ అగ్ని నడుమునఁ బెట్టు
యజ్ఞ గుడాఽర్చనల నగ్న్యాదిర్ నలరించు ॥ 2017

†(6) రవి పవి వాక్కులన్ రాజించు గగనమ్ము
శబ్ద నిశ్శబ్ద తతి శక్తులన్ నద్వాయు
భవ్య తరంగాలు వ్యాపించి మీఱంగ
లోక సౌఖ్యాఽఽవళులు ప్రకటములై వెలయ ॥ 2018

† దివ్యత్వ మొనఁగూడు దివ్యాత్మగా వెలిఁగి
రజత సుమేరు గిరు లజర మై యమర మై
భవ్యదేవాఽఽవళుల పరమ దేవాఽఽవళుల
దివ్య వాహ్యాళికి నవ్య వాన మ్మౌచు
అఖిల కామము లొసఁగి అమృత జలముల నొసఁగి
హాయి సమకూర్చులేః అంతరిక్షములోన ॥ 2019

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7)†క॥ చంద్రాఽమృత సోమమ్మును
సాంద్రముగఁ బరిగ్రహించి జ్వలియించు మహా
చండ్రిచ్చద రవి తతులె ఆ
తంద్రముగా విశ్వ సృష్టిఁ దనరుఁ గ్రమ గతిన్ ॥ 2020

†క॥ రవి తేజము ప్రసరింపఁగఁ
బ్రవిమల శశి కాంతి జాల చంద్రిక లలరున్
అవతార సూర్య తేజ
మ్మ విభక్తము శీతలమున కని తెలుపంగన్ ॥ 2021

(8)†క॥ అమృత జలమ్మై సోమము
కమనీయమ్మై సుమధుర కాంతి ప్రద మై
శమ దమ శక్తుల నొసఁగును
నమితాఽమృత సిద్ధి మంత్ర మమర సుసిద్ధిన్ ॥ 2022

†క॥ సూర్యుని బోషించెడి ఆ
ఆర్యేంద్ర సుసోమ శక్తి నారాధింపన్
నాఽఽర్య[1] కుశక్తులు తొలఁగును
హర్యగ్నుల అమృత శక్తు లలరున్ సుగతిన్ ॥ 2023

## సూక్తము—76

ఋషి—ఇరావతీపుత్రుఁడు జరత్కర్ణుఁడు
దేవత—గ్రావలు (రవి చంద్రులు, రజత మేరు గిరులు)

## అర్థాంతరము—2

†(1) ప్రాణ ప్రదాతవై క్రాలు కాంతుల నొసఁగి
భువి దివి లోకాల పూర్ణ జ్ఞానము నిచ్చి
పగలు రాత్రులు గూడఁ బరఁగు మా జన్నాల
హవిరన్నము గ్రహించి ఆదరించెడి యింద్ర!
రోదసిన్ మరుదాళి లేప మొయిళుల నడిపి
సపసద్ జ్ఞానాల సద్వర్షముల నిమ్ము! ॥ 2024

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. నాఽఽర్య=అద్వైతీయ.

†(2) విశ్వ సృష్టిని నిత్య మశ్వరమ్మౌ సహజ
రవ్యుదయ యజ్ఞాల రంజిల్లు చైతన్య
చిత్త శక్తులు సర్వ శ్రేయాల విలసిల్లు
నానంద కందళిత మహా దీప్త సంపదలు
ఋత దీపమై సత్య పిత రూపమై నిత్య
జిత మహా శాత్రవ తతుల సంస్తుత్య మహా ॥ 2025

(3)† జల యజ్ఞముల ఘన ఫల యజ్ఞములు మీఱ
సర్వానీ దేవతల నా దేవ వైద్యులన్
ఆరాధనము చేసి ఆయురారోగ్యాల
భవ్య భవ భోగాల భాగ్యాల నందఁగా
బ్రేమాఽధ్వరమ్ములను బ్రియ మారఁగాఁ జలిపి
పంచ భూతాఽఽవళుల నంచితముగా మించు
ఆ మనశ్శక్తులను నతిలోకముగఁ బెంచి
ఆమూల చూడముగ నఖిల భువనాల్ తిరుగు ॥ 2026

†(4) దివ్య దేవాఽఽవళుల భవ్యాఽర్చనలు చేసి
గగన రతుం డౌచుఁ గ్రాలు గ్రహ ఋక్షముల
గతి శక్తు లెరుఁగుచున్ ఋతు పవన నిర్ఋతిని
జల సంపదల మ్రింగు ఛల రక్షసులఁ దునిమి
సిరి సంపదలు మీఱఁ బరఁగ సౌఖ్యాఽఽవళులు
అజ్ఞానములఁ బాపి విజ్ఞాన ప్రజ్ఞాన
సుజ్ఞాన పుంజాల సూరులకు సూరులై
వీరులకు వీరులై ధీరులై వెలుఁగ నగు ॥ 2027

†(5) గాఢాంధకారాల మూఢాంధకారాలఁ
జెండాడి ఛేదించి చెలఁగు చిద్దీధితుల
దివమె దివ్యమ్మైన నవ నవ్య నిత్యమై
సచ్చిదానంద మౌ సత్య మౌ పదముగా
నెఱఁగి ఆరాధించి యిందు సోమ మ్మగ్ని
రవి శక్తులను బ్రిభన్ రగిలించి మించు గతి
నమృత శక్తులఁ బొంది అతిరక్తి ఘృణి నొంది
అనిలాఽనల సలిల మందు మృద్గగనాల ॥ 2028

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అజ్ఞాన తిమిరాంధతాఽంబుధిని దాఁటంగ
భువి దివుల రవి కాఁగ రవులకే రవి కాఁగ
వెలుఁగు వెలుఁగుల వెలుఁగు విష్ణు పరమౌ వెలుఁగు
ఆదిత్య తేజమ్మొ అమర మౌ సేతు వగు
నన్యోఽన్య బంధాల నా పరమ పద గతుల
నఖిల కామ్యమ్ములకు నదె మార్గదర్శి యగు ॥ 2029

†(7) ఆ శశి పూర్ణ మౌ నమృత రస శక్తులన్
ఆ సూర్య గోళాలె ఆవిష్కృతిని జేయు
నమృత కిరణాఽఽవళుల నగ్ని కిరణాఽఽవళుల
నుద్భవిల్లఁగఁ జేయు నుల్లముల్ రంజిల్ల
వ్రేల్చు ఖర కర కరాలఁ బీల్చు నా అమృతమును
బీల్చి మరి మరి మంచుఁ బెంచు నమృత శక్తి
నావికర్షణ శక్తు లాకర్షణ ప్రశక్తు
లమృతములై పరఁగు నంతరిక్షములోన ॥ 2030

†(8) రజత గిరి మేరు గిరి రాజించు సోమాల
నింప్రి జవ జీవాలె యినుమడించుచు నింగి
**వసు** శక్తు లన్నియున్ మిసమిసలఁ బెంపొందు
మాటిమాటికి దైవ మహిమలే మహిత మౌ
దివి భువుల గోళాల తేజాలు జ్వలిత మౌఁ
బ్రభు శక్తు లన్నియున్ విభవ మై వెల్గొందు ॥ 2031

## సూక్తమ్—77

ఋషిః—స్యూమరశ్మిర్భార్గవః
దేవతా—మరుతః
ఛందః—త్రిష్టుప్; 5-జగతీ

(1) అభ్రప్రుషో న వాచా ప్రుషా వసు హవిష్మన్తో న యజ్ఞా విజానుషః ।
సుమారుతం న బ్రహ్మాణమర్హసే గణమస్తోష్యేషాం న శోభసే ॥ 813

(2) శ్రియే మర్యాసో [1]అంజీగ్ంరకృణ్వత సుమారుతం న పూర్వీరతి క్షపః ।
దివస్పుత్రాస[2] ఏతా న యేతిర ఆదిత్యాసస్తే అక్రా న వావృధుః ॥ 814

---

1. మర్యాసోఽఅంజీగ్ఽరకృణ్వ, 2. పుత్రాసఽఏతా న యేతిరఽఆదిత్యాసస్తేఽఅక్రా. (పా.ప.)

(3) ప్ర యే దివః పృథివ్యా న బర్హణా త్మనా రిరిచ్రే[1] అభ్రాన్న సూర్యః ।
పాజస్వన్తో న వీరాః పనస్యవో రిశాదసో న మర్యా [2]అభిద్యవః ॥ 815

(4) యుష్మాకం బుధ్నే [3]అపాం న యామని విథుర్యతి న మహీ శ్రథర్యతి ।
విశ్వప్సుర్యజ్ఞో [4]అర్వాగయం సు వః ప్రయస్వన్తో న సత్రాచ[5] ఆ గత ॥ 816

(5) యూయం ధూర్షు ప్రయుజో న రశ్మిభిర్జ్యోతిష్మన్తో న భాసా వ్యుష్టిషు ।
శ్యేనాసో న స్వయశసో రిశాదసః ప్రవాసో న ప్రసితాసః పరిప్రుషః ॥ 817

(6) ప్ర యద్వహధ్వే మరుతః పరాకాద్ యూయం మహః సంవరణస్య వస్వః ।
[6]విదానాసో వసవో రాధ్యస్యాఽఽరాచ్చిద్ ద్వేషః సనుతర్యుయోత ॥ 818

(7) య[7] ఉదృచి యజ్ఞే అధ్వరేష్ఠా మరుద్భ్యో న మానుషో దదాశత్ ।
రేవత్ స వయో దధతే సువీరం స దేవానామపి గోపీథే[8] అస్తు ॥ 819

(8) తే హి యజ్ఞేషు యజ్ఞియాస[9] ఊమా ఆదిత్యేన నామ్నా శంభవిష్ఠాః ।
తే నోఽవన్తు రథతూర్మనీషాం మహశ్చ యామన్నధ్వరే చకానాః ॥ 820

---

1. రిరిచ్రేఽభ్రాన్న, 2. మర్యాఽఅభిద్యవః, 3. బుధ్నేఽఅపాం, 4. యజ్ఞోఽఅర్వా, 5. సత్రాచఽఆ గత,
6. విద్వానాసో. 7. యఽఉదృచియజ్ఞేఽఅధ్వరే, 8. గోపీథేఽఅస్తు, 9. యాసఽఊమాఽఅదిత్యే. (వా.ప్ర.)

## సూక్తము—77

ఋషి—భార్గవుఁడైన స్యూమ రశ్మి†

దేవత—మరుత్తులు†

(1)*గీ॥ అభ్ర నిస్సృత జలంబుల ననుసరించి
యా మరుత్పంక్తికిన్ ధన మందఁజేయు
హవ్య యుక్ యాగముల వలె నా మరుత్తు
లఖిలమును బుట్టఁజేయుచు నమరుచుండ్రి ॥ 2032

*గీ॥ శోభన మరుత్తులను నేను స్తుతులవలనఁ
దొల్లి స్తుతియింపలేదుగా యుల్ల మలరఁ
గాన నూతన మౌ స్తోత్రకలనవలన
సన్నుతించుచునున్నాఁడ సకల శక్తి ॥ 2033

(2)*గద్యము॥
స్వశరీర శోభనార్థము మనుష్యరూపు లగు మరుత్తులు మనుష్యు లగుచు సుకృతివిశేషమువలన నమరు లైరి. శోభించెడు మరుత్తుల గణమును బహు ఋవయిత్రులు పరిభవింపలేవు. వారిని మేము స్తుతియింపలేదుగాన ద్యుదేవతయొక్క పుత్రులు వెడలుచున్నారు. అదితిపుత్రులు నాక్రమణ శీలురు నగు మరుత్తులు వృద్ధిఁ బొందకుండనున్నారు ॥ 2034

(3)*గద్యము॥
స్వశరీరమూలమున నభ్రముమండి సూర్యుఁడు వలె మరుత్తులు దివమునుండి పృథ్వినుండి గొప్పది యగు నాత్మవలన నతిరిక్తు లయిరి. వీరుల వలె స్తుతికాము లగుచున్నారు. మనుష్యులను బోలి యభిగత దీప్తు లగుచున్నారు ॥ 2035

(4)*గీ॥ మీ సుసంర్గమువల్లను మెచ్చఁదగిన
యంబు గమనంబు రీతి మీ యఖిల పంక్తి
పాటువల్ల మరుత్తులు! భవ్య భూమి
శీర్ణితం బొందకుండఁ దాఁ జెలఁగుచుండు ॥ 2036

---

† వ్రతప్రతి 13వ సంపుటము 165వ పుటలో నీ సూక్తమునకు ఋషి "స్యూమ రశ్మి"గాను-దేవత "మరుత్తు" (ఏకవచనము) గాను వ్రాసి, 16b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "స్యూమ రశ్మి" ఋషిగాను "మరుత్తులు" (బహువచనము) దేవతగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ విశ్వ రూప వృథ్వి విమలేష్టి సాధనం
బైన హవ్యకలన నధిగమించు
నన్న పంతుల వలె నతిసుఖ దాతలై
సంఘములుగ[1] మీరు సాగి రండుః ॥ 2037

(5)*సీ॥ తేజస్వులైన యాదిత్యాదులం బోలి బా సమంచితులయి పరగుఁ డీరుః
శ్యేనములం బోలి శ్రీకరోషస్సుల లలిత భావంబుతో వెలుఁగుఁ డీర
లట్టివానినిఁ బోలి యతిశయ విశదులై స్వాయత్త కీర్తుల సాగుఁ డీరు ః
యానయోక్త్ర సుబద్ధ హయములఁ బోలుచు గంతలై యంతటఁ గదలుఁ డీరు ః
గీ॥ కరము పథికులఁ బోలుచుఁ గడుఁ బ్రసిద్ధ
యానములఁ గల్గుచున్ బ్రథమాను లైన
యో మరుత్సంఘములుః మీర లోలి సర్వ
దేశములఁ దిరుగవలయు[2] దీక్షఁ బూని ॥ 2038

(6)*గీ॥ దూరముననుండి మమ్ముల౦ జేరవచ్చు
నపుడె వరణీయ ధనము మా కందఁజేయు
మీర లంతర్హితుల శత్రు వీరవరులఁ
బారఁ దోలుఁడుః దూరము పంత మలర ॥ 2039

(7)*చ॥ సవనము పూర్ణమై వెలుఁగ సర్వ మరుత్తులకున్ వలెన్ మహో
త్సవమున సస్య పూరుషుల కిన్న మొసంగెడు యజ్ఞకర్త తా
భువనమునందు భవ్యతర పుత్రుల నిన్నముఁ గాంచు నింక వా
సవ ముఖ రాజితో[3] మధు రసంబును ద్రావుసుగాకఁ బ్రీతితోన్ ॥ 2040

(8)*ఉ॥ యాగములందుఁ బూజ్యు లగునట్టి మరుత్తులు సంతసంబుతో
సాగుచు[4] సీటివల్లను వెసన్ సుఖ మిచ్చు జనాళి నిష్టికిన్
వేగము పోవఁజేసెడు వివేకులు నై వెలుఁగొంచుచుండి మా
యీ గురు సన్నుత స్తుతి మహిన్ వినుచుందురుగాత నెల్లెడన్ ॥ 2041

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. రండుః సరసులారః, (తా.పా.), 2. దిరుగవలెనుడీః దీక్షఁబూని, (తా.పా.), 3. సురసంబును ద్రావునుగాక
వాఁడొగిన్ (తా.పా.), 4. వాఁవల్లను వెసన్ సుఖ మిచ్చెడు వార లిష్టికిన్. (తా.పా.)

## సూక్తము—77

ఋషి—భార్గవుఁడైన స్యూమ రశ్మి

దేవత—మరుత్తులు

### అర్థాంతరము—1

†(1) శబ్ద శక్తులును నిశ్శబ్ద శక్తులు లేక
యజ్ఞ యాగాఽఽవళుల హవిరాదులును లేక
అత్యంత సహజమై ఆ దేవు మహిమమై
అల్ల మరీచి నామాఽనిలముల్ వీవఁగా
వసు శక్తు లొనరంగ వర్ష ధారలు కురియ
నర సుర గణాదులకు నవ విధ బ్రహ్మలకుఁ
బంచ భూతాత్మ ప్రపంచ సర్వమ్మునకు
విశ్వ సృష్టికి శక్తి విమలమై పెంపొందు ॥ 2042

†(2) ఆదిభూతము గాని ఆ అనిల సమృద్ధి
ఆ దేవదేవు కృప సమర మరీచిగా
విష్ణు వాదిత్యుని విపుల శక్తిని సృష్టి
వ్యాపించు సచ్ఛక్తి ప్రాణి రూప మ్మొదుఁ
చరముల నచరాల సంచరించుచు సర్వ
మావరించుచుఁ బరిత్యజియించుచున్ దిరుగు ॥ 2043

(3)†క॥ భువి దివ్యాఽఽటులలోనన్
పవన తతులు సంచరించుఁ బ్రత్నన శక్తిన్
రవి శశి జల గగన వరత
సవితథ తాదాత్మ్యతమెయి నంది గుణములన్ ॥ 2044

(4)†క॥ అమలాఽనిల సంగమమున
విమలము లౌ మొయిళు లెల్ల విశ్వ వ్యాప్తిన్
అమృతములౌ మధుర జలము
లమితముగా గొనఁగుచుండు సమరాంచితమై ॥ 2045

† బుద్ధీంద్రియమ్మునన్ బూర్ణ దీధితులతో
నజ్ఞాన తమోమాల నంతరింపఁగఁ జేయు
జల గతమ్మై తనరు నస్మరుచ్ఛక్తులే
బాహ్యాఽంతరమ్ములన్ బ్రహ్మత్వమ్ముగా నిలుచుఁ
బరమ హంసగ వెలుఁగుఁ బ్రాణ హంసగఁ దిరుగు
విశ్వ జల యజ్ఞాన సర్వ శక్తుల మలకు ॥ 2046

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్మమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) వెలుఁగులన్ వెలుఁగుఁగా సలిలాల సలిలముగ
మృత్తులన్ మృత్తుగా మిన్నులన్ మిన్నుగా
రూప విరూపాల [1]సృష్టి నరూపాల
దశ దిశల విహరించు దశ దశల సుమరుత్తు ॥ 2047

†(6) అందరును ద్వేషింప నావహ మై మహా
మారుత మె పోరుగా హోరుగాఁ జెలరేగు
నానా విధాలుగా నూను భీభత్సాలు
సిరి సంపదల బ్రతుకు చెల్లాచెదరు కాఁగ-
మరు వసంతమ్ములా మలయాఽనిలమ్ములన్
అందరున్ హర్షాలఁ గొంపలములన్ మరచి
మై మరువఁ బ్రాణి తతి మహిత మహోత్సవ
సంవరణ సంగతిన్ సర్వమ్ము పులకించు ॥ 2048

†(7) సద్యజ్ఞ తతులలో సన్మరుత్తులు మీఱ
నుత్కృష్ట మౌ నగ్ని ఉద్భూత మౌచుంతు
మానవత్వము మీఱి మహిత దేవత్వమును
దేవాధిపత్యమును దేవదేవత్వమును
గోపినాథుఁడు కాఁగ గోపాలకుఁడు కాఁగ
విష్ణు మరీచిగా విశ్వమ్మునే [illegible] ॥ 2049

†(8) అర్ధనారీశుఁడై అదిత్యు విష్ణువై
యజ్ఞమ్ములందు నా యజ్ఞ యజ్ఞాలలో
మహిత మనీషులకు మహామహమై నిల్చి
అంధతను దొలఁగించు నధ్వర చరితాల
నా మరీచియె వెల్గు నతిలోక శక్తులన్
ఆయురారోగ్యాల నఖిల శుభముల నొసఁగు ॥ 2050

## సూక్తము—77

ఋషి—భార్గవుఁడైన స్యూమ రశ్మి
దేవత—మరుత్తులు
**అర్థాంతరము—2**

†(1) మేఘజాలమునుండి మించి కురిసెడి వాన
పుడమిపై బ్రతుకులను బొసరు సస్యాఽఽవళులఁ
బెంపొందఁ జేయు గతి విమల వాక్ఛక్తులన్
జనిత మౌ వాయువుల్ ధన సంపదల నొసఁగు

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. "రూ-ఋ"లకు యతి. (చూ. పీఠిక.)

ఘన శుభ సుఖాళి వరములఁ గలిగించు నారోగ్య
మా మంత్ర యజ్ఞాల నష్ట వసు సంపదల
నభివృద్ధి చేయ నగు నా బ్రహ్మ శక్తులన్
మరుద్ మరీచులన్ మహిత దివ్యత్వ మౌ ॥ 2051

†(2) అసమాన మారుత మ్మల్ల మరీచితో
విశ్వ కళ్యాణములు వెలయింపఁగా నౌను
అఖిల దుర్వాయువుల నంత మొందింప నౌ
లోక భీకర శత్రు మూకాళులను నెల్ల
నిర్జింపఁగా నౌను నిండు సచ్ఛక్తితో
దివ్య ప్రకృతి మాత తేజోమయ మ్మైన
ప్రతిరూపు నాదిత్యు పూర్ణ దయ మీఱఁగా
దుష్టాళి విశ్వానఁ దుడిచి పెట్టుకుఁ బోవు ॥ 2052

†(3) భువులవల్లనుగాని దివులవల్లనుగాని
మరుదాళు లెన్నడున్ మహితత్వ మొందవు
రవి కిరణ జాలాల భువి దివుల సలిలాలు
జలదమ్ము లౌ గతిగ సన్మరీచుల శక్తి
జలదముల్ వర్షించు జ్వలియించు ననలముల్
అగ్ని గోళా లెల్ల నద్భుత జ్వాలలన్
గీలులన్ వెలుఁగులన్ గెరలించు మరలించు
విశ్వ వ్యాప్త మ్మౌచు విహరించు స్వేచ్ఛగా ॥ 2053

†(4) విశ్వాన విలసిల్లు విమల మౌ మరుదాళి
ఒక టొకటి ఒరుసుకొని సద్భూత మౌ నగ్ని
పవనాల సవనాల హవిషాలు దివిజాళి
నలవోకగాఁ జేరు నెలవాఁకగా మీఱఁ
జవనాల సలిలాలు అల లౌను నుడు లౌను
గలగలా ప్రవహించు జలజలా ప్రవహించు
నొరవడుల నురవడుల నురుకు లిడు సుప్రొంగు
దుర్గంధ జాలాల దూరముగఁ బోఁజేసి
మృత్సుగంధమ్ములను మూర్కొనఁగ హాయిగా
వహియించు రహి మించు విహరింపఁగాఁ జేయు
జగలు పొగలును లేని వగలు సెగలును లేని
గగనాన గగనమై అగణిత జగ మౌచు
నా మరీచ్యనలమ్మె అమేయ మౌ శక్తి
నలరారుచుండులే! ఆ విష్ణు పర మౌచు ॥ 2054

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) ఆ వైష్ణవాదిత్యు నసమాన తేజాల
కాంతి వేగమ్ముతోఁ గరువలి పయనించు
నా సన్‌మరీచి మహా శక్తులు మీఱ
సృష్టి దుశ్శక్తులను జెండాడుఁ దున్మాడు
సకల లోకాలలో సదమలోషస్సులను
సంచరించును మహా శాంతి సంధాతగా ॥ 2055

†(6) ద్యో పృథ్వులను దాఁటి దూర తీరాలలో
విహరించు సంవరణ సహితాఽనిలమ్ములే
అంతరిక్షమునుండి అపురూప శక్తితో
మహితమై పుడమిపై మలయాలపై మలఁగు
జలద మాలల శక్తి వంచించు దుశ్శక్తిఁ
దునుమాడి ప్రకృతిని సునుత రక్తులు మీఱ
వర్షాల తర్షాల హర్షాల నొసఁగుచున్
బోషక పదార్థాలఁ బూర్ణ వృద్ధిని జేయు ॥ 2056

†(7) యజ్ఞాగ్ని తతులలో నాజ్యాహులన్ బోయ
నావహమ్మై యనిల మతిలోక వివహమై
వేద మంత్రాక్షరాల్ మూదలించెడి శక్తి
నంతరిక్షముఁ జేరు నమల శుభముల నొసఁగు
నష్ట వసు శక్తులకు నఖిల లోకాఽఽవళికి
నింతింత లనరాని యెస లేని గతులతో
నర కిన్నరాదులకు సుర సంఘముల కెల్ల
సంతోష మొనఁగూర్చు సౌభాగ్యముల నొసఁగు ॥ 2057

†(8) వైష్ణవాదిత్య సత్‌ప్రాభవ మ్మొప్పంగఁ
గాంతి పుంజాలతోఁ గ్రాంతి వింజామరాల్
వీవంగ విశ్వాన విమలాఽఽనిలాల్ సదా
సృష్టి సంస్థితి గతులు వ్యష్టి సమిష్టులను
శంకరములై నిలుచు శశ్వత్ సుఖా లొసఁగు
విశ్వ సంసృష్టిలో అశ్వర శక్తులన్
గతి రతుల మతి ధృతుల నతిలోక కృతు లొలయ
మహితమౌ విభవాల విహితములుగాఁ జేయు ॥ 2058

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—78

ఋషిః—స్యూమరశ్మిర్భార్గవః
దేవతా—మరుతః
ఛందః—త్రిష్టుప్:2,5-7-జగతీ.

(1) విప్రాసో న మన్మభిః స్వాధ్యో దేవావ్యోః న యజ్ఞైః స్వప్నసః ।
రాజానో న చిత్రాః సుసందృశః క్షితీనాం న మర్యా [1]అరేపసః ॥ 821

(2) అగ్నిర్న యే భ్రాజసా రుక్మవక్షసో వాతాసో న స్వయుజః సద్య[2]ఊతయః ।
ప్రజ్ఞాతారో న జ్యేష్ఠాః సునీతయః సుశర్మాణో న సోమా[3]ఋతం యతే ॥ 822

(3) వాతాసో న యే ధునయో జిగత్నవో ఽగ్నీనాం న జిహ్వా విరోకిణః[4] ।
వర్మణ్వన్తో న యోధాః శిమీవన్తః పితౄణాం న శంసాః సురాతయః ॥ 823

(4) రథానాం న యేఽరాః సనాభయో జిగీవాంసో న శూరా [5]అభిద్యవః ।
వరేయవో న మర్యా ఘృతప్రుషో ఽభిస్వర్తారో [6]అర్కం న సుష్టుభః ॥ 824

(5) అశ్వాసో న యే జ్యేష్ఠాస [7]ఆశవో దిధిషవో న రథ్యః సుదానవః ।
ఆపో న నిమ్నైరుదభిర్జిగత్నవో విశ్వరూపా [8]అంగిరసో న సామభిః ॥ 825

---

1. మర్యాఽఅరేపసః, 2. సద్యఽఊతయః, 3. సోమాఽఋతం, 4. విరోకిణపి, 5. శూరాఽఅభి,
6. స్వర్తారోఽఅర్కం, 7. జ్యేష్ఠాసఽఆశవో, 8. రూపాఽఅంగిరసో. (వా.ప్ర.)

(6) గ్రావాణో న సూరయః సిన్ధుమాతర¹ ఆదర్దిరాసో అద్రయో న విశ్వహా ।
శిశూలా న క్రీళయః సుమాతరో మహాగ్రామో న యామన్నుత త్విషా ॥ 826

(7) ఉషసాం న కేతవోఽధ్వరశ్రియః శుభంయవో నాంజిభిర్వ్యశ్విత్తన్ ।
సిన్ధవో న యయియో భ్రాజదృష్టయః పరావతో న యోజనాని మమిరే ॥ 827

(8) సుభాగాన్నో దేవాః కృణుతా సురత్నానస్మాన్ త్స్తోతౄన్ మరుతో వావృధానాః ।
అధి స్తోత్రస్య సఖ్యస్య గాత సనాద్ధి వో రత్నధేయాని సన్తి ॥ 828

## సూక్తము—78

ఋషి—భార్గవుఁడైన స్యూమ రశ్మి†
దేవత—మరుత్తులు†

(1,2)*సీ॥ బ్రాహ్మణులం బోలి ప్రస్తుతి సుందర ధ్యానులై యంతట నరుగువారు
సవనములన్ దేవ సంఘంబుఁ దనిపెడు యజమానులం బోలి యమరువారు
శ్రీల నమ్మూర్ధాభిషిక్తులం బోలుచుఁ బూజలం గాంచుచుఁ బోవువారు
మనుజులం బోలి తా మనిశ మపాపులై నిజ గృహంబులయందు నిలుచువార
గీ॥ లగ్ని యెట్టులు శోభించునట్టి రీతి, దీక్ష తేజస్సుతోఁ గడు దీప్తిఁ గాంచి
హేమ వక్షస్సులం గల్గు భీమ వాత,ములను బోలు మరుత్తులు వెలుఁగుచుండ్రి ॥ 2059

*గీ॥ ఇచ్ఛ జనియించినంతనె యేగఁగల్గు
జ్ఞానులం బోలి పూజ్యులు నరన సోమ
ములను బోలుచు సుముఖులై వెలుఁగునట్టి
యో మరుత్తులుః యజ్ఞంబు¹ నొందుఁ డీరు ॥ 2060

---

1. మాతరఽఆదర్దిరాసోఽఅద్రయో. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 167పుటలోను, 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలోను, ఋషి "స్యూమరశ్మి"గాను, దేవత "మరుత్తులు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. యజ్ఞంబుఁ జేరుఁడీరు. (తా. పా.)

(3)*గద్యము॥

ఏ మరుత్తులు వాయువుల రీతి శత్రు కంపయితలై గమనశీలులో: అగ్నిజ్వాలల వలె విరోచన శీలముఖులో: కవచములు గలుగు యోధుల మాడ్కి శౌర్య కర్మవంతులో: జనకుల వాక్కుల చందాన సుదానులో: యట్టి మరుత్తులు మా యజ్ఞమునకు వత్తురు గాక: ॥ 2061

(4)*గద్యము॥

రథచక్రములయొక్క యరలు చాల సన్ననువవి సమాన నాభులు గలవి యగునట్లు మరుత్తులు ఒక యంతరిక్షమునందుండి పరస్పర బంధుభూతములు, జయశీలు లగు శూరుల మాడ్కి సభగత దీప్తులు. వరమును నితరుల కొనంగఁగోరుచున్న మనుష్యుల వలె సుదకసేక్తలు. స్తోత్రమును బఠించు వందుల కైవడి సుశబ్దము గలవారు మరుత్తులు ॥ 2062

(5)*గద్యము॥

ఏ మరుత్తు లశ్వముల వలెఁ బ్రశస్యతములు, శీఘ్రగమనులు, వసుధారకుల వలె రథస్వాములు సుదానులు, అప్పుల వలె నిమ్నోపకములలో గమనశీలురు, నానారూపులు సామయుక్తులు నగు నంగిరస్సుల వలె సర్వదా సామగులు నగుచున్నారు ॥ 2063

(6)*గద్యము॥

ఉదక ప్రేరకము లగు మేఘముల వలె నదీ నిర్మాతలు, వజ్రాద్యాయుధముల వలె శత్రు హంతలు, శోభన మాతృక లగు శిశువుల వలె విహర్తలు, మహా జన సంఘము వలె గమనమందు దీప్తియుక్తులును నగు మరుత్తులు మా యజ్ఞమునకు వత్తురుగాక: ॥ 2064

(7)*గద్యము॥

ఏ మరుత్తులు ఉషోరశ్మల వలె యజ్ఞము నాశ్రయింతురో: కళ్యాణ రాము లగు వరుల వలె నాభరణములచే దీపింపఁబడుదురో: నదుల వలె గమన శీలలో: దీవ్యమానాఽఽయుధులై దూరాధ్వనీనము లగు బడబలు వలె దూరదేశములకుఁ బోవుదురో: యా మరుత్తులు మా యజ్ఞమునకు వత్తురుగాక: ॥ 2065

(ఈ ఋక్కుచే స్తుతిని జాలించుచున్నాఁడు)

(8)*గద్యము॥

ఓ మరుత్తులారా! స్తుతిచే వర్ధమాను లగు మీరు మమ్ము సుధనలుగాఁ జేయుఁడు: శోభన రత్నములను గలవారినిగా నొనర్పుఁడు: మరియు మీరు స్తోత్రమునకు సఖీభూత మగు స్తోత్రమును బొందుఁడు: మా కీయవలసియున్న రత్న దానములు చిర కాలమునుండి మీ యొద్దఁగలవు ॥ 2066

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—78

ఋషి—భార్గవుఁడైన స్యూమ రశ్మి
దేవత—మరుత్తులు

## అర్థాంతరము—1

(1)†చ॥ హృదయము లేని విప్రుని కుహీనపు స్వాధ్యయనమ్ము రీతి, నా
సుదివిజులన్ విశేష రతిఁ జూరఁగొనన్ గలదైన యజ్ఞ సం
పద గతిఁ, బాలనమ్ము నెడఁబాసి సుదర్శన మైన లేని చి
త్ర దశగ రాజు గాఁగ, జన తండము లేని మహీపతీశుగా
నుదకము లీయ లేని గతి నుండు మరుత్తులు వ్యర్థ మౌనులే: ॥ 2067

†(2) అగ్ని పగిది భాసింపక భగ్న వక్షస్థలము భాతిఁ
బ్రజ్ఞ ప్రతిభలు లేని పరమ ఉంత జ్యేష్ఠుఁ డట్లు
సుఖము లేని నీతి రీతి సోమాఽమృతమ్ము లేని
ఋత శక్తుల వలెన్ మతి రక్తులు వ్యథా కలిత
మౌ రీతిగ నఖిల సృష్టి నాదు కౌనుచు నాయు వౌనఁగు
సత్తు లేని శక్తి లేని చవట మరుత్తులు వృథా ॥ 2068

(3)†క॥ సంచలనపు శక్తులతో
వంచితములు కాక విశ్వ పద మావృతమై
సంచిత మహాఽగ్ని జిహ్వల
సించితమై వాయు వితతి చెలఁగున్ సృష్టిన్ ॥ 2069

†(4) వీరత్వమే లేని పెను యోధ తతి గాఁగ
నాత్మ గతి రహిత మౌ నా పితృ దుర్గతిగ
స్తుతి నుతుల్ వినరాని సురవరుని రీతిగా
మహిత శక్తులు లేని మరుదాళి యేలరా:
లోక నింద్య మ్మైన మూఁక కరువలి యేల?
రాకాంకితము కాని మూఁక గగన మ్మేల? ॥ 2070

(5)†ఉ॥ కాల రథమ్ము విశ్వమునఁ గ్రాలుచుఁ గాంతుల సౌర చక్రముల్
లీలగ గిర్రు గిర్రనను రింగుల రింగుల సంచరింపఁగాన్
బాలితమో! అపాలితమో! నాఁగఁ జరించు మరుత్తతుల్ ప్రభన్
ధీ లలితమ్ములై వివిధ దీప్తుల వారిని సంప్రపూర్ణ మౌ ॥ 2071

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

† విశ్వ రూపాలైన వివిధాగ్ని పుంజాల
దిగ్దిగంతాలలో దేదీవ్యమానమై
కాంతి పుంజాలతోఁ గ్రాంతు లీనుచు సదా
జల సంపదలు మీఱ నలుదెసల వ్యాపించి
కాల రథము నెక్కి కాంలెడి సామాల
శబ్ద శక్తులు తనర సంచరించును మరుత్తు ॥ 2072

(6)†క॥ రవి శశి లోకాల్ జగతిని
నవితథ గతి రంజిలంగ నపురూప మ్మై
దివి సింధు మాత రతిగను
బవన తతుల్ శిశువు లౌచుఁ బరఁగున్ బ్రకృతిన్ ॥ 2073

† విశ్వాన మరుదాళి విమలోదకము లిచ్చుఁ
బిడుగులౌ నగ్నులన్ బెను వజ్రముల నొసఁగి
శత్రు సంఘాతాల సంహరింపఁగఁ జేయు
ప్రకృతి మాతను సదా ప్రతికృతిని రక్షించుఁ
బ్రాణి కోటులు చరింపఁ బ్రాణ పదముల నొసఁగు
దేదీవ్యమాన మౌ దివ్య దీధితు లిచ్చు ॥ 2074

(7)†క॥ ఉషసులఁ గేతనములుగాఁ
గృషి సద్వర శక్తి మీఱఁ గీర్తి ప్రద మై
తృషఁ దీర్చెడి మరుదాళులు
తుషితము లౌ విశ్వమందు దూర్వహ గతులన్ ॥ 2075

† వాయు శక్తులతోటి పర్వ రాజులు రాగ
నదులు నదములు సదా నానా దిశలఁ బారు
నాకర మ్మై కాంతు లవఘెలగా నిముడ
నంతరిక్షమ్ములో నవనిపైఁ బ్రవహించు
యోజనాలై సత్ప్రయోజకాలై తనరు
విశ్వ సంక్షేమాల విమల మరుదావళులు ॥ 2076

†(8) అత్యంత సజ్జన్మ మద్భుత గతి మీఱ
వివిధ రత్నాలవళుల పెను పుట్టు పేటికగ
సహజ సంపచ్ఛ్రీజి మహిత మై విలసిల్ల
నంతరిక్షములోన నఖిల లోకాలలో
గ్రహ తతుల నక్షత్ర గ్రావలన్ అద్రిలన్
మరుదాళి సర్వమై మహితమ్ముగాఁ దిరుగు ॥ 2077

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—78

ఋషి—భార్గవుఁడైన స్యూమ రశ్మి

దేవత—మరుత్తులు

### అర్థాంతరము—2

†(1) అతిలోక గతి మీఱు మతి శక్తు లొప్పంగ
మన సెల్ల విశ్వ మై మహిత మై వెలయంగ
దివ్య దేవాఽఽవళుల భవ్య యజ్ఞాఽఽవళులఁ
జిత్రాఽతిచిత్రమై చెలఁగు శశి శక్తులన్
బృథివీ తతులు నిలిచి పెంపొందు సృష్టిలో
మరుదాళి సచ్ఛక్తి మహితముగ విహితమై ॥ 2078

†(2) అగ్ని తేజాలతో నద్భుతముగా నలరి
కనరాని కెరటాల విను వీథి విహరించి
సుఖ సంపదలు మహా శుభ కృణ్మయ కర్మాళు
లతి పవిత్రము కాఁగ నా ఋత వ్రత మొప్ప
సోమ శక్తులు సర్వ ధామమై తనరారి
అమృత మూర్తుల నిచ్చు నా మహన్మరుదాళి ॥ 2079

†(3) సత్య పథ గామిగా నిత్య నవమై వెలుఁగు
జగదగ్ని జిహ్వలకుఁ బ్రగతు లొసంగుచున్
జన్మ మూల మ్మైన జనక తత్వా లెల్ల
మాతాపితల రూపాలఁ బ్రకృతి పురుషులు వెలుఁగ
శమ శక్తి వర్ధిల్ల శాంతి దాంతులు నింప
సన్మరుత్తులు విశ్వ సంచార మొనరించు ॥ 2080

†(4) ఆ మరున్నాభులను నతివేల శక్తులన్
విశ్వానఁ దేజరిలు సశ్విరాజుల సదా
అర్కు లుదర్కులై అతి శూర ఖర కర
చరణాల కిరణాల తరుణ సంపద లొప్పఁ
గాల రథమ్ముతోఁ గాంతి మరుదశ్వాలు
ఆదాన సంప్రదానాఽఽవళులు తనరార
సంచరించును బ్రభా సంచయము లొప్పంగ
విజయ శీలత్వమ్ము లజితమ్ములై నిలువ ॥ 2081

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) దిగ్దిగంతమ్ములే దివ్యమౌ హద్దులై
తేజరిలు శక్తులను తృప్తి సద్దానాల
సచ్ఛక్తు లొప్పార స్వచ్ఛ మై అచ్ఛమౌ
సలిలాల మధురాల సంపదలు తనరార
శ్రేష్ఠమౌ జ్యేష్ఠమౌ సిరుల మరుదావళులు
విశ్వ రూపము నొంది విమలాంగిరము లౌను
రవి చంద్ర గ్రహ రాజి రాజించి మించంగా
రెక్కలకు రెక్కలై పృక్కులై దిక్కులై ॥ 2082

†(6) రవి చంద్ర గోళాలు రజత మేరు గిరులున్
సింధు జనకమ్ములై చెలువొందఁ బెంపొంద
నా మరుచ్ఛక్తులే అసమాన మూలమై
ఆవిర్భవము చెంది అద్భుతముగా నిలువ
జలద మాలలనుండి సలిలములు స్రవియింప
మైత్రిమై మరుదాళి మహనీయ శక్తులన్
మాన్య మూర్తిగఁ బ్రకృతి మాతృ మూర్తిగ నిలిచి
విపుల విశ్వమ్మునన్ వీచుచుండును సదా ॥ 2083

†(7) భువి దివుల కన్నిటికిఁ బొలు పగు సుషోదయ
మ్మలరారు రీతిగా నా మరుత్తులు సృష్టి
నంతు పంతును లేని ఆ గగన సీమలో
నా దేవతతి కైన నందంగ రాని గతి
నలరార సత్యప్రతాఽఽవహ మ్మౌ కేతన
మ్మనఁగఁ దనరారుచున్ ఘన రాజి కదలించి
కదలించి జల రాశి కదలించి ముటములన్
అధ్వర శక్తులకు నాలంబన మ్మౌను
గతి శీలమౌ గతుల నుత దీప్తిమంతమై
సుఖ సంవలిత మౌను శుభకర మ్మౌనులే! ॥ 2084

†(8) అష్ట వసు సంపదల నమల మౌ సృష్టిలో
నపురూప రత్నాలె ఆవిర్భవమ్ము లౌ
స్నేహ సౌహార్దాల సిరి సంపదలు మీఱ
సర్వ విధ ప్రాణులకు సకల మౌ నాహార
మందించు సంశక్తు లారోగ్య భాగ్యాలు
నలరించు నమర గతు లా మరుచ్ఛక్తులన్ ॥ 2085

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—79

ఋషిః—సౌచీకోఽగ్నిర్వైశ్వానరో వా సప్తిర్వాజంభరో వా
దేవతా—అగ్నిః
ఛందః—త్రిష్టుప్

(1) అపశ్యమస్య మహతో మహిత్వమమర్త్యస్య మర్త్యాసు విక్షు ।
నానా హనూ విభృతే సం భరేతే[1] అసిన్వతీ బప్సతీ భూర్యత్తః ॥ 829

(2) గుహా శిరో నిహితమృధగక్షీ[2] అసిన్వన్నత్తి జిహ్వయా వనాని ।
అత్రాణ్యస్మై పడ్భిః సం భరన్త్యుత్తానహస్తా నమసాధి విక్షు ॥ 830

(3) ప్ర మాతుః ప్రతరం గుహ్యమిచ్ఛన్ కుమారో న వీరుధః సర్పదుర్వీః ।
ససం న పక్వమవిదచ్ఛుచన్తం రిరిహ్వాంసం రిప[3] ఉపస్థే అన్తః ॥ 831

(4) తద్వామృతం రోదసీ ప్ర బ్రవీమి జాయమానో మాతరా గర్భో[4] అత్తి ।
నాహం దేవస్య మర్త్యశ్చికేతాఽగ్నిరంగ విచేతాః స ప్రచేతాః ॥ 832

(5) యో[5] అస్మా అన్నం తృష్వాదధాత్యాజ్యైర్ఘృతైర్జుహోతి పుష్యతి ।
తస్మై సహస్రమక్షభిర్వి చక్షేఽగ్నే విశ్వతః ప్రత్యఙ్ఙసి త్వమ్ ॥ 833

---

1. రేతేఽఅసిన్వతీ, 2. గక్షీఽఅసిన్వ, 3. రిపఽఉపస్థేఽఅన్తః, 4. గర్భోఽఅత్తి,

5. యోఽఅస్మాఽఅన్నం. (వా. ప.)

(6) కిం దేవేషు త్యజ[1] ఏనశ్చకర్థాఽగ్నే పృచ్ఛామి ను త్వామవిద్వాన్ ।
అక్రీళన్ క్రీళన్ హరిరత్తవేఽదన్ వి పర్వశశ్చకర్త గామివాసిః ॥ 834

(7) విషూచో[2] అశ్వాన్ యుయుజే వనేజా[3] ఋజీతిభీ రశనాభిర్గృభీతాన్ ।
చక్షదే మిత్రో వసుభిః సుజాతః సమానృధే పర్వభిర్వావృధానః ॥ 835

## సూక్తము—79

ఋషి—సౌచీకాగ్ని లేక వైశ్వానరాగ్ని లేక సప్తి లేక వాజంభరుఁడు†
దేవత—అగ్ని†

(1)*గద్యము॥
ప్రజల హృదయములలో వైశ్వానర రూపమున నున్న యీ యగ్ని యొక్క మహత్వమును జూచుచున్నాను. ఈ యగ్ని యొక్క హనువులు శిప్రముల విభిన్నములుగ ధరించుచున్నవి. అటు లొనర్చి యవి "యసంఖాదతులు" భక్షయతులు నై ప్రభూత కాష్ఠమును[1] భక్షించుచున్నవి ॥ 2086

(2)*క॥ అనలుని శిరస్సు మానవ
గణములయం దుండు వీని కమనీయాక్షుల్
ఘన చంద్ర సూర్య రీతుల
సునిహితములుగా వెలుంగుఁ జోద్యం బలరన్ ॥ 2087

*చ॥ అనలుఁడు జిహ్వతోడ ననయంబు వహించును గాష్ఠ సంతతిన్
ఘనుఁ డగు వహ్నికై జనులు గ్రాలెడు పాత్రలఁ దాల్పఁ జేతులం
బనిగొని యెత్తి భక్తి మెయిఁ బావన మూర్తుల మధ్య హవ్యమున్
వినయముతో గ్రహించెదరు విస్తృత షట్పద పద్ధతిన్ ద్వరన్ ॥ 2088

---

1. త్యజఽఏన, 2. విషూచోఽఅశ్వాన్, 3. వనేజాఽఋజీతి. (వ్రా. ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 171పుటలో నీ సూక్తమునకు ఋషి "సౌచీక గుణుఁడు"గాను 155 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అగ్నియో సప్తియో"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మహాప్రాణయుతమైన "కాష్ఠ" శబ్దమును నల్పప్రాణయుక్త "కాష్ట" శబ్దముగా శ్రీ నేమానివారు అన్నిచోట్లను వ్రాసిరి.

(3)*క॥ అనలుఁడు పృథ్వీ వీరుధ్
గణములఁ దగ్ధోప్యమూల ధర్మము గాంచన్
తనయుఁడు స్తన్యంబునకై
చను నట్టులు ప్రీతితోడ సాగుచు నుండున్॥ 2089

*గీ॥ మూలములచేతఁ బృథ్విని లీలఁ దినుచుఁ
బక్వ మైనట్టి యన్నము వగిది దీప్త
మైన నీరస వృక్షంబు నగ్ని భూమి
యందుఁ జూచుచునుండు మహాదరమున॥ 2090

(4)*గీ॥ అరణి సంజాతుఁ డైనట్టి యగ్ని యరణు
లను గ్రసించుచు నుండెడు ననెడు మాట
నే నెరుంగకయుండుట నిశ్చయ మని
రోదసుల్! చెప్పుచున్నాఁడ సాదరమున॥ 2091

*గీ॥ ఓయి! వైశ్వానరుఁడ! యగ్ని యున్నతంపు
టరణులం బుట్టు వాఁ డౌట నతిప్రకృష్ట
వివిధ విజ్ఞానుఁ డౌటను విమల బుద్ధి
నేను నుతియింపఁజాలను వాని నెపుడు॥ 2092

(5)*చ॥ అనలున కన్న సంపదను నందఁగఁజేసెడు వాని నింక నా
యనలుని కాష్ఠ సంతతి ననంతము వెల్గఁగఁజేయు వాని నా
యనలుఁడు చూచుచుండుఁగద! యగ్నిరో! నీదు విశేష శక్తి మా
తనువులయందుఁ బెట్టుచు నితాంతము మమ్ముఁ జరింపఁజేయవే!॥ 2093

(6)*గద్యము॥
"ఓ యగ్నీ! నిన్ను శీఘ్రము దేవతలయందు విడిచెనా? క్రోధమును బాపమును జేసితివి" అని యవిద్వాంసుఁడ నగు నేను ఖాండమును దహించు నగ్నిని అడుగుచుంటి. మరియు నొక దేశమందు విహరించుచు మరియొక దేశమున వినోదించుచు(లీలచే దహించుచు)హరిత వర్ణుఁ డవై అన్న కాష్ఠాదికమును బ్రీతిసంధియందు నానావిధము లొనర్చుచున్నావు! అసి గోవును ఛేదించునటులు ఛేదించుచున్నావు!॥ 2094

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(7)*గద్యము॥
ఈ యగ్ని విష్వగంచనము లగు సత్త్వములను, వ్యాప్తము లగు గొప్ప వృక్షములను గూర్చు చున్నాఁడు. వనమం దభివృద్ధి నొందుచు ఋజు గాములు రశనా స్థానీయములు నగు లతలచేఁ బరిగృహీతము లగు స్వకీయాశ్వములను శీఘ్రము గ్రహించి రథమందుఁ గూర్చెను. మాకు మిత్రభూతుఁడు, వసువృద్ధుఁడు నగు నట్టి యగ్ని వసువులను శకలములుగాఁ జేయుచున్నాఁడు. కాష్ఠ ఖండములవలన నతఁడు లెస్సగా వృద్ధిఁ బొందుచున్నాఁడు ॥ 2095

## సూక్తము—79

ఋషి—సౌచీకాగ్ని లేక వైశ్వానరాగ్ని లేక సప్తి లేక వాజంభరుఁడు

దేవత—అగ్ని

### అర్ధాంతరము—1

(1)†క॥ మానవ దేహమ్ములను న
మానుష రాక్షస పిశాచ మాన్య వివిధ దే
వాఽనీక శరీరమ్ములఁ
బ్రాణ ప్రద మౌచు నగ్ని వరఁగుచు నుండున్ ॥ 2096

†క॥ అనలము విశ్వమ్ముందున
జనితమ్మయి మరణ గతుల సర్వ పదార్థా
శిని, జరముల నచరాళుల
ననుసంభృత మై చరించుఁ బ్రాభవ శక్తిన్ ॥ 2097

†(2) అగ్ని శిర మలరారు నాకాశమయమ్మై
సౌర గోళాఽఽవళులు చాంద్ర గోళాఽఽవళులు
ఉష్ణ శీతల కాంతు లొనరార నక్షులౌఁ
దరు లతా పుంజాల గిరులందు జలమందు
నగ్ని జిహ్వలు మీఱ నలరారుచుండులే!
చదలంటి వెలుఁగొందు షట్కృత్తికల నొప్పఁ
బర్వులే సరి లేక సర్వాగ్ని రూపాలు
కరములే చరణములుగఁ జరణాలె కరము లై
బహిరంతరములలోఁ బరఁగు నన్నింటను
నంతరాంతరములను నసమాన గతి నగ్ని ॥ 2098

†(3) తల్లి దేహమునుండి తనరారఁగాఁ బుట్టి
స్తనములన్ దడుము చా తల్లి పాలనె త్రాగు
నిసువుగా నా అగ్ని నిండు ప్రకృతిలోన
మెండుగా జనియించి అడాండ పిండాండ
బ్రహ్మాండ భాండాల నిండారఁగా నిండి
సర్వ ధారక మౌను సర్వ భక్షక మౌను ॥ 2099

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4)†సీ॥ లౌకికాऽలౌకిక పాంకట భేదాల నలరారు నా యగ్ని యఖిల గతుల
మరణ స్వభావాల మహిమాన్విత మ్మౌను నమరాగ్ని మూలమై అమరు నింగి
మర్త్యాగ్ని యౌచు నమర్త్యాగ్నియు నొప్పుచు నంగాంగ రహితమై అలరు నగ్ని
చరము నచర మౌచు జాజ్వల్యమానమై చేతనాऽచేతన శిష్ట గతులఁ

ఆ॥వె॥ దల్లి పిల్ల వోలెఁ దనరార జన్మించి, తల్లి గర్భ శుద్ధిఁ దనరఁజేయు
శిశువు రీతి నగ్ని విశద విశ్వమ్మున, నుద్భవించు శుద్ధి నొంద జగతి ॥ 2100

(5)†క॥ అగ్నిని నాజ్యము పోయఁగ
రుగ్ణతలు నశించు వాయు రోదసులందున్
మగ్నత సువర్ణ మనుద్
విగ్న స్వర సంవలితపుఁ దేజము లొదవన్ ॥ 2101

†క॥ ఆ విశ్వ విరాట్ పురుషుఁడు
వే వేలుగ నేత్ర తతుల వెల్గెడు రీతిన్
ఈ విశ్వమ్మున నగ్నియు
వే వే లా చక్షు తతుల విస్తృత మౌలేః ॥ 2102

†(6) సర్వ విశ్వములోనఁ బర్వి అంతర్గతుల
దేవ మానవ తతుల దివి భువి లోకాల
సకల మౌ జీవాऽళి సర్వ చరాऽచరాల
విజ్ఞానిగా వెలిఁగి అజ్ఞానిగాఁ జెలఁగి
దివ్య పరంజ్యోతి దేదీప్యమానముగ
దేవత్వమును జూపి దివ్యత్వ మొనఁగూర్చు
దావాऽనలమ్ముగా దందహ్యమానమై
బడబాऽనలమ్ముగా జడధిలో నిబిడ మౌ
సంచలన శక్తితో సంచరించును గేళిఁ
జలన రాహిత్యమున జడ మౌను నడయాడ ॥ 2103

†(7) అష్ట వసువుల నలరి ఐశ్వర్య గతి పెంపుఁ
జక్షువుల వెలుఁగొంది అక్షి దృక్కుల నొసఁగుఁ
గుక్షిలోపల నుండి అక్షయమ్ముగ క్షుత్తు
కలిగించు రగిలించు నరిగించు నాహార
మంతరిక్షము లోనఁ గాంతి పుంజము లుండు
ననిలాలలో నుండు నా నీరముల నుండు
మృత్పదార్థాలలో నుండు నుండు ఋజు శక్తులను
నా విషాదయమ్ములకు నది మూలమై నిలుచు ॥ 2104

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—79

ఋషి—సౌచీకాగ్ని లేక వైశ్వానరాగ్ని లేక సప్తి లేక వాజంభరుఁడు
దేవత—అగ్ని

### అర్థాంతరము—2

†(1) అగ్ని శక్తిని మర్త్యుఁ డమర్త్యుఁడై వెల్గొందుఁ
ప్రాణులలో నగ్ని పరమ పవిత్రమై
అతిలోక శక్తులన్ అలరారఁగాఁ జేయు
నా ప్రాణి జాలాల నపవిత్ర మౌ నగ్ని
ఆరోగ్యమున్ జంపు నాయువున్ హరియించు
జ్వాలలన్ గీలులన్ జ్వలియించు జడములన్
అంతర్గత మ్మౌచు నతిగూఢమై యుండు
రక్షించు భక్షించు రాగిల్లు రాజిల్లు ॥ 2105

†(2) ప్రాణి తతులను నప్రాణి తతులనె గాక
ఆ గగనమున నగ్ని యౌదలఁ దనరారు
అసిత పదార్థాల నక్షిగా సిత మౌను
తరులందు గిరులందుఁ దనరు సలిలాదులన్
సప్తానిలమ్ములన్ సప్తానల జిహ్వ
లలరారు షడృతువులందునన్ విశ్వాన ॥ 2106

†(3) అతిగుహ్యతరమైన ఆ దుష్ట మన్మథుని
ప్రిమ శక్తి మీఱంగ సమలత్వ రహితమౌ
సర్పమ్ము గతుల మస్సలిల మౌ వీర్యమున్
ఆ అగ్ని శక్తితో నమృతమ్ముగాఁ జేసి
అఖిల గాత్రవ రతుల నంతమ్ము కావించి
ప్రకృతి పురుషుల శక్తి పరమ పవిత్రతల
సృష్టి రీతులలో విశిష్టతల్ కాపాడి
వ్యష్టి సమిష్టుల సదృష్ట శక్తుల నిలుపు ॥ 2107

†(4) చేతనా సహితమై చేతనా రహితమై
ఋత శక్తు లొప్పంగ ఋజు శక్తు లుప్పొంగ
సమృత శక్తుల నలరి ఆ రోదసిని మీఱి
అన్మృత శక్తులు మీఱ ననృజు శక్తులు హెచ్చ
మృత శక్తులకు లొంగి గత శక్తులకు సాగి
అమరత్వ మొందు నౌ నఘ రూప మందు నా ॥ 2108

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) అగ్నిలో నాజ్యాల నద్భుత మంత్రాల
బ్రహ్మ స్వరూపుఁడై పరఁగు యజ్ఞాలలో
ఆ సహస్రాక్షుఁడై అఖిల విశ్వములోన
ననిలమూర్తులు మీఱ ననల శక్తుల నెరపి
భూ కక్ష్యలనె కాదు పొనరు ద్యో కక్ష్యలన్
అనలాల సలిలాల అనిలాల గోళాల
అఖిల మౌ కక్ష్యలన్ అక్షమ్ము లన్నిటిన్
మార్చంగ నౌనులే! మహిత శక్తులు వెలయ ॥ 2109

(6)†క॥ రుగ్ణత వార్ధక్యమ్ముల్
భగ్నముగాఁ దనరు నా అలౌకిక శక్తిన్
నగ్నముగా వెలుఁగొందెడు
నగ్నియె దైవీయ మౌను నమలిన శుచిగా ॥ 2110

† అగ్ని శక్తుల నెఱుఁగ నజ్ఞాని యౌ ప్రాణి
అనలమున్ దేవాఽఽళి కర్పణము కావించి
చేతులన్ ముడుచుకొనుఁ జైతన్య ముడుగుచున్
అగ్ని మేలెంచు నని అగ్ని కీడెంచు నని
అగ్ని క్రీడించు నని అగ్ని క్రీడింప దని
సర్వగామిగ వెలుఁగు సర్వేశ్వరేశ్వరుని
భరియించు శక్తిగా హరియించు శక్తిగా
వైష్ణవీయ మ్మగుచు వరలంగఁ జేయ నౌ ॥ 2111

†(7) నిర్ద్వంద్వ గతి వెలయ నిండు ద్వంద్వమ్ముగా
అనిలాల సలిలాల నలరారులే! అగ్ని
ఆకసమ్మునఁ బృథ్వి నమ రొందులే! అగ్ని
పుట్టు జన్మము లేక పుట్టు కీటులు లేక
ఆదిత్య విష్ణు వర మౌచు వెలిఁగెడు నగ్ని
ఆహారమై తనర నా పరంజ్యోతి కృప
మిత్రుఁడే చక్షువై మిన్నంటు శక్తితో
విశ్వ వసు శక్తులకు విమల సంతతి గతుల
ఆ అజయ్యా లైన ఆనంద పర్వాల
విజయోత్సవాలలో విలసిల్లఁగా నౌను ॥ 2112

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—80

ఋషిః—సౌచీకోఽగ్నిః వైశ్వానరో వా సప్తిర్వాజంభరో వా
దేవతాః—అగ్నిః
ఛందః—త్రిష్టుప్

(1) అగ్నిః సప్తిం వాజంభరం దదాత్యగ్నిర్వీరం శ్రుత్యం కర్మనిఃష్ఠామ్ ।
అగ్నీ రోదసీ వి చరత్ సమంజన్నగ్నిర్నారీం వీరకుక్షిం పురంధిమ్ ॥ 836

(2) అగ్నేరప్నసః సమిదస్తు భద్రాఽగ్నిర్మహీ రోదసీ [1]ఆ వివేశ ।
అగ్నిరేకం చోదయత్ సమత్స్వగ్నిర్వృత్రాణి దయతే పురూణి ॥ 837

(3) అగ్నిర్హ త్యం జరతః కర్ణమావాఽగ్నిరద్భ్యో నిరదహజ్జరూథమ్ ।
అగ్నిరత్రిం ఘర్మ [2]ఉరుష్యదన్తరగ్నిర్నృమేధం ప్రజయాసృజత్ సమ్ ॥ 838

(4) అగ్నిర్దాద్ ద్రవిణం వీరపేశా [3]అగ్నిరృషిం యః సహస్రా సనోతి ।
అగ్నిర్దివి హవ్యమా తతానాఽగ్నేర్ధామాని విభృతా పురుత్రా ॥ 839

(5) అగ్నిముక్థైరృషయో వి హ్వయన్తేఽగ్నిం నరో యామని బాధితాసః ।
అగ్నిం వయో [4]అన్తరిక్షే పతన్తోఽగ్నిః సహస్రా పరి యాతి గోనామ్ ॥ 840

---

1. రోదసీఽఆ వివేశ, 2. ఘర్మఽఉరుష్య, 3. పేశాఽఅగ్ని, 4. వయోఽఅన్తరిక్షే. (ప్రా. ప్ర.)

(6) అగ్నిం విశ [1]ఈళతే మానుషీర్యా అగ్నిం మనుషో నహుషో వి జాతాః ।
అగ్నిర్గాన్ధర్వీం పథ్యామృతస్యాఽగ్నేర్గవ్యూతిర్ఘృత [2]ఆ నిషత్తా ॥ 841

(7) అగ్నయే బ్రహ్మ [3]ఋభవస్తతక్షురగ్నిం మహామవోచామా సువృక్తిమ్ ।
అగ్నే ప్రావ జరితారం యవిష్ఠాఽగ్నే మహి ద్రవిణమా యజస్వ ॥ 842

## సూక్తము—80

ఋషి—సౌచీకాగ్ని లేక వైశ్వానరాగ్ని లేక సప్తి లేక వాజంభరుఁడు†
దేవత—అగ్ని

(1,2)*సీ॥ రణరంగమున శత్రుగణముల విజయించు సప్తిని నొసఁగెడు జ్వలనుఁ డగ్ని
యాగమందు ననన్యోత్తము గల్గెడు పుత్రుని కలిఁగించు పూతుఁ డగ్ని
రోదసీ ద్వయమును మోదాంచితుండయి చరియింపఁజేయుండును సురుచిరాగ్ని
వీర కుక్షిని మరి విమల పురంధిని యోషిత్తుగ నొనర్చి యుండు నగ్ని
గీ॥ కర్మఁ గలిఁగిన యగ్నికి ఘన సమిత్తు, భద్ర మగుఁగాక నా యగ్ని భవ్య మైన
సుస్వతేజస్సుతో రోదసులను బ్రీతిఁ, దాఁ బ్రవేశించియుండె నంతనముఁ బూని ॥ 2113

*గీ॥ భక్తుఁ డనహాయుఁడైనను బ్రదనమందు
నగ్ని విజయిగఁ జేయును నతని మిగుల
బహుళ సంఖ్య మెలంగెడు వైరి గణముఁ
జంపుచుండెడు వాఁ డగ్ని శక్తిఁ గొలఁది ॥ 2114

(3,4)*సీ॥ అగ్ని జరత్కర్ణుఁ డను వాని రక్షించె, నగ్ని జరూథుని నడఁచి పెట్టె
నగ్ని కాపాడె నా నత్రి మహర్షిని నగ్ని నృమేధనుఁ డనెడు వాని
బ్రజతోడఁ గూర్చెను బ్రజలఁ గూడెడు నగ్ని ద్రవిణంబు నమకూర్చె నవనమందు
బహు గోవులం గల్గఁ బరమర్షి పుత్రుని నగ్నిఁ దాఁ బంపించె నతివ్రసిద్ధుఁ
గీ॥ డైన యగ్ని దివంబున హవ్యము గడు, విస్తరింపంగఁ జేసెను విస్తృతాగ్ని
శకునములెల్ల బహుక్రీడలచేలందు, వెలుఁగుచుండెను నే వేళ వివిధ గతుల ॥ 2115

---

1. విశ ఈళతే, 2. ఘృత ఆ నిషత్తా, 3. బ్రహ్మ ఋభవస్త. (వ్రా. ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 175పుటలో నీ సూక్తమునకు ఋషి "సౌచీకవైశ్వానరాగ్ని" గాను, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "అగ్ని"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(5)*క॥ అనలుని శస్త్రంబులచే
తను బిలుచుచు నున్నవారు తజ్జ్ఞులు మరి యా
యనలుని రణ బాధితులై
కనుఁగొనుచున్నారు జనులు గలుఁగ జయంబున్ ॥ 2116

*గీ॥ అగ్ని నంతరిక్షమందుఁ బక్షులు పడుఁ
జూచుచుండు మరియు సుందరాగ్ని
గో సహస్రములను గూడంగ సంప్రీతి
వెడలుచుండుఁగాదె! వేద్యు మీఱ ॥ 2117

(6)*గీ॥ నహుష జాతులైన నరులు మహానలు
వినుతిఁ జేయుచుంద్రు వివిధ భక్తి
మనుజ జాతులైన జనులును గడు యుక్తి
సన్నుతింపుచుంద్రు సరస నుతుల ॥ 2118

*గీ॥ యజ్ఞ పథమునకున్ బథ్య మైన యట్టి
వాక్కు వినుచుండుఁగాదె! యా వహ్ని మిగుల
నగ్ని సన్మార్గ మతిమధురాజ్యమందు
నంతటఁ బ్రసిద్ధ మౌచుఁ దా సమరుచుండ ॥ 2119

(7)*గీ॥ అగ్నికై స్తోత్ర జాలంబు నాచరింతు
రధిక మేధావులైనట్టి యార్యవరులు
ఘనతముండైన యగ్నిని మనసు దీర
మేము వర్ణించెదము కడు సీమ మలర ॥ 2120

*గీ॥ యువతముండ! యగ్ని! యున్నత స్తోతకు
నవన మొసఁగి నీవు సవనమందు
నిరుపమాన మైన నిఖిల ధనంబును
నీ వొసంగు! మాకు నిశ్చయముగ ॥ 2121

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వెంకటనరసింహశాస్త్రి

## సూక్తము—80

ఋషి—సౌచీకాగ్ని లేక వైశ్వానరాగ్ని లేక సప్తి లేక వాజంభరుఁడు

దేవత—అగ్ని

### అర్థాంతరము—1

(1)†శ్రీలలితవృత్తము॥*

శ్రుతి శక్తితో మహా శుద్ధ కర్మ నిష్ఠతో
వితతాగ్నివంతుఁడై వీర్యవంతుఁడై ప్రజన్
నుత సప్త రోచిసుల్ నూత్న తేజ మీయఁగా
నతులాంతరిక్ష మాహాత్మ్య మొప్పఁగా రతిన్
సతతమ్ము సంచరింపంగ నౌ విశాల మౌ
ఋత శక్తి సంచయ మ్మేపుగా నెఱుంగ నౌ
ప్రతి లేని ఆ పురా ప్రాభవాలఁ బుణ్యముల్
సతి శక్తులన్ మహోల్లాస వీరులన్ గనున్ ॥ 2122

†(2) సృష్టిలోపల నగ్ని స్రష్ట చిత్ర మ్మోచు
నలరారుచుండులే! అంతయుఁ దా నౌచు
అన్నియు నగ్నులై అన్నియున్ సమిధలై
అపురూప శక్తులన్ విపరీత రూపాల
పూర్ణాగ్నులై రగులు బూడిదలై మిగులు
రోదసీ కుహరాన రూక్ష రూపము లేని
అమల దీపమ్ముగా సమర దీపమ్ముగా
నా పరంజ్యోతిగా నలరు నజాతమై ॥ 2123

†(3) వర్ధిల్ల ఋషి శక్తి వార్ధక్యమును బాపు
దూర శ్రవణ శక్తి దూర దృష్టుల నిచ్చు
అహఃపుత్రుల భాతి నఖిల తేజము నొసఁగు
నత్యుష్ణ దీప్తులన్ అస్వేదత న్నొసఁగు
అంతర్గత శక్తి నా అగ్ని మహితమై
ప్రజల సృష్టించులే! బజబజలు కాకుండ ॥ 2124

†(4) అత్యంత తేజాల నగ్ని ప్రవహించులే!
ఆ నీరముల వగిది నరి వీర శక్తులన్
అగ్గి బుగ్గిగఁ జేయు నతిసహస్రము తాఁగ
నా హవిస్సంపదల నమృతముగా దివుల
సౌభాగ్య భాగ్యాల సంతరించును సదా
అగ్ని సంస్థానాలు అఖిల విశ్వము నిండ ॥ 2125

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"శక్వరీ"ఛందము.(14)

†(5) అగ్ని శక్తుల ఋషులు అంతటన్ దిపగుదురు
అగ్ని తేజము లఖిలాండమ్ములన్ బాపు
రెక్కలన్ విప్పుచున్ చెక్కరల్ గొట్టుచున్
గగనాన విహరించు గరుడాది పక్షులుగ
నే రెక్కలున్ లేక యెన లేని శక్తులన్
అంతరిక్షములోన నరుగు సుదూరాలు
అతిసాహసిత లెక్క లందని గోళాల
నధిరోహణము చేయు నంతువంతుల నరయు ॥ 2126

†(6) ఆ మహా తేజాల నఖిల సంతోషాల
నలరారు మనుజాళు లర్చింతు రగ్నులన్
నిస్తేజ నిర్వీర్య నిస్సంతుష్టు లౌ
నసమర్థ నరులును నాశింతు రగ్నులన్
గాంధర్వ పథములన్ బంధ మౌ మంత్రాగ్ని
అమృతాగ్నిగా నిలుచు నా ఘృత శక్తిగా
నఖిల లోకాల్ తిరుగు నతిమేధ నొసఁగులే!
అక్షర శక్తులన్ అది జాతులై వెలుఁగు ॥ 2127

†(7) అగ్ని బ్రహ్మ మ్మొచు నలరారుచుండులే!
అగ్ని ఋభువులు కాఁగ నఖిలమ్ము నను వెల్గు
దక్ష శక్తులు మీఱఁ దనరారులే! అగ్ని
వర్ణింపరాని గతిఁ బ్రగతి శక్తులు వెలయ
నత్యంత గతి శక్తి నతి సర్పణపు రక్తి
సృష్టి యజ్ఞములోనఁ జెలఁగుఁ బ్రాకృత మౌచు ॥ 2128

## సూక్తము—80

ఋషి—సౌచీకాగ్ని లేక వైశ్వానరాగ్ని లేక సప్తి లేక వాజంభరుఁడు
దేవత—అగ్ని

## అర్థాంతరము—2

†(1) దేదీప్యమానమౌ తేజమున్ ధరియించి
సప్త రీతుల వెల్గు సప్త్యగ్ని తృప్తిమై
శ్రితి కర్మ నిష్ఠతన్ మతి ధర్మ పూర్ణ మౌ
వీర్య శక్తిని బ్రబల విపుల రోదసిలోన
విమలమై వెల్గొందు వీర కుక్షిం గల్గు
శక్తి జలముల నొసఁగు సల్ పదార్థము తనర ॥ 2129

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) విశ్వ పదార్థాలు విమల సమిధలు కాఁగ
దివి భువుల నన్నిటన్ దేజరిలు నా యగ్ని
రోదసిన్ విలసిల్లి రూఢ దీప్తుల నొసఁగు
సనలమ్మె ఒక్కటై అనూన గతులతో
నైకైక రూపాల లోకాల విలసిల్లు
బహుళ ప్రయోజనాల్ బహుముఖమ్ముగ నిచ్చు ॥ 2130

†(3) అగ్ని సృష్టిని సదా అపురూప గతి నిల్పుఁ
గర్మ సాక్షిగ నిల్చు ధర్మ సాక్షిగ వెల్గు
సలిల మాకర్షించి జలద మాలల నిలిపి
నీరాల ధారలను నిండుగాఁ గురియించు
అంతరిక్షములోన నలరారు శబ్ద గుణ
తత్త్వమ్ము నిల్పుచున్ దంత్రమై సృష్టిలో
రస శక్తి వర్ధిల్లి రాణింప నర మేధ
నర సుర జనాఽఽవళుల వరలంగఁ జేయులే! ॥ 2131

†(4) అగ్ని ప్రజ్వాలలను నతివిస్తృతము చేయు
నబ్ద[1] రూపాఽఽవళిగ శబ్ద శక్తుల నెఱుఁగు
మంత్ర ద్రష్టల శక్తి మహిమాఽన్వితము చేయుఁ
గాంత సంతానాలు క్రాంతులై విశ్వాన
గోశాది జాలాల వేలాదిగా సురల
సర్వ సృష్టిని మహా శశ్వత్ శుభా లొసఁగు ॥ 2132

†(5) అతి సహస్రమ్మైన అగ్ని కిరణాలతో
శత్రు సంచయ మహా సంహార శక్తు లౌ
రవి శక్తులన్ మించు కవి శక్తు లలరార
దివ్య శక్తుల మీఱఁ దేజరిలఁగా నౌను
అంతరిక్షములోన నతి మహోష్ణాలతో
ఆధారభూతమై అన్నింట నలరారు ॥ 2133

†(6) అత్యంత దీప్తులను నగ్ని పయనించులే!
నురుములను మెరుపులను నొనర మొయిళుల నలరుఁ
ప్రాణి కోటిని నిల్పి ప్రాణ ప్రద మ్మౌను
విశ్వ సృష్టిని యజ్ఞ వితతులన్ దనరారు
గంధర్వ శక్తులన్ బంధాఽమృత మ్మౌచు
లోక ధారక మౌచుఁ బ్రాకటముగా వెలుఁగు
మహితమై పుట్టులే! అహితమై గిట్టులే!
పుట్టు గిట్టులు లేని పూర్ణ శక్తిగఁ దనరు ॥ 2134

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. అప్+దము=అబ్దము=మేఘము.

(7)†క॥ అగ్నిని జిహ్మాయు ఋషులు
మగ్నత నర్చింత్రు దివ్య మంత్రాగ్ర్యులతో
ఋగ్నుతులన్ నతుల నను
ద్విగ్న్య మతిని నిశ్చలాత్మ దీప్తులు తనరన్ ॥ 2135

## సూక్తమ్—81

ఋషిః—విశ్వకర్మా భౌవనః
దేవతా—విశ్వకర్మా
ఛందః—త్రిష్టుప్; 2-విరాడ్రూపా

(1) య[1] ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా న్యసీదత్ పితా నః ।

స[2] ఆశిషా ద్రవిణమిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాగ్ం[3] ఆ వివేశ ॥ 843

(2) కిం స్విదాసీదధిష్ఠానమారంభణం కతమత్ స్విత్ కథాసీత్ ।

యతో భూమిం జనయన్ విశ్వకర్మా వి ద్యామౌర్ణోన్మహినా విశ్వచక్షాః ॥ 844

(3) విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్ ।

సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః ॥ 845

(4) కిం స్విద్వనం క[4] ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః ।

మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్ యదధ్యతిష్ఠద్భువనాని ధారయన్ ॥ 846

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. యఽఇమా, 2. సఽఆశిషా, 3. వరాగ్ంఽఆ వివేశ, 4. కఽఉ స వృక్షఽఆస. (వా. ప్ర.)

(5) యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమా ।
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః స్వయం యజస్వ తన్వం వృధానః ॥ 847

(6) విశ్వకర్మన్ హవిషా వావృధానః స్వయం యజస్వ పృథివీముత ద్యామ్ ।
ముహ్యన్త్వన్యే [1]అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు ॥ 848

(7) వాచస్పతిం విశ్వకర్మాణమూతయే మనోజువం వాజే [2]అద్యా హువేమ ।
స నో విశ్వాని హవనాని జోషద్ విశ్వశమ్భూరవసే సాధుకర్మా ॥ 849

## సూక్తము—81

ఋషి—భువన పుత్రుఁడు విశ్వకర్మ†
దేవత—విశ్వకర్మ

(1)*గద్యము॥
విశ్వకర్మ యను ఋషి హోమ నిష్పాదకుం డగుచు, సర్వ భువనంబులను హోమముఁ జేయుచు నగ్నిలోఁ బ్రవేశించెను. పిత యగు నా ఋషి ఆశీః ప్రతిపాదక మగు సూక్త వాక్యాదికమున స్వర్గాఽఽఖ్యమును గోరుచు భువనాఽఽచ్ఛాదయితయై విప్రకృష్టము లగు భూతములను బ్రవేశించెను ॥ 2136

- ఈ ఋక్కున కాధ్యాత్మికార్థము -

*గద్యము॥
పరమేశ్వరుఁడు ఈ పృథివ్యాది సప్తలోకములను దినయం బాహుతి ప్రక్షేపము వలె సంహరించుచు నతీంద్రియ ద్రష్టయు, సర్వజ్ఞుఁడు నగు సంహార రూప హోమకర్త మాకుఁ బితయయి స్వయముగ నిలచెను. అట్టి పరమేశ్వరుఁడు ధనోపలక్షిత మగు జగద్భోగము నాకాంక్షించుచుఁ బారమార్థిక రూపమును నావరించుచు స్వసృష్టము లగు ప్రాణి హృదయ ప్రదేశములను జీవరూపమునఁ బ్రవేశించెను ॥ 2137

---

1. తన్యేఽఅభితో జనాసఽఇహా, 2. వాజేఽఅద్యా. (వ్రా. ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 179 పుటలో ఋషి "భువనపుత్రుఁడు విశ్వకర్మ" గాను, 15b సంఖ్య గల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "విశ్వకర్మ" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(2)*గద్యము॥
(లోకమందు ఘటమును జేయు కులాలుఁడు గృహాదికమందు నివసించి మృద్రూపక మగు నారంభక ద్రవ్యముతోఁ జక్రాది రూపోపకరణముల ఘటమును నిష్పాదించును. అట్లు) పరమేశ్వరునకు జగదాశ్రయ ద్యావా పృథ్వుల యుత్పాదనవేళయందు, వేనివల్ల నతఁడు భూమినిఁ బుట్టించుచుండునో! దివమును సృజించుచుండునో! యా యధిష్ఠానమేది? యా యారంభణ మేది? (ఏవియుఁ గావనుట)॥ 2138

(3)*గద్యము॥
సర్వతోవ్యాప్త చక్షుష్కుఁడు, విశ్వతోముఖుఁడు, విశ్వతోబాహువు, విశ్వతఃపాత్తు నగు పరమేశ్వరుఁడు బాహువులవల్ల దివమును బ్రేరేపించుచున్నాఁడు. గమన శీలము లగుపాదములచేఁ బృథ్విని బ్రేరేపించుచు ద్యావాభూములను బుట్టించుచు ద్యోతమానుండైన పరమేశ్వరుఁ డసహాయుఁడై యుండెను॥ 2139

(4)*గద్యము॥
(లోకమునందుఁ బ్రౌఢ ప్రాసాదమును నిర్మింపఁ దలఁచుచు నొక మహావనమం దొక మహావృక్షమును గొట్టి చెక్కి స్తంభాదికమును సంపాదించును. అటులనే పరమేశ్వర ప్రేరితులయి జగత్స్రష్ట లగు యతులు ఏ వనమునుండి యే వృక్షమును గ్రహించి ద్యావా భూములను నిర్మించిరో! యట్టి వన మెద్ది? ఆ వృక్ష మేదియై యుండును? ఓ మనీషులారా! ఆ యుభయమును జిజ్ఞాసా మనస్సుతో నడుగుఁడు! మరియు నీశ్వరుఁడు భువనములను ధరించుచు నే స్థానమందుండెనో! యా స్థాన మెద్దియో! తెలిసికొనుఁడు! (బ్రహ్మ ఆ వన మనియు, బ్రహ్మయే ఆ వృక్ష మనియు గుర్తెరుంగునది)॥ 2140

(5)*గద్యము॥
ఓ విశ్వకర్మా: ఏవి నీ కుత్తమ శరీరములో! ఎవ్వి యధమ శరీరములో! యా సర్వశరీరములను సఖుల మగు మా కిమ్ము! హవిర్లక్షణాన్న వంతుఁడా! స్వయముగనే నీవు స్వకీయ మగు పూర్వోక్త శరీరమును హవిస్సున వృద్ధిఁబరచుచున్న వాఁడవై యుండుము!॥ 2141

(6)*గద్యము॥
విశ్వవిషయకర్మ యను పరమేశ్వరుఁడా! నే నొసంగు హవ్యమున వర్ధమానుం డగు విశ్వకర్మ సర్వ భూతములను హోమముఁ జేసెను. స్వయముగఁ బృథ్విని మరియు దివిని బ్రవృద్ధుఁడవై పూజింపుము! నాకన్న నన్యజనులు యాగ విరోధు లగు వారంతట ముగ్ధు లగుదురుగాక! ఈ యజ్ఞయందు మా విషయమై మఘవంతుఁడు-మదీయ హవ్యమున ధనవంతుఁడు-స్వర్గాది ఫలప్రేరకుఁడు నగుఁగాక!॥ 2142

(7)*గీ॥ వాక్కునకు సామి యనుచుఁ బా వరలి విశ్వ
కర్తయుం జిత్త వేగుఁడై కార్యలు నట్టి
దేవునకుఁ దృప్తిఁ జేయ నీ దినమునందుఁ
బిలిచెదము మేము వానిని లలిత నుతుల॥ 2143

---

రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. సేవించుకాగ. (వ్రా.వ్ర.ప.)

*గీ॥ సాధు కర్మ యగుచు సకల సుఖోత్పాద
కుండు నగుచు దేవుఁ డుండి మాకు
నవన మొనఁగఁ దాను హవ్యము సేవించుఁ[1]
గాక నని వచింతు గౌరవమున ॥ 2144

## సూక్తము—81

ఋషి—భువనపుత్రుఁడు విశ్వకర్మ
దేవత—విశ్వకర్మ

### అర్థాంతరము—1

†(1) సృష్టి యజ్ఞము చేయు ఋషి పుంగవుఁడు భాతి
అఖిల సృష్టిని జేయు నా దేవదేవుండు
ఆ దిక్కు లలరంగ నాద్యంతములు తనరఁ
దాతగా నేతగాఁ దగు పంచ భూతాల
గతి శీలమై యొప్ప గగనాన నిగమాల
సంకల్పమాత్రిస సర్వమ్ము సృష్టించి
నవ దీప్తి జాలాల భువనాల భవనాల
నిర్మించి చరియించు సింధఁగాఁ దన గుండె ॥ 2145

†(2) ఏ రీతిగా సృష్టి యింత వింతగ జరిగె
నెది మొట్టమొదలో! యెది తుట్టతుదలో!
యీ పంచ భూతాల నేది ముం దుద్భూత
మౌనొ! యీ సృష్టికి నఖిలమ్మునకుఁ గర్త
యౌ విశ్వకర్మయే ఆశ్వరము కానట్టి
విశ్వ చక్షువు లైన విమలేందు సూర్యులన్
దివి భువుల సృష్టించె దివ్యమ్ముగా నడపఁ
దన మహిమ మహితమై తనరార సంపదలు ॥ 2146

†(3) విశ్వమే చక్షువై విశ్వమ్మె ముఖ మౌచు
విశ్వమే బాహువులు విశ్వమే పాదాలు
నై వెల్గు దేవుండె అలరారు నొక్కఁడై
కరములున్ జరణముల్ కామ్య కర్మలఁ జేయ
నణు పరమాణుపు లద్భుతమ్మై వెలయ
భువి దివుల సన్నిటిన్ బుట్టించి త్రిప్పులే ॥ 2147

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఆ పంచ భూతాలు లవినాభావ మౌ
సంబంధ బంధాఽనుబంధాల వెలయ
నేది ఆకాశమ్మొ! యేది సలిలమ్మో!
యేది వాయువొ! అగ్ని యెద్దియో! జగతిఁ
దుది మొదల్ తెలుపకయె యెదలోని సంకల్ప
మానందమై లీల నది కర్మ మాయగా
ద్యో పృథ్వి జాలాలు ఋతు లొప్ప సృష్టు
లా అనాహత శక్తి సధివసించుచు సర్వ
సృష్టినే నడుపుచున్ వ్యష్టి సమిష్టులుగఁ
బ్రికృతులన్ భువనాలఁ బద గతులఁ దిప్పలే! ॥ 2148

†(5) విశ్వ సంసృష్టి నెల్ల విరచించెడి విశ్వకర్మ!
ఉత్తమ మధ్యమ భేదా లొనరు నధమ మౌ గతులున్
అన్నింటిని సమముగానె అత్యద్భుత శిక్ష లమర
స్నేహ ధర్మ మొప్పారఁగఁ జిన్విలాసాలు వరల
విశ్వ సృష్టి యజ్ఞమ్మున విధిగాఁ బ్రితిపదార్థమ్ము
సమిధ కాఁగఁ బ్రాణి కోటి సంచరించు హవిషాళుల ॥ 2149

†(6) దివి భువి లోకా లన్నిటిఁ దివిరి సృష్టి యజ్ఞమందు
విశ్వకర్మ! హవిస్సుగా విమల యశస్సుతో నుంతువు!
సకల ప్రాణి కోటు లెల్ల సదసత్తుల జ్ఞాన రూప
మెపుఁగు నట్లు సూరి శక్తి కిరవౌ తెలివిడి నిమ్మా! ॥ 2150

(7)†కళాశ్రీవృత్తము ॥*
వాక్పతివౌ విశ్వకర్మ! ప్రకృతి సృష్టి సర్వస్వము
దిక్పతివౌ నిన్నుఁ జేరి దృఢత లీన మౌచుండును
దృక్పటు శక్తుల్ మహాగ్ని హృదయ శక్తి వేగాలను
బ్రక్పరమాత్ముండ వౌదు! వరలు సాధుకర్మాధిప! ॥ 2151

## సూక్తము—81

ఋషి—భువనపుత్రుఁడు విశ్వకర్మ
దేవత—విశ్వకర్మ

### అర్థాంతరము—2

†(1) విశ్వ గోళ సంచయాలు పెద్ద పిన్న శకలాదులు
నక్షత్రాల్ గ్రహ రాజియు నానావిధ ధూమకేతు
జాల మెల్లఁ బరిభ్రమించు శక్తిని దగు విశ్వకర్మ
రూప మైన భ్రమణశక్తి! ఆపరాని నీ చలనపు

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"అత్యష్టి"చ్ఛందము. (17)

శక్తి పితయె సృష్టి లోక జాలాలను నిలిపె జగతి
నిచ్ఛామాత్రమ్ముగానె యీ దిగ్విశ్రాంతరాళ
మంతటి నావిష్కృతిని జేసి అలరఁ బరివ్యాప్తమ్ముగ
విరాజితము చేయుచుంటి! విపుల విశ్వ శక్తి మీఱ ॥ 2152

†(2) ఈ జగదాశ్రయ మెయ్యది? యేది మూల మౌను జూడ
నుపాదాన కారణ మ్ముండు నెచట? నీ జగతి యె
యే గతి సంజనన మ్మౌ నీ జగత్స్రష్ట దృష్ట
అయిన ఆ పరమేశుం డవనీతల ద్యులోకాల
నన్నింటిని సృష్టించును వ్యాపకతా శక్తి మీఱ
నాచ్ఛాదిత మౌనట్లుగ నఖిల సృష్టి నలరఁజేయు
నన్నిటికిని నాశ్రయుఁడై అధారము కాఁగ నిలిచి
ఉపాదానమై ప్రకృతియె ఒనరు జగదూప మౌచు ॥ 2153

†(3) విశ్వమ్ము నరయుచున్ విశ్వతో ముఖుఁ డౌచు
విపుల బాహువు లలర విశ్వమ్ము బంధించు
విశ్వపాచ్చక్షులన్ విశ్వ చలనము మీఱ
సర్వాస వ్యాపించి సరేశ్వరుం డౌచు
నణు పరమాణువు లాకృతిన్ బ్రకృతిగ
జీవ కోటులలో నిర్జీవకోటులతోడ
దివ్యాది భువ్యాది దీప్త లోకావళుల
నవతరింపఁగఁజేసి అఖిలమ్మునున్ నడపు ॥ 2154

†(4) పంచ భూత సృష్టి నెవఁడు పచరించెను? విచలితముగఁ
బరమేశ్వర కామ్య కర్మ కరణ శీల శక్తి యేదో?
ఆ శక్తియె దివి భువులను నఖిలమ్మును బచరించెను
మనశ్శక్తి మర్మ మెఱిఁగి మనసారా సృష్టి చేసి
సర్వ భువన సంచయా లఖర్వ గతిగ నధివసించి
సర్వ ధారి భారి కాఁగ జగత్కార్య రూపుఁ డౌను ॥ 2155

†(5) ఉత్తమత్వమ్ములన్ ఒనరు మధ్యమ గతుల
నధమ వ్యవస్థలన్ అఖిలమ్మనను నిండు
పంచ భూతావళుల నంచితముగా నిలిపి
క్రమము తప్పని రీతిఁ గ్రమ శిక్షలన్ నడచు
లోకాలఁ బ్రాణులన్ లోలుపత్వము మీఱ
సృష్టి యజ్ఞములోనఁ జెలఁగు హవిషము కాఁగ
సూక్ష్మమ్ముగా సర్వ సూక్ష్మతరమ్ముగా
గరీయాల గురుతరమై శరీరాళులన్ నిల్పి
ఆహారముల్ కూర్చి వ్యాహారముల్ నెరప
నుద్భూతముగఁ జేయు నును రొనఁగి హరియించు ॥ 2156

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) ప్రాకృతమ్మై వెలుఁగు ప్రకృష్టతర శక్తి
విశ్వ సృష్టిని జేసి విశ్వేశుఁడై నిలుపు
విశ్వకర్మా! నీవు పృథ్వ్యాది దివ్యాది
సర్వ భువనాంతరములు పర్వఁగా నిల్పెదవు!
సూరి శక్తులు వెలుఁగ సుజ్ఞాన విజ్ఞాన
ప్రజ్ఞానములతోడఁ బ్రాణు లలరారఁగా
సఖిల సంపద లొసఁగి ఐశ్వర్యముల నిచ్చి
ఆత్మ పరమాత్మల ఆజ్ఞాన ముదయింప ॥ 2157

†(7) శబ్ద శక్తుల నిశ్శబ్ద శక్తుల స్వామి!
అతిలోకమై వెలుఁగు నా మనో వేగాన
నలరారు నో దేవ! అఖిలాఖిల మ్మైన
ఆ ♦విశ్వకర్మలకు నాధార మౌదువులే!
విశ్వ సంపద లొసఁగి ఐశ్వర్యముల నొసఁగి
సర్వ సంక్షేమాల్ సల్లక్ష్యమై నిలువ
విశ్వతో ముఖమైన విశ్వ కళ్యాణాల
సాధు కర్మల హవన సవనా లొసర్పుమా! ॥ 2158

## సూక్తమ్—82

ఋషిః—విశ్వకర్మా భౌవనః
దేవతా—విశ్వకర్మా
ఛందః—త్రిష్టుప్

(1) చక్షుషః పితా మనసా హి ధీరో ఘృతమేనే[1] అజనన్నమ్నమానే ।
యదేదన్తా[2] అదదృహన్త పూర్వ ఆదిద్ద్యావాపృథివీ అప్రథేతామ్ ॥ 850

(2) విశ్వకర్మా విమనా[3] ఆద్విహాయా ధాతా విధాతా పరమోత సందృక్ ।
తేషామిష్టాని సమిషా మదన్తి యత్రా సప్త[4]ఋషీన్ పర ఏకమాహుః ॥ 851

(3) యో నః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా ।
యో దేవానాం నామధా[5] ఏక ఏవ తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా ॥ 852

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦ విశకర్మలకు=విశ్వ సృష్టిలో జరుగు కర్మలకు.

1. మేనే॰అజనన్న, 2. దన్తా॰అదదృహన్త పూర్వ॰ఆదిద్యావాపృథివీ॰అప్ర, 3. విమనా॰ఆద్విహా,
4. సప్త॰ఋషీన్ పర॰ఏక, 5. మధా॰ఏక॰ఏవ తం. (ప్ర. ప్ర.)

(4) త[1] ఆయజన్త ద్రవిణం సమస్మా[2] ఋషయః పూర్వే జరితారో న భూనా ।
అసూర్తే సూర్తే రజసి నిషత్తే యే భూతాని సమకృణ్వన్నిమాని ॥ 853

(5) పరో దివా పర[3] ఏనా పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి ।
కం స్విద్గర్భం ప్రథమం దధ్ర[4] ఆపో యత్ర దేవాః సమపశ్యన్త విశ్వే ॥ 854

(6) తమిద్గర్భం ప్రథమం దధ్ర[4] ఆపో యత్ర దేవాః సమగచ్ఛన్త విశ్వే ।
అజస్య నాభావధ్యేకమర్పితం యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః ॥ 855

(7) న తం విదాథ య[5] ఇమా జజానాऽన్యద్యుష్మాకమన్తరం బభూవ ।
[6]నీహారేణ ప్రావృతా జల్ప్యా చాऽసుతృప [7]ఉక్థశాసశ్చరన్తి ॥ 856

## సూక్తము—82

ఋషి—భువనపుత్రుఁడు విశ్వకర్మ†

దేవత—విశ్వకర్మ

(1)*గద్యము॥

చక్షు రుపలక్షిత మగు నింద్రియ సంఘాత్మక శరీరమునకుఁ బిత యగు విశ్వ కర్మ "నహిమత్సమోకశ్చిదస్తి" అని మొట్టమొదట నుదకమును సృజియించెను. పిమ్మట ద్యావా భూములు జలమునందుఁ జలించుచుండెను. తర్వాత నా ద్యావా భూమి సంబంధము లగు పర్యంత ప్రదేశములు దృఢము లయ్యెను. అనంతర మవి యథాకామము ప్రథితము లయ్యెను ॥‡ 2159

1. తऽఆయజన్త, 2. మస్మాऽఋషయః, 3. పరऽఏనా. 4. దధ్రऽఆపో, 5. యऽఇమా, 6. నీహారేణ, 7. సుతృపऽఉక్థశా. (వ్రా. ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 183వ పుటలో నీ సూక్తమునకు ఋషి "భువనపతి విశ్వకర్మ"గాను, 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "విశ్వకర్మ"గాను నిర్దేశించుచు శ్రీ నేమానివారు ,, డిటో వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

‡ప్రారంభమున జల ముండె ననియు అందు ద్యావా భూములు తేలుచుండె ననియు నిది యొక సృష్టి క్రమ మిందు వర్ణింపఁబడెను. ఇతర గ్రంథములయందును- "అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమపాసృజత్ తదండ మభవద్ధైమం" మొదలగునది గలదు. నే. వేం. న. శా.

- దేవతార్థము -

(2)*గద్యము॥

బహువిధ ప్రకాశవృష్టి ప్రదానాది కర్మలకుఁ గర్త యగు నాదిత్యుఁడు, విభూత మనస్సు గలవాఁడై, మహాత్ముఁడై, ధాతయై, జగత్కర్తయై పరముఁడై, సందృష్టయై యుండెను. సత్‌జ్యోతిస్సుల స్థానము లన్నముచే నే యాదిత్యునియందు సమ్మోదించుచున్నవో: యా యాదిత్యుని సప్తర్షులకంటె భిన్నునిగాఁ జెప్పుచున్నారు ॥ 2160

- ఆధ్యాత్మికార్థము -

*గద్యము॥

పరమాత్మ ప్రాణ ప్రకాశములచే నుపేతుఁడై బహు కర్మ గలవాఁ డగుచున్నాఁడు. అతఁడు విభూత మనస్సు గలవాఁడై, మహాత్ముఁడై ధాతయు విధాతయు నై యిందిృయ ద్రష్టయై వెలుఁగుచున్నాఁడు. ద్రష్ట లగు నిందిృయములు అన్నమున సమ్మోదించుచున్నవి. సర్వజ[1] స్వభావములకంటె భిన్న మైనట్టియు, నిందిృయా వ్యతీత మైనట్టియు నొక్క వానిని బరమాత్మగాఁ జెప్పుచున్నారు ॥ 2161

(3)*గద్యము॥

ఏ విశ్వకర్మ కేవలము మాకుఁ బాలకుఁడే కాక యుత్పాదకుఁడు[2] నగుచున్నాఁడో: ఎవఁడు విధాతయో: సర్వ జగదుత్పాదకుఁడో: ఎవఁడు దేవతా తేజస్స్థానముల నెరుంగుచున్నాఁడో: భూత జాతముల నెరుంగుచున్నాఁడో: ఎవఁడు అగ్ని వాయ్వాది నామ ధాతయో: (ఇంద్రాదుల నిర్మించి వారి కింద్రాది నామములను బెట్టి వారి స్థానములయందు వారిని స్థాపించువాఁడో:) యట్టి వానిని భూతములు పొందుచున్నవి ॥ 2162

(4)*గద్యము॥

ఎవఁడు స్థావర జంగమాత్మక మగు జగత్తునందున్న ప్రాణులను స్వతేజస్సునఁ బూరించుచున్నాఁడో: పూర్వ మహర్షు లా యాదిత్యుఁ డగు విశ్వకర్మకొఱకుఁ దేజస్సును సమకూర్చిరి ॥ 2163

(5)*గద్యము॥

ఈశ్వరతత్త్వ మనునది యెట గలదో: యది ద్యులోకముకంటెను, బృథ్వికంటెను, దేవతల కంటెను, అసురులకంటెను, బరస్తాద్వర్త మాన మగు గుహాఽవస్థిత గర్భమును (గర్భవద్ గ్రాహక తత్త్వమును)అప్పులు తొల్లి ధరించినవి. ఆ గర్భమందు నింద్రాదు లందరు సంగతులై పరస్పరము చూచుకొనుచున్నారు. (ఇట్లు తెలిసికొనుచు నొక తత్త్వవిత్తు "కః పరమేశ్వరః" అని ప్రశ్నించుచున్నాఁడు) ॥ 2164

(6)*గద్యము॥

ఆ గర్భస్థానీయమును దొల్లి యప్పులు ధరించినవి. ఏ గర్భమందు సర్వదేవతలు సంగతు లగుదురో: ఆ యజముయొక్క నాభియం దొక యండ మమర్పఁబడెను. ఆ యండమున సర్వ భూతములు నివసించుచున్నవి ॥ 2165

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. సర్వజ స్వభావములుకంటె. (వ్రా.ప్ర.పా.) 2. యుద్పాదకుఁడు. (వ్రా.ప్ర.పా.)

(7)*గద్యము॥
అహం ప్రత్యయ గమ్యు లగు జీవులయొక్క యంతరము అహం ప్రత్యయ గమ్యాఽతిరిక్త
మగు సర్వేశ్వర తత్వ మగుచున్నది. ఓ నరులారా! మీరు నీహార సదృశ మగు
నజ్ఞానమున నావృతు లైనవారు. "నేను దేవతను. నేను మనుష్యుఁడను" అను
ననృత జల్పమునఁ గూడుకొన్నవారలు, ఉదరంభరు లగు వారలు కావున
భూత జాతమును బుట్టించిన విశ్వకర్మను దెలిసికొనలేరు ॥ 2166

## సూక్తము—82

ఋషి—భువనపుత్రుఁడు విశ్వకర్మ
దేవత—విశ్వకర్మ

### అర్థాంతరము—1

†(1) ఆకాశ వాయువు లనల జల పృథ్వుల
కన్నిటికి నాదియై ఆధారభూత మౌ
మనసె పితగా వెల్గ మహిత కాలముఁ గలిసి
ప్రకృతిగ నీ సృష్టి ప్రకటించెఁ దొల్దొల్తఁ
బ్రాగ్దక్షిణమ్ములన్ బశ్చిమోత్తరము లౌ
దిశలె సరిహద్దులై దివ్యాది లోకాలు
భువ్యాది భువనాలు పూర్ణ మూర్తులు కాఁగ
నాద్యంతములు మీఱ నవతరించంగా ॥ 2167

†(2) సప్తాఽనలమ్ములకు సప్తాఽనిలమ్ములకు
సప్త విధ జలములకు సప్త మృత్ తతికెని
నాకాశ పరమైన ఆవరణ సప్తకమున
కందకుండఁగ సదా ఆ పంచభూతాళి
కతీతమై సృష్టి నతిలోకమై వెల్గు
నా వైష్ణవాదిత్యుఁ డా విశ్వకర్మగా
మనసు కతీతమౌ మహిమాఽన్విత శక్తి
ధాతగా వెలింగి విధాతగాఁ దనరుచున్
ఏకైకుఁడై సర్వ మిష్ట పూర్తిగ నేలు
హేలగా లీలగాఁ గేళిగా మేలుగా
సచ్చిదానందాలు నిచ్చలున్ దనరార
నఖిల విశ్వము కర్మ లన్నియున్ దా నౌచు ॥ 2168

†(3) ఆకసమ్ము ననిలాఽనలాఽంబు మృత్ తతు లన్నిటి
భువన లోక సంచయాలఁ బుట్టించిన వాఁ డెవ్వఁడో!
అఖిల సృష్టి తండ్రికాఁగ నలరారెడి ఆ దేవుఁడె
ఏకైకుఁడు కాఁగ విశ్వ మేలు దేవదేవుఁ డౌను ॥ 2169

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) చరము నచరమై యొప్పెడి సకల సృష్టిలో వెలుఁగులు
యజ్ఞములై పంచ భూత విజ్ఞానము విస్తరిల్ల
భూనభోఽంతరాళాదుల భువనా లవి పృథ్వీ దివులు
చలితములౌ లోకములై సత్వరజస్తమోగుణ
సంచయమ్ము సహజమ్మై సంచితమ్ముగా నిల్చుచు
నహోరాత్రులై వెలయఁగ నాదిత్యుం దలరుచుండు
నన్నింటికి నాద్యుఁ డౌచు నా వైష్ణవ శక్తి మీఱ
విశ్వ సృష్టి కర్మ చేయు విశ్వేశ్వరుఁడై తనరుచు ॥ 2170

†(5) దివు లన్నిటి కతీతమై దేవాఽఽవళి కతీతమై
అసురాళికి నందకుండ నవగతమ్మై కాకుండఁగ
పృథ్వ్యాది లోకాలకు నితరమ్మై యీశ్వరమై
విశ్వాఽతీత మ్మౌచును శాశ్వత గతి వెలుఁగు శక్తి
ఆద్యంతము లేని శక్తి అధినాథుఁడు లేని శక్తి
తొలి వేల్పుల మలి వేల్పుల నలరించెను నఖిల సృష్టి ॥ 2171

†(6) అజనాభదేవ దేవై కైకనాథుఁడై
ఆ శ్రీమహావిష్ణు వఖిలాంతరంగుఁడై
సృష్టి విశ్వాలలోఁ జెలఁగు భువనాఽఽవళుల్
దేవాఽఽళి కల్పించి దివ్యగర్భము లౌనఁగి
తొలి సృష్టి ప్రక్రియకు మలి సృష్టి ప్రక్రియకుఁ
బ్రాకృత శక్తులకుఁ బ్రతికృతులఁ గల్పించె ॥ 2172

†(7) నీరె నీహారమై నీరుగా నీహార
మలరారు రీతిగా నఖిల సృష్టిని ద్వంద్వ
శక్తు లవి లే వనుచు సర్వమ్ము నెఱుఁగుచున్
నీవు నే నను భేద భావాలు లేకుండ
నంతరములే లేని ఆంతర్య మొకటిగా
సకలమున్ జల్వమై సంచరించు నటంచు
సృష్టి స్వరూపమ్ము సృష్టి స్వభావమ్ము
వ్యష్టి సమిష్టులుగ నా మహావిష్ణువే
విశ్వమ్ము నే నడప [1]విశ్వకర్మల నడప
శాసించినట్లుగా సర్వమ్ము నడచుచున్
బాహ్య గతులన్ సృష్టి వరలు స్థితి గతు లెల్ల
నంతర్గతులుగా నంతయున్ లయ మౌను ॥ 2173

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. విశ్వకర్మలు=సృష్టి సంచలన-ఆకర్షణ-వికర్షణాది కర్మలు.

## సూక్తము—82

ఋషి—భువన పుత్రుఁడు విశ్వకర్మ†

దేవత—విశ్వకర్మ

### అర్థాంతరము—2

†(1) విశ్వ సృష్టియె కర్మ విశ్వ స్థితి గతి కర్మ
విశ్వ వ్యాకోచమ్ము విశ్వ సంకోచమ్ము
విశ్వ సంచలనముల్ విశ్వమ్మె కర్మలే!
కాంచుటలు కర్మ కనిపించుటలు కర్మ
వినుటలున్ గర్మలే వినిపించుటలు కర్మ
మన సౌటయె కర్మలే! మననమ్మె కర్మలే!
ధరణ ధారణములు కర్మ భరణ భారణములు కర్మ
దశదిశలే కర్మలై దిశాంతాలె కర్మలై
అనిలాదులు కర్మగా నాకసమ్ము కర్మగా
వరుణాదులు కర్మగా నఖిలమ్మును గర్మలై
కలుగు దివి భువుల కెల్లఁ గర్మాధిపతిగఁ బితగఁ
గర్మయే కర్తయౌఁ గర్తయే కర్మ యౌ ॥ 2174

†(2) ఆ జగత్కారకుఁడు నా జగన్నాయకుఁడు
దివి భువుల నన్నింటిని రవి శశి నక్షత్ర
గ్రహ రాజులన్ సర్వ కాంతి పుంజాఽఽవళుల
సృష్టించెడి మహా స్రష్ట ఏకైకుఁడై
సప్త పదార్థాల సుప్త జాగృతి గతు
లన్నింటి కధిపతిగ నా విశ్వకర్మయే
ప్రభ సూక్ష్మ జీవాత్మ పరమాత్మ తత్వాల
నానంద శోకాల నగు కష్ట సుఖముల
కాది కారకుఁ డౌచు నఖిల ద్రష్టగ నిలిచి
యిష్ట మనిష్టముల్ సృష్టి సహజము చేయు ॥ 2175

†(3) ఎవఁడు విశ్వ సృష్టి చేసె? నెవఁడు ప్రాణములను బోసె?
నెవఁడు విశ్వపాలకుండొ? యెవఁడు విశ్వ విజ్ఞానియొ!
ఎవఁడు విశ్వ గోళ లోక భువనాఽఽవళులఁ బదార్థాల
నెంతేనియు నెఱుఁగువాఁడొ? సృష్టిలోని సమస్యలకు
సమాధాన మౌ నాతఁడు సర్వేశుఁడు సుర తతి పిత
అద్వితీయుఁడై వెలిఁగెడు నాతండే విశ్వకర్మ ॥ 2176

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) చక్రనేమి క్రమ గతులన్ సర్వ జగము కలిగించుచు
సకల మైన పదార్థాల శక్తి మీఱ సృష్టించుచు
ద్రుత గతిమై విశ్వ సృష్టి సతతమ్మును నడుపుచుండి
సంయోగము వినియోగాల సర్వ చరాఽఽచరాఽఽవళుల
భూత జాత సర్వస్వము పుట్టించుచు గిట్టించుచు
నఖిల సూత్రధారి గాఁగ నా దేవదేవుఁ డలరు ॥ 2177

†(5) దివి భువులకు నతీతుండు దేవాఽఽళుల కతీతుండు
నసుర మానవాదులకును నఖిల ప్రాణి కోటి కెల్ల
నతీతుఁడై ఆకసమున కనిలాఽనల సలిలాలకు
మృత్పదార్థాది సర్వ జగత్ పదాఽతీతుఁ డౌచు
నలరారెడి విశ్వేశుఁడు నణువులఁ బరమాణువులను
నన్నింటిని భరియించుచు నతీతుఁడై వెలుఁగుచుండె
దివ్య దేవ శక్తి తత్వ దీప్త గర్భ హిరణ్మయుఁడు
తనరారఁగ విశ్వమ్మును గని పెంచును దహించునతే: ॥ 2178

†(6) అణు పరమాణువు లౌచును నలరు విశ్వ పదార్థాల
సృష్టి మీఱ ధరియించుచుఁ జెలఁగి భరించుచును సదా
విశ్వ లోక భువనాలను విశ్వ విరాడ్ రూప మంది
అజన్మతో స్వయంభువత సనాతనంపు నాభినుండి
ఆవిష్కృతి చేసి నిలుపు ననమాన మహా శక్తుల
హిరణ్య గర్భ రూపతమై యెనఁగు నా విశ్వేశుఁడు ॥ 2179

†(7) లోకాఽఽవళులను సర్వ లోకాఽంతర గతుల తతుల
సృష్టి చేసి విశ్వమ్మునఁ జెలఁగి సర్వ వ్యాప్తి నొంది
అంతర్గతి నలరుచుండి అతీతుఁడై వెలుఁగుచుండి
జలమె నీహార మ్మని జలమౌ నని నీహారమె
జల్పిత రతి భ్రమజ మతిన్ జగద్గతిని గుర్తించుచు
విశ్వేశుఁడు శాస్త యగుచు విశ్వమ్మును నడుపు ననుచు
అజ్ఞానపుఁ దిమిరాంధత లంతరించఁగా జగతిని
సర్వ మాత్మ మయ మ్మనుచు సచ్చిదానందాలను
పర తమ భేదాలు లేని తన పర వాదాలు లేని
దివ్య దేవ దేవ రూప దీధితులను గుర్తింపుము: ॥ 2180

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్మమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

# సూక్తమ్—83

ఋషిః—మన్యుస్తాపసః

దేవతా—మన్యుః

ఛందః—త్రిష్టుప్; 1-జగతి

(1) యస్తే మన్యో[1]ఽవిధద్వజ్ర సాయక సహ[2] ఓజః పుష్యతి విశ్వమానుషక్ ।
[3]సాహ్యామ దాసమార్యం త్వయా యుజా సహస్కృతేన సహసా సహస్వతా ॥ 857

(2) మన్యురిన్ద్రో మన్యురేవాస దేవో మన్యుర్హోతా వరుణో జాతవేదాః ।
మన్యుం విశ[4] ఈళతే మానుషీర్యాః పాహి నో మన్యో తపసా సజోషాః ॥ 858

(3) అభీహి మన్యో తవసస్తవీయాన్ తపసా యుజా వి జహి శత్రూన్ ।
అమిత్రహా వృత్రహా దస్యుహా చ విశ్వా వసూన్యా భరా త్వం నః ॥ 859

(4) త్వం హి మన్యో[5] అభిభూత్యోజాః స్వయంభూర్భామో [6]అభిమాతిషాహః ।
విశ్వచర్షణిః సహురిః సహావానస్మాస్వోజః పృతనాసు ధేహి ॥ 860

(5) అభాగః సన్నప పరేతో [7]అస్మి తవ క్రత్వా తవిషస్య ప్రచేతః ।
తం త్వా మన్యో [8]అక్రతుర్జిహీళాహం స్వా తనూర్బలదేయాయ మేహి ॥ 861

1. మన్యోఽవిధ, 2. సహఽఓజః, 3. సాహ్యామ దాస, 4. విశఽఈళతే, 5. మన్యోఽఅభి, 6. భూర్భామోఽఅభి, 7. పరేతోఽఅస్మి, 8. మన్యోఽఅక్రతు. (వా). వ్ర).

(6) అయం తే[1] అస్మ్యుప మేహ్యర్వాఙ్ ప్రతీచీనః సహురే విశ్వధాయః ।
మన్యో వజ్రిన్నభి మామా వవృత్స్వ హనావ దస్యూఁరుత బోధ్యాపేః ॥ 862

(7) అభి ప్రేహి దక్షిణతో భవా మే ఽధా వృత్రాణి జఙ్ఘనావ భూరి ।
జుహోమి తే ధరుణం మధ్వో[2] అగ్రముభా ఉపాంశు ప్రథమా పిబావ ॥ 863

## సూక్తము—83

ఋషి——తపఃపుత్రుఁడు మన్యువనెడువాఁడు†
దేవత——మన్యువు†

(1)*గీ॥ మన్యు దేవ! నీకు మాన్యుఁ డెవ్వఁడు పరి
చర్యఁ జేయువాఁడొ! శక్తుఁ డతఁడు
బలము, తను బలంబుఁ బ్రధనమునం బొందు
వైరి హింసకుండ! వజ్ర ధారి! ॥ 2181

*గీ॥ బలముచేఁ బుట్టి యత్యంత బలము గల్గి
మిగుల సహనంబు వహియించి మెలఁగు నీవు
సత్సహాయంబు మా కెల సలుపుచుంట
నభిభవింపంగఁ గలవార మరుల మేము ॥ 2182

(2)*ఉ॥ మన్యువె యిందుఁడై పరఁగు మన్యువె దేవుఁడు సర్వ భూ స్థలిన్
మన్యువె హోమ కారకుఁడు మన్యువె సర్వముగా వెలింగె నా
మన్యువునే విశేషముగ మానవు లెల్ల నుతింత్రుగాన నో
మన్యువ! నీవు తండ్రి వలె మాకు నొసంగుము! రక్ష నెమ్మె యిన్ ॥ 2183

---

1. తే॰ఽఅస్మ్యుప, 2. మధ్వో॰ఽఅగ్రముభా॰ఽఉపాంశు. (వ్రా. ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 187 పుటలో నీ సూక్తమునకు ఋషి "తపఃపుత్రుఁడు మన్యు వనెడువాఁడు"గను-దేవత "మన్యువు"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "మన్యువు"గాను-దేవత "మన్యువు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.
*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(3)*గీ॥ బలము గలవానికంటెను బలము గల్గు
మన్యు! మా కృత యజ్ఞంబు మనుచుచుండి
నీవు మా పిత సాయాన నేర్పు మీర
శత్రువుల నెల్లఁ జెండుము! శక్తి మీర! ॥ 2184

*గీ॥ వృత్ర హంతవు[1] మరియు సమిత్రహంత
వఖిల శాత్రవ గణ హంత వగుచు దస్యు
హంతవై నట్టి మన్యువా! పంత మలర
నీవు నసువులఁ గొనితెమ్ము! [2]నేరిమిమెయి ॥ 2185

(4)*చ॥ వర బల నాశకుండవయి భాముఁడవై సకలారి జేతవై
నిరుపమ జన్మముం గలిఁగి నిత్యము సర్వముఁ జూచువాఁడవై
వర మతినొప్పుచున్ సహనవంతుఁడవై వెలుఁగొందు మన్యువా!
సురణములందు మా కొసఁగుఁ జోద్య బలంబుఁ బ్రశస్త మౌనటుల్ ॥ 2186

(5)*గీ॥ ఓ ప్రచేతస్స! మన్యు! నీ యుచిత కర్మ[3]
భాక్కునై యుండకుండుట బవరమందు
శాత్రవాఽభిహతుండనై చాల దూర
మరగినాఁడను ధైర్యము కరము కలిఁగి ॥ 2187

*గీ॥ కర్మరహితుండ వౌ[4] నిన్ను ఘనుఁడ! మన్యు
వా! కడుం గ్రుద్ధునిగఁ జేసి యమరినాను[5]
దనువువై నీవు [6]నా కిలఁ దగిన బలము
నొసఁగ నా చెంతఁ జేరుమా! మసలకుండ ॥ 2188

(6)*గీ॥ శత్రు సహన శీల! సర్వధారక! మన్యు
కర్మఁ[7] జేయుచుందుఁ గరము నీకు
నందుచేత నాకు నభిముఖంబుగ[8] దుగ్రత
మరుగఁదెంతుగాక నతిశయించి ॥ 2189

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మిత్రహంతవు. (వా.ప్ర.పా.), 2. గొనితెమ్ము! నిశ్చయముగ, (తొ.పా.), 3. నీ యుచితకర్మ, చే నబాగుండనై యుద్ధచేష్టయందు, (తొ.పా.), 4. భాగరహితుఁడవౌ నిన్ను భవ్యమన్యు, (తొ.పా.), 5. యమరియుంటి, (తొ.పా.), 6. నాకెల్ల, (తొ.పా.), 7. కర్మఁజేయువాఁడ, (తొ.పా.), 8. దుగ్రత, మరుగఁదేరవలయు నాదరమున. (తొ.పా.)

*గీ॥ వజ్రి! మన్యువ! నీ విష్ణు వచ్చి వేగ
విశ్రమింపుము! నాయందు విపుల గతిని
ధరణి శత్రువు లైనట్టి దస్యుల మరి
బంధువులఁ గూడ నెఱుఁగుము! దవ్యగతిని ॥ 2190

(7)*గీ॥ నాదు యుద్ధమునకు వచ్చి సాదరమున
నాకు దక్షిణమందున్న భీకరు లగు
శాత్రవుల నెల్ల సహస మా శక్తితోడఁ
జంపఁగలవార మగుదము చతుర మన్యు! ॥ 2191

*గీ॥ మన్యువా! నీకు శ్రేష్ఠమౌ మధుర సోమ
రసము నిచ్చుచు నున్నాఁడ నసమ భక్తి
నీవు నేనును దానిని నిశ్చలముగఁ
బానమును జేయుదముగాకఁ బరమ మన్యు! ॥ 2192

## సూక్తము—83

ఋషి—తపఃపుత్రుఁడు మన్యువు
దేవత—మన్యువు

### అర్థాంతరము—1

†(1) విశ్వ మానవాత్మమ్మున నశ్వరమౌ మన్యు శక్తి
ఆ సహస మ్మనాహత మ్మచంచల మ్మై వెలయఁగ
సుప ర్మధోలోకమ్ముల నోజో గుణ మెల్ల నింప
సనమానవు నస్త్రాగ్ని నిశా పవి విధ్వస్త మగును
వీర శూర ధీర గతు లపార మైన విజయ మిచ్చు
దీప్త లెల్ల వశము లౌను దేవుఁడైన దాసుఁడౌను ॥ 2193

†(2) ఇంద్ర శక్తు లెల్ల నింపు నెసఁగు దైవ శక్తు లుండు
వరుణ శక్తి వరలుచుండు జ్వలితాగ్నుల శక్తు లమర
ఋక్షశక్తుల ఋత శక్తుల హ్యాచ్ఛక్తుల హోర కాఁగ
మన్యు శక్తి తనరారును మహా మహితమై నిల్చును
నాత్మ రక్షణమ్ము నిచ్చు సంరక్షక గతుల నిచ్చు
ద్వేష్య మధ్వేష్యమ్ము కాఁగ వశ్యమాన విశ్వ రూప
శశ్వదత్ర కాంతి జాల సర్వస్వము మన్యువులో
అక్షయమై యుండు మా రక్షా కవచమ్మై యగును ॥ 2194

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) అభయ శక్తి యుక్త మౌచు నగ్ని కాత్మరూప మౌచు
వెలుఁగొందెడి ఓ మన్యువ! వృష్టి శక్తి హరియించుచు
నుష్ణరూప మొందు వృత్రు నుత్తమాంగ విచ్ఛేదన
మొనరించుచు జలనాభిని నుదక శక్తిమయ మొనర్చి
శాత్రవ తండాల నెల్ల నమయించుచు సకల రూప
ఘోర రూక్ష రక్షస్సులఁ గ్రూరముగా సంహరించి
సర్వలోక ప్రాణి జాల సంక్షేమము కావించుచు
విశ్వసృష్టి వసు శక్తుల నశ్వరముగఁ గాపాడుము ॥ 2195

†(4) స్వయముగానె జననమై స్వాయంభువత్వాన
సువిశాల మహా హృదయ సూనృతత్వమ్ము వెలుఁగ
నరి భయంకర మైన అజయ్య మౌ శక్తి
సహజౌజ పర రూప సర్వ సృష్టి "క్షేమ
కారి"గాఁ దనరారు ప్రాంత మన్యు సుదీప్తి
విశ్వమ్మున వ్యాప్తమై విలయ కేతన మ్మొనుతె! ॥ 2196

†(5) ఆ అనాహత శక్తి నలరారు హృదయాన
నతిలోక శక్తులన్ మితి లేని శక్తులన్
సమకూర్చు మన్యు నస్మంత్రాక్షరా లెల్ల
ననలాల ననలమై అనిలాల ననిలమై
జలములకు జలము నై ధరణులకు ధరణియై
అంతయున్ శూన్య మౌ నాకాశముల నెల్ల
నాకాశ మై తనరి అక్షరమ్ము గొలువఁగా
సత్యాద్భుత బలాన సన్నింపఁ దనరుతే! ॥ 2197

†(6) దుష్ట శాత్రవ తతుల దుర్మంత్ర తంత్రాల
విధ్వస్త మొనరించి విమల నిర్భేద్య మౌ
వపురూప శక్తిగా నలరారు మన్యువా!
అక్షర శక్తులన్ అక్షయమ్మౌ రూప
మలరారు నీ శబ్ద జ్వలితానల శక్తి
నాత్మ శక్తిగఁ జేయ నతిలోక మై వెలయు
వజ్ర వజ్రాయుధము వ్రక్కలుగ ముక్కలుగ
రాల్చు నీ పవి శక్తి పవులకే పవి గాఁగ
రవులకే రవి కాఁగ రాజించి మించులే!
శత్రు జాలము నెల్ల నమయింపఁ జేయులే! ॥ 2198

†రచయిత :—వాఙ్మయ మహోదృష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) మన్యు సోమ శక్తి మీఱు మహితమ్మై సుహితమ్మై
చాతుర్యము తనరంగా సర్వ శత్రు తతులఁ జంపు
దక్షిణ దిశ శత్రు దస్యు తండాలన్ దున్మాడును
నజయ్యంపు సహన శక్తి అభేద్యమై నిలువంగాఁ
గరాళాఽగ్ని గరళాఽగ్నులు నిరాటంక మౌ రీతిని
బరాక్రమించు వృత్ర శక్తి పరాభూత మై పోగా ॥ 2199

## సూక్తము--83

ఋషి—తపఃపుత్రుఁడు మన్యువు
దేవత-—మన్యువు

## అర్థాంతరము—2

†(1) వజ్ర రూప దృఢ బలాల వరలు సాయక విష శక్తుల
విధ్వస్తము చేయు మన్యు విమల సహన శక్తులెల్ల
బాహ్యాంతర తను మనముల బలము లఖిల పుష్టములై
దైవీయాఽదైవీయ క్రూర దస్యు రూప తండాలను
అభిభూతము కావించును నక్షయమౌ పద గతులను
నక్షరమౌ శబ్ద సిద్ధి దక్షత లవి వెలుఁగొందఁగ ॥ 2200

(2)†గోపశ్రీవృత్తము॥*
విద్యుచ్ఛక్తుల విలసనములతో
సద్యోరూప విశద వరుణ గతిన్
ఖద్యోత మ్మగు ఖర కర శుచిగా
విద్యోతాగ్ని పవి బహు శిఖులమై
సు ద్యో శక్తుల సుగుణ సహనతల్
విద్యోద్భాసిత విమల మహిత మ
న్యోద్యోగాద్భుత నుత విజయముగాఁ
బ్రిద్యోతాఽరుల రణ దనుజ తతుల్
ఆద్యంతాలను నపమరణ గతిన్
నుద్యద్ఘాతల నసురుల విడుచున్ ॥ 2201

†(3) బలములకె బలముగా వరలెడి మన్యువే
అన్యాయముల నెల్ల నణిముణిగఁ గొట్టుచున్
విశ్వ సంక్షేమాల విశాలతా హృదిని
నతిమైత్రి గోరుచు న్నసుర నాశము చేసి
సౌభాగ్య సంపదల జగము వర్ధిల్లఁగా
నైశ్వర్య తతులతో నఖిల మౌ శుభమయము ॥ 2202

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"జగతీ"చ్ఛందము. (12)

(4)†కృష్ణశ్రీవృత్తము॥*

దుర్విరోధ భావ రహిత ధృతిమంతము తన్మన్యువు
వర్వి సర్వ సత్త్వ సహిత వ్రకటాఽద్భుత శక్త్యుజ్జ్వల
దూర్వహాగ్ని ప్రజ్వలిలఁగ దురితాఽంధజ దుర్వీర్యజ
ఖర్వ రాక్షసాధములను ఖర కాంతులు దున్మాడును ॥ 2203

†(5) మన్యు శక్తి లేనినాఁడు మనుజుఁ డైన దనుజుఁ డైన
సుర కిన్నర యక్షు లైన సురపతు లే దక్షు లైన
శాత్రవ తతి శక్తులతో సంకుల సమరాంగణాల
నోడిపోయి కూలిపోయి మాడిపోయి మరణింతురు
ఎవ రైనను దోడు లేని యేకైకుం డైనఁగాని
మన్యు శక్తి గల్గు వాఁడు మహిమాన్వితుఁడై వెల్గును
చిత్త చేతనమ్ము మించు హృత్తు రూపె మిత్తిగాఁగ
వైరి వీర తండాలను నేరివేయుఁ బారఁద్రోలు ॥ 2204

†(6) మన్యు రూప మహిత శక్తు లగణ్యముగఁ గల్గునపుడు
శాంతి శక్తి పరిఢవిల్లు సర్వ భాగ్యముల్ వర్ధిలు
నద్భుత రవి శక్తి మించి అలరు వజ్రాయుధమ్ము
వవుల మీఱు పవి కాఁగను బవులకే పవి కాఁగను
దనరారును- శత్రుతతులఁ దునుమాడును వెన్నంటుచు-
ఏకైకమ్మె విశ్వము నేలఁగల్గు మేలు కల్గ ॥ 2205

†(7) దాక్షిణాత్య రాక్షసాళి దండించుచు ఖండించుచు
జల నాభిని మ్రింగివైచు ఖల వృత్రుని దు్రించివైచి
విశ్వమునకు విహితమైన విమలాఽమృత సలిల మొసఁగి
సోమ శక్తి విరాజిలఁగ సూర్య చంద్ర దీప్త లెనయ
సర్వ జగము శాంతి యుక్త శర్వమ్ములఁ బర్వముగా
మన్యు శక్తి విరాజిలును మహిత పరాక్రమత మీఱ ॥ 2206

## సూక్తమ్—84

ఋషిః—మన్యుస్తాపసః
దేవతా—మన్యుః
ఛందః—జగతీ, 1-3-త్రిష్టుప్

(1) త్వయా మన్యో సరథమారుజన్తో హర్షమాణాసో ధృషితా మరుత్వః ।
తిగ్మేషవ[1] ఆయుధా సంశిశానా అభి ప్ర యన్తు నరో[2] అగ్నిరూపాః ॥ 864

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ధృతి"చ్ఛందము. (18)

1. తిగ్మేషవఽఆయుధా సంశిశానాఽఅభి, 2. నరోఽఅగ్ని. (వా్ర.ప్ర.)

(2) అగ్నిరివ మన్యో త్విషితః సహస్వ సేనానీర్నః సహురే హూత[1] ఏధి ।
హత్వాయ శత్రూన్ వి భజస్వ [2]వేద ఓజో మిమానో వి మృధో నుదస్వ ॥ 865

(3) సహస్వ మన్యో[3] అభిమాతిమస్మే రుజన్ మృణన్ ప్రమృణన్ ప్రేహి శత్రూన్ ।
ఉగ్రం తే పాజో నన్వా రురుధ్రే వశీ వశం నయస[4] ఏకజ త్వమ్ ॥ 866

(4) ఏకో బహూనామసి మన్యవీళితో విశంవిశం యుధయే సం శిశాధి ।
అకృత్తరుక్ త్వయా యుజా వయం ద్యుమన్తం ఘోషం విజయాయ కృణ్మహే ॥ 867

(5) విజేషకృదిన్ద్ర[5] ఇవానవబ్రవో ఽస్మాకం మన్యో[6] అధిపా భవేహ ।
ప్రియం తే నామ సహురే గృణీమసి విద్మా తముత్సం యత [7]ఆబభూథ ॥ 868

(6) ఆభూత్యా సహజా వజ్ర సాయక సహో బిభర్ష్యభిభూత[8] ఉత్తరమ్ ।
క్రత్వా నో మన్యో సహ మేద్యేధి మహాధనస్య పురుహూత సంసృజి ॥ 869

(7) సంసృష్టం ధనముభయం సమాకృతమస్మభ్యం దత్తాం వరుణశ్చ మన్యుః ।
భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో[9] అప ని లయన్తామ్ ॥ 870

1. హూతఽఏధి, 2. వేదఽఓజో, 3. మన్యోఽఅభి, 4. నయసఽఏక, 5. కృదిన్ద్రఽఇవాన, 6. మన్యోఽఅధిపా, 7. యతఽఆబభూథ, 8. భిభూతఽఉత్తరమ్, 9. పరాజితాసోఽఅప. (వా.ప.)

## సూక్తము—84

ఋషి—తపఃపుత్రుఁడు మన్యు వనువాఁడు†

దేవత—మన్యువు†

(1)*చ॥ అతిశయ హృష్టులై మిగుల నాయుధ పాళికి సానఁ బెట్టుచున్
విలసిత మహోష్టి సేన లగు వీర మహేంద్రముఖాదు లెల్ల సం
మ్మతి నిను పిల్తురే రథము మారుత నెక్కి ప్రశస్త మన్యు! వి
స్తృత మగు యుద్ధ మందు ననుఁ జేరుచు సాయ మొనర్తు గాకొనిన్ ॥ 2207

(2)*గీ॥ పావకుని మాడ్కి మన్యువా! ప్రజ్వలించి
సేన కధిపతి వై శత్రు సేనఁ జంపి
సహన శీలుఁడ! శాత్రవ సకల ధనము
తెచ్చి మా కిమ్ము! బలమును నిచ్చుచుండి ॥ 2208

(3)*ఉ॥ మన్యుఁ దిరస్కరింప నభిమానము గల్గినవారిఁ జంపి నీ
వెమ్మెయి నైన వారు మఱి యెప్పుడు దీనము నొందకుండు న
ట్లిమ్ముగఁ గూర్పుమోయి! త్వదీయ మహోగ్ర బలంబు శత్రువుల్
వమ్ముగఁ జేయకుండ నల వైరుల వశ్యులుగన్ విధింపవే! ॥ 2209

(4)*గీ॥ ఒక్కఁడవె నీవు మన్యువా! పెక్కు రైన
శత్రువుల నెల్లఁ జంపంగఁ జాలఁగలవు
కావున మదీయ శత్రుని గదనమునకుఁ
దీక్ష్ణతరముగఁ జేయు మే తీరు నైన ॥ 2210

*గీ॥ ఓ యవిచ్ఛిన్న దీప్తుఁడా! యోయి! మన్యు!
తావక సహాయ సంపత్తిఁ దాల్చి మేము
విజయ మందంగ ఘోషను వేడ్క మీరఁ
జేయుఁగలవార మగుదుము శ్రీలు చెలఁగ ॥ 2211

† వ్రాతప్రతి 1వ సంపుటము 189వ పుటలో నీ సూక్తమునకు ఋషి "తపఃపుత్రుఁడు మన్యు వనెడు వాఁడు"గను-దేవత "మన్యువు"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "మన్యువు" దేవత "మన్యువు" అను భావముతో ,, అని డిటో గుర్తులు శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(5)*గీ॥ మన్యు! నీవు మహేంద్రుని మాడ్కి విజయ
వగు చనిందిత వచనుండ వగుదువయ్య!
అందుచే మాకు నీ మహా యజ్ఞమందు
నీవు రక్షిత వై ప్రీతి నిలువు మెపుడు ॥ 2212

*గీ॥ శత్రు సహన శీల! చక్కని నీ స్తోత్ర
మును రచింతుమయ్య, కనుక మిగుల
వృద్ధిఁ బొందుచుందు వీవు బలోద్గమ
యిత వటంచు నేను మతిఁ దలంతు ॥ 2213

(6)*గీ॥ వజ్రవత్ సారభూతుఁడా! వైరి హంత!
సహజముగఁ బుట్టు దేవుఁడా! శక్తి నీవు
దాల్చుచున్నావు! స్నిగ్ధత [1]దాల్తు మేము
సకల సంగ్రామ సంబంధ సర్గమందు ॥ 2214

(7)*గీ॥ వరుణ దేవుఁడు, మన్యువు కరము మాకు
నుభయ విధ మైన ధనమును నొసఁగుచుండ్రి
గాక! భయమును జిత్తానఁ గలుఁగుచుండి
శాత్రవులు వెడలెదరుగాక! శక్తి మీర ॥ 2215

## సూక్తము—84

ఋషి—తపఃపుత్రుఁడు మన్యువు

దేవత—మన్యువు

## అర్థాంతరము—1

†(1) మాయ లెన్నొ చేయఁగల్గు మనుజ దనుజు లైనఁగాని
మృత్పదార్థ రూపము తగు త్రిదశు లెంత వార లైన
సలిల రూప మంది వరలు జరా రహితులే గాని
అనల రూప మలరి వెల్గు ఆ సుమనస్సులె గాని
అనిల రూప మందునట్టి ఆ సుర లెవ రైనఁ గాని
ఆకాశపు మూర్తిఁ గొన్న అమరు లెవ్వ రైనఁ గాని
దిగ్గజాలు తేరు తతులు దివ్యాశ్వము లున్నఁ గాని
వీర శూర ధీరులై అపార మైన అస్త్ర శస్త్ర
సంపదాళు లనంత మైన శాప శక్తు లున్నఁ గాని
అమరాఽమృత దీప మౌచు నఘోరాస్త్ర రూప మైన
మన్యు శక్తి సిద్ధి లేక మహిత బలము లందలేరు
ఆహవాళి శత్రు తతుల నజయ్యులుగ నిలువలేరు ॥ 2216

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1.దాల్తుమయః. (తొ.పా.)

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) సర్వధారి భారవాహ సర్వ సమత సహన శక్తి
సర్వ భక్షకమ్ము కాఁగఁ బర్విడి ఆ అగ్ని వోలె
వేద విద్య విరాజిలెడి విమల రూపీ! ఓ మన్యువ!
నీ ఓజో గుణ శక్తులు నిర్జించును శాత్రవాళి ॥ 2217

†(3) మన్యుదేవ! ఏకైకా! మహిమాన్విత శక్తి యుక్త!
శత్రు తతులు ప్రయోగించు శస్త్రాలను నస్త్రాలను
సర్వ మంత్ర తంత్రాలను సకల రుజల రూపు మాపి
మృత్యువో! అపమృత్యువో! యేమాత్రము దరికి రాక
బ్రతికకూడఁ జచ్చినట్లు గతిమాలిన బ్రతుకు గతులు
రాకుండఁగఁ గాపాడుచు వీఁక నుగ్ర మైన నీదు
నజయ్యంపు శక్తి మీఱ నఖిలము వశ మౌచు మాకు
నణఁగి మణఁగి లొంగియుండు నదృష్టము కలిగింపుము! ॥ 2218

†(4) హే! మన్యు! నీ శక్తి యేకైకమై తనరి
అక్షయమ్మై అజయ్య మౌ రీతి వరలఁగా
విజయ దుందుభు లెల్ల వినువీథి ఘోషిల్ల
రుజ తతులు నశియింప లోకేశ్వరేశ్వరత
మాటి మాటికి విశ్వ మాన్యత్వములు మీఱ
బహు రూప దుశ్శక్తి ప్రతతులన్ నిర్జించు
ఏ శక్తి కా శక్తి కాశ నిరాశగా
నాత్మ ఘాతుక గతుల నరుగుఁ దన స్థలమునకు ॥ 2219

†(5) ఇంద్రుని విజిగీష కెనలేని శక్తిగాఁ
దనరారు నీ శక్తి తలఁదన్ను నింద్రునే
హింస చేసెడి వారి హింస వారినె చేర
నరివీర భీకరత నతిలోక శక్తితో
నండాండ పిండాండ బ్రహ్మాండ భాండాల
ఋత మైన ఓజస్సుఁ బ్రియమారఁగా నిల్పి
శాంతి దాంతులు మీఱఁ గాంతి కాంతులు క్రాల
నలరారు మన్యువా! అధిపతివి! నీ వౌదు ॥ 2220

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(5)*గీ॥ మన్యు! నీవు మహేంద్రుని మాడ్కి విజయ
వగు చనిందిత వచనుండ వగుదువయ్య!
అందుచే మాకు నీ మహా యజ్ఞమందు
నీవు రక్షిత వై ప్రీతి నిలువు మెపుడు ॥ 2212

*గీ॥ శత్రు సహన శీల! చక్కని నీ స్తోత్ర
మును రచింతుమయ్య, కనుక మిగుల
వృద్ధిఁ బొందుచుందు వీవు బలోద్గమ
యిత వటంచు నేను మతిఁ దలంతు ॥ 2213

(6)*గీ॥ వజ్రవత్ సారభూతుఁడా! వైరి హంత!
సహజముగఁ బుట్టు దేవుఁడా! శక్తి నీవు
దాల్చుచున్నావు! స్నిగ్ధత [1]దాల్తు మేము
సకల సంగ్రామ సంబంధ సర్గమందు ॥ 2214

(7)*గీ॥ వరుణ దేవుఁడు, మన్యువు కరము మాకు
నుభయ విధ మైన ధనమును నొసఁగుచుంద్రు
గాక! భయమును జిత్తానఁ గలుఁగుచుండి
శాత్రవులు వెడలెదరుగాక! శక్తి మీర ॥ 2215

## సూక్తము—84

ఋషి—తపఃపుత్రుఁడు మన్యువు
దేవత—మన్యువు

### అర్థాంతరము—1

†(1) మాయ లెన్నొ చేయఁగల్గు మనుజ దనుజు లైనఁగాని
మృత్పదార్థ రూపము తగు త్రిదశు లెంత వార లైన
సలిల రూప మంది వరలు జరా రహితులే గాని
అనల రూప మలరి వెల్గు ఆ సుమనస్సులె గాని
అనిల రూప మందునట్టి ఆ సుర లెవ రైనఁ గాని
ఆకాశపు మూర్తిగొన్న అమరు లెవ్వ రైనఁ గాని
దిగ్గజాలు తేరు తతులు దివ్యాశ్వము లున్నఁ గాని
వీర శూర ధీరులై అపార మైన అస్త్ర శస్త్ర
సంపదాళు లనంతమైన శాప శక్తు లున్నఁ గాని
అమరాఽమృత దీప మౌచు నఘోరాస్త్ర రూప మైన
మన్యు శక్తి సిద్ధి లేక మహిత బలము లందలేరు
ఆహవాళి శత్రు తతుల నజయ్యులుగ నిలువలేరు ॥ 2216

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1.దాల్తుమయః. (తొ.పా.)
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) సర్వధారి భారవాహ సర్వ సమత సహన శక్తి
సర్వ భక్షకమ్ము కాఁగఁ బర్వెడి ఆ అగ్ని వోలె
వేద విద్య విరాజిలెడి విమల రూపి! ఓ మన్యువ!
నీ ఓజో గుణ శక్తులు నిర్జించును శాత్రవాళి ॥ 2217

†(3) మన్యుదేవ! ఏకైకా! మహిమాన్విత శక్తి యుక్త!
శత్రు తతులు ప్రయోగించు శస్త్రాలను నస్త్రాలను
సర్వ మంత్ర తంత్రాలను సకల రుజల రూపు మాపి
మృత్యువో! అపమృత్యువో! యేమాత్రము దరికి రాక
బ్రతికకూడఁ జచ్చినట్లు గతిమాలిన బ్రతుకు గతులు
రాకుండఁగఁ గాపాడుచు వీఁక నుగ్ర మైన నీదు
నజయ్యంపు శక్తి మీఱ నఖిలము వశ మౌచు మాకు
నణఁగి మణఁగి లొంగియుండు నదృష్టము కలిగింపుము! ॥ 2218

†(4) హే! మన్యు! నీ శక్తి యేకైకమై తనరి
అక్షయమ్మై అజయ్య మౌ రీతి వరలఁగా
విజయ దుందుభు లెల్ల వినువీథి ఘోషిల్ల
రుజ తతులు నశియింప లోకేశ్వరేశ్వరత
మాటి మాటికి విశ్వ మాన్యత్వములు మీఱ
బహు రూప దుశ్శక్తి ప్రతతులన్ నిర్జించు
ఏ శక్తి కా శక్తి కాశ నిరాశగా
నాత్మ ఘాతుక గతుల నరుగుఁ దన స్థలమునకు ॥ 2219

†(5) ఇంద్రుని విజిగీష కెనలేని శక్తిగాఁ
దనరారు నీ శక్తి తలఁదన్ను నింద్రునే
హింస చేసెడి వారి హింస వారినె చేర
నరివీర భీకరత నతిలోక శక్తితో
నండాండ పిండాండ బ్రహ్మాండ భాండాల
ఋత మైన ఓజస్సుఁ బ్రియమారఁగా నిల్పి
శాంతి దాంతులు మీఱఁ గాంతి కాంతులు క్రాల
నలరారు మన్యువా! అధిపతివి! నీ వౌదు ॥ 2220

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అత్యంత సహజమై అతిలోక శక్తులన్
శ్రీ మహావిష్ణు కృపఁ [illegible] వెలుఁగొందు నీ యెడన్
శక్తి నిండార నీవె సంకల్పమాత్రాన
స్వర్గాధిపతులుగా సంజనితులం జేసి
వజ్రాయుధమ్ముతో వరలున ట్లొనరించి
సిరి సంపదల వెల్గ సుర పతులఁ జేసితివి!
ధర్మ మహత్త్వం బగపడి వో మన్యూ!
కర్మ మహత్త్వాల సత్కార్యాధిపతి వౌట! ॥ 2221

(7)†చ॥ ఇహ పర సాధనమ్ముగ సహిస మహాఽద్భుత "వారి" శక్తులన్
మహితముగాఁగ విశ్వమున మన్యువ! నిల్పుచు నర్వులన్ దగన్
సుహితములై చరాఽచర విశుద్ధతఁ గాంచ తలిన్ మహా కృపన్
సహజముగా నొసంగుచు వసంత జగమ్మున కగ్ని శక్తితో ॥ 2222

†—జలశక్తి హరియించి జగమునే బాధించు
దుష్ట రక్షోజాలిఁ దున్మాడి పది శక్తి
శాంతి సౌభాగ్యాల సర్వ విశ్వము వరల
జల ధారగా జగజ్జల ధారగా వెలుఁగు
మన్యు శక్తి మహా మహితమై వెలుఁగొందు
సర్వ మూర్తిగ సృష్టిఁ దనరు నగణ్యమై ॥ 2223

## సూక్తము—84

ఋషి—తపస్పుత్రుఁడు మన్యువు
దేవత—మన్యువు

### అర్థాంతరము—2

†(1) అగ్ని దీప్త తేజమ్ముల ననమాన విశేష శక్తి
మాన్య మరుత్ప్రాణ మలర మహిత రథమ్ము లంకరించి
హృష్ట మైన ఘృష్ట మైన యెన లేని వాక్ఛక్తులై
బహు విధాల శస్త్రము లై పటుతర మౌ నస్త్రములై
తీక్ష్ణతలను దేజరిలఁగ దివ్య మన్యు శక్తి మీఱ
ననలములను ననిలములను ఆకాశము సలిలములను
మృత్తుల నతిహృత్తుగ మితి లేని జగత్తులో
సమరాంగణ విజేత కాఁగ సమరాఽమృతమై తనరును ॥ 2224

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) వేద రూప విజ్ఞానము విపుల మైన విమల మైన
ఓజోగుణ రాశి నీయ భ్రాజమాన శక్తులతో
అగ్ని వోలె వెలుఁగొందుచు నభిభూతము కాకుండఁగ
నఖిల శాత్రవాళ లెల్ల నస్త్ర శస్త్ర రాజులతో
విధ్వస్త మ్మై పోవఁగ విశ్వములో విజేతగాఁ
గాంతి రేఖ విరాజిలఁగ శాంతి కాంతు లలరారఁగ
సహన శీల తత్త్వాఽమృత శాంతి లోక సేనానిగ
మహిత మౌను మన్యు శక్తి మనుగడలకు మనుగడగా ॥ 2225

†(3) ఉగ్రమైన రూపాలను నుజ్జ్వల మౌ తేజస్సుల
సర్వ శత్రు తండాలను శమయించుచు సహియించుచు
రుజ రూపా లన్నింటిని నజపజ లేకుండఁగా
నేకతా భావ జన్మ మెల్ల జగద్రూప మంది
అఖిలాఽఖిల విశ్వ మ్మది అమల ప్రేమమయము కాఁగఁ
జరము నచర మౌ జగమ్ము సర్వ ప్రాణి కోటి యెల్ల
నిశాచరులతో సహా వశీభూత మై నిలువఁగ
నశాంతాళు లణఁగిపోవఁ బ్రశాంతులే పరిఢవిల్ల
నాశాంత సువిశ్వమందు నాశా జ్యోతిగ వెల్గెడి
ధన్య మైన మన్యు శక్తి తనరారును నజయ్యమై ॥ 2226

†(4) అనంత కోటి రూపాలను నలరారెడి విశ్వమ్మున
నేకైకముగా వెల్గెడి ప్రాకట మౌ మన్యు శక్తి
అమర మౌచు నమల మౌచు నక్షయ మై నజయ్య మై
అణు వణువును బ్రత్యణువును నగణిత పరమాణువులును
అఖిలాఽఖిల సృష్టి యెల్ల ననల దీప్తి వెలుఁగొందఁగ
యుద్ధ ఇద్ధ విజయావళి నోజో గుణ రాశి మీఱ
ఈ విశాల ప్రపంచమ్ము ఎనలేని సుసంపదలను
శాంతి సౌఖ్య సహముంతో సౌభాగ్యా లలరఁజేయు ॥ 2227

†(5) అతీంద్రియత నింద్రశక్తి నధిగమించు నోజో గుణ
మపురూపపు జ్వాలలుగా నవిచ్ఛిన్న మై వెల్గెడి
నగ్ని దీప్తు లలరారఁగ ననిత్య మై అమేయ మై
ఆర్తత్రాణ పరాయణత మూర్తి గొన్న రూపుగాఁగ

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

అఖిల జగము రక్షించును సుఖ శాంతులు వర్ధిల్లఁగ
నాధిపత్య శక్తి గల్గి అసామాన్యపుఁ బ్రేమ నిండ
సర్వ సమత జగతిలోన సముత్సాహ తత్త్వ మెనయు
మన్యు రూప మహా మాన్యః ధన్య మ్మౌ నీ జన్మము ॥ 2228

†(6) విశ్వ శాంతి సౌఖ్యాలకు విమల సంపదావళులకు
విఘాతమ్ము కలిగించెడు నఘ రూపపు శత్రు తతుల
సంహార మ్మొనరింపఁగ సదమల మౌ ఓజో గుణ
సహజ మైన విభూతిగ జ్వలియించెడి వజ్ర శక్తి
నెల్ల జగత్కల్యాణ మ్మొనలేని రీతిఁ జేయ
నపురూపపు శక్తులతో నవతరించినట్టి మన్యుః
పురుహూతుని బుట్టించిన సురవర శర్వాగ్ని మూర్తి
నిర్మల మౌ ధర్మ జనిత కర్మ ధనము మర్మ ఘనత
సృష్టి సర్వ లక్షణ మై చెరగని లక్ష్యమ్ము చేర
దివ్యఁ డైన దేవ దేవు భవ్య శక్తి లీనముగా
ఉత్తమ గతులన్ వెల్గెడి ఉత్తర దిక్ ప్రయాణాల
నుల్లాసమ్ముగ నడుపుః సముజ్జ్వలంపు గతులు మీఱ ॥ 2229

(7)†క॥ చరము నచరమై తనరు న
పరిమిత మౌ విశ్వ సృష్టిఁ బ్రాణాఽఽవళులన్
వరుణాఽనలాఽనిలాఽఽదుల
వరవడులన్ మాన్య శక్తి వరలఁగఁ జేయున్ ॥ 2230

†క॥ ఇహ పర ఫలములు దక్కన్
సహకారము మీఱ సర్వ జన ధన సంపత్
సహిత మ్మై సకల జగతి
మహితోభయతారకముగ మాన్యం బౌలేః ॥ 2231

†క॥ జల శక్తుల హరియించెడి
ఖల శత్రు తతుల నజయ్య కాంతి చ్ఛటలన్
జ్వలియించెడి హృచ్ఛక్తులఁ
బరా[1]జితులఁ జేయు మన్యు భాగ్యము వరలన్ ॥ 2232

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఈ పద్యములో "ల-ర" లకుఁ బ్రాస మైత్రి.

## అనువాకః—7; సూక్తమ్—85

ఋషికా—సావిత్రీ సూర్యా

దేవతా—1-5-సోమః; 6-16-సూర్యావివాహః; 17-దేవాః; 18-సోమార్కౌ;19-చన్ద్రమాః;
20-28-నృణాం వివాహమన్త్రా ఆశీఃప్రాయాః; 29-30-వధూవాసఃసంస్పర్శనిన్దా;
31-దమ్పత్యోర్యక్ష్మనాశనం; 32-47-సూర్యా సావిత్రీ
ఛందః—అనుష్టుప్; 14, 19-21, 23-24, 26, 36-37, 44-త్రిష్టుప్; 18, 27, 43-జగతీ;
34-ఉరోబృహతీ

(1) సత్యేనోత్తభితా భూమిః సూర్యేణోత్తభితా ద్యౌః ।
ఋతేనాదిత్యాస్తిష్ఠన్తి దివి సోమో[1] అధి శ్రితః॥ 871

(2) సోమేనాదిత్యా బలినః సోమేన పృథివీ మహీ ।
అథో నక్షత్రాణామేషాముపస్థే సోమ[2] ఆహితః ॥ 872

(3) సోమం మన్యతే పపివాన్ యత్ సంపింషన్త్యోషధిమ్ ।
సోమం యం బ్రహ్మాణో విదుర్న తస్యాశ్నాతి కశ్చన ॥ 873

(4) ఆచ్ఛద్విధానైర్గుపితో బార్హతైః సోమ రక్షితః ।
గ్రావ్ణామిచ్ఛృణ్వన్ తిష్ఠసి న తే[3] అశ్నాతి పార్థివః ॥ 874

(5) యత్ త్వా దేవ ప్రపిబన్తి తత[4] ఆ ప్యాయసే పునః ॥
వాయుః సోమస్య రక్షితా సమానాం మాస[5] ఆకృతిః ॥ 875

1. సోమోఽఅధి, 2. సోమఽఆహితః, 3. న తేఽఅశ్నాతి, 4. తతఽఆ, 5. మాసఽఆకృతిః. (వా.ప్ర.)

(6) రైభ్యాసీదనుదేయీ నారాశంసీ న్యోచనీ ।
సూర్యాయా భద్రమిద్వాసో గాథయైతి పరిష్కృతమ్ ॥ 876

(7) చిత్తిరా[1] ఉపబర్హణం చక్షురా[2] అభ్యంజనమ్ ।
ద్యౌర్భూమిః కోశ[3] ఆసీద్ యదయాత్ సూర్యా పతిమ్ ॥ 877

(8) స్తోమా[4] ఆసన్ ప్రతిధయః కురీరం ఛన్దో[5] ఓపశః ।
సూర్యాయా[6] అశ్వినా వరా ఽగ్నిరాసీత్ పురోగవః ॥ 878

(9) సోమో వధూయురభవదశ్వినాస్తాముభా వరా ।
సూర్యాం యత్ పత్యే శంసన్తీం మనసా సవితాదదాత్ ॥ 879

(10) మనో[7] అస్యా అన ఆసీద్ ద్యౌరాసీదుత చ్ఛదిః ।
శుక్రావనడ్వాహావాస్తాం యదయాత్ సూర్యా గృహమ్ ॥ 880

(11) ఋక్సామాభ్యామభిహితౌ గావౌ తే సామనావితః ।
శ్రోత్రం తే చక్రే[8] ఆస్తాం దివి పన్థాశ్చరాచరః ॥ 881

1. చిత్తిరాఽఉప, 2. చక్షురాఽఅభ్యం, 3. కోశఽఆసీద్, 4. స్తోమాఽఆసన్, 5. ఛన్దఽఓపశః.
6. సూర్యాయాఽఅశ్వినా, 7. మనోఽఅస్యాఽఅనఽఆసీద్, 8. చక్రేఽఆస్తాం. (వా.వ.)

(12) శుచీ తే చక్రే యాత్యా వ్యానో[1] అక్ష ఆహతః ।
అనో మనస్మయం సూర్యా ఽఽరోహత్ ప్రయతీ పతిమ్ ॥ 882

(13) సూర్యాయా వహతుః ప్రాగాత్ సవితా యమవాసృజత్ ।
అఘాసు హన్యన్తే గావో ఽర్జున్యోః పర్యుహ్యతే ॥ 883

(14) యదశ్వినా పృచ్ఛమానావయాతం త్రిచక్రేణ వహతుం సూర్యాయాః ।
విశ్వే దేవా[2] అను తద్వామజానన్ పుత్రః పితరావవృణీత పూషా ॥ 884

(15) యదయాతం శుభస్పతీ వరేయం సూర్యాముప ।
క్వైకం చక్రం వామాసీత్ క్వ దేష్ట్రాయ తస్థథుః ॥ 885

(16) ద్వే తే చక్రే సూర్యే బ్రహ్మాణ[3] ఋతుథా విదుః ।
అథైకం చక్రం యద్గుహా తదద్ధాతయ [4]ఇద్విదుః ॥ 886

(17) సూర్యాయై దేవేభ్యో మిత్రాయ వరుణాయ చ ।
యే భూతస్య ప్రచేతస[5] ఇదం తేభ్యోఽకరం నమః ॥ 887

---

1. వ్యానోఽఅక్షఽఆహతః, 2. దేవాఽఅను, 3. బ్రహ్మాణఽఋతుథా, 4. తయఽఇద్విదుః,
5. ప్రచేతసఽఇదం. (వ్రా.ప్ర.)

(18) పూర్వాపరం చరతో మాయ[1]యైతౌ శిశూ క్రీళన్తౌ పరి యాతో[2] అధ్వరమ్ ।
విశ్వాన్యన్యో భువనాభిచష్ట[3] ఋతూగ్ంరన్యో విదధజ్జాయతే పునః ॥ 888

(19) నవోనవో భవతి జాయమానో ఽహ్నాం కేతురుషసామేత్యగ్రమ్ ।
భాగం దేవేభ్యో వి దధాత్యాయన్ ప్ర చన్ద్రమాస్తిరతే దీర్ఘమాయుః ॥ 889

(20) సుకింశుకం శల్మలిం విశ్వరూపం హిరణ్యవర్ణం సువృతం సుచక్రమ్ ।
ఆ రోహ సూర్యే[4] అమృతస్య లోకం స్యోనం పత్యే వహతుం కృణుష్వ ॥ 890

(21) ఉదీర్ష్వాతః పతివతీ హ్యే౩షా విశ్వావసుం నమసా గీర్భిరీళే ।
అన్యామిచ్ఛ పితృషదం వ్యక్తాం స తే భాగో జనుషా తస్య విద్ధి ॥ 891

(22) ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేళామహే త్వా ।
అన్యామిచ్ఛ ప్రఫర్వ్యం౧ సం జాయాం పత్యా సృజ ॥ 892

(23) అనృక్షరా[5] ఋజవః సన్తు పన్థా యేభిః సఖాయో యన్తి నో వరేయమ్ ।
సమర్యమా సం భగో నో నినీయాత్ సం జాస్పత్యం సుయమమస్తు దేవాః ॥ 893

1. మాయయాౌతౌ శిశూ, 2. పరియాతోఽఅధ్వరమ్, 3. చష్టఽఋతూగ్ం, 4. సూర్యేఽఅమృతస్య,
5. అనృక్షరాఽఋజవః (వా్ర.ప్ర.)

(24) ప్ర త్వా ముఞ్చామి వరుణస్య పాశాద్ యేన త్వాబధ్నాత్ సవితా సుశేవః ।
ఋతస్య యోనౌ సుకృతస్య లోకే ఽరిష్టాం త్వా సహ పత్యా దధామి ॥ 894

(25) ప్రేతో ముఞ్చామి నాముతః సుబద్ధామముతస్కరమ్ ।
యథేయమిన్ద్ర మీఢ్వః సుపుత్రా సుభగాసతి ॥ 895

(26) పూషా త్వేతో నయతు హస్తగృహ్యాఽశ్వినా త్వా ప్ర వహతాం రథేన ।
గృహాన్ గచ్ఛ గృహపత్నీ యథాసో వశినీ త్వం విదథమా వదాసి ॥ 896

(27) ఇహ ప్రియం ప్రజయా తే సమృధ్యతామస్మిన్ గృహే గార్హపత్యాయ జాగృహి ।
ఏనా పత్యా తన్వంస్ సం సృజస్వాఽధా జివ్రీ విదథమా వదాథః ॥ 897

(28) నీలలోహితం భవతి కృత్యాసక్తిర్వ్యజ్యతే ।
ఏధన్తే[1] అస్యా జ్ఞాతయః పతిర్బన్ధేషు బధ్యతే ॥ 898

(29) పరా దేహి శాముల్యం బ్రహ్మభ్యో వి భజా వసు ।
కృత్యైషా పద్వతీ భూత్వ్యా జాయా విశతే పతిమ్ ॥ 899

---

1. ఏధన్తేఽఅస్యా. (పా.ప్ర.)

(30) అశ్రీరా తనూర్భవతి రుశతీ పాపయాముయా ।
పతిర్యద్వధ్వో౩ వాససా స్వమంగమభిధిత్సతే ॥ 900

(31) యే వధ్వశ్చన్ద్రం వహతుం యక్ష్మా యన్తి జనాదను ।
పునస్తాన్ యజ్ఞియా దేవా నయన్తు యత[1] ఆగతాః ॥ 901

(32) మా విదన్ పరిపన్థినో య[2] ఆసీదన్తి దంపతీ ।
సుగేభిర్దుర్గమతీతామప ద్రాన్త్వరాతయః ॥ 902

(33) సుమఙ్గలీరియం వధూరిమాం సమేత పశ్యత ।
సౌభాగ్యమస్యై దత్త్వాయాఽథాస్తం వి పరేతన ॥ 903

(34) తృష్టమేతత్ కటుకమేతదపాష్ఠవద్విషవన్నైతదత్తవే ।
సూర్యాం యో బ్రహ్మా విద్యాత్[3] స ఇద్వాధూయమర్హతి ॥ 904

(35) ఆశసనం విశసనమథో[4] అధివికర్తనమ్ ।
సూర్యాయాః పశ్య రూపాణి తాని బ్రహ్మా తు శున్ధతి ॥ 905

---

1. యతఽఆగతా, 2. నోయఽఆసీదన్తి, 3. విద్యాత్సఽఇద్వా, 4. మథోఽఅధి. (వ్రా.ప్ర.)

(36) గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాసః ।

భగో[1] అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః ॥ 906

(37) తాం పూషంఛివతమామేరయస్వ యస్యాం బీజం మనుష్యాః వపన్తి ।

యా న[2] ఊరూ ఉశతీ విశ్రయాతే యస్యాముశన్తః ప్రహరామ శేపమ్ ॥ 907

(38) తుభ్యమగ్నే పర్యవహన్ త్సూర్యాం వహతునా సహ ।

పునః పతిభ్యో జాయాం దా[3] అగ్నే ప్రజయా సహ ॥ 908

(39) పునః పత్నీమగ్నిరదాదాయుషా సహ వర్చసా ।

దీర్ఘాయురస్యా యః పతిర్జీవాతి శరదః శతమ్ ॥ 909

(40) సోమః ప్రథమో వివిదే గన్ధర్వో వివిద[4] ఉత్తరః ।

తృతీయో[5] అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః ॥ 910

(41) సోమో దదద్గన్ధర్వాయ గన్ధర్వో దదదగ్నయే ।

రయిం చ పుత్రాగ్ంశ్చా[6]దాదగ్నిర్మహ్యమథో ఇమామ్ ॥ 911

---

1. భగోఽఅర్యమా, 2. యా నఽఊరూఽఉశతీ, 3. దాఽఅగ్నే, 4. వివిదఽఉత్తరః,

5. తృతీయోఽఅగ్ని, 6. పుత్రాంశ్చా. (ప్రా.ప్ర.)

(42) ఇహైవ స్తం మా వి యౌష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్ ।
క్రీళన్తౌ పుత్రైర్నప్తృభిర్మోదమానౌ స్వే గృహే ॥ 912

(43) ఆ నః ప్రజాం జనయతు ప్రజాపతిరాజరసాయ సమనక్త్వర్యమా ।
అదుర్మంగలీః పతిలోకమా విశ శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥ 913

(44) అఘోరచక్షురపతిఘ్న్యేధి శివా పశుభ్యః సుమనాః సువర్చాః ।
వీరసూర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥ 914

(45) ఇమాం త్వమిన్ద్ర మీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు ।
దశాస్యాం పుత్రానా ధేహి పతిమేకాదశం కృధి ॥ 915

(46) సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ ।
ననాన్దరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ[1] అధి దేవృషు ॥ 916

(47) సమంజన్తు విశ్వే దేవాః సమాపో హృదయాని నౌ ।
సం మాతరిశ్వా సం ధాతా సము దేష్ట్రీ దధాతు నౌ ॥ 917

---

1. సమ్రాజ్ఞ్యధి. (వా.ప.)

†(48) అవిధవా భవ వర్షాణి శతం సాగ్రం తు సువ్రతా ।
తేజస్వీ చ యశస్వీ చ ధర్మపత్నీ పతివ్రతా ॥ 918

†(49) జనయద్బహుపుత్రాణి మా చ దుఃఖం లభేత్ క్వచిత్ ।
భర్తా తే సోమపా నిత్యం భవేద్ధర్మపరాయణః ॥ 919

†(50) అష్టపుత్రా భవ త్వం చ సుభగా చ పతివ్రతా ।
భర్తుశ్చైవ పితుర్భ్రాతు ర్హృదయానందినీ సదా ॥ 920

†(51) ఇన్ద్రస్య తు యథేన్ద్రాణీ శ్రీధరస్య యథా శ్రియా ।
శంకరస్య యథా గౌరీ తద్భర్తురపి భర్తరి ॥ 921

†(52) అత్రేర్యథానుసూయా స్యాద్ వసిష్ఠస్యాప్యరున్ధతీ ।
కౌశికస్య యథా సతీ తథా త్వమపి భర్తరి ॥ 922

†(53) ధ్రువైధి పోష్యా మయి మహ్యం త్వాదాద్బృహస్పతిః ।
మయా పత్యా ప్రజావతీ సం జీవ శరదః శతమ్ ॥ 923

ఇతి
అష్టమోఽష్టకే తృతీయోఽధ్యాయ
సమాప్తః

† ఋగ్వేదము దశమ మండలములోఁ గల 85వ సూక్తములో నీ ఆరు ఋక్కులును నధికముగాఁ గొన్ని వ్రాత ప్రతులలోఁ గలవు. వీటిని "ఖిల" మంత్రములుగాఁ గొందఱు భావింపఁ బరిశిష్టములుగాఁ గొందరును బ్రక్షిప్తము లని మరి కొందఱును నధిక పాఠము లని వేరొక కొందరును భావించిరి.

### అనువాకము—7 సూక్తము—85

ఋషిక—సావిత్రి సూర్య†

దేవత—1-5-సోముఁడు, 6-16-వివాహార్థదేవత, 17,18-సోమార్కులు,
21-చంద్రమస్సు, పరిశిష్టములకు సూర్య†

(1)*సీ॥ సత్యంబువలననే[1] సర్వ[2] భూమితలం బుపరిబద్ధంబయి యొనర నుండు
సూర్యునివలననే[1] సొంపారు దివ మెల్లఁ గవకతా ధరియింపఁబడుచు నుండు
యజ్ఞంబువలననే[1] యాదిత్య గణ మెల్లఁ బరమ ముదంబునఁ బరఁగుచుండు
యజమాన దత్తమౌ హవ్యంబువలననే[1] సుర పంక్తి బ్రతుకుచు శోభ నుండు
గీ॥ దేవతా రూపుఁ డగుచు నా దేవతలకు, సంతసంబును గూర్చుచు సకల వితతి
రూప సోముండు దివమును నోపి నాశ్రయించె నని సూర్య వేఁడెఁ దా నెలమి సోము॥ 2233

(2)*గీ॥ సోమమున[3] బలము గలవారు సురలు, సోమ
ముననె పృథ్వియు నెక్కువ ఘనతఁ గాంచె
సోమమున నోషధులు కడు శోభ నందె
దివమునం దట్టి సోముఁడు తిరుగుచుండు॥ 2234

-ఓషధిపక్షార్థము-

(3)*గీ॥ ఓషధీ రూప మగు దని[4] నుర్వి జనులు
పిండెదరొ: దాని భక్షింతురు[5] పెద్దవారు
యాగ సాధన భూత మౌ నట్టి[6] లతను
యజ్వ తప్ప మ రే జనుఁ డందఁగలఁడు?॥ 2235

† సంస్కృత మూలమున దేవతలు కొంత భిన్నముగాఁ బేర్కొనఁబడెి. ఋక్కు లన్నింటను సాయణాదుల దృష్టి ననుసరించి యా యా విషయములు భిన్న దేవతాకము లైనను నొకటిగానే యున్నవి. అర్థదృక్పథమునఁ జూచినచో నీ ఋక్కులకు భిన్నార్థ మున్న దన్నమాట వేరు మాట. సంస్కృతమూలము ననుసరించి యీ సూక్తమునకు దేవత లిట్లుండుదురు- 1-5-సోముఁడు, 6-16-వివాహదేవతసూర్య, 17-దేవతలు, 18-సోమార్కులు, 19-చంద్రుఁడు, 20-28-వివాహదేవత. 29-30-వధూవాసము. 31-దంపతుల రోగ నాశనము, 32-47-సావిత్రిసూర్య, సంస్కృతమందలి కొన్ని దేవతలు విషయ వివరణా వివేచన కామికములు- ఈ దృష్ట్యా తెలుఁగు సంస్కృతములందలి దేవతల భిన్నత్వము సంతగాఁ బాటింప నక్కరలేదు. శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాత ప్రతి 13వ సంపుటము 191-193పుటలలో నీ సూక్తమునకు ఋషికె మారుగా దేవత "సూర్య" అని వ్రాసి-దేవత "1-5-సోముఁడు, 6-11-వివాహార్థ దేవత, 17,18-సోమార్కులు, 21-చంద్రమస్సు పరిశిష్టములకు సూర్య"గా వ్రాసి-15వ సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "సూర్య"గాను, దేవతలు "సోముఁడు, సూర్యుని రథచక్రము, దేవతలు, సోమార్కులు, చంద్రుఁడు, ఆశీర్వాదము"గాను శ్రీనేమానివారు వ్రాసిరి-శ్రీనేమానివారి యనువాదములు వా రిచ్చిన దేవతలను దృష్టిలో నుంచుకొని రచియింపఁబడినవి గాన దేవతల నామములు వా రిచ్చినట్లే యిక్కడఁ బేర్కొనఁబడినవి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. చేతనే, (తా.పా.), 2. సర్వంసహాదేవియు పరిబద్ధంబయి యొలసుండు, (తా.పా.), 3. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది. 4. నోలి బుధులు, (తా.పా.), 5. పేర్మి మిగుల, (తా.పా.), 6. భూత మౌనట్టి దాని, (తా.పా.)

-చంద్రపక్షార్థము-

*గీ॥ ఓషధీ రూపు నెవ్వని శౌనక ధీర
లభిషవ గ్రావలన్ దమ రందఁగలరు
పీత సోముని వానిని బెద్దఁజేసి
చంద్రమస్సునిగాఁ దల్త్రు[1] చతురు లెల్ల ॥ 2236

(4)*గీ॥ సోమః యాచ్ఛద్విధానుల[2] సూరి సప్త
సోమ పాలుర రక్షచే నుందరుంచ
వైన నీవు శిలాధ్వని నాలకింతు
మానవుం డెవఁడు గ్రహింపఁ బూను నిన్ను ॥ 2237

-లతార్థము-

(5)*గీ॥ నిన్నుఁ ద్రావిన పిమ్మట నిన్నె మరలఁ
ద్రావఁ గోరుచు నుందురు దస్కటములు
వత్సరాకృతి మాసము వాయువు కదు
సోమ రక్షితు లగుచుంద్రు[3] సొగసు లేవ ॥ 2238

-చంద్రార్థము-

*గీ॥ రశ్మ[4] లెంతయు నినుఁ ద్రావి రాజ సోమ:
మరల గ్రహియింప నుందువు గరము ప్రీతి
నీకు రక్షిత వాయువు నీవు కూడ
నబ్ద మాసంబులకుఁ గర్త వౌచు నుందు! ॥ 2239

(6)*గీ॥ రైభి నాకు వయస్య విరాజమాన
యౌ నరాశంసి దాసియై యమరి మరియు
సూర్య నగు నాకు వస్త్రము సురుచిరముగఁ
గట్టఁబడియుండె సంప్రీతి గాథవలన ॥ 2240

(7)*గీ॥ సోము, నవ భర్తగాఁ గాంచ సూర్య! రమ్య
చక్షు వభ్యంజనం బయ్యెఁ జతుర చిత్తి
దేవి యుపబర్హణం బయ్యె దివియు భువియుఁ
గోశ రూపంబు లయ్యె నే కొదువ లేక ॥ 2241

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1, సరస భక్త, (తా.పా.), 2. అచ్ఛాదయంతి విధానాని యేషాం తే. (నే.వేం.న.శా.), 3. సోమ రక్షిత యగుచుండు సూటి మీర, (తా.పా.), 4. రశ్మలెంతయు నినుఁద్రావురాజసోమ!, మరల గ్రహియింపఁబడుదువు! కరము నీవు, నీకు రక్షిత వాయువు నీవు కర్త, సబ్ద మాసంబులకుఁగూడ నతిశయముగ. (తా.పా.).

(8)*గద్యము॥
సూర్య యను నామె రథమునకు స్తోమములు పరిధు లయ్యెను. "కురీర" నామక మను ఛందస్సు ఓపశ[1] మయ్యెను. ఆ సూర్యకు అశ్వులు వరు లయిరి. ఆమె వివాహమందుఁ బ్రస్తావార్థము ముందు వెడలినవాఁడు అగ్ని ॥ 2242

(9)*గీ॥ పతిని గోరెడు సూర్యఁ దత్పిత సుసోము
నకు నొసంగిన యప్పుడే యకలుష మతి
సోముఁడు వధూ ప్రియుం డయ్యె సురుచిరాశ్వి
దేవతలు నూత్న వరు లైరి తివిరి తాము ॥ 2243

(10)*ఉ॥ ఎప్పుడు సూర్య సోమ వరు నెక్కువ ప్రీతిని గాంచఁగల్గెనో!
యప్పుడె యామె మానసము యానముగా వెలసిల్లె ద్యోతలం
బప్పుడె యామెకున్ ఛదిగ నయ్యెను, సూర్యుఁడు చంద్రమస్సు తా
మప్పుడె తద్రథంబున హయంబులుగాఁ గడు బంధితుల్ గదా! ॥ 2244

(11)*గీ॥ అంబ! ఋక్సామములవల్ల నభిహితు లగు
సూర్య చంద్రులు ప్రథమాన శోభ గాంచు
చుండు వాహంబులై వెల్గుచుండి వరుని
సదనమును జేర్చుచున్న వి ముదముతోడ ॥ 2245

*గీ॥ నీదు సుశ్రోత్రములు రెండు నిరతిశయము
మానస రథంబునకుఁ గడు మంచి చక్ర
ములుగ వర్తిల్లె, ద్యోతలమును సుగమన
సాధనం బగు మార్గమై సౌరు గాంచె ॥ 2246

(12)*గద్యము॥
పతిని బడయఁగోరి వెడలుటకు నిశ్చయించిన నీ యొక్క రథమునకుఁ బతి గుణ శ్రావిణు లగు శ్రోత్రములు చక్రము లయ్యెను ॥ 2247

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఓపశము=విశ్రమించుటకు స్థలము.(నే.వేం.న.శా.)

(13)*గద్యము॥
సోమున కొసఁగఁబడిన సూర్యకు గవాది పదార్థము ఆమె వెడలకముందే పంపఁబడెను.
దానిని సూర్య పిత యగు సవిత యిచ్చెను. సవితృ దత్తము లగు గోవులు
మఘా నక్షత్రములయందు దండములచేఁ బ్రేరేపింపఁబడెను. ఫల్గుణీ
నక్షత్రములయందు సూర్యునివలన గోవులు తీసుకొనిపోఁబడుచున్నవి ॥ 2248

(14)*గద్యము ॥
ఓ యశ్వి దేవతలారా! త్రిచక్రయుత మగు రథముపై నెక్కి సూర్యా వివాహమునుగూర్చి
సవితను బ్రశ్నించుటకు వెడలునపుడు మిమ్ము సర్వ దేవతలు తెలిసికొనిరి. పుత్రుఁ
డగు పూష పితరులను నావరించెను ॥ 2249

(15)*గీ॥ ఉదకపతులార! మీ రేడ నున్నత యగు
సూర్యఁ బొందంగ సవితను జూచువారు
మీకుఁ గల నొక్క చక్రము మెలఁగు నెచట
దానమునకయి నెచ్చట దాగినారు? ॥ 2250

(16)*గద్యము ॥ (సూర్య తనలోఁ దా ననుచున్నది)
ఓ సూర్యా! నీకుఁ గల సూర్య చంద్రాత్మకము లగు రెండు చక్రములు ఋతు వినిర్దిష్టము
లని బ్రాహ్మణు లెఱుంగుదురు. తర్వాత నొక చక్రమును గుహా నిహిత మగు దానిని
మేధావులే తెలిసికొనుచున్నారు ॥ 2251

(17)*గీ॥ సూర్య దేవునకున్ మరి సురలకు మరి
వరుణ మిత్రులకున్ భూత వర్గమునకు
నభిమతంబుల నొసఁగెడు నఖిలమునకు
నీ నమస్సు నొనర్తు నే నెలమితోడ ॥ 2252

(18)*గీ॥ తొలుత సూర్యుఁడు గతియించుఁ దుష్టి మరల
వాని జంద్రుఁడు వెంటాడు వ్రబల మాయ
వలన సూర్యుఁడు చంద్రుఁడు లలిత దివిని
సంచరించుచు నున్నారు సంతసమున ॥ 2253

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(19)*గీ॥ అమల చంద్రుఁడు[1] ప్రతిదినమంబుఁ గాంతిఁ
బుట్టుచున్ నవ నవుఁడయి పూర్ణ దివస
ములకుఁ బ్రజ్ఞాపకుండయి అలి సుషోగ్ర
భాగములఁ బొందుచున్నాఁడు [2]భావుకుఁడయి॥ 2254

*గీ॥ హీన వృద్ధులఁ బక్షాంత మందుచుండి
హవ్య భాగంబుఁ బ్రీతితో నమరులకయి
యందఁజేయుచుఁ జంద్రమ స్సాయువు కడు
వృద్ధిఁ జేయుచు నున్నాఁడు వివిధ గతుల॥ 2255

(20)*గీ॥ శోభన కింశుక సుందర వృక్ష నిర్మిత మైన రథముపై మెలఁగుచుండె
నిస్తుల శాల్మలి నిర్మిత యానంబుపై విశ్రమించుచుఁ బరఁగుచుండి
విశ్వ రూపములతో వెల్గొందు రథమునఁ [3]దగు ప్రీతి నాసీన వగుచునుండి
సౌవర్ణ కాంతితోఁ [4]జక్కని రథముపై విస్తృత దీప్తిని వెలుఁగుచుండి
గీ॥ సుష్టు వర్తనమును గల్గి సురుచిరముగఁ, జక్రముల నొప్పు రథమునఁ జాల రక్తి
నెక్కి సోముని వరియింప నీవు సూర్య!, యమృతమౌ స్థానమును జేరుమా! ముదాన॥ 2256

(21)*క॥ కన్యాస్వామీ! యీ సతి
ధన్యం దగు పతినిఁ బడసెఁ దద్ధేతువునం
గన్యా సమీపమును విడి
యన్య స్థలమునకు నేగుమయ్యా! కపికన్॥ 2257

*గీ॥ పేర విశ్వావసుం డను పేర నొప్పు
నట్టి గంధర్వ రాజును నాదరమున
స్తుతులచేత నమస్సుల తతులచేత
సన్నుతించెద నే నతిసంతసమున॥ 2258

*గీ॥ ఆర్య! గంధర్వ! పితృ కులమందు నున్న
దాని వ్యక్తగ నున్నట్టి దాని నీవు
స్వీకరింపుము! శ్రీలతోఁ జెలఁగు నా వ
దార్థమే కల్పితం బయ్యెఁ దగిన రీతి॥ 2259

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. అట్టి చంద్రుఁడు. (పాఠాంతరము), 2. భాగ్య మలర. (తా.పా.), 3. అతి ప్రీతి, (తా.పా.),
4. సరసమౌ రథముపై, (తా.పా.),

(22)*గీ॥ ఆర్య! విశ్వావసూ! మా శయనమునుండి
పొమ్ము! నీకు నమస్సులు పొసఁగ నిడుదు
నన్యను బృహన్నితంబను నధిగమించి
కరుణతో నన్నుఁ బతితోడఁ గలుపు మీవు! ॥ 2260

(23)*గీ॥ వరుని యాచింప మా సఖుల్ వరుని తండ్రి
కడకుఁ బోయెడు మార్గముల్ కంటక సహి
తములు కాకుండఁ గుటిలతఁ బాల్పకుండ
నుండుఁగా కెల్ల[1] దేవతా మండలంబు ॥ 2261

*గీ॥ మమ్ముఁ బంపంగఁగలవాఁడు సుమ్ము భగుఁడు
నెమ్మి నర్యముఁ డట్టులే నేర్వఁగలఁడు
లలిత జాయాపతీ యుగళంబునకు మిథు
నంబుగా నుండుఁగాక! ముదంబుతోడ ॥ 2262

(24)*గద్యము॥
సవిత ప్రేరితుఁడు నగు వరుణుఁడు తన పాశములవలనఁ బ్రాణిని బంధించుచున్నాఁడు. కాఁబట్టి యేపాశమువలన వరుణప్రేరితుఁ డగు సవిత బంధించునో! యట్టి వరుణ పాశమునుండి ఓ వధువా! నిన్ను విడిచిపుచ్చెదను ॥ 2263

- యజ్ఞాంగార్థపక్షము -

*గద్యము॥
యోక్త్రమునఁ గర్మానుజ్ఞాతుఁ డను దేవుఁ డే ఋత్విక్పాశమున బంధించెనో! దానిని విప్పి కర్మక్షేత్రమందు అహింసితను బతితోఁ గలిపెదను ॥ 2264

*గీ॥ పితృకులమునుండి విడిపింతు నతివ! నిన్నుఁ
బతి గృహమునుండి తప్పింప వలనుపడదు
నింద్రుఁడా! నేను సుభగగా నెట్టు లౌదు
నట్లు చేయుము! సేక్త! నీ వాదరమున ॥ 2265

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి
1. నుండుగావుత. (తా.పా.)

25 *గీ॥ గ్రాహ్యా హస్తుఁడు పూష యో కన్య! నిన్ను
నిటులఁ బంపించుఁగాకఁ దా నెలమితోడ
అశ్వులు రథంబుపై నిన్ను నాదరమున
నికుమఁ బంపించెదరుగాక నెలమితోడ ॥ 2266

*గీ॥ [1]భర్తృ గృహమునకుం బోవు [1]మట్టి గృహము
నందు స్వామిని వగుదువు! పొందు గలిగి
పతి వశంబున మెలఁగుచుఁ బతి గృహస్థు
లైన భృత్యులతోడను మాట లాడు మీవు! ॥ 2267

26 †క॥ హాజి గృహిణి యొనర్పఁగ
ధీనిధి కైవన మగు నిను ధృతి సంతోషం
బాసీతము గాఁగఁ బతి గృ
హానంద నిలయమున కేఁక ననువమె పూషా! ॥ 2268

(27) *చ॥ పతి కులమందు నీవు వధువా! ప్రజతో నభివృద్ధిఁ జెంది యా
పతి గృహ ధర్మముల్ నెరపి భాగ్యము నందుచు భర్తతోడ నీ
వతిశయ సౌఖ్యముల్ వడసి యావయి మీ రతి జీర్ణులై మహా
మతిని గృహస్థులై యపుడు మాటల స్వేచ్ఛగ నాడుఁడీ! కడున్ ॥ 2269

(28) *గద్యము॥
అభిచారాభిమానిని యగు కృత్య నీల లోహిత రూపము గలది. ఆ కృత్య యామెయందు విడువఁబడుచుండెను. ఆ కృత్య వెడలఁగా వధూ జ్ఞాతులు వృద్ధిఁ బొందుచున్నారు. పతి సాంసారిక బంధములయందు బంధింపఁబడుచున్నాఁడు ॥ 2270

(29) *క॥ అల మల ధారక వస్త్రము
తొలఁగింపుము! బ్రాహ్మణులకుఁ దుష్టి ధనంబున్
గలిగింపుము! పాదములం
గల కృత్యా! భార్య వెంచుఁ గ్రాలుము! పతితోన్ ॥ 2271

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి

1. ఇక్కడఁ గేవల "అ"కారస్వరయతి విశిష్టముగాఁ బ్రయుక్తమైనది. (చూ. పీఠిక.)

† ఈ 85వ సూక్తములోని యీ 26వ ఋక్కును శ్రీ నేమానివా రనువదింపక విడిచిపెట్టిరి.
(చూ. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత: వ్రాతప్రతి-13వ సంపుటము. 203పుట.)

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(30)*గీ॥ దీప్తయై పాప యైనట్టి దివ్య కృత్య
తనువుతోఁ గూడి యున్న తద్వరుని పూని
తనువు సుస్త్రీలఁ జొంపించి తత్క్షణంబ
సతిశయం బగు సశ్రీక మంచుఁగాదె! ॥ 2272

(31)*గీ॥ వధువు[1] చారు కనక వరణీయ రూపంబు
వ్యాధు లెల్లఁ బొంద వచ్చుచుండు
యముని నైనఁ[2] బొంద నరుదెంచు వ్యాధులఁ
బోవఁ[1]జేయుఁ డీవ దేవ వరులు ॥ 2273

(32)*గీ॥ పారెదరుగాక! శత్రువుల్ పతిని సతిని
బొందు శత్రువుల పథంబుఁ బొంది శత్రు
దేశమును బొందెదరుగాక! స్థిరము వార
లుండెదరుగాక! నచ్చటే గంతు వీడి ॥ 2274

(33)*క॥ ఈ వధువు సుమంగళి యగుఁ
గావున బుధులార! యామెఁ గాంచుచు భవ్యం
బే విధిని నైన నొసఁగుచు
వారిరి నిజ సదనములకు వరుసగఁ జనుఁడీ! ॥ 2275

(34)*గద్యము॥
ఈ వస్త్రము దాహ జనకము. కటుకము. ఋజీషము. విషము వలె నీ వస్త్రము అనుపభోగ్యము. ఏ బ్రాహ్మణుఁ డీ సూర్యను దెలిసికొనునో! యాతఁడే యీ వస్త్రమున కర్హుఁడు ॥ 2276

(35)*గద్యము॥
"ఆశసనము(తుషాధానము) విశసనము(శిరస్సునందుంచఁబడునట్టిది) అధివికర్తనము" అను మూఁడు విధముల వాసస్సులు సూర్యకు రూపము లగుచున్నవి. వానినిఁ జూడుము! ఇట్టి యాశసనాదుల సూర్య స్వశరీరమందు ధరించుచున్నది. అట్టి రూపములను సూర్యావిద్ బ్రహ్మ తొలఁగించుచున్నాఁడు ॥ 2277

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి
1. వధువుయొక్క కనక. (తా.పా.), 2. యముని నైన యట్టి వ్యాధులు విడచుచుఁ, బోవఁజేయుఁ డీవ దేవతలు. (తా.పా.)

(36)*గీ॥ వధువ! నాతోడ ముదిమిని బడసి నీవు
ఒహూర సౌభాగ్యమునుఁ బొందఁ బరమ కాంతి
సురుచిరం బౌచు నానంద శోభఁ దేల్చు
నీదు హస్తము గ్రహియింతు[1] నేను ప్రీతి ॥ 2278

*గీ॥ నేను గృహపతి నగునట్లు నిన్ను యోగ్య
భగుఁడు సవిత పురంధియు భాగ్య మొసఁగు
నర్యముఁడు మొదలుగాఁగల యమరవరులు
నాకు నర్పించినార[2] లానంద మొప్ప ॥ 2279

(37)*గీ॥ ఎట్టి యూరువునన్ జను లెల్ల బీజ
మును గ్రహించుచు నున్నారొ![3] పూష! మరల
నట్టి యూరువు శివతమం బైన దాని
నర్వతఃప్రేరణముఁ జేయు సరస! [4]నాకు ॥ 2280

*గీ॥ ఎద్ది కామయమానమై యొసఁగుమండు
దీప్త శేఫంబు నెద్దాన దీక్షఁ బూని
పెట్టఁగలవార మగుదుమో! దిట్ట! [5]నీవె
యట్టి యూరువు[6] నా కీయు మెట్టులైన ॥ 2281

(38)*గీ॥ అగ్ని! వహతునితోఁ[7] గూడ నతివ సూర్య
నీకు నొసఁగెను గంధర్వ నికర మిపు!
సోమున కొసంగుటన్ దాని సుప్రజాభి
వృద్ధిఁగల జాయ నా కిమ్ము! వేద్య! కలుఁగ ॥ 2282

(39)*గీ॥ ఆయువున[8] నగ్ని యొసఁగిన యతివ కెవఁడు
పతిగ నుండునొ! వాఁడు సంతతము ప్రీతి
యుక్తుఁడై వత్సర శతంబు రక్తితోడ
నిలను జీవించుఁగాతఁ దా[9] నెల్ల విధుల ॥ 2283

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

1. నిశ్చయముగ, (తా.పా.), 2. నాకు సమర్పించినారలు ప్రాకటముగ, (తా.పా.), 3. జ, మును త్యజించుచు నున్నారొ, (తా.పా.), 4. సరస పూష!, (తా.పా.), 5. పేర్మి మెర, (తా.పా.), 6. యట్టి యూరువు ప్రేరించుము దాన, (తా.పా.), 7. వహతువతో, (వా.ప్ర.పా.), 8. ఆయువున=ఆయుస్సుతో. (నే.వేం.న.శా.), 9. తా నెసగ మెసగ. (తా.పా.)

(40)*క॥ కన్యకు సోముఁడు పతి యగుఁ
గన్యకు గంధర్వ రాజు కలఁడు పతిగ నా
కన్యకకు నగ్ని పతి యగు
గన్యకుఁ బతి మనుజుఁ డౌనుగాదే! వరుసన్ ॥ 2284

(41)*గీ॥ మొదట గంధర్వునకు సోమమూర్తి యిడగ
నట్టి గంధర్వుఁ డగ్నికి నందఁజేసె
నట్టి కన్యను బుత్రుల నగ్ని నాకు
ధనముతోడ నొసంగెఁ దా ఘనత మీర ॥ 2285

(42)*గీ॥ పుత్ర పౌత్రులతోఁ గూడి పూర్ణ గృహము
నందు మోదించు చీ లోకమందు మేము
వేరు కాకుండ మెలఁగుచు విశ్వ మైన
యాయువును బొందెదముగాక! నతిశయించి ॥ 2286

(43)*గీ॥ ఇల ప్రజాపతి యను దేవతాధికుండు
మాకుఁ బ్రజలను బుట్టించుఁగాక యట్టి
పుత్రులు జరను బొందుచున్ బూర్ణ జీవు
లగుచు నివసించెదరుగాక నెలమితోడ ॥ 2287

*గీ॥ అతివ! నీవు సుమంగళి వౌచు నార్య!
పతి సమీపంబుఁ బొందుము! భాగ్యవతిరొ!
ద్విపదమందుఁ జతుష్పద వీథియందు
సుఖముతో వెల్గుమా! నీవు సుదతి కాన ॥ 2288

(44, 45)*సీ॥ ఘోర చక్షుస్సుతోఁ గూడక యో కాంత! కమ్ర నేత్రములతోఁ గ్రాలు మీవు!
పతికి నే వేళల[1] బాధలఁ బెట్టక పతిహితంబును[2] జాలఁ బడయు మీవు!
పశు గణంబుల కెల్లఁ బరమ హితంబును గూర్చుచు సంతుష్టిఁ గూడు మీవు!
శుభకర వర్చస్సు సుమనస్సు గలుఁగుచు వీర ప్రసవ వౌచు వెలయు నీవు!
గీ॥ వధువ నో యింద్ర! సుభగగ వర్ధనీయ, పుత్రవతిగను బతిని సుపుత్ర దశకి
మునను నేకాదశునిగను[3] నొనరఁజేయు, నీవు సంతత సంతుష్టి నేదుమయ్య! ॥ 2289

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి

1. పతికయి సతతము, (తా.పా.), 2. పతి హితంబు నీవు వడయు మీవు. (తా.పా.). 3. నొనరఁజేయు, మయ్య! సంతత ప్రీతి నందుమయ్య! (తా.పా.), నందు మీవు. (మ.పా.)

(46)*గీ॥ అత్త మామల చెంతను నతిశయముగ
దేవతల సన్నిధిని[1] గూడఁ దిరుగుచుండి
నీవు సమ్రాజ్ఞివై కడు నిశ్చలమతి
నుండుము! వధువ! ప్రీతిని మెండు గలిఁగి! ॥ 2290

(47)*గీ॥ సురలు మన[2] రెండు హృదయాల సూటి నొకటి
యైన యట్టులు సేయుత[3] మప్సమూహ
మాతరిశ్వ సరస్వతుల్ ధాతయు మముఁ
దలఁచుచుందురుగాకఁ దాత్పర్య మెసఁగ ॥ 2291

†(48) సువ్రతగ నిల్చు సురుచిరయై తనరి
ధర్మపత్నిగ వరలి తనరెడి పతివ్రత
శతాధిక మైన సంవత్సరమ్ములు
అవిధవగా వెలిఁగి అలరు సుమంగళిగ ॥ 2292

†(49) పుత్రు లెందరు నీకుఁ బుట్టినన్గాని
అప్పు డప్పుడు దుఃఖ మతివ! లభించు
ధర్మ పరాయణతఁ దనరారు భర్త
నీకు సోమాఽమృతము నిత్య మ్మొసంగు ॥ 2293

†(50) పతివ్రత కాఁగ సుభగగాఁ దనరుమన్
అష్ట పుత్రులతోడ నలరారు నీవు!
అన్నదమ్ముల హృత్తు కా తండ్రి హృత్తుకున్
భర్తృ హృదయమునకున్ వరలుము! నందినిగ ॥ 2294

†(51) ఇంద్రునకున్ దనరు "ఇంద్రాణి"గాఁగ
శ్రీధరునకుఁ దనరు "శ్రీ"దేవి వోలె
శంకరునకున్ దగు శాంకరి "గౌరి"గా
భార్యగాఁ దనరారు! భర్తకే వెపుడున్ ॥ 2295

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి

1. సన్నిధిని మతి తిరుగుచుండి, తా.పా., 2. సురలు మన మానసంబుల సురుచిరంబు, లై నయట్టులు....మాతరిశ్వలు మన మతుల్ పూతములుగ, ధాతయు సరస్వతియు(న్) మమ్ముఁ దలపవలయు, (తా. పా.), 3. వివాహ సందర్భమున వధూవరు లెట్టులు ప్రమాణములు చేసికొనెదరో గ్రహించినచో హిందూ వివాహ పవిత్రత గ్రహింపఁబడును. ఇందుకు బ్రాహ్మణమునఁ గల ఈ వాక్యములు గనుఁడు: "నీ హృదయము మేది కలదో యది నాది యగుఁగాక. నా హృదయము నీ హృదయ మగుఁగాక". ("యదేతత్ హృదయం తవ తదస్తు హృదయం మమ, యదిదం హృదయం మమ తదస్తు హృదయం తవ.")—నే.వేం.న.శా.

†ఇవి "ఖిల" మంత్రానువాదములు.

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(52)•అత్రికి నమరిన "ననసూయ" భాతి
అవ్వశిష్ఠునకుఁ దగు "నరుంధతి" రీతి
అల్ల కౌశికునకు నలరెడి "సతి" గాఁగ
అలరు మీవును భర్త కర్థాంగి వవుచు ॥ 2296

†(53)•ధ్రువ తారగా నన్నుఁ దొడరి పోషించు
మహి బృహస్పతి కాఁగ మహిమ నిలువంగఁ
బ్రజలు బిడ్డలుగ నా పతితోడ నొవ్వ
శత శరత్తులు నేసు జల్లఁగా బ్రతుక నౌ ॥ 2297

ఇయ్యది
శ్రీభరద్వాజ గోత్ర శ్రీవేంకటేశ్వర పౌత్ర
సంగమేశ్వర పుత్ర సీతాంబాగర్భశుక్తి
ముక్తాయమాన, భగవత్పాదారాధక,
నేమాని వేంకట నరసింహశాస్త్రి
విరచితకృతులలో శ్రీమదాంధ్ర
ఋగ్వేదసంహితయందు
సప్తమాష్టకమునఁ
దృతీయాధ్యాయము
సంపూర్ణము

## సూక్తము—85

ఋషిక—సావిత్రి సూర్య
దేవత—సూర్య, 1-5-సోముఁడు, 6-16-వివాహార్థదేవత, 17, 18-సోమార్కులు
21-చంద్రమస్సు

## అర్థాంతరము—1

†(1) సత్య శక్తిని భూమి సదమల మై యలరు
సూర్యునితో దివము శోభలన్ దనరారు
ఋత శక్తి పూర్వమై ఉండు నాదిత్యాఽఽళి
దివి సోమ మహిత మై తపికల మ్మై యుండు ॥ 2298

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•ఇవి "ఖిల"మంత్రానువాదములు.

†(2) ఆదిత్యులకు బలము అల్ల సోమాఽమృతము
సోమ శక్తిని బృథ్వి సొబగొందు మహి గాఁగను
నాకాశమయ చంద్రాఽమృత శక్తులన్
నక్షత్ర పుంజాలు అక్షయము లై తనరు ॥ 2299

†(3) చంద్రాఽమృత బలిమి శక్తివంతము లౌచు
నలరారు నోషధులు అఖిల భువనాలలో
ఇంద్ర సమృత శక్తి నెరుఁగుదురు బ్రహ్మలే
మ్రింగలే రెవ్వరున్ మింటి సోముని జూడ ॥ 2300

†(4) సప్త మృత్తులతో సప్త సలిలాలతో
సప్తాఽనలాలలో సప్తాఽనిలాలతో
సప్త మహా నావరణ చయములన్ అలరొందు
జాబిల్లి అమృతానఁ జదలులో గోళాలు
రక్షితము లై వెల్గు రమ్య రహస్యాల
శబ్ద శక్తులఁ దిరుగు చంద్ర ప్రభాకరులఁ
బంచ భూతాఽఽవళుల నంచితముగా నేలు
పార్థివు లెవరైన భక్షింపఁగా లేరు ॥ 2301

†(5) చంద్రామృతమ్మును సర్వ దేవాఽఽవళులు
మమత మై సేవింత్రు మరి మరి సేవింత్రు
సోముఁడే వాయువున్ సుష్ఠుగా రక్షించు
మాసమ్ము లన్నిటిన్ మలచు సమమ్ముగా ॥ 2302

†(6) సూర్యగా వెలుఁగొందు జాబిల్లి దేహాన
కరుణ కిరణుని కాంతు లలరారు వస్త్రమై
అగ్నిమయమై రూపు నందు నక్షర తతుల
శబ్ద శక్తుల భద్ర జాలముల్ తనరార
సచ్ఛమై స్వచ్ఛమై అలరి విస్పష్టముగఁ
బ్రకృతి సంపదలలో వరలుఁ బరిష్కృతుల ॥ 2303

†(7) సూర్య కాంతి పుంజాలను జోద్యమ్ముగ భరియించెడి
చంద్ర రూప శక్తు లెల్లఁ జదలంటుచు విశ్వమ్మున
దివి భువి భువనాఽఽవళులను దీప్త సంపదాళి నిచ్చు
నాహ్లతమ్ము కాని శక్తి నలవరచును జిత్తమునకు
అక్షులకును నత్యుత్తమ మహా రంజన మై వరలునులే ॥ 2304

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) అత్యంతము శ్రేష్ఠమ్మై ఆ సూర్యుని అగ్ని కాంతు
లలరారుచు నావిష్కృతి నా సోముని శక్తిఁ గలిసి
అతులితమౌ నానందము ననుభూతిని గలిగించుచుఁ
బ్రతిఫలించు చంద్రికలే పర్వమ్మై పర్వునులే ॥ 2305

†(9) చంద్రాఽమృత శక్తి సిద్ధిఁ జద లంబెడి కాంతి తతుల
సూర్య కాంతి పుంజాలను భార్యగా ధరియింప నౌను
ఆదిత్యుని అనుగ్రహాన అమల మైన మనశ్శక్తి
అమేయముగ సంద నౌను నా చంద్రుఁడె అమర పతిగ ॥ 2306

†(10) ఆకాశమ్మున కానందమ్మై అతులిత మనమున కానందమ్మై
ద్యో లోకమునకు ద్యుతి నానందము యోగముగా గ్రహమై తగ
నతిలోక ప్రశక్తులతో అపురూపపు వీర్యములన్
అలరారెడి రవి చంద్రులె ప్రాణము లౌచుదు ప్రకృతికి ॥ 2307

†(11) చరాఽచర ప్రపంచానఁ జరాభూతమ్ము కాని
పథములలోఁ దిరుగుచుండు భానుండును జంద్రమస్సు
రోదసికే ప్రొద్ది యైన శ్రోత్రములై వెలుఁగొందుచు
సర్వ లోక హితము కాఁగ సంచరించు దివి పథాల ॥ 2308

†(12) ఏకైక మ్మై వెలిఁగెడి హృదయ పవిత్రత వోలెను
ఏక చక్ర గతులఁ దిరుగు నినుఁ పక్షము తప్పకుండ
జపి చక్ర మ్మై తనరఁగ శుద్ధ మైన వ్యాన తతులు
లక్ష మ్మై విరాజిలఁగ నక్షయ కాంతుల నౌనఁగును ॥ 2309

†(13) సూర్య కాంతి పరిధపిల్లఁ జందమామ ధరియించుచు
నాదిత్యుని శక్తులతో నిశితత్త్వము తనరారఁగ
లోకాలను వ్యాపించెడి రోగ పాప పుంజాలను
ఖర కర కిరణాఽఽవళులును జలువల వెన్నెలలు ద్రుంచు ॥ 2310

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(14) భూత భావి వర్తమానములను దనరు కాల చక్ర
త్రితయమ్మున వరలు సూర్య తేజోమయ కాంతి జాల
మఖిల విశ్వ దేవతాఽఽళు లనిలజ మౌ నగ్ని పూష
నానందము నను మోదము నావహిల్ల నలరారును ॥ 2311

†(15) దివి భువులను సర్వమ్మున( దేజరిల్లు రోదసిలో(
దగ్రియు,కాల చక్ర మేడ( దనరారుచు నుండునో! మరి
శుభకర మౌ పతి శక్తుల సూర్య కాంతి పుంజాలను
ఒకే ఒక్క చక్రమ్మున నొనరు వర్తమాన గతుల ॥ 2312

†(16) చంద్ర సూర్య రూప మైన చక్రమ్ముల జంట తనరు
నేకైక మ్మై వెలు(గుచు నెన(గు కాల చక్రమ్మున
బ్రహ్మలకును ఋతువు లలర వరల( జేయు మాన గతుల(
గాల చక్ర గుహ్య రతుల( గ్రాంతుల విశ్వము తనరును ॥ 2313

†(17) మిత్రునకును వరుణకును మీరి వెల్గు రవి శశులకు
దివ్య దేవతాఽఽళి కెల్ల( దేజరిలెడి భూత గతిని
నిత్య చిత్త చేతనమున నెగడు ప్రచేతసునకును
నమస్కృతి నొసరింతును నవ దీప్తులు తనరార(గ ॥ 2314

†(18) ప్రాక్పశ్చిమ దిశల( జుట్టు రవి చంద్రులు శిశువులుగా(
గాలాఽధ్వర యానమ్మున( గ్రీడించును మాయలతో
ఋతు తతు లవి చక్ర గతుల సతతమ్మును సంచరింప
నఖిల విశ్వ సృష్టియందు నన్యలోకములను వెలు(గు ॥ 2315

†(19) నవ నవముగ నిత్యమ్మును భవమై వెల్గెడి కళలను
నుజ్జ్వల మౌ నహస్సులతో నుషోదయ మ్మొనర(జేయు
దివుల వెలు(గు దేవాఽఽళికి హవిర్భాగ తతుల( దనర
దీర్ఘాయువు నొస(గు( జంద్ర తేజ మెల్ల వెన్నెల లై ॥ 2316

†రచయిత:—వాఙ్మయ మహోద్యాన, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(20) సత్వంచ భూతాల సదమల శక్తులన్
రంగారు బంగారు వర్ణాల నొప్పార
నుత్తమ చక్రాల నుత్తమ పరివృత్తి
నపురూప తేజాల నంతయున్ వెల్గొంప
విశ్వరూప మైన విపుల మౌ రథ మెక్కి
అమృత లోకమ్ములో నలరారు పతి దేవు
దేహమునఁ జేరంగ దివ్య లక్ష్యమ్ముతో
సూర్య తేజో రూప సుదతి యానము చేయు ॥ 2317

†(21) విశ్వ వసు రూపముల విమల సమస్సులన్
శబ్ద శక్తుల నుతుల సంపదల నర్చించి
సౌర తేజో రాశి భారవహ మౌ శశియె
జనక స్థానము వీడి జన్య రూపము వెలుఁగ
అంతరిక్షములోన నలరార వ్యక్త మౌ
నపురూప శక్తినే అద్భుతముగా నెఱిఁగి
అంతరాత్మను గోరి లతి పవిత్ర హృదిని
నా "మరీచి" మరుత్తు లలరారఁ బయనించు ॥ 2318

†(22) అతిభార మొప్పంగ నలరారు వసు శక్తు
లఖిల విశ్వములోన నంతరాంతరములను
నమరొందఁగాఁ గాంతి కవరోధ మై నిలుచు
నా వసువులకు మెరుఁగు లమితముగఁ గల్గించి
ధరియించి భరియించి తనరారుఁ బతిఁ జేరు
సూర్యాది కిరణాలు సురుచిరము లై వెలుఁగు ॥ 2319

†(23) దేహజ మౌ కాంతి దివ్య తత్త్వము మీఱ
నిండు ఋజు శక్తులన్ నిష్కంటక మైన
పథములన్ బయనించి పరమ సఖ్యమ్ముగాఁ
దనరి వరణీయ మై దైవీయ లీలగా
ఖగ గతులు వరలంగ ఖగ గతుల విలసిల్లి
సర్వ దేవాఽవశుల సదయమ మ్మలరార
నుత్తమ గతు లొంద నుజ్జ్వల మౌ నవ్య
కాంతు లవి పరిసరించుఁ గాంతు లై పస మించు ॥ 2320

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(24) ఆదిత్య ప్రభలతో సలిలమ్ములను దనరు
జల శక్తి పాళమై జ్వలన తత్త్వము లొప్ప
జగమునన్ నిండులే! జగమునే చుట్టులే!
సత్య సంధత మీఱు సదమల జన్మతో
సుకృతాల లోకాన వికృతత్వముల నెనఁగు
నే అరిష్టము లైన నే మాత్రమును లేక
జల గండమే లేక వెలుఁగొందఁగా వెలుఁగు
జలములే మిలమిలల ధళధళలఁ దనరార
సౌర కాంతులు మీఱఁ జంద్రామృత కిరణ
జాలాలు హాయిగా జగమునే అలరించు ॥ 2321

†(25) సత్ ఖగోళమ్ములో సదమలముగాఁ బుట్టి
అమృత కర శక్తులన్ అమితముగ బద్ధమై
ప్రేరిత తతులను విడిచి విపులమ్ముగా నిలిచి
ఐశ్వర్యముగఁ దనరు నష్ట పసువులఁ బర్వి
సత్ పుత్రులుగ నలరి చద లంటి సోమాళి
సౌర మండల తతుల సంచార మొనరించు
తెలి వెలి వెన్నెలలఁ జలువల వెన్నెలల
మిన్నులకుఁ గన్నులై కన్నులకుఁ గన్నులై ॥ 2322

†(26) కాంతి పుంజా లెల్లఁ గరము లై తనరార
వెలుఁగులకు నెల వైన నెలఁత వై మెలఁత వై
ఉదరమునఁ బయనించి ఆవిష్కృతిని జేయు
పితృతలమును విడిచి గతి మార్గమునఁ దనరి
ఆకర్షణ శక్తి నతిలోక రతితోడ
ధరియించి ధరియించు తరణి పత్నిని గూడి
గృహము చేరెడు నట్టి గృహ పత్ని సతి వోలె
గగనాన రిక్కలు కాంతిలఁ బరివార మై
స్వస్థానమునఁ జేరుఁ బ్రస్థాన మొనరించి
ఋత గతుల సోమాళి ఋతుమతిగ వర్తించు ॥ 2323

(27)†మ॥ గ్రహ రాజున్ రవిఁ గూడి చంద్రుఁ డతి విక్రాంతిన్ మహా శ్వేతుఁడై
మిహిరుం డౌచుఁ జరాచర ప్రతతికిన్ మే లొప్పఁగా వెన్నెలల్
విహరింపంగను జేయు విస్మయ గతిన్ విస్తార హృచ్ఛక్తి మై
సహకార మ్మలరారఁగా నిహ పరోచ్చాలన్ దిశాంతమ్ముగన్ ॥ 2324

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(28) అతులిత క్రమ గతిని బ్రతిమానమున్ దిరిగి
నీల లోహిత వర్ణ కాల పరిశుద్ధరన్
గృత్తికల్ కాంతులు కెరలి వెల్గుచునుండు
ఖర కర కర కాంతి క్రాలంగ మేల్మిగాఁ
బరిపంథులను దరుమఁ బతి బంధములఁ దనరి
అలరు నా శశికళ అమృత కిరణాఽఽవపముల ॥ 2325

†(29) వసు రూపముల విడిచి బ్రహ్మలను నిర్జించి
కృత్తికాఽఽగ్నుల విశ్వ గృహమందు వెల్గించి
ప్రియురాలు విశదముగఁ బ్రియుని జేరెడి రీతి
జ్ఞాన రూపము తనర శశికళయె సత్ప్రకాశగఁ
బతి బాహు బంధాల మతి బద్ధమై వరలు
రవి శక్తి నమృతమై రాజిల్లఁగాఁ జేయు ॥ 2326

†(30) అత్యంత విస్తృతిన్ అలరారు కిరణాఽఽఽ?
తిమిర తతులను దశ దిశలందుఁ దొలఁగించి
పాప పుంజము లెల్లఁ బటాపంచలు కాఁగఁ
గాంతి కాంతుల విశ్వ గమనమ్ము చేయుచున్
గ్రమ గతిగ సన్న నై అమితముగ సన్న నై
అలరి భూతాలలో నలవోకగాఁ గలియు ॥ 2327

†(31) సృష్టి సహజత్వాన వ్యష్టి సమిష్టులుగఁ
దొలినుంచి కడవఱకుఁ బలు చంద్రమస్సులకుఁ
గాంతి క్రమ పూర్ణతల్ కాంతి క్షీణత హైన్యముల్
తిరిగి పరిపూర్ణతలు వరలులే! యెల్లపుడు
దేవతల నవ్య మౌ దివ్య మౌ తత్త్వాల
యజ్ఞాలుగా శశల ప్రజ్ఞాన గతులుగా ॥ 2328

†(32) దుర్గమాఽతీత మౌ ద్యో రూప శక్తులన్
రవి చంద్ర తేజాలు రాహువున్ గేతువున్
బరిపంథి రక్షసులఁ బాపాత్ము లెల్లరన్
అపమార్గగాము లౌ నరాతులన్ దులువలన్
దూరగులుగాఁ జేసి తున్మాడి- ప్రకృతికి
క్షేమంకరాలుగా సిరి సంపదలు కూర్చు ॥ 2329

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(33)†క॥ శ్రీకర సుమంగళి యగు వ
ధూ కాంతి గతిని సుదీధితుల సూర్యా ద్యా
వా కృత్తిక పృథ్వీ తతులు
ప్రాకట సౌభాగ్య రూప భాగ్య తతిఁ దగున్ ॥ 2330

†(34) కటు రూపముతోఁ బ్రకృతిని గాల్చి వేయు మాడ్చివేయు
దాహ శక్తి విస్తృత మై దహ్యమాన విష కీలల
దరిదాపుల కైన రాఁ దగని మష్ట ధూమకేతు
తండాలను బ్రహ్మ విద్య తనరారఁగ విధ్వస్తము
చేసిచేసి సూర్య కాంతి చెలఁగంగా నవ వధువుగ
వరలుచు నీ ప్రకృతి కొక్క వర మౌ నిత్యత్వమ్మున ॥ 2331

(35)†క॥ మంచిని మమతగఁ బెంచుచుఁ
దుంచుచుఁ జెడులను సతతము పూర్వాహ్ణ గతిఁ బ్రా
పంచికజ బ్రహ్మమయి రూ
పాఽంచిత మై తనరు సూర్య యౌగిక కాంతుల్ ॥ 2332

†(36) ఆర్యముం డై వెలుఁగు నాదిత్య విష్ణుండు
సవితగా భగుఁడుగాఁ జప లంటి వెల్గుచున్
గరము కరముగఁ గలియు కాంతి కిరణాఽఽవళుల
సౌభాగ్య భాగ్యాల సర్వ కాలాలలోఁ
బతి సతులుగా నిలిచి పరఁగుచున్ విశ్వాన
నాధార భూత మై ఆధేయ మై నిలిచి
తిరుగుచున్ నక్షత్రలన్ సురుగుచున్ గగనాన
మరగుచున్ బశ్చిమ మలయాఽనిలాలలో
నిత్య ముదయ మ్మొంచు నిండు తేజము లొనఁగు
దేవాఽఽళు లెల్ల సందీప్తు లై ప్రభ మీఱ ॥ 2333

†(37) మంగళ ప్రద దీప్తి మాన్యుఁడౌ నా పూష
మానవాఽఽళికి బెఱ మహిమాఽన్వితపు శక్తి
నంతర్గతులు మీఱ నతిలోక రతులతో
నిలుపుచున్ లోకాన నిరతమ్ము జననాల
సృష్టి రీతుల నడిపి చెలఁగఁగాఁ బ్రకృతిలోఁ
బతి శక్తి సతి శక్తి వరయు సహజ మ్మొంచు ॥ 2334

(38)†క॥ ముందుగ నడుచుచుఁ గాంతి ప
సందులు వెల్గులు ప్రసార శక్తుల మీఱన్
బొందం గోరుచు రహి మహి
తేందు ప్రకృతి భువన తతి నెనయుదు లెః రవుల్ ॥ 2335

†రచయిత :—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(39) అగ్నిమయ మై వెలుఁగు నా మహత్తర శక్తి
పతి పత్ను లిర్వురున్ బర్వుదు రెప్పుడున్
దీర్ఘాయు వలర ననర్ఘ శరదశ్శతముగాఁ
జంద్రాఽమృత శక్తి జాలమ్ము నెల్లపుడు
నరుణుండు కిరణాల నాత్మ వశ గతిఁ జేసి
మరి యింతగా ముండు మహితోజ్జ్వల దీప్తి
రవి కిరణ సమృద్ధి నవ కిరణ సంనిత్య
కాంతి ప్రభావాలఁ గ్రాలుతేః చంద్రుండు
అమరమై అమృత మౌ నమృతానఁ దనరారు
నుభయ వర్చసు లలర నుష్ణ శీతలతలను ॥ 2336

†(40) మను శక్తి జన్మించు ఘన ప్రాణి తతి కెల్ల
హృదయాధిపతి చంద్రుఁ డెనఁగుఁ దొలి నాథుఁడుగ
జన్మతోడనె హృత్తు జన్య మై యుంటచే
గతి చలన శక్తులన్ గంధర్వుఁడె పతి పిదప
నగ్ని మూఁడవ పతిగ నగు జీవ శక్తులను
నిత్య సహ జీవాన నిండు ప్రాణిగఁ బ్రేమ
పంచుకొను సరిజోడు పరఁగు నాల్గవ పతిగ
సృష్టికే పతి ఉండు స్రష్టకే పతి ఉండు
అధినాథుఁడే లేక అలర దేదియు సృష్టిఁ
జన పెద్ద శక్తులన్ డెన్నొందు పతి రీతి ॥ 2337

†(41) హృద్గత మౌ చంద్ర శక్తి యెనఁగుచు గాంధర్వ గతుల
కప్పగించుఁ జలన గతుల నా గంధర్వ సుశక్తి
జఠరాద్యగ్ని తతుల శక్తుల పరమ్ము చేయు
నా అగ్నియె ప్రేమ మెయిని నర్పించును నిహ పర మౌ
నధినాథున కధీనముగ నాజన్మాంతము నిలువఁగ
సుఖ సంపత్తులు వెలయుఁగ సుపుత్రులును శోభిలంగ ॥ 2338

†(42) విశ్వ సృష్టి సద్గృహాన వెలయు గ్రహము లుప గ్రహా
లలరు పుత్ర పౌత్రులుగా నఖిల సృష్ట్యధినేతకు
రకరకాల క్రీడలతో రమ్య మైన కాంతులతో
రాజిల్లఁగ భువన లోక రాజి గోళ వితతు లెల్ల
ముహుర్ముహుర్మహానంద మోదమానుఁ డై తనరును
జక్రనేమి క్రమముగాఁగ సంభవింప సృష్టి లయాల్ ॥ 2339

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(43) ఆ ప్రజాపతి జనుల నఖిల పృథ్వులలోనఁ
బుట్టించి పెంచుచు గిట్టింపఁ జేయునే!
ఆ సుమంగళి సూర్య అంతయు శ్రేయ మై
ద్విపద చతుష్పద వివిధ ప్రాణుల శుభ
సంక్షేమములు నెఱప సర్వ జన తతులతోఁ
బతిలోకమే గతిగఁ బరమ లక్ష్యమ్ముగా ॥ 2340

†(44) అపతులన్ దునుమాడి ఆ సూర్య తేజమ్ము
గోవుల మూలానఁ గూర్చి కళ్యాణముల
నక్రూర దృష్టులన్ అతివేల మౌ కృపను
సుమనస్సు వెలయంగ సువర్చస్సు వెలుఁగంగ
వీర శక్తుల నొసఁగి పార మెసయని దివ్య
దేవ తతులను సూర్య తేజమ్ము శ్రేయాల
ద్విపద చతుష్పద వివిధ ప్రాణుల శుభ
సంక్షేమములు నెరపు సర్వ జన తతులతో ॥ 2341

†(45) ఇంద్ర శక్తుల మీఱి యెన లేని సుభగు లౌ
ఆ సుపుత్రుల బలము లతిలోకమై వెలయ
దశ దిశలు ముఖము లై తనరారఁగా జగతి
నేకాదశుండుగా నినుల కినుఁ డై వెలుఁగు
పతి దేవుఁడవు కాఁగ వర సృష్టి స్థితి లయల
గతులు తనరారులే! క్రాలు నీ శక్తిమై ॥ 2342

(46)†క॥ ప్రకృతికిఁ బ్రతికృతి గాఁగను
సుకృతిగ నొక శక్తి పుట్టి సూనృత గతులన్
బ్రకృతి పురుష మూలాల న
వికల్ప సామ్రాజ్ఞి దేవ వితతుల వెల్గున్ ॥ 2343

†(47) విశ్వే దేవత లెల్ల విమల మౌ శక్తులన్
జలము నదముల మౌచుఁ జలించుచు ద్రవింప
జల బిందు భేదాల లలి నెఱుఁగలేనట్లు
ఆ మరుచ్ఛక్తులే అమర మై అమరునటు
చంద్ర చంద్రిక లట్లు సవిత తేజముల గతి
స్రష్ట సృష్టుల భాతి శబ్దముల్ శక్తులుగ
హృదయాల నన్నింటి నొక్కఁడిగ నొనరించు
హృచ్ఛక్తి ఏకైక ఋత "మనాహత"ముగా ॥ 2344

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(48) వసు పత్నిగా వెలిఁగి వసు బద్ధ మై నిలిచి
కెరలి తేజోవతిగఁ గీర్తివతిగాఁ బ్రకృతి
తుదిదాఁక సువ్రతగఁ దొడరి మేల్పొందుచున్
బతి రహిత కాకుండ వరలు శత వర్షాలు ॥ 2345

†(49) ప్రతికృతిగా నీకు బహు సంతతి కలిగి
దుఃఖమ్మె దొడరు నీ దురితాఽరియౌ పతి
వసు పరాయణత్వమ్ము వరలంగ నిత్యమ్ము
సోమాఽమృతము త్రాగి సుష్ఠుగా ముద మొనఁగు ॥ 2346

†(50) పతి బద్ధ వై నీవు వరలి వెల్గొందుచున్
అష్ట వసువులె పుత్రులై తనర సుభగ వై
పతి పిత భ్రాతలకుఁ బరమ మౌ నానంద
మీయు మెల్లపుడు నీ ఉల్లమ్ము నందినిగ ॥ 2347

†(51) ఇంద్ర శక్తులవల్ల నింద్రాణి వెల్గు నటు
శ్రీధరుని శక్తులన్ శ్రియ వెల్గు భాతిగాన్
శంకరుని శక్తులన్ గౌరి వెల్గెడి రీతి
ధరియించు శక్తిలో వరలు నిత్యము ప్రకృతి ॥ 2348

(52)†ఆ॥వె॥ ఈర్ష్య లేని అత్రి కెన యైన రీతిగాఁ
జెడుపుల నెఱుఁగని వశిష్ఠు భాతిఁ
గౌశికు నతి శబ్ద గాయత్రి ధర్మమ్మె
తనరు నట్లు ప్రకృతి తగును బతికి ॥ 2349

†(53) ప్రకృతి పురుషుల మధ్య వరలు ధ్రువ బంధముగ
ఆ బృహస్పతి శక్తి నలరు బుద్ధిగఁ బనరి
పరియించి ధరియించు పతి నైన నాతోడ
శత శరత్తులు ప్రజావతిగాఁగ జీవించు ॥ 2350

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—85

ఋషి—సావిత్రి సూర్య

దేవత—సూర్య, 5-సోముఁడు, 6-16-వివాహార్థ దేవత,
17-18-సోమార్కులు, 21-చంద్రమస్సు

### అర్థాంతరము—2

†(1) సత్యలోక ప్రభావమ్మున సర్వ పృథ్వులు సంచరించును
బ్రధ్న చంద్ర ప్రభావమ్ముల రాజిల్లును రమణ వ్యోమము
జ్వలన జ్వాలల జలమయమ్మయి సదమల మ్మౌ సత్య శక్తిని
సధివసించుచు నలరుచుండును నాదిత్యుం డఖిల జగమున
అష్ట వసువుల నమల శక్తుల నధిశ్రిత మౌ నల్ల దిప మది ॥ 2351

†(2) ఆకసమ్ము చలి వెలుఁగుల నాదిత్యుల రంగు లలరు
వసు చంద్రుల వాయు తతుల వసుధ మహీతల మ్మౌను
రిక్కల గుంపుల మహిమలఁ జుక్కల రేఁ డలరారును
సౌర కాంతు లెనయుచుండ సాయంసంధ్యల పిదవను
నతి గుహ్యమ్మౌ శక్తుల నఖిలమునకు హిత మౌచును ॥ 2352

†(3) నానా ఓషధులు పెరుగు నవ వసు శక్తుల నిత్యము
వివిధ లతల వృక్షములను వెలయును వసు పదార్థములు
సోమ పానమునను బ్రాణి శుభ సుఖ శోభలను నొందు
నమృతానిల శక్తులతో నాకాశపుఁ దత్త్వముతో
నవ బ్రహ్మల నెవఁడైనను నవగతమ్ము చేసికొనక
గుర్తింపఁడు సోమ శక్తి గుణ మనుభవసీయముగా ॥ 2353

†(4) అత్యంత గుహ్యమై అపురూపమై వెలయు
నాహ్లాద రూపాల నమృతమ్ము విలసిల్లు
రవి చంద్ర గోళాల రక్షితమ్మై నిలుచు
నమృత పానము చేయు నఖిల పృథ్వ్యధిపతులు
రాహువున్ గేతువున్ రవి చంద్రులను మ్రింగ
సాధ్యమ్ము కాదు విశాల విశ్వమ్ములో ॥ 2354

†(5) ఆప్యాయతలు మీఱ నఖిల దేవాఽవళులు
అతి విహారాలతో నమల సోమము త్రాగు
ననిల సోమము నెల్ల నమృత గతి రక్షించి
కాల రూపాలలోఁ గ్రాల సమానముగ ॥ 2355

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వల్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) వైష్ణవీయాఽఽశంస వర్ధిల్లఁ జేయఁగా
వసు శక్తి తతు లెల్ల వరలు విస్తారముగ
వ్యక్తమౌ ప్రభాకర ప్రభలు ప్రజ్వలిత మౌ
నిత్య పరిష్కృతుల నెగడొందు భద్రరతి ॥ 2356

†(7) హృదయమునకుఁ జంద్ర శక్తి [1]ఉపధానమ్మై తనరును
హృదయమ్మును జంద్రశక్తి ఉచ్చ నీచ గతుల నుంచు
అంజనమౌఁ జంద్ర శక్తి అక్షి ద్వితయమ్మునకు
దీప శిఖగ వెలుఁగొందును దివ్య దృష్టి కాఁగ నిలుచు
రజితమ్మును స్వర్ణమ్మును బ్రభవింపఁగఁ జేయునులే!
దివి భువులను జంద్ర శక్తి తేజరిలెడి పతి యాచును ॥ 2357

†(8) సూర్య చంద్ర కాంతుల రతి వీర్యాగ్నులు సంభవించి
ప్రకృతి పురుష శక్తులతోఁ బ్రేమ దౌత్యము నెఱపునులే!
మహిత చరాఽచరమ్ములను మైథున క్రియగా శక్తుల
వినిమయాల నానందము విమలమ్ముగ ముందు నడుపు ॥ 2358

†(9) ఆదిత్యుని శక్తులతో నడుమఁడు వెల్గు పన్నిగ
సమమలమౌ మనశ్శక్తి సంచరించు విశ్వమ్మున
అతీతమై మహాకాంతి వితానాల వేగాలకు
నవ పథువుగఁ బ్రకృతి నిలువ నవ్యామృత మొసఁగు నింగి ॥ 2359

†(10) పుత్తడిగఁ దనరారఁ బుణ్యమ్ముగాఁ బెరుగ
నగ్ని తేజాలతో నవురూప మై వెలుఁగు
రవి చంద్ర కాంతులకుఁ బ్రాణ మౌనులె మనసు
ఆచ్ఛాదన మ్మౌను నల్ల ఛత్రాఽఽవరణ గతిగ
ఆహ్లాదకారిగా నఖిల మౌ దివసములకు
గృహముగా గృహిణిగాఁ గెరలు విశ్వమ్మందుఁ
గల్పతరు జాతి ననల్ప శక్తులు మీఱ
నాయాస రహిత మౌ నతిలోక గమన గతి
వహియించి అహరహము విహరించు మహితముగ
నంత మెసఁగని మహా యాన స్వరూపమై ॥ 2360

†(11) చరాఽచరమ్మౌ పథముల సముదాత్తపు దివ్య గతుల
శబ్ద శక్తి ప్రాణ శక్తి సర్వలోక విచలితమై
అనలాఽనిల సలిల చక్రముల శ్రోత్రమ్ములు కాఁగను
గాలి రథము పయనించును గ్రాలఁగ రవి చంద్ర తతులు ॥ 2361

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఇక్కడ "ఋ-ఉ"లకు యతి. (చూ. పీఠిక.)

†(12) పతి రహితమ్మై హృదయము వరలు సన్మహితమ్మై
రవి చంద్రులు చక్రములై రాత్రుల నక్షమై గమనము
మనోమయమ్మైన శక్తి అనాహతమ్మై తనరుచు
నారోహణ మొనరించును ననంతేశుఁ జేరుకొనఁగ ॥ 2362

†(13) ప్రకృతి పురుష తత్త్వాలను బ్రతిదియు ద్వైతమ్ము కాఁగఁ
గర్త కర్మలై వెలయఁగ - గర్మ - కర్మ ఫలము నాఁగఁ
గష్ట సుఖాల్ మంచి చెడులు కాంతి తిమిర జాలమ్ములు
నానందాల్ దుఃఖమ్ములు సకల లోకముల నిండఁగ
సౌర చాంద్ర గతులు మీఱఁ బడయు నప్డాదిత్యుం
డన్నింటిని నలరింపుచు మిన్నంటఁగ నడిపించును ॥ 2363

†(14) మూఁడు నాడులు తనరు మూఁడు చక్రాలలో
నుష్ణ జల శీతాల నొనరు కాలము లొప్ప
రవి చంద్ర తేజాలు రంజిల్లఁగాఁ జేయు
బతి పుత్ర గతులుగా విశ్వ దేవత లెల్ల
నలరారఁగాఁ జేయు నాదిత్యుఁడౌ పూష
అంతువంతూ లేని ఆ కాల గతు లరర ॥ 2364

†(15) ఒక కాల చక్రాన నొనరు కాలాధిపత
సూర్య చంద్రుల నడుపు శుభ పరంపర లిచ్చు
గగనాన నక్షత్ర గ్రహ రాజులను నడుపు
నుదయాస్తమయములు నొదవ నాదిత్యుండు ॥ 2365

†(16) సౌర చాంద్రము లైన చారు చక్ర ద్వయము
ఋతు గతుల నడుపఁగా ఋత నవ బ్రహ్మలే
వాతాది భూతాలఁ బ్రభవింపఁగాఁ జేయు
నేక చక్రమ్ముతో నెసఁగు కాలాధిపుని
గుహ్య తత్త్వము నెల్ల గుర్తెఱుంగఁగ నౌను
ఆ శ్రీమహావిష్ణు నఖిలేశు నెఱుఁగ నౌ ॥ 2366

†(17) సూర్య కాంతికి దివ్య శుభ చంద్ర కాంతికిన్
మించు దేవాఽఽవళికి మిత్రాఽఽదిత్యునికి
వరుణ నామమ్ముతో వరలు నాదిత్యునికిఁ
బంచ భూతాలకున్ మించు సత్యమ్మునకు
ధర్మమ్మునకు న్యాయ తత్త్వ సత్ప్రవృత్తులకు
నమస్కృతులం జేసి నడయాడులే ప్రకృతి ॥ 2367

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(23) దివ్య దేవతాళి కృపను దేజరిలెడి సత్యము దయ
సత్యంతము నుత్తమమై ఆనింద్యమౌ నుదకమ్ముల
ఋజు దీప్తులు వర్ధిల్లును సృష్టి నూర్న శక్తి నొందు
నాకర్షణ శక్తి తతుల కణు వైనను లో(గకుండ
నలరారెడి నాదిత్యు(డు అరుణ మండలాధిపత్య
శక్తి మీఱ నఖిత్వమున సంచరించు గగనమంచు ॥ 2373

†(24) సత్య యోనులం దెపుడును సంజాతమౌ సుకృతము
లోకాఽరిష్టాల నెల్ల రూపు మాపుచుండు సదా
ఆదిత్యుని సంసేవన మలరి అనుగ్రహము కలుగ
వరుణుండే అధిపతిగా వరలు దిక్కాదిగా(గ
జ్వల శక్తులు వ్యాప్తి నొందు జ్వాలాంతర్గతము లౌచు(
బంచ భూత నియమ రతుల మించు జగతి తనరు గతుల ॥ 2374

†(25) ఆ సకలాధిపు నపురూపమౌ కరుణ(
గ్రహ గతులు మెఱంగ( గ్రాలుచున్ వేల్గుచున్
ఆకసమ్మున( దిరుగు నఖిల గోళాదులును
సచ్ఛక్తి బద్ధ మై శర్మ సత్తత్వాల మై
అలరారు పుత్రులై అమర తేజస్సులను
బేర్త రూపాఽఽవరులు విచ్ఛిన్న మై పోవ ॥ 2375

†(26) కాల రథమున( గ్రాలు కాల పురుషుని కాంతి
కిరణాలె కరములై చరణాలుగా వరల
ఆధేయమై నిత్య పాథేయమై లోక
కర్మ సాధన మౌచు ధర్మ సాధన మౌచు
మర్మ శక్తుల పూష మహితమై తనరారు
విశ్వ గృహమ్మునన్ వెలు(గు గృహపత్నిగా ॥ 2376

†(27) ఆకర్షణ శక్తి నందు లోకము( జేరు
సౌర చాంద్రములై మీఱు తేజోవతులు
కిరణాలుగా నిత్య కృతి గార్హపత్యమై
గ్రహ రాజె అధిపతిగ గృహపతిగ( దనరార(
బ్రకృతి ధర్మము పురుష రమణ మర్మ సుకర్మ
గతి( జరాఽచర మెల్ల( గ్రాలు జగదీశ కృప ॥ 2377

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(28)†క॥ దైవీయ మ్మగు శక్తిని
ప్రావట్కృత నీల లోహితాఽంచిత వ్య
జ్యాఽవకలితమయ్యె మహా
జీవికగా విధి సుబద్ధ చేతన మెప్పన్ ॥ 2378

†క॥ పతిత పతి బంధమ్ములతో
నతులితమై సంచరించు నఖిలమ్మౌ లో
క తతుల వినీల లోహిత
గత మైన విధాన విశ్వగ సహజ గతిమై ॥ 2379

(29)†క॥ పరమాత్ముని సర్చింపఁగ
వర వసు సత్ సంపదాళి బ్రహ్మ పరమ్మై
వరలెడి భాతిన్ దైవీ
య ఋత సుశక్తులు పతి సతు లౌచున్ వసరున్ ॥ 2380

(30)†గోపికావృత్తము ॥*
పాప పుంజ ప్రభావమ్మున వరలు పుణ్య మ్మంతరించును
దీప కాంతి ప్రభావమ్మునఁ దిమిర పుంజ మ్మంతరించును
గోప నాథ ప్రభావమ్మునఁ గుటిల రక్షో జాతి చచ్చును
దాప దేదీప్యమానాఽచ్యుతఁ దరణి వెల్గున్ వెల్గు వెల్గుగ ॥ 2381

(31)†సుధావిషమవృత్తము॥•
యక్ష్మ రహిత సుచంద్ర శక్తులు యజ్ఞములతో వివర్ధన మౌఁ
బక్షములతోఁ బూర్ణ మౌ రతిఁ బర్వును సుధా ప్రపూర్ణముగా
పక్ష శక్తులఁ బుసర్జన్మము ధన్య మౌ సుర సంఘ మొందున్
అక్షయ మ్మౌ నమృత వృష్టుల హాయి పొందున్ జనాఽఽవళులే ॥ 2382

(32)†క॥ పరిపంథుల మారమ్ముగఁ
దరిమి తరిమి చంద్ర శక్తి పంపరుల రతిన్
వర ప్రకృతి పురుష శక్తులఁ
బరమాఽమృత వృష్టిఁ బెంచు ప్రాణ ప్రదమై ॥ 2383

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"అతిధృతి"చ్ఛందము (19). •ఇది పరస్థాన విషమ వృత్తము. ఇందులో సంయుతాఽసంయుతప్రాస "క్ష్మ-క్ష"లకుఁ బ్రయుక్త మైనది.

(37)†క॥ శివతమ మై విశ్వమ్మున
నవ వీణాఽమృతస్వ రూప నానా మన్వా
ద్భవ శక్తిఁ బ్రాణులు జగతి
నవితథముగ జన్మ మౌను ననుభూత రతిన్ ॥ 2390

†క॥ ఆకర్షణ శక్తులపై
వైకర్షణ శక్తి పెనఁగఁ బ్రహరణములతో
ఛేకాఽనుబంధ గతులను
ప్రాకృత తత్త్వాలఁ బోష రాణించు సదా ॥ 2391

(38)†తే॥గీ॥ సతులు పతులను సర్వోపచార మహిత
సేవ లొనరించు రీతి పవిత్ర గతులఁ
బ్రకృతి పురుషుని సేవించుఁ బ్రాణి తతులఁ
గనుచు పెంచును దనలోనఁ గ్రోలఁజేయు ॥ 2392

†క॥ సూర్య పతి కాంతిఁ జంద్రుం
డార్య సుశక్తిగ ధరించి యమృత ప్రద యౌ
భార్యగఁ బెంచె వెన్నెలలన్
ధుర్య సుధర్మ ప్రకృతి సగర్వతో వర్తన మౌ ॥ 2393

(39)†క॥ వెన్నెల వన్నెల పన్నియ
మిన్నంటెడి వేడి వెలుఁగు మించెటి కాంతిన్
విన్నాణమ్ముగఁ బెంచును
గ్రన్నన నాయుష్య శత శరత్తులు కాఁగన్ ॥ 2394

† భాను తేజము నొంది భవ్య శక్తులు మీఱఁ
జనదైన యమృతంపు ఘన తత్త్వమును నొసఁగి
రవి పతికి దీర్ఘాయు నవ శక్తులన్ గూర్చి
శత శరత్తులు కాఁగఁ జంద్రుఁడే వరలుచున్
ఋత రతులు పతి గతుల సుత ప్రసూనుల మీఁద
దేదీప్యమానాలఁ దేజరిలఁగాఁ జేయు ॥ 2395

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(40)†తే॥గీ॥ అమృత శక్తియె తొలి పతి యగును ప్రకృతి
కఖిల చర కామ రూపత్వ మావలి పతి
అగ్ని మూఁడవ పతి కాఁగ, నలరుచుండు
వృద్ధ సంజాత శక్తి తురీయ పతిగ ॥ 2396

†(41) అమృత మిచ్చెను ప్రకృతి చర కామ రూపతల
కా చర కామ రూపత లనలమ్మునకు నొసఁగె
నా యగ్ని పతి రూపుఁడా పురుషునకు నీయ
నచర రూపా లెల్ల నవతరించెఁ బ్రకృతిగ ॥ 2397

†(42) జగద్గృహమ్ములోఁ జంద్ర సూర్యాయుతే
సంతానమై క్రీడ లంతటన్ జరుపంగ
సృష్టి ఆయువు సుమహితాఽదృష్టమై తనరార
సచ్చిదానందమై సర్వ విశ్వము నడుచు ॥ 2398

†(43,44) ఆ దేవ దేవుండు అతిలోక క్రీడగా
విశ్వ పతిగా వెలిఁగి ద్విపదేహ పర మౌచు
నాల్గు పాదాలలో నడువ ధర్మము కర్మ
మఖిల ప్రాణులు ప్రకృతి ననుసరించుచు బ్రతుకుఁ
బ్రగతి కళ్యాణముల సుగతు లవి విలసిల్ల
నతి సువర్చస్సుతో నత్యంత సుమనస్సు
లలరారఁగా శివము లా అఘోరాఽఘులన్
అపతులన్ దునుమాడి అఖిల శుభముల నొసఁగు ॥ 2399

†(45) అద్భుత తేజాల నఖిల ఖగోళముల
సత్పుత్ర లతి గాఁగ నవదరించుచు నుండు
దిశ దిశలు పుత్రులై తనరార విశ్వాన
నేకాదశుండుగా నెసఁగఁగా దిగధిపతి
వరల సహజ మ్మౌచుఁ బ్రకృతి మాతయె తనర
రోదోఽంతరాళమ్ము ప్రోదిద సుభగగ వెలుఁగు ॥ 2400

†(46) అద్వైత తత్త్వమే అత్త మామలు ప్రకృతి
కఖిల సత్త్వమ్ములకు నలరు రాజ్ఞిగఁ బ్రకృతి
అన్ని ఆనందాల కమటి మూలమ్ముగాఁ
దిష్ఠ వేయును దివ్య దేవాఽఽళి తేజరిల ॥ 2401

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(47) విశ్వ దేవత లెల్ల వెలుఁగగా నొక్కటౌ
మన దివ్య హృదయాలు మహితముగ నొక్కటౌ
అనిలాఽనలాదులు అలరంగ నొక్కటౌ
శబ్ద శక్తులు ధాత సర్వస్వ మొక్కటౌ ॥ 2402

†(48) వ్రతమె పతిగా వెలుఁగఁ బత్ని యీ ధర్మమే
సన్నియమాలతో సధవగాఁ దనరారి
తేజస్వియై పూర్ణ దివ్య యశస్వియై
శత వర్షములఁ బ్రకృతి సాగ్రముగ విలసిల్లు ॥ 2403

†(49) ధర్మ స్వరూపతన్ దనరారు ప్రకృతికి
నమృతాఽధిపుఁడె నిత్య మధినాథుఁడై నిలుచు
ఆనందమును నొసఁగు నతివేల గతి మీఱఁ
జంద్రునితో సహా సర్వ చరాఽచరాల్
సంతానమై వరలి సంతసమునే కాక
యెప్పుడో ఒకసారి యిచ్చులే దుఃఖమున్ ॥ 2404

†(50) వ్రతమె పతిగా వెలుఁగ రాజిల్లు సుభగకు
గుహ్య స్వరూపమై కొమరులై తనరారు
మూల పురుష పితృ మూర్తికిన్ సహ జన్మ
లందరికి నధిపతికి నగు నందినియె హృత్తు ॥ 2405

†(51) తేజమ్మునకు వెలుఁగు దీప్తు లలరారునటు
అష్ట వసుధారికి ఐశ్వర్య ముండునటు
రాజ్య బీజాఽఽత్మునకు రమణ విశ్వము భాతి
నధినాథుఁ డగు పురుషున కధీన మౌఁ బ్రకృతి ॥ 2406

†(52) త్రైత రహిత మ్మైన పూతాఽనుసూయగా
నా పతివ్రత ధర్మ మది రూపమై యుండు
వాశిష్ఠ విశిష్టగ వగ లేని వధువుగాఁ
బసిడిలోఁ బస లొలుకు పసిమి మిసమిసలుగా
ఓ ప్రకృతి వధువా! ఉజ్జ్వల భార్య వై
అంకిత మ్మగు మీవు! అధిపతికిఁ బురుషునకు ॥ 2407

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(౫౩) ప్రకృతి పురుషుల మహిత ప్రజ్ఞగా బుద్ధిగా
సృష్టి గోళాదులకుఁ జెలఁగు ధ్రువమ్ముగా
సత్ ప్రజావతి వౌచు సత్‌పతిన్ ననుఁ గూడి
సంజీవనిగ నీవు శత శరత్తులు బ్రతుకుః ॥ 2408

ఇయ్యది
విశ్వసృష్టిప్రకృతిమాత్రైకైకపుత్ర
పతకమళ్ళ గోత్ర-వద్లమూడి కుల సందీప్త-
శ్రీ సుబ్బన్నపౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అద్వితీయ ద్వితీయపుత్ర
శ్రీసరస్వతీమాతృ ప్రియపుత్ర-అపార వేదశాస్త్ర సాహిత్యవిద్యా పారంగత-
అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకిక శక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాదిసర్వ దేవతాస్వరూప-విద్వన్మణి పంచముఖాంజనేయోపాసక శ్రీవేదుల రామశాస్త్రి గురువరాభిస్తుత ముఖకలిత గోపాలసువద-మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమగురువర్యాభినుత "శతవర్షాశీర్వచన రక్షిత అగుణశోభితనిష్కళాసహిత శ్రీ మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహినీ హృదయ లక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్‌వాక్ స్వరూపిణి అమలినపవిత్ర పతిరక్తి భక్తి శక్తి స్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్యచైతన్యవతి, నిర్నిద్రమతి, వినిర్మలగతికలిత, ప్రియశరీరాంతర్విలీనగాన జ్ఞాన ధ్యానస్వరూపిణీతన్మయి, శివపూజితఫాలచంద్రకళా మూర్తి అకళంక సౌందర్యరాశి-సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త - జయశ్రీ సత్యశ్రీ పుత్రికారత్నద్వయ అజయ్య జయ విజయ పతాకయుక్త - శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహర రాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య ఛత్రాఽఽవరణయుక్త-పాణినీయాఽష్టాధ్యాయీపూర్వత్రాసిద్ధసూత్రసహితశబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త మహా వైయాకరణ వేదవేదాంతకోవిద దశభాషా కవితా విశారద పుంభావశారదా మూర్తి శ్రీ గుండేరావుహర్కారే - సాష్టాంగనమస్కార పూర్వకప్రస్తూయమాన-"శ్రీ వాఙ్మయ మహాధ్యక్ష-ప్రాచీనవైయాకరణానమయ సంప్రదాయ రక్ష - స్ఫోరితానేక జనాభినవోన్మేష కాలికావ్య నిర్మాణశక్తిమన్నికౌచనాక్ష-మాధుర్యస్యందివీర్యవత్తరపద గుంఫాధురీణ - మహీభుగగోచరగాంభీర్యప్రకటరావటిమాపారీణ-కల్పాంతారీణాఽనల్పకల్పనా భూషణ"-లీలామానుష విగ్రహ - ఆంధ్ర విశ్వకళాపరిషత్ సంభావితచతుర్వింశ దధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్ "కళా-ప్రపూర్ణ"సార్థక బిరుద విరాజిత - బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, వద్లమూడి గోపాలకృష్ణయ్య
సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్తసహిత, సుసమగ్ర
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
దశమమండలమున నష్టమాష్టకమునందలి
అర్థాంతరయుక్త తృతీయాధ్యాయము
సమాప్తము

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"



# సమగ్ర

# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—చతుర్థోఽధ్యాయః

### సూక్తమ్—86

ఋషిః—ఇన్ద్రః; 7,13,23-ఐన్ద్రో వృషాకపిః; 2-6,9-10,15-18-ఇన్ద్రాణీ

దేవతా—ఇన్ద్రః, ఇన్ద్రాణీ, వృషాకపిః

ఛందః—పంక్తిః

(1) వి హి సోతోరసృక్షత నేన్ద్రం దేవమమంసత ।

యత్రామదద్వృషాకపిరర్యః పుష్టేషు మత్సఖా విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 924

(2) పరా హీన్ద్ర ధావసి వృషాకపేరతి వ్యథిః ।

నో[2] అహ ప్ర విన్దస్యన్యత్ర సోమపీతయే విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 925

(3) కిమయం త్వాం వృషాకపిశ్చకార హరితో మృగః ।

యస్మా[3] ఇరస్యసీదు న్వర్యో వా పుష్టిమద్వసు విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 926

---

1. విశ్వస్మాదిన్ద్రఽఉత్తరః. 2. నోఽఅహ, 3. యస్మాఽఇరస్య. (వ్రా.వ్ర.)

(4) యమిమం త్వం వృషాకపిం ప్రియమిన్ద్రాభిరక్షసి ।

శ్వా న్వస్య జమ్భిషదపి కర్ణే వరాహయుర్విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 927

(5) ప్రియా తష్టాని మే కపిర్వ్యక్తా వ్యదూదుషత్ ।

శిరో న్వస్య రావిషం న సుగం దుష్కృతే భువం విశ్వస్మాదిన్ద్ర [1]ఉత్తరః ॥ 928

(6) న మత్ స్త్రీ సుభసత్తరా న సుయాశుతరా భువత్ ।

న మత్ ప్రతిచ్యవీయసీ న సక్థ్యుద్యమీయసీ విశ్వస్మాదిన్ద్ర [1]ఉత్తరః ॥ 929

(7) ఉవే[2] అమ్బ సులాభికే యథేవాఙ్గ భవిష్యతి ।

భసన్మే [3]అమ్బ సక్థి మే శిరో మే వీవ హృష్యతి విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 930

(8) కిం సుబాహో స్వఙ్గురే పృథుష్టో పృథుజాఘనే ।

కిం శూరపత్ని నస్త్వమభ్యమీషి వృషాకపిం విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 931

(9) అవీరామివ మామయం శరారురభి మన్యతే ।

ఉతాహమస్మి వీరిణీన్ద్రపత్నీ మరుత్సఖా విశ్వస్మాదిన్ద్ర ఉత్తరః ॥ 932

---

1. దిన్ద్ర౽ఉత్తరః, 2. ఉవే౽అమ్బ, 3. భసన్మే౽అమ్బ. (హ్రా.ప్ర.)

(10) సంహోత్రం స్మ పురా నారీ సమనం వావ గచ్ఛతి ।
వేధా[1] ఋతస్య వీరిణీన్ద్రపత్నీ మహీయతే విశ్వస్మాదిన్ద్ర[2] ఉత్తరః ॥ 933

(11) ఇన్ద్రాణీమాసు నారిషు సుభగామహమశ్రవమ్ ।
నహ్యస్యా[3] అపరం చన జరసా మరతే పతిర్విశ్వస్మాదిన్ద్ర[2] ఉత్తరః ॥ 934

(12) నాహమిన్ద్రాణి రారణ సఖ్యుర్వృషాకపేరృతే ।
యస్యేదమప్యం హవిః ప్రియం దేవేషు గచ్ఛతి విశ్వస్మాదిన్ద్ర[2] ఉత్తరః ॥ 935

(13) వృషాకపాయి రేవతి సుపుత్ర[4] ఆదు సుస్నుషే ।
ఘసత్ త[5] ఇన్ద్ర ఉక్షణః ప్రియం కాచిత్కరం హవిర్విశ్వస్మాదిన్ద్ర[2] ఉత్తరః ॥ 936

(14) ఉక్ష్ణో హి మే పంచదశ సాకం పచన్తి వింశతిమ్ ।
ఉతాహమద్మి పీవ[6] ఇదుభా కుక్షీ పృణన్తి మే విశ్వస్మాదిన్ద్ర[2] ఉత్తరః ॥ 937

(15) వృషభో న తిగ్మశృంగో ఽన్తర్యూథేషు రోరువత్ ।
మన్థస్త[7] ఇన్ద్ర శం హృదే యం తే సునోతి భావయుర్విశ్వస్మాదిన్ద్ర[2] ఉత్తరః ॥ 938

---

1. వేధాఽఋతస్య, 2. ఇన్ద్రఽఉత్తరః, 3. నహ్యస్యాఽఅపరం, 4. పుత్రఽఆదు, 5. ఘసత్తఽఇన్ద్రఽఉక్షణః, 6. పీవఽఇదు, 7. మన్థస్తఽఇన్ద్ర. (వా.ప్ర.)

(16) న సేశే యస్య రమ్బతే ఽన్తరా సక్థ్యా౩ కపృత్ ।
సేదీశే యస్య రోమశం నిషేదుషో విజృమ్భతే విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 939

(17) న సేశే యస్య రోమశం నిషేదుషో విజృమ్భతే ।
సేదీశే యస్య రమ్బతే ఽన్తరా సక్థ్యా౩ కపృద్ విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 940

(18) అయమిన్ద్ర వృషాకపిః పరస్వన్తం హతం విదత్ ।
అసిం సూనాం నవం చరుమాదేధస్యాన[2] ఆచితం విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 941

(19) అయమేమి విచాకశద్ విచిన్వన్ దాసమార్యమ్ ।
పిబామి పాకసుత్వనో ఽభి ధీరమచాకశం విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 942

(20) ధన్వ చ యత్ కృన్తత్రం చ కతి స్విత్ తా వి యోజనా ।
నేదీయసో వృషాకపే ఽస్తమేహి గృహాగ్ం[3] ఉప విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 943

(21) పునరేహి వృషాకపే సువితా కల్పయావహై ।
య[4] ఏష స్వప్నంశనో ఽస్తమేషి పథా పునర్విశ్వస్మాదిన్ద్ర ఉత్తరః ॥ 944

---

1. దిన్ద్రఽఉత్తరః, 2. స్యానఽఆచితం, 3. గృహాగ్ంఽఉప, 4. యఽఏష. (వా.ప.)

(22) యదుదంచో వృషాకపే గృహమిన్ద్రాజగన్తన ।

క్వ౧ స్య పుల్వఘో మృగః కమగంజనయోపనో విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 945

(23) పర్శుర్హ నామ మానవీ సాకం ససూవ వింశతిమ్ ।

భద్రం భల త్యస్యా[2] అభూద్ యస్యా ఉదరమామయద్ విశ్వస్మాదిన్ద్ర[1] ఉత్తరః ॥ 946



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—చతుర్థాధ్యాయము

### సూక్తము—86

ఋషి—ఇంద్రుఁడు, 7,13,23-ఇంద్రుఁడైన వృషాకపి; 2-6, 9-10, 15-18-ఇంద్రాణి†
దేవత—ఇంద్రుఁడు, ఇంద్రాణి, వృషాకపి†

(1) *గీ॥ కడు మహేష్టిని జేయంగ విడువఁబడిన
యష్ట లెల్లరు నావల్ల నధిక ప్రీతి
విడువఁబడినను నన్నింద్రు విడచిపెట్టి
పుత్రుఁడైన వృషాకపిఁ బొగడుచుండ్రు ॥ 2409

---

1. దిన్ద్ర ఉత్తరః, 2. త్యస్యా అభూద్యస్యా ఉదర. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 211వ పుటలో నీ సూక్తమునకు దేవత "ఇంద్రుఁడు, ఇంద్రాణి, వృషాకపి"గా వ్రాసి ఋషి నామములు శ్రీనేమానివారు వ్రాయలేదు. కాని 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ఇంద్రుఁడు, ఇంద్రాణి, వృషాకపు"లు ఋషులుగాను దేవతలుగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ సోమ యాగములందు నా సుతుఁడు నాకు
సత్సఖుం డౌచు సోమ రసాతి హృష్టుఁ
డయ్యె నైనను నే నీ మహా ప్రపంచ
మందు నుత్కృష్టపరుఁడను [1]నౌచు నుంటి ॥ 2410

(2)*గీ॥ నీవు చలితుండవై యింద్ర! నీ కుమారుఁ
గడు నెదుర్కొనుచున్నావు! కాంత సోమ
పానమును జేయకున్నావు! పరమ ప్రీతి
నుత్తరుం డౌదు! సర్వ జగత్తుకంటె ॥ 2411

(3)*గీ॥ హరిత వర్ణ వృషాకపి యనెడు వాఁడు
నీకుఁ బ్రియ మేమి చేసెను నీవు వాని
[2]కఖిల ధనమును నొసఁగంగ నమరుచుంటి
వోయి హరి! [3]జగముకంటె మహోత్తరుఁడవు! ॥ 2412

(4)*గీ॥ ఇంద్రదేవ! నీకు నిష్ట వృషాకపిఁ
దగిన పందినట్లు[4] తలఁచి కుక్క
తినునుగాక! వేగ దీక్షతో విశ్వంబు
కంటె[5] నుత్తరుండు కాఁడె వజ్రి ॥ 2413

- ఇంద్రాణి వాక్యము -

(5)*గీ॥ నాకుఁ గల్పింపఁబడుచు నస్తోక లీల
నాజ్య సిక్తము లైన యీ హవ్య తతుల
నొక కపీశుఁడు దూషించియుండెఁ గాన
వాని శిరసును ఖండింపఁ బూను దేను ॥ 2414

*గీ॥ దుష్కృతంబు లొనర్చుచు దుష్టుఁడైన
యా వృషాకపి యను వాని కఖిల సుఖము
నొసఁగుదానను గాకుండ నుంచు నింద్రుఁ
డుత్తరుఁడు కాఁడె సర్వ జగత్తుకంటె ॥ 2415

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. నౌదుగాదె, (తొ.పా.), 2. మూర్తి వలె ధనము నొసగంగఁ బూనుచుంటి, (తొ.పా.), 3. ఇక్కడ నింద్రగణమునకు మారుగాఁ బంచలఘుగణము ప్రయుక్తమైనది. 4. దగు వరాహ మట్లు తలచి కుక్క, (తొ.పా.), 5. కన్ను నుత్తరుండు విన్నకాఁదె. (తొ.పా.)

(6)*సీ॥ నాకంటె నన్యయౌ నారి లోకమునందు సుభగగా నుండుట చూచు టరిది
నాకంటె నన్యయౌ నారి జగంబున నతిశయ సుఖవతి యౌట యరిది
నాకంటె నన్యయౌ నారి పురుషునం( బతిని నత్యంతంబు( బడయు టరిది
నాకంటె నన్యయౌ నారి సక్థిని భోగమందు విప్పుట లోకమందు నరిది
గీ॥ అఖిలమందున నాకంటె నన్యకాంత, మైథునానుగుణంబుగా మరలు టరిది
నాకు( బతి యైన యింద్రు( డస్తోక మగుచు, [1]నున్న విశ్వంబునందున నుత్తరుండు ॥ 2416

(7)*గీ॥ అంబ! శోభన లాభ! నీ వనిన యట్టు
లగునుగాక! భవచ్ఛగ మతిశయముగ(
పండ్రి కుపయోగపడు(గాక( దరచు ననుచు
నా వృషాకపి బదు లాడె నంబతోడ ॥ 2417

*గీ॥ ప్రియ రుతంబున( గోకిల ప్రీతి( గూర్చు
విధము నీదు శిరస్సు నా పితను దృప్తి(
జేయు(గాక! మహేంద్రు(డు శ్రీ లొసంగ
నుత్తరు(డు కా(డె సర్వ జగత్తుకంటె ॥ 2418

(8)*సీ॥ శోభన బాహువా! సురుచిర! యింద్రాణి! కడు వృషాకపి( గోప(బడెద వేల?
సుందరాంగుళివతి! శూరపత్ని! నీవు కడు వృషాకపి( గోప(బడెద వేల?
పృథుకేశసంఘాత! ప్రేయసి! యింద్రాణి! కడు వృషాకపి( గోప(బడెద వేల?
విపుల నితంబాఢ్య! యపరిమిత కుద్ధ! కడు వృషాకపి( గోప(బడెద వేల?
గీ॥ కలికి యింద్రాణి! యా వృషాకపిని నేల,నీవు దూషించుచున్నావు! నెనరు లేక
యెవని జనకుండనైన నే నీ జగంబు, కంటె నత్యుత్తరుండనై గ్రాలుచుందు ॥ 2419

(9)*గీ॥ ఘాతుక మృగ స్వరూపు(డై గ్రాలునట్టి
యీ వృషాకపి యను నాత( డింద్ర భార్య
నైన నన్ను నవీరగా నాత్మ( దల(చి
యిట్లు నిందించుచున్నవా( డింద్ర! వినుము! ॥ 2420

*గీ॥ ఇంద్ర భార్య నౌట నింద్రాణి నగుదును
బరమ వీరపుత్రవతిని నగుదు
వెలు(గు నాదు భర్త విశ్వముకంటెను
నుత్తరుండు కా(డె! యూహ( జేయ ॥ 2421

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. నున్న విశ్వంబుకంటెను నుండు టరిది. (తా.పా.)

(10)*గీ॥ నారి యగుచుఁ దాను వీర పుత్రులఁ గల్గి
సత్య ధాత్రి యగుచు సవన పతికి
భార్య యైన యామె పరమ సంగ్రామంబొ
యజ్ఞమొ యగు[1] నొక్కొ: [2]యఖిలమందు ॥ 2422

*గీ॥ మహతి: యగుచుంటె నింద్రాణి మఱియు స్తోత్ర
వరులఁ బొగడఁబడుచుంటె నరయ నాకుఁ
బతిగ నున్నట్టి యింద్రుఁడు పరము జగము
కంటె నుత్తరుఁడయి యుండెఁగాదె[3] తలఁప ॥ 2423

(11)*గీ॥ లలిత సౌభాగ్యమును జేసి తలఁచి చూడ
మిగుల నింద్రాణి యను నామె మగువలందు
శ్రేష్ఠతర యని సంతుష్టిఁ జెప్ప నింద్రుఁ
డుత్తరుం డగు సర్వ జగత్తుకంటె ॥ 2424

(12)*క॥ నాకు వృషాకపియే ప్రియుఁ
డో కోమలి: సురల మధ్య నున్న హవిస్సున్
వీఁక గ్రహించెడు: నీ వ
స్తోకం బౌ జగముకంటె స్తుత్యుఁడ నగుచున్ ॥ 2425

(13)*గీ॥ ఓ వృషాకపాయి: ఓ ధనవతి: పుత్ర
వతి: మహేంద్రుఁ డిప్పు డతిశయముగ
నీకు సేచనంబు నెన దుంచి చేయంగఁ
బసవులను[4] గ్రసించి పరఁగుఁగాక: ॥ 2426

*గీ॥ ఓసి: యింద్రాణి: సుఖము నొసఁగునట్టి
హవ్యమును [5]బ్రియముగాఁ జేయుమా: బిరాన
నఖిల విశ్వముకంటెను నిఖిల విధుల
నుత్తరుండను గానదె: హాయలు చెలఁగ ॥ 2427

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. పరమ సంగ్రామంబొ, యజ్ఞమగును నొక్కొయఖిలమందు, (వ్రా.ప్ర.పా.), 2. యతిశయముగ, (తా.పా.)
3. యుండుగాదె కడిది, (తా.పా.), 4. బసులను గ్రసించి, (వ్రా.ప్ర.పా.), 5. ఇక్కడ నిందగ్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్త మైనది.

(ఇంద్రుఁడు పలుకుచున్నాఁడు)

(14)*గద్యము॥

పంచదశ, వింశతి సంఖ్యాకము లగు వృషభములతోడ, భార్య యగు నింద్రాణిచేఁ బ్రేరితు లగు యష్టలు పచనముఁ జేయుచున్నారు. నేను వానిని భక్షించి స్థూలుఁడ నగుచున్నాను. నా రెండు కుక్షులు సోమముచే యష్టలు పూరించుచున్నారు. అట్టి యింద్రుఁడను విశ్వముకంటె నుత్తరుఁడను ॥ 2428

(ఇంద్రాణి పలుకుచున్నది)

(15)*గద్యము॥

ఎట్లు వృషభము గో సంఘముల యందు శబ్దమును జేయుచు గోవులను రమింపఁజేయునో! యట్లే ఓ యింద్రుఁడా! నీవు నన్ను రమింపఁజేయుము! ఓ యింద్రుఁడ! నీ హృదయము కొఱకు మంథనవేళయందు శంకరుఁడవు కమ్ము! మరియు నీకు నే సోమమును, భావమును గోరుచున్న యింద్రాణి తీయుచున్నదో! ఆ సోమము శంకర మగుఁగాక! నా పతి యగు నింద్రుఁడు విశ్వముకంటె నుత్తరుఁడు ॥ 2429

(16)*గీ॥ సక్థితోఁ గూడకుండెడు సమయమందు
నెవని శేఫము వ్రేలాడు నెంత యేని
నట్టి జనుఁ డింద్ర దేవుఁడా! [1]యతిశయింప
మిథున కర్మకు శక్తుఁ డై మెలఁగుచుండు ॥ 2430

*గీ॥ ఎవనికిం బతిగ నున్నట్టి యింద్రుఁ డెల్ల
జగమునకు నుత్తరుండో! యే జనునకుఁ గడు
రోమశోపస్థ మమరునో! యా మహాత్ముఁ
డతిశయంబుగ మైథున మాచరించు ॥ 2431

(17)*గద్యము॥

శయానుఁ డగు నే జనునకు రోమశ మగు నుపస్థము వివృత మగునో! యా జనుఁడే మైథునముఁ జేయ సమర్థుఁడు కాఁడు. ఏ జనునకుఁ బ్రజననము సక్థి వినా వ్రేలాడునో! యెవని పతి యగు నింద్రుఁడు విశ్వముకంటె నుత్తరుఁడో! యా జనుఁడు మైథునముఁ జేయ సమర్థుఁడు ॥ 2432

(18)*గద్యము॥

ఓ యింద్రుఁడా! యీ వృషాకపి రస విషయమందు హింసితుఁ డైన వానిని దెలిసికొనునుగాక! అటులనే శస్త్రమును ఉద్గానము, పాత్రార్థము నవ మగు భాండమును, బిమ్మటఁ గాష్ఠ పూర్ణ మగు శకటమును దెలిసికొనునుగాక! నా పతి విశ్వముకంటె నుత్తరుఁడు ॥ 2433

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. యతిశయముగ. (తా.పా.)

- ఇంద్రుడు -

(19)*గద్యము॥
యజమానులను జూచుచు సుపక్షయిత యగు నసురుని వేరు చేయుచు నింద్రుడ నగు నేను యజ్ఞమునుగూర్చి వెళ్లుచున్నాను. అట్లు వెళ్లి సోమాభిషోతయొక్క పరిపక్వమానసమున యజమాన సంబంధ మగు సోమమును ద్రావుచున్నాను. విశ్వముకంటె నుత్తరుండ నగు నేను ధీమంతుం డగు యజమానుని జూచుచున్నాను ॥ 2434

(20)*గద్యము॥
ఏది నిరుదకాన్న దేశమో! శత్రు నిలయ మగు నట్టి యరణ్యమునకు మా గృహంబునకు నెన్ని యోజనము లున్నది? సమీపస్థ మగు నా శత్రు నిలయమునుండి ఓ వృషాకపీ! నీవు మా గృహంబునకు రమ్ము! ఇంద్రుండ నగు నేను విశ్వముకంటె నుత్తరుండ నగుటచే యజ్ఞ గృహమును బ్రవేశింపుము! ॥ 2435

(21)*గీ॥ అస్మదీయ గృహంబున కరుగం దెంచి
యున్నచో నీకుం బ్రీతిని నోలిం జేయు
కర్మముల నెల్ల నింద్రాణి! కాంతతోడం
గలిసి కల్పనం జేయుదు లలిత గతిని ॥ 2436

*గీ॥ క్రీలు విశ్వముకన్నను ఘనుండ వౌటం
దివిరి స్వప్నములం గొట్టు దివ్య మూర్తి
వౌట నీవు వృషాకపీ! యస్మదీయ
సదనమును జేరుచున్నావు! సంతసమున ॥ 2437

(వెడలి వచ్చిన వృషాకపిని నింద్రుడు ప్రశ్నించుచున్నాండు)

(22)*గద్యము॥
పరమైశ్వర్యము గల వృషాకపీ! భౌమ రసాత్త యగు నీ సంబంధ మృగ మెచ్చట నున్నది? జనులను సంతసింపంజేయు మృగ మే దేశమున కేగెను? ఆ యింద్రుడు విశ్వముకంటె నుత్తరుండు ॥ 2438

(ఇంద్రుడు వృషాకపి నాశీర్వదించుచున్నాండు)

(23)*గద్యము॥
విసృజ్యమానశరుండా! ఎవని యుదరము వింశతి పుత్రులతో నిండియున్నదో! మృగి యగు ఆ మను దుహిత వింశతి సంఖ్యాక పుత్రులను గనెను. ఆమెకుం గళ్యాణ మగుంగాక! నాకుం బ్రియ యగు నింద్రుడు విశ్వముకంటె నుత్తరుండు ॥ 2439

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—86

ఋషి—ఇంద్రుడు,7,13,23-ఇంద్రుడైన వృషాకపి, 2-6, 9-10, 15-18-ఇంద్రాణి
దేవత—ఇంద్రుడు, ఇంద్రాణి, వృషాకపి

### అర్థాంతరము—1

(1)†శా॥ విశ్వ మ్మొక్క విశిష్ట సృష్టి యయి దైవీయమ్ముగా వెల్గుచున్
అశ్వాఽఽ పూర్ణ సుదీధితుల్ వృషభ రాశ్యారూఢ సూర్యా ఽచ్చమై
శశ్వల్లోక సముచ్చయాలు సురలున్ సత్ప్రాణి కోటుల్ మహా
నిశ్వాసమ్మయి దేవ దేవునికి శాంతిన్ దాంతి సద్భాగ్యముల్
సుశ్వేతాఽన్విత సత్పదార్థమయమై శోభాయమానమ్ముగా
విశ్వే దేవత లెల్ల భూరి తతిమై వీర్యేంద్రిమై యొప్పెడిన్ ॥ 2440

†(2) శక్తివంత మ్మోచు( జండ ప్రచండ మౌ
భాను తేజము మహేంద్ర ప్రభల మీరుచు వెల్గ
విశ్వ శక్తుల నిలుపు విమల తత్త్వము నిండు
చంద్రాఽమృతము పిల్చి శర్వ శక్తులు పెంచు
అఖర్వ తేజము మీఱ నచ్యుత జ్వాలలే
సర్వమ్ము వెలుగులన్ బర్వునట్లుగ( జేయు ॥ 2441

†(3) పగతోడ మృగశిరను బంధించి బాధించు
హరిత వర్ణుం డైన ఆ దుష్ట రాక్షసుని
వృషభ రాశిని దనరు విమలుడౌ సూర్యుండు
విధ్వస్త మొనరించి విశ్వమ్ము నైశ్వర్య
వసు సంపదల నిల్పు నని మీఱగా జగతి
శక్తిమంతము చేయు రక్తిమంతము చేయు ॥ 2442

†(4) ధర్మ బద్ధ మ్మైన తరణి నెల్లపుడున్
దేవ శునితో సహా దివ్య వరాహమ్ము
దేదీప్యమానుడౌ దివ్యుడౌ కృష్ణాంశ
మేరు శక్తులు మీఱ మేల్మిగా( గాపాడు
నింద్ర లోకమ్మునకు నెనగుచున్ ఉపరాన
ద్వైతమ్ముగా విశ్వ ధర్మమ్ము నెగడొంద ॥ 2443

†(5) విష రూపమై సర్వ విశ్వమ్మునే మ్రింగు
దుష్ట సంకల్పాన దుర్మార్గ తత్త్వాన
జగతినే వ్యాపించు చండ శాసన మహా
పాపి రాక్షసు శిరము వ్రక్కలుగ ముక్కలుగ
దున్మాడి క్షేమాల దొంతరల సమకూర్చు
దివ్య తేజుండౌచు దేదీప్యమాన రవి ॥ 2444

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అత్యంత వేగాన నాత్మ ప్రదక్షిణలు
అధిపతి ప్రదక్షిణ లలర ఖగోళాలు
ప్రకృతి మాత్మ సుధర్మ పోషణ మ్మొప్పంగ
నిత్యమ్ము చరియించు సత్య పథవర్తులై
ఆత్మ కైవారాలు హద్దులై శక్తులై
ఆదాన ప్రదానాలు అనునిత్యమున్ జరుగ
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరలు
సత్సంగ తతి సదా శర్మ గతులన్ బరఁగ ॥ 2445

†(7) అంగాంగ గతి నలరి అతిలోక శక్తులన్
అమృత ప్రద మౌచు నఖిల మౌ స్థితి మతిని
జగదంబగా వెలిఁగి జాజ్వల్య దీప్తులన్
నాకుఁ దేజము నొసఁగు నాకు మేధను నిచ్చు
నా శిరమ్మున సర్వ జ్ఞానమ్ము చరియింప
విశ్వ వ్యాప్త మ్మైన వీర్య శక్తులు వరలు ॥ 2446

†(8) ఉందు బాహువు లేల? ఉత్తమాంగ మ్మేల?
సువిశాల వక్షమ్ము జోదు జఘన మ్మేల?
శూరతా పత్నితో జోడది యేమిటకు?
జల ప్రోక్షణమ్ములున్ మల క్షాళన మ్మేల?
పుణ్య భూమిని గాంతి పూర్ణమ్ముగా వెలుఁగ
విశ్వ వ్యాప్త మ్మైన వీర్య శక్తులు మీఱ ॥ 2447

†(9) జల శతఘ్ని తతి సమీర చల రూపిగ ధానుఁడు
పరిగణించెడు కాంతిఁ బ్రకృతి వీర్యము మీఱు
మరుత్సహిత యౌ స్వాహా మహిత మౌ తేజము
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరలు
బ్రకృతి సత్సంతతి ప్రాణం వీరత్వమును
వహ్ని రత బ్రహ్మముఁ బ్రతిభ మై ధృతి గొంచు ॥ 2448

†(10) మనశ్శక్తిగ మహా మాన్యమై విశ్వాన
జల తరంగాలుగా జ్వలితమై రంగారు
వాణీ విలాసాల వరలఁగా శబ్దాల
ఋత శక్తులే ప్రభా-ఽమృత గతులతో వెలిఁగ
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు మీఱ
బ్రహ్మ తత్త్వము సదా రాజించు మహిత గతి ॥ 2449

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) నీర తరంగిణుల నిర్నిద్ర మహత్తమై
ఆదిత్య తేజమ్ము అహస్సుగా నిలిచి
అగ్ని రూప మ్మోను అల్ల సుభగ శక్తి
అపర మను నది లేక అత్యంత ప్రాచీన
తర మైన కాలముగఁ దరణి కతీతమై
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2450

†(12) సత్య స్వరూపానఁ జప లంటు ధర్మానఁ
బుణ్య పుంజము కాఁగ వృష సూర్యుఁడే వెలుఁగు
అఖిల యజ్ఞాలలో హవిషాఽఽళి దేవాఽఽళి
కందించి ప్రియమార నమృత గతి మీఱు
ననలాఽనిల శక్తి అతిలోకముగ నిల్పి
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2451

†(13) గాన రేవతి స్వరము క్రాలు శక్తుల మీఱు
నాత్మ సుపుత్రి మహితాఽరుణుఁడు మండుచున్
ఆదిత్య దేవులకు నతి ప్రియమ్మును గూర్చి
అత్యల్ప మౌ హవిసు నందించుచున్
ననలాల ననిలాల నతి సుఖమ్ములు కూర్చి
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2452

†(14) ఆ శ్రీ మహావిష్ణు వంతు వంతూ లేని
ఆ నేత్ర లతులతోఁ* అఖిల మౌ విశ్వమ్ముఁ
బంచదశ రూపాలఁ• బర్యవేక్షణఁ జేయు
నజయ్య మౌ వెల్గు నఘోరంపుఁ బవి శక్తి
నిహ పరమ్ములు కుక్షి నెసని నిండఁగ నింపు
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2453

†(15) అంతర్గత మ్మైన అతివేల శక్తులన్
ధ్వనులు ప్రతిధ్వనుల లొప్పఁ త్రైగుణ్య శృంగాలఁ
దనరారు వృషభమ్ము తరణి తేజాలతో
హృదయ రోహణ శక్తి ననుమతింపఁగఁ జేయు
శుభ భావములు మహా శోభ నుత్పన్న మౌ
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2454

---

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వల్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*విస్+శతిమ్=విం శతిమ్, శతిమ్=అనేకమైన, ఏమ్=నేత్రాలతో.
•పంచదశ రూపాలు—1. సనక, 2. సనంద, 3. సనత్కుమార, 4. సనత్సుజాత, 5. సనాతన, 6. నర, 7. నారాయణ, 8. కపిల, 9. ఋషభ, 10. విష్ణు, 11. హయగ్రీవ, 12. వ్యాస, 13. ధన్వంతరి, 14. అనంత, 15. శ్రీకృష్ణ. ఇవి శ్రీమహావిష్ణు రూప విశేషాలేగాని పురాణోక్తము లైన అవతారములు కావు.

†(16) అంతర్గత మ్మైన అతివేల శక్తులన్
అశ్వినీ దేవతలు ఆశిగ విజృంభించ
మేష రాశి విశద మిత్ర కాంతుల మీఱు
జీవ చైతన్యాలు చెలఁగ మహాద్భుత గతి
నత్యంత విస్తృతి నరుణోచ్చ వర్ధ లలరు
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2455

†(17) అశ్వినీ దేవతలు అసమర్థతన్ నిలువ
నజ రాశి వెలవెల నరుణ కాంతులు తరుగ
అంతర్గత మ్మైన అతివేఁ శక్తులే
జీవ చైతన్య నిర్జీవ రీతుల నిల్పు
నీచోచ్చ రాహిత్య నిరత రవి కాంతి తతి
విశ్వాన వ్యాపించు వీర శక్తులు వరల ॥ 2456

†(18) నిత్య నవమై వెల్గు నిండు ఖర కర కాంతి
కరవాలమై మెఱయఁ దరవాలమై వెలయ
వృషభ రవి శక్తులే విమద శత్రులఁ దుర్రించ
నాత్మ తేజ శ్శక్తు లాత్మజులుగాఁ బసర
విపులమై విమలమై విశదమై విస్తరిల
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2457

†(19) కర్మ తత్త్వాలమై మర్మ తత్త్వాలమై
దేవ దేవుని దివ్య తేజాల లీల లవి
జగమునన్ దనరార నగణితముగా వెలయు
సర్వ చరాఽచర జన్య రూపాలలో
ధీరాతిధీర మౌ దృఢ వీర శక్తులన్
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2458

†(20) అపురూప మౌ నగ్ను లతి విస్తృతములుగా
నతులిత మౌ కాంతి లతలు లక్షలు కోట్ల
రూపాల వ్యాపించి రోదసిన్ బ్రోదిగా
సర్వగోళాఽఽవళుల జ్వలిత కాంతులఁ జేరి
జీవ చైతన్యాలు చెలఁగఁ దనరఁగఁ జేయు
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2459

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(21) వృషరాశి గత రవిః వృద్ధి కాంతులు మీఱ
గల్పాంతముల దాఁక ఘన దీప్తు లొప్పారఁ
బునరాగమనాలు పొనర యానాలతో
సత్య మార్గాలలో నిత్య స్వప్నాలుగాఁ
దెల్లవారఁగఁ జేయు మెల్ల సృష్టిని దిరిగి
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2460

†(22) అరుణః వృషాకపిః అలరు నీ సచ్ఛక్తి
మూల త్రికోణమై యేలు సింహమునుండి
అతిలోక తేజాల నావరించును జగతి
మృగమె వాహన మౌచు మృగమె కేతన మౌచు
మిత్ర కాంతులు మీఱ శత్రువుల వధియించు
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2461

†(23) మను శక్తు లొప్పారు మహిమాన్విత మ్మైన
ఆ అ ఘోరాఽస్త్రమ్ము అగణితాక్షుల దృష్టి
వృషభ శక్తులు మీఱ విశ్వ యానాలతో
రోదోఽంతరాశాసఁ గ్రూర మౌ యుద్ధాల
భద్రాతిశయమునన్ బరఁగ విజయ మ్మొందు
విశ్వాన వ్యాపించు వీర్య శక్తులు వరల ॥ 2462

## సూక్తము—86

ఋషి—ఇంద్రుఁడు,7,13,23-ఐంద్రుఁడైన వృషాకపి, 2-6,9-10,15-18-ఇంద్రాణి
దేవత—ఇంద్రుఁడు, ఇంద్రాణి,వృషాకపి

### అర్థాంతరము—2

†(1) ఇంద్రునితోసహా యితరేతరాఽమరుల్
సృష్టి యజ్ఞములోన వ్యష్టి సమిష్టులుగ
ధర్మ మ్మె తేజమై తనరఁగా వీర్య మౌ
భగవంతుఁడే జగద్భాగ్యాల సఖుఁ డౌను
బరిపుష్టతన్ నిలుచుఁ బరితృప్తు లానంద
మలరు పెశ్వేపఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2463

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) ధర్మ తేజము మీఱు ధర్మేశుఁ డౌ హరి
అతిలోక శక్తులన్ అఖిలమ్మునను నింపుఁ
పాప రహిత మ్మైన పవిత్ర పుణ్యాఽఽపదుల
నఖిలాఽమరాఽఽశులకు నమృతమ్ము కృప నొసఁగు
నాత్మైక్య మలరాడు నపురూప మౌ గతుల
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2464

†(3) సృష్టినే జరియించు సృష్టిలోఁ జరియించుఁ
జలన శక్తులు సదా జగతి ప్రాణము గాఁగ
ధర్మ తేజము కర్మ మర్మాలలో నెగడు
దేవ దేవుని లీల దివ్య తత్త్వము మీఱఁ
దుష్టి శక్తులు మహాఽఽకృష్ట దిక్తటాలుగా
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2465

†(4) జగద్ రక్షకుఁ డఖిల చరాఽచరములఁ బ్రేమ
సర్వ విధాలుగా సంరక్షణము చేయు
ధర్మ తేజము మీఱ ధ్వాంతప్వ గతి దహియించి
అంతటన్ వ్యాపించి అతిలోక శక్తులన్
సాధికారమ్ముగా దీధితుల విస్తరిల
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2466

†(5) పుణ్య తేజము పాప పుంజాలఁ దున్మాడి
ధర్మ మస్తక మౌను కర్మ గతులను బెంచు
దుష్కృతుల ప్రకృతులను నిష్కృతుల విస్మృతులను
అసుఖ తత్త్వమ్ములను సఖిల పురుషార్థాల
నావిష్కృతులఁ జేసి అంతరింపఁగఁ జేయ
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2467

†(6) అతివేల శక్తులన్ అతిశీఘ్ర గమనాలఁ
బ్రకృతి ఒక అతివగాఁ బతి పురుష వరితయై
కాంతి పుంజాలతోఁ గ్రాలుచున్ జగమునన్
నిత్య చైతన్య ధర నిర్నిద్రతా గరిమ
వరలంగ ధర్మ గతి నిరత ముత్థానమై
అలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2468

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ"

†(7) అంగమై అంగియై అంబగా నీ ప్రకృతి
అలరారు సృష్టిలో నాత్మ తత్త్వము మీఱ
మేల్తర మగ్ని శక్తి మిడిమేలముల నణఁచి
జగద్విభునకు ధర్మ మగణిత శిర మౌచు
ఆనంద రూపాల నప్రరూపమై నిలువ
నలరు విశ్వేశుఁడౌ నా మహావిష్ణు కృప ॥ 2469

†(8) ధర్మ రూప మగ్నియుఁ దనరారు తేజమ్మె
ప్రకృతికి బాహువులు ప్రకృతికి అంగాలు
పృథు జఘన మగ్నిను బృహు కేశ జాల మౌ
శారదా పత్నిగా మెరలన్ మీఱఁగా
నాకర్షణ శక్తి నాధిపత్యము వెలుఁగ
నలరు విశ్వేశుఁడౌ నా మహావిష్ణు కృప ॥ 2470

†(9) జల శక్తులను మ్రింగు ఛల శత్రు తండాలు
ప్రకృతి నవీరముగ భావించి పరాజిత మౌ
సృష్టి సంపద లెల్లఁ జెలఁగఁ బురుషశ్రీగ
మరుదాశి సఖి కాఁగ మహిత మై వెల్గొందు
అనల జల రూపాల నఖిలమున్ రక్షలన్
ఆలరు విశ్వేశుఁడౌ నా మహావిష్ణు కృప ॥ 2471

†(10) ఆది "నారి"గఁ దనరు నా ప్రకృతి యెల్లపుడు
సంసర్గ గతి మీఱ సర్వాత్మగాఁ దిరుగు
మహిత మౌ సద్వీర్య మాన్య పూరుష శక్తి
ఋత వేదలను దుడిచి ప్రతి లేని విలసనాల్
జగతిలో విరియఁగా సర్వాన వ్యాపించ
నలరు విశ్వేశుఁడౌ నా మహావిష్ణు కృప ॥ 2472

†(11) వీర్య శక్తికి మిత్ర బృంద మౌ భగ గోశ
తతు లెల్లఁ బ్రకృతిని నతులోత్సవము లొలయఁ
బ్రాచీన తరమైన పటుతర మహనీయ
కాంతి జాలాలలోఁ గ్రాలుచున్ రోదసిని
ఆకర్షణ శక్తి సన్నియున్ దిరుగాడ
నలరు విశ్వేశుఁడౌ నా మహావిష్ణు కృప ॥ 2473

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) ప్రకృతి శక్తి విరహితమై పరిఢవిల్లు దీ విశ్వము
సత్య ధర్మ తేజమ్ములు సఖ్యమ్ముగఁ దనరారఁగ
యజ్ఞాగ్నుల హవిషాళులు నమరాళులఁ బ్రియతమమై
చేరుచుండు నెల్లప్పుడు సృష్టిని సౌజము కాఁగను
జగద్ రమణ కారకత్వ మగణిత గతిమై నిలువఁగ
నలరును విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2474

†(13) వృష రాశిని వెల్గొందెడి ఋషభ సామ సత్ప్రకృతి
ప్రాణ ప్రద శబ్ద శక్తి ప్రీతి ఫలాల నొసఁగుచుండు
భోగ్య రతుల సర్వ గతుల భాగ్య తతులు వర్ధిల్లఁగ
సత్యోత్తమ పదార్థాల నఖిల జగతి వరలుచుండు
నాకర్షణ వికర్షణల నచ్యుతముగ సంచరించు
నలరును విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2475

†(14) సర్వతో నేత్రాల సందీప్తు లెసయఁగాఁ
బంచ దశ గుణములన్* బంచభూతాళ్ళిళులు
నిర్గుణ మ్మై చెలఁగు నింగిగా వెలుఁగొందు
నది చిదాకాశమై అదె పరబ్రహ్మమై
పంచ దశ గుణములను బ్రహ్మమై విశ్వమై
అలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2476

†(15) అతితీక్ష్ణమై వెలుఁగు నగ్ని శృంగాలతో
నమరు నా వృష శబ్ద మంతర్గత సమూహ
ప్రాణ సంచలనాల నపరిమిత మథనాల
హృచ్ఛక్తులను బెంచు నెనరొందు శుభ తతులు
విశ్వాంతరాకాశ నశ్వ తేజశ్శబ్ద
మలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2477

---

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*"మృత్" పదార్థములో నున్న "శబ్ద స్పర్శ, రూప, రస, గంధము" లనెడి పంచ గుణాలను దీసివేసినచో "మృత్" పదార్థము "నిర్గుణ" మగును. "జలము"లో నున్న "శబ్ద, స్పర్శ, రూప, రసము" లనెడి నాల్గు గుణములను దీసి వేసినచో "జలము" "నిర్గుణ" మగును. "అగ్ని"లో నున్న "శబ్ద, స్పర్శ, రూపము" లనెడి మూఁడు గుణములను దీసివేసినచో "అగ్ని" "నిర్గుణ" మగును. "వాయువు"లో నున్న "శబ్ద, స్పర్శము" లనెడి రెండు గుణాలను దీసి వేసినచో "వాయువు" నిర్గుణ" మగును. "ఆకాశము"లో నున్న "శబ్ద" గుణము నొక్కదానిని దీసివేసినచో "ఆకాశము" నిర్గుణ మగును. ఆ "నిర్గుణ"మే "చిదాకాశము". అదే "నిర్గుణ పరబ్రహ్మము"గా వేదాంతులు పేర్కొందురు. ఆ "నిర్గుణ పరబ్రహ్మము" పంచ దశాత్మక గుణ సంచయముతోఁ గూడిన పంచ భూతాత్మక మగుచో "విశ్వ సృష్టి" యగును.

†(16) అంతరాంతములను నఖిల జగమ్ములో
సమర తేజశ్శక్తు లక్షయములై తనరు
అజ రాశి గత మైన అశ్వినీ దేవతలు
దివ్యౌషధమ్ములన్ దేజి యై విజృంభించు
వశమాన శక్తులన్ వరలఁ బ్రకృతి మాత
అలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥

†(17) అగణితములై తనరు నరుణ కిరణాఽఽవళులు
అజ రాశి గతములై అంతర్గతుల వరల
విశ్వ మెల్లను వీర్యవంతమై రూపొందు
నతి విశాలత్వాన నత్యంత దీర్ఘ మై
అతివేలమై జగతి నా సృజన సంశక్తు
లలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥

†(18) పరమాత్మ విరుద్ధ మౌ నపాక్రృత దుశ్శక్తుల
ధర్మ తేజ వీర్య మ్మది ధ్వంసమ్మును జేయుచుండ
అసి ధారగఁ గాంతి ధార అమరమ్మై వరలంగా
నవ జీవాఽమృత శక్తులు జవసత్వము లమరఁజేయ
సృష్టి తనరు వ్యష్టి సమిష్టి పూర్ణ మైన గతుల
నలరును విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥

†(19) దేవ దేవు సధీనమై తిరుగుచుండు జగం బెల్ల
జనన శక్తు లెల్ల విరియు జన్య శక్తు లెల్ల వరలుఁ
ప్రాకృత తత్త్వమ్మును బాధించెడి "అఘ" శక్తిని
సంహరించి శుభము లిచ్చు శర్మమ్ముల నొసఁగుచుండు
అతిపవిత్ర మ్మైన గతుల నమృత శక్తు లమరఁజేయు
నలరును విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥

†(20) సుందర మ్మౌ సృష్టి సొరిదిఁ గారడవి యౌ
మహిత మౌ విశ్వమ్మే మరు భూమిగా మారు
ఎప్పుడో ఒక్కపుడు సృష్టిఁ బ్రత్యంగుళము
నేదియో ఒక రీతి నెసఁగ శ్మశాన మౌ
ధర్మ తేజము మీఱఁ దగు పంచ భూతాల
భువనాలు లోకాలు నవ గతులఁ దనరార
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(21) అపురూపమై వెలుఁగు నాదిత్య శక్తులన్
ధర్మ తేజము సృష్టిఁ దనరారు సర్వదా
చక్రనేమి క్రమాన సంచార మొనరింప
జగ మెల్ల స్వప్నముగ శాశ్వతము కాదనుచు
మగల మరల జన్మ మహిత సృష్టులు దెల్ప
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2483

†(22) విశ్వ గృహమ్ములో వెలుఁగొందుచుండు నా
ధర్మ తేజము మహత్తర శక్తి లొప్పార
నిత్య చలనాలతో సత్య మార్గణముల
నూర్ధ్వ గతులను నిల్పు నుత్తమ స్థితి తనర
సచ్చిదానందాలు సర్వాత్మలన్ నింప
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2484

†— ఉత్తమోత్తమ గతుల నొందు లక్ష్యాలతో
నూర్ధ్వ మార్గాలలో నాగి ధర్మ తేజాల
దేవ దేవుని నిత్య దివ్యమౌ నాత్మలో
సంలీనమై పోవ సచ్చిదానందాల
సహమహమికతో నా జ్ఞాన మూర్తిగా
అన్వేషణము చేసి అమనస్కతా స్థితిని
నపురూప శక్తిగా సమరొందు ముక్తిగా
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2485

†(23) పాంచ భౌతిక మైన ప్రకృతి సర్వస్వమ్ము
విజ్ఞాన నేత్రాల విశ్వమ్ముగా వరలు
సృష్టి మాతకు విశ్వ రోదసియె ఉదరమై
ఔదరి శక్తులు మీఱఁ బర్వులే భువనాళి
లోక కళ్యాణాల లోలుపత్వము తనర
నలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2486

†— హననకారులు నాత్మ హననకారులు నైన
మానసీయమ్ము లై ప్రాణాలఁ దనరారు
పాంచ భౌతిక మైన పద చరాచర తతులు
పీడితమ్ములై జగతిఁ బెంపొందుఁ బ్రదపించి
తరిగి వినశ్వ గతిఁ దనరుఁ బునర్జన్మ
లలరు విశ్వేశుఁ డౌ నా మహావిష్ణు కృప ॥ 2487

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—87

ఋషిః—పాయుర్భారద్వాజః

దేవతా—రక్షోహాగ్నిః

ఛందః—త్రిష్టుప్; 22-25-అనుష్టుప్

(1) రక్షోహణం వాజినమా జిఘర్మి మిత్రం ప్రథిష్ఠముప యామి శర్మ ।
శిశానో[1] అగ్నిః క్రతుభిః సమిద్ధః స నో దివా స రిషః పాతు నక్తమ్ ॥ 947

(2) అయోదంష్ట్రో [2]అర్చిషా యాతుధానానుప స్పృశ జాతవేదః సమిద్ధః ।
ఆ జిహ్వయా మూరదేవాన్ రభస్వ క్రవ్యాదో వృక్త్వ్యపి ధత్స్వాసన్ ॥ 948

(3) ఉభోభయావిన్నుప ధేహి దంష్ట్రా హింస్రః శిశానో౽వరం పరం చ ।
ఉతాన్తరిక్షే పరి యాహి రాజంజమ్భైః సం ధేహ్యభి యాతుధానాన్ ॥ 949

(4) యజ్ఞైరిషూః సంనమమానో [3]అగ్నే వాచా శల్యాగ్ం అశనిభిర్దిహానః ।
తాభిర్విధ్య హృదయే యాతుధానాన్ ప్రతీచో బాహూన్ ప్రతి భఙ్ధ్యేషామ్ ॥ 950

(5) అగ్నే త్వచం యాతుధానస్య భిన్ధి హింస్రాశనిర్హరసా హన్త్వేనమ్ ।
ప్ర పర్వాణి జాతవేదః శృణీహి క్రవ్యాత్ క్రవిష్ణుర్వి చినోతు వృక్ణమ్ ॥ 951

---

1. శిశానో౽అగ్నిః, 2. దంష్ట్రో౽అర్చిషా, 3. మానో౽అగ్నే వాచా శల్యాగ్ం౽అశని. (పా.ప్ర.)

(6) యత్రేదానీం పశ్యసి జాతవేదస్తిష్ఠన్తమగ్న[1] ఉత వా చరన్తమ్ ।
యద్వాన్తరిక్షే పథిభిః పతన్తం తమస్తా విధ్య శర్వా శిశానః ॥ 952

(7) ఉతాలబ్ధం స్పృణుహి జాతవేద[2] ఆలేభానాదృష్టిభిర్యాతుధానాత్ ।
అగ్నే పూర్వో ని జహి శోశుచాన[3] ఆమాదః క్ష్విఙ్కాస్తమదన్త్వేనీః ॥ 953

(8) ఇహ ప్ర బ్రూహి యతమః సో[4] అగ్నే యో యాతుధానో య[5] ఇదం కృణోతి ।
తమా రభస్వ సమిధా యవిష్ఠ నృచక్షసశ్చక్షుషే రన్ధయైనమ్ ॥ 954

(9) తీక్ష్ణేనాగ్నే చక్షుషా రక్ష యజ్ఞం ప్రాంచం వసుభ్యః ప్ర ణయ ప్రచేతః ।
హింస్రం రక్షాంస్యభి శోశుచానం మా త్వా దభన్ యాతుధానా నృచక్షః ॥ 955

(10) నృచక్షా రక్షః పరి పశ్య విక్షు తస్య త్రీణి ప్రతి శృణీహ్యగ్రా ।
తస్యాగ్నే పృష్టీర్హరసా శృణీహి త్రేధా మూలం యాతుధానస్య వృశ్చ ॥ 956

(11) త్రిర్యాతుధానః ప్రసితిం త[6] ఏత్వృతం యో అగ్నే అనృతేన హన్తి ।
తమర్చిషా స్ఫూర్జయంజాతవేదః సమక్షమేనం గృణతే ని వృఙ్ధి ॥ 957

---

1. మగ్న ఽ ఉత వా, 2. జాతవేద ఽ ఆలేభా, 3. చాన ఽ ఆమాదః, 4. సో ఽ అగ్నే, 5. య ఽ ఇదం,
6. త ఽ ఏత్వృతం యో ఽ అగ్నే ఽ అనృతే. (ప్రా.ప్ర.)

(12) తదగ్నే చక్షుః ప్రతి ధేహి రేభే శఫారుజం యేన పశ్యసి యాతుధానమ్ ।
అథర్వవజ్జ్యోతిషా దైవ్యేన సత్యం ధూర్వన్తమచితం న్యోష ॥ 958

(13) యదగ్నే[1] అద్య మిథునా శపాతో యద్వాచస్తృష్టం జనయన్త రేభాః ।
మన్యోర్మనసః శరవ్యా[2] జాయతే యా తయా విధ్య హృదయే యాతుధానాన్ ॥ 959

(14) పరా శృణీహి తపసా యాతుధానాన్ పరాగ్నే రక్షో హరసా శృణీహి ।
పరార్చిషా మూరదేవాంఛృణీహి పరాసుతృపో[3] అభి శోశుచానః ॥ 960

(15) పరాద్య దేవా వృజినం శృణన్తు ప్రత్యగేనం శపథా యన్తు తృష్టాః ।
వాచాస్తేనం శరవ[4] ఋచ్ఛన్తు మర్మన్ విశ్వస్యైతు ప్రసితిం యాతుధానః ॥ 961

(16) యః పౌరుషేయేణ క్రవిషా సమఙ్క్తే యో అశ్వ్యేన పశునా యాతుధానః ।
యో[5] అఘ్న్యాయా భరతి క్షీరమగ్నే తేషాం శీర్షాణి హరసాపి వృశ్చ ॥ 962

(17) సంవత్సరీణం పయ[6] ఉస్రియాయాస్తస్య మాశీద్యాతుధానో నృచక్షః ।
పీయూషమగ్నే యతమస్తితృప్సాత్ తం ప్రత్యంచమర్చిషా విధ్య మర్మన్ ॥ 963

---

1. యదగ్నే౽అద్య, 2. శరవ్యా౩౽జాయతే, 3. సుతృపో౽అభి, 4. శరవ౽ఋచ్ఛన్తు,
5. యో౽అఘ్న్యాయా, 6. పయ౽ఉస్రియా. (ప్రా.ప్ర.)

(18) విషం గవాం యాతుధానాః పిబన్త్వా వృశ్చ్యన్తామదితయే దురేవాః ।
పరైనాన్ దేవః సవితా దదాతు పరా భాగమోషధీనాం జయన్తామ్ ॥ 964

(19) సనాదగ్నే మృణసి యాతుధానాన్ న త్వా రక్షాంసి పృతనాసు జిగ్యుః ।
అను దహ సహమూరాన్ క్రవ్యాదో మా తే హేత్యా ముక్షత దైవ్యాయాః ॥ 965

(20) త్వం నో [1]అగ్నే అధరాదుదక్తాత్ త్వం పశ్చాదుత రక్షా పురస్తాత్ ।
ప్రతి తే తే [2]అజరాస స్తపిష్ఠా అఘశంసం శోచతో దహన్తు ॥ 966

(21) పశ్చాత్ పురస్తాదధరాదుదక్తాత్ కవిః కావ్యేన పరి పాహి రాజన్ ।
సఖే సఖాయమజరో జరిమ్ణే ఽగ్నే మర్తాగ్ం [3]అమర్త్య స్త్వం నః ॥ 967

(22) పరి త్వాగ్నే పురం వయం విప్రం సహస్య ధీమహి ।
ధృషద్వర్ణం దివేదివే హన్తారం భఙ్గురావతామ్ ॥ 968

(23) విషేణ భఙ్గురావతః ప్రతి ష్మ రక్షసో దహ ।
అగ్నే తిగ్మేన శోచిషా తపురగ్రాభిరృష్టిభిః ॥ 969

1. నోఽఽఅగ్నే ఽఅధరాత్, 2. తేఽఅజరా, 3. మర్తాగ్ంఽఅమర్త్య.(వా.ప్ర.)

(24) ప్రత్యగ్నే మిథునా దహ యాతుధానా కిమీదినా ।
సం త్వా శిశామి జాగృహ్యదబ్ధం విప్ర మన్మభిః ॥ 970

(25) ప్రత్యగ్నే హరసా హరః శృణీహి విశ్వతః ప్రతి ।
యాతుధానస్య రక్షసో బలం వి రుజ వీర్యమ్ ॥ 971

## సూక్తము—87

ఋషి—పాయు వనే భారద్వాజుఁడు†
దేవత—రక్షోహాగ్ని†

(1)*క॥ బలవంతుని రాక్షస గణ
బల హంతను నగ్ని దేవుఁ బరమ ఘృతమునన్
వెలిఁగింపఁజేసి పృథువై
విలసిల్లెడు సదనమందు[1] వెలయుదు నెపుడున్ ॥ 2488

*గీ॥ అట్టి యగ్ని దేవుఁ డతిశయ జ్వాలల
వెలుఁగఁజేయుచుండి వివిధ కర్మ
అతి సమిద్ధుఁ డగుచు నతిహింసకుని వలెఁ
గరము మమ్ముఁ గాచి గ్రోలుఁగాకః ॥ 2489

(2)*గీ॥ జాతవేదుఁడః దీప్తినిఁ జాలఁ గాంచి
తీక్ష్ణదంతుఁడ వగుచును దీక్ష్ణ యాతు
ధానులకు నెల్ల దంతముఁ బూని నీవు
జ్వాలచేత దహింపుమాః లీలమాత్ర ॥ 2490

†వ్రాతప్రతి 18వ సంపుటము 221వ పుటలో నీ సూక్తమునకు ఋషి "పాయు వనే భారద్వాజుఁడు"గాను దేవత "రక్షోహాగ్ని"గాను వ్రాసి, 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "పాయుఁడు"గాను దేవత "అగ్ని, రక్షోహసుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. విలసిల్లెడు సదనంబునందు వెలయుదు నెపుడున్. (వ్రా.ప్ర.పా. గణభంగము.)

*గీ॥ సకల రాక్షస సంఘంబు జ్వాలవలనఁ
జంపుమా! మాంసమును దిను సకల రాక్ష
సాళి నీ యాస్యమం దుంచి యతిశయముగఁ
గప్పి పెట్టుము! నీ వతికరుణ గలిఁగి ॥ 2491

(3)*గీ॥ ఉభయ దంష్ట్రాభియుక్తుఁడా! యోయి! యగ్ని!
నీదు దంష్ట్రల వాడిగా నెఱపి వధకు
నర్హులైనట్టి యాతుధానాదులందు
స్థిరత స్థాపింపుమా! యతిశీఘ్ర మీవు! ॥ 2492

*గీ॥ జగము రక్షించి యంతరిక్షస్థ రాక్ష
సులను జేరుచు వారల సుక్కఁ జేసి
తినుటకున్ సాధనంబు లౌ తీక్ష్ణ దంష్ట్ర
ములను భక్షింపుమా! నీవు మోద మలర ॥ 2493

(4)*గద్యము॥
అగ్ని! నీ వస్మదీయ బలకర యాగములచేతను, స్తుతిచేతను వక్రము లగు బాణములను సన్నమమానుండవై ఆ బాణములయొక్క శల్యములను దీప్తులచేఁ దీక్ష్ణములుగా నొనర్చుచు నా యిషువులవలన రాక్షసుల హృదయమందుఁ గొట్టి యా యాతుధానుల సంబంధము లగు యుద్ధములఁగూర్చు బాహువులను మర్దింపుమా! ॥ 2494

(5)*గీ॥ జాతవేద! నీవు యాతుధానుని త్వక్కు
[1]వలచియున్న వాని వజ్రము కడు
హింస బెట్టుఁగాక! హింసక గణమును
దఱచు తాపమునను దట్టుఁగాక! ॥ 2495

*గీ॥ శిథిల[2] మైనట్టి సంధులచేత మిగుల
ఛిన్న సంధుని రాక్షసు శీఘ్ర గతిని
మాంసమును గోయుచున్నట్టి మాంసహార
వృకము భక్షించి భక్షించి వెడలుఁగాక! ॥ 2496

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. వలచియున్నవాని వజ్రము కడు, (తా.పా.), నొలిచియున్నవాని వజ్రము కడు, (మ.పా.) శ్రీనేమానివారు స్వయముగా సంస్కరించిన యీ పాఠములో యతిభంగము. (మూ.పీఠిక). 2. సిధిల మైనట్టి. (వ్రా.ప్ర.పా.)

(6)*గీ॥ అంతరిక్షమందు నతిశయ పృథ్విపై
వెడలు యాతుధాను వేగ మీవు
చూచుచుంటి వాని సూచీ శరంబుల
వాడి కోలతోడ వంచుమయ్య! ॥ 2497

(7)*గీ॥ యష్ట నగు నన్నుఁ బొందెడు యాతుధాన
వరుల రక్షింపుమా! తీక్ష్ణ బాణ పంక్తి
మరియు నన్ను నెదుర్కొన మరలి వచ్చు
యాతుధానునిఁ దునుమాడు మయ్య! యగ్ని! ॥ 2498

*గీ॥ అట్టి యాతుధాను నతిశయ పక్ష మౌ
మాంసమును గ్రహించి మనెడు నట్టి
ధ్వనిని జేయునట్టి తగ నేగుచున్నట్టి
వారు తిందురీగాక! వలసినట్లు ॥ 2499

(8)*గద్యము॥
ఓ యువతమాగ్నీ! యే రాక్షసుఁడు యజ్ఞ విఘ్నకారియో! యే పిశాచాదికము ఈ యజ్ఞ దూషణాదులను జేయుచున్నదో! యట్టి వానిని నా నిమిత్తము స్వకీయ తేజస్సునఁ జంపుటకుఁ బ్రారంభింపుము! పిదప నా పాపిష్ఠుని నృదృష్ట యగు నీ తేజస్సుచే దహింపుమా! ॥ 2500

(9)*గద్యము॥
ఓ యగ్నీ! నీవు తీక్ష్ణ తేజస్సుచే నస్మదీయ యాగమును బరిపాలింపుమా! ఓ ప్రకృష్టాగ్నీ! ప్రాంచిత మగు యజ్ఞమును వసువులను బొందింపుము! ఓ నృదృష్ట! రక్షస్సులను హింసించు స్వభావము గలిఁగినట్టియు, నభిప్రదీప్త మైనట్టియు నిన్ను యాతు ధానులు హింసింపఁజాలరు ॥ 2501

(10)*గీ॥ అగ్ని! మనుజ ద్రష్ట వౌచు మనుష్యుల
హింసఁ జేయువాని నెరిఁగి యెరిఁగి
వాని మూఁడు తలల వాని పాదంబులఁ
దృంచు[1]మయ్య! నైజ తేజమునను ॥ 2502

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ "త్రుంచు" శబ్దము భ్రమవల్ల "దృంచు"గాఁ బ్రయోగింపఁబడి యతి స్థానమున "తే" వర్ణముతో "దృ" వర్ణమునకు మైత్రి పాటింపఁబడినది. (చూ.పీఠిక.)

(11)*గద్యము॥
ఓ జాతప్రజ్ఞా! యగ్నీ! నీ జ్వాలా బంధనమును రాక్షసుఁడు మువ్మారు పొందునుగాక!
మరియు యాతుధానుఁడు సత్యమును అనృతముచేఁ గొట్టుచున్నాఁడు! ఆ యాతు
ధానుని స్వకీయ తేజస్సుచే నూరివేయుచు వానిని, నిన్ను స్తోత్రము జేయు
నా సమక్షమునందు విడువుము! ॥ 2503

(12)*గీ॥ అనల! రొడఁ జేయుచున్నట్టి యాతుధాను
పైకిఁ దేజస్సుఁ బరపుదు! వరము దాన
శఫ సమాన నఖంబుల సాధువులను
నెదురుకొను రాక్షసాధము నెదురుకొనుము! ॥ 2504

*గీ॥ సత్యమును గప్పి పెట్టుచు నిత్య ముండు
గాఢ మైన యసత్యము మూఢ మతము
దివ్య తేజస్సునన్ నీవు దీప్త వహ్ని!
తరచు నాశముఁ జేయు మదర్వ వలెను[1] ॥ 2505

(13)*గద్యము॥
ఓ యగ్నీ! యీ దినమందు స్త్రీపురుషులు పరస్పర మాక్రోశించుచున్నారు. ఎపుడు స్తోతలు
వాక్సంబంధి కటుకముఁగూర్చి పరస్పర మాక్రోశించుచున్నారో! యప్పుడు దీప్తుఁడ
వగు నీ సకాశమునుండి యే శరవ్యముఁ బుట్టుచున్నదో! యా శరవ్యముచే
యాతుధానులను గొట్టుము! ॥ 2506

(14, 15)*సీ॥ అనలుఁడా! రాక్షస గణమును దాపానఁ దునుమాడి దునుమాడి ఘనతఁ గనుము!
వహ్నీ! రాక్షసులను బహుతౌష్ణ్య శక్తిచేఁ దునుమాడి దునుమాడి ఘనతఁ గనుము!
మారయితవ్య లౌ వీర రాక్షసులను దునుమాడి దునుమాడి ఘనతఁ గనుము!
మనుజాసువులఁ దృప్తిఁ గనెడు రాక్షసులను దునుమాడి దునుమాడి ఘనతఁ గనుము!
గీ॥ పావక పురోగ లైనట్టి దేవ వీరు, లిప్పుడే యాతుధానులఁ దప్పకుండఁ
జంపుదురుగాక! శపథముల్ సకల శత్రు, మర్మములఁ బొందుఁగాక! స్వధర్మ మెరిఁగి ॥ 2507

*గీ॥ మేము పలికెడు శపథము లో మహాత్మ!
యాతుధానుల మర్మాళి నాశయించుఁ
గాక! వ్యాప్తాగ్ని జాలము కఠిన రాక్ష
సాధముని జెందుఁగాకఁ! బ్రశస్త రీతి ॥ 2508

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మరియు సత్యంబుచేతను బరము సత్య, ము ప్రహింసితమును నింక మూఢమతము, దివ్యతేజస్సుచేతను దీప్తవహ్నీ!. (తొ.పా.), బ్రశస్త రీతి. (వ్రా.ప్ర.పా.)

(16)*గీ॥ ఏ రాక్షసుఁడు కడు హెచ్చు పౌరుషమాంస మాత్మకు సర్పింప నరుగువాఁడొ!
యెవఁ డశ్వ మాంసంబు నెంతయు గ్రహియించి తానె భక్షించుచుఁ దనరువాఁడొ!
యెవ్వఁడు పశు మాంస మెవ్విధి నైనను గ్రసియింప సంప్రీతిఁ గ్రాలువాఁడొ!
యెవ్వాఁడు గో క్షీర మెల్ల నొక్కుమ్మడి హరియించి గ్రోలంగ నమరువాఁడొ!
గీ॥ యట్టి దనుజుల సిరసుల నతిశయమయి, తీక్ష్ణమయి భీతికర మగు తేజమునను
ననలుఁడా! దీప్త తేజస్క! మొనసి నీవు, ముక్క ముక్కలు సేయుమా! యొక్కమారె! ॥ 2509

(17)*గద్యము॥
నరదగ్రష్ట్రా! యగ్నీ! యస్మదీయ సంవత్సర భవ క్షీరమును యాతుధానుఁడు
గ్రోలకుండుఁగాక! ఏ రాక్షసుఁ డస్మదీయ గో పయస్సున నాత్మను దృప్తిఁ
బరచుకొనునో! యే రాక్షసుఁడు యుద్ధమునకు వెడలునో! యా రాక్షసుని
స్వకీయ తేజస్సుచేఁ గొట్టుమా! ॥ 2510

(18)*గీ॥ గో గృహంబులయం దెల్లఁ గూడునట్టి
విషము భక్షించెదరుగాక! వివిధ రాక్ష
సాధము లశేషముగ వాడి యైన యాయు
ధంబులును వారిఁ దునుముతఁ దత్క్షణంబు ॥ 2511

*గీ॥ హింసకులకు సవిత యా రాక్షసుల నెల్ల
నొసఁగుఁగాక! దుఃఖ మొనఁగుఁగాక!
నట్టి యాతుధాను లా యోషధీ భాగ
మును గ్రహింతురుగాకఁ! బనిని బూని ॥ 2512

(19)*గీ॥ చాల కాలమునుండి యో జ్వలన దేవ!
హింసఁ బెట్టుచునుంటివి! హింసకులకు
నైన సంగ్రామముల వార లపజయంబు
నీకుఁ గల్పింపలేరైరి నిశ్చయ మిది ॥ 2513

*క॥ మారక ధర్మముఁ గల్గిన
వీరుల భస్మంబుఁ జేసి వెలుఁగుము! మరియున్
వారలు నీ యాయుధములఁ
జేరుచు నుండెదరుగాక! శీఘ్రము వహ్నీ! ॥ 2514

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(20)*గీ॥ నాల్గు దిక్కులయందును గల్గునట్టి
రాక్షసులనుండి మమ్ముల రహిఁ జెలంగ
నీవు కాపాడుమా! యగ్ని! నీదు రశ్మ
లఘముఁ జేసెడు రాక్షసు నడఁచుఁగాక! ॥ 2515

(21)*గీ॥ కవివరుండవు! దీప్తాగ్ని! కవి సుకర్మ
వలన రక్షింపుమా! మమ్ముఁ బ్రథిత రీతిఁ
బశ్చిమమునుండి మరియును బ్రాక్కునుండి
దక్షిణమునుండి యుత్తరతలమునుండి ॥ 2516

*గీ॥ ముదిమి లేని నీవు ముదమున నా కిల
జరను గూర్పవయ్య! జ్వలన దేవ!
చావు లేనివాఁడ! జరసు నా కెక్కువ
కల్పనంబుఁ జేసి గాంలుమయ్య! ॥ 2517

(22)*గీ॥ త్వరితజాత! యగ్ని! [1]ధర్షక వర్ణని
యాతుధాన హంత! నధిక మేధఁ
గల్గు వాని నిన్ను లలిత భారద్వాజు
లెల్ల వేఁడుచుండి రెల్ల వేళ ॥ 2518

(23)*గీ॥ అనల! భంజన కర్మల నఖిల రాక్ష
సాదముల జ్యోతిచేతను నడఁచిపెట్టు
మాయుధ విశేషములవల్ల నఖిల శత్రు
గణములను దుంచుమా! నీవు ఘనత మెఱయ ॥ 2519

(24)*గద్యము ॥
మిథున భూతులు కిమీదినులు[2] (ఇప్పు డేమి అనువారు) నగు రాక్షసులను
దహింపుము! ఓ మేధావి! అహింసితుఁడ వగు నిన్ను స్తుతులుచేఁ
బొగడుచున్నాను. మేలుకొనుము! ॥ 2520

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. దర్షకవర్ణని. (వ్రా.వ్ర.పా.), 2. కిమాదులు, (వ్రా.వ్ర.పా.) సంస్కృత మూల మంత్రములో "కిమీదినా" అని కలదు. "కిమిదానీ మితి యే చరన్తి తే కిమీదినః. తాన్ కిమీదినా"-వ.గో.కృ.

(25)•గద్యము॥
ఓ యగ్నీ! నీవు నీ తేజస్సున రాక్షసుని హరణ శీల బలమును నశింపఁజేయుము!
అటులనే రాక్షస వీర్యమును గొట్టుము! ॥ 2521

## సూక్తము—87

ఋషి—భరద్వాజుని పుత్రుఁడు పాయువు
దేవత—రక్షోహాగ్ని

### అర్థాంతరము—1

(1)†ఉ॥ రాక్షస శక్తులన్ జగతిఁ బ్రాకృత దైవజ నిత్య దీప్త మౌ
రూక్ష మహా ఛటాళి ననురోధము లేకయె కాల్చి వేృల్చు సద్
దక్షత సృష్టిలో రవి సుధామ మహోజ్జ్వల దివ్య కాంతులన్
బక్ష విపక్ష ఋక్ష తతి పాృిదవ మెల్ల నపారమై తగన్ ॥ 2522

†తే॥గీ॥ సృష్టిలో నున్న కల్మష చ్ఛిదృి తతుల
ధ్వంస మొనరించుచున్ సదా ధర్మ
నర్మ కర్మ తత్త్వాల సనాతనంపు
దైవ శక్తుల విశ్వాగ్ని తనరుచుండు ॥ 2523

†శాంతిశ్రీవృత్తము॥•
విశ్వ సృష్టి కృితువు కాఁగ వెలుఁగఁ బృికృతి నగ్ని సహజ
తాఽశ్వి యజ్ఞ మహిత కుండ మవుచుఁ దనర వైష్ణవ పర
శాశ్వతంపు దివిజ శక్తి సకల జగతి రక్షిత మగు
శశ్వదక్షయ మయి శమ్య దమమయ మగు శాంతి గతుల ॥ 2524

†(2) ఉపర్యధోతలములకును నుభయ పార్శ్వ మూల దిశల
కుజ్జ్వల దీప్తుల దంష్ట్రిల నొనరు జిహ్వా జాలాలను
నతిచలనపు శక్తులతో అగ్ని జాత మౌచు నలరు
నభో మండలములోపల నుభయము లౌ నిహ పరాలఁ
బృిభా భాసితమ్ము లౌచు నభయ గతుల వెలుఁగొందుచు
భయకర రాక్షస చయ భంజన మొనరించు సృష్టి
భానులకే భానుఁ డైన భాస్వదాదిత్య శక్తి
సర్వ వ్యాప్తమ్ము కాఁగ ధర్మ శక్తి పృిజ్వలిల్లు ॥ 2525

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-పృిపూర్ణ"
•"కృతి"చ్ఛందము. (20)

†(3) అంతరిక్షములోన నఖిల మౌ విశ్వాన
వివిధ రూపాలలో నవితథ మ్మౌ శక్తిఁ
పగలు రాత్రులు సదా ప్రజ్వలిల్లెడు నగ్ని
సర్వ రక్షక మౌచు సర్వ భక్షక మౌచు
మర్మ ధర్మపు గతుల మహిత కర్మపు జతుల
నమలమై అమరమై అతిలోక భరితమై ॥ 2526

†(4) యజ్ఞాగ్ని కీలాళి సమర శరావళుల
శబ్ద శక్తులఁ దరలు జ్వలిత వాగ్బాణాలు
అవశ మౌ శక్తులన్ అశని పాతాలతో
యాతుధానులు యమ యాతనల్ పొందంగ
అగ్ని దేవా! నీవు అమల మౌ హృచ్ఛక్తిఁ
జలన రహితము చేయు! శత్రుపుల బాహువుల ॥ 2527

†(5) చరాఽచర ప్రపంచమును జ్వలితమ్ముగఁ జేయఁగల్గు
సృష్టి బీజ సర్వమ్ములఁ జెలఁగి ఛేదనమ్ము చేయు
నశని పాతమై హింసను నన్నింటను జేయఁగల్గు
జాతవేదుఁడై జగతిని జరియించును సంక్రమణలఁ
గ్రాంతి విష్ణు మహా శక్తిఁ గ్రాలెడి విశ్వాగ్ని తతులు
దుష్ట రాక్షసాళి శక్తిఁ దనుమాడును సృష్టిలోన ॥ 2528

†(6) అంతరిక్షమందుఁ దనరు నఖిల గోళములను వరలు
మార్గములను మార్గణముల దుర్గమ మౌ సచరాలను
నలరి అగ్ని తమస్తతుల నతిదూరముగాఁ దరుమును
గృత్రిమ మై సాజమ్మై క్లేశ దాయకమ్ము లైన
వాంఛనీయాలు కాని బాధామయ దుశ్శక్తులు
నరాతితతు లమిత పరాభూతమై నశింపఁ
గరశాగ్నుల జ్వాలలతోఁ గరాశాగ్ని కీలులతో
విశ్వమ్మున శర్వ శక్తి విమల మ్మై విరాజిలును ॥ 2529

†(7) సృష్టి బీజ శక్తిలోనఁ జెలఁగు జాతవేదాగ్నులు
ప్రాణ శక్తి నిల్పుచుండి ప్రభవ మ్మౌ ముక్తి నిచ్చ
పరమ శుచిగఁ బవిత్రమై పరిశుద్ధ మ్మై వెల్గును
రాకడ పోకడ లన్నియుఁ బ్రకటమై దశ దిశలను
బహుముఖ దృష్టులు వరలఁగ మహిత మ్మై చరియించును
ఆమూలాగ్రము ప్రకృతిని నఖిలమ్మున నిండి యుండు ॥ 2530

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(8)†క॥ సృష్టిక్షేమాల మ్మోచును
వ్యష్టి సమిష్టులుగ నిలుచు పార్థివ రూపో
త్కృష్ట మహాగ్ని సుశక్తులు
దృష్టి జగచ్చక్షువులయి తేజరిలు సదా! ॥ 2531

†(9) అగ్ని రూప చక్షువులై అఖిలమ్మున వరలు రవులు
విశ్వ సృష్టి యజ్ఞమ్మున విమల శక్తు లుద్భవిల్లఁ
పరబ్రహ్మ పదార్థాల పరతత్త్వాలై వెలయఁగ
వసు సంపద లెల్ల జగతి వర్ధిల్లఁగ బహు ముఖాల
సర్వ లోక జాలా లవి చర్విత చర్వణ సుగతులఁ
బ్రగతులతోఁ గుగతులతో భ్రష్ట మైన దుర్గతులను
వరలును సాజ మ్మోచును జరాఽచర ప్రపంచమ్ము
నిత్య సత్యమై వెల్గును నిరతము పరిణామ మొంది ॥ 2532

†(10) సృష్టి స్థితి లయ శక్తులఁ బలఁగంగా మూల మ్మై
త్రివిధమ్ముల విరాజిలెడి దివ్య బీజ శక్తి యెల్లఁ
దిక్కాలాల సర్వమ్మునఁ దేజరిల్లుచుండు సదా
విశ్వ చక్షువై తనరును సత్త్వ తతుల రక్షించును
జగతిని దనరారు సర్వ జడాఽజడ పదార్థాల
విష తతులను మలినాలను విధ్వస్తము కావించును ॥ 2533

(11)†క॥ అనృతపు దుష్ట కుశక్తుల
జనితాగ్ని తతుల ఋత గతి జాల మ్మో వే
ద నిరత జనస సుదీప్తులు
దునుమాడును దివ్యరోచి దోర్బల గతులన్ ॥ 2534

(12)†క॥ అక్షరమై అయక్ష మౌ
చక్షువులై సృష్టి బీజ సత్యాఽనలముల్
ఋక్షమ్ముల దైవీయపుఁ
బక్షములై ద్వైత గతుల వరలును సృష్టిన్ ॥ 2535

†(13) సృష్టి బీజ శక్తు లెల్లఁ జెన్నొందెను విశ్వమ్మున
అనాహత మనశ్శక్తి సపురూపపు మన్యు శక్తిఁ
బ్రకృతి పురుష తత్త్వాలను ప్రమ దౌత్యముతో నెరపుచు
ఆదానము ప్రదానాలు నాకర్షణ శక్తులతో
అమర మిథున కర్మలుగా నఖిలమ్మున నిత్యమ్మును
సంజననాల్ సంస్థితులును సంవర్ధన గతు లెసఁగును ॥ 2536

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(14) అండాండ పిండాండ బ్రహ్మాండ భాండాల
నిండి నిలిచిన సృష్టి నెగడు బీజము దైవ
లీల విస్తృత మౌను గ్రాలు విశ్వమ్ముగా
రక్ష శక్తిగ నిలిచి రాజిల్లుఁ బెంపొంద
ఆ సృష్టి బీజమ్మె అంతర్ముఖ మ్మౌచు
అంతరాంతర గతుల అఖిలమ్ము కుంచుకొని
నంతరించక నిలుచు నంతర్హిత మ్మౌచు
నరుణాదులన్ నెగడు నాదిత్య తేజాల
నిహ పరాఽతీత మౌ మహిత మౌ నా యగ్ని
సర్వ పరమై నిలుచు సచ్చిదానందాల ॥ 2537

(15)†ఉ॥ సృష్టికి బీజమై తనరు జీవ పదార్థ మహత్వ తత్త్వమే
తుష్ట సురాళి పూజ్యమయి తోడుత సౌఖ్య వధాలు మీఱఁగా
వ్యష్టి సమిష్టి శబ్ద తతి ప్రాభవ మొప్పఁగ విశ్వ మర్మ సద్
దృష్టి విశాల కాంతిమయ దీప్త మహాగ్ని వెలింగెడున్ సదా! ॥ 2538

(16)†శా॥ క్షీర మ్మగ్నిని జేరి శీర్షమయ విశ్లేషాత్మతన్ ధూమమై
నీరాగ్ని జ్వలితమ్ముగా జగతి సందీప్తిన్ మహా పౌరుషం
బారూఢమ్మయి నిత్య సత్య ప్రకృతిన్ యజ్ఞాత్మతన్ నిల్చుచున్
బ్రారబ్ధమ్ముగఁ బాప పుణ్య గతులన్ భ్రష్టోచ్చతల్ పర్వెడున్ ॥ 2539

†(17) సర్వ లోక జాలాలను బర్వు వర్ష పాతము లవి
ఖరకర కర కిరణాలను గ్రాలుసులే మొయిళు లగుచు
ఎక్కడి కక్కడ వత్సర మొక్కటిగాఁ బరిమితమై
జలదములై సలిలములై చక్ర నేమి క్రమము గాఁగ
సలిలమ్ముల నగ్ని ఆరి వెలుఁగుచుండు నంతర్గతి
అగ్ని జలమ్ములను బీల్చి ఆవిరిగా మార్చివేయు
నిప్పులోన నీరున్నది నిప్పున్నది నీటిలోన
నిప్పు నీరు నొక్కటిగా నెగడు మృన్మరుద్దివులు
విశ్వ సృష్టి వెలఁగుచుండు విశ్వాత్మగఁ గాల గతుల
నఖిలములౌ లోకమ్ములు నలరుఁ బంచ భూతావళి ॥ 2540

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(18) ఆదిత్యుల శక్తులతో నలరారెడి సృష్టి బీజ
మహితాఽమృత దీప్త శక్తి విహరించును విశ్వమ్మున
సర్వ సంక్షేమత శాంతి దాంతులను హరించు
కుహనా లోకాల వరలు గహనా లౌ విష తతులను
పీల్చి పీల్చి పిప్పి చేసి విధ్వస్తము కావించును
ధర్మ విజయ రూపిణిగాఁ గర్మ విజయ ధర్మముగాఁ
బరతత్త్వము వర్ధిల్లఁగ వరలఁగ సౌభాగ్యాళులు
విశ్వౌషధ తతులు గాఁగ విమలమైన మంగళ మౌ ॥ 2541

†(19) సృష్టి బీజ శక్తి మీఱి జీవమ్మై నిత్య గతిని
దివ్య దేవతాఽఽళు లెల్లఁ దేజరిలఁగ నవ దీప్తులఁ
గరాళాగ్ని కీలులతో గరళాగ్నుల జ్వాలలతో
రూక్షాగ్నిగ వెల్గొంచుచు రాక్షస తండాలఁ దునిమి
విశ్వ లోక హననమ్ముల వికటముగా నొనరించెడి
విష పూరిత ధూమకేతు పృథురక్షో రూపాలను
విధ్వస్తము కావించుచు విశ్వ విజయ శక్తి వెలుఁగ
భగ్న రహిత దివ్య దీప్తి నగ్నములై అగ్ను లలరు ॥ 2542

†(20) రమణీయమౌ సృష్టికి రక్షణలన్ దక్షతమెయి
వార్ధక్యము లేక నిత్య వర్ధన మౌ సంశక్తుల
సుపర్యధో లోకాలను సుజ్జ్వలముగఁ దేజరిలుచు
నాదిత్యుల మహిమ మీఱు నమృతాఽగ్నులు విస్తరిల్లి
దందహ్యమానమ్మై తరణి కనహ్యమౌచును
పాప గోప మశ్మక్తులఁ బ్రబలెడి విష గోళాలను
రూపు మాపి దీప మార్చి రోదసిలో శాంతి శక్తి
సౌభాగ్యపు రక్తు లలర జగము నెల్లఁ గాపాడును ॥ 2543

†(21) దశ దిశలను విశద శక్తి తనరారెడి బ్రహ్మమ్మై
రక్షించును విశ్వమ్మును రాణ మహావిష్ణు కృపను
అమృతమ్మై అమర్త్యమై అజరామర మైన మహా
విశ్వ సఖిత్వాన నగ్ని విమల గతుల జ్వలియింపఁగ
జగద్వ్యాపితమ్మై తగు నగణితమౌ శక్తి మీఱ
నఖిల చరాఽచరమ్ములను నంతర్గతి నలరారును ॥ 2544

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(22) అత్యంతము శ్రేష్ఠమ్మై
నిత్యమ్మై బల తతులను నిర్మల గతులన్
సత్య సుధర్మ పరాయణ
తాఽత్యద్భుత రతిని నగ్ని యలరుస్ జగతిన్ ॥ 2545

(23)†క॥ విషరూపపు దుశ్శక్తులఁ
దుషిత మ్మౌ రాక్షసాళిఁ దుష్టున్ వ్రేల్చున్
ఋషి శక్తి నగ్ని వర్ధిలి
త్విషాంపతి విశేష దివ్య దీప్తులు దనరన్ ॥ 2546

†(24) సృష్టి బీజ శక్తులలో వ్యష్టి సమిష్టులుగ జగతి
నగ్ని మిథున కర్మలతో నలరు దాహ మూల మౌచు
మహిమాన్విత దివ్య సృష్టి మనశ్శక్తు లెల్ల విరిసి
మహా విశ్వ జాగృతి గతి మాన్యతరమ్మై వెలయఁగ ॥ 2547

(25)†క॥ రాక్షస బలముల జగతి వి
చక్షణమై విశ్వత స్సుసంక్షేమ మహా
లక్షయ మై తనరారఁగ
దక్షతఁ గాల్చును మహాగ్ని తగు హర శక్తిన్ ॥ 2548

## సూక్తము—87

ఋషిక—భరద్వాజుని పుత్రుఁడు పాయువు
దేవత—రక్షోహాగ్ని

## అర్థాంతరము—2

†(1) మిత్రాగ్నులు మహిత మౌచు మిన్నంటుచు వెల్గొందఁగ
దుష్ట రాక్షసాళి శక్తి భ్రష్ట మౌను నష్ట మౌచు
విమల మైన విశ్వ శాంతి విలసిల్లును శర్మమ్ముల
విశ్వ సృష్టి యజ్ఞమ్మున విమలాగ్నులు తేజరిలుచు
దివ్య దేవతాళితోడ భవ్యమైన జగము నెల్ల
నిత్య నవ్య శక్తులతో సత్య గతుల రక్షించును ॥ 2549

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) ధాతు శక్తి విశ్వమ్మున ధాత రూపమై వరలఁగ
జనన శక్తి విజ్ఞానము లనములన్ వెలయంగా
రక్షణ రతి భక్షణ రతిఁ బ్రజ్వలాగ్ని దీప్తమౌను
గీలులె మేలులు కాఁగాఁ గీడులనే తొలఁగించును
జ్వాలలె దంష్ట్రలు కాఁగా జ్వలియించుచుఁ గౌరికివైచు
హద్దు లుండి యగ్ని సృష్టి సపురూపపు శక్తి యౌను ॥ 2550

†(3) ఇహ పర సుఖముల నీయఁగ నెంతేనియు రాజిల్లును
శాంతి కర్మ దాంతి కర్మ క్రాంతి కర్మ లొప్పారఁగ
నంతరిక్షమందు నగ్ని అవర సృష్టి కర్త వోలె
నఖిలమ్మున వ్యాప్తి చెంది అంతరాంతరాల నిలిచి
విశ్వ సృష్టి విధ్వస్తము విపరీతము కావించెడి
దుష్ట శక్తి తండాలను దున్మాడును నెల్లప్పుడు ॥ 2551

†(4) యజ్ఞాగ్నుల జ్వాలలతో నశనిపాత దుశ్శక్తుల
విషమయ వలయాలతోడ వ్రేల్చి కాల్చు గోళాలను
విధ్వస్తము కావించుచు విశ్వ శాంతి వరలఁజేసి
అనిలమ్ముల కశ్మలాల నంతరాంతరాల శుద్ధి
నమృత పవిత్రముగఁ జేయుచు నమర రతుల నంచరించు
నమల గతుల వ్యాప్తి నొందు "ననాహత" హృచ్చక్తిని ॥ 2552

†(5) విష్ణ్వాదిత్యుని శక్తుల విమలాగ్నులు విస్తరిల్ల
నగ్నిమయము కాఁగ సృష్టి అలరారును నెల్లపుడున్
ఖగ చక్రములో వరలెడి క్రాంతి సంక్రాంతి తతులు
రవ్యగ్నుల ఋష్యాగ్నుల భ్రాజిత మౌ నగ్న్యగ్నుల
సృష్టి యెల్ల విడిపోవును వ్యష్టిగా విశిష్ట గతుల
సృష్టి యెల్లఁ గలిసిపోవు సమిష్టి కాఁగఁ ఋష్టి మీఁద ॥ 2553

†(6) మితచారల నతిచారల మిన్నంటుచు వెన్నంటుచు
సర్వ సృష్టి పదార్థాల సమ్మిశిత మ్మై వెలఁగును
జాతవేద శక్తి వెలుఁగు ధౌత మహా శుచ్యగ్నులు
వాతకు ధాతగ సృష్టిని దనరారఁగ శాశ్వత గతి
నిలుచు వైష్ణవాదిత్యుని నిత్య దీప్తి శక్తి నొంది
అంతరిక్షమందుఁ గాంతు లఖిల శుభము లొసఁగుచుండు ॥ 2554

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఙ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) విమల విశ్వ సచ్ఛక్తుల విష శక్తుల భక్షించుచు
నంతరిక్షమందు నగ్ని అత్యద్భుత శక్తిఁ దనరు
వేగాలకు వేగముగా విశ్వ రూప భాగముగాఁ
దీక్ష్ణతలకుఁ దీక్ష్ణమ్ముగ దీప్తమానమై వరలును ॥ 2555

†(8) సృష్టి మూల బీజ శక్తి నిష్టాపూర్వమ్ము కాఁగ
బ్రహ్మమె మూల మ్మోచును వరలెడి నా వైష్ణవాగ్ని
అదిత్యుని రూపములో "ననాహత"మ్మై వెల్గును
విశ్వ చక్షు వౌను నగ్ని విశ్వాగ్నిని నమిధ యౌను
అజ్ఞానపుఁ దిమిర తతుల నఖిలమ్మున నావరించు
నంధకారములను నెల్ల నవలీలఁగఁ బోఁద్రోలును ॥ 2556

†(9) అష్ట వసు సంపదల నద్భుతముగా నగ్ని
పరిశుద్ధమున్ జేయుఁ బ్రిధల మీఱఁగఁ జేయు
నృష్ట శక్తికి మహాఽదృష్ట రక్తులు సదా
నిత్య నవ్యమ్ముగా నిర్నిద్ర గతి నిల్పు
సృష్టి స్థితి రూపములఁ జెలఁగు లయ రూపాల
నిరత మంతర్గతుల నిండి నిల్చును నగ్ని ॥ 2557

†(10) సృష్టి రూపమ్ముగా స్థితి నొప్పు రూపాన
లయ రూపమున నగ్ని వ్యయ రహితమై వెల్గు
మూఁడు కాలాలలో మూఁడు నాభుల శక్తి
జనితమై వెలయఁగా జ్వలితాగ్ని మర్మ గతి
ఉష్ణ నాభినె కాదు ఉండు జల నాభిలో
నుండు శీతల నాభి నుగ్రతాఽనుగ్రతలఁ
బరిణామ శీలతల నిరతమున్ బ్రికృతిని
జక్రనేమి క్రమతఁ జరియించుఁ గాలాగ్ని ॥ 2558

†(11) ధర్మ రాహిత్యాగ్ని కర్మ దుష్కృతులతో
నర్మ గర్భ కుశబ్ద మర్మ దుశ్శక్తులన్
మూఁడు నాభులు పుట్టు మూలమునె బంధించ
దుర్మార్గగామి యౌ దుష్ట రక్షో జాతి
సంహరించును సదా సన్మంగళము లేయ
జాత వేదాగ్ని విశాల శక్తులు వెలుఁగ ॥ 2559

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) దృష్టిలోని మహాగ్ని [1]రుజ నాశనము చేయు
దృష్టిలో ఘృణ్యగ్ని రూక్ష రాక్షసులఁ గాల్చు
ద్వైవీయమై జగతి ద్వంద్వ శక్తుల నలరి
తేజరిలు నక్షత్ర దివ్య గోళాఽఽవళులు
సత్య మాధారమై నిత్య ధర్మమ్ముతోఁ
గను గుడ్డె బ్రహ్మాండ మనఁ గ్రాలుఁ బ్రకృతిగ ॥ 2560

†(13) విశ్వాన రాక్షసుల పీచ మణంచుచు
అవినాశమై వెలుఁగు నక్షర వద గతుల
మన్యు మన శ్శక్తి మహితమై నిలువంగ
నగ్ని ప్రబల మిథున మద్భుతముగా సృష్టి
నలరఁ జేయుచు నుండు నక్షరాఽక్షయ గతుల
ననుసరణ పరిణతుల నాత్మ ప్రతికృతి కాఁగ
హృదయమే బంధమై యెల్ల విశ్వాగ్నులన్
సృష్టి యజ్ఞము చేయు స్రష్ట మహిమలు వెలుఁగ ॥ 2561

†(14) దుష్ట రాక్షస తతులఁ దున్మాడు హృచ్ఛక్తి
దుష్టాగ్ని జ్వాలలను దున్మాడు హృచ్ఛక్తి
యే లోకముల నైన నెనసి మీఱెడి శత్రు
గరళాగ్నులను మహా కరాళాగ్నులఁ గూడ
దునుమాడి హృచ్ఛక్తి తనరు నజయ్య మై
శాంతి సౌభాగ్యాలు సకల జగతిని వరల ॥ 2562

†(15) అక్షయ మౌ శబ్ద శక్తు లనంత మైన గతుల మీఱ
దివ్య మైన రాజ పథము దిక్తటాల వరలంగా
దేవతాళి యెల్ల యెడలఁ దేజరిల నౌ బీజ శక్తి
విశ్వ రహస్యమ్ము నెఱుఁగ విమల మైన సత్య దీప్తి
సద్ధర్మ పరాయణత విద్ధ మహా జ్ఞానములౌ
శత్రు తతుల సంహరింప సదా వెలుఁగు దివ్యాగ్నులు ॥ 2563

†(16) సృష్టి బీజ శక్తి తనరు శిష్టమైన కాంతి తతులఁ
బ్రకృతి పురుష శక్తులతో నకృతముగఁ దనరు నెల్ల
అగ్ని లోన క్షీర తతులు నలరఁగ శీర్షమ్ము లౌచు
దీప్తి తతుల ధూమ గతులఁ దేజరిల్లు లోకాలకు
దివ్య శక్తి నొనఁగునట్లు నవ్య నిత్య శుద్ధతమై
విష వలితాళిఁ ద్రుంచు వృష శక్తులు విజృంభించ ॥ 2564

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఇక్కడ "ఋ-రు"లకు యతి మైత్రి. (చూ.పీఠిక.)

†(17) అంతరిక్షములోన నా క్షీర శక్తు లవి
అతిగోప్య మై నిలుచు నద్భుత శక్తులన్
ఆ "నాభి" రూపాల నాత్మైక్య మై వికృతి
నఖిల విశ్వమ్మునకు నలరించు నభ్యుదయ
మమర మౌ జ్యోతులై అలరు గోశాఽఽవళుల
మర్మ శక్తుల దీప్తి మలినాలఁ దొలఁగించు ॥ 2565

†(18) విష తతుల భక్షించి విష రూపముల బ్రతికి
విశ్వ నాశముఁ గోరి విషములన్ గ్రక్కుచున్
బహు ముఖాలుగ జగతి వ్యాపించు రాకాసి
శక్తులన్ దునుమాడి సవిత యౌ నాదిత్య
దేవ తతి విజయాల దివ్యౌషధీ తతుల
మహిత శుభ గుణమయ విహితమ్ముగాఁజేయు
అఖిల జగమును సత్య మక్షయ ధర్మాల
నలరారఁగా నిత్య మతివేల గతులమై ॥ 2566

†(19) విశ్వ సత్య ధర్మాలను విమలమ్ముగఁ గాపాడుచు
నఖిలమ్మున వ్యాపించెడి అనృత దుష్ట శక్తిమయ
రాక్షస తండాల నెల్ల రాచి రంపమునఁ బెట్టి
సంహరించుచుండు సదా సకల సృష్టి మూలాగ్నియె
సర్వాగ్నుల మూల మ్మై పర్వు మహా దివ్యాగ్నియె
జగతిని శుద్ధ మ్మొనరుచు నగణిత గతు లలరంగా ॥ 2567

†(20) ఏ దిశనుండియున్ ఎట్టి విష శక్తులున్
వ్యాపించకుండఁగా రూపు మాపుచు సదా
అజరామర మ్మైన అమృత శక్తులు వరల
నఘ రూపమునె చంపు నాదిత్యుఁడౌ నగ్ని
అద్భుత జ్వాలలన్ అమల ఋత తేజాల
జగమునే రక్షించు సగుణ నిర్గుణ గతుల ॥ 2568

†(21) అఖిల దిశలను దిరుగు నిఖిల గోశామలన్
అజర మై అమర మౌ నమల సఖిత్వమున
సత్త్వ గుణములు మీఱ సర్వదా కాపాడ
రాజస గుణ శక్తి రాక్షసాదులఁ దునిమి
కర్మ మొక కార్యమై కార్య ఫలమై కర్త
చరము నచర మైన జగము విరాజిలును ॥ 2569

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(22) అన్యోఽన్య సంబంధ ధన్యాఽనుబంధాల
నిత్య యౌవన గతులు సత్య ధీ దీధితులు
ప్రతిదివమ్మందును బ్రతి లేక వరలును
సమరాగ్ని జ్వాలలన్ అమల సుజ్ఞానాల
సృష్టి విరుద్ధ మై స్రష్ట విరుద్ధ మౌ
దుష్టమౌ శక్తులన్ భ్రష్టు పట్టించుచున్ ॥ 2570

†(23) ప్రకృతి విష రూపాల విష రూప రాక్షస
కృత వికృత దుశ్చర్య తతుల విధ్వంసాల
జగతి కపకృతి చేయు సంహార శక్తులను
గ్రించు మీఁదులఁ గెరలు సకల మౌ దిశలను
అద్భుత తేజాల నలరు సమరాగ్నులే
విధ్వస్త మొనరించు విశ్వ రూపము మీఱ ॥ 2571

†(24) విశ్వ రూప మ్మైన విమలాగ్ని తేజమ్ము
మిథున శక్తుల నిలుపు మేల్ పురుష ప్రకృతుల
మేఘమ్ము జల మీయ మేఘ మై అ జలమె
తనరారునట్లుగాఁ దగు సర్వ విశ్వమ్ము
దేవ దేవుని జగద్దివ్య లీలగ పరలి
సన్మనో గత మైన సంకల్ప సిద్ధులన్ ॥ 2572

†(25) రుజ వీర్య శక్తులన్ భుజ బల రక్తులన్
బెరుగు రాక్షస గణము పురుష ప్రకృతుల
సృష్టి వీర్య బీజమ్మును నష్టపరచఁగ మీఱ
విధ్వస్త మొనరించు విశ్వ మూలాగ్నియే
సృష్టి కర్తయె "అగ్ని" స్థితికర్తయే "అగ్ని"
లయకర్త "అగ్ని" యై రాణించి మించులేః ॥ 2573

†— సృష్టి కర్తయె యౌను స్థితి లయ కర్తలుగ
స్థితి కర్తయె యౌను సృష్టి లయ కర్తలుగ
అవును లయ కర్తయే అల సృష్టి స్థితి కర్తలుగి
ఆ కర్త ప్రతికృతిగ సమరాగ్ని తనరారు
అఖిల భూతాఽఽవళులు సంతర్గతి నలర
దుష్ట రాక్షస గణ దోర్బల వీర్యాల
దుర్మార్గ తత్త్వాల మర్మ శక్తులఁ దునిమి
దివ్యాగ్ని రూపమై తేజరిలు విశ్వాన ॥ 2574

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—88

ఋషిః—ఆంగిరసో మూర్ధన్వాన్, వామదేవ్యో వా

దేవతా—సూర్యఃవైశ్వానరోఽగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) హవిష్పాన్తమజరం స్వర్విది దివిస్పృశ్యాహుతం జుష్టమగ్నౌ ।

తస్య భర్మణే భువనాయ దేవా ధర్మణే కం స్వధయా పప్రథన్త ॥ 972

(2) గీర్ణం భువనం తమసాపగూళ్హమావిః[1] స్వరభవజ్జాతే[2] అగ్నౌ ।

తస్య దేవాః పృథివీ ద్యౌరుతాపో ఽరణయన్నోషధీః సఖ్యే[3] అస్య ॥ 973

(3) దేవేభిర్న్విషితో యజ్ఞియేభిరగ్నిం స్తోషాణ్యజరం బృహన్తమ్ ।

యో భానునా పృథివీం ద్యాముతేమామాతతాన రోదసీ[4] అన్తరిక్షమ్ ॥ 974

(4) యో హోతాసీత్ ప్రథమో దేవజుష్టో యం సమాంజన్నాజ్యేనా వృణానాః ।

స పతత్రీత్వరం స్థా జగద్యచ్ఛ్వాత్రమగ్నిరకృణోజ్జాతవేదాః ॥ 975

(5) యజ్జాతవేదో భువనస్య మూర్ధన్నతిష్ఠో[5] అగ్నే సహ రోచనేన ।

తం త్వాహేమ మతిభిర్గీర్భిరుక్థైః స యజ్ఞియో [6]అభవో రోదసిప్రాః ॥ 976

---

1. గూళహమావిః, 2. జాతేఽఅగ్నౌ, 3. సఖ్యేఽఅస్య, 4. రోదసీఽఅన్తరిక్షమ్, 5. తిష్ఠోఽఅగ్నే,
6. యజ్ఞియోఽఅభవో. (వా.ప్ర.)

(6) మూర్ధా భువో భవతి నక్తమగ్నిస్తతః సూర్యో జాయతే ప్రాతరుద్యన్ ।
మాయామూ తు యజ్ఞియానామేతామపో యత్ తూర్ణిశ్చరతి ప్రజానన్ ॥ 977

(7) దృశేన్యో యో మహినా సమిద్ధో ఽరోచత దివియోనిర్విభావా ।
తస్మిన్నగ్నౌ సూక్తవాకేన దేవా హవిర్విశ్వ[1] ఆజుహవుస్తనూపాః ॥ 978

(8) సూక్తవాకం ప్రథమమాదిదగ్నిమాదిద్ధవిరజనయన్త దేవాః ।
స[2] ఏషాం యజ్ఞో అభవత్ తనూపాస్తం ద్యౌర్వేద తం పృథివీ తమాపః ॥ 979

(9) యం దేవాసోఽజనయన్తాగ్నిం యస్మిన్నాజుహవుర్భువనాని విశ్వా ।
సో[3] అర్చిషా పృథివీం ద్యాముతేమామృజూయమానో [4]అతపన్మహిత్వా ॥ 980

(10) స్తోమేన హి దివి దేవాసో [5]అగ్నిమజీజనఞ్ఛక్తిభీ రోదసిప్రామ్ ।
తము[6] అకృణ్వన్ త్రేధా భువే కం స[7] ఓషధీః పచతి విశ్వరూపాః ॥ 981

(11) యదేదేనమదధుర్యజ్ఞియాసో దివి దేవాః సూర్యమాదితేయమ్ ।
యదా చరిష్ణూ మిథునావభూతామాదిత్ ప్రాపశ్యన్ భువనాని విశ్వా ॥ 982

---

1. విశ్వఽఆజుహవు, 2. సఽఏషాం యజ్ఞోఽఅభవత్, 3. సోఽఅర్చిషా, 4. మానోఽఅత, 5. దేవాసోఽఅగ్ని, 6. తమూఽఅకృణ్వన్, 7. సఽఓషధీః. (ప్రా.ప్ర.)

(12) విశ్వస్మా [1]అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతుమహ్నామకృణ్వన్ ।
ఆ యస్తతానోషసో విభాతీరపో [2]ఊర్ణోతి తమో అర్చిషా యన్ ॥ 983

(13) వైశ్వానరం కవయో యజ్ఞియాసో ఽగ్నిం దేవా[3] అజనయన్నజుర్యమ్ ।
నక్షత్రం ప్రత్నమమినచ్చరిష్ణు యక్షస్యాధ్యక్షం తవిషం బృహన్తమ్ ॥ 984

(14) వైశ్వానరం విశ్వహా దీదివాంసం మన్త్రైరగ్నిం కవిమచ్ఛా వదామః ।
యో మహిమ్నా పరిబభూవోర్వీ[4] ఉతావస్తాదుత దేవః పరస్తాత్ ॥ 985

(15) ద్వే స్రుతీ[5] అశృణవం పితౄణామహం దేవానాముత మర్త్యానామ్ ।
తాభ్యామిదం విశ్వమేజత్ సమేతి యదన్తరా పితరం మాతరం చ ॥ 986

(16) ద్వే సమీచీ బిభృతశ్చరన్తం శీర్షతో జాతం మనసా విమృష్టమ్ ।
స ప్రత్యఙ్ విశ్వా భువనాని తస్థావప్రయుచ్ఛన్ తరణిర్భ్రాజమానః ॥ 987

(17) యత్రా వదేతే[6] అవరః పరశ్చ యజ్ఞన్యోః కతరో నౌ వి వేద ।
ఆ శేకురిత్ సధమాదం సఖాయో నక్షన్త యజ్ఞం క[7] ఇదం వి వోచత్ ॥ 988

1. విశ్వస్మా ఽఅగ్నిం, 2. రపో ఽఊర్ణోతి తమో ఽఅర్చిషా, 3. దేవా ఽఅజనయన్. 4. వోర్వీ ఽఉతావస్తా,
5. స్రుతీ ఽఅశృణవం, 6. వదేతే ఽఅవరః, 7. క ఽఇదం. (వా.ప్ర.)

(18) కత్యగ్నయః కతి సూర్యాసః కత్యుషాసః కత్యు స్విదాపః ।
నోపస్పిజం వః పితరో వదామి పృచ్ఛామి వః కవయో విద్మనే కమ్ ॥ 989

(19) యావన్మాత్రముషసో న ప్రతీకం సువర్ణ్యో౩ వసతే మాతరిశ్వః ।
తావద్దధాత్యుప యజ్ఞమాయన్ బ్రాహ్మణో హోతురవరో నిషీదన్ ॥ 990

## సూక్తము—88

ఋషి—అంగిరసుఁడైన మూర్ధన్వుఁడు లేక వామదేవ్యుఁడు†
దేవత—సూర్యుఁడు, వైశ్వానరాగ్ని†

(1)*గద్యము॥
సోమాత్మకము, జరారహితము, దేవతా ప్రియము నగు హవిస్సు సూర్యవేది, దివిస్పృష్టయు నగు నగ్నియందు నాహుతిఁ జేయఁబడెను. ఆ సోమాత్మక మగు హవిస్సును భరించుటకు (ధారణముకొఱకు) సుఖకరుఁ డగు నగ్నిని దేవత లన్నమున వృద్ధిఁబరచుచున్నారు ॥ 2575

(2)*గీ॥ అగ్ని పుట్టిన వెంటనే యధిక గీర్ణ
మగుచు నంధోపగూఢమై యమరునట్టి
సర్వ భువనంబు సర్వదా సత్య మగుచు
నంచితంబుగ నావిర్భవించుచుండె ॥ 2576

*గీ॥ క్రాలు వైశ్వానరాగ్ని సత్కర్మ యందు
దేవ తతి యంతరిక్షంబు పావనోద
కంబులును నోషధీ తతి డంబు మీఱఁ
బ్రీతిఁ గూర్తురు[1] భువికి విఖ్యాతి మెరయ ॥ 2577

---

†వ్రాతప్రతి 13వ సంపుటము 231వ పుటలో నీ సూక్తమునకు ఋషి "మూర్ధన్వ"గాను- దేవత "సూర్యుఁడు, అగ్ని"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "మూర్ధన్వుఁడు" ఋషిగాను "సూర్యుఁడు, వైశ్వానరుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

***రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి**

1. ప్రీతి గూర్చును గాదె విఖ్యాతి మెరయ. (తొ.పా.)

(3)*గద్యము॥
ఏ వైశ్వానరాగ్ని తేజస్సుచేఁ బృథ్విని నీ దివమును నభివృద్ధిఁబరచుచుండెనో!
దేవేషితుఁడనై నేను జరారహితుఁడు మహాత్ముఁడు నగు నా వైశ్వాన
రాగ్నిని స్తుతించుచున్నాను ॥ 2578

(4)*గీ॥ ఎవఁడు వైశ్వానరుండయి యెసఁగుచుండు
నెవ్వఁ డమరాళి సేవితుం డౌచు నుండు
నట్టి యగ్నిని యజమాను లాజ్య ధారఁ
దృప్తి పరచుచు నున్నారు దీక్షఁ బూని ॥ 2579

*గీ॥ సకల పతగాది బృందము స్థావరముల
జంగమంబైన లోకము జాత ధనుఁడు
పావకుఁడు క్షిప్రముగఁ దాను బరమ ప్రీతిఁ
గలుఁగఁజేసెను నంతట వెలుఁగునటుల ॥ 2580

(5)*గీ॥ అనల! జాతధనుండ! యీ యఖిల లోక
మూర్ధ్నమున నున్న యాదిత్య[1]మూర్తిఁ గూడి
వెలుఁగుచున్నట్టి నిను నేను వివిధ నుతుల
పిలువఁగలవాఁడనయ్య! యో![2] వేల్పు పెద్ద! ॥ 2581

*గీ॥ జాతవేదుఁడ! యనల వైశ్వానరాఖ్య!
నీవు [3]రోదసు లంతట నిష్ఠఁ బూని
నిండుచుండెడు[4]వాఁడవై నిఖిల యజ్ఞ
ములకు సర్వాండ వగుచుంటి! ముదితుఁడవయి! ॥ 2582

(6)*గీ॥ అగ్ని రాత్రియందు నఖిలాభిముఖ్యుఁడు
కాంత[5] సూర్యుఁ డతఁడె కల్యమందు
దనివల్ల సూర్య దేవుఁడు కర్మలఁ
బరపుచుండు నట్టి ప్రజ్ఞ యతఁడె ॥ 2583

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. మూర్తితోడ, (తా.పా.), 2. యో పెద్దవేల్పు!, (తా.పా.), 3. రోదసులను గడు, (తా.పా.), 4. నిండుఁజేసెడు వాఁడవై, (తా.పా.), 5. కమ్ర సూర్యుఁ డగును కల్యమందు, దేనిఁ దెలిసికొనుచు దినమణి కర్మము, జేయునట్టి ప్రజ్ఞ శ్రీదు డతఁడు. (తా.పా.)

(7)*గీ॥ అగ్ని దర్శనీయుఁ డగును మహత్తున[1]
నగ్ని దీప్తుఁ డగును నంతరిక్ష
మందు నగ్ని యందు నఖిలామరులు సూక్తి
హవ్య మొసఁగి నార లాదరమున ॥ 2584

(8)*గద్యము॥
"ఇదం ద్యావాపృథి"వీత్యాది వాక్యమును మనస్సుచే నిరూపించుచున్నారు. అనంతరమే అగ్నిని మథనమునఁ బుట్టించుచున్నారు.తదనంతరమే హవిస్సును బుట్టించుచున్నారు. ఆ వైశ్వానరాగ్ని యష్టవ్యుఁ డగుచున్నాఁడు. శరీర రక్షితకూడ నగుచున్నాఁడు ఆ యగ్నిని ద్యోలోక మెరుఁగును. ఆ యగ్నిని భూమి తెలిసికొనుచున్నది. ఆ యగ్నిని నంతరిక్షము కూడఁ దెలిసికొనుచున్నది ॥ 2585

(9)*గద్యము ॥
ఏ వైశ్వానరాగ్నిని దేవతలు పుట్టించిరో! యే వైశ్వానరాగ్ని యందు భూతములు హోమముఁ జేసినవో! ఆ వైశ్వానరాగ్ని తేజస్సుచేఁ బృథ్విని, నంతరిక్షమును, దివమును, నీ భూమిని, ఋజుగమనము గలవాఁడై మహత్త్వముచేఁ దపింపఁజేయుచున్నాఁడు ॥ 2586

(10)*గీ॥ కర్మ బలమున దేవతల్ గాత్రిలు రోద
సులను గప్పెడు ననలాత్మ సూర్యు దివిని
సుందరం బౌచు నత్య మౌ సూక్తి వలనఁ
బుట్టఁ జేసిరి[2] ప్రీతితో భువనమందు ॥ 2587

*గీ॥ సుఖకరుండైన యగ్నిని సురలు దివము
నందుఁ ద్రివిధంబులుగఁ జేసి యమరుచుందు
రగ్ని వ్రీహ్యాదికంబుల నాదరమునఁ
బచనమును జేయుచున్నాఁడు పావసుఁడయి ॥ 2588

(11)*గీ॥ అదితి పుత్రుని నగ్నిని నమరులు దివిఁ
దాల్పఁ జరణ స్వభావు లౌ తరణి వహ్ను
లుదయమును బొంది పిమ్మట నదయు లగుచు
విశ్వమును జూచుచున్నారు పేడ్కా మీఱ ॥ 2589

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మహత్వాన, (తా.పా), 1. బుట్టఁజేసిరి గాదె యీ భువనమందు. (తా.పా.)

(12)*గీ॥ దేవతలు భువనమునకై తేజరిల్లు
నగ్ని వైశ్వానరాఖ్యుని నాదరమున
దివస కేతునిగాఁ దాము దిద్ది తీర్చి
వెలిఁగియున్నార లీ మహా విశ్వమందు ॥ 2590

*గీ॥ అట్టి వైశ్వానరాఖ్యుఁడౌ నగ్ని ప్రత్యు
షస్సులన్ వెల్గఁజేసె నా జ్వలనుఁడు కడుఁ
దిరుగుచుం జీకటుల నెల్లఁ దేజమునను
గొట్టుచున్నాఁడు కడుఁగడుఁ గూర్మి మెఱయ ॥ 2591

(13)*గీ॥ అమరు లిష్టి కర్మ కర్తలై మేధావు
లగుచు ముదిమి లేక యమరుచుండ్రు
సూర్య రూప వహ్ని సొంపుగఁ[1] బుట్టించి
నారు వారు జగతి ధీరు లగుచు ॥ 2592

*గీ॥ అగ్ని చరణ శీలుఁ డగుచుఁ బురాణమై
దేవ ముఖ్య మగుచు దివ్య మగుచు
నతిప్రవృద్ధమైన నా కృత్తికాది న
క్షత్రముల జయించె సకల విధుల ॥ 2593

(14)*గద్యము॥
ఎవఁడు మహత్వమున ద్యావా పృథువులను బరిభవించుచున్నాఁడో: మరియు నెవఁడు సూర్యాత్మకుఁడై క్రింద మీఁదఁ దపింపుచున్నాఁడో: సర్వదా దీప్తుఁడు కాంత ప్రజ్ఞుఁడు నగు నట్టి యగ్నిని మంత్రములచే స్తుతింపఁగలము ॥ 2594

(15)*గద్యము॥
పితురులకు, దేవతలకు, మర్త్యులకు, దేవ యాన, పితృ యానము లను• రెండు మార్గము లున్నవని నేను[2] విన్నాను. ఏ విశ్వము పితృభూత మగు దివమునకు మాతృభూత మగు పృథ్వికి మధ్యను గలదో: యా విశ్వ మగ్నిచే సంస్కృతమైనది యై యా దేవయాన పితృయానముల ద్వారా వెడలుచున్నది ॥ 2595

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1.సొగసుగఁ బుట్టించినారు కారె, (తా.పా.), 2. వింటిని, (తా.పా.)

•దేవ యానము పితృయాన మను నీ రెండు మార్గములు శాస్త్రోక్తము లైనవి. అనఁగాఁ బుణ్య కర్మలు చేయువారికే ప్రాప్తము లగుచున్నవి. పితృయాన మను మార్గము దేవయాన మను మార్గముకంటెఁ గ్రింది మెట్టైనను నదియుఁ జంద్రలోకమును (అనఁగా నొక విధ మగు స్వర్గలోకమును) బొందింపఁజేయునదే యగుటచే నక్కడ నుండు సుఖము ననుభోగించుటకుఁ బాత్రుఁ డగుటకై యిహ లోకమునఁ గొన్నియైనను శాస్త్రోక్తములుగాఁ బుణ్యకర్మ లొనర్చియుండవలయు నని విస్పష్ట మగుచున్నది. ఈ దేవయాన-పితృయాన శబ్దములకు వేరు వే రర్థములను వ్రాసిరి బాదరాయణాదులు. (నే.వేం.న.శా.)

(16)*గీ॥ శిరసువల్లను బుట్టుచు శీఘ్రగామి
యగుచు స్తుతి సంస్కృతుండయి యలరునట్టి
యగ్ని దేవుని రోదసు లాదరమునఁ
దాల్చుచున్నవి సంతత ధర్మ నిష్ఠ ॥ 2596

*గీ॥ అప్రమాదంబు గాంచుచు నధిక దీప్య
మానుఁడై క్షిప్రకారియై మనెడు నగ్ని
సర్వ భువనంబులకుఁ దాను సకల విధుల
నభిముఖుండయి యే వేళ నమరుచుండు ॥ 2597

(17)*గద్యము ॥

"ఏ కాలమందుఁ బార్థివాగ్ని వాయు వీ యుభయులు మనలో యజ్ఞ నేతృఁ డగు నెవఁడు మంత్రభూయిష్ఠ మగు యజ్ఞమును దెలిసికొనుచున్నాఁడు?" అని వివాదమును జేయు కాలమందు ఋత్విజులు యజ్ఞమును జేయుటకు సమర్థు లగుచున్నారు. యజ్ఞమును జేయుచున్నారు. యజ్ఞార్హు లగు వారిలో నీ వివాద నిర్ణయము నెవఁడు చేయఁగలఁడు? ॥ 2598

(18)*గద్యము॥

"అగ్ను లెందరు? సూర్యు లెందరు? ఉషస్సు లెన్ని? అప్పు లెన్ని? యను నది విచారణీయము. ఓ పితరులారా! 'ఉపస్పిజ ముపస్పిజ' మను స్పర్ధాయుక్త మగు వాక్యము చెప్పఁబడుచున్నది. పూర్వోక్త మగు ప్రశ్నను నే నడుగను. తెలియక, ఓ మేధావులారా! విజ్ఞానమునకుఁ బ్రశ్నించుచున్నాను" అని వివిధ మాన్యు లగు నగ్ని వాయువులు పితరులను బ్రశ్నించుచున్నారు ॥ 2599

(19)*క॥ ఎప్పుడు రాత్రు లుషస్సుం
దప్పక కనఁగల్గుచుండుఁ దగిన విధముగా
నప్పుడె హోత సుబుద్ధిన్
మెప్పు వడయు హోమ కర్మ మిక్కిలి దాల్చున్ ॥ 2600

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—88

ఋషి——ఆంగిరసుఁడైన మూర్ధన్వుఁడు లేక వామదేవ్యుఁడు
దేవత——సూర్యుఁడు, వైశ్వానరాగ్ని

### అర్థాంతరము——1

†(1) అజరమై అందు చంద్రాఽమృతము హవిస్సును
స్వీకరించి మరింతగాఁ జెలఁగి ప్రజ్వలిలుచు సూర్యుఁ
డమరమైన అగ్ని కాఁగ నాకసమున సంచరించు
సోమాఽమృత శక్తితోడ శోభ నొందు దివులు సురలు
సృష్టి ధర్మ మెల్ల జగతి జీవన గతి నొనఁగుచుండు
విశ్వ సృష్టిలో నమృతము విమలమైన శక్తు లిచ్చు ॥ 2601

†(2) అనలానిల శక్తులలో నలరు జల మృదాకాశపు
శక్తులలో సుర తతు లవి సంజనితములై తనరను
తమసాఽతీతము లౌచును విమలాగ్నుల ప్రభావాల
నజరాఽమర స్థితి గతులను నమృతౌషధి మైత్రి మీఱ
నగ్ని దీప్తు లొప్పారఁగ నతిలోకపుఁ బ్రవృత్తులను
నంతరాంతర గూఢమైన తమసాళిని బోఁద్రోలును ॥ 2602

†(3) రోదోఽంతరాళాన వేదాఽన్విత మొప్పుచు
మోదాఽన్విత మొప్పుచు దేదీప్యమానాల
దివ్యాగ్ని సృష్టివర తృష్ణేష్టితతులలో
నజరాఽమర మ్మైన చ్యుత శక్తులన్
బృథ్వ్యాది లోకాల భువనాల సంక్షేమ
గతులతో భానుండు తనరారు దీధితుల ॥ 2603

†(4) సృష్టి తొలి యజ్ఞానఁ జెలఁగు నాజ్యము లెల్ల
దేవ జుష్టము లౌచు దీప్త శక్తుల నిచ్చు
అగ్ని క్షాత్రత మీఱ నఖిలమ్ము నను వెలుఁగుఁ
దొలి హోత కృత మౌచు నల రొంద విశ్వాన
జాత వేదుని శక్తు లాతతములై నిలువఁ
బ్రాతరగ్నులు నిత్య జాతమ్ములై వెలుఁగ ॥ 2604

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) ఆదిత్య శక్తులన్ అలరారు నా యగ్ని
భువనాలపై వరలి నభోఽంతరాళాన వెలుఁగు
సృష్టి యజ్ఞమునకై స్రష్ట యజ్ఞమునకై
పంచ భూతాలలో మించు జన్మాలకై
మతి బుద్ధి వాక్కులన్ మహితమౌ శబ్ద బల
శక్తులన్ జనియించి సంచార మొనరించు ॥ 2605

†(6) అగ్ని మూర్ధుండైన ఆ సూర్యదేవుండు
సంజనితుఁడై వెలిఁగి సంచరించును సదా
ఆదిత్య తేజాల నద్భుత శక్తులన్
అనిలాల సలిలాల నాకసమ్మున మృత్తు
లన్నిటన్ జ్వలియింప నాంతర బహిర్గతుల
సమృత మృత శక్తుల నగ్ని తనరారఁగా ॥ 2606

†(7) విశ్వ యజ్ఞమ్ములో విమల మౌ శబ్దాల
నగ్ని తేజము లలర హవిషాః దేవాళి
దివి యోని జన్మించి దివ్య గతిన్ వరలు
ననల వాహన మౌచు ననిల కేతన మౌచుఁ
జరాఽచరమౌ జగతి సప్రాణముగఁ జేసి
రక్షగా వెలుఁగొందు రాణించు జ్వలితాగ్ని ॥ 2607

†(8) సృష్టి కర్త స్రష్ట కర్త శిష్టుఁడైన సర్వేశుని
మహిమాన్విత మౌచు వెల్గు మనశ్శక్తి దీప్తులతో
సత్పదార్థ మెల్ల వరల సకలాగ్నులు తేజరిల్లు
దేవ దేవు హవిశ్శక్తి దేవాఽఽకులు జన్మింతురు
ఆకాశపు శబ్దాలను నఖిల వేద శక్తు లలరు
సృష్టి రక్షక మ్మౌచును జీవ దాతగా వెల్గుచు ॥ 2608

†(9) విశ్వ దివ్య శక్తులతో విలసిల్లుచు వివిధాగ్నులు
భువనావళు లెల్ల నగ్ని పూర్ణత మొయి నలరారును
గాంతు లెల్ల నుజ్జ్వలగతిఁ గ్రాంతితతులఁ బ్రజ్వరిల్ల
సత్య స్వరూపము తనర సర్వాంతర్యామి కాఁగ
మహిత దీప్తి శక్తి వెలయ మాన్య వైశ్వానరాగ్ని
ప్రభవ-విభవ-తత్త్వాలను వరలుఁ జర ప్రపంచాన ॥ 2609

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) దేవాళుల మహిత శక్తి దివులలోన వెలుఁగు నగ్ని
దివ్య దీప్తు లెల్లప్పుడు తేజరిలును రోదసిలో
ఉష్ణ శీత జల శక్తుల నుద్భవించు నుజ్జ్వలాగ్ని
చరాఽచర ప్రపంచాల సకలౌషధి తతులు వరలు
సృష్టి శక్తి వర్ధిల్లఁగఁజేయుచుండు నిత్యమ్మును
జగతిని వెలుఁగుల నింపును జ్వలితాగ్నులు ప్రజ్వలిల్ల ॥ 2610

†(11) ఆదిత్య తేజాల నలరారు సూర్య గతి
దేవతతు లెల్లను దివుల యజ్ఞాలతో
నా పంచ భూతాల అద్భుత శక్తులన్
ప్రకృతి పురుషుల తత్త్వ భాస్వన్మిథున మతి
విశ్వాన భువనాలు విలసిల్లు మహితమై
చలన స్వభావాల సంచరించుచు నుండు ॥ 2611

†(12) విశ్వాన భువనాల వైశ్వానరాగ్నుల
జ్వలిత పతాకాల జాజ్వల్యమానాల
నలర నహోరాత్రు లపురూప గతులతో
నంధకారమ్ములను నతిదూర మొనరించి
అర్చిషాళులు మీఱ నమలాగ్ను లవి వెల్గ
నిత్య ముషోదయా లత్యద్భుత గతిని దగు ॥ 2612

†(13) దైవ శక్తి వైశ్వానరు దేవ తతులు నర్చించుచు
యజ్ఞాగ్నుల నలరఁజేయ నజరత్వము నమరత్వము
నాదినుంచి తుదివరకును నఖిలలోక నక్షత్రము
లా రవి శశ్యాదులకును నఖిలాకాశమ్మునకును
అధ్యక్షుండై వెల్గెడు నజయ్యమైన శక్తులతో
మహనీయుఁడు సృష్టిలో మహిత శక్తివంతుఁ డౌను ॥ 2613

†(14) విశ్వమ్మున వ్యాపించిన వైశ్వానరాగ్ని తతుల
నచ్ఛ మౌచు స్వచ్ఛమైన అక్షయ మంత్రాక్షరాల
ద్యో పృథ్వీ పరివ్యాప్త రోదోఽంతర దివ్యాగ్నుల
నభినుతించి అర్చించుచు నతిలోకపు మహిమలతో
విశ్వమ్మున నహోరూప ప్రాఽశ్వి శక్తి వరలంగా
సుహితమ్మై సర్వస్వము సుకృతమ్మై ప్రతిఫలించు ॥ 2614

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15) ప్రకృతి పురుష రూపాలను భాస్వత్ పితరులు వరలఁగ
మృత్ప్రాయపు దేహాలను మించు మరుజ్ జలాగ్నుల
నాకసంపుఁ దత్త్వాలను నలరుచుఁ బలు లోకాలను
మానవ దేవాళు లెల్ల మహితమైన శక్తులతో
సర్వ సృష్టిలోన మహా సంతానమ్మై తనరఁగ
నుష్ణ శీత జల నాభుల నుజ్జ్వల గతి వెలయంగా
విశ్వ మెల్ల వరలుచుండు విస్తృతాగ్ని శక్తులతో
జనన జీవ మార్గా లవి చక్రగతులఁ దనరుచుండ ॥ 2615

†(16) అతిలోకపు టాదిత్యుని అగ్ని శక్తి తత్త్వాలను
మన సన్నది మహిత మౌచుఁ దనరారును సృష్టిలోన
శిరము కాఁగ వరము కాఁగ సురమౌళుల పరము కాఁగ
నాకర్షణ శక్తు లలర నా రవి చంద్రాది గోళ
తతు లెల్లను నక్షత్రపు వితతు లెల్ల వెలుఁగంగా
విశ్వ లోక జాలా లవి విశ్వాత్మగ వరలుచుండు ॥ 2616

†(17) అనులోమ విలోమ గతుల ననలాఽనిల రూపా లవి
సంయోగపు సంఘటనల సంఘర్షణ సంఘటనల
సృష్టిలోన సహజ గతులఁ వెలుఁగు దివ్య యజ్ఞ తతులు
విజ్ఞానమె వేదమ్మై విశ్వ శబ్ద శక్తి వెలయ
జనన మరణ స్వభావాల జ్ఞాన మూల తత్త్వమ్మును
నెఱుఁగు దేవదేవుఁ డొకఁడె యెసఁగ మాయ లీల కాఁగ ॥ 2617

†(18) అగ్ను లెన్ని కలవు సృష్టి? అరుణ గోళా లెన్ని కలవు?
ఉషసు లెన్ని ఉదయమ్మౌ ఉపర్యధో లోకాలను?
అనిలము లవి యెన్ని కలవు? ఆ సలిలము లెన్ని కలవు?
మృత్తతు లవి యెన్ని కలవు? మిన్ను లెన్నొ యెన్న నౌన?
సృష్టికిఁ దలిదండ్రు లెవరు? స్రష్టకుఁ దలిదండ్రు లెవరు?
అన్నింటికి నధిపతియౌ నల క్షీరాబ్ధిశయానుని
సర్వజ్ఞుని సర్వేశుని సర్వాంతర్యామి యైన
సచ్చిదానందరూపు సంకల్పమె సర్వమ్మౌ ॥ 2618

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(19) ఉదయ గతుల నుషోదయాలు గొనరు సూర్య శక్తి గతుల
విశ్వ సృష్టి యజ్ఞమ్ముల విమల నిత్యాగ్నులుగా
ధాత శక్తి వరలుచుండు మాతరిశ్వరూప గతులు
గోచరమ్ము కాక తనరు నా చరాచర సృష్టి నెల్ల
మర్మ శక్తులెల్ల వరలి కర్మ రూపమై వెలయఁగఁ
బ్రకృతి ప్రాణ సహితమ్మై సుకృత పురుష విహితమ్మై
బ్రహ్మతత్త్వ భరితమ్మై పరఁగును సర్వాత్మ కాఁగ
సృష్టి యెల్ల నడుచుచుండు స్రష్ట స్రష్ట లీల మీఱ ॥ 2619

## సూక్తము—88

ఋషి—ఆంగిరసుఁడైన మూర్ధన్వుఁడు లేక వామదేవ్యుఁడు
దేవత—సూర్యుఁడు, వైశ్వానరాగ్ని

### అర్థాంతరము—2

†(1) అతిలోకపు టమృత శక్తు లఖిలమ్మున విస్తరిల్ల
నగ్నిజుష్ట మైన హవిసు లజర శక్తులన్ విరియును
ధర్మ భువన జాలాలను ధర్మ దేవతత్త్వ గతులు
రవిగతు లవి వరలంగా దివి రతు లవి వెలయంగా
నవ శక్తుల స్వధ యెపుడున్ నా నా దిశలను వెల్గఁగ
విశ్వ శ్రేయము తనరఁగ వెలుఁగు సృష్టి సర్వస్వము ॥ 2620

†(2) అతిలోకపు శక్తులతో నక్షర మౌ ప్రభావాల
నతిదుష్టపు దుర్మార్గపు టపగూఢ తమస్సు నెల్ల
నగ్ని నాశనమ్ము చేయు నగ్నినుండి స్వర్గము లవి
అపురూపపు శక్తులతో నావిర్భావము చెందును
సత్పదార్థతతు లెల్లను సఖ్యమ్ముగఁ దనరంగా
నంతరిక్ష మరు దగ్నులు సల్ల సలిల మృత్తతు లవి
దివి భువి లోకా లన్నిటఁ దేజరిలును నోషధులుగ
నతిబల తతి నాహారమ్మై అరణములై తనరారును ॥ 2621

†(3) అత్యంతము విస్తృతమై అలరారెడి విశ్వ సృష్టి
దేవ తతులు యజ్ఞాశలు తేజరిల్లు నజరాలై
రోదసీకుహరమ్మునఁ బృథ్వీ ద్యో లోకాలను
సూర్య తేజాలతోఁ జోద్య గతిని నగ్నులు
నిత్యమ్ము వెలుఁగొందు సత్య ధర్మాత్మతన్
దేవ దేవుని దివ్య భావ లీలలు వరల ॥ 2622

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఎవఁడు దేవజుష్టమైన సృష్టిష్టుల హవిషాళుల
తొట్టతొలుత హోత కాఁగఁ దొవర నాజ్య మెల్ల నొసఁగు
అతఁడు కాలాగ్నులలో నంతు రథ మ్మధివసించి
సృష్ట యజ్ఞ యజ్ఞాలను సృష్టి యజ్ఞ తత్త్వాలను
జాతవేదాగ్ని గతుల జగచ్ఛలన శక్తి రథులఁ
జరాఽచరమ్ములను నిలుపు విరాడ్రూప మహిత గతిని ॥ 2623

†(5) ఆదిత్యుని శక్తులతో అఖిల తాడనాల భరింపు
సత్యద్భుత బలము మీఱ సంగాంగములందు నిండ
వెల్గు నగ్ని రూపమ్మై విరాజిలును బ్రభాకరుఁడు
మతి బుద్ధుల మహితమైన అతులితమౌ నమగోక్తులు
రోదసి ద్యో లోకాళులఁ బృథ్వుల వ్యాపించు శక్తి
శాబ్దిక మౌ యజ్ఞమ్ముల సర్వ విశ్వమ్ము నిండు ॥ 2624

†(6) సకలములౌ తాడనాల సర్వాంగములన్ భరించు
శక్తి కల్గు నగ్ను లెల్ల నక్తములన్ దినములందు
సౌర దీప్తులౌ ప్రావరఁగ సంజనితమ్మై వెల్గును
మాయ కాఁగ జల శక్తుల మర్మ గతుల నిండియుండు
శీఘ్ర గమన యానమ్ములఁ దెలఁగి సంచరించుచుండు
విజ్ఞు లెల్ల యజ్ఞాలను వినుతుల సంభావింతురు ॥ 2625

†(7) ఆదిత్యుని అమలాగ్నుల అమేయంపు శక్తులతో
దివ్య యోనియందుఁ బుట్టి తేజరిల్లు మహితాగ్నులు
ప్రభాకలిత విభావాల నభోఽంతరాళ భువనాలను
సర్వ లోక గోళాలను బర్వు సూక్ష్మ బృహద్గతుల
దేవాళుల హవిస్సులకుఁ దేజరిలెడు వాహనమై
శబ్ద శక్తు లలర నిచ్చు సర్వాఽనిల భరిత గతుల ॥ 2626

†(8) అవినాభావమ్ము కాఁగ నక్షర మౌ శక్తి తతుల
నలరారెడి పద పుంజము లద్భుత వాక్యము లౌచును
సురుచిరమౌ శక్తులతో సూక్తములై తనరారును
అనలాఽనిల మృన్మరుదాకాశపుఁ దత్త్వ జాల
మహితమైన ప్రభావాల విహిత విశ్వ లోకమ్ములు
దివి భువులును జనిత మౌను దేవ సృష్టి యజ్ఞాలను ॥ 2627

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) దివ్య దేవ శక్తులతోఁ దేజరిలెడి అనలమ్ములు
పృథ్వీ ద్యో లోకాలను [1]భువనాలను విశ్వమ్మునఁ
గాంతి జాల పుంజాలను గ్రొంతు లెల్ల వెల్లివిరియ
సకల జగతి వ్యాపించిన సత్య రూపమ్ము గాఁగ
సత్యుష్ణపు శక్తులతో నతిశీతల మహత్వాన
నలరారెడు నగ్ని రూప మతిలోక ప్రశస్తమై ॥ 2628

†(10) రోదసిలో విరాజిలెడి రూఢ దివ్యాగ్ని శక్తి
దివి భువులను నఖిలాలను దేజరిలెడు నగ్ని పుట్టు
అనిలాగ్నిగ సలిలాగ్నిగ సల్ల మృదగ్ని గాఁగ
ఆత్మాశ్రియమై అగ్నికి ఆకాశము తనరంగా
విశ్వాత్మక రూపాలుగ విరాజిలఁగఁ బ్రత్యణువును
ఓషధులై తనరారును [2]సృష్టి స్థితి లయ శక్తుల ॥ 2629

†(11) ఆదిత్యుని శక్తులతో నలరారెడి రవి గోళా
లఖిల దివుల దేవాళుల నన్నింటిని నలరించును
ఆకర్షణ వికర్షణలను నంతరిక్ష గతము లౌచు
విశ్వ భువన సముచ్చయాల వెలుఁగొందెడు నగ్ని శక్తి
ప్రకృతి పురుష మిథున ద్వయ సుకృత పక్ష ప్రమ దౌత్యము
వరలంగా సృజన గతులు వరఁగును జరాఽచరాల ॥ 2630

†(12) విశ్వాత్మ మౌ నగ్ని వైశ్వానరత్వాన
దైవీయ శక్తులను దనరి భువనాలలో
నహసు కేతువుగాఁగ నన్నింట వెలుఁగుచున్
జీకటుల్ జ్యోతులై చెలఁగంగఁ బ్రాగ్దిశల
ఉదయించి సర్వాన సుత్తమోత్తమ ప్రగతి
జీవ చైతన్యాల సంజీవనిగ నిలుచు ॥ 2631

†(13) దైవీయ శక్తులన్ దనరు వైశ్వానరము
యజ్ఞాగ్ను లన్నియున్ అమరాళి పర మౌచు
అమల తత్త్వాలతో నజర తత్త్వాలతో
అఖిలాండముల నిండి అమృత భాండము పగిది
సృష్టి కధ్యక్షుఁడై స్రష్టలకె అధిపతిగ
నలరు నాదిత్యాగ్ని అతిలోకమై వెలుఁగు ॥ 2632

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఇక్కడ "పృ-భు"లకు యతి మైత్రి. 2. ఇక్కడ "ఓ-ఋ"లకు యతి మైత్రి. (మూ.పీఠిక.)

†(14) విశ్వ పురుషాగ్నిగా విశ్వ సలిలాగ్నిగా
విశ్వాత్మగా వెలిఁగి విమలామృతాక్షర
మంత్రాగ్నిగా జగతి మాన్యమై తనరారి
దివ్య స్వచ్ఛతమెయిని దేజరిలు మహిమలన్
దేవ పరమై నిలిచి దీధితులు తనరార
నుండు ననిలాలలో నుండు సలిలాలలో
నుండు నాకాశాన నుండు నుర్వులఁ గూడఁ
గ్రాంతి దర్శిత్వాల గాఢ గూఢత్వాల ॥ 2633

†(15) మనుజులకును దేవతలకు మహిమాన్విత పితరులకును
నంతట వ్యాపించి వెలుఁగు నంతర్గతమైన అగ్ని
దివ్య దేవ శక్తి మీఱఁ దేజరిల్లు నన్నింటను
మాతాపితరులు కాఁగను మహిమాన్విత శక్తులమై
సృష్టి కర్తలౌ స్రష్టల విశిష్టముగ నాభి కమల
మందుఁ గన్న దేవదేవుఁ డఖిల స్రష్టలకు స్రష్ట
విశ్వరూపుఁడై వెల్గును విశ్వాత్ముండై వరలును
చరాచర మ్మైన సృష్టి నరాతులన్ దునుమాడును ॥ 2634

†(16) చరాచర మ్మైన సృష్టి జాత మౌచు శీర్షమ్ముల
మనశ్శక్తి వ్యాపించఁగ మహిమాన్వితమై జగతిని
అణు వణువున నశ్వి శక్తు లగణిత గతి నలరుచుండు
విశ్వమ్మున భువనాలను వెలుఁగుచుండు దీప్తులతోఁ
ధరణి రూప మంది సదా పరిభ్రమణ గతులతోడ
నన్నింటికి నభిముఖమై అరుణోదయమై తనరును ॥ 2635

(17)†క॥ పర మపర మ్మౌ శక్తుల
వరణీయ మ్మై సుయజ్ఞ ప్రాజ్ఞతరాగ్నుల్
నిరతము విజ్ఞత దీప్తుల
మరణ రహిత శక్తు లొప్ప మైత్రిన్ వెల్గున్ ॥ 2636

†(18) సంహార క్రియల నెరపు జ్వలితాగ్నులు మహితాగ్నులు
సంహార క్రియల నెరపు సౌర గోళ తతు లుషస్సులును
సంహార క్రియల నెరపు సలిలాగ్నులు వెలయంగా
నీర్ష్యా ద్వేషాలు లేని యిచ్ఛా క్రియ రూపాలను
సచ్చిదానందమ్ముల సర్వాంతర్యామి యైన
త్రిమూర్త్యాత్మకమ్మై తగు దేవ రూప మని విజ్ఞులు
ఆదిత్యులు రవి చంద్రులు అఖిలములౌ నక్షత్రా
లన్నింటికి జనకుఁడుగా వర్ణింతురు ప్రార్థింతురు ॥ 2637

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(19) అత్యంతము స్వచ్ఛమై అమరమైన సువర్ణగా
ఉదయమ్ముల హృదయమ్ముల సుపసులతో నావరించి
బ్రహ్మజ్ఞుల యజ్ఞ తతుల వరలెడి సన్మపదాశలు
కర్మ యౌచుఁ గర్త యౌచుఁ గ్రాబు హోతగాఁగ వరలు
సకలమ్మును మాయ కాఁగ సంప్రాప్త మ్మొచునుండు
సహజమైన సృష్టి యజ్ఞ సంపద లవి వరలు జగతి ॥ 2638

## సూక్తమ్—89

ఋషిః—రేణుర్వైశ్వామిత్రః
దేవతా—ఇన్ద్రః; 5-ఇన్ద్రాసోమౌ
ఛందః—త్రిష్టుప్

(1) ఇన్ద్రం స్తవా నృతమం యస్య మహ్నా విబబాధే రోచనా వి జ్మో[1] అన్తాన్ ।
ఆ యః పప్రౌ చర్షణీధృద్వరోభిః ప్ర సిన్ధుభ్యో రిరిచానో మహిత్వా ॥ 991

(2) స సూర్యః పర్యురూ వరాంస్యేన్ద్రో వవృత్యాద్రథ్యేవ చక్రా ।
అతిష్ఠన్తమపస్యం౧ న సర్గం కృష్ణా తమాంసి త్విష్యా జఘాన ॥ 992

(3) సమానమస్మా[2] అనపావృదర్చ క్ష్మయా దివో[3] అసమం బ్రహ్మ నవ్యమ్ ।
వి యః పృష్ఠేవ జనిమాన్యర్య[4] ఇన్ద్రశ్చికాయ న సఖాయమీషే ॥ 993

(4) ఇన్ద్రాయ గిరో[5] అనిశితసర్గా అపః ప్రేరయం సగరస్య బుధ్నాత్ ।
యో[6] అక్షేణేవ చక్రియా శచీభిర్విష్వక్ తస్తమ్భ పృథివీముత ద్యామ్ ॥ 994

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. వి జ్మో ఽఅన్తాన్, 2. మస్మా ఽఅనపా, 3. దివో ఽఅసమం, 4. మాన్యర్య ఽఇన్ద్ర, 5. గిరో ఽఅనిశితసర్గా ఽఅపః,
6. యో ఽఅక్షేణేవ. (వా్ర.ప్ర.)

(5) ఆపాన్తమన్యుస్తృపలప్రభర్మా ధునిః శిమీవాంఛరుమాగ్ం[1] ఋజీషీ ।
సోమో విశ్వాన్యతసా వనాని నార్వాగిన్ద్రం ప్రతిమానాని దేభుః ॥ 995

(6) న యస్య ద్యావాపృథివీ న ధన్వ నాన్తరిక్షం నాద్రయః సోమో[2] అక్షాః ।
యదస్య మన్యురధినీయమానః శృణాతి వీళు రుజతి స్థిరాణి ॥ 996

(7) జఘాన వృత్రం స్వధితిర్వనేవ రురోజ పురో[3] అరదన్న సిన్ధూన్ ।
బిభేద గిరిం నవమిన్న కుమ్భమా గా[4] ఇన్ద్రో అకృణుత స్వయుగ్భిః ॥ 997

(8) త్వం హ త్యదృణయా[5] ఇన్ద్ర ధీరో ఽసిర్న పర్వ వృజినా శృణాసి ।
ప్ర యే మిత్రస్య వరుణస్య ధామ యుజం న జనా మినన్తి మిత్రమ్ ॥ 998

(9 ప్ర యే మిత్రం ప్రార్యమణం దురేవాః ప్ర సంగిరః ప్ర వరుణం మినన్తి ।
న్యమిత్రేషు వధమిన్ద్ర తుమ్రం వృషన్ వృషాణమరుషం శిశీహి ॥ 999

(10) ఇన్ద్రో దివ[6] ఇన్ద్ర ఈశే పృథివ్యా ఇన్ద్రో అపామిన్ద్ర ఇత్ పర్వతానామ్ ।
ఇన్ద్రో వృధామిన్ద్ర[7] ఇన్మేధిరాణామిన్ద్రః క్షేమే యోగే హవ్య[8] ఇన్ద్రః ॥ 1000

---

1.రుమాగ్ంఽఋజీషీ, 2.సోమోఽఅక్షాః, 3.పురోఽఅరదన్న, 4. గాఽఇన్ద్రోఽఅకృణుత, 5.ఋణయాఽఇన్ద్ర,
6. దివఽఇన్ద్రఽఈశే పృథివ్యాఽఇన్ద్రోఽఅపామిన్ద్రఽఇత్, 7. మిన్ద్రఽఇన్మే, 8. హవ్యఽఇన్ద్రః. (వ్రా.ప్ర.)

(11) ప్రాక్తుభ్య[1] ఇన్ద్రః ప్ర వృధో అహభ్యః ప్రాన్తరిక్షాత్ ప్ర సముద్రస్య ధాసేః ।
ప్ర వాతస్య ప్రథసః ప్ర జ్మో[2] అన్తాత్ ప్ర సిన్ధుభ్యో రిరిచే ప్ర క్షితిభ్యః ॥ 1001

(12) ప్ర శోశుచత్యా[3] ఉషసో న కేతురసిన్వా తే వర్తతామిన్ద్ర హేతిః ।
అశ్మేవ విధ్య దివ[4] ఆ సృజానస్తపిష్ఠేన హేషసా ద్రోఘమిత్రాన్ ॥ 1002

(13) అన్వహ మాసా[5] అన్విద్వనాన్యన్వోషధీరను పర్వతాసః ।
అన్విన్ద్రం రోదసీ వావశానే[6] అన్వాపో అజిహత జాయమానమ్ ॥ 1003

(14) కర్హి స్విత్ సా త[7] ఇన్ద్ర చేత్యాసదఘస్య యద్భినదో రక్ష[8] ఏషత్ ।
మిత్రక్రువో యచ్ఛసనే న గావః పృథివ్యా[9] ఆపృగముయా శయన్తే ॥ 1004

(15) శత్రూయన్తో[10] అభి యే నస్తతస్రే మహి వ్రాధన్త[11] ఓగణాస ఇన్ద్ర ।
అన్ధేనామిత్రాస్తమసా సచన్తాం సుజ్యోతిషో[12] అక్తవస్తాగ్ం అభి ష్యుః ॥ 1005

(16) పురూణి హి త్వా సవనా జనానాం బ్రహ్మాణి మన్దన్ గృణతామృషీణామ్ ।
ఇమామాఘోషన్నవసా సహూతిం తిరో విశ్వాగ్ం[13] అర్చతో యాహ్యర్వాజ్ ॥ 1006

---

1. ప్రాక్తుభ్యఽఇన్ద్రః ప్రవృధోఽఅహభ్యః, 2. ప్రజ్మోఽఆన్తాత్, 3. శుచత్యాఽఉషసో, 4. దివఽఆసృజాన, 5. మానాఽఅన్విద్వనా. 6. వశానేఽఅన్వాపోఽఅజిహత, 7. సా తఽఇన్ద్ర, 8. రక్షఽఏషత్, 9. పృథివ్యాఽఆపృ, 10. యన్తోఽఅభి, 11. వ్రాధన్తఽఓగణాసఽఇన్ద్ర, 12. జ్యోతిషోఽఅక్తవస్తాగ్ంఽఅభిష్యుః, 13. విశ్వాగ్ంఽఅర్చతో. (వ్రా.ప్ర.)

(17) ఏవా తే వయమిన్ద్ర భుంజతీనాం విద్యామ సుమతీనాం నవానామ్ ।
విద్యామ వస్తోరవసా గృణన్తో విశ్వామిత్రా[1] ఉత త ఇన్ద్ర నూనమ్ ॥ 1007

(18) శునం హువేమ మఘవానమిన్ద్రమస్మిన్ భరే నృతమం వాజసాతౌ ।
శృణ్వన్తముగ్రమూతయే సమత్సు ఘ్నన్తం వృత్రాణి సంజితం ధనానామ్ ॥ 1008

## సూక్తము—89

ఋషి—వైశ్వామిత్ర రేణువు†
దేవత—ఇంద్రుఁడు, 5-ఇంద్ర సోములు†

(1)*గద్యము॥
ఎవని మహత్త్వము పరుల తేజస్సులను బరిభవించుచున్నదో! యెవని మహత్త్వము
పృథివీ పర్యంతములను నభిభవించుచున్నదో! యే యింద్రుఁడు మనుష్య
ధర్త యై సముద్రములకంటె నెక్కుడగు మహత్త్వమునఁ బ్రవర్ధమానుఁ
డగుచుఁ దమోవారకము లగు తేజస్సుల ద్యావా భూములను నిండింపఁ
జేయుచున్నాఁడో! నేతృతముఁ డగు నట్టి యింద్రుని నో స్తోతా!
నీవు స్తుతింపుము! ॥ 2639

(2)*గీ॥ యాన చక్రంబులను గర మూని సార
ధి రథ చక్రంబులను దాను ద్రిప్పునటుల
వీర్యమున సుప్రసిద్ధుఁ డౌ వేల్పు రేఁడు
దీప్తిఁ దేజస్సులం గొట్టి తిరుగుచుండు ॥ 2640

*గీ॥ విమల కర్మణ్యుని విధాన వెలుఁగు నట్టి
నశ్వమును, గృష్ణ వర్ణంబు లగుచునున్న
యట్టి గాఢ తమస్సుల సమలదీప్తి
వలన హరియించుచున్నాఁడు [1]వాసవుండు ॥ 2641

---

1. మిత్రా౽ఉత త౽ఇన్ద్ర. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 239వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వైశ్వామిత్రరేణువు" గాను దేవత "ఇంద్రుఁడు" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "రేణువు" గాను, దేవత "ఇంద్రుఁడు, సోముఁడు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. లలిత రీతి (తా.పా.).

(3)*గీ॥ స్తోతః యపగతి రహిత [illegible] త [illegible]వము
కంటె నీ పృథ్వి[illegible]
నతివ్రిశస్తము [illegible]
స్తోత్రమును నుచ్చరింప[illegible] సూక్తి [illegible] ॥ 2642

*గీ॥ యజ్ఞములను బుట్టి [illegible]ములంబులై [illegible]
బృష్ట• సంఖ్యచేత స్పష్ట రీతిఁ
గాృలు స్తోత్రములను [illegible] నిందుృఁడు
వెదకుచుండు సఖుని వె[illegible] ॥ 2643

(4)*క॥ అతనూకృత సర్గ స్తుతి
తతివలన[2] సముద్ర [illegible] [2][illegible]తిన్
మతిమన్మహేంద్రు[illegible] నే
నతిశయముగ[3] [illegible]పు[illegible] [illegible]ద్ధిన్ ॥ 2644

*గీ॥ అక్షమున యాన చక్రంబు[5] [illegible]ముగఁ
గట్టఁబడునట్టు లింద్రుఁడు [illegible] తతుల
భూతలంబును దివమును ఖ్యాతి[6] [illegible]
నంచితుం డగు తాను బంధించు[illegible] ॥ 2645

(5)*గద్యము॥
ఆపాతిత మన్యువు గ్రావాములచే క్షిప్రకారి, శత్రుకంపయుత, కర్మవంతుఁడు, ఆయుధవంతుఁడు, ఋజీషవంతుఁ[illegible] సోమ[illegible] అతసమయము లగు వనములను వృద్ధిఁ జేయుచున్నాఁడు. సమాన [illegible]వ్యము లింద్రునిగూర్చి లఘువు లగుచున్నవి ॥ 2646

(6)*సీ॥ ఏ యింద్రునకు [7]భూమి యెనఁగు నా[illegible] సామ్యం[illegible]నొందంగఁజాలకుండు
నే యింద్రదేవున కెల్ల జలస్ఫూర్తి సామ్యంబునొందంగఁజాలకుండు
నే యింద్ర విభున కమేయాంతరిక్షం[illegible] సామ్యంబు నొందంగఁజాలకుండు
నే యింద్రమూర్తికి నెల్ల పర్వతచయులు సామ్యంబునొందంగఁజాలకుండు
గీ॥ నట్టి యింద్రునకై సోమ మమరుచుండు, వజ్ర యను వాఁడు క్రోధము వైరి తతికిఁ
జూపు నప్పుడు స్థిరముల నోపి తాను, [8]ఛిందరఁగఁ జేయుచుం గడుఁ జెలఁగుచుండు ॥ 2647

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

•సంస్కృత మూలమంత్రములో "వృష" శబ్దము మహాప్రాణమైన "ఠ"కారయుక్తముగా నుండఁగా శ్రీనేమానివారు అల్పప్రాణ"ట"కారయుక్తముగా వ్రాసి "స్పష్ట"లోని "ష్ట"కారముతోఁ బ్రాసయతిని సరిపెట్టుకొనిరి.

1.సుందరదివి,(తా.పా.), 2.తతిచేత,(తా.పా.), 3.తరచు ప్రీతితోన్,(తా.పా.), 4.బేర్రణంబు నాచరించెడున్,(తా.పా.), 5.చక్రాశి, (తా.పా.), 6. ఖ్యాతితోడ, (తా.పా.), 7. రోదసీద్వయం బేమియు, (తా.పా.), 8. చిందరవందరగాఁ జేసి జెలగుచుండు. (తా.పా.).

(7,8)*సీ॥ వనమున బరశువు వలె శత్రు పురములఁ గొట్టి వృత్రాసురుఁ గూల్చి నదుల
నుదక పూర్ణములుగా నొనరించి మేఘంబు నవ కుంభము విధాన నలుగఁ గొట్టి
యల మరుత్తులఁ గూడి యంబువు నిచ్చెదు నింద్ర! నా ప్రాజ్ఞత నెల్లఁ గనెడు
నీవు సంస్తుతి గుణ నికరంబుఁ బొందింప వాఁడవై శస్త్రము వలె నుపద్రి
గీ॥ వసులఁ గొట్టుచున్నావు; వరుణ మిత్ర,కర్మముల [1]మృత్యువు విధానఁ గలుష రీతిఁ
జేయువారల నెప్పుడు[2] శీఘ్రగతిని, హింసఁ బెట్టుచున్నాఁడ[3] వేవు కలిఁగి ॥ 2648

(9)*గీ॥ ఎవరు వరుణుని మిత్రుని నెవ్వ రర్య
ముని మరుత్తుల హింసింప నెసుచు నుండు
రట్టి దుష్టుల దండింప నమర! నీవు
వాఁడి జేయుము: వజ్రంబు వంచనింత ॥ 2649

(10,11)*సీ॥ ఇంద్రుండు దినమున కీశ్వరుం డగుఁ బృథ్వి కీశ్వరుం డగు జీవనేశ్వరుఁ డగు
మేఘేశ్వరుం డగు మిగుల వృద్ధేశ్వరుం డగుచు జ్ఞానేశ్వరుం డగుచు నుండు
మరి యింద్రుఁడు ధనంబు కరముఁ బాలించుచు క్షేమాధిపతి యగు సిరుల నొసఁగు
రాత్రులకంటె విరాజి దినంబులకంటెఁ బ్రవృద్ధుఁడై గ్రాలు నంత
గీ॥ రిక్ష దేశంబు కంటెఁ బ్రవృద్ధుఁ డగుచు, నబ్ధి ధూములకంటెను నఖిల నదుల
కంటె మనుజులకంటెను ఘనత గాంచు,చుం బ్రవర్తిల్లుచుండెను సూటి[4] కలుఁగ ॥ 2650

(12)*గీ॥ ప్రత్యుషః కేతు వైనట్టి పరమ రశ్మి
చందమున[5] వెలుఁగుచును భేద మంపనట్టి
వజ్ర మను నాయుధమును ఖల వైరులందుఁ
దాఁ బ్రవర్తిల్లుఁగాక! నంతనము హెచ్చ ॥ 2651

*గీ॥ అశని వృక్షములను నతిశయంబుగఁ గొట్టు
చందమున మహేంద్ర! శబ్దకారి
శత్రు హంత యైన చతురమౌ హేతిచే
వైరి మండలంబు వంచు మీవు: ॥ 2652

(13)*సీ॥ భాసమానంబులౌ మానసముల్ ప్రాదుర్భవించు మహేంద్రుని మించుచుండు
వర్ణనీయంబులౌ వసు పంక్తు లింద్రుని చిత్తం బలరునట్లు చేరుచుండు
రోదసీ ద్వయమును సాదరంబుగ నింద్రు నంద ముప్పారంగఁ బొందుచుండుఁ
బర్వత శ్రేష్ఠముల్ పరమ పావను నింద్రు నంచితంబుగ నాశ్రయించుచుండు
గీ॥ నప్పు లింద్రుని గూడంగ ననుసరించు, సకల మానాద్యధిష్ఠాతృ చారు దేవ
తలు మహేంద్రుని జేరంగఁ దత్క్షణంబ,యనుసరించుచు నుందురు మొనసి తాము ॥ 2653

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. యుక్తము విధాన, (తా.పా.), 2. బాయకుండ, (తా.పా.), 3. సున్నాఁడ వెంతయేని, (తా.పా.), 4.సూటిమీర, (తా.పా.), 5.ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(14)*గద్యము ॥

ఓ యింద్రుఁడా! యే హేతిచే నీవు యుద్ధమునకై వచ్చెడు రక్షస్సును గొట్టితివో! యే హేతిచేఁ బృథివీ సంబంధ మగు విశసన స్థానమునందుఁ బశువులు వలె, శక్తిచేఁ గ్రూరకర్మలను జేయువారు చంపఁబడినవారై పృథ్వితోఁ గూడుచు నీ యుద్ధము నందు శయనింతురో! యా హేతి శత్రువులయం దెప్పుడు క్షేప్తవ్య మగును? ॥ 2654

(15)*గీ॥ సంఘములుగఁ బ్రవర్తించి చాల మమ్ము
బాధఁ బెట్టెడు శాత్రవుల్ పరమ తమముఁ
బొందుదురుగాక! దివసాదు లంద మొప్ప
నట్టి వైరుల హింసించి యమరుఁగాక! ॥ 2655

(16)*గీ॥ బహు విధము లౌచు జగతిని బరఁగునట్టి
యఖిల మానవ సంబంధ మందినట్టి
స్తోత్ర జాలము లన్నియు సుర విభుండ!
నిన్ను వినుతించుచున్న వి సున్నితముగ ॥ 2656

*క॥ స్తుతిపరులున్[1] స్తుతి వాక్యము
మతిఁ దలఁచి [2]వచింతు రట్టి మాన్యుల సత్య
స్తుతుల మతిఁ బెట్టి హరి! న
న్మతితో నిటు రమ్ము! నీవు మంచితనమునన్ ॥ 2657

(17)*గద్యము॥

ఓయి యింద్రుఁడా! విశ్వామిత్ర పుత్రుల మగు మేము నీ స్తోత్రములను బొందఁగలము. ఓ యింద్రుఁడా! యహోరక్షణార్థము నిను వినుతించు మేము నీ యనుగ్రహంబులను బొందఁగలము ॥ 2658

(18)*గద్యము॥

ఈ సంగ్రామమందు వృద్ధిఁ బొందునట్టియు, మా యాహ్వానమును వినునట్టియు, నుగ్రమైనట్టి యుద్ధములయందు శత్రువుల దహించుచున్నట్టియు, శత్రువులను జంపుచున్నట్టియు, శత్రు ధనములను హరించునట్టి యింద్రుని నన్న లాభమునకు, రక్షణముకొఱకు నాహ్వానించెదము ॥ 2659

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. స్తుతిపరులు స్తుతి వాక్యము, (వ్రా.వ్ర.పా.), 2. వచించుచుండి మాన్యులకెల్లన్, గతులుగ నొనర్చి. (తౌ.పా.)

## సూక్తము—89

ఋషి—వైశ్వామిత్రి రేణువు
దేవత—ఇంద్రుఁడు,ఇంద్ర సోములు

### అర్థాంతరము—1

†(1) విశ్వాదిని వెలంగు విశ్వాంత్యమున వెలుంగు
అపురూపపుఁ దేజమ్ముల నాదిశేష శక్తులతో
మహితమ్ముగఁ బ్రస్తుతించి విహిత మ్మౌ ప్రతిఫలాలు
నిత్య గతుల విస్తరిల్లి ప్రత్యూహమున్ వనరారఁగ
నాదిత్యుని శక్తు లెల్ల నఖిల విశ్వము నిండంగాఁ
బరిపూర్ణమౌ జ్యోతులు ప్రభా భాసితమ్ము లౌచు
నదీ నద జలధి తతుల నా నా దేశ లోకమ్ముల
నవ్య గతులు వెలుఁగొందును దివ్య మహత్వములు వరల ॥ 2660

†(2) వేల లెనయని కాల చక్రము పాలితమ్మై తనరుచుండఁగ
ఆ అదిత్యుఁడు రథమ్ము నధివసించి చరించు భాతి
అత్యద్భుత కాంతి జాల మాకృతిగా సూర్య గోళ
మఖిల సృష్టి గోళాలను నావరించు నల్లనైన
కృష్ణ మాయ తమసాళిని విష్ణు మాయగాఁ దునుముచు
నాత్మ మాయ నవలఁ బెట్టు నాత్మ ఒవలోకిగాఁగ
నాత్మైక్యమ్ముగ సర్వము నంతయుఁ దా నౌచు వెలుఁగు
గతి శీలముతో సత్య నిసర్గ గతులఁ దనరుచుండ ॥ 2661

†(3) దివి భువు లన్నింట సదా తేజరిల్లు బ్రహ్మ శక్తి
అనమానమ్మై వరలును నపురూపపు నవ్య శక్తి
అవినాభావమ్ములైన అదృష్టపు సమానతలఁ
దొలిరూపై అవతరించి అలివిమాలినట్టి శక్తి
అఖిలమ్మును నిండియుండు నా సర్వేశుని విశాల
నఖిత్వమ్ము సృష్టి నెల్ల నదమలమై శ్రియఃపతిగఁ
దేజోరూపాల వెలయ దివ్యత్వపు మహిమలమై
నిత్య చలన స్వభావాల నెగడు ద్వైతతత్త్వ మెనయ ॥ 2662

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అతిసూక్ష్మపు శక్తులతో నఖిల సృష్టి విశ్లేషత
సత్యంతము నిశితమైన యమరశబ్ద శక్తులతో
విష సహితములై తృష్ణత విశ్వము నాక్రమణ చేయు
దుష్ట శక్తులన్ దునుముచు [1]ఘృతకాల సుచక్రిండై
భువి దివి లోకా లన్నియు నవ శక్తులఁ దనరారఁగ
సక్షమ్ములఁ ద్రిప్పుచుండు నక్షయ గతు లొప్పారఁగ
విశ్వ వ్యాపిత మౌచును విష్వక్ తతి విస్తరిల్ల
సక్రమ గతి సర్వస్వము సంచరించు హరి కరుణను ॥ 2663

†(5) ఖిలా౽ఖిల జల శక్తుల నాధిపత్య మొప్పారెడి
మన్యు శక్తి విస్తరిల్ల మహిమాన్వితమై వ్రేలుచు
మాయా౽వృత మై వరలెడి మాయమౌ విశ్వాండము
పంచా్ర౽మృత శక్తి మీఱ జగతిలోనఁ జెలువొందును
బ్రాగీశ్వర మహిమాన్విత భాగ్యతతులు వెలయంగా
సప్త విధ విభేదములత గుప్తములై దీప్తములౌ
సత్య శక్తి పంచభూత సంచయాల నొప్పారఁగ
విశ్వ సృష్టి నడుపుచుండి విశ్వేశుఁడు వెలుఁగుచుండు ॥ 2664

†(6) దివులు భువులు కాదు తేజస్సోమములు కాదు
విషము కా దమృతము కాదు విశ్వా౽క్షములు కాదు
అద్రు లవ్వి కానె కాదు అంతరిక్షమ్ము కాదు
మన్యు శక్తి నధివసించి మహిమాన్వితుఁడై వెల్గుచు
వినుచుఁ గనుచు నడుపుచుండు విశ్వమ్మును బ్రా౽శ్విగతులఁ
గామ్య కర్మ లెల్ల నెరపి కర్త కాఁగ భర్త కాఁగ
స్థితి గతులను దృఢతరమై చెలఁగు గాఢ బాధ
పదార్థాల శీర్ణములుగ వరల భేదనమ్ము చేయు
నణు పరమాణు తతులు నలరఁగ బ్రహ్మాండ మౌచు
సర్వ సృష్టి కధిపతిగా సర్వేశుఁడు విరాజిలును ॥ 2665

†(7) జలనాభి హరియించు ఖల వృత్రు వధియించి
జగములో సలిలాల నగణితముగా నిలిపి
అత్యంత గూఢమౌ నపరాజిత మహిత
శక్తు లవి రాజిల్ల సర్వాధిపత్యాన

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఇక్కడ "దు-ఘృ"లకు యతి. (చూ. పీఠిక.)

నిత్య నవ దీప్తులన్ నిఖిలమ్ము నింపఁగా
జ్ఞాన తేజమ్ము సర్వ జగద్వ్యాప్తమ్ముగా
భిన్న భిన్నాలుగా విన్నాణముల నిలువ
నమృతేశ్వరుఁడు లీల నఖిలేశుఁడై వెలుఁగు ॥ 2666

†(8) సృష్టి యజ్ఞమ్మునకు సృష్ట యజ్ఞమ్మునకు
భంగమ్ము కలిగించి వ్యాఘాతములు మీఱ
విశ్వ నాశము గోరు విష శక్తులను దునిమి
వరుణ ధామమ్ములను వర మిత్ర ధామాల
నేక పథమున నిలుపు నేకైక దేవుండు
విశ్వ సంక్షేమాలు విమల రూపము లంద ॥ 2667

†(9) దేవదేవుని దివ్య దేదీవ్య రూపాల
సంస్తుతుల శక్తు లవి సకల సూర్యులఁ జేరి
వరుణ శక్తులఁ బెంచి నిరతాఽమృత గతుల
రవి శత్రు తండాల ప్రభల వినాశమ్ము
గావించి వృషభాలఁ గ్రోల వృషరాజ గతి
సత్వ గుణ సంపదలు స్వచ్ఛమై వెలుఁగొందు ॥ 2668

†(10) విష్ణువే దివ మౌఁప విష్ణు వీశ్వరుఁ డౌను
విష్ణువే భూమిగా విష్ణువే జలముగా
విష్ణువే భువన మౌ విష్ణువే బల శక్తి
విష్ణువే జ్ఞానాల విజ్ఞాన ప్రజ్ఞాన
సుజ్ఞాన పుంజాల నాజ్ఞప్తిమై నిల్చు
విష్ణువే క్షేమమై విష్ణువే యోగమై
విష్ణువే యజ్ఞమై విష్ణువే హవ్యమై
విష్ణు మాయగ సృష్టి విష్ణు లీలఁగఁ దనరు ॥ 2669

11(†) పగలు రాత్రులు సదా అగణితముగా నిల్చు
అఖిలాంబుధుల నిల్చు నంతరిక్షము నిల్చు
ననలమ్ములను నిల్చు ననిలమ్ములను నిల్చు
క్షితుల నెల్లను నిల్చు క్షతి రహిత శక్తులన్
సింధువులతో సహా క్షితుల కన్నింటికన్
సంక్షేమములఁ గూర్చు సర్వేశ్వరేశ్వరుఁడు ॥ 2670

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) సర్వేశ్వరేశ్వరు సందీప్త శక్తులన్
అరుణాఽరుణమ్ములై అద్భుతావహములై
అద్వితీయమ్ములౌ నా ఉషఃకేతువుల
విధ్వస్త మొనరింప వినాశ మొనరింప
సాధ్యమ్ము కా దీ విశాల మౌ విశ్వాన
శబ్ద శక్తుల బహుళ సాంద్ర రూపమ్ములు
అత్యుష్ణ తాపాల నమర లోకపు గతుల
ననుపమములై తనరు నా కాంతి హేషలను ॥

†(13) ఆవృత్తులే లేక అఖిలేశ్వరుం డైన
ఆ పరమాత్ముని అద్భుత లీలగా
అగణితములై తనరు పగలు రాత్రులు వరలు
మాసాలు పరఁగును మహిత కాంతులు మీఱ
విష్ణు శక్తులు మీఱ విమలమౌ రోదసిని
నఖిల చరాఽచరము లద్భుతౌషధములై
రవి చంద్ర కాంతుల రమణాఽనుసరణాల
నావిర్భవ మ్మొచు సంతరించును సృష్టి
నాత్మైక్య మలరార నాకాశ రూపాన
ననిలాఽనలముల భాతి నా మృజ్జలము గతి
నావృత్తు లవి మీఱ నావిర్భవము చెందు
బ్రహ్మ శక్తికి హితము ప్రతిబింబమై తనర ॥

†(14) విష్ణు శక్తులు మీఱు విజయ పరంపరల
నద్వితీయ మ్మొచు నజయ్య గతులమై
సృష్టి కల్లోలాల నపవరచెడి దుష్ట
రాక్షసాళిని దునిమి రక్షించు లోకాల
ఋతరూప ఋక్కులే మృద్రూపమై నిలువ
ఋక్కులే జలమునై ఋక్కులే అనలమై
ఋక్కులే అనిలమ్మై ఋక్కు లాకాశమై
ఆదిత్య రూపమై అలరొంది వెలుఁగఁగా ॥

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య

†(15) రవి తేజములఁ గప్పి రాజించు లోకాలఁ
జీకట్ల వాఁకలను రాకాసి మూఁక లవి
వ్యాపింపఁగాఁ జేసి ప్రగతి సంక్షోభాల
నగతులున్ కుగతులు నెగడంగ దుర్గతులు
అష్ట కష్టాలతో నష్టపరచును సృష్టి
"నభి" శక్తు లవి మీఱ నల్లకల్లోలముల
నా రాక్షసాధముల నతివేల శక్తులన్
ఆమూలచూడముగ నంతరింపఁగఁజేయు
సత్యద్భుతమ్ముగా నిత్య తేజము వెలుఁగ
నా విష్ణు శక్తులే అపురూప మౌ మహిమ ॥ 2674

†(16) సృష్టి సంజననాల స్రష్ట శక్తులు నెరపు
బ్రహ్మణిగా సర్వ బ్రాహ్మ్య రూపము వరల
దివ్య దేవాఽఽవళులు తెగటార్చు దుష్టతల
విశ్వ సంచలనాల నశ్వ శబ్దాఽఽవళుల
జ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞాన సుజ్ఞానాల
సృష్టి సంక్షేమాలు చెలఁగు సహజమ్ములై ॥ 2675

†(17) నిత్య నవమై వెల్గు నిరత సుమతులు మీఱ
విశ్వ రూపము నెల్ల విష్ణువే రక్షించు
విశ్వమ్మున కమిత్ర వికృత శక్తుల నెల్ల
రవికి సూనముగాఁగ నవిరళముఁ దున్మాడు
విశ్వ సంక్షేమమ్ము విశ్వ శాంతులు వరల
విశ్వ ప్రేమాఽమృతము విమలమై వర్ధిలఁగ ॥ 2676

†(18) వసు సంపదాశలను భ్రష్టు పట్టింపఁగా
సత్యుగ్ర రూపాల మృత్యు తాపాలుగా
నాఽన్యతో ముఖముగా శూన్యాన వ్యాపించి
వృత్ర శక్తులఁ దునిమి విశ్వేశ్వరేశ్వరుఁడు
మఘవంతుఁడై వెల్గు మహితేంద్రుఁ గాపాడి
జల శక్తులను నిలిపి జలద మాలలఁ దనుపుఁ
బ్రకృతి పురుషుల పురా ప్రాకృత విభవాలు
సకృతములుగా జగతి సుకృతములుగా వరల ॥ 2677

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—89

ఋషి—వైశ్వామిత్ర రేణువు
దేవత—ఇంద్రుడు, ఇంద్ర సోములు

### అర్థాంతరము—2

†(1) విశ్వాత్మగా నిలుచు విశ్వ సింధువులోన
విష్ణు శక్తులు మిఱు విమలమౌ భూతాలు
అవినాభావమౌ నన్యోన్య సంబంధ
బంధాల వరలంగ నంధలా రహితమౌ
నా రశ్ముల తేజాలు అపురూపమై వెలుగు
అవిచ్ఛిన్నపు రతుల నతిలోక ఋత గతుల ॥ 2678

(2)†క॥ రవి తేజము లొప్పారఁగ
నవిరళమును విశ్వ లోక యజ్ఞము లలరున్
దివి విష్ణు చక్ర తత్త్వము
అవితథముగఁ గాల చక్ర మై తనరంగా ॥ 2679

†— జగచ్చక్షు తేజమ్మున జగము తిమిర రహిత మౌను
కృష్ణుఁడైన విష్ణు శక్తు లుష్ణతలను దీప్తములై
కాల రూప తమసమ్ము సమూలముగఁ బారఁద్రోలు
నిరతమ్మౌ బ్రహ్మ సృష్టి నిసర్గముగ సర్గమౌను ॥ 2680

(3)†క॥ అనమానపు టజ శక్తిని
నసి సృష్టి విశాల మౌచు సర్వము తా నై
అసువుల నవ్యత్వమ్మున
నసుధాఽధిప హరి సమాన సఖ్యము తనరన్ ॥ 2681

(4)†అష్టపదకందము॥
అప్రకటిత మౌ శబ్దజ
సుప్రథ వెలుఁగంగ జగతి సుకృతము లౌగన్
క్షిప్రగ చక్రగ దివి భువి
విప్రేక్షణ శక్తి తతుల విశ్వము వరలున్
బ్రప్రథమమ్మయి భూత మ
య ప్రకరము దేని కదిగ నలర మహా వి
ష్ణు ప్రభ దివ్యత్వమ్మున
నప్రతిహత గతులు తనర నమృతం బౌలే ॥ 2682

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

(5)†అష్టపదకందము॥
సోమాఽమృత శక్తి తతుల న
సామాన్య మహిమను దివ్య సౌభాగ్య తతిన్
భా మహిత మ్మొచు వసు సు
ధామమ్మయి పంచ భూత ధారణ గతులన్
సీమ సహిత చలన గతి వి
రామ తతులు చక్రనేమి క్రమతలు మీఱన్
వ్యోమాఽంచిత విశ్వమ్మునఁ
జేృమాంకిత విష్ణు లీల పేర్మిని నడుచున్ ॥ 2683

†(6) దివి భువులును లేని శక్తి రవి చంద్రులు లేని శక్తి
అద్రి తతులు సక్షమ్ములు సంతరిక్షమ్ము లేని
అపురూప మ్మైన శక్తి అఘోరంపు దీప్త శక్తి
మన్యు శక్తి మహిత మైన మహావిష్ణు ధన్య శక్తి ॥ 2684

†(7) నిర్వక్ర పరాక్రమత నిత్యమ్మై నిండి నిలువ
నవక్ర మౌ విక్రమతల నలరారెడి చక్ర మద్ది
నిశ్శబ్దపు శబ్ద శక్తి నిరత తేజ రూపముగా
వరల విష్ణు వెల్ల సృష్టిఁ బరమ గుహ్య శక్తిఁ బెంచు ॥ 2685

(8)†క॥ అనలాఽనిల జల మృత్తతి
కనంతమౌ నాకసమున కధినాథుండై
వ్రణుత సుధాముండై హరి
వినుతుం డౌ విశ్వ సృష్టి విస్తృతి తనరన్ ॥ 2686

†(9) సత్పదార్థ శక్తులతో శబ్ద నిశ్శబ్ద తత్త్వ
మహితమైన దీప్తితతులు నిహితమ్మౌ మిత్ర శక్తి
లోక భీకరమ్ము లౌచు నాక కంటకమ్ము లైన
విశ్వాఽహిత దుశ్శక్తుల విచ్ఛేదన మొనరించును ॥ 2687

†(10) విష్ణు వౌచు దివమ్ము విష్ణు వౌ చీశ్వరుఁడు
విష్ణువై భూమియే విష్ణువై సలిలమ్ము
విష్ణువై భువనాలు విష్ణువై బల శక్తి
విష్ణువై విశ్వమ్మె విష్ణువై జ్ఞానాలు

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

విజ్ఞాన ప్రజ్ఞాన సుజ్ఞాన పుంజాలు
విష్ణువై క్షేమమ్ము విష్ణువై యోగమ్ము
విష్ణువై యజ్ఞమ్ము విష్ణువై హవ్యమ్ము
విష్ణు వౌచును మాయ విష్ణు వౌచును లీల
విష్ణువై సృష్టియే విస్మయమ్ముగఁ దనరుఁ
గర్మ కర్తలు కలిసి మర్మ ధర్మ మ్మౌను ॥ 2688

†(11) ముద్ర సహిత మ్మౌచు నిద్ర విహిత మ్మైన
విశ్వమ్ము తనరారు విపుల దిన రాత్రులను
అనలాఽనిల జల మృదాకాశ రూపాల
నంతరిక్షమునందు నఖిలమున్ జరియింప ॥ 2689

†(12) ఆ శ్రీమహావిష్ణు నాజ్ఞ నౌదలఁ దాల్చి
సకల రవి గోళాలు సకుటుంబముగఁ దనరి
ఉషసాళి చిహ్నమై ఉజ్జ్వలమ్ముగఁ దిరుగు
మిత్ర ఘాతుక శక్తి మిన్నులన్ బరిమార్చు ॥ 2690

†(13) పంచ భూతాఽఽవళుల ప్రాధాన్య మొప్పంగ
నలరారు గోళాల నఖిలౌషధులు నిత్య
నవ మైన శక్తులన్ నా నా విధ గతులఁ
బగలు రాత్రులయందు వరలు మాసాలలోఁ
గాలానుగుణముగాఁ గ్రాలు భువనాలలో
స్రష్ట స్రష్టకు హితము సృష్టి స్రష్టల హితము
చేయుచున్ వర్ధిల్లి స్థితి శక్తులన్ నిలిచి
రోదసిని వివశమై రోచిస్సులన్ దనరు ॥ 2691

†(14) ఆదిశేషువు ఋక్కు లాదిశేషువె విశ్వ
మాదిశేషువు కాఁగ నా భూత పంచకము
నాదిత్య గోళాలు నాదిశేషువు కాఁగ
నండాండ పిండాండ బ్రహ్మాండ భాండాలు
నతిలోక గతి నఖిల మాదిశేషువె కాఁగ
ఆ ఆదిశేషువే అనంత రూప మౌ
శయ్యగా వరలఁగా శయనించి కృష్ణుండు
అఘరూపమున్ బాపి అఖిలమున్ రక్షించు ॥ 2692

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15) "అభి" శక్తులన్ బొంది "నాభి" శక్తుల నిలుపు
దుష్ట శాత్రవ తతులఁ దున్మాడి విష్ణుపు
తిమిరాళిఁ బోఁదోలుఁ దేజ స్వరూపాలు
రవ్యాది గోళాల రక్షించు నిత్యమ్ము
సృష్ట శక్తుల వెలయు సృష్టి వ్యవస్థలో
స్థితి శక్తి వెలుఁగంగఁ జిన్మయండై తనరు ॥ 2693

†(16) సృష్టి యజ్ఞాలలో సృష్టలున్ బ్రాహ్మణుల్
దివ్య దేవాఽఽవళులు తేజరిల శక్తులన్
జనన మరణాలతో జగ మెల్లఁ దనరార
నావిర్భవ మ్మొందు నగుఁ దిరోధానాలు
విజ్ఞానమయమైన విశ్వమ్ము వర్ధిలఁగ
నజ్ఞాన రహితమై అలరు సద్జ్ఞానాల ॥ 2694

†— బ్రాహ్మ్య శక్తులు సదా బ్రహ్మ యజ్ఞాలతోఁ
బ్రకృతులై తనరారి పరమేశ్వరేచ్ఛమై
సంజనన శక్తులన్ సకలమ్ములను నిల్పఁ
బుట్టుటల్ పెరుగుటల్ గిట్టుటల్ సాజమై
విశ్వాన వరలఁగా సర్వ శక్తులఁ బెంచు
మన్నులన్ మిన్నులన్ మరుదాగ్ని సలిలాళి
ననలాలలోఁ దనరు నండాండ పిండాండ
బ్రహ్మాండ భాండాలు రాజించఁ దిగ్గతుల ॥ 2695

†(17) విశ్వ సంక్షేమాలఁ బీడించి కీడుగా
నతిగ నమిత్రతల నలరు శత్రు తతుల
నిశ్శేషముగ వధించి నిండు శాంతి కాంతి నిలిపి
నిత్య నవమై నిలుచు సత్య సుమతుల శక్తి
వర్ధిలఁగ జగమందుఁ బరమాత్ముని దివ్య లీల
లనవరతము నడుచుచుండు నతిలోక మహత్త్వాల ॥ 2696

†— సచ్చిదానందాలు సర్వాత్మగా వరల
రక్షణ రూపులై వ్రాలు నవ సుమతులు
అరుణాఽచ్ఛ ఘృణి భరితాఽమృత మహాశక్తి
విశ్వ స్వరూపమై విస్తరిల్లఁగ నిలిచి
జగతి శాత్రవ తతులు విగత శక్తులు కాఁగ
రవికి నూనము కాఁగ సవితథమ్ముగఁ జంపు ॥ 2697

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(18) ముఖ సహితమై వెల్గు మర్మ శక్తులఁ గాంతి
అనిలాలతోఁ గలిసి అంతరిక్షము నిండి
వివిధ వృత్రాఽఽవళుల విలసిల్లి వసు తతుల
వృద్ధి పొందించుచున్ ఋభు గణమ్ము నిల్చి
అఖిల లోకాలలోఁ బ్రాణులన్ గాపాడు
సృష్టి దుష్టతలను జెండాడు సర్వదా ॥ 2698

## సూక్తమ్—90

ఋషిః—నారాయణః
దేవతా—పురుషః
ఛందః—అనుష్టుప్; 16-త్రిష్టుప్

(1) సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వా ఽత్యతిష్ఠద్దశాఙ్గులమ్ ॥ 1009

(2) పురుష[1] ఏవేదం సర్వం యద్భూతం యచ్చ[2] భవ్యమ్ ।
ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతిరోహతి ॥ 1010

(3) ఏతావానస్య మహిమా ఽతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ।
పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ॥ 1011

(4) త్రిపాదూర్ధ్వ[3] ఉదైత్ పురుషః పాదోఽస్యేహాభవత్ పునః ।
తతో విష్వం వ్యక్రామత్ సాశనానశనే[4] అభి ॥ 1012

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. పురుషఽఏవేదం, 2. యచ్చ భావ్యమ్, 3. దూర్ధ్వఽఉదైత్, 4. శనేఽఅభి. (వా.ప్ర.)

(5) తస్మాద్విరాళజాయత విరాజో[1] అధి పూరుషః ॥
స జాతో[2] అత్యరిచ్యత పశ్చాద్భూమిమథో పురః ॥ 1013

(6) యత్ పురుషేణ హవిషా దేవా యజ్ఞమతన్వత ।
వసన్తో[3] అస్యాసీదాజ్యం గ్రీష్మ [4]ఇధ్మః శరద్ధవిః ॥ 1014

(7) తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః ।
తేన దేవా[5] అయజన్త సాధ్యా ఋషయశ్చ యే ॥ 1015

(8) తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః సంభృతం పృషదాజ్యమ్ ।
పశూన్ తాగ్ంశ్చక్రే వాయవ్యానారణ్యాన్ గ్రామ్యాశ్చ యే ॥ 1016

(9) తస్మాద్యజ్ఞాత్ సర్వహుత [6]ఋచః సామాని జజ్ఞిరే ।
ఛన్దాంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మాదజాయత ॥ 1017

(10) తస్మాదశ్వా [7]అజాయన్త యే కే చోభయాదతః ।
గావో హ జజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా[8] అజావయః ॥ 1018

1. విరాజోఽఅధి పురుషః, 2. న జాతోఽఅత్య, 3. వసన్తోఽఅస్యా, 4. గ్రీష్మఽఇధ్మః, 5. దేవాఽఅయజన్త సాధ్యాఽఋషయ, 6. హుతఽఋచః, 7. దశ్వాఽఅజాయన్త, 8. జ్జాతాఽఅజావయ. (వా౹.వ౹.)

(11) యత్ పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కిమస్య కౌ బాహూ[1] కా ఊరూ పాదా ఉచ్యేతే ॥ 1019

(12) బ్రాహ్మణోఽస్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో[2] అజాయత ॥ 1020

(13) చన్ద్రమా మనసో జాతశ్చక్షోః సూర్యో[3] అజాయత ।
ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥ 1021

(14) నాభ్యా[4] ఆసీదన్తరిక్షం శీర్ష్ణో ద్యౌః సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశః శ్రోత్రాత్ తథా లోకాగ్ం[5] అకల్పయన్ ॥ 1022

(15) సప్తాస్యాసన్ పరిధయస్త్రిః సప్త సమిధః కృతాః ।
దేవా యద్యజ్ఞం తన్వానా[6] అబధ్నన్ పురుషం పశుమ్ ॥ 1023

(16) యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః ॥ 1024

1. బాహూ కాఽఊరూ పాదాఽఉచ్యతే, 2. శూద్రోఽఅజాయత, 3. సూర్యోఽఅజాయత, 4. నాభ్యాఽఆసీదన్తరిక్షం, 5. లోకాగ్ంఽఅకల్పయన్, 6. తన్వానాఽఅబధ్నన్. (వా.ప్ర.)

## సూక్తము--90

ఋషి—నారాయణ నామకుఁడైన ఋషి†
దేవత.—మహదాది విలక్షణ పురుషుఁడు†

‡-పురుషసూక్తము-

(1)•గీ॥ పురుషుఁడు సహస్ర శీర్షుఁడై వర సహస్ర
నేత్ర పాదాంచితుండయి నెగడి, భూమి
నంతటం జుట్టుకొనుచుఁ దా నఖిల దేశ
ములను మీరి వసించుచు వెలుఁగుచుండు ॥ 2699

†వ్రాతప్రతి 13వ సంపుటము 247వ పుటలో నీ సూక్తమునకు ఋషి "నారాయణో నామ ఋషిః" అనియు, దేవత "మహదాది విలక్షణ పురుషుడు"గాను వ్రాసి, 155 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతలపట్టికలో "నారాయణుఁడు" ఋషిగాను "పురుషుఁడు" దేవతగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

‡-పురుషసూక్తము-

‡ఈ సూక్తమును బురుష సూక్త మనెదరు. "పురుషుఁ డాదియందు విరాడ్రూపుఁడై యుండెను. వానియందుండి యజ్ఞముల ద్వారా సర్వసృష్టియు నుత్పన్న మైనది." అను విషయమును సూచించుచున్నది. ఇది యొక రీతి సృష్టి క్రమము. ఈ పురుషసూక్తము మొదటి నాల్గు మంత్రముల సార మీ క్రింద వ్రాయఁబడినది. సర్వ వ్యాప్తకుం డగు పరమేశ్వరుఁడు జగత్కర్త. అతని మహత్వ మనంతము. శాశ్వతము. అది నిర్గుణము. ఇఁకఁ బిమ్మట సృష్టి క్రమము వర్ణింపఁబడెను. పురుష శబ్ద వ్యుత్పత్తికై నిరుక్తము-1-13-2,3చూడుముః సర్వము వ్యాపించిన వాఁడు పురుషుఁడు (పురి సంసారే శేతే వర్తతే స పురుషః). ఈ సూక్తము పురుష మేధమును సూచించుచున్న దని యనెదరు గాని నర యజ్ఞ గంధముకూడ నే వేదమందును గానరాదు. కొందఱు విద్వాంసులు ఋగ్వేదములోని 10వమండలము తర్వాతఁ దర్వాతఁ జేర్పఁబడె నని తలంచుచున్నారు. అట్లనుటకుఁ దగిన కారణములు కానరావు. మరి కొందరు అనఁగా 'హాగ్' మొదలగువారు ఋగ్వేదము 10వమండల మతిపురాతన మని నిశ్చయించినారు.• మంత్రములందు గూఢార్థ మున్నంత మాత్రమున నా మంత్రములు నవీనము లనుట హాస్యాస్పదము. ఇంతకంటె గూఢార్థములు వేదమునందుఁ గలవు. "మోక్షముల్లర్" పండితుఁడును "ఋగ్వేదము 10వ మండలము భాషా శైలినిబట్టి చూడ నుపనిషత్తత్త్వము వలె నున్న దను కారణముఁ జూపి యది నవీన మనుట గొప్ప పొరపాటు. మరియు నద్వైత మత ప్రతిపాదకము లగు సిద్ధాంత బీజములు గ్రంథమునం దగుపడినంత మాత్రమున నా భాగము నిన్న మొన్నటిదని త్రోసిపుచ్చుట తగనిపనికాని వేఱొండు కాదు.వేదములోని గొంతభాగము పురాతన మనియుఁ గొంత నవీన మనియు వితర్కించుట సమంజసము కాదు. కావున ఋగ్వేదమునఁ గల మంత్రము లన్నియుఁ బ్రమాణములే" అని వ్రాసి యున్నారు. ఇట్టి విమర్శన లన్నియుఁ బాశ్చాత్యులవేః.(నే.వేం.న.శా.)
•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

•ఈ సందర్భములో శ్రీ నేమాని వారు "ఈ సూక్త భాషా శైలిని జూచియు అందలి యర్థ కల్పనము జూచియు (Dr. Haug) హాగ్ పండితుఁడు బ్రాహ్మణోత్పత్తి యను గ్రంథమం దిట్లు వ్రాసెను." అని వ్రాసి వారే దానిని స్వయముగా కొట్టివేసిరి. శ్రీ హాగ్ "బ్రాహ్మణోత్పత్తి" అను గ్రంథములో వ్రాసిన వాక్యములను శ్రీ నేమానివారు వ్రాయలేదు. (చూ. వ్రాతప్రతి. 13వ సంపుటము. 246వ పుట.)—వ.గో.కృ.

(2)*క॥ ఏ జగము గడచియుండెనో!
యే జగ మాగామి యగుచు [1]హెచ్చు వెలుఁగునో!
యా జగ మెల్ల విరాట్టుగ
భ్రాజిల్లుచు నుండుఁగాదె! పరికింపంగన్ ॥ 2700

*గీ॥ సహజ మైన యవస్థను సన్యసించి
జగదవస్థను బొందుచు సాగు నతఁడు
తాన నా మూల పురుషుండు ఘనతరాఽమృ
తత్వమున కీశుఁ డగుచుండుఁ దత్వ[2] మదియె ॥ 2701

(3)*గీ॥ వర్తమాన భూత భావి జగత్సర్వ
మట్టి పురుషు మహిమె యగుచు నుండు
వాని మహిమకంటె వాఁ డధికుం డగు
నిదియె సుమ్ము! తత్వ మెదఁ దలంప ॥ 2702

*గీ॥ అఖిల భూతాళి తచ్చతుర్థాంశ మగును
మిగిలి యున్న త్రిపాత్స్వమో తగినరూప
మమృత మగుచుండి ద్యోతమానాత్మక మగు
తత్స్వరూపంబునందునఁ[3] దనరి వెలుఁగు ॥ 2703

(4)*గీ॥ ఆ త్రిపాత్పురుషుఁడె బ్రహ్మ యగుసు మరియు
నాతఁ డజ్ఞానహీనుఁడై యమరియుండు
వాని లేశమె మాయను బూని లీల
మరల మరలఁ గనంబడి మెఱయుచుండు ॥ 2704

*గీ॥ ప్రాణ జాతంబులును మరి పర్వతాది
కంబు లెట్లగు నట్టులు కలుఁగఁజేసి
స్వయము దేవాది రూపముల్ బడసి తాను
వివిధుఁడై వ్యాప్తిఁ గాంచుచు[4] వెలుఁగుచుండు ॥ 2705

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. నెసఁగుచుండునో!, (తొ.పా.), 2.తత్వ మరయ, (తొ.పా.), 3.సుస్వరూపంబునందున శోభ గాంచు, (తొ.పా.)
4. గాంచెను వెలుగునటుల. (తొ.పా.).

†(5)*గీ॥ ఆద్య పురుషునివల్ల బ్రహ్మాండ దేహ
మంకురించెను దానిని నాశ్రయించి
పురుషుఁ[1] డొక్కఁడు పుట్టి తాఁ బరము సృష్టి
సకల జీవ శరీరముల్ సలిపి పిదప ॥† 2706

(6)*గీ॥ పురుష హవ్యముచేతనే సురలు యజ్ఞ
మును నొనర్చిరి దానికి ఘన వసంత
మాజ్యమును, గ్రీష్మ మిధ్మము పూజ్య మైన
యా శరద్ధవ్యమును జేసి యమరినారు ॥‡ 2707

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. పురుషుఁడొక్కఁడు జనియించె పరము సృష్టిఁ, జేసి జీవ శరీరముల్ జేసె పిదప. (తా.పా.)

†ఈ మంత్రగతార్థ మంతయు రూపకాలంకారమున వర్ణిత మయ్యెను. అనఁగా సృష్టి వర్ణన మంతయు రూప కాలంకార భూషితము. ఈ మంత్ర మథర్వ వేదమందు (XIX-6) కొలఁది మార్పులతోఁ గలదు. మిగిలిన వేదములందును గలదు. (నే.వేం.న.శా.)

†—దీని తాత్పర్యము—

ఆది పురుషునివల్ల బ్రహ్మాండ దేహ ముత్పన్న మయ్యెను. ఆ విరాడ్దేహము నధికరణముగాఁ జేసికొని తద్దేహాభిమాని యగు నొక పురుషుఁడు పుట్టెను. సర్వ వేదాంత వేద్యుఁ డగు పరమాత్మ స్వకీయ మాయచే బ్రహ్మాండ రూపమును జూచి యట జీవరూపమునఁ బ్రవేశించి బ్రహ్మాండాభిమానియై దేవతాత్మ యగు జీవుఁ డయ్యెను. పిదప నా విరాట్ పురుషుఁ డతిరిక్తుఁ డయ్యెను. తర్వాత భూమిని సృజించెను. పిదప జీవుల శరీరములను సృజించెను. (నే.వేం.న.శా.)

‡భూమిపై దృశ్యము లగు పదార్థ జన్మములు వర్ణితము లయ్యెను. లతలు, గోవులు మొదలగునవి పుట్టినవి. ఆ పురుషుని వల్ల ఘృతము పుట్టినది. (ఉద్భిజ్జములు పుట్టినవి. ఉద్భిజ్జముల సారమే ఘృతము.) వానివల్లనే తర్వాత పక్షులు, మృగములు, సింహములు, వ్యాఘ్రములు మొదలగునవి పుట్టినవి.

జగత్తునకు మూల కారణము పరమాణు వని కణాద న్యాయ శాస్త్ర మతము. కణాదుని పరమాణు వ్యాఖ్యానమును పాశ్చాత్త్యు లగు నాధిభౌతిక శాస్త్రజ్ఞుల పరమాణు వ్యాఖ్యానమును నొక్క రీతిగనే యున్నవి. పదార్థములను విభజించుచుఁ దుదకుఁ విభాగార్హత లేనివానిని పరమాణువు లనెదరు. ఈ పరమాణువులు గుమిగూడిన కొలఁది వానియందు నవీన గుణములు సంయోగముచేఁ బుట్టుటవలన వేర్వేరు పదార్థములు పుట్టుచున్నవి. మనస్సునకు శరీరమునకుఁ బరమాణువు లున్నవి. అవి కలిసి యొక్కచో నుండిన చైతన్య మగును. పృథివి, అప్పు, తేజస్సు వాయువు వీని పరమాణువులు, స్వభావములు వేర్వేరుగ నున్నవి. పృథ్వికి మూల భూత మగు పరమాణువునందు రూపము, రసము, గంధము, స్పర్శము అను నాలుగు గుణములును, జల పరమాణువునందు మూఁడు గుణములును, తేజఃపరిణామమందు రెండును, వాయు పరమాణమందు ఒకే గుణమును నున్నవి. ఇటులే సర్వ జగత్తును సనాది నుండియు సూక్ష్మములు, నిత్యములు నగు పరమాణువులచే వ్యాపింపఁబడినది. పరమాణువులు తక్క జగత్తున కితర కారణము లేదు. సూక్ష్మములు, నిత్యములు నగు పరమాణువు లొకదానితో నొకటి కలియుట కారంభమైన యపుడు సృష్టియందు వ్యక్త పదార్థములు పుట్టును. ఇందు కొక చిన్న కథ చెప్పెదరు- నైయాయికునికి మరణ సమయము తటస్థింపఁగా నీశ్వరుని స్మరింపు మని ఆప్తులు వాని కుపదేశించిరి. అప్పు డతఁడు "పీలవః, పీలవః" "పరమాణువులు, పరమాణువు" లని అనెనట! చూచితిరా! మహాజనులారా! సృష్టి విషయమై యెన్ని యభిప్రాయ భేదము లున్నవో! (నే.వేం.న.శాస్త్రి.)

(7)*గీ॥ అల ప్రజాపతి ముఖ్యు లా యమల ఋషులు
సృష్టి పూర్వజుఁడై పుట్టి చెలఁగు పురుష
రూప పశువున మానస రూప యజ్ఞ
మును నొనర్చిరి విస్తృతామోద మలర ॥ 2708

(8)*గీ॥ సర్వ హుత మైన మానస సవన కర్మ
వలన నాజ్యము దధియును గలుఁగు నట్టు
లఖిల వాయువ్య పశువులు నఖిల వన్య
పశువులున్ గ్రామ్య పశువులు ప్రభవ మందె ॥ 2709

(9)*గీ॥ సర్వ హుత యజ్ఞముననుండి సామ ఋక్కు-
లుద్భవించెను ఛందస్సు లుద్భవించె
నట్టి యజ్ఞమునుండియె యా [1]యజుస్సు
పుట్టియుండి ప్రకాశించెఁ బొలుపు[2] మిగుల ॥ 2710

(10)*గీ॥ అట్టి యజ్ఞమునుండి యే యశ్వములును
గర్దభాశ్వతరంబులు, కాంత దంత
యుత మృగంబులు, గోతతి యతిశయ మవి
భాగములు [3]జన్మ మొందె నా జగతియందు ॥ 2711

(11)*గీ॥ దేవతలు[4] కతివిధంబుల దివ్య పురుషుఁ
గలుఁగఁజేసిరొ? వాని ముఖం బదేదొ?
యెవ్వి బాహువు లయ్యెనో? యెవ్వి యూరు
పాదములొ? యంచుఁ బలికిరి బ్రహ్మ విదులు ॥ 2712

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. యా యజుస్సు, (వ్రా.ప్ర.పా.), 2. పుట్టియుండెనుగాదటె పూజ్యులార! (తొ.పా.), 3. పుట్టియుండెను జగతియందు, (తొ.పా.), 4. ఇక్కడ నింద్రగణమునకుమారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(12)*[1]గీ॥ వర ప్రజాపతి ముఖ మయ్యె బ్రాహ్మణుండు
బాహువులు క్షత్రియుం డయ్యెఁ బ్రజ్వలిలెడు
నూరువులు వైశ్యుఁడై వెల్గె నొనర వాని
పాదములనుండి శూద్రుఁడు పరిఢవిల్లె ॥† 2713

(13)*గీ॥ అల ప్రజాపతి మానస తలమునుండి
చంద్రుఁ డాతని చక్షుఃప్రశస్తి సూర్యుఁ
డాతని ముఖంబునన్ వహ్ని యల మహేంద్రుఁ
డతని ప్రాణంబునన్ వాయు వమరినారు ॥ 2714

(14)*గీ॥ వాని నాభివలన బహుళాఽంతరిక్షంబు
శిరసువలన [2]దివియు శ్రీపద ద్వ
యంబువలన భూమి యతని శ్రోత్రమునుండి
జనన మొందియుండె సౌరు మెఱయ ॥ 2715

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. వర ప్రజాపతి ముఖమున బ్రాహ్మణుండు
బాహువులనుండి క్షత్రియవరుఁడు మరియు
నూరువులనుండి వైశ్యుం డహో యనంగ
పాదములనుండి శూద్రుఁడు పరిఢవిల్లె ॥ (తొలి పాఠము.)

రెండవపాదమున "బాహువుల నుండి క్షత్రియ" అన్నదానిలోని "నుండి క్షత్రియ" అను మాటలను గొట్టివేసి "వరుఁడు మరియు" అను మాటలు శ్రీనేమానివారు కొట్టివేయలేదు. కాని సవరించిన పాదమును పూర్తిగా వ్రాసిరి. "పాదములనుండి శూద్రుఁడు" అనుదానిలోని "నుండి" అను నక్షరాలను నీ పేజీలో నే సిరాతోఁ బద్యములు వ్రాసిరో ఆ సిరాతోనే నిలువుగా రెండు గీతలు గీసి శ్రీనేమానివారు కొట్టివేసిరి. కాని దానికి సవరణను వ్రాయలేదు. (చూ. వ్రాతప్రతి. 13వ సంపుటము. 251వ పుట.) —వ.గో.కృ.

†బ్రాహ్మణుఁడు వేదముల జ్ఞానము గలవాఁ డగుటచేతను మనస్సును ఇంద్రియములను లోఁబరచుకొనెడువాఁ డగుటచేతను పురుషుని ముఖముగాఁ జెప్పఁబడెను. రాజన్యుఁ డనఁగా రాజశ్రేష్ఠుఁడు, యోద్ధ, తమ పరాక్రమమును దెలియఁజేయు ఖడ్గమును, ఈటెను మొదలగువానిని ధరించినవాఁ డగుటచేఁ బురుషుని బాహువులుగాఁ బరిగణింపఁబడెను. పురుషుని యూరువులు శరీరావయవములలో నతిదృఢములైనవిగాన వైశ్యులుగాఁ (వర్తకులు, కృషీవలులు) జెప్పఁబడెను. మీఁదఁ బేర్కొనఁబడిన మూఁడు విధము లగు వారి సేవఁ జేయు శూద్రులు పురుషుని పాదములుగాఁ జెప్పఁబడిరి. "భారత వర్షమున బ్రాహ్మణాది జాతి విభాగ మున్నది." అని వాదించెడు వారీ వేద మంత్రమును మాత్రమే ప్రమాణముగాఁ జూపింతురు. పౌరాణికు లీ మంత్రార్థమును మక్కికి మక్కిగాఁ దమ గ్రంథములయం దెక్కించినారు. కాన విశేషార్థములను దెలియఁజేయక యూరకుండిరి. (నే.వేం.న.శా.)

(15)*గీ॥ సప్త ఛందస్సు లావిధ సవనమునకుఁ
బరిధు లయ్యె సముచ్చయ మిరువదేడు
గాఁ బ్రవర్తిల్ల సురలు తత్కర్మఁ జేయు
చున్ బురుషుఁ బశువుగఁ దాము చూచినారు ॥† 2716

(16)*క॥ దేవులు సంకల్పంబునఁ
బావన యజ్ఞ స్వరూపుఁ బర పూరుషునిన్
భావించుట ధర్మంబులు
వావిరి ముఖ్యంబు లగుచు వర్ధిలుచుండున్ ॥ 2717

*గీ॥ ఎట్టి నాకమందు నెల్ల సాధ్యులు గల
రల విరాట్స్వరూప మైన యట్టి
స్వర్గమును విశేష సత్పురుషావళు
లొందుచున్న వార లంద మొప్ప ॥ 2718

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†—దీని తాత్పర్యము—

†ఈ సాంకల్పిక యజ్ఞమునకు గాయత్ర్యాది సప్త చ్ఛందస్సులు పరిధు లయ్యెను. (ప్రతినిధి భూతము లయ్యెను.) ద్వాదశ మాసములు, అయిదు ఋతువులు, మూఁడు లోకములు, ఈ యాదిత్యుఁడు, ఈ యిరువదియేడును సమిత్తు లయ్యెను. ప్రజాపతి ప్రాణేంద్రియ రూప దేవతలు మానస యజ్ఞమును జేయుచు విరాట్పురుషునె పశువుగా భావించినారు. (నే.వేం.న.శా.)

సూచన—ఈ ఋక్కునకు సాయణాచార్యకృత భాష్య మీ విధముగా నున్నది. "అస్య సాంకల్పికయజ్ఞస్య గాయత్ర్యాదీని సప్త ఛన్దాంసి పరిధయః ఆసన్. ఐష్టికస్యాహవనీయస్య త్రయః పరిధయ ఉత్తరవేదికాస్త్రయ ఆదిత్యశ్చ సప్తమః పరిధిప్రతినిధిరూపః. అత ఏవామ్నాయతే— 'న పురస్తాత్పరి దధాత్యాదిత్యో హ్యేవోద్యన్ పురస్తాద్రక్షాంస్యపహన్తి' (తై.సం.2.6.6.3) ఇతి. తత ఏత ఆదిత్యసహితాః సప్త పరిధయోఽత్ర సప్త ఛన్దోరూపాః. తథా సమిధః త్రిః సప్త త్రిగుణీకృతసప్తసంఖ్యాకాః ఏకవింశతి కృతాః. 'ద్వాదశ మాసాః పంచర్తవస్త్రయ ఇమే లోకా అసావాదిత్య ఏకవింశః' (తై.సం.5.1.10.3) ఇతి శ్రుతాః పదార్థా ఏకవింశతి దారుయుక్తేధ్మత్వేన భావితాః. యత్ యః పురుషో వైరాజోఽస్తి తం పురుషం దేవాః ప్రజాపతిప్రాణేన్ద్రియ రూపాః యజ్ఞం తన్వానాః మానసం యజ్ఞం తన్వానాః కుర్వాణాః పశుమ్ అబధ్నన్ విరాట్పురుషమేవ పశుత్వేన భావితవన్తః. ఏతదేవాభిప్రేత్య పూర్వత్ర 'యత్పురుషేణ హవిషా' ఇత్యుక్తమ్."— భాష్య మీ రీతిగా నుండగా శ్రీనేమానివారు ఏకవింశతి (21) సంఖ్యావాచకము విడిచిపుచ్చి ఇరువదేడు సంఖ్యను బరిగ్రహించిరి. శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసిన తాత్పర్యములో ద్వాదశ మాసములు ఇత్యాది వాక్యము సరిగా వ్రాయక "ఈ యాదిత్యుఁడు" అను పదాలను వాక్యము పూర్తిచేయక వ్రాసిరి. ద్వాదశ మాసములు, అయిదు ఋతువులు, మూఁడు లోకములు, నాదిత్యుని కలుపుచో నిరువది ఒక్కటగును. దీనికి సప్త ఛందస్సులు కలుపుచో ఇరువది యెనిమి దగును గాని ఇరువదియేడు కాదు. (వ.గో.కృ.)

## సూక్తము—90

ఋషి—నారాయణుఁడు

దేవత—పురుషుఁడు

### అర్థాంతరము—1

†(1) అనంతమైన శీర్షాలను ననంతమైన చక్రాలను
అనంతమైన చక్రికారకాత్మకత్వాలను
ఉనికిపట్టుగాఁగ నిలువ నుండు విశ్వ సర్వస్వము
దశ దిశలను వ్యాప్తమ్మై తనరారును బరమాత్మ ॥ 2719

†(2) ఈ పురుష సర్వస్వము నెసఁగు నెల్ల భూతములై
భూతాత్మక రూపములై పూత సత్య తత్త్వమ్మున
ఈశానుండై వరలును సీ విశ్వ మ్మఖిలమ్మును
నన్న శక్తి నుద్భవిల్లు నసాధారణమ్మౌ గతులను ॥ 2720

†(3) ఈ విశ్వ పూరుషుని కెన లేని మహత్వమున
నిఖిల భూత సంచయాల నెగడు జగతి పాదమ్మౌ
ఉత్త మోత్తమ రూపమతత్త్వమ్మునఁ దిరికాలాల
నీ పూరుష దివ్యత్వ మ్మెసఁగు నమృతత్వమ్మున ॥ 2721

†(4) విరాజమాన పురుషున కీ విశ్వమ్మే పాద మౌను
ఈ పాదమె మరల నెసఁగుచుండుఁ దేజమ్మై
పిదప నదియె వరల విభువుగాఁగ వ్యాప్తి చెందె
సాశనముగఁ దనరి అనశనముగ నిలిచి ॥ 2722

†(5) దానివల్ల విరాడ్రూపము తనరారఁగాఁ బుట్టె
అధిపురుషుఁడు విరాజిలెను ఆకసముగ నా పిదపను
అధికాధికమై వరలుచు ననిలమ్మును ననలమ్మును
సలిలమ్మును భూమియు విలసిల్లుచు గోళాలై
అవతరించె నిత్యగతిగ నారంభమునం దంతట
సుర నర రాక్షస తతి చర సంచయాలు పుట్టె ॥ 2723

---

†రచయిత:—వాఙ్మయ మహోపాధ్యాయ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) ఆ పురుషుని కామని ఆజ్యమ్మై తనరంగా
సమిధ కాఁగ గ్రీష్మ మ్మది శరద్ధవిస్సుగాఁగ
ఆ పురుష ప్రదత్తమైన హవిస్సుతో దేవాఽఽళులు
అతివిస్తారమ్ముగాఁగ నలరించిరి యజ్ఞమ్మును ॥ 2724

†(7) ఆది పురుష శక్త్యగ్నిని యజ్ఞమ్మును నొనరించెను
సర్వ సాధ్య శక్తులతో సాధ్యులుగా వెలుఁగొందెడు
దేవాళులు ఋషివరులును నావిర్భావమ్ము చెంది
సృష్టి కార్య యజ్ఞమ్మును జిద్గతి సాగించినారు ॥ 2725

†(8) ఆ సృష్టియజ్ఞాల నఖిలమ్ము ఆజ్యమై
సంభృతమ్మై నిలిచి సర్వ హుత మ్మౌను
సచ్చక్తు లొప్పంగ సద్వాయుతతులతో
బహు ముఖ జ్ఞానాల వర మిథున క్రియలు ॥ 2726

†(9) సర్వ హుతమ్ముగాఁ బర్వు నా యజ్ఞాన
రవితతులు జన్మించెఁ గ్రాలు కాలమ్ముతో
బద్ధమౌ శబ్దాలు ప్రభవించి ఆనంద
కలితమై తనరారఁ గామ కర్మలు పుట్టె ॥ 2727

†(10) ఆది పురుష శక్తి మెయిని అనంతమైన కాంతు లొదవెఁ
గాంతి ద్వయ శక్తులతోఁ గ్రాలె వివిధ గోళమ్ములు
ఆ పురుషుని అతిశక్తిని ఆకాశ మ్మవతరించె
వయోరహితమై తనరుచుఁ బ్రభవింపక ప్రాకృతముగ ॥ 2728

†(11) ప్రశ్నయే ముఖముగా- బాహువుల్ మరుదగ్నులు-
జల మృత్తు లూరువులు- సర్వ సమ సంకలిత
శక్తులే పాదాలు- సర్వాదిపురుషునకు-
బహు రూప కల్పనల వరలు విశ్వ మ్మద్ది ॥ 2729

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) పరతత్వ విజ్ఞాని వరలు ముఖమ్ముగా-
సద్ధర్మ రక్షక క్షాత్రిత బాహువుల్-
బలవర్ధక శక్తి పరఁగునులే ఊరువులై-
విశుద్ధ శక్తులెల్ల వరలు విశ్వ కాల పాదములై ॥ 2730

†(13) ఆది పురుషుని మనసె అలరెఁ జందురిండుగా-
అక్షులు సూర్యుఁడుగ- ఆదిశేషువు శక్తి
అగ్నియున్ ముఖముగాఁ- బ్రాణమ్ము వాయువై-
అలరారె-సృష్టిలో అసలు జన్మము కాఁగ ॥ 2731

†(14) అంతరిక్షమె నాభి అవుచుఁ దనరారఁగా
శీర్ష సచ్చిత్తులే చెలఁగ ద్యోలోకమై
విశ్వ మృన్మండలాల్ వెలయఁ బాదములుగా
శబ్దగ్రాహకములై సకల దిశ లలరఁగా
లోకాల సృష్టించె సాకల్య గతి మీఱ ॥ 2732

†(15) సప్తాఽవరణాల సప్తాఽనిలమ్ములన్
సప్తాఽనలమ్ములన్ సప్త సలిలమ్ములన్
సప్త మృత్‌తతుల• సర్వమ్ము [1]త్రికాలాల
నావిష్కృతమ్మైన ఆ పంచభూతాల
నా సప్త రూపాలు అంతర్హితము లౌను
అన్నియు సమిధలై ఆ ఆదిపూరుషుని
చలన శక్తుల విశ్వ సర్వ యజ్ఞమ్ములో
నతిగరీయ మ్మొచు నలరుఁ దను రూపమై ॥ 2733

†(16) దైవీయ శక్తులను ధర్మాలు తనరారఁ
దొలుత యజ్ఞముచేత నలరె యజ్ఞము సృష్టి
సాధ్య శక్తుల వరలు నసాధ్య దేవాఽఽవళులు
మహితులై అలర దుఃఖ రహితమ్ముగా నుంత్రి ॥ 2734

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•సప్త ఆకాశాలు, సప్త మరుత్తులు, సప్తాగ్నులు, సప్త(సముద్ర)సలిలాలు, సప్తవిధ(ద్వీప)మృత్తులు.
1. త్రికాలాలు=భూత భవిష్యద్ వర్తమాన కాలాలు.

## సూక్తము—90

ఋషి—నారాయణుఁడు

దేవత—పురుషుఁడు

## అర్థాంతరము—2

†(1) అంతు లేని శీర్షాలను అంతు లేని అక్షాలను
అంతు లేని కిరణాలను నంతు లేని చోటులతో
అంతట వ్యాపించి జగతి ననంత రూపమ్ము నంది
వివిధ దశలు మీఱ వెల్గు మూలమ్మై దశ దిశలను
సమిధ కాఁగ విశ్వతస్సర్వమ్మున జీవాత్మయె ॥ 2735

†(2) ఈ జీవాత్మయె సర్వము నెసఁగు భూత సహితమ్మై
తాత్కాలిక సత్యత్వము తనరారఁగ నునికిపట్టు
ఊహామయ భావ్యములై యొనరఁగ నీశానుఁ డౌచు
శాశ్వతంపు టమృతగతి నన్న శక్తి నంతరించు ॥ 2736

†(3) ఎన్నెన్నొ రూపాల నెసఁగు జీవాత్మయే
జగ మెల్ల వ్యాపించు నగణిత విభూతులై
ఏకైక పాదమై యీ సృష్టి వెలుఁగఁగాఁ
బరమాత్మ గగనమ్ము ప్రకృతి సర్వస్వమ్ము
త్రిపాదమ్ము లవుచు దివ్యాఽమృతగతిన్ నిలుచు ॥ 2737

†(4) పరమాత్మ గగనమ్ము ప్రకృతి సర్వస్వమ్ము
మూఁడు పాదాలుగా ముక్కాలముల వరల
నేక పాద మ్మౌచు నిహలై జీవాత్మ
అలరారు వివిధ గతుల నశనాఽనశనము లౌచు
మరల మరల జన్మ మహితమై తనరంగ ॥ 2738

†(5) ఆ జీవాత్మయె సర్వము అలరు విరాడ్రూప మౌచు
అధిపూరుష శక్తి సదా అఖిలమ్మును నడుపుచుండ
నంతరిక్ష గోళాలను ననంత గతుల నొందుచుండి
ఆకాశ మ్మాదిగాఁగ నవతరించు నిఖిలమ్మును ॥ 2739

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) ఆ జీవాత్మయె సృష్టిని సలుపఁగ దివ్యత్వమ్ములు
అనిలము ఆజ్యమ్ము కాఁగ నసలమ్మె సమిధ యౌచు
శర జాలము హవిస్సుగా సర్వ సృష్టి యజ్ఞమ్మునఁ
దనర యజ్ఞమ్మును విస్తార మ్మొనరించు సదా ॥ 2740

†(7) విరాట్‌పురుష మూలమైన విశ్వాధిష్ఠిత జీవ శక్తి
అంతులేని రూపాలను నాకసమున నలరించెను
వాటిలోన దేవతలు వరలు సాధ్య ఋషితతులును
అవతరించి సృష్టి శక్తి సత్యూపయె మ్మొందించిరి ॥ 2741

†(8) సర్వ సృష్టి యజ్ఞమ్మున జగదోజసమ్ము చేయు
జీవాత్మయె పదార్థాలఁ గెలఁగ జనితమునఁ జేయును
వృష శక్తుల నగతతులను విశిష్ట చరిగతులను
వాయ్వాపలు వరలెఁ బ్రిథిలమెయిని నాట్యమ్ముగ ॥ 2742

†(9) శబ్ద శక్తుల తన నా జగద్యజ్ఞాన ఋక్కులు
నవతరించఁగ ననంతర మలరె గానామృతము
ఆ అమృతమునుండి అవతరించె నానందము
ఆనందము మూలమ్మై అలరారెను జీవాత్మయె
సృష్టి రచనా రూప ద్రష్టలై వెల్లి విరియ ॥ 2743

†(10) ఆ జీవాత్మ నిరుపమ్ము లత్యద్భుత శక్తులతోఁ
బ్రకృతి పురుష వీర్య శక్తి ప్రభవించెను విశ్వమ్మున
ఆ శక్తుల లోకాలను నఖిలాంశము లవతరించె
అఖిల జగద్వ్యాప్తమ్ముగ నగణితమౌ ప్రకృతులతో ॥ 2744

†(11) కారణము ముఖ మౌను- క్రిలు బాహు ద్వయము
సృష్టి శక్తులుగాగ- స్థితి శక్తు లూరువులు-
వ్యాప్తి తత్వ శక్తులై వరల నా పాదాలు
ఆ పురుష రూపమ్ము అఖిల విశ్వ మ్మగును ॥ 2745

†రచయిత:- —వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) విశ్వతోముఖుఁడుగా వెలుఁగొందుచున్నట్టి
ఆ దివ్య పూరుషుని అలరు ముఖ నక్షత్రాల
పూర్ణ తేజమ్ముతోఁ బుట్టు బ్రహ్మజ్ఞాని-
విశ్వతో బాహువై వెలుఁగొందుచున్నట్టి
ఆ దివ్య పూరుషుని కగు బాహు తారల శక్తి
విశ్వ రక్షక క్షాత్ర విమల ధర్ముఁడు పుట్టు-
విశ్వ రూపోరువుల వెలుఁగొందుచున్నట్టి-
ఆ దివ్య పూరుషుని అలరు నూరూడుల[1] శక్తి
విశ్వ సౌష్ఠవ కార్య విశిష్ట వైశ్యుఁడు పుట్టు-
విశ్వైక పాదుఁడై వెలుఁగొందుచున్నట్టి
ఆ దివ్య పూరుషుని అమల పాదాబ్జాల
కాంతుల నతిపవిత్ర కర్మ శూద్రుఁడు పుట్టు ॥ 2746

†సీ॥ అసలు బ్రహ్మజ్ఞాని అపుచు బ్రాహ్మణుఁడుగ విశ్వ ముఖమ్ముగా వెలుఁగుచుండు
సత్య ధర్మ ప్రభువు క్షత్రియుఁ డౌచును విశ్వ బాహువులుగా వెలుఁగుచుండు
వ్యాప్త సంక్షేమాల వైశ్యుండు గా నిల్చి విశ్వోరువులుగాఁగ వెలుఁగుచుండు
శుద్ధ పవిత్రత శూద్రుఁడై క్రియలను విశ్వపాదములుగా వెలుఁగుచుండు
గీ॥ విశ్వ పురుషుని రూపమ్ము విపులమైన, వివిధ శక్తుల రిక్కల వెల్గు లలర
సకల లోకాలఁ బ్రాణుల శక్తి తతుల, సృష్టియున్ స్థితి లయముల శిష్ట మౌను ॥ 2747

†(13) చంద్ర శక్తుల మనసు జగతిలోఁ బసరారు
తెగడు రవి శక్తులన్ నేత్రముల్ విశ్వాన
ఆదిశేషాఽగ్నుల శక్తి నలరులే ముఖమ్ము
వాయు శక్తిని దగును ప్రాణమ్ము సృష్టిలో ॥ 2748

†(14) అంతరిక్షమ్ములో అలరుచుండును నాభి
శీర్ష్ణ శక్తులు సృష్టిఁ జెలఁగు తేజాలలో
ముక్కాల[2]రూపాల దిక్కాలముల నొప్పు
మూఁడు కాలాలలో[3] మొనయు మృద్రూపాల
శబ్ద నిశ్శబ్దాల శక్తులను గ్రహియించు
దిశలు శ్రోత్రాలుగా దేవుండు కల్పించె ॥ 2749

---

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఊరు+ఉడుల శక్తి=ఊరూడుల శక్తి. ఉడు=నక్షత్రము, 2. ముక్కాలరూపాలు=భూత భవిష్యద్వర్తమాన కాలాలు, 3. మూఁడు కాలాలు=వేసవికాలము, వర్షాకాలము, శీతాకాలము.

†(15) మూఁడు కాలమ్ములన్* మూఁడు నాభులుఁ గూడి
సప్త ప్రకృతులు మీఁఱ సప్త విధ భేదాలఁ
బరఁగు భూతాలతో వరలుచున్ సృష్టిగాఁ
బెరుగుచున్ విరుగుచున్ కరఁగుచున్ మురుగుచున్
దేవ కృతి యజ్ఞాన దివ్య పురుషుని శక్తి
సృష్టి సర్వస్వమ్ము వెలువొందు సమిధగా
వెలుఁగుగా వెలుఁగొందుఁ జెలఁగుఁ దను రూపమై ॥ 2750

†(16) తొలుత ధర్మము లలర వెలుఁగు యజ్ఞమ్ముతో
యజ్ఞమ్ము నొనరించి అఖిల దుఃఖాపహుల
నంతరింపఁగఁజేసి యమరంగ మహిమత్వ
మా దివ్య శక్తులే అఖిల సృష్టిని సాధ్య
రూపాఽఽపకుల నాకి లోకాఽఽపకులఁ బూర్వ
దేవాళులే నిల్పు జీవ నిమిత్తాల ॥ 2751

## అనువాకః—8; సూక్తమ్—91

ఋషిః—అరుణో వైతహవ్యః
దేవతా—అగ్నిః
ఛందః—జగతీ; 15-త్రిష్టుప్

(1) సం జాగృవద్భిర్జరమాణ[1] ఇధ్యతే దమే దమూనా [2]ఇషయన్నిళస్పదే ।
విశ్వస్య హోతా హవిషో వరేణ్యో విభుర్విభావా సుషఖా సఖీయతే ॥ 1025

(2) స దర్శతశ్రీరతిథిర్గృహేగృహే వనేవనే శిశ్రియే తక్వవీరివ ।
జనంజనం జన్యో నాతి మన్యతే విశ[3] ఆ క్షేతి విశ్యో విశం[4]విశమ్ ॥ 1026

(3) సుదక్షో దక్షైః క్రతునాసి సుక్రతురగ్నే కవిః కావ్యేనాసి విశ్వవిత్ ।
వసుర్వసూనాం క్షయసి త్వమేక[5] ఇద్ ద్యావా చ యాని పృథివీ చ పుష్యతః ॥ 1027

* మూఁడు కాలాలు=భూత భవిష్యద్వర్తమాన కాలాలు.

1. మాణఽఇధ్యతే, 2. దమూనాఽఇషయన్ని, 3. విశఽఆక్షేతి, 4. విశావిశమ్, 5. మేకఽఇద్యావా. (వ్రా.ప్ర.)

(4) ప్రజానన్నగ్నే తవ యోనిమృత్వియమిళాయాస్పదే ఘృతవన్తమాసదః ।

ఆ తే చికిత్ర[1] ఉషసామివేతయో ఽరేపసః సూర్యస్యేవ రశ్మయః ॥ 1028

(5) తవ శ్రియో వర్ష్యస్యేవ విద్యుతశ్చిత్రాశ్చికిత్ర[2] ఉషసాం న కేతవః ।

యదోషధీరభిసృష్టో వనాని చ పరి స్వయం చినుషే[3] అన్నమాస్యే ॥ 1029

(6) తమోషధీర్దధిరే గర్భమృత్వియం తమాపో[4] అగ్నిం జనయన్త మాతరః ।

తమిత్ సమానం వనినశ్చ వీరుధో ఽన్తర్వతీశ్చ సువతే చ విశ్వహా ॥ 1030

(7) వాతోపధూత[5] ఇషితో వశాగ్ం అను తృషు యదన్నా వేవిషద్వితిష్ఠసే ।

ఆ తే యతన్తే రథ్యో౩ యథా పృథక్ శర్ధాంస్యగ్నే[6] అజరాణి ధక్షతః ॥ 1031

(8) మేధాకారం విదథస్య ప్రసాధనమగ్నిం హోతారం పరిభూతమం మతిమ్ ।

తమిదర్భే హవిష్యా సమానమిత్ తమిన్మహే వృణతే నాన్యం త్వత్ ॥ 1032

(9) త్వామిదత్ర వృణతే త్వాయవో హోతారమగ్నే విదథేషు వేధసః ।

యద్దేవయన్తో దధతి ప్రయాంసి తే హవిష్మన్తో మనవో వృక్తబర్హిషః ॥ 1033

---

1. చికిత్రఽఉష, 2. శ్చికిత్రఽఉషసాం, 3. చినుషేఽఅన్నమాస్యే, 4. తమాపోఽఅగ్నిం,

5. వధూతఽఇషితో వశాగ్ంఽఅను, 6. స్యగ్నేఽఅజరాణి. (వ్రా.ప్ర.)

(10) తవాగ్నే హోత్రం తవ పోత్రమృత్వియం తవ నేష్ట్రం త్వమగ్నిదృతాయతః ।
తవ ప్రశాస్త్రం త్వమధ్వరీయసి బ్రహ్మా చాసి గృహపతిశ్చ నో దమే ॥ 1034

(11) యస్తుభ్యమగ్నే[1] అమృతాయ మర్త్యః సమిధా దాశదుత వా హవిష్కృతి ।
తస్య హోతా భవసి యాసి దూత్యముప బ్రూషే యజస్యధ్వరీయసి ॥ 1035

(12) ఇమా[2] అస్మై మతయో వాచో[3] అస్మదాగ్ం ఋచో గిరః సుష్టుతయః సమగ్మత ।
వసూయవో వసవే జాతవేదసే వృద్ధాసు చిద్వర్ధనో యాసు చాకనత్ ॥ 1036

(13) ఇమాం ప్రత్నాయ సుష్టుతిం నవీయసీం వోచేయమస్మా[4] ఉశతే శృణోతు నః ।
భూయా[5] అన్తరా హృద్యస్య నిస్పృశే జాయేవ పత్య[6] ఉశతీ సువాసాః ॥ 1037

(14) యస్మిన్నశ్వాస[7] ఋషభాస ఉక్షణో వశా మేషా అవసృష్టాస ఆహుతాః ।
కీలాలపే సోమపృష్ఠాయ వేధసే హృదా మతిం జనయే చారుమగ్నయే ॥ 1038

(15) అహావ్యగ్నే హవిరాస్యే తే స్రుచీవ ఘృతం చమ్వీవ సోమః ।
వాజసనిం రయిమస్మే సువీరం ప్రశస్తం ధేహి యశసం బృహన్తమ్ ॥ 1039

---

1. మగ్నే ఽ అమృతా, 2. ఇమా ఽ అస్మై, 3. వాచో ఽ అస్మదాగ్ం ఽ ఋచో గిరః, 4. మస్మా ఽ ఉశతే, 5. భూయా ఽ అన్తరా, 6. పత్య ఽ ఉశతీ సవాసాః, 7. శ్వాస ఽ ఋషభాస ఽ ఉక్షణో వశా మేషా ఽ అవసృష్టాస ఽ ఆహుతాః. (వా.వ.)

## అనువాకము—8; సూక్తము—91

ఋషి— వీతహవ్యపుత్రుఁడు అరుణుఁడు†

దేవత—అగ్ని†

(1)*చ॥ అనలుఁడ! స్తోతృ బృందముల యత్యధికం బగు స్తోత్ర మందుచున్
ఘనతర దాతృ మానసముఁ గల్గుచు నుత్తరవేది నన్నముం
గనఁగఁ దలంచి హోతయయి గౌరవ మందుచు దీప్తి నొందు నీ
వనయము యజ్ఞకారకున కింపముగా వెలుఁగొందుచుండవే! ॥ 2752

(2)*గీ॥ దర్శనీయ విభూతియై తగిన యట్టి
యతిథియౌ నగ్ని యజమాన తతి సమస్త
వసతులందున ఘనతర వనములందు
వెలుఁగుచున్నాఁడు తా నెల్ల వేళలందు ॥ 2753

*గీ॥ జన హితాగ్ని సర్వ జనమును వీడక
జనులఁ బొందుచుండు మొనసి తాను
మరియు సర్వ జనుల మర్యాదతోఁ గూడి
వెలుఁగుచున్నవాఁడు విశ్వమందు ॥[1] 2754

(3,4)*సీ॥ అనలుఁడా! బలులందు ఘన బలుం డవుదువు! మేధావి కర్మచే మిగులఁ గవివి!
బహుళజ్ఞుఁడవు! ధన బహు వాసయుత నౌచు నొక్కఁడవై నీవు పెక్కు గతుల
నివసించుచుండువు! నిశ్చల రోదసీ పోషిత వసువుల పూర్ణ శక్తి
శాసించెదవు! ఘృత సహితమై యున్నట్టి యుత్తరవేదిపై నుండె దీవు!
గీ॥ నీదు రశ్మ లుషఃకాంతి నిశ్చల తతి, వలెను సూర్యుని నిష్ప్రప లలిత రశ్మి
జాలముల మాడ్కి సంతత సరస రీతి,దృశ్యమానంబు లగుచుండెఁ దేజరిలుచు ॥ 2755

(5)*గద్యము॥
ఓ యగ్నీ! నీవు వ్రీహి యవాద్యరణ్యములను దహించుటకు విడువఁబడినవాఁడవై స్వయముగ
నాస్యమందు స్థావర లక్షణ రూపాన్నమును విడుచునపుడు, స్తోత్ర పర్యాయ వర్షిత యగు
మేఘునికిఁ జెందిన విద్యుత్తులు ఉషస్సునకుఁ గేతువులయినట్లు నీదు శ్రీలు చిత్రము
లగుచున్నవి ॥ 2756

---

†వ్రాతప్రతి 13వ సంపుటము 253వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వీతహవ్య పుత్రుఁడు అరుణుఁడు"గాను దేవత "అగ్ని"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "అరుణుఁడు"గాను దేవత "అగ్ని"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. "(ఈ పద్యమున చాల పునరుక్తి కలదు)" అని వ్రాతప్రతిలో నీ పద్యముక్రింద (చూ. వ్రాతప్రతి; 13వ సంపుటము- 253వ పుట) శ్రీపామర్తి వెంకటరమణమూర్తి వ్రాసిరి. ఇందలి "జన" శబ్దము పునరుక్తి కాదు. ఏకార్థకము కాదు.

(6,7)*సీ॥ గర్భభూతుని నగ్ని ఘనతరౌషధు[1]లెల్ల నంచితగతిని ధరించుచుండు
మాతృభూతాఽప్పులు ఖ్యాతి గల్గెడునట్టు లనలు పుట్టించుచు నమరుచుండు
మరియు వనస్పతుల్ సురుచిరు నా యగ్ని గనుచు సంతత ప్రీతిఁ గ్రాలుచుండు
గర్భవదోషధీగణము లా యగ్నిని బ్రసరించుచుం డాము మెసలుచుండు
గీ॥ ననల! నీవు వనస్పతి గణముఁ బొందఁ, బోవుసప్పుడు నీ తీక్ష్ణ పూర్ణ తేజ
ములు సురథులను బోలుచు లలిత రీతి, మెచ్చునట్లు పృథక్కుగా వచ్చుచుండు ॥ 2757

(8)*గీ॥ అధిక మేధాకరుని హోత యజ్ఞసాధ
కుని సురాళికి వార్తలఁ గూర్చువాని
శత్రు పరిభావయితను నస్మంత నగ్ని
మేము వరియించుచున్నా మమేయ భక్తి ॥ 2758

*గీ॥ అట్టి యగ్నిని స్వల్ప నౌ హవ్యమందు
ఋత్విజులు వేఁడుచున్నారు తత్త్వ మరసి
యగ్ని కంటెను నన్యుఁడౌ నమర వరుని
వేఁడకున్నారు మిక్కలి వేడ్కతోడ ॥ 2759

(9)*చ॥ పౌరిఁ బొరి దేవతా తతికిఁ బూజలు సేయఁదలంచి మానవుల్
కరము హవిస్సుఁ దాల్చుచుఁ బ్రకామము నీకు నొసంగునప్పుడే
బిర బిర ఋత్విజుల్ సురలఁ బిల్చెడు నిన్ను మహాగ్నిదేవుఁడా!
సురుచిర యజ్ఞ కర్మముల సూక్తుల వేఁడుచునుందురేగదా! ॥ 2760

(10)*సీ॥ హోత్రము నీ దౌను బోత్రము నీ దౌను నేష్టృకర్మముకూడ నీదె యగును
యజ్ఞంబుఁ గోరెడు యజమానునకు నీవె యగ్ని వౌదువుగాని యన్యుఁ డెవ్వఁ
డగ్ని తానేర్చునే! యజ్ఞంబునకు నీవె హేతు వగుదువుగాదె![2] పూత శాస్త్ర
కర్మము నీ దౌదు! కమనీయ బ్రహ్మగా నీవు వెలుంగుచు నిత్య ముందు
గీ॥ వనలుఁడా! యస్మదీయ గృహంబునందు, నమర యజమానుఁడవు! నీవె యగుచునుందు
నీవు లేకుండ నున్నచో నిశ్చయముగ, మాకు యజమానుఁ డెవ్వఁడౌన్ మాన్య! చెపుమ! ॥ 2761

(11)*గీ॥ ఆనలుఁడా! నీకయి యజుఁడు సమిత్తును నిచ్చుచునున్నవాఁ డెలమి హవ్య
మును నొసంగుచునుండె మనుజునికై హోత వగుచు నుంటివి! మరి యమర[3] దౌత్య
మును నొనర్చుచు నుందు! ముదముతో బ్రహ్మవై యజ్ఞమునందున హవ్య వితతి
పరిహితం బటంచును బలుకుచు నుందువు! యజమాన ధర్మంబు నంది నీవు
గీ॥ దేవతా సంతతికి నెల్ల దీవ్యమాన, హవ్యములఁ గూర్చుచుండి యత్యతిశయముగ
విమలమైనట్టి యజ్ఞంబు వేడ్క మీరఁ, జేయుటకుఁ గోరుచున్నావు సిరులు వెలుఁగ ॥ 2762

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఘనత రోషధులెల్ల నంచితగతి ధరించుచుండు. (వ్రా.ప్ర.పా.) 2. ఇక్కడ నిందఱి గణమునకు మూరు "నహ"మ్ము ప్రయుక్తమైనది. 3. దూత్యమును. (వ్రా.ప్ర.పా.)

(12)*గద్యము ॥

జాత ప్రజ్ఞుఁడు వాసయితయు నగు నగ్నికొఱకు స్తుతులు పూజ్యములై మా నిమిత్తము
ధనకామములై మావల్ల బయలుదేరుచున్నవి. ఆ స్తుతు లగ్నిని సంతోష పెట్టుఁగాక!
ఎవ్వి స్వయముగఁ బ్రవృద్ధములైనను మరల వానిని వృద్ధిపరచుచున్నవాఁడై
యగ్ని స్తోతలను గోరుచున్నాఁడు. ఆ యగ్నిని నా ఋగాత్మిక వాక్కులు
సంతసింపఁజేయుఁగాక! ॥ 2763

(13)*గీ॥ అతిపురాతనుఁడై స్తోత్ర మందఁగోరు
నట్టి యగ్నికి నూతన మైన వాక్కుఁ
బలికెదను బ్రీతి నే నల పలుకు వహ్ని
విమల మైనట్టి మనసుతో వినునుగాక! ॥ 2764

*గీ॥ అగ్నిహృదయమందు నానందకందంబుఁ
బుట్టఁజేయఁగలను భూతి నేను
సురుచిరాఽచ్ఛ వస్త్ర శోభిత యగు జాయ
పతి మనస్సుఁ దుష్టిపరచు భంగి ॥ 2765

(14)*గద్యము ॥

ఏ యగ్నియందు సేచన సమర్థాశ్వములు, వృషభములు, స్వభావముచే వంధ్యము లగు
మేషములు, దేవతార్థము పరిత్యజ్యము లగుచు అశ్వమేధమునం దాహుతము
లగుచున్నవో! ఉదకపాయి యగునట్టియు సోమ పృష్ఠుఁ డైనట్టియు నా
యగ్నికి నేను హృదయ కళ్యాణమును జేయుచున్నాను ॥ 2766

(15)*గీ॥ చమసమందు సోమ మమరించునట్టులు,
స్రుక్కునందు ఘృతము నూటి నుంచు
విధము, హవ్య ముఖ్య వివిధ పదార్థాళి
యనల! నీ ముఖంబునందు నిడుదు ॥ 2767

*గీ॥ అన్నదాత సుపుత్రిక మచ్చు కీర్తి
మంతము ప్రశస్త మౌ[1] ధన మెంతయేనిఁ
జింతఁ బాయంగ నా కిలఁ జేర్చి నీవు
సుప్రసన్నుం డవగుమయ్య! సుందరాంగ! ॥ 2768

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ప్రశస్తమౌ. (వ్రా.ప్ర.పా.)

## సూక్తము—91

ఋషి—వీతహవ్య పుత్రుఁడు అరుణుఁడు.
దేవత—అగ్ని

## అర్థాంతరము—1

(1)†జ్యోతిశ్రీవృత్తము ॥•

సంచలన శక్తులన్ సర్వాన వ్యాపించి
మించు దమ జాత మౌ మిత్రాఽనిలాఽఽశిన్ బ్రి
పంచితముగాఁగ విశ్వానన్ మహిత్వాన
నించు హవిషమ్ము కాంతిన్ వర్ధిలంగాను
బ్రాంచిత విభుత్వ వైభావాలు సఖ్యాల
సంచిత మహేష్టి విశ్వాఽగ్నుల్ సువిస్తార
చంచలత సర్వమున్ సౌభాగ్యముల్ నింపు ॥ 2769

†(2) అగ్ని అగ్నిని వెల్గు అగ్ని జలమున నిల్చు
అగ్ని వాయువులను నంతర్గతిని నిల్చు
అగ్ని ఆకాశాన నల మృత్ తతుల నుండు
నేకైక మై అగ్ని యెనఁగు నన్నింటిలో
అతిరస్కృత శక్తి నఖిల ప్రాణుల నిల్చు
నణువణువులో నుండు నంతటన్ దా నుండు ॥ 2770

†(3) దక్షులన్ దక్షుఁడై తనరుఁ గ్రతువులన్ గ్రతువుగాఁ
గ్రాంత రశ్మలలోనఁ గ్రాంత దర్శిగ నిలిచి
వసువులన్ వసువుగా నసమాన గతి సృష్టి
దివి భువుల నన్నిటన్ దేజరిలు విశ్వాన
నేకైక మై నిలిచి యెన లేని శ్రీలతో
నద్భుతముగా నగ్ని అలరారుచుండు లేఁ ॥ 2771

†(4) అగ్ని సర్వ మ్మవుచు నఖిలమ్ము నిండు
విశ్వాన వ్యాపించి విశ్వంభరత మీఱి
అరుణ శక్తుల నొంది అల్ల ఉష రూపాలఁ
గాంతి కిరణాఽవళుల క్రాంత దర్శిత్వాల
నత్యంత పరిశుద్ధ నిత్య శక్తులు క్రాల
మృత్స్థానమునఁ గూడ మించి జన్య మ్మౌను ॥ 2772

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

•"అతిజగతీ"చ్ఛందము (13), సప్తపది.

†(5) అగ్ని కీలులు విద్యుదద్భుత దీప్తులన్
జితాశ్రితచిత్రమై చెలువొందు రశ్మలే
కేతువులుగాఁ దనరి ప్రాతరుషస్సులన్
సర్వ గోళాలలో సకల లత తరు తతుల
జడ పదార్థాలలో జలములన్ జల తీర
ప్రాంతాల విలసిల్లు నంత మెనయని దివ్య
శక్తులన్ ఓషధులు స్వయం పోషక గతుల
నగ్ని రూపమ్ము లే అన్న ముఖములుగాఁగ
అలరారు మేఘాల నగు వర్ష శీలాల
సిరి సంపదలు వెలయఁ జెన్నొందు దివ్యాగ్ని ॥ 2773

†(6) సత్యమే గర్భమై సకల భూతాఽఽవళుల
సంజనిత మై వెల్గు రంజితౌషధులుగా
అప్పు లనిలాలలో నలరారుటయె కాక
బద్ధ విరుద్ధమై వరలెడి పదార్థాల
నోషధీతతులలో నుజ్జ్వల శక్తులన్
విశ్వ వ్యాప్త మ్మౌచు విమల దీప్తుల నగ్ని
సంతరాంతర గతుల వింతగా జన్మించి
సర్వ సమత్వాల సకల భక్షక మౌను ॥ 2774

†(7) అనిలాల కంపాల నద్భుతముగా వెలిఁగి
సర్వౌషధుల నిండి సకలాన్న ములనుండి
అజర మౌ శక్తులన్ అఖిల యానాలతోఁ
గాంతి రథ గతులతోఁ గ్రాంత శక్తుల వరలి
వ్యస్త శక్తుల సమస్త సమిష్టి శక్తుల మీఱ
నక్షయ గతి నగ్ని దక్షతన్ వెలుఁగొందు ॥ 2775

†(8) విశ్వ సృష్టి యజ్ఞాలను విమల మేధ రూప మంది
వెలుఁగొందెడు నగ్ని శక్తి విస్తృతమౌ కార్యాలను
హవి గ్రహీతగాఁగ నిలిచి అత్యంతము పరిభూత మ్మై
మతి రీతుల వృద్ధిపరచి మహిమాన్విత శక్తులతోఁ
ప్రాణుల చైతన్య గతులఁ బ్రభా భాసితములు చేసి
దివ్య జ్ఞానమ్ము మీఱఁ దేజరిల్లు లోకాలను ॥ 2776

†రచయిత:—వాఙ్మయ మహోదధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) వేద లెన్నియున్నఁగాని విశ్వమ్మున వ్యాపించుచు
నగ్ని శక్తి వెల్గుచుండు సప్తరూపపు గతులు మీఱ
మనన శక్తి విశ్వమ్మున మహితమ్మై తనదు రీతి
దివ్య దేవతాళి లెల్లఁ దేజరిల్లు మహా శక్తి
ఆహారమ్మై తనరుచు నమృతత్వము వర్ధిల్లఁగ
నన్నియుఁ గుఱి లౌచు సదా అద్భుతమ్ముగా నిలుచును ॥ 2777

†(10) హోత కార్యము నీదె! ఓ అగ్ని దేవుఁడా!
పోత్రి కార్యము నీదె! పొసఁగు యితు కార్యమ్ము
నేష్ట్ర కార్యము నీదె! నెగడొందు సత్య గతి
నావృతత్వము నీదె! అగ్నీధ్రుఁడవు! నీవె!
అతి ప్రశంసల నొందు నధ్వర్యుఁడవు నీవె!
బ్రహ్మ వౌదువు! నీవె! వరలు యజమానుఁడవు!
గృహ పతివి నీ వౌదు! కెరలు నిర్మాత్ముఁడవు!
దమ రూప శక్తిగాఁ దనరారుదువు! నీవె! ॥ 2778

†(11) అగ్నిశక్తి మర్త్యాళికి నమృతమ్ముగ నలరుచుండు
నమృతుం డౌ దీనిధి కడ హవిస్సుగాఁగ నలరారును
సమిధ కాఁగఁ దనరారును సకల విశ్వమ్మునందు
హోత దేవతాళి మధ్య నొనర దౌత్య గతిని నిల్చి
అధ్వరీయ కార్య మౌచు హవిష్మాళిని నందింతువు!
అతిలోకపు నీ శక్తుల నప్రతిహతిఁ బ్రకటింతువు! ॥ 2779

†(12) అగ్నిరూపముఁ దెల్పు నమృత వాక్కులు సదా
తుష్టి పుష్టుల నిచ్చు సృష్టి వడ ఋక్తతులు
అష్ట వసు శక్తులన్ అఖిల సంపద లలర
వర్ధమానుం డౌచు వర జాతవేదుండు
జ్ఞాన రూపము మీఱ సద్గుణ పుంజాల
సర్వాన సందీప్తి పర్వాల నెలకొల్పు ॥ 2780

†(13) అతిపురాతన మౌచు సత్యాదునిక మౌచు
నిత్యత్వ శక్తిమై సత్య రూపము వెలుఁగ
నర్ధాంగిగాఁ గాంతు లఖిలమ్ము నిండఁగా
నవినాభావ మౌ నతులిత మౌ దీప్త
ఋష్టతల్ తేజాలు నుజ్జ్వలమ్ముగఁ దనర
నాంతరగతులతో నఖిలమ్మునను మండు ॥ 2781

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(14) అశ్వినీగత మౌచు నా మేషమున నలరి
ఉచ్చ శక్తులు మీఱ నుష్ణగతి సరుణుండు
వృషభమ్మునను వరలి వెలయ సోమాఽమృతము
కీలులన్ గేలులన్ గెరలు కాంతుల లీల
నపురూప చారుతరాఽగ్నులన్ హృద్గతుల
నిత్యతన్ దివ్యత్వ మత్యంతమును బొందు ॥ 2782

†(15) చంద్రాఽమృత శక్తి సదమల ఘృతముగా
సౌరాగ్ని సర్వమ్ము జ్వలియించు మహిమమై
అతివిపుల తేజాల నపరిమిత మౌ నగ్ని
సృష్టి వసు శక్తులను వ్యష్టి సమిష్టులుగ
హవిరాస్యమై వెలుఁగ నవిహార్యమై అగ్ని
సద్వీర్య శక్తులన్ జగ మంతటన్ నింపు ॥ 2783

## సూక్తము—91

ఋషి—వీతహవ్య పుత్రుఁడు అరుణుఁడు

దేవత—అగ్ని

### అర్థాంతరము—2

(1)†అరుణశ్రీవృత్తము॥•
శబ్దాఽనిల తరంగాల సదమల మౌ శక్తులన్
అబ్దాఽమృత జలాన్విత యతనపు వర్షాఽచ్ఛ ని
స్తబ్ధా[1]ఽఽత్త హవిషాఫల్ విశద వర యజ్ఞాల ని
శ్శబ్దోత్తమజ మాహాత్మ్య చయములు వర్ధిల్లఁగా ॥ 2784

†(2) అఖిలమౌ లోకాల నఖిల పదార్థాల
ననిలాల సలిలాల నాకసపు మృత్తులన్
అఖిల గృహాలలో నతిథిగా నలరారి
అగ్ని తేజము నిచ్చు నాదుకొను నన్నిటను
జన రంజక మ్మౌచుఁ గనుల రంజక మౌచుఁ
దిమిర భంజక మౌచుఁ దేజమ్ము నొసఁగుచున్
విశ్వ వ్యాప్తమ్ముగా నశ్వి శక్తులు మీఱ
శాశ్వత గతి వెల్గు శర్మ మహత్త్వముల ॥ 2785

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"అష్టి"చ్ఛందము (16). 1, "ద-ధ"ల ప్రాసమైత్రి.

†(3) దక్షత్వముల మహిత దక్ష శక్తిగ వెలిఁగి
కృతువులలోన సుకృతువుగాఁ దనరారి
క్రాంత దర్శులలో మహాకవిగాఁగను వరలి
వసు తతుల వసువుగా వరలుచున్ విశ్వాన
నేకైక శక్తిగా నెసఁగి దివి భువులందు
సిరిసంపదలుగాఁగఁ జెలఁగుచుండును నగ్ని ॥ 2786

†(4) అగ్నియోనిగ నిలువ నఖిల ప్రాణులు పుట్టు
నగ్ని ధారణ శక్తి నఖిల తిమిరము పోవు
సొబగైన ఉషసాశి సూర్య రశ్మలు కాఁగఁ
బృథ్వులన్ దేజాలు పొన రొందు నగ్నులన్
అత్యంత శుద్ధమై నిత్య సత్యత్వాలఁ
బ్రతియుతువులోఁ గూడఁ బ్రాణ శక్తిగ నిలుచు ॥ 2787

†(5) శబ్ద శక్తి పరంపరలు ఝంఝూమారుతముల మీఱ
నీరములను వర్షించెడి వారిదముల తటిల్లతలు
ఉషఃకన్య జండాలై ఉజ్జ్వలముగ వెలుఁగొందఁగ
నఖిలమ్మునఁ బ్రజ్వలిలుచు నాస్యమ్మున జడ పదార్థ
మలరఁగ హవిస్సుగాఁగ నపురూపపు జీవ శక్తి
దివ్యమైన శోభాఽఽఽభలు నవ్య నిత్య కాంతు లీనఁ
జిత్ర వర్ణ సంకీర్ణత చెలఁగ జల మృత్తతులను
నోషధులై స్వయంభువత నుర్వి నభిస్పష్టము లగు ॥ 2788

(6)†దీపితవృత్తము॥*
సత్య శక్తి గర్భ మౌచు సత్వ సలిలమందు నిండి
మృత్యు వొందనట్టి శక్తి మింటి మెఱయు తేజ మౌచు
నిత్యమైన విశ్వరూపి నిర్జర గతు లొందుచుండఁ
బ్రత్యభిజ్ఞమైన దివ్య భవ్య జనని దీప్త మౌను
బ్రత్యయమ్ము దూరమైన ప్రాకృత తిమిరాళు లెల్ల
మత్యరూప[1]తత్త్వ మౌచు మాన్య రహిత శక్తి కాఁగ ॥ 2789

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"అత్యష్టి"చ్ఛందము (17). 1. మతి+అరూప=మత్యరూప.

(7)†జయవృత్తము॥*
ఆనలాఽమలదీప్తిచ్ఛట లనిలమ్ములఁ గంపితమై
ప్రణుతాఽమృత ధారాఽఽవృత రమణమ్మయి రంజితమై
నినదోజ్జ్వల మేఘాళుల నెగడొందఁగ నింగిని దా
జనితమ్మయి సృష్టిష్ఠిగ జ్వలిత మ్మగు దక్షతమై
వినుతాఽజర శక్తిద్యుత విమల మ్మగు రమ్య గతిన్
ఘనతాఽగణితోద్యాఽచ్ఛ జగము దీప్తులమై జయ మౌ ॥ 2790

†(8) మేఘరూపము గతుల మిన్నులన్ వ్యాపించి
కామ రూపాలతోఁ గాంతులన్ వెల్గుచున్
మతి శక్తి హోతగా మహితాగ్నులే మీఱఁ
గాంతు లక్ష్యము లౌచు గగనాన నిగమాల
నుజ్జ్వల వర శక్తి నురుకులన్ బరుగులన్
అంతటన్ దిరుగాడు ననల మనిలము కాఁగ ॥ 2791

†(9) విశ్వ యజ్ఞమ్ములో విమలాగ్ని జాలాల
ఋత్విక్కులై సృష్టి తత్త్వజ్ఞు లలరార
హోత లై జగమందు దాత లై త్రాత లై
అనల శక్తులు వరలు నత్యద్భుతము లౌచు
సర్వభక్షక శక్తి సకలాన వ్యాపించి
సర్వ దక్షత లొనర సర్వ రక్షక మౌచు ॥ 2792

†(10) హోత గత మౌ శక్తి ఒనరఁగా నీ దౌను
పోతవ్య గత శక్తి పొనరఁగా నీ దౌను
నిర్వారహిత రూప మెనలేని నిర్మమత
నీ దౌను విశ్వాన నిత్య సృష్టిని నెఱపు
బ్రహ్మ కృత యజ్ఞాన వరలుదువులే అగ్నిః
గృహపలిగఁ బురపతిగ నిహ పరమ్ములలోన
అఖిల భువనపతిగ నలరుదుః నీ వగ్నిః
నిత్య దమ శక్తులన్ సత్య స్వరూపమ్ముగా ॥ 2793

(11)†ఆ॥వె॥ సృష్టి సమిధ కాఁగ వ్యష్టి సమిష్టులన్
అమృత శక్తి నిత్య హవిసు లగును
హోత వౌచు సృష్టి నుజ్జ్వల దీప్తులన్
అగ్నిః దూత వౌదు వఖిల జగతి ॥ 2794

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యమ, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ధృతి"చ్ఛందము (18). షట్పది.

†క॥ మృతి నొందెడి ప్రాణి తతికి
నతతము దేహాఽనువర్తిఁ జరియించుచు ను
ద్ధృతి నసువుల కృతి ననిలాఽఽ
వృతి గగనాగ్నులు సురూప వేష్టిత మగుతన్. ॥ 2795

(12)†క॥ శబ్దమయమ్మై అనలము
శబ్దమ్మకతాన వెల్గు జాజ్వల్యత ని
శ్శబ్దగ శక్తితతుల మై
నబ్దగ మై దివ్యతత్త్వ యజ్ఞాంగమ్మై ॥ 2796

†క॥ మత భేదము వరలంగా
ఋత ఋక్ తతి వాక్కు లెల్లఁ గృతి సత్యములై
అతులిత సంపద లిచ్చుచు
సతతము మహితాగ్ని శక్తి చదలున వెల్గున్ ॥ 2797

†(13) ఆద్యంతము లేని అగ్ని అతిపురాతన మైన అగ్ని
నిత్య నూతన మ్మౌచును నిగమాగమ వేద్య మౌచు
అఖిల వస్తు సంచయాల నసంఖ్యాక ప్రాణి కోటి
నంతర్గతి నలరుచుండు నంతరంగమందు నుండు
హృచ్ఛక్తిని నజయ్య మై నెసఁగు నగ్ని ఆరకుండ
సర్వమ్మున కధిపతిగా సర్వాత్మగ వెల్గుచుండు ॥ 2798

†(14) అగ్ని శక్తి మేషాదిగ నలరారును వృషభాదులఁ
గీలులతో వెలుఁగంగా జ్వాలల మై దీప్తులతో
జన్మల దేహాదులందు హృన్మతులన్ జజ్వాదుల
సౌర మండలాల వెలుఁగు చారు గ్రహ ఋక్ష తతుల
మండి నిలిచి చెలఁగుచుండి నిండు సృష్టిఁ దనరుచుండి
అఖిలమ్మున కాత్మ వోలె నలరారును నగ్ని సదా. ॥ 2799

†(15) దీప్తులలో నగ్ని శక్తి తేజరిల్లు రీతిగా
ననలమ్మున ఘృత రూప మ్మంతర్గత మౌ భాతిగ
అగ్ని ముఖమ్మందు హవిసు లలరారును విశ్వమ్మున
నతిసూక్ష్మ మ్మౌ గతి మై అతిబృహత్తర వరముగ
నతిలోక ప్రతాపాల నరుణ శక్తి దీప్త మౌచు
నగ్ని నిత్య జ్యోతి కాఁగ నఖండముగ వెల్గొందును ॥ 2800

---

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—92

ఋషిః—శార్యాతో మానవః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—జగతీ

(1) యజ్ఞస్య వో రథ్యం విశ్పతిం విశాం హోతారమక్తోరతిథిం విభావసుమ్ ।
శోచంచుష్కాసు హరిణీషు జర్భురద్ వృషా కేతుర్యజతో ద్యామశాయత ॥ 1040

(2) ఇమమంజస్పాముభయే[1] అకృణ్వత ధర్మాణమగ్నిం విదథస్య సాధనమ్ ।
అక్తుం న యహ్వముషసః పురోహితం తనూనపాతమరుషస్య నింసతే ॥ 1041

(3) బళస్య నీథా వి పణేశ్చ మన్మహే వయా[2] అస్య ప్రహుతా ఆసురత్తవే ।
యదా ఘోరాసో[3] అమృతత్వమాశతాదిజ్జనస్య దైవ్యస్య చర్కిరన్ ॥ 1042

(4) ఋతస్య హి ప్రసితిర్ద్యౌరురు వ్యచో నమో మహ్యరమతిః పనీయసీ ।
ఇన్ద్రో మిత్రో వరుణః సం చికిత్రిరేఽథో భగః సవితా పూతదక్షసః ॥ 1043

(5) ప్ర రుద్రేణ యయినా యన్తి సిన్ధవస్తిరో మహీమరమతిం దధన్విరే ।
యేభిః పరిజ్మా పరియన్నురు జ్రయో వి రోరువజ్జఠరే విశ్వముక్షతే ॥ 1044

---

1. ముభయేఽఅకృణ్వత, 2. వయాఽఅస్య ప్రహుతాఽఆసు, 3. ఘోరాసోఽఅమృతత్వ. (వ్రా.వ్ర.)

(6) క్రీళా రుద్రా మరుతో విశ్వకృష్టయో దివః శ్యేనాసో[1] అసురస్య నీళయః ।

తేభిశ్చష్టే వరుణో మిత్రో[2] అర్యమేన్ద్రో దేవేభిరర్వశేభిరర్వశః ॥ 1045

(7) ఇన్ద్రే భుజం శశమానాస[3] ఆశత సూరో దృశీకే వృషణశ్చ పౌంస్యే ।

ప్ర యే న్వస్యార్హణా తతక్షిరే యుజం వజ్రం నృషదనేషు కారవః ॥ 1046

(8) సూరశ్చిదా హరితో[4] అస్య రీరమదిన్ద్రాదా కశ్చిద్భయతే తవీయసః ।

భీమస్య వృష్ణో జఠరాదభిశ్వసో దివేదివే సహురిః[5] స్తన్నబాధితః ॥ 1047

(9) స్తోమం వో[6] అద్య రుద్రాయ శిక్వసే క్షయద్వీరాయ నమసా దిదిష్టన ।

యేభిః శివః స్వవాగ్ం[7] ఏవయావభిర్దివః సిషక్తి స్వయశా నికామభిః ॥ 1048

(10) తే హి ప్రజాయా[8] అభరన్త వి శ్రవో బృహస్పతిర్వృషభః సోమజామయః ।

యజ్ఞైరథర్వా ప్రథమో వి దారయద్దేవా దక్షైర్భృగవః సం చికిత్రిరే ॥ 1049

(11) తే హి ద్యావాపృథివీ భూరిరేతసా నరాశంసశ్చతురఙ్గో యమోఽదితిః ।

దేవస్త్వష్టా ద్రవిణోదా[9] ఋభుక్షణః ప్ర రోదసీ మరుతో విష్ణురర్హిరే ॥ 1050

---

1. శ్యేనాసోఽఅసురస్య, 2. మిత్రోఽఅర్యమే, 3. మానాసఽఆశత, 4. హరితోఽఅస్య, 5. సహురిస్తన్న, 6. వోఽఅద్య, 7. స్వవాగ్ంఽఏవ, 8. ప్రజాయాఽఅభరన్త, 9. దాఽఋభుక్షణః (వ్రా.ప్ర.)

(12) ఉత స్య న[1] ఉశిజాముర్వియా కవిరహిః శృణోతు బుధ్న్యో[3] హవీమని ।
సూర్యామాసా విచరన్తా దివిక్షితా ధియా శమీనహుషీ[2] అస్య బోధతమ్ ॥ 1051

(13) ప్ర నః పూషా చరథం విశ్వదేవ్యో ఽపాం నపాదవతు వాయురిష్టయే ।
ఆత్మానం వస్యో[3] అభి వాతమర్చత తదశ్వినా సుహవా యామని శ్రుతమ్ ॥ 1052

(14) విశామాసామభయానామధిక్షితం గీర్భిరు స్వయశసం గృణీమసి ।
గ్నాభిర్విశ్వాభిరదితిమనర్వణమక్తో[4]ర్యువానం నృమణా [5]అధా పతిమ్ ॥ 1053

(15) రేభదత్ర జనుషా పూర్వో[6] అంగిరా గ్రావాణ ఊర్ధ్వా అభి చక్షురధ్వరమ్ ।
యేభిర్విహాయా[7] అభవద్విచక్షణః పాథః సుమేకం స్వధితిర్వనన్వతి ॥ 1054

## సూక్తము—92

ఋషి—మనుపుత్రుఁడు శర్యాతుఁడు†

దేవత—విశ్వే దేవతలు

(1)*క॥ సురలార! యజ్ఞ నేతను
వర జనపాలకుని దేవపతి హోతను స
త్వర మహిత దీప్తు నతిథిగ
మెరయుచునున్నట్టి యగ్ని మెచ్చుఁడు! మీరల్! ॥ 2801

---

1. ఉతస్యనఽఉశిజా, 2. నహుషీఽఅస్య, 3. వస్యోఽఅభి, 4. మక్తోఽవానం, 5. నృమణాఽఅధా,

6. పూర్వోఽఅంగిరాగ్రావాణఽఊర్ధ్వాఽఅభి, 7. యాఽఅభవ. (వ్రా ప్ర)

†వ్రాతప్రతి 15వ సంపుటము 261వ పుటలో నీ సూక్తమునకు "ఋషులు మనుపుత్రుఁడు శర్యాతుఁడు"గాను, దేవత "బహు దేవతలు"గాను వ్రాసి, 15b సంఖ్యగల స.పుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "శర్యాతుఁడు"గాను, దేవత "విశ్వేదేవతలు"గ ను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ శుష్కభూతౌషధుల[1] నెల్ల స్రుక్కఁ జేసి
హరిత వర్ణౌషధుల[2] నెల్లఁ గరముఁ దినుచు
కామ వర్షిత కేతువై గ్రాలు వహ్ని
యఖిల యష్టవ్యుఁడై దివ మాశ్రయించె ॥ 2802

(2)*గద్యము॥
దేవ మనుష్యు లుభయులు శీఘ్ర రక్షకుని, ధారయితను, అగ్నిని, యజ్ఞమును సాధించు
వానిగా నొనర్చిరి. ప్రకాశమాన వాయువుయొక్క పుత్రుఁడు పురోహితుఁ డగు
నగ్నిని నుషస్సులు స్వరశ్ములచే నాదిత్యుని వలె నాశ్రయించుచున్నవి ॥ 2803

(3)*గద్యము॥
ఏ కాలమందు భయంకరము లగు నగ్నిజ్వాలలు నాశము నొందుచున్నవో? పిమ్మట మా
ఋత్విజులు దేవతా సంబంధుఁ డగు నగ్నికొఱకు హవ్యము నొసంగఁగలరో? యా
కాలమందు నస్మత్సుత్యుఁ డగు నగ్నికి మా ప్రజ్ఞానములు సత్యము లగుఁగాత
మని కోరుచున్నాము. మరియు మా యన్నాదులు భక్షణార్థము ప్రహితము
లగు నని కోరుచున్నాము ॥ 2804

(4)*గీ॥ అతిశయం బగు దివ మతివ్యాప్త మైన
యంతరిక్షంబు మరియుఁ బర్యంత రహిత
యైన పృథ్వియు యజ్ఞాగ్ని కాదరమున
నమనమును జేయుచుండెను సమత గలిఁగి ॥ 2805

*గీ॥ పిదప నిట్టి యగ్నిఁ బేర్మితో నిందుఁ బ్రిండు
వరుణ దేవ భగులు పరమ సవిత
శుద్ధ బలముఁ గలుఁగు సుర సమూహంబును
దెలిసికొనుచు నుందు రెల్లముగను ॥ 2806

(5)*గీ॥ స్యందన స్వభావ సకలాప్పులు మరుద్గ
ణంబుతోడ వెల్గు డంబు మీర
నా మరుత్తు లెల్ల నతిశయ పృథ్విని
బరిభవించుచుండెఁ బలు విధముల ॥ 2807

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. భూతోషధుల నెల్ల (వ్రా.ప్ర.పా.), 2. వర్ణోషధుల నెల్ల. (వ్రా.ప్ర.పా.)

గీ॥ అల మరుత్తులతోఁ గూడి యమర నాథుఁ
డధిక వేగముఁ బూనుచు[1] నమరుచుండెఁ
జారు శబ్దంబుఁ జేయు పర్జన్యుఁ డల్ల
వానితోఁగూడి[2] తడుపును బహు జగత్తు ॥ 2808

(6)*గద్యము ॥
మేఘమున కావాసభూతులు, అంతరిక్ష సంబంధులు, శంసనీయగతులు, వ్యాప్త మనుష్యులు
నగు మరుత్తులు స్వాధికారకర్మయం దుండిరి. అశ్వములు కల్గు దేవతలతోఁ గూడ
సోమవంతుఁ డగు నింద్రుఁడు చూచుచున్నాఁడు. వరుణుఁడు, మిత్రుఁడు,
అర్యముఁడు, మరుత్తులతోఁ గలిసి చూచుచున్నారు ॥ 2809

(7)*సీ॥ వాసవుం డతినుతి భాసమానుం[3] డౌట బుధులు పాలనమును బొందుచుంద్రు
సూర్యుఁడు సంస్తుతి శోభిల్ల నందరు నద్వస్తు విషయంబు చాలఁ గాంతు
రింద్రుఁడు స్తుత్యుఁడై యెసఁగంగ బలమును నంపంబుగా జను లందఁగలరు
స్తోత లీ యింద్రుని[4] స్తుతి పూజలన్ సుప్రసిద్ధంబులుగఁ జాలఁ జేయుచుంద్రు
గీ॥ యజ్ఞ కర్తలు తమ తమ యజ్ఞ గృహము,లందు నే యజ్ఞము నొనర్ప నతిశయ మగు
ఘనత [5]వసియింతురో! యట్టి కర్మమంను,వజ్రము సహాయపడును[6] నవ్వారి కాఁగ ॥ 2810

(8)*గీ॥ సూర్యుఁ డీ యింద్ర పరమాత్మ శోభవలన
సముచితాశ్వాళి ప్రేరేపణమును జేయు
నెట్టి సురుఁడైన సృష్టిలో హెచ్చు భీతుఁ
డైన దానికిఁ గారణ మగును హరియె ॥ 2811

*గీ॥ కామ వర్షితయై బహు భీముఁ డైన
నింద్ర పరమాత్మవల్లనే యెవ్వఁ డైన
నంతరిక్షంబువల్ల నత్యంత సహన
శీలుఁడై శబ్దమును గడుఁ జేయుచుండు ॥ 2812

(9)*గీ॥ అశ్వములపైని వచ్చెడు నా మరుచ్ఛ
యంబుతో జ్ఞాతిమంతుఁడై యధిక కీర్తి
నెసఁగి సుఖకరుఁడౌ పరమేశ్వరుండు
స్తవ మొనర్చును బుధులకు దివముసుండి ॥ 2813

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. డధిక వేగముఁ జేబుచు, (తా.పా.), 2. వానితోఁ దడపుచుండెను, (తా.పా.), 3. భాసమానుండుకాగ, (తా.పా.), 4. భక్తు లీ యింద్రుని పరమ పూజల సుప్రసిద్ధంబులుగఁ బ్రీతి జేయుచుంద్రు, (తా.పా.), 5.కడక వసియింతురో, (తా.పా.), 6. వజ్రము సహాయమును బొందు నవ్వారిగాగ. (తా.పా.), సహాయము పడును నవ్వారి కాఁగ. (వా్రి.ప్రి.పా.)

*గీ॥ అల మరుత్తులఁ గూడుచు నరులఁ దృంచు
చున్ రణంబున శక్తుఁడై చూడఁబడెడు
రుద్ర దేవునకుం జాల భద్రమైన
స్తోత్రమును బొందఁజేయుఁడీ![1] సూరులార! ॥ 2814

(10)*చ॥ అతిశయ కామవర్షిత, బృహస్పతి, సోమరతుల్, [2]సురల్ సదా
తత మగు నన్నసంపద నితాంతముఁ గూర్చెద రల్ల[3] మౌని తా
మతిని నదర్వముఖ్యుఁడయి మాన్యులఁ[4] దృప్తులుగా నొనర్పఁ ద
త్కృత మగు నిష్టిఁ జేరి విబుధేంద్రులు కార్యము లెల్లఁ జేయరే! ॥ 2815

(11)*గద్యము॥
బహూదకములు గల ద్యావా భూములు యముఁడు, ద్రవిణోదస్సు, అగ్ని, ఋభువులు, రుద్రపత్నులు, మరుత్తులు, రుద్రులు, ఈ విశ్వే దేవతలు నగ్ని చతుష్టయ సహితుఁడగు నగ్ని యా నరాశంస నామధేయాగ్నియందు విష్ణువు స్తోతలచేఁ బూజింపఁబడుచున్నారు ॥ 2816

(12)*గద్యము॥
మరియుఁ గామయమాను లగు ఋత్విజ్ఞుల మహా స్తుతిని నంతరిక్షభవ దేవుఁడు దేవతలకు హవ్య మిచ్చెడు యజ్ఞమందు వినెదరుగాక! దివమున సంచరించెడు సూర్యాచంద్రమస్సులు బుద్ధివలన నీ స్తోత్రమును నాలకించెదరు. కర్మవతి యగు నో పృథ్వీ! ఓ దివమా! మీరు స్తోత్రమును బ్రజ్ఞచేఁ దెలిసికొనుఁడు! ॥ 2817

(13)*గద్యము॥
పూషదేవుఁడు మా జంగమమును విశేషము రక్షించుఁగాక! విశ్వదేవ హితుం డగు నపాన్నపాద్వాయువు యజ్ఞ నిష్కృత్యర్థము రక్షించుఁగాక! సర్వాత్మభూతుఁ డగు వాయువును వననీయుఁడై తెలిసికొనునుగాక! ఓ యశ్వులారా! శుభాహ్వానులై మీరు మా యాగ గమనమందు స్తోత్రమును వినుఁడు! ॥ 2818

(14)*సీ॥ సంసారభయహీన సజ్జనాంతర్వర్తి నతికీర్తి నగ్నిని నాశ్రయించి
యమరపత్నులఁ గూడు సమర మాత దితిని పెమల వాక్యంబుల వేఁడియుండి
రాత్రికిఁ దేజస్సు నాత్రఁ గూర్చెడు చంద్రు నధిక సంస్తవముల నధిగమించి
మానవ ప్రేమను బూనెడు నాదిత్యు సంతసంబున మేము సంస్తవించి
గీ॥ సర్వ పాలకుఁ డౌచు నఖర్వ రీతి, వెలుఁగుచుండెడు నట్టి యా వేల్పు రేని
నతిశయం బగు భక్తిని నాశ్రయించి, వేఁడుచున్నార మెక్కువ ప్రీతిఁ[5] బూని ॥ 2819

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. బొందఁజేయుఁడీ! మీరు సూరులార! (వా.వ్ర.పా.), 2. సోమవరామరుల్ గడున్, (తా.పా.), 3. ఎల్ల దేవులన్, (తా.పా.), 4. మాన్యులగా నొనరించెగాదె. (తా.పా.) 5. ప్రేమఁ బూని. (తా.పా.)

(15)•గీ॥ అంగిరోమహర్షి యజ్ఞంబునం బ్రిత్సుఁ
దగుచు వేఁడుచుండె నమర వరుల
గ్రావ లెత్తఁబడుచుఁ గమనీయ సోమంబుఁ
జూచుచుండు మునులు చోద్య మంద ॥ 2820

•గీ॥ అట్టి గ్రావలఁ బుట్టిన యచ్ఛ శబ్ద
ములను నిందుఁడు హృష్టుఁడై వెలిఁగె వాని
వజ్రము నుదకవంతమౌ పథమునందు
జలము పడున ట్లొనర్చెను శక్తిఁ బూని ॥ 2821

## సూక్తము—92

ఋషి—మనుపుత్రుఁడు శర్యాతుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

(1)†క॥ అనిలము రథమై తనరఁగఁ
బ్రిబుత మ్మౌ యజ్ఞతతుల రాజిత దీప్తిన్
ఘన విశ్వ దేవతాళి హ
రిణుల సురూప మలరారు బుత మౌ శక్తిన్ ॥ 2822

†క॥ బహు దీప్తుల యజ్ఞమ్ముల
ముహుర్ముహుర్జన్మ మంది మూర్తి జ్వాలా
విహిత మ్మై హోత జగతి
మహితపుఁ గేతువుగ గగన మణిగా వెల్గున్ ॥ 2823

†(2) అపురూప మౌ దీప్తి నమల మౌ శక్తులన్
ధర్మ దీపమ్ముగాఁ దనరారు ననలమ్ము
సాధనముగా విశ్వ సర్వస్వమున నిండు
నగ్ని దేహమునుండి ఆత్మ పుత్రుఁడు కాఁగ
అమర తేజము పుట్టి అతిపురోహిత శక్తి
నద్భుత ఫలములన్ అనురూపగతి నిచ్చు
నఖిల లోకమ్ములను సుఖ శాంతు లొప్పార
అత్యంత పరిశుద్ధ మైన జన్మము మీఱ ॥ 2824

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) వాగ్రూపముల నిండు వహ్ని శక్తులు బహుళ
మహితత్వములు మీఱ విహరించు విశ్వాన
దివ్యమై నవ్యమై తేజరిలు దీప్తులన్
అమృతతత్త్వము తనర నసుర శక్తులఁ దునిమి
దశ దిశలలో నిలుచు నిశి రూప దుశ్శక్తు
లన్నింటి విధ్వంస మలవోకగాఁ జేసి
అతిలోక మూర్తిగా నజయ్య శక్తిగా
నక్షయ్యమౌ గతుల నలరుచున్ వెల్గొందు॥ 2825

†క॥ సత్యమ్మౌ గతులు వెలయ
నిత్య మహత్త్వమయ శబ్ద నిశ్శబ్ద తతుల్
మృత్యు విరహిత విశుద్ధ సు
కృత్యమ్ముల నగ్ని విమల ఘృణి తనరారున్॥ 2826

†(4) ఇంద్రుండు మిత్రుండు నెసఁగు వరుణుండు
పరమ పూత సుదక్ష భగుఁడు నాదిత్యుండు
సత్య మాధారముగ సర్వమ్మునను నిలిచి
ఆకసమ్మున వెలుఁగు నలరారు లోకాల
దివి భువు లన్నింటఁ దేజరిల్లుచు నిలుచి
విశ్వ దేవత లౌచు నశ్వి శక్తులు వరల॥ 2827

†(5) అతిప్రకృష్టమ్మైన అతిలోక రుద్ర గతి
మరుదాళి వర్ధిల్లి సలిలాళి సింధువుల
ప్రకృతి పాత్రము లౌచు వరలంగ విశ్వాన
జఠరమై అనలమ్ము జర రహిత రూపాల
గర్జించి జగములోఁ గ్రాలు జయ శక్తులన్
భర్జించి దుష్టాళి నిర్జించు నిత్యమ్ము॥ 2828

†(6) ఆకాశ మనిలమ్ము నల జల మృత్ తతులు
ఆవాసమై నిలిచి అగ్ని వెల్గును సదా।
అర్యమేంద్రులు మిత్రు లమల వరుణుఁడు నా
దివ్య దేవాఽఽవళులు దివులలోఁ దేజరిల
రుద్ర శక్తులు మీఱ భద్రమౌ రూపాల
నియతమౌ కర్మలన్ నిత్యమై వెల్గొందు
సత్యమై విశ్వాన నత్యమలమౌ శక్తి
మత్యమలమౌ దీప్తి మృత్యు రహిత మ్మౌను॥ 2829

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) దశ దిశలం దనరారు తరణి శక్తులు మీఱ
సృష్టిలో యజ్ఞాలు వ్యష్టి సమిష్టులుగ
నింద్ర లక్ష్యమ్ముగా నెనఁగులేః అనలాలు
వజ్ర శక్తుల నిలిచి ప్రకృతి పురుషుల ద్వంద్వ
గతి పడుగు పేకలు గాఁగ వరలుచున్ నింగి
మేఘ జాలము లెల్ల మించు జల పూర్ణ మై
జగతి జలముల నిచ్చి అగణిత మౌ నిత్య
సత్య గతు లొప్పార సర్వ మనల మ్మౌను ॥ 2830

†(8) స్వర్ణ దీప్తులు వెలుఁగఁ బూర్ణ చిన్మయ గతులఁ
బ్రతి దివమ్మున నిలిచి ప్రతి పృథ్విలో నిలిచి
ఆకసమ్మున నిండి అఖిలమ్మునను నిండి
విశ్వ జఠరము కాఁగ విమల మౌ శక్తులన్
సంరక్షణమ్ములన్ సత్కామ పుంజాల
బాధ వేధలు లేని ప్రాణ వాయువు తనర
సూర్యాగ్ని కిరణాలు సృష్టిలో వ్యాపింప
సర్వ తేజశ్శక్తి నదమల మ్మై వరలు ॥ 2831

†(9) వీర వీర్య రూప మైన విమల రుద్ర శక్తు లెల్ల
నగ్ని మూల భూత మౌచు నలరారును విశ్వమ్మున
జనన శక్తి వృద్ధి శక్తి క్షయ లయ రూపాల శక్తి
సహజ మ్మై సర్వమ్మున నిహ పర శివ రూప మౌచు
దివి భువులను దేజమ్మున నవ యశస్వంతమ్ముగ
శత్రు తతులఁ దున్మాడును సదాః శక్తివంత మౌను ॥ 2832

†(10) చంద్రాఽమృత శక్తి మీఱ సర్వ విశ్వ యజ్ఞమ్మున
సచ్చిత్తులు తనరారును నిచ్చ లానందమ్మున
దుర్మార్గగ దుశ్శక్తులఁ దున్మాడుచు దక్షత మై
దుష్ట శిక్షణమ్ము చేసి శిష్ట రక్షణమ్ము చేసి
సృష్టి యజ్ఞమందు ద్వంద్వ పుష్టి శక్తు లొప్పారును
దేవాళుల దివ్య శక్తి తేజరిల్ల విశ్వమ్మున ॥ 2833

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు జల మృత్తులు
వరలు విశ్వ మెల్ల నిండి ప్రభలకుఁ బ్రభ గాఁగ నిలిచి
దివి భువి లోకా లన్నిట దివ్య శక్తి వెలుఁగొందుచు
నాస్య బాహూరువు లలరంగను బాదా లవి
అఖిలమ్మై తనరారెడి ఆ విష్ణు స్వరూపమ్మై
దేవాఽఽళికి సూర్యాఽఽళికిఁ దేజరిల్ల దీప్త శక్తి
వసు సంపద లఖిలములై వరలంగా విశ్వమ్మున
నిత్య స్థితి శక్తులతో సత్య గతుల నొప్పారును ॥ 2834

†(12) ప్రకృతిమాత పుత్రుఁ డవుచు వరలు నంతరిక్షమ్మున
దివి భువులను సర్వమ్మునఁ దేజరిలెడు రవ్యాదుల
దేవ దేవుఁ డైన విష్ణు దేవుఁ డఖిల వ్యాప్తుఁ డౌచు
శబ్ద శక్తు లొప్పారఁగ సర్వమ్మును గ్రహియించును
దీపిత మా కాంతి కాంతి రూపచ్ఛట శబ్ద రతుల
నానందమయుం డౌను నఖిలములన్ లీల కాఁగ ॥ 2835

†(13) వాయు శక్తి వర్ధిల్లఁగ వరలు విశ్వ సర్వస్వము
సర్వ కాల రథమ్మునకుఁ బర్వఁగ రవి చక్ర మౌచు
జల శక్తుల నగ్ని శక్తు లలర మృదాకాశము
లఖిల విశ్వ దేవాఽఽళులు అంతటికిని బాదములై
అత్యద్భుత తేజమ్మై ఆత్మ రూప మౌచు జగతి
రాత్రిందివళులు నిత్యము రాజిల్లును వెల్గులుగా ॥ 2836

†(14) సృష్టి స్థితి లయ గతులను జెందకుండ వెలుఁగొందెడు
పగలు దీప్తి రవి శక్తుల వరలు రాత్రి శశికళలను
దివ్య దేవ శక్తి తతుల తేజమ్ముల కందకుండ
నిశ్చలమై మహితమ్మై నిత్యమ్మై సత్యమ్మై
నిర్వికారమై తనరుచు నిరంజనమ్మై వరలెడి
సచ్చిదానంద మహా స్వరూపమ్మై సర్వ స్తుత్య
మాన మౌచు గాన మౌచు మౌన మౌచు ధ్యాన మౌచు
జ్ఞాన మౌచుఁ జెలువొందును జరాఽచరమ్ములను ॥ 2837

†రచయిత:—వాఙ్మయ మహార్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15) అఖిల లోకావళుల నగ్ని తనరారులే!
అఖిల దిగంతాల నగ్ని తనరారులే!
సృష్టి సర్వస్వమున కిష్టి సర్వమ్మునకు
దివ్య దృష్ట్యధ్వర దీప్త శక్తుల కెల్ల
నందకుండఁగఁ దనరు నమరాగ్ని తతు లెల్ల
మంచి చెడుల సదా! యెంచి సుకృతిదుష్కృతుల
నన్నింటినిన్ గూడ నధిగమించుచు వెల్గి
నంతయు నాకాశ మై అలరఁగా వ్యాపించు ॥ 2838

## సూక్తము—92

ఋషి—మనుపుత్రుఁడు శర్యాతుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

†(1) సృష్టి యజ్ఞ రథము నెక్కి చెలఁగి విశ్వపతి జగాన
సర్వ దీప్తి సంయుతుఁడై సకల శక్తివంతుఁ డౌచు
హరిణ వర్ణ సహిత మైన అఖిల ప్రకృతి సర్వమ్మును
స్థితి శక్తిని రక్షించుచుఁ జిద్గగనపుఁ దేజమ్ముల
జ్ఞాన కేతువై లీలలు సద్గతులను వెల్గొందఁగ
ననల దివ్య దీప్తు లెల్ల నలరు హోత రూప మౌచు ॥ 2839

†(2) ధర్మయుక్త సదమలాగ్ని ధన్య సాధనమ్ము కాఁగ
సృష్టిలోన సర్వస్వము నిష్ఠలతో నిబిడ మౌచు
నిండి వెలిఁగి గూఢ గతుల మండుచుండుఁ గనిపించక
అలరారును నద్భుతముగ నత్యంతము సూక్ష్మగతుల
ఆదిత్యుని అపురూపపు నంతర్గత దివ్యశక్తి
దీప్తు లెల్ల నొప్పారఁగఁ దేజరిలుచు నైజమ్ముగ ॥ 2840

†(3) ఘోర వీర భీతి రూప క్రూరగతులు విస్తరిల్లు
నసుర శక్తు లన్నింటిని నఖిలమ్మున సంహరించి
అపురూపమ్మై వెలిఁగెడి అనాహతపు టఘోరంపు
మహిమాన్విత మనశ్శక్తి విహరించును నెదురు లేక
దైవీయమ్మౌ లీలఁగఁ దనరారఁగ విశ్వమ్మున
సృష్టి సహజ చలన శక్తి చెలఁగ శబ్ద శక్తు లెల్ల ॥ 2841

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4)†శా॥ సత్య మ్మోచును విశ్వమందు సకలాఽఽశా పూర్ణ సందీప్తులన్
నిత్యత్వ మ్మలరారు నీ ప్రకృతి బందీభూత సంశక్తులన్
అత్యంతమ్ము విషాద మోదమయ విశ్వాగ్నుల్ ప్రభావాఽఽచ్ఛమై
కృత్యంతీన పరాత్ పరాఽద్భుత జగత్ కేదారముల్ నిండఁగన్ ॥ 2842

(5)†మ॥ అతి రుద్ర మ్మగు శక్తులన్ మహిత సృష్ట్యగ్నిష్టి సంజాత మౌ
ప్రతులే లేని విశాల విశ్వగత ప్రాభావాఽఽళి దివ్యమ్ముగా
నతులోద్భాసి మహామహిత్వ వర విశ్వాంతర్గతేద్ధ్యమ్ము లై
వితతాగ్నుల్ జగమందు సర్వమునఁ బ్రావృట్ఛక్తులన్ వెల్గెడున్ ॥ 2843

(6)†అష్టపదకందము ॥
మరుదాళులు విశ్వమ్మున
నరిమురి లేనట్టి శక్తి నతిలోక గతిన్
వర దీపితాగ్ని మయమై
వరుణాఽర్యమ మిత్ర దేవ భాగ్యేంద్ర మహా
భరిత మ్మయి సకల జగతి
వర భృతగతిని సువిశాల ప్రకృతి మహా నై
జ రమణ మౌను బవిత్రతఁ
జరాఽచర ప్రపంచమందు సత్యాత్మత మై ॥ 2844

(7)†క॥ సకలాఽఽశాపూర్ణమ్మయి
ప్రకటిత మౌ సృష్టి నెల్ల భాస్వద్గతులన్
వికటాఽవికట మ్మై వి
శ్వ కృతి వికల మవికల మగుఁ బ్రాకృత మౌచున్ ॥ 2845

†(8) రవి శక్తులన్ సృష్టి రాణించు హరిత మై
వచ్చపచ్చఁగఁ బ్రకృతి నిచ్చలున్ వర్ధిల్ల
దివ్య దేవాఽఽవళులు తేజరిల దీప్తులన్
అమర లోకాలలో నమృత శక్తులు వరల
విష్ణు శక్తుల సృష్టి విశ్వమై తనరారు
స్థితి రక్షగా నిలిచి చెన్నొంద నిత్య గతి ॥ 2846

†(9) రుద్ర వీర్య శక్తి తతిని భద్ర మౌను బ్రకృతి యెల్ల
సర్వ మంగళమ్ము కాఁగ సకల విశ్వ మలరుచుండు
దుశ్శక్తుల దోర్బలములఁ దుత్తినియలుగాఁ జేయుచు
సచ్ఛక్తుల సర్వస్వము నిచ్చారతి విజయ మొంద
దివ్య దీప్త తేజమ్ము లదృష్ట శక్తులై వరలఁగ
యశఃపూర్ణమై నిలుచును నాశాపూర్ణమ్ము కాఁగ ॥ 2847

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) సోమాఽమృత మహచ్ఛక్తి సొబగొందఁగ నిత్య రతుల
నద్భుతమతి నలరారఁగ నతిలోకపు జాయ పగిది
యజ్ఞాగ్నులు దంపతులై యజ్ఞ ఫలము ప్రసాదింప
విశ్వ శాంతి సర్వస్వము విమల సంపదాళి నీయ
భక్షణ భక్ష్యాల తత్త్వ మక్షయ గతిఁ బరిఢవిల్ల
దక్షత్వము సృష్టిలోన నక్షరమై అభ్యుదయాల
నిత్య గతులఁ దనరారఁగ సత్య రతులఁ దని వొందుచుఁ
బ్రత్యహమున్ బ్రతిరాత్రియు వరలు సౌరచాంద్రశక్తి ॥ 2848

†(11) రోదోఽంతరాళాన వేదాఽన్విత మ్మొచు
వెలుఁగొందు విష్ణుండు విశ్వ శక్తులు మీఱ
దివి పృథ్వి జాలాలఁ దేజరిల్లుచు సదా।
బహిరంతరములలోఁ బర్వుచున్ సృష్టిలోఁ
జతురంగములు మీఱ సర్వమున్ రూపమై
ముఖ బాహువులు నూరు లఖండ పాదము లలరఁ
బంచ భూతాలతో సంచితమ్మొ సర్వ
భువనాలు నక్షత్ర పుంజాలు చరియింప
విశ్వ సృష్టిని ద్రష్ట విమల గతులను బొంద
నల్ల మరీచి మరుత్తు లమృత రూపము లౌను ॥ 2849

(12)†రాజఫణివృత్తము ।•
అంతరిక్షమ్ములో ననమాన గతులమైఁ
గ్రాంతి తత్త్వమ్ములన్ రమణీయమయి సదా।
కాంతులన్ జిమ్ముచున్ గవి రాజఫణిగ శ్రీ
మంతమై సర్వ శాంభవ శక్తులను సుధీ
మంత భవ్యమ్ము శర్మము శర్వ గతి మహా
దాంత మోదాంత[1] వేదజ శ్యామ తతి జగత్
సాంత శక్తుల్ గభస్తి సూర్య మహిమలన్
వింతలన్ వింతగా నిఖిలాన వెలుఁగులే। ॥ 2850

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
• "శక్వరీ"చ్ఛందము (14). 1. మోదాంత=మోదబద్ధమైన.

†(13) మహాఫణివృత్తము ॥♦
ఆకాశ వాయ్వగ్ను లలర జల మృత్తతులు
ప్రాకామ్య శక్త్యాళి వరలఁగ జగమ్మునను
లోకాల నిత్యాఽఖిరుజతతులఁ దున్ముచును
నాకాఽంచితమ్మైన నవ ఘృణి మహాఫణియె
రాకాంచితోద్భాసి రవి రమణ దీప్తి తతిఁ
బోకార్చి పాపాల భువి దివుల సర్వమున
లోకాఽశ్వి పుంజాల ఋత గతులు నిత్యమయి
ఆ కాల పూషాగ్ని అమల కిరణాల్ వరలు ॥ 2851

†(14) అభయ శక్తులు మీఱ నత్యద్భుతమ్ముగా
నధివసించుచు విశ్వ మఖిలాఽంతరిక్షమున్
అఘ రూపములఁ బాపి అమృత పుణ్యము మీఱఁ
బవలు రాత్రులు మహా పర్వమ్ములై వరల
స్వయం సంచలితంపు సంభార శక్తులన్
ఆదిత్య పతి వెల్గు సపురూపమై నిలిచి ॥ 2852

†(15) విశ్వ లోకమ్ములను విమల జల శక్తులన్
హరియించు "నభి" శక్తి నఖిలమున్ ద్రించుచున్
అక్షయమ్మౌ అక్షి అక్షర శక్తులన్
అఖిల జగత్సృష్టి నద్వరమ్ముగఁ జేసి
అండాండ పిండాండ బ్రహ్మాండ భాండాలఁ
బాలించుచున్ నిత్య పాలకుం డౌను హరి ॥ 2853

†—క॥ గుణ కర్మల శక్తులను న
గణిత మహిత సుకృతమును నఘమయ వికృత మౌ
ప్రఋత విదూషిత ఫలముల
ననవరత మ్మొనఁగుచుండు నంతయుఁ దానై ॥ 2854

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"అతి శక్వరీ"చ్ఛందము. (15).

## సూక్తమ్—93

ఋషిః—తాన్వః పార్థ్యః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—ప్రస్తార పంక్తిః; 2, 3, 13-అనుష్టుప్; 9-అక్షరైః పంక్తిః;
11-న్యంకుసారిణీ; 15-పురస్తాద్బృహతీ

(1) మహి ద్యావాపృథివీ భూతముర్వీ నారీ యహ్వీ న రోదసీ సదం నః ।
తేభిర్నః పాతం సహ్యస[1] ఏభిర్నః పాతం శూషణి ॥ 1055

(2) యజ్ఞేయజ్ఞే స మర్త్యో దేవాన్ త్సపర్యతి ।
యః సుమ్నైర్దీర్ఘశ్రుత్తమ[2] ఆవివాసాత్యేనాన్ ॥ 1056

(3) విశ్వేషామిరజ్యవో దేవానాం వార్మహః ।
విశ్వే హి విశ్వమహసో విశ్వే యజ్ఞేషు యజ్ఞియాః ॥ 1057

(4) తే ఘా రాజానో [3]అమృతస్య మన్ద్రా అర్యమా మిత్రో వరుణః పరిజ్మా ।
కద్రుద్రో నృణాం స్తుతో మరుతః పూషణో భగః ॥ 1058

(5) ఉత నో నక్తమపాం వృషణ్వసూ సూర్యామాసా సదనాయ సధన్యా ।
సచా యత్ సాద్యేషామహిర్బుధ్నేషు బుధ్న్యః ॥ 1059

---

1. సహ్యసఽఏభిర్నః, 2. శ్రుత్తమఽఆవివా, 3. రాజానోఽఅమృతస్య మన్ద్రాఽఅర్య. (వ్ర.ప్ర.)

(6) ఉత నో దేవావశ్వినా శుభస్పతీ ధామభిర్మిత్రావరుణా[1] ఉరుష్యతామ్ ।
మహః స రాయ ఏషతే ఽతి ధన్వేవ దురితా ॥ 1060

(7) ఉత నో రుద్రా చిన్మృళతామశ్వినా విశ్వే దేవాసో రథస్పతిర్భగః ।
ఋభుర్వాజ[2] ఋభుక్షణః పరిజ్మా విశ్వవేదసః ॥ 1061

(8) ఋభురృభుక్షా[3] ఋభుర్విధతో మద [4]ఆ తే హరీ జూజువానస్య వాజినా ।
దుష్టరం యస్య సామ చిదృధగ్యజ్ఞో న మానుషః ॥ 1062

(9) కృధీ నో[5] అహ్రయో దేవ సవితః స చ స్తుషే మఘోనామ్ ।
సహో న[6] ఇన్ద్రో వహ్నిభిర్న్యేషాం చర్షణీనాం చక్రం రశ్మిం న యోయువే ॥ 1063

(10) ఐషు ద్యావాపృథివీ ధాతం మహదస్మే వీరేషు విశ్వచర్షణి శ్రవః ।
పృక్షం వాజస్య సాతయే పృక్షం రాయోత తుర్వణే ॥ 1064

(11) ఏతం శంసమిన్ద్రాస్మయుష్ట్వం కూచిత్ సన్తం సహసావన్నభిష్టయే సదా పాహ్యభిష్టయే ।
మేదతాం వేదతా వసో ॥ 1065

---

1. వరుణాఽఉరుష్య, 2. ఋభుర్వాజఽఋభు. 3. ర్‌ఋభుక్షాఽఋభు, 4. మదఽఆ తే,
5. కృధీ నోఽ అహ్రయో, 6. సహో నఽఇన్ద్రో. (వా.వ.)

(12) ఏతం మే స్తోమం తనా న సూర్యే ద్యుతద్యామానం వావృధన్త [1]నృణామ్ ।
సంవననం నాశ్వ్యం తష్టేవానపచ్యుతమ్ ॥ 1066

(13) వావర్త యేషాం రాయా యుక్తైషాం హిరణ్యయీ ।
నేమధితా న పౌంస్యా వృథేవ విష్టాన్తా ॥ 1067

(14) ప్ర తద్దుఃశీమే పృథవానే వేనే ప్ర రామే వోచమసురే మఘవత్సు ।
యే యుక్త్వాయ పంచ శతాస్మయు పథా విశ్రావ్యేషామ్ ॥ 1068

(15) అధీన్న్వత్ర సప్తతిం చ సప్త చ ।
సద్యో దిదిష్ట తాన్వః సద్యో దిదిష్ట పార్థ్యః సద్యో దిదిష్ట మాయవః ॥ 1069

## సూక్తము—93

ఋషి—పృథుపుత్రుఁడగు తాన్వుఁడు†
దేవత—విశ్వే దేవతలు†

(1,2)*సీ॥ ఆదరముం జూపు రోదసుల్! మీరలు విస్తీర్ణులై కడు వెలుఁగు టొప్పు
నాదరముం జూపు రోదసుల్! మీరలు యువతుల వలె మాకు నుండు టొప్పు
నాదరముం జూపు రోదసుల్! మీరలు శాత్రవ పంక్తిని జంపు టొప్పు
నాదరముం జూపు రోదసుల్! మమ్ముల నెల్ల శత్రువుల• రక్షించు టొప్పు
గీ॥ నెవఁడు శ్రోత, హవిస్సుల నెవ్వఁ డమర, సేవకుఁడుగా మెలంగుచు శ్రేష్ఠుఁ డగునొ!
యట్టి మనుజుఁడు ప్రతియజ్ఞమందు దేవ,తలను దనుపుచునుండెను దత్పరుఁడయి ॥ 2855

1. నృమ్ణామ్. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 13వ సంపుటము 267వ పుటలో నీ సూక్తమునకు ఋషి "పృథు పుత్రుఁడగు తాన్వుఁడు" గాను, దేవత "విశ్వేదేవతలు"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "తాన్వుఁడు"గాను దేవత "విశ్వేదేవతలు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి
• "శత్రువులనుండి రక్షించు టొప్పు" అని శ్రీనేమానివారి భావము.

(3)*గీ॥ ద్యోతమాన గుణాఢ్యులై ఖ్యాత పవన
పతులుగా నుండు మీయొద్ద పరమ ధనము
కలదు, దానిని మా కిండు: వెలుఁగు విశ్వ
లార! యష్టవ్య లగుదురు మీరు తలఁప ॥ 2856

(4)*గద్యము॥
అర్యముఁడు, అప్రతిహతగతిఁ గల వరుణుఁడు, ఋత్విక్ స్తుతుఁ డగు రుద్రుఁడు, పోషయిత
లగు మరుత్తులు, భగుఁడు స్తుత్యులై మనుష్యులకు సుఖమును నిచ్చెదరుగాక! వా రందఱు
నమృత సదృశ హవిస్సునకు నీశ్వరులుగదా! ॥ 2857

(5)*గీ॥ అధిక వర్షణ ధను లైన యిశ్వలార!
మీరు వారికిఁ జెంపిన వారు నుండు!
సూర్య చంద్రులు! మీరలు శోభితాఽంత
రిక్షములఁ గూడి [1]మాకు సంరక్ష నిండు! ॥ 2858

(6)*గీ॥ ఆత్మ తనువులచేతను నశ్వివరులు!
మమ్ము రక్షించెదరుగాక! నెమ్మి మిగుల
మిత్రుఁడా! [2]వరుణదేవుఁడ! మా శరీర
ములను రక్షించెదరుగాకఁ! జెలఁగి మమ్ము ॥ 2859

*గీ॥ ఎవని మీరలు రక్షింతు రెల్ల వేళ
వాఁడు హెచ్చు ధనంబును బడయు వాఁడు
దురితము లతిక్రమించును నిరుదక ప్ర
దేశములఁ[3] బథికుఁడు విధాన దీక్షఁ బూని ॥ 2860

(7)*గీ॥ రుద్ర పుత్రు లశ్విభద్ర రథస్వతుల్
వాయువును భగుం డమేయ దేవ
తలు ధనంబుతోడఁ దనియుచు మా కిల
సుఖము గూర్త్రుగాక! సురుచిరముగ ॥ 2861

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. రిక్షములఁ గూడి మమ్ము రక్షింతురుగాక. (వ్రా.ప్ర.పా. యతిభంగము.). 2. ఇక్కడ "మిత్రుఁడ!" అని ప్రయోగించి "నల"ముగా సరిపెట్టవచ్చును గాని శ్రీనేమానివారు స్వయముగా "మిత్రుఁడా!" అని దీర్ఘాక్షరము వ్రాసి ఇంద్ర గణమునకు మారు "భల"ము ప్రయోగించిరి. (చూ. వ్రాతప్రతి- 13వ సంపుటము. 269పుట.) 3. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణము ప్రయుక్త మైనది.

(8)*గీ॥ ఇష్టి కర్మవలన నింద్రుఁడు భాసిల్లు
నింద్ర! నిన్నుఁ గొలుచు నెల్ల జనుఁడు
యజ్ఞమున వికాస మందుచు మిక్కిలి
వెలుఁగు వాసవుండు[1] వేడ్కతోడ ॥ 2862

*గీ॥ నీదు హరులు బలాఢ్యముల్[2] నీదు సామ
మద్వితీయ మజేయమై యమరుఁగాదె!
తగిన యిష్టి యమానుషముగ వెలుంగు
చుండి దివ్యముగా నుం[3]డఖండితముగ ॥ 2863

(9)*గద్యము॥
ఓ సవిత! (ప్రేరకుఁడా!) నీవు మము లజ్జితులఁగా నొనర్పుము: నీవు ధనవంతు లగు
యజమాన సంబంధు లగు ఋత్విజ్ఞులచే స్తుతింపఁబడుచున్నావు! రథచక్రము
రశ్మిని వలె నింద్రుఁడు వహ్నులవల్లను మాకు బలము తరచు భృశము
గూర్చుఁగాక! ॥ 2864

(10)*గీ॥ రోదసులు! మీరు మిక్కిలి యాదరమున
నస్మదీయ సుపుత్రులయందు మనుజ
సహిత మైనట్టి యశమును జాల నునిచి
వెలుఁగుచుండుఁడు! నే వేళ వివిధ గతుల ॥ 2865

*గీ॥ రోదసులు! మీరు మిక్కిలి యాదరమున
బలముఁ బొందంగ నన్నము కలుఁగనిండు!
శత్రు సంబంధ మైనట్టి చాల ధనము
వలన మా కన్న సంపద కలుఁగనిండు! ॥ 2866

(11)*గీ॥ మమ్ముఁ గామించుచున్ నీవు నెమ్మి మీర
నెచ్చటను నున్న సంస్తోత నిష్టి సభిమ
తార్థసిద్ధికి రక్షింపుమయ్య! నీవు
ప్రజ్ఞచే నన్నెరుంగుము! బలయుత వసు! ॥ 2867

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. వెలుగుచుండు తాను వేడ్కతోడ, (తా.పా.), 2. బలాఢ్యులు, (తా.పా.),
3. ఉండును+అఖండితముగ=ఉం డఖండితముగ. దుస్సంధి.

(12)*గద్యము ॥
సూర్యునియందు విస్తృతము లగు రశ్ముల నభివృద్ధిఁ బొందించునట్టులు, ద్యుతి
రహితము సర్వార్హము నగు రథమును త్వష్ట సంస్కార స్థానమునుండి
ప్రేరేపించు నట్టులును నేతలకు హింసనముగ నున్నట్టి నా స్తోత్రమును
ఋత్విజ్ఞులు వృద్ధిపరచుచున్నారు ॥ 2868

(13)*గద్యము ॥
మాకొఱకు నీయ నున్న ధనముతోఁగూడిన దేవతా స్తుతి దేవతల నిమిత్తము ప్రీతికర మై
ఘటికా యంత్ర మాల వలె మాటిమాటికి మరలుచున్నది ॥ 2869

(14)*గద్యము ॥
దేవతలు పంచశాఖాయుక్తులై యజ్ఞమార్గమునఁబడి వచ్చుచున్నారు. శ్రావిక
గుణయుక్త మగు వారి స్తోత్రమును దుశ్శీలాది రాజుల యెదుటను
ధనవంతుల మధ్యను బ్రకటించుచున్నాను ॥ 2870

(15)*గీ॥ ఘనుఁడు తాన్వానుఁ డను ఋషి కమ్ర ధేను
సప్త సప్తతి యాచించె సకల నృపులఁ
బార్థ్యుఁడును మాయవుండును బరమ ధేను
సప్త సప్తతి నడిగెను జాల భక్తి ॥ 2871

## సూక్తము—93
ఋషి—పృథుపుత్రుఁడు తాన్వుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

†(1) మృద్భూత నారులై సృష్టిలో లోకాలు
రోదసీ సదనాల నాదాలు మీఱఁగా
దివి ఋభులతో సహా తేజరిల్లుచుఁ దిరుగు
అతిలోక పతిశక్తి నారాధనము చేయు
ఆత్మ ప్రదక్షిణ అలరఁ బ్రదక్షిణలు
రక్ష శక్తులు నిత్య ప్రబలమ్ములై నిలువ ॥ 2872

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) మృదూ్రపమౌ ప్రాణి సృష్టి యజ్ఞాలలోఁ
దృప్తిగాఁ బూజించి దేవాళి తనియించి
అత్యంత విస్తృతిన్ నిత్యోత్తమ మ్మైన
సుమనస్సు హవిష మై శుభ సౌఖ్యములఁ గూర్చు
విశ్వ సంక్షేమాల విమల ధర్మము మీఱ
సృష్ట్యాది సృష్ట్యంత్య ఋత కాల పరిమితుల ॥ 2873

†(3) దివ్య దేవ శక్తులతోఁ దేజరిల్లు విశ్వపతియె
విశ్వ మాదిశేష మౌచు విశ్వమే మహస్సుగాఁగ
విశ్వ యజ్ఞ యజ్ఞమ్ముల విమల దీప్తు లొప్పారఁగ
అఖిల లోక వ్యాప్తి నొంది అత్యంత మహత్త్వాల
యష్టవ్యముగా వెల్గును సృష్టి సహజ యజ్ఞ మౌను
నంతరహిత సృష్టి స్థితు లలర లయ రతులు మీఱ ॥ 2874

†(4) నుత శక్తులతోఁ దనరుచు గతి శీలము లై పరలెడి
అనలమ్ములు ననిలమ్ములు నాకాశము జల ప్రవృత్తులు
మందాఽర్యమ మిత్ర వరుణ మత్యుషణ భగులు
రుద్రాధిపు లెల్లరకును ఋత పుణ్యామూర్తి కాఁగ
అమృతాధిపుఁడై వెల్గెడి ఆ దేవుని స్తుతి చేయుట
కాంతి సౌఖ్య సంపదాళి సౌభాగ్య దాయక మౌ ॥ 2875

†(5) జల నాభిని జల శక్తుల నచమలముగఁ జేయునట్టి
అశ్వి రాజ పుంజా లవి అఖిలమ్మునఁ దేజరిలును
సౌర చాంద్ర కాంతి తతులు చారు విశ్వ రూప మ్మై
ఆదిశేషు శక్తులతో ననవరతము బద్ధ మౌను
రాత్రిం బవళులు జగమున రంజిత మై కాల గతుల
నా రోదసి నతి శక్తిని నంతర్గతి నలరారును ॥ 2876

†(6) దివ్య మైన దైవ గుణ మవ్యయ గతి నలరారఁగ
నశ్వి శక్తు లెల్ల సకల విశ్వమునకు శుభము కూర్చు
నతి మిత్రపుఁ దేజమ్ముల నభి వరుణపు శక్తులతోఁ
బటా పంచ లౌకు సర్వ పాపాళులు నశియింపఁగ
సంతోషపు సంరంభపు జగత్కళ్యాణ గతుల
సత్సంగమ మొప్పారును సుత్సవోత్సంగ రతుల ॥ 2877

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) అతిరుద్ర సుశక్తులతో నసమాన మ్మౌ నవ్వల
తేజా లవి జ్వలియింపఁగ దివ్య విశ్వ దేవాళుల
అధిపతిగాఁ గాల రథాధిపతిగ భగుఁడు
విశ్వ వేద శక్తులతో విమల మహత్తరము లైన
ఋభు గణాల పంచభూత ఋత ధనాల సంచయాల
సర్వాత్మక మైన శక్తి సంపదాళి నలరారును ॥ 2878

†(8) అతిలోకమ్మై వెలిఁగెడు నమానుషంపు సర్వ శక్తి
సర్వ కాలములనె కాదు సర్వాఽవస్థలందుఁ గూడ
అలరారెడు నా శ్రీహరి అఖిలమ్మౌ ఋభు గణమ్ములను
అఖిలాఽఖిల లోకమ్ముల ననంత మైన విశ్వమ్మును
జిద్యజ్ఞపు సంగతులన్ జెలువారఁగ శబ్ద కాంతి
శక్తుల సంరక్షించును సంచరింప సర్వస్వము ॥ 2879

†(9) క్రాంతి వాంతి శక్తు లెల్లఁ గ్రాల జగద్దీప్తము లై
శబ్ద నిశ్శబ్ద శక్తి సర్వస్వము రూపము లై
వరలఁగ నాదిత్య దేవుఁ డలరారును దివ్య శక్తి
కాల చక్రాగ్ని చయ కాంతి జాల మెల్ల వెలుఁగ
ఆదిశేష రూప మైన అహి దీప్తులు వ్యాపింపఁగ
మహా మహిత మౌను సృష్టి సహాయతా రహిత మైన
మహావిష్ణు మహాశక్తి మహిమాగ్నిగ నిత్య సత్య
సహిత మ్మై మహిత మ్మౌ విహిత మ్మౌ సుహిత మ్మౌ ॥ 2880

†(10) ధాత సృష్టిగా నిలిచెడి ద్యావా పృథ్వ్యాదు లెల్లఁ
బంచ భూతములను దగు నుదంచిత గోళా లవి
ఆధిపత్య శక్తులతో నాకసమ్ము నందు నలరు
సృష్టిలోన సంపదాళి సంజననపు సంవర్ధన
సంశక్తులు సాజము లై సదా వరలుచుండంగా
సవాంఛనీయ శక్తి తతులు నసమర్థత నశియింపఁగ ॥ 2881

†(11) వసు శక్తులు విశ్వమ్మున నసమానపు సంపద లై
ప్రకృతిలోన సాజముగాఁ బ్రాకృత గతి వెలుఁగొందఁగ
విజ్ఞానము గర్భిత మై విశ్వరూప మై తనరును
స్థితి శక్తుల గతి శక్తుల మతి శక్తుల ఋత శక్తుల
సంచరింప సర్వస్వము జగద్రక్షణమ్ము చేయు
జగద్వ్యాపకుం డౌచును జగదీశుం డై వెలుఁగును ॥ 2882

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) సూర్య దీప్తి సర్వస్వము సృష్టిలోన వ్యాపింపఁగ
నవినాశమ్మైన కాంతు లవిరళమై ప్రసరింపఁగ
ప్రాణి కోటు లెల్ల సదా పరమ భద్రగతులఁ దిరుగు
నిరాటంకమైన గతుల నరాతి శక్తులన్ దున్ముచుఁ
బరాభూతమ్ము కాక పరాక్రమించి విక్రమించి
సంవననపుఁ గ్రమ గతులను సక్రమముగఁ దనరారుచు
నక్రమ రాహిత్య మొప్ప నతిలోకపుఁ గ్రమశిక్షణ
నసమానమ్మై వరలును నజయ్యంపు హరి శక్తుల ॥ 2883

†(13) జగద్ దివ్య శక్తు లొప్ప సౌర దీప్తి సర్వస్వము
నుజ్జ్వలమై ప్రజ్వరింప [1]సృష్టి యెల్ల సప్త శక్తుల
నలరారును నద్భుతముగ నతిలోకపు గుణగతులను
నంతరిక్ష మలరుచుండు నాకర్షణ వికర్షణల
నఖిల గోళ లోకా లవి అడుగు తప్పకుండఁ దిరుగుఁ
గాంతి దీప్తి శబ్ద శక్తి క్రాలంగా విశ్వమ్మున ॥ 2884

†(14) విశ్వ సృష్టి సర్వస్వము విమల పంచ భూతాలను
అనేకమైన శతతత్త్వము లలరారఁగఁ బ్రభవించును
సంచరించు సంచలనపు శబ్ద శక్తు లెల్లఁ బ్రబల
నఘ రహితమ్మై వరలుచు మఘయుక్త సుసంపదాళి
అంత మెనయకుండఁ దనరు నాకాశమునన్ మహితపు
సంచలనపుఁ గ్రీడలతో సంచరించుచుండు సదా ॥ 2885

†(15) సప్త విధములై వరలెడి సకల భూత పంచకమ్ము
ఒక్కొక్కటి పది రూపుల లెక్కించఁగ డెబ్బదిగా
దశ దిశలను విశ్వ సృష్టిఁ దనరారును బహు గతులను
సద్యోజాతమ్ము కాఁగ సద్యోదీర్ఘమ్ము కాఁగ
సద్యోవిశాల మౌచు సద్యస్సంవర్ధకముగ
మాయాఽఽవృతమ్ము కాఁగ మహావిష్ణు మాయ యౌచు ॥ 2886

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. "ఉ-ఋ"లకు యతిమైత్రి. (చూ. పీఠిక.)

## సూక్తము.—93

ఋషి—పృథుపుత్రుఁడు తాన్వుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

†(1) మృజ్జలమ్ములు ననలానిలమ్ములు
మిన్ను రూపమ్ములున్ గలియుచున్ బహురీతి
దివి పృథ్వీ లోకాలు రకరకాలుగ సృష్టిఁ
దేజరిలు వేలాది రూప నామాలతో
వివిధ శక్తులు వెలయ వెల్గొందు దేవాళి
నవనవ్య రీతులన్ రక్షించుచుండులే!
చరము నచరమైన జడము నజడ గతుల
సంరక్షణముఁ జేయుఁ బ్రాక్కృత చరాచం ॥ 2887

†(2) మృత్ప్రాయమై పుట్టి మిత్తి మాయుచు లోఁగు
మానవాళులు చేయు మహిత యజ్ఞావళుల
దేవతలఁ దృప్తిమైఁ దేజరిలఁ జేయుదురు
అతి నిర్మల వ్యోమ నత్యుత్తమ వ్యోమ
అతి దీర్ఘ మౌ మనసు నపురూప శక్తులన్
యజ్ఞ రహితమ్ముగా నజ్ఞానముల దుల్చి
ఆవిష్కృతము కాఁగ నఖిల జ్ఞానమ్ములున్
సర్వ ప్రాణులు దివ్య శక్తులన్ దన్యమౌ ॥ 2888

†(3) సర్వ దేవతాళులందు సకలాధిపుఁడై వెల్గుచు
నఖిలమ్మున నలరుచుండు నా దేవ దేవుఁ డెలమి
విశ్వ సృష్టి నెల్లఁజేసి విశిష్టముగ నిల్పి పెంచి
విశ్వోత్సవమై వెలుఁగఁగ విశ్వాంతర్యామిగాఁగ
సృష్టి యజ్ఞ పరంపరలఁ జెలఁగు యుష్టప్య గతుల
నిత్య సత్యమౌ సృష్టి అనిత్య మసత్యమ్ముగాఁగ ॥ 2889

†(4) చంద్రమస్సుల అమృత శక్తులతోఁ బంచభూత
సంచయాలు వరలుచుండు సకలరూప మందుచుండి
రుద్రశక్తు లొప్పారఁగ రోదసి దేవాళు లెల్ల
నమరత్వమ్మున వెల్గుచు రతులితమౌ శక్తులతో
భగుఁడౌ నాదిత్య శక్తి వరలంగా విశ్వమ్మున
వసు సంపద లశ్వ గతులు ప్రబలమౌ లోకాలు ॥ 2890

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) సౌర శక్తు లొప్పారఁగ సర్వ సృష్టియంప సర్వ
జలధారలు కురియుచుండుఁ జడలున మొయిళులు క్రమ్మఁగ
ఆదిశేష మహాశక్తు లపురూపపు దీప్తులతోఁ
బంచభూతతత్త్వాలను బదిలమ్ముగ నడుపు చేసి
విశ్వ ధార వాహక మై విష్ణు దేవ దేవు మహిమ
విశ్వాత్మగ వెల్గొందును వెలుఁగు సృష్టి స్థితి లయాల ॥ 2891

†(6) విష్ణ్వాదిత్యుని శక్తుల విమలమ్మౌ నాదిశేష మహిమమై
అగణితమౌ ఫణ తతు లవి నపురూపపు శక్తులతో
అఖిలమునకు రక్ష కాఁగ నా శ్రీహరి దక్షతమెయి
దురితాంధక రూపు మాపి దుర్విదగ్ధమౌ దీప్తుల
మిత్ర వరణ శక్తులతో మైత్రి సనిల మృత్ తతు లవి
దివ్య దీప్తు లొప్పారఁగఁ దేజరిలును శుభచయాలు ॥ 2892

†(7) రుద్ర శక్తు లొప్పారఁగ రోదసి తేజాలు నిండ
విశ్వ కాల చక్రమ్ములకు విశ్వ దేవాళులకును
అధిపతిగాఁ దనరారెడు నల్ల భగుండౌ సవితయె
ఋభు గణమ్ము లన్నింటిని ఋక్షమ్ముల రక్షణమై
ఋత గతులను దనరారుచు నతులితమౌ సంపత్తుల
అభివృద్ధికరమ్ముకాఁగ నభ్యుదయ మ్మొందించును ॥ 2893

†(8) ఋభు గణముల సృష్టించును ఋతదీప్తులు పెంపొందఁగ
గోళా లవి సంచరించి గో శక్తుల గానావళి
సృష్టి సహజమై వెలయఁగ జేజేలకు జేజేలై
తేజరిల్లు శక్తులతో దివ్యత్వము తనరంగా
శ్రీహరి వెల్గొందు సచ్చిదానందరూపుండై
మహావిష్ణు మాయ కాఁగ మహిమాన్విత లీల కాఁగ ॥ 2894

†(9) దేవ దేవుఁడైన విష్ణు దివ్య శక్తి మీఱ సవిత
అతిలోకపు శక్తు లొప్పు నాదిత్యుని మహత్త్వాన
సౌర మండలాల నెల్లఁ జద లంచెడి చక్ర గతులఁ
గ్రాంతి కాంతి దీప్తు లొప్పఁ గ్రాలు మేఘ మాల లెల్ల
నంతర్గత మౌచు నగ్ని అలర సలిల మాకసమున
నవతరించుఁ జిత్రమ్ముగ నఖిల లోకములను నిలుచు ॥ 2895

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) ఆ విధాత మహితశక్తి నావిష్కృతమై వరలెడి
దివి భువి లోకాలు జగతి దివ్యగతులఁ దనరారఁగ
విశ్వ సృష్టి వీర శక్తి విస్తృత గతి వ్యాప్తి చెంద
సహజ సంపదాళు లెల్ల సకలమ్మున సంగతమై
పాలితమై జగ మెల్లను బ్రాభావిత పాలక కృతి
సర్వ రూప శత్రుతతుల సంహారము గావించును ॥ 2896

†(11) దివ్య లోక దీప్తు లెల్లఁ దేజరిలుచు విశ్వ సృష్టి
వసు శక్తుల విజ్ఞానము ననమ్ముగ విస్తరిల్ల
అఖిల జగతి రక్షకమై అమర దేవ దేవ శక్తు
లలరారఁగ నఖిలమ్మును జెలువొందును బోధ రతుల ॥ 2897

†(12) సౌర శక్తు లెల్లఁ గ్రమత జల శక్తుల స్వీకరించి
పంచ భూత లోకమ్ములఁ బ్రపంచితమ్ము చేసి నిలిపి
కర్మమ్ములు ఫలితమ్ములు క్రాల నవినాభావగతుల
దీప్తమైన గమనాలను దివ్యలోక సృష్టి తనరు ॥ 2898

†(13) ఆకర్షణ శక్తులతో నంతరిక్షమందు నలరు
దివ్య గోళ సంచయాలు తిరుగు నుదయాస్తమయాల
అమలమైన తేజమ్ములు నఖిలమ్మునఁ బ్రసరించుచు
విశ్వ దీప్త దీపములై విరాజిలును శుభ రతులను ॥ 2899

(14)†క॥ అంత మ్మెనయని గగన మ
నంత మగు సుదీప్త కాంతు లనవరతమ్మున్
వింతగ విరఁజిమ్ముచును ని
తాంత చలన శక్తు లలర నమృతకరమ్మై ॥ 2900

†క॥ వందలు వందలుగఁ దగు న
నిందిత పథములను దిరుగు నిఖిలోడు తతుల్
చిందర వందర కాక అ
మంద చలన గతులఁ దగుఁ గ్రమ మహిత శిక్షన్ ॥ 2901

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15) సప్త సంఖ్యాత్మక సర్వాఽఽకాశాలు
సప్త సంఖ్యాత్మక సర్వాఽనిలమ్ములున్
సప్త సంఖ్యాత్మక సకలాఽనలమ్ములున్
సప్త సంఖ్యాత్మక సకల సలిలమ్ములున్
సప్త సంఖ్యాత్మక సకల మృత్ తతులున్
దశ విధ భేదాలఁ దనరారఁ దత్త్వాల
వివిధ లోకాఽఽవళులు విలసిల్ల విశ్వాన
సర్వమున్ నడుపుచున్ సర్వేశ్వరేశ్వరుఁడు
అడుగడుగునన్ సదా! అప్పటి కప్పుడే
పుట్టుచున్ రాజిల్లి పువ్వులై వ్యాపించుఁ
గాంతు లెల్లను మీఱఁ గ్రాలు లే! యీ సృష్టి
దేవుండు లీలగా సృష్టి సారించఁగా ॥ 2902

## సూక్తమ్—94

ఋషిః—అర్బుదః కాద్రవేయః సర్పః
దేవతా—గ్రావాణః
ఛందః—జగతీ; 5,7,14-త్రిష్టుప్

(1) ప్రైతే వదన్తు ప్ర వయం వదామ గ్రావభ్యో వాచం వదతా వదద్భ్యః ।
యదద్రయః పర్వతాః సాకమాశవః శ్లోకం ఘోషం భరథేన్ద్రాయ సోమినః ॥ 1070

(2) ఏతే వదన్తి శతవత్ సహస్రవదభి క్రన్దన్తి హరితేభిరాసభిః ।
విష్ట్వీ గ్రావాణః సుకృతః సుకృత్యయా హోతుశ్చిత్ పూర్వే హవిరద్యమాశత ॥ 1071

(3) ఏతే వదన్త్యవిదన్ననా మధు న్యూంఖయన్తే[1] అధి పక్వ ఆమిషి ।
వృక్షస్య శాఖామరుణస్య బప్సతస్తే సూభర్వా వృషభాః ప్రేమరావిషుః ॥ 1072

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఖయన్తేఽఅధి పక్వఆమిషి. (వా.ప్ర.)

(4) బృహద్వదన్తి మదిరేణ మన్ద్రేణేన్ద్రం క్రోశన్తోఽవిదన్నవా మధు ।
సంరభ్యా ధీరాః స్వసృభిరనర్తిషురాఘోషయన్తః పృథివీముపబ్దిభిః ॥ 1073

(5) సుపర్ణా వాచమక్రతోప ద్యవ్యాఖరే కృష్ణా[1] ఇషిరా అనర్తిషుః ।
న్యంఙ్ని యన్త్యుపరస్య నిష్కృతం పురూ రేతో దధిరే సూర్యశ్వితః ॥ 1074

(6) ఉగ్రా[2] ఇవ ప్రవహన్తః సమాయముః సాకం యుక్తా వృషణో బిభ్రతో ధురః ।
యచ్ఛ్వసన్తో జగ్రసానా[3] అరావిషుః శృణ్వ[4] ఏషాం ప్రోథథో అర్వతామివ ॥ 1075

(7) దశావనిభ్యో దశకక్ష్యేభ్యో దశయోక్త్రేభ్యో దశయోజనేభ్యః ।
దశాభీశుభ్యో[5] అర్చతాజరేభ్యో దశ ధురో దశ యుక్తా వహద్భ్యః ॥ 1076

(8) తే[6] అద్రయో దశయన్త్రాస[7] ఆశవస్తేషామాధానం పర్యేతి హర్యతమ్ ।
త[8] ఊ సుతస్య సోమ్యస్యాన్ధసోఽంశోః పీయూషం ప్రథమస్య భేజిరే ॥ 1077

(9) తే సోమాదో హరీ[9] ఇన్ద్రస్య నింసతేంఽశుం దుహన్తో [10]అధ్యాసతే గవి ।
తేభిర్దుగ్ధం పపివాన్ త్సోమ్యం మధ్విన్ద్రో వర్ధతే [11]ప్రథతే వృషాయతే ॥ 1078

---

1. కృష్ణాఽఇషిరాఽఅనర్తిషుః, 2. ఉగ్రాఽఇవ, 3. సానాఽఅరావిషుః, 4. శృణ్వఽఏషాం ప్రోథథోఽఅర్వ, 5. శుభ్యోఽర్చతా, 6. తేఽఅద్రయో, 7. యన్త్రాసఽఆశ, 8. తఽఊ సుతస్య, 9. హరీఽఇన్ద్రస్య, 10. దుహన్తోఽఅధ్యా, 11. ప్రయతే. (వ్రా.ప్ర.)

(10) వృషా వో[1] అంశుర్న కిలా రిషాథనేళావన్తః సదమిత్ స్థనాశితాః ।
రైవత్యేవ మహసా చారవః స్థన యస్య గ్రావాణో[2] అజుషధ్వమధ్వరమ్ ॥ 1079

(11) తృదిలా[3] అతృదిలాసో అద్రయో ఽశ్రమణా అశృథితా అమృత్యవః ।
అనాతురా[4] అజరాః స్థామవిష్ణవః సుపీవసో[5] అతృషితా అతృష్ణజః ॥ 1080

(12) ధ్రువా[6] ఏవ వః పితరో యుగేయుగే క్షేమకామాసః సదసో న యుంజతే ।
అజుర్యాసో హరిషాచో హరిద్రవ[7] ఆ ద్యాం రవేణ పృథివీమశుశ్రవుః ॥ 1081

(13) తదిద్వదన్త్యద్రయో విమోచనే యామన్నంజస్పా[8] ఇవ ఘేదుపబ్దిభిః ।
వపన్తో బీజమివ ధాన్యాకృతః పృంచన్తి సోమం న మినన్తి బప్సతః ॥ 1082

(14) సుతే[9] అధ్వరే అధి వాచమక్రతా ఽఽ క్రీళయో న మాతరం తుదన్తః ।
వి షూ ముంచా సుషువుషో మనీషాం వి వర్తన్తామద్రయశ్చాయమానాః ॥ 1083

ఇతి
అష్టమోఽష్టకే చతుర్థోఽధ్యాయ
స్సమాప్తః

1. వృషావోఽఅంశుర్న, 2. గ్రావాణోఽఅజుషధ్వ, 3. తృదిలాఽఅతృదిలాసోఽఅద్రయోఽశ్రమణాఽఅశృథితాఽఅమృత్యవః, 4. అనాతురాఽఅజరాః, 5. సుపీవసోఽఅతృషితాఽఅతృష్ణజః, 6. ధ్రువాఽఏవవః, 7. ద్రవఽఆ ద్యాం, 8. జస్పాఽఇవ, 9. సుతేఽఅధ్వరేఽఅధి వాచ. (వా.ప.)

## సూక్తము—94
ఋషి—సర్పార్బుదులు (కాద్రవేయులు)†
దేవత—గ్రావలు†

(1)*గీ॥ గ్రావలార! ధ్వనిని గలిగించెదరుగాక!
శబ్దమును నొనర్చు సకల శిలల
సంస్తుతింతు మేము సకల ఋత్విజ్జులు!
నుతులఁ జేయుఁ డీరు! మతులఁ దలఁచి ॥ 2903

(2)*గీ॥ శత సహస్ర సంఖ్యఁ జరియించు మనుజులఁ
బోలి గ్రావ లెల్లఁ బూర్ణ శబ్ద
మును నొనర్చుచుండె ఘన సోమమున నాస్య
ముల ధ్వనించుచుండె బోరు మనుచు ॥ 2904

*గీ॥ మఱియు శోభన కర్ములై తిరుగునట్టి
గ్రావ లిష్టిని బొందుచు దేవ తతులఁ
బిలువ నగ్నికిఁ బూర్వమే ప్రీతి భక్ష
ణీయ హవ్యము గ్రహియించుఁ బాయకుండ ॥ 2905

(3)*చ॥ అతిరుచిరాకృతిం గలుఁగు నామిషముం దినువారు మాంస వి
స్తృతికయి బిట్టు శబ్దమును జేసెడు మాడ్కి సువర్ణ వృక్ష సం
తతుల నవీన శాఖల సితాంతము భక్షణఁ జేయు నెద్దు ల
త్యతిశయమైన సుధ్వని ననంతముగా నొనరించుచుండి సం
స్కృత మధుకారి సోమము నదేవనిఁ బట్టుచుఁ బొందుచుండెడున్ ॥ 2906

(4)*గీ॥ మదకరం బౌచు నభిషూయమాన మౌచు
నున్న సోమముచే గ్రావ [1]లుండి యిందుఁ
బిలుచుచుండి సుశబ్దంబు బిట్టు చేయు
చుండి మధుకర సోమము నొందుచుండు ॥ 2907

†వ్రాతప్రతి 14వ సంపుటము 6వ పుటలో నీ సూక్తమునకు ఋషి "సర్పార్బుదులు (కాద్రవేయులు)" గాను, దేవత "గ్రావలు"గాను వ్రాసి, 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అర్బుదుఁడు" ఋషిగాను, "రోలు, పొత్రము" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. నున్న సోమముచే గ్రావ లెలమి నిందు. (వ్రా.ప్ర.పా. యతిభంగము.)

*గీ॥ మఱియు సంరబ్ధభూతులై కరము ధీర
లౌచు శబ్దముతోడఁ దా మఖిల పృథ్వి
నిండఁజేయుచు గ్రావలు నేర్పు మెఱయ
నంగుళులఁ గూడి నృత్యంబు నాచరించు ॥ 2908

(5,6)*సీ॥ సుపతనములఁ గల్గు సుందర గ్రావలు చెంత దివంబున నెంతయేని
ధ్వనిని జేయుచుఁ, గృష్ణ వర్ణ మృగంబులఁ బోలుచు సూర్యుని బోలి శ్వేత
వర్ణాంచితంబులై బహుళ నృత్యముఁ జేయుచుండి నిష్క్రూత మగుచుండు సోమ
మును రాతి క్రిందకుఁ బొందించుచున్ సోమలక్షణోదకమును లలిత రీతిఁ
గీ॥ దాల్చుచుండెను మఱి యవి దర్శనీయ,యాన భారము వహియించు నశ్వవరము
లట్లు,సోమయుతంబులై యధిక వేగ,గమనమున వచ్చుచుండెను గడియలోన ॥ 2909

*గీ॥ శిలలు నిశ్వసంతములుగ వెలుఁగుచు
ముఖమునుండి శబ్దమును వదలును
నశ్వరాజు సహజ మగు నాస్యముననుండి
హేష విడచు రీతి నిద్ధ మతిని ॥ 2910

(7)*గద్యము ॥
దశావనములను, దశ కక్ష్యములను, దశ యోక్త్రములను, దశ యోజనములను, దశ యాశీశువులను, జరావర్జితములను, దశ హింసితృలచే యుక్తములను, నభిషవాఖ్య కర్మయందు వ్యాప్రియమాణములను నో ఋత్విజ్జులారా! అర్చింపుఁడు! ॥ 2911

(8)*గీ॥ క్షిప్రకారి శిలలు చెలఁగుచు దశ యంత్ర
ములుగనుండి ఖ్యాతి వెలుఁగుచుండు
వాని యభిషవాఖ్య వననీయ కర్మము
జగతి హృద్య మగుచు సాగుచుండు ॥ 2912

*గీ॥ అట్టి శిలలు మిగుల నభిషుత వర సోమ
జన్య ఖండ రూప సారసాఽన్న
జాత మైన యమృత సారము నెలమిని
బొందుచుండుఁ జాల నంద మొప్ప ॥ 2913

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(9)*గీ॥ సోమ భక్షక శిల లతిసుందరేంద్ర
హరులఁ బొందుచు నుండెను గరము ప్రీతి
మఱియు గవ్యమునందునఁ బరమ సోమ
మును గ్రహించుచునుండెను మొనసి తాము ॥ 2914

*గీ॥ వానివల్లనె సౌమ్యమై పరఁగుచుండు
సోమ రూపాఽమృతంబును సురుఁడు ద్రావె
వృద్ధ తనువును ధరియించి వృషభము వలె
బలసి సంప్రీతి వృష వలెఁ బరిఢవిల్లె ॥ 2915

(10)*గీ॥ గ్రావలార! మీకుఁ గమనీయ సోమము
కాంక్షితం బొసంగఁ గలదు జగతి
శీర్ణ భావ మెపుడుఁ జెందక దృఢ మైన
తనువుతోడఁ గూడి తనియుఁ డీరు! ॥ 2916

*గీ॥ అన్న వంతుల వలె మీర లతిశయముగ
భోజయితలయి యుండుఁడు! భువనమందు
రేవతుల వలె మీరలు పావనంపుఁ
దేజమునఁ గూడి కుశలానఁ దేజరిలుఁడు! ॥ 2917

(11, 12)*సీ॥ గ్రావలారా! మీరు శ్రమ వివర్జితులయి వెలుఁగుఁడు! భూమిపై వేయి విధుల
నజరులై యమృతులై యపగతరోగులై వెలుఁగుఁడు! భూమిపై వేయి విధుల
నశిథిలీకృతులయి యన్య భేదకులయి వెలుఁగుఁడు! భూమిపై వేయి విధులఁ
దృష్ణా విహీనులై దీవ్యద్బలాఢ్యులై వెలుఁగుఁడు! భూమిపై వేయి విధులఁ
గీ॥ బ్రతి యుగంబున మీ పితృ పర్వతములు, శుభములం గోరుచును సదసులను నాత్మ
తోడఁ గలువక జగ మెల్లఁ దుష్టి నొంద, నభిషవ ధ్వని వినిపింతు రతిశయముగ ॥ 2918

(13)*గద్యము ॥
ఆదరణీయ గ్రావలు యామమంచు రథములకు వలె నుపత్తుచే నా యభిషవ కర్మను
(సోమ రస విమోచన వేళయందు) బ్రకటించుచున్నవి. సోమమును భక్షించు
గ్రావలే కృషీవలులు బీజమును జల్లునట్లు సోమమును జల్లుచున్నవి ॥ 2919

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(14)*గీ॥ పూజ్యమాన శిలలు పుణ్యాధ్వరమునందు
మిగుల ధ్వనిని జేసి మెలఁగునట్లె
హస్తమునఁ గుమారు లధికము తల్లిని
గొట్టుచుండి ధ్వనిని గూర్చునట్లు ॥ 2920

*గీ॥ సోమమును గూర్చుచుం దాము శోభ గాంచు
గ్రావలకు స్తుతి[1] నొనర్పుఁడీ! కర్మకరులు!
మరియు గ్రావలు విస్తార మహిమ నఖిష
వ ధ్వనిం జేయుఁగాక! నీ యధ్వరమున ॥ 2921

ఇయ్యది
శ్రీభరద్వాజగోత్ర శ్రీవేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వర పుత్ర సీతాంబా గర్భ శుక్తి
ముక్తాయమాన శ్రీ భగవద్భక్తారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి
విరచిత కృతులలో శ్రీమదాంధ్ర
ఋగ్వేద సంహితయందు
నష్టమాష్టకమునఁ
జతుర్థాధ్యాయము
సంపూర్ణము

## సూక్తము—94

ఋషి—కాద్రవేయులైన సర్పార్బుదులు
దేవత—గ్రావలు (రవి చంద్రులు, రజితమేరుగిరులు)

### అర్థాంతరము—1

(1)†అష్టపదకందము ॥
తుది మొదలు లేని గతులను
జద లంపెడి దివ్య దీప్తి చయ మొప్పంగాఁ
బది కోటుల పడగలతో
మది శక్తుల నాదిశేష మాహాత్మ్యమునన్
ముదిమి రహిత మేరు రజిత
సదమల గిరులను దగ రవి చంద్రుల్ నానా
పదములలోఁ దనరంగ ద
శ దిశలను వెలుంగుచుంద్రు జగదీశు కృపన్ ॥ 2922

*రచయిత—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఇక్కడ నింద్రగణమునకు మారు "నలల"ముగాని, "జగ"ముగాని ప్రయుక్తమైనట్లు భావింప నగును.

(2)†మ॥ శత సాహస్రిక శక్తి తత్త్వములతో సౌరాఽచ్ఛ చాంద్రాత్మక
ప్రతతిన్ దేజము వెల్గుచుండును మహాభాస్వంత మై రోదసిన్
అతులమ్మౌ హరిత ప్రసారములమై సాత్మీయమై సృష్టిఁ బ్రా
కృత తత్త్వమ్ములు వర్ధిలంగ సుకృతిన్ గృత్యాళి దివ్యమ్ముగా
ఋత చిత్పూర్వ హవిస్సు హేతువవుచున్ ఋషాళి లోకమ్ములన్
వితత క్షేమ మహాశుభాఽఽవళులతో విశ్వమ్మె అశాంతమై
సతతమ్మున్ బలు ప్రాణిజాలములు సంజాతమ్ములై గిట్టుచున్
జతన మ్మొందఁగ సృష్టి సంస్థితి లయాల్ సంసర్గమై యొప్పెడున్ ॥ 2923

(3)†చ॥ అరుణమయాంచితాద్భుత విహాయన శక్తుల సద్భవమ్ములై
పరమ పవిత్ర శబ్ద వృషభప్రతతుల్ జగతిన్ బ్రసారమై
నిరతము నవ్య దివ్య మధు నిర్మల శాఖలుగాఁగఁ గాంతులన్
వరలెడు విశ్వ వృక్షము ప్రభాస సుపుణ్య ఫలాలు పక్వమై ॥ 2924

(4)†క॥ సంతోషము సుఖ శాంతులు
వింతగ విశ్వాన నిలువఁ బ్రీతిన్ బ్రాణుల్
కాంతులఁ గాంతుల సుర లా
శాంతము నోషధితతులను నలరున్ భువనాల్ ॥ 2925

†(5) అంతరిక్షములోన నలరారు సూర్యులు
విష్ణు శక్తుల మీఱు విమల కాంతిచ్ఛటల
నా సుపర్ణ శక్తి నద్భుతముగా వెలిఁగి
అతిలోక శక్తులన్ అలరారు జగతిలో
నిష్కృతి రూపమౌ నిఖిల తిమిరాళులన్
విధ్వస్త మొనరించు విశ్వ సంక్షేమ గతి ॥ 2926

†(6) వేలు లక్షలు కాఁగ వెలుఁగు గ్రహ ఋషాలతో
ధర్మబద్ధ మ్మౌచుఁ దరణి చంద్రులు తిరుగ
రోదసిన్ దీప్తమై లోకాల వ్యాపించి
ఉజ్జ్వలమ్మై కాంతు లుష్ణ శీతల గతులఁ
బ్రసరించి శబ్దాల పవన తరంగాల
సృష్టిలోఁ బ్రాణమై చెలువొందు సర్వదా! ॥ 2927

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) దశదిశాఽఽవశులకై దశ విధ కక్ష్యలకు
దశ బంధములకునై దశ యోచనలకు
దశ దుష్ట శక్తులకు దశ శిష్ట శక్తులకు
దశ విధమ్ములు కాఁగ దశరూప ధారణల
కజర శక్తులకునై అతిలోక గతి నిల్చి
అర్చనలు మీఱంగ నరుణాధిపుఁడు నిల్చు ॥ 2928

†(8) దశదిశలలో వెల్గు తరణి చంద్రావశులు
దశ యంత్రములుగాఁగ దశ దిశలు ధరియింప
నాకర్షణ శక్తి నన్నియున్ దిరుగుచున్
అమృతాంశములు మీఱ నఖిలమౌ విశ్వమ్ము
తొట్టతొలి దేవునికి ధ్రువ దేవ దేవునికి
నర్చనలు చేయంగ ననంత యానము చేయు ॥ 2929

†(9) సంవర్ధకమ్మై సర్వేశు హరి శక్తిఁ
జంద్రాది గ్రహ రాజి సౌర శక్తులతోడ
వివిధమౌ లోకాల కవితథ దీప్తులన్
అమృతమౌ చంద్రికల నమల దుగ్ధము లొసఁగి
మధు రూపములఁ బెంచి మహిమాన్వితములుగా
శుభపరంపరలతో సుఖ సంపదలఁ గూర్చు ॥ 2930

†(10) విశ్వ సర్వస్వమున కశ్వి చంద్రిక లొప్ప
నమల సోములు వెసరి అమృత శక్తులు మీఱ
రేవతీ నక్షత్ర దైవీయ దీధితుల
రవుల తేజమ్ములను రాజిల్లుచున్ జగతి
అజుని మార్గము లెల్ల నధ్వరమ్ములు కాఁగ
నిత్యోత్సవములుగా నిఖిల శుభముల నొసఁగు
సృష్టి వ్యవస్థతో నిష్ట పూర్తము కాఁగ
సర్వదా సర్వధా సర్వాఽఽశాంతముగ ॥ 2931

†(11) శాశ్వతత్వమ్ముతో నశాశ్వతత్వముతో
నశ్రమముగా నిలిచి ఆ శ్రమల మైఁ దిరిగి
అమృతత్వమ్ముతో నా మృతితత్త్వమున
వైష్ణవీయ మ్మౌచు నవైష్ణవ స్థితి గతి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

తృషా రహితమ్ముగాఁ దృషా సహితమ్ముగా
నతృష్ణ శక్తులం దావిర్భవము చెంది
ఆతురత్వము లేని అజరత్వ మలరార
రవి చంద్ర గోళాళి రాజిల్లు లోకాలు ॥ 2932

†(12) ప్రతియుగమ్మున విశ్వ మతిరూప మై తనరు
రవ్యాది గోళాల రజిత మేరు గిరుల
సకల లోకాఽఽఽవళుల సంక్షేమములఁ నింపు
తొలి తల్లిదండ్రులే విలువైన సంపదల
అజుశక్తి తనరార నమృతశక్తుల నొసఁగి
దివి భువుల నన్నింటఁ దేజరిలు హరి దీప్తి
శబ్ద శక్తులు మీఱ సర్వమ్ము వ్యాపింప
సృష్టి శక్తుల నిలిపి స్థితిగతుల నెగడింతు ॥ 2933

(13)†క॥ అమృతమయ శక్తుల రస
మ్మమితముగా స్వీకరించి అమృతమ్మనె సృ
ష్టి మిగుల స్రవియించి నితాం
తము సంవర్ధన మొనర్చుఁ దరణి శశికిల్ ॥ 2934

†క॥ బీజము సృష్టికి రవి శశి
తేజఃపుంజము ప్రాణము హృది దివ్యాయువునై
భ్రాజిత మవును జరాఽచర
పూజిత మై సర్వగతులఁ బూత మ్మవులే! ॥ 2935

†(14) సృష్టి యజ్ఞమ్ములో సోమామృతము నింపు
సప్తాగ్ని మాతృకల దీప్తాధినేతగా
శబ్ద నిశ్శబ్దాల సంశక్తు లొప్పార
విశ్వ విజ్ఞానంపు విపుల మహిమలను
సకల దిశలను వెలుఁగు సౌర మండలతతులు
సృష్టి శక్తుల నొప్ప స్థితిశక్తులన్ దనరు
పూజనీయమ్ములౌ పూర్ణ దీప్తుల సదా
పుంఖానుపుంఖ విశృంఖలగతి వెలుఁగ ॥ 2936

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య: "కళా-పరిపూర్ణ"

## సూక్తము—94

ఋషి—కాద్రవేయులైన సర్పార్బుదులు

దేవత—గ్రావలు (రవిచంద్రులు, రజిత మేరుగిరులు)

### అర్థాంతరము—2

†(1) అత్యుత్తమములైన ఆ రజిత మేరు గిరుల
నవ్య నవ నిత్యమౌ దివ్య తేజస్సులన్
ఆశాంతములలోన సద్రులకు సద్రులై
అమృత శక్తులు మీఋ నా సోమతత్వ గతి
ఘన రూప రూపమై క్రాలఁగా నష్ట వసు
సంపదల గలగలల స్వచ్ఛ సంస్తుతి శబ్ద
సంభార మొప్పంగ సాజమై ప్రకృతిని
చద్భుత శక్తిమై నతిధీరతలు తనరు ॥ 2937

†(2) శత విధాలుగా సృష్టి సహస్ర విధాలుగా
వ్యాపించు "నభి"శక్తి రూపు మాపుచు సౌర
సందీప్తత మీఱఁ జాంద్ర శక్తులు నిండు
సుకృత పూర్ణమ్ములౌ సుకృతముల్ వరలంగఁ
జిత్పూర్వమై దివ్య చేతన దీప్తులన్
రజితాద్రి హేమాద్రి రంజిల్ల విశ్వాన
నరగని తరగని హరిత రూపము వరల
మొక్కవోని సుదృఢ మూర్తిత్వ మొప్పుతేః ॥ 2938

†(3) పరిపక్వమౌ పుణ్య ఫలము మధువౌ గతిని
విశ్వవృక్ష విశాఖ విమలాఽరుణ ఫలమ్ము
అమృత దీప్తులు వరల నన్నృత తృప్తులఁ దునుము
అమలాగ్ని శక్తులే అతిపవిత్ర ప్రేమ
నంతరిక్షము గుండె నలరి నింపుచు మంద
అత్యుత్తమమ్మైన ఆదిశేషువు భోగ
మతిబలీయముగా విశ్వాఽఽవరణమై వెల్గొంద
నియమగతి గగనానఁ బయనించు సకుటుంబముగ ॥ 2939

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) మధురూపమై నిలిచి కుదరాలు కాకుండ
నదమగతి లేకుండ సుధరాలుగా నిలిచి
రజిత హేమాద్రు లవి రంజిల్లి విశ్వాన
మందమౌ శబ్దాల సమందమౌ తేజాల
సతిధీరరూపమై అతిమృద్విశేషమై
అపురూపమౌ సిరు లౌచుఁ దనరును సృష్టి ॥ 2940

†(5) అతిలోకమౌ నగ్ని నత్యంత శుద్ధమై
మెరుఁగులన్ జెల్వొందు మేల్మిగా వెల్గొందు
సూర్య దీప్తులు మీఱ సర్వ నిష్కృతతతిని
విధ్వంస మొనరించి విష్ణుదేవుని కనుల
జంటగా దంటగా మింటిలోఁ బంటలై
రవి చంద్రగతి హేమ రజితాద్రు లొప్పంగ
దేవ దేవుని దివ్య తేజమౌ వీర్యమై
అంతరాంతరశక్తి నపురూపమై వెలుఁగు ॥ 2941

†(6) ధర్మ శక్తులు మీఱఁ దనరి శ్రేష్ఠమ్ముగా
దైవ వీర్యమ్ముగా ద్వైత ద్రవతత్వముల
స్వర్ణజలమై రజిత జల మౌచు విశ్వాన
ఉగ్రగతి తనరారు నుజ్జ్వల రతు లొప్ప
జవ జీవ శక్తులను జాజ్వల్యమానమై
శత్రు దుర్భేద్యమై మిత్ర స్వర్భాగ్య మై ॥ 2942

†(7) దశ దిశాఽఽవళివల్ల దశ కక్ష్యలవలన
దశ బంధములవల్ల దశ యోచనలవల్ల
దశ దుశ్శక్తులవల్ల దశ శిష్ట శక్తులవల్ల
దశ విధమ్ములవల్ల దశ వారణలవల్ల
నజర శక్తులవల్ల నతిలోక గతివల్ల
నఖిలమ్ము వెల్గొందు నరుణాధిపార్చనల ॥ 2943

†(8) ధ్రువ గతులు మీఱంగ రూఢ శక్తులు తనర
దశ దశ యంత్రాలఁ దగు రజిత స్వర్ణాద్రి
ద్వయ మొప్పు విశ్వాన భరితాఽమృత మొప్పఁ
జలన గతులను బ్రథమ జరిత సోమము తనర ॥ 2944

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(9)†క॥ రవి చంద్రులు ప్రథమమ్మై
అవితథ గతి వర్ధిలంగ నా హేమ నగ
మ్మవు రజిత గిరియు నలరును
నవ దీప్తుల లోకములను నారాయణులై ॥ 2945

(10) అత్యంత శ్రేష్ఠమౌ నతిలోక దీప్తులను
రజిత స్వర్ణాద్రులే దైవత శక్తులన్
రాజిల్ల విశ్వాస రక్షా కవచ దీక్ష
నాకాశమున విష్ణు వాదిత్య కృతి దీప్త
లధ్వరాఽధ్వగములుగా నలరార నిత్యమ్ము
దైవ నిలయమ్ములై తగు నచంచల గతి ॥ 2946

†(11) శాశ్వత గతి నశాశ్వత స్థితు లొప్ప
నశ్రమ సుఖ గతి నతిశ్రమాఽఽకలితమై
అమృత మహిమను నామృతిపర మౌచు
వైష్ణవీయమ్ముగా నవైష్ణవీయమ్ముగాఁ
దృష విహితమై సర్వ తృష రహితమై నిల్చి
తృష్ణారహిత మూల దీప్తి సంభవ మౌచు
నాతురత్వము లేని అజరత్వ మలరార
రజిత స్వర్ణాద్రులు రాజిల్లు విశ్వాస ॥ 2947

†(12) నగములకు నగములై యుగయుగమ్ముల నిలిచి
స్థిరగతులు తనరార క్షేమంకరము లౌచు
వైష్ణవీయమ్ములై వరలు రజితగిరి
స్వర్ణాద్రి విశ్వానఁ బ్రభ లొప్పఁ బృథ్వియై
అతిచలన శక్తులన్ గతి చలన మూర్తులై
తిరుగాడు భువనాలఁ దేజరిల్లుచునుండు ॥ 2948

†(13) రజితాద్రి స్వర్ణాద్రి రాజిల్లు దైవీయ
వీర్యరూప మ్మౌచు వెలిఁగి బీజమ్ముగా
విశ్వ వసు సంపదల విమల మూర్ధమ్ముగా
రవి చంద్ర గోళాల రాజిల్లు నమృతంపు
శక్తులన్ శుద్ధమై వ్యక్త ధగద్ధగల
తేజాల దృఢశక్తి దివ్య దజయ్యమౌ ॥ 2949

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(14) సర్వాన వ్యాపించు సప్త మాతృక తతికి
జ్వాలలన్ మూల మై శబ్ద శక్తుల మీఱ
దేవ పితరులకును దివ్య సంతతులకు
నావాస మై సదా! ద్యో వాస మై వరల
నగ దీప్త కేశికా నగరాజ రూప మై
వరలులే! రజితాద్రి స్వర్ణాద్రి విశ్వాన ॥ 2950

ఇయ్యది
విశ్వసృష్టిప్రకృతిమాత్రైకైకపుత్రి
పతకమళ్ళ గోత్ర-వడ్లమూడి కుల సందీప్త-
శ్రీసుబ్బన్న పౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అద్వితీయ ద్వితీయపుత్ర-
శ్రీసరస్వతీమాతృ ప్రియపుత్ర-అపార వేద శాస్త్రసాహిత్యవిద్యా పారంగత-
అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకిక శక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సర్వ దేవతాస్వరూప-విద్వన్మణిపంచముఖాంజనేయోపాసక శ్రీవేదుల రామశాస్త్రి గురువరాభిస్తుత "ముఖకలితగోపాలసువద"-మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమ గురువర్యాభినుత "శతవర్షాశీర్వచన రక్షిత అగుణశోభిత నిష్కళానహిత శ్రీ మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహినీ హృదయలక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్వాక్ స్వరూపిణి, అమలినపవిత్ర పతిరక్తి భక్తి శక్తిస్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్యచైతన్యవతి, నిర్నిద్రమతి, వినిర్మలగతికలిత, ప్రియశరీరాంతర్విలీనగాన జ్ఞానధ్యానస్వరూపిణీతన్మయి, శివపూజితఫాలచంద్రకళా మూర్తి-అకళంక సౌందర్యరాశి-సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త- జయశ్రీ సత్యశ్రీ పుత్రికా రత్నద్వయ అజయ్యా జయ విజయ పతాకయుక్త - శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహర రాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య ఛత్రాఽఽవరణయుక్త-పాణినీయాఽష్టాధ్యాయాపూర్వత్రాసిద్ధసూత్రసహిత శబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త-మహావైయాకరణ-వేదవేదాంతకోవిద-దశభాషా కవితావిశారద-పుంభావశారదా మూర్తి- శ్రీ గుండేరావు హర్కారే సాష్టాంగనమస్కార పూర్వక ప్రస్తూయమాన- "శ్రీ వాఙ్మయమహాధ్యక్ష-ప్రాచీన వైయాకరణానమయ సంప్రదాయరక్ష-స్ఫోరితానేక జనాభినవోన్మేష శాలికావ్య నిర్మాణశక్తి మన్నికోచనాక్ష-మాధుర్య స్యందివీర్యవత్తరపద గుంఫాధురీణ - మహీభుగగోచరగాంభీర్యప్రకటనాపటిమాపారీణ - కల్పాంతారీణాఽనల్పకల్పనా భూషణ"- లీలామానుష విగ్రహ-ఆంధ్రవిశ్వకళాపరిషత్ సంభావిత చతుర్వింశదధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్ "కళా-ప్రపూర్ణ" సార్థక బిరుద విరాజిత-బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య
సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్త సహిత సుసమగ్ర
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
దశమమండలమున నష్టమాష్టకమునందలి
అర్థాంతరయుక్త చతుర్థాధ్యాయము
సమాప్తము

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"



# సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—పంచమోఽధ్యాయః

### సూక్తమ్—95

ఋషిః—ఐలః పురూరవాః

ఋషికా—2, 4-5, 7, 11, 13, 15-16, 18-ఉర్వశీ

దేవతా—ఉర్వశీ, పురూరవాః

ఛందః—త్రిష్టుప్

(1) హయే జాయే మనసా తిష్ఠ ఘోరే వచాంసి మిశ్రా కృణవావహై ను ।

న నౌ మన్త్రా[1] అనుదితాస ఏతే మయస్కరన్ పరతరే చనాహన్ ॥ 1084

(2) కిమేతా వాచా కృణవా తవాహం ప్రాక్రమిషముషసామగ్రియేవ ।

పురూరవః పునరస్తం పరేహి దురాపనా వాత [2]ఇవాహమస్మి ॥ 1085

(3) ఇషుర్న శ్రియ[3] ఇషుధేరసనా గోషాః శతసా న రంహిః ।

అవీరే క్రతౌ వి దవిద్యుతన్నోరా న మాయుం చితయన్త ధునయః ॥ 1086

---

1. మన్త్రాఽఅనుదితాసఽఏతే, 2. వాతఽఇవా, 3. శ్రియఽఇషు. (వా.ప.)

(4) సా వసు దధతీ శ్వశురాయ వయ[1] ఉషో యది వష్ట్యన్తిగృహాత్ ।
అస్తం ననక్షే యస్మించాకన్ దివా నక్తం శ్నథితా వైతసేన ॥ 1087

(5) త్రిః స్మ మాహ్నః శ్నథయో వైతసేనోత స్మ మేఽవ్యత్యై పృణాసి ।
పురూరవోఽను తే కేతమాయం రాజా మే వీర తన్వం౨స్తదాసీః ॥ 1088

(6) యా సుజూర్ణిః శ్రేణిః సుమ్న[2]ఆపిర్హ్రదేచక్షుర్న గ్రన్థినీ చరణ్యుః ।
తా[3] అంజయోఽరుణయో న సస్రుః శ్రియే గావో న ధేనవోఽనవన్త ॥ 1089

(7) సమస్మింజాయమాన[4] ఆసత గ్నా ఉతేమవర్ధన్ నద్యం౨ః స్వగూర్తాః ।
మహే యత్ త్వా పురూరవో రణాయా ఽవర్ధయన్ దస్యుహత్యాయ దేవాః ॥ 1090

(8) సచా యదాసు జహతీష్వత్కమమానుషీషు మానుషో నిషేవే ।
అప స్మ మత్ తరసన్తీ న భుజ్యుస్తా[5] అత్రసన్ రథస్పృశో నాశ్వాః ॥ 1091

(9) యదాసు మర్తో[6] అమృతాసు నిస్పృక్ సం క్షోణీభిః క్రతుభిర్న పృంక్తే ।
తా ఆతయో న తన్వః శుమ్భత స్వా[7] అశ్వాసో న క్రీళయో దన్దశానాః ॥ 1092

---

1. వయఽఉషో, 2. సుమ్నఽఆపిర్హ్ర, 3. తాఽఅంజయో, 4. మానఽఆసత గ్నాఽఉతే, 5. భుజ్యుస్తాఽఅత్ర, 6. మర్తోఽఅమృతా, 7. స్వాఽఅశ్వాసో. (వా.ప్ర.)

(10) విద్యున్న యా పతన్తీ దవిద్యోద్భరన్తీ మే[1] అప్యా కామ్యాని ।
జనిష్టో[2] అపో నర్యః సుజాతః ప్రోర్వశీ తిరత దీర్ఘమాయుః ॥ 1093

(11) జజ్ఞిష[3] ఇత్థా గోపీథ్యాయ హి దధాథ తత్ పురూరవో మ[4] ఓజః ।
అశాసం త్వా విదుషీ సస్మిన్నహన్ న మ[5] అశృణోః కిమభుగ్వదాసి ॥ 1094

(12) కదా సూనుః పితరం జాత[6] ఇచ్ఛాచ్చక్రన్నాశ్రు వర్తయద్విజానన్ ।
కో దంపతీ సమనసా వి యూయోదధ యదగ్నిః శ్వశురేషు దీదయత్ ॥ 1095

(13) ప్రతి బ్రవాణి వర్తయతే[7] అశ్రు చక్రన్ న క్రన్దదాధ్యే శివాయై ।
ప్ర తత్ తే హినవా యత్ తే[8] అస్మే పరేహ్యస్తం నహి మూర మాపః ॥ 1096

(14) సుదేవో[9] అద్య ప్రపతేదనావృత్ పరావతం పరమాం గన్తవా[10] ఉ ।
అధా శయీత నిరృతేరుపస్థే ఽధైనం వృకా రభసాసో[11] అద్యుః ॥ 1097

(15) పురూరవో మా మృథా మా ప్ర పప్తో మా త్వా వృకాసో[12] అశివాస ఉ క్షన్ ।
న వై స్త్రైణాని సఖ్యాని సన్తి సాలావృకాణాం హృదయాన్యేతా ॥ 1098

1. మేఽఅప్యా, 2. జనిష్టోఽఅపో, 3. జజ్ఞిషఽఇత్థా, 4. మఽఓజః, 5. న మఽఅశృణోః, 6. జాతఽఇచ్ఛా, 7. యతేఽఅశ్రు, 8. యత్తేఽఅస్మే, 9. సుదేవోఽఅద్య, 10. వాఽఉ, 11. సోఽఅద్యుః,
12. వృకాసోఽఅశివాసఽఉక్షన్. (వా్ర.ప్ర.)

(16) యద్విరూపాచరం మర్త్యేష్వవసం రాత్రీః శరదశ్చతస్రః ।
ఘృతస్య స్తోకం సకృదహ్న[1] ఆశ్నాం తాదేవేదం తాతృపాణా చరామి ॥ 1099

(17) అన్తరిక్షప్రాం రజసో విమానీముప శిక్షామ్యుర్వశీం వసిష్ఠః ।
ఉప త్వా రాతిః సుకృతస్య తిష్ఠాన్ని వర్తస్వ హృదయం తప్యతే మే ॥ 1100

(18) ఇతి త్వా దేవా[2] ఇమ ఆహురైళ యథేమేతద్భవసి మృత్యుబన్ధుః ।
ప్రజా తే దేవాన్ హవిషా యజాతి స్వర్గ[3] ఉ త్వమపి మాదయాసే ॥ 1101



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—పంచమాధ్యాయము

### సూక్తము—95

ఋషి—ఇలా పుత్రుఁడు పురూరవసుఁడు†
ఋషిక—2,4,5,7,11,13,15,16,18-ఊర్వశి†
దేవత—ఊర్వశీ పురూరవసులు†

పురూరవసుని వాక్యము

(1)*క॥ మన సరసాలాపము ల
త్యనుదితములు గుంభితంబు లగుచుఁ బ్రతిదినం
బున మనకు సుఖము నేమియు
నొనరింపక యుండెఁగాన నో ఘోరస్త్రీ! ॥ 2951

1. దహ్నఽఆశ్నాం, 2. దేవాఽఇమఽఆ, 3. స్వర్గఽఉత్వ. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 13వ పుటలో నీ సూక్తమునకు ఋషి "పురూరవసుఁడు-ఊర్వశి"గాను దేవత "ఊర్వశీ పురూరవసుల వాక్యార్థము"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "పురూరవసువు-ఊర్వశి" ఋషి ఋషికలుగాను, "ఊర్వశి పురూరవసువులు" దేవతలుగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.
*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ ఉభయులము కూడి యొకచోటనుండి సరస
వాక్యముల నాడుకొనెదము వనిత! ప్రీతి
యుక్త చిత్తము నాపయి యోపి చేర్చి
విశ్రమింపవే! యిప్పుడు వేగ నీవు! ॥ 2952

ఊర్వశి

(2)*గీ॥ బహ్వ్యుషస్సులఁ దొల్లిటి ప్రత్యుషస్సు
తా గతించెడు విధముఁ దత్సమీప
భాగము నతిక్రమించితి భోగ రహిత
వాక్కుచే నేమి ఫల మగు? వసుమతీశ! ॥ 2953

*గీ॥ నన్నుఁ గోరకుండఁ దిన్నఁగ గృహమును
జేరుమయ్యా! యో పురూరవస్సు!
వాయు మూర్తిఁ బోలి పరమ దుష్ప్రాపనై
వెలయుచుంటి నేను వివిధ జగతి ॥ 2954

పురూరవసుఁడు

(3)*సీ॥ ఇషుధిమధ్యమునుండి యిషువులు తీయుచు శత్రులపైఁ బంపఁజాలఁగలనె?
తద్విరహానల దహ్యమానుండనై విజయబుద్ధిని గల్గి వెలుఁగఁగలనె?
వేగవంతుఁడనై వివిధ శాత్రవ ధేను సంభక్తగా నేను సాగఁగలనె?
సకలారి గణ ధన సంభక్తగా నేను నిజమైన శక్తితో నిలువఁగలనె?
గీ॥ వీర సామర్థ్యమున నేను వెలయఁగలనె?
విస్తృతములైన సంగ్రామ వీథులందు
నస్మదీయ జనావళి యతిశయించి
సింహ నాదంబు తెలియంగఁ జేతనగునె? ॥ 2955

ఊర్వశీ పరోక్షవాక్యము

(4)*గీ॥ ఊర్వశీకాంత శ్వశురున కోపి యన్న
మును నొసంగుచుఁ దద్గృహమున వసించి
యున్నయప్పుడు పతిఁ గోరి యున్న యెడలఁ
దద్గృహంబును జేరుఁ దాఁ దత్క్షణంబ ॥ 2956

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ శ్వశుర చారు గృహము సరసనే యున్నట్టి
పతి గృహంబు ప్రీతిఁ బడతి చేరి
శ్రేష్ఠ మైన భర్తృ శేషమునం దాను
గొట్టఁబడుచు నుండెఁ గోర్కె లూర ॥ 2957

(5)*గీ॥ ఓ పురూరవస్స! యొగి శేఫమున నీవు
మూఁడు మార్లు నన్ను మోదినావు!
పతిని గొట్టి నాతి పడతిని నన్నట్లు
తలఁచుచుంటి వేల? తనివి నరక ॥ 2958

*గీ॥ ఇట్టి బుద్ధి తావకీన గృహంబును
జొచ్చినాను వీర! మెచ్చు నటులఁ
దొలుత సుఖము నాకుఁ గలిఁగించితివికాదె!
యిపుడు కాతరుండ వెట్టు లయితి? ॥ 2959

పురూరవసుఁడు

(6)*గద్యము ॥

"సుజూర్ణి, సుజవ, శ్రేణి, సుమ్న ఆపిదేహచక్షువు" అను నఖిభూత మానినులతోఁ గలసి సందర్భవతి, చరణశీలయు నగు నూర్వశి వచ్చెను. ఆ యప్సరసలు, ఆభరణోపేతలు నరుణవర్ణలు నయి పూర్వము వలె వెడలకున్నారు. శ్రీయణముకొఱకు నవ ప్రసూత గోవుల వలె శబ్దించకున్నారు ॥ 2960

ఊర్వశి

(7)*గీ॥ సత్పురూరవస్సు జన్మింపఁగనె యప్స
రసలు సంగతలుగఁ గ్రాలినార
లీ పురూరవసుని నెలమిని నదు లెల్ల
వృద్ధి [illegible]ండె వేగఁ జనుచు ॥ 2961

*గీ॥ ఓ పురూరవస్స! యున్నత సంగ్రామ
వీథులందు దస్యు వీర గణము
[1]దృంప నిన్నుఁ బ్రీతి దేవత లభివృద్ధి
పరచినారు ముదముఁ బడసినారు ॥ 2962

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

1. "దృంప" శబ్దము "దృంప"గాఁ బ్రమాదవశమునఁ బ్రయోగితమై "దేవత"శబ్దములోని "దే"తో యతి మైత్రి పాటింపఁబడినది. (చూ. పీఠిక.)

(8)*గీ॥ అతిసహాయభూతుఁడైన పురూరవ
స్సనెడు వాఁడు రూపమును ద్యజించు
దేవ వేశ్యలందుఁ దృప్తిని బొందంగ
నరుగుచుండె వారి కభిముఖముగ ॥ 2963

*గీ॥ అప్పు డప్సరసలుఁ చప్పున నను వీడి
పరమ భీతిఁ దాము పరుగు లిడిరి
వ్యాధ భీతిచేతఁ బరుగులు వెట్టెడు
మృగి గతించునట్లు మేలు గలుఁగ ॥† 2964

(9)*చ॥ ఘనుఁడు పురూరవ స్సమర కాంతలతోఁ దగ ముచ్చటింపఁగాఁ
బనిఁగొని పోవ వార లతిభాసుర జిహ్వల చారు సుస్రుక్కులన్
దినుచు హయాంగనాళుల గతిం గడు స్వీయ సురూప కాంతులన్
దనియుచుఁ జూపకుండి రవి, ధన్యుఁడు వాఁ డెటు లౌను మీఁదటన్ ॥‡ 2965

(10)*ఉ॥ చంచల రీతి నూర్వశి ప్రశస్త తరంబుగ వెల్గుచుండి తా
నంచిత వారి వారముల నాత్ర భరించుచు నాకు నెప్డు మేల్
గాంచిన పుత్ర రత్నమును గాంచునొ। యప్పుడె యామె నా కిలన్
మించిన యట్టి యాయువు నమేయ దయన్ బ్రకటించుఁగాకొగిన్ ॥ 2966

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి
†95వ సూక్తము 8వఋుక్కులోని రెండవ పద్యములో మొదటి పాదములోని చివరిభాగము రెండవపాదము పూర్తిగా నీ క్రింద నిచ్చిన గీతపద్యములోవలె మూల వ్రాతప్రతి 14వసంపుటము 17వపుటలో వ్రాసి కొట్టివేయఁబడినది. పైన నిచ్చినదికూడ మూలవ్రాతప్రతిలోఁ బ్రక్కన వ్రాసికొట్టివేయఁబడినది. ఇది "ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము-పరిశోధనాలయము"లోఁ గల 43వ పుస్తకము (Acc. No. 3787. call No. T 25-43) 10వ పుటలో శుద్ధముగా వ్రాయఁబడినది. మరొక పద్యము వ్రాయు నుద్దేశముతో శ్రీ నేమానివారు దీనిని గొట్టివేసి యుండ వచ్చును. కాని వేరుగా మరొక పద్యము వారు వ్రాయలేదు.

గీ॥ అప్పు డప్సరసలు చప్పున నను వీడి
పారిపోయి రట్లు పరమ భీతి
వ్యాధ భీత యగుచు నతిశయ వేగాన
నెట్లు మృగి గతించు నెచటనైన ॥ (తొ.పా.)

‡చ॥ ఘనుఁడు పురూరవుం డమర కాంతలతోఁ దగ ముచ్చటింపఁగాఁ
బనిగొని పోవ వార లతిభాసుర జిహ్వలతోడ సృక్కులన్
దినుచు గతింతు రశ్వల విధంబున స్వీయ సురూప కాంతులన్
దనియుచుఁ జూపకుండి రిఁక ధన్యుఁడ నయ్యెద నెట్లు తల్చినన్ ॥ (తొ పా.)

ఊర్వశి

(11)*గీ॥ ఆత్మయే పుత్త్రి రీతిని నవతరించు
ననెడు వాక్యానుసారము ఘన పురూర
వస్సః భూమినిఁ బాలింప వరలు పుత్త్రి
రూపమునఁ బుట్టియున్నాఁడ వేపు గలిఁగి ॥ 2967

*క॥ నా యుదరమందు నునిచితి
మోయిః మహోజస్సునట్టు లుండక నీకుం
జేయ నగు కృత్య ముడివితి!
మాయురెః యద్దాని నీవు మరచితి వేమోః॥ 2968

*గీ॥ నాదు వాక్యంబు నీ వెట్టు లతిశయమున
నాచరింపకయున్నా వనాదరమున
దినమునకు మూఁడు మారులు మొనసి నీవు
కూర్మి మీరఁగ నాతోడఁ గూడవలయు ॥ 2969

(12)*ఉ॥ ఎప్పుడు నీ సుతుండు నను నెంతయుఁ బ్రీతిని జూచుఁ దండ్రిగా
నెప్పుడు వాఁడు నన్ననుచు నెక్కువఁ గార్చునోః కంట నీరు వాఁ
డొప్పుగ నిన్ను నన్నుఁ గడు నుత్తమ రీతిని గౌఁగలించునోః
చెప్పఁగరాదు వాఁ డిపుడు [1]శ్రీశ్వశురాలయమందు నుండెనోః॥ 2970

ఊర్వశీ వాక్యము

(13)*గద్యము ॥
ఓ పురూరవస్సాః నిన్నుద్దేశించి పలుకుచున్నాను. నీ యపత్యము బాష్పములను బ్రవర్తింపఁ జేయఁగలదు. శివ ముపస్థితము కాఁగా రోదనముఁ జేయఁగలదు. ఏ యపత్యము నాయందుఁ బ్రవేశింపఁజేసితివోః యా యపత్యమును నీ నిమిత్తము పంపుచున్నాను. నీవు నీ యింటికిఁ బొమ్ముః నన్నుఁ బొందకుండనున్నావుః ॥ 2971

(14)*గద్యము ॥
నీతోఁగూడి క్రీడ సల్పు పతి యిప్పుడు ప్రకర్షముగాఁ బడుఁగాకః అనావృతుండై దూరదేశముకంటె దూరదేశముఁగురించి మహా ప్రస్థానమును జేయుఁగాకః ఎచ్చటనో యొకచోటఁ బాపదేవత చెంతఁ జనిపోవునుగాకః పిమ్మట వీనిని నక్కలు తినునుగాకః ॥ 2972

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఊర్వశి తలిదండ్రుల చెంత నుండెనాః అని యర్థము. (నే.వేం.న.శా.)

పురూరవసునితో నితర స్త్రీలు

(15)*గద్యము ॥

ఓ పురూరవస్సా! నీవు మరణింపకుము! పతనమును జేయకుము! నన్ను సృగాలములు
తినకుండుఁగాక! నాపైని నాగ్రహమును జూపకుము! స్త్రీ సఖ్యములు లేవుగదా!
ఈ సాలావృక సఖ్యములు సమస్తాఽఽపన్నులకు ఘాతుకములు ॥ 2973

(16)*గద్యము ॥

మనుష్య సంపర్కమువలన విగతసహ భూతదేవ రూపనై మనుష్యులయందుఁ దిరిగితిని.
అపుడు రాత్రిలను బూరించు నాల్గు శరత్తు లున్నాను. ఘృత స్తోకమున నిపుడు
తృప్తనై చరించుచున్నాను ॥ 2974

పురూరవసుఁడు

(17)*గీ॥ సహజ తేజోభరంబున సకల మైన
యంతరిక్షంబుఁ బూరించునట్టి యుదక
ములను నిర్మించునట్టి యా లలితకాంత
యూర్వశిని నా వశంబున నుంచుచుందు ॥ 2975

*గీ॥ సుకృత కర్మల నే వేళఁ జూపునట్టి
నేను బ్రేయసి! నినుఁ బొందనేర్తు నాదు
హృదయము తపింపఁబడుచుండె నింతి! నీవు
మరలుమా! సంతసంబున మరలు! మరలు! ॥ 2976

(18)*ఉ॥ ఓయి! పురూరవస్స! యిపు డూర్జిత మృత్యు వశంబు పొందినా
వోయి! ప్రశస్త జన్మము నొందితి వింక మహా సురాశికిన్
బాయక యజ్ఞ కర్మములఁ బల్మరుఁ జేసితి వీవు! నాకమం
దో యధిపా! వసింపు మని యోపి వచించిరి దేవతోత్తముల్ ॥ 2977

*గీ॥ ఓ పురూరవస్స! యొనరంగ నిట్టులు
చేయుచుంటి వందుచేత నీవు
నీదు కాంక్షితంబు నిఖిలంబు విడచుచు
సౌఖ్య మందుమయ్య! సత్వరముగ ॥ 2978

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—95

ఋషి—ఇలాపుత్రుఁడు పురూరవసుఁడు

ఋషిక—2,4,5,7,11,13,15,16,18-ఊర్వశి

దేవత—ఊర్వశీ పురూరవసులు

### అర్థాంతరము—1

†(1) సప్తవిధ ప్రకృతులు శబ్ద మిశ్రిత మౌచు
ఐశ్వరీయ మ్మగుచు నెసఁగి మనస్సులోఁ
దిష్ఠ వేసిన చాంద్రి నిష్ఠా రహస్యమై
అనుద్భూత మ్మౌచు ననాహత మ్మౌచు
నతిలోక సౌందర్య ప్రతిరూప శిల్పమయ
కృత శక్తిగా నిల్చు ఋత శక్తిగా వెల్గు ॥ 2979

†(2) అత్యద్భుత మ్మైన అపురూప శబ్దమయ
శక్తులే ఉషసులై సర్వాన వ్యాపించ
నతిబృహత్తర మౌచు నతిలోక శక్తులన్
నలరారు నా చంద్రి నపురూప తత్వాన
దుష్ట శక్తుల నెల్లఁ దున్మాడు వాయు గతి
నావృత్తి రహితమై అమరమై తనరారు ॥ 2980

†(3) అతివేల శక్తుల నసంఖ్యాకములైన
కాంతి శర సంపదలు క్రాంతి నిధులై తనర
నత్యంత వేగాన నంతటన్ వ్యాపించు
శబ్ద సంవలితమై శరదాఽఽవళుల నిల్చు
బంధానుబంధాలు స్వార్థ ప్రయోజనాళి
లేమియున్ లేనట్టి యెనలేని క్రతువుల
నంతరిక్షములోన నంతటన్ నెఱపుచున్
మేఘ మాలలు జలము మెఱుపుల న్నురుములన్
దనరార లోకాల వినువీథి గోళాలఁ
గాల వర్షమ్ములై అకాలవర్షములై కురియు ॥ 2981

†(4) సూర్య గోళమునకై సొబగైన ఉషసాళి
నిత్య ముదయ మ్మౌచు నెగడొందు ఖాతిగా
విశ్వగేహమునుండి విమలాష్టవసువులను
సకలమౌ సంపదలు సర్వ దివమ్ములను
నదృశ్య శక్తుల నిలుచు నపురూప గతులమైఁ
బ్రకృతిలో నిక్షేప భాగ్యాళి వరలంగ ॥ 2982

†రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) మహితమైన చాంద్రశక్తి మనసై విలసిల్లుచుండ
విమల విశ్వమందు మహావీరుండై వెల్గొందును
క్షీణగతుల వృద్ధిగతులఁ బ్రాణాత్మక పూర్ణగతుల
సూక్ష్మమ్మై బృహత్తరమై శుభక్షేమంకరత్వాలఁ
ద్రివిధములై త్రికాలాలఁ దేజరిల్లు నమృతగతి
ప్రాణశక్తి ప్రకృతిలోఁ బ్రభవింపగఁ వర్ధిల్లఁగ ॥ 2983

†(6) గోవు లీనఁగ దూడకూనలు గెంతు గతి
విశ్వాంతరిక్షాన వింతవింతలుగాఁగ
అతులిత శక్తులన్ అవతరించినయట్టి
గోళాలు తిరుగాడు గుప్త చలన శక్తి
దీప్త భ్రమణ శక్తిఁ దేజరిల్లుచుఁ దిరుగు
సృష్టి మాతకు దివ్య శ్రేణి సంతానమై ॥ 2984

†(7) విశ్వ సంక్షోభమును విపరీతముగఁజేయు
దుష్ట రాక్షస తతులఁ దున్మాడ దేవాళి
అతిలోకమై తనరు ననాహత రూపమౌ
చాంద్రమానస శక్తి సర్వ విజేతయౌ
రోదోఽంతరాళాన నాద శక్తులు మీఱ
స్వయంచలన శక్తి సంభృతముగా నిలువ ॥ 2985

†(8) కృష్ణ సంశక్తులన్ విష్ణు లీలగ సదా
భాస్వంతమౌ గోళ ప్రతతులే కాకుండఁ
గాంతి రహితము లౌచుఁ గటికచీకట్లతో
నలరు గోళా లుండు నంతరిక్షమ్ములో
మాయచిహ్నము బుద్ధిమాన్య రూపము కాఁగ
అజడ మయ్యును నగ మా జడ రూపమై అచర
శక్తుల సృష్టిలో జాగృతి రహితమై
తనరారులే కొన్ని తరణి వెలుఁగులు లేక ॥ 2986

†(9) అతిసూక్ష్మమై వెలుఁగు నపురూప శక్తులన్
రవి చంద్ర కాంతు లవి రాజిల్ల విశ్వాన
భూలోక యజ్ఞాలఁ బుట్టుచున్ గిట్టుచున్
మానవాది సకల ప్రాణులు తనరారు
నమృత దీప్తులు మీరు నమల చంద్రజ శక్తి
ప్రసరించు వెన్నెలల వన్నెలై మహితమై ॥ 2987

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) అతిలోకమ్మై వెల్గు నపువ్రూప శక్తులన్
చాంద్రశక్తులు తనర సౌర కాంతులు మీఱ
అంతరిక్షమ్మందు నఖిలమౌ దివి భువుల
విద్యుల్లతలుగా విమలమౌ కాంతి చవి
ప్రసరింపఁజేయుచున్ బ్రకృతి కామ్యావహుల
దీర్ఘాఽఽయురారోగ్య దివ్య శక్తుల జన్మ
జనక శక్తుల విశ్వ మాన్య రక్తులు వరల
మహితాగ్నితో జలము మర్మగతులను నిలుచు ॥ 2988

†(11) విశ్వగోళా లెల్ల విమల గోపికలుగా
విదుషీమణులుగా విలసిల్లుచుండఁగా
ఆ పురూరవ శక్తి అద్భుతముగా నిల్చి
ఉన్నతోన్నత గతుల నోజో గుణం బెనయ
సచ్చిదానందాలు సర్వాన విలసిల్ల
గుణ సంపదలఁ బెంచుఁ దనుసంపదలఁ బెంచు ॥ 2989

(12)†క॥ స్వచ్ఛందమ్మౌ మతి హ్యా?
నిచ్ఛామాత్రమ్ముతోడ నీ విశ్వమ్మున్
స్వచ్ఛతమై సృష్టించిన
అచ్ఛ సుడంపతులు ప్రకృతి నాద్యులు చూడన్ ॥ 2990

†క॥ రవి కాంతుల విరజిమ్మఁగ
సవితృ గతిఁ గిరణ తతులు నపురూపములై
దివి భువి రోదసులన్ గడు
నవమై నిత్యమ్ము వెల్గు నవ జీవములన్ ॥ 2991

(13)†క॥ ధ్వనులు అవి రోదోఽంతరమున
ఘన శక్తిఁ బ్రతిధ్వనులుగఁ గ్రాలన్ ధృతమై
మననీయమ్మౌ శక్తి న
గణిత శివ తతులఁ బ్రకృతి వికాస మ్మొందున్ ॥ 2992

†క॥ ఒక ప్రకృతినుండి వేరొక
వికృతి ప్రకృతిగా జనించి విస్తృత గతులన్
అకటావికట మ్మౌచును
నాకటాటుప దగు రవి శశి లొనఁగు వెలుఁగులన్ ॥ 2993

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(14) ఘోరాతిఘోరమౌ గాఢ దుశ్శక్తులన్
అపకృతి రూపాల నంతరిక్షంబులో
పరలు గోశావళులబారి పడకుండంగఁ
బరమ గంతవ్యమౌ పరమపదమును జేర
నిత్య ఋత శక్తులన్ నిరత వ్రతమును బూని
పాప రూపమ్ములను రూపుమాపుచు సదా
పూజించి దైవమును బుణ్యగతులన్ దనరి
మహితగతిఁ జేయు నా మహాప్రస్థానమ్ము ॥ 2994

†(15) అద్భుతమ్మై వెలుఁగు నతిబృహత్తర చాంద్రి
హ్యాచ్ఛక్తి రూపమై యెసఁగు పురూరవ
దీప్త శక్తులు విశ్వ తేజమై వీర్యమై
అంతరిక్షమ్ములో నఖిల దివి భువులందు
సర్వ సఖ్యమ్ములను సర్వ దిశలను దనరి
స్థితిశక్తి వర్ధిల్లఁజేయు ననునిత్యమ్ము ॥ 2995

†(16) నాల్గు శరత్తు లవి నడవ నొక శరత్తుగ
వత్సర చతుష్కమ్ము వరల నొక్కెడుగా
మహిమాన్వితమ్మైన ఆ మర్త్య లోకాల
ద్వాదశాదిత్య కృతి ద్యోత శక్తులు పరల
సుకృతపరమై దినము లకలంకములుగాఁగ
ద్వాదశ దిన మితిఁ దనర రాత్రులు సృష్టి
విద్యుదాహారమై విలసిల్లుచుండఁగా
నవరూపమై వెల్గు నా చాంద్రి శక్తు లవి ॥ 2996

†(17) అంతరిక్షమ్ములో నవరూప శక్తులన్
సన్మంగళకరముగాఁ జాంద్రిశక్తులు వరల
హృదయగతమై యొప్పు నెనలేని సుకృతంపు
వర్తనమ్ములు సత్యవహములై నిత్య గతి
వరల విశిష్టమై వశిష్ఠగతు లవి మీర
విశ్వ రజో గుణము విధ్వస్త మగుచుండు ॥ 2997

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(18) సృష్టియజ్ఞము చేయు స్రష్టగా దేవుండు
మృత్యు బంధువుగాఁగ సత్యగత మై వరలి
దేవతల్ మానవు లీ విశ్వసర్వస్వ
మెల్ల చరాచరము నెనఁగ నశాశ్వత గతిఁ
బుణ్య కర్మలు హవిష పూర్ణ రతులను వెలుఁగ
స్వర్గ సౌఖ్యము లెల్ల సర్వమున వర్ధిలు
శ్రీమహావిష్ణుని స్థితిశక్తి మహిత మై
నజశక్తి సంపదలఁ బ్రజలు పెంపొందుదురు ॥ 2998

## సూక్తము—95

ఋషి—ఇలాపుత్రుఁడు పురూరవసుఁడు
ఋషిక—2,4,5,7,11,13,15,16,18-ఊర్వశి
దేవత—ఊర్వశీ పురూరవసులు

## అర్థాంతరము—2

(1)†చ॥ మనసునఁ గూడుకట్టి అతిమాన్య సుశక్తుల నద్భుతమ్ముగాన్
వినిమయమౌ సపార వరణీయ సుకాంతులు పూర్ణ నిత్య నూ
తన శశి దీప్త మైన అతిధౌత విశేషజ దైవ రూప మై
ఘనతర శబ్ద శక్తులను గ్రాంతముగా విలసిల్లి వెల్గెడున్ ॥ 2999

†(2) అతిబృహత్తర మైన ఆ దైవజ శక్తి
అతిలోక మహిత మై ఆ పురూరవసుగా
శబ్ద నిశ్శబ్దాల సంచలన శక్తులన్
గామాబ్ద రూపాలు క్రాల బహు రీతులన్
సౌర కాంతులు మహోష స్తేజ పూర్వక మై
తెమ్మెరల నింపంగ దీప్త భాగ్యావళుల
దిన మౌచు దివ్యాగ్ని తేజరిల్లును సదా
అతికాంత మై మహా ప్రగతి దాంతిగ నిలువ ॥ 3000

†(3) మేఘాళి విద్యుత్తు మెరుపులై మెరయ
అబ్దములు వర్షించు అఘ శబ్ద శక్తులన్
బ్రక్షాళనము చేసి ప్రవహింపఁగా జలము
విశ్వ మెల్లను మహా ప్రాశ్వి దీప్తుల వెలుఁగి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

గగనాన జలరాశి అగణితముగా సుగతి
నాధార రహితమై నచ్యుతముగా నిలుచు
మాయగా దైవీయ మహిమాన్వితపు శక్తిఁ
జంద్ర కాంతులు సర్వ సౌభాగ్యముల నొసఁగు ॥ 3001

†(4) అష్ట వసు శక్తులన్ అపురూపమై విశ్వ
మఖిల భూతావళుల సందాండ పిండాండ
బ్రహ్మాండ భాండాలు వరలుచున్ జరియించు
ఉషరూపమై అరుణుఁ డుజ్జ్వల దీప్తులన్
వెలుఁగుచున్ దిరుగుచున్ అలివిమాలిన గతుల
నతిబృహత్తరమైన నా చాంద్రశక్తితో
వరలు దైవజ రూప పరదేవతా శక్తి
నతులమౌ గతిరతుల సంతతిన్ వ్యాపించు ॥ 3002

†(5) సృష్టి స్థితి పూర్వక వ్యష్టి సమిష్టి విశిష్ట
లయ శక్తులే విశ్వమయ రూపమై సదా
నుత బృహత్తర మౌచు నతిమహత్తరమైన
ఆ పురూరవ రూపి అతిలోక దైవమ్ము
త్రివిధ గతులను జాంద్ర తేజాలు మీరంగ
సూక్ష్మాతిసూక్ష్మమై చోద్యాలఁ జోద్యమై
అతి గరీయమ్ములన్ అతిలోకమై నిలుచు
స్థిర మైన మాయయే చెలఁగ నిడగ నిల్చె ॥ 3003

†(6) ఆ గోవులుసే చూడ లన్నియున్ దిరుగునటు
సర్వ విశ్వమ్ములో సౌరమండల తతులు
చాంద్ర గోళాదులున్ సర్వ గ్రహ నక్షత్ర
తతులతోఁ దిరుగుచున్ అతులితమౌ శక్తి
సంచలన రూపాల శబ్ద శక్తులు సదా
సాజమై తనరారఁ దేజాల దేజమై
అనిలాల సలిలాల ఆకాశ రూపాల
దీపమ్ములై వరలు దేదీప్యమానగతి ॥ 3004

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) అతిలోక తేజాల సతత చాంచల్య గతి
నలరు విద్యుత్తులే ఆకసమ్మున మేఘ
మాలలన్ మిరుమిట్లు మాయగతులను మెరయ
నతిలోక శక్తుల ప్రతతులన్ బవనాళి
రకరకాలుగ జగతిఁ గ్రాలంగ వీవంగ
దివ్య దేవత లెల్ల నవ్య నవ గతులతో
నా పురూరవ శక్తి నతిచాంద్ర హృన్నిత్య
సత్య మహిత పవిత్ర కృత్యమ్ములన్ నెరపు ॥ 3005

†(8) సత్యమ్ముతో సత్వ నిత్య శక్తులు వరలఁ
బంచభూతాళులఁ బంచ భూతమ్ములో
అంతర్గతులతో నలరారు నట్లుగా
మానవాళుల మనిషి మహిమ మై తనరారు
ఆత్మగతిఁ బుత్రుఁడై అవతరించెడి తండ్రి
ఆదిశేషువు కాఁగ నతిలోక దీప్తులన్
ఆరాధనము చేసి అఖిలమ్మునను వెలుఁగు
సత్య రూపము వీడి మృత్యు రూపముఁ జేరి
తిమిర పుంజము లెల్ల నమితముగ వ్యాపించ
మత్త మద శక్తు లవి మిత్తి రూపము దాల్చు ॥ 3006

†(9) కామరూపాలతోఁ గ్రాలు మేఘాళిగా
నప్సరోగణ మెల్ల నమర శక్తుల మీరి
సృష్టి క్రతువున మహా స్రష్ట కృతిగా నిల్చి
శబ్ద శక్తులు వరల సర్వ విశ్వమ్ములో
మృత రూప శక్తు లమృత రూప శక్తులున్
బృథ్వులన్ దేవాళి పూత లోకమ్ములన్
ప్రతిలేని ఆంతర బాహిర శక్తులన్
అతిలోక దీప్తులన్ అఖిలమ్మును వెలుంగ
సౌర చాంద్రాదిత్య సంక్రాంతి గ్రహ ఋక్ష
తతు లెల్లఁ దనరారు ఋత శక్తి వరలంగ ॥ 3007

†రచయిత:—వాఙ్మయ మహోద్యమ, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) ఆకాశ మేఘాళి నంతర్గతిని వెల్గ
విద్యుల్లత లెల్ల విమలమౌ దివి భువుల
అతిలోక శక్తులన్ ఆంతటన్ వెలుఁగొందు
జల శక్తులను నిండి జ్వలితాగ్నిగా నిలిచి
దైవీయమౌ శక్తి తన వశము చేసికొని
దీర్ఘాయువును మహా దివ్యత్వ మొప్పంగ
నూర్వశిగాఁ దనరు నుత్తమోత్తమ చాంద్రి
పూర్ణాఽమృతశక్తి పొలుపొందు దివ్యమై ॥ 3008

†(11) ఆ పురూరవ శక్తి అత్యంత గోప్యమై
దివ్యమై నవ్యమై తేజరిలు నోజమ్ము
భవ్య శక్తుల వరలి భద్రరూపము కాఁగ
గోపినాథుని కృపను దీప గోపాలకత
సర్వ గోశాఽవశలు సర్వ విదుషులుకాఁగ
ఆజ్ఞ లేకుండఁగా విజ్ఞాన ప్రజ్ఞాన
సుజ్ఞాన శక్తులే యజ్ఞ బద్ధములట్లు
కాల బద్ధము లౌచుఁ గ్రాలుచున్ దిరుగాడు ॥ 3009

†(12) తల్లిదండ్రులు తనరు తనయుండు భాతి
నిచ్చా చక్రమ్ము నెసఁగు విజ్ఞానులను-
అగ్నిలోఁ దేజాలు అలరారు పగిది
మనసైన దంపతుల మాన్యవర్తన మలరు-
చంద్రచంద్రిక లౌచుఁ జల్లని వెన్నెలల్
సౌర తేజము లొప్పఁ జదలంటి వ్యాపించు
ఆ పురూరవ శక్తు లలర దైవతమౌచు
నూర్వశీ సహితమౌ నుప్పొంగు నమృతమై ॥ 3010

†(13) జల శక్తిలో నగ్ని చక్రగతిఁ దిరుగాడు
శివ శక్తిగా దివ్య నవ శక్తి వెల్గు
అస్తంగత మ్మౌచు నస్తంగతము కాని
అతిలోక శక్తిగా నలరు నా పురూరవ
శక్త్యద్భుతమ్మైన చాంద్రిశక్తిని నిల్వ
సూర్యుఁడే ఆత్మగా సర్వముండై వెలిఁగి
పితృరూపమ్ముగాఁ బుత్రుఁడై చంద్రుఁడై
నిత్య నవ శక్తులన్ నిత్యోత్సవము నెరపు ॥ 3011

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(14) విశ్వదీప్తులు మీర విమల ప్రాణము లొప్ప
నఖిల లోకమ్ములున్ నత్యంత దీక్షమై
పరమ గంతవ్యమౌ పరమ పదమును జేర
దిక్కాలములు లేని దివ్య శక్తిని జేర
నూర్వశి శక్తిమై నుజ్వల గతి మీర
ఆ పురూరవ రూప మమృత ధామము కాఁగ
నృత రక్తులన్ మహాద్భుతసక్తమై వెలుఁగ
ఋత శక్తితో సర్వ ఋతు తతుల విధనాదః ॥ 3012

†(15) పగలు రాత్రిలు సంధ్య లగణితములై తనర
సృష్టి స్థితి శక్తులన్ వెలుఁగు లయ శక్తులన్
సఖ్య భావమ్ముతో సర్వదా వెలుఁగొందు
నా పురూరవ శక్తి అపురూపమై నిలుచు
ప్రాణప్రద మ్మొంచు వరలు బృహత్తర చాంద్ర
వైష్ణవీయపు హృదయ భాగ్య తేజము వరలు ॥ 3013

†(16) శతవత్సరమ్ములే సంవత్సరము కాఁగ
నాల్గు సంవత్సరాల్ నాల్గు శరత్తులై
రాత్రులై వరలంగ రమ్య మహాచంద్ర
విహితమౌ దైవీయ విశ్వ శక్తులు సదా
అమర్త్య మై అచర మై అపురూపమై వెలుఁగు
దేవవేదజ మౌచు దేదీప్యమానమౌ
అమృతమ్మె ఘృతముగా నా సూర్యు లగ్నిగా
అఖిల విశ్వము యజ్ఞ మై యలరుచుండులే ॥ 3014

†(17) అరణో గణ కాంతి నంతరిక్షము సదా
క్షిప్ర శక్తులఁ దనరు శిక్షణగతి మీర
ఊర్వశిగాఁ జాంద్ర మూర్వశీ వశిష్ఠత
స్థితి శక్తి వరలంగ ఋత శక్తులన్ మీర
సుకృతాలె విశ్వాన సృష్టి రవి చాంద్రాది
దీప్తులై వెలయుంగఁ దెజరిలు హృచ్ఛక్తి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శ్రీమహావైష్ణవ చిద్విలాసము కాఁగ
సర్వ శక్తుల నెఱపు విశ్వమ్మునే నడుపు
దిక్కాలముల నెల్లఁ దీర్చిదిద్దుచు నిలుచు
విమల మానమ్ముగా వెలయ విశిష్టతల ॥ 3015

†గీ॥ అంతరిక్షమ్ము కాంతుల నావృతమయి
వెలసి నిత్యమ్ము దీప్తమై విశ్వ సృష్టి
దేవ దేవుని నిత్యమౌ దివ్య శక్తిఁ
బెట్టనట్టి దీపంబులై వెలుఁగుఁ గోట్లు ॥ 3016

†(18) నిత్యమ్ము విశ్వాన సత్య రూప మ్మొచు
మృత్యు బంధాలతో మేసులన్ దాల్చుచున్
మనుజాళి దేవాళి అంత మెనయని ప్రాణి
కోటు లెన్నియొ పుట్టి ఓటువడు మృత్యువుల
సృష్టి యజ్ఞమ్ముతోఁ జెలఁగి హవిషమ్ముగా
స్వర్గ మపవర్గాలు శశ్వదశాశ్వతమైన
వివిధ లోకా లెల్ల వెలుఁగు గ్రహ వృక్షాలు
అవతరించుచు నుండు అంతరించుచు నుండు
సత్య దీపాలుగా నిత్య దీపాలుగా
అసత్యరూపము లౌచు ననిత్యరూపము లౌచు
అఖిల విశ్వము తనరు నా దేవు మహిమమైఁ
దాత్కాలికపు స్వచ్ఛతలు నిత్యతలు తనరఁగా ॥ 3017

## సూక్తమ్—96

ఋషిః—బరురాంగిరసః, సర్వహరిర్వా ఐన్ద్రః
దేవతా—హరిః
ఛందః—జగతీ; 12,13-త్రిష్టుప్

(1) ప్ర తే మహే విదథే శంసిషం హరీ ప్ర తే వన్వే వనుషో హర్యతం మదమ్ ।
ఘృతం న యో హరిభిశ్చారు సేచత[1] ఆ త్వా విశన్తు హరివర్పసం గిరః ॥ 1102

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. చతఉఆ త్వా. (ప్రా.ప్ర.)

(2) హరిం హి యోనిమభి యే సమస్వరన్ హిన్వన్తో హరీ దివ్యం యథా సదః ।
ఆ యం పృణన్తి హరిభిర్న ధేనవ[1] ఇన్ద్రాయ శూషం హరివన్తమర్చత ॥ 1103

(3) సో[2] అస్య వజ్రో హరితో య[3] ఆయసో హరిర్నికామో హరిరా గభస్త్యోః ।
ద్యుమ్నీ సుశిప్రో హరిమన్యుసాయక ఇన్ద్రే ని రూపా హరితా మిమిక్షిరే ॥ 1104

(4) దివి న కేతురధి ధాయి హర్యతో వివ్యచద్వజ్రో హరితో న రంహ్యా ।
తుదదహిం హరిశిప్రో య[4] ఆయసః సహస్రశోకా[5] అభవద్ధరింభరః ॥ 1105

(5) త్వంత్వమహర్యథా[6] ఉపస్తుతః పూర్వేభిరిన్ద్ర హరికేశ యజ్వభిః ।
త్వం హర్యసి తవ విశ్వముక్థ్యమసామి రాధో హరిజాత హర్యతమ్ ॥ 1106

(6) తా వజ్రిణం మన్దినం స్తోమ్యం మద[7] ఇన్ద్రం రథే వహతో హర్యతా హరీ ।
పురూణ్యస్మై సవనాని హర్యత[8] ఇన్ద్రాయ సోమా హరయో దధన్విరే ॥ 1107

(7) అరం కామాయ హరయో దధన్విరే స్థిరాయ హిన్వన్ హరయో హరీ తురా ।
అర్వద్భిర్యో హరిభిర్జోషమీయతే సో[9] అస్య కామం హరివన్తమానశే ॥ 1108

---

1. ధేనవఽఇన్ద్రా, 2. సోఽఅస్య, 3. యఽఆయసో, 4. శిప్రో యఽఆయసః, 5. శోకాఽఅభవద్ధ, 6. హర్యథాఽఉప, 7. మదఽఇన్ద్రం, 8. హర్యతఽఇన్ద్రాయ, 9. సోఽఅస్య. (వ్రా.ప్ర.)

(8) హరిశ్మశారుర్హరికేశ[1] ఆయసస్తురస్పేయే యో హరిపా[2] అవర్ధత ।
అర్వద్భిర్యో హరిభిర్వాజినీవసురతి విశ్వా దురితా పారిషద్ధరీ ॥ 1109

(9) స్రువేవ యస్య హరిణీ విపేతతుః శిప్రే వాజాయ హరిణీ దవిధ్వతః ।
ప్ర యత్ కృతే చమసే మర్మృజద్ధరీ పీత్వా మదస్య హర్యతస్యాన్ధసః[3] ॥ 1110

(10) ఉత స్మ సద్మ హర్యతస్య పస్త్యోఽరత్యో న వాజం హరివాగ్ం[4] అచిక్రదత్ ।
మహీ చిద్ధి ధిషణాహర్యదోజసా బృహద్వయో దధిషే హర్యతశ్చిదా ॥ 1111

(11) ఆ రోదసీ హర్యమాణో మహిత్వా నవ్యంనవ్యం హర్యసి మన్మ ను ప్రియమ్ ।
ప్ర పస్త్యమసుర హర్యతం గోరావిష్కృధి హరయే సూర్యాయ ॥ 1112

(12) ఆ త్వా హర్యన్తం ప్రయుజో జనానాం రథే వహన్తు హరిశిప్రమిన్ద్ర ।
పిబా యథా ప్రతిభృతస్య మధ్వో హర్యన్ యజ్ఞం సధమాదే దశోణిమ్ ॥ 1113

(13) అపాః పూర్వేషాం హరివః సుతానామథో[5] ఇదం సవనం కేవలం తే ।
మమద్ధి సోమం మధుమన్తమిన్ద్ర సత్రా వృషంజఠర[6] ఆ వృషస్వ ॥ 1114

---

1. కేశఽఆయస, 2. హరిపాఽఅవర్ధత, 3. హర్యయస్యాన్ధసః, 4. హరివాగ్ంఽఅచిక్రదత్, 5. మథోఽఇదం,
6. జఠరఽఆవృషస్వ. (వా.ప్ర.)

## సూక్తము—96

ఋషి—ఆంగిరసుఁడైన వరువు లేక ఐంద్రుఁడైన సర్వహరి†
దేవత—ఇంద్రాశ్వములు†

(1)*గీ॥ యజ్ఞమందున నింద్ర! నీ హరుల నేను
నన్నుతించితిఁగాదె! ప్రశస్త[1]మతిని
నా విధంబున నీదు మహా ధనంబు
నాకు నభిమత మగుఁగాదె! శ్రీకరముగ ॥ 3018

*గీ॥ హరిత వర్ణము లైనట్టి యశ్వ[2]తతులు
యాగ కర్మలకుం బోయి యమరు ఘృతము
వలెను నుదకంబు వర్షించు వాని హరిత
వర్ణు నింద్రుని స్తుతియించు వాక్కుతోడ ॥ 3019

(2)*గద్యము॥
దేవసంబంధ యాగగృహమునుగూర్చి యింద్రుని నెట్లు ప్రేరేపించుచున్నారో! యట్లే యశ్వములను బ్రేరేపించుచున్న యే స్తోతలు ఇంద్ర స్థానభూత మగు నశ్వమును స్తుతించుచున్నారో! యింద్రుని నవప్రసూత గోవులు దూడలను తృప్తిఁబరచునట్టు లెవరు సోమములఁ బూరించుచున్నారో! యట్టి స్తోతలారా! మీరు ఇంద్రుని బలమును స్తుతులచే నర్చింపుఁడు! ॥ 3020

(3)*గీ॥ కడు నయస్సారభూతమై గ్రాలునట్టి
యింద్రు వజ్రము హరితమై యెసఁగి నిత్య
కాంతిదంబయి శాత్రవ గణమునకయి
వాని[3] హస్తమునం దెప్డు వరలియుండు ॥ 3021

*క॥ ధని శోభన హనులై యరి
గణగంతగ వెల్గు నింద్రు కమనీయాంచద్
ఘన రూపంబులు మిక్కిలి
యనయము హరితంబు లౌచు నమరుచునుండున్ ॥ 3022

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 21వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వరువు" గాను దేవత "ఇంద్రహరులు"గాను వ్రాసి, 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "బరువు లేక సర్వహరి" గాను దేవత "ఇంద్రుని అశ్వములు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ప్రశస్థ, (వ్రా.వ్ర.పా.), 2. యశ్వపితతి, (తా.పా.), 3. హస్తములయందు వర్తించు టమరుగాదె. (తా.పా.), వర్తించు చమరుచుండు. (మ.పా.)

(4)•గద్యము ॥
అంతరిక్షమందుఁ బ్రకాశకుఁడైనట్టి ఆదిత్యుని వలె నీ యింద్రుఁడు స్తోతలచే వినిహితుం
డయ్యెను. మరియు హరిత వర్ణము లగు నాదిత్యాశ్వములు వేగమున గంతవ్యస్థానము
నెట్లు పొందునో! యట్లు లింద్రుని వజ్రము స్పృహణీయమై శత్రు సంఘమును
వ్యాపించుచున్నది. ఎవని వజ్ర మయోవికారమైనదియై వృత్రాసురుని గొట్టు
చున్నదో! యా యింద్రుఁడు మహానుభావుఁడై సోమపాన రసమున
హరిత వర్ణ నాసికుఁడై[1] యపరిమిత దీప్తిని బొందుచున్నాఁడు ॥ 3023

(5)•గీ॥ హరిత రోమవదశ్వుఁడా! యజ్ఞమందు
జాత మైనట్టి యజమాన జాతివలన
నీవె సర్వత్ర హవ్యము నిశ్చయ మగు
ప్రీతిఁ గాంక్షించుమా! భువి ఖ్యాతిఁ గలుఁగ ॥ 3024

•గీ॥ హరిత వర్ణుండవై యింద్ర! యరులఁ దుంప
నవతరించి ప్రశస్తమై యసమ మగుచు
నమరునట్టి హవిర్లక్షణాన్నము తగ
నీవు కామించుచున్నావు [2]నిశ్చల మతి ॥ 3025

(6)•గీ॥ హరిత వర్ణము లైనట్టి హరులు మోద
మాను స్తుత్యుని నింద్రుని మా కృతేష్టిఁ
బొందఁజేయుచునున్నవి పూర్ణ సోమ
ములు మహేంద్రునికై యిట వెలుఁగుచుండె ॥ 3026

(7)•గీ॥ ఇంద్రకామనమును కెంతయుఁ జాలిన
నెల్ల సోమములు దరింపఁబడెను
సోమములు మహేంద్ర శోభకు సశ్వి ద్వ
యంబుఁ బంపుచుండె నాదరమున ॥ 3027

•గీ॥ శూర[3]సేవ్య మౌచు శోభిల్లు సంగ్రామ
సీమకుం గతించు శీఘ్రరథంబు
సోమవంతమైన సురనాథ యజ్ఞముఁ
బొందుచుండుఁగాదె! యంద మొప్ప ॥ 3028

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. నాశికుఁడై,(వా.ప్ర.పా.), 2. నిశ్చయముగ, (తా.పా.) 3. సూర. (వా.ప్ర.పా.)

(8)*క॥ హరిత వివర్ణ శ్మశ్రువు
హరిత సుకేశం డయోమయాత్ముఁడు హరి తాఁ
ద్వరితము సోమము ద్రావుచు
సురుచిర మగు వృద్ధిఁ బడ సెసుమ్ము॥ తలంపన్ ॥ 3029

*గీ॥ హరిత హయములచేఁ దాన యజ్ఞ ధనుఁడు
గా వెలుంగుచు నింద్రుఁడు కాంతయాన
మునకు హరులను గూర్చి మా పూర్ణ దురిత
ములను దొలఁగించుఁగావుత॥ మోద మలర ॥ 3030

(9)*గీ॥ పరమ హవ్య పూర్ణ పాత్ర ద్వయం బెట్లు
హోమమునుగురించి యెగి గతించు
నట్టు లింద్రదేవు నరదంబుపైఁ బెట్టి
యజ్ఞమునకుఁ బోవు నశ్వ యుగము ॥ 3031

*గీ॥ చమసవర్త మాన చారు సోమంబును
గ్రోలి హరులు మిగుల లీల నొందు
నపుడె యింద్రదేవ హనువులు సోమము
ద్రావఁ జలన మొందుఁ దత్క్షణంబ ॥ 3032

(10)*గీ॥ బలయుతుని నిన్ను బలభేది[1] పరమ సంస్త
వంబు కోరుచునుండె ముదంబుతోడఁ
[2]గాన ననికయి యశ్వముఁ జనెడు మాట్కి
నింద్రుఁడా॥ వసుధంబును నెలమిఁ జేరె ॥ 3033

*గీ॥ అట్టులైయున్నచో నింద్ర॥ యతిశయముగ
నన్నమును గోరుచున్నట్టి యఖిల పూరు
షాళి కన్నము విస్తృత మైన యట్లు
నీ వొసంగుచునున్నావు॥ నిశ్చయ మిది ॥ 3034

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. బేధి, (వ్రా.వ్ర.పా.), 2. కనుక. (తా.పా.)

(11)*క॥ అతికామయమానుఁడవై
సతతము రోదసులఁ గప్పఁ [1]జాలెడు నో స
న్మతి! నీవు ప్రియ స్తోత్రం
బతిశయముగఁ గోరుచుండి [2]యమరుదువుగదా! ॥ 3035

*గీ॥ అమరుఁడా! యతి మనోహరం బైన యట్టి
యంబు తలమును సుదక పరిహర్త యైన
సూర్యదేవునకుం జాల సొంపుఁ గలుఁగ
నీవు ప్రకటీకరింపుమా! నేర్పు మెఱయ ॥ 3036

(12)*‡చ॥ అమల గృహాది సంభృతము యాగ సుసాధన మౌచు వెల్గుచున్
సముచిత రీతి నంగుళుల సాధితమై కడు శస్త మైన సో
మమును జయార్థమై గొనుచు మాన్యుఁడవౌ [3]నిను నోయి వాసవా!
సమద మహాశ్వముల్ జనుల సన్నిధిఁ[4]బ్రీతిని బెట్టుఁగావుతన్! ॥ 3037

(13)*గద్యము ॥
ఓ యింద్రా! ప్రాతస్సవనికము లగు సోమములను ద్రావితివి! ఓయి! హరివంతుఁడా!
మాధ్యందిన సవనమునం దదే యగును. ఆ సవనమునందు మాధుర్యోపేత మగు
సోమమును గ్రోలుము! భూయిష్ఠవర్షిత! సోమమున జఠరమును నింపుకొనుము!॥ 3038

## సూక్తము—96

ఋషి—ఆంగిరసుఁడైన పరువు లేక ఇంద్రుఁడైన సర్వహరి

దేవత—హరి

### అర్థాంతరము—1

(1)†క॥ హరి మృత్తగు హరి సలిలము
హరి తేజమ్మగును గాలి హరి గగనం బౌ
హరి సర్వ చరాచర మగు
హరి సృష్టి స్థితి లయాలు హరి కర్త యగున్ ॥ 3039

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

‡వ్రాతప్రతిలో (14వ సంపుటము. 25 పుట.) "అమల గృహాది" ఇత్యాది పద్యమును బొరపాటున నుత్పలమాలగా నిర్దేశించుచు "ఉ॥" అని శ్రీనేమానివారు వ్రాసిరి.

1. జాలుచుండు సన్మతి. (తొ.పా.). 2. యమరుచుందువ్, (తొ.పా.), 3. మాన్యుఁడవేని కువాస, (తొ.పా.), నిను సదా వాసవుఁడ, (మ.పా.), 4. సన్నిధియందున పెట్టుగావుతన్. (తొ.పా.)

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†ఉ॥ శాబ్దికమైన శక్తుల విశాల మహత్తర విశ్వ రూప ని
శ్శబ్దగ దివ్య తత్త్వమయి చంచల నీలజ కామరూపతన్
ఆబ్ధము కాక నయ్యు మహితాద్భుతమైన అతీత శక్తులన్
అబ్దమె యౌను విష్ణు ముకురాంతర విశ్వము సృష్టి సర్వమున్ ॥ 3040

(2)†మ॥ హరియే నిల్చును సర్వ సృష్టికి సహాయ మ్మై మహా యోనిగా
హరియే సంతతి గాఁగ నిల్చి సకలాఽఽశా పూర్ణ గోళమ్ములై
హరి లోకమ్ములు తేజముల్ తిమిర సంస్త్యాయమ్ములౌ సృష్టి సం
భరితత్వంపు స్థితుల్ లయాళి హరి సర్వస్వమ్ముగా వెల్గెడున్ ॥ 3041

†(3) అలరు ననాహత మౌ నఘోరంపు శక్తు
లపురూపమై వెల్గ నతిలోక కాంతిన్
వజ్రి శక్తులు కూడ వశ మౌచు నిలువ
హరిత దీప్తుల విశ్వ హారమ్ముగా వెలిఁగి
అతివేల తేజాల నఖిల సృష్టిని మహా
దివ్య శక్తుల వివిధ నవ్య నవ రూపాల
పంచ భూతాలతో వరలు లోహాలతో
ధన మౌచు ఘన మౌచు ఖనిజమై జగతిగా
విశ్వ రూపమ్ముగా వివిధ రూపాలతో
సంసృష్టి సంభృత సంహార శక్తులన్
సర్వమ్ము మాయగాఁ బర్వఁగా లీలగా
హరివరలు సర్వదా పరమపదమునఁ దనరి ॥ 3042

†(4) అతిలోక సాహస్రి భృత దీప్తి కిరణాల
దివి భువి వ్యోమాలఁ దేజరిలుచున్ సదా
వివిధ శక్తులతో విలసిల్లు రవి వవుల
నద్భుత గతి మీరి ఆ విష్ణు చక్రి మది
ఆ హరి కరగత మ్మౌచు నలరుచునుండు
ధర్మ రక్షక మౌ సద్ధర్మ విధ్వంసకమై ॥ 3043

†(5) తేజ మూలమ్మైన దివ్య శక్తులతోఁ
గాంతి గోళా లెల్లఁ గ్రాలుచుండంగా
లీలగా మాయగా రేపు యామమ్ములై
వెలుఁగు చీకట్లతో విశ్వమ్ము వరలు
అగ్ని కణ జాలాలు అవుచు ద్రవ్యాలుగా
హరి దీప్తులై సదా వరలు సర్వస్వమున ॥ 3044

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) సృష్టి యజ్ఞాలలోఁ జెలఁగు దీప్తులు మహా
విష్ణు దేవుని జేర వెలుఁగులై వెలుఁగు
కాంతి పుంజాలతోఁ గ్రాలుచున్ వేగ్రులుచున్
సర్వ విధ లోకాలు పర్వ గోళాదులున్
సంచరించుచు సదా మించు హరిఁ జేరంగ
నిత్య యానము చేయు సత్య పథగాములై ॥ 3045

†(7) ఆకర్షణ వికర్షణాఽఽదిత్య కాంతి తతి
విశ్వమ్ములో సౌర విమల సోమాఽమృతము
లోక సంక్షేమాల లోలువత్వము మీర
నిత్య సంస్రవణ గతి సత్వ సంవర్ధక మగు
హరి శక్తి తతులతో నాదిత్య లోకాలు
అఖిల జగమును వరలు నంతరిక్షములోన ॥ 3046

(8)†క॥ హరి కృపను సూర్య తేజము
వర సోమాఽమృత రస మనవరతముఁ బీల్చున్
దురితాఽపహర మ్మౌచును
సురవరమై నిత్య సత్య శోభాన్వితమై ॥ 3047

†(9) లోకాలఁ జీకట్లఁ బోకార్చి విశ్వాన
హరి దివ్య తేజాలు ఆదిత్య దీప్తులన్
అఖిలమ్ము వ్యాపింప నంతర్గతుల శక్తి
నమృతతత్త్వమ్ముతో నలరారు సర్వదా
సర్వ వాహక మౌచుఁ బర్వెడి కాంతి తతి
శక్తివంత మ్మౌచుఁ జదలునన్ బ్రసరించు ॥ 3048

†(10) అతిశక్తివంతమై అఖిలాన వ్యాపించు
కాంతి పుంజా లెల్లఁ గ్రాలుచున్ విశ్వాన
దుష్పదార్థాళులన్ దున్మాడుఁ దిమిరాళి
నిత్య చైతన్య గతి సత్య మౌ శక్తి తతి
జాగరితమై సర్వ జగ మెల్ల వర్తింప
హరి శక్తి దీప్తులై అంతటన్ వర్తిల్లు ॥ 3049

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) రోదోఽంతరాళాన దృఢ దీప్త లొప్పారు
నిత్య నవ నవ్యమై సత్య భవమై వెల్గ
నరుణునికై తగు నాదిత్య శక్తులన్
విశ్వ సర్వస్వమ్ము నశ్విమయమై తనరు
హరిణ తత్త్వమ్ముతో నఖిల సృష్టియు వరల
వర్ధిల్లు హరి దీప్తి వర మనశ్శక్తులన్ ॥ 3050

†(12) కాల రథ గతులతోఁ గ్రాలఁగా లోకాలు
విశ్వాన దశ దిశల వెల్గొందు ప్రాణ్యాళి
అంతరిక్షమ్ములో నా రవి కాంతులన్
అమర సోమాఽమృత మమరమై స్రవియింప
ద్వంద్వగతి సృష్టి నిర్ద్వంద్వమై నిలువఁగా
హరి లీలయై సర్వ మలరారు విశ్వాన ॥ 3051

†(13) సర్వపితయౌ హరికి సకలమ్ము సంతాన
మై తనర మహితమై ధాత ధాతగ వెలుఁగు
హరి కేళిగా సృష్టి వరలంగఁ గేవలము
విశ్వ మొక యజ్ఞమై విలసిల్లఁగా సతము
నాదిత్య శక్తులను నమృతతత్త్వము మీఱ
రవి చంద్ర కాంతి తతి రాజిల్ల సోమమై
అభిషిక్తమై మహా ప్రభలు తనరారఁగా
సర్వ విశ్వము పూర్ణ శక్తివంత మ్మౌను ॥ 3052

## సూక్తము—96

ఋషి—ఆంగిరసుఁడైన వరువు లేక ఐంద్రుఁడైన సర్వహరి

దేవత—హరి

### అర్థాంతరము—2

†(1) ఆకాశ మ్మనిలమ్ములు నసలమ్ములు సలిలమ్ములు
పృథివిమయమ్ము కాఁగ సృష్టి సర్వస్వము వరలంగా
హరి రూప మ్మై పుట్టును హరి రూప మ్మై నిల్చును
హరి రూప మ్మై పెరుగును హరి రూప మ్మై తరుగును
హరి రూప మ్మై సర్వ మ్మంతర్హితమై పోవు జగతి
హరి కర్తగ హరి కర్మగ నఖిలమ్మును జరుగుచుండు ॥ 3053

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) శ్రీమహావిష్ణువే చెలఁగు కారణ మౌచు
దివి భువులు విశ్వమ్ము తేజరిలు సర్వదా
కాంతి పుంజాలతోఁ గ్రాలు లోకా లెల్ల
సర్వ విధ గోళాలు సదమల శక్తులన్
దిరుగాడులే జగతిఁ దరణి కుటుంబమై
సత్పదార్థాళిమై నసత్పదార్థాఽభి శక్తి
విధ్వస్త మొనరించి విమల సంక్షేమ గతి
విలసిల్లఁగా సర్వ విశ్వ కళ్యాణముల
నభివర్ధనము చేయు నాత్మ శక్తులు వరల
దివ్య శక్తుల సకల దేవాఽఽళులే తనర ॥ 3054

(3)† అతిలోక దీప్తమౌ నత్యంత యత్నాల
నన్నింట విహరించు నా వజ్ర శక్తితతి
నలవోకగాఁ ద్రుంచు నా హరి కిరణాళి
అతిమానస మ్మైన అనాహత హృచ్ఛక్తి
అఘోర రూపమై ఆ హరి కర గత
చక్ర శక్తుల మీఱి అవక్రాఽజయ్య మౌ
దివ్య దీప్తుల రూప నవ్యత్వ మలరార
వైష్ణవీయమ్ముగా వరలు సత్యమ్ముగా ॥ 3055

†(4) అతిసహస్రమ్మైన అతిలోక కాంతులే
అక్షర దీప్తులై అక్షయ శక్తులన్
హరి కారణమ్ముగా నావిర్భవము చెందు
నపురూప సౌందర్య మలరార విశ్వాన
దేవ లోకావళులు దివ్య రూపాలతోఁ
గామ రూప ప్రశస్త ధామమ్ములై వరలు ॥ 3056

†(5) శ్రీమహావిష్ణుమయ చిద్విలాసమ్ములే
సృష్టి మూలమ్ములై చెన్నొందులేః సదా
హరి కాంతి కిరణాలె తరణి శశి గ్రహ ఋక్ష
తతి రూపమై వెలిఁగి అతులిత శక్తులన్
గాంతివంతము చేయు గ్రహియించు సర్వమ్ము
క్షాళనమ్మును జేయు సదమలమ్మును జేయు
సద్రూప మౌ సృష్టి చిద్రూప మై తనర
నానంద రూపమై అలరారు నిరతమ్ము ॥ 3057

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) గ్రిహరాజ కుటుంబ రాజిత గ్రిహ ఋక్ష
రాజాలు దీప్తులన్ రాజిల్లుచున్ దిరుగ
విశ్వ రథమ్ముతో విమలాఽశ్విపుంజాల
వజ్రి శక్తుల మీఱు వర హరి దీప్తులే
కాలమ్మె మద మౌచుఁ గాలమ్మె మందమై
కాలిఁ గాలాఽతీత మూల శక్తులు వరల
దిక్కాలములు లేని దివ్యతత్త్వమ్ముతోఁ
దనరారు శ్రీవిష్ణు ఘన శక్తి సర్వదా ॥ 3058

†(7) అమృతమ్ము గ్రిహియించు నా రవి కిరణాలు
హరి శక్తి జ్వలియించు హరి శక్తి వర్ధిల్లు
విశ్వ ధారక మౌచు విశ్వ భారక మౌచు
సర్వ ధామమ్ముగా సర్వ కామద మౌచు
నాకర్షణ శక్తు లఖిలాధిపత్యాల
నలరంగ సృష్టికి నాధారభూతమై
నంచలన తత్త్వాల నంచితముగా సర్వ
గోళాలు లోకాలు వేలలన్ వెలుఁగొందు ॥ 3059

†(8) కాంతి కిరణావళులె కాలిఁ గేతువు లౌచు
దివ్య రూపమ్ములై తేజరిల విశ్వాన
నాధిపత్యము మీఱ నంతయున్ వ్యాపించు
నతిలోక వేగాన నపురూప పయనాల
విష్ణు పదమును జేరు విమల లక్ష్యమ్ముతో
విశ్వమే పరువెత్తు నశ్వి శక్తులు మీఱ ॥ 3060

†(9) విష్ణు శక్తులు మహా విశ్వమున్ శాసించుః
సూర్య చంద్రాదులను జోద్యమ్ముగా నిలుపుః
గాంతులన్ గ్రాంతులన్ గ్రాలంగఁ జేయులేః
సృష్టిలో మహితమై చెల్వొందు నమృతమును
ఆ కాంతి కిరణాలు ఆకర్షణ కృతుల
స్వీకరించును సదా ప్రాకృత హరి శక్తి
విశ్వ సౌభాగ్యముల విశ్వ కళ్యాణముల
శాంతి సుఖ సంపదలు సంక్షేమముల మీఱ ॥ 3061

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) "అభి"శక్తి వర్ధిల్ల హరియించి జల నాభి
లోక కంటక మౌచు భీకరముగా వ్యాప్తి
చెందు వృత్రుని శక్తిఁ జెండాడి పవి శక్తి
రవి శక్తులై వరల రక్షించి జలదాల
హరి కరుణ వర్ధిల్ల వర సృష్టి సర్వస్వ
మరి వీరుల జయించి అభ్యుదయ మ్మొందు
నహి శక్తిఁ జరియించి బృహదంతరమ్ములై
మహి దేవులు సర్వాలు మహితమ్ములై వెలయు ॥ 3062

†(11) నిత్య నవ నవ్యమై నెగడు నాకాశమ్ము
దివి పృథ్వి లోకాలు తేజో౽గ్ని లోకాలు
వాయు లోకావళులు వరుణ లోకావళులు
నతిశక్తి మీఱంగ నావిష్కృతము లౌచు
హరి మహిమమై నిలుచు నద్భుతగతి తోప
జల హరణ శక్తులన్ విలసిల్లు సూర్యాది
గోళాలె జలదాలఁ గ్రిలఁజేయుచు వెలుఁగ
శబ్ద శక్తులు సదా చద లంటి విశ్వాన
నాకాశ గుణ మౌచు నపురూప రూపమై
వరల నసంఖ్యాక వర చార శక్తులే
శాశ్వత గతి తోప నశాశ్వత తత్వమ్మునన్
విశ్వ రూప మ్మౌచు నశ్వులన్ దనరారు ॥ 3063

†(12) హరి శక్తి నత్యంత మత్యద్భుతమ్ముగా
వెలుఁగొందుచున్ సూర్య విస్తృత తేజాల
కిరణాలు జగములోఁ బరివ్యాప్తి నొందుచున్
అనునిత్యమున్ వరల నపురూప శక్తులన్
దశ దిశల నిత్యమ్ము నిశి దినము లొప్పంగ
సృష్టి యజ్ఞము తనరు స్రిష్ట ప్రిజ్ఞలు మీర
నమృతరసమును బిల్చి అమితమ్ముగా వెల్గు
నా విష శక్తులన్ హరియించు ననల గతిఁ
గాల రథమున వరలి కాలాంతక మహిత
నిత్య రూప మ్మౌచు సత్య దీప మ్మౌచు
హరి బద్ధమై జగము పరమ పదమే సర్వ
పరమ గంతవ్యమై ప్రిబలమై వెల్గొందు ॥ 3064

---

†రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

†(13) వ్యష్టి సమిష్టులను సృష్టిలోఁ దనరారు
నమృతమును ఘృతమును నా క్షీర మధురాల
జలములన్ గ్రహియించి జ్వలిత జ్వాలలతోఁ
జిత్రాతిచిత్రమౌ సృష్టి యజ్ఞమ్ములోఁ,
జాంద్ర సౌరాది విశ్వాత్మ దీప్తులు వరల
విశ్వాదిగా సర్వ విశ్వాంత్యమువఱకు
సృష్టి స్థితి లయ గతులఁ జెలఁగుచున్ నిత్యమ్ము
హరి లీలగా సకల చరము నచర మొప్పు ॥ 3065

## సూక్తమ్—97

ఋషిః—ఆథర్వణో భిషగ్
దేవతా—ఓషధయః
ఛందః—అనుష్టుప్

(1) యా [1]ఓషధీః పూర్వా జాతా దేవేభ్యస్త్రియుగం పురా ।
మనై ను బభ్రూణామహం శతం ధామాని సప్త చ ॥ 1115

(2) శతం వో [2]అమ్బ ధామాని సహస్రముత వో రుహః ।
అధా శతక్రత్వో యూయమిమం మే [3]అగదం కృత ॥ 1116

(3) ఓషధీః ప్రతి మోదధ్వం పుష్పవతీః ప్రసూవరీః ।
అశ్వా[4] ఇవ సజిత్వరీర్వీరుధః [5]పారయిష్ణ్వః ॥ 1117

(4) ఓషధీరితి మాతరస్తద్వో దేవీరుప బ్రువే ।
సనేయమశ్వం గాం వాస[6] ఆత్మానం తవ పూరుష ॥ 1118

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. యా౽ఓషధీః, 2. శతం వో౽అమ్బ, 3. మే౽అగదం, 4. అశ్వా౽ఇవ, 5. పారయిష్ణవః,

6. వాస౽ఆత్మా. (వ్రా.ప్ర.)

(5) అశ్వత్థే వో నిషదనం పర్ణే వో వసతిష్కృతా ।
గోభాజ ఇత్ కిలాసథ యత్ సనవథ పూరుషమ్ ॥ 1119

(6) యత్రౌషధీః సమగ్మత రాజానః సమితావివ ।
విప్రః స[1] ఉచ్యతే భిషగ్ రక్షోహామీవచాతనః ॥ 1120

(7) అశ్వావతీం సోమావతీమూర్జయన్తీముదోజసమ్ ।
ఆవిత్సి సర్వా[2] ఓషధీరస్మా అరిష్టతాతయే ॥ 1121

(8) ఉచ్ఛుష్మా[3] ఓషధీనాం గావో గోష్ఠాదివేరతే ।
ధనం సనిష్యన్తీనామాత్మానం తవ పూరుష ॥ 1122

(9) ఇష్కృతిర్నామ వో మాతా ఽథో యూయం స్థ నిష్కృతీః ।
సీరాః పతత్రిణీః స్థన యదామయతి నిష్కృథ ॥ 1123

(10) అతి విశ్వాః పరిష్ఠాః స్తేన[4] ఇవ వ్రజమక్రముః ।
ఓషధీః ప్రాచుచ్యవుర్యత్ కిం చ తన్వో౩ రపః ॥ 1124

1. సఽఉచ్యతే, 2. సర్వాఽఓషధీరస్మాఽఅరిష్ట, 3. ఉచ్ఛుష్మాఽఓషధీనాం, 4. స్తేనఽఇవ. (వా.వ్ర.)

(11) యదిమా వాజయన్నహమోషధీర్హస్త¹ ఆదధే ।
ఆత్మా యక్ష్మస్య నశ్యతి పురా జీవగృభో యథా ॥ 1125

(12) యస్యౌషధీః ప్రసర్పథాంగమంగం పరుష్పరుః ।
తతో యక్ష్మం వి బాధధ్వ ²ఉగ్రో మధ్యమశీరివ ॥ 1126

(13) సాకం యక్ష్మ ప్ర పత చాషేణ కికిదీవినా ।
సాకం వాతస్య ధ్రాజ్యా సాకం నశ్య నిహాకయా ॥ 1127

(14) అన్యా వో ³అన్యామవత్వన్యాన్యస్యా ⁴ఉపావత ।
తాః సర్వాః సంవిదానా⁵ ఇదం మే ప్రావతా వచః ॥ 1128

(15) యాః ఫలినీర్యా⁶ అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః ।
బృహస్పతిప్రసూతాస్తా నో ముంచన్త్వంహసః ॥ 1129

(16) ముంచన్తు మా శపథ్యా౩దథో వరుణ్యాదుత ।
అథో యమస్య పడ్బీశాత్ సర్వస్మాద్దేవకిల్బిషాత్ ॥ 1130

---

1. హస్తఽఆదధే, 2. బాధధ్వఽఉగ్రో, 3. వోఽఅన్యా, 4. న్యస్యాఽఉపావత, 5. సంవిదానాఽఇదం,

6. ఫలినీర్యాఽఅఫలాఽఅపుష్పా. (ప్రా.ప్ర.)

(17) అవపత న్తీరవదన్ దివ[1] ఓషధయస్పరి ।
యం జీవమశ్నవామహై న స రిష్యాతి పూరుషః ॥ 1131

(18) యా[2] ఓషధీః సోమరాజ్ఞీర్బహ్వీః శతవిచక్షణాః ।
తాసాం త్వమస్యుత్తమారం కామాయ శం హృదే ॥ 1132

(19) యా[2] ఓషధీః సోమరాజ్ఞీ[3]ర్విష్ఠితాః పృథివీమను ।
బృహస్పతిప్రసూతా [4]అస్యై సం దత్త వీర్యమ్ ॥ 1133

(20) మా వో రిషత్ ఖనితా యస్మై చాహం[5] ఖనామి వః ।
ద్విపచ్చతుష్పదస్మాకం సర్వమస్త్వనాతురమ్ ॥ 1134

(21) యాశ్చేదముపశృణ్వన్తి యాశ్చ దూరం పరాగతాః ।
సర్వాః సంగత్య వీరుధో ఽస్యై సం దత్త వీర్యమ్ ॥ 1135

(22) ఓషధయః సం వదన్తే సోమేన సహ రాజ్ఞా ।
యస్మై కృణోతి బ్రాహ్మణస్తం రాజన్ పారయామసి ॥ 1136

---

1. దివఽఓషధయ, 2. యాఽఓషధీః, 3. రాజ్ఞీర్విష్ఠతాః 4. ప్రసూతాఽఅస్యై,

5. యస్మై చాహ ఖనామివః. (ప్రా.ప్ర.)

(23) త్వము త్తమాస్యోషధే తవ వృక్షా[1] ఉపస్తయః।

ఉపస్తిరస్తు సో౽౽స్మాకం యో[2] అస్మాగ్ం అభిదాసతి ॥ 1137

## సూక్తము—97

ఋషి—అథర్వపుత్రుఁడు భిషక్కు[†]

దేవత—ఓషధి[†]

(1)*గద్యము॥

ఋతువులవల్ల నే యోషధులు పురాతనములై జాతము లైనవో! యా యోషధులనుంచి వసంతమునందుఁ, ప్రావృట్కాలమునందు, శరత్తునందు, నేను బభ్రువర్ణము లగు సోమాద్యోషధులయొక్క శతము సప్త స్థానములను నూహించుచున్నాను ॥ 3066

(2)*గద్యము ॥

ఓ యోషధులారా! మీ ధామము లపరిమితములు. మరియు మీ ప్రరోహ మపరిమితము. మరియు నో శతకర్మలారా! మీరు నన్ను రోగ రహితునిగాఁ జేయుఁడు! ॥ 3067

(3)*గద్యము॥

ఓ యోషధులారా! మీరు పుష్పవతులు, ప్రసవములు, పుష్పములు, గలవారు. అశ్వముల వలె రోగమును జయించువారు, రోగమునుండి పురుషుని ప్పించువారలునై యీ రుగ్ణమునుగూర్చి హృష్టు లగుదురుగాక! ॥ 3068

(4)*గద్యము॥

ఓషధులారా! ద్యోతమానగుణకులారా! మాతృ వర్ధితకాయులారా! మీ సంబంధి యగు భిషక్కుతో "అశ్వమును, గోవును, ఁంపకమును, దుద ౹ాత్మను, ఓ చికిత్సకా! నీ కిచ్చెదను" అని పలికెదను ॥ 3069

---

1. వృక్షా౽ఉప, 2. యో౽అస్మాగ్ం౽అభిదాసతి. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 28వ పుటలో ఏ సూక్తమునకు ఋషి "అథర్వ పుత్రుఁడు భిషక్కు"గాను దేవత "ఓషధి"గాను వ్రాసి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "భిషజువు"గాను దేవత "ఓషధులు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(5)*గద్యము॥

ఓషధిదేవతలారా! మీ సదనము అశ్వత్థములయందుఁ గలదు. పలాశమందు మీ వసతి ప్రకాశించుచున్నది. పురుషుని సేవించినచో గోవులకు సంబంధ భాజయితలుగ నుండుఁడు! ॥ 3070

(6)*గద్యము॥

యుద్ధమందు రాజులు సంగతు లగునట్లు ఏ దేశమం దోషధులు కలిసికొనునో! యచ్చటఁ బ్రాజ్ఞుఁడు భిషక్కని పిలువఁబడెను. అపుడు రక్షోహంత వ్యాధినాశకుఁడు నగుచున్నాఁడు ॥ 3071

(7)*గద్యము॥

ప్రధానభూతము లగు నోషధులు నాలుగు. ఆ సర్వోషధులను నీ రోగమును నశింపఁజేయుటకు స్తుతించెదను ॥ 3072

(8)*గద్యము॥

గోవులు గోష్ఠమునుండి వలె స్వసామర్థ్య లక్షణమును నొసఁగుటకుఁ గోరుచున్న ఓషధుల బలములు స్వవీర్యమును రుగ్ణమందుఁ బ్రోద్గ మించుచున్నవి. ఓ రోగగ్రస్త పురుషుఁడా! ఆత్మను [1]ఓషధులను బొందించుచున్నావు! ॥ 3073

(9)*గద్యము॥

ఓ యోషధులారా! మీ జనని సర్వరోగ నిష్కృతిగదా! కాఁబట్టి మీరు నిష్కృతులు. మీరు సరణశీలలు, పతనవతులు[2] కండు! పురుషుఁడు వ్యాధితుఁ డయినయెడల వానిని సంస్కరింపుఁడు! ॥ 3074

(10)*గద్యము॥

అంతట నున్న ఓషధులు స్తేనుఁడు వ్రజము నతిక్రమించునట్లు వ్యాధుల నతిక్రమించుచున్నవి. అటు లొనర్చి రుగ్ణ శరీరముయొక్క వ్యాధి లక్షణమును బోఁగొట్టుచున్నవి ॥ 3075

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఓషధులకు. (ప్రా.వ్ర.పా.), 2. పతనవతులు. (ప్రా.వ్ర.పా.)

(11)*గద్యము॥
రుగ్ణుని బలవంతునిగాఁ జేయుచు నేను నోషధులను హస్తమందు ధరించునపుడు మృత్యువువల్ల జీవము వధింపఁబడునట్లు రోగాత్మ నశించును ॥ 3076

(12)*గద్యము॥
ఓషధులారా! మీరు ఉద్గీర్ణబలుఁడు, మధ్యమస్థానమందు వర్తమానుఁడు నగు రాజు ఉపద్రవకారు లగు శత్రువులను ప్రతిపదమునందు బాధించునటుల రుగ్ణునియొక్క ప్రత్యంగమునందుఁ బ్రతిపర్వమునందుఁ గల వ్యాధిని బాధించుచున్నారు ॥ 3077

(13)*గద్యము॥
అస్మదీయ శరీరాధిష్ఠాయి వగు నో వ్యాధీ! అతిశీఘ్రము పోవు "చాషాఖ్య"పక్షితోడను "కికిదీవి"యను పక్షితోను నతివేగమునఁ బొమ్ము! గోధికతోఁగూడ నాశము నొందుము! ॥ 3078

(14)*గద్యము॥
ఓ యోషధులారా! మీలో నొక యోషధి వేరొక యోషధిని బొందుఁగాక! ఒకదాని చెంత కొకటి [1]పోవుఁగాక! క్షితియం దే యోషధులు గలవో! యవి యన్నియుఁ బరస్పరైకమత్యము పొందినవియై మా స్తుతి లక్షణ వచనమును రక్షించుత! ॥ 3079

(15)*గద్యము॥
ఏవి ఫలవతులో! యేవి ఫలవర్జితలో యేవి పుష్పరహితలో బృహస్పతి యను మంత్రాభిమానదేవునివల్ల ననుజ్ఞాత లగు నవి మమ్ముఁ బాపములనుండి రక్షించుఁగాక! ॥ 3080

(16)*గద్యము॥
శపథ జనిత మగు పాపమునుండి యోషధులు నన్ను రక్షించుఁగాక! వరుణ స్వపాశమునుండి రక్షించుఁగాక! యముని పాశబంధనమునుండి నన్నుఁ దప్పింపుఁగాక! కేవలము వరుణాది పాపమునుండియే కాదు దేవ కృతము లగు కిల్బిషమునుండికూడఁ గాపాడుఁగాక! ॥ 3081

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. పొందుఁగాక. (వ్రా.ప్ర.పా.)

(17)*గద్యము॥
దివమునుండి క్రిందఁబడుచున్న ఓషధులు "ఏ పురుషుని మేము పొందెదమో!
ఆ పురుషుఁడు హింసింపఁబడఁడు" అని పలికినవి ॥ 3082

(18)*గద్యము॥
ఏ యోషధులు సోముఁడు రాజుగాఁ గలవియో! ఏవి యసంఖ్యాతలో! ఏవి బహుదర్శనలో:
ఓ సోమాఖ్యోషధీ! ఆ యోషధులలో నీవు ఉత్తమమైనదానవు! కాఁబట్టి కాంత
హృదయమునకు సుఖకారి వగుము! ॥ 3083

(19)*గద్యము॥
సోమ రాజులు, పృథ్వియందు వివిధముగ నున్నట్టి వారలు, అంతరిక్షమునుండి వచ్చిన
వారలు, నగు మీరు బృహస్పతిచే ననుజ్ఞాతలై యీ రుగ్ణ తనువునందు వీర్యమును
సమకూర్చుఁడు! ॥ 3084

(20)*గద్యము॥
ఓ యోషధులారా! యే భూ ఖనన కర్తయు మిమ్ము హింసింపకుండును. రుగ్ణునికొఱకు
మిమ్ము నేను దర్వెదను. మరియు మా పుత్ర భృత్యాదికము, గో మహిష్యాదికము
రోగరహిత మగుఁగాక! ॥ 3085

(21)*గద్యము॥
ఏ యోషధు లీ స్తోత్రమును వినునో! యేవి దూరమునుండి పరాగతములై సర్వవీరుత్తులను
గలియునో! ఆ వీరుత్తులు రుగ్ణ తనువునందు వీర్యమును నుంచుఁగాక! ॥ 3086

(22)*గద్యము॥
"ఏ రుగ్ణునికొఱకు (బ్రాహ్మణః) వైద్యుఁడు చికిత్సను జేయునో! ఆ రుగ్ణుని మేము
తప్పించెదము" అని యోషధులు సోమునితో వాదించుచున్నవి ॥ 3087

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(23)*గద్యము॥
ఓ సోమాఖ్యోషధీ! నీ వోషధులలో నుత్తమురాల వగుచున్నావు! నీ వృక్షము లన్నియు నధశ్శాయినులే! మ మ్మెవ్వఁడు హింసించునో! వాఁ డధశ్శాయి యగుఁగాక! ॥ 3088

## సూక్తము—97

ఋషి—అథర్వపుత్రుఁడు భిషక్కు
దేవత—ఓషధి

## అర్థాంతరము—1

†(1) దేవాళివల్లను దివ్య శక్తులు మీఱ
మూఁడు యుగములు కాఁగ మూఁడు కాలాలలో
సప్త విధాఽఽకాశ సప్త విధ మరుదాళి
సప్త విధాఽగ్నుల సప్తవిధ సలిలాళి
సప్త విధమౌ పృథ్వి శక్తి తత్త్వాలమై
సృష్టి శక్తులు మహాస్థితి లయ శక్త్యాళు
లతిమానసపు రతుల నపురూప గతి వెలయ
శతధామముల జగతి సతతమ్ము జనితమై
ఉద్భూతమై పెరుగు నోషధీతతి సదా
అద్భుతరీతులన్ అఖిల విశ్వమ్ములో ॥ 3089

†(2) ఆ ప్రకృతి మాతగా నలరు జగన్మాత
కతిలోక రూపాల శత సహస్రములుగా
స్థానాలు విలసిల్లు సర్వ ధారక మౌచు
శత విధమ్ముల పరలు ఋత సృష్టి క్రతువులన్
దుష్ట జాడ్యమ్ములన్ దున్మాడుచున్ బ్రకృతి
ఓషధీ తతి గతుల నొప్పుచుండును సదా ॥ 3090

†(3) కాంతి తేజో రాశి కాంతి శక్తులు వోలె
విశ్వాన నోషధులు విమలమ్ములై పుట్టిఁ
బెంపొంపఁ బుష్పించు నింపైన ఫ్రతిఫలము
లానంద రూపాల నత్యంత సహజముగ
నలరించుచుండు నా మలినాళిఁ బోఁగొట్టి
సృష్టి స్థితి లయ గతు లిష్టిగాఁ జెల్వొంద ॥ 3091

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అత్యద్భుత మ్మైన అతిపురుష శక్తులన్
ప్రకృతి దేవియె నిత్య భవ్య మాతగ నిలువ
నోషధీ రూపమై ఉజ్జ్వల శక్తులన్
ఆత్మ ప్రతికృతిగాఁగ నలరారి గోళాల
నఖిల లోకాలలో నతిరతి నాప్పార
నుత్పన్నమై పెరుగు నొదిగి కలియును బ్రకృతి ॥ 3092

†(5) అకలంకమై వెలుఁగు నపురూప కళలతో
నమరగతి నలరారు నా విశ్వపూరుషుని
నద్భుతమ్మౌ శక్తు లఖిల గోళావళుల
నాకాశ మనిలాల ననలాల సలిలాల
మృత్పదార్థావళుల మెలఁగు నా విష్ణు కృప
సృష్టి వృక్షమ్ము నకుఁ జెలఁగు పర్ణాలుగాఁ
బుష్ప ఫలాలుగాఁ బొలుపొందు లోకాలు
ప్రకృతి రూపమ్ములై ప్రకటిత మ్మై తనరు ॥ 3093

†(6) చాంద్ర శక్తులు మీఁఱ జలువల వెన్నెలల
కాంతి కిరణావళులఁ గ్రాలు ప్రకృతి పదార్థ
సంపదలు సద్గుణ సంచయములన్ దనరు
విజ్ఞాన ధని యైన భిషజుని మేధగా
రక్ష శక్తులు సృష్టి రమణీయమై పరలి
విస్తృతగతు లొప్ప విశ్వరూపముఁ దాల్చు ॥ 3094

†(7) విశ్వ ప్రకృతిలోన విపరీత రీతులన్
అపకృత కృతుల బహిరంతర గతులతో
నలరెడి దుర్గుణ పదార్థాల నన్నింటి నణఁచఁగాఁ
జాంద్ర కిరణావళులు సౌరాది గ్రహరాజి
ఉష్ణ కవోష్ణాదివరోజ్జ్వల కాంతులు
ఆనందమును గూర్పు నఖిలౌషధులఁ బెంచు
నోజో గుణమ్ములను నుత్తమ గతి నించు
సంవర్ధకత నిండ సర్వ ప్రకృతి తనరు ॥ 3095

†(8) వివిధ లోకా లెల్ల నవ నస్య శాలలై
ఓషధీ నిలయాలు నుషసాళి వెల్గొందు
విశ్వ పూరుష శక్తి విష్ణు సంవర్ధకత
నాత్మీయ మౌ స్థితి నశ్వి శక్తులు తనరఁ
బ్రకృతి పదార్థాలె వరల బల వర్ధక
శక్తులై ఓషధీ సంపదలుగా వరలు ॥ 3096

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) ప్రికృతి మాతయె సర్వ ప్రికార శక్తుల నొసఁగుఁ
బ్రికృతి మాతయే సృష్టి సకలమ్మునకు సదా
దుష్కృతులఁ దున్మాడి నిష్కృతిని జూపించు
విశ్వ వృక్షమ్మునకు విపుల పత్రిలుగా
గోళాలు లోకాలు గుణ పుంజములు మీఱ
నా విష్కృతము లౌను నద్భుత రూపాల ॥ 3097

†(10) అతి విశ్వ రూప మై అత్యద్భుతమ్ముగా
నలరు కాంతుల మహా యత్న ప్రిసారాల
నతులిత దీప్తులన్ అతి సూక్ష్మ శక్తులన్
ఓషధీ రూప మై ఒనరు పదార్థాలు
లతలు వృక్షమ్ములన్ రాళ్ళు రప్పలు వివిధ
వస్తు గుణ సంపదలు వర్ధిల్లులేః సదా ॥ 3098

†(11) జడ పదార్థతల కజడ పదార్థాలకికి
నగు చలాచరమ్ములరు నన్నిటికి సృష్టిలో
నిత్య నూతనమైన నత్య సత్వము నొసఁగి
ఆత్మ శక్తిని మహా యజ్ఞ విశ్వమ్ము గా
జీవ సత్త్వము నిచ్చు దేవ తత్త్వము నిచ్చు
సర్వ నాశనముగ నశాశ్వత గతి నిచ్చు ॥ 3099

†(12) వస్తు గుణ తతులతో వరలు నీ సృష్టిలోఁ
గదలాడుచున్ అసలె కదలక మెదలక
పడి ఉండు జడముగ వరలు నన్నియుఁ గూడ
నంగాంగములు నలరు నౌషధీ తతులుగా
ఉగ్రిమై ఉష్ణమై ఒనర మధ్యోష్ణమై
కాిలఁగఁ గవోష్ణ గతి లీల శీతల గతులఁ
బ్రికృతి నారోగ్యమ్ము నకటా వికటము చేయు
క్షీణ రూపము కూర్చుఁ గీడు శక్తుల నెల్ల
రూపు మాపుచు విశ్వ దీప యువ శక్తులే
సృష్టి నంస్థితి గతులఁ జెల్వొందు సాజముగ ॥ 3100

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

†(13) వృద్ధి క్షయాలతో విశ్వ లోకమ్ములను
నన్లాల సలిలాల సనిలాల మృద్గతుల
నాకాశ వ్యాప్తి రతి నద్భుతముగాఁ బుట్టి
పెరిగి విరుగుచుఁ దరిగి సురిగి పోయెడి
వస్తు గుణ రూపావళుల్ వసు సంపదావళులు
సంచలించును సృష్టి సంచరించును సదా ॥ 3101

†(14) అన్యమై జన్మించి అన్యమై పెరుగుచున్
అన్యమై యితరేతరాఽన్య సంపర్కాల
నన్యోఽన్యతలు మీఱ నమల శబ్దావళుల
అపురూప శక్తులన్ అభ్యుదయ మొ్మంది
పురుషుండు ప్రకృతికి వరల భిషగ్వరుఁడుగ
సృష్టి సంపద లెల్ల సొంపుగా వర్ధిల్లు ॥ 3102

†(15) పత్ర పుష్పాలతో ఫల రాజములతోడఁ
ద్వక్కు కాండాలతోఁ దల్లి వేరులఁ దనరు
పిల్ల వేరుల మూల బీజ రాజులతోడఁ
బత్ర రహితమ్ముగా వర పుష్ప రహితముగ
ఫల రహితముగాఁగ వరలు లత వృక్షాలు
బీజాలె లేకుండ వెల లేని శక్తులన్
ఆ బృహస్పతి మతి నతి మహిత బింబమై
అపురూపరతి నిల్చు నద్భుత మ్మా ప్రకృతి ॥ 3103

†(16) సలిల తత్త్వాలతోఁ దలక్రిందులై పుట్టి
పెరిగి విరిసెడి ప్రకృతి వర లతా వృక్షములఁ
దేజరిలు శక్తులన్ దేవ కిల్బిషమైన
సృష్టి రుగ్ణత కాఁగ [1]రూక్ష రూపము నొందు
వికృతి ప్రకృతుల నెల్ల విరిచివేయుసు సదా
వాయు తత్త్వాలతో నమేయమౌ దీప్త రతి ॥ 3104

†(17) దివ్య దేవ లోక తతుల తేజశ్శక్తులు మీఱఁగ
జీవ గతులు వృద్ధిరతులు చెల్వొందఁగ విశ్వమ్మున
ఓషధు లవి వర్ధిల్లును సుపర్యధో లోకాలను
విశ్వ రూపుఁడౌ పూరుష విమల దీప్తు లొప్పారఁగ

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. "ఋ-రూ"లకు యతి మైత్రి. (చూ. పీఠిక.)

నజయ్యమౌ నమర శక్తి నద్భుతగతి వ్యాపించును
సృష్టి సంక్షేమాలను నప్పపరచి సంక్షోభము
కలిగించెడి దుశ్శక్తులఁ గకావికలుగాఁ జేయును
నఖిల రోగ పుంజాలను నాసాంతము రూపుమాపు ॥ 3105

(18)†అష్టపద కందము ॥
శత గుణ రాజమ్ములతో
సతతమ్మును విరియు నమృత చాంద్రిక కిరణ
ప్రతతుల నోషధులు ప్రకృతి
నతులితమై పుష్టి పెరిగి అలరును సృష్టిన్
నుత శక్తుల వరి వరి విధ
రతి చలితపు వస్తు గుణ విరాజిత గతిమై
నతులమ్మౌ గతి జనితపు
యుత స్వరూప ప్రకృతి పరివృతమౌ సృష్టిన్ ॥ 3106

†(19) వృక్షో రూపాలతో వెలుఁగు గోళాలతో
సోమ శక్తులు విరియ సొబగొందు నోషధులు
అతిలోక వీర్యగతి నద్భుత శక్తులన్
ఆయువున్ నిత్యమౌ యౌవనమ్మును నిచ్చు
నల్ల బృహస్పతికిఁ దల్లిగాఁ దండ్రిగా
నలరు శక్తుల నిచ్చు నతిలోక మతి నొసఁగు ॥ 3107

†(20) ప్రకృతి సర్వము నిచ్చుఁ బ్రకృతి సర్వముఁ దినును
నాల్గు దిక్కులలోన నలువ రూపము కాఁగ
ఉజ్జ్వల గతులతో నుపరిలోకమ్ములన్
అపురూప గతులతో అధో లోకమ్ములన్
నలరు నోషధులుగా నద్భుతమౌ ప్రకృతు
లారోగ్య భాగ్యాల నంతటన్ దనరించు ॥ 3108

†(21) అతి దూర లోకాల నపురూప కాంతి లత
లంతటన్ వ్యాపించి అన్యోఽన్యతలు మీఱ
నితరేతరజ మైన ధృత శక్తులను గూడి
ద్వంద్వ రూపమ్ములవి తనరార నొక్కటిగ
సర్వ సాంగత్యానఁ బర్వు నోషధి తతిగ
దత్త వీర్యమ్ములై మిత్తులకు మిత్తులై ॥ 3109

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(22) అమృత కిరణావళుల సలరారు చాంద్ర గతి
నఖిలౌషధులు జగతి నద్భుతముగా వరలు
బ్రాహ్మ్య శక్తులు మీఱఁ బరమాయు వొప్పఁగా
జాడ్యాలఁ బోఁద్రోలి జగజంతగా నిలుచు
సోమ శక్తులకు సదా సీమలై గగనాలె
తేజరిల్లును మహిత దివ్య గుణములు ప్రకృతి ॥ 3110

†(23) ప్రకృతికై ఓషధులు ప్రకృతికై వృక్షాలు
విశ్వ పూరుష శక్తి నశ్వి తత్త్వాలతో
ఉత్తమ బ్రహ్మ గుణ యోగ జాలలతో
నొనరులే యీ సృష్టి అనయమ్ము తిరుగుచున్
పీడిత శక్తులన్ తాడిత శక్తులన్
అంతర్గత రతుల నలరారు సర్వదా ॥ 3111

## సూక్తము—97

ఋషి—అథర్వపుత్రుఁడు భిషక్కు
దేవత—ఓషధి

## అర్థాంతరము—2

†(1) శక్తి ద్వయము కలిసి చాగు తృతీయ శక్తి
విశ్వ ప్రకృతి ఓషధీ వితతిగాఁ దనరారు
దివ్య దేవాఽఽవళుల తేజరిలు శక్తులను
శత ధామములుగాఁగ సతము సంజనితమై
వర్ధిల్లి మహిత గతి ప్రాణ ధారక మౌచుఁ
బ్రాణ వర్ధక మౌచుఁ బరఁగులే! ప్రకృతి ॥ 3112

†(2) శత రూపములుగాఁగ సాహస్ర రూపాలుగాఁ
బ్రకృతిమాతయె వరలు సుకృతు లవి వెలయంగ
సృష్టి సర్వస్వమ్ము చెలఁగ శత క్రతువులుగ
దుష్ట శక్తుల సదా తున్మాడుచున్ విశ్వ
శిష్ట గుణ శక్తులను జెన్నొందఁగాఁ జేసి
సృష్టికే ఓషధిగ సృష్టియే తనరారు ॥ 3113

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) కాంతి పుంజాలుగాఁ గ్రాలుచున్ విశ్వాన
మహిత శక్తుల నొసఁగు మాన్యగుణముల రీతిఁ
బుష్పవంతమ్ములై పొనరు నోషధితతులు
ఫలవంతములుగాఁగఁ బర్వ నారోగ్యముల
భాగ్యాలఁ బ్రసవించి వరలంగ మోదాల
అధ్వమ్ములను దీర్చి అఖిల రుగ్ణత డుల్చు ॥ 3114

†(4) ప్రకృతి మాతగ దివ్య సుకృతౌషధీతతుల
నఖిల గోళావళుల నలరారుచున్ సదా
మహిత పూరుష వర మర్మ శక్తులు తనర
ప్రకృతి రూపమ్ములే బహుగుణౌషధులుగ
నాత్మ భిషక్కుగా నఖిల కాలాలలోఁ
బంచ భూతాలతోఁ బరఁగు నింద్రియగతుల ॥ 3115

†(5) అనిల శక్తులు జగతి నంతర్గతము లౌచు
ననల జల మృణ్మయత లలరారఁగాఁ బ్రకృతి
ఓషధీ తతు లౌచు నొనరుఁ బదార్థాలు
సృష్టిలో సాజమై వ్యష్టి సమిష్టులుగ
గో భాజనమ్ములై గూఢ కళలను గూడి
పురుష సంసేవనపుఁ బూర్ణ శక్తులు వరలు ॥ 3116

†(6) చంద్ర చంద్రిక తతులు సౌర గ్రహ నక్షత్ర
కాంతి పుంజాలలోఁ గ్రాలఁగా మిళితమై
దేదీప్యమానమౌ దివ్య శక్తులు నిండి
విశ్వాన వ్యాపించి వివిధ లోకాలలో
విజ్ఞాన ధనియైన విమల భిషక్కుగాఁ
బరఁగఁ బూరుషశక్తిఁ బ్రకృతిలో రుజ లుడుగు ॥ 3117

†(7) కాంతి వంతమ్ములై క్రాలు చంద్రిక లలర
నతి మహిత శక్తుల నమరు నోజోగుణము
పరఁగ సృష్టిని నెల్ల పదార్థాలు బహురూపి
ఓషధులుగా వరల నుడుగు నరిష్టాళి
విశ్వాన వ్యాప్తమౌ వెలుఁగు వెన్నెల లెల్లఁ
బ్రాణమై వస్తు గుణ వైద్యరూపముగాఁగ
వర్ధిల్లఁగాఁ జేయు వసుతత్త్వ మొప్పార
నిత్యమ్ము జనితమై సత్య సత్వపుఁ బ్రకృతి ॥ 3118

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) గోమయము సృష్టిలో గూఢ శక్తులు వెలయ
విశ్వ వినాశక విష ఘాప లన్నింటి
రూపు మాపెడి రీతి దీపితమ్మౌ సర్వ
లోకాలఁ బదార్థాలు కృతధనములై ప్రకృతి
నోషధీతతులుగా నుత్పన్నమై పెరిగి
ఆత్మ పూరుష భిషగధిపతి కధీన మౌ ॥ 3119

†(9) ఆహార రూపమై అలరు ప్రకృతి పదార్థ
సంచయాళులు మహా సార భూతమ్ములై
శక్తివంతమ్ములై సకల రుజ నిష్కృతిగఁ
బుట్టి పెరుగుచుఁ బ్రకృతి పూర్ణౌషధులుగాఁగఁ
దనరారఁ సృష్టిలో మనుగడల్ విలసిల్లఁ
జేయుఁ బ్రకృతి మాత నాయురారోగ్యాల ॥ 3120

†(10) విశ్వాన వ్యాపించి విమల దీప్తులు మీఱ
ప్రజ శక్తులన్ గాంచి విజయవంతమ్ముగా
సూక్ష్మాతి సూక్ష్మమౌ చోద్యమౌ నాంతర్య
తరుగతులు వరలంగ ననుకూల ప్రకృతుల
నాత్మ శక్తులు పెంచ నద్భుతౌషధులుగ
సృష్టి పదార్థాలు చెలఁగు సహజమ్ములై ॥ 3121

†(11) అతిలోక యువతత్వ మతులిత రతి నొప్ప
నాదిశేషువు దివ్య యౌవన వాయ్వగ్ని
జల మృత్ తత్త్వాలు చద లంట విశ్వాన
జీవ శక్తులు సృష్టిఁ జెల్వొందఁగా సదా
ప్రకృతి పదార్థాలు పరిఢవిల్లుచుఁ బుట్టి
పెరిగి ఓషధులుగా విలసిల్లు విశ్వాన ॥ 3122

†(12) ప్రకృతి పదార్థాల వస్తుగుణ సంపదల
ప్రత్యంగమే కాదు ప్రత్యణువును గూడఁ
బురుష శక్తుల వరలి నిరత మోషధులుగ
వర్ధిల్లి ప్రకృతికే వైద్యమ్ము నొనరించు
వ్యష్టి సమిష్టులుగ సృష్టిలోఁ బుట్టుచున్
బెరుగు రుజ రూపాల విరుచు నుజ్జ్వల శక్తి ॥ 3123

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(13) వేధా పర మ్మొచు బాధాకర మ్మొచు
రోగ రూపమ్ముగా రూప నాశము చేయు
ప్రికృతి వికృతుల నెల్లఁ బరమ దీప్తులు నింద
ననిలాఽనల జల మమృత శక్తుల మీరు
నోషధీతతు లెల్ల నొనరు విశ్వమ్ములో
విస్తారముగఁ బెరుగుఁ బ్రిస్తార శక్తులన్ ॥ 3124

†(14) సృష్టి సంచలనంపు వ్యష్టి సమిష్టి పూర్ణ
శబ్ద శక్తుల మహా సంవిధానాలతో
అన్యోఽన్య సంబంధితాఽనుబంధాలతో
వస్తుగుణ సంపదల అస్తిత్వ వినిమయ
రూపాల నోషధులు రూపొందఁగాఁ బ్రికృతి
సహజ సంపద లెనయ సహరహము వర్ధిల్లు ॥ 3125

†(15) ఫల సహితమైనను ఫల రహితమైనను
బుష్ప సహితమ్మైనఁ బుష్ప రహితమ్మైనఁ
బత్రి సహితమ్మైనఁ బత్రి రహితమ్మైనఁ
గాండ సహితమ్మైనఁ గాండ రహితమ్మైన
మూల సహితమ్మైన మూల రహితమ్మైనఁ
బ్రికృతి లత వృక్షాలు వస్తు పదార్థాలు
బాహిరములై ప్రికృతి భాగ్యావళుల నింపు
రతిజన్యగతిఁ బెంచు మతి శక్తులను బెంచు
రుగ్ణతా రూపాల రూక్ష గుణ తత్త్వాల
భగ్నమ్ముగాఁ జేయు నగ్న నవ శక్తులన్ ॥ 3126

†(16) జల వాయు తత్త్వాల శైత్యాగ్ని నిత్యతన్
బదలంటి వెల్గొందు చందమామల చలువ
వెన్నెలల వన్నెలన్ విలసిల్లు ప్రికృతిలో
దివ్యౌషధులు పుట్టి నవ్య నవ శక్తులన్
బ్రిసరింపఁగాఁజేయు విసములన్ విరుచుచున్
వసు శక్తులను బెంచి ప్రిసరించు స్వస్థతల ॥ 3127

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

†(17) జీవ రూపాలతో దైవీయమౌ రతుల
శబ్ద శక్తులు వరల సర్వదా ప్రసరించు
కాంతి పుంజాలతోఁ గ్రాలులే ఓషధులు
ఆయురారోగ్యాల నా వనస్పతు లీయ
వికృతి రహితమ్మైన ఆకృతాల సుకృతాలఁ
బ్రకృతి పులకించఁగా వరలు పూరుష శక్తి ॥

†(18) శత విచక్షణలతో నతులిత శక్తులన్
కౌముదీ దీప్తు లవి కాంతి కిరణాలుగా
మిన్నంటు పున్నెమై వెన్నెలల వెలుఁగులై
వరలఁగా విశ్వాన వర కామ రూపాల
నాయురారోగ్యాల నానంద భాగ్యాలు
హృదయ రాజ్యమ్ములో నెసఁగు నోషధు లౌచు
ఉత్తమోత్తమ శక్తు లుజ్జ్వల గతులమై
నిత్య జీవిక లౌచు నగదొందుఁ బ్రకృతిలో ॥

†(19) సోమ శక్తుల వరలు చోద్య మౌ నోషధుల
మహిత తత్త్వాలతో మర్మ తత్త్వాలతోఁ
బృథువు లవి వర్ధిల్లు వీర్య శక్తులు వరల
వివరీత ధీ శక్తి విస్తార తేజాలు
మతి పతులఁ బుట్టించి రతి రక్తి ఋత శక్తి
నతులితముగా నీయ నఖిలమున్ దత్తమౌ ॥

†(20) విశ్వ సృష్టి స్వభావమ్ము విచిత్రమౌ సుచిత్రమౌ
తినఁబడునదె తినుచునుండు మసుగడయే మరణమౌ
జీవ మొసఁగు పదార్థమ్మె జీవాంతక మౌచునుండు
ద్వంద్వ గతుల ద్వంద్వమ్మె తనరుఁ జతుష్పదముగాఁగ
ఆకాశమె శూన్యమ్మె అనిలానల జలమృత్తతు
లఖిలమ్మున కోషధులై అలరు సృష్టి సాజములై ॥

†(21) అతి దూరమ్మౌ వస్తువు లతి చేరువుగా నిలువగ
అత్యంతము సన్నిహితమ్మై అలరెడి పదార్థాలు
దూర తీరాల కేగుఁ దొడరెడి విశ్వానఁ జూడ
అంత మెనయనట్టి సృష్టి అనుబంధా లటువంటివి
సర్వ మోషధీతతిగాఁ బర్వఁగ నీ జగతిలోన
దత్త వీర్యమై ప్రకృతికి విత్తమ్మౌ సహజమ్ముగ ॥

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(22) అతి లౌషధీపతిగ నలరారు చంద్రికా
పతి ప్రకృతి పతిగాఁగ బ్రాహ్మ్య శక్తులు తనర
సృష్టి సంకట గతుల నష్టపరచుచు సదా
అమృత దీప్తుల నొసఁగి అఖిలమున్ బెంచులేః ॥ 3133

†(23) ఉత్తమ మ్మౌ దీప్తి మ త్తత్వ మలరఁగాఁ
ఇంద్రాగ్న్య శక్తులన్ ఇంద్రికల్ జాల్వార
విశ్వ వృక్షము సదా విస్తృతిన్ వర్ధిల్లఁ
బ్రకృతు లోషధులుగ సుకృత రూపము లౌను
ద్వైత మద్వైత గతి తనరార సృష్టిలో
సర్వమ్ము జ్ఞాన మై సంపదలై వరలు ॥ 3134

## సూక్తమ్—98

ఋషిః—ఆర్ష్టిషేణో దేవాపిః♦ (వృష్టికామః)
దేవతా—దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) బృహస్పతే ప్రతి మే దేవతామిహి మిత్రో వా యద్వరుణో వాసి పూషా ।
ఆదిత్యైర్వా యద్వసుభిర్మరుత్వాన్ త్స పర్జన్యం శంతనవే వృషాయ ॥ 1138

(2) ఆ దేవో దూతో[1] అజిరశ్చికిత్వాన్ త్వద్దేవాపే [2]అభి మామగచ్ఛత్ ।
ప్రతీచీనః ప్రతి మామా వవృత్స్వ దధామి తే ద్యుమతీం వాచమాసన్ ॥ 1139

(3) అస్మే దేహి ద్యుమతీం వాచమాసన్ బృహస్పతే[3] అనమీవామిషిరామ్ ।
యయా వృష్టిం శంతనవే వనావ దివో ద్రప్సో మధుమాఀ[4] ఆ వివేశ ॥ 1140

†రచయితః—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦ఆర్ష్టి షేణో దేవాపిః (పాఠాంతరము)

1. దూతో౽అజి, 2. వాపే౽అభి, 3. బృహస్పతే౽అనమీవా, 4. మధుమాఀ౽ఆ వివేశ. (ప్రా.ప్ర.)

(4) ఆ నో ద్రప్సా మధుమన్తో విశన్త్విన్ద్ర దేహ్యధిరథం సహస్రమ్ ।
ని షీద హోత్రమృతుథా యజస్వ దేవాన్ దేవాపే హవిషా సపర్య ॥ 1141

(5) ఆర్ష్టిషేణో హోత్రమృషిర్నిషీదన్ దేవాపిర్దేవసుమతిం చికిత్వాన్ ।
స[1] ఉత్తరస్మాదధరం సముద్రమపో దివ్యా[2] అసృజద్వర్ష్యా అభి ॥ 1142

(6) అస్మిన్ త్సముద్రే[3] అధ్యుత్తరస్మిన్నాపో దేవేభిర్నివృతా[4] అతిష్ఠన్ ।
తా[5] అద్రవన్నార్ష్టిషేణేన సృష్టా దేవాపినా ప్రేషితా మృక్షిణీషు ॥ 1143

(7) యద్దేవాపిః శంతనవే పురోహితో హోత్రాయ వృతః కృపయన్నదీధేత్ ।
దేవశ్రుతం వృష్టివనిం రరాణో బృహస్పతిర్వాచమస్మా అయచ్ఛత్ ॥ 1144

(8) యం త్వా దేవాపిః శుశుచానో[6] అగ్న ఆర్ష్టిషేణో మనుష్యః సమీధే ।
విశ్వేభిర్దేవైరనుమద్యమానః ప్ర పర్జన్యమీరయా వృష్టిమన్తమ్ ॥ 1145

(9) త్వాం పూర్వ[7] ఋషయో గీర్భిరాయన్ త్వామధ్వరేషు పురుహూత విశ్వే ।
సహస్రాణ్యధిరథాన్యస్మే[8] ఆ నో యజ్ఞం రోహిదశ్వోప యాహి ॥ 1146

---

1. స౽ఉత్తర, 2. దివ్యా౽అసృజద్వర్ష్యా౽అభి, 3. సముద్రే౽అధ్యుత్తర, 4. వృతా౽అతిష్ఠన్,
5. తా౽అద్ర, 6. శుచానో౽అగ్న౽ఆర్ష్టిషేణో, 7. పూర్వే౽ఋషయో,
8. థాన్యస్మే౽ఆనో. (వ్రా.ప్ర.)

(10) ఏతాన్యగ్నే నవతిర్నవ త్వే[1] ఆహుతాన్యధిరథా సహస్రా ।
తేభిర్వర్ధస్వ తన్వః శూర పూర్వీర్దివో నో వృష్టిమిషితో రిరీహి ॥ 1147

(11) ఏతాన్యగ్నే నవతిం సహస్రా సం ప్ర యచ్ఛ వృష్ణ[2] ఇన్ద్రాయ భాగమ్ ।
విద్వాన్ పథ[3] ఋతుశో దేవయానానప్యౌలానం దివి దేవేషు ధేహి ॥ 1148

(12) అగ్నే[4] బాధస్వ వి మృధో వి దుర్గహా ఒపామీవామప రక్షాంసి సేధ ।
అస్మాత్ సముద్రాద్బృహతో దివో నో ఒపాం భూమానముప నః సృజేహ ॥ 1149

## సూక్తము—98

ఋషి—ఋష్టిషేణ పుత్రుఁడు దేవాపి†
దేవత—బృహస్పతి మిత్రాదులు†

(1)•చ॥ వరుణుఁడ వౌదువో! మరి యవారిత మిత్రుఁడవై వెలుంగుదో!
సురుచిర పూషుగా వెలుఁగుచున్ విలసిల్లుదొ! యో బృహస్పతీ!
సరస వసు ప్రపంచమును సర్వ మరుత్తులఁ గూడుచుందువో!
యెరుఁగము[1] కాని శంతనున కిమ్ము! సువర్షము దేవతాదయన్ ॥ 3135

(2)•గద్యము ॥
దేవుఁడైన యొక దూత గమనశీలుఁడు చేతనవంతుఁడు! ఓ దేవాపీ! త్వత్ప్రేషితుఁడై వాఁడు నన్నుఁ జేరుఁగాక! ఓ బృహస్పతీ! అస్మదభిముఖుఁడవై నా యొద్దకు రమ్ము! నీ నిమిత్తము దీప్తియుక్తమగు స్తుతిని నా యాస్యమందు ధరించెదను ॥ 3136

---

1. త్వేఽఆహుతా, 2. వృష్ణఽఇన్ద్రాయ, 3. పథఽఋతుశో, 4. అగ్నేఽబాధస్వ. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 81వ పుటలో ఈ సూక్తమునకు ఋషి "ఋష్టిషేణ పుత్రుఁడు దేవాపి" గాను దేవత "బృహస్పతి మిత్రాదులు" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "దేవాపి" గాను దేవత "దేవతలు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. సురలను బొంది దృష్టికయి సూటిగ, (తా.పా.), సరగునఁ బొంది దేవతల శంతన రాజున కిమ్ము వర్షమున్. (మ.పా.)

(3)*గీ॥ గద్గదాది దోష గణహీన మైనట్టి
ద్యుతిని వెల్గునట్టి యుచితమైన
స్తోత్ర రూప వాక్కు నాత్ర బృహస్పతీ
యాస్యమందు నునిచి యమరుమయ్య! ॥ 3137

*గీ॥ ఎట్టి వాక్కుచేత నెల్ల దేవతలకు
నిష్టిఁ గూర్చి శంతనేశునకయి
వృష్టిఁ [1]బొందఁగలమొ! వివిధ వాక్పూరంబు
పడునో! యట్టి వాక్కుఁ బడయఁగలము ॥ 3138

(4)*గద్యము॥
వృష్టి సముదాయములు మాధుర్యోపేతములై మ మ్మావేశించుఁగాక! రథముపైఁ గల
సహస్ర సంఖ్యాక ధనమును మా కొసంగుము! ఓ దేవాపీ! ఆర్త్విజ్యమునందు
వసింపుము! అట్లుండి ప్రతికాలమునందు నీవు దేవతలను స్తుతులచేతను
హవిస్సుచేతను సేవింపుము! ॥ 3139

(5)*క॥ దేవాపి యనెడు ఋషి పతి
దేవతల నుతించు చెల్లఁ దెలియుచుఁ బ్రీతిన్
బావన హోతృ సుకర్మము
గావింపఁ దలంచి యచటఁ గ్రాలుచు[2] నుండున్ ॥ 3140

*గీ॥ అతఁడు మీఁదనున్న యంతరిక్షాఖ్యమౌ
నుదధినుండి భూమి నున్న యట్టి
యబ్ధిఁ గూర్ప మిగుల నంబు ధారల సృష్టిఁ
జేయుఁగాక! సకల చిత్త మలర ॥ 3141

(6)*గద్యము॥
ఈ పార్థివ సముద్రము పూరణీయము కాఁగా నంతరిక్షాఖ్యమందు నుదకములు
ద్యోతమానములచే నిరుద్ధములైయున్నవి. ఆ యప్పులు దేవాపిచేతఁ
బ్రేషితములై పరిమృష్టస్థలులయందు స్రవించుచున్నవి ॥ 3142

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి
1. వృష్టిఁబడయఁగలమొ, (తా.పా.) 2. గ్రాలుచుండెడున్. (తా.పా.)

(7)*గద్యము ॥
దేవాపి శంతనునికొఱకు స్వభ్రాత యగు కౌరవ్యునకుఁ బురోహితుఁ డగుచు హోతార్థ
వృతుఁ డగుచు దేవతలకు వినఁబడిన వానిని వృష్టి యాచనుని బృహస్పతి ధ్యానించెను.
రమమానుం డగు బృహస్పతి యీ దేవాపికొఱకు వాక్కు నిచ్చెను ॥ 3143

(8)*గీ॥ స్తోత్రమున వెలుంగు సూరి దేవాపినిం
బ్రజ్వలింపఁజేయు పావకుండ!
యమర పఙ్క్తిచేత ననుమాద్యమానుండ
వగుచు నంబుదంబు ననుపు మీవు! ॥ 3144

(9)*గీ॥ అగ్ని! నిన్నుఁ బూర్వు లైన ఋషీశులు
స్తుతులఁ బొందినారు సురుచిరముగ
నధ్వరములయందు యజమాన గణములు
నిన్నుఁ జెందుచుందు రెన్నుటకయి ॥ 3145

*గీ॥ బహు సహస్ర సంఖ్యఁ బరఁగెడు గో యూధ
ముల రథాధికముల ముదిత శంత
నుం డొసంగుఁగాక! దండి యో[1] యశ్వమా!
యజ్ఞమునకు రావె! విజ్ఞుఁడవయి ॥ 3146

(10)*గద్యము॥
అగ్నీ! గోవుల నవతి, నవ, సహస్ర రథాధికములు గో సహస్రములు, నీవు ప్రీతుఁడవుగా
నాహుతము లయ్యెను. వానివలన యుష్మదీయ బహు తనువులను వృద్ధిఁ బొందింపుము!
మా నిమిత్తము ద్యులోకమునుండి వృష్టి ప్రార్థితుఁడవై పూరింపుము! ॥ 3147

(11)*గద్యము॥
అగ్నీ! గోవుల నవతి సహస్రములను నొసంగెడు నిందునికొఱకు భాగమ్ము నిమ్ము!
మరియు దేవ మార్గములను నెరుంగుచు నీవు ప్రతికాలమందుఁ గురు కుల
జాతుఁడైనను శాంతనవుని దేవతలమధ్య నుంచుమా! ॥ 3148

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. యో రోహిదశ్వమా!. (తా.పా.)

(12)*గీ॥ అనల దుర్గహ శాత్రవ గణ పురాళి
రాక్షసుల, రోగమునుగూడ రాజమాన
శక్తిఁ బూనుచు మిగుల నానక్తితోడ
నీవు, దహియింపుదువుగాక! నీవు వహ్ని! ॥ 3149

*గీ॥ విస్తృతం బైన ద్యో లోక వీథినుండి
మిగుల బహు భావమును బొంది మెలఁగునట్టి
వృష్టి సంఘాతమును మాకు సృష్టియందు
నీవు సృజియింపుమా! యగ్ని! నిశ్చయముగ ॥ 3150

## సూక్తము—98

ఋషి—ఋష్టిషేణపుత్రుఁడు దేవాపి
దేవత—బృహస్పతి మిత్రాదులు

## అర్థాంతరము—1

†(1) ఆకసమ్మున ననిలాఽనల జల మృత్‌తతుల
వసు సంపదల సర్వ వస్తు వితతులయందు
శబ్ద నిశ్శబ్దాల శక్తులన్ నిండుచున్
ద్వాదశాఽఽదిత్యాళి వేద పద రతులమై
విశ్వ వృష శక్తు లవి ఆత్మాత్మలై తనర
నగు జడాఽజడములను నలరారు బుద్ధిమయ
పతి శక్తి విశ్వాన నతులితమౌ గతుల
దైవ లీలగ బుద్ధి తత్త్వమౌ సర్వమ్ము
అజ్ఞతా తత్త్వమై అలరారు నఖిలమ్ము
వెలుఁగు చీకట్లుగా వెలయు సృష్టి స్థితులు ॥ 3151

†(2) లోక కంటక మైన రూక్ష శక్తులు నిండు
"నభ" శక్తి నాశముగ నధఃకరించుచున్
దైవీయమౌ శక్తి తనరి విశ్వ వ్యాప్తి
నొంది తేజోరూప ముడు తతులు చంద్రాళి
ఉత్తమ చంద్రిక లుత్పత్తి స్థితి వృద్ధి
శక్తులున్ రక్తులున్ సర్వాన విలసిల్ల
శబ్ద శక్తులు సృష్టి నకలమ్మునన్ వరలఁ
గాంతివంతము లౌచుఁ గ్రాలు మతి పతి శక్తి ॥ 3152

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి
1. దహియింప వలదటే నేర్పు మిగుల. (తా.పా.)
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) పద స్ఖాలిత్యమ్ము వర్ణ స్ఖాలిత్యమ్ము
శబ్ద స్ఖాలిత్యమ్ము స్వర స్ఖాలిత్యమ్ము
అన లేమియును లేక అంతరిక్షానఁ దగు
సృష్టి సహజ మ్మైన శిష్ట ధ్వని తతు లెల్ల
విశ్వాన వ్యాపించి విపుల మౌ శక్తులన్
బంచ భూతావళుల నంచితాంతర్గతుల
వరలి ప్రకృతికి నిత్య పర మైన వరముగాఁ
దనరు బహు చైతన్య తత్త్వ రూపమ్ముగా ॥ 3153

†(4) అత్యంత మధుర మౌ నమృత శబ్దాలతో
జల వాయు తత్త్వాల జ్వలితాగ్ని మృత్తత్త్వ
జాలాల నాకాశ సద్రూప తత్త్వాలు
విశ్వ సంక్షేమాల వెలయు వర్షము లిచ్చు
దివి భువుల నన్నింటఁ దేజరిలు శక్తు లవి
మతితత్త్వ సాహస్ర పతి శక్తి పరిధులన్
జిత్రాఽతిచిత్రముగఁ జెలఁగును జగ మెల్ల
విజ్ఞాన ప్రజ్ఞాన సుజ్ఞానములు మీఱ ॥ 3154

†(5) అఖిల లోకాఽఽవళుల నలరారు సలిలాల
నావిరిగ మార్చుచు నలరంగ మొయిళులై
మధుర రుచు లొప్పంగ మహిమాన్వితపు శక్తి
వర్ష ధారల నిచ్చు వరదేవ దేవాపి
“నాభి” శక్తుల మూల ప్రాభవాన్వితమైన
పంచభూతాంచిత ప్రభవ శక్తిగ వరలుఁ
బ్రాణ దాతఁగ దనరు రంజిల్లు సంచలన
సంపూర్ణ శక్తిమయ సంపత్ స్వరూప మౌ ॥ 3155

†(6) అపురూప శక్తుల నాకసమ్మున జలము
నిలిచి సంద్రముకాని నిండు సంద్రముకాఁగ
దివ్యదేవుని శక్తిఁ దేజరిల్లుచునుండు
నాధార రహితమై అనిల మ్మలరు గతిఁ
బుడమి లోకాఽఽవళులు వరుణాది లోకాలు
స్రష్ట ప్రేషిత మైన శిష్ట దేవాపి స
చ్ఛక్తులే వరలంగ సకల భూతావళులు
నలరు జగత్సృష్టి నఖిలేశు నాజ్ఞమై ॥ 3156

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

†(7) దేవదేవుని మహిమ దేవాపి శక్తితతి
జల శక్తి మూల మౌ సదమల "నాభి"నే
సృష్టించుచున్ నిలిపి చెల్వొంద నలరించి
జగములో మధుర మౌ జలధార లగణిత
గతిమైని గురియఁగా నతులిత మౌ మతి
మాన్య శక్తులు మహా మహిత మౌ శాబ్దిక
శక్తులున్ వరల విశ్వమ్ము దైవీయ మౌ
బృహస్పతి పూర్ణమై వెలుఁగు జ్ఞాన కృతిగ ॥ 3157

†(8) విశ్వ లోకాలలో విమల జీవము వెలయఁ
బ్రాణప్రదా లౌచుఁ బంచ భూతావళులు
దేవాపి శక్తిమై దేవదేవుని దివ్య
సృష్టి స్థితి లయ శక్తు లిష్ట పూర్ణములుగా
ననువర్ధమానమై అద్భుతముగా వరలు
నన్నియు నొకటిగా నపురూపమై తనరు ॥ 3158

†(9) అతి సహస్రమ్మైన అద్భుత క్రియలమైఁ
బ్రకృతి దేవావళుల భవ్య శబ్దావళుల
విశ్వాగ్ని గుండాల నశ్వి యజ్ఞము లొప్ప
వినువీథులను మహావిష్ణు దేవుని లీలఁ
గాల రథమును నెక్కి కదలాడు సర్వమ్ము
సృష్టి స్థితి లయాళు లిష్ట పూర్తిగ వరలు ॥ 3159

†(10) సత్య పథగాములై నిత్య నవమై వెల్గు
దశ[1]దిశలఁ గాంతులన్ దనరారు నవ[1] గ్రహ
రాజి శక్తులు నవతి[1] రమ్య శక్తుల మీఱ
గగన వీథులలోన నగణిత సాహస్ర
కాంతు లెనయఁగ విశ్వ కాల రథమును నెక్కి
అనలాఽనిల జల మృదాళి నలరించు దేవుండు ॥ 3160

†(11) పంచతత్త్వాలతోఁ బంచ[2]భూతము లలర
షడృతువు[2] లొప్పారి సరి [2]నవతిగఁ [2]దిక్కాల
రథ మధిరోహించి పథ సహస్రము వరల
నతిసహస్రమ్మైన అద్భుత కాంతులన్
విజ్ఞాన పథముగా విశ్వమ్ము దీప్తముగ
దివ్య దేవుఁడు నిత్య నవ్య శక్తిని నిలుపు ॥ 3161

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. దిక్కులు-10, గ్రహాలు-9; $10\times9=90$
2. పంచభూతాలు-5, ఋతువులు-6, కాలాలు-3 (వేసవికాలము, వర్షాకాలము, శీతాకాలము.)
$5\times6=30$; $30\times3=90$.

†(12) అబ్ధజలములఁ దుర్చించు "నభి" శక్తి దుష్టాగ్ని
రాక్షసాఽఽళిని మహా రక్ష శక్తులు మీఱ
సంహరించుచు సదా జలనాభినే నిలిపి
కాంతి పథములఁ దనరు నంతరిక్షములోన
నతిలోకమౌ సృష్టి సపురూపముగ నడుపు
నిద్రారహిత దేవ ముద్రా సహిత విశ్వ
భద్రాశి వర్ధిల్లు వసుధాగ్ని జల మరుత్తు
లాకాశ పంచభూతాఽఽవళులు వర్తిల్ల ॥ 3162

## సూక్తము—98

ఋషి—ఋష్టిషేణపుత్రుఁడు దేవాపి
దేవత—బృహస్పతి మిత్రాదులు

### అర్థాంతరము—2

†(1) దేవాధిపతియైన దేవదేవుఁడు సదా
అగ్ని వరుణులఁతోడ ననిల పృథ్వ్యాకాశ
భూతాలతో సృష్టి పూర్ణమ్ముగాఁ జేసి
ఆదిత్య శక్తులన్ అలవోకగా నిలిపి
ఉరుములన్ మెరుపులన్ అరిమురిగా నింగి
నింపి జలధారలను నిర్మల గతి నిచ్చు ॥ 3163

†(2) అనల రూప మ్మోచు ననుద్భూత మ్మోచు
దేవ దూతగ మహా దివ్య శక్తుల మీఱ
అమరమౌ నమృతాల నమల చంద్రులు "నభి"
శక్తి పాలిటఁ బడక చదలునన్ వెలుఁగుచున్
శబ్ద శక్తులతో మహిత జ్వలన శక్తుల మీఱఁ
దెల్ల తెల వెలుఁగుల నెల్ల నింగిని నింపు ॥ 3164

†(3) శబ్ద శక్తుల పూర్ణ సద్దీప్త లొప్పార
శ్రీమహావిష్ణు ప్రభ చిద్విలాసాదులే
లవణ గుణ జలరాశి రాజిల్ల మధుర గతి
నాకాశమున సర్వ మలరు నద్భుత శక్తిఁ
బంచ భూతావళులు ప్రకృతిగా స్వాతంత్ర్య
శక్తు లంతర్గతులఁ రక్తిమైఁ బెంపొంద ॥ 3165

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అత్యంత మధురమై అద్భుతావహము నౌ
అతిసహస్రకాంతి రథ మారోహణము చేసి
విశ్వ సృష్టియె నిత్య విమల హవిషము కాఁగఁ
గాల గతులను నమృత జాలము విశ్వ
దేవ దేవుని జలముగా వరలుచుండంగ
నంతటన్ జ్వలితాగ్ని లంతర్గతము లౌను ॥ 3166

†(5)"అభి" శక్తు లన్నింటి నధమాధమము చేసి
భువుల నాకాశమునఁ జవులూరు మధురమయ
జల సముద్రములను సలిలాల గ్రహియించి
మేఘ రూపాలుగా మేల్మిగా రూపొంది
అమలశక్తులు మీఱ నమృతజలముల నిచ్చి
సృష్టి యజ్ఞాలతోఁ జెలఁగు హవనము లొప్ప
దేవామృతము సురల దివ్య జలమై తనర
నంతరిక్ష మ్మలరు నఖిలాత్మగా జగతి ॥ 3167

†(6) సర్వ దివ్యామృతము సలిలమ్ముగా వరల
దేవాళి సేవించి తేజరిలు నమృతిగతి
సృష్టిలో విద్యుత్తు సృష్టకే దీపమై
విష్ణు శక్తులు మీఱ విమలమ్ముగా వెలిఁగి
నుష్ణ దీప్తులు తనర నుపరి తలాలలో
ఉండుండి వెలుఁగులన్ నిండఁ గనులను నింపు
సృష్టిలో వెలుఁగొంద సూర్యగోళా లెన్నొ
సప్తసంఖ్యల వరలు సర్వ భూతమ్ములును ॥ 3168

†(7) ఆ మహావిష్ణు కృప నద్భుతగతు లొప్ప
సృష్టికే హిత మొసఁచు నిష్టి కర్మగ విశ్వ
పంచ భూతావళులు నంచితముగా వరల
సత్య పవనాగ్ని లవి నిత్యమై తనరార
జలశక్తిలో నిండి చదలునన్ మొయిళులను
నంచితముగా సృష్టి పంచితమ్మై నిలుచు ॥ 3169

†(8) దేవజల మమృతమై తేజరిల గగనాన
ననలాల ననిలాల నఖిల మృత్‌తతులను
మను రూపమై జీవ ధన రూపమై వెలయ
దేవ శక్తుల విశ్వ తేజాలు వర్ధిల్ల
శబ్ద గుణక మ్మైన సదమలాకాశమ్ము
సర్వ సంక్షేమాల శబ్ద శక్తులఁ దనరు ॥ 3170

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) తొలి దేవతలు విశ్వ భరితమౌ శబ్దాల
శక్తులన్ వెలయించి సకలాధ్వరము నెరపి
అతి సహస్రమ్మైన అనలానిలరూప
శక్తు లవి విలసిల్ల సర్వ కాల రథాన
నధివసించుచుఁ దిరుగు నా దేవ దేవు నిర
తోజ్జ్వల దీప్తు లవి ఉచ్ఛ్వాస లగు సృష్టి
నా ప్రాణ పూర్వమౌ ననిల సహిత మ్మౌచు
నఖిల చరాఽచరాల నద్భుతముగా నిలుపు ॥ 3171

†(10) అతి సహస్ర మ్మైన ఆ కాంతి పుంజాలఁ
గ్రాలు కాల రథమ్ము లీల నధిరోహించి
నవ దీప్తు లొప్పార నవ సంఖ్య గ్రహ దీప్తు
లలరఁ •దొంబది కాఁగ నఖిల దిశలను వ్యాప్తి
నొంది వివిధ పదార్థ తుందిలాల్ ఢక్కాల
తత్త్వములను బొంద సత్వ రూపమ్ములను
శక్తివంతము లౌచు సర్వాన వ్యాపించఁ
బంచభూతమ్ములే పరమ వర్షము లౌను ॥ 3172

†(11) దశ దిశల వ్యాపించు తగు నవ గ్రహ కాంతి
పుంజాలు తొంబదిగఁ బృథ్వ్యాది భూతాల
సంవలితమై తనరి సౌర కుటుంబాన
దివ్య తేజాలతోఁ దేజరిలఁ దనరారు
విశ్వ ఋతు శక్తులన్ విజ్ఞాన పథములై
దేవ దేవుని నవ్య దివ్య శక్తులు వరల
విశ్వ పదార్థాలు విమల యానాలతో
నిత్య సంచలన గతి సత్య పథముల నడచు ॥ 3173

†(12) అనల మైత్రిని సలిల మంతర్గతిని నలరు
జల మైత్రిమై నగ్ని సలిలమ్మునను దనరు
ననల సలిల యోగ మనిల మృత్తులు పొంద
నన్యోఽన్య సంబంధ జన్య జనక బంధ
తత్త్వాఽనుబంధాలతోఁ దనర నాకాశమ్ము
చదలు సంద్రమ్ముగా సర్వ విశ్వమ్ములోఁ
బంచభూతావళుల వరలుచున్ జలధిగాఁ
బృథ్వీమానమ్ముగా బృహద్భవమై తనరు ॥ 3174

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•నవగ్రహ కాంతులు-9, దిక్కులు-10. 9×10=90

## సూక్తమ్—99

ఋషిః—వమ్రో వైఖానసః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) కం నశ్చిత్రమిషణ్యసి చికిత్వాన్ పృథుగ్మానం వాశ్రం వావృధధ్యై ।
కత్ తస్య దాతు శవసో వ్యుష్టౌ తక్షద్వజ్రం వృత్రతురమపిన్వత్ ॥ 1150

(2) స హి ద్యుతా విద్యుతా వేతి సామ పృథుం యోనిమసురత్వా ససాద ।
స సనీళేభిః ప్రసహానో[1] అస్య భ్రాతుర్న ఋతే సప్తథస్య మాయాః ॥ 1151

(3) స వాజం యాతాపదుష్పదా యన్ త్స్వర్షాతా పరి షదత్ సనిష్యన్ ।
అనర్వా యచ్ఛతదురస్య వేదో ఘ్నంఛిశ్నదేవాగ్ం[2] అభి వర్పసా భూత్ ॥ 1152

(4) స యహ్వ్యోఽవనీర్గోష్వర్వా ఽఽజుహోతి ప్రధన్యాసు సస్రిః ।
అపాదో యత్ర యుజ్యాసోఽరథా ద్రోణ్యశ్వాస[3] ఈరతే ఘృతం వాః ॥ 1153

(5) స రుద్రేభిరశస్తవార[4] ఋభ్వా హిత్వీ గయమారేఅవద్య ఆగాత్ ।
వమ్రస్య మన్యే మిథునా వివవ్రీ[6] అన్నమభీత్యారోదయన్ముషా[7]యన్ ॥ 1154

---

1. హానోఽఅస్య భ్రాతుర్నఽఋతే, 2. దేవాగ్ంఽఅభి, 3. శ్వాసఽఈరతే, 4. వారఽఋభ్వా,
5. మారేఽఅవద్యఽఆగాత్, 6. వివవ్రీఽఅన్న, 7. యన్ముషాయన్. (ప్రా.ప్ర.)

(6) స[1] ఇద్దాసం తువీరవం పతిర్దన్ షళక్షం త్రిశీర్షాణం దమన్యత్ ।
అస్య త్రితో న్వోజసా వృధానో విపా వరాహమయో[2]అగ్రయా హన్ ॥ 1155

(7) స దుహ్[3]హ్వాణే మనుష ఊర్ధ్వసాన ఆ సావిషదర్శసానాయ శరుమ్ ।
స నృతమో నహుషోఽస్మత్ సుజాతః పురోఽభినదర్హన్ దస్యుహత్యే ॥ 1156

(8) సో[4] అభ్రియో న యవస [5]ఉదన్యన్ క్షయాయ గాతుం విదన్నో[6] అస్మే ।
ఉప యత్ సీదదిన్దుం శరీరైః శ్యేనోఽయోపాష్టిర్హన్తి దస్యూన్ ॥ 1157

(9) స వ్రాధతః శవసానేభిరస్య కుత్సాయ శుష్ణం కృపణే పరాదాత్ ।
అయం కవిమనయచ్ఛస్యమానమత్కం యో[7] అస్య సనితోత నృణామ్ ॥ 1158

(10) అయం దశస్యన్ నర్యేభిరస్య దస్మో దేవేభిర్వరుణో న మాయీ ।
అయం కనీన [8]ఋతుపా అవేద్యమిమీతారరుం యశ్చతుష్పాత్ ॥ 1159

(11) అస్య స్తోమేభిరౌశిజ [9]ఋజిశ్వా వ్రజం దరయద్వృషభేణ పిప్రోః ।
సుత్వా యద్యజతో దీదయద్గీః పుర[10] ఇయానో అభి వర్పసా భూత్ ॥ 1160

1. సఽఇద్దాసం, 2. మయోఽఅగ్రియా, 3. దుహ్రియాణేమనుషఽఊర్ధ్వసానఽఆ, 4. సోఽఅభ్రియో, 5. యవసఽఉదన్యన్, 6. విదన్నోఽఅస్మే, 7. యోఽఅస్య, 8. కనీనఽఋతుపాఽఅవేద్య, 9. శిజఽఋజిశ్వా, 10. పురఽఇయానోఽఅభి. (వ్రి.వ్రి.)

(12) ఏవా మహో[1] అసుర వక్షథాయ వమ్రకః పడ్భిరుప సర్పదిన్ద్రమ్ ।

స [2]ఇయానః కరతి స్వస్తిమస్మా[3] ఇషమూర్జం సుక్షితిం విశ్వమాభాః ॥ 1161

## సూక్తము—99

ఋషి—వైఖనసునిపుత్రుఁడు వమ్రుఁడు†

దేవత—ఇంద్రుఁడు†

(1)*గద్యము॥

ఓ యింద్రుఁడా! చిత్ర మగు నే ధన విశేషమును బ్రేరేపించుచున్నావు? సర్వథా ప్రేరణీయ మని యెరుంగుచు మా వృద్ధికొఱకు స్తుత్యము పృథు భావమును బొందుచున్నదియు నగు నెట్టి ధన విశేషమును నిచ్చుచున్నావు? మరియు బల వ్యుచ్చనము కాఁగా మా కే దానము లబ్ధ మగుచున్నది? ఆవరక పాప హింసక మగు నే వజ్రమును త్వష్ట సంపాదించెనో? ఆ వజ్రము దానరూపమున వచ్చినది ॥ 3175

(2,3)*సీ॥ విద్యుదాయుధమున వెలుఁగుచు నింద్రుఁడు సామముఁ బొందంగ సాగుచుండె
బల విరాజితుఁడయి ఫలము నొసంగెడు యజ్ఞ కర్మకు నింద్రుఁ డరుగుచుండె
సవిమాను లైనట్టి సర్వ మరుత్తులఁ గూడి తిరస్కృతిఁ గూర్చుచుండె
నాదిత్య సప్త ముం దగు నింద్రునిన్ యజ్ఞమందు మాయలు పర మందకుండె

గీ॥ శూర సంగ్రామ భూమిని జేరునట్టి
సౌమ్య పతనంబుచేఁ గడు జరుగునట్టి
వాసవుఁడు లాభయుక్తమై భాసమాన
మైన జన్యంబునందున నమరుచుండె ॥ 3176

†గీ॥ ద్వారపాలకు లెల్లరఁ దర్చ్చి శత్రు
శత పురంబుల మధ్య నిహిత ధనంబు
యుద్ధమున గర్వ మొందక యున్న యింద్రుఁ
డధిక బలమునఁ గొనుచుండె నతిశయముగ ॥ 3177

---

1. మహో᳚ ఽ అసుర, 2. స ఽ ఇయానః, 3. మస్మా ఽ ఇషమూర్జం. (వ్ర.ప్ర.)

†వ్రతవ్రతి 14వ సంపుటము 365వ పుటలోను 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలోను నీ సూక్తమునకు ఋషి "వమ్రుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(4)•గద్యము॥

ఏ భూములయందుఁ బాదరహితములు, రథ వర్జితములు, ద్రుత వ్యాపనములు నింద్ర
సఖములు నగు నదులు జలమును బ్రేరేపించుచుండునో! ప్రకృష్ట ధన నిమిత్త
లగు నా భూములయందు, మే ఘాభిగంత, సరణ కుశలుఁడు,నగు నింద్రుఁడు
మహాఽప్పులను విడుచుచున్నాఁడు ॥ 3178

(5)•గీ॥ సహజ దాత స్తోతృ సంప్రార్థితుఁడు రుద్ర
పుత్ర సహితుఁ డగుచుఁ బూజ్యుఁడైన
యింద్రమూర్తి మిగుల నెలమిని నేతెంచుఁ
గాక! స్వస్థలంబు వీఁక విడచి ॥ 3179

•గీ॥ వమ్రి లను నామధేయానఁ బరఁగునట్టి
పితరులను రోగులుగఁ దల్తు సతత మేను
వమ్రిఁ డను వాఁడు శాత్రవ పరమ ధనము
సంగ్రహించుచు నేడ్చెఁ దాఁ జాలవరకు ॥ 3180

(6)•గద్యము॥

ఆ యింద్రుఁడు సర్వస్వామియై దాసుని సంగ్రామమందు బహు శబ్దకారిని వృత్రుని
శిక్షించుచు నక్షి షట్కోపేతుని ద్రిశిరస్కుని ద్వష్టృ పుత్రుఁ డగు విశ్వరూపుని
జంపుటకుఁ దలఁచెను. మరియుఁ ద్రితుఁ డను మహర్షి యింద్ర బలమున
వర్ధమానుఁ డగుచు నయోవత్కఠిన నఖము గల అంగుళిచే నుదకవంత
మగు మేఘమును గొట్టెను ॥ 3181

(7)•గద్యము॥

ఇంద్రుఁడు ద్రోగ్ధ్రవ్యుఁ డగు మనుష్యునికొఱకు, స్వభక్తులను హింసించువాని వధకొఱకు
శౌర్యాది గుణ సమన్వితుఁ డగుచు వజ్రమును బ్రేరేపించుచున్నాఁడు. ఆ యింద్రుఁడే
మనుష్యులలో నేతృతముఁడు, సంగ్రామమందు శూరగతమయితృతముఁడు నయి
మా నిమిత్తము సుష్ఠుప్రాదుర్భూతుఁడై దస్యు హనన స్థాన మగు సంగ్రామమందు
శత్రు శరీరములను ఛేదించెను ॥ 3182

(8)•గీ॥ అభ్ర సంఘము రీతి గవాది భక్ష
ణార్థమున కగు తృణమున కంబువులను
నీయఁదలఁచుచు నింద్రుఁ డమేయ మార్గ
మును గనుంగొనె మాకయి మోద మలర ॥ 3183

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ అంగములవలన సోముని నల్ల యింద్రుఁ
డెలమిఁ బొందెడు సమయాన శ్యేన గమన
మున వెలుంగు చయోమయ పూర్ణ పార్ష్ణి
యగుచు దనుముచున్నవాఁ డరులఁ ద్రుంప ॥ 3184

(9)*గీ॥ బలవదాయుధములచేతఁ బరమ శత్రు
వులను నింద్రుఁడు దునుమాడి వెలుఁగుఁగాకఁ!
గుత్సుఁ డను వానిపైఁ గడుఁ గూర్మిఁ బూని
శుష్ణుఁ డను వాని ఖండించి శోభఁ గూర్చె ॥ 3185

*గీ॥ వాసవుని తూప సంభక్త భాసమాను
లౌ మరుత్తులకున్ భక్త యైన కవిని
స్తోత్ర సంశస్యమానుని సుర విభుండు
స్వవశమును జేర్చుకొనెఁ గడు శక్తి మెఱయ ॥ 3186

(10)*గద్యము॥
ఈ యింద్రుఁడు స్తోతలకు ధన మొసంగుచు సృహితు లగు మరుత్తులతోఁ గూడెను. ద్యోత
మానము లగు స్వతేజస్సులచే దర్శనీయుఁ డగు వరుణుఁడు వలెఁ బ్రజ్ఞావంతుఁడు.
మరియు నితఁడు ఋతు పాత. అరరుఁడను నసురుని సంహరించెను ॥ 3187

(11)*గద్యము॥
ఎపుడు సోమస్తోత, స్తుతివాక్కులను దీపింపఁజేసెనో! ఎప్పుడు వెడలుచు శత్రుపురములను
భేదించెనో! యపుడు ఇంద్రుని స్తోత్రములచేత ఉశికీపుత్రుఁ డగు ఋజిశ్వ వృషభ
సహితము పిప్రు పాలితము నగు గోష్ఠమును భంగపరచెను ॥ 3188

(12)*గద్యము॥
ఓ బలవదింద్ర! గొప్ప స్తోత్రము నాలకించుటకు స్వర్గాది ప్రాపణముకొఱకు
షట్పాదములచే నుపగమ్యమానుఁడవై వమ్రకునకు స్వస్తి ని జేయుదువుగాక!
అన్నమును సుక్షితిని సర్వమును సమకూర్చుఁగాక! ॥ 3189

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

### సూక్తము—99

ఋషి—వైఖనస పుత్రుఁడు వమ్రుఁడు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

(1)†అష్టపదకందము॥

చిత్రాఽతిచిత్ర గతులఁ బ
విత్రితమై దేవదేవు విష్ణుని మాయన్
మిత్రుని కాంతుల గతులన్
సత్రమ్మౌ విశ్వ సృష్టి సలిలము లెల్లన్
ఆ త్రిగుణమ్ములతో స
ర్వత్రఁ జెలఁగుచుండు సప్త వర్ణాన్వితమై
వృత్రుని వధింప వజ్రము
చత్రమ్ముగ నాకసమ్ము సకలమ్ములరన్ ॥ 3190

†(2) సత్యరూపమ్మైన సర్వ సంసృష్టిలో
సప్త మాయలు కాఁగ సప్త భేదాలతో
నాకాశ మనిలమ్ము ననల జల మృత్తతులు
క్రాంతి సంక్రాంతులే కాంతియోనులు కాఁగ
నిత్య విద్యుత్తుగా నిఖిలమ్ము నిండి
పృథు సామ గానాలె మిథున శక్తుల వరలి
సృష్టి స్థితి లయాల చేష్ట లవి సర్వదా
పునర్జన్మలుగాఁగఁ బుట్టి పెరుగుచు గిట్టు ॥ 3191

†(3) సర్వ విశ్వమ్మందు సకల భూతాలలో
సంకీర్ణ శక్తి గతి సంకుల సమరముగ
సంఘర్షణము రేగు సామర్థ్య బల రతుల
నంతరాంతర గతుల నన్యోఽన్య బంధాల
ననుబంధముల మీరు నాకాశ మనిలాలు
ననలాలు సలిలాలు నవని రూపాఽఽవళులు
నధికాధికములౌచు నతిమైత్రితో నెసఁగు
నెద్దాని నైనను నెంతొ వింతగ మ్రింగుఁ
దన కడుపులో నుంచు జనితముగ ఘన గతిని
వినువీథిలో సర్వ మణఁకువగా నమరు ॥ 3192

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అవనిలో జల ముండు నవనిపైఁ బ్రవహించు
నబ్బురముగా నిలుచు నాకాశమున జలము
ఆధార మే లేక హద్దు పద్దులు లేక
అరథగతులను మీరు ననిలాలఁ బయనించు
నగ్ని శక్తులు నిరతాంతర్గతిన్ నిలిచి
పవనాలను దరివించి పతనమై ప్రవహించు ॥ 3193

†(5) ఋతు గణావళి శక్తి రుద్ర రూపాలలో
విశ్వాన భూతాలు విస్తరిల్లుచు నుండు
అధికాధిక మ్మోచు నాధిపత్యపు గతుల
నాకాశ మనిలాలు ననలాలు సలిలాలు
నవనీతలాలు విశ్వాంతర్గతమ్ములై
అలరారు మిథునాల అద్భుత శక్తులను
అన్న రూపమ్ముగా నాహారమై తనరి
హరియించులేః తానె అద్భుతగతి మీఱ ॥ 3194

†(6) ఆరు నేత్రాలతో నలరు త్రిశిరస్సులను
నతిలోక శక్తులను అఖిల లోకాఽఽవళులఁ
గల్లోలములు మీఱఁ దల్లడిల్లఁగఁజేయు
విశ్వ రూపుండైన విష దీవ రాక్షసుని
సంహరింపఁగ విష్ణు శక్తి సంపన్నమౌ
వారాహమయ శక్తి వధియించి విశ్వాన
సృష్టి త్రైతము నిలిపి వ్యష్టి సమిష్టులను
బుట్టుటల్ పెరుగుటల్ గిట్టుటల్ నెరపులేః ॥ 3195

†(7) విశ్వ సంక్షేమాల విలసిల్లు శక్తులను
విధ్వస్త మొనరించు విష రూప రాక్షసుల
వజ్ర శక్తులు వెలుఁగ వధియించి విశ్వాన
సృష్టి మన్వంతర వ్యష్టి సమిష్టి కాల
రూపాల లోకాల నేపారు వివిధమౌ
మను వర్గమయ మహా మహీతలముల నిల్పి
ఊర్ధ్వ లోకాలలో నున్నతోన్నత గతుల
వరలు మానవ దేవ వర్గాల నన్నింటిఁ
గాపాడి రాక్షస గణములన్ దున్మాడి
ప్రకృతితత్త్వములను బ్రాకృతముగా నిలుపు ॥ 3196

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) జలవాయు శక్తులున్ జ్వలితాగ్ని శక్తులున్
ఆకాశ క్షమా తత్త్వ ప్రాక్రామ్య శక్తు లవి
వివిధ లోకాంతరముల విమల రూపుల నిల్పి
శబ్ద శక్తులు సృష్టి సలిలాలు మేఘాలు
అనలాలు ననిలాలు నాకాశముతో సహా
అన్నియున్ నిలువఁగా నంతరిక్షములోన
విష్ణు శక్తులు సర్వ వీరేంద్ర శక్తులై
లోక కంటక మైన భీకర శక్తులను
సంహరించుచు విశ్వ శాంతి సౌభాగ్యాల
వర్ధిల్లఁగాఁ జేయు వసు సంపదల నిలిపి ॥ 3197

†(9) మరుదాశుల సచ్ఛక్తుల మహా విషమయమ్ము చేసి
అఖిల లోక కంటకముగ సరిమురి శత్రువు కాఁగను
అగ్ని రూప విష వాయువు లాకాశము నాక్రమింప
వ్యాపించెడి దుష్ట శక్తి రూపు మాపి దేవదేవ
దివ్యశక్తి మహితమ్మై భవ్య లోక జాలాలను
భద్ర గతుల నిల్పుచుండు నభద్ర రతుల సంహరించి ॥ 3198

†(10) ఋత శక్తుల నష్టపరచి ఋతు శక్తుల భ్రష్ట పరచి
విశ్వ రోగ సంక్షేమము విధ్వంసము కావించఁగ
దుర్మార్గ విషాగ్ని తతుల ధర్మ రూప దీప్తిఁ దనరఁ
బెంపొందెడి రాక్షస గణ భీకర రూపాలు తాల్చ
సత్య ధర్మ రూపమైన నిత్యాగ్నులు జ్వలియింపఁగ
నాల్గు పాదముల ధర్మము నడపంగా లోకాలను
దైవ శక్తి విరాజిలును దరణులకే తరణులుగా
వరుణులకే వరుణులుగా మరుదాళికి మరుత్తులుగ
మృత్తులకే మృత్తులుగా మిన్నులకే మిన్నులుగా
నతిలోకపు శక్తులతోఁ బతి రహితపు రక్తులతో ॥ 3199

†(11) "అభి"శక్తిని రూపుమాపి అఖిలమ్ముల జల నాభిని
అజయ్యముగ నిలిపి సర్వ భజనీయమ్మౌ వృషభపు
సోమామృత శక్తులతోఁ జోద్యమ్ముగ విషముఁ ద్రుంచు
విశ్వమ్మునఁ బ్రాణ శక్తి విమల దీప్తి సలిలమ్మున
ననిలమ్ముల ఆవనులలో నాహారపుఁ బదార్థాల
నమలంబుగ నొసరించుచు నమృతముగా నొనరించుచు ॥ 3200

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) షడృతు రూపాల సచ్చక్తు లలరఁగాఁ
గాలమ్ము కదలఁగాఁ గ్రీలు ప్రకృతుల్ మీరఁ
బంచ భూతాఽఽవళులు నంచితములై వరల
విశ్వ లోకాఽఽవళులు విమలగతులన్ దిరుగ
దైవోత్సవమ్ముగాఁ దనరారు నీ సృష్టి
స్థితి లయ త్రితయమ్ము చెన్నొంద సర్వదా
పునరపి జననమై పునరపి మరణమై
మాటి మాటికి జరుగు మహితగతు లవి వెలుఁగ ॥ 3201

## సూక్తము—99

ఋషి—విఖనసపుత్రుఁడు వమ్రుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

†(1) చిత్ర కాంతుల తతులఁ జెల్వొందు మేఘాలఁ
జెల్లచెదురుగఁజేసి ఛిన్న భిన్నముఁ జేసి
జల శక్తులను డుల్చి మల శక్తులను నింపి
దివి భువుల నన్నింటి వివిధమౌ కష్టాల
నష్టాల గురి చేసి నాభి శక్తుల మీంగ
వ్యాపించు వృత్రాసురు వజ్రమ్ము వధియించు
మిత్ర దీప్తులు వెల్గ మిన్నంటి వెన్నంటి
లోకకంటక శత్రు రూక్ష తతులను ద్రుంచు ॥ 3202

†(2) ద్యుతి విద్యుత్తులే అతిలోక శక్తులన్
జల యోనిలోఁ బుట్టు జలద మాలలఁ బుట్టు
స్రిష్ట ఋత శక్తులే సృష్టి సోదరులుగాఁ
బంచభూతాఽఽవళుల నంచితముగా నిలుపు
దైవమాయగ నవ్వి తనరు నన్యోఽన్య గతి
నవినాభావమౌ నంతర్గతి రతుల
వ్యష్టి రూపములయ్యు సమిష్టి భావత వరలు
నధికాధిక మ్మోచు నా భూత రూపమౌ ॥ 3203

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) దైవీయ మైనట్టి తరణి శక్తులు మీఱ
వేద విజ్ఞానంపు నాద శక్తులు విశ్వ
శాంతి సౌభాగ్యాల కాంతి తతులను మించ
"నభి"శక్తి సర్వమ్ము సంతరించును నింగి
"నాభి" శక్తుల నిల్పి నవ్య నవ చైతన్య
మధుర జల సంపదల మహితమౌ గతి నొసఁగు ॥ 3204

†(4) పాద రహితమ్మైన ప్రభు శక్తి వరలఁగాఁ
గాలాంతక గతిని వేలాంతక రతిని
వెలుఁగు దేవుని శక్తి విశ్వ బంధమ్ములై
పంచభూతాఽఽవళి ప్రపంచాలు వరలఁగా
నవని జల గోళాలు ననలాఽనిల లోకాలు
ఆకాశ గతములై అమల గతులను దనర
లోక కంటకమైన రాకాసి మూఁకలను
సంహరించుచు దైవ శక్తు లజయ్యమౌ ॥ 3205

(5) నాదాల రూపాల నవ్య నవ శక్తులన్
ఋభు గణమ్ముల నెల్ల ఋక్ష గ్రహ నక్షత్ర
పుంజాలు సర్వమ్ము పూర్ణమ్ముగా నడచు
దివ్య దైవీయమై దేదీప్యమానమౌ
తేజాల వర్ధిల్లి భ్రాజితమ్మౌ పంచ
భూతాలతో నన్న పూర్ణ రూపము వరలు ॥ 3206

†(6) దక్షిణోత్తర పశ్చిమ త్రియ దిక్తటములు
త్రిశిరస్కతా శక్తి దివ్య మహత్వాల
నాక్రమించుచు వంచనాత్మక రూపాల
ఋతువు లారింటిని అతల కుతలముగాఁగఁ
గాల వ్యవస్థలన్ గకావికలుగఁ జేసి
విశ్వాన గల్లోల వికటాఽట్టహాసాల
విన్యాసముల నింపు విష రూప రాక్షసుల
సంహరించును ప్రాగ్దిక్ఛక్తి వరాహమై ॥ 3207

†(7) విశ్వ లోకమ్ములను విమల భూతావళుల
దివి భువులఁ జెల్వొందు దేవ మానవ గణము
లన్నియు నికృష్ట గతి నష్ట కష్టము లొంద
హింసాపరములై విధ్వంస శక్తులు మీరు

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

కల్లోలముల పాలు కావింపు రాక్షస
గణనాశ మొనరించి అనుపమమ్మౌ "అభి"
శక్తులన్ దున్మాడి సర్వ ఋతు కాలాల
సక్రియ గలి నిల్పు సర్వేశ్వరేశ్వరుఁడు ॥ 3208

†(8) గోళాలు లోకాలు గూఢ శక్తుల వరల
నంతరిక్షమ్ములో నద్భుతముగాఁ దిరుగు
ఆత్మ ప్రదక్షిణల నధిప ప్రదక్షిణలఁ
గాల బద్ధము లౌచుఁ గ్రాలు సంచలనంపు
శబ్ద గానాలతో సదమలమ్మౌ సహజ
శక్తు లవి విస్తరిల సదా రాక్షస దుష్ట
విష శక్తులను దునిమి విశ్వాస సచ్ఛక్తు
లలరంగఁజేయు నా అఖిలేశ్వరేశ్వరుఁడు ॥ 3209

†(9) సుర శక్తులు సృష్టిలో నపరిభూతముగాఁగ నిలిచి
దైవ మానవాऽऽళు లెల్ల దక్షతమై రక్షితమౌ
దానవాది దుశ్శక్తుల తుణీరములను దున్మెంచును
శోష శక్తు లొప్పారఁగ విష శక్తుల గుప్పించుచు
వ్యాప్తమ్మౌ మహిత దుష్టాऽగ్నులు నశియింపఁగఁ
బంచభూతఋతుతతు లవి వరలున్ సక్రమగతి ॥ 3210

†(10) అపురూపపు శక్తులతో నలరారెడి ఆదిత్యుఁడు
ఋతుకాలము లన్నింటిని ఋతబద్ధము చేసి నిల్పి
దైవీయమ్మౌ శక్తులఁ దనరారఁగఁ బంచభూత
తత్త్వా లవి విశ్వమ్మున సత్త్వ గతుల నొప్పారుచు
వరుణాऽనిలాऽనల జల మృత్తతు లెల్లెడలను
విస్తరిల్లు దేవాऽऽళుల విమల శక్తు లతిగతులను ॥ 3211

†(11) అఖిలమ్మున వ్యాపించెడి అరిష్టాత్మ విషమయమౌ
"అభి" శక్తుల విధ్వస్త మ్మభయమ్ముగా సజయ్యముగ
నొనరించెడి దైవ శక్తు లుజ్జ్వలగతి నలరుచుండు
ఆది శేషు పరములైన అఖిల విశ్వ కాంతి తతులు
ద్వంద్వ శక్తులను వెలుఁగుచు ద్వంద్వాऽతీతమ్ముకాఁగ
అనలాऽనిల జల ప్రజముల కాశమ్మవనీతల
సర్వస్వము లలరంగా సక్రియ గతి వరలంగా
విష్ణు శక్తి వెలుఁగుచుండు నుష్ణాది త్రినాభి గతుల ॥ 3212

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) షడృతువులతోఁ గాలము సక్రమగతిఁ దనరంగా
షడ్రసలు దినమ్ములన్ షడ్రసలు రాత్రి వేళఁ
దనరారఁగ దీప్త శక్తి అనుపమ మౌ సర్వ సృష్టి
దివ్య దేవ దేవు శక్తి నవ్య నిత్య మహిత శక్తి
అధిపత్య రూప మైన అమరప్రభు శక్తి వెలుఁగ
శక్తివంతమై తనరును రక్తివంతమై వరలును ॥ 3213

## అనువాకము—9; సూక్తమ్—100

ఋషిః—దువస్యుర్వాన్దనః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—జగతీ; 12-త్రిష్టుప్

(1) ఇన్ద్ర దృహ్య మఘవన్ త్వావదిద్భుజ[1] ఇహ స్తుతః సుతపా బోధి నో వృధే।
దేవేభిర్నః సవితా ప్రావతు శ్రుతమా సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1162

(2) భరాయ సు భరత భాగమృత్వియం ప్ర వాయవే శుచిపే క్రన్దదిష్టయే।
గౌరస్య యః పయసః పీతిమానశ[2] ఆ సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1163

(3) ఆ నో దేవః సవితా సావిషద్వయ[3] ఋజూయతే యజమానాయ సున్వతే।
యథా దేవాన్ ప్రతిభూషేమ పాకవదా సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1164

(4) ఇన్ద్రో[4] అస్మే సుమనా అస్తు విశ్వహా రాజా సోమః సువితస్యాధ్యేతు నః।
యథాయథా మిత్రధితాని సందధురా సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1165

1. భుజఽఇహ, 2. మానశఽఆ, 3. ద్వయఽఋజూయతే, 4. ఇన్ద్రోఽఅస్మే సుమనాఽఅస్తు. (వా.ప్ర.)

(5) ఇన్ద్ర[1] ఉక్థేన శవసా పరుర్దధే బృహస్పతే ప్రతరీతాస్యాయుషః ।
యజ్ఞో మనుః ప్రమతిర్నః పితా హి కమా సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1166

(6) ఇన్ద్రస్య ను సుకృతం దైవ్యం సహో ఽగ్నిర్గృహే జరితా మేధిరః కవిః ।
యజ్ఞశ్చ భూద్విదథే చారుర న్తమ[2] ఆ సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1167

(7) న వో గుహా చకృమ భూరి దుష్కృతం నావిష్ట్యం వసవో దేవహేళనమ్ ।
మాకిర్నో దేవా[3] అనృతస్య వర్పస ఆ సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1168

(8) అపామీవాం సవితా సావిషన్న్యఙగ్వరీయ [4]ఇదప సేధ న్త్వద్రయః ।
గ్రావా యత్ర మధుషుదుచ్యతే బృహదా సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1169

(9) ఊర్ధ్వో గ్రావా వసవో ఽస్తు సోతరి విశ్వా ద్వేషాంసి సనుతర్యుయోత ।
స నో దేవః సవితా పాయురీడ్య[5] ఆ సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1170

(10) ఊర్జం గావో యవసే పీవో[6] అత్తన ఋతస్య యాః సదనే కోశే[7] అంద్వే ।
తనూరేవ తన్వో [8]అస్తు భేషజమా సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1171

---

1. ఇన్ద్రఽఉక్థేన, 2. చారుర న్తమఽఆ, 3. దేవాఽఅనృతస్యవర్పసఽఆ, 4. గ్వరీయఽఇదప, 5. రీడ్యఽఆసర్వ,
6. పీవోఽఅత్తనఽఋతస్య, 7. కోశేఽఅంద్వే, 8. తన్వోఽఅస్తు. (వ్రా.ప్ర.)

(11) క్రతుప్రావా జరితా శశ్వతామవ[1] ఇన్ద్ర ఇద్భద్రా ప్రమతిః సుతావతామ్ ।
పూర్ణమూధర్దివ్యం యస్య సిక్తయ[2] ఆ సర్వతాతిమదితిం వృణీమహే ॥ 1172

(12) చిత్రస్తే భానుః క్రతుప్రా[3] అభిష్టిః సన్తి స్పృధో జరణిప్రా[4] అధృష్టాః ।
రజిష్ఠయా రజ్యా పశ్వ[5] ఆ గోస్తూతూర్షతి పర్యగ్రం దువస్యుః ॥ 1173

## అనువాకము—9 ; సూక్తము—100

ఋషి—వందనపుత్రుఁడు దువస్యుఁడు†

దేవత—విశ్వే దేవతలు†

(1)•సీ॥ ధనవంతుఁడా! నీవు స్వత్వాస్వామ్యము బొందు శత్రు బలంబును జంపుట తగు
మాకు భోగంబును శ్రీకరంబుగ నీవె యెంతయుఁ బ్రీతితో నిచ్చుట తగు
యజ్ఞంబునందున నభిషుత సోమంబు వర్ధనంబునకయి పడయుట తగు
సవిత యజ్ఞంబును సర్వ విధంబుల నంచిత రీతి రక్షించుట తగు
గీ॥ సర్వ రూపాత్మ యైనట్టి సత్య రూప, యయినయట్టి యఖండయై యమరునట్టి
దేవ మాతగ నుండెడు దివ్య కాంత,యైన యదితిని వరియింతు మాదరమున ॥ 3214

(2)•గీ॥ ప్రబల సంగ్రామకారియౌ వాసవునకు
ధ్వనిత గమనంబు గలుఁగుచుఁ దగఁ బయోఽభి
పానమును గోరుచున్నట్టి వాయువునకుఁ
గాల భాగంబు నీయుఁడు! లీల ఋషులు! ॥ 3215

(3)•గద్యము ॥
సర్వ ప్రేరకుఁ డగు సవిత, ఋజుకాముఁడు, అభిషవమును జేయువాఁడు నగు
యజమానునికొరకు అన్నము నే ప్రకారము మేము దేవతల నలంకరింపఁ
గలమో! యట్లు స్తుతించుచున్నాము ॥ 3216

---

1. మవఽఇన్ద్రఽఇద్భద్రా, 2. సిక్తయఽఆ, 3. క్రతుప్రాఽఅభిష్టిః 4. జరణిప్రాఽఅధృష్టాః,
5. పశ్వఽఆ. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 41వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వందనపుత్రుఁడు దువస్యుఁడు" గాను-దేవత "వైశ్వదేవము"గాను వ్రాసి, 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "దువస్యుఁడు" ఋషిగాను, "ఇంద్రుఁడు లేక మాస్ (Mace)" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి. "మాస్" అని తెలుగు లిపిలో వ్రాసి బ్రాకెట్లలో ఇంగ్లీషు లిపిలో Mass అనిగాని Mars అనిగాని వ్రాయక Mace అని స్పష్టముగా స్వహస్తముతో వ్రాసిరి. "Mace', శబ్దమునకు ఇంగ్లీషులో "న్యాయాధిపతి ముందు అధికార సూచకముగాఁ బట్టుకొను వెండికర్ర, అధికారము, జాపత్రి, 'సుగంధ ద్రవ్యము" అని అర్థములు గలవు.
•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(4)*గీ॥ ఏ విధంబున మా కిల నెల్ల మిత్ర
నిహిత ధనములు ప్రాప్తించు నిశ్చయముగ
నట్లు సోముఁడు మా స్తుతి నందుఁగాక!
యట్లె యింద్రుఁడు సుమనస్కుఁ డగును గాక! ॥ 3217

(5)*గీ॥ ఈ మహేంద్రుఁడు బలమున నెలమి యజ్ఞి
యంబు ధరియించుచుండెఁ దా నధిక ప్రీతి
నో బృహస్పతి! మా కిల యుక్త మైన
యాయువును వృద్ధిఁ జేయుచు నమరుచుంటి! ॥ 3218

(6)*చ॥ సురహిత మౌ బలంబు కడు సూటి మహేంద్ర సుకల్పితం బగున్
సుర జలభూత వహ్ని సొగసుందన మెప్పుఁగ గార్హపత్యుఁడౌన్
బర మతఁడే సురాళి కతి భాస్వర సంస్తుతి కర్త ప్రాజ్ఞుఁడుం
గర మనలుండె మా దరిని గ్రోలుచునుండెడు వాఁడు చూడఁగన్ ॥ 3219

(7)*ఉ॥ దేవతలార! మీ[1] యెదుటఁ దేకువఁ బాప మొనర్పకుందు మో
దేవతలార! క్రోధమున దీప్తులుగా మిముఁ జేయకుందు మో
దేవతలార! మా కనృత తీవ్రత కల్గకయుండుఁగాక నో
పావనులార! మానవుని భావము మాకు జనింపకుండుతన్! ॥ 3220

(8)*గద్యము॥
సవితృ దేవుఁడు మా పాపమును బోఁగొట్టుఁగాక! పర్వతాభిమాను లగు దేవతలు మా యురుతర పాపమును గొట్టుదురుగాక! ఏ దేశమున మధుర సోమ సోత యగు గ్రావ స్తోత్రము చేయఁబడునో! యచ్చట సర్వము జరుగుచున్నది ॥ 3221

(9)*గద్యము॥
ఓ దేవతలారా! సోమాభిషవకర్త నగు నాపైని గ్రావ యున్నత మగుఁగాక! సమస్త ద్వేష్టలను మీరు తొలఁగింపుఁడు! ఆ సవిత మమ్ముఁ బాలించువాఁడు ॥ 3222

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మీ విపుల దీప్త గృహంబున పాపదోషముల్, (తా.పా.), మీ కడను దేకువ పాపము చేయకుందుమో. (మ.పా.)

(10)*గద్యము॥
గోవులారా! తృణవద్దేశమున మీరు ప్రివృద్ధ రసమును గోరిలుఁడు! యజ్ఞ సదనమందు దోహన స్థానమునందు వ్యంజనములను గల్పింపుఁడు! సోమ రసమునకు భేషజ మగుఁగాక! సర్వాత్మిక యగు నదితిని వరింపఁగలము ॥ 3223

(11)*గీ॥ ఎవనికై ద్రోణ కలశము నవ విధంపు
సోమమున నిండునో! యట్టి సుందరేంద్రుఁ
డఖిల జరయితయై తాను నిఖిలమునకు
రక్షకుండయి ప్రపతియై రాజిలుఁగడ! ॥ 3224

(12)*గద్యము॥
ఓ యింద్రుఁడా! నీ ప్రకాశము ఆశ్చర్యభూత మైనది. ఆ భానువు మా కర్మలను బూరించునది. అభ్యేషణీయము. ఓ యింద్ర! నీ స్పర్ధలు స్తోతలకు ధనమును బూరించునవి. అనాప్రధృష్యములు. కావున ఋజు తమ రజ్జువుచే గో పరిచరణమును గోరుచు నీ ఋషి తొందరపడుచున్నాఁడు ॥ 3225

## సూక్తము —100

ఋషి—వన్దనపుత్రుఁడు దువస్యుఁడు
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—1

†(1) ఇంద్రాది దేవాళి యెసఁగి నుతింపఁగా
నమితమౌ స్వచ్ఛత నలరు నాదిత్యుండు
దేవదేవుని దివ్య భావ స్తోత్రోఽఽవళుల
శబ్ద శక్తులు విశ్వశాంతి సౌఖ్యము లొసఁగు
అక్షయమ్మౌ శబ్ద గతాఽక్షర శక్తులే
దివ్యమౌ జ్ఞానాల దీప్తు లొసఁగుచుసుండు
జలద మాలల జన్య జ్వలిత శక్తులు మీఱ
సృష్టి స్థితి లయ గతులఁ జెల్వొందుఁ బ్రాణమ్ము ॥ 3226

†(2) అదితి శక్తుల జగతి నధిదైవతములుగా
అతిదైవతములుగా నాది దేవుని మహిమ
నద్భుతముగా వెలయ నసల స్వచ్ఛత దీప్తు
లలరార గగనాన సమృతమై అమరమై
అమలమౌ శబ్దత త్ర్యక్షర శక్తులే
కాలరూపమ్ములై క్రాలఁగా విశ్వాన

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ఆకాశ రతమైన అద్భుత దీప్తులే
భార సహితమ్ములై భార రహితమ్ములై
శుచ్యనలాఽనిల శుద్ధ తత్త్వము వరల
విశ్వ సంవర్ధకత విమలముగ వెల్గొందు ॥ 3227

†(3) అఖిల దేవాఽఽవళులు అండాండ పిండాండ
బ్రహ్మాండ సర్వస్వ ప్రతిప్రపంచముకూడ
ద్వాదశాదిత్యాళి తరణి గ్రహ నక్షత్ర
సకలమ్మును మహా విశ్వానఁ దిరుగుచు
ఆ శ్రీమహావిష్ణు నాధిపత్యము మీఁదు
యాజమాన్యమ్ముతో నచ్యుత శక్తులన్
సత్య రూపాలలో నిత్యమ్ము తనరారి
అమృత విష తత్త్వాల నగు వెలుఁగు చీకట్ల
సదసత్తులు చిదచిత్తులు సర్వ విశ్వానఁ దనరార
ఆనంద శోకాలె అగు లీల మాయలౌ ॥ 3228

†(4) విష్ణుదేవుఁడు సదా విమలమౌ సుమనస్సు
చంద్ర దీప్తులు మహా శక్తి నమృత మీయ
ఆదిత్య రూపాలు అతిలోకమౌ సత్త్వ
సత్య శక్తుల దివ్య నిత్య సంభారాలు
విశ్వాన వ్యాపించ విపుల సంక్షేమాల
సృష్టి శక్తులఁ బెంచి చెన్నొందఁగాఁజేయు ॥ 3229

†(5) అదితి శక్తుల మూల మౌ నాధిపత్యాల
నతిలోక దీప్తులన్ అలరు మహావిష్ణు
సృష్టి యజ్ఞమ్ములో నిష్ట మను శక్తులన్
పతిగాఁగఁ బితగాఁగ నతులిత ఋత శక్తి
నత్యుత్తమమ్మైన అతి బుద్ధి వరలఁగా
సుగతి ధారక మౌచు జగతి నవారిత
ప్రగతి భారక మౌచు వరలఁగా సర్వమ్ము
విశ్వ శాంతి సుఖాళి విమలమై తనరారు ॥ 3230

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అదితి శక్తులు జగతి నద్భుతముగా వరల
దేవదేవుని దివ్య దీప్త మహిమలు తనర
దైవీయమౌ సుకృతి తగ ననల గృహముగాఁ
దనరారఁగా నశ్వి జనితమౌ విశ్వమ్ము
సహజ సుందర మౌచు నహరహము రూపొంద
వినువీథి విద్యుత్తు వెలుఁగులకు వెలుఁగులై
అనిల మృజ్జలముల నాకాశమున దివ్య
తత్త్వమ్ము వర్ధిలఁగ సత్త్వ శక్తుల నొసఁగు ॥ 3231

†(7) అదితి శక్తులు జగతి నద్భుతముగా వరల
అతిగణ్యమై తనరు దితి పూర్వ దుష్కృతుల
అనృత పూర్ణమ్ములౌ అత్యేహ్య తత్త్వాల
దేవాళి దివ్యమౌ దీప్త శక్తుల సదా
హేళన మ్మొనరించు హెచ్చైన అవమతుల
నాశ మొనరించుచున్ నవనవ్య దీప్తులన్
పుణ్య పుంజము లెల్ల నగణ్యమై తనరార
వసు సంపదలు విశ్వ భాగ్యములై జగతిఁ
బ్రగతి రూపమ్ములై సుగతి దీపమ్ములై
అతిలోక శక్తులన్ అఖిలమ్మునన్ నిండు ॥ 3232

†(8) అదితి శక్తులు జగతి నద్భుతముగా వరల
రవి చంద్ర గోళతతి రజత మేరు గిరులున్
ఆకాశ మనిలాల ననలాల సలిలాల
అవనీతలాలతో నలరారు సృష్టిలో
నతిలోకమౌ శక్తు లతివ్యాప్తి మై వెలయ
నాదిత్య రూపాల నంతరిక్షమ్ములో
నపురూప శక్తులన్ అనుపమమ్ముగ వరల
నతిబృహత్తర మౌచు ననంతతత్త్వమ్మున
విశ్వాన వ్యాపించు విషవాయ్వగ్ని తతి
రూపాల నన్నింటి రూపు మాపుచు సదా
అనృత శక్తుల దుల్చి అమృత శక్తుల నొసఁగి
జ్ఞానధారణ దీప్తి సకల ప్రకృతిని నిల్పు ॥ 3233

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) అదితి శక్తులు జగతి నద్భుతముగా వరల
సచ్చిదానందాల నిచ్చలున్ ద్వేషించు
దుష్ట రాక్షస తంత చేష్ట శక్తుల నెల్లఁ
దున్మాది విశ్వాస దుర్మార్గ విష రూప
జాలాలు నశియింప సవిత శక్తులు మహా
సౌభాగ్యములు నింప సర్వ వసు సంపదలు
ఊర్ధ్వ లోకా లొచు సున్నతోన్నత గతుల
రవిచంద్రగ్రహతతులు రజిత హేమాద్రులును
విశ్వ కాంతులు విపుల విమల తత్త్వాలతో
వర్ధిల్లఁగా జగతి పాలకత్వము మీకు ॥ 3234

†(10) అదితి శక్తులు జగతి నద్భుతముగా వరల
సత్య సదనమ్ములో సత్వ కోశము మీకు
సచ్చిదానందాల సర్వమ్ము విలసిల్ల
నూర్జ శక్తుల సృష్టి నుత్తమ గతు లొప్ప
సూక్ష్మాతిసూక్ష్మమౌ సూక్ష్మ దీప్తులు తనర
వృద్ధి శక్తులలోడ విశ్వమ్ము వర్ధిల్లు ॥ 3235

†(11) అదితి శక్తులు జగతి నద్భుతముగా వరలు
దివ్య దీప్తులు సృష్టిఁ దేజరిల సర్వాన
సంజనన శక్తు లవి సర్వ విశ్వమ్ములో
భిన్న రీతులఁ బుట్టి భిన్నరీతులఁ బెరుగుఁ
గర్మపూరక మౌచుఁ గ్రాలు జగతిని మహా
కాంతి క్రాంతుల విష్ణు వింత శక్తులు వరల
నిత్యమౌ సత్యతా నైశ్చిత్వ మొప్పంగ
విశ్వ సర్వస్వమ్ము విపుల రక్షణ నిల్చు ॥ 3236

†(12) భంగుభంగుల నింగి రంగురంగుల కాంతి
ప్రభల మీరఁగ వెలుఁగు భానుదీప్తులు క్రాల
విశ్వ సర్వస్వమును విమల సృష్టులు జరుగు
నాధిపత్యము వెలయు నతిలోక శక్తులను
వివిధమౌ స్థాయులను వెలుఁగు గోళా లెల్ల
సృష్టి సహజముకాఁగ జీవులుగఁ దిరుగాడు ॥ 3237

†రచయిత:—వాఙ్మయ మహోదృష, డాక్టర్ పడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—100

ఋషి—వన్దనపుత్రుఁడు దువస్యుఁడు

దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము —2

†(1) ఆదిత్యుని మహిత దీప్తి సఖిలారుణ లోకాఒగ్నుల
దేవతాళి దివ్య శక్తి దీప్తములై తనరారును
మఖవంతుని మహితగతులు మర్మసహితమై వెలయఁగ
విశ్వ సృష్టి యెల్ల మహా విజ్ఞానపు రూపమ్మై
బోధ రూపమై నిల్చును పూర్ణ శక్తు లొప్పారఁగ
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3238

†(2) అతిలోకమ్మై తనరెడి సనలాఒనిల శక్తులతో
సదమలమౌ మహామధుర సలిలమ్ముల తత్త్వాలను
ఆకాశము సర్వస్వమ్మలదుచుండు నతిగతులను
ధారకమై భారకమై చార శక్తి సంచరించి
ఋతుగతుల సర్వ ప్రకృతితతులు వర్ధిల్లఁగ
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3239

†(3) అద్భుతమౌ దైవ శక్తి నలరుచుండు నాదిత్యుఁడు
మహితమ్మౌ ఋజుగతులను మాన్యమ్ముగ వ్యాప్తిఁజేసి
దృశ్యమానమౌ ప్రకృతిని ద్యోలోకపుఁ బదార్థాల
నాధిపత్య శక్తులతో నపురూపపు శక్తులతో
నఖిలమ్ముల సమప్రచేసి యంతరాంతరమ్ముల జగతి
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3240

†(4) సుమనస్సుల జన్మించును నమృతకిరణుఁడౌ చంద్రుఁడు
నమృత చాంద్ర శక్తితతుల సుమనస్సులు జనితమ్మౌ
తేజమ్ములు విశ్వమ్మున దీప్యమానమై వెల్గుచు
అగ్నితత్త్వ మెల్ల జగతి నతిలోకముగా వెలుఁగఁగ
విశ్వధారకమ్మై తనరఁగ విశ్వభారకమ్మై వరలును
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3241

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) విశ్వ శాంతి శబ్ద శక్తి విస్తరిల్ల సర్వమ్మున
విష్ణు దీప్త మౌచుఁ బ్రగతి విమలగతుల వర్తిల్లఁగ
సృష్టిఁ బ్రమతి శక్తు లెల్లఁ జిద్విలాసగతుల మీఱ
మనుకాలపు యజ్ఞమ్మై జనక శక్తు లొప్పారఁగ
విశ్వ దీప్తి కధిపతిగా విశ్వేశ్వరేశుఁడు నిలువ
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3242

†(6) సుకృత స్వరూపుఁడై వికృత శక్తులు లేని
అకృతశక్తులు వెలుఁగఁ బ్రకృతిదీప్తులు తనర
దైవీయమ్మౌ ననల జీవ తేజాల్ సృష్టి
సర్వాన వరలఁగా సకలాంతర్బాహిర
రూపాలఁ దనరారు దీప శక్తులు మీఱ
సర్వవిశ్వశక్తితతుల సదమల గతి నిలుపు నదితి ॥ 3243

†(7) దేవతాళి హేళనలన్ దివ్య శక్తి తిరస్కృతుల
నఖిల విశ్వ సృష్టిఁ దనరు నా దుష్కృతితత్త్వమ్ములు
నన్నృతములై నాశమ్ముగ నా ఋతతతి విస్తరిల్ల
నష్ట వసువు లఖిలమ్ముల నద్భుతైశ్వర్యమ్ములై
అలరారఁగ దేవాఽఽళులు అభ్యుదయ పథాల మీఱ
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3244

†(8) రవి చంద్ర తేజాల రజితాద్రి హేమాద్రి
రాజిల్ల విశ్వానఁ గ్రాల నాదిత్యాఽఽళి
అహరహముగ వ్యాప్తి నందు నమృతగతుల
సత్యపథ శక్తిగతి నిత్యధర్మము తనర
జ్ఞానధారణ గతుల సకల ప్రకృతి వరల
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3245

†(9) ఆదిత్యుని శక్తులతో అఖిల విశ్వమందు నలరు
రవిచంద్రులు గ్రహఋక్షా లవితథముగ వెల్గొందఁగ
నిత్యకృతిగ సృష్టి యజ్ఞ మత్యంతము జరుగుచుండు
వసు సంపద విశ్వమ్మున ససమరతులఁ దనరారఁగ
గుణ సంపద్ దరిద్రతల ననుపమముగ ద్వేషించుచు
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు నదితి ॥ 3246

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) విశ్వ సత్య సదనమ్మున నశ్విశక్తు లొప్పారఁగ
సూర్యగతుల రవి చంద్రులు నొసఁగ రజత మేరుగిరులు
సర్వ సృష్టి కోషధిగాఁ బర్వఁగ నీ ప్రకృతి యెల్ల
నణు పరమాణువు లొసఁగు నఖిలమ్మును నలరుచుండ
సూక్ష్మగతులు తనరారును జోద్య మొచు వెలుఁగు సృష్టి
యుప శక్తుల నపశక్తుల నవికలమౌ భవ రక్తుల
ప్రకృతి జ్ఞానధారణములు వరల నుపాదాన మొచు
సృష్టియెల్ల వర్తిల్లును దుష్టితత్వ మొప్పారఁగ
సకలలోక సంచయాలు సచ్చిదానందములుగ
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు సదితి ॥ 3247

†(11) విశ్వ సృష్టి సంతతిగా విమలమ్ముగ నలరారఁగఁ
బంచభూత పూర్ణమ్ముగ వరల సృష్టి సర్వస్వము
తేజోవంత మ్మొచును దేజో భద్ర మ్మొచును
అత్యుత్తమ బుద్ధితత్త్వ మలరారఁగ నంతర్గతిఁ
బదార్థాఒళు లద్భుతమై వరలంగాఁ బ్రకృతిలో
దివి భువులను జీవశక్తి నపశక్తులఁ దేజరిలఁగ
ఉద్భూతమ్మై తనరును నొసరు నంతర్గతులు మీఱ
సర్వవిశ్వశక్తితతుల సదమలగతి నిలుపు సదితి ॥ 3248

†(12) బహుకాంత్యగ్నుల శక్తుల భానుదీప్తి ప్రజ్వలిల్ల
"అభి"రూపపు దుశ్శక్తుల నాజ్యముగాఁ గాల్చి వేల్చి
సర్వ గోళ లోకాలను బర్వఁగ నాదిత్య దీప్తి
నిర్వక్రిత నిర్నిద్రిత నిర్జర తేజాలు మీఱ
అత్యంతము సరసమ్మౌ నపురూపపు శక్తులతో
భయావహము కాకుండఁగ నయాచితంపు సద్గుణగణ
పుంజాలను విశ్వశాంతి పూర్ణభాగ్య మలరారఁగఁ
గర్మతత్త్వపర మొచును ధర్మముతో జగతి నడవ
విష్ణ్వాదిత్యుని శక్తులు విశ్వ వ్యాపిత మొచును
విమల ధర్మ కర్మమ్ముల వెలయించును సత్య గతుల ॥ 3249

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—101

ఋషిః—బుధః సౌమ్యః

దేవతా—విశ్వే దేవా, ఋత్విజో వా

ఛందః—త్రిష్టుప్; 4-6-గాయత్రీ; 5-బృహతీ; 9-12-జగతీ

(1) ఉద్బుధ్యధ్వం సమనసః సఖాయః సమగ్నిమిన్ధ్వం బహవః సనీళాః ।

దధిక్రామగ్నిముషసం చ దేవీమిన్ద్రావతో౽వసే ని హ్వయే వః ॥ 1174

(2) మన్ద్రా కృణుధ్వం ధియ[1] ఆ తనుధ్వం నావమరిత్రపరణీం కృణుధ్వమ్ ।

ఇష్కృణుధ్వమాయుధారం కృణుధ్వం ప్రాంచం యజ్ఞం ప్ర ణయతా సఖాయః ॥ 1175

(3) యునక్త సీరా వి యుగా తనుధ్వం కృతే యోనౌ వపతేహ బీజమ్ ।

గిరా చ శ్రుష్టిః సభరా[2] అసన్నో నేదీయ ఇత్ సృణ్యః పక్వమేయాత్ ॥ 1176

(4) సీరా యుంజన్తి కవయో యుగా వి తన్వతే పృథక్ ।

ధీరా దేవేషు సుమ్నయా ॥ 1177

(5) నిరాహావాన్ కృణోతన సం వరత్రా దధాతన ।

సించామహా [3]అవతముద్రిణం వయం సుషేకమనుపక్షితమ్ ॥ 1178

---

1. ధియఽఆతను, 2. సభరాఽఅసన్నోనేదీయఽఇత్, 3. మహాఽఅవత. (వా.ప్ర.)

(6) ఇష్కృతాహావమవతం సువరత్రం సుషేచనమ్ ।

ఉద్రిణం సించే [1]అక్షితమ్ ॥ 1179

(7) ప్రీణీతాశ్వాన్ హితం జయాథ స్వస్తివాహం రథమిత్ కృణుధ్వమ్ ।

ద్రోణాహావమవతమశ్మచక్రమంసత్రకోశం సించతా నృపాణమ్ ॥ 1180

(8) వ్రజం కృణుధ్వం స హి వో నృపాణో వర్మ సీవ్యధ్వం బహులా పృథూని ।

పురః కృణుధ్వమాయసీరధృష్టా మా వః సుస్రోచ్చమసో దృంహతా తమ్ ॥ 1181

(9) ఆ వో ధియం యజ్ఞియాం వర్త[2] ఊతయే దేవా దేవీం యజతాం యజ్ఞియామిహ ।

సా నో దుహీయద్యవసేవ గత్వీ సహస్రధారా పయసా మహీ గౌః ॥ 1182

(10) ఆ తూ షించ హరిమీం ద్రోరుపస్థే వాశీభిస్తక్షతాశ్మన్మయీభిః ।

పరి ష్వజధ్వం దశ కక్ష్యాభిరుభే ధురౌ ప్రతి వహ్నిం యునక్త ॥ 1183

(11) ఉభే ధురౌ వహ్నిరాపిబ్దమానో ఽన్తర్యోనేవ చరతి ద్విజానిః ।

వనస్పతిం వన[3] ఆస్థాపయధ్వం ని షూ దధిధ్వమఖనన్త[4] ఉత్సమ్ ॥ 1184

---

1. సించేఽఅక్షితమ్, 2. వర్తఽఊతయే, 3. వనఽఆస్థాప, 4. నన్తఽఉత్సమ్. (వా.ప్ర.)

(12) కప్నృన్నరః కప్నృతమద్దధాతన చోదయత ఖుదత వాజసాతయే।

నిష్టిగ్ర్యః పుత్రమా చ్యావయోతయ[1] ఇన్ద్రం సబాధ ఇహ సోమపీతయే ॥ 1185

## సూక్తము—101

ఋషి—సోమపుత్రుఁడు బుధుఁడు†

దేవత—విశ్వే దేవతలు లేక ఋత్విజులు†

(1)*గద్యము॥

ఓ ఋత్విజులారా! సమాన మనస్కులు, పరస్పర మద్రోగ్గులు నగు మీ రగ్నిని దీపింపఁ జేయుఁడు! నేనును దధిక యను దేవతను అగ్నిని సుషస్సును నింద్రసహితు లగు మిమ్ములను మా రక్షణముఁ గోరి పిలిచెదను ॥ 3250

(2)*సీ॥ సఖులార! మదకరసత్స్తోత్ర పద్ధతి నుచ్చరింపుఁడు! మీర లున్నత మతిఁ
గమనీయమౌస్థలి కర్షణాదుల నెల్ల జరిగింపుఁడీ! మీరు సరసమతిని
వార[1] కరిత్రాణ పారయితవ్యమౌ నావను జేయుఁడీ! పావనమతి
సారయుతంబులౌ సీరయుగాదుల మిక్కిలి కాంచుఁడీ! మేలుమతిని

గీ॥ బ్రాంచమైనట్టి యిష్టికిఁ బ్రమతయుక్త,మైన మతితోడఁ గూడుచు నగ్ని దేవుఁ
జేర్చుఁడీ! మీరు సజ్జన చిత్త మలర, వెలుఁగుఁడీ! లోకమందున వేడ్కమిగుల ॥ 3251

(3)*గద్యము॥

సఖులారా! మీరు అనడ్వాహములతో సీరములను గూర్చుఁడు! అందునిమిత్తము యుగములను విస్తరింపఁజేయుఁడు! సీతయందు గ్రామ్యారణ్య బీజములను జల్లుఁడు! (తిల మాష వ్రీహ్యాదికము గ్రామ్య సప్తకము. వేణు శ్యామాక నీవారాదిక మరణ్య బీజ సప్తకము) స్తుతిచే మా కన్నము కలుగుఁగాక! మరియు నంకుశము వలె వక్ర మగు లవిత్రము పక్వస్తంభమును జేరుచున్నది ॥ 3252

(4)*గీ॥ సుఖముఁ బడయంగఁ దలఁచుచు సూరులైన
కవులు కర్షణ సాధన గణములఁ గడుఁ
గూర్చుచున్నారు మరియును బేర్చియుగము
లను నొనర్చుచునున్నారు మొనసి తాము ॥ 3253

---

1. యోతయఽఇన్ద్రం సబాధఽఇహ. (వ్రా.వ్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 43వ పుటలో నీ సూక్తమునకు ఋషి "సోమ పుత్రుఁడు బుధుఁడు"గాను దేవత "విశ్వే దేవతలు"గాను వ్రాసి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "బుధుఁడు"ఋషిగాను, "విశ్వే దేవతలు లేక పురోహితులు" దేవతలుగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. కర్షణాధిరూపము. (నే.వేం.న.శా.)

(5)*గద్యము॥
ఓ సఖులారా! మేము ఉదా్రవవంతము సించనము చేయుటకు శక్యమైనది. యుదకోపక్షయ
రహితము నగు నవటమును దడిపెదము. కావున నగ్నిచయన ప్రదేశ కర్షణార్థము
గోపాన సాధన దుా్రమమయ పానపాత్రముల సిద్ధముఁ జేయుఁడు! ॥ 3254

(6)*గీ॥ శోభన వరత్రయుక్తము శోభనోద
కాఢ్య మక్షీణ మగునట్టి! యతిశయముగ
సంస్కృతం బైన దోణిమము సంతసమునఁ
దడుపుచున్నట్టి వాఁడను గడుఁ బ్రపత్తి ॥ 3155

ఋత్విక్పక్షము

(7)*గద్యము॥
ఓ ఋత్విక్కులారా! మీ రశ్వములను బలీవర్ధములను నుచిత ఘాసోదక ప్రదానమునఁ
దృప్తిఁబరపుఁడు! పిమ్మట పిత్తనములు చల్లుటకుఁ దగునట్లు కర్షణముఁ జేయుఁడు!
హలమును సుఖ వాహక మగు దానిగా సిద్ధపరపుఁడు! అవటము వలె నిమ్న
భూతము. అశ్మమయ చక్రము ఉదకమునకుఁ గోశస్థానీయము నరపాన
యోగ్యము నగు నవటము నుదక పూరితముగఁ జేయుఁడు! ॥ 3256

వైశ్వదేవపక్షము

*గద్యము॥
అశ్వములను స్నాన పాన యోగ్యాన్నముల సంగ్రామ యోగ్యములుగాఁ జేయుఁడు!
బంధువులకు సుహృత్తులకు హిత మగునట్లు సంగ్రామమును గావింపుఁడు!
రథమును నాశన రహితముగ నొనర్పుఁడు! దుమ్రమయ రథములు
గలది కూప ప్రాంత నిబద్ధాశ్వ ప్రహరణాయుదవంతమును ననంత్ర
ధనుఃకవచములఁ గలుఁగునట్టిదియు నగు కూపసదృశ సంగ్రామమును
నో సైనికులారా! మీరు చేయుఁడు! ॥ 3257

ఋత్విక్స్తుతిపక్షము

(8)*గద్యము॥
ఓ ఋత్విక్కులారా! ఆ శిరదోహార్థము గోష్ఠమును సిద్ధపరచుఁడు! ఆ శిరము దేవపాన
సాధనము. వర్మములను జేయుఁడు! ఆ వర్మములు బహుళములు. విస్తీర్ణములు.
ఆయోమయవత్సారభూతములు. అన్యాధృష్యములుగాఁ గావింపుఁడు! మీ
చమసమును దృఢముగా నుంచుఁడు! ॥ 3258

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

వైశ్వదేవపక్షము

•గద్యము॥

అస్మదీయ యోధులారా! నృపాణము (శత్రువుల ప్రాణముల హరించునది) మీ యది. కవచములను ధరింపుఁడు! పురము లనాధృష్యములు. మీ యదనసాధనము స్రవింపకుండుఁగాక! ॥ 3259

(9)•గీ॥ పూజ్యమై ద్యోతమానమై పూర్ణ యజ్ఞ
హేతు వైనట్టి మీ బుద్ధి పూతులార!
మమ్ము రక్షించుటకు నేను నెమ్మి మీర
మరలఁ జేసెద నయ్యలు! సురుచిరముగ ॥ 3260

•గీ॥ యవసముల నెల్ల భక్షించి యతిశయముగఁ
బ్రీత యైనట్టి దేనువు పూత దుగ్ధ
ములను నొసఁగెడు చందాన లలితమైన
యా మహాబుద్ధి కాంక్షిత మందఁజేయు ॥ 3261

(10)•గద్యము॥

ఓ యధ్వర్యూ! సోమమును దారుమయ పాత్రలోఁ బోయుము! పాత్ర సంపాదకులారా! అయశ్శిలాసారభూతము లగు వానిచేఁ బాత్రములను గల్పింపుఁడు! దశ సంఖ్య గల ఆ సోమ పూర్ణ పాత్రలను బర్యాయముగా నాసాదింపుఁడు! రజ్జువుల నా పాత్రలకుఁ జుట్టఁబెట్టుఁడు! రెం డనడ్వాహములను గూర్చుఁడు! ॥ 3262

(11)•గద్యము॥

హవిర్ధాన శకటము రెండు ధురముల మోయుచు ఆ శబ్దమాన మగు వాహకానడ్వాహము యోనియందు వలె రెండింటి మధ్యను జరించుచున్నది. శకటమును వననీయ దేశమందు స్థాపింపుఁడు! పిదప నచ్చట నున్న సోమమును సుఖము కలుఁగు నట్టు లుంచుఁడు! తర్వాత నా రసమును సంపాదింపుఁడు ॥ 3263

కర్షణపర వ్యాఖ్యానము

•గద్యము॥

ఏ లాంగలముయొక్క రెండు ధురములను మోయుచు శబ్దాయమాన మగు ననడ్వాహము యోనియందు వలె రెండింటి మధ్యను జరించుచున్నది. వనస్పతి వికార మగునట్టి లాంగలమును గర్షణ ప్రదేశమందు స్థాపింపుఁడు! సేకసాధన ప్రదేశమును దప్పుచు లాంగలమును నంతటఁ బ్రవేశింపఁజేయుఁడు! ॥ 3264

---

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(12)•గద్యము॥

ఓ ఋత్విజ్జులారా! ఇందుడు సుఖపూరకుడు. సుఖపూరయిత యగు నిందుని బ్రేరేపింపుడు! రమింపజేయుడు! అన్న లాభమునకు సంస్కరింపుడు! ఓ హోత! అదితి పుత్రు డగు నింద్రుని రక్షణమునకు ద్రిప్తి పరపుడు! ॥ 3265

## సూక్తము—101

ఋషి—సోమపుత్రుడు బుధుడు

దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—1

†(1) అగ్ని శుచి శక్తు లవి అంతర్గతుల నలర
సఖులుగా బద్ధమై సచ్చిదానందాల
సమనస్కతారూప మమలమై వరలగా
సమృతతత్త్వమ్ముతో నా దుగ్ధ ఘనీభూత
దధిశక్తి గతి బుద్ధి తనరార జ్ఞానమై
ఉషసు దేవిగ వెలుగ సుజ్వలాగ్నుల దీప్తు
లతివేల గతులతో నఖిలాన వ్యాపించు
విశ్వదేవాఽఽవళుల విమల తేజము లలరు ॥ 3266

†(2) హృదయ హర్షదాయకమై యెనగు స్తుతుల శబ్ద శక్తు
లుత్తమమౌ కర్మతతుల నుజ్వల తరణీయ మౌచు
విశ్వసృష్టిలోన విపుల విజ్ఞానము మూర్తి గొనగ
దేవ దేవు సృష్టిశక్తి దివ్యయజ్ఞ మొనరింపగ
నింగి యజ్ఞగుండ మౌచు నిరతమ్మును నెగడుచుండు
ఆదిత్యుల మహితమైన అగ్నిదీప్తు లొప్పారగ
ఆపణలోకజాలా లవి అత్యంతము సఖ్యతమై
నంతర్గతి నలరుచుండు ఆధిపత్యపరిధు లొప్ప ॥ 3267

†(3) విశ్వ మొక యోనిగా విమల ప్రకృతి పురుష
ద్వంద్వ శక్తులను నిర్ద్వంద్వ శక్తిగ రూపు
నంది బీజమ్ముగా నద్భుత ప్రాణి గతి
దనురూపమై ప్రగతి ఘనరూపమై జగతి
శబ్ద శక్తుల మహిత నన్నా దతతు లొప్ప
ననన్నాశక మౌచు నవతరించును హృత్తు
అక్షయమ్మై తనరు నక్షర దీప్తులన్
అతనురూప మ్మౌచు ననాహత స్థితి గతుల ॥ 3268

---

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) కాల మొక్కటిగాఁగఁ గ్రాలుచుండంగా
గాల పురుషం డొకఁడు లీలఁగా వెలుఁగఁ
గాల బద్ధుం డౌచు వేల లెనసిన ప్రాణి
కాలమున్ విభజించి పాలించు రీతిగా
పృథగత్త్వమున వరలు వివిధ విభాగాల
యుగము లను పేరుతో నగణితగుణితాల
నలరఁజేయుచునుండు నావిష్కృతముఁ జేయు
కాలాంతకుం డౌచుఁ గ్రాలు దేవుండు
దేవాఽఽళులన్ నిత్య ధీరతన్ దనరు
దేవ దేవుఁడుగాఁగ దివ్య దివ్యత్వాల ॥ 3269

†(5) అఖిల లోకాఽఽవళుల నా పంచభూతాల
నలరారు సర్వదా ఆధికాధిక గతుల
సలిలముల్ ప్రవహింప సలిలముల్ త్రావుచున్
అంతర్గతిని నిల్వ నాకసమ్మునఁ దనర
క్షీణ మయ్యును జల మక్షీణగతిగ వరలు
ననలాదు లన్నియు నంతర్గతిని నిముడ ॥ 3270

†(6) అత్యుత్తమమ్మైన అతిలోక స్థితిరతుల
మహితమై జనితమై మధుర రుచు లొప్పార
అమృత శక్తులు నింప నల ప్రాణతతు లొప్ప
నక్షయమ్మౌ శక్తి నావిష్కృత మ్మౌచు
అమర గతులను వరలి అమలతత్త్వము మీఱ
నాకసముతోసహా అన్నిటన్ దనరారు ॥ 3271

†(7) సంచలన శక్తులన్ అంచితముగా నొప్పి
మధురమై ఆనంద మహిమాఽన్వితమ్మై
కాంతి శక్తుల జలము క్రాలు ప్రసన్నతన్
జలము ధనమై నిలుచు జలము ఘనమై వెలుఁగు
జలము రక్షక మౌచు జగత్ ప్రాణద మౌను
అనలాఽనిలాఽఽకాశ మవనీ తలాలతో
అవినాభావమౌ ననుబంధ మొప్పఁగాఁ
బునర్జన్మల శక్తి పూర్ణమై తనరారు ॥ 3272

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) విశ్వ సృష్టి సర్వస్వము వెలుఁగొందును లోకాలను
ఫలవంతములై వరలుచు నిలయములై సహజ కవచ
వలయములై తనరారును బహుళములౌ పృథు శక్తుల
లోహమయమ్ములు కాక లోఁబడునవి కాక జగతి
ఆగనట్టి యజ్ఞ మద్ది అఖిల సృష్టి యజ్ఞ మద్ది
యజ్ఞ పాత్రి కర్మమ్మె యజ్ఞకర్త యౌ నీవుఁడు ॥ 3273

†(9) సృష్టియజ్ఞతతులు జగతిఁ జెలఁగుచుండు దేవదేవ
దంపతీకృతము లౌచుఁ దనరారుచు నిత్యమ్మును
అమృత శక్తు లొప్పుచుండు నమలమైన జలధారల
సహస్రములు లోకమ్ముల స్రవియింపఁగ౹ దైవశక్తి
పృథ్వితత్త్వ మెల్ల వరలు వృద్ధి నభ్యుదయాళితోడ
సృష్టిచైతన్య శక్తి స్రష్ట యిచ్చు ప్రాణంబై
విజ్ఞానమయమ్ము కాఁగ విశ్వమ్మున వరలుచుండు
నజ్ఞానపు దుశ్శక్తుల నంతరింపఁజేయు సదా౹ ॥ 3274

†(10) హరి కృపమై విశ్వ మ్మది ఉలరారును సద్భుతముగ
దశ దిశలను విలసితమై తరణి సంఘ కుటుంబాళి
చాంద్ర ఋక్ష గ్రహతతులను సదమలమౌ రజిత మేరు
గిరి రతులను రత్న రాజి వరలు నష్ట వసు సంపద
అఖిలమ్మున విస్తృతమై అపురూపపు దీప్తులతో
నమృత శక్తిమయ మ్మొచు నద్భుత ఋత శక్తు లొప్పు ॥ 3275

†(11) ప్రకృతి తరుణి రమణీయతఁ గ్రాలు కాల పురుష ఘనత
వరలు విశ్వ సర్వస్వము ద్వంద్వ శక్తు లొప్పారఁగ
వనస్పతుల బృహస్పతుల వరలు పంచభూతతతుల
అతిలోకపు టతిశక్తుల నతిగతులను రతిగతులను
ఆవిష్కృతరక్తి తతుల నంతర్హిత ముక్తిగతుల
అగ్ని దీప్తు లొప్పారఁగ నఖిలాంతర్యోని కాఁగ
సృష్టి స్థితి లయ కృతులను జెలఁగ విశ్వతత్త్వ మ్మది
ఆద్యంతము లెనయనట్టి ఆకాశము లోకాదులు
శబ్ద శక్తు లొప్పారఁగ సర్వస్వము సంచరించు
స్థాపించని విధి కాఁగను దీపితమై నిలుచు సృష్టి ॥ 3276

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) చంద్రాఽమృత శక్తితతుల సౌరానల దీప్తులు కడు
సహజముగా స్వీకరించు సచ్చిత్తుల తేజ మెనయఁ
ఋతువులుగాఁ జంద్రతతులు మిత్ర రతుల విలసిల్లఁగ
ఆకర్షణ వికర్షణల అఖిలమ్మును సబాధకత
నలరారుచు సంచరింప నద్భుతగతి నిత్యమ్మును
దిక్కాలా లలరుచుండు నిక్కమ్మౌ సృష్టి నిష్ఠ ॥ 3277

## సూక్తము—101

ఋషి — సోమపుత్రుఁడు బుధుఁడు

దేవత — విశ్వే దేవతలు

### అర్థాంతరము — 2

†(1) అనంతత్వాలతో నఖిలమ్మును దనర
ఆ మనశ్శక్తులవి అతిలోకపు గతులతో
అతివేల రతులతో నాకర్షణపు శక్తి
నసలు లోఁగక సదా అంతరిక్షాఽతీత
మహిత శక్తులు తనర మహిమాన్వితమ్ముగాఁ
బ్రకృతి రూపము వరల నకృత సఖిత్వాలఁ
పురుష తత్త్వాలతోఁ బూర్ణైక్యములు పొందు
సుసురులకు సుసుతులై ఉష శక్తులను నిలుపు ॥ 3278

†(2) ఆనందరూపమౌ నతిలోక శబ్దాల
నుత్తమ కర్మలతి సుజ్జ్వలగతి నిల్ప
అఖిల లోకాఽఽవళులు నంతరిక్షపు నౌక
నధిరోహణము చేసి యంత మెసయని యాత్ర
నిష్టిగా సృష్టిక్రియ లదృష్ట శక్తుల నెరపి
అపురూపమై వెలుఁగు నతివేల దీప్తులన్
తనురూపమౌ శత్రు తత్త్వాలనే తునిమి
విష్ణుదేవుని మహో విజయ పతాకగా
విశ్వ సృష్టియె వెల్గు సశ్వ దీప్తులు పరల
శాశ్వతాఽశాశ్వతపు స్వచ్ఛతా గరిమమై ॥ 3279

†(3) కాలయోనిని యుగము క్రాలు బీజముగా
ననంతయోనిగఁ గాల మసంఖ్యాకమై యుగ
బీజాళులే వరల విశ్వమ్ము రాజిల్లు
శబ్ద శక్తుల జగతి సంభారమై సదా
నిత్య సమరమ్ముగా సత్య సృష్టులు తనరఁ
బుట్టుటల్ పెరుగుటల్ గిట్టుటల్ వరలులేః ॥ 3280

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) చక్ర శక్తులు సృష్టి విక్రమమ్ములు వరల
ఆత్మ ప్రదక్షిణాల నతిలోక శక్తులన్
విజయ యాత్రగ విశ్వ విజయ ప్రదక్షిణాల
దేవాఽఽశితతులకే దివ్యగతి యుగములై
జంటలై మింటిలోఁ బంటలై దంటలై
ప్రకృతి పురుషుల కాల ప్రాకృతత్త్వము తనరు ॥ 3281

†(5) సలిల శక్తులు మహా జగతిలో వర్తిల్లఁ
దరణుల సందీప్త కిరణాఽఽళి వరలంగ
ననిల శక్తులు సకలాకాశములఁ బర్వఁ
బృథ్వీ తత్త్వాలతో విశ్వరూపము నిండ
క్షతిరహితగతి మిఱి స్రష్ట శక్తులు తనర
సృష్టి స్థితి లయా లవి చెలఁగు ననునిత్యమ్ము ॥ 3282

†(6) ఉత్తమతత్త్వాల నొప్పెడి పంచభూ
తాళు లలర సృష్టి సక్షయగతులమై
విశ్వ సంక్షేమాల విమల సౌఖ్యము లొప్ప
సర్వేశ్వరేశ్వరుఁడు పర్వ నఖిలాధిపత
సర్వ సేచనరతుల సమమలగతి సృష్టి
నిత్యాఽనుబంధాల నిఖిలమ్ము వర్తిల్లి ॥ 3283

†(7) విశ్వాఽశ్వి శక్తు లవి విమల దీప్తుల వరల
సృష్టి సర్వస్వమ్ము చెలువొందు సుఖగతులఁ
గాల రథ గమనాల వేల లెనయని రీతి
విష్ణు దేవుని చక్ర విపుల రక్షణ లెనయ
సృష్టి క్రతువులు సదా చెలఁగు దివ్యత్వాల
విశ్వ కోశము సహజ విపుల సంపద లలర ॥ 3284

†(8) అఖిల దిక్కుల వెల్గు నసంఖ్యాకములైన
రవి చంద్ర గోళాల రాజిల్లు దివి భువులు
ప్రకృతి సిరి సంపదలఁ బరిఢవిల్లుచుఁ దనర
దైవీయమై ఉవ్యతర శక్తు లొప్పార
సదృష్ట సౌభాగ్య మపురూపమై వెలయ
స్రష్ట యజ్ఞము మహా సృష్టిగాఁ జెన్నొందు ॥ 3285

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) దైవీయ శక్తులన్ దనరారు నీ సృష్టి
ప్రకృతి పురుషుల తత్త్వ మకృత రూపాలుగా
వరలఁగా జగ మెల్లఁ బరదేవతాపర
యజ్ఞమై వరలఁగా నఖిలమౌ సృష్టి స్థితి
లయ నిత్యగతి సత్యక్రియ లొప్ప మహితమై
విష్ణు చక్రము సదా విశ్వ రక్షక మౌచు
సహస్రధారగ వెలిఁగి యిహ పర లోకాల
నెదురు లేని శక్తిగా నెసఁగు నజయ్యమై ॥ 3286

†(10) హరిశక్తి వశ మౌచు నఖిల విశ్వము తనరు
రవి చంద్ర గోళాలు రమణమౌ దివి భువులు
ఋక్ష గ్రహ నక్షత్ర సృష్టి సర్వస్వమ్ము
నిత్య చారలు మీఱ సత్యధారక మౌచు
ధర్మ తారక మౌచుఁ గర్మ భారక మౌచు
దశదిశలఁ దనరారు విశద కక్ష్యలు వరల
నిహ పర సాధన మహితమై కాలగతిఁ
బ్రకృతి పురుషుల యోగ సుకృతు లవి వరలులేః ॥ 3287

†(11) బహిరంతర్గతులు రహి మించ విశ్వానఁ
బ్రకృతి కంతర్యోని అక్షతమ్ముగ వెలయ
వరుణ శక్తులు సదా వర్ధిల్ల విశ్వాన
ననలాఽనిల రూప మవనీతలాఽఽకాశ
తత్త్వాల సలిలాలు తనరార సృష్టిలో
ద్వంద్వ శక్తుల జగతి వర్ధిలును మహితమై
ఆత్మ ప్రదక్షిణల నలరఁ బ్రదక్షిణల
పరిభ్రమణము మీఱ వరలఁగా గోళాలు ॥ 3288

†(12) అఖిల విశ్వమ్మందు నమల శక్తులు వరలఁ
జంద్రామృత కిరణ జాలాలు సృష్టిలో
నిత్య నవ చైతన్య సత్య శక్తుల నొసఁగ
నాత్మయే పుత్రుఁడై అలరారునట్లుగా
నఖిల్మ చెలువొందు ననలము దీప్తులు వెలుఁగఁ
గాల బద్ధ మ్మౌచుఁ గ్రాలుచున్ విధిగతుల ॥ 3289

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—102

ఋషిః—ముద్గలో భార్మ్యశ్వః
దేవతా—ద్రుఘణ, ఇన్ద్రో వా
ఛందః—త్రిష్టుప్; 1,3,12-బృహతీ

(1) ప్ర తే రథం మిథూకృతమిన్ద్రోఽవతు ధృష్ణుయా ।
అస్మిన్నాజౌ పురుహూత శ్రవాయ్యే ధనభక్షేషు నోఽవ ॥ 1186

(2) ఉత్ స్మ వాతో వహతి వాసో[1] అస్యా అధిరథం యదజయత్ సహస్రమ్ ।
రథీరభూన్ముద్గలానీ గవిష్టౌ భరే కృతం వ్యచేదిన్ద్రసేనా ॥ 1187

(3) అన్తర్యచ్ఛ జిఘాం[2]సతో వజ్రమిన్ద్రాభిదాసతః ।
దాసస్య వా మఘవన్నార్యస్య వా సనుతర్యవయా వధమ్ ॥ 1188

(4) ఉద్నో హ్రదమపిబజ్జర్హృషాణః కూటం స్మ తృంహదభిమాతిమేతి ।
ప్ర ముష్కభారః శ్రవ[3] ఇచ్ఛమానో ఽజిరం బాహూ[4] అభరత్ సిషాసన్ ॥ 1189

(5) న్యక్రన్దయన్నుపయన్త[5] ఏనమమేహయన్ వృషభం మధ్య[6] ఆజేః ।
తేన సూభర్వం శతవత్ సహస్రం గవాం ముద్గలః ప్రధనే జిగాయ ॥ 1190

---

1. వాసోఽఅస్యాఽఅధిరథం, 2. జిఘాంశతో, 3. శ్రవఽఇచ్ఛమానో, 4. బాహూఽఅభరత్,
5. యన్తఽఏన, 6. మధ్యఽఆజేః. (ప్రా.ప్ర.)

(6) కకర్దవే వృషభో యుక్త[1] ఆసీదవావచీత్ సారథిరస్య కేశీ ।
దుధేర్యుక్తస్య ద్రవతః సహానస[2] ఋచ్ఛన్తి ష్మా నిష్పదో ముద్గలానీమ్ ॥ 1191

(7) ఉత ప్రధిముదహన్నస్య విద్వానుపాయునగ్వంసగమత్ర శిక్షన్ ।
ఇన్ద్ర[3] ఉదావత్ పతిమఘ్న్యానామరంహత పద్యాభిః కకుద్మాన్ ॥ 1192

(8) శునమష్ట్రావ్యచరత్ కపర్దీ వరత్రాయాం దార్వానహ్యమానః ।
నృమ్ణాని కృణ్వన్ బహవే జనాయ గాః పస్పశానస్తవిషీరధత్త ॥ 1193

(9) ఇమం తం పశ్య వృషభస్య యుంజం కాష్ఠాయా మధ్యే ద్రుఘణం శయానమ్ ।
యేన జిగాయ శతవత్ సహస్రం గవాం ముద్గలః పృతనాజ్యేషు ॥ 1194

(10) ఆరే[4] అఘా కో న్విత్థా దదర్శ యం యుంజన్తి తమ్వా స్థాపయన్తి ।
నాస్మై తృణం నోదకమా భరన్త్యుత్తరో ధురో వహతి ప్రదేదిశత్ ॥ 1195

(11) పరివృక్తేవ పతివిద్యమానట్ పీప్యానా కూచక్రేణేవ సించన్ ।
ఏషైష్యా చిద్రథ్యా జయేమ సుమంగలం సినవదస్తు సాతమ్ ॥ 1196

---

1. యుక్తఽఆసీద, 2. సహానసఽఋచ్ఛన్తి, 3. ఇన్ద్రఽఉదావత్, 4. ఆరేఽఅఘా. (వ్రా.ప్ర.)

(12) త్వం విశ్వస్య జగతశ్చక్షురిన్ద్రాసి చక్షుషః ।

వృషా యదాజిం వృషణా సిషాససి చోదయన్ వధ్రిణా యుజా ॥ 1197

## సూక్తము—102

ఋషి—భార్మ్యశ్వుఁడైన ముద్గలుఁడు†

దేవత—ఇంద్రుఁడు లేక ద్రుఘణ†

(1)•గీ॥ [1]ఓయి! ముద్గలుఁడా! నీ మహోజ్జ్వలంపు
టరద మశ్వ శూన్యమై యమిఁగాక!
నట్టి రథమును దర్శకుఁడైన యింద్రుఁ
డిపుడు[2] రక్షించుఁగాకఁ దా నెలమి మీర ॥ 3290

•గీ॥ ఓయి! పురుహూత! [3]యో దేవ! యోయి! యింద్ర!
ఎల్ల సంగ్రామములయందు నెట్లొ [4]మాకు
దేనువులు [5]ధనము కల్గెడు తీ రొనర్చి
మమ్ము రక్షింపుమా! కడు నెమ్మి నీవు ॥ 3291

(2)•గద్యము ॥

అధికముగ రథము నధిరోహించి సహస్రసంఖ్యాక గో సంఘమును బుట్టించునపుడు
ముద్గలమునకు సారథిభూత యగు దానియొక్క యంశుకము వాయువు మీఁదుగా
ధరించుచున్నది. అపహృత గోవుల యేషణమందు ముద్గలస్త్రీ సారథి యయ్యెను.
ఇంద్రసేన స్తుత్యయై సంగ్రామమందు సంపాదించిన గో సంఘమును
శత్రువులనుండి తప్పించెను ॥ 3292

†వ్రాతప్రతి 14వ సంపుటము 4వ పుటలో నీ సూక్తమునకు ఋషి "ద్రుఘణ మను ముద్గరము" గాను దేవత "ఇంద్రుఁడు"గాను వ్రాసి, 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "ముద్గలుఁడు" గాను దేవత "ఇంద్రుఁడు లేక మాస్ (Mace) "గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఓసి ముద్గలుఁడా! నీదు భాసమాన, మౌ రథం బశ్వ శూన్యమై, (వ్రా.ప్ర.పా.), 2.రక్షించు గావుత మెలమి మీర. (తొ.పా.)

3. గీ॥ ఓయి! పురుహూత! శాత్రవహారి! యింద్ర!
యిట్టి సంగ్రామమందు నెట్లొ మేము
దేనుధన కాములము కాగ తెపిరి నీవు
మమ్ము రక్షింపుమా! కడు నెమ్మి మీర॥ (తొ.పా.)
ఓయి! పురుహూత! యో దేవ! యోయింద్ర!, అఖిల సంగ్రామమందు. (మ.పా.)

4. "నెట్లొ మేము" అని వ్రాసి శ్రీనేమానివారు "మేము" కొట్టివేసిరి. వారు "మాకు" శబ్దము వ్రాయలేదు.

5. ఇక్కడ నింద్ర గణమునకుమారు "పంచలఘు గణము" ప్రయుక్తమైనది.

(3)*ఉ॥ వాసవ! చంప నున్న యల వైరిపయిన్ భవదీయ వజ్రమున్
వేసి వెలుంగుమయ్య! యతివేగము నాశము నొందనున్న బల్
మోసము చేయనున్న యల మూర్ఖుఁడు దాసుని గూడ వజ్రమున్
భాసిలకుండఁజేసి బహు భంగుల [1]దానిని వేరు చేయుమా! ॥ 3293

(4)*చ॥ ఉదకము చాలఁ గోరి కడు నున్నతహౌ వృషభంబు శక్తిచే
నెదఁ బరితుష్టి నందుచు నమేయ మహీధర శృంగ భాగమున్
ముదమునఁ గొట్టి వైరులను మొత్తగ నేగుచు వృద్ధ ముష్కుమై
సదమల కీర్తిఁ బొందుటకు శత్రులఁ [2]దుంచుచునుండెఁ గిన్కమై ॥ 3294

(5)*గద్యము॥
ప్రభూతక్రందనమున శత్రువులు పారిపోవునట్లు సమీపస్థ నరు లే వృషభమును గ్రిందునట్లు చేసిరో! సేక్త యగు నే వృషభమునకు సంగ్రామముమధ్యను విశ్రామార్థము మూత్ర పురీషోత్సర్గమును గావించిరో! యేది శోభన చణకాది భక్షకమో! యట్టి వృషభమున యవలను భక్షించు గో సహస్రమున సంగ్రామమునందు ముద్గలుఁ డగు నేను జయించితిని ॥ 3295

(6)*గద్యము॥
శత్రు హింసనముకొఱకు వృషభము రథమునకుఁ గట్టఁబడెను. ప్రగ్రహవంతుఁ డగు రథసారథి శత్రుభయ జనక మగు క్రోశమును గావించెను. దుర్ధరమై శీఘ్రముగ యుద్ధమధ్యమునఁ బరువెత్తు వృషభముయొక్క భయంకర శబ్దముతో యోద్ధలు ముద్గలుని యోషిత్తునిగూర్చి వచ్చుచున్నారు ॥ 3296

(7)*గద్యము ॥
విద్వాంసుఁ డగు ముద్గలుఁడు రథఛిద్రకాష్ఠ ప్రాంత కాష్ఠమును నమర్చెను(రథమును సన్నాహపరచెను)పిదప రథమునందు పననీయ గమనము గల వృషభమును రథ సమీప యుగమునందు బంధించిరి. ఇట్లు కాఁగా నింద్రుఁడు అహంతవ్య గోపతిని రక్షించెను. తర్వాత వృషభము సరణులచే వేగము పోయెను ॥ 3297

(8)*గద్యము॥
సుఖము కలుఁగునట్లు అష్ట్రావి కపర్దము కలదియై సంచరించుచున్నది. ఋధ్నియందు రథాంగభూత మగు కాష్ఠమును సర్వతో బంధించుచు స్వభృత్యాది జనులకొఱకు శత్రు సంబంధ ధనములను సంపాదించుచు గోవులను స్పృశించుచు జయము నొందెను ॥ 3298

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి

1. వేరుగఁజేయు మీ వొగిన్, (తా.పా.), 2. ద్రుంచు నైజ బాహుతన్, (తా.పా.).

(9)•గద్యము॥
ఓ సఖుఁడా! వృషభమునకు సఖిభూతుని సంగ్రామమందు హంతవ్యులను జంపి నిర్వ్యాపారముగ వర్తమానుని ద్రుమమయుని ఘనుని జూడుము: ఏ ద్రుఘణునివల్ల శతోపేత మగు గో సహస్రమును సంగ్రామమందు నేను జయించితినో! యట్టి వీనిని జూడుము: ॥ 3299

(10)•గద్యము॥
ఎవఁడు సమీపమందు నఘయలను జేయుచున్నాఁడో! వానిని నే నరుఁడు చూడఁగలఁడు? ఎవనిని రథమునందుఁ గూర్చుచున్నారో! వానిని పరిహరణార్థము రథమునందు స్థాపించుచున్నారు. వీనికొఱకుఁ దృణమునుగాని, జలమునుగాని, కొనితేకుండ నున్నారు. ఇట్టి ద్రుఘణుఁడు దక్షిణ వృషభమునకు స్వయ ముత్తరుఁడై రథ భారమును వహించుచున్నాఁడు ॥ 3300

(ముద్గలాని వర్ణింపఁబడుచుండెను)

(11)•గద్యము॥
ముద్గలాని పతివిముక్త యగు యోషిత్తు వలెఁ బతి సమీపమునకు సారథిత్వముచే వచ్చి కుచక్రము వలె వర్ధమానయై మేఘమువలె జలమును వర్షించుచు నభివృద్ధిఁ బొందు చున్నది. సారథిభూత యగు నా వ్యక్తిచే జయింపఁగలము. శత్రువులచే నపహృత మగు గో సంఘమును నామె కిడుఁడు! శోభన మంగళము వలె నన్నము కలుఁగుఁగాక! ॥ 3301

(12)•గీ॥ వర్షకుండైన ముద్గలు పరిధనమునకు
నశ్వములఁ గట్టుచున్నావు యానమునకు
విపుల చక్షస్సు గలిఁగిన విశ్వమునకు
చక్షు వగుచుంటివో! యింద్ర! చాతురిమను ॥ 3302

## సూక్తము—102

ఋషి—భార్మ్యశ్వుఁడైన ముద్గలుఁడు
దేవత—ఇంద్రుఁడు లేక ద్రుఘణ

### అర్థాంతరము—1

(1)†చ॥ జగతిని బంచభూతముల శక్తులు మిక్కుటమౌచు నొక్కెడన్
బగతులుగాఁగ ఘర్షణలు పర్వఁగ నాంతర బాహిరమ్ములై
అగణిత రీతులన్ దనర నౌచును మిన్గును నొండొరుల్ మహద్
ద్విగుణిత శక్తిఁ గాల రథ వేగము నిశ్చలమై చెలంగఁగన్ ॥ 3303

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(2)†గీ॥ బహుళ గోళాల విలసిల్లు మహితమైన
కాంతి శక్తులు మృణ్మయ గరళములను
సర్వ నాశన మొనరించుఁ గాల రథము
నధివసించుచు ననిల సాహస్ర మెనయు ॥ 3304

†(3) తరణి కాంతుల మించు తగు వజ్ర శక్తి
శత్రు తండాలనే సంహార మొనరించు
వజ్రాయుధా లెన్నొ వరలఁగా విశ్వాన
అన్నింటినిన్ మించు నసలైన పవి శక్తి
దేవ దేవుని దివ్య దీప్తులన్ దనరుచు
బ్రకటిత కాంతులన్ రవి శక్తులన్ మించి
పవుల పవిగా నిలిచి రవిశతుల రవి రవుల
నిర్వీర్య మొనరించు నిర్జరేంద్రుల పవుల ॥ 3305

†(4) హృచ్ఛక్తి మహితమై యెన లేని రీతిలో
వెల్గొందఁగా సృష్టి విమలమౌ దీప్తులన్
అతివేలమై పోవు నతివేగ శక్తులన్
గతిలోక శక్తుల నన్నింటిని జయించు
ఇచ్ఛ మాత్రమ్ముతో నింత లింతలు కాని
విశ్వ శక్తుల కాంతి వీర్యబలములఁ దునుము ॥ 3306

†(5) శత సహస్రములైన సర్వ విధ గోళాల
వెన్నెలల కుతిమిత విషమౌ పదార్థాల
దివ్య దీప్తుల సృష్ట్యతీత హృచ్ఛక్తులన్
విధ్వస్త మొనరించి వృష శక్తిఁ బయనించు ॥ 3307

†(6) చెప్ప శక్యము కాని చిత్సన్మయమైన
హృచ్ఛక్తి విశ్వాన నెల్ల విష రూపములు
స్థాన రహితమ్ములై సార రహితమ్ములై
హరియించు నిరతమ్ము నతిలోక వృష గతుల
నశ్విశక్తుల మీరు నద్భుత వేగాల
విశ్వ సంచారమ్ము విస్తృతిగ నొనరించు ॥ 3308

†(7) శిక్షా రహిత మౌచు రక్షా రహిత మౌచు
నశ్వి శక్తులు లేక అసలు రథమే లేక
అపురూప శక్తుల నతిలోక వృష యాన
మొనరించుఁ గాలమ్ము అనంత రూపమ్మై
అనియత గోపత్వ మలరార సృష్టిలో
విశ్వ లోకాఽఽవళుల విమలపతిగా వరల ॥ 3309

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) క్రాంతి కాంతుల శక్తి క్రాలంగ వెన్నంటి
అద్వితీయమ్మైన అతిలోక యానాల
దిక్కాలములకు నతీతమై తనరుచున్
అక్షయమ్మై జగతి నజయ్యమై పరలంగ
హృచ్ఛక్తి దివ్యమై యెసఁగు లోకాలలో
అహోరాత్రులు లేక బహురూపమై వెలుఁగు ॥ 3310

†(9) విషశక్తుల విరచివేయు విశ్వమ్మే ఆజ్ఞయుగా
సృష్టిశక్తి స్రష్టశక్తి నిష్ఠా పూర్తముగ మించి
దిక్తటముల మధ్య మెలఁగుఁ దేజరిల్లు వృషశక్తులు
సకల లోకములనే కాక సర్వవిశ్వమందె కాఁ
దిక్తటాల దిగంతాల దిక్కాలాఽతీతగతుల
హృచ్ఛక్తులు విరాజిలుచు నెదురులేక పరాక్రమించు ॥ 3311

†(10) ఆకలి దప్పులు లేకను అనుపమమౌ శక్తులతో
నింగి గాలి నిప్పు నీరు నేల లన్నింటికిన్ జగతి
అందకుండ నారూపము లందకుండఁగా మహితమై
అమలమౌచు సమరమౌచు సమ్మృతమౌచు నమితమౌచు
సర్వ ధారక మ్మౌచు సర్వ దారక మ్మౌచును
సర్వాఽతీత మ్మౌచును బర్వును హృచ్ఛక్తి సదా ॥ 3312

†(11) భూ చక్రము తిరుగునట్లు పొనరు విశ్వ మెల్ల నడుచుఁ
గాలరూపపతి వెలుంగఁ గ్రాలు లోక జాలా లవి
దివ్యాగ్నుల తేజాలను భవ్య సృష్టి నిత్యగతుల
జయ శక్తుల వర్ధిల్లఁగ సర్వ సుమంగళము కాఁగఁ
గాల బద్ధమై తనరుచుఁ గ్రమ శిక్షణఁ దిరుగాడుచుఁ
బంచ భూతరూపమ్ములఁ బరఁగును సీ సృష్టి యెల్ల ॥ 3313

†(12) జగచ్చక్షువై వరలుచు నగణితగతిఁ దనరారఁగ
విశ్వపురుష చక్షువుగా విశ్వాత్మగ వెలుఁగొందుచుఁ
గాలపాశయుక్తమైన కాలాంతక శక్తి మించు
వృషశక్తుల సృష్టి నెల్ల విష రూపుల విధ్వంసము
కావించెడి క్రాంత దివ్యభావ నిత్యాఽనలముగ
విష్ణ్వాదిత్యుని శక్తులు విశ్వ వ్యాప్తమ్ము లౌను ॥ 3314

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—102

ఋషి—భార్మ్యశ్వుఁడైన ముద్గలుఁడు
దేవత—ఇంద్రుఁడు లేక ద్రుఘణ

### అర్థాంతరము—2

†(1) విశ్వశత్రు తండాలను విధ్వస్తము కావించెడి
కాలరథము నధివసించు కాలాంతక రూప దీప
మనశ్శక్తి సర్వసృష్టి మహిమాన్వితమై నిలుచును
పంచభూతతత్త్వాలను నంచితముగ పుట్టి పెరిగి
విరుగు సృష్టి కతీతమై వరలు నమరతత్త్వగతుల ॥ 3315

†(2) అనలాఽనిల మహితగతుల నపురూపపుఁ గాల రథము
నధివసించి జగతిలోన నఖిల లోకముల వెలుఁగుచు
వేయి వెలుఁగులన్ వెలిఁగెడి వేఁడివెలుఁగు కాంతితతులు
సేన లౌచు విజృంభించు శీర్ణ రహిత శక్తి మీఱ
విషశక్తుల హరియించును వృష శక్తులు వర్ధిల్లఁగ
విజయశక్తి విమలగతుల నజయ్యముగ నద్భుతముగ ॥ 3316

†(3) అంతర్గతమౌ శక్తుల నపురూపముగాఁ దనరుచు
యజ్ఞసహితుఁడై వెలిఁగెడి యజ్ఞేశుని శ్రీవిష్ణుని
దివ్యసృష్టి శక్తి యెల్లఁ దేజరిలును వ్యష్టిగాఁగఁ
గాలబద్ధ మైన సృష్టి క్రాలును సమిష్టి కాఁగ
విష్ణుదాసమైన జగతి విలసిల్లును నిత్యమ్మును
సృష్టి స్థితి లయ గతులను జెన్నొందుచు మిన్నంటుచు ॥ 3317

†(4) హృచ్ఛక్తుల విలసనముల నెల్ల సృష్టి నేల నగును
అబద్ధమై అశాశ్వతమై అస్థిరమౌ జగ మెల్లను
దిగదుడుపౌ హృచ్ఛక్తుల దివ్యశక్తి ముందు చూడ
సచ్ఛక్తులు చిచ్ఛక్తులు సర్వేశ్వర శక్తి యెల్ల
హృచ్ఛక్తికి లొంగిపోవు నిచ్చారతు లెల్ల బ్రుంగు
విష శక్తుల మూలశక్తి వృష శక్తుల మూలశక్తి
నధమాధమముగఁజేసి అఖిలమ్మును నాక్రమించి
నతిలోకపు శక్తులతో నతీతముగ వెలుఁగుచుండు ॥ 3318

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) అతులితమౌ శక్తులతో శతగోళమ్ముల భాతిని
సహస్రమైన లోకజాల సర్వస్వము నతిక్రమించి
ఆకర్షణశక్తితతుల నధఃకరించు వృషశక్తుల
నవలీల గతిన్ జయించి అమలమైన సచ్ఛక్తుల
విశ్వసృష్టిలోన రేగు విపరీతమ్మౌ ఘర్షణ
సంఘర్షణ సంఘటనల సమయించుచు నమితముగా
నెల్ల సృష్టి కరగతమై ఉల్లసితపు టుల్లముగా
హృదయశక్తి వర్ధిల్లఁగ రిక్కలనే ధిక్కరించు ॥ 3319

†(6) కాలరథ సహిత మౌచుఁ గ్రాలఁగ వృషశక్తు లెల్ల
జైత్రయాత్ర చేసి జగతి శత్రు సంహార మొప్ప
విష శక్తుల నిర్జించుచు వృష శక్తుల బర్జించుచు
దుర్ధర్ష మ్మైన దీప్తి దూర్వహ మగు నిష్పదమౌ
విష్ణుశక్తి విరాజిలును విశ్వ సంక్షేమగతుల ॥ 3320

†(7) కాలపాద సహిత మౌచుఁ గ్రాలి సంచరించు జగతి
విశ్వ మెల్ల శిక్షితమై అశ్వి శక్తు లొప్పారఁగ
అఖిలేశుం డలరుచుండు నధిపతిగా విశ్వమ్మున
కసహాయ శూర శక్తి నంతరిక్షగతుల మీరి ॥ 3321

(8)†నాగమణివృత్తము॥•
విశాల మౌచు విశ్వమ్మున
నశుద్ధ భావ హార్దాన్విత
విశీర్ణ మైన విజ్ఞానపు
నశాశ్వతత్త్వ యజ్ఞాంగజ
నిశీథ రూప నిద్రాగత
నిశాంతతత్త్వ నిర్వీర్యము
దిశాంత మౌనె దీప్తమ్ముగః
ప్రశాంత శక్తి రంజిల్లునెః ॥ 3322

†(9) దిక్తటములమధ్యమ్మునఁ దేజరిలుచు విశ్వేశుఁడు
మృషశక్తులఁ జూచి నవ్వు విషశక్తులఁ జూచి నవ్వు
వృషదీప్తులు వర్ధిల్లఁగ విశ్వమ్మునఁ దిమిరాళులు
అంతరించు నఖిలమ్మున నపురూపపుఁ గాంతులతో
వేలు వేలు లోకము లవి వేల లెనసి శత సంఖ్యగఁ
గ్రాలు గ్రహము లుపగ్రహములుగ ననంతముగా ॥ 3323

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"బృహతీ"చ్ఛందము. (9)

(10)† అష్టపదకందము॥

ఆన్నోదక సంచయములు
సున్నాలై క్షుత్పిపాస శూన్యముగాఁగన్
మిన్నంటెడి ధీ మహితపు
విన్నాణము విస్తరిలఁగ విశ్వోత్తరమై
క్రిన్నన గోతా లెల్లను
జెన్నొందెడు విష్ణుపదము చేరెడు దృష్టిన్
ఛిన్నమ్ములు కాక ఆవ
చ్ఛిన్నగతి నమిల సువిహిత శీఘ్ర గతిమెయిన్ ॥ 3324

†(11) భూ చక్రముగా సర్వము
నేచి చరించుచు జగతిని నెల్లన్ దనరన్
ఆచంద్రార్కము విజయము
ధీచరిత సుమంగళగతిఁ దేజరిలు సదా ॥ 3325

(12)†అష్టపదికందము॥

అవనీ జలాఽనలాఽ నిల
పవన గగన గతికి విశ్వ భావ మహితమౌ
నవితథ రూపమ్ములకును
అవికలితపుఁ గాల రూప యజ్ఞమ్ములకున్
భువనాలకుఁ జక్షువుగా
రవి శశులకు బ్రహ్మ విష్ణు పరమేశులకున్
నవ నవ గతి చక్షు వగును
స్తవనీయం బైన మూలశక్తిఁ బ్రదీప్తిన్ ॥ 3226

## సూక్తమ్—103

ఋషిః—ఐన్ద్రోఽప్రతిరథః
దేవతా—ఇన్ద్రః; 4-బృహస్పతిః; 12-అప్వా దేవీ; 13-మరుతో వా
ఛందః—త్రిష్టుప్; 13-అనుష్టుప్

(1) ఆశుః శిశానో వృషభో న భీమో ఘనాఘనః క్షోభణశ్చర్షణీనామ్ ।
సంక్రన్దనోఽనిమిషఽ[1] ఏకవీరః శతం సేనా అజయత్ సాకమిన్ద్రః ॥ 1198

†రచయిత—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. నిమిషఽఏక. (వా్ర.ప్ర.)

(2) సంక్రన్దనేనానిమిషేణ జిష్ణునా యుత్కారేణ దుశ్చ్యవనేన ధృష్ణునా ।
తదిన్ద్రేణ జయత తత్ సహధ్వం యుధో నర[1] ఇషుహస్తేన వృష్ణా ॥ 1199

(3) స[2] ఇషుహస్తైః స నిషంగిభిర్వశీ సంస్రష్టా స యుధ[3] ఇన్ద్రో గణేన ।
సంసృష్టజిత్ సోమపా బాహుశర్ధ్యుగ్రధన్వా ప్రతిహితాభిరస్తా ॥ 1200

(4) బృహస్పతే పరి దీయా రథేన రక్షోహామిత్రాగ్ం[4] అపబాధమానః ।
ప్రభంజన్త్సేనాః ప్రమృణో యుధా జయన్నస్మాకమేధ్యవితా రథానామ్ ॥ 1201

(5) బలవిజ్ఞాయః స్థవిరః ప్రవీరః[5] సహస్వాన్ వాజీ సహమాన[6] ఉగ్రః ।
అభివీరో[7] అభిసత్వా సహోజా జైత్రమిన్ద్ర రథమా తిష్ఠ గోవిత్ ॥ 1202

(6) గోత్రభిదం గోవిదం వజ్రబాహుం జయన్తమజ్మ ప్రమృణన్తమోజసా ।
ఇమం సజాతా[8] అను వీరయధ్వమిన్ద్రగ్ం సఖాయో[9] అను సం రభధ్వమ్ ॥ 1203

(7) అభి గోత్రాణి సహసా గాహమానో ఽదయో వీరః శతమన్యురిన్ద్రః ।
దుశ్చ్యవనః పృతనాషాడయుధ్యో ఽస్మాకం సేనా[10] అవతు ప్ర యుత్సు ॥ 1204

---

1. నర ఽ ఇషుహస్తే, 2. స ఽ ఇషు, 3. యుధ ఽ ఇన్ద్రో, 4. మిత్రాగ్ం ఽ అపబాధ, 5. ప్రవీరసహస్వాన్, 6. మాన ఽ ఉగ్రః, 7. వీరో ఽ అభిసత్వా, 8. సజాతా ఽ అను, 9. సఖాయో ఽ అను, 10. సేనా ఽ అవతు. (వా.ప్ర.)

(8) ఇన్ద్ర[1] ఆసాం నేతా బృహస్పతిర్దక్షిణా యజ్ఞః పుర[2] ఏతు సోమః ।
దేవసేనానామభిభంజతీనాం జయన్తీనాం మరుతో యన్త్వగ్రమ్ ॥ 1205

(9) ఇన్ద్రస్య వృష్ణో వరుణస్య రాజ్ఞ[3] ఆదిత్యానాం మరుతాం శర్ధ[4] ఉగ్రమ్ ।
మహామనసాం భువనచ్యవానాం ఘోషో దేవానాం జయతాముదస్థాత్ ॥ 1206

(10) ఉద్ధర్షయ మఘవన్నాయుధాన్యుత్ సత్వనాం మామకానాం మనాంసి ।
ఉద్వృత్రహన్ వాజినాం వాజినాన్యుద్రథానాం జయతాం యన్తు ఘోషాః ॥ 1207

(11) అస్మాకమిన్ద్రః సమృతేషు ధ్వజేష్వస్మాకం యా[5] ఇషవస్తా జయన్తు ।
అస్మాకం వీరా[6] ఉత్తరే భవన్త్వస్మాగ్ం[7] ఉ దేవా అవతా హవేషు ॥ 1208

(12) అమీషాం చిత్తం ప్రతిలోభయన్తీ గృహాణాంగాన్యప్వే పరేహి ।
అభి ప్రేహి నిర్దహ హృత్సు శోకైరన్ధేనామిత్రాస్తమసా సచన్తామ్ ॥ 1209

(13) ప్రేతా జయతా నర[8] ఇన్ద్రో వః శర్మ యచ్ఛతు ।
ఉగ్రా వః సన్తు బాహవో ఽనాధృష్యా యథాసథ ॥ 1210

---

1. ఇన్ద్రఽఆసాం, 2. పురఽఏతు, 3. రాజ్ఞఽఆదిత్యా, 4. శర్ధఽఉగ్రమ్, 5. యాఽఇషవస్తా,
6. వీరాఽఉత్తరే, 7. వస్మాగ్ంఽఉ దేవాఽఅవతా, 8. నరఽఇన్ద్రో. (వా.వ.)

‡(14) అసౌ యా సేనా మరుతః పరేషామభ్యైతి న ఓజసా స్పర్ధమానా ।

తాం గూహత తమసాపవ్రతేన యథామీషామన్యో అన్యం న జానాత్ ॥ 1211

‡(15) అన్ధా అమిత్రా భవతాశీర్షాణా అహయ ఇవ ।

తేషాం వో అగ్నిదగ్ధానామగ్నిమూఢానామిన్ద్రో హన్తు వరంవరమ్ ॥ 1212

## సూక్తము—103

ఋషి—ఇంద్రపుత్రుఁడగు నప్రతిరథుఁడు।
దేవత—బృహస్పతి, అప్వ, ఇంద్రుఁడు లేక మరుత్తులు†

(1)*గీ॥ భీమ వృషభంబు వలె నింద్ర వీరుఁ డెపుడు
వ్యాపకుండయి శత్రుల నడఁచుచుండు
క్షోభయిత క్రందయిత యయి నూటి నేక
వీరుఁడై శత్రుసేనను బారఁజేసె ॥ 3327

(2)*గీ॥ బాణహస్తుఁడు, పర్షిత, ప్రవనకారి
యనిమిషుఁడు, దర్షకుండయి యమరు నింద్రు
సాయమును బొంది మీరలు సకల జనులు
శత్రు వర్జిక్క జయింపుఁడుః జగతియందు ॥ 3328

(3)*గీ॥ బాణ ఖడ్గములం గల్గి భటులఁగల్గి
చెలఁగి సంస్పృష్టజేతయై వెలిఁగి సోమ
పాయియయి యుగ్రధన్వయై వాసవుండు
మారయితయయి విజయించు మరల మరల ॥ 3329

‡ఋగ్వేదము దశమ మండలములోఁగల 103వ సూక్తములో నీరెండు ఋక్కులును నధికముగాఁ గొన్ని వ్రాతప్రతులలోఁ గలవు. వీటిని 'ఖిల' మంత్రములుగాఁ గొందఱు భావింపఁ బరిశిష్టములుగా గొందరును బ్రక్షిప్తములని మరికొందఱును నధికపాఠములని వేరొక కొందరును భావించిరి.

†వ్రాతప్రతి 14వ సంపుటము 58వ పుటలో నీ సూక్తమునకు ఋషి "ఇంద్రపుత్రుఁడగు ప్రమతిరథుఁడు"గాను దేవత "బృహస్పతి, అప్వ, ఇంద్రుఁడు"గాను వ్రాసి, 156 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అప్రతిరథుఁడు" ఋషిగాను "ఇంద్రుఁడు, బృహస్పతి, అప్వా, మరుత్తులు"దేవతలుగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(4)*ఉ॥ ఓయి! బృహస్పతీ! మిగుల నూర్జిత యానముపైని వచ్చి దు
ర్మాయలు చేయు రాక్షసుల మట్టిచు శత్రుల నష్టపెట్టుచున్
బాయక వైరి సేనల నపార బలంబునఁ బారఁ ద్రోలి య
త్యాయిత యోన రక్షణము నత్యధికంబుగఁ జేయు మీ వొగిన్ ॥ 3330

(5)*సీ॥ అతిబలభూతుండ వౌదువు! స్థవిరుండ వౌదువు! వీరుండ వౌదు వరుల
పరిభవింపఁగ నీవు కరము సమర్థుఁడ! వవుదువు! వాజివై యమరుచుండు
వృద్ధీర్ణబలుఁడవై యుండెద వతిపీకధర్మంబు నొంపుచుఁ దనియుచుండు
వభిగత సత్వుండ వవుదువు! బహుబలజాతుండ వౌదువు! పూతుఁ డవుదు
గీ॥ వుదక వేదిత వగుచుందువోయి! యింద్ర!, ఋట్టు నీవు ప్రశస్తిచే నెసఁగి మాకు
సాయమును జేయ సంతత జైత్రమైన,యరదమును నెక్కి ప్రీతితో నరుగఁగఁదెమ్ము! ॥ 3331

(6)*సీ॥ పర్వతవేదియై పరిధవిల్లెడి వాని నుదకలబ్ధిగఁ గదు నుంతువాని
గరగత వజ్రుఁడై గ్రాలిన వానిని జయశీలుఁడై బహు సొగుబాని
గమలశీలం బగు నమితశత్రుబలంబు బలముచేత జయింపఁగలుఁగువాని
నరిగణంబుల నెల్లఁ బరిభవించెడు వాని నతిసమర్థుండయి యమరువాని
గీ॥ నింద్రుఁడను నాయకుని మీర లెల్ల యుద్ధ, దేశముల ముందుగానుంచి తేజరిల్లి
వీరకృతమైన కార్యంబు వేట్కమీరఁ,జేయుఁడీ! యోద్ధ లెల్లరు చిత్త మలర ॥ 3332

(7)*చ॥ మిగుల బలంబుచేత హరి మేఘములన్ వసియించి సిద్ధయుల్
తగ శతమన్యుఁ డౌచు వివిధం బగు శాత్రవ సేన లెల్ల బల్
పగఁగొని గొట్టి జేత యగు వాసవదేవుఁడు యుధ్యుఁ డౌచు ఁదా
నొగి మముఁగాచుఁగాకఁ గృత యుద్ధమునందు మహాప్రశస్తిచేన్ ॥ 3333

(8)*గీ॥ అస్మదీయ సహాయార్థ మరుఁగఁదెంచు
సమర సేనలకున్ హరి యధిపుఁడగుత!
వానిముందు బృహస్పతి వరలుఁగాక!
వానిముందఱ సోముండు వరలుఁగాక! ॥ 3334

*గీ॥ అస్మదీయ కుశత్రుల నడఁచిపెట్టి
జయము గాంచుచున్నట్టి సరసులైన
దేవతా సేనలకు ముందుఁ జేరుచుండి
యీ మరుత్తులు వెలయుత మాదరమున ॥ 3335

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహ శాస్త్రి

(9)*గీ॥ వర్షకేంద్రనిజబలమును వరుణ దేవు
బలము నాదిత్యబలమును వెలుఁగునట్టి
యా మరుత్తుల బలమును నతిశయించి
మమ్ముఁ బొందునుగావుత! మున్మురముగ ॥ 3336

*గీ॥ అత్యుదారమనస్కులై యఖిల భువన
ముఖకు సుచ్యావయితలయి వెలుఁగునట్టి
దేవతాశతంబ శబ్దము లేజరిలుచుఁ
బుట్టుచుండెను నంతట భువనమందు ॥ 3337

(10, 11)*సీ॥ మఘవంతుఁడా![1] యెప్డు మా యాయుధంబులు ప్రహర్షపరములై పరఁగుఁగాక!
నస్మదీయ[2] మనస్సు లత్యుచ్చసంతోషవార్ధిలోపలఁబడి వరలుఁగాక!
హోత్రవన్నిందర్! మా వృత్రాశ్వముల వేగములు సంతతంబును [3]దెలఁగుఁగాక!
నట్టులే జయ మొందునట్టి రథంబుల ఘోషము కీర్తిని గూర్చుఁగాక!
గీ॥ బరులఁ బొందుచు ధ్వజముల మెఱయునట్టి,మా సుసైనిక[4]పంక్తికి భాసమానుఁ
డైన యింద్రుఁడు రక్షిత యగుచుఁ బ్రీతి,నమితమైనట్టి యానంద మందుఁగాక! ॥ 3338

*గీ॥ ఇట్టులే యింద్రదేవ! మా యఖిల బాణ
ములను సంగ్రామములయందు మోద మలర
శత్రుల జయించుఁగావుత! సకల సురలు
మమ్ము [5]రక్షించుదురుగాక! మున్మురముగ ॥ 3339

(12)*గీ॥ ఓసి! యప్వ! నీవు యోద్ధలా శత్రుల
మనసు మోహ పెట్టి మొనసి వారి
యవయవాళి నెల్ల నతిశయ భస్మంబు
నట్లు[6] చేయవలదె! యతిశయించి ॥ 3340

(13)*గీ॥ నేతలార! మీరు నేరిమి పోయి ప్ర
త్యర్థిభటుల నెల్ల నదఁచిపెట్టుఁ
డింద్రుఁ డెలమి మీకు నెక్కుడు సుఖమును
నిచ్చుఁగాక! ముదము నిచ్చుఁగాక! ॥ 3341

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. మఘవ! మా కగునట్టి మాన్యాయుధంబులు, (తా.పా.), 2. మామక సైనికమనస్సులు సంతోషవార్ధిలోపల, (తా.పా.) 3. కలుఁగుఁగాక, (తా.పా.). 4. మా సుసైనిక బృందంబు, (తా.పా.), 5. మమ్ము రక్షించుఁగావుత మున్మురముగ, (తా.పా.), 6. భస్మంబుగాఁగచేయ కలదె కరుణవీడి. (తా.పా.).

•గీ॥ నేతలార! మీ పవిత్ర బాహువు లెల్ల
నుగ్రతరము లౌచు నుండుఁగాక!
ననభిభవ్య లౌచు నమరెడు మీరలు
వెలుఁగ[1]గలరునుండు! విశ్వమెల్ల ॥ 3342

(14)†క॥ బహు రూపమ్మై తనరుచు
విహరించు మరుత్తతు లతివేలమ్మై నన్
మహిత మ్మౌ శక్తుల న్ప
ర్ధహరకర మ్మగు గుణౌజ రాజిత మోలే! ॥ 3343

†క॥ వెలుఁగులఁ దిమిరమ్ములలో
జలముల నగ్నులఁ బథములఁ జదలున వరలన్
విలసిల్లుచు బహిరంతర
తలముల గుహలను మరుత్తు తనరారు సదా ॥ 3344

(15)†గీ॥ శీర్ష రహితమ్ము లౌచు పశీర్ణగతులఁ
దిమిర తతుల కమితత్రతఁ దేజము గతి
నగ్నిదగ్ధమ్ముగాఁగ విహాయసమున
ననల మూల శక్తిగఁ దగు నమరపతిగ
ననిల శక్తులు విశ్వాన వ్యాప్తి నొందు
విష్ణు శక్తులు వ్యాప్తిత్వ విహిత మొనఁగు ॥ 3345

## సూక్తము—103

ఋషి—ఇంద్రపుత్రుఁడగు నవ్రతిరథుఁడు

దేవత—బృహస్పతి, అప్పు, ఇంద్రుఁడు, మరుత్తులు

## అర్థాంతరము—1

†(1) అతిరూప శక్తులను అతిలోక గతులమై
సంతతన్ వ్యాపించు నా ఘనాఘనములన్
అతికాంతి వేగాన నద్భుతముగాఁ బరుగు
లెత్తు వృష కాంతిగతి నెనలేని వేగాన
నింద్ర సహిత మ్మవుచు నెసఁగు సేనలతోడ
అనిమిష శక్తులన్ అఖిలమ్ము వ్యాపించి
విష్ణు శక్తులు సదా విశ్వమ్మునన్ వరలు
జగతి సంరక్షింపఁ బ్రగతులన్ విలసిల్ల ॥ 3346

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. వెలుఁగఁగలరు గాదె విశ్వమందు. (తా.పా.)

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†ఇవి "ఖిల"మంత్రానువాదములు.

†(2) విశ్వ విజేతగా వెలుగొందు దేవుండు
నిమిషరహితుండైన నిర్జరేశుని కరుణ
విష్ణు శక్తులు వరల విశ్వేంద్రుఁ డొప్పు
జల శక్తు లొప్పంగఁ జదలంటి విశ్వాన
దుశ్చ్యవనుం డౌచు దుర్ధర్షణుం డౌచు
నతిగూఢమై వరలు నపురూప తేజాల
వైరి వీరులఁ దునిమి మేర మీరుచు వెలిఁగి
పార మెనయని శక్తు లపారమై రాజిల్ల ॥ 3347

†(3) ఆనల కాంతులు నిండి అనిల రూపాలతో
భంగు భంగుల మీరు రంగు రంగుల విల్లు
అలరార గగనాన హస్తగత మ్మోచు
మరుత్సాయక శక్తు లరిమురిగఁ దనరార
జలధార లవి కురియు జగ మెల్ల విలసిల్ల
సంసక్తరహితమౌ సంస్రిష్ట శక్తులన్
సోమాఽమృతపు శక్తి శుభదీప్త పానమై
నిత్యదీప్తుల నొనఁగి నిచ్చలున్ వెలుఁగొందు ॥ 3348

†(4) రథావళికి రథముకాఁగఁ బథావళికిఁ బథముకాఁగ
గగనవీథి నగణితగతిఁ బ్రగతిఁ బ్రభంజనము లొప్పఁ
గాలరథము ననుసరించి గాంతిరథము పయనింపఁగ
నంతరహిత పయనాలను నవిశ్రాంత గమనాలను
అక్షయమౌ రక్షశక్తు లలరారును నఖిలమ్మున
రాక్షస శక్తుల నన్నిటి రాచి రంపమునఁ బెట్టుచు ॥ 3349

†(5) శబ్దశక్తి కలిగి వెలిఁగి సకల విశ్వ గోళాలను
సంచరించి కాల రథాన సంచితముగ సహౌజసున
నధివీరుండై తనరుచు నభిసత్త్వుండై వరలుచు
బలవిజ్ఞుండై వెలుఁగుచుఁ బ్రవీరుఁడై స్థవిరుండై
విశ్వాధిపుఁడైన విష్ణుపు విశ్వేశుఁడుగా వెలుఁగును
జిత్రశక్తు లొప్పారఁగఁ జైత్రయాత్ర లొనరించును ॥ 3350

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) విశ్వ విజేతగా విమల సభిత్వాన
సర్వ విధ శబ్దాల శక్తులన్ దనరార
మర్మ శక్తులు మీరు మరుదూ్రపావకులు
అల్లిబిల్లిగ నలరి ఒల్లుకొను మొయిళులను
జెల్లచెదురుగఁజేసి చెల్వొంద నోజస్సు
ఝంఝారలను గురియు జగములో సర్వదా ॥ 3351

†(7) శత మన్యు శక్తుల ధృత దివ్య విష్ణుండు
అతి గుహ్యమై తనరు సప్తరూప శక్తులన్
దుశ్చ్యవనుఁడై నిలిచి దుర్మార్గు లగు శత్రు
తండాలఁ దున్మాడి తనరు బ్రహ్మాండాల
సర్వస్వమున్ మహా సంక్షేమముల నిలిపి
"అఘ"శక్తి సకలమ్ము నధమాధమము చేసి
"నాభి"శక్తులు నిలువ నవ్య నవ దీధితుల
సైన్యమై మరుదాళి చలన శక్తుల మెలఁగి
గోత్రరూపాఽఽవళుల చిత్రగతులను నిలుపు
జలశక్తు లొప్పారు జలద మాలలలోన ॥ 3352

†(8) చంద్రాఽమృతశక్తి సర్వస్వ మొప్పంగ
దక్షిణాదిని దుష్ట రాక్షసాళిని దునుమ
సర్వ సేనావళుల సకల బాహువులతో
ననిలానిలయోగజాఽద్భుతాగ్నులు వరల
విజయ యజ్ఞము చేయు విశ్వవిజ్ఞానియౌ
నా బృహస్పతి నేతగ నా విష్ణు కృప నిలుచు ॥ 3353

†(9) అగ్నిదేవుం డొకఁడు అనిల దేవుం డొకఁడు
వరుణ దేవుం డొకఁడు వరల నాదిత్యుండు
మహిమాన్వితమ్మైన మానసిక శక్తులన్
దేవ దేవుల నవ్య దివ్య తత్త్వాలతో
శబ్ద శక్తులు జగతి సర్వదా వర్ధిల్లు
సర్వవిధ గోశాలు సంచరింపఁగ సదా ॥ 3354

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) వృత్రశక్తులఁ దునుము విశ్వేశు హృచ్ఛక్తి
సకల జగములఁ బ్రోచి సర్వ మానసశక్తి
సంవర్ధనము చేసి సంచలనగతు లొప్ప
విశ్వగోళావళుల విమల రథములు మీఱఁ
గాలశక్తులు క్రాలి కాంతిశక్తులు వరల
విశ్వవిజయము మహావిష్ణుపరమై నిలుచు ॥ 3355

†(11) దివ్యదేవ యజ్ఞాలను దేజరిల్లెడి మహావిష్ణు
శక్తితత్వ మెల్ల వెలుఁగు సమాప్రమముగా జగతిని
మృతసహితమ్మై తనటుప సతత సముద్భూత మ్మామ
వర్ధిల్లెడి విశ్వమ్మును పరంఁజేయు నెల్లప్పుడు
విశ్వ సృష్టి సర్వస్వము వృత్తముగా వర్తిల్లుచు
ను త్తరోత్తరగతిగా నుపర్యుపరితలము లొందు ॥ 3356

†(12) విద్యాప్రమములో శక్తులు సమాప్రమములై వెలుఁగఁగ
లోకాళులు గ్రహములుగా లోలుపత్వముల వరలును
దివ్యదేవ హృచ్ఛక్తులు తేజరిలఁగ నజయ్యమై
"అభి"శక్తులు దూరమ్మై అతిలోకాఽవళుల కెల్ల
నాకరమై అమితాంధకార బంధురానఁ
గొట్టాడును మిట్టాడును నిట్టనిలుపుసన్ గూలును ॥ 3357

(13)† క॥ జలశక్తులు గగనమ్మున
ఖల ఛల ప్రేితతతులను గకావికలుగ ను
జ్జ్వల గతి నొనరించును సద్
విలసిత శర్మములఁ గూర్చు సర్వేంద్ర కృపన్ ॥ 3358

(14)† క॥ స్పర్ధారహిత మ్మామున్
సార్థక మహా నోఽయున ససాధారణ మా
వర్ధిత మరుత్తులను ని
రర్థకతలు లేని మర్మ నిచయము లుండున్ ॥ 3359

†— అవగాహనలు లేని అతిలోక శక్తులన్
అన్యోఽన్య సంబంధ అనుబంధ బంధాల
తిమిరావవ్రితాసఁ దివిరి గూఢత పిర
నితర ప్రపంచమ్మ నేమాత్ర మెఱుఁగక
తిరుగు దుశ్శక్తు లవి దివ్యతా రహితమై
అఖిల విశ్వమ్మునను అధమాధమమ్ము రా ॥ 3360

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్మమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15) శిరము లేని హయముగతిగఁ జెలఁగు నమితాంధతగతి
ఒదలు లేని హయశిరముగ నొప్పు రాత్రివాళి సహ
అగ్ని దగ్ధమైపోవును నమరేశుని శక్తులమై
దుష్టశక్తు లెల్ల జగతిఁ దుడిచిపెట్టుకొనిపోవును
దైవీయమ్మౌ శక్తులు తనరును విశ్వమ్ము లోన
శ్రేష్ఠములకు శ్రేష్ఠములై చిద్విలాసరూపములై ॥ 3361

## సూక్తము—103

ఋషి—ఇంద్రపుత్రుఁడగు నప్రతిరథుఁడు

దేవత—బృహస్పతి, అప్వ, ఇంద్రుఁడు, మరుత్తులు

### అర్థాంతరము—2

†(1) ఏకైకవీరుఁడై యెనలేని శక్తులన్
ఎనఁగు శ్రీమహావిష్ణు వసమాన దీప్తిమై
నిమిషరహిత మ్మౌచు నిచ్చలున్ చనరారు
గమన రహితమ్మైన కాల శక్తులతో
ఘనములకు ఘనముగా ఘనతమై వరలుచున్
వృషభ శక్తులు మీర విశ్వాన వ్యాపించు
దివ్య దేవాఽఽవళుల దివ్యత్వ మొప్పఁగా
నతివేల శత సంఖ్య నమర సేనలు తనరు ॥ 3362

†(2) విద్యుత్తరంగాల విమల శక్తులతో
మరుదాళితోఁ గలిసి మహిత దీప్తులమై
అజిత రూపమ్మైన అదృశ్య శక్తుల మీర
విష్ణువే జిష్ణువై విలసిల్ల లోకాల
ననిమిషత్వమ్ముతో నఖిలమ్ము వ్యాపించు
దుశ్చ్యవన శక్తులన్ దుర్ధర్ష దీప్తులన్
సర్వ విజేతగా సకలమ్ము వ్యాపించి
సృష్టి నేతగ వరలు స్రష్ట ధాతగఁ దనరు ॥ 3363

†(3) "అభి"శక్తి మీఱంగ "నాభి"శక్తులు మ్రింగ
దుష్ట దానవవితతి దుర్మార్గ రూపాల
విశ్వ వ్యాపితముగ విస్తృత శక్తులన్
వ్యాపించ నాదిత్య వైష్ణవీయపు దీప్తి
దివ్య విద్యుత్తులై లేజరిల మరుదాళి
సంహరించును సదా సన్మార్గగతి మీఱ
నుగ్రదీప్తులు సన్మహోజ్జ్వల ధనువుగా
ననంసక్త శక్తులే అద్భుతాయుధములుగా ॥ 3364

---

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఆ విష్ణు శక్తులను నతిలోక రూపాలఁ
గాల రథమును నెక్కి వేల లెనయని రీతి
సృష్టి కమిత్రమై నష్టదాయక మౌచు
వేధించు బాధించు విష శక్తు లన్నింటి
విధ్వస్త మొనరించి విశ్వ శాంతిని గోరి
జగత్సంక్షేమాల నగణితముగాఁ గూర్చు ॥ 3365

(5) †క॥ గతిశీలతమై యనరుచు
నతులిత జల సంపదలను నతిలోకమ్మౌ
ఋత గతిఁ బ్రకృష్ట శక్తుల
సతత మజయ్యముగ నిచ్చు శంపాన్వితమ్మై ॥ 3366

(6) †ఆజపావృత్తము॥*
అపారమైన ఓజస్సున నపూర్వగతులు వెలయంగా
నపాదమైన రాలాగ్నులు ఉపా చరిత రతిఁ దగంగాన్
ద్రిపా విరూప మేఘాళులు నపాన్న పద సుభరితమ్మై
విపాదమైన విద్యుద్గతి విపూర్ణ మవుచు విలసిల్లున్ ॥ 3367

†(7) "అభి"శక్తి మేఘాళి సంతరింపఁగఁజేయు
శతమన్యు శక్తులను నతులితగతి వెల్గ
శ్రీవిష్ణుదేవుండు చెలఁగు వీరత్వాన
దుశ్చ్యవనుఁడై సర్వ దుర్ధర్షణుండై
శత్రు తండమ్ములను సంహార మొనరించి
పంచభూతావళులఁ బరఁగ రక్షించుచున్
విశ్వసృష్టిని శాంతి విమలమ్ముగా వరల
సంక్షేమముల జగతి సదా వర్ధిలఁజేయు
అంత మెనయని దయాంతరంగము మీఱఁ
గ్రాంత దర్శిగ సృష్టిఁ గాంచి కాపాడులే! ॥ 3368

†(8) సోమాఽమృతము ముందు సొంపుగాఁ జెలువొందఁ
బంచభూతాఽఽవళులు ప్రపంచాన వర్తిల్ల
సృష్టి యజ్ఞమ్మౌచు స్రిష్ట ప్రజ్ఞగ వెలుఁగు
నా బృహస్పతి శక్తి అమల దక్షిణగతుల
శత్రు విధ్వస్తమ్ము మిత్ర దీప్తుల నెరపి
అమర సేనల శక్తి అపురూపమై వెలయ
మరుదాళి విశ్వాన మర్మ శక్తులఁ దిరుగు
నభి శక్తులను సదా అభిభవ మ్మొనరించు ॥ 3369

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*"అతిధృతి"చ్ఛందము. (19)

†(9) ఇంద్రునకు వృష్ణుఁడై యెనలేని శక్తులన్
వరుణునకు రాజుగా నిరత నిర్జర గతుల
మరుదాళి కన్నిటికి మహిమాన్విత మ్మపుచు
ద్వాదశాదిత్యులను దగ వైష్ణవీయమై
అతిమానసపు శక్తి నంతయున్ బాలించు
దివ్య దేవాఽఽపఃల సప్య దీప్తులు వరల
శబ్ద శక్తులు విశ్వ సంక్షేమములు గూర్చు
చలన గతులను గోళ జాలాలు వర్తిల్ల
దేవదేవుని మహిత దివ్య ప్రదక్షిణల
నాత్మ ప్రదక్షిణల నన్నియున్ భ్రమియించు ॥ 3370

†(10) విశ్వ సృష్టి సంజాతము విమల శక్తి వర్ధిల్లును
బ్రాణ తత్త్వ మెల్ల వెలసి త్రాణ రూప దీప్తు లిచ్చు
హృదయ రూప దివ్య దీప్తి సదమలగతి విలసిల్లఁగ
నఖిలమ్మున వ్యాపించెడి ఆకర్షణ శక్తి తతుల
నప్రతిహతగతి మీఱఁగ నతిలోకపు శక్తులతో
నన్నింటిని నధిగమించి మిన్నులకే మిన్నులుగాఁ
గన్నులకే కానరాక వెన్నుని విన్నాణంబున
విశ్వగోళ పుంజాలవి విమల రథములన్ వరలఁగఁ
గాల శక్తి కాంతి శక్తి క్రాలంగాఁ జలన గతుల
వృత్రాసుర దుష్ట శక్తిఁ జిత్రవధలు చేయునులేః ॥ 3371

†(11) విశ్వసృష్టి శత్రువులను విధ్వస్తము కావించుచు
నజయ్యమౌ శబ్దరూప నిజ శక్తుల నిర్నిద్రిత
నిరతమ్మును వెలుఁగొందఁగ నిఖిలమ్మును విస్తరిల్లి
ఋత శక్తులు మహితములై సతతమ్మును వ్యాప్తినొంద
సృష్టి స్థితి గతులు సదా చెల్వొందఁగ నిత్యరతుల
ఆత్మ ప్రదక్షిణలను నఖిల పరిభ్రమణచేసి
అధిదేవుని ప్రదక్షిణల ననునిత్యము చేయుచుండి
ఉత్తర దిగ్యానాలను సుపర్యుపరి లోకాలకుఁ
బయనించును సర్వ లోక భవనాలవి భువనాలవి
దివ్య దేవ శక్తి మీఱ సవ్య నిత్య తత్త్వగతుల ॥ 3372

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(12) అతిలోలమై వెలయు నా చిత్తవృత్తులవి
ప్రతిలోమ శక్తులన్ మితిగ చరియించులే:
ఆ చిత్తమును గట్టి అమృతంపు హృచ్ఛక్తి
అతివేలగతితోప నతిలోకమై వెలయు
లోక గృహాఽవళుల లోలుపత్వము మీఱ
నాభిశక్తులఁ ద్రుంచు "నభి" శక్తిఁ దుమ్మాడి
లోకాల శోకాలఁ బోకార్చి తిమిరోగ్ర
అంధతమసము నెల్ల నంతరింపఁగఁజేయు
నిండు విష శక్తులను నిర్దహమ్ముగఁజేసి
విశ్వ కళ్యాణమున విస్తరిల్లఁగఁజేయు । 3373

†(13) అతిప్రకర్షమ్మైన అపురూప శక్తితో
విశ్వ శుభ సంక్షేమ విమల సుఖములఁ గూర్చి
అమల మరుద్గణము లమృత శక్తులఁ దనర
జ్వాల బాహువులతోఁ గ్రాలఁగా ననలమ్ము
శంపాలతగ వెలిఁగె యింపైన దీప్తాళి
నప్రతిహతశక్తి నా విష్ణుదేవుండు
సర్వాధారకుఁ డౌచు సర్వ ధారకుఁ డౌచు
సంచరింపఁగఁజేయు సంచలింపఁగఁజేయుఁ
జండ ప్రచండ మా చండభానుల కోటి
కోట్ల దీప్తుల వరలు గూఢశక్తులు తనర ॥ 3374

†(14) ఓజోరహితమైన భ్రాజిత స్పర్ధతో
గూఢతమమును బోలు బాధాఽజ్ఞతల నెల్ల
మరుదాళి శక్తులే మహిత సేనగ నిలిచి
స్పర్ధా రహిత మహా సకలౌజసుల్ పరల
ఆదానములు మీఱు నఖిల ప్రధానాల
నన్యోఽన్య సంబంధ మనుబంధ బంధాలు
దివ్య దీప్తులతోటి తేజరిల్లఁగ జగతి
మంచినే పెంచుచున్ ద్రుంచుచున్ జెడులనే
విశ్వ సంరక్షణము విజయ చరితమ్ముగా
శ్రీమహావిష్ణువే చెన్నొందఁగాఁజేయు ॥ 3375

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(15) ఆద్యంత మ్మలరు శిరము అమరని ఆరిన దీప్తికి
అంధతమస మమిత్రముగ నావలికే తొలగిపోవు
అగ్ని రూపమై విశ్వము అద్భుతమ్ముగా వెల్గును
అగ్ని దగ్ధమై సర్వము అణగారుసు రూపు మాసి
విష్ణు శక్తి వర్ధిల్లగ విశ్వ విజయవరమై తగు
లోకకంటకమ్ములైన భీకరారితతి వధించు ॥ 3376

## సూక్తమ్—104

ఋషిః—అష్టకో వైశ్వామిత్రః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) అసావి సోమః పురుహూత తుభ్యం హరిభ్యాం యజ్ఞముప యాహి తూయమ్ ।
తుభ్యం గిరో విప్రవీరా[1] ఇయానా దధన్విర ఇన్ద్ర పిబా సుతస్య ॥ 1213

(2) అప్సు ధూతస్య హరివః పిబేహ నృభిః [2]సుతస్య జఠరం పృణస్వ ।
మిమిక్షుర్యమద్రయ[3] ఇన్ద్ర తుభ్యం తేభిర్వర్ధస్వ మదముక్థవాహః ॥ 1214

(3) ప్రోగ్రాం పీతిం వృష్ణ[4] ఇయర్మి సత్యాం ప్రయై సుతస్య హర్యశ్వ తుభ్యమ్ ।
ఇన్ద్ర ధేనాభిరిహ మాదయస్వ ధీభిర్విశ్వాభిః శచ్యా గృణానః ॥ 1215

(4) ఊతీ శచీవస్తవ వీర్యేణ వయో దధానా[5] ఉశిజ ఋతజ్ఞాః ।
ప్రజావదిన్ద్ర మనుషో దురోణే తస్థుర్గృణన్తః సధమాద్యాసః ॥ 1216

†రచయితః—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. వీరాఽఇయానాదధన్విరఽఇన్ద్ర, 2. సుతస్య, 3. మద్రయఽఇన్ద్ర, 4. వృష్ణఽఇయర్మి,

5. దధానాఽఉశిజఽఋతజ్ఞాః. (వా.ప్ర.)

(5) ప్రణీతిభిష్టే హర్యశ్వ సుష్టోః సుషుమ్నస్య పురురుచో జనాసః ।
మంహిష్ఠామూతిం వితిరే దధానాః స్తోతార[1] ఇన్ద్ర తవ సూనృతాభిః ॥ 1217

(6) ఉప బ్రహ్మాణి హరివో హరిభ్యాం సోమస్య యాహి పీతయే సుతస్య ।
ఇన్ద్ర త్వా యజ్ఞః క్షమమాణమానడ్ దాశ్వాగ్ం[2] అస్యధ్వరస్య ప్రకేతః ॥ 1218

(7) సహస్రవాజమభిమాతిషాహం సుతేరణం మఘవానం సువృక్తిమ్ ।
ఉప భూషన్తి గిరో[3] అప్రతీతమిన్ద్రం నమస్యా జరితుః [4]పనన్త ॥ 1219

(8) సప్తాపో దేవీః సురణా అమృక్తా యాభిః సిన్ధుమతర ఇన్ద్ర పూర్భిత్ ।
నవతిం స్రోత్యా నవ చ స్రవన్తీర్దేవేభ్యో గాతుం మనుషే చ విన్దః । 1220

(9) అపో మహీరభిశస్తేరముఞ్చో ఽజాగరాస్వధి దేవ[5] ఏకః ।
ఇన్ద్ర యాస్త్వం వృత్రతూర్యే చకర్థ తాభిర్విశ్వాయుస్తన్వం పుపుష్యాః ॥ 1221

(10) వీరేణ్యః క్రతురిన్ద్రః సుశస్తిరుతాపి ధేనా పురుహూతమీట్టే ।
ఆర్దయద్వృత్రమకృణోదు లోకం ససాహే శక్రః పృతనా[6] అభిష్టిః ॥ 1222

---

1. స్తోతారఽఇన్ద్ర, 2. దాశ్వాగ్ంఽఅస్య, 3. గిరోఽఅప్రతీత, 4. పునన్త, 5. దేవఽఏకః,
6. పృతనాఽఅభిష్టిః. (ప్రా.ప్ర.)

(11) శునం హువేమ మఘవానమిన్ద్రమస్మిన్ భరే నృతమం వాజసాతౌ ।
శృణ్వన్తముగ్రమూతయే సమత్సు ఘ్నన్తం వృత్రాణి సంజితం ధనానామ్ ॥ 1228

## సూక్తము—104

ఋషి—వైశ్వామిత్రుఁడు అష్టకుఁడు†
దేవత—ఇంద్రుఁడు†

(1)*క॥ పురుహూత! నీకు సోమము
కర మభిషుతమయ్యెఁగాదె! కావున నీ స
ద్ధరియుగముతోడ నిష్టికి
బిరబిరఁ జనుదెమ్ము! నీవు ప్రీతి దలిర్పన్ ॥ 3377

*గీ॥ విప్రవీరము లగు నుతుల్ విపుల గమన
వంతములుగా వెలుంగుచు వాసవుండ!
నిన్నుఁ దనియింపఁ[1]బోవును నిశ్చయముగఁ
గాన సోమము ద్రావుము! పూని నీవు ॥ 3378

(2)*గీ॥ అభిషవ గ్రావ లెల్ల నిన్నతిశయముగఁ
దృప్తిఁ జేయంగ సోమము దీసియుండె
నట్టి సోమము నీ యజ్ఞమందుఁ ద్రావి
మదముచే వృద్ధిఁ గాంచుచు ముదము నొందు ॥ 3379

(3)*గీ॥ వర్షకుఁడవైన నీకయి వాసవుండ!
సోమమును బ్రేరణముఁ జేతు నీమ మలర
శక్తిచే బుద్ధిచేతను జారు షుద్ధి
కర్మలం దృప్తి నొందుము నిర్మలముగ ॥ 3380

†వ్రాతప్రతి 14వ సంపుటము 57-59 పుటలలో నీ సూక్తమునకు ఋషి "వైశ్వామిత్రుఁడు అష్టకుఁడు"గాను దేవత "ఇంద్రుఁడు"గాను వ్రాసి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అష్టకుఁడు" ఋషిగాను "ఇంద్రుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. బోయెను (తా.పా.)

(4)*గద్యము॥
శక్తివదింద్రః నీ రక్షణముచేఁ బ్రీజోపేత మగు నన్నమును ధరియించుచున్నవారై నిన్నే
కోరుచు యజ్ఞమును దెలిసికొనుచున్న వారలై యంగిరస్సులు యజమానుని యజ్ఞ
గృహమునందు నిన్నభినుతించుచు మదించుచున్నవారలు ॥ [illegible]

(5)*గీ॥ హరిత వర్ణాశ్వమా! స్తుతి నంది సుఖము
కలిఁగియుండెడు నీయొక్క వెలుఁగుదాన
కర్మముల స్తోత లెల్లరు నిర్మలముగ
నీదు రక్షఁ గోరుచు నిలిచియుంద్రు ॥† [illegible]

(6)*గీ॥ హరితవర్ణాశ్వములఁ గల్గు హరి విభుండ!
సోమపానంబునకు నీవు నీమ మలరఁ
బరిబృఢములైన మా సురుచిర సమస్త
నుతులఁ గాంచంగ రారమ్ము! మతిఁ దలంచి ॥ [illegible]

*గీ॥ సోమభాగము నిన్నింద్ర! నీమ మలరఁ
బొందుచున్నది యాగంబు నంద మొప్ప
కనుఁగొనుచు నీవు మిక్కిలి కర్మ ఫలము
నిచ్చుచున్నావు[1] సర్వము మెచ్చునటుల! ॥ [illegible]

(7)*చ॥ అపరిమితాన్నముం గలిఁగి యంతట హింసక హర్త యౌచుఁ దా
నెపుడు ధనాఢ్యుఁడై వెలిఁగి యెంతయు సోమమునందుఁ గేరి యా
రిపులను దుంచుచున్ స్తుతిపరీతుఁడుగా వెలుఁగొందు నింద్రు ని
ష్కపట నుతుల్ స్తుతించుచుఁ బ్రశస్తముగా విలసిల్లుచుండెడున్ ॥ [illegible]

(8)*గీ॥ ఇంద్ర! నీ యాజ్ఞచేతనే యెసఁగు సప్త
నదులు హింసలఁ[2] బొంక నడచుచుండె
వాసవా! నీవు పురభేత్త వగుచు నదుల
సింధువును వృద్ధిఁబరచితి శీఘ్రకరముగ ॥ [illegible]

---

*రచయిత:——కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†వ్రాతప్రతి 14వ సంపుటము 5?వ పుటలో నీ సూక్తములోని 6వ ఋగనువాదములుగా నీ క్రింది పద్యములు
రెండును వ్రాయఁబడి కొట్టివేయఁబడినవి. ఇవి తొలి పాఠములు.
(5)గీ॥ హరిత వర్ణాశ్వములఁ గలు హరివిభుంత!
సోమ పానంబునకు నీవు నీమ మలర
పరిబృఢములైన యా సురుచిర సమస్త
నుతుల గాంచుచు రారమ్ము మతిఁ దలంచి ॥ (159)
గీ॥ సోమభాగము నిన్నింద్ర: నీమ మలర
పొందుచున్నది యాగంబు నంద మొప్ప
గనుగొనుచు నీవు మిక్కిలి కర్మ ఫలము
నిచ్చుచున్నావు కావటే! మెచ్చునటుల ॥ (160)
1. నిచ్చుచున్నావు కావటె! (తొ.పా.), 2. నదులు హింసితలై వేగ నడచుచుండె, (తొ.పా.)

*గీ॥ నవతినవ సంఖ్యగా నొప్పు నదులు సకల
దేవతా కాంక్షితంబైన దివ్య హవ్య
భాగమునకును[1] సజ్జన భోగమునకు
నదుల మార్గంబుఁజూపితి సదయ నింద్రః ॥ 3387

(9)*గీ॥ ఇంద్రః యభిహింసకుండైన వృత్రువలన
జలము నడిపించినాఁడ వా జలములందు
నొక్కరుండవెః యింద్రః నీ వూర్జితముగ
నప్రమత్తుండ వై తుష్టి నమరుచుంటిః ॥ 3388

*గీ॥ వృత్రహతుని జంపెడుః వేళ యందు
నెట్టి యప్పుల స్పృష్టించి తీవ్ర ప్రీతి
నట్టి యప్పులచే నింద్రః యఖిలమైన
తనువునకు వృద్ధిఁ గల్పించ తనిసినావు ॥ 3389

(10)*గీ॥ వీరుఁడై కర్మచేఁ జాల వెలుఁగు నింద్రుఁ
డతని స్తుతి వాక్కు నుచ్చరించు చమరుచుండె
మరియు నాతఁడు వృత్రుని [2]మాన్య బలము
గొనుచు దునుమాడె క్షేమము గూర్పఁ దలఁచి ॥ 3390

*గీ॥ అసుర హతకుని జంపుచు నధికమైన
సుప్రకాశంబు గల్పించె సుర విభుండు
శక్తుఁడైనట్టి యింద్రుఁడు శత్రు బృంద
సైనికుల నెల్లఁ బరిమార్చె సత్వరముగ ॥ 3391

(11)*గద్యము॥
ఈ సంగ్రామమందు వృద్ధిఁ బొందుచున్నట్టియు మా యాహ్వానమును వినునట్టియు నుగ్రమైనట్టియు, యుద్ధములయందు శత్రువులను హింసించుచున్నట్టియు, శత్రువులఁ జంపుచున్నట్టియు, శత్రు ధనమును హరించుచున్నట్టియు, నింద్రుని అన్న లాభమునకు రక్షణకొఱ కాహ్వానించెదను॥ 3392

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. భాగము నిమిత్తమును జన భోగమునకు, (తా.పా.), 2. కరము బలము. (తా.పా.)

## సూక్తము—104

ఋషి—వైశ్వామిత్రుఁడైన అష్టకుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) సోమాఽమృతము సృష్టి సొబగొందుచుండఁ
సృష్ట చేసెడి మహా సృష్టి యజ్ఞమ్ముగాఁ
గాంతి పుంజాలతోఁ గ్రాలఁగా సోమమ్ము
స్వీకరించుచుసుండుఁ జిద్విలాసముగా
విష్ణు శక్తుల దీప్తి విలసిల్లుచుండఁగా
శబ్ద శక్తులు స్వచ్ఛచైతన్యమొనఁగఁ
దండ్రి పుత్రుల భాతిఁ దగఁ గాంతి వెలుఁగ
నాదిత్య దీప్తు లవి అంతటన్ రాజిల్లు ॥ 3393

†(2) మృతిని బొందిన యట్టి మిట్టి జఠరము రీతి
సృష్టి శక్తులు వీడి సురిగిపోవుచునుండు
ఆత్మరూపము భాతి నంతర్గతపు శక్తి
సుతుఁ డుద్భవించు గతి సృష్టి తనరారులేః
గ్రహరాజు శక్తులన్ గ్రాలు సలిలము భాతి
నంతర్హితమై పోవు నతిలోక దీప్తులన్
ఇంద్రశక్తులు మీరు చదలంటు సోమమ్ము
సాంద్రగతి విశ్వాన జగ మెల్ల వ్యాపించు ॥ 3394

†(3) వర్షధారల నిచ్చు వాసవుఁ డెప్పుడున్
సృష్టి జల శక్తులకు స్రష్టగా నిలుచు
నీటి నావిరిగాఁగ నిండు రవి పీల్చఁగా
నిత్య శక్తుల మొయిళు లత్యంతము జలము
లఖిల గోళాఽఽవళుల నద్భుతముగా నీయ
భూతపంచక క్రియలఁ బూతమ్ముగా నెఱపు ॥ 3395

†(4) అగ్ని తేజ మ్మొప్ప నఖిలమ్ము నిండి
సృష్టి నాహారమును స్రష్టగా నిలుపు
దివ్య శక్తులు మీఱఁ దేజరిల్లంగ
ఋత శక్తులను యజ్ఞ గతు లొప్పు సృష్టి
అతిలోకగతి వెలయ నాదిత్య శక్తులు
వీర్యవత్తరములై విలసిల్లు జగతి
ఉత్తమత్వము వెలయ నుజ్జ్వల స్థితిని
సర్వ సంస్కృత్యమై శర్మశక్తులు వెలుఁగు ॥ 3396

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(5) కర్మ సాక్షిగ సృష్టిఁ గర్మ రక్షణ కలదు
కర్మతో విశ్వమ్ము కదలాడుచుండుఁ
గర్మ సాక్షియుఁ గూడఁ గదలాడు సహగతి
విశ్వ శక్తులు సృష్టి విమలమై వర్ధిల్లుఁ
గర్త ఆధారముగఁ గర్మమ్ము వెలుఁగుఁ
గర్మ రూప మ్మొచుఁ గర్త తనరారులేః
కర్మ కర్తలు సృష్టిఁ గ్రాలు కర్త కర్మలుగా
నిత్య చైతన్యమై నెగడొందుచుండు ॥ 3397

(6) సోమాఽమృతపు శక్తి సొంపుగా వరలు
విశ్వ సృష్టిని సదాః విమల శక్తుల నొసఁగి
సృష్టి సంస్థితి శక్తిఁ జెల్వొంద నింపు
తండ్రి పుత్రుని భాతిఁ దగ శబ్ద శక్తి
బ్రహ్మణిగ వెలిఁగి బ్రహ్మ దీప్తుల నొసఁగు
నిత్య సత్యమ్ముగా సత్యంత దీప్తమౌ
నఖిలాండముల నిండి అద్భుతావహముగా
ఋత శక్తులను సృష్టి నతిలోక గతి నిలుపు ॥ 3398

†(7) అతి సహస్రమ్మె అద్భుత పదశక్తి
సృష్టి సర్వస్వమ్ము చెల్వొందుచుండు
మఘవంతుఁడై విష్ణు వఘరూపములఁ బాపి
నిత్య సత్యము నిలిపి సత్య దీప్తులు తనర
అఖిల లోకాఽఽవళులు అద్భుతముగాఁ దిరుగు
జగత్సాక్షిగ మహా జగన్నాటక కర్త
సర్వ సృష్టిని నడప సకలమ్ము నెఱపు
సృష్టి యజ్ఞమ్ముగా స్రష్టయే యజ్ఞమౌ ॥ 3399

†(8) నవ్య నవతులు కాఁగ దివ్య సృష్టిని సదాః
పంచ భూతాఽఽవళులు పరఁగుచునుండులేః
సృష్టి వ్యవస్థలో స్రష్ట వ్యవస్థలో
నిష్ట పూర్తములుగా నెల్ల శక్తులు నిల్చు
జల శక్తు లవి యెల్ల జగతి వర్ధిల్లఁగా
సప్త భేదాలుగా సర్వాన విలసిల్ల
నింద్ర దీప్తులతోడ నెసఁగు జల శక్తులే
గానరీతులతోడఁ గ్రాలు విశ్వమ్మందు ॥ 3400

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) ఏకైక దేవుఁడై యెనఁగు నీతండు
వృత్ర శక్తుల సృష్టిఁ జిత్రవధగాఁ జేసి
జల శక్తులను నిలుపు చదలంట విశ్వాన
అమృత దీప్తులు వరల నఖిల సంసృష్టిలో
నిత్య చైతన్యమై సత్య శక్తులు తనర
జల శక్తులు నిఖిల జగములను నిండఁగా
నాభి శక్తుల నిలిపి సవ్య తత్త్వాలతో
సృష్టినే కాపాడు స్రష్ట ప్రతీకగా ॥ 3401

†(10) వృత్రశక్తులఁ దునిమి విపుల విశ్వమ్ములో
నిత్య చైతన్యముగ సత్య జలనాభినే
సదమలముగా నిలిపి స్వచ్ఛతల్ మెఱయ
సృష్టి క్రతువును జలము స్రష్టశక్తిగ వెలుఁగ
జగతిదాహముఁ దీర్చి జగమేలు సామిగా
అదృష్టగతితోప నఖిలాన నిండుచున్
లోకాల శోకాలఁ జోకార్చి సర్వదా
"అధి" శక్తులను దుర్చి అమృతమ్మౌ వృతస
శక్తుల విశ్వాన సందీప్తమై తనర
శబ్ద దీప్తులతో నిశ్శబ్ద శక్తులు మీఱ ॥ 3402

†(11) విశ్వ వ్యాపితమైన విమల శక్తులతో
వృత్రాసురుని మహా చిత్రవధ చేయుచున్
జలనాభులను నిలిపి జగద్దాహముఁ దీర్చి
రాజాధిరాజుగా రాజిల్లు దేవుండు
అశ్విశక్తులు మీఱ అపురూపగతి నిల్చి
విష్ణువే యింద్రుఁడై విలసిల్లఁగా జగతి
సృష్టి సంస్థితిగతుల స్రష్ట రూపము వెలయ
సత్య శక్తులరతుల నిత్యమై తనరు ॥ 3403

## సూక్తము—104

ఋషి—వైశ్వామిత్రుఁడైన అష్టకుఁడు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

†(1) సోమ శక్తులు జగతి శుభ్రతన్ వరలు
సృష్టి యజ్ఞమ్ములో స్రష్ట ప్రక్రియ కాఁగ
నశ్విశక్తులు మీఱ నఖిలమ్ము నిండి
శీఘ్రచలనమ్ముతోఁ జిద్విలాసమ్ముగా

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శబ్ద శక్తులు జగతిఁ జదలంటి నిలువ
వీరత్వ మెదలంగ విస్తృతి శక్తులన్
అద్భుతాఽమృతధార లపురూపమై తనర
నిత్య నూతన శక్తి నిఖిలమౌ జగ మొప్ప ॥ 3404

†(2) తెల్లతెల్లని దివ్య తేజాలు వరలంగ
విశ్వశక్తులు వెలుఁగ నశ్వరగతులమై
సృష్టి పుత్రిని సృష్టి జఠర శక్తులుగా
సోమాఽమృతమ్మునే సొబగొందఁగాఁ బొందు
నిత్య సంస్థితి శక్తి సత్య హృష్టులు వరల
సృష్టి సర్వస్వమ్ము చెలఁగుచుండును సదా ॥ 3405

†(3) సర్వ విశ్వమ్ములో సత్యదీప్తులు వరల
శుచ్యగ్నిగా జగతి శూన్యతత్త్వమ్ముతో
నిత్యాన్విత మ్మోచు మృత్యు సహితమ్మోచు
విశ్వ సంపదలెల్ల నశ్విశక్తులు తనరు
దీ సంపదలతోటి దేదీప్య మానమై
ఋత పుత్రశక్తులే సతత నిత్యమ్ముగా
జగతిలో వెలుఁగొందు జగదీశ కృపతోడ
నగణిత శక్తులన్ అద్భుతావహముగ ॥ 3406

†(4) సత్య దర్మాలతో నిత్య దీప్తులు వరల
సృష్టి సంస్కృతి శక్తి చెల్వొంద విశ్వాన
వీర్యవత్తరమైన విమల శక్తులు మహా
తేజాలతో జగతిఁ దేజరిల నిత్యమ్ము
యుద్ధ రంగాలలో యోద్ధగాఁ దనరారు
మహనీయమై వెలయు మనుశక్తి సర్వమ్ము
కాలగతుల నిలిచి కాంత్రిలు ఋత శక్తులను
వేల లెనయని దీతు లాలవాలము కాఁగ ॥ 3407

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) సృష్టి సుషుమ్నగా సృష్ట వెలుఁగొందఁగా
నిష్ట పూర్తముగా నెసఁగు నఖిలమ్ము
సత్య శక్తుల తోటి సర్వవిశ్వము వెలుఁగు
నిత్య రూపముగా నిఖిలమ్ము నిలుచు
శాశ్వతాఽశాశ్వత శర్మ తత్త్వాలతో
సకల సృష్టియు నిండు సర్వేశు కృప మీఱ
మహిత రూపమ్ముగా మాన్యమై నిలుచు
నిత్య సంచలనగతి నిర్నిద్రశక్తులన్ ॥ 3408

†(6) కాంతి క్రాంతులతోటి కాంతులై వెలుఁగ
విశ్వరూపమ్ములో విమల దీప్తులు మీఱ
బ్రహ్మాణి శక్తులే వరలఁ బ్రకృతి గాఁగ
సృష్టి శక్తులు బింబ సృష్ట రక్తులు కాఁగఁ
దేజరిలు లోకాలు దివ్య ప్రతిబింబమై
కాల రథమున సాగి క్రాలుచుండంగా
సృష్టి యజ్ఞము జరుగు సృష్ట దీప్తులు మీఱ
వ్యష్టి సమిష్టులుగ నిష్ట పూర్తముగాఁగ ॥ 3409

†(7) శబ్దశక్తులు తనర నిశ్శబ్దశక్తులు వరల
అమర శక్తులతోటి అఖిలమ్ము నిండుచున్
పుత్రరూపమ్ముగా మిత్రగతి జగతి తగ
ఉషశక్తి విశ్వాన ఉజ్వలమ్ముగ వెలుఁగ
మృత్యు రహితమ్మైన సత్యశక్తులు సదా
విశ్వాన రాజిల్లు నశ్వి శక్తులు తనర ॥ 3410

†(8) నవ్య నవమై తనరు నవతి శక్తులతో
ప్రకృతి రూపము వరల భవ్య దీపమ్ముగాఁ
బంచభూతాఽవశులు నంచితముగా వరలు
అనలములు సలిలమ్ము లనిలమ్ము లాకాశ
పృథ్వి లెల్లను గూడఁ బూర్ణ శక్తులతో
తనరారు విశ్వాన తరణి దీప్తులతో
ప్రకృతియే గానమై వికృతియే గానమై
కృష్ణశక్తులు వెలయ విష్ణు శక్తులు తనరు ॥ 3411

---
†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) ఏకైకదేవుండె యెనఁగు విశ్వాన
నిత్య దీప్తులతోటి సత్య శక్తులు వరల
అతిలోక దీప్తమై అద్భుతముగా వెలుఁగఁ
బ్రకృతి సంపద లెల్ల వికృతి రూపాలతో
బహుగతులతో నిలిచి అహరహము వెలుఁగొందు
జల"నాభి"నే మ్రింగు ఖల వృత్రు వధియించి
యింద్రుండు సర్వదా యెసఁగు జల దాతగా
విశ్వేశు కృప మీఱ విశ్వ సంక్షేమాల ॥ 3412

†(10) "అభి" శక్తులన్ మీఱి "నాభి" శక్తుల మ్రింగు
వృత్రాసురుని మహా చిత్రవధగాఁ జేసి
వృష్టి శక్తుల నిలిపి స్రష్ట శక్తుల నిలిపి
పురుహూతుఁడే దివ్య పూర్ణ శక్తులు మీఱ
లోకాల నెల్లపుడు శోకాలఁ బోకార్చి
సైన్య శక్తులఁ గాంతి శర్మశక్తులు వరల
దివ్యతా భరితమై నవ్యతా జరితమై
సృష్టి క్రతువును జేసి స్రష్ట ఋత చక్రాన
వ్యష్టి సమిష్టులుగ నఖిల విశ్వము తనర
సౌర శక్తులు మీరుఁ జారు సృష్టిని సదా ॥ 3413

†(11) వృత్ర శక్తుల నెల్లఁ జిత్ర చిత్రమ్ముగా
వధియించి జల"నాభి" వర్ధిల్లఁగాఁ జేసి
సత్యగతి వరలంగ నిత్య రతి తనరంగ
సత్వ శక్తుల మహా చారు విశ్వము వరల
సలిల శక్తులు సృష్టి జలద మాలలు కాఁగ
జలధారలు గురియు జగమునే రక్షించు
రారాజుగా జగద్రాజుగా సృష్టి
విష్ణువే ఇంద్రుఁడై వెలుగొందఁగాఁ బ్రకృతి
వికృతి రూపాలలో విశిష్ట దీపాలుగా
మహిత శక్తులతోటి మాన్యమై వెలుఁగొందు
మర్మ దీప్తులు వెలయ సర్మ శక్తులు తనర
మహిమాన్వితం బౌచు మహనీయ గతి నొందు ॥ 3414

†రచయిత.—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—105
ఋషిః—కౌత్సో దుర్మిత్రః సుమిత్రో వా
దేవతా—ఇన్ద్రః
ఛందః—ఉష్ణిక్; 1-గాయత్రీ వా; 2,7-పిపీలికమధ్యా; 11-త్రిష్టుప్;

(1) కదా వసో స్తోత్రం హర్యత[1] అవ శ్మశా రుధద్వాః ।
దీర్ఘం సుతం వాతాప్యాయ ॥ 1224

(2) హరీ యస్య సుయజా వివ్రతా వేరర్వన్తాను శేపా ।
ఉభా రజీ న కేశినా పతిర్దన్ ॥ 1225

(3) అప యోరిన్ద్రః పాపజ[2] ఆ మర్తో న శశ్రమాణో బిభీవాన్ ।
శుభే యద్యుయుజే తవిషీవాన్ ॥ 1226

(4) సచాయోరిన్ద్రశ్చర్కృష[3] ఆగ్ం ఉపానసః సపర్యన్ ।
నదయోర్వివ్రతయోః శూర[4] ఇన్ద్రః ॥ 1227

(5) అధి యస్తస్థౌ కేశవన్తా వ్యచస్వన్తా న పుష్ట్యై ।
వనోతి శిప్రాభ్యాం శిప్రిణీవాన్ ॥ 1228

---

1. హర్యతఽఅవ శ్మశా. 2. పాపజః.ఆ మర్తో, 3. చర్కృషఽఆగ్ంఽఉపానసః,

4. శూరఽఇన్ద్రః. (వా.ప.)

(6) ప్రాస్తాద్‌దృష్వోజా[1] ఋష్వేభిస్తతక్ష శూరః శవసా ।
ఋభుర్న క్రతుభిర్మాతరిశ్వా ॥ 1229

(7) వజ్రం యశ్చక్రే సుహనాయ దస్యవే హిరీమశో హిరీమాన్ ।
అరుతహనురద్భుతం న రజః ॥ 1230

(8) అవ నో వృజినా శిశీహ్యృచా వనేమానృచః ।
నాబ్రహ్మా యజ్ఞ[2] ఋధగ్జోషతి త్వే ॥ 1231

(9) ఊర్ధ్వా యత్ తే త్రేతినీ భూద్యజ్ఞస్య ధూర్షు సద్మన్ ।
సజూర్నావం స్వయశసం సచాయోః ॥ 1232

(10) శ్రియే తే పృశ్నిరుపసేచనీ భూచ్ఛ్రి[3]యే దర్విరరేపాః ।
యయా స్వే పాత్రే సించస[4] ఉత్ ॥ 1233

(11) శతం వా యదసుర్య ప్రతి త్వా సుమిత్ర[5] ఇత్థాస్తౌద్దుర్మిత్ర ఇత్థాస్తౌత్ ।
ఆవో యద్దస్యుహత్యే కుత్సపుత్రం ప్రావో యద్దస్యుహత్యే కుత్సవత్సమ్ ॥ 1234

ఇతి
అష్టమోఽష్టకే పంచమోఽధ్యాయ
స్సమాప్తః

---

1. దృష్వోజాఽఋష్వేభి, 2. యజ్ఞఽఋధగ్, 3. భూంఛ్రియే, 4. సించసఽఉత్,

5. సుమిత్రఽఽఇత్థాస్తౌద్దుర్మిత్రఽఇత్థా. (వా.ప.)

## సూక్తము—105

ఋషి—దుర్మిత్రుఁడు లేక సుమిత్రుఁడు†
దేవత—ఇంద్రుఁడు†

(1)*గద్యము॥
వాసయితః యింద్రః కుల్యా ఉదకము నవరోధించి వారించునట్లు కామయమానుండ వగు
నీకొఱకు మా స్తోత్రము సవనక్రియరూపమున వచ్చిన సోమమును నుదకదానమునకై
యెప్పు డవరోధింపఁగలము? ఏ కాలమున నివారింపఁగలము? ॥ 3415

(2)*గద్యము॥
ఏ యింద్రుని హరిత వర్ణాశ్వములు సుశిక్షితములు, విశిష్టకర్మలు, రణకుశలములు.
ప్రశస్త పుంస్త్వవంతములో! యా యుభయములు ద్యావా భూముల వలెఁ
బ్రకాశించుచున్నవి. ఇంద్రుఁడా! నీ వట్టి వానికి స్వామి వగుచు
ధనము నొసంగుచు ధనాదులను గోరుమా! ॥ 3416

(3)*గీ॥ ఎవఁడు మనుజుని బోలుచు వృత్ర యుద్ధ
మందు భీతిని జెందునో! యట్టి యింద్రుఁ
డా మరుత్తులతోఁ గూడె నతి బలంబు
గ్రాల వృత్రాభియోజితగా వెలుంగు ॥ 3417

(4)*చ॥ మనుజునకున్ విశేషముగ మాటికి మాటికిఁ దాను బ్రీతితో
ధన చయమున్ బ్రశస్త మగు దానిని దాన మొసంగ నెక్కుచో
ధనమును గూర్చుకొంచు సురథంబును నెక్కుచు వచ్చి స్తోతకున్
ధనమునఁ బూజఁ జేసి హరి దస్యుఁడుగా నిటు వచ్చుచుండెడున్ ॥ 3418

*గీ॥ కదఁగి హేషలు సేయుచుఁ గ్రాలునట్టి
యఖిల కర్మలు కలుఁగుచు నమరునట్టి
యశ్వములకు నియంతయౌ నమర వరుఁడు
వచ్చుచుండెను లోకము మెచ్చునటుల ॥ 3419

†వ్రాతప్రతి 14వ సంపుటము 68వ పుటలో నీ సూక్తమునకు ఋషి "దుర్మిత్రుఁడో సుమిత్రుఁడో"గాను దేవత "ఇంద్రుఁడు"గాను వ్రాసి, 155 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "దుర్మిత్రుఁడు లేక సుమిత్రుఁడు" ఋషిగాను "ఇంద్రుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.
*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(5)•గద్యము॥
ఏ యింద్రుఁడు కేశవంతములు వ్యాప్తి మంతములు నగు నశ్వములను నెక్కునో; ప్రశస్తములగు హనువులను గలిఁగిన నా యింద్రుఁడు శత్రువులను హింసించుచున్నాఁడు ॥ 3420

(6)•గీ॥ దర్శనీయ బలుం డౌచు దర్శనీయు
లౌ మరుత్తులతోఁగూడి తగిన నుతులు
[1]చేయఁబడె నంచుఁ దనకయి చిత్త మలర
నింద్రుఁడేలెంచు నచటికి నెనఁగమెనఁగ ॥ 3421

•గీ॥ ఋభువు లెట్టులు ప్రజ్ఞల నిద్ధ కర్మ
ములను జమసాధికంబును గలుఁగఁజేసి
నారొ; యట్టులె యింద్రుఁడు శూరుఁ డౌచు
వృత్రహననాది కర్మల వెలుఁగఁ జేసె ॥ 3422

(7)•గద్యము ॥
ఎవఁడు శత్రువుకొఱకు వజ్రమును జేసెనో; యట్టి యింద్రుఁడా; నీవు హరిత శ్మశ్రువులు గలవాఁడవై హరితాశ్వుఁడవై యంతరిక్షము బాధ్యమౌనటుల, నబాధిత హనువు గలవాఁ డగుచున్నాఁడు ॥ 3423

(8)•చ॥ అతిశయమైన పాపమును నంత హరింపు; మహేంద్ర; నీవు సం
స్తుతులను సాధనంబులను శోషిలఁ జేయుదు మిష్టి హీనులన్
స్తుతి పరి హీన యజ్ఞమును జూడక యుంచుపు; నీపు సంస్తవం
బతిశయమైన యట్టు లనయంబు సుదం బది నీకుఁ గూర్చునే; ॥ 3424

(9)•గద్యము॥
ఇంద్రుఁడా; నీయొక్క క్రియ యెప్పుడు యాగ స్థానమున వోధలయందుఁ బ్రవృత్తమైనదో; యపుడు మరుత్తులచేఁ బ్రీయమానుఁడవై యజమానులతోఁ గూడ స్వాయత్త యశస్క మగు తరణ సాధనమును నీ వారోహించుచున్నావు; ॥ 3425

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. వీనిచేఁ జేయఁబడెనంచు వేడ్కమీర, తాఁ బ్రశంచుచున్నాఁడు శప్పక హరి. (తా.పా., ధన్యుఁడు హరి. (మ.పా.)

(10)*గద్యము॥

ఇంద్రా! నీయొక్క సోమశ్రీకి గోవు దోగ్ధ్రి యగు(గాక: అట్టులే దర్వి యపావ మగుచు హవ్యశ్రీకి నమరు(గాక: ఆ దర్విచేతనే పాన సాధన మగు ముఖము ద్వారా నీవు తాగ్రవుచున్నావు: ॥ 3426

(11)*గద్యము॥

ఓ బలవదింద్రు(డా: అపరిమిత ధనము నెప్పుడు కోరితివో: దస్యు హననమందు( గుత్స పుత్రు(డగు దుర్మిత్రుని నెపుడు రక్షించితివో: యపుడు సుమిత్రు( డిట్లు స్తుతించెను ॥ 3427

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర వేఙ్కటేశ్వరపౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి
ముక్తాయమాన శ్రీ భగవద్భక్తారాధక
నేమాని వేంకటనరసింహశాస్త్రి
విరచితకృతులలో శ్రీమదాంధ్ర
ఋగ్వేద సంహితయందు
నష్టమాష్టకమున(
బంచమాధ్యాయము
సంపూర్ణము

## సూక్తము—105

ఋషి—దుర్మిత్రు(డు లేక సుమిత్రు(డు
దేవత—ఇంద్రు(డు

### అర్థాంతరము—1

†(1) అతిలోక సంపద లతివేలమై తనర
వసు సంపదలు మహా వైభవమ్మై నిండి
వరుణరూపమ్మైన అరుణారుణు దీప్తు
లనిలాఽనలయోగ మపురూపమై వెలయు
నిత్యచైతన్య గతి నిండు రూపమ్ముగా
అపురూపగతి మీఱ నంతరాత్మగ జగతి
దీర్ఘమై నెగడొందు తీర్థమ్ము భాతి
సుర శక్తి వర్ధిల్లు స్తుత్యమానమ్మై ॥ 3428

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

†(2) వాయు శక్తులు జగతి వహియించి దీప్తులన్
పర్ధిల్లుచుండుటే: ప్రవృద్ధమానమై
దివిభువుల నన్నింట దేదీప్యమానతన్
గతి శీల మొప్పంగ రతిశక్తి తనరంగ
బలవర్ధక మ్మోయు బహురూప శక్తులన్
విశ్వవ్యాపిత మౌచు నర్వ శక్తులు తనరఁ
గళ్యాణప్రదగతులఁ గర్మ ములరారంగ
నర్వమ్ము తనరారు సకల సంపద లొలయ ॥ 3429

†(3) "అభి"శక్తి రూపాన నావరించుచు జగతి
"నాభి" శక్తుల మ్రింగి నానా విధాలుగా
జగతి కల్లోలము నగణితముగాఁ జేయు
వృత్ర శక్తుల నెల్ల విధ్వస్త మొనరించు
విష్ణుదేవుని శక్తి విపులమై విమలమై
విస్తరిల్లఁగ వాయు విశ్వరూపము దాల్చి
విశ్వకళ్యాణము విస్తృతముగా వరల
నిత్యదీప్తమ్ములై సత్యవర్ధిష్ణువౌ ॥ 3430

†(4) అతిలోక శబ్దాల నపురూపమై వెలసి
అతివిశిష్టమ్మైన యఖిల వాహన కర్మ
లలరార వాయుగతి నఖిల నియంతగా
మేఘాళి మహితమౌ మిరుమిట్లు గొలుపఁగా
సలిల జాలమ్ములు సముద్భూతము కాఁగ
అన్య భౌతిక శక్తు లావిర్భవము కాఁగ
రాజిల్లు పవనాళి రమ్య చలనగతుల
నదరూప గతులమై చదలంటి వెల్గొందు ॥ 3431

†(5) రవిచంద్ర దీప్తుల రాజిల్లఁగాఁ జేసి
విశ్వాన వ్యాపించు విశద శక్తులు మీర
అఖిల గోళావళుల నద్భుతముగా నిలిపి
సంచరింపఁగఁజేయు సంచలన శక్తులన్
జగతి సంపోషణశక్తి సర్వస్వమ్ము
వర్ధిల్లఁగాఁజేసి సను సంపదలు మీఱ
విశ్వ విష శక్తులను విధ్వస్త మొనరించి
లోక కళ్యాణమ్ము లోలుపతమై నెఱపు
సనిల శక్తులు సదా అనల శక్తుల నింపి
అద్భుతముగా సలిల మావిష్కృతము చేయు ॥ 3432

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అతిగ పరివ్యాప్తమౌ అతిలోకశక్తులన్
రవిచంద్ర మరుదాళి రాణ శక్తులుమీఱ
జలద మాలలఁ ద్రుంచి జల"నాభి" నే మ్రింగు
వృత్ర శక్తుల నెల్ల విధ్వస్త మొనరించి
జగతి సలిలమ్ములను శాశ్వతముగా నిలుపుఁ
జరము నచరమ్ములను జ్వలితమ్ములై వెలయు ॥ 3433

†(7) అకృతకర్మల నెల్లి అధమాధమము చేసి
శబ్ద శక్తులు మీఱ నిశ్శబ్ద శక్తులు వరల
అంతరిక్షములోన నతిలోక గతి మీఱఁ
జ్వలన శక్తుల ననిల నలవోకగా నిలుచు
బాధారహిత మౌచు వేధారహిత మ్మౌచు
వజ్ర శక్తులు మీరి వరణీయమై వెలుఁగు ॥ 3434

†(8) అతిగర్హితములైన పతిత నీచ కర్మలను
వర్జితముగాఁ జేసి నిర్జించి దుశ్శక్తి
విశ్వ సంక్షేమాల విస్తృతముగాఁ జేసి
మంత్ర పూత మ్మౌచు మహిమాన్వితమ్మైన
శబ్ద శక్తులు సదా సత్వమ్ము నిండంగ
సృష్టియే యజ్ఞమై సృష్టక్రియలను మ్రింగఁ
దనరారఁగా జగతిఁ దరణి శక్తులు మీర
జగత్కళ్యాణములు సర్వదా వర్తిల్లు ॥ 3435

†(9) ఔను త్రికాలాల నద్భుతముగా వెలసి
ఊర్ధ్వగతులను నౌనరు మధ్యమాధమగతుల
త్రివిధమౌ సత్కాల తీర్థ యజ్ఞాలలో
సృష్టి యజ్ఞము నిత్య సృష్ట యజ్ఞము కాఁగఁ
బ్రభవించి విలసిల్లు ప్రకృతి సర్వస్వమ్ము
వికృతి సహిత మ్మౌచు విపుల విశ్వము నిండి
స్వయంచాలిత మౌచు స్వయంప్రభా వలితమై
నిత్య విధిగా సృష్టి సత్య సంవర్ధితమౌ ॥ 3436

†(10) సూర్యతేజాలతో శోభ తేరగ సృష్టి
వృష్టి శక్తులు సదా వివర్ధనమ్మై తనర
రవికిరణ పుంజాలు రాజిల్ల జలరాశి
అవిరిగ గ్రహియించి అంతరిక్షములోన
మేఘమాలలుగాఁగ మిన్నంటి తిరుగాడఁ
జేసి జలశక్తులను జెన్నొందఁగాఁ జేయు ॥ 3437

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) ఓ శక్తివంతుఁడా! ఓ రక్తివంతుఁడా!
పంచభూతాఽఽవళులు సంచితములై వెలుఁగ
మిత్రభూతము లౌచు మిన్నంటి వెలఁగ
పుత్రభూతమ్మైన ప్రకృతి సర్వస్వమ్ము
నిత్య సత్య మ్మౌచు నిండుగా వెలుఁగ
దుర్మిత్ర శక్త్యాళిఁ దున్మాడి సర్వదా
సన్మిత్ర శక్త్యాళి సదమలముగాఁ బెంచి
విశ్వ కళ్యాణమును విస్తృతముగాఁ జేయు ॥ 3438

## సూక్తము—105

**ఋషి—దుర్మిత్రుఁడు లేక సుమిత్రుఁడు**

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

†(1) సృష్టి రోదన మెల్ల స్రష్ట శబ్దము కాఁగ
వృష్టి సమిష్టులుగ నిష్టపూర్తము కాఁగ
దీర్ఘమౌ సచ్ఛక్తి తీర్థమై వెలయఁగా
ననిల శక్తులు మహా హవిషమై తనరార
విశ్వాన సహశక్తు లశ్వి దీప్తుల వరల
సకలమ్ము దీప్తమై శాశ్వతముగా వెలుఁగు ॥ 3439

†(2) హరిదీప్తు లొప్పంగ నఖిల విశ్వము వరలు
తీక్ష్ణ శక్తులతోటి ఉదీర్ణ దీప్తులు తనర
వీరత్వ మెదలంగ విశ్వ వ్యాపిత శక్తి
కాంతి కిరణావళులు క్రాలఁగా నిత్యమ్ము
గతి శీల మొప్పంగ "ఋత" శక్తు లొప్పార
దివి భువుల నన్నింట దేదీప్యమానమై
అనిల శక్తులు మహితజాఽద్భుత గతులమై
వరలంగ నిత్యమ్ము వర్ధిల్లుచుండులే! ॥ 3440

†(3) వృత్రాసురుని దుష్ట విపుల శక్తుల నెల్ల
ఛిన్నభిన్నమ్ము చేసి చెల్లాచెదురుగఁ జేసి
అనిల శక్తులు మీఱ ననల శక్తులు వరల
సలిలశక్తుల నిలిపి జలధార లొప్పంగఁ
బ్రకృతిశోభను బెంచి అకృత శక్తులు మీఱ
సృష్టి సుకృతముకాఁగఁ జెలఁగు సర్వస్వమ్ము ॥ 3441

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) శబ్దశక్తులు మీఱ నిశ్శబ్దశక్తులు పార
హృదయ ముపాసనగ [1]నుజ్జ్వలగతి తోప
నాకాశ జలధార లద్భుతముగా నురలి
దివి భువుల నన్నింటఁ దీర్ఘమై ప్రవహించ
నదములై జగతిలో నానా విధాలుగాఁ
బ్రవహించ సర్వదా వివిధగతు లొప్పార
వృత్ర శక్తులఁ దునిమి ఛిత్రపడగాఁ జేసి
జలనాభి కాపాడి జలదుఁడై వెల్గు హరి ॥ 3442

†(5) దుష్ట శక్తుల నెల్లఁ దున్మాడి విశ్వాన
జగతి సంక్షేమాల సర్వమ్ము వెలుఁగొంద
సౌరశక్తులు జగతి జలములన్ హరియించి
మేఘమాలల నిలిపి మింటి ఆఘు శక్తుల దుల్చి
మధుర జల ధారలను మహితమ్ముగా నిచ్చు
విశ్వ సృష్టిని నూత్న విమల శక్తులు వరలఁ
జక్రనేమిక్రమాన సపక్రగతు లొప్పఁగా
జల శక్తు లావిరిగ జలదమాలలు కాఁగ ॥ 3443

†(6) సత్య శక్తులు మీర సర్వదేవావళులు
నిత్యత్వ మొప్పంగ నిచ్చలానందాన
శిల్పాలు విశ్వానఁ జెల్వొందఁ దీర్చినటు
నక్షత్ర రాజు లవి నానా విదాలుగాఁ
దివ్య దీప్తులఁ దనరఁ దేజరిల్లుచు వరలి
నిత్యక్రతువై సృష్టి సత్యకర్మంబుగాఁ
బ్రత్యణువు సృష్టిలో సత్యధర్మము కాఁగఁ
దనరారు ప్రగతిమై ధన్యతల్ మీరంగ ॥ 3444

†(7) వజ్రశక్తులు విశ్వ వర్ధనమ్ములు చేయుఁ
జక్ర దీప్తులు సదా సంరక్షణము చేయు
హరిశక్తి విశ్వాన నరిమురిగఁ దనరార
ననల శక్తులు వరల ననిల శక్తులు తనర
సలిల శక్తులు జగతి చటలంటి పరఁగంగ
విశ్వసంక్షేమములు విమల దీప్తుల వరల
బహురూప మహితమై అనురూప గతులమై
నణువణువు వర్ధిల్లు నా విష్ణు కృప మీఱ ॥ 3445

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1."ఋ-ఉ" లకు యతిమైత్రి. (చూ.పీఠిక.)

†(8) బ్రహ్మ శక్తులు విశ్వమ్మున పరలంగాఁ బ్రగతిమై
నరుణారుణ కాంతులతో నఖిల విశ్వ మలరంగాఁ
గాంతిపుంజాఽఽవళులఁ గ్రాలంగా గోశా లవి
శబ్ద మంత్ర శక్తు లవి సదా వివర్ధనము చెంద
అతిలోకపు శక్తులతో నపురూపపు దీప్తులతో
అఖిలమ్మును విరాజిలఁగ సమస్త శక్తు లొప్పారఁగ
విశ్వశాంతి దాయకమౌ విమల మంత్ర శక్తు లెల్ల
నక్షర గతి నలరుచుండు నక్షయగతు లొప్పారఁగ ॥ 3446

†(9) సృష్టి యెల్లఁ ద్వైతముగా భిన్నాభిన్న ముకాఁగను
ద్వైతాద్వైతమ్ము మీఱ ద్వంద్వైక్యత మీరంగా
భూత భావి వర్తమాన పూర్ణ కాల దీప్తు లలర
నిత్యసత్యమైన శక్తి నిరత వాక్య రూప మౌచు
నిండు శక్తి వర్ధిల్లఁగ నిర్నిద్రితా గరిమ వెలుఁగ
నతిలోకపు రూపముగా నపురూపపు శక్తులతోఁ
బ్రబుద్ధమైన దీప్తులతోఁ బ్రకర్షతా శక్తి మీఱ
సర్వ సృష్టియజ్ఞ మ్మది సకలమ్మును వర్ధిల్లును ॥ 3447

†(10) సౌరశక్తులు వృష్టి జలములను బెంచుతే
ఆవిరిగ గ్రహియించి అద్భుతముగా పెంచు
"అభి" శక్తులను ద్రుంచి "నాభ" శక్తులఁ బెంచి
అఖిల విశ్వమ్ములో నమల జలములఁ గురిసి
అనృత శక్తుల దుల్చి అమృత శక్తుల నిల్పి
ఋతదీప్తు లొప్పార సుతకాంత పుంజాల
సర్వ లోకమ్ములను సకల ప్రాకటగతుల
సద్వీర్య గతు లొప్ప సర్వమ్ము నెగడొందు ॥ 3448

†(11) శతశక్తు లొప్పార సర్వసర్వంసహను
సకల బ్రహ్మాండాల సర్వస్వమును నిండి
అనిల శక్తులు మహాఽనల శక్తులు మీఱ
నిర్జర దీప్తులన్ నిర్నిద్రితాగరిమ
నిర్ధూమధామమై నిరతమ్ము వెల్గొందఁ
బుత్ర సహితుండైన పితృదేవుని భాతి
సర్వగోశాఽఽవళులు సౌరమండల గతుల
శక్తిమంతమ్ములై సర్వాసఁ దిరుగాడు ॥ 3449

†రచయిత:—వాఙ్మయి మహోద్యోష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ ప్రకటితమౌ శక్తి తతిగ
సకలాధికమమ్మ రాత అపురూపతమై
సకలము విశ్వము లసదును
సకలుష శక్తులను మహితమై వెలుఁగంగన్ ॥ 3450

ఇయ్యది
విశ్వసృష్టిప్రకృతిమాత్రైకైకపుత్ర
పరికమళ్ళ గోత్ర-వద్లమూడి కుల సందీప్త-
శ్రీ సుబ్బన్న పౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అప్రియ ద్వితీయపుత్ర-
శ్రీసరస్వతీమాతృ ప్రియపుత్ర-అపార వేదశాస్త్ర సాహిత్యవిద్యా పారంగత-
అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకిక శక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాదిసర్వ
దేవతాస్వరూప-విద్వన్మణి పంచముఖాంజనేయోపాసక శ్రీవేములరామశాస్త్రి గురువరాభినుత"ముఖకలిత గోపాలసుపద"-
మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమగురువర్యాభినుత "శతపర్షాతిర్వ్యచన రచిత జగుణాంచిత నిష్కాసహిత శ్రీ
మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహినీ హృదయ లక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్వాక్ స్వరూపిణి,
అమలినపవిత్ర పతిరక్తి భక్తి శక్తి స్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్యచైతన్యవతి,
నిర్నిద్రమతి, వినిర్మలగళితికిత, ప్రియశరీరాంతర్వ్యలితగాన జ్ఞానధ్యానస్వరూపిణీతన్మయి, శివపూజితపాలచంద్రకళా
మూర్తి-అకళంక సౌందర్యరాశి-సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త-జయశ్రీ సత్యశ్రీ పుత్రికారత్నద్వయ జయ్యా
జయ విజయ పతాకయుక్త-శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహర రాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య
ధరాత్రఽఽవరణయుక్త-పాణినీయాష్టాధ్యాయీపూర్వతాత్రసిద్ధసూత్రసహిత శబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర
ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త మహా వైయాకరణ వేదవేదాంతకోవిద దశభాషా కవితా విశారద పుంభావశారదా
మూర్తి శ్రీ గుండేరావుహర్కారే-సాష్టాంగనమస్కార పూర్వక ప్రస్తూయమాన-"శ్రీవాఙ్మయ మహావృక్ష-ప్రాచీనవై
యాకరణానమయ సంప్రదాయ రథ-స్ఫూర్తిరానేక జనాభినవోన్మేష శాలికావ్య నిర్మాణశక్తిమన్నిరోచనాక్ష-మాధుర్య
స్యందివీర్యపత్త్రరపదగుంఫాధురీణ - మహితగగోచరగాంభీర్యప్రకటనా పటిమాపారీణ-కల్పాంతారీణాఽనల్పకల్పనా
భూషణ"- లీలామానుష విగ్రహ - ఆంధ్రవిశ్వకళాపరిషత్ సంభావితచతుర్వింశ దధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్
"కళా-ప్రపూర్ణ" సార్థక బిరుద విరాజిత - బ్రహ్మర్షి, వాఙ్మయ మహావృక్ష, వద్లమూడి గోపాలకృష్ణయ్య
సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్త సహిత సుసమగ్ర
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
దశమమండలమున సప్తమాష్టకమునందలి
అర్ధాంతరయుక్త పంచమాధ్యాయము
సమాప్తము

---

†రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"



# సమరాల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—షష్ఠోఽధ్యాయః

### సూక్తమ్—106

ఋషిః—భూతాంశః కాశ్యపః

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) ఉభా ఉ నూనం తదిదర్థయేథే వి తన్వాథే ధియో వస్త్రాపసేవ ।
సధ్రీచీనా యాతవే ప్రేమజీగః సుదినేవ పృక్ష[1] ఆ తంసయేథే ॥ 1235

(2) ఉష్టారేవ ఫర్వరేషు శ్రయేథే ప్రాయోగేవ శ్వాత్ర్యా శాసురేథః ।
దూతేవ హి ష్ఠో యశసా జనేషు మాప స్థాతం మహిషేవావపానాత్ ॥ 1236

(3) సాకంయుజా శకునస్యేవ పక్షా పశ్వేవ చిత్రా యజురా గమిష్టమ్ ।
అగ్నిరివ దేవయోర్దీదివాంసా పరిజ్మానేవ యజథః పురుత్రా ॥ 1237

---

1. పృక్షఽఆ. (ప్రా.ప్ర.)

(4) ఆపీ వో¹ అస్మే పితరేవ పుత్రోగ్రేవ రుచా నృపతీవ తుర్యై ।
ఇర్యేవ పుష్ట్యై కిరణేవ భుజ్యై చ్రుష్టీవానేవ హవమా గమిష్టమ్ ॥ 1238

(5) వంసగేవ పూషర్యా శిమ్బాతా మితేవ² ఋతా శతరా శాతపన్తా ।
వాజేవోచ్చా వయసా ఘర్మ్యేష్ఠా మేషేవేషా సపర్యా పురీషా ॥ 1239

(6) సృణ్యేవ జర్భరీ తుర్ఫరీతూ నైతోశేవ తుర్ఫరీ పర్ఫరీకా ।
ఉదన్యజేవ జేమనా మదేరూ తా మే జరాయ్వజరం మరాయు ॥ 1240

(7) పజ్రేవ చర్చరం జారం మరాయు క్షద్మేవార్థేషు తర్తరీథ³ ఉగ్రా ।
ఋభూ నాపత్ ఖరమజ్రా ఖరజ్రుర్వాయుర్న పర్ఫరత్ క్షయద్రయీణామ్ ॥ 1241

(8) ఘర్మేవ మధు జఠరే సనేరూ భగేవితా తుర్ఫరీ ఫారివారమ్ ।
పతరేవ చచరా చన్ద్రనిర్ణిఙ్మనఋఙ్గా⁴ మనన్యా న జగ్మీ ॥ 1242

(9) బృహన్తేవ గమ్భరేషు ప్రతిష్ఠాం పాదేవ గాధం తరతే విదాథః ।
కర్ణేవ శాసురను హి స్మరాథోంఽశేవ నో భజతం చిత్రమప్నః ॥ 1243

1. ఆపీవోఽఅస్మేపిత, 2. మితేవఽఋతా, 3. రీథఽఉగ్రా, 4. మనఽఋఙ్గా. (వ్రా.ప్ర.)

(10) అరంగరేవ మధ్వేరయేథే సారఘేవ గవి నీచీనబారే ।
కీనారేవ స్వేదమాసిష్విదానా క్షామేవోర్జా సూయవసాత్ సచేథే ॥ 1244

(11) ఋధ్యామ స్తోమం సనుయామ వాజమా నో మన్త్రం సరథేహోప యాతమ్ ।
యశో న పక్వం మధు గోష్వన్తరా భూతాంశో[1] అశ్వినోః కామమప్రాః ॥ 1245

‡(12) హవిర్భృరేకే స్వరితః సచన్తే సున్వన్త ఏకే సవనేషు సోమాన్ ।
శచీర్మదన్త ఉత దక్షిణాభిర్నేజ్జిహ్మాయన్త్యో నరకే పతామ ॥ 1246



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—షష్ఠాధ్యాయము

### సూక్తము—106

ఋషి—కశ్యపపుత్రుఁడు భూతాంశుఁడు†
దేవత—అశ్విదేవతలు†

(1)*గీ॥ జగతియందుఁ గువిందులు తగిన వస్త్ర
ములకు విస్తృతిఁ గల్పించి వెలుఁగునట్లు
[2]మీర లశ్వు లే మొనరించు మేలు నుతుల
వినుచు మా సంస్తవంబులు వెలుఁగ నింపు ॥ 3451

1. భూతాంశోఽఅశ్వినోః. (వ్రా.ప్ర.)
‡ఋగ్వేదము దశమమండలములోఁ గల యీ 106వ సూక్తములోని 12వ ఋక్కు అధికముగాఁ గొన్ని వ్రాత ప్రతులలోఁ గలదు. దీనిని 'ఖిల' మంత్రముగాఁ గొందఱు భావింపఁ బరిశిష్టముగాఁ గొందరును,ప్రక్షిప్తమని మరికొందఱును అధికపాఠమని వేరొక కొందరును భావించిరి.
†వ్రాతప్రతి 14వ సంపుటము 69 పుటలోని సూక్తమునకు ఋషి "కశ్యప పుత్రుఁడు భూతాంశుఁడు"గాను దేవత "అశ్విదేవతలు"గాను వ్రాసి, 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "భూతాంసుఁడు" ఋషిగాను "అశ్విదేవతలు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.
*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. మీర లశ్వులు మే జేయు మేలు నుతుల. (వ్రా.ప్ర.పా.)

•గీ॥ సహజ మైనట్టి రశ్ములఁ జంద్ర సూర్యు
లన్నము నలంకరించెడు నంద మొప్పి
మీర లన్నంబులను బ్రీతి మీర లన్ని
విపుల భూషించుచున్నారు వేల్పులార! ॥ 3452

(2,3)•సీ॥ తృణమంపు వృషభముల్ దిరిగెడు చందాన హవ్యమం దెంతను నమరుచుండ్రి
ధన సాధకంబులౌ ఘన హయంబులఁ బోలి స్తవములకున్ మీరు సాగుచుండ్రి
రాజ్యంబునందున రాజ పుత్రుల వలె జనులందుఁ గీర్తిని గనుచు నుండ్రి
మహి మహిషంబులు మడుగు వీడని యట్లు మా హవ్యము గ్రహింప మానకుండుఁ
గీ॥ డనమ పక్షుల రీతిని నధిక ప్రీతి,నొండొరుల వీడకుండగ నుండ్రి వళ యు
గంబు వలెఁ జాయనీయులై కలసియుండు, మీ రశ్ములు! మా కడఁ జేరుఁ డిపుడు ॥ 3453

•గీ॥ హవ్య సంస్తుతులన్ యజ్ఞమందు నగ్ని
దీప్తిఁ గాంచెడు నట్లు లో విష్ణులార!
మీరలును సంస్తుతులతోడ మిగుల దీప్తి
పొందుచున్నార లంతటి నంద మొప్ప ॥ 3454

•గీ॥ కర్మఁ జేయంగ సంతతఁ గ్రాలు నట్టి
యిద్ధ రథ్వర్యులం బోలి నెసఁగు నశ్వు
లార! మీరలు దేశంబులందు దేవ
తలను బూజించుచున్నారు తనివి దీర ॥ 3455

(4)•సీ॥ సూనునకుం బితల్ చుట్టంబు లౌనట్లు మీర లశ్వులు! మాకు మెలఁగుచుండ్రి
సహజ తేజస్సుచేఁ జంద్రాదులట్టులు కాంతిచే మీరలు గ్రాలుచుండ్రి
సేనను ద్వార పెట్టఁ బూను రాజులఁబోలి కర్మలఁ ద్వార పెట్టఁగల్గుచుండు
రన్నాద్యులు జనాళి నాదరించెడు రీతి ధన దానముల నెల్లఁ దనుపుచుండు
గీ॥ రసల సూర్యాది కిరణము లఖిలలోక, మునకు నుపయోగమైనట్లు మొనసి మిగుల
స్తోత్ర జనములు పరిభోగి శోభఁజెంద, మీర లుపయోగపడుచుండ్రి మిక్కుటముగ ॥ 3456

•గీ॥ సుఖము గల్గిన సజ్జనుల్ సురుచిర మగు
కీర్తికై పోవుచుండెడు రీతి మీర
లస్మదీయ సవాహ్వాన మాలకింప
నరుగఁదెం డిటు శీఘ్రమే యశ్వులార! ॥ 3457

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(5)*సీ॥ బలసిన వృషభముల్ పగిది నశ్వులః మీర లతిపుష్ట దేహులై యమరువారు
పాప సంఘంబులఁ బారదోలుచు నుంట సౌఖ్యంబు కలిగింపఁ జాలువారు
వరుణ మిత్రుల మాట్కిఁ గరము మహా సత్యభూతులై యంతటఁ బోవువారు
బహుళ ధనంబునఁ బరిధవిల్లెడు మీరు తీక్ష్ణ స్తుతికు లొంచఁ దిరుగువారు
గీ॥ ఘాసమున నశ్వములు కడుఁ గ్రాలునట్లు, హవ్యమునఁ బుష్టి నొందుచు నరుగువారు
దీప్తహౌ నంతరిక్షంపు దేశమందుఁ,బుష్పవంతుల వలె శోభఁ బొందువారు ॥ 3458

*గీ॥ సురుచిరం బగు నన్నంపు శోభతోడ
మేషములఁ బోలి వృద్ధితో మెలఁగు నశ్వు
లారః పరిచరణీయులు మీరు జనుల
పోషణము చేయువారలు పూర్ణ మహిమ ॥ 3459

(6)*సీ॥ మత్తగజంబుల మాట్కి గాత్రవినామమును నొనర్చుచుఁ బ్రీతిఁ బొందఁగలరు
భర్త లౌనసన్ మరు పరమశాత్రవులను శిక్షింప వారిని జేరఁగలరు
నైతేశలం[1] బోలి భ్యాత శక్తిని బూని శత్రు హంతకు లౌచు సాగఁగలరు
పూత జలంబులఁ బుట్టి యుండుటఁజేసి కాంతులతోఁ గూడి గ్రాలఁగలరు
గీ॥ జయముఁ గోరెడు వారలు చారు మతులు, మీరు బలమున మత్తులై మీరు వారు
మరణ శీల శరీరంబు మరణరహిత,మైన యట్టులు చేయుఁడీః యశ్వులారః ॥ 3460

(7)*గీ॥ ఉగ్రులై వీరులై మీర లుండి చరణ
శీలమై[2] మరణ శీలమై చెలఁగు నాదు
తనువు నాపత్సమూహంబు దరికిఁ జేర
కుండ దాఁటించుచున్నార లుదకము వలె ॥ 3461

*గీ॥ ఋషివరులచేత దత్తమౌ నిద్ధ రథము
శుద్ధబలులైన మిమ్ముల నూటిఁ బొందె
నద్ది వాయువు విధమున నంతటఁ జను
శత్రు ధనమును గొనితెచ్చు శక్తి మీర ॥ 3462

(8)*సీ॥ మీర లశ్వులః మహావీరులఁ బోలుచు స్వోదర ఘృతమును బొందువారు
ధన విషయం బగు ఘన రక్షణంబును జేయుచు నే వేళఁ జెలఁగువారు
వైరి మండలముల వంచుచుండుటఁ జేసి యాయుధంబులతోడ నమరువారు
పతన శీలంబులౌ పక్షుల చందాన సంచితంబుగ సంచరించువారు
గీ॥ చంద్రమస్సదృశ[2] మైనట్టి చారు రూప,సంపదను బొంది ప్రీతితో సాగువారు
మనస సాధువు లగు వారు మనులు యజ్ఞ,మునకు వచ్చెడు వారలు మోద మలర ॥ 3463

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. బతేశులు=వధ చేయువారు (నే.వేం.న.శా.), 2. ఇక్కడ నిందగణమునకు మారు "శల"ము ప్రయు క్తమైనది.

(9)•సీ॥ అంబు ప్రతిష్ఠ మహాత్ముల వలె దుష్ప్రదేశస్థలిఁ బ్రతిష్ఠ బిట్టు తెలిసి
పురుష పదంబులు పోలిక జలరాశి గాధంబు నెరుఁగుచుఁ గరముఁ గ్రాలి
ఘన మగు శబ్దంబు కర్ణంబు లట్టులు సంస్తవంబులఁ జేయు జనుని నెరిఁగి
యవయవంబులతోడ నమరెడు వారలు యజ్ఞంబునకుఁ బోవునట్టు లెనఁగి
గీ॥ మీర లశ్వులు! మా కృతాఽమేయ చారు,చిత్రకర్మను బ్రీతితోఁ జేర ద్రుతము
వచ్చి మమ్ముల సంతోష వార్ధి ముంచి,సర్వ శుభముల నొసఁగుడు! సకల విధుల

(10)•సీ॥ గర్జనమును జేయు ఘనముల కైవడి జలముఁ బ్రేరేపింప జరిగి జరిగి
మధు మక్షికంబులు మధువు విధంబున గోవుల క్షీరంబులఁ గూర్చి గూర్చి
కునరులు స్వేదంబు నొనరించునట్టులు జలమును బుట్టింపఁజాలి చాలి
ఘాసాదికంబును గాంచుచు సద్దాని భక్షించు ధేనువు పగిదిఁ బరఁగి
గీ॥ క్షీర రూపాన్నమునఁ గడు మీరునట్లు, మీర లశ్వులు! సురుచిరాఽమేయ హవ్య
సంపదలతోడఁ గూడుచు సకలలోక,మందుఁ దిరుగుచునున్నారలంద మెచ్చ

(11)•గీ॥ స్తోమమును వృద్ధిఁ బరతుము సురలు! మీకు
హవ్యము నొసంగనున్నార మాదరమున
మీరు రథములపై నెక్కి మేము సేయు
స్తోత్రమును నాలకింపంగ నాత్ర రండు! ॥

•గీ॥ గో గణోధస్సులందున దాఁగి యుండి
పరిణతంబయి మధురమై పరఁగి యాజ్య
హవ్య రూపాది లక్షణంబైన యన్న
మును నపేక్షించి యిటు రండు! ఘనులు మీర
లనుచుఁ బ్రార్థించె భూతాంశుఁ డనెడు మౌని ॥

(12)†అష్టపదకందము॥
హవిష మ్మొకటై సృష్టిని
నవనీతము పగిదిఁ దనరి నవనవ శక్తిన్
నవన విషయ సంగతమై
పవన గతుల దక్షిణ దిశ వరలున్ సతమున్
దివి భువులను సాజమ్మై
జవసత్త్వము లెల్ల నిండి చదలున వెలుఁగన్
అవసతమై నరకము- నా
క విహిత మౌచు జగతి గతిఁ గ్రాలున్ బ్రగతిన్ ॥

---

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†ఇది "ఖిల"మంత్రానువాదము.

†క॥ అవిరళమౌ కాంతితతుల
నవితథముగ వెల్గుచుండు నపరిమిత మగు నా
రవి ఋభు గ్రహరాజి వితత
మవును సుసృష్టికి సురూప మంతరహిత గతిన్ ॥* 3469

## సూక్తము—106

ఋషి—కశ్యపపుత్రుఁడు భూతాంశుఁడు
దేవత—అశ్వి దేవతలు

### అర్థాంతరము—1

†(1) వదతి మోమున మేల్మి పసిడి ముసుఁగును దీసి
నవిలాసవతి కాఁగ సౌందర్య రాశిగా
వరలు ప్రకృతి యెల్ల వలువ తిమిరమ్ము నే
అలవోకగాఁ దీసి అతిలోక దీప్తులన్
అరుణారుణ కాంతు లద్భుతముఁగా వరల
ఆ ఉషోదయ దీప్తు లసురాగ గతులమైఁ
దనరంగ విశ్వమ్ము తరణి దీధితులమైఁ
జైతన్యవంతమై జగతి వర్ధిల్లులేః ॥ 3470

†— సూర్యకాంతి చంద్రకాంతి సొబగౌ నాహార మౌచు
నమృత శక్తు లొప్పారఁగ సంతరాంతర గతుల
అలరారఁగ సృష్టి యెల్ల అద్భుతముగ వర్ధిల్లు
విశ్వ సౌభాగ్యాలు లెల్ల విములములై విస్తృతమౌ
నసురాగపు హేలలతో సత్యంత సన్నిహితమై
సృష్టి యెల్ల పెంపొందును స్రష్ట శక్తి విపులమ్మై ॥ 3471

†(2) సృష్టి లోక సర్వమ్మునఁ జెలఁగు ప్రియ శక్తు లెల్లఁ
బ్రహ్మ దౌత్యము లొప్పంగా భ్రమ లెరుఁగని దీప్తులమైఁ
గీర్తి ప్రద మౌచు సదా మూర్తి క్రతు వౌచు వరలి
సర్వ విశ్వమందు మహిత జగత్కల్యాణమ్ము తనరఁ
బ్రకృతియెల్ల శోభాళుల విక్రుతులతో సలరంగా
సకృత పుణ్య పరమౌచును సుకృత పుణ్యవరమై తగు
నిత్య చలన శక్తు లొప్ప నిర్నిద్రిత పరలంగాఁ
బ్రత్యభిజ్ఞాన గతిని నిత్య సత్యమై పరఁగును ॥ 3472

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*ఇది "ఖిల" మంత్రానువాదము.

(3)†క॥ ప్రకృతి సుచేతన మొక గతి
వికృతిగఁ జేతన మవుచును విధి శకునమ్మై
అకలుషిత సృష్టి హితమై
నికటమ్మున జ్ఞాన దీప్తి నిరతము వెల్గున్ ॥ 3473

†క॥ అనలము మహితపు దీప్తిన్
ఘన చిత్ర విరూప వర్ణ గాత్రము తనరన్
అనిమిష శక్తుల నిత్యముఁ
దనరారును జ్వలిత కీల ధామములు తగన్ ॥ 3474

(4)†క॥ పిత పుత్రులుగా వరలుచు
నతులితుడౌ రాజు ప్రజగ నపురూప గతిన్
కృత సూర్య చంద్ర కాంతులు
గతిఁ బ్రకృతి సకలమును దగుఁ గ్రాంతిన్ గాంతిన్ ॥ 3475

†(5) వృషభ కాంతుల జపము వెల్గొందఁగాను
విశ్వాన సంచార మశ్వ శక్తులు చేయు
అఘ రూపముల నెల్ల నణువణువుఁగూడ
విధ్వస్త మొనరించి విశ్వ పవిత్రతమై
రవి చంద్ర తేజాలు రాణించ నిత్యమ్ము
జగ మెల్ల వెల్గొందు నగణిత దీప్తులన్
నండాండ పిండాండ బ్రహ్మాండ ఖాండాల
నంతటన్ విలసిల్లు నపురూప శక్తులన్ ॥ 3476

†(6) సూర్య తేజము భాతి సొబగొందు ననిలము
అంతటన్ వ్యాపించు నగ్ని శక్తులను
ద్యో పృథ్వు లన్నింటి ద్యుతి మీర భరియించి
ఏకైకమై దీప్తి యొసఁగు నేతశుని గూడ
ఎకసక్కె మాడుచున్ నెల్లెడల వ్యాపించు
జరా మృత్యు రహితముగ శరీరమ్ము నొనరించు
హర్ష వర్ధనము చేయు అమితానందపు రతుల
నిత్య శక్తి విలసిల్లఁగ సత్య రూపముల్ వెలయఁగ ॥ 3477

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) అత్యంతము శక్తిశీలమై అలరెడి అశ్వినీ శక్తి
జరారహితమై వెలిగెడి చారశక్తి తనరారఁగఁ
బద్మగర్భ శక్తు లొప్ప వరలు నిత్య యౌవన గతి
ఖరకర కిరణాళు లెల్లఁ గ్రాలంగా బహు దీప్తుల
నిత్య సత్యమై వెల్గును నిఖిలమ్ముస విస్తృతమై
దుష్ట శక్తు లన్నింటిని దునుమాడును మహితమ్ముగ
వాయు శక్తు లొప్పారఁగ వరలు విశ్వమెల్ల నిండి
ఉగ్ర దీప్తు లెల్ల జగతి నుద్భవిల్లి విస్తరిల్లి ॥ 3478

†(8) ధర్మతత్త్వము మీఱఁ దనరారు విశ్వాన
రవి శక్తు లొప్పంగ రాజిల్లు సృష్టిలోఁ
జంద్రామృత శక్తిఁ జడలంటె ఙ.తిని
అమృత దీప్తులతోటి అమ... వర్ధిల్ల
మనశ్శక్తుల మెయిని మహిత వేగాలతో
అశ్వినీ కాంతు లవి అతిలోక వేగాన
నద్భుతముగా వెలుఁగు నారోగ్యమును గూర్చు
జరయు మృత్యువు లేని శక్తి సంపద లిచ్చు ॥ 3479

†(9) ఒకవంక జల రాశి ఉద్భూత శక్తులన్
ఒకవంక శబ్దజ మరలంక దీప్తులన్
అక్షర శక్తులై అక్షయ గతులతో
నవయవ శక్తిగా నద్భుతముగా వరల
సర్వాగ్ని హోత్రమై సదమల శక్తులన్
వరలంగ సృష్టిలో వర్ధిల్లు సత్కాంతి
అఖిల శక్తులు తనర నశ్వినీ దీప్తులన్
అమరమై అమలమై అపురూపమై వెలుఁగు ॥ 3480

†(10) మేఘాళి గర్జనల్ మిన్నంటి మ్రోగ
జల సంచయముల మోష చదలంటి క్రాల
తేనెటీగల తీపి తేనియలు వరల
అల పా లవి సదా అలర నమృతమై
ప్రకృతి స్వేదము భాతి వరల జల ధారలు
లత వృక్ష తతు లెల్ల సతులితాహారమై
ప్రకృతియే ప్రకృతి కొరకు ప్రతిభ వరమై తనరి
వర్ధిల్లు సర్వదా వశంవద శక్తులన్ ॥ 3481

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(11)†అష్టపదకందము॥

అక్షరపద శక్తులతో
నక్షయమై వెలుఁగునట్టి యద్భుత దీప్తుల్
రక్షిత తేజము లఖిలము
దక్షతమై వరలు మహిత దార్ఢ్యత తనరన్
కుక్షి ప్రకృతి గత మ్మగు
సక్షీణ విహిత విశాల యజ్ఞాఽంగమ్మై
శిక్షిత కాలక్రమ గత
పక్షమ్మై అశ్వి కాంతి వరలున్ జగతిన్ ॥ 3482

(12)†అష్టపదకందము॥♦

ఏకైకమ్మై జగతిని
ప్రాకట హరి శక్తి మహిత భాస్వంతమ్మై
వీఁక నవన శక్తిగఁ దగ
నాకృతి సోమాఽమృత గతి నద్భుత శక్తిన్
చేక కుదుష్టజ శక్తుల
నాకి విదూరముగఁ జేసి నరక ప్రాప్తిన్
సాకల్యంబుగ దక్షిణ
సాకాశ చరిత సుదీప్తి శక్తులు తనరున్ ॥ 3483

## సూక్తము—106

ఋషి—కశ్యపపుత్రుఁడు భూతాంశుఁడు

దేవత—అశ్వి దేవతలు

### అర్థాంతరము—2

†(1) కర్త కర్మ శక్తు లొప్పఁ గ్రాలు నశ్వి కాంతితతులు
విశ్వ సృష్టి వ్యాప్తి చెంది విమలమైన శక్తులతో
ఆయుస్సును నారోగ్యము నఖిలమైన భాగ్య తతులు
వరలంగాఁ బ్రకృతి మాత కరుదైన ప్రశస్త శక్తి
నిత్య సత్యమైన శక్తి అత్యంతము ప్రదీప్తమై
దివ్య ప్రతాపా ప్పరఁగఁ దేజరిలును విశ్వమ్మున
నతులితమౌ శక్తు లొప్ప నపురూపపు దీప్తు లొనర
నణువణువునఁ గాంతి పుంజ మలరారఁగ నద్భుతగతి ॥ 3484

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

♦ఇది "ఖిల" మంత్రానువాదము.

†(2) చలన శక్తి దీప్త శక్తి చదలంటుచు వెలుఁగుచుండ
నశ్వనీ శక్తు లెల్ల నఖిలారోగ్యము లిచ్చుచు
సద్భుతముగ వెలుఁగొందఁగ నమల యౌవనగతు లొప్పఁగ
సకలమ్మున వ్యాపించును స్వర్భాగ్యము వరలంగా
నవనీ తలమందె కాక అఖిల లోకములను గూడ
సమిత గతుల వ్యాపించును నపురూపపు శక్తులమై ॥ 3485

†(3) పక్షాఽన్వితమై వెల్గెడి అక్షయమౌ కాంతి జాల
ఁడక్షతలవి దీక్షతమై తనరారును నిత్యమ్మున్
అక్షయ గతు లొప్పారఁగ నఖిల దీప్తు లలరారును
అక్షర శక్తుల కాంతుల నఖిల రూప మిరవొందఁగ
ఈ క్షితి దివు లన్నింటను నెసఁగు కాంతి శక్తు లెల్ల
ఏ క్షణమందైన నిలిచి యెల్ల లెనయకుండ వెల్గు ॥ 3486

(4)†క॥ పిత పుత్రుల భాతిగ జల
మతులిత కాంతులు తనరును సద్భుత గతిమై
సతత మ్మవినాభావపు
రతి గతి నిరతము వరలును బ్రాకృత గతిమై ॥ 3487

(5)†క॥ శత శక్తులతో నశ్విని
గత మైన మహిత విమలపుఁ గాంతుల్ జగతిన్
అతులితమై వెల్గొంది ని
రతమున్ దనరున్ విపుల విరాజిత దీప్తిన్ ॥ 3488

(6)†సరోజావిషమవృత్తము॥
జరా రహితమౌ శక్తిని చరాఽచరములన్ నిలుపుచు
అరాతి రహిత రూప మొప్ప నద్భుతంపు శక్తులతో
నిరాటంకమైన ప్రసర నిర్వికల్ప దీప్తులమై
వరారోహమైన మహిత పరాక్రమంపు శక్తి తనర
నిరాధార మైన ప్రకృతి నిర్నిద్రిత వెలుఁగంగా
ధరాధరము రజితమేరు ధర్మ గిరులు లోకములన్
బరాక్రమించి భద్రితమై వరలంగా నిత్యమ్మై
మురారీశ బ్రహ్మ శక్తి మూర్తమ్మై వెలుఁగొందున్ ॥ 3489

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7)†క॥ ఋభు గణములు వెలుఁగంగా
నభయమ్మై కాంతి తతుల నద్భుత గతిమై
శుభ గణ గతుల మహాశ్విని
గభస్తి చయము వరలు దివిఁ గాంతి ప్రదమై ॥ 3490

(8)†క॥ ప్రకృతి ఒక ధర్మ మౌచున్
నకృతమ్ముగ నిత్య గతుల నతులిత శక్తిన్
సకృతాఽశ్వినీ ప్రభలు కడు
నకలుషమై విశ్వమందు నలరారు సదా ॥ 3491

(9)†క॥ అత్యంతము విస్తృతమై
మృత్యు రహితమై వెలింగి మిన్నంటుచు సత్
ప్రత్యంతర గతి రహితపు
గత్యంతరమై సునిత్య కాంతిన్ వెల్గున్ ॥ 3492

†— అతి విశాలంబైన ఆ దివ్య శక్తి
అతివేలమై వెలయు నద్భుత కాంతి
అఖిల లోకాఽఽవళుల నపురూప గతుల
ఆవరించుచుఁ దనర నమృత శక్తులతో
అణువణువు కాంతిగా ననునిత్యమున్ దనరు
అజరాఽమృత మైన అశ్వినీ దీప్తులన్ ॥ 3493

†(10) అతిలోక దీప్తమై అతివేల మధురమై
అండాండ పిండాండ బ్రహ్మాండములఁ దనరి
నీచ రహితమ్మైన నిర్నిద్ర శక్తి
నీహార బిందు తతి నిండు ప్రకృతి మాత
స్వేదాంబుదములుగాఁ జెన్నొందు విశ్వాన
సోమాఽమృతపు శక్తి సొబగొందు మధురగతి
ప్రాణప్రద మ్మౌచుఁ బ్రకృతినే కాపాడు
నిత్య యౌవన గతుల సత్య శక్తులు వరం ॥ 3494

(11)†ప్రగతివృత్తము॥•
అనాదియైన అధ్వ గతుల
అనంతమైన అధ్వ రతుల
సనాతనంపుఁ జాంద్రమతుల
అనావృతంపు టద్భుత గతి

---

†రచయిత.—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"పఙ్క్తి"చ్ఛందము. (10)

వినా జరాశి విస్మయ గతి
జనున్ విశాల శాంత ప్రకృతి
ఘనాఘనమ్ము కాంతు లెనయ
నినాదముల్ ప్రణీత మతిగ ॥ 3495

(12)†క॥ నవనమ్మున నవిరళమై
నవనీతము భంగి జగతి నవ నవ గతులన్
హవిషమ్మై సృష్టి కిరణ
భవమై తనరారు దీప్తి వర్ధిల్లు సదా ॥♦ 3496

†— విశ్వ సృష్టిలోన సదా విమలమైన తేజ మ్మది
అపురూపు శక్తులతో హవిషమ్మై వర్ధిల్లును
సృష్టి నిత్య క్రతువు కాఁగ స్రష్ట సత్య హోత కాఁగ
జరారహిత మృత్యురహిత చరాఽచర ప్రపంచమ్ము
జరాసహిత మృత్యుసహిత చరాఽచర ప్రపంచమై
అసాధారణ గతి మీరఁగ నలరారును నద్భుత గతి ॥♦ 3497

## సూక్తమ్—107

ఋషిః—దివ్య ఆంగిరసః, దక్షిణా వా ప్రాజాపత్యా
దేవతా—దక్షిణా, దక్షిణాదాతారో వా
ఛందః—త్రిష్టుప్; 4-జగతీ

(1) ఆవిరభూన్మహి మాఘోనమేషాం విశ్వం జీవం తమసో నిరమోచి ।
మహి జ్యోతిః పితృభిర్దత్తమాగాదురుః పన్థా దక్షిణాయా[1] అదర్శి ॥ 1247

(2) ఉచ్చా దివి దక్షిణావన్తో[2] అస్థుర్యే అశ్వదాః సహ తే సూర్యేణ ।
హిరణ్యదా అమృతత్వం భజన్తే వాసోదాః సోమ ప్ర తిరన్త[3] ఆయుః ॥ 1248

† రచయిత:—వాఙ్మయ మహోద్యమ, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”
♦ఇవి “ఖిల”మంత్రానువాదములు.

1. దక్షిణాయాఽఅదర్శి, 2. వన్తోఽఅస్థుర్యేఽఅశ్వదాః, 3. రన్తఽఆయుః. (వా.ప.)

(3) దైవీ పూర్తిర్దక్షిణా దేవయజ్యా న కవారిభ్యో నహి తే పృణన్తి ।
అథా నరః ప్రయతదక్షిణాసో ఽవద్యభియా బహవః పృణన్తి ॥ 1249

(4) శతధారం వాయుమర్కం[1] స్వర్విదం నృచక్షసస్తే అభి చక్షతే హవిః ।
యే పృణన్తి ప్ర చ యచ్ఛన్తి సంగమే తే దక్షిణాం దుహతే సప్తమాతరమ్ ॥ 1250

(5) దక్షిణావాన్ ప్రథమో హూత[2] ఏతి దక్షిణావాన్ గ్రామణీరగ్రమేతి ।
తమేవ మన్యే నృపతిం జనానాం యః ప్రథమో దక్షిణామావివాయ ॥ 1251

(6) తమేవ[3] ఋషిం తము బ్రహ్మాణమాహుర్యజ్ఞన్యం సామగాముక్థశాసమ్ ।
స శుక్రస్య తన్వో వేద తిస్రో యః ప్రథమో దక్షిణయా రరాధ ॥ 1252

(7) దక్షిణాశ్వం దక్షిణా గాం దదాతి దక్షిణా చన్ద్రముత యద్ధిరణ్యమ్ ।
దక్షిణాన్నం వనుతే యో న[4] ఆత్మా దక్షిణాం వర్మ కృణుతే విజానన్ ॥ 1253

(8) న భోజా మమ్రుర్న న్యర్థమీయుర్న రిష్యన్తి న వ్యథన్తే హ భోజాః ।
ఇదం యద్విశ్వం భువనం స్వశ్చైతత్ సర్వం దక్షిణైభ్యో దదాతి ॥ 1254

1. మర్కంఽనృచక్షసస్తేఽఅభి, 2. హూతఽఏతి, 3. తమేవఽఋషిం, 4. నఽఆత్మా. (వ్రా.ప్ర.)

(9) భోజా జిగ్యుః సురభిం యోనిమగ్రే భోజా జిగ్యుర్వధ్వం౧ యా సువాసాః ।
భోజా జిగ్యురన్తఃపేయం సురా[1]యా భోజా జిగ్యుర్యే[2] అహూతాః ప్రయన్తి ॥ 1255

(10) భోజాయాశ్వం సం మృజన్త్యాశుం భోజాయాస్తే[3] కన్యా౩ శుమ్భమానా ।
భోజస్యేదం పుష్కరిణీవ వేశ్మ పరిష్కృతం దేవమానేవ చిత్రమ్ ॥ 1256

(11) భోజమశ్వాః సుష్ఠువాహో వహన్తి సువృద్రథో వర్తతే దక్షిణాయాః ।
భోజం దేవాసోఽవతా భరేషు భోజః శత్రూన్త్సమనీకేషు జేతా ॥ 1257

## సూక్తము—107

ఋషి—దివ్యుఁడను అంగిరస్సు లేక ప్రాజాపత్య దక్షిణ†
దేవత—దక్షిణ లేక దక్షిణదాత†

(1)*గీ॥ సూర్య రూపాంచితుండైన సురుచిరేంద్ర
సహజ తేజస్సు యజమాన సంఘ యాగ
సిద్ధి కత్యంత హేతువై చెలఁగి మిగుల
సుప్రకాశిత[4]మయి యుండె సొగసు మిగుల ॥ 3498

*గీ॥ అఖిలము తమోవిహీనమై యమరు నచట
నట్టి జ్యోతిస్సె హవ్యము నందఁజేయు
నద్ది యాగాంగభూతమౌ నద్ది దక్షి
ణపు సుమార్గముగ [5]సమర్చు నకలుషముగ ॥ 3499

---

1. సూరాయా, 2.జిగ్యుర్యేఽఅహూతాః, 3. యస్తేకన్యా. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 75వ పుటలో నీ సూక్తమునకు ఋషి "దివ్యుఁడను అంగిరస్సు"గాను, దేవత "దక్షిణ" గాను వ్రాసి, 15h సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "దివ్యుఁడు లేక దక్షిణ" ఋషిగాను "వనము" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

4. సుప్రకాశిత మయ్యెను చోద్య మంద, (తా.పా.), 5. నపర్చు. (వ్రా.ప్ర.పా.)

(2)*సీ॥ దక్షిణ లొసఁగెడు ధర్మాత్ము లెల్లరు దివమందు సంప్రీతిఁ దిరుగుచుందు
రశ్వాళి[1] నిచ్చెడు యజమానవరు లెల్ల నాదిత్య విభువుతో నమరుచుంద్రు
స్వర్ణ దానంబులఁ జాలఁ జేసెడు వార లమరణ ధర్మంబు నందుచుంద్రు
వస్త్రంబు లొసఁగెడు వారు నీతో సోమ! యున్నత సంపత్తి నొందుచుందు
గీ॥ రిట్టి ధర్మాత్ము లెల్లరు మొట్ట మొదట, నఖిల లోక విచిత్రంబు లధిగమింప
నధిక మైనట్టి జీవన మందుచుండి,సంతతానంద సుఖములఁ జాలఁ గాంత్రు ॥ 3500

(3)*గీ॥ హవ్యములతోడ స్తుతులతో నమరులకయి
పూజఁ జేయక యున్నట్టి పురుషులకయి
దేవ యాగంబు దక్షిణా దీప్తి కూడ
సంభవింపకయుండును జక్కని గతి ॥ 3501

*గీ॥ నరులు ప్రియత దక్షిణలు కల్గువారలై
విహిత కర్మ వితతి రహితు లగుటఁ
బాప భీతిఁ దాము బహుభంగులఁ దలంచి
దేవతలను బ్రీతిఁ దేల్చుచుంద్రు ॥ 3502

(4)*గీ॥ సర్వవేది నరుక్క సరసు నాదిత్యుని
వాయు దేవు దృష్ట్య వర్గములను
దేవతలనుగూర్చి పావన యజమాను
లెల్ల హవ్యములను నిచ్చుచుంద్రు ॥ 3503

*గీ॥ ఎవరు దేవతలకు నెలమిని హవ్యంబు
నిచ్చువారొ! వార లిచ్చఁ దలఁచి
మాతృభూతులైన పూత సంస్థలు గల్గు
దక్షిణను నొసంగఁ దగినవారు ॥ 3504

(5)*గీ॥ దక్షిణాంచితుఁడే మహాదరణియందు
ముఖ్యుఁడై యంతటకుఁ బోవు మోద మలరఁ
గరము దక్షిణఁ గలవాఁడె గ్రామమునకు
నేతయై ముందుగా నేగుఁ బూత మతిని ॥ 3505

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. రశ్వంబు లిచ్చెడు. (తా.పా.)

*గీ॥ దక్షిణ నొసంగు వానినే ధరణి పాల
కునిగ భావించెదను మరి ధనము దాన
మిచ్చువానిని రాజుగా నెంచె దేను
వానినే మనుజ పతిగను బలికె దేను ॥ 3506

(6)*సీ॥ దక్షిణలన్ జనుఁ దనిపెడు వానినే నింద్రియ దర్శిగ నెరుఁగుచుంద్రు
దక్షిణలన్ ఆనుఁ దనిపెడు వానినే సధ్వర్యునిగ జను లనుచునుంద్రు
దక్షిణలన్ జనుఁ దనిపెడు వానినే శ్రీసామగాతగఁ జెప్పుచుంద్రు
దక్షిణలన్ జనుఁ దనిపెడు వానినే పరమహోతగ బుధుల్ పలుకుచుంద్రు
గీ॥ దక్షిణాదానము నొసంగఁదగిన వాఁడె,వైద్యుతాగ్ని స్వరూపముల్ పడయఁగలఁడు
దక్షిణన్ ఋత్విగాదులఁ దనుపు నెవఁడు, జగమునం దెల్ల ముఖ్యుఁడై సాగువాఁడె ॥ 3507

(7)*క॥ దక్షిణ యశ్వము నొసఁగును
దక్షిణ హేమంబు నొసఁగుఁ దగిన జనులకున్
దక్షిణ ధేనువు నిడు మరి
దక్షిణ యన్నం బొసంగి తనుపు సుజనులన్ ॥ 3508

*గీ॥ వర్మ మే రీతి నాయుధ వర్గములను
దా నివారించునట్టులు తగ మదీయ
మైన యాత్మయు దురితాళి నవలఁ దోలి
దక్షిణను దానవరముగ దీక్షఁ జేయు ॥ 3509

(8)*ఉ॥ దాతలు దేవతాత్వమును దాల్తురు కావున వారు ప్రీతి స
ద్గతిఁ గనుచుంద్రు హింసితులు కారు పరస్పరభీతి వీడి సం
తతము చరించుచుండెదరు దక్షిణ తానె సమస్త వస్తు సం
తతుల నొసంగుచుండెడును ధన్యత గాంచిన పూరుషాళికిన్ ॥ 3510

(9)*గద్యము॥
తొలుత దాతలు క్షీరాదుల కుత్పత్తి స్థానమగు ధేనువును శత్రువులనుండి జయించిరి.
దాతలు నవోఢ యగు స్త్రీని జయించిరి. ఏ స్త్రీ సువాసయో! యామెను జయించిరి.
దాతలు శత్రువుల యంతఃపానమును జయించిరి.బలాధిక్యమున నాహూయమాను
లగు శత్రువులను దాతలు జయించుచున్నారు ॥ 3511

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(10)*క॥ పరిచారకు లశ్వంబును
నిరతము భూషించుచుండ్రి నెఱ దాతకు నా
సురుచిర యౌవన కాంతయు
స్థిరముఁగ వసియించు వాని చెంతనె యెపుడున్ ॥ 3512

*గీ॥ [1]అబ్జ హంసాద్యలంకృతంబైన సరసుఁ
బోలి చిత్తమునకుఁ దుష్టిఁ బొసఁగఁజేయు
నట్టి గృహమందె ప్రీతి నత్యంత మొంది
దాత వసియించుచుండుఁ దాత్పర్య మెసఁగ ॥ 3513

(11)*గీ॥ వహన సామర్థ్యమును గల్గు వారువములు
దాతఁ బొందించు లక్ష్యము తప్పకుండ
సుష్ఠు చక్రాదికము గల్గి సురుచిరాశ్వ
వంతమౌ రథము దాతకుఁ జెంత నుండు ॥ 3514

*గీ॥ రణములం దాతకున్ మీరు రక్ష నిడుఁడు!
దాత భవదీయ రక్షను దాల్చి మిగుల
యుద్ధ భూములయం దెల్ల నోలి విజయి
గాఁ బ్రవర్తించుచుండునుగాదె! సురలు! ॥ 3515

## సూక్తము—107

ఋషి—దివ్యుఁడను ఆంగిరస్సు లేక ప్రాజాపత్య దక్షిణ
దేవత—దక్షిణ లేక దక్షిణదాత

### అర్థాంతరము—1

†(1) రవితేజ సర్వమ్ము రమ్య రూపముగా
నంతర్గతశక్తి నద్భుతావహముగా
దివ్యాగ్నిగా సకల దేహాన నిలువ
విశ్వ మెల్లను దీప్త విభవమ్ముతో వెలుఁగ
నావిష్కృతము లౌను సమరేచ శక్తులే
దక్షిణాదిని బ్రబలు రాక్షస శక్తులన్
విధ్వస్త మొనరించి విశ్వశాంతిని గోరి
పితృ శక్తుల నిలిపి చిత్రగతు లొప్పఁగా ॥ 3516

---

*రచయిత:—శాస్త్రతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1.గీ॥ అబ్జ హంసాద్యలంకృతమైన సరసు
బోలుచున్ గృహము మిక్కిలి పొలుపు గలుఁగ
చిత్త తుష్టి కరంబయి చెలఁగుచుండి
దాత వసియింపనుండఁడె ధరణియందు ॥ (తొ.పా.)

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) విశ్వవాతావరణ శశ్వచ్చక్తులను విష
కలుషిత మ్మొనరించి కష్ట నష్టములతో
సంతసంపడు దుష్ట శాత్రవ తండాల
సంహార మొనరించు శక్తి సంపద వెలుఁగ
నా దేవ దేవుండు నఖిల మను కాలాల
నతిశక్తి కాపాడు సుత సృష్టిగా నిలుపు
నశ్వరమ్మౌ శక్తి అరుణారుణోచ్చగతి
రవితేజ మొప్పంగ రమ్య హిరణ్యద మౌచు
అమృతత్వ శక్తులన్ నఖిల వసు సంపదల
సోమ మధుర సార్ద్రవ శుద్ధాయు వౌనఁగంగ
దాక్షిణాత్యపు దుష్ట రాక్షసాధమ శక్తి
విధ్వస్త మొనరించు విమల దీప్తులు వరల ॥ 3517

†(3) వామ రూప మ్మౌచు వరలు దక్షిణ క్రియల
విధ్వస్త మొనరించి వెలుఁగు దేవాఽఽఖలు
నిత్య రవి దీప్తులన్ నిరతమ్ము వెలిఁగి
సత్య శక్తులు సదా సార్థకమ్మై వరల
శబ్ద శక్తులు ననిల సంవాహ మొప్పంగ
విస్తృతములై తనరు విశ్వ విశ్వమ్ములో ॥ 3518

†(4) శబ్ద సంశక్తులన్ సర్వమ్మున్ వెలుఁగు
రవి శత ధారలను రాణిల్లు రాజిల్లు
వాయు తరంగాలు వద శక్తు లొప్పంగ
అక్షరమౌ శక్తు లపురూపమై తనర
"అభి"దుష్ట శక్తులను సద్వాన్న గతినుంచి
"నాభి"శక్తుల నిలిపి నానా శుభాఽఽవళుల
సప్త మాతృక శక్తి సప్తాఽనలము లొప్ప
సంగమమ్మై దివ్య శక్తు లొప్పారులే ॥ 3519

†(5) దుష్ట రాక్షస గణముఁ దున్మాడి దున్మాడి
అక్షయ్యమౌ శక్తి దక్షిణ దిక్కుపై
ాధిపత్యము మీఱ నఖిల దిశలును వరల
నపురూప శక్తులన్ అతిలోక గతుల వలె

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

అండాండ పిండాండ బ్రహ్మాండ భాండాల
నన్నిటిన్ గుప్పిటన్ అలవోకగాఁ బట్టి
అలరు నా దేవుండు నఖిలేశుఁడై వెల్గు
విశ్వ రూపమ్ముగా విశ్వాత్మగాఁ దనరి ॥ 3520

†(6) దక్షిణ దిశ నెవఁడు దక్షతన్ నిర్జించు
వాఁడె సర్వేశుఁడై వరలుచుండును జగతి
దక్షిణ దిశ నెవఁడు దక్షతన్ నిర్జించు
వాఁడె వేదేశుఁడై వరలుచుండును జగతి
దక్షిణ దిశ నెవఁడు దక్షతన్ నిర్జించు
వాఁడె శబ్దేశుఁడై వరలుచుండును జగతి
దక్షిణ దిశ నెవఁడు దక్షతన్ నిర్జించు
వాఁడె స్రష్టగఁ బ్రగతి ప్రబలుచుండును జగతి
ప్రాక్పశ్చిమమ్ములు వరఁగు నుత్తర దిశ
ఒక్క ఎత్తుగ దక్షిణ మొక్క ఎత్తు
గాఁగ మహా రాక్షస గణ తతి కాల రాచి
సకల దిగధిపత్యంబు సర్వేశుఁడే పొందు ॥ 3521

(7)†క॥ దక్షిణ దిశ సంపన్మయ
రక్షణమై నస్త్ర శస్త్ర రాజి వెలుంగున్
అక్షర దీక్షిత శక్తులు
నక్షయమై తనరు శబ్ద యజ్ఞము లొప్పన్ ॥ 3522

†(8) స్రష్ట దాతృత్వమున సృష్టి నెల్లను జరుపు
స్రష్ట నేతృత్వమున సృష్టి నెల్లను నడుపు
స్రష్టయే సర్వాన సంక్షోభముల నింపు
నిష్ట పూర్తము కాఁగ నెల్ల సృష్టిని నిండి
దాక్షిణాత్యపు దుష్ట రాక్షసాళిని దునుము
అక్షరమ్మౌ శబ్ద మక్షయ గతి మీఱ
అఖిలమ్ము బ్రహ్మమై అద్భుతముగా వరలు
ఆత్మరూప మ్మౌచు నమల గతులను బొందు ॥ 3523

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) ఈ విశ్వ విశ్వమ్ము నెనఁగు సృష్టిని నిలిచి
దేవ దేవుని దివ్య దీప్తి దక్షిణ కాఁగ
సర్వమ్ము వెలుఁగొంది సకల సంపద్రాశి
నిత్య సత్యమ్ముగా సత్య నిత్యమ్ముగాఁ
దనరారు బహుముఖ దార్ఢ్యతల్ వరలంగ
సత్పదార్థాళిమై సర్వమ్ము తనరార
స్వచ్ఛ శక్తులు పరఁగ సకలమ్ము నిండి
ఇచ్ఛారహిత మౌచు స్వేచ్ఛగా మెలఁగు ॥ 3524

†(10) దేవమానము కాఁగ దివ్య కాలము తనర
విశ్వ స్వరూపాన విమల కన్యయె వరల
చిత్రాఽతిచిత్రమౌ విచిత్ర రతిఁ బరఁగంగ
సర్వాఽఽకాశమ్ము సకల శోభల వెలుఁగి
సర్వ రక్షకి కాఁగ సర్వ భక్షకి కాఁగ
దుష్ట రాక్షస చయ దుర్మతులఁ దున్మాడి
సర్వ సృష్టిని సకల సౌభాగ్యముల నెఱపి
విశ్వ విజేతగా విశ్వరూపిణి వరలు
సర్వ సాక్షిగ మహా శర్వాణిగాఁ దనరు
ధర్మ స్వరూపిణిగ ధగద్ధగిత మౌను ॥ 3525

†(11) సర్వ శత్రు వినాశనము చండశాసనముగఁ జేసి
సకల సృష్టి భారమ్ములు సదమలముగ వహియించుచు
సంరక్షణ సంపోషణ సంవర్ధన రూపముగా
సర్వమ్మును రక్షించుచుఁ జండ పాప రూప మైన
దుష్టమైన దాక్షిణాత్య జెష్ట భ్రష్ట రాక్షస తతి
విధ్వస్తము రావించుచు విశ్వక్షేమమ్ముఁ గోరి
వక్రరహిత చక్రగతి నిర్వక్ర పరాక్రమత మీఱఁ
గాలరూపమై వెలుఁగును వేల లెనయకుండ నిలిచి
సర్వేశుని కృప మీఱఁగ సర్వమ్మును బరిమళించు
సర్వాత్మగ సర్వరూప శర్మగతులఁ దనరారును ॥ 3526

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య: "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—107

ఋషి—దివ్యుఁడను ఆంగిరసుఁ లేక ప్రాజాపత్య దక్షిణ

దేవత—దక్షిణ లేక దక్షిణదాత

### అర్థాంతరము—2

†(1) అంధకార బంధురతన్ నధఃకరించి చీల్చి వేసి
అవిష్కృత మాయె విశ్వ మద్భుతావహముగా
జీవకోటి సర్వస్వము చేతన శక్తుల మీఱఁగ
బహు మార్గగ రూపాళులఁ బరిఢవిల్లు సర్వ సృష్టి
దివ్యమైన దీధితులను తేజరిల్లు లోకాళులు
శ్రీ మహావిష్ణున కిదు చెన్నొందెడు దీప్తులతో
సృష్టి యజ్ఞ దక్షిణలై సృష్టికాంతలై వరలును
నిష్ఠ పూర్తమై వెలుఁగుచు నిష్ఠ శక్తిగాఁ బరఁగును ॥ 3527

†(2) సౌరరూపమౌ దీప్తులు చాంద్రగతుల నొప్పారఁగ
మేషోచ్చల వృషభోచ్చల మేలిమిగాఁ దనరారుచు
దివి భువులను నన్నింటను దివ్య శక్తు లొప్పారఁగ
తేజఃపుంజాల నొసఁగు దివ్య దీధితులు వరల
నమల స్వర్ణ భరితమ్మై నమృతప్రదమై తనరఁగ
అష్ట వసు సుసంపదాళి అపురూపపు దైశ్వర్యము
లై వరలఁగ విశ్వమ్మున నాయువు రూపమ్ము లౌచు
దక్షిణగాఁ దనరారును రక్షణగాఁ గొమరొందును ॥ 3528

†(3) దైవీయమ్మౌ శక్తులు ధగద్ధగితమై వెల్గఁగ
దేవయజ్ఞమందు వరలు దివ్య దక్షిణగ జగతియె
అలరారును మహాశక్తి అద్భుత రూపము గాఁగను
దుర్ధరుఁడై దుష్టుండై దుర్విదగ్ధ రూపుండై
దుర్ధర్షణుఁడౌ రాక్షసు దుర్మార్గపు తత్త్వాలను
దున్మాడును విశ్వేశుఁడు తుష్టి నిచ్చి జగాలకు ॥ 3529

†(4) శతధారగ ననిలము సర్వమ్మున వ్యాపింపఁగ
"అఖి"శక్తులు నశియింపఁగ "సాక్షి"శక్తి వర్ధిల్లఁగ
సలిలమ్మై హవిషమ్మై సర్వమ్మున వ్యాపింపఁగ
విశ్వలోక దక్షిణగా విస్తృతగతి వర్తిల్లుచు

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సప్తాఽనల గతులతోడ సప్తాఽనిల రతులలోడ
సప్త సలిల తత్త్వాలను సప్తమృత్తతు లొప్పారఁగ
సప్తాఽఽవరణలను వరలెడి సప్తమాతృకాళి నెల్ల
నర్చించుచు సృష్టిగతుల నపురూపపు దీప్తులతో
అంతరిక్షమందు నఖిల మనంత శక్తి వర్ధిల్లఁగ
నిత్య సత్యమై వరలును సత్య నిత్యమై తనరును ॥ 3530

†(5) ప్రకృతిమాత సర్వమునకు వరలు దక్షిణలు పదార్థాలు
శిష్ట దృష్టి తుష్టి మీఱ నిష్ట పూర్తమ్ము కాఁగ
దేవమానవాళి కెల్ల దివ్య దక్షిణగఁ బ్రకృతియే
తనరారును విశ్వమ్మునఁ దగు నాధిపత్య రతుల
నఖిలమ్మును గానుకలై అలరారఁగ మహిత శక్తి
సృష్టిమాత దేవి కాఁగ సృష్టి దివ్య దక్షిణగా
అలరారును బ్రాకృతమై అపురూపపు దీప్తులతో
అతిలోకపు సంపదలను అతివేలపు నియంత్రణల ॥ 3531

†(6) దివ్య దేవతాళి శక్తి తేజరిలెడి చక్ర శక్తి
దివ్యమైన విజ్ఞానము దీధితులను నొప్పారఁగ
భూత భావి వర్తమాన పూర్ణ కాల గతులలోన
సృష్టి స్థితి లయ రతులను చెలఁగుచు నీ సర్వ సృష్టి
బ్రహ్మశక్తి దక్షిణగాఁ బర్వఁగ నిత్యమ్ము జగతి
సామ శక్తు లొప్పారఁగ సర్వాయువు శక్తులుగా
సూక్ష్మాతిసూక్ష్మ మౌచు సొబగొందెడి విజ్ఞానము
గరీయములకు మహా గరీయమై తనరారును ॥ 3532

†(7) విశ్వ సృష్టిలో వెలిఁగెడి విమల కాంతిపుంజా లవి
లోకాలను రజిత మేరు రూప పర్వతాఽఽవళులును
వసు సంపద సర్వస్వము ననమానపు భాగ్యాళులు
దక్షిణలై చాంద్ర సౌర ధగద్ధగిత కాంతి తతులు
జల ధారల దక్షిణ కవి సాధారణ రూపములై
దాన తర్పణాల గతుల తనరారును సాజములై ॥ 3533

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) సృష్టి స్థితి దానమ్మై యిష్ట పూర్తమై వెల్గును
ఉత్పాతము నెల్ల సృష్టి ఒనర హింస దక్షిణలను
స్థితి యెల్లను దానమ్మై శ్రీకరమౌ దక్షిణగాఁ
దనరారఁగ సృష్టి యెల్ల తరతమ భేదములు లేక
అఖిల మీప కృత మౌచును నలరారును దక్షిణగాఁ
ప్రకృతిమాత దక్షిణగా వరలు విశ్వ సర్వస్వమ్మై
స్వచ్ఛమైన జీవశక్తి సర్వ సంపదాళి లొప్ప
సకల లోక జాలా లవి శర్మములై తనరారును ॥ 3534

†(9) విశ్వమ్మున సంభవించు విపుల సంక్షోభాలను
విధ్వస్తము కావించుచు విపరీతపు శక్తులతో
సర్వ సుగంధములు మీఱ సకల సంపదాళి వరలఁ
ప్రకృతిమాత విజయమ్ములు ప్రాకృతముగఁ బొందుచుండు
నిత్య సత్యమౌ జగతిని సత్యపూర్వ శక్తు లొప్ప
నవరూపపు దీప్తులతో నఖిలమ్మును వరలుచుండు ॥ 3535

†(10) అతిశీఘ్రపుఁ జలనాలను నఖిల సృష్టి చరియించును
అనంత విశ్వ రూపిణిగా నపూర్వ కన్య రాజిల్లఁగ
మహా శోభ మీఱ సృష్టి మహితశక్తి వర్ధిల్లఁగ
సృష్టి జలధిలోఁ గమలము చెన్నొందెడు రీతి కాఁగ
విశ్వ సృష్టి సర్వస్వము విచిత్రముగ వికసించును
దేవ మానవ కృతము కాఁగ దివ్య కాల తత్త్వ మెనయ
సకల సృష్టి స్థితి గతులను సర్వ లయ ప్రకారాల
వరలు చక్రనేమి క్రమ భాసురమై దీధరమై ॥ 3536

†(11) కాంతి కిరణ జాలా లవి క్రాలు నాకర్షణగతుల
చక్రగతుల సంచరించి నవక్రముగ వరలుచుండు
కాల రథము ప్రయాణింప గతి ననంత యానముగా
విశ్వమ్మే వర్ధిల్లును నశ్వి శక్తి రాజాలను
సృష్టి యజ్ఞ సర్వస్వము చెల్వొందఁగ రక్షితమై
ప్రకృతి సహజ సంగ్రామపు వికలమ్మున విజయాళుల
సర్వస్వము నొందు దివ్యశక్తి దేవ సకలమ్మును
అద్భుతగతి వరలంగా నమృత శక్తు లలరంగా ॥ 3537

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—108

ఋషిః—పణయో-ఽసురాః
ఋషికా—2,4,6,8,10-11 సరమా దేవశునీ
దేవతా—సరమా; 2,4,6,8,10-11 పణయః
ఛందః—త్రిష్టుప్

(1) కిమిచ్ఛన్తీ సరమా ప్రేదమానడ్ దూరే హ్యధ్వా జగురిః పరాచైః ।
కాస్మేహితిః కా పరితక్మ్యాసీత్ కథం రసాయా[1] అతరః పయాంసి ॥ 1258

(2) ఇన్ద్రస్య దూతీరిషితా చరామి మహ[2] ఇచ్ఛన్తీ పణయో నిధీన్ వః ।
అతిష్కదో భియసా తన్న[3] ఆవత్ తథా రసాయా అతరం పయాంసి ॥ 1259

(3) కీదృఙ్ఙిన్ద్రః సరమే కా దృశీకా యస్యేదం దూతీరసరః పరాకాత్ ।
ఆ చ గచ్ఛాన్మిత్రమేనా దధామాఽథా గవాం గోపతిర్నో భవాతి ॥ 1260

(4) నాహం తం వేద దభ్యం దభత్ స యస్యేదం దూతీరసరం పరాకాత్ ।
న తం గూహన్తి స్రవతో గభీరా హతా[4] ఇన్ద్రేణ పణయః శయధ్వే ॥ 1261

(5) ఇమా గావః సరమే యా[5] ఐచ్ఛః పరి దివో[6] అన్తాన్ సుభగే పతన్తీ ।
కస్త[7] ఏనా అవ సృజాదయుధ్వ్యుతాస్మాకమాయుధా సన్తి తిగ్మా ॥ 1262

1. రసాయాఽఅతరః, 2. మహఽఇచ్ఛన్తీ, 3. తన్నఽఆవత్, 4. హతాఽఇన్ద్రేణ,
5. యాఽఐచ్ఛః, 6. దివోఽఅన్తాన్, 7. కస్తఽఏనా అవ. (ప్రా.ప.)

(6) అసేన్యా వః పణయో వచాంస్యనిషవ్యాస్తన్వః సన్తు పాపీః ।
అధృష్టో వ ఏతవా[1] అస్తు పన్థా బృహస్పతిర్వ[2] ఉభయా న మృళాత్ ॥ 1263

(7) అయం నిధిః సరమే[3] అద్రిబుధ్నో గోభిరశ్వేభిర్వసుభిర్న్యృష్టః ।
రక్షన్తి తం పణయో యే సుగోపా రేకు పదమలకమా జగన్థ ॥ 1264

(8) ఏహ గమన్నృషయః సోమశితా[4] అయాస్యో అంగిరసో నవగ్వాః ।
త[5] ఏతమూర్వం వి భజన్త గోనామథైతద్వచః పణయో వమన్నిత్ ॥ 1265

(9) ఏవా చ త్వం సరమ[6] ఆజగన్థ ప్రబాధితా సహసా దైవ్యేన ।
స్వసారం త్వా కృణవై మా పునర్గా[7] అప తే గవాం సుభగే భజామ ॥ 1266

(10) నాహం వేద భ్రాతృత్వం నో స్వసృత్వమిన్ద్రో విదురంగిరసశ్చ ఘోరాః ।
గోకామా మే[8] అచ్ఛదయన్ యదాయమపాత[9] ఇత పణయో వరీయః ॥ 1267

(11) దూరమిత పణయో వరీయ[10] ఉద్గావో యన్తు మినతీరృతేన ।
బృహస్పతిర్యా[11] అవిన్దన్నిగూఢాః సోమో గ్రావాణ[12] ఋషయశ్చ విప్రాః ॥ 1268

---

1. ఏతవాఽఅస్తు, 2. తిర్వఽఉభయా, 3. సరమేఽఅద్రి, 4. శితాఽఅయాస్యోఽఅంగిరసో, 5. తఽఏత, 6. సరమఽఆజగన్థ, 7. పునర్గాఽఅపతే, 8. మేఽఅచ్ఛః 9. పాతఽఇత, 10. వరీయఽఉద్గావో, 11. తిర్యాఽఅవిన్దన్నిగూళహాః, 12. వాణఽఋష. (వా.వ.)

## సూక్తము—108

ఋషి—అసురులైన పణులు†

ఋషిక—2,4,6,8,10-11 దేవశుని సరమ†

దేవత—సరమ, పణులు†

పణులు

(1)*గద్యము॥

సరమ(దేవశుని) పార్ష్ణిభాగమునుగూడఁ జూడకుండ నతిత్వరితము గమనస్థానమును జేరెను.
వచ్చుచున్న నీకు నీ మార్గము యదృచ్ఛాగమనమునకు శక్యము కాదు. ఓ సరమా!
మాకడ నపేక్షితార్థ మేమి కలదు? భ్రమణ మేల? శబ్దాయమానయు, శతయోజన
విస్తీర్ణయు నగు నంతరిక్ష నదియొక్క యుదకముల నేల దాఁటవలసి యున్నదో!
చెప్పుము! ॥ 3538

సరమ

(2)*గీ॥ మీ మహాపర్వతంబున నా మహాత్ము
గో నిధుల నెల్ల వెదుకఁగఁ గోరి యింద్రు
దూతినై మీ గృహంబుఁ బ్రఖ్యాతి మీరఁ
జేరుచుంటిని పణులార! శీఘ్రగతిని ॥ 3539

*గీ॥ ఆ యతిక్రమణ సంజాతమైన భయము
వలన నా నది జలముసన్ లలిత రీతి
నెలమి రక్షింపఁ దన్నదీ జలము దాఁటఁ
గల్గితిని సుండు! పణులార! కరము వేగ ॥ 3540

పణులు

(3)*గీ॥ సరమ! యెవనికి దూతివై నిరతముంచు
వట్టివాని పరాక్రమం బెట్టు లుండు?
నీ మహేంద్రు మహా సేన యెట్టి దగునో!
చెప్పుమా! స్పష్టముగ నీవు శీఘ్రగతిని ॥ 3541

*గీ॥ వచ్చుఁగాక! సరమ వలసిన రీతిని
సామి యగునుగాక! సకలమునకు
ధేనువులకుఁ బతిగఁ దేజరిల్లునుగాక!
సనుచుఁ బల్కినారు పణులు తలఁచి ॥ 3542

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 81వ పుటలో నీ సూక్తమునకు ఋషి "పణులు"గాను, దేవత "సరమ"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "సరమ, పణులు" ఋషిగాను "సరమ, పణులు" దేవత గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

సరమ

(4)*గీ॥ ఎవనికిన్ దూతి నౌచు నే నెంతయేని
శీఘ్రగతి మీ గృహంబును జేరుచుంటి
నట్టి యింద్రుఁడు పణులార! హన్యుఁ డనుచు
నాకుఁ జెప్పంగఁ దర మౌనె? భీకరముగ ॥ 3543

*గీ॥ ఆవరింప లేవు పావన నదు లింద్రు
నెవని మహిమవలన నెల్ల జలధి
నిస్తరింపఁగలమొ! నిరత మా యింద్రుని
వెల్లడించుచుండు విమల నదులు ॥ 3544

పణులు

(5)*మ॥ సరమా! నీవు దివంబు వీడి యెటకో సంతుష్టితోఁ బోవు చే
వెరవుం గానక గో చయంబు కదకన్ వీక్షింపనున్నావు? స
న్నరుఁ డెవ్వాఁడు రణంబు చేయకయె నానా గోవులం బొందు నీ
ధరణిన్? మాకును నాయుధాళి కల దీ తత్త్వంబు పాటింపుమా! ॥ 3545

సరమ

(6)*గీ॥ పాప యుక్తము లగుటచేఁ బణులు! మీ శ
రీరములు విక్రమంబును జేరకుండె
మీరు పలుకు వచస్సు లమేయ సేన
కర్హములు కాక యెంతయు నమరకుండె ॥ 3546

*గీ॥ మీ మహా మార్గమునఁ బోవ మేలు కాదు
మీ మహా దేహముల కెల్ల నా మహా బృ
హస్పతియు[1] సుఖము నిడకుండ నధికతీక్ష్ణ
తరముగా బాధ[2] నిడును దాఁ దలఁచితలఁచి ॥ 3547

పణులు

(7)*గీ॥ అస్మదీయకోశ మద్రి బంధక మద్ది
వసు గవాశ్వతతుల వశ్యమగును
పణులు నిధిని మిగులఁ బాలించుచున్నారు
వ్యర్థముగ బిరాన వచ్చి తీవు! ॥ 3548

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఇక్కడ నింద్రగణమునకు మారు "పంచలఘు గణము" ప్రయుక్తమైనది. 2. బాధపెట్టు నే విధమునైన, (తా.పా.)

సరమ

(8)*గీ॥ సోమ పాన జాత శోభచే నొప్పెడు
నల నవగ్వయాస్యు లరుగఁ దెంతు
రట్టు వచ్చి వార లా గో సమూహంబు
విభజనంబుఁ జేసి వెతలఁ గలరు ॥ 3549

*క॥ ఎందుకు వచ్చితి వని మీ
రందంబుగ నన్నుఁ గూర్చి యన్న పలుకు లో
మందాసురులారా! ని
స్పందంబుగ నుడువకుంటి పొడి యగు నుడిః ॥ 3550

పణులు

(9)*క॥ సరమా! సుర శక్తిని బల
పురమునకుం జనుచు ధేను పుంజముఁ గని తత్
పుర నాథువలన బాధలఁ
బరముఁ గొనఁగ వచ్చినావు పరమార్థ మిదే ॥ 3551

*గీ॥ సరమ! నిన్ను మేము స్వసగ భావింతుము
నీవు చేరఁబోకు నెమ్మి నిందుఁ
సుభగ! నీదు ధేను సుందర వ్రజమును
నింపు మీరఁగా భజింపఁగలము ॥ 3552

సరమ

(10)*గద్యము॥
ఓ పణులారా! నేను భ్రాతృత్వమును స్వసృత్వమును నెరుఁగను. ఇంద్రుఁడు రత్రి
భయంకరు లగు నంగిరస్సులు వానివాని నెరుంగుదురు. మఱియు నా స్థానమును
గోరి యింద్రాదులు మీ స్థానము నాక్రమించుచున్నారు. అక్కారణమున నో
పణులారా! ఉరుతర మగు గోబృందమును విడిచి వేరొక చోటికిఁ బొండు ॥ 3553

(11)*క॥ పణులారా! మీరు దూరము
చనుఁడీ యుపహ్వతము లైన చక్కని గోవుల్
ఘన గిరిబిలనన్ వెలువడి
పనిఁ బూనుచు వచ్చుఁగాతఁ బరమ ప్రీతిన్ ॥ 3554

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

ఆ.గీ॥ అతి నిగూఢము లైనట్టి యాల నెల్ల
నా బృహస్పతి పొందెఁ దా నటులె సోమ
మునకు నుపకారకంబులౌ కఠిన శిలలు
నయుత మా గోవులను గాంచె సౌఖ్య గరిమ ॥ 3555

## సూక్తము—108

ఋషి—అసురులైన పణులు

ఋషిక—2,4,6,8,10,11-దేవశుని సరమ

దేవత—సరమ, పణులు

### అర్థాంతరము—1

†(1) అల దూరమౌ దేశ మత్యంత శీఘ్రాన
సరమ పరుగున దాటి పరివేషణముగ
నదీ ప్రవాహమ్ము నవ పరివాహమ్ము
అతిక్రమించుచు సహిత వృత జనన శక్తి
దేవశునిగా సర్వ దివ్య శక్తులు మీర
దేవతలలో సరస దీప్త పీఠిక తగ
నున్నతస్థానమ్ము నెన్ని త్రిష్టప్ గతిని
విన్నాణ మొప్పంగ విశ్వమ్ము తిరుగ ॥ 3556

†(2) విరాట్టిటి ప్రథమౌ సృష్టి వ్యవస్థలో
మాధ్యమికమౌ వాక్కు మహిమాన్వితమ్మై
నింద్రి శక్తులు మీర నతీంద్రియగతి రోవ
సషర శక్తులన్ అక్షయ దీప్తులన్
పమ్యపహృత మైన ప్రాణ శక్తుల నెల్ల
దివ్యత్వ మొప్పంగ నవ్య నవ భావాల
నిత్యరా గతిమమై నిర్ణిద్ర గతి తోడ
సవనిమల కరితమౌ నవతాఽనాసక్తమెయి
సర్వమున్ వ్యాపించి సకల రక్షక గతులఁ
నర్పిత చర్యల గతి సర్వమున్ గాచెడు ॥ 3557

*(3) వేగ శక్తి రూప మౌను విజ్ఞాత భరిత మౌను
విమలమైన సరమ సుమలమై జనితగమల
సూర్య శక్తి ప్రతిఫలించ నవాత్మ్యదీప్త మహితమైన
నిత్య సత్య శక్తి యెల్ల నింపు ప్రతిభ లబ్బురమై
సర్వమ్మున వ్యాపించును సత్యగముల నిత్యరతుల
నవలోకపు దీప్తులమై నవరూపపు శక్తులమై ॥ 3558

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహోవృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అతిగభీరమ్మైన అతివేల శక్తి
పణుల నన్నింటిని బరిహరించుచుఁ బ్రగతి
వేద విజ్ఞానమ్ము విస్తృతమ్మై దేవ
దివ్య విజ్ఞానముగ దీధితుల వరల
నఖిల విశ్వ మ్మెల్ల నద్భుతముగాఁ దనర
నమృత శక్తులు కాంతు లమర వాహనులై
అతివేగముగ సృష్టి నావరింపంగా
సద్భుతముగా సరమ నపురూపమై నిలుచు ॥ 3559

†(5) సకల విశ్వమ్ములో సరమ శక్తులు వరలఁ
దిరుగాడు గోళాలు దివ్య శక్తులు మీఱఁ
బరమేశ్వరేచ్ఛగా వరణీయమై వరలి
సరమ శక్తులు మీఱ సకలమౌ వేగాన
వేగమే సృష్టిగా వేగమే స్థితి కాఁగ
వేగమే లయముగా విశ్వాంతరాళాన
వేగ స్వరూపమై విస్తృత శక్తులన్
విశ్వమే సరమగా విష్ణు లీలగఁ దిరుగు ॥ 3560

†(6) పాప శక్తుల నెల్లఁ బరిహరింపఁగ నిలిచి
దీప రూపము లేని దేబె పణి సమూహమ్ము
దురిత మార్గాలలో దుష్ట రూపమ్ముగాఁ
బయనించి పయనించి పరమ దుష్ఫలమ్ములన్
నాశించి దిరుగాడు ససహాస రూప గతి
నా దుష్ట శక్తులను నద్భుత గతి తోవ
దైవీయమౌ గతి ధన్యత్వ మొప్పంగ
నిత్యమై చరియించు సత్యతత్త్వము వెలయ ॥ 3561

†(7) అష్ట వసువు లన్నింటిని ఆధికాధిక రూపతమై
రజిత గిరుల హేమ గిరుల రాణఁ గాపాడుచుండి
విశ్వరూపమై వెలిఁగెడి విమలమైన సరమ శక్తి
సర్వ లోక జాలాలను సడమలముగ నమృతముగ
రక్షణ మొనరించు నవ్య రమ్య వేగ తత్త్వాలను
నపురూపపు దృత శక్తుల సద్భుతముగ వెలుఁగొందుచు
ససాధారణమ్మౌ గతి నతిలోకపు శక్తులతో
ననూహ్యమౌ దీప్తుల ననురూప రూపాలను ॥ 3562

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) వాయు తీక్ష్ణ శక్తులతోఁ బ్రజ్వలిల్లు నగ్ని భాతి
మేఘ రూప మంది నిల్చు మిన్నులలో మితి మీరఁగఁ
గాంతి విభజన మొనరించెడి ప్రాణశక్తి విశ్వమ్మున
మేఘాలను ననిలపరమై మిక్కుటముగ జలశక్తులు
స్రవియింపఁగ ధారలుగాఁ జగ తెల్లను నిండంగా
లోకమ్ముల శబ్దశక్తి లేకైకమ్మై వరలఁగ
అఖిలాఖిల వాయు గతుల సప్తరూపశక్తులతోఁ
బ్రకృతి సహజమైన శక్తి ప్రభావాసితమ్మై వరలును
శబ్దశక్తి మహిత మోమఁ బాండ్రశక్తి విస్తరిల్లఁ
దత్త్వరహితమైన సహజ దార్ఢ్యరక్షశక్తి మీరు ॥ 3563

†(9) దైవీయ మైనట్టి దీవాజమృత శక్తి
ప్రాణ రూప మ్మైన గగన నిశ్వాస గతిని
బ్రకృతి రూపము నెఱిఁగి ధాన్యాంతమై వరల
నవనద్వివేగానఁ జంచద్వతిగ నిలిచి
లోక రక్షణ మెప్పుఁ బ్రాకట గతి నిల్పి
సర్వ లోకాజవళుల సాతత్య మెప్పంగ
సప్తరూప గతి తోప నమృతావహమ్మై
నన్ని లోకమ్ములను నమృతలో నుంచనగు ॥ 3564

†(10) వాయు శక్తి వర్ధిల్లఁగ బ్రాతగ భూతాళులందు
వేద శబ్ద శక్తి కాఁగ విశ్వమ్మునఁ బెంపొందుచు
నగ్ని కాఁగ నఖిలమ్మను నమృతమ్ముగా వరలుచు
నచ్చమైన అనిల ప్రాణ మఖిలమ్మున వ్యాపించఁగఁ
గాంతి రూప పంచ శక్తులఁ గాలిల విశ్వగతుల సదా
వీరత్వము ధీరత్వము విమల గతుల నద్భుతమై
నతిలోకపు శక్తి కాఁగ నతిసహజపు ధర్మమునన్
సర్వ రక్షక మ్మోచును స్వకీయ రక్ష శక్తి వెలుఁగ
స్థితి శక్తిని గాపాడెడి దివ్యదేవ విష్ణుశక్తి
దేవతనిగ దివ్యతమై దివిభువి లన్నిట వెల్గును
నిత్య నవ్య శక్తులతో లీలాలుగ నిరతమ్మున్
అమరమ్మై లసరాదను నమృతగతు లొప్పారఁగ ॥ 3565

---

†రచయిత.—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) సత్య శక్తు లొప్పారఁగ నిత్య గతిని విశ్వ మ్మది
  అఖిల లోక సర్వమ్మున సమ్మృతావహముగా
రజిత హేమ గిరులందును రాణ చరాచరములందు.
  సోమాఽమృత శక్తు లొప్ప దీపహితపు దేవాళుల
విజ్ఞతమై విశ్వ మ్మది విస్తృతగతి వర్ధిల్లును
  వ్యాకోచము సంకోచము వ్యాప్తిత్వపు శక్తులమై
గూఢతత్త్వ మొప్పారఁగ వాధశక్తి వర్ధిల్లఁగ
  నిత్య సత్య తత్త్వ రూపు సత్య తత్త్వ రూప రూపాను ॥ 3566

## సూక్తము—108

ఋషి—అసురలైన పణులు

ఋషిక—2,4,6,8,10,11-దేవశుని సరమ

దేవత—సరమ, పణులు

### అర్థాంతరము — 2

†(1) అఖిలములో మొయిళు లెల్ల సమ్మతశక్తి వర్ధిల్లను
  స్వేచ్ఛాగతి ప్రాణదీప్తి వెన్నొందను నిత్యమ్మున్
దూరతీర గతులతోడ నిరుపమా రతి మీఱఁగ
  నిర్ధూమపు భానువుమ్మగ నిస్తంద్రిత మీఱంగా
నిరత చలన శక్తులతో నిర్వక్రిత క్రియత మీర
  విశ్వగతమ్మైన శక్తి విస్తృతగను లొప్పారఁగఁ
పరిమిత పరిధులలోపలఁ దిరుగాడును విమల గతుల
  నిరతమ్మును యుక్తుల నిర్వికల్ప రూపముందె ॥ 3567

†(2) విష్ణుదేవు నిచ్ఛారతి విస్తృతమౌ దూతగతిఁగ
  సకల విశ్వ సర్వస్వము సుపురూపముఁ జలన శక్తి
సంచలనపు రీతులలో సంవలితపు భాగగతుల
  నిరతమ్మును నిర్నిద్రిత నిర్మల తత్త్వమ్ము మీర
ఆత్మ ప్రదక్షిణపు గతుల నడిపెడి ప్రదక్షిణపు రీతుల
  నంతరిక్షమందు మహా యజ్ఞ సృష్టి చేయుంగఁ
అఖిల భూత శక్తు లెల్ల నంతర్గతి నలరారును
  సతివేలము కాఁగఁ దిరుగు సద్భూతము కాకుండఁగ ॥ 3568

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(౩) ఏ రీతిగ సూర్య దీప్తి యొసఁగ విశ్వ మెల్లఁ దినగ
ఏ రకిగా సూర్యశక్తి యీ ప్రపంచ మెల్ల నిండు
నే గతిగా నెల్లెడల నవారితగతి రవి కాంతులు
వ్యాప్తి చెంది దివ్యతేజ దీప్త[illegible]
సర్వ లోక ప్రభువు తాఁగ నిర్వికారి నిరతమ్మును
అద్భుతగతి నలరారును ననుపమాన ప[illegible]లలో
గోపతత్త్వ మొప్పారఁగ గూఢశక్తు లప్పుడెల్ల
నిత్య గతుల సత్య రతుల నిరతమ్ముగ వెల్గొందును ॥ ౩౫౬౯

†(4) విష్ణుశక్తి నెల్ల జగతి విధ్వస్తము కావింపఁగ
నేరికైన సాధ్యము రా దీ విశ్వమం దెప్పుడును
దీప్తమైన సర్వశక్తి దివ్యమూర్తి శక్తు లెల్ల
నత్యంతము గభీరమై [illegible] మీఱ
సత్య సర్వ శక్తు లెల్ల నిత్యతా గరిమతమై
సత్యాపూర్వ దీప్తులమై సకలములై వెల్గొందును
ఆ పరమపు శక్తి తాఁగ [illegible]
మూలశక్తి గ్రహణశక్తి గ్రసన శక్తు లొప్పారును ॥ ౩౫౭౦

†(౫) దివి భువి లోకా లన్నిట దీప్తమంత గతుల మీఱ
దుది మొద లెరుఁగక జగతిని దుర్నిదగ్ధ శక్తి వెలయు
వ్యాప్తి నొందు విస్తృతగతి వసుశక్తుల మిత మీఱుచుఁ
గాంతి కిరణ శక్తు లెల్లఁ గ్రాలు సమర శక్తులతో
వాడిగ వేడిగ వరలును మోదు వారకుండ నిలుచు
నిత్య సత్య పరమ శక్తి సత్య దీప్తు లొప్పారఁగ
నభయ మైన నుభయగతులఁ బ్రకటించెడి దీప్త శక్తి
నపురూపమ్మై వెలుఁగును సమితమైన వాయు రతుల ॥ ౩౫౭౧

†(౬) అదృష్టమైన యద్భుతగతి నతిలోకపు దీప్తులమై
ననివారిత మార్గాలను ననురూప శక్తులతో
అత్యంతము సూక్ష్మమ్మై అంతరాంతరపు గతులను
బహుముఖమౌ పథాలలో నహరహమును వర్తిల్లుచు

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య: "కళా-ప్రపూర్ణ"

సునిశితమౌ దీప్తులతో సూక్ష్మమైన ప్రసరశక్తి
అదృశ్యమైన అపురూపపు సమరమైన ప్రభావాల
నిహ పర లోకాలన్నిట నెన లేని ప్రభల మీరి
నపురూపపు నరమ శక్తి ననిలమార్గ గతుల నిల్చు ॥ 3572

†(7) విశ్వసృష్టి కోశ మౌచు విమలమైన దీప్తులతో
మేఘరాజి కాంతి శక్తి మిన్నంటెడి సంపదలను
ప్రకృతి ధనము మహితమైన రజత హేమ గిరు లలరను
సకల లోకరక్షకమై సర్వప్రాణ ప్రాభవ రతి
నపురూపపు దీప్తులతో నమలమైన గతి శక్తుల
నత్యంతము గోప్యమైన అతినిగూఢరతులు మీరఁ
గరణశక్తి ధరణశక్తి కాంతి మీఱు చలనశక్తి
అఖిల విశ్వ మావరించి అతిపరమమ్మై నిలుచును
నిధిరూపమ్మై వెలుఁగును ప్రథితమ్మై విశ్వమ్మున
అతిసహజమ్మౌ వ్యాప్తుల నఖిలమ్మున నలరారుచు ॥ 3573

†(8) అమర శక్తు లొప్పారఁగ నఖిలమ్మున సంచరించుఁ
జంద్రాఽమృత శక్తి వోలె స్వచ్ఛ శీత ప్రభా కలిత
సర్వలోక జాలా లవి శబ్దశక్తు లొప్పారఁగ
నదమలమ్ముగ వర్తిల్లును జక్రగతి భ్రమణగతుల
నగ్ని దీప్తు లలరారఁగ నమర దివ్య దేవతాళి
అతిరమ్యపుఁ దేజాలను ననవరతముఁ బ్రసరింపఁగ
విభజించుచు వ్యాపించుచు విస్తృతగతి విమలమ్ముగ
ననలాఽనిల దీప్త రతులు నద్భుతగతి వర్తిల్లును ॥ 3574

†(9) బ్రాహ్మీ శక్తి తనరారెడి పరమ నరమ జనిత దీప్తి
ద్వైవీయమ్మై నిరతము తాదాత్మ్యత నొందురీతి
స్వీయ శక్తి వర్ధిల్లఁగ సృష్టి తత్త్వ దృష్టగతుల
అఖిల లోక సర్వస్వము నద్భుతగతిఁ జరియింపఁగఁ
బునఃపునర్భ్రమణ గతులఁ బూర్ణ జీవ దీప్తు లొలయ
స్వయంచలన పీఠస గతి సర్వస్వము తనరారును
సృష్టి శక్తి స్థితి శక్తియుఁ బెంపఁగ లయ మహా శక్తు
లఖిలమ్మున వర్తిల్లును నతిసహజమ్మౌ మూర్తిగ ॥ 3575

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) అనలాఽనిల శక్తులతో నలర నేది ముందొ యెరుఁగ
సహ జన్మ గతమ్మేదొ సాతత్యపు సాపత్యపు
శక్తితత్త్వ మెల్ల జగతి జన్య జనక భావాలను
ఆది అంత మెనయకుండ నదృశ్యపు శక్తులతో
ముం దేదియొ? పిద పేదియొ? మూర్తి రూపు తెలియకుండ
ననంతముగఁ బ్రసరించెడి అద్భుతమౌ కాంతి జాల
మపురూపపు దీప్తులతో నఖిలమ్మున వ్యాపించుచు
ఒకగోళమునుండి మరొక ఉపర్యధోగోళాలకు
అతివేలపు శక్తులతో అతికాంతుల వేగాలను
వెలుఁగులతో వ్యాపించును విమల దీప్తు లొప్పారఁగ ॥ 3576

†(11) మేఘ మాలలు జగతి మిన్నంటి కదలాడు
అనిల శక్తులు మీర ననల శక్తులు మీఱఁ
జాంద్ర సౌరాదుల శక్తి సర్వస్వములు
రజిత గిరి హేమ గిరి రాజిల్ల స్వచ్ఛతల
నతి నిగూఢమ్మైన అపురూప శక్తులను
ఋతశక్తి సృష్టికే ధృతశక్తిగా వెలుఁగఁ
బ్రాణ దీప్తులు వాయు త్రాణ శక్తులు వరల
జీవ శక్తులు పొందు శీఘ్ర చైతన్యాల
సోమాఽమృతపు రతుల ధామమౌ నీ ప్రకృతి
కామితమ్ముల సృష్టి గాఢమ్ముగా నిలుపు ॥ 3577

†—అష్టపదకందము॥
రవి చంద్రులు ఋభు గణములు
కవి దివ్య సుదేవతాఽఽళిఁ గ్రాలెడి విప్రల్
అవితథమౌ నవ్య రతులఁ
బ్రవిమలమౌ రజిత మేరు పర్వతములు భా
ర విలసితమై రహిత గతి
నవనీతము భాతి సృష్టి నవ గో తతిగా
జవ సత్త్వము లొప్పారఁగ
నపరళ రతిఁ దిరుగు నిత్య మద్భుత గతులన్ ॥ 3578

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—109

ఋషిః—జుహూర్బ్రహ్మజాయా, బ్రహ్మా ఊర్ధ్వనాభో వా
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్; 6-7-అనుష్టుప్

(1) తేఽవదన్ ప్రథమా బ్రహ్మకిల్బిషే ఽకూపారః[1] సలిలో మాతరిశ్వా ।
వీళుహరాస్తప[2] ఉగ్రో మయోభూరాపో దేవీః ప్రథమజా[3] ఋతేన ॥ 1269

(2) సోమో రాజా ప్రథమో బ్రహ్మజాయాం పునః ప్రాయచ్ఛదహృణీయమానః ।
అన్వర్తితా వరుణో మిత్ర[4] ఆసీదగ్నిర్హోతా హస్తగృహ్యా నినాయ ॥ 1270

(3) హస్తేనైవ గ్రాహ్య[5] ఆధిరస్యా బ్రహ్మజాయేయమితి చేదవోచన్ ।
న దూతాయ ప్రహ్యే తస్థ[6] ఏషా తథా రాష్ట్రం గుపితం క్షత్రియస్య ॥ 1271

(4) దేవా[7] ఏతస్యామవదన్త పూర్వే సప్త[8]ఋషయస్తపసే యే నిషేదుః ।
భీమా జాయా బ్రాహ్మణస్యోపనీతా దుర్ధాం దధాతి పరమే వ్యోమన్ ॥ 1272

(5) బ్రహ్మచారీ చరతి వేవిషద్విషః స దేవానాం భవత్యేకమఙ్గమ్ ।
తేన జాయామన్వవిన్దద్బృహస్పతిః సోమేన నీతాం జుహ్వం న దేవాః ॥ 1273

---

1. కూపరః, 2. తపఽఉగ్రో, 3. ప్రథమజాఽఋతేన, 4. మిత్రఽఆసీదగ్నిః, 5. గ్రాహ్యఽఆధిరస్యాః,
6. తస్థఽఏషా, 7. దేవాఽఏతస్యాం, 8. సప్తఽఋష. (వా.ప్ర.)

(6) పునర్వై దేవా[2] అదదుః పునర్మనుష్యా[2] ఉత ।
రాజానః సత్యం కృణ్వానా బ్రహ్మజాయాం పునర్దదుః ॥ 1274

(7) పునర్దాయ బ్రహ్మజాయాం కృత్వీ దేవైర్నికిల్బిషమ్ ।
ఊర్జం పృథివ్యా భక్త్వాయోరుగాయముపాసతే ॥ 1275

## సూక్తము—109

ఋషి—జుహూ యను బ్రహ్మవాదిని లేక బ్రహ్మపుత్రుఁడు ఊర్ధ్వనాభ†‡
దేవత—విశ్వే దేవతలు‡

(1) ఉగద్యము॥
ముఖ్యదేవత లెల్లరు జుహూ దౌర్భాగ్యరూప మగు బృహస్పతి పాపము విషయమై యిట్లనిరి.
"మహాగతి గల ఆదిత్యుఁడు, వరుణుఁడు, వాయువు, తాపనముచే నుగ్రుఁ డగు నగ్ని,
సుఖదాయిత యగు సోముఁడు, బ్రాహ్మణోత్పాదిత లగు దేవతలు, సుపాయమును
పరికించి యామెకుఁ బ్రాయశ్చిత్తము గావించిరి ॥ 3579

(2) ఆ.గీ॥ సురల ముఖ్యుండైన సోముఁ డనెడి[1] రాజు
కల్మషాపహరణ కారణమున
లజ్జఁ బొందకుండ బలిలాంగి నా బృహ
స్పతికి నొసఁగియుండె మతిఁ దలంచి ॥ 3580

ఆ.గీ॥ హోతృ మిత్రులు మఱియు సంపూత వరుణ
దేవుఁడును సోము కృత్యంబు హేతు మని
పలికియుండిరి పిమ్మటఁ బావనాగ్ని
యామె గ్రహియించ యా ఋషి కంపఁజేసె ॥ 3581

---

1. దేవాఽఅదదుః, 2. మనుష్యాఽఉత. (వ్రా.ప్ర.)

† ఈ సందర్భమున నొక యితిహాసము గలదు. జుహూ యను నొక్క బ్రహ్మణ జాయ. బృహస్పతి వాచస్పతి యగుటచే నతనికి జుహూ యను నామె భార్య యయ్యెను. ఒకప్పుడు వీని కిల్బిషము భార్యా దౌర్భాగ్య రూపమున నుండెను. కాఁబట్టి బృహస్పతి యామెను బరిత్యజించెను. పిమ్మట నాదిత్యాది దేవతలు విచారించి యామెను పాపరహితగ నొనర్చి తిరుగ బృహస్పతికి నొసంగిరి. ఈ కథ యీ సందర్భమున వర్ణింపఁబడెను.

‡ ఈ సూక్తమునకు వ్రాతప్రతి రెండవ పుటలో ఋషి "జుహూ యను బ్రహ్మవాదిని"గను, దేవత "విశ్వే దేవతలు"గను వ్రాసి, 156 సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "జుహూఁడు" ఋషిగాను "విశ్వే దేవతలు"దేవత గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

1. సోముఁడనే రాజు. (వ్రా.ప్ర.పా.)

(3)*గీ॥ ఓ బృహస్పతి! ఋషిపతి! యోపి యామె
దేహము స్వహస్త లభ్యమై తేజరిల్లు
పరము దీనిని దేవతల్ బ్రహ్మ జాయ
యని వచించిరి సుర లెల్ల రతని గాంచి ॥ 3582

*గీ॥ క్షత్రియ సురక్షితంబైన సకల రాజ్య
మెట్టు శత్రుప్రు దృష్టిని బట్టకుండు
నట్టె దౌర్భాగ్యయుక్తత నా సుకాంత
స్వాత్మఁ బ్రకటింపకుండెను సరస గతిని ॥ 3583

(4)*గీ॥ అతిచిరంతన ఋషు లెల్ల సట్టి కాంత
పాప రహిత యటంచును బలికినారు
సప్త సంఖ్యాక ఋషులు విస్తార తపముఁ
జేయఁ గూర్చుండియున్నారు చిత్త మలర ॥ 3584

*గీ॥ శత్రు రూప పాప సంఘంబునకు భీతిఁ
గొలుపు జాయ నొసఁగి లలిత ఋషికి
వెలిఁగినారు తపము వ్రేల్మిడి దుర్ధాన[1]
నైన నుంచఁగలుఁగు నతిశయముగ ॥ 3585

(5)*గీ॥ అతఁడు బ్రహ్మచారి యగుచు నంతటఁబోవు
చుంట నిష్టులందు నోలి సురల
స్తుతులతోడ హవ్యతతితోడ నతిభక్తి
బొందుచుండె మిగుల నంద మొప్ప ॥ 3586

*గీ॥ తలఁప గంధర్వుఁ డెట్టులు వెలుఁగు సోమ
నీతయౌ కన్య గ్రహియించె పూతుఁడైన
యల బృహస్పతి యట్టులే యాదరమున
జుహువు గ్రహియించె జాయగా సురలు మెచ్చ ॥ 3587

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి

1. వ్రాతప్రతి 14వ సంపుటము 87వ పుటలో నీ పద్యమున "దుర్ధాన" అను శబ్దమునకు సున్నా చుట్టఁబడి ప్రశ్నార్థకము వ్రాయఁబడియున్నది.

(6) *గీ॥ అల బృహస్పతి కిడినార లతని భార్య
సురలు మనుజు లొసంగిరి పరమ దేవ
మనుజ కృతమైన దానము ఘన మటంచు
వెల్లడించిరి రాజులు వేట్కు మీర ॥ 3588

(7) *గీ॥ ప్రబల కిల్మిషమును గొట్టి బ్రహ్మ జాయ
బ్రహ్మ కొసఁగిరి దేవతా వర్గ మెల్ల
నల బృహస్పతికిం బెందు యజ్ఞ కర్మ
హవ్యయుతులయి సేవించి రతిశయముగ ॥ 3589

## సూక్తము—109

ఋషి—జుహువను బ్రహ్మవాదిని లేక బ్రహ్మపుత్రుఁడు ఊర్ధ్వనాభ
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—1

†(1) సత్య రూపమై వెలిఁగెడి సర్వ శక్తి సచ్ఛక్తియె
"పూర్వ దుర్గతి నాశని"గ నపూర్వ గతుల శక్తి చూపు
సాధారణ పాపముల నసాధారణ కిల్మిషాల
బ్రహ్మ కిల్మిషమ్ము నైన వరల నాశనమ్ము చేయు
నతిసూక్ష్మమ్మై తనరెడి నాదిత్యపు దీప్తులతో
ననలాలను ననిలాలను నఖిల సలిల మృత్తతులను
నాకాశములందు నమరు సంతరాంతర పాపాళుల
నుగ్రమైన దీప్తులమై నుద్వాసన చెప్పి చంపు ॥ 3590

†(2) బ్రహ్మ జాయగా వెలిఁగెడి వచశ్శక్తి కున్న మహా
పాప పుంజ రూపాలను భ్రష్టపరచి నాశముగాఁ
బునస్స్వచ్ఛగతు లొప్పఁగఁ బూర్ణ శుద్ధ రతు లొసరఁగఁ
బవిత్రతా గరిమ మీర బ్రహ్మదీప్త రూప మొచుఁ
బరబ్రహ్మ పుణ్య దీప్తి బ్రహ్మలకే బ్రహ్మ కాఁగ
నంతర్గత శక్తులతో అనల రూప దీప్త మొచు
వరుణ మిత్ర భారరతులఁ బంచ భూత తత్త్వాలను
బవిత్రితల నిల్పుచుండుఁ బాప రూప భావములను
నామరూప నాశనముల నఖిలమ్మును విధ్వస్తము
పూర్ణమ్ముగఁ గావించును "పూర్వదుర్గతీ నాశని" ॥ 3591

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(3) హసన విద్యుల్లాసగతుల నానందపు రూపముగా
సఖిలమ్మున వ్యాపించెడి ఆ పుణ్యప్రద శక్తులు
"పూర్వదుర్గతీ నాశని" పూర్వక్రమములుగా వరలుచు
నంతరహిత సద్గతి శక్తి కాధారముగా నిలుచుచుఁ
బుణ్యమునకు బీజముగాఁ బొలుపొందెడు పురాదిగా
జ్ఞాన రూప దీపమునకు సకల బ్రహ్మ తేజమునకుఁ
గ్రొన్నిరగ జాయ గాఁగఁ గెరలు పాప పీడ కాఁగ
నిలుచు దుర్గతిన్ జగతిని నిర్ధూమపు ధామముగా
నొనరించుచు సద్గతిరతి నుత్తమోత్తమాగ్ని శక్తి
నుత్తమోత్తమానిలాల దీప్త చిత్తత్వపుఁ బుణ్యశక్తి
గు వ్రతరూప రాష్ట్ర మౌచు సూధ మిత్ర శక్తి కాఁగ
విశ్వశాంతిదూత కాఁగ విమల పుణ్య శక్తి వరలు ॥ 3592

(4)*క॥ ఋషి శక్తులు మృష రహితపుఁ
దృషా విమార విష విషయ తిమిర వినాశా
విష విరహిత పుణ్య ప్రద
ఋషాఽమృత మహా సుదివ్య ఋత రూపములో ॥ 3593

*— సప్త ఋషి రూపాల సప్తాగ్ని సప్త జల
సప్తాఽనిలాకాశ సప్త పృథ్వుల శక్తి
సత్ రూప సచ్ఛక్తి సప్త ఋత రూపమై
అత్యంత పక్ష గతి గమరూప ధీమరతి
బ్రహ్మోపనీతమై వరదు దివ శక్తులన్
దివ్య దేవాస్పద దీధితులఁ దనరారు ॥ 3594

(5) అస్ఖలితమ్మైనయట్టి అస్ఖరూపపు బ్రహ్మచర్య
దివ్యతత్త్వ స్వచ్ఛ వీర్య దేవైశ్వర్యముగా నిత్యము
దేవతలకె దేవలగా దీప్తికై రాఽంగముగా
సోమ శక్తి వర్ధిల్లుచు సుగతి పుణ్య రూప మ్మది
పతిదేవుల పతి కాఁగన్ బరమార్థాంగిత్వ మలరు
సవినాభావంపు శక్తి అమృతావహము గాఁగ
విష రూపపుఁ బాప శక్తి విధ్వస్తము గావించును
దేవ దేవ దివ్య శక్తిఁ దేజరిల్లును సచ్ఛక్తులు ॥ 3595

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూరి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) ప్రాభవమౌ పుణ్యశక్తి ప్రకృతి పురుష శక్తు లెల్లఁ
బునర్జన్మ లొందుచుండుఁ బూర్ణశక్తి రతుల మెయిని
మానవాళి రాక్షసాళి మహిత దివ్య దేవతాళి
బ్రహ్మశక్తి శబ్దశక్తి వరలు నామ రూప మౌచు
అధిపత్య రూపమైన నఖిల సత్య దీప మౌచు
అపురూపమ్మై నిలుచును అసాధారణంపు రతులఁ
జక్రనేమి క్రమము కాఁగఁ జర్వితచర్వణ మట్లు
సృష్టి స్థితి లయ రూపాల్ చెలఁగుచుండెఁ నిత్యమ్మును ॥ 3596

†(7) దివ్యమైన దేవశక్తి తేజరిల్లఁగ సృష్టిలోనఁ
గల్మష రాహిత్యమ్మునఁ గెరలు శబ్ద శక్తు లెల్ల
బ్రాహ్మ్యములై వెలుఁగొందుచు వరలు జాయ ఛాయ లౌచు
నిత్యోపాసన కాఁగను సత్యోపాసన కాఁగను
నత్యంత విశిష్టమైన యపురూపపు శక్తులతో
నలరారుచు బృథివీత్వపు టమలనమౌ దీప్తులమై
నుత్పన్నమ్మై నిలుచును నుద్దిష్టమ్మై పెరుగును
సృష్టి స్థితి ప్రతికృతిగాఁ ఉద్వేలానుగతి తోపఁగ ॥ 3597

## సూక్తము—109

ఋషి—జుహూవను బ్రహ్మవాదిని లేక బ్రహ్మపుత్రుఁడు ఊర్ధ్వనాభ
దేవత—విశ్వేదేవతలు

## అర్థాంతరము—2

†(1) పంచభూత రూపాలను సంచితమై కల్మషమ్ము
అనలమ్మై సలిలమ్మై అనిలమ్మై ఆకసమై
పృథ్వీరూపమై పెరుగును విశ్వసృష్టి శక్తి గతుల
పడుగును పేకై నిలుచుచు వరలు ఛాయగా జాయగ
విష్ణుదేవు మాయ కాఁగఁ గృష్ణ శక్తి లీల కాఁగ
బ్రాహ్మణమ్మై కల్మషమ్ము వరలు సృష్టి సర్వమ్మున
సత్యశక్తి వర్ధిల్లఁగ సదమలమౌ నిత్య దీప్తిఁ
"బూర్వదుర్గతినాశని" బోఁ దోలును పాపములఁ
దౌలి శక్తిగ వెలుఁగొందుచు నలవి మాలినట్టి దీప్తి
నమేయమౌ బ్రహ్మశక్తి కాద్యమ్మై పవిత్రితల ॥ 3598

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) అనలాఽఽకృతులు ననిలాఽఽకృతులు నలరు సలిల పృథ్వ్యాకృతులు
నాకాశాకృతుల నన్నిట నమరు పాప పంకిలమును
సోమశక్తి శబ్దశక్తి శుద్ధముగాఁ గడిగివేయు
వరుణ మిత్ర శక్తు లొప్ప వర్ధిల్లెడి విశ్వమ్మున
నఖిల పంచ భూతాకృతులై అమల హోతలై తనరుచు
నమరంగా బ్రాహ్మీశక్తి అమలజాయఁగా వెలుగుచుఁ
బాపరహితగా స్వచ్ఛత వర్ధిల్లుచుఁ బుణ్యరతుల
బ్రహ్మ మహాముఖగతమైఁ బరమపవిత్రత తనరుచు
దివ్యమైన దేవశక్తి తేజరిలెడి శబ్దశక్తి
కిల్బిష హారకమై జగతిని గెరలును సద్గతి గతియై ॥ 3599

†(3) ఆ శ్రీమహావిష్ణు ననుగ్రహము మీరంగా
నాదిశేషు మహాశక్తు లపురూపపు శబ్దగతులు
బ్రాహ్మ్య గతమై వరలెడి పాపరూప శక్తితతుల
విధ్వస్తము కావించును విమల దీప్తి వెల్లివిరియ
సృష్టి సంరక్షకమై వెలుఁగును స్థితి శక్తి వరల
క్షాత్రరూపమై వెలుఁగు మిత్ర దౌత్య దీప్త రూప
రహస్యాల రాష్ట్రమ్మై బ్రహ్మతేజ మలరారఁగ
జాయా గతి ప్రకటితమై శర్వ శబ్ద శక్తు లలర
శత్రు నాశక మ్మౌచును సర్వ సృష్టి రూపాలను
నిత్య వ్యాపకత్వ మొప్ప నిర్మలమై తనరారును ॥ 3600

†(4) సప్త పృథ్వులె ఋషులై సప్త సలిలముల్ ఋషులై
సప్తాఽనలములు ఋషులై సప్తాఽనిలములు ఋషులై
సప్త గగనములు ఋషులై సత్యరూప దేవతలై
సృష్టి తొలుతఁ బ్రభవించుచు వ్యష్టి సమిష్టిగతులు మీఱ
నిష్టాపూర్తమ్ము కాఁగ నెల్ల కిల్బిషములఁ ద్రుంచి
అతిభయకరమౌ దుష్టత నలవోకగఁ జంపివైచి
సత్య నిత్యమై వరలెడి సత్త్వ శక్తి బ్రాహ్మ్యమ్మై
సకల విశ్వ రూప మౌచు జగతి ధారణంపుగతుల
సృష్టి స్థితి లయ రతులను వెలుఁగ సదా విశ్వమ్మది
శబ్ద నిశ్శబ్దశక్తు లబ్ధములౌఁ గామరతుల ॥ 3601

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) ఏకైకాఽంగమ్మొచును సృష్టి నెల్లఁ జెల్వొందెడి
దైవీయమ్మొ రూపము తనరారును దివ్యగతుల
సోమాఽమృత పూర్ణశక్తి నీమముగా స్రవియింపఁగ
బ్రహ్మచర్య బ్రాహ్మ్య శక్తి వర విభాశిఁ దుంచివైవఁ
బాపరూపమైన తిమిర భాజకమౌ నీడ పీడ
నశియింపఁగ దైవశక్తి నానా దిశలను వరలఁగ
బృహస్పతిగ మేధాగతి విస్తరిలఁగ విశ్వమ్మున
శబ్దశక్తు లొప్పారఁగ సదమలమౌ బహు రూపులఁ
బంచభూత తత్త్వాలను వరలు శుద్ధగతులు మీఱ
సంచితమై దోషతతులఁ దుంచివైచు నిత్యమ్మును ॥ 3602

†(6) పునర్జన్మతో సృష్టియె పొలుపొందుచునుండు సదా
మానవాళి మరల పుట్టు మహిత దేవతాళి పుట్టుఁ
బునర్జన్మ మొప్పారఁగఁ బూర్ణ గతుల రవిచంద్రులు
లోకాదులు బ్రహ్మజమౌ లోలుపత్వ మెనయ సృష్టి
సదసత్తులు బ్రహ్మ కాఁగ జాయ కాఁగ జగతిలోన
సృష్టి స్థితి లయగతులను జెలఁగుచుండు నిత్యమ్మును
సత్య శక్తితో విశ్వము సదా సంచరించుచుండ
సత్యమ్మే నిశ్చయమై సత్యమ్మే కాలమ్మై
సత్యమ్మే బ్రహ్మమ్మై సత్యమ్మే పునర్జన్మ
గతిగాఁగఁ జరాచరాలఁ గ్రాలును నిత్యత్వ మెనయ ॥ 3603

7)†అష్టపదకందము ॥

సత్తుకు నీడగ నిత్య మ
సత్తై తగు పాప పంక జాలము పోవున్
మిత్తి రహిత దైవీయప్ర
వృత్తిమయ నిత్య శక్తి యుక్తాఽన్వితమై
మృత్తులు సలిలము లనల మ
రుత్తతు లాకాశములును రూఢములై ఆ
వృత్తులుగఁ స్రష్ట లీలగ
సత్త్వమునకుఁ దావలమై సత్త్వాఽన్వితమౌ ॥ 3604

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—110

ఋషిః—జమదగ్నిర్భార్గవః, జామదగ్న్యో రామో వా
దేవతా—ఆప్రీసూక్తం (1-ఇధ్మః సమిద్ధోఽగ్నిర్వా; 2-తనూనపాత్;
3-ఇళః; 4-బర్హిః; 5-దేవీర్ద్వారః; 6-ఉషాసానక్తా; 7-దైవ్యా హోతారా ప్రచేతసౌ;
8-తిస్రో దేవ్యః సరస్వతీళాభారత్యః; 9-త్వష్టా; 10-వనస్పతిః; 11-స్వాహాకృతయః.)
ఛందః—త్రిష్టుప్

(1) సమిద్ధో[1] అద్య మనుషో దురోణే దేవో దేవాన్ యజసి జాతవేదః ।
ఆ చ వహ మిత్రమహశ్చికిత్వాన్ త్వం దూతః కవిరసి ప్రచేతాః ॥ 1276

(2) తనూనపాత్ పథ[2] ఋతస్య యానాన్ మధ్వా సమఞ్జన్త్స్వదయా సుజిహ్వ ।
మన్మాని ధీభిరుత యజ్ఞమృన్ధన్ దేవత్రా చ కృణుహ్యధ్వరం నః ॥ 1277

(3) ఆజుహ్వాన[3] ఈడ్యో వన్ద్యశ్చా ఽఽ యాహ్యగ్నే వసుభిః సజోషాః ।
త్వం దేవానామసి యహ్వ హోతా స[4] ఏనాన్ యక్షీషితో యజీయాన్ ॥ 1278

(4) ప్రాచీనం బర్హిః ప్రదిశా పృథివ్యా వస్తోరస్యా వృజ్యతే[5] అగ్రే అహ్నామ్ ।
వ్యు ప్రథతే వితరం వరీయో దేవేభ్యో[6] అదితయే స్యోనమ్ ॥ 1279

(5) వ్యచస్వతీరుర్వియా వి శ్రయన్తాం పతిభ్యో న జనయః శుమ్భమానాః ।
దేవీర్ద్వారో బృహతీర్విశ్వమిన్వా దేవేభ్యో భవత సుప్రాయణాః ॥ 1280

---

1. సమిద్ధోఽఅద్య, 2. పథఽఋతస్య, 3. జుహ్వానఽఈడ్యో, 4. హోతా సఽఏనాన్,
5. వృజ్యతేఽఅగ్రేఽఅహ్నామ్, 6- దేవేభ్యోఽఅదితయే. (ప్రా.ప్ర.)

(6) ఆ సుష్వయన్తీ యజతే[1] ఉపాకే ఉషాసానక్తా సదతాం ని యోనౌ ।
దివ్యే యోషణే బృహతీ సురుక్మే[2] అధి శ్రియం శుక్రపిశం దధానే ॥ 1281

(7) దైవ్యా హోతారా ప్రథమా సువాచా మిమానా యజ్ఞం మనుషో యజధ్యై ।
ప్రచో[3]దయన్తా విదథేషు కారూ ప్రాచీనం జ్యోతిః ప్రదిశా దిశన్తా ॥ 1282

(8) ఆ నో యజ్ఞం భారతీ తూయమేత్విళా మనుష్వదిహ చేతయన్తీ ।
తిస్రో దేవీర్బర్హిరేదం స్యోనం సరస్వతీ స్వపసః సదన్తు ॥ 1283

(9) య[4] ఇమే ద్యావాపృథివీ జనిత్రీ రూపైరపింశద్భువనాని విశ్వా ।
తమద్య హోతరిషితో యజీయాన్ దేవం త్వష్టారమిహ యక్షి విద్వాన్ ॥ 1284

(10) ఉపావసృజ త్మన్యా సమఞ్జన్ దేవానాం పాథ[5] ఋతుథా హవీంషి ।
వనస్పతిః శమితా దేవో[6] అగ్నిః స్వదన్తు హవ్యం మధునా ఘృతేన ॥ 1285

(11) సద్యో జాతో వ్యమిమీత యజ్ఞమగ్నిర్దేవానామభవత్ పురోగాః ।
అస్య హోతుః ప్రదిశ్యృతస్య వాచి స్వాహాకృతం హవిరదన్తు దేవాః ॥ 1286

---

1. యజతేఽఉపాకేఽఉషాసా, 2. సురుక్మేఽఅధిశ్రియం, 3. ప్రచోదయన్తా, 4. యఽఇమే,
5. పాథఽఋతుథా, 6. దేవోఽఅగ్నిః. (ప్రా.ప్ర.)

## సూక్తము—110

ఋషి—భార్గవుఁడైన జమదగ్ని లేక వానిపుత్రుఁడు రాముఁడు†
దేవత—అప్రిసులు†(1-ఇధ్ముఁడు, సమిద్ధుఁడైన అగ్ని, 2-తనూనపాత్తు, 3-ఇళ,
4-బర్హి, 5-దేవీర్ద్వారము, 6-ఉష, 7-ప్రచేతసులు, 8- సరస్వతి, ఇళ,
భారతులు, 9-త్వష్ట, 10-వనస్పతి, 11-స్వాహ)

(1)•గీ॥ సహజ తేజో విరాజిత! జాతవేద!
రక్షితవ్య గృహంబున రాజితుండ
వగుచు నిందాఁది దేవాళి నెల్ల హవ్య
ములను బూజింపుమా! నీవు మోద మలర ॥ 3605

•గీ॥ స్తోతృ పూజల నందుచు స్తోతృ రచిత
నుతుల వినుచుండి సంస్తవమతిని గూడి
యమరులను[1] బిలుచుకొని వచ్చి హవ్య మిషను
[2]వారికిన్[3] హితము గూర్తువు![4]వహ్నె! నీవు ॥ 3606

(2)•గీ॥ ఓ తనూనపాత్త! ఓయి! సుజిహ్వుఁడా!
యోయి! యజ్ఞదేవ! యోయి! యగ్ని!
సుఫల మొసఁగు యజ్ఞ సుహవిస్సులను మధు
రసమువలనఁ బ్రీతి మెసఁగు మీవు! ॥ 3607

•క॥ మనసీయ స్తోత్రంబుల
ఘన బుద్ధులచేత యజ్ఞకలనకు వృద్ధిం
బనిఁబూని చేసి సురలకు
ననలుఁడుగ[5] నద్దాని నెల్ల నందింతువుగా! ॥ 3608

(3)•గీ॥ దేవతాహ్వాతవై యగ్నిదేవ! నీవు
వంద్యుఁడవు![6] మరియు వసు గణ [7]వందనములఁ
బ్రీయమానుండవై సదా[8] ప్రీతి మెఱయ
నిచ్చటకు రమ్ము! మే మెల్ల మెచ్చునటుల ॥ 3609

†వ్రాతప్రతి 14వ సంపుటము ౮౪వ పుటలో నీ సూక్తమునకు ఋషి "జమదగ్నియో వాని పుత్రుడు రాముఁడో" అనియు, దేవత "సమిరాదులు, నరాశంస వర్జితులగు తనూనపాత్తులు"గాను వ్రాసి, 1౬౬ సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో "జమదగ్ని లేక రాముఁడు" ఋషిగాను, "అప్రిసులు" దేవతగాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నిందగణమునకు మారు "నలల"ము ప్రయుక్తమైనది. 2. సురలకున్ హితముఁ జేయుఁడు సుకవి వగుచు, (తా.పా.). 3.ఇక్కడ నిందగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది. 4.వలసినంత, (తా.పా.), 5. నొనరఁగనద్దాని,(తా.పా.), 6. ఇక్కడ నిందగణమునకు మారు "నలల"ము ప్రయుక్తమైనది. 7. వంద్యుఁడువుగ, (తా.పా.), 8. నీవు ప్రీతి మెఱయ. (తా.పా.).

*గీ॥ అమరులకు హోత వగుచుంటి వగ్ని దేవ!
యష్టృతరుఁడవు! మరియు నీ వస్మదీయ
మధుర సంప్రార్థనల నెల్ల మదిఁ దలంచి
సురలఁ బూజింపుమా! హవి శోభఁ గూడి ॥ 3610

(4)*గద్యము ॥
ప్రాఙ్ముఖ మగు నే బర్హిస్సు కలదో! యది వేదియొక్క ప్రాగ్దిక్కునఁ బ్రికర్షమంత్రమున స్తుతింపఁబడుచున్నది. అది దేవతలకుఁ బృథ్వికి సుఖకర మగుచున్నది ॥ 3611

(5)*గద్యము ॥
సంభోగ కాలమునఁ బతుల నిమిత్తము శోభమాన లగు స్త్రీ లెట్లాశ్రిత లగుదురో! యట్లు వ్యాప్తిఁ గాంచిన ద్వారదేవతలు విశేషముగ నాశ్రిత లగుదురుగాక! ఓ ద్వార దేవతలారా! మీరు దేవతల నిమిత్తము సువివృతలు కండు! ॥ 3612

(6)*గద్యము ॥
సుగమన లగు నహోరాత్రి దేవత లీ యజ్ఞస్థానమందు నియమమున విశ్రమింతురు. ఆ దేవత లిద్దఱు యోషిత్తుల వలెఁ బ్రీణయిత్రిలు, మహతులు, శోభన దీప్తులునై సుందరశ్రీని ధరించుచున్నారు ॥ 3613

(7)*సీ॥ మనుజ హోతకుఁ దొల్త ఘన యజ్ఞ కర్మయం దొనర నాదిత్యాగ్ను లుందురుగాక!
శోభన స్తోత్రిశ శోభితులై యిష్టి నొనర . దిత్యాగ్ను లుందురుగాక!
నిఖిలంబునకు నిష్టి నిర్మించువారలై యొనర నాదిత్యాగ్ను లుందురుగాక!
నఖిల చోదయితలై[1] నయజ్ఞతలంబున నొనర నాదిత్యాగ్ను లుందురుగాకఁ!
గీ॥ బూర్వదిక్కున జ్యోతి నపూర్వ మార్గ,మునను బెట్టుచు నాదిత్యుఁ డనలుఁడు కడు
హోమ నిష్పాదకులయి తా ముచ్చయజ్ఞ,మందు నివసింతురుగాక! నమందరీవి ॥ 3614

(8)*గీ॥ భారతీదేవి మరి యిళా భాగ్యమతియు
నా సరస్వతి యిష్టికి నరుగఁదెంచి
యమరులకు[2] సుఖముఁ గూర్చెడు యజ్ఞ కర్మలఁ
బొందుదురుగాక! శీఘ్రమే పొలుపు మిగుల ॥ 3615

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఇక్కడ నింద్రగణమునకు మారు "నహ"ము ప్రయుక్తమైనది.
2. ఇక్కడ నింద్రగణమునకు మారు "నలల"ము ప్రయుక్తమైనది.

(9)*గీ॥ విశ్వజనయిత్రులైనట్టి విపుల రోద
సులకు రూపములం గూర్చె నెలమి త్వష్ట
సకల భూత ప్రకాండంబు సరస రూప
యుక్తముగఁ దా నొనర్చుచునుండె నతఁడు ॥ 3616

*గీ॥ హోత! యష్టృతముండవై! ఖ్యాతి మెఱయు
సర్వము నెరుంగుచున్ నీ వఖర్వ రీతిఁ
బ్రార్థితుఁడ వౌచు మాచేత బహు విధములఁ
ద్వష్ట పూజింపఁబడును మా యిష్టియందు ॥ 3617

(10)*గీ॥ యూపమా! స్వాత్మచేతనె యోపి ప్రాప్త
కాలమందున దేవతా గణమునకయి
పశు సురూపాన్నమును మరి పరపు హవ్య
ములను వ్యక్తీకరింపుచుఁ గలుఁగనిమ్ము! ॥ 3618

*గీ॥ అల వనస్పతి శమితయు నగ్నిహోతృఁ
డనెడు ముగ్గురు దేవత లధిక మధుర
మైన ఘృతమున నతిశయ హవ్యములను
దాము భక్షించెదరుగాకఁ దత్క్షణంబ ॥ 3619

(11)*గీ॥ అగ్ని పుట్టినమాత్రాన నాతఁ డీప్తిఁ
బుట్టఁజేయుచున్నాఁడు పూజ్యుఁడైన
యగ్ని దేవతలకుఁ బురోయాయి యగుచుఁ
దాఁ బ్రకాశించుచున్నాఁడు తనివిఁ జెంది ॥ 3620

*గీ॥ హోమ నిష్పాదకుండైన యగ్ని ముఖము
నందు స్వాహాకృతంబైన యమల హవ్య
ములను దేవత లెల్లరు మోద మలరఁ
దాము భక్షించెదరుగాకఁ దనివి సెంద ॥ 3621

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—110

ఋషి—భార్గవుఁడైన జమదగ్ని లేక జమదగ్నిపుత్రుఁడు రాముఁడు

దేవత—ఆప్రీసులు (1-ఇధ్ముఁడు, సమిద్ధుఁడైన అగ్ని, 2-తనూనపాత్తు, 3-ఇళ, 4-బర్హిస్సు, 5-దేవీర్ద్వారములు, 6-ఉష, 7-ప్రచేతసులు, 8-సరస్వతి, ఇళ, భారతులు, 9-త్వష్ట, 10-వనస్పతి, 11-స్వాహ)

### అర్థాంతరము—1

†(1) సృష్టితోనే పుట్టి సృష్టిలోపలఁ బుట్టి
సృష్ట సృష్ట మహత్తర జన్య ప్రకృతి కాఁగ
జాతవేదుని దివ్య జాజ్వల్యమానాగ్ని
కవి మిత్ర శక్తులన్ గ్రాలఁగా విశ్వాన
బహు రూపమై మహా ప్రాభవ మ్మొప్పంగ
అతి ప్రకృష్టమ్మైన అమృత చిత్తాన
మను శక్తి విశ్వాన మర్మ దీప్తులతోడ
దివ్య దేవాళికై దేవాళి యజ్ఞముల్
నిత్యమ్ము నొనరించు నిర్మల దౌత్యాన
నసలాఁడసిలి శక్తు లపురూపగతి వెలయ ॥ 3622

(2)†క॥ ఋత శక్తుల కృతి ధృతిమైఁ
బ్రీతిగా మానుష సమిద్ధ వరదేవ రతిన్
సతతము యజ్ఞాళులమై
నతులితముగ దేవ సంఘ మర్చించుసుతేఁ ॥ 3623

†ఉ॥ మిత్రుని దివ్య శక్తు లనుమేయ విశాల సువిశ్వమండు వై
చిత్రిత మీఱఁగా జగతి జీవిక యానముగా సమంజ తే
జ త్రితయ ప్రదీప్తమయ ఛన్న సుప్రాకృత దివ్యశక్తి సత్
పాత్రిత జాతవేద గతి భాసుర మౌను మనస్సపారమై ॥ 3624

†(3) అగ్నిదీప్త శక్తులతో నఖిల విశ్వయజ్ఞాలను
నష్టవసు సుసంపదాళు లపురూపపు దీప్తులతో
నుత్పన్నమ్మై వెలుఁగును నుపమానము లేని విలువఁ
బ్రకృతిరూప సంపదాళు లకృతములై సాజములై
అమానుషంపు టదైవేయ యజ్ఞ సృష్టి భాగ్యముగా
వర్ధిల్లుచు నైశ్వర్యపు మూర్ధములై మూలములై
రామ రూప యక్షగతుల భా మహిమపు గతి వరలఁగ
నంతరాంతర గతులు మీఱ నసాధారణ స్థితి నొప్పును ॥ 3625

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4)†క॥ మృచ్ఛక్తికిఁ బ్రాగ్దిశలో
స్వచ్ఛతమై నగ్ని వరలు జాజ్వల్య రతిన్
ఆచ్ఛాదన విహితమ్మై
స్వేచ్ఛాగతి సహిత రహిత విస్తృత శక్తిన్ ॥ 3626

†క॥ అతిలోకపు దీప్తి మహిమ
నతులితమై సృష్టి వెలయ ననలాఽనిల మృత్
తతి జల గగన విహితమై
ప్రతిలేని సురూప గతుల భాసిలుఁ బ్రకృతుల్ ॥ 3627

(5)†ఉ॥ ప్రాకృతమైన విశ్వ సముపాసిత దివ్య మహత్వ తత్త్వమై
నాక విరాజితోజ్జ్వల వియద్గత లోకములన్ మహా గతిన్
బ్రకటమైన పూరుష విభాసిత శక్తిని నావృతమ్ముగా
లోకములే మహా ప్రకృతి రూపగ మాతగ నొప్పుచుండులే!
వీఁకను సృష్టి మాతగ సువిస్తృత సంతతి కాఁగ దీప్తమై
చీకటులే విదూరమయి చేతము వెల్గఁగ నగ్ని శక్తులన్
వైకృత మాతృ పుత్ర రతి భావితమై యతిలోక రూపులన్
ఛేకము కాఁగ సృష్టి లయి చిన్మయ మాచను శక్తు లొప్పెడున్ ॥ 3628

†(6) దివ్యమైన దేవశక్తి తేజరిలఁగ విశ్వమ్ము నఁ
గాల భాగ రూపమైన క్రాలు పగలు రాత్రి లోచు
వేల తెనయనట్టి రీతి వివిధ పరిధు లొప్ప నలరి
నిత్య చలన గతులఁ దనర సత్యశక్తి రూప మౌచుఁ
పంచ భూత లోకాలను సంచితముగ వరలుచుండు
వేవెలుఁగుల వెలుఁగులతో నిరిసి మసురుకొను తిమిర
పుంజాలను విశ్వమ్మది పూర్ణ ప్రాశితములుగాఁగ
నిశ్చలరతి చలనగతుల నిరతమ్మును బర్వు లిడును ॥ 3629

(7)†అష్టపదకందము ॥
ఆదిత్య శక్తి సృష్టులు
ప్రాదిగ సంభవము లొందుఁ బలు విధములుగా
నాదియు నంతముగఁ బెరుగు
బాధితము నబాధిత గతిఁ బ్రాక్పశ్చిమతన్

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

వేదిత మగు నుదయాఽస్తమ
యాదులఁ గర్మ మ్మకర్మ మతుల గతులమై
నేదుచు విశ్వము నిత్యము
ప్రాదుర్భావమ్ము నొందు వరలు లయ రతిన్ ॥ 3630

†(8) అనల సలిల శక్తులతో ననిల పృథ్వి గగనా లవి
అన్యోన్యపు టవినాభావాఽద్భుత సమ్మేళనాల
నఖిల సృష్టి వర్తిల్లును నతిశక్తుల వర్ధిల్లును
భూత భావి వర్తమాన భవ్య కాల గతుల నొప్ప
వేసవి వానా కాలము లా శీతా కాలమ్మును
నంచితమౌ చలనాలను ననుస్యూత గతి మీఱఁగ
ననంతముగ వర్తించును నవికలనపు శక్తులతోఁ
బ్రకృతి మాత లీల కాఁగ వరలు పురుష హేల కాఁగ ॥ 3631

†(9) విశ్వ సృష్టి మాత గాఁగ విమలశక్తి పితరుఁడుగాఁ
జరాఽచర ప్రపంచమ్ము నిరాటంక గతు లొప్పఁగ
సృష్టి స్థితి లయ రతులను వ్యష్టి సమిష్టి గతు లొప్పఁగ
దివ్య దేవ దేవు లీల రేజరిలఁగ నిత్యమ్మును
అహరహమును బహు రూపుల నిహ పరముల నన్నింటను
గాల బద్ధమై కదలుచుఁ గ్రాలు పంచ భూతాళుల
ననంతమైన రూపాలను నన్యోఽన్యాఽవినాభావాల
ననురూపపు రతులతో నననురూప గతులతో
నఖిలమ్మును నలరుచుండు నిఖిల రూప రూపాలను
సృష్ట సుకృతమై వఠలెడె సృష్టియే సుయజ్ఞమౌను ॥ 3632

†(10) సృష్టి స్థితి లయ శక్తులఁ జెలఁగు విశ్వరూపుండే
రూప మంది అంతర్గతి దీపముగాఁ దనరారును
బుట్టి పెరిగి అంతరించు నిట్టి ట్టనరాని గతుల
నంతర్హిత మౌను సృష్టి నన్యోఽన్యాఽఽనంద రతుల
నద్భుత ప్రకృతిగఁ దనరును నపురూపముగా వెలుఁగును
నంతరహిత చక్రనేమి ధ్వాంతగతుల ధర్మ మొప్ప
దివ్య దేవ ధర్మమ్ముగ నవ్య నిత్య కర్మమ్ముగ
వ్యయమౌ గతి వరలు నవ్యయమౌ ప్రాకృత గతి ॥ 3633

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) అగ్ని ముఖముగా సృష్టియె అఖిలమునకు యజ్ఞమౌను
ఆ సర్వేశుని లీలగ సంతయు నావిర్భవింప
దేవ దేవు కృత్యమ్ముగ భావ దేవు సత్యమ్ముగఁ
బ్రకృతి రూపమై వరలుచుఁ బ్రాకృతరతి పరఁగంగా
సుకృతి గతుల వికృతి గతుల నకృతములుగఁ గృతములుగా
నిత్య గతులఁ బుట్టుచుండు ననిత్య రతులఁ బెరిగి విరుగు
సర్వ కాల గతుల జరుగు సకల విశ్వరూప మద్ది
ఋత శక్తుల బింబమ్మై కృత శక్తుల ప్రతిబింబత ॥ 3634

## సూక్తము—110

ఋషి—భార్గవుఁడైన జమదగ్ని లేక జమదగ్ని పుత్రుఁడు రాముఁడు
దేవత—ఆప్రీసులు (1-ఇధ్ముఁడు, సమిద్ధుఁడైన అగ్ని, 2-తనూనపాత్తు, 3-ఇళ, 4-బర్హిస్సు, 5-దేవీర్ద్వారము, 6-ఉష, 7-ప్రచేతసులు. 8-సరస్వతి, ఇళ, భారతులు, 9-త్వష్ట, 10-వనస్పతి, 11-స్వాహా)

## అర్థాంతరము—2

(1)†అష్టపదకందము ॥
దేవాళి దేవతలకై
నేవమ్ముగ సృష్టి యజ్ఞ నిత్య సుకర్మన్
భావిత మిత్ర విశారద
ధీ విలసిత బ్రహ్మశక్తి దీధితి తనరున్
వావిరి మానుష వసతుల
జీవికలై ప్రకృతి ప్రాణ చేతన గతులన్
వే విధమౌ సృష్టి స్థితి
దేవాజ్ఞల విలయ కలిత దివ్యజ్ఞమ్మౌ ॥ 3635

(2)†అష్టపదకందము ॥
జ్వాలల జిహ్వలు ఋత గతిఁ
గీలలుగా సూక్ష్మ సూక్ష్మ కృత మహితాగ్నుల్
వేల లెనయకుండ జగతి
లీలగ వ్యాపించు నంతరీక్షాల శక్తిన్
జ్వాలితమై వివిధ విధి
త్రాళులఁ జిత్రాతిచిత్ర రాజిత వర్ణో
జ్వాలితమై సృష్టికిఁ బద
మాలమ్మౌ నంతరాంతరాఽన్విత గతులన్ ॥ 3636

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(3) †క॥ అగ్ని ముఖమ్మై విశ్వము
భగ్నత లేకుండ నిత్య భ్రాజిత శక్తిన్
రుగ్ణతగాఁగ నరుగ్ణో
న్మగ్నత కృతి సృష్టి సత్య మహితత్వమునన్ ॥ 3637

†క॥ విజ్ఞానముగా సర్వము
సుజ్ఞాన ప్రకట తత్త్వ సూనృత శక్తిన్
బ్రాజ్ఞతమై జగతి మహా
ప్రజ్ఞ భరిత పూర్ణ దీప్త భాసుర మౌలేః ॥ 3638

(4) †అష్టపదకందము ॥
ఉదయమ్మై ప్రాగ్దిశలో
నదవద లేనట్టి దీప్త యజ్ఞాఽన్వితమై
ముదితమ్మై ప్రకృతి మహిత
పదము సుసృష్టి స్థితి గతి భాగ్యము లలరన్
సదమలమై లయ గతులను
విదిత చరిత చక్ర క్రమత విపుల వసు రతిన్
ఒదిలమ్మై సుదివ తతుల
సదనమ్మై విశ్వ మెల్లఁ జరియించునులేః ॥ 3639

(5) †అష్టపదకందము ॥
వ్యాప్తిత్వము వరలంగా
దీప్త గతుల సృష్టి యెల్లఁ దేజరిలు సదా
సప్తాఽనల సప్తాఽనిల
సప్త సలిల పృథ్వి గగన సప్తాఽఽవృతమై
ప్రాప్తి ప్రాకామ్య మహిత
సుప్తమ్మై చేతన గతి సూనృత రతి ని
క్షిప్తమ్మై ప్రాణ భరిత
గుప్తత నొప్పారు జగతి గుణకలితమ్మై ॥ 3640

(6) †అష్టపదకందము ॥
దిన రాత్రులు విశ్వమున్మన
ననవరతము సృష్టి జనన యజ్ఞ సుశక్తుల్
కని విని మెరుఁగని రీతుల
ననునిత్యము జనిత మౌను నద్భుత గతిమై

† రచయిత:—వాఙ్మయ మహర్షి, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ఘనముగ నగణితమౌ విధి
వినిమయ ప్రకృతి పదగుణ వివిధ వి స్తృతిమై
రణిత కృతుల విశ్వమ్మది
అణువణువును నద్భుత గతి నతిలోక మగున్ ॥ 3641

(7)†క॥ మానుష యజ్ఞము కాఁగ న
మానుష గతి తోప సత్య మాన్య సుర తతుల్
ధీనిధులై విశ్వమ్మను
ప్రాణ రతుల నలరఁజేయుఁ బ్రాజ్ఞత కృతమై ॥ 3642

(8)†క॥ ఆదిత్యాగ్నులు నతిరతి
వేదిత గుణ పృథ్వి మహిత విమల జల గతిన్
బ్రాదిని శబ్దాక్షరమయ
మోదితమై శబ్ద శక్తి మూర్తుల్ వెలుఁగున్ ॥ 3643

(9)†క॥ ద్యావా పృథ్వీ తతులను
నీ విశ్వ మ్మెల్ల నిండి కృత మహితమ్మై
వేవే విధ భూతాళుల
నావృతమై సృష్టి రూప మలరున్ సతమున్ ॥ 3644

(10)†క॥ సృష్టి పదార్థాళులు- పర-
వ్యష్టి సమిష్టి మహిత గతి భవ భాగ్యములన్
అష్ట వసు సంపదలమై
నిష్టా పూర్తమ్ముగాఁగ నెసఁగున్ బ్రకృతుల్ ॥ 3645

(11)†క॥ విశ్వము హవిషమ్ముగను సు
శాశ్వత గతి నిత్య సత్య స త్త్వము తనరన్
ఆశ్వర మౌ దీప్త రతుల
నీశ్వర రూపమ్ము గాఁగ నెసఁగున్ బ్రకృతుల్ ॥ 3646

---

†రచయిత.—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†తే॥గీ॥ జగతి యెల్లను బంచ భూతగ గతి మెయి
నఖిల రూపాల నిత్యమ్ము నమర మౌచుఁ
జలన శక్తుల జనియించి జ్వలన రతుల
నంతరాంతర గతు లొప్ప నలరుచుండు ॥ 3647

## సూక్తమ్—111

ఋషిః—వైరూపోఽష్టాదంష్ట్రః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) మనీషిణః ప్ర భరధ్వం మనీషాం యథాయథా మతయః సన్తి నృణామ్ ।
ఇన్ద్రం సత్యైరేరయామా కృతేభిః స హి వీరో గిర్వణస్యుర్విదానః ॥ 1287

(2) ఋతస్య హి సదసో ధీతిరద్యౌత్ సం గార్ష్టేయో వృషభో గోభిరానట్ ।
ఉదతిష్ఠత్ తవిషేణా రవేణ మహాన్తి చిత్ సం వివ్యాచా రజాంసి ॥ 1288

(3) ఇన్ద్రః కిల శ్రుత్యా[1] అస్య వేద స హి జిష్ణుః పథికృత్ సూర్యాయ ।
ఆన్మేనాం కృణ్వన్నచ్యుతో భువద్గోః పతిర్దివః సనజా[2] అప్రతీతః ॥ 1289

(4) ఇన్ద్రో మహ్నా మహతో[3] అర్ణవస్య వ్రతామినాదంగిరోభిర్గృణానః ।
పురూణి చిన్ని తతానా రజాంసి దాధార యో ధరుణం సత్యతాతా ॥ 1290

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. శ్రుత్యా—అస్య, 2. సనజాఽఅప్రతీతః, 3. మహతోఽఅర్ణ. (వా.ప్ర.)

(5) ఇన్ద్రో దివః ప్రతిమానం పృథివ్యా విశ్వా వేద సవనా హన్తి శుష్ణమ్ ।
మహీం చిద్ ద్యామాతనోత్ సూర్యేణ చాస్కమ్భ చిత్ కమ్భనేన స్కభీయాన్ ॥ 1291

(6) వజ్రేణ హి వృత్రహా వృత్రమస్తరదేవస్య శూశువానస్య మాయాః ।
వి ధృష్ణో [1]అత్ర ధృషతా జఘన్థాథాభవో మఘవన్ బాహ్వోజాః ॥ 1292

(7) సచన్త యదుషసః సూర్యేణ చిత్రామస్య కేతవో రామవిన్దన్ ।
ఆ యన్నక్షత్రం దదృశే దివో న పునర్యతో నకిరద్ధా ను వేద ॥ 1293

(8) దూరం కిల ప్రథమా జగ్మురాసామిన్ద్రస్య యాః ప్రసవే సస్రురాపః ।
క్వ స్విదగ్రం క్వ బుధ్న[2] ఆసామాపో మధ్యం క్వ వో నూనమన్తః ॥ 1294

(9) సృజః సిన్ధూంరహినా జగ్రసానాం[3] ఆదిదేతాః ప్ర వివిజ్రే జవేన ।
ముముక్షమాణా[4] ఉత యా ముముచ్రే ఽధేదేతా న రమన్తే నితిక్తాః ॥ 1295

(10) సధ్రీచీః సిన్ధుముశతీరివాయన్ త్సనాజ్జార[5] ఆరితః పూర్భిదాసామ్ ।
అస్తమా తే పార్థివా వసూన్యస్మే జగ్ముః సూనృతా[6] ఇన్ద్ర పూర్వీః ॥ 1296

---

1. ధృష్ణోఽఅత్ర, 2. బుధ్నఽఆసా, 3. సానాంఽఆదిదేతాః, 4. మాణాఽఉత,
5. జారఽఆరితః, 6. సూనృతాఽఇన్ద్ర. (వా.ప.)

## సూక్తము—111

ఋషి—వైరూపుఁడు అష్టాదంష్ట్రుఁడు†

దేవత—ఇంద్రుఁడు†

(1)*గీ॥ మీకుఁ దోచిన యట్టులు మేలు నుతుల
పలుకుఁడీ! స్తోతృవరులార! పరమ భక్తి
శక్తుఁడైన మహేంద్రుఁడు సన్నుతిపరు
డపుడుఁ బిలుతుము వానినే యజ్ఞమునకు ॥ 3648

(2)*గీ॥ అంతరిక్షము భరియించునట్టి యింద్రుఁ
డతిశయించుచు భువనంబులందు వ్యాప్తిఁ
గాంచుచుండెను వృషభంబు గ్రాలు రవముఁ
జేయుచున్[1] మహిమచేతఁ దాఁ జెలఁగునటుల ॥ 3649

(3)*చ॥ సురుచిర సూర్య మార్గమును జూపెడు వాఁడు సమస్త శత్రులన్
నిరతముఁ జంపువాఁడు మహనీయుఁడు వైరి కసాధ్యుఁడైన యా
సురపతి మేన నాఁ బరఁగు సుందరితో నిటు వచ్చుచుండి మా
వర నుతి నాలకించు నలవాఁడె పయఃపతి యౌను జూడఁగన్ ॥ 3650

(4)*గీ॥ అంగిర స్తుత్యమానుఁడౌ సమర విభువు
జలము గల మేఘముల నెల్లఁ గలఁతఁ బెట్టి
పిదప జలముల భరియించి ప్రీతిఁ గొల్చు
వాని[2] నెల్లను బడఁజేసె వసుధయందు ॥ 3651

(5)*క॥ వితత ద్యో భువనములకుఁ
బ్రతినిధియై వెలుఁగునట్టి వాసవుఁ డిష్టి
వ్రతములు[3] నెరుఁగును మరియున్
హతమార్చెను శుష్ణు వాఁడు హంతకుఁ డగుటన్ ॥ 3652

---

†ప్రాతప్రతి 14వ సంపుటము 93వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వైరూపుడు అష్టాదంష్ట్రుడు"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను వ్రాసి, 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అష్టాదంష్ట్రుఁడు" ఋషిగాను, "ఇంద్రుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:— కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నిందగ్రణమునకు మారు "బలము" ప్రయుక్తమైనది. 2. నుదకముల నెల్లఁ బడఁజేసె నుర్వియందు, (తా.పా.), 3. కెరుఁగును శుష్ణుని, హతమార్చెనుగాదె వాఁడు హంతకుఁ డగుటన్. (తా.పా.)

*గీ॥ ద్యోతలంబును వెల్గించి పూతుఁడైన
నింద్రుఁడు నిరోధనంబును నెంతయేనిఁ
గొనుచు నద్దాని సామర్థ్యమున దివంబు
[1]వృద్ధిఁ గాంచెడు నట్టులు వృద్ధి పరచె ॥ 3653

(6)*గీ॥ ఇంద్ర! వజ్రంబుచేతనే వృత్రుఁ జంపి
తీవు! పిమ్మట ధృష్ణుఁడా! నీవ దేవ!
వృత్రు మాయల నెల్లను వేగ వజ్ర
మును ధరించుచుఁ గొట్టితి! మొనసి యపుడు ॥ 3654

(7)*గీ॥ సూర్య రూపాత్మ కేంద్రుని శోభతోడ
నెపు డుషస్సులు[2] చేరునో! యపుడు సర్వ
కేతువులు సూర్య రశ్ములు ఖ్యాత శోభఁ
బడయుచున్[3] లోక మంతట వ్యాప్తిఁ గాంచు ॥ 3655

*గీ॥ దినము నక్షత్ర మెప్పుడు దీప్తితోడఁ
జూడఁబడకుండు నప్పుడే చోద్య మంద
నంతటం బోవుచున్నట్టి యనఘ సూర్య
రశ్ములను నెవ్వఁ డెరుఁగంగ రహి గతించు ॥ 3656

(8)*క॥ హరి యాజ్ఞవలన నెయ్యవి
చరియించుచునుండు నట్టి జలమును నీటన్
బరమ ప్రథమములై చని
వెరవున దూరంబు పోయి వెలిఁగెడు జగతిన్ ॥ 3657

*గీ॥ మీరు నగ్ర మెచట? మీకు మూలం బెచ?
మీకు మధ్య మెచట? మీకు నంత
మెచటొ?[4] జలములార! యెరుఁగుదు మే మెట్టు
లెవరు మీ సుమహిమ[5] నెంచఁగలరు? ॥ 3658

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. తా నిరోధించె సమయ(ము) తప్పకుండ, (తా.పా.), 2. నెపు డుషస్సులు కలియునో, (తా.పా.),
3. గాంచియుండెనుగాదొకో యెంచిచూడ, (తా.పా.), 4. మెచటనుండు నెరుగంగ శక్యమే, (తా.పా.),
5. మహిమ నెరుఁగఁగలరు. (తా.పా.)

(9)•గద్యము॥
ఇందు్రడా! వృత్రుచే గ్రస్తము లగు నప్పులను మరలించితివి! పిమ్మట నా యప్పులు వేగముగాఁ జరించినవి. మరియు మోక్షమును గో రవ్వులు నిందు్రనిచే మోచితము లైనవి. తర్వాత నప్పులు సర్వత్ర గమన శీలములయ్యెఁగదా! ॥ 3659

(10)•క॥ కామినులు స్వపతి నెట్టులు
కామింతురొ! యట్లు మిగులఁ గ్రాలెడు నప్పుల్
నీమమున సముద్రంబును
గామించుచు నుండు భర్తగా జగమందున్ ॥ 3660

•గీ॥ జారయితయైన యిందు్రఁడు పే్రరకత్వ
మున మహాస్వామి యయ్యె నో ఘనుఁడ! మాకుఁ
బార్థివ హవిస్సులున్ మరి పరమ వాక్కు
లును మముం జెందుఁగావుత! ఘనతరముగ ॥ 3661

## సూక్తము—111

ఋషి—వైరూపుఁడు అష్టాదంష్ట్రుఁడు
దేవత—ఇందు్రఁడు

### అర్థాంతరము—1

†(1) మనశ్శక్తి మహారూప మహిమాన్వితమై సృష్టిని
అఖిల లోక గోళాదుల ఆకర్షణ శక్తి తతుల
నతిక్రమించి అవలీలగ నతిలోకపు శక్తిగతుల
నపూర్వమై అభేద్యమౌ అమేయంపు టజేయంపు
శక్తిరూప దీప్త గతుల సదసత్తుల కతీతమై
ఋత రూపముగా వరలును సతత దీపమై వెలుఁగును
శబ్దాక్షర దివ్యాక్షయ శక్తి రూప జనిత మౌచు
సనసురూప దృశ్యమ్ముగ నదృశ్యంపు టదృష్టముగ ॥ 3662

†(2) సత్యశక్తి దీప్తముగా సచ్చిత్తుల రూపముగా
సకలాంతరాళమ్మున సకృత చలన గతులు మీఱ
నంతరిక్షమందు వెలుఁగు నఖిలమైన దివి భువులను
దివ్య దీప్తు లాప్పారఁగ దేవశక్తు లలరారును
మృగశిర రూపమ్ముగాఁగ వృషభ రోదనములఁ దిరుగు
కార్తికేయ రౌహిణీయ కా్రంతి కాంతి పుంజాలను
నుచ్చగతుల నుజ్జ్వల రతి నుత్తమోత్తమ ప్రభలను
శబ్దించుచు నినదించుచు జాజ్వల్యముగా వెల్గును ॥ 3663

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) అప్రతీతమైన శక్తి నతిలోకపు దీప్తరతుల
నండ పిండ బ్రహ్మాండము లన్నింటిని సంచరించుచు
సురపతులకు దీప్తముగా సురపితలకు నాప్తముగా
సలరారెడు నాదిత్యుండు అపురూపపు శక్తులతో
అఖిలేందుల కిందుండుగా నమరేంద్రుల కింద్రుండుగా
సత్యమల స్వచ్ఛ మౌచు నారనట్టి అగ్ని కాంగ
అద్భుతముగ వెలుంగొందుచు అరుణులకే అరుణుండుగా
రవులకు మార్గము చూపెడి అవిరళమౌ శక్తి కల్గి
ఆ శ్రీమహావిష్ణు సుశ్రీపతి కృతి కాంగను
అతివేలపు టమృత శక్తు లనంత గతుల వెల్లివిరియు ॥ 3664

†(4) ఋతు శక్తులు నిల్చునందు ఋత శక్తుల తత్త్వాలను
విశ్వమ్మున జల శక్తుల విమల దీప్తు లొప్పారంగ
నావిరిగా నాకర్షణ మాదృతి నా రవి కాంతులు
మేఘ సంచయమ్ముగ నిలిపి మిన్నులలో విహరించుచు
సలిల ధార లొప్పారంగ సకలమ్మున వర్షాలను
గురిపించుచు జలాశయాల కిరవౌ గతి నీరు నిలిపి
తిరిగి మొయిళు లౌచు నిలిచి ఉరుములతో మెరుపులతో
మరల మరల వర్షించుచు మహిమాన్విత సృష్టి రీతిం
జక్రనేమి క్రమముగాంగ సర్వస్వము చరియింపంగం
బుట్టి పెరిగి గిట్టి మరలం బుట్టి పెరిగి గిట్టుచుండుం
బునరపి జననము గాంగను బునరపి మరణము గాంగను
విచిత్రముగ విశ్వ సృష్టి సచిత్రముగం దనరారును ॥ 3665

†(5) జల శక్తులు శోష చేయు ఛల శక్తుల రూపముగా
"నాభి" శక్తి మ్రింగునట్టి "అభి"రూపపు దుశ్శక్తిని
విధ్వస్త మ్మొనరించుచు విశ్వ కాంతి నెల్ల నిలిపి
వరుణ దేవు కరుణ మీఱ నిరతము జలములం గురియంగ
లోకాలను పాపశక్తి వ్యాకులితము చేయకుండ
ఉసురులకే ఉసురుగాంగ సువశాంతుల నొసంగుచుండి
చిదచిత్తులతో విశ్వము చిత్రముగాం దనరారంగ
దివి భువు లన్నిట వరలును దివ్యమైన దైవ శక్తి ॥ 3666

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) జలదమ్ముల జల శక్తుల చలితగతుల చలన గతుల
దుష్టమైన "నాభి"శక్తులఁ దున్మాడుచు జలతత్త్వము
విశ్వ"నాభి" తత్వమ్మును విధ్వస్తము కావించెడి
వృత్రరూప లోకాంతక శత్రుకూప తండాలను
ఛిద్రమ్ముగ వజ్రశక్తిఁ జెండాడుచు నద్భుతగతి
విమల లోక సంక్షేమపు విశ్వ కాంతి విద్రోహగ
దుష్ట రాక్షసాళి నెల్లఁ దునిమి సజల "నాభి" శక్తిఁ
గాపాడుచు విశ్వమాత దీప దాహమ్మును గడు.
దీర్చి దేహ కాంతి నిచ్చి అర్చిస్సుల వర్చస్సుల
నతిలోకముగా నిల్పును నపురూపముగా గెల్చును
దివ్య దేవ శక్తి యెపుడు దీధితులను వెలుఁగొందుచు
సృష్టి స్థితి ల మగతు లవి శ్రీకృష్ణుని లీలలుగా ॥ 3667

(7)† అష్టపదకందము॥
ఉదయాస్తమయ గతులను స
విదిత సుదీప్త రతుల నతివిశదగతిమెయిన్
జెదరని విడులని శక్తుల
నదపద లేనట్టి కాంతు లహరహము చెవిన్
నిధులై నిత్యము సత్య సు
పదమై సంచలన రూప భ్రమణ సుగతులన్
దుది మొదలు లేని యానము
లనురు బెదురు లేక రిక్క లరుణ గతిఁ దగున్ ॥ 3668

†(8) ఆకసముల మూల మెద్ది? అనలములకు మూల మెద్ది?
అనిలాలకు మూల మెద్ది? అంబువులకు మూల మేది
మృత్తులకు మూల మేది? ఋత శక్తుల నెరుఁగంగా
ఆది యేది? మధ్య మేది? అంత మేది? అఖిలములకు
నన్నియు నన్యోఽన్య గతుల నవినాభావంపు రతుల
నంతర్గతి నలరుచుండు నాలంబన మౌచుండు
నభ్యుదయ మ్మొనరించును నతిలోకపు శక్తులుగా
నంతరమై తనరారును బ్రాణాంతకరూప మౌచు
లోకాంతక కాలాంతక యాక్ష విశ్వరూప మౌ న
నూనాంతకమై వెల్గును జ్ఞాన విష్ణు దీప మౌను ॥ 3669

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) సౌరశక్తి నుద్భవిల్లు సలిలమ్ములు విశ్వమ్మున
సౌరశక్తి సంతరించు సలిలమ్ములు విశ్వమ్మున
సౌరశక్తి నదృశ్యమౌ సలిలమ్ములు విరూపముగ
సౌరశక్తి నంతమౌను సలిలమ్ములు నరూపముగ
సలిలాళులు జనితములై సర్వమ్మున వృద్ధి పొందు
సకలమ్మున సంచరించు నకలుష గతి నద్భుతమై
కశ్మలముల విదూరముగ రశ్మిశక్తిఁ బోఁదోలును
నిర్మలతత్త్వము నిల్పును నిరత తేజ రూప మౌను
నంతర్గతి ననల శక్తు లనిల శక్తు లొప్పారఁగ
నాకాశముగాఁ బృథ్విగ నంబుధిగా నలరారును
మధుర గుణము లవణ మౌచు మధుర మౌచు లవణ గుణము
ఆకసంపు రంగు మీరు నా కృష్ణుని లీల కాఁగ ॥ 3670

†క॥ తొలి శక్తియె నిత్యమ్మై
మలి శక్తిగ విశ్వ రూప మహితత్త్వమునన్
దొలి నడుమ తుదులు లేకయె
అలరారును గృష్ణ శక్తు లబ్బుర మౌచున్ ॥ 3671

(10)†అష్టపదకందము ॥
నదులను నదముల జలములు
నుదధిని జేరుచును క్షీర మువ్పును మధురా
ద్భ్యుదధి సహజ గుణ వరమై
చెదరక ఆవిరిగఁ దిరిగి చెలఁగు మొయిళులై
ఉదకములుగ ననిల గతుల
మధురములై దివి భువులను మలఁగు జలములన్
విదుర గతుల వర్షించును
దుది మొద లెరుఁగని గతులను దృప్తిన్ బ్రకృతిన్ ॥ 3672

†అష్టపదకందము ॥
వసు నంపద విశ్వమ్మున
నసమ గతుల సలిల శక్తి నద్భుత గతిమై
నసి చెడని దివ్య కాంతుల
ను సత్య మహిత ప్రకృతి కృత నుత సంతతిగా

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

విసమును నమృతము వరలఁగ
మిసిమింతల భాగ్య రూప మృజ్జీవికలై
ఉసురులుగా దీప్తి తతులు
వసుమతి దివి సర్వ లోక భ్రాజిత మౌలేః ॥† 3673

## సూక్తము—111

ఋషి—వైరూపుఁడు అష్టాదంష్ట్రుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

†(1) బహు ముఖమౌ బుద్ధితత్త్వ పరాశక్తి మనశ్శక్తి
మహితులైన మనీషులకు సహస్రుగా వెల్గొందుచు
భ్రాజపప్రదమౌ దీప్తుల వందు నిండు వెన్నెలగాఁ
దనరారును భారరహిత ఘనరూపపు మర్మ గతుల
ఋత రూపపు నమృతముగాఁ బ్రీతిలేని సురూపమ్ముగ
శబ్ద శక్తి రూపాలను సన్మయ కృత వేద మహిత
రవి రవియౌ విష్ణు దీప్త రాజిలేంద్ర ప్రభా సహిత
దివ్య తత్త్వ దేవోత్తమ దీప్త కర్మలన్ వరలును ॥ 3674

†(2) ఋత రూపమ్మౌ శక్తిన్ వృషభరాశి శబ్దగతులు
అతులితమౌ రూపాలను సనమ కామ దీప రతుల
విశ్వ లోక గోళాలను విమల ప్రతిధ్వనులఁ జరించు
మహామహిత రవి దీప్తుల మాన్యాఽమృత శక్తిరూప
చిద్విలసిత విశ్వరూప మద్వయ గతి నద్భుతమై
చరాఽచర ప్రకృతిలోన నరాతితతుల నిరాకరించి
పరాక్రమించి సురాళిశక్తి వరాన్వీత జరా రహిత
మురారీశ మహోజ్జ్వల మూర్తి సృష్టి మూల మౌను
అగ్ని దీప్త రజోగుణము లమలమైన చిద్గతులను
సత్స్వరూపమై వెలుఁగును సకల విశ్వధారకమౌ ॥ 3675

†క॥ రోదసిలో మహిత బహుళ
వేదాఽన్విత శక్తు లలర విమల సుదీప్తిన్
ఆదిత్యుఁడు వెల్గొందుచుఁ
భ్రాదిగ విశ్వమ్ము నిలుపుఁ బ్రకృతుల సుకృతిన్ ॥ 3676

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) విశ్వరూప దీప్తు లలర విపుల శక్తు లొప్పారఁగ
సత్వతత్త్వ పరిపూర్ణత జ్వలద్దీప్తు లనంతముగ
సూర్యునికై పథములకై శుభము లభము లెనయంగా
విష్ణుదీప్త జిష్ణుశక్తి విపులసృష్టి తత్త్వ రతుల
నఖిలమ్మును విలసిల్లును నపురూపపు జీవగతుల
జనన జీవ మృత్యు హేల లనవరతము నడుచుచుండ
శబ్దవేద శ్రవణశక్తి జ్వాలనదీప్త ప్రతిబింబముఁ
బ్రతిధ్వనిగ విశ్వమ్మున వర్తిల్లును బహు గతులను
దేహ రూప తతులు వరల సాహస్రుల సహరాత్రుల
గాల విహిత జగతి యెల్లఁ గలకాలము విలసిల్లును ॥ 3677

†(4) అవినాశరూపమౌ నంగిరోమయ శక్తి
విష్ణు ప్రభావాన విశ్వాన వ్యాపించు
నిత్య సత్యమ్ముగా నిఖిలమ్మనను వరలు
సృష్టి స్థితి శక్తిగాఁ జిద్రూప లయ గతిగఁ
జక్రనేమి క్రమముగా సత్యమ్ముగ నిత్యమ్మును
జరాచర ప్రపంచమ్ము పర్విత పర్వణ మట్లుగ
ధరణ ధారణాల గతుల ధరణ కారణాల రతులఁ
బుట్టినట్లె పెరిగినట్లె గిట్టినట్లె మరల మరల
విస్తారమ్మై విశ్వమ్మిట్టా ఆగీ లేకయె
జరిగినాట జరుగనట్లె సర్వమ్మును జరుగుచుండు
సత్త్వ రజస్తమోగుణాల్ తత్త్వగతుల విస్తరిల్ల
నప్పృతముగ నఖిలమ్మును నసాధారణముగ నడుచు ॥ 3678

†(5) విశ్వ విజ్ఞాన దీప్తి విమల మౌచు విస్తరిల్ల
దివి భువి గోళా లెల్లను దేజరిల్లఁ బ్రాణశక్తిఁ
బరిభ్రమణ శక్తులతోఁ బ్రదక్షిణపుఁ బ్రాభవాల
నాత్మ ప్రదక్షిణంపు టంతర్గత చలన శక్తి
సృష్టి సవన సంచయ గతి చెలఁగ నిత్య రతులఁ గ్రతుల
నాకర్షణ వికర్షణల నఖిలమ్మును నిలిచి తిరుగ
జగమే చిద్రూప మౌచు నగణిత గతి వర్తిల్లును
ద్యౌ శక్తియె మాత గాఁగ ద్యుతుల సూర్య విభుత వెలుఁగ
దోష జుష్ట శక్తి తతులఁ దున్మాడుచుఁ బ్రకృతిలో
మృద్రూపగ మహీజాల భవ్రగతుల దివు లలరును ॥ 3679

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(6)†క్రాంతివృత్తము ॥♦

విష్ణుమాయ శక్తులతో
జిష్ణు వజ్ర దీప్తులమై
నుష్ణ రూపమై తనరన్
ఉష్ణ భిన్న మాతుకమై
కృష్ణ శక్తి చీల్చు మహా
తృష్ణ వృత్ర ప్రాణము తో
చిష్ణ గవ్య దీప్త గతిన్
గృష్ణు లీలగా వరలున్ ॥ 3680

†క॥ అగ్నికిఁ బ్రతిరూపమ్మై
రుగ్ణత రూపమ్ముగాఁగ రూక్ష విషకరా
శాగ్నుల జలనాభి మహా
భగ్నత నొనరించు వృత్ర వజ్రి వధించున్ ॥ 3681

†(7) బహుభంగుల రంగులతోఁ, బలు విధముల రిక్కలతోఁ,
జిత్రాతివిచిత్రరతుల చిద్విలసన సృష్టి గతిన్
రవి శక్తుల అవికలితపుఁ బ్రభ దీప్తులు కేతువులై
విశ్వమ్మున వ్యాపించును నశ్విగతుల నపురూపపు
రూపములై అవిరళమౌ దీప మహల కాంతి తతులు
అనుస్యూతమై వరలుచు ననంతముగఁ బ్రభవించుచు
నణుశక్తుల ఘనశక్తుల ననవరతపుఁ బ్రాణ రూప
వాయు చలనముల్ బ్రగతిని వరలును నఖిలమ్మౌ రోదసి
దివులై భువులై జగతిని దివ్య పునర్భవత వరల
నఖిలమ్మును దైవ లీల నద్భుత గతి జరుగుచుండు ॥ 3682

†(8) పంచభూత తత్త్వాలకు వరల విశ్వ సృష్టిలోన
మూలమైన శక్తి తనరు మూర్తిదైవలీల గాఁగ
నాకసములకు ననిలాలకు ననలాలకు సలిలాలకుఁ
బృథువులకును విశ్వమ్మున ఋత దృష్టిని సరసిచూడ
నాది లేదు నడుమ లేదు అంత్యమ్మును లేదు లేదు
అఖిలేశుని సృష్టి లీల నంద పిండ బ్రహ్మాండము
లన్నియుఁ దగు పంచభూత యజ్ఞరూప సృష్టిగాఁగ
నంతులేని దూరముగా ననంతగతుల నొప్పారఁగ ॥ 3683

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"అనుష్టుప్"ఛందము. (8)

†(9) పంచభూత రూపా లవి పరలి సూక్ష్మ బృహద్గతుల
నశ్వి శక్తు లౌప్పారఁగ నపురూపపు వేగమ్ముల
నఖిలమ్మును సంచరించు నమృతగతిఁ బయనించుచు
నసాధారణంపు శక్తి నంతరాంతరముల నిలుచు
అవినాభావంపు గతుల నన్యోఽన్యాఽనుబంధ రతుల
విశ్వ వ్యాపిత మౌచును విడివిడిగాఁ గలివిడిగా
గోళములై లోకములై గో శక్తుల సంచరించు
జీవ శక్తి మహాదీప్త చేతన గతి నిత్యము తగు ॥ 3684

†క॥ బంధువులై విశ్వమునకు
సింధువులై పంచ భూత జీవన గతులన్
అంధతమోదీప్తి మహా
బంధ జ్వలితాగ్ని జలము వర్తిల్లు సదా ॥ 3685

(10)†అష్టపదకందము ॥
అసమానపు దివ్య మహిత
వసు శక్తులు విశ్వమందు వర్ధిల్లు మహా
రసన గతులఁ బ్రకృతి నిలుచు
విస మౌచును నమృత మౌచు వికృతి గతమ్మై
మసిమసిగా మిసిమింతల
పసిడి పసిమిగాఁగ జగతి వరలి బహు పదా
ర్థ సహితమై సృష్టిగతి స
దసత్తుగ జనించుఁ గిట్టు ననునిత్యమ్మున్ ॥ 3686

†— విష్ణుదేవు సత్య శక్తి విమల తత్త్వ మెనయంగా
వసు శక్తుల సృష్టి యెల్ల వర్ధిల్లుచు వర్తిల్లును
బుట్టుచుండుఁ బెరుగుచుండుఁ బట్టినట్లు నిలిచి ఉండు
పుట్టినట్లె పుట్టుచుండి పెరిగినట్లె పెరుగుచుండి
నిలిచినట్లె నిలుచుచుండి నిట్టనిలుపునా గిట్టును
ఆకసమ్ము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తుల తత్త్వాలే అవి చిత్తు నచిత్తుల తత్త్వాల్
సదసత్తుల తత్త్వా లవి ముదితమ్ముల తత్త్వా లవి
అంత రహితమై తనరెడి అంబోధిగ నలరారును
నంతు లేని సృష్టి గతిగ నఖిలమ్మును నలరుచుండు ॥ 3687

† రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ పట్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†గీ॥ విశ్వసృష్టిని శాత్రవ విపుల శక్తి
నాశనమ్మును బొనరించి నవ్య నిత్య
దీప్తులొప్పార విశ్వాన దేవ తృప్తిఁ
గృష్ణుఁ డొప్పారు స్థితి శక్తి కెరలుచుండ ॥ 3688

## సూక్తమ్—112

ఋషిః—వైరూపో నభఃప్రభేదనః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) ఇన్ద్ర పిబ ప్రతికామం సుతస్య ప్రాతఃసావస్తవ హి పూర్వపీతిః ।
హర్షస్వ హన్తవే శూర శత్రూనుక్థేభిష్టే వీర్యాఁ ప్ర బ్రవామ ॥ 1297

(2) యస్తే రథో మనసో జవీయానేన్ద్ర తేన సోమపేయాయ యాహి
తూయమా తే హరయః ప్ర ద్రవన్తు యేభిర్యాసి వృషభిర్మన్దమానః ॥ 1298

(3) హరిత్వతా వర్చసా సూర్యస్య శ్రేష్ఠై రూపైస్తన్వం స్పర్శయస్వ ।
అస్మాభిరిన్ద్ర సఖిభిర్హువానః సధ్రీచీనో మాదయస్వా నిషద్య ॥ 1299

(4) యస్య త్యత్ తే మహిమానం మదేష్విమే మహీ రోదసీ నావివిక్తామ్ ।
తదోక[1] ఆ హరిభిరిన్ద్ర యుక్తైః ప్రియేభిర్యాహి ప్రియమన్నమచ్ఛ ॥ 1300

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. తదోకఉఆ హరిభి. (పా.ప.)

(5) యస్య శశ్వత్ పపివాగ్ం[1] ఇన్ద్ర శత్రూననానుకృత్యా రణ్యా చకర్థ ।
స తే పురంధిం తవిషీమియర్తి స తే మదాయ సుత[2] ఇన్ద్ర సోమః ॥ 1301

(6) ఇదం తే పాత్రం సనవిత్తమిన్ద్ర పిబా సోమమేనా శతక్రతో ।
పూర్ణ[3] ఆహావో మదిరస్య మధ్వో యం విశ్వ[4] ఇదభిహర్యన్తి దేవాః ॥ 1302

(7) వి హి త్వామిన్ద్ర పురుధా జనాసో హితప్రయసో వృషభ హ్వయన్తే ।
అస్మాకం తే మధుమత్తమానీమా భువన్త్సవనా తేషు హర్య ॥ 1303

(8) ప్ర త[5] ఇన్ద్ర పూర్వ్యాణి ప్ర నూనం వీర్యా వోచం ప్రథమా కృతాని ।
సతీనమన్యురశ్రథాయో[6] అద్రిం సువేదనామకృణోర్బ్రహ్మణే గామ్ ॥ 1304

(9) ని షు సీద గణపతే గణేషు త్వామాహుర్విప్రతమం కవీనామ్ ।
న[7] ఋతే త్వత్ క్రియతే కిం చనారే మహామర్కం మఘవంచిత్రమర్చ ॥ 1305

(10) అభిఖ్యా నో మఘవన్ నాధమానాన్ త్సఖే బోధి వసుపతే సఖీనామ్ ।
రణం కృధి రణకృత్ సత్యశుష్మా ఽభక్తే చిదా భజా రాయే[8] అస్మాన్ ॥ 1306

---

1. పపివాగ్ంఽఇన్ద్ర, 2. సుతఽఇన్ద్ర, 3. పూర్ణఽఆహావో, 4. విశ్వఽఇదభి, 5. ప్ర తఽఇన్ద్ర,
6. శ్రథాయోఽఅద్రిం, 7. నఽఋతే, 8. రాయేఽఅస్మాన్. (బ్రా.వ్ర.)

## సూక్తము—112

ఋషి—విరూపగోత్రజుఁడగు నభప్రభేదనుఁడు†

దేవత—ఇంద్రుఁడు†

(1)*గద్యము॥

ఓ యింద్రుఁడా! నీవు యథేచ్ఛముగ నభిషుత మగు నీ సోమభాగము ద్రావుము; ప్రాత స్సవనమం దభిషుత మగు సోమము మొట్టమొదట నీచేఁ ద్రావఁదగినది. ఓ సమర్థుఁడా! నీవు శత్రువులను జంపుటకు హృష్టుఁడవు కమ్ము; పిమ్మట వృత్ర హననాది లక్షణములు గల వీర్యములను శస్త్రములచేఁ జెప్పఁగలము ॥ 3689

(2)*గీ॥ మనసుకంటెను వేగమె చనెడునట్టి
రథముపై సోమమునకయి రమ్ము; నీవు
రథమునకుఁ గట్టఁబడినట్టి రాజమాన
హరులు పరుగిడుఁగాక! సత్యంత వేగ ॥ 3690

(3)*గీ॥ కడు హరిద్వర్ణయుక్తుఁడై గ్రాలు సూర్య
తేజమున శ్రేష్ఠరంగములై వెలిగిల్లు
స్వీయ రూపంబులన్ నాదు వెలుఁగు తనువు
నీవు స్ఫురియింపుమా! యింద్ర! నిశ్చయముగ ॥ 3691

*గీ॥ అల మరుత్తులతోఁ గూడునట్టి నీవు
సఖుల మైనట్టి మాచేత సరస ఫణితిఁ
బిలువఁబడుచున్న వాఁడవై విశ్రమించి
సోమపానంబు సేయుము సొగసుఁ గనుము ॥ 3692

(4)*గీ॥ రోదసులు రెండు వాసవా! నీదు మహిమ
వేరు చేయక యుండుత! వీరవర్య!
శోభ సరిఁ గూర్చునట్టి యీ సోమమునకు
నశ్వములతోడ నిష్టికి నరుఁగఁదెమ్ము! ॥ 3693

†వ్రాతప్రతి 14వ సంపుటము 97వ పుటలో నీ సూక్తమునకు ఋషి "విరూపగోత్రజుఁడగు ప్రభేదనుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను వ్రాసి, 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "నాభా ప్రభేదనుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(5)*ఉ॥ సోమము దాౖవి నీవు సహసోన్నత శాత్రవ శిక్ష కర్త్వహా
భీమ మహాయుధంబు గొని వేగిర మెవ్వని శత్రు కోటులన్
నీమముతోడఁ దృంచితొ[1] గణింపఁగ వాఁడు నుతిన్ రచించు నా
సోమము కూడ నీకుఁ గడు శోభను గూర్చును[2] నెల్ల భంగులన్ ॥ 3694

(6)*క॥ ఎయ్యది సోమ స్థానమొః
యెయ్యది సురవరుల కెల్ల నిష్టం బగునోః
యొయ్యన నా చమసంబును
నయ్యాః హరిః మేము దాని నందితిమిసుమాః ॥ 3695

(7)*గీ॥ కామ పూరకః యంతటఁ గలుఁగు ఋషులు
నిన్నె పిలుచుచున్నారు నీ నిమిత్త
మస్మదీయ మహేష్టు లత్యమల సోమ
పూర్ణములు కాన దానిని బుచ్చుకొనుముః ॥ 3696

(8)*గీ॥ ఇంద్రః నీ కృత వీర్యము లెల్ల నేను
నుగ్గడించుచున్నాఁడ నుదక మెసఁగ
వజ్రమున మేఘమండలి బాదినావు
బ్రహ్మకై గోగణంబులఁ బట్టినావుః ॥ 3697

(9)*గీ॥ కవి గణంబులలో నీవు ఘనుఁడ వనుచుఁ
జెప్పినారలు కానఁ బ్రసిద్ధిఁ జెందు
గణపతీః నీవు స్తోతల గణమునందు
విశ్రమింపవెః యాలింప వివిధ నుతుల ॥ 3698

*గీ॥ నిన్ను విడిచి పెట్టి నికటంబునందున
నైన దూరమందునైనఁ గర్మ
జరుప లేదు నీవు కరము సుస్తోమంబు
చిత్రముగ నొనర్చి చెలఁగుమయ్యః ॥ 3699

---

*రచయితః—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. నీమముతోడ దృంచితివొ నీ కల వాఁడు నుతిన్, (తా.పా.), 2. గూర్ప సమర్థ మౌన్ గదాః. (తా.పా.)

(10)*గీ॥ యాచమానుల మగు మమ్ము నతిప్రసిద్ధి
వంతులుగఁ జేయుమాః ధనవంతః నీవు
వసుపతీః నీవు సఖులమై వరలు మేముః
చేయు స్తోత్రశ నంతయుఁ జెవుల నిడుముః ॥ 3700

## సూక్తము—112

ఋషి—విరూప గోత్రజుఁడగు నభప్రభేదనుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) దేవదేవుని దివ్య భావ శక్తులు మీఱ
సర్వసృష్టి జగత్‌సంపదగఁ దనరార
నపురూపమౌ విశ్వ మాత్మ సంతతి కాఁగ
అపకారకారకమ్మై నిలుచు నఖిల శాత్రవతతుల
విధ్వస్త మొనరించి విమల శక్తుల నిచ్చి
హర్ష పులకాంకితా లానంద రూపాల
సృష్టి ప్రతికృతి కాఁగఁ జెల్వొందఁ జిల్లిల
వీర్యవత్తరశక్తి విశ్వ విజృంభణల
విమల గతి వ్యాపింప విజయ సృష్టులు వెలయఁ
బ్రకృతి వరలును మహా భావ సంక్షేమగతి ॥ 3701

†(2) అతిలోకమై వెలయు నపురూప హృదయగతి
అద్భుత వేగాన నఖిలాండములు తిరుగు
నీ దివ్య రథ గతులు నిత్య కాంతుల హరులు
మానసాఽతీతమౌ మహిమాన్వితపు శక్తి
ఆమూలచూడముగ నఖిల విశ్వము తిరుగు
సోమాఽమృతపు శక్తి శుభతేజ వీర్యగతి
విశ్వాన వ్యాపింప నశ్వి శక్తులు వరల
కాలగతి సర్వమ్ము కాలు నిత్యత్వాన
సృష్టియే స్థితిగాఁగ స్థితిలయ దీప్తిగాఁ
జక్రనేమి క్రమత సర్వమ్ము తనరార ॥ 3702

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) బహు వర్ణ గతు లెనయ వరలు కాంతులు సదా
సూర్య దీప్తి ప్రబలు వీర్యవత్తరములై
అతిలోక వేగాన నద్భుత కాంతులన్
బ్రకృతి తను రూపమ్ము వర్ధిలఁగ సంతసాన
దివ్యకాంతి నవ్యశక్తి భవ్య స్పర్శ తనరారఁగ
ననిల రూప ప్రసారాల సపురూపపు స్పర్శలతో
నద్భుతముగఁ జలియించెడి ఆ మరుచ్ఛక్తు లెల్ల
సోమ శక్తి శీతల గతి ధామ రూప దీప్త మౌచు
విశ్వ సఖ్య చలనగతుల విమల శుభాఽఽవహము కాఁగ
ననునిత్యము వర్ధిల్లును నద్భుతమౌ మహాశక్తి ॥ 3703

†(4) ఉపర్యధో తత్త్వాలను నున్నట్లుగ లేనట్లుగ
రోదోఽంతర దివ్య రూప నాద శక్తు లొప్పారఁగ
సోమాఽమృత మహాశక్తి స్రోతస్సుగ జాలువార
నపురూపపు దీప్తులతో నమరాఽమృత మమల శక్తి
నిత్య చలన సత్య శక్తి నిఖిల వ్యాప్త నిరత దీప్తి
అత్యపూర్వగతు లొప్పఁగఁ గృత్యమైన సృష్టిరూప
శ్రుతులౌ నత్యమలపు శుభ మహత్వ మొప్పారఁగ
దివ్యమైన దీప్తు లెల్లఁ దేజరిలఁగ విశ్వమ్మునఁ
గాంతి శక్తి దాంతి శక్తి శాంతి రూప క్రాంత శక్తి
అంత మెనయనట్టి గతుల సంతట వ్యాపించుచుండు ॥ 3704

†(5) అతిలోకమౌ నమృతపు నపురూపపు బల దీప్తుల
అమలమైన అమరమైన అమృత సోమ శక్తు లొప్ప
మహిత విశ్వ సృష్టి యెల్ల నహరహమ్మును వర్ధిల్లును
నద్భుత చైతన్యగతుల ననహాయ మహాశక్తి
సంక్షేమపుఁ బ్రకృతి నెల్ల సంక్షోభమ్ముల నింపెడి
సర్వ శత్రు సంచయాల సంహారము కావించుచు
విశ్వశాంతి భాగ్యతతులు విమలములై విపులములై
వీర్యవత్తరము లౌచు విస్తృతంపు దివ్యశక్తి
సకల జగతి వ్యాపింపఁగ సంపన్నపు దీప్తులమై
నకృతమైన ప్రకృతిశక్తి నపురూపపు గతుల నిల్చు ॥ 3705

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) అతి విచిత్ర శక్తులతో అపురూపపు దీప్తులతో
దైవీయమ్మౌ శక్తుల జీవరూప నిత్య కాంతి
సర్వశక్తి గణపతిగా నఖర్వమైన మనశ్శక్తి
అనుమేయపు టజయ్యంపు టక్షయగతు లొప్పారఁగ
విశ్వసృష్టి వీర్యశక్తి విమల జల సంభరితమై
అద్భుతముగ వర్ధిల్లఁగ నఖిల జగతి వరలుచుండుఁ
ప్రకృతి సిద్ధమై విశ్వమ్మకృతాఽమృత దివ్యశక్తి
అతిలోకపు వ్యాప్తిత్వపు టద్భుతమై తనరారును
ప్రకృతి వికృతి గతుల విశ్వ భావ రూప చిత్రావళి
సహజోద్భవములు కాఁగను సర్వమ్ము నదృశ్యములౌ ॥ 3709

†(10) వసు సంపద విశద రూప ప్రభాకలిత దివ్యత్వము
అనమగతుల విశ్వమ్మున నఖిలేశుని ప్రసాదముగ
నద్భుతగతి వర్తిల్లును నపురూపత వర్ధిల్లును
అనుమేయపు దివ్యశక్తి అఖిల సృష్టి ప్రవర్తిల్లఁ
ప్రకృతి పురుష తత్త్వాలవి వరల సఖ్యగతు లొప్పఁగ
శబ్ద శక్తు లొప్పారఁగ సర్వమ్మునఁ దనరారును
సృష్టి సహజమౌచుఁ బ్రకృతి జీవశక్తి శబ్దముగా
వ్యష్టి సమిష్టి సుకృతుల శిష్టగతుల నలరారఁగ ॥ 3710

## సూక్తము — 112

ఋషి — విరూప గోత్రజుఁడగు నభప్రభేదనుఁడు
దేవత — ఇంద్రుఁడు

## అర్థాంతరము — 2

†(1) లోకమ్ముల కధిపతిగాఁ బ్రకటమౌ దివ్యశక్తి
ఆకృతిగా నఖిలమ్మున నతివేలపు శక్తులతో
నమృత రూప మొప్పారఁగ ననృత శక్తు లంతరింప
నతిలోకమ్మౌ సృష్టిని సతత చేతన గతి వరలఁగఁ
ప్రకృతి హర్ష రూపముగా సకృత వికృత దీప్తముగా
విశ్వ సృష్టి శత్రు తతుల విధ్వస్తముఁ గావించుచు
వసు సంపద తత్త్వాలను వసుధ వర్ధిల్లి వెలుఁగ
అనమగతుల నఖిలమ్మును నద్భుతమ్ముగా వరలును ॥ 3711

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) అతిలోకమ్మౌ శక్తుల నతివేలపు వేగ గతుల
మనశ్శక్తి విశ్వమ్మున మహిమాన్వితమై వెలయుచు
రోదసిలోఁ బ్రాకృతమౌ వృషభ శక్తులొప్పారఁగ
శబ్దమయమ్మైన జగతి శబ్ద గతుల సోమామృత
తత్త్వ మెల్ల సృష్టియందుఁ దాదాత్మ్యత వరలంగా
నఖిల జగమునందు నెల్ల నమృతశక్తితతులు సదా
అంతర్గతి నలరారును ననుమేయపు శక్తులతో
నసమానపు దివ్యశక్తి వసివాళ్వాడని యౌవన
నిత్య తత్త్వ మొప్పారఁగ నిఖిల జగతి దీప్త మగుచు
నసాధారణంపు గతుల నతివేలముగా వెల్గును ॥ 3712

†(3) అరుణారుణమై అలరెడి అరుణకాంతి సూక్ష్మ గతుల
హరిత వర్ణ వర్చస్సుల నచ్యుతగతి వరలంగాఁ
బ్రకృతి మిత్రి తత్త్వాలను నకృతమైన ప్రాకృతంపు
సహజ శక్తి విశ్వరూప విహిత మౌచు వర్ధిల్లఁగ
నతిలోకపు టానందమె అచ్యుతగతి వరలంగా
విస్తృతమై వర్తిల్లెడి విశ్వసృష్టి తత్త్వమ్మది
అమృత గతుల వర్ధిల్లును నతిశ్రేష్ఠమ్మై జగతిని
దను శక్తుల ఘన శక్తుల మనశ్శక్తు లలరారఁగ
వృషభ రూప శబ్దతత్త్వ విమల గతులు విశ్వమ్మున
నానందపు రూపములై అచ్యుతగతిఁ దనరారును ॥ 3713

†(4) రోదసిలో వ్యాప్తమైన రూపమ్మౌ దీప్త శక్తి
అశ్విరూప దివ్య శక్తు లఖిల జగతి నొప్పారఁగ
నచ్యుతగతి వర్ధిల్లుచు నపురూపపు శక్తులతోఁ
బృథక్పృథగ్రూప మౌచుఁ బూర్ణైక్య విశేషగతుల
సర్వ సృష్టి వ్యాపించుచు నిర్వక్రిత నిర్నిద్రిత
నిత్య చైతన్య గతుల సత్య ప్రసాద రతుల
మహితమైన తత్త్వశక్తి విహితమ్మై విశ్వ మెల్ల
నమృత గతుల భరిత మౌను నమల మౌచు వ్యాప్త మౌను
బ్రియకరమౌ సఖ్యమ్ముల విశేష గతుల వర్తిల్లుచుఁ
బృథివిత్వము వర్ధిల్లును ఋత శక్తుల నిత్యమ్మును ॥ 3714

†రచయిత.—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) విశ్వ శాంతి సౌభాగ్యము విధ్వస్తముఁ గావించెడి
శత్రుతతుల సంహరించి సదమలమౌ సోమాఽమృత
శక్తి విష్ణు సంతతిగా శర్మ రతుల శశ్వద్గతి
నతిలోకపు శక్తులతో నద్భుతంపు రక్తులతో
అవినాభావమ్ములైన ఐక్యరూప దీప్తు లలర
నానందపుఁ బ్రవృత్తులను ననుమేయపు వృత్తులతో
బ్రకృతి తత్త్వ యుత శక్తుల నకృత సహజ సృష్టి శక్తి
నిరతము వర్తిల్లుచుండు నిర్నిద్రత వర్ధిల్లును
అతివేలమ్మైన దివ్య హార్దికమౌ ప్రసన్నతి మాత
నిత్య నవ్య శక్తు లెల్ల నిధులై తగు నవధి లేక ॥ 3715

†(6) విశ్వ సృష్టి సర్వస్వము విశేష క్రతు శతములుగా
నిత్య చలన గతుల మహిత నిర్మల తత్త్వము వరలఁగ
దేవాఽళుల దివ్యశక్తిఁ దేజరిల్లు స్థానమ్మగ
నన్యోఽన్యమ్మైన జగతి నపురూపపు టనుబంధా
లైక్యములై తనరారఁగ నమరాకృతు లొప్పంగా
నానందపుఁ బ్రకృతి రూపు లతి సహజములై వర్తిల
యుత రూపము నిత్యమ్మౌఁ బృథుశక్తుల నతులితమౌ
నర్క దీప్తు లొప్పారఁగ నమేయంపు శక్తులతో
నఖిలపదార్థ గణతతులను నమర దేవ తత్త్వాలను
సకల సృష్టి వర్తిల్లును శశ్వద్గతు లొప్పారఁగ ॥ 3716

†(7) మధుమత్తమ్మౌ రీతిగ మహిమాన్విత విశ్వ మెల్ల
శబ్ద రూపమై పరలెడి సర్వ సత్తాక శక్తి
వృషభ గతుల రోదసిలో విస్తృత గతి వర్తిల్లును
అవధి లేని ఆనందపు టర్ణవాల నతివేలపు
మహితశక్తి విహితమైన మాన్య పదార్థ జనిత గతుల
అఖిల సృష్టి అలరారును నజస్యంపు టక్షయ రతి
దీపిత రక్తుల నఖిలము దివ్యాఽమృత శక్తి తత్త్వ
విస్తృతమై విపులమ్మై విమలమ్మై వర్తిల్లఁగ
నంతులేని రూపముగా ననంత దీప్తు లొప్పారఁగఁ
గ్రాంతి కాంతి శక్తు లెల్లఁ గ్రాలు నిత్య సత్యములై ॥ 3717

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) సృష్టి బ్రహ్మశక్తిగాఁగఁ జెలఁగు నిత్య చైతన్యత
రజితాద్రియు హేమాద్రియు రాజిల్లఁగ వీర్య మౌచు
వసు శక్తులు బలవర్ధక వైభవానసమమహితములై
పురుష శక్తి సంయమనపుఁ బూర్ణ దీప్తులొప్పారఁగఁ
బ్రకృతిలోన సహజ గతుల నకృతములై వెలయంగా
నతిలోకపు దీప్తరతుల నతివేలపు మూర్తములై
నద్భుతగతి వర్ధిల్లఁగ నపురూపపు శక్తులతో
సర్వ గోళ లోకాలను నడపుల శక్తులు వరలఁగఁ
బ్రకృతి వీర్య శక్తి దివ్య వికృతిగాఁ దనరారఁగ
విశ్వసృష్టి తొలి శక్తిగ విస్తృతగతి వెలయుచుండు ॥ 3718

†(9) అర్కులకే అర్కుఁడైన ఆదిత్యుని విశేష శక్తి
దివ్య దేవ గణతతులకు సవ్య నిత్య తత్త్వగతులు
నక్షయగతి నక్షరరతి నద్భుతముగ వర్తిల్లఁగ
జిత్రవిచిత్రమైన విమల చిత్రశక్తు లొప్పారఁగ
హృద్దీప్తుల కృద్దీప్తుల సద్దీప్తుల చిద్దీప్తులు
హద్దు పద్దు లేని శక్తి నానందపు రూపులతో
నతిలోకపు టాకర్షణ ప్రతిరహితపు మహాశక్తి
అసాధారణంపు గతుల నతివేలపు దీప్తరతుల
నఖిల సృష్టిఁ దనరారఁగ నమేయమౌ దీప్తమునై
ననసురూప మహితశక్తి ననిర్వచనీయ మౌను ॥ 3719

†(10) పసుపతిగా శ్రీవిష్ణువు అసమగతుల వర్తిల్లఁగఁ
జిదాకాశరూప మౌచు ముదాకలితమైన జగతి
ఋత శక్తుల నిత్యమ్మును సతత గతిని సంచరించు
పదార్థాల సంపదాళి బహుముఖమై విశ్వమ్మున
నఖ్యమ్మది వరలంగా సదా వివర్ధన మ్మొచును
జ్ఞాన ధారణంపు దీప్తమానమైన దివ్యశక్తి
విశ్వ వ్యాపిత మౌచును విస్తృత గతి వర్తిల్లును
నతిలోకపు శక్తులతో నతివేలపు దీప్తులతో
నసమానపు దీప్తరతుల నపురూపపు శక్తి రతుల
నఖిల సృష్టి వర్తిల్లును ననూహ్యమైన ఋత గతిమై ॥ 3720

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ అమరు గతుల గోళతతులు
రమణములై సూర్య చంద్ర రాజిత విభుత
భ్రమణ ప్రదక్షిణ మహా
క్రమతలు వరలంగ సంచరణ మొనరించున్ ॥ 3721

## అనువాకః—10; సూక్తమ్—113

ఋషిః—వైరూపః శతప్రభేదనః
దేవతా—ఇన్ద్రః
ఛందః—జగతీ; 10-త్రిష్టుప్

(1) తమస్య ద్యావాపృథివీ సచేతసా విశ్వేభిర్దేవైరను శుష్మమావతామ్ ।

యదైత్ కృణ్వానో మహిమానమిన్ద్రియం పీత్వీ సోమస్య క్రతుమాగ్ం[1] అవర్ధత ॥ 1307

(2) తమస్య విష్ణుర్మహిమానమోజసాంఽశుం దధన్వాన్ మధునో వి రప్శతే ।

దేవేభిరిన్ద్రో మఘవా సయావభిర్వృత్రం జఘన్వాగ్ం[2] అభవద్వరేణ్యః ॥ 1308

(3) వృత్రేణ యదహినా బిభ్రదాయుధా సమస్థిథా యుధయే శంసమావిదే ।

విశ్వే తే[3] అత్ర మరుతః సహ త్మనా ఽవర్ధన్నుగ్ర మహిమానమిన్ద్రియమ్ ॥ 1309

(4) జజ్ఞానః[4] ఏవ వ్యబాధత స్పృధః ప్రాపశ్యద్వీరో[5] అభి పౌంస్యం రణమ్ ॥

అవృశ్చదద్రిమవ సస్యదః సృజదస్తభ్నాన్నాకం స్వపస్యయా పృథుమ్ ॥ 1310

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. క్రతుమాగ్ంఽఅవర్ధత, 2. జఘన్వాగ్ంఽఅభవ, 3. విశ్వే తేఽఅత్ర. 4, జజ్ఞానఽఏవ,

5. వీరోఽఅభి. (వా.ప్ర.)

(5) ఆదిన్ద్రః సత్రా తవిషీరపత్యత వరీయో ద్యావాపృథివీ[1] అబాధత ।

ఆవాభరద్ధృషితో వజ్రమాయసం శేవం మిత్రాయ వరుణాయ దాశుషే ॥ 1311

(6) ఇన్ద్రస్యాత్ర తవిషీభ్యో విరప్శిన [2]ఋఘాయతో అరంహయన్త మన్యవే ।

వృత్రం యదుగ్రో వ్యవృశ్చదోజసాఽపో బిభ్రతం తమసా పరీవృతమ్ ॥ 1312

(7) యా వీర్యాణి ప్రథమాని కర్త్వా మహిత్వేభిర్యతమానౌ సమీయతుః ।

ధ్వాన్తం తమోఽవ దధ్వసే హత[3] ఇన్ద్రో మహ్నా పూర్వహూతావపత్యత ॥ 1313

(8) విశ్వే దేవాసో[4] అధ వృష్ణ్యాని తేఽవర్ధయన్త్సోమవత్యా వచస్యయా ।

రద్ధం వృత్రమహిమిన్ద్రస్య హన్మనాఽగ్నిర్న జమ్భైస్తృష్వన్నమావయత్ ॥ 1314

(9) భూరి దక్షేభిర్వచనేభిరృక్వభిః సఖ్యేభిః సఖ్యాని ప్ర వోచత ।

ఇన్ద్రో ధునిం చ చుమురిం చ దమ్భయఞ్ఛ్రద్ధామనస్యా శృణుతే దభీతయే ॥ 1315

(10) త్వం పురూణ్యా భరా స్వశ్వ్యా యేభిర్మంసై నివచనాని శంసన్ ।

సుగేభిర్విశ్వా దురితా తరేమ విదో షు ణ[5] ఉర్వియా గాధమద్య ॥ 1316

---

1. పృథివీఽఅబాధత, 2. విరప్శిశఽఋఘాయతోఽఅరం, 3. హతఽఇన్ద్రో, 4. దేవాసోఽఅధ,

5. షు ణఽఉర్వియా. (వా.ప్ర.)

## అనువాకము—10 ; సూక్తము—113

ఋషి—వైరూపుఁడైన శతప్రభేదనుఁడు†

దేవత—ఇంద్రుఁడు†

(1)*గీ॥ దివ్య చేతనమును గల్గు దివియు భువియు
సురలుతోడుత నింద్రుని పరమ బలము
నెలమి రక్షించుఁగాక! నీ యింద్ర బలము
తొలుత మమ్ముల రక్షించి వెలుఁగుఁగాక! ॥ 3722

*గీ॥ వృత్ర హననాదికంబు తా వేట్కఁ జేయు
నట్టి యింద్రుఁడు మహిమను నధిక వీర్య
సంపదను బొందునప్పుడు సరస మైన
సోమమును ద్రావి యాతఁడు శోభఁ గాంచె ॥ 3723

(2)*గీ॥ విష్ణు వను వాఁడు మదకర విమల సోమ
ఖండమును హెచ్చరించుచు మెండు సహజ
తేజమున జాత మైనట్టి భ్రాజితేంద్ర
మహిమఁ గొనియాడుచుండెను మరల మరల ॥ 3724

*గీ॥ తోడఁ గూడు మరుత్తులతోడఁ గూడు
నట్టి మఘవకు వృత్రుని హతముఁ జేసెఁ
గావునన్ వాఁడు దేవతా గణమునందుఁ
దా వరేణ్యుఁడుగా వెల్గెఁ బావనుఁడయి ॥ 3725

(3)*గీ॥ రణముఁ జేయంగ నాయుధ రాజి నెపుడుఁ
దాల్చుచున్ నీవు వృత్రుని దరి వసింతు
వప్పుడే నీదు వీర్యంబు నతిశయముగ
సంతసంబునఁ జెప్పెద సత్వర మతి ॥ 3726

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 99వ పుటలోను, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలోను, నీ సూక్తమునకు ఋషి "శతప్రభేదనుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

•గీ॥ ఓయిః యుద్దీర్ణ బలవంతః యోయిః యింద్రః
యిప్పుడే నీదు మహిమను నెల్ల వీర్య
మును మరుత్తులు తమతోడ మోద మలర
వృద్ధిఁ జేసిరి కాదెః యీ విశ్వమందు ॥ 3727

(4)•గీ॥ పుట్టినంతనె యింద్రుఁడు పూర్ణ బలముఁ
బూని శత్రులఁ బీడించెఁ బూర్ణ శక్తిఁ
దవుచు సంగ్రామ బలమును నధిగమించి
స్వబలమును జూచుచుండెఁ దా సత్వరముగ ॥ 3728

•గీ॥ అంబుదముఁ గొట్టి యింద్రుఁడు స్యందమాన
జలముల నడపఁజేసెను బలముఁ బూని
దివిని గర్మేచ్ఛచేత నుత్సవము మీరఁ
గడు నిరుద్ధము కావించి గ్రాలెసుండుః ॥ 3729

(5)•గీ॥ సేనలకు నీశ్వరుం డయ్యె శ్రీ మహేంద్రుఁ
డలఁడె రోదసులందున్న యరులఁ ద్రుంచె
వరుణునకు మిత్రునకుఁ గూడఁ గరము హవ్య
మును నొసంగెడు యజ్వకు ముదముఁ గూర్ప
నాయసం బగు వజ్రంబు నతఁడె దాల్చె ॥ 3730

(6)•చ॥ జలములఁ గట్టు[1] వానిఁ దమసావృతు వృత్రుని వీర్య సంపదన్
బలమును బూని వాసవుఁడు[2] వావిరిఁ గొట్టెడు కాలమందె నా
జలములు శత్రు మండలముఁ జంపిన యింద్రుని సత్ఫలంబు తా
మిలఁ బ్రకటింప వేగముగ నేగె[3] జగంబు ముదంబు నొందఁగన్ ॥ 3731

(7)•గద్యము॥
స్వబలములచే యుద్ధమునకు యతమాను లగు నింద్రవృత్రులు వీర్యమును సంయోజనముఁ జేసిరి. వారిలో నింద్రుఁడు వృత్రుని జంపఁగా నిబిడ మగు తమస్సు ధ్వంస మయ్యెను. మరియు నింద్రుఁడు హూరులతోఁ బ్రథమాహూయమానుఁ డయ్యెను ॥• 3732

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమానివేంకటనరసింహశాస్త్రి

1. దాల్చువాని, (తా.పా.), 2. వాసవుడు పట్టుమ, (తా.పా.), 3. నేగెడుగాదె తలంచి చూడఁగన్. (తా.పా.).

•గీ॥దక్షములు మంత్రయుక్తములే తగినవి యగు, స్తుతులచేతను నో మహా స్తోతలార!
మరల మరల మహేంద్రునిఁ గరము మీర, నుగ్గడింపుడు గాంభీర్య ముప్పతిల్ల. (తా.పా.).
ఈ పద్యము 7వ ఋగనువాదముగా వ్రాయఁబడి కొట్టివేయఁబడినది. కాని యీ పద్యమే తాలిపాదములోని "మంత్ర" శబ్దమునకు మారుగా "మరియు" శబ్దము నుపయోగించి 9వ ఋక్కునకు కనువాదముగా 103 పుటలో శ్రీనేమానివారిచే స్వయముగా వ్రాయఁబడినది.

(8)*గీ॥ వృత్ర హననంబు జరిగిన వెనుక విశ్వ
దేవతలు సోమసహిత వాగ్గీఃప్ర విధుల
నింద్ర! తావక బలముల నెల్ల వృద్ధి
పరచుచున్నారు[1] కడుఁగడుఁ బంత మలర ॥ 3733

*గీ॥ అగ్ని తన దంతములఁ జేత నన్నముఁ గడు
భక్షణంబును జేసెడు పగిది నింద్ర!
వజ్ర సంపాదితాన్నము వలయు దాని
జనుఁడు భక్షించె నతిశయ సంతసమున ॥ 3734

(9)*గీ॥ దక్షములు మరియు[2] యుక్తముల్ తగినవి యగు
స్తుతులచేతను నో మహా స్తోతలార!
మరల మరల మహేంద్రుని స్థిర బలంబు
నుగ్గడింపుఁడు! గాంభీర్య ముప్పతిల్ల ॥ 3735

*గీ॥ ఇల "దభీతి"పేర నెసఁగు రాజర్షికై
ధుని చమూరు లనెడు దోషి వరులఁ
బరిహరించుచుండి పలికెడు మా నుతి
నాలకించుచుండె[3] నమరరాజు ॥ 3736

(10)*గీ॥ ఎట్టి ధనముల సురలకు నెల్ల వేళఁ
బూజఁ జేయుదునో! బహు పూర్ణ నుతుల
నుచ్చరించుచు నట్టి మహోత్తమ ధన
ములను గొనితెచ్చి మా కిమ్ము! [4]పూతదేవ! ॥ 3737

*గీ॥ అట్టి ధనములచేతనే యన్ని దురిత
ములను హరియింపఁగల[5] మార్య ముదితులమయి
మేము సేసెడు స్తోత్రంబు మిక్కుటముగ
గౌరవముఁ జూపి వినుమయ్య! వీర! నీవు ॥ 3738

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. పరచుచున్నారు కారపేః, (తా.పా.), 2. ఇక్కడ నింద్రగణమునకు మారు "పంచలఘుగణము" ప్రయుక్తమైనది.
3. నాలకించుచుండె నతిముదమున, (తా.పా.), 4. మోద మలర, (తా.పా.), 5. హరియింపఁగలమయ్య. (తా.పా.).

## సూక్తము—113

ఋషి—వైరూపుఁడైన శతప్రభేదనుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) సోమాఽమృత దివ్యశక్తి సీమముగా విశ్వమ్మున
సర్వ గోళ లోకాలను సదా స్రవియించుచుండు
ద్వైవీయమ్మౌ ప్రాకృత ధర్మమ్మది వరలంగాఁ
బరిగ్రహించుఁ బ్రకృతి యెల్లఁ బ్రసాదించు జరాఽచరాల
దివి భువి లోకా లన్నిటఁ దేజరిలఁగ దీప్తశక్తి
తిమిరాళుల సర్వస్వము దివ్య దేవతాళి మహిమ
విధ్వస్తమ్మగుచునుండు విమల నిత్య సమరమ్మునఁ
జేతన శక్తులు జగతిని జిద్విలాస గతు లొప్పఁగ
సర్వమ్మును రక్షించును సదమలమౌ సహజ ధర్మ
మలరంగా ననునిత్యముఁ జలనగతుల నమేయముగ ॥ 3739

†(2) విష్ణు దేవు కృప మీరఁగ విమలశక్తి ప్రసారాల
లోకాలను జీకట్లను బోకార్చెడి ఋత దీప్తుల
నమృతరూప చంద్రిక లవి అమలగతుల వెల్లివిరియు
మధు రూపమ్మౌ శక్తుల మహిమాన్వితమై వరలఁగ
విశ్వ విహిత సృష్టి శక్తి విమలమైన జలనాభిని
మ్రింగివేసి ఉష్ణ గతులు మింట సర్వలోకాలను
వ్యాప్తి చెంది అగ్నిగుండ మట్లు సృష్టి మండిపోవు
నట్లు చేయు వృత్రాసురు నంగాంగము వధియించుచు
మేఘమాల లెల్ల జగతి మృగశిరలై జలము లీయఁ
బ్రకృతియెల్ల మహితముగాఁ బ్రాణకలితమై వరలును ॥ 3740

†(3) అహి రూపమ్మై విస్తృత మహిత విష ప్రాయమ్మౌ
నగ్న్యుగ్ర వికార వృత్తు నస్తంగత మొనరించుచు
నమృతశక్తి విశ్వమ్మున నపురూపమ్మై వెలయఁగ
మొయిళుల రక్షించి జలద మూర్తు లెల్లఁ గురియంగా
అతిలోకముగా వర్షము లతి సహజములై పరఁగఁగ
సర్వ జగత్ ప్రకృతిమాత సకలాంతర్గతుల బహిః
ప్రాణ తతుల వర్ధిల్లఁగఁ బ్రభవించును బునర్జన్మ
జీవాఽభ్యుదయ మహామహిత శ్రీ లలరారఁగ
సృష్టి స్థితి శక్తు లెల్లఁ జెలఁగఁ గృత్యమై ప్రకృతికి
నిత్య సత్య విధిగాఁగను నిఖిలమ్మును వర్ధిల్లును ॥ 3741

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అతిలోకపు శక్తులతో నపురూపమ్మౌ దృఢతను
రజితాద్రిగ హేమాద్రిగ రాణ చెందు స్థిరత మీర
వృత్రహ స్తగతమై తగు విషమయమౌ "నభి" శక్తిని
నగ్ని దోష వినాశమ్ము నసాధారణ గతి నొసటు
వజ్ర శక్తి మహా రూప ప్రాభవాన విధ్వస్తము
కావించుచు జల శక్తులఁ గాపాడుచు ననునిత్యము
విశ్వమ్మున వృష్టి రతుల శశ్వచ్ఛ్రేయాలు వెలయ
నపురూపపుఁ బ్రకృతిగా నమేయమౌ వికృతిగాఁ
జక్రనేమి క్రమముగాఁగఁ జర్విత చర్వణ మట్లుగ
విశ్వ శ్రేయస్కరమై విమలమ్ముగ వర్తిల్లును ॥ 3742

†(5) మిత్ర వరుణ శక్తులకై మిన్నంటెడి వజ్రశక్తి
ద్యావా పృథ్వుల నన్నిట దైవీయమ్మౌ దీప్తుల
నాధారపీఠమ్ము గాఁగ వేధాధారమ్ము గాఁగ
సృష్టి సత్ర సంచయాల శ్రేయోదాయక మౌచును
నిత్య దైవ లీల గాఁగ సత్య భావ విహితమ్ముగ
సుఖ శాంతుల సర్వస్వము శుభదాంతుల ప్రభావాల
నతివేగపుఁ బ్రయాణాల నతిలోకపు విజయ కృతుల
నాదాన ప్రదానాల నఖిలమ్మును నలరారును ॥ 3743

†(6) తపశ్శక్తి విశ్వమ్మున దాహ రూప తత్త్వమ్మున
జల నాభిని సర్వస్వముఁ గలుషిత గతి విధ్వస్తము
కావించుచు నుష్ణశక్తి కకావికలుగాఁ గాఁగను
దిమిరశక్తి పరివృతమై అమితమ్మౌ సేనాగతి
వృత్ర శత్రు శక్తులతో విశ్వ శాంతి సౌభాగ్యము
లలరంగా నింద్రశక్తు లమృతమైన జలగతులను
వాయుతతుల నలరించుచుఁ బ్రకర్షముగ జగతిలోన
సలిల ప్రదాతగాఁగ సర్వ విశ్వమున వర్తిలు ॥ 3744

†(7) మహావీర్య పంచభూత మహిమాన్విత శక్తులతో
"నభి" శక్తు లన్నియు నతల కుతల గతులు గాఁగ
అంధకార మూల శక్తు లఖిలమ్మును జెదరఁగొట్టి
విధ్వస్తము కావించుచు విమలమైన దివ్యశక్తి

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

మహిత గతుల జలధారల మాన్యత మీరఁగ జగతిని
నానిలాద్భుత ప్రభావాల నావిష్కృతమై వరలును
నాకసంపు ధ్వాంతగతుల నపురూపపు దీప్తులతో
హర్షరతులు వెల్లివిరియ వర్ష గతుల నొప్పారును ॥ 3745

†(8) విశ్వ సంక్షేమ గతులు విస్తృతమౌ ననిల శక్తి
వృత్రరూప తిమిరాగ్నుల విధ్వస్తము కావించుచు
విచిత్రముగ విశ్వమ్మున విమల "నాభి" శక్తి తతుల
అనిర్వచనీయమైన అఖిల సౌఖ్య సౌభాగ్యపు
మహిత శక్తిఁ గాపాడుచు మర్మ దీప్తు లొప్పారఁగ
ససాధారణంపు రతుల నసామాన్య దివ్యగతుల
జగతిని జలరూపాలను నగణితముగఁ గాపాడుచు
సకల సృష్టి సోమామృత శక్తి నెల్ల నిలుపుచుండు ॥ 3746

†(9) ఋత దీప్తుల మహితమైన ఋక్ఛక్తుల తత్త్వాలను
దక్షతమై రక్షణగతి నక్షయ్యమ్ముగఁ దనరుచు
నాకాశము ననల సలిల మనిలావనులు మృత్తతులును
స్నేహములకు స్నేహముగాఁ జిత్స్నిగ్ధత వరలంగా
నక్ష్యతమై సృష్టిలోన సదమలగతి వర్ధిల్లుచు
వర్తిల్లఁగ జల శక్తులు నర్తించఁగ జగతిలోన
శబ్ద శక్తు లొప్పారును సత్వ సత్యతత్త్వ మెనయ
ససనురూప దీప్తులమై నద్భుతగతి నమరంగను ॥ 3747

†(10) సృష్టిలోనఁ గాంతి శక్తి చిద్విలాస రూప మొప్ప
విశ్వ దురిత సర్వస్వము వినాశమ్ము కావించుచు
నపురూపపు శక్తులతో ననురూప దీప్తులతో
నమేయంపు టగ్ని శక్తు లఖిలమ్మున వ్యాపించును
జల శక్తులు జగతిలోనఁ జదలంటఁగ నమృత గతుల
నభి శక్తుల దుష్ట రతుల నాకశించు వృత్రాసురు
విధ్వస్తము కావించుచు నధ్వరతుల గగనాధ్వర
సృష్టి క్రియ లలరారును దిక్కుల వెలుఁగులు మీరఁగ ॥ 3748

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—113

ఋషి—వైరూపుఁడైన శతప్రిభేదనుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

†(1) విశ్వ దేవత లెల్ల విశ్వాక్షులై నిలిచి
సృష్టి సంక్షేమాల వ్యష్టి సమిష్టులుగ
నపురూప గతితోప నతివేల రతులతో
సోమాఽమృతపు శక్తి శుభ సంకీర్ణమై
జగతి సంపూర్ణమై చదలంట సుఖ రతుల
దివి భువుల నన్నింట దేదీప్యమాన గతి
విశ్వ తిమిరాఽవళుల నశ్వి దీప్తులు మీర
విధ్వస్త మొనరించి విమల శక్తులు వెలుఁగ
విజయ గతిమై విపుల విజృంభణ లలరంగ
సృష్టి క్రతువులు నిత్య దృష్ట ఋతములుగాఁగ
బహుముఖ వీర్యగతి పరమార్థమై తనరఁ
జిత్తమై విశ్వమ్ము చిద్రూపమై ప్రబలు ॥ 3749

†(2) విశ్వాంధకారమున్ విధ్వస్త మొనరించు
విష్ణుమహిమము సృష్టి విమల తేజము లొప్ప
విపుల శక్తులు మీర నపరాజిత గతుల
దివ్య రూపాలతో దేదీప్యమాన రతి
నపురూపమౌ శక్తు లద్భుతముగా వరల
నతిలోక గతులమై నతివేల రూపాల
నోజో గుణ మ్మొప్ప నుద్భూతమౌ జగతి
నాదిత్య శక్తులను నఖిలాండ పిండాలు
బ్రహ్మాండ భాండాలు వరలంగ విశ్వాన
సలిలగతులను మొయిళు లమృతజలముల నొసఁగ
సోమాఽమృతపు శక్తి సృష్టిలో విరియంగఁ
జంద్రకాంతుల సౌర సౌభాగ్యములు మీర
నిత్య సంచలనగతి సత్య సంవరణ రతి
నఖిలమ్ము తనరారు నఖిలేశు లీలగా ॥ 3750

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) వృత్రు దుశ్శక్తులను మిత్ర రహితమ్ముగా
విశ్వాన వ్యాపించు విష శక్తు లఖిలమ్ము
లపురూపమై వెలయు నాదిత్య గతి మెయిన్
మూలమట్టమ్ముగా మూర్తి రహితమ్ముగా
విధ్వస్తమై పోవ విమలమౌ దీప్తులన్
మహితమౌ నమృతంపు మాన్యమౌ సోమమయ
శీతలాఽమృత కిరణ ధాతగా శశిగతుల
సచ్చిదాఽఽనందాల సర్వమ్ము వ్యాపింప
నంతరాంతర గతుల నతివేలమై వెలయ
నపురూప శక్తుల నద్భుతావహముగా
నతిలోకమై వెలయు నాదిత్య శక్తులే
విశ్వ రక్షక మౌచు నశ్విగతు లొప్పార
నక్షర భరితమై అక్షయ పరముగా
ఋక్షగతు లవి వరల దీక్షా క్రమశిక్షణల
నదృశ్యమౌ శక్తు లనంతగతులఁ దగ
విశ్వ శాంతికి దివ్య బృందావన మ్మగును ॥ 3751

†(4) వెలుఁగు చీకట్లకు విపుల విశ్వములోన
నిత్య గతిమై జరుఁగు సత్య యుద్ధమ్ములన్
లోక కంటక మౌచు రూక్ష విష శక్తులన్
అతిభయంకరముగా నఖిల జగతిని సర్వ
నాశనమ్మును జేయ నానావిధ బీభత్స
గతుల కల్లోలాలఁ గకావికలుగఁ జేయు
"నభి" శక్తులను నెల్ల నతిలోక దీప్తులన్
విధ్వస్త మొనరించి విజయ రూపమ్మైన
అజయ్యమౌ శక్తి నక్షయ్యమౌ దీప్తి
సమరాంగణమ్ములో సదమలమై వెలయ
నమరాఽమృత గతుల నపురూప దీప్తులన్
నాక శుభ సౌఖ్యాల నవ్య నిత్యత మీర
విశ్వరూప మ్మౌచుఁ బృథుశక్తి వరలంగ
రవి చంద్ర రూపాల రాజిల్లు దివ్యతా
తేజాలు వ్యాప్తమై దేదీప్యమానతల
నసుర శక్తులఁ దునుము నసమాన గతులమై ॥ 3752

†రచయిత.—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) సృష్టి సత్రమ్ములన్ జెల్వొందఁగా విష్ణు
విష్ట పూర్తము గాఁగ వ్యష్టి సమిష్టులను
నతిలోక గతులమై నద్భుతావహముగా
నతివేల శక్తులన్ ధృతమైన గతి మెయిని
దివి భువుల సర్వాన దివ్య శక్తులు మీర
మిత్రునికి వరుణునికి మేల్మి నుతి హారాల
వజ్రదీప్తుల మీరు వరవీర జయ శక్తి
నపురూప గతు లొప్ప నతులితమౌ రీతి
బహు రూపమౌ సృష్టి సత్వతత్త్వము పరల
నతి ప్రగల్భమ్మైన నత్యపూర్వ ప్రభల
నఖిలమ్ము వెల్గొందు నను మేయమౌ గతిని
నజయ్యమై వరలు నపురూప వజ్రగతు
లరాతి భంజకత లసదృశమై తనర
నఖిలేశు ఏలఁ దగు ననంతమౌ జగతిలో ॥ 3753

†(6) జలశక్తుల విధ్వస్తము ఛల శక్తులఁ గావించెడి
వృత్రరూప దుశ్శక్తులఁ జిత్రముగాఁ జంపివైచు
నతిలోకపు శబ్దశక్తు లతివేలములై వెలయఁగఁ
దిమిరాళులఁ బరిప్లుతమై సమరగతుల సలరారెడి
సంక్లేశము పొనరంగాఁ జదలంచెడి "అభి" శక్తుల
హతమార్చెడి విష్ణు దేవు నుత మహితపు వజ్రశక్తి
మహోగ్రమైన దివ్యాగ్నుల విహరించుచు గగనమ్మున
నరాతి తండ దుశ్శక్తులఁ బరాభవించి పరాక్రమించి
సంహారము కావించెడి శంకరమౌ జగచ్ఛక్తి
జల శక్తులఁ బ్రసాదించు శాంతి శుభ సుఖమ్ము లలర
విశ్వమ్మున నశ్వరగతి విమల దేవ దివ్య శక్తి
అపురూపమ్మై తనరఁగ నద్భుత గతి వరలంగా ॥ 3754

†(7) తొలిరూపములై సృష్టిని నలవోకగ నమృత గతుల
నాకాశము ననల సలిల మనిల మృత్తతు లవి
వీర్యములై విశ్వ సృష్టి ధార్యములై మహిత శక్తి
మహనీయమ్మై వెలుఁగును మహిత దైవ శక్తు లలర

†రచయిత:—వాఙ్మయ మహార్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

విష్ణుశక్తి విశ్వమ్మున విమల విజయ రూప మౌచుఁ
దమోరూప దుశ్శక్తుల ధ్వంసమ్మును జేసిచేసి
శబ్ద శక్తు లొప్పారఁగ సంహరించి వృత్రాసురు
"నాభి" శక్తి రక్షించుచు నానా జల రాసు లలర
ననూహ్యమైన విశ్వశక్తి నతిలోకముగా నిలుపుచు
విశ్వకాంతి సమకూర్చును సర్వదీప్తు లొప్పారఁగ ॥ 3755

†(8) శాబ్దికమౌ శక్తితతుల జగతి సత్యమును వరలఁగ
విష్ణుశక్తి విజయ గతుల వృష్టిశక్తి వర్ధిల్లఁగ
నపురూపమ్మౌ దీప్తిని నల వృత్రుని సంహరించి
జల శక్తుల జలదములను సర్వవిధులఁ గాపాడుచు
సోమాఽమృత దివ్యవృష్టి క్షేమగతులఁ బెంపొందఁగ
సృష్టి సహజ మౌచు వరలఁ జిన్మయమై విశ్వమ్మది
అగ్ని దీప్తు లొప్పారఁగ నంతరాంతరముల నిలిచి
విశ్వ సృష్టి జ్వలియించును విమల శక్తు లొప్పారఁగ ॥ 3756

†(9) అక్షరమయ పద గతులను నక్షయమౌ శబ్ద శక్తి
ఋక్తతులను ఋతశక్తుల ఋషిదీప్తుల వెల్గొందెడి
దివ్య దేవ శక్తితతులు తేజరిల్ల విశ్వమ్మున
నతిలోకమ్మౌ శక్తుల నపురూపపు దీప్తులతో
సఖ్యములకు సఖ్యముగా సర్వ సంక్షేమ రూప
సఖ్య తత్త్వ మొప్పారఁగ సర్వ పంచ భూతతతుల
అన్యోఽన్యత లలరంగా నవినాభావమ్ము లౌచు
నపూర్వ గతుల సృష్టి రూప మపాతముగ వరలుచుండు
విశ్వ దేవ రూప మౌచు విద్యుదారపు శక్తు లొలయ
అంతరహిత సృష్టి తనరు నఖిలేశుని యిష్టి కాఁగ ॥ 3757

†(10) ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతు లవి విశ్వమ్మున మిన్నంటెడి శబ్ద తతుల
నపురూపముగా వెల్గుచు అన్యోఽన్యాఽన్వితములై
విశ్వ దురిత దుశ్శక్తుల విధ్వస్తము కావించుచు
సోమాఽమృత శక్తు లొప్ప సృష్టి పరి వ్యాప్త మౌచు
భువి దివులను సర్వమ్మున నివచనమయ దురితాశిని
వినాశమ్ము కావించుచు విశ్వ సౌభాగ్య మలర
నుత్తమోత్తమ శక్తులు ఉద్భూతములై వరలఁగ ॥ 3758

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ ఉత్తమ గతు లొప్పారఁగ
సత్తును జిత్తును ననంత జనిత జగానన్
మృత్తులు మరు దనల జల వి
యత్తలము లలరును విశ్వ యజ్ఞము కాఁగన్ ॥ 3759

## సూక్తమ్—114

ఋషిః—వైరూపః సధ్రిః, తాపసో ఘర్మో వా
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్; 4-జగతీ

(1) ఘర్మా సమన్తా త్రివృతం వ్యాపతు స్తయోర్జుష్టిం మాతరిశ్వా జగామ ।
దివస్పయో దిధిషాణా[1] అవేషన్ విదుర్దేవాః సహసామానమర్కమ్ ॥ 1317

(2) తిస్రో దేష్ట్రాయ నిరృతీరుపాసతే దీర్ఘశ్రుతో వి హి జానన్తి వహ్నయః ।
తాసాం ని చిక్యుః కవయో నిదానం పరేషు యా గుహ్యేషు వ్రతేషు ॥ 1318

(3) చతుష్కపర్దా యువతిః సుపేశా ఘృతప్రతీకా వయునాని వస్తే ।
తస్యాం సుపర్ణా వృషణా ని షేదతుర్యత్ర దేవా దధిరే భాగధేయమ్ ॥ 1319

(4) ఏకః సుపర్ణః స సముద్రమా వివేశ స [2]ఇదం విశ్వం భువనం వి చష్టే ।
తం పాకేన మనసాపశ్యమన్తిత స్తం మాతా [3]రేళ్హి స ఉ రేళ్హి మాతరమ్ ॥ 1320

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. దిధిషాణాऽఅవేషన్, 2. సऽఇదం, 3. మాతా రేళహి సऽఉ రేళహి. (వా్రి.ప్ర.)

(5) సుపర్ణం విప్రాః కవయో వచోభిరేకం సన్తం బహుధా కల్పయన్తి ।
ఛన్దాంసి చ దధతో [1]అధ్వరేషు గ్రహాన్త్సోమస్య మిమతే ద్వాదశ ॥ 1321

(6) షట్త్రింశాగ్ంశ్చ[2] చతురః కల్పయన్తశ్ఛన్దాంసి చ దధత[3] ఆద్వాదశమ్ ।
యజ్ఞం విమాయ కవయో మనీష[4] ఋక్సామాభ్యాం ప్ర రథం వర్తయన్తి ॥ 1322

(7) చతుర్దశాన్యే మహిమానో[5] అస్య తం ధీరా వాచా ప్ర ణయన్తి సప్త ।
ఆప్నానం తీర్థం క[6] ఇహ ప్ర వోచద్యేన పథా ప్రపిబన్తే సుతస్య ॥ 1323

(8) సహస్రధా పంచదశాన్యుక్థా యావద్ ద్యావాపృథివీ తావదిత్ తత్
సహస్రధా మహిమానః సహస్రం యావద్బ్రహ్మ విష్ఠితం తావతీ వాక్ ॥ 1324

(9) కశ్ఛన్దసాం యోగమా వేద ధీరః కో ధిష్ణ్యాం ప్రతి వాచం పపాద ।
కమృత్విజామష్టమం శూరమాహుర్హరీ[7] ఇన్ద్రస్య ని చికాయ కః స్విత్ ॥ 1325

(10) భూమ్యా[8] అన్తం పర్యేకే చరన్తి రథస్య ధూర్షు యుక్తాసో[9] అస్థుః ।
శ్రమస్య దాయం వి భజన్త్యేభ్యో యదా యమో భవతి హర్మ్యే హితః ॥ 1326

1. దధతోఽఅధ్వరేషు, 2. త్రింశాంశ్చ, 3. దధతఽఆద్వాదశమ్, 4. మనీషఽఋక్సామా, 5. మానోఽఅస్య, 6. తీర్థం కఽఇహ, 7. హరీఽఇన్ద్రస్య, 8. భూమ్యాఽఅన్తం, 9. యుక్తాసోఽఅస్థుః. (వ్రా.ప్ర.

## సూక్తము — 114

ఋషి—విరూపుఁడైన సధ్రి లేక తాపసుఁడైన ఘర్మuఁడు†
దేవత—విశ్వేదేవతలు†

(1)*గద్యము॥
సంవ్యాప్త దిగంతులు, దీప్యమానులు నగు నగ్న్యాదిత్యులు మూఁడు లోకములందుఁ
దేజస్సులతో వ్యాపించిరి. అంతరిక్షమందున్నవాయువు వారియందుఁ బ్రీతిని జెందు
చున్నది. ఎప్పుడు వేదత్రియ తేజస్సహితుఁ డగు నర్చనీయ సూర్యుని దీప్య
మానము లగు స్వరశ్మలు పొందినవో; యప్పుడవి లోకత్రియ ధారణ
సమర్థములై ద్యులోక సంబంధి పయస్సు వర్షించినవి ॥ 3760

వేరొక యర్థము

*గద్యము ॥
స్వయముగఁ గలిసిన జీవేశ్వరులు, సత్త్వరజస్తమోగుణాత్మిక యగు మాయను నియంతృ
నియమ్య భావమున వ్యాపించిరి. వరమాత్మ సంభోక్తవ్య పదార్థములవల్ల సంజాతమైన
ప్రీతిని బొందెను. ఆ వరమాత్మను వేదమయుఁ డగు సూర్యుని దేవతలు
తెలిసికొనుచున్నారు ॥ 3761

(2)*గద్యము॥
లోకత్రియమందుఁ గల అగ్న్యాది దేవతలను హవిఃప్రదానముకొఱకు నుపాసనమును
జేయుచున్నారు. పిమ్మటఁ బ్రఖ్యాత కీర్తులు గల వహ్నులు జగత్ప్రాపిక లగు
దేవతలను దెలిసికొనుచున్నారు ॥ 3762

వేరొక యర్థము

*గద్యము ॥
ఎవరు సృష్టిస్థితిసంహృతులను నాత్మకర్మభోగదానముకొఱకు నుపాసనమును జేయుచున్నారో;
వారు మంత్రి దృశ్యాది పదార్థమును గుర్తెరుంగకుండనున్నారు. సంసార వోఢలు వానిని
నెరుంగకుండనున్నారు. క్రాంతదర్శులు సృష్ట్యాదులకు మూలకారణ మగు పరమాత్మను
మిక్కిలి తెలిసికొనుచున్నారు. ఉత్కృష్టము లగు కర్మలయందు నే ప్రవృత్తులు
గలవో; వాని మూలకారణమును దెలిసికొనుచున్నారు ॥ 3763

(3)*గద్యము॥
చతుష్కోణ, శోభనాలంకార, ఘృతప్రముఖ హవిష్క యగు వేది, జ్ఞాతవ్య పదార్థములను
గర్మలను ఆచ్ఛాదించుచున్నది. ఆ వేదియందు హవిస్సు నొసంగువారు సుపతను లగు
జాయాపతులు కూర్చున్నారు. ఆ వేదియందు నగ్న్యాదులు స్వస్వభాగమును
ధరించుచుండిరి ॥ 3764

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 103వ పుటలో నీ సూక్తమునకు ఋషి "సధ్రి"గాను, దేవత "విశ్వేదేవతలు"గాను
వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "శధ్రి లేక ఘర్మuఁడు" ఋషిగాను
"విశ్వే దేవతలు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

వేరొకయర్థము

*గద్యము ॥

నామాఖ్యాతోపసర్గనిపాత లను నాల్గు కపర్ద స్థానీయములు గలదియు, దీప్యమాన వర్ణావయవయు* నగు నీ యౌపనిషదీవాక్కు జ్ఞానముల నాచ్ఛాదించుచున్నది. ఆ వాక్కునందు జీవపరమాత్మ లున్నారు ॥ 3765

(4)*గద్యము ॥

సర్వకార్యములయం దసహాయుఁడై సుపతనము గలవాఁడై మధ్యమ స్థానుఁ డగు దేవుఁడు అంతరిక్షమును బ్రవేశించి భూత జాతమును బ్రవేశించుచున్నాఁడు. ఆ దేవుని బరిపక్వ మనస్సుతో సమీపమందుఁ జూచితిని. ఉదక నిర్మాత్రి యగు మాధ్యమిక వాక్కు నా దేవుఁడు జీవింపఁజేయుచున్నాఁడు ॥ 3766

వేరొక యర్థము

*గద్యము ॥

నిరాధారసంచారియై యేకుఁడైన ప్రాణవాయువునే అంతరిక్షమును లేదా ప్రపంచ జాతమును సృజించి అందుఁ బ్రవేశించెను. వాయు పక్షమున వాయ్వాదిరూపమునఁ బ్రవేశించెను. వాఁ డీ సర్వలోకమును విశేషముగ స్థాపించుచున్నాఁడు ప్రాణము కలిఁగియుండఁగా లేదా పరమాత్మ కలిఁగియుండఁగా జీవముగల పురుషులు లోకమును విఖ్యాతముగఁ జేయుచున్నారు. అట్టి దేవుని నుపాసకుఁడ నగు నేను బరిపక్వ మనస్సుతో స్వహృదయమందుఁ జూచితిని. ఆ ప్రాణమును వాక్కు పొందుచున్నది ॥ 3767

(5)*గీ॥ ఋషులు మేధావు లైనట్టి మనుజ వరులు
పతన పరమాత్మ నొక్కని పరమ నుతుల
బహు విధంబుల నతిశయ భక్తి కలుఁగఁ
గల్పనముఁ జేయుచున్నా రనల్ప బుద్ధి ॥† 3768

*గీ॥ అట్టి కవు లధ్వరంబులయందుఁ బ్రీతిఁ
గాత్రి ఛందస్సుల ధరించి గ్రహణ సాధ
నంబు లగు పాత్రముల నెల్ల దంబు మీరఁ
గటక నిర్మించుచున్నారు కరము శ్రద్ధ ॥ 3769

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*ఉపనిషత్ప్రమాణమును గైకొని ఆ కాలమందు అక్షరములు లిపి యున్నదని నిశ్చయించినచోఁ బొరపాటు కానేరదు. "ఉపనిషదీవాక్కు వర్ణావయవములు" అను సందర్భమున "వాక్కు వర్ణావయవములు గలది నిర్ణయించు నక్షరములు గలది" యను నర్థము తెలుచున్నది. కావున నకారాది క్షకారాంతము లగు నక్షరములు గల వని నిశ్చయింపఁగలము. (నే.వేం.న.శా.)

†దీనిని సత్తును (ఎప్పుడు నుండునది) అను దానినే లోకులు వేర్వేరుగఁ జేర్కొనెదరు. కాని కొన్ని స్థలములందు దీనిని విపరీతముగనే "దేవానాం పూర్వ్యే యుగేఽసతస్సదజాయత" (ఋ.10-72-7) దేవతల యుత్పత్తికంటెఁ బూర్వ మిందుసయితము అసత్తునందుండియే సత్తుయొక్క సృష్టి యుత్పన్నమైన దని యితరస్థలములయందుఁ జెప్పఁబడినది. అసత్తనఁగా అవ్యక్తము. సత్తనఁగా వ్యక్తము. (నే.వేం.న.శా.)

(6)•గద్యము ॥

చత్వారింశత్సంఖ్యాకము లగు గ్రహములను సోమము పూరించుచు గాయత్ర్యాది
ఛందస్సులను ధరించుచుఁ గవులు బుద్ధిచేత యజ్ఞమును నిర్మించి దానిని ఋక్
సామములచేఁ బ్రకర్షముగా సంపాదించుచున్నారు ॥♦ 3770

(7)•గద్యము॥

ఈ యజ్ఞరూప పరమాత్మకు నీ చతుర్దశ లోకములు విభూతు లగుచున్నవి. ఈ యజ్ఞమును
సప్త సంఖ్యాకు లగు ధీరులు శస్త్ర రూపవాక్కుచేఁ జేయుచున్నారు. ఏ యజ్ఞ మార్గమున
నభిషుత సోమమును దేవతలు త్రావుచున్నారో? ఆ తీర్థమును నెవ్వఁ డెరుఁగఁగలఁడు? ॥ 3771

(8)•గద్యము॥

సహస్రసంఖ్యాకము లగు బ్రహ్మాది స్తంబ పర్యంత దేహములయందుఁ బంచదశసంఖ్యాకము
లగు నంగము లున్నవి. ప్రాణిదేహములు జాతములు కాఁగా ద్యావాభూముల కెంత పరిమాణ
మున్నదో? యంతపరిమాణమే ఆత్మాధిష్టిత మగు ప్రాణి దేహజాతము గలదు. మరియుఁ
బ్రతిక్షణము వ్యవహారములు సహస్ర సంఖ్యాకములు కలుఁగుచున్నవి. జగత్కారణ
మగు వస్తువు నానావిధ ప్రాణి దేహ రూపముచే నెంత పరిమాణమై యున్నదో?
వాక్కును నంత పరిమాణము గలదు ॥ 3772

---

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

♦వేదములు ఋక్సామాది భేదముల నాల్గు విధము లని శ్రుతి స్మృతి పురాణములయందుఁ బ్రసిద్ధము. కాని యొక గ్రంథమున నీ కథ గల మంత్రము కలదు. దానివలన వేదము లనంతమని తేలుచున్నది. "పూర్వమున భరద్వాజుఁ డను విప్రుఁడు మూఁడాయుస్సులచే బ్రహ్మచర్యమును జరిపి వేదాధ్యయనముచేతనే అఖిలకాలమును వెళ్ళఁబుచ్చెను. పిమ్మట వృద్ధుఁడై మరణమునకుఁ బ్రతీక్షించుచుండెను. అప్పు డింద్రుఁడు వాని చెంతకు వచ్చి "ఓ భరద్వాజ! నన్నింద్రునిగా గుర్తెరుంగుము! నీవు మూఁడాయుస్సులందు వేదాధ్యయనమున నాయాసము నొందితివి! నీకు నాల్గవ యాయుస్సునుగూడ నొసంగెదను. ఏమి చేయుట కిచ్ఛగించెదవు?" అని పలుకగా, భరద్వాజుఁడు "ఆర్యా! నేను సమగ్రముగా వేదము పఠింపలేదు. వేదము పూర్తిగాఁ జదువనిది నా హృదయము తృప్తిఁ గాంచ నేరదు" అని బదులాడెను. ఆ మాట విని యింద్రుఁడు వానికి దివ్యచక్షుస్సు నిచ్చి మూఁడు కుండలను జూపించి ప్రత్యేకముగ నొక్కొక్క గిరినుండి యొక్కొక్క ముష్టిని గ్రహించి "ఓ భరద్వాజ! గిరిరూపములై ముందు గనఁబడునవియే వేదము లనియు నవి యనంతము లనియుఁ బలికెను. ఈ ముష్టిత్రయ పరిమిత మగు ఛందోభాగమే మూఁడాయుస్సులలోను నీచేతఁ బఠింపఁబడెను. కాఁబట్టి శాఖలయం దేది సారభూతమో అదియే లెస్సగఁ జదివి అమర్త్యుఁడవై ఆదిత్యుని సాయుజ్యమును బొందుము" అని చెప్పినట్లు కథ గలదు. కాన వేదము లనంతము లనియే నమ్మనది. (నే.వేం.న.శా.)

సూచన:- "అనంతా వై వేదాః, అనంతా వై దేవాః, అనంతా వై రాగాః, అనంతా వై తాళాః" అని వేదమంత్ర భాగము కలదు. (వ.గో.కృ.)

(9)*సీ॥ ధీమంతుఁ డెవ్వఁడు దీప్త గాయత్ర్యాది చలిత యోగంబును దెలియఁగలఁడు?
హోత్రాది తలముల నున్నత వాక్కులు నెవ్వఁడు సెప్పంగ నెరుఁగఁగలఁడు?
యజమాన సంఖ్యను సప్తమ సంఖ్యగా శోభిలఁ జేసెడు శూరుఁ డెవఁడు?
ఋక్సామ నామ సమృద్ధిఁ గాంచిన హరు నెవ్వఁడు పూజింప నేగఁగలుఁగు?
గీ॥ సప్త సంఖ్యా ప్రపూరకుండైన దేవ,తోత్తముని [1]దెలిసికొనునట్టి స్తుత్య మూర్తి
యెవ్వఁ డని ప్రశ్న పడినచో నెలమి మీర,నతఁడు పరమాత్ముఁ డనిగదా! యనఁగవలయు ॥ 3773

(10)*గద్యము॥
సప్తాశ్వములు పృథ్వియొక్క ద్యులోకముయొక్క పర్యంతముఁ[2]బరిచరించుచున్నవి. అప్పు
డశ్వములు యుగాది భారములతో యుక్తము లైనవి. ఏ కాలమున సూర్యుఁడు హర్మ్య
స్థానీయ రథమందు నిహితుఁడగునో! యపుడు అశ్వములకు దేవతలు శ్రమ
వారక మగు మాసాదికమును నిచ్చుచున్నారు ॥ 3774

## సూక్తము—114

ఋషి—విరూపుఁడైన సధ్రి లేక తాపసుఁడైన ఘర్ముఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

†(1) సకల సృష్టి పరివ్యాప్త జ్వలితాఽనల ధర్మరూప
మమలమ్మై అమరమ్మై అలరారును దిక్కాలముల
నాదిత్యుని మహాదివ్య దేదీప్య విరాజమాన
కాంతిశక్తి లోకాదులు క్రాలు నర్క గోళాదులు
మహితమైన దేవశక్తి మరుజ్జలావళులు తనరు
దివములలో భువులలోను నవనిత్యమ్మైన దీప్తి
నవినాభావాల నిలిచి నన్యోఽన్యమ్మైన రతుల
నంతర్గత రూపాలను నతులితమై వరలుచుండు ॥ 3775

†(2) అతులితమౌ నిత్యగతుల ఋత శక్తుల నొప్పారుచు
సృష్టి స్థితి లయ పరమై చెల్వొందఁగ విశ్వమ్మది
సుప్త రహిత నిత్యచలన గుప్తమైన దీప్త శక్తి
విస్తృతమై విశాలమౌ న స్తవ్యస్తమ్ము కాని
క్రమగతులను దగుచుఁ గ్రాలు శబ్దశక్తు లెల్ల
నింగిలోను ప్రకృతిలోను నిండి నిలుచు నిత్యమ్మును
గర్మ ధర్మ పరముగాఁగ నర్మ భర్మ భరితముగాఁ
బరమేశ్వరు లీలలమెయి వరలు విశ్వసర్వస్వము ॥ 3776

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఇక్కడ నింద్రగణమునకు మారు "నలల"ము ప్రయు క్తమైనది, 2. బరిచరించుచున్నారు. (శా.పా.)
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) చతుష్కపర్దమ్ములైన అతులితాష్ట దిగ్గజాల
ధరణ ధారణాల శక్తి భరణ భారణాల శక్తి
విశ్వమ్మది వర్తిల్లును విశ్వేశుని దివ్య లీల
ఘనల సలిల తతులతోడ నాకాశము ననిలాఽనలు
పృథ్వి లొప్ప వెలుఁగుచుండు వివిధ విషయ వలితములై
వాయు మూల "వయు" శక్తులు వర్తిల్లఁగ నంతర్గతిఁ
పంచభూత తత్త్వాలను ప్రాణపంచకమ్ము వరలు
వృషశక్తులఁ బరివృతమై తుషితమ్మౌ యుగయుగాల ॥ 3777

†(4) అంతరిక్షమందు నలరు నఖిలలోక గోళాలవి
ఏకైక సుపర్ణశక్తి నాకర్షితమై తిరుగును
దేవదేవు మనశ్శక్తి దీపితమై దివ్యగతులఁ
బ్రకృతి సృష్టి పాకమునకుఁ బ్రాకృతమౌ మాతగాఁగ
రోదోఽంతర మధ్యమ్మున నాదశక్తి ననాహతంపు
టమేయమై అపూర్వమౌ నతిలోకపు టతివేలపు
మహాశక్తి అసమానత నసహాయతఁ బ్రకర్షితమై
అలరారును విశ్వసృష్టి యత్యద్భుతగతి వరలఁగ ॥ 3778

†(5) ఏకైకమ్మై వెలిఁగెడి ఏకైకేశుని దేవుని
కవిపండిత ఋషివరులును గ్రాలు దివ్య దేవతాళి
వేదపరమ్మైన మహా విజ్ఞానపు దృష్టి మీఱ
బహు రూపాలను వరలఁగ వర్ణింతురు శబ్దశక్తు
లలరఁగ ద్వాదశమౌ నాదిత్య గ్రహ దీప్తుల
సృష్టి యెల్లఁ బరఁగుచు నా పన్మృణ్మయమ్ముగాఁగ
లోక గోళ సర్వస్వము రూపొందుచు విశ్వమ్మున
ధరణ ధారణంపుఁ గృతుల భరణ భారణము లలరఁగ ॥ 3779

†(6) అర్ధానుస్వార సహిత మా ద్వాదశ ప్రాణావళి
చజల దంత్య తాలవ్యత షట్త్రింశద్ధల్లు లలర
దేవదత్తమై వరలుచు దివ్య విశేష మాయగాఁగఁ
గాల శబ్ద రూప మగుచుఁ గ్రాలు రథవర్తనమై
అమర శక్తు లొప్పారఁగ నమృతగతుల విస్తృతమౌ
దేవ ఋషులు వేదర్షులు దేవాదుల దివ్య శక్తి
ఋక్సామము లలరంగా ఋత యజ్ఞము తనరంగా
వేద చతుష్టయము జగతి విజ్ఞతమై గుర్తింతురు ॥ 3780

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*(7) సప్తాఽఽకాశమ్ములలో సప్తాఽనిలతతులతోడ
సప్తాఽనలములతోడను సప్త సలిలావళులను
సప్త మృత్ తత్త్వాలను జడములోన వెలుఁగొందెడు
పంచభూతమయముగా సువంచితముగఁ దనరారెడి
ద్వాదశాదిత్యాళులు వరలుఁ జతుర్దశ సంఖ్యను
భూత భావి వర్తమాన పూర్ణకాల గతులు వెలయఁ
గృత త్రేత ద్వాపర కలి చతుర్యుగా లనుగతముగ
సోమ శక్తు లలరారఁగ సృష్టి యెల్ల వర్ధిల్లఁగ
నపురూపపు గతులతోడ నంతరాంతర ప్రాణిజ
జవసత్త్వపు శక్తు లెల్ల జగతి నెల్ల విస్తృత మగు ॥ 3781

†(8) పంచభూత పదార్థాలఁ బంచదశలుగా వరలెడి
దశదిశలును నసమగతుల ద్యావాపృథ్వులఁ బరఁగును
సహస్రమైన రూపాలను సహస్రమౌ మహిమలతో
సహస్రమైన సృష్టిగతుల సహస్రమౌ స్రష్టరతుల
సహస్రముగఁ దనరారెడి శబ్దగతుల శక్తితతుల
వ్యాప్త మౌచు బ్రహ్మశక్తి వరలు విశ్వరూప మౌచు ॥ 3782

(9)†అష్టపదకందము ॥
యుగయోగముతో వేగము
నగణిత గతి నెరిఁగె సృష్టి నద్భుత క్రియగా
జగమును గుప్పిట నిలుపుచు
నిగమగ హృచ్ఛక్తి మహిత నిరుపమ గతిమైఁ
బ్రగతిని విశ్వ విరాజిత
గగన మణిగ మర్మ రూప కాంతిప్రదమై
సగుణము నిర్గుణమై శ
బ్ద గణము హరి శూరతమెయి వరలున్ సతమున్ ॥ 3783

†— అష్ట దిక్కులలోన నతిలోక గతిమై
నష్టాఽనల మూర్తు• లలరారుచుండు
జగత్కారక మౌచుఁ జడలంటి హరి లీల
నాకాశ మనిలమ్ము నసల జల మృత్తతులు
అరుణుండు చంద్రుండు నంతర్యామియున్*
అలరఁ దనరారులేఁ అఖిల విశ్వమ్ము ॥ 3784

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"జాతవేద, సప్తజిహ్వ, హవ్యవాహన, అశ్వోదర, వైశ్వానర, కౌమార, విశ్వముఖ, దేవముఖ" మూర్తులు అనునవి అష్టవిధములైన అగ్ని మూర్తులు.
*ద్వయముష్ణం ద్వయం శీత మనుష్ణా శీతల ద్వయమ్
ద్వయ మస్పర్శనం చైవ పాతునశ్శివమూర్తయః ॥
సూర్యాగ్నులు ఉష్ణమూర్తులు-చంద్రజలములు శీతలమూర్తులు-పృథ్వీవాయువులు ఉష్ణ శీతలమూర్తులు కానివి-
ఆకాశాఽంతర్యాములు స్పర్శా రహితములు.

†(10) ఏకైకమై సృష్టి యెనలేక నిలుచుఁ
గర్మ రూపమ్ముగా ధర్మ రూపమ్ముగా
శ్రమ రూపమై వరలు యమ నియమ గతుల
నాద్యంత రూపమై అమర చర రూపమై
అచరమున్ జర మౌచు అమల గతులన్ దిరుగ
సృష్టి స్థానమ్ముగ వ్యష్టి సమిష్టులను
గ్రాల రథగతు లొప్పుఁ గ్రాలు సర్వస్వమ్ము
దేవదేవుని మాయ దివ్య లీలగఁ దనరు ॥ 3785

## సూక్తము—114

ఋషి—విరూపుఁడైన సధ్రి లేక తాపసుఁడైన ఘర్ముఁడు
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—2

†(1) ఆత్మ ధర్మయుక్తమైన ఆదిత్యాగ్నులు ననిలము
సలిలమ్మును బృథ్వియు బహుస్వచ్ఛతమెయి దీప్త మౌచు
దివిభువు లన్నిట నరయఁగ నవశక్తుల వర్ధిల్లుచు
దేవాళుల విజ్ఞతమై ప్రావేవన వ్యాప్త శక్తి
శబ్దరూప దివ్య మైన సామశక్తి పటుతరమై
అర్క-జ్యోతిగ వెల్గుచు నఖిలమ్మున వరలుచుండ
విశ్వ సృష్టి తనరారును విపుల బహుళ లోకాలను
నాకర్షణ రూపమైన అతిసహజపు ధారణ గతి ॥ 3786

†(2) సృష్టి స్థితి లయ శక్తులఁ జన్మయమౌ విశ్వమ్మున
నపవర్గము కోరి ప్రాణి అతిలోకమ్మౌ శక్తుల
నారాధన మొనరించును నారూఢమ్మౌ దీప్తుల
నతిగుప్తమ్మౌ శక్తుల నపురూపమ్మౌ రక్తులఁ
గ్రాంత దర్శియైన దివ్య శాంతి దాంతి శక్తిరూప
దివ్య దేవతాళు లెల్ల ధృతదీప్తుల వెల్గుచుండుఁ
బ్రకృతి జీవ కారణమై అకృతశక్తి రాజిల్లుచు
దీర్ఘశ్రుతిగా జగతిని దేదీప్యమ్ముగ వరలును ॥ 3787

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) చతుర్యుగములందు మహా ధృతప్రకృతి శివశక్తుల
యుగ యోగముతో విశ్వము ఉత్పన్న మ్మౌచు నిలుచు
వివిధ గోళ లోకా లవి అవితథమై నిత్యగతుల
శబ్ద శక్తు లలరారఁగ సదమలమౌ ప్రకృతి యువతి
చిత్త చైతన్య మొప్ప సిరి సంపద లలరంగా
జీవాత్మల పరమాత్మలఁ జెలఁగుచుండు నిత్యమ్మును
సకలదైవ శక్తు లెల్ల స్థానగతుల సపురూపత
నిలిచి సృష్టి సాక్షిగాఁగ నిరత వీర్య రూప మందు ॥ 3788

†(4) అంతరిక్షమందు నలరు నఖిలలోక గోళాలను
ఏకైకమ్మై తనరెడి ఈశ్వరీయ చలన శక్తి
దీప్త మౌచుఁ బ్రవర్తిల్లు దివ్య నవ్య స్థితి ధృతులను
బరిణతమౌ జ్ఞాన దృష్టి వరలెడి ధీమతులు మహా
సృష్టి తత్త్వ మెల్ల నెరిఁగి వ్యష్టి సమిష్టిమయగతుల
శబ్ద శక్తు లలరారఁగ సర్వస్వము నిండి విశ్వ
కళ్యాణము నొనరించును గ్రాలఁగ శుభ సౌఖ్యాదులు
అతివేలపు మనశ్శక్తు లతిలోకములై తనరఁగ ॥ 3789

†(5) ఏకైకమ్మై వరలెడి యీ సృష్టిని శబ్ద శక్తి
పంచభూత తత్త్వాలను బహురూపమ్మై వెల్గఁగఁ
గవి ఋషి దేవాళు లెల్ల రవితథముగఁ గల్పింతురు
ద్వాదశాదిత్య శక్తి తనరారఁగ విశ్వమ్మున
దివ్యశక్తి తేజరిలఁగ దీధితులను వేదరూప
మద్వరగతి నలరారఁగ నమృత సోమమయముగాఁగ
నాకర్షణ శక్తులతో నఖిల లోక గోళా లవి
వరలంగా విశ్వ మెల్లఁ బరఁగుచుండు నిత్యమ్మును ॥ 3790

†(6) బహుముఖమౌ దివ్యదృష్టి నలరంగాఁ జతురతమై
భూత భావి వర్తమాన ధాత కాల రూప మౌచు
ద్వాదశాదిత్య శక్తు లేదుచు నీ నిఖిల సృష్టి
షట్త్రింశత్గతు లొప్పఁగ సర్వమ్మున వ్యాపించుచు
శబ్ద స్వర గాన శక్తు లబ్దగతుల నమల రతుల
తేజోవంతము లౌచును దీధితులను వరలంగా

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నాకాశము లనిలమ్ములు ననల సలిల మృత్తతులను
బ్రాజిరూప జ్ఞానరూప ప్రకర్షణల నలరారెడి
విశ్వ మ్మది విస్తృతమై విజ్ఞానమయమ్ము గాఁగ
దైవతలగాఁగ వరలు జీవాత్మలఁ బరమాత్మల ॥ 3791

†— ముప్పదియా రగు గ్రహముల మూర్తు లొప్ప నలరారెడి
ద్వాదశమౌ నాదిత్యులఁ దరణి చంద్ర శక్తు లలర
నల్దిక్కులఁ బ్రకాశలిప నవ్యదీప్తు లొప్పారఁగ
జ్ఞాన విజ్ఞాన రూప మనూన సృష్టి పరత నొప్పు
ఋక్సామమ్ముల శక్తుల ఋత శక్తుల నలరంగా
విశ్వ మ్మది నిలిచి తిరుగు విమల సృష్టి స్థితి గతులను ॥ 3792

†(7) కృత త్రేత ద్వాపర కలి ధృతమౌ యుగకాల రూప
దశదిశ లవి చతుర్దశా విశద రూపముల వరలఁగ
సప్త గగన సప్తానిల సప్తానల సప్త సప్త
సలిల మృత్తు లలరంగా సర్వ విశ్వ మబ్బురమౌ
సృష్టిలోన శబ్ద శక్తు లిష్టిగాఁగ వ్యష్టిగా స
మిష్టిగాఁగఁ దనరారుచు మిన్నులఁ జెన్నొందుచుండు
విశ్వదేవదేవు పుత్రు విమల కేళి బంతులుగా
నఖిల గోళతతులు వరలు నద్భుతగతి తనరారఁగ ॥ 3793

†(8) పంచదశా పూర్ణతతుల పంచభూత రూపాలను
దశదిశ లవి సృష్టిలోనఁ దనరారఁగ దైవగతిగ
ద్యావాపృథ్వులు వరలును నద్భుతగతి సహస్రమై
సహస్ర మహితతత్త్వాలను సహస్రసృష్టి రీతులతో
సహస్ర శబ్ద శక్తులతో నిహపర లోకాలు మీర
నెంతవరకు బ్రహ్మరూపు వింతగ వర్తిల్లుచుండు
నంతవరకు విశ్వ మెల్ల నతిలోకపు గరులతోడ
సృష్టి స్థితి లయ రతులను జెలఁగుఁ జక్రనేమిక్రమత ॥ 3794

†(9) ప్రకృతి పురుషుల దివ్య భావ యోగాలతో
శబ్ద శక్తులు జగతి సబ్దగతులను వెలుఁగ
నాహ్లాద రూపమౌ నఖిల సృష్టిని దివ్య
తేజాలు వర్ధిల్ల దేదీప్యమాన గతి

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నక్షయ్యమై వరలు నజయ్యమౌ జగతి
నష్టవిధ• రూపాల నఖిల సృష్టిని దనరు
నానంద• మర్మాల పాృణ శక్తులు వరల
హరి కూరతలు సదా అఖిల విశ్వానఁ బగు ॥ † 3795

†(10) భూలోకము మొదలు ద్యోలోకమువఱకుఁ
గాం శక్తులు వరలఁ గాంతి దీప్తులమెయిని
సృష్టి గోళావళులు వ్యష్టి సమష్టులుగాఁగఁ
గృమశిక్షణలు మీర యమనియమ గతులమైఁ
జకృనేమిక్రమత శృమరూపమై నిత్య
మాత్మపృదక్షిణల నలరు పృదక్షిణలఁ
గాల రథ గతులతోఁ గాృలఁగా గోళాలు
నిత్య సంచలన గతి సత్య శక్తులు వరయు ॥ 3796

## సూక్తమ్—115

ఋషిః—వార్ష్టిహవ్య ఉపస్తుతః
దేవతా—అగ్నిః
ఛందః—జగతీ; 8-త్రిష్టుప్; 9-శక్వరీ

(1) చిత్ర[1] ఇచ్ఛిశోస్తరుణస్య వక్షథో న యో మాతరావప్యేతి ధాతవే ।
అనూధా యది జీజనదధా చ ను వవక్ష సద్యో మహి దూత్యం౧ చరన్ ॥ 1327

(2) అగ్నిర్హ నామ ధాయి దన్నపస్తమః సం యో వనా యువతే భస్మనా దతా ।
అభిప్రమురా జుహ్వా స్వధ్వర[2] ఇనో న ప్రోథమానో యవసే వృషా ॥ 1328

(3) తం వో విం న దృషదం దేవమన్ధస[3] ఇన్దుం ప్రోథన్తం ప్రవపన్తమర్ణవమ్ ।
ఆసా వహ్నిం న శోచిషా విరప్శినం మహివ్రతం న సరజన్తమధ్వనః ॥ 1329

†రచయిత;—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•అష్టవిధానందములు — సహజానందము, విషయానందము, వాసనానందము, విద్యానందము, యోగానందము, ఆత్మానందము, బ్రహ్మానందము, అద్వైతానందము.

1. చిత్రఽఇచ్ఛిశో, 2. స్వధ్వరఽఇనో, 3. మన్ధసఽఇన్దుం. (వా్ర.వ్ర.)

(4) వి యస్య తే జ్రయసానస్యాజర ధక్షోర్న వాతాః పరి సన్త్యచ్యుతాః ।

ఆ రణ్వాసో యుయుధయో న సత్వనం త్రితం నశన్త ప్ర శిషన్త[1] ఇష్టయే ॥ 1330

(5) స[2] ఇదగ్నిః కణ్వతమః కణ్వసఖా ఉర్యః పరస్యాన్తరస్య తరుషః ।

అగ్నిః పాతుగృణతో[3] అగ్నిః సూరీనగ్నిర్దదాతు తేషామవో నః ॥ 1331

(6) వాజిన్తమాయ సహ్యసే సుపిత్ర్య తృషు చ్యవానో[4] అను జాతవేదసే ।

అనుద్రే చిద్యో ధృషతా వరం సతే మహిన్తమాయ ధన్వనేదవిష్యతే ॥ 1332

(7) ఏవాగ్నిర్మర్తైః సహ సూరిభిర్వసుః ష్టవే సహసః సూనరో నృభిః ।

మిత్రాసో న యే సుధితా[5] ఋతాయవో ద్యావో న ద్యుమ్నైరభి సన్తి మానుషాన్ ॥ 1333

(8) ఊర్జో నపాత్ సహసావన్నితి త్వోపస్తుతస్య వన్దతే వృషా వాక్ ।

త్వాం స్తోషామ త్వయా సువీరా ద్రాఘీయ[6] ఆయుః ప్రతరం దధానాః ॥ 1334

(9) ఇతి త్వాగ్నే వృష్టిహవ్యస్య పుత్రా[7] ఉపస్తుతాస ఋషయోఽవోచన్ ॥

తాగ్ంశ్చ[8] పాహి గృణతశ్చ సూరీన్ వషడ్వషళిత్యూర్ధ్వాసో[9] అనక్షన్ నమో నమ ఇత్యూర్ధ్వాసో అనక్షన్ ॥ 1335

---

1. శిషన్తఽఇష్టయే, 2. సఽఇదగ్నిః, 3. గృణతోఽఅగ్నిః, 4. వానోఽఅను, 5. సుధితాఽఋతాయవో. 6. ద్రాఘీయఽఆయుః, 7. పుత్రాఽఉపస్తుతాసఽఋషయో, 8. తాంశ్చ, 9. సోఽఅనక్షన్నమో నమఽ ఇత్యూర్ధ్వాసోఽఅనక్షన్. (వా.ప.)

## సూక్తము—115

ఋషి—వార్ష్టిహవ్య ఉపస్తుతుఁడు†

దేవత—అగ్ని

(1)*గీ॥ జాతుఁడైనట్టి యర్భకుండు మాతృ జనక
భూత రోదసులన్ జేరఁబోవకుండుఁ
బానమునకయి శిశు భూతుఁడైన యగ్ని
హవ్య వహనంబు చిత్రమై యమరుచుండె ॥ 3797

*క॥ లలి నూధో రహితంబయి
వెలసిన లోకంబు నగ్ని విధిఁ బుట్టింపం
జెలఁగుచు[1] వాఁడే దూతగ
వెలుఁగుచు హవ్యం బొసంగు వేల్పులకొఱకై ॥ 3798

(2)*గీ॥ ధరణి యష్టులకున్ ధనదాత యగుటఁ
గర్మవత్తముఁడైనట్టి ఘనుఁడు వహ్ని
పూత యజమాన గణ సంగృహీతుఁ[2] డగును
దంతమున[3] నటవి దరియించు నెంతయేని ॥ 3799

*గీ॥ హృష్ట పుష్టాంగమును గల్గు వృషభ మెట్లు
సంచరించుచునుండు ఘాసాదికమున
నట్లె హవ్య విరాజితుండైన యగ్ని
హవ్యమందుఁ జరించుచు నమరుచుండు ॥ 3800

(3)*సీ॥ పాదపంబునఁ గల పక్షి చందంబున వృక్షముపైఁ గడు వెలుఁగువాని
స్తోతృ బృందమునకు సురుచిరాన్నంబును సంచిత మతిని బొందించువాని
శబ్దాయమానుని జారు వనంబులఁ గాల్చువానిని వారిఁ గల్గువానిఁ
గడు ననడ్వాహంబు కరణి వహన యోగ్యుఁ డగుచు సంప్రీతిని నరుగువాని

గీ॥ సూర్యుఁ డెట్టులు మార్గముల్ చూపు నట్లె
మార్గముల నెల్లఁ జూపుచు మనెడు వాని
నుదక పూరంబుఁ బుట్టించుచుండు వాని
నగ్ని దేవుని స్తుతియింపుఁ డార్యులార! ॥ 3801

†వ్రాతప్రతి 14వ సంపుటము 109వ పుటలో నీ సూక్తమునకు ఋషి "ఉపస్తుతుడు"గాను, దేవత "అగ్ని"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో ఋషి "ఉపస్థుతుఁడు"గాను, దేవత "అగ్ని" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. జెలగు ననలుఁడు దూతలు, కలగు హవ్యమందజేయు ఘన సురలకునై, (తొ.పా.), 2. సంగృహీతుఁడగుట.(తొ.పా.)
3. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్తమైనది.

(4) *గీ॥ గమన శీలత దక్షతఁ గలుఁగు నజర!
వాయు సంఘము లే రీతి వ్యాప్తిఁ గాంచు
నట్లె యచ్యుతిఁ గలుఁగుచు [1]నమరు నీదు
సత్ప్రభావంబు లధికము [2]శక్తి గాంచు ॥ 3802

*గీ॥ యోద్ధలు విధాన శీఘ్రమే యుచిత గమన
మును నొనర్చుచు శబ్దంబు ఘనతరముగఁ
జేయు ఋత్విజ్ఞు లెల్లరుఁ జిత్త మలర
యాగమును జేయుచున్నార లతిశయముగ ॥ 3803

(5) *గీ॥ కర్ణ సుఖుఁ డౌచు నార్యుఁడై గ్రాలుచుండి
స్వామి యైనట్టి యనలుఁడే శత్రుహంత
యతఁడు స్తోత్రముఁ జేయుచు హవ్యములను
నందఁజేయుచు మా కిల నవన మిడుత! ॥ 3804

(6) *గీ॥ అగ్ని! శోభనవంతుఁడా! యన్నవంత!
యతిశయ బలంబుఁ గల్గుచు నరులఁ బ్రోచు
నట్టి కవియైన యట్టి నీ కాదరమున
స్తుతుల నొనరించుచున్నార లతుల మతులు ॥ 3805

*గీ॥ శత్రు ధర్షణ యోగ్యమౌ సహజ కార్మ
కంబుచే శ్రేష్ఠతర పాలనంబుఁ జేయు
నట్టి పూజ్యతముం డౌచు నమరునట్టి
యగ్నికిన్ స్తుతి[3] నొనర్చుచు నడుగుచుంటి ॥ 3806

(7) *గీ॥ బలమునకు సూనుఁడై[4] తాను వెలుఁగునట్టి
యగ్ని[5] మాచేత మనుజులచేత వసువు
కొఱకు నతిశయ సంతుష్టికొఱకుఁ బ్రీతి
నిట్లు నుతియింపఁబడుచుండె[6] హేళి కలుఁగ ॥ 3807

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. నమరుచున్న, (తా.పా.), 2. నెగడుచుండు, 3. ఇక్కడ నింద్రగణమునకు మారు "శల"ము గాని, "జల"ముగాని ప్రయుక్తమైనట్లు భావింపవలయును. 4. సూనుఁడైనట్లు, (తా.పా.), 5. యగ్ని మావల్ల మనుజులవల్ల, (తా.పా.), 6. నుతియించుచుండెను హేళికలుగ. (తా.పా.)

*గీ॥ సఖులఁ బోలుచుఁ దృప్తులై సకల యజ్ఞ
కర్మ కామయమానులై నిర్మలముగ
ద్యోతమానుల వలె నగ్ని నీత బలము
చేత సూరులు శత్రులఁ జెందుచుందు ॥ 3808

(8)*గద్యము ॥
ఓ బలపుత్ర! సహస్వి! అగ్ని! నిన్ను సువస్తుతుఁడ నగు నాయొక్క హవిర్వర్ధయిత్రి యగు స్తుతి స్తుతించుచున్నది. మరియు మేము నిన్ను వినుతింపఁగలము. నీవల్ల శోభన పుత్రులు గలవార మయ్యెదము. దీర్ఘతర మగు నాయుస్సు నత్యంతము వరించుచు నుండఁగలము ॥ 3809

(9)*గద్యము ॥
ఓ యనలుఁడా! నీవు వృష్టిహవ్యుఁ డనెడు ఋషికి, ఋత్రి లగు సుపస్తుతు లను ఋషులను బాలింపుము! స్తోత లగు సూరులను రక్షింపుము! హవిఃప్రదానార్థము ఊర్ధ్వ ముఖ హస్తములు గలవారిని స్తుతించుటకు నుద్యుక్తు లగువారిని బరిపాలింపుము! ॥ 3810

## సూక్తము—115
ఋషి—వార్ష్టిహవ్య ఉపస్తుతుఁడు
దేవత—అగ్ని

## అర్థాంతరము—1

†(1) చిత్రవర్ణాలతో శిశు కౌమార తరుణ
ప్రౌఢతర వార్ధక్య బహు రూపములు మీఱ
దీప్తమై అనలమ్ము దీధితులు వరలంగ
సర్వ భక్షక మౌచు సకలాన వ్యాపించు
రోదసీ జనితమై రోదోఽంతరాళ గతి
వాయు ధూమాలుగా వరలఁ బదార్థాలు
ఆకాశమునె చేర్చు నతివేల దౌత్య రతి
అఖిల దిగ్గతులతో నతిశుచిగ వెల్గొందు ॥ 3811

†క॥ చిత్రాఽతి చిత్ర శక్తి వ
విత్రత వరలంగ జగతి విస్తృత దీప్తుల్
గాత్రములై విశ్వమ్మున
ధత్రి రతుల నగ్ని రక్ష సంపత్కరమౌ ॥ 3812

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) "అభి" శక్తులను ననుము నద్భుతాయుధ మౌచుఁ
దిమిర భంజక మౌచు దేదీప్యమానమౌ
దీధితుల జ్వలియించు దివ్యాగ్ని రూపాలు
హవ్య వాహక మౌచు నాకాశ దౌత్యాల
స్వచ్ఛాఽనిల జల సంపదల పరివ్యాప్తి
శాంతి సౌభాగ్యాలు సర్వ జగతిని వరల
విశ్వాఽభ్యుదయ మహిత విజ్ఞానమయముగా
నా పంచభూతాల ననలమ్ము తనరారు ॥ 3813

†అష్టపదకందము ॥
తిమిరమ్ములఁ బోఁదోలుచు
నమలినమౌ దీప్తు లలర నఖిల దిశలలో
నమర గతుల బహు రూపుల
నమరును ననలమ్ము సృష్టి నద్భుత రతులన్
అమితమ్మౌ వాయుతతుల
రమణీయమ్మై విచిత్ర వ్రిభ కీలులమై
దమ శమ శక్తుల విశ్వగ
క్రమ తేజోదాత్రి కాఁగఁ గ్రాలు సతమ్మున్ ॥ 3814

†(3) చంద్ర సూర్య గతము లౌచు సర్వ ఋక్ష గ్రహరతమై
సృష్టి నఖిల పదార్థాల వ్యష్టి సమిష్టి రూపాలను
బహిరంతర గతులతోడ బహు తీరుల మేర లొంది
ఉన్నట్లుగ లేనట్లుగ నుండికూడ లేనట్లుగ
నతిగుహ్యమ్ముగ ననలము లసాధారణముగ నిలుచు
ననిలగతుల నమలగతులఁ గనలుచుఁ బయనించుచుండు
నింగినిండు నిండునంతరంగమందు నఖిల లోక గోళమ్ముల
నణువణువునఁ బరమాణు గరీయాల నుండు సృష్టి ॥ 3815

†తే॥గీ॥ శుచిగ వెల్గొందు నగ్ని విస్తృతగతిమెయి
విశ్వ సంపూర్ణ సందీప్త విమల శక్తి
నఖిలమందు నంతర్బాహిరాఽద్భుత గతి
నంతరాంతర రూపాలఁ గ్రాంతు లీను ॥ 3816

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అజరమ్మౌ వాయు కలిత మైన అగ్ని విరాజిలును
విమల దీప్తు లొప్పారఁగ నమల రతుల వి స్తరిలుచు
జగచ్చలన శక్తులతో నగణితగతి నలరారుచు
బహిరంతర రూపమ్ముల నహోరాత్రి దీపములై
అతిలోకపు శక్తులతో ననులోమ విలోమగతుల
దశదిశలను వ్యాప్తమ్మై అసమ రతుల దీప్తమ్మై
ఆధేయముగా నిలుచును నాధారముగా వెలుఁగును
శోధన గతు లొప్పారఁగ సాధన ధృతు లలరంగా
బోధామయ మహిత మౌచుఁ బూర్ణ శుభ సుఖమయమ్ముగాఁగ
బాధాకలిత మ్మౌచును వేదావలిత మ్మౌచును
అభ్యుదయావహ మ్మౌచు నమరశక్తిభరిత మౌచు
నఖిల సృష్టి నలరు దృశ్యాఽదృశ్య రూపమ్ముల ॥ 3817

(5)†అష్టపదకందము ॥
శిలలను దరు తతుల సకల
సలిలములను సృష్టి విశ్వ జాత వివిధ వ
స్తు లఘు గురు పదార్థ చయము
ల లలి ననిల పృథ్వి నింగి రాజిలు నగ్నుల్
అల వౌచు నలవి కాకను
జలి వెలుఁగుల వేఁడి వెలుఁగు సంచయ గతమై
చలి వెచ్చని నులి వెచ్చని
నలలిత కులలిత మహా విజృంభిత ప్రిభలన్ ॥ 3818

†క॥ కూర్చిర మ్మగు నగ్నులు విష
పూరితమౌ నగ్ని చయము పూర్ణాఽఽహుతిగాఁ
బేరు భగభగ భుగభుగల
హారతిగా నభ్యుదయపు హారము లౌలేః ॥ 3819

†(6) సకల జగతి జాగృతమై సంచరింపఁ బ్రకృతిగతుల
సృష్టి లోక గోళ ప్రాణ వ్యష్టి సమిష్టిరతి నిలువఁగ
నాహార విహారాదుల సహాయతా గరిమ వెలుఁగ
నభ్యుదయంపుఁ బ్రయోగాల నతిలోకమ్మౌ శక్తుల

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

ననురూపమ్మౌ గతులను నననురూప వైరుధ్యపు౯
బ్రకృతి వికృతి తత్త్వాలను సుకృత వికృత ఫలితాలను
దివ్యమైన దీధితులను నవ్య భవ్య దీప్తగతుల
నఖిలమ్ము౯ సనల మలరు నారాధ్యమ్మై జగతిని ॥ 3820

(7)†మ॥ ఋతమౌ శక్తుల విశ్వమందు౯ బరిసంవృత్తాత్మతన్ దివ్యమై
జతన మ్మొప్పఁగ గుప్త దీప్త గతి స్వచ్ఛాఽస్వీత వైశిష్ట్యతన్
అతులమ్మైన సుభాగ్య మష్ట వసు రూపైశ్వర్యముల్ సృష్టిలో
సతతమ్ము౯ దనరించు నగ్ని అతిశౌచ్యత్వమ్ము వర్తిల్లఁగన్ ॥ 3821

†(8) అనలరూప శక్తులతో నమలత్వము వర్ధిల్లును
అనలరూప శక్తులతో నమృతత్వము వర్ధిల్లును
ననల రూప శక్తులతో నమరత్వము వర్ధిల్లును
అతిలోకపు శక్తితతికి నతివేలపు శక్తితతికి
ఆననురూప మహాశక్తి కనాహతంపు దివ్యశక్తి
కమేయ మౌచు నభేద్య మౌచు నజయ్యమైన అతిశక్తికి
ఆలవాల మౌను నగ్ని మూలభూత మౌను నగ్ని
మృత్యుభర మ్మౌను నగ్ని మృత్యుహర మ్మగును నగ్ని ॥ 3822

(9)†అష్టపదకందము ॥
జల హారకుఁడై వరలుచు
జల ధారకుఁడై తనరుచు జల కారకుఁడై
జలదమ్ముల మెరుపులమై
సలిలమ్ములఁ గురియు నగ్ని చదలునఁ దగుచున్
జ్వలితమ్మై గోళ తతుల
వలితమ్మై ప్రకృతి నెల్ల వర్తిల్లుచు స
ల్లలితమ్మై పృథివి ననిల
నలిలాకాశముల మహిత శక్తుల నిలుచున్ ॥ 3823

†— ఊర్ధ్వగతుల నధోగతుల నొనరు పార్శ్వగతుల మీఱ
నక్ష గతుల నక్షయమౌ నక్ష రహితమౌ స్థితులను
నతిలోకపు శక్తులతో నతివేలపు గమనాలను
నగ్ని అలరు దైవీయపు టార్షేయమ్మౌ శక్తిగ ॥ 3824

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—115

ఋషి—వార్ష్టిహవ్య ఉపస్తుతుఁడు
దేవత—అగ్ని

### అర్థాంతరము—2

†(1) అగ్నిదీప్తు లలరారఁగ నపురూపపు శక్తులతో
ఆ మాతృ స్థానమైన అంతరిక్షమునకు నరుగు
అధస్థాన జల తతులను ఆకర్షణ మొనరించును
ఉపరి మేఘ సలిల రాశి నుర్వికి వర్షింపఁజేయు
అభినవమౌ శక్తులతో నావిర్భావమ్ము గాఁగ
ఫలాహార పదార్థాలఁ బ్రభవింపఁగఁజేయు జగతి
నంతరిక్ష దాతృమూర్తి కమల దౌత్య మలరారఁగ
హవిషాశుల నఖిలమ్మును ననవరత మ్మందించును ॥ 3825

†(2) "అభి" శక్తుల విశ్వ మెల్ల నంధకారమయముగాఁగ
వ్యాప్తి చెందు తిమిరాశుల ననాకారముగఁ జేయుచు
వెలుఁగు లెల్ల జగతిలోన జ్వలిత గతుల నలరారఁగఁ
గాష్ఠాళులు గాలంగాఁ గాల్చి కాల్చి మసిమసిగా
విజ్ఞానపు వాహశక్తి యజ్ఞతతుల విస్తరిల్ల
వృష శక్తులఁ బయనించును విమలమైన అగ్ని తతులు
అంత మెనయనట్టి సృష్టి నంతరాళ పరివృతమై
నఖిలమ్మున వ్యాపించును నదృశ్యశక్తు లలరారఁగః ॥ 3826

†(3) దేవతాళి దివ్యశక్తిఁ దేజరిలఁగ మథన మ్మది
ఇంధు శక్తి నెల్లఁ దెచ్చి నెసఁగు నమృత మహాసార
మంతరిక్షమునకు లాగి అఖిలమ్మున వ్యాప్తి చెంద
శుచిశక్తులు వర్ధిల్లఁగ రుచిదీప్తులు ప్రసరింపఁగ
నగ్ని సర్వ రక్షకమై అలరు సర్వ భక్షకమై
కాంతి దీప్తు లొప్పారఁగఁ గాల్ల జగతి చేతనరతి
శాంతి దాంతి రూపాలను సకలాభ్యుదయాలు వరలఁ
బ్రాణికోటి వెలుఁగులతో వర్ధిల్లఁగఁజేయు జగతి ॥ 3827

†రచయిత;—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) సృష్టి స్థితి లయ గతులను జిద్విలాస దీప్తు లలర  
నజరరూపమై వరలుచు నద్భుతజయశక్తు లమర  
భువి దివులను నంతరిక్ష పూర్ణ సర్వ గోళాలను  
ద్రికాలాల సకాలాల నకాలాల ప్రకారాల  
అనాకార వ్యాప్తి గతుల నంతరిక్ష దీప్త రతుల  
నచ్యుతమై అలరారును నపురూపపు శక్తులతోఁ  
బంచ భూత ప్రకృతి శక్తి వరలఁగ స్వాభావికమై  
సృష్టి నెల్ల వ్యాపించును వ్యష్టి సమిష్టి రూపాలను ॥ 3828

†(5) అఖిలమ్మును గ్రహియించును ననల రూప దీప్త మద్ది  
అఖిలమ్మును బ్రసాదించు నతిలోకపు శక్తులమై  
నఖిలమ్మును రక్షించును నమర కాంతి క్రాంతి గతుల  
నంతరిక్షమందు నలరి అనద్వేద బాధ కాఁగ  
నమృతశక్తి వర్ధిల్లఁగ నసాధారణంపు గతుల  
ననిల సలిల మృత్‌తతులను నాకసంపు దివ్యరతుల  
నన్యోఽన్యపు టనుబంధా లవినాభావాల వరలుఁ  
బ్రాకృతగతిఁ దనరారును బ్రకృతి పంచ భూతాళులు ॥ 3829

†(6) ఆదరణీయమ్ముగాఁగ నమృతమయ శక్తులతో  
జాతవేదమైన అనల శక్తి జగతి వర్ధిల్లును  
అనిల ధూమ తత్త్వా లవి అఖిలమ్మున వ్యాపింపఁగ  
దూతగాఁగ ఋత శక్తుల నీతు లొప్ప రీతు లొప్ప  
బల శక్తుల విశ్వమ్మునఁ బ్రబలు శత్రుతతులఁ దునిమి  
హవిషాళుల నద్భుతముగ నంతరిక్షగతముఁ జేసి  
అఖిలాంతర్యామి కమృత మఖతతి నొనరించుచుండి  
సృష్టి యెల్లఁ బలురూపుల సుప్రియమై వర్తిల్లును ॥ 3830

†(7) అష్టావిధ వసు సంపద వ్యష్టి సమిష్టి రూపాలను  
మిత్ర దీప్తు లొప్పారఁగ మిన్నంటెడి కాంతులతో  
ఋత శక్తుల విశ్వమ్మున నతులితముగ దివి భువులను  
ఋక్ష గ్రహ ప్రముఖ రాజి రక్షిత గతి వర్తిల్లఁగఁ  
బ్రకృతివిహిత మౌచు నిత్యసుకృతపురుషశక్తి తనర  
మను రూపపుఁ గాల గతులఁ దనురూపపుఁ గాంతి రతులఁ  
ద్వష్టశక్తి రూప మౌచు నిష్టాపూర్తమ్ము గాఁగ  
విశ్వరూప మొప్పారును విస్తృత వర్ధన గతులను ॥ 3831

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) వృషశబ్దపు శక్తులతో విస్తృతానంతయాన
మొనరించెడి అసల శక్తి వినిమయగతు లొప్పారఁగ
ననిల సలిల మృత్తతులను నాకాశపు రూపాలను
నఖిల సృష్టి వర్తిల్లఁగ ననన్యశక్తితతులు మీఱ
బలవర్ధక మౌ శక్తుల ప్రభా భాసురంపు దీప్తి
యుష్కారక మౌచును నఖిలమ్మున నిత్య సత్య
ప్రాణశక్తి వర్ధకమై పరివ్యాప్త దీప్త మౌచు
నంత మెనయనట్టి శక్తు లనంతగతుల వర్తిల్లఁగ
నపురూపపు శక్తులతో నమేయంపు దీప్తులతో
నాకర్షణ వికర్షణల నగ్ని తనరు నఖిలమ్మున
సృష్టి స్థితి లయ గతులను జెలఁగ యజ్ఞ రూపముగా
నఖిల విశ్వ మలరారఁగ ననూహ్యమైన ఋతగతులను ॥ 3832

†(9) వృష్టిశక్తి విశ్వమ్మున నిష్టాపూర్తమ్ము గాఁగ
వ్యష్టి సమిష్టి గతు లొప్పఁగ వ్యాప్తమైన అసలశక్తి
ఊర్ధ్వగతుల నధోగతుల నొనరు నుభయ పార్శ్వగతుల
ముందు వెనుకలందు నమల మూర్తి భవ్యరూపు లొప్ప
దివ్య దేవతాళి శక్తి దీధితులను వర్ధిల్లఁగ
విశ్వ రక్షణమ్ముగాఁగ నశ్వి శక్తు లలరారఁగ
నమృత గతుల నమర గతుల నమల రతుల నఖిల జగతి
ననల మ్మది వర్తిల్లును ననురూప శక్తులతో
నంతరిక్ష పరివ్యాప్త కాంతి క్రాంతి దాంతి శక్తి
అంత మెనయనట్టి గతుల ననంతమైన రూపములను
నక్ష సహితమై తనరుచు నక్ష రహితమై వరలుచు
నఖిల రోదసీ తలమున ననాహతంపు గతు లొప్పఁగ
నద్వితీయమై వరలును నద్వయగతు లలరంగాఁ
బట్టు విడుపులవి తనరఁగఁ బ్రభాభాసితానలమ్ము ॥ 3833

†ఆ॥వె॥ ప్రకృతిమాత పురుష భావ జనితమైన
పుత్రుఁ డట్లు వర్ష భూతి తనరు
నగ్ని చలువ జలము లాకర్షితము లౌచు
నావి రగును నగును నంబుదములు ॥ 3834

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—116

ఋషిః—స్థౌరోఽగ్నియుతః స్థౌరోఽగ్నియూపో వా
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) పిబా సోమం మహత¹ ఇన్ద్రియాయ పిబా వృత్రాయ హన్తవే శవిష్ఠ ।
పిబ రాయే శవసే హూయమానః పిబ మధ్వస్తృపదిన్ద్రా వృషస్వ ॥ 1336

(2) అస్య పిబ క్షుమతః ప్రస్థితస్యేన్ద్ర సోమస్య వరమా సుతస్య ।
స్వస్తిదా మనసా మాదయస్వాఽర్వాచీనో రేవతే సౌభగాయ ॥ 1337

(3) మమత్తు త్వా దివ్యః సోమ ²ఇన్ద్ర మమత్తు యః సూయతే పార్థివేషు ।
మమత్తు యేన వరివశ్చకర్థ మమత్తు యేన నిరిణాసి శత్రూన్ ॥ 1338

(4) ఆ ద్విబర్హా³ అమినో యాత్విన్ద్రో వృషా హరిభ్యాం పరిషిక్తమన్ధః ।
గవ్య సుతస్య ప్రభృతస్య మధ్వః సత్రా ఖేదామరుశహా వృషస్వ ॥ 1339

(5) ని తిగ్మాని భ్రాశయన్ భ్రాశ్యాన్యవ స్థిరా తనుహి యాతుజూనామ్ ।
ఉగ్రాయ తే సహో బలం దదామి ప్రతీత్యా శత్రూన్ విగదేషు వృశ్చ ॥ 1340

---

1. మహతఽఇన్ద్రియాయ, 2. సోమఽఇన్ద్ర, 3. బర్హాఽఅమినో. (వ్రా.ప్ర.)

(6) వ్యంర్య[1] ఇన్ద్ర తనుహి శ్రవాంస్యోజః స్థిరేవ ధన్వనోఽభిమాతీః ।
అస్మద్ర్యగ్వావృధానః సహోభిరనిభృష్టస్తన్వం వావృధస్వ ॥ 1341

(7) ఇదం హవిర్మఘవన్ తుభ్యం రాతం ప్రతి సమ్రాళహృణానో గృభాయ ।
తుభ్యం సుతో మఘవన్ తుభ్యం పక్వో౽ద్ధీన్ద్ర పిబ చ ప్రస్థితస్య ॥ 1342

(8) అద్ధీదిన్ద్ర ప్రస్థితేమా హవీంషి చనో దధిష్వ పచతోత సోమమ్ ।
ప్రయస్వన్తః ప్రతి హర్యామసి త్వా సత్యాః సన్తు యజమానస్య కామాః ॥ 1343

(9) ప్రేన్ద్రాగ్నిభ్యాం సువచస్యామియర్మి సిన్ధావివ ప్రేరయం నావమర్కైః ।
అయా[2] ఇవ పరి చరన్తి దేవా యే[3] అస్మభ్యం ధనదా ఉద్భిదశ్చ ॥ 1344

## సూక్తము—116

ఋషి—స్థిరుఁడైన అగ్నియుతాఖ్యుఁడు లేక స్థిరుఁడైన అగ్నియూపుఁడు†
దేవత—ఇందుఁడు

(1)*సీ॥ వేల్పురేఁడా! నీవు వీర్య సంపద నొంద సోమంబు డ్రావుము! నీమ మలర
నతిశయ బల వృద్ధుఁడైన వ్రతుని జంప సోమంబు డ్రావుము! నీమ మలర
నాహూయమానుండవై ధనంబు నొసంగ సోమంబు డ్రావుము! నీమ మలర
నతిరుచ్యమైనట్టి యన్నంబు నందీయ సోమంబు డ్రావుము! నీమ మలర
గీ॥ మధుకరము లౌచు సర్వదా ముదము నొసఁగు,నట్టి సోమములం డ్రావుమయ్య![4] యింద్ర!
మేము కోరెడు కోర్కెల మిగుల మాకు,నొసఁగఁ దృప్తుఁడ వగుచు నీ వుండుమయ్య! ॥ 3835

1. ర్యఽఇన్ద్ర, 2. అయాఽఇవ, 3. యేఽఅస్మభ్యంధనదాఽఉద్భిదశ్చ. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 113వ పుటలో నీ సూక్తమునకు ఋషి "అగ్నియుతాఖ్యుఁడు"గాను, దేవత "ఇందుఁడు"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "అగ్నియుతుఁడు లేక అగ్నియూపుఁడు" గాను, దేవత "ఇందుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
4. నీవు ప్రీతి యింద్ర! (తా.పా.)

(2)*గద్యము॥
ఓ యింద్ర! స్తుతియుక్తము, హవిర్ధానమునుండి యుత్తరవేదిని బొందింపఁబడినది, అభిషుత
మయినది యగు సోమముయొక్క నీ భాగమును నభిముఖముగాఁ ద్రావుము; పిమ్మట
నీ వంతఃకరణమున హృష్టుఁడ వగుము; ధనవంత మగు సౌభాగ్యమును మా
కొసంగుట కభిముఖుఁడవు కమ్ము! ॥ 3836

(3)*గీ॥ దివ్యమైనట్టి సోమము దేవ! నిన్నుఁ
దనదు కళచేత మిక్కిలి తనుపుఁగాకఁ!
బృథ్వి యజనంబులంబునఁ బ్రీతిఁ గొనెడు
సోమమును నీకు నిడుఁగాక! శోభ మిగుల ॥ 3837

*గీ॥ ధనముఁ[1] బుట్టించితివొ! దేని ఘనతవలన
శత్రువుల నెల్ల దేనిచేఁ జంపుచుంటి
వట్టి మహనీయ సోమ మదెట్టులైన
నీకు సమ్మద మిడుఁగాక! [2]నిర్మలేంద్ర! ॥ 3838

(4)*క॥ స్తుత శస్త్ర వర్ధనీయుఁడు
సతతము సర్వత్రగంత సకలాభీష్టం
బతిశయముగ నొసఁగెడు హరి
క్షితిగల యన్నంబు హరులఁ[3] జేరుచుఁగాతన్! ॥ 3839

*చ॥ అరులను చ్రించునట్టి హరి! యజ్ఞమునం గల గోవుచర్మమం
దిరవుగ[4] సోమ ముండెఁగద! నీ మధు సోమము ద్రావి ప్రీతి నీ
వరయుచుఁ బుష్టిఁ గాంచుచు మహారుల చెంగట నిల్చి శక్తితోఁ
బరుసఁదనంబుఁ దాల్చి వృషభంబును బోలుచు నంచరింపుమా! ॥ 3840

(5)*చ॥ స్థిరముగ వెల్గుచుండు బహు తీక్ష్ణ మహాయుధపాళి నింద్రుఁడా!
వెరపున మండఁజేయుచును వేయి విధంబుల వానితోడ నీ
పురుతర యాతు[5]ధానులకు నున్న బలంబు నశింపఁజేయుచో
సురుచిర హవ్య మిచ్చెదము[6] శూరుఁడ! నీకు మహా ముదంబునన్ ॥ 3841

---

*రచయిత: ---కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ధనము జేసితివో, (తా.పా.), 2, నిర్జరేంద్ర! (తా.పా.), 3. జేరుగావుతన్, (తా.పా.), జేరగవలయున్ (మ.పా.),
4. దరమున, (తా.పా.). 5. యాతుధానగణ పూర్ణబలంబును బోవఁజేయుమా, (తా.పా.), 6. హవ్య మిచ్చెదము
సుమ్ము గ్రసంపుము దాని ప్రీతితోన్.(తా.పా.)

*గీ॥ పిదప నింద్రః నీవు పెద్ద శబ్దంబును
జేయుచుండి శత్రు సేన కెల్ల
వితత బలము గల్గి ప్రతికూలముగఁ బోయి
వారిఁ జంపు మీ వవారిత గతి ॥ 3842

(6)*గీ॥ స్వామిః యింద్రః నీవు సకలాన్నములఁ బ్రీతి
నొసఁగుమయ్యః మాకు నసమ రీతి
నరి సమూహ మెల్ల నాత్మీయ వీర్యంబు
గొనుచు బాణ తతులఁ గొట్టుమయ్యః ॥ 3843

*గీ॥ కడఁగి యాత్మీయ బలములఁ గాంచి యింద్రుఁ
డధికము ప్రవృద్ధుఁ [1]డవుటను నరి నిహంత
యౌచు నాత్మీయ తనువును నతిశయముగ
వృద్ధిఁబరుచుముః నీ దైన వృద్ధిఁగోరి ॥ 3844

(7)*గీ॥ ధనము గలవాఁడః సమార్ట్టః ఘనుఁడః యింద్రః
యస్మదీయ హవిస్సును నందుకొనవేః
యీ పురోడాశ మెల్ల[2] నీకె యీయఁబడెను
దీని భక్షించి సోమముఁ బూను మీవుః ॥ 3845

(8)*గీ॥ ఇంద్రః యుత్తరవేదిపై నెనఁగుచున్న
హవ్య లక్షణమౌ నన్న మందుకొనవేః
సోమమును ద్రావి యతిశయ శోభతోడ
వెలుఁగుచుండవేః యీ మహావిశ్వమందు ॥ 3846

*గీ॥ అన్నమును గల్గువారమై యధిక ధనము
గోరుచున్నార మింద్రునిఁ జేరుచుంటి
మిష్టి కర్తల యభిలాష లెల్ల సత్య
ములుగ నగుఁగాకః సంతతామోద మొదవ ॥ 3847

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. వృద్ధిఁబరచుడు, (తా.పా.), 2. యీ పురోడాశమును నీకె. (తా.పా.)

(9)*గీ॥ సింధువున నావ నట్టులు శ్రీమహేంద్ర
వహ్నులకుఁ బ్రేరణము సేతు వాక్కు నేను
ధనదు లైనట్టి దేవతల్ ఘనులఁ బోలి
మమ్ముఁ బూజింత్రు ధనముతో నెమ్మి మీర ॥ 3848

## సూక్తము—116

ఋషి—స్థిరుఁడైన అగ్నియుతాఖ్యుఁడు లేక స్థిరుఁడైన అగ్నియూపుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) అమృతత్త్వము నిత్యమ్మును నమల గతుల వర్ధిల్లెడి
సోమసార మదేపనిగ నియమముగా స్వీకరించి
అతిలోకపు వీర్యశక్తి నతివేలపుఁ బరాక్రమాల
నగ్నిరూప వజ్రశక్తు లసామాన్య ప్రభలు మీర
విశ్వశాంత్యభ్యుదయాల విధ్వస్తము కావించెడి
వృత్రాసురు దుష్ట బలముఁ జిత్రవధగఁ జేసిజేసి
వృష దీప్తుల వేగాలను విస్తరిల్లు శబ్దశక్తు
లఖిలేశుని కృపమెయి నఖిల సృష్టి నిల్చుచుండు ॥ 3849

†(2) అర్కాది గ్రహతతు లవి అమల సోమరసము నెల్ల
నమృతరూప మలరారఁగ నాస్వాదన మొనరించును
దివ్యశక్తి దీప్తశక్తి నవ్య నిత్య భవ్య ప్రభలఁ
జలన గతుల నొప్పారఁగ జ్వలితగతుల స్వస్వరూప
మహాగ్నిరూప మహోరాత్రు లసహాయానంత కిరణ
జాలా లవి జగములోన వేల లెనసి విస్తరిల్లఁ
బ్రాక్పశ్చిమ దిక్తటాలఁ బ్రభల నుదయాస్తమయాలఁ
బ్రకృతి మీర సర్వస్వము వరలు శుభ సౌభాగ్యగతుల
సంపదాళు లెల్ల సృష్టి సహజమైన భాగ్యములై
తనరారఁగ దైవశక్తు లనవరతము వర్ధిల్లును ॥ 3850

†(3) దివ్యాఽమృత సోమ శక్తు లవ్యయమై తనరారఁగ
రవిచంద్రుల గోళా లవి రాణ ఋక్ష గ్రహతతులును
నలిల వాయు పృథివీమయ సర్వభూత గోళ జాల
మెల్లఁ దృప్తి నొందు సదా యెల్లని చల్లని కృపతోఁ

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

దృప్తి నొందు దేవాఽఽఖులు తృప్తి నొందు సంతసానఁ
బ్రికృతి సర్వ సర్వస్వము ప్రిభాశక్తి భరిత మౌచు
విశ్వ సృష్టి శతృితతుల విరూపతల నామ రూప
విధ్వస్తము కావించును విశ్వ సౌభాగ్య మొసఁగు ॥ 3851

†(4) హరిశక్తిని విశ్వమ్మున నంధకార మంతరించు
వర్షశక్తి వృద్ధి నొందు హర్ష మొదవుఁ బ్రికృతిమాత
కామోదానందములను నఖిలములౌ దివి భువులను
నర్క చంద్రి గోళాలను ననంత ఋతు గ్రిహతతులను
సోమశక్తి ప్రిభావాస శోభలు శుభ బల శక్తులు
సహజములై వర్ధిల్లఁగ జగన్మాత మహా దీప్తి
నతివేలపు శక్తులతో నపురూపముగా వరలును
దృప్తి మీర సృష్టిలోన దుఃఖవినాశమ్ముగాఁగ
వర్షశక్తు లెల్ల నిలిచి హర్ష పులకాంకురాలు
నకృతానందరతులఁ బ్రికృతిలోన వర్తిల్లును ॥ 3852

(5)†అష్టపదకందము ॥
తానై మహాప్రిభల జగ
దనూన కాంతి తతులన్ వియత్తలమం దుత్
ప్రాణమ్మై చరము నచర
మౌ నిఖిల సుర జన తిర్యగాళి జడములున్
రాణించను నిత్యము పలు
స్థానములును సంచరించు చంద్రాదుల్ తే
జోనీకములన్ బ్రితిబిం
బా నీతములై వెలుంగు నతిప్రితికృతిగాన్ ॥ 3853

†(6) సౌరశక్తి వర్ధిల్లఁగ జ్వలితగతుల మిన్నంటుచు
సూక్ష్మాతిసూక్ష్మ మౌచుఁ జొచ్చి అంతరాంతరమున
నోజోగుణ మొప్పారఁగ బ్రాజితాభేద్య మౌచు
ననూన మౌచు నమేయ మౌచు నజయ్యంపు టాత్మశక్తి
"నభి"శక్తులు నశియింపఁగ నామూలాగ్రిమ్ముగాఁగ
మూలమట్టమ్ముగాఁగ మూర్తి మూల రూపు దునిమి
వర్ష శక్తి జగచ్ఛాంతి వర్ధిల్లఁగఁజేయు నదా
విశ్వ సౌభాగ్యతతులు నశ్వరతుల నలరారఁగ ॥ 3854

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

†(7) సృష్టిలోని పదార్థాలు వెలఁగు హవిరాశిగాఁగ
సూర్యుఁ డలరు గ్రహీతగా నార్యదేవతాళితోడ
అన్నింటిని మిన్నంటుచు వెన్నుఁడుగా గ్రహియించుచు
నమృతమ్ముగ సోమశక్తి నా చంద్రాదుల కిచ్చుచు
నఖిల సృష్టి పుష్పవంత మగునట్లుగఁ బోషించును
నభ్యుదయావహముగాఁగ నాయుర్బల వర్ధకముగ
దేవాఽళుల దివ్యశక్తి నేవముగా వెల్గొందఁగ
నవినాభావమ్ముగాఁగ నమృత మోజ శక్తు లలర
విశ్వ సృష్టి యజ్ఞ మౌచు శాశ్వతమౌ కర్మలుగా
దేవదేవు ధర్మముగా దివ్య ధర్మ మర్మముగా ॥ 3855

†(8) సృష్టికర్త ఇచ్ఛారతి నిష్ఠి జరుగు విశ్వమ్మున
స్రష్టకె స్రష్టగ వెల్గెడి సర్వేశుని లీలగాఁగ
సకల చరాఽచరప్రపంచ సర్వస్వము హవిషముగా
నలరారును సృష్టియజ్ఞమందుఁ గాల మౌచుఁ దనత
నర సురాళి తిర్యగ్జడ పరమై వరలును సర్వము
సూర్యులె వేదులు కాఁగా సోమాఽమృతధార లెనయఁ
బంచభూత తత్త్వా లవి పరిధ విల్లు బ్రహ్మమ్ముగఁ
బరఁగుచుండు విశ్వ సృష్టి పరబ్రహ్మ యజ్ఞముగా ॥ 3856

†(9) ఆకసమ్మె సింధువుగా నలరారఁగ సృష్టిలోన
అరుణుండే నావ కాఁగ నఖిల బ్రహ్మాండములను
సృష్టివరలు మహాశక్తి వ్యష్టి సమిష్టి రూపాలను
సౌర మండలమ్ము లెల్లఁ బార మెనయనట్టి సృష్టి
దరణి శక్తి ప్రభావానఁ దరణీయములై వరలును
నిత్యచార లొప్పంగా సత్యతార లుప్పరమై
గ్రహరాజుల క్రమగతులను నహోరాత్రు లలరంగా
దివ్య దేవతాళి వరల దేవదేవు మహాశక్తి
కర్మ రూపమై విశ్వము ధర్మ గోపమై సత్యము
మర్మ దీపమై నిత్యము నిర్మల తత్త్వమ్ము మీర
సచ్చిదానందమ్ములు నిచ్చ లామోద గతుల
జగదీశుని చక్షువులై అగణిత గతి నలరారును ॥ 3857

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—116

ఋషి—స్థిరుఁడైన అగ్ని యుతాఖ్యుఁడు లేక స్థిరుఁడైన అగ్ని యూపుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము —2

†(1) మహనీయమ్మౌ నింద్రియ మహిత పౌరుషంబు వెలుఁగ
సనాహతంపు వజ్రశక్తి అతివేలముగా నిలువఁగ
మహాహతకుఁ డౌచు జగతి మంపఁజేయు వృత్రాసురు
వధియించుచు విశ్వమ్మునఁ బ్రాణశక్తి మను శక్తులు
శాంతి దాంతి శుభావళులు సౌభాగ్యాభ్యుదయాలు లెల్ల
వర్ధిల్లఁగ బహుముఖాల సార్థకానుభూతు లలర
భువి దివి భువనా లన్నిటఁ బూర్ణ వర్ష తర్షణ లవి
అనుభూతికి రాగఁ బ్రకృతి కమృతముగా వరలుచుండు ॥ 3858

†(2) ప్రకృతిమాత పుత్రుఁడుగా వరలు విశ్వ సంపదాళి
సోమామృత శక్తి తతుల సొబగొందును నిత్యమ్మును
మనశ్శక్తి మహితముగా సమర్థ్యరూపమై వరలుచు
అతిలోకపు శక్తులతో అతివేలపు గమనాలను
వివిధాకర్షణ శక్తుల విరాడ్రూప దివ్య శక్తి
విస్తరించి సర్జించుచు విమలమ్మై వర్ధిల్లును
నజయ్యముగ నమేయముగ నపూర్వముగ ననూనముగ
విశ్వశాంతి సౌభాగ్యము స్వస్తి సంపదాళి నిచ్చు ॥ 3859

†(3) సోమామృతము దివ్య శుభ శక్తులను నిచ్చుఁ
బ్రాణితతులను మమత పరిఢవిల్లఁగఁజేయుఁ
దరు లతల పర్ణాలఁ దనరు సుమ ఫలములన్
ధరాధరముల ధరల ఝరులందు జలధులన్
ఖనిజాల గనుల రస ధునులందు గగనాన
ననిలాల ననలాల లఖిలాండ పిండాండ
బ్రహ్మాండ భాండాల రాజిల్లఁగాఁజేయు
మహిమాన్వితమ్మైన మమతా పరివ్యాప్త

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సంక్షేమతత్త్వమ్ము సౌభాగ్య భాగ్యమ్ము
వర్ధిల్లఁగాఁజేయు బహుశక్తు లెనయఁగాఁ
బ్రకృతి పురుషుల శక్తి వికృత శత్రువులైన
"అభి"శక్తులను దుంచు నఖిల కళ్యాణగతి ॥ 3860

†(4) సూర్యకాంతి పుంజాలను సోముఁడు శీతల కౌముదు
లలరారఁగ వెలుఁగుచుండు నరుణదీప్తి తేజా లవి
అఖిల ఋక్ష గ్రహతతులను అలరించును వెలుఁగులుగా
నంతరిక్ష పుత్రులుగా నద్భుతగతిఁ దిరుగుచుండి
ఆత్మప్రదక్షిణల నలరు ప్రదక్షిణముల
ననునిత్యము తిరుగుచుండు నఖిలేశుని గోళీలై
కష్టసుఖము లిరవొందఁగ నష్ట లాభములు పొందఁగ
సృష్టి క్రియ సత్యములై పుష్టి వర్ధనమ్ము లౌచు ॥ 3861

†(5) చక్రగతుల వక్రగతుల నిర్వక్రపరాక్రమాల
ఋక్ష గ్రహ గోళా లవి అక్షరగతిఁ దిరుగుచుండు
సౌరశక్తి ప్రభావాల మేర లెనసి సంచరించు
సుగ్రకాంతి దీప్తు లెల్ల నుచ్చ నీచ గతులు తనర
విశ్వ శత్రు రూపమైన విషజాలము లెల్ల విరచి
సంక్షేమపు శక్తి జాల సర్వస్వము ప్రసాదించి
నిత్యసత్యమై వరలును నిర్నిద్రిత చేతనతలు
సృష్టి స్థితి లయగతులను జిద్విలాసములు మీరఁగ ॥ 3862

†(6) దివ్యదేవదేవుశక్తి తేజరిలఁగ విశ్వమ్మున
సహజ సృష్టి విరుద్ధంపు వ్యష్టి సమిష్టి రూపాళుల
నోజశ్శక్తులు మహిత మహోజ్జ్వల దీప్తులమై
"నభి"శక్తులఁ దున్మాడుచు "నాభి"శక్తి వర్ధిల్లఁగ
విషశక్తుల సంహరించి ధిషణగతులు కసిమసంగ
నంతరిక్ష గతములైన అజయ్యంపు టక్షయాల
నమేయమౌ నక్షరమౌ నపరిభూత దివ్యశక్తు
లలరారును దైవీయపు టమరలీల లొప్పారఁగ ॥ 3863

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) సృష్టిరూప సర్వస్వము నిష్టిగాఁగ విశ్వముగాఁ
చరాచరమ్మైన గతుల సర్వేశుని హవిస్సుగా
దేవదేవు ప్రీతముగాఁగ దివ్యనిత్య క్రతువుగాఁగ
ఋతరూపమ్మై తనరెడి సతత సృష్టి స్థితి లయాళి
అతులితమై అనుస్యూతమై అవినాభావాల మీరు
నన్యోఽన్యత లలరంగా నఖిల ప్రకృతి వర్తిల్లును
సౌర శక్తులన్ గ్రహములు సకల ఋక్షతతులు సదా
కాంతితతుల విరాజిలును శాంతి దాంతి సుఖము లొప్ప ॥ 3864

†(8) సృష్టికర్త హృద్గతమౌ నిచ్ఛారతి నచ్ఛమైన
విశ్వరూప మెల్ల నిలుచు నశ్విశక్తు లలరారఁగ
సచ్చిదానందా లవి అచ్ఛములై సృష్టి నెల్ల
నవినాభావంపు శక్తి నద్భుతగతి వర్తిల్లును
ఋతరూపములౌ ప్రకృతుల సతత సృష్టి స్థితి లయాల
యజమానుండౌ వేపుఁడు యజనమ్ముల సహజముగా
సోమాఽమృత శక్తు లలర శుభ సుఖ మహోదయాల
నియమ గతులఁ బ్రసరింపఁగ నిఖిల జీవ ప్రాణి జాల
సంక్షేమము లలరంగా సంవర్ధనగతులు మీఱ
నఖిల కామ రూపాలను నఖిలేశుని ఏలగాఁగ ॥ 3865

†(9) దశదిశలను దనరారెడి తరణి జాల కాంతితతులు
అఖిలాంతర్వర్తిగాఁగ సలరారెడి అగ్నితత్త్వ
మసాధారణంపు గతుల నసామాన్యరతులు వరల
సకలలోక గోళాదులు సంచరించు ననునిత్యము
నంతరిక్షమందుఁ గ్రమత వింత క్రమ శిక్షణలు తగ
నుదయాస్తమయగతులను నుజ్జ్వలమౌ కాంతితతులఁ
బ్రకృతి సంపదాళి తనరఁ బరమేశుని లీలమెయిని
నాకాశము ననిలమ్మును ననలమ్మును జల మృత్తులు
జలధు లౌచు విలసిల్లఁగ శబ్దాదుల శక్తు లెల్ల
నావలుగాఁ బరఁగంగా నవ్య నిత్యమౌచు సృష్టి
నదయాడును బసిపిల్లగఁ బడి లేచును బ్రవృద్ధముగ
నభ్యుదయ మ్మందుచుండు నంతర్గతి నంతరించు ॥ 3866

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ ఉత్తమమౌ శబ్దాలను
జిత్తమయమ్మైన శక్తి చేతన గతిమై
సత్తైమ్మై హృద్గతిగా
నిత్తైమ్మై విశ్వయాత్ర నిజగతి మీరన్ ॥ 3867

† క॥ అనిలాఽనల వేగమ్ముగ
మనోగతి సువేగ మహిత మాన్య జనితమై
అణు పరమాణువులను మిం
చి నింగి మింగుచు సదా అజేయ మ్మౌలేః ॥ 3868

## సూక్తమ్—117

ఋషిః—భిక్షురాంగిరసః
దేవతా—ధనాన్నదానం
ఛందః—త్రిష్టుప్; 1-2-జగతీ

(1) న వా[1] ఉ దేవాః క్షుధమిద్వధం దదురుతాశితముప గచ్ఛన్తి మృత్యవః ।
ఉతో రయిః పృణతో నోప దస్యత్యుతాపృణన్ మర్డితారం న విన్దతే ॥ 1345

(2) య[2] ఆధ్రాయ చకమానాయ పిత్వోఽన్నవాన్త్సన్ రఫితాయోపజగ్ముషే ।
స్థిరం మనః కృణుతే సేవతే పురోతో చిత్ స మర్డితారం న విన్దతే ॥ 1346

(3) స[3] ఇద్భోజో యో గృహవే దదాత్యన్నకామాయ చరతే కృశాయ ।
అరమస్మై భవతి యామహూతా ఉతాపరీషు కృణుతే సఖాయమ్ ॥ 1347

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. వాఽఉ దేవాః, 2. యఽఆధ్రాయ, 3. సఽఇద్భోజో. (వ్రా.ప్ర.)

(4) న స సఖా యో న దదాతి సఖ్యే సచాభువే సచమానాయ పిత్వః ।
అపాస్మాత్ ప్రేయాన్న తదోకో[1] అస్తి పృణన్తమన్యమరణం చిదిచ్ఛేత్ ॥ 1348

(5) పృణీయాదిన్నాధమానాయ తవ్యాన్ ద్రాఘీయాంసమను పశ్యేత పన్థామ్ ।
ఓ హి వర్తన్తే రథ్యేవ చక్రా ఽన్యమన్యముప తిష్ఠన్త రాయః ॥ 1349

(6) మోఘమన్నం విన్దతే[2] అప్రచేతాః సత్యం బ్రవీమి వధ[3] ఇత్ స తస్య ।
నార్యమణం పుష్యతి నో సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ ॥ 1350

(7) కృషన్నిత్ ఫాల[4] ఆశితం కృణోతి యన్నధ్వానమప వృఙ్క్తే చరిత్రైః ।
వదన్ బ్రహ్మావదతో వనీయాన్ పృణన్నాపి[5]రపృణన్తమభి ష్యాత్ ॥ 351

(8) ఏకపాద్భూయో ద్విపదో వి చక్రమే ద్విపాత్ త్రిపాదమభ్యేతి పశ్చాత్ ।
చతుష్పాదేతి ద్విపదామభిస్వరే సంపశ్యన్ పఙ్క్తీరుపతిష్ఠమానః ॥ 1352

(9) సమౌ చిద్ధస్తౌ న సమం వివిష్టః సంమాతరా చిన్న సమం దుహాతే ।
యమయోశ్చిన్న సమా వీర్యాణి జ్ఞాతీ చిత్ సన్తౌ న సమం పృణీతః ॥ 1353

---

1. తదోకోఽఅస్తి, 2. విన్దతేఽఅప్ర, 3. వధఽఇత్, 4. ఫాలఽఆశితం, 5. పరివృణన్త. (వా్ర.ప్ర.)

## సూక్తము—117

ఋషి—భిక్షువను ఆంగిరసుఁడు†

దేవత—ధనాన్నదానములు†

(1)*గీ॥ ఎవఁడు వధరూపమౌ క్షుత్తు నెక్కుడన్న
దానమున శాంతిఁ బరచు నాతఁడు సుదాత
యితరుల కిడక యన్నము నెల్లఁ దానె
తినెడు వానిని మృత్యువు తినునుగాదె: ॥ 3869

*గీ॥ దానము నొసంగకున్న యదాతృ ధనము
నాశనము నొందుచుండు నా నరుని జనులు
సుఖయితగ నెంచకుందురు సురలు కూడ
వాని సుఖపెట్టఁజాలరు వలసినట్లు ॥ 3870

(2)*గద్యము ॥
ఏ పురుషుఁ డన్నవంతుఁడై నను నన్నమును గోరు దుర్బలునకు, దారిద్ర్య హింసితునకు, గృహమునకు వచ్చువానికి, దాన మిడక పోవుటయందంతఃకరణమును సుస్థిరముగఁ జేయునో: వాఁడు తనను సుఖపెట్టువానినిఁ గాంచఁజాలఁడు ॥ 3871

(3)*గీ॥ అన్నకాముఁ డవుచు నావసథంబును
జేరు వాని[1] కెలమి శ్రీలు చెలఁగు
నన్న మొసఁగువాఁడె యన్ని విధంబుల
దాత యగును సుమ్ము: ధరణియందు ॥♦ 3872

*గీ॥ యజ్ఞమందు దాత యధిగమించెడు ఫల
మెక్కు వగుచునుండుఁ జక్కని గతి
జన్మభూమియందు సర్వులు వానికి
మిత్రులగుచు నుంద్రు మైత్రిఁ బూని ॥ 3873

†వ్రాతప్రతి 14వ సంపుటము 117వ పుటలో నీ సూక్తమునకు ఋషి "భిక్షు వసు ఆంగిరసుడు"గాను, దేవత "ధనాన్నదానములు" గాను వ్రాసి, 15 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "భిక్కు" ఋషిగాను, "ఔదార్యము" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. జేరియున్నవారి చిత్త మలర. (తొ.పా.)

♦3వ ఋగనువాదముగా నున్న "అన్నకాముఁ డవుచు" ఇత్యాది పద్యము తరువాత 3వ ఋగనువాదములో రెండవ పద్యముగా నున్న "యాన సంబంధ" ఇత్యాది పద్యము ను వ్రాసి శ్రీనేమానివారే కొట్టివేసిరి.

(4)*గీ॥ సహభవన శీలుఁడై నట్టి సఖ్యు మూను
నట్టి సేవకుఁడై నట్టి యఖిల జనున
కెవ్వఁ డన్నము నొసఁగంగ నేగకుండు
నట్టివాఁడు సఖుం డెట్టు లగును జగతి? ॥ 3874

*గీ॥ జనుఁడు దాతగ నుండని జనుని వీడు
వాని సదనంబు[1] సదనమై వరలు టెట్లు?
పురుషుఁ డన్నాదికంబును గర మొసంగు
నట్టి సామిని బ్రీతితో నధిగమించు ॥ 3875

†గీ॥ మిత్రులకును సర్వ పితృ దేవతలకు
నన్న మిడని నరుఁడె యధముఁ డగును
గాక! నతని మిత్రిగా నెవ్వరైనను
దలఁతురొక్కొ? పృథ్వి దాతగాను ॥ 3876

(5)*గీ॥ విపుల ధనముచేఁ బ్రవృద్ధుఁడౌ పురుషుండు
యాచకునకు ధనము నందఁజేసి
యున్న యెడల నాతఁ డురుతర సుకృతంబు
జూచుఁగాదె! జనులు చోద్య మంద ॥ 3877

*గీ॥ యాన సంబంధ చక్రము లతిశయముగఁ
గ్రిందకున్ మీఁదకుం బోవు రీతి ధనము
లొక్క పురుషుని వీడి మరొక్క పురుషుఁ
బొందుచున్నవి యీ మహా భువనమందు ॥ 3878

(6)*గద్యము॥

అపరిపక్వ జ్ఞానుఁడు నన్నమును వ్యర్థముగఁ బొందుచున్నాఁడు. ఇది యదార్థ మని చెప్పుచున్నాను. కేవలము వ్యర్థమే కాదు‡. ఆ పురుషున కన్నము వధప్రాయ మగును. ఏ పురుషుఁడు సర్వ దేవతలను హవిఃప్రదానమునఁ బోషింపఁడో! అభ్యాగతాఽతిథి కన్న మిడక తానే తినునో! వాఁడు పాపాత్ముఁ డగుచున్నాఁడు ॥ 3879

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. చక్కని సదనమౌనె. (తా.పా.)

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡ఋషి, పితృ, దేవ, భూత మనుష్యు లను వారిని మొదటఁ దృప్తిపరచినపిమ్మట గృహస్థైనను దా నన్నమును దినవలయు నని గార్హస్థ్య ధర్మముల విధింపఁబడినది. ఆ తీరున చేయక యెవఁడేని కేవలము తన యుదర భరణార్థమై యన్నమును వండుకొని తినెనేని నా మనుష్యుఁ డఘమును బొందు. వాఁడే పాపాత్ముఁ డగును. ఈ పంచ మహా యజ్ఞములే కాక దానము, సత్యము, దయ, అహింసయు నను సర్వభూత హిత ప్రదములును గృహస్థునకు విధింపఁబడినవి. ఇవియన్నియు నొక విధ మగు యజ్ఞములే యని తైత్తిరీయ సంహిత. (1.11)

(7)*గద్యము॥
కృషిని జేయుచున్న ఫాలుఁడు కర్షకుని భోక్తగఁ జేయుచున్నాఁడు. మార్గమందుఁ బోవు పురుషుఁడు ఆత్మీయ గమనములచే స్వామికి ధనమును గూర్చుచున్నాఁడు.శాస్త్రార్థముఁ జేయుచున్న బ్రాహ్మణుఁడు శాస్త్రార్థము చేయనివానికంటెఁ బ్రియకరుఁడు. వీరందఱు స్వకర్మయందుఁ బ్రవర్తమానులై పరుల కుపకారకు లగునట్లు దాత యగు పురుషుఁ డాదాత యగు పురుషుని కంటె బంధు వగును ॥ 3880

(8)*గీ॥ ఏకపాద ధనుండైన యెల్ల జనుఁడు
ద్విపద ధని మార్గమును బట్టి తేజరిల్లు
ద్విపద ధనుఁడును గ్రమముగాఁ ద్రిపద ధనుని
నధిగమించుచునున్న వాఁ డతుల శక్తి ॥ 3881

*గీ॥ అల చతుర్భాగ ధనవంతుఁడైన వాఁడు
ధన చయంబులఁ దాఁ గడుఁ గనుచునుండు
నిట్టులే యుత్తమాధము లెల్ల వారు
కాన ధనము నొసంగుఁడీ! కరుణ జనులు ॥ 3882

(9)*గద్యము॥
హస్తములు సమములైనను సమానముగఁ గార్యమందు వ్యాపింపవు. వత్సమునకు ధేనువులు సమములైనను బయస్సు నొసంగవు.సహజాత పుత్రులకుఁ గూడ సమానవీర్యము లుండవు. ఒక్కకులమందుఁ బుట్టిన వారైనను సమానముగ నీయఁజాలరు. కాఁబట్టి ధన మెవ్వనికిఁ గలదో! వాఁడే ధనము నొసంగును ॥ 3883

## సూక్తము—117

ఋషి—భిక్షువను అంగిరసుఁడు

దేవత—ధనాన్న దానములు

### అర్థాంతరము—1

†(1) క్షుధాకలితమై వరలెడి సృష్టి స్థితి గతులఁ బ్రాణి
మిత్తి బారిఁ బడుచునుండు మిన్నుల మన్నుల జలమున
ననలాఽనిల సర్వమ్మున ననల రూప మౌచు నిలిచి
సోమాఽమృత శక్తితతుల క్షుత్పిపాస లుపశమింప
నతిలోక బలాతిబలాల నలరి నిత్య యౌవనమ్ము
నమృత గతు లొప్పారును ననాధారణంపు స్థితుల
నిర్జించుచు శత్రుతతుల భర్జించుచు రుగ్ణతలను
నజరామర స్థితి గతులను నపూర్వమ్ముగా నిలుచును ॥ 3884

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత.—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) విశ్వ సృష్టి యజ్ఞమౌను విమల శక్తులొప్పారఁగ
ఆహారమ్మౌను ప్రకృతి ఆత్మార్పణ మగు రీతిగఁ
ప్రకృతినుంచి ఆహారము ప్రాణికిఁ బ్రాదుర్భవించుఁ
దరు లతలును ధరణి ధరాధరజాలము
లెల్ల స్వీకరించుచుండు నిచ్ఛాధృతి నాహారము
అన్నమ్మును మానవాళి ఆహారముగా గ్రహియింపఁగ
ఆ అన్నమె మానవాళి నాహారముగా గ్రహించుఁ
చిత్స్వరూప తత్త్వమ్మది సత్స్వరూప దీప్త రతుల
నానందమ్ముగ వర్తిలు నంతయు నద్వైత గతిగ
ద్వైతగతిగ దృశ్యమ్మై తాదాత్మ్యత వరలుచుండు ॥ 3885

†(3) అన్నమ్మే పరబ్రహ్మమై తనరుసు సృష్టిలోన
అన్న రూపమై వరలును నఖిల పదార్థములు జగతి
"సహం బ్రహ్మాస్మి" నాఁగ నంతయు బ్రహ్మమ్మె యౌను
బ్రహ్మమ్మును గోరి చేరఁ బరఁగు హ్యాచ్ఛక్తు లెల్ల
సర్వాంతర్యామిగాఁగ సకలము బ్రహ్మ మ్మౌచును
జన్య జనక భావమ్ముల జగత్తెల్ల వర్తిల్లఁగ
సృష్టి స్థితి లయ కర్మలు స్వేష్టాపూర్తమ్ము లగుచు
సచ్చిదానందరూప శర్మమ్మది కర్మమ్మది
ధర్మమ్మది పరబ్రహ్మ తత్త్వమ్మది రూపమ్మై
వరఁగును బ్రహ్మజ్ఞుని తరణీయముగా నిత్యము ॥ 3886

(4)†క॥ బ్రహ్మమె సహజన్మత్వము
బ్రహ్మమ్మే సఖ్య మగుచు వరలును సృష్టిన్
బ్రహ్మమ్మే సేవకుఁడై
బ్రహ్మమ్మే జన్మ ప్రాణ బల వర్ధకమౌ ॥ 3887

†క॥ ఆదానములఁ దగి ప్రదా
నాదుల సృష్టి స్థితి లయ కార్యము లలరన్
ఆదియు నంత్యము లెనయని
తాదాత్మ్యమ్మనను బ్రహ్మ తనరారు సదాః ॥ 3888

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) విశ్వరూపుఁడై వెలిఁగెడి విమల మహా పూరుషునకుఁ
ప్రకృతి మాత ధనముగాఁగ వరలు సకలమ్ము గాఁగ
చక్రనేమి క్రమత మీఱ సౌరమండలావళు లవి
యానబద్ధమై మహా కాలమాన సమిద్ధ మగుచు
నండ పిండ బ్రహ్మాండము లన్నియు నిర్గుణము లౌచుఁ
బరబ్రహ్మతత్త్వమ్మున దురిత రహిత మౌచుఁ జేరు
నంచెలంచె లౌచు నౌరవు లంచితముగఁ గాల గతుల
మించి తనరు లోకి గోళ సంచయాలు పయనించుచు ॥ 3889

*ఆ॥వె॥ వివిధ కాల చక్ర వితతులు నిత్యమ్ము
సత్య గతము లౌచుఁ బ్రత్యభిజ్ఞ
తత్త్వ మొందు బ్రహ్మ తత్త్వాన వర్తిల్లు
నంత మెనయకయె యనంత గతుల ॥ 3890

(6)†క॥ భక్ష్యమ్మై భక్షకమై
లక్ష్యమ్మై నిర్గుణ పరబ్రహ్మ పదమ్మై
కక్ష్యాంతరముల సృష్టి న
లక్ష్య క్రమ శిక్షణ మెయి రాజిలు జగతుల్ ॥ 3891

†క॥ సత్యమె కేవలమై స
న్నిత్యత పరలంగ మోహ నివృత్తిన్
అత్యమలమ్మై సృష్టి న
కృత్యమ్మై కృత్యమై నిగూఢ మ్మౌరా! ॥ 3892

†(7) అచర తరు గిర్యాదులు చర గోళ గతమ్ము లౌచు
నజడ గతుల నలరారుచు నపురూపపు శక్తులమై
నిర్ణీతపుఁ బరిధులలో నియమకాల బంధాలను
"నభి" శక్తులఁ దున్మాడుచు నతి వేలపు మహాదీప్తి
బ్రహ్మరూప ప్రకృతి విజయ రక్షితమై శిక్షితమై
ఆదాన ప్రదానాల నసాధారణంపు రతుల
రోదసి మరు దగ్ని జల పృథ్వ్యలరు సృష్టిలోన
దేవదేవు నాజ్ఞమెయిని దివ్యశక్తి లీల గతుల
దుర్గమ్మగు మార్గగమై నిర్గమాఽదుర్గగమై
బద్ధ మౌచు వివిధ కాల నిబద్ధ మౌచు వర్తిల్లును ॥ 3893

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) కాలరూప మేక మౌచు వేల లెనయకుండా సలరు
క్రమ గతులను దకరకాలఁ గాని విగోగోచతతులు
ద్విపదగతుల వర్తిల్లును త్రిపదగతుల వర్తిల్లును
జతుష్పద స్థితు లలరఁగ సర్వమ్మును వరలుచుండుఁ
గృతయుగమై ద్వాపరమై త్రేతా కలియుగమ్ము లౌచు
జగదీశుని మహా మాయ లంగజకర్తృతులై వెలయఁగఁ
జరాచర ప్రపంచమ్ము సర్వ సమత కాల గతుల
"సఖి"శక్తులఁ దున్మాడుచు సలరు నిత్య సత్యమ్ముగ ॥ 3894

† అష్టపదకందము ॥
ఏక గుణమ్మె వరలుచుఁ
బ్రాకటముగ ద్వైత గతులఁ బర్వ ద్విగుణమై
సాకల్యంబుగఁ ద్రైత
మ్మాకృతిగాఁ ద్రిగుణ మగుచు నైక్య గతులమై
నేకత కలియఁ జతుష్పద
జాఽఽకలితమ్మె ప్రకృతిని సలరి గుణాళుల్
దీకలితమైన విశ్వ
మ్మేకైకమ్మయి చెలఁగును నితరేతరమై ॥ 3895

†(9) సర్వగతమ్మైన సత్తు సత్య రూపమై యొకటౌ
సత్తు ఒక్కటయ్యు జగతి సమాప్తిపల్ భిన్నము లగుఁ
జిత్తన్నది జగతిలోనఁ జెలఁగును నొక్కటి కాఁగను
జిన్మయమై సర్వమ్మును జీద్విలాసగతు లౌవ్వఁగ
భిన్న భిన్న రూపాలను జెన్నొందును జిత్తు సృష్టి
అఖిల సృష్టి నానందము అసాధారణముగ సలరు
ఏకైకమ్మె ప్రకృతిని నెనఁగు వేరువేరు గతుల
జీవ కోటి తత్త్వాళి నిర్జీవకోటి పదార్థాల
వీర్య మొక్కటై వరలఁగ వేరు వేరు శక్త్యాళిని
యమనియమాలొక్కటిగా సమలములై భిన్నము లగు
సమ గతులను వర్తిల్లును సర్వమ్మును విశ్వమ్మున
ససమగతులఁ బ్రవర్తిల్లఁ బసల ప్రాణి పదార్థాలు ॥ 3896

†రచయిత;—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—117

ఋషి—భిక్షువను ఆంగిరసుఁడు

దేవత—ధనాన్నదానములు

### అర్థాంతరము—2

†(1) ఆకాశాఽనిలాలతోడ ననల జల మృత్తతులను
దనరెడి వివిధ గోళతతు లన్నిటఁ బుట్టి బ్రతుకునులే!
ప్రాణికోటి ఆకలితో నలమటించుచుండునులే!
దివ్యదేవతాళు లెల్ల భవ్య సుఖము లందుచుండి
క్షుత్పిపాస సహితముగా క్షుత్పిపాస రహితముగా
నలరుచుండు రతి లోక బలాతిబల శక్తులమై
అమృతాస్వాదన మొప్పఁగ నాకలి ఉండియు లేకయు
స్థితి గతులను నిత్య సత్వ జీవగతుల నలరారుచు
లఖిల చారశక్తు లెనయ నదృశ్యంపు మహిమలు తగ
దీర్ఘాయుర్దాయ మొప్ప ననర్ఘ యౌవనంపు గతుల
మృత్యువునకు లోఁబడుచున్ బునర్జన్మ మలరారఁగఁ
బుట్టి పెరిగి గిట్టుచుండుఁ బూర్ణ మహావిష్ణుకృపను ॥ 3897

†(2) అమృతాస్వాదన మొప్పఁగ సమరమైన దేవాళులు
అన్నవంతమై ఆలరును మిన్నంటిన శక్తులతో
ప్రజ్ఞాధనులౌ విజ్ఞులు యజ్ఞమ్ములు చేయ సృష్టి
హవిషాదులు నైవేద్యా లన్నియు ననలమ్ము కలన
దేవాళులఁ జేరుచుండు దివ్యక్షుత్తు నడఁగించును
జిన్మనశ్శక్తు లెల్లఁ దన్మయమౌ బ్రాహ్మ్యమ్మున
సంకల్ప వికల్పాల సర్వ రూపముల నందుచుఁ
బ్రకృతిలోన నైక్య మౌను బ్రాకృతగతు లొప్పారఁగ ॥ 3898

†(3) సఖ్యరూపమై ప్రకృతి సర్వభూత చయము వోలె
నంతరాంతరాల గతులు నిరంతరమ్ము వర్తిల్లఁగ
స్థితిశక్తుల నిలిచి ఉండి చెలఁగి ప్రవృద్ధమ్ము నొచు
వశ్య రూప దీప్తులతో నవశ్యదీప శక్తులతో
ఆకర్షణ వికర్షణాది అమరశక్తు లొప్పారఁగ
బలాబల ప్రదర్శనలఁ బ్రకృతి వికృతి తత్త్వ మహిత
సృష్టి సహజ గుణము కాఁగ వ్యష్టి సమిష్టి రూపాలను
జయము నపజయమ్ము నొందు జగమే ఒక లీలకాఁగ ॥ 3899

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) సఖిత్వాన పదార్థాల జన్యాకర్షణ శక్తుల
సాన్నిహిత్య మొనర్చుకొను సమైక్య రూప మందంగా
శత్రు భావ మొప్పంగా జన్యాకర్షణ శక్తుల
సాన్నిహిత్య మొనర్చుకొనుచుఁ జంపి వైచు రూపుమాపి
ప్రకృతిరూప శక్తు లెల్ల వికృతములై విశేషముగ
మిత్రత్వము తనరంగా శత్రుత్వము వరలంగా
రెండు కారణాలఁగూడ నిండు ప్రేమ వైరమ్ముల
వస్తుతతుల దూరముగా నిస్తులగతిఁ ద్రోసివేయు
సనిలమ్మున సగ్ని పుట్టి అనిలమ్మున సగ్ని ఆరు
రీతిఁ బంచభూతాళులు సృష్టి స్థితి లయము లొందు
సృష్టిలోని చిత్ర మ్మిది సృష్టి స్రష్ట సత్ర మ్మిది
స్రష్ట స్రష్ట విచిత్రింపుఁ జారుచర్య మాయ లీల ॥ 3900

†(5) విశ్వ సృష్టి గోళతతులు విపులమైన లోకాళులు
వివిధ కాల బద్ధాలై వెలుఁగు చీకట్ల వరల
రకరకాల మార్గాలను గకావికలు కాకుండఁగఁ
గ్రమశిక్షణ లొప్ప సక్రమ రక్షణ లమరంగా
ఛిన్నాభిన్నముకాక భిన్నభిన్న మార్గాలను
నలరు ప్రదక్షిణాళులను నాత్మ ప్రదక్షిణావళులను
నధిపతి కధీన మౌచు నధిగమించి అవాంతరాల
నిత్యయాన గతులతోడ నిఖిలేశుని జాడ చూడ
నాత్మ స్థైర్యమ్ముతోడ నాత్మ పరమాత్మ నెరిఁగి
సౌరాదిత్యుల పరిధుల మేర మీరకుండ చరించు ॥ 3901

†(6) అమృతంబైనను గాని అల సోమపు శక్తిగాని
ఆహారమ్మై వరలెడి అఖిల సృష్టి పదార్థాలు
మోఘములై విలసిల్లును నమోఘములు కావు చూడఁ
బ్రకృతి సత్య విరుద్ధమౌ వికృత రాక్షసాళి శక్తి
విధ్వస్తము కావించును విశ్వ సంక్షోభమ్ముల
నఖిల విశ్వ సర్వస్వము నపురూపపు శక్తులతో
ఋత భరితమ్మై నిల్చును ఋత వర్ధితమై వెలుఁగును
సృష్టి స్థితి లయాలు చెలఁగును ఋత రూప మౌచు ॥ 3902

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) అఖిల సృష్టి వ్యాపించుచు నల్లకల్లోలముల
నతిగ రేపి విధ్వస్తము నసాధారణముగఁ జేయు
"నఖి" శక్తుల నన్నింటిని నస్తవ్యస్తమ్ముగాఁగ
విధ్వస్తము కావించుచు విశ్వశాంతి సౌభాగ్యా
లలరారఁగ బహుగతులను నఖిల సృష్టికర్త బ్రహ్మ
అవిచలితపు దైవ కేల లవికలమై వర్తిల్లఁగ
సృష్టి స్థితి లయ గతులవి చెలఁగుచుండు నిత్యమ్మును
సంక్షేమము సంవర్ధన సంక్షోభమ్ములు వరలఁగ
వ్యాకోచము సంకోచము వ్యష్టి సమిష్టి తత్త్వాలను
చర్విత చర్వణ మట్లుగ సర్వమ్మును బ్రహ్మ మౌను ॥ 3903

†క॥ విశ్వమ్మది వర్తిల్లును
నశ్వర గతి జనిత మౌచు నపురూపతమై
శాశ్వతముగ భాసిల్లు చ
శాశ్వత రతి సంతరించుఁ జదలై క్రమతన్ ॥ 3904

(8)†అష్టపదకందము ॥
ఒకటై విశ్వము వరలుచు
ద్వికమై త్రికమై చతుష్క దీపిత మౌచున్
బ్రకటిత నానా శక్తుల
సకలుషమై కలుష పలితమై రూప విభా
వ కలితమై నిత్య గతి న
వికల్ప మగుచు జగతి ఘన విస్తృత విధ్వ
స్త కరణ కర్త సకల క
ర్మ కారక మగుఁ బరమాత్మ మర్మ మ్మెల్లన్ ॥ 3905

†క॥ అతిలోకముగా నొకటై
ప్రతిరహితమయిన మహత్తర సుశక్తిన్ భా
సితమౌ ద్వి త్రి చతుర్భే
ద తతులఁ బ్రకృతి విలసిల్లు దైవీయమ్మై ॥ 3906

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(9)†అష్టపదకందము॥
సమమై విశ్వము వరలు స
సమ గతులఁ దనరును మహిత జయ కలితమ్మై
యమ నియమ్ముల నలరుచు
శమ దమ శక్తుల నశాంతి సర్వ విశ్వంఖా
శి మితి నియమాశి రాహి
త్యముగా మాతృ మూర్తులై సంతతిగా
నమితమ్మౌ భేదమ్ముల
నమలమ్మౌ చిద్గతులను నఖిలము వరలున్ ॥ 3907

†క॥ విశ్వమె సత్తై వరలును
విశ్వమె చిత్తగుచుఁ దనరు వివిధ గతులమై
విశ్వమె ఆనంద మ్మగు
విశ్వమె శూన్యమ్ము నౌను వివిధ వ్యాకృతులౌ ॥ 3908

## సూక్తమ్—118

ఋషిః—ఉరుక్షయ ఆమహీయవః
దేవతా—రక్షోహాగ్నిః
ఛందః—గాయత్రీ

(1) అగ్నే హంసి న్యంత్రిణం దీద్యన్మర్త్యేష్వా।
స్వే క్షయే శుచివ్రత ॥ 1354

(2) ఉత్తిష్ఠసి స్వాహుతో ఘృతాని ప్రతి మోదసే।
యత్ త్వా స్రుచః సమస్థిరన్ ॥ 1355

(3) స ఆహుతో[1] వి రోచతే ఽగ్నిరీళేన్యో గిరా।
స్రుచా ప్రతీకమజ్యతే ॥ 1356

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. సఽఆహుతో. (వ్రా.ప్ర.)

(4) ఘృతేనాగ్నిః సమజ్యతే మధుప్రతీక[1] ఆహుతః ।
రోచమానో విభావసుః ॥ 1357

(5) జరమాణః సమిధ్యసే దేవేభ్యో హవ్యవాహన ।
తం త్వా హవన్త మర్త్యాః ॥ 1358

(6) తం [2]మర్తా అమర్త్యం ఘృతేనాగ్నిం సపర్యత ।
అదాభ్యం గృహపతిమ్ ॥ 1359

(7) అదాభ్యేన శోచిషా ఽగ్నే రక్షస్త్వం దహ ।
గోపా[3] ఋతస్య దీదిహి ॥ 1360

(8) స త్వమగ్నే ప్రతీకేన ప్రత్యోష యాతుధాన్యః ।
ఉరుక్షయేషు దీద్యత్ ॥ 1361

(9) తం త్వా గీర్భిరురుక్షయా హవ్యవాహం సమీధిరే ।
యజిష్ఠం మానుషే జనే ॥ 1362

---

1. ప్రతీకఽఆహుతః, 2. మర్తాఽఅమర్త్యం, 3. గోపాఽఋతస్య. (వా.ప్ర.)

## సూక్తము 118

ఋషి—ఉరుక్షయుఁడు†

దేవత—రక్షోహాగ్ని†

(1)•గీ॥ మనుజులందు దీప్తిఁ గనుచుండి యాత్మీయ
తలమునందునుండి వెలుఁగుచుండి
పూతకర్మ! యగ్ని! పూర్ణ శత్రువులను
జంపుమయ్య! నీవు శక్తి మీర ॥ 3909

(2)•గీ॥ సురుచిరములైన పాత్రముల్ కరము నిన్నుఁ
బొందుచుండెడు సమయాన నంద మొప్పు
నగ్ని! యాహూయమానుఁడా! యరణులందుఁ
బొంది హవ్యంబులం బుష్టి నొందు మీవు! ॥ 3910

(3)•గీ॥ అభిముఖంబుగ నాహుతి నందువాఁడు
వాక్కుచేతను స్తుత్యుఁడై వరలువాఁడు
నైన యా యగ్ని దీపించు నతిశయముగ
దేవతలకంటె ముందుగాఁ దేజరిల్లి ॥ 3911

(4)•గీ॥ హవ్యములచేత నాహుతుండైన వాఁడు
ఘృత సుపృష్ఠాంగుఁడై చాల కేరువాఁడు
దీప్యమానాగ్ని సహజమౌ దీప్తిచేత
సర్వమును గప్పుచుండుఁ దా సరస రీతి ॥ 3912

(5)•గీ॥ స్తోత్ర సంస్తూయమానుఁడా! సుష్ఠు హవ్య
వాహనుఁడ! నీవు దేవతా వర్గమునకు
హవ్యములచేత వెలుఁగుదు వట్టి నిన్ను
జనులు పిలుచుచునున్నారు చతుర శక్తి ॥ 3913

†వ్రాతప్రతి 14వ సంపుటము 121వ పుటలో నీ సూక్తమునకు ఋషి "ఉరుక్షయుఁడు"గాను, దేవత "రక్షోహాగ్ని"గాను వ్రాసి, 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ఉరుక్ష్యుఁడు" ఋషి గాను, "అగ్ని రక్షోహనుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(6)*గీ॥ గేహపతి యౌచు నే వేళఁ గేరుచుండి
యన్య హింస్యుఁడు కాకుండ నమరుచుండు
నగ్ని హోతృనికిన్ జనులార! మీరు
పూజఁ జేయుచునుండుఁడీ! పూత మతిని ॥ 3914

(7)*గీ॥ నీ వహింస్యమైన నీదు తేజస్సున
రాక్షసులను జంపి రహి వెలుంగు
మనలదేవ! యజ్ఞమునకు గోపాయిత
వగుచు వెలుఁగుమయ్య! యతిశయముగ ॥ 3915

(8)*గీ॥ ఉపతర నివాసములయందునుండి నీవు
యాతుధానుల సతులను నతిశయముగ
నీవు తేజస్సుచేత వినిర్దహించు
మోయి! యనలుఁడ! చలమును బాయకుండ ॥ 3916

(9)*గీ॥ బహు నివాసులైన గృహయజమానులు
హవ్యవాహ జనులయందు యష్ట్ర
తముఁడవైన నిన్ను సముచిత స్తుతులచే
వెలుఁగఁజేసినారు వివిధ గతుల ॥ 3917

## సూక్తము—118

ఋషి—ఉరుక్షయుఁడు

దేవత—రక్షోహాగ్ని

### అర్థాంతరము—1

†(1) అతిశున్యమై వరలు నగ్ని శక్తులు సదా
అతిలోకమై తనరు నాదిత్య దీధితుల
సృష్టి చేయుఁగ నిత్య స్వేష్టిగా నలరారు
స్థితి శక్తిమైఁ బ్రకృతి నతులితముగా నిలుపు
లయశక్తిగా నఖిల జయ కేతనమ్మగును
నా పరబ్రహ్మమై హంస శక్తిగ వరలి
నఖిలమ్మును బరఁగు నద్భుత గతులతో
నమరమై అమలమై అమృతధామమ్మగుచు ॥ 3918

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(2)†అష్టపదకందము ॥

అనిల ధృతములై వెలిఁగెడి
అనలమ్ములు గగన గిరుల సత్యుజ్జ్వలమై
తనరఁగ నుపరితలమ్మునఁ
గనపిమ్మటి కిల తెగయు నుత్తిష్ఠములై
ఘన మోదాఽన్విత మౌచును
జనిత పదార్థాళి వస్తు చయ సంధృతిమై
వినువీథిని భూత తతుల
ననవరతము గూఢతమెయి నలరారు సదా ॥ 3919

(3)†అష్టపదకందము ॥

హవ్యోత్పన్న మ్మౌచును
భవ్యమ్మై విశ్వ రూప భాస్వంతమ్మై
దివ్యమ్మై దివి భువి తతి
గవ్యమ్మై మృదనిల జల గగనాళులలో
నవ్యమ్మై బహిరంతర
గవ్య మ్మౌచును సకలము కాంతిన్ గ్రాంతిన్
అవ్యయ శబ్దజ శక్తుల
రవ్యాదిత్యాది సర్వ గ్రహ పూర్ణమ్మౌ ॥ 3920

(4)†అష్టపదకందము ॥

కుధరమ్ముల నంతర్గతి
సుధిరమ్ముల మృత్తతులను సృష్టిన్ సర్వ
ప్రథిత మ్మౌచును బ్రకృతి వి
విధము లగు పదార్థ చయ వివ్మల మగుచున్ శ
బ్ద ధన సుసంభవమై ని
త్య ధవళజ చిత్ర వర్ణ తాదాత్మ్యమునన్
మథన పరమ్మై జ్వలితపుఁ
బథమ్ముల విజృంభితమయి వరలు ననలముల్ ॥ 3921

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(5)†అష్టపదకందము ॥

అక్షర పద శక్తులతో
నక్షయమౌ దీప్త గతుల నఖిల జగతులన్
ఋక్ష గ్రహ రాజులతో
సుక్షేమ ప్రాణదమయి శూన్య మహిత సన్
నిక్షేపమ్ముగ గుప్తగ
దీక్షిత వర్తిల్లు నగ్ని దీధితు లొప్పన్
బక్ష మ్మోచు మహోజ్జ్వలి
త క్షయ గతుల వరలు సతతము బహురతులన్ ॥ 3922

(6)†అష్టపదకందము ॥

ప్రకృతి చెందును విశ్వమ్మన
నతులిత గతి మృత్యు రహిత హార్దిక శక్తిన్
సతతము మనుగడ నిలుచును
ఋత గతులఁ జరాచర ప్రకృతి వినుతమెయిన్
ప్రతిలేని దివ్య దీధితి
జతనమ్మె అనల శక్తి జాగృతి తనరన్
ఇతరేతర జన్యమ్మె
కృతి నిత్య క్రతువయి విధి సృష్టిగ వరలున్ ॥ 3923

(7)†అష్టపదకందము ॥

గోపగమౌ శక్తులతోఁ
బ్రాపణ గతి లోక గోళ రాజుల నెల్లన్
దీపితమై బహిరంతర
రూప ప్రజ్వలన మహాగ్ని వృధు లగు గతులన్
ఏ పారఁగ సర్వమ్మును
గాపాడును వర్ధిలంగఁ గ్రాలన్ గాలన్
రూపరఁగా నఖిలమ్మును
దాప రహిత గతిని బ్రాణధర్మము నణఁచున్ ॥ 3924

†రచయిత :—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(8)†అష్టపదకందము ॥
విశ్వమ్ము నె కాపాడుచు
నశ్వర గతి నఖిల సృష్టి నపురూపముగన్
శశ్వత్పరమై విస్తృతి
నశ్వి విరాజ మహిత విధి యజ్ఞముగాఁగన్
శాశ్వత మగుచును బ్రకృతి న
శాశ్వత సంవర్ధకమయి సంహారకమై
నిశ్వసితమ్మై దేవు స
నశ్వరమౌ మాయ లీల నగ్ని వెలుంగున్ ॥ 3925

(9)†అష్టపదకందము॥
దివ్యమ్మౌ జ్వల శక్తుల
హవ్యమ్ములను వహియించి యజ్ఞ ప్రకృతిగాన్
గవ్యమ్ముల సృష్టి క్రియల
భవ్యమయ సుసత్య నిత్య భాగ్యముగాఁగన్
నవ్యజ సృష్టి స్థితి లయ
భావ్యమ్మయి అక్షరరతి సమర గతులతో
నవ్యయమయి అఖిలాంతర
ఊ వ్యయగతి నొప్పు నగ్ని సకల విభూతిన్ ॥ 3926

## సూక్తము—118

ఋషి—ఉరుక్షయుఁడు

దేవత—రక్షోహాగ్ని

## అర్థాంతరము—2

†(1) భూత భావి వర్తమాన పూర్ణకాల గతులలోన
విశ్వరూపమై వరలెడి వివిధములౌ పదార్థాల
ప్రాణ ప్రదమౌ శక్తిగ జ్ఞాన ప్రదమౌ శక్తిగ
హంసరూప మౌచు నగ్ని అతివేలపు శక్తులతో
నతిలోకపు శక్తులతో నపురూపముగా నిల్చును
బద్ధ మౌచు శుద్ధ మౌచు వరలు స్థితి క్షయలుగా ॥ 3927

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†— అగ్ని బుగిలి ఆత్మాహుతి నద్భుతగతి నొనరించును
సృష్టిలోని ధాతువులను జెలఁగ శుద్ధ మొనరించును
మానవాళి శరీరాల దానవాళి శరీరాల
జరారహిత దేవతాళి శరీరాల జీవకోటి శరీరాల
నుండు వివిధ రోగాలను జెండాడుచునుండు నగ్ని
నత్యంతము దీప్తి మీఱ నంతరాంతరముల గతుల
బరిశుద్ధ మ్మగుచు నిత్య పవిత్రతలు వరలంగా
స్వయంప్రకాశమానమౌను వియత్తలాన సృష్టిలోన ॥ 3928

†(2) ఉజ్జ్వల గతు లొప్పారఁగ నున్నతోన్నతంపుఁ గీల
లానందపు రూపాలుగ నతిసుందర దీపాలుగ
మృదాకాశ సలిలాఽనిల మృత్యు పదార్థాలఁ గూడ
నతిలోకముగా వెల్గును నన్నింటిని ధరియించును
వివిధ పాత్రలందు నగ్ని విశేషముగ నిల్చునట్లు
అఖిల భూత పదార్థాల నంతర్గతి నలరుచుండు
నవినాభావానుబంధ జవ జ్వలన శక్తు లలరఁ
బ్రకృతి పదార్థా లన్నిట వరల సంగమమ్ము నొందు
మంచి చెడుల నన్నింటను నంచితముగ సమభావము
తనరంగా విశ్వమ్మున నొనరు సర్వ భక్షక మై ॥ 3929

†(3) పలువిధమౌ పదార్థాల బహురూపుల నలరారుచు
రకరకాల గుణాలతో రాజిల్లుచు జ్వలితగతుల
యజ్ఞతతుల హవిషాళుల నతికాంతులఁ బరిగ్రహించి
వివిధాక్షర శబ్దరూపు లవితథమౌ శక్తిజాల
సర్వస్వముతో సృష్టిని సకలాంతర్యామిగాఁగ
బహిరంతర స్థితి గతులను వరలుచుండి నిత్యమ్మును
జీవ మృత్యు రూప జ్వలిత చేతన గతి నజ్వలితప్ర
టునుకులలో నాకాశము నొంది నిలుచు సర్వదా
త్రివిధ భూత సంచయాల దీప్త గతుల వెల్గొందుచు
నారిపోయి అన్నింటను నాకసమున లీన మౌను ॥ 3930

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అష్టవిధమై వరలు నపురూప వసు తతుల
నఖిల విశ్వము తనరు నద్భుతగతిమెయిని
ననలాలఁ బ్రతికృతుల నతిదీప్తమై వెలుఁగు
అగ్నిధృతమై జగతి కాధారమై నిలుచు
మధుపదార్థపు శక్తి మహిమాన్విత మ్మౌచు
ఉజ్జ్వలత్వము మిఱ ఉపశమన మ్మొందు
నారిపోకుండగా నంతర్గతిగతి తనర
గూఢశక్తిమై మహా గూఢతరమై వెలుఁగు
శిష్ట శుచి రూపాల సిక్తమై తనరారు
అభివ్యక్తమై వరలు నపురూప గతులమెయి ॥ 3931

†(5) మానవాళి దేవతాళికి మహిత దీప్తు లొప్పారఁగ
జ్వలియించెడి నగ్నిరూప వలితమ్మై భూతతతుల
యజ్ఞక్రియాజాలాలను విజ్ఞత హవిష్యాలు లౌనఁగి
జరారూప మృత్యు శక్తి నిరాకరించి జ్వలియింపఁగ
అక్షరమయమై వరలుచు నాశాశాఽన్వీత మౌచు
శబ్ద శక్తు లొప్పారఁగ సర్వ పదార్థాళి వరలి
సృష్టి యజ్ఞ క్రియగాఁగను వ్యష్టి సమిష్టి రూపాలను
మృణ్మయభూతప్రాణులు మించు సర్వ విశ్వమందు
ఆవృత్తిగ సకల జన్మ జీవ మరణ గతులఁ దనర
సమిద్ధ మౌచు విశ్వమ్మున సర్వస్వము వర్ధిల్లును ॥ 3932

(6)†అష్టపదకందము ॥
మృత్తుల మెలఁగుచు నిత్యా మ
మృత్తు లనిల సలిల గగన యుత రూపములన్
సత్తై వరలుచు వెలుఁగుచు
మిత్తిగ ననలమ్ము లారి మిన్నంటుచు నా
వృత్తి గతుల విశ్వమ్మునఁ
జిత్తుగ జననము మరణము చెలఁగంగ సదా
మిత్తికి జగతి విశాల వ్రి
వృత్తుల జన్మ జనక వరవిజ్ఞత వరలున్ ॥ 3933

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7)†అష్టపదకందము ॥

దహియించుచు విశ్వమ్మునె
అహరహమున్ జ్వలిత గతుల నపురూపతమై
విహరించుచు నఖిలమ్మున
మహనీయమ్మౌ పదార్థ మర్మ గతులమై
వహనీయ సర్వ భూతగ
ముహుర్ముహుర్ జనన మరణ మూర్తులు తనరన్
సుహితమ్మౌ సృష్టి సకల
మహితముగా నిలిచి వెలుఁగు మాన్య మ్మౌచున్ ॥ 3934

†(8) జ్వలిత మౌచు నగ్నిశక్తి జగతి నఖిల పదార్థాల
యాతుధానరూపమైన అనేకరోగరూపాలను
రూపుమాపి శుచి శక్తుల రూక్ష దీప్తు లొప్పారఁగ
నూపిరి బలముల నిచ్చుచు నుజ్జ్వలమౌ బ్రతుకు నిచ్చి
క్షయగతులకు లయగతులకు విలయ ప్రళయ గతుల కెల్ల
మూల మౌచు దీప్యమాన కీల లెనయ సృష్టిలోన
నసాధారణంపుఁ గ్రియల నతివేలపు శక్తులతో
ననసురూప ఘనశక్తుఁలు నమితములై వరలంగా
నద్భుత గతి వర్తిల్లును ననులోమ విలోమ గతుల
నతిలోకమ్మై తనరును నమర శక్తి తతులు మీఱ ॥ 3935

†(9) విస్తృతమై విశాలమౌ విశ్వలోక జాలాలను
విపులమైన శుచిత్వాన వెలుఁగుచుండు నగ్ని మూర్తి
మనురూపపు దివ్యశక్తి మాన్యమ్మై వరలంగా
జన్యశక్తి రూప మౌచు జ్వలియించును బ్రకృతిలోన
తానై జ్వలియించుచుండుఁ బ్రాణదీప్తు లొప్పారఁగఁ
దానై జ్వలియింపఁజేయు నూను సృష్టి పదార్థాల
హవ్యవాహక మ్మౌచును నఖిలమ్మును వర్తిల్లుచు
శబ్దశక్తు లలరారఁగ సదమల దీప్తుల వరలును
నిత్య సృష్టి స్థితి లయాల నిరతోరు క్షయశక్తుల
ననల మొప్పు నఖిలమ్మున నసాధారణంపు గతుల ॥ 3936

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—119

ఋషిః—ఐన్ద్రో లవః
దేవతా—ఇన్ద్రః(ఆత్మా)ఐన్ద్రో లవో వా
ఛందః—గాయత్రీ

(1) ఇతి వా[1] ఇతి మే మనో గామశ్వం సనుయామితి ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1363

(2) ప్ర వాతా [2]ఇవ దోధత ఉన్మా పీతా అయంసత ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1364

(3) ఉన్మా పీతా[3] అయంసత రథమశ్వా[4] ఇవాశవః ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1365

(4) ఉప మా మతిరస్థిత వాశ్రా పుత్రమివ ప్రియమ్ ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1366

(5) అహం తష్టేవ వన్ధురం పర్యచామి హృదా మతిమ్ ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1367

---

1. ఇతి వాఽ ఇతి, 2. ప్ర వాతాఽఇవ దోధతఽ ఉన్మా పీతాఽ అయం, 3. పీతాఽ అయంసత,
4. రథమశ్వాఽఇవాశవః. (ప్రా.ప్ర.)

(6) నహి మే[1] అక్షిపచ్చనాఽచ్ఛాన్త్సుః పంచ కృష్టయః ।

కువిత్ సోమస్యాపామితి ॥ 1368

(7) నహి మే రోదసీ[2] ఉభే అన్యం పక్షం చన ప్రతి

కువిత్ సోమస్యాపామితి ॥ 1369

(8) అభి ద్యాం మహినా భువమభీ౩మాం పృథివీం మహీమ్ ।

కువిత్ సోమస్యాపామితి ॥ 1370

(9) హన్తాహం పృథివీమిమాం ని దధానీహ వేహ వా ।

కువిత్ సోమస్యాపామితి ॥ 1371

(10) ఓషమిత్ పృథివీమహం జఙ్ఘనానీహ వేహ వా ।

కువిత్ సోమస్యాపామితి ॥ 1372

(11) దివి మే[3] అన్యః పక్షో౩ ఽధో అన్యమచీకృషమ్ ।

కువిత్ సోమస్యాపామితి ॥ 1373

---

1. నహి మేఽఅక్షి, 2. రోదసీఽఉభేఽఅన్యం, 3. మేఽఅన్యః. (ప్రా.ప్ర.)

(12) అహమస్మి మహామహోఽభినభ్యముదీషితః ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1374

(13) గృహో యామ్యరంకృతో దేవేభ్యో హవ్యవాహనః ।
కువిత్ సోమస్యాపామితి ॥ 1375

ఇతి
అష్టమోఽష్టకే షష్ఠోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—119

ఋషి—ఐంద్రుఁడైన లవుఁడు†
దేవత—ఇంద్రుఁడు (ఆత్మ) లేక ఐంద్రలవుఁడు†
(ఇంద్రుఁడు లవరూపమును బొంది సోమపానముఁ జేయుచున్నపుడు ఋషి
దృష్టుఁడై తన యాత్మ నుద్దేశించి పలుకుచున్నాఁడు)

(1)*గీ॥ గోవు నశ్వంబు నరులకుఁ గూర్చుచుంటి
నిట్టి రీతిని నాదైన యెల్ల మనసు
వెలుఁగుచుండెను నే వేళ వేడ్క నేను
లీల సోమంబు మిక్కిలి గ్రోలి యుంట ॥• 3937

(2)*గీ॥ వాయువులు వృక్షముల బహు బలముతోడఁ
గదుఁ గదల్చెడు చందానఁ గాంత సోమ
ములు కదల్చుచునుండెను ముదితు నన్ను
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3938

†వ్రాతప్రతి 14వ సంపుటము 123వ పుటలో నీ సూక్తమునకు ఋషి "ఇంద్రుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను, వ్రాసి, 16సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "లవుఁడు" ఋషిగాను "ఇంద్రుఁడు లవునిగా" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

•(4)గీ॥ సోమపానంబుఁ జేయుచు శోభఁ గాంచు
చుంటినే స్తోతలకు నెల్ల నుచిత గోవు
నశ్వమును నిచ్చుచున్నాఁడ నాదరమున
నీ విధంబున నా మన స్సెల్ల యుండె ॥ (తొలి పాఠము)
మొదట నీ పద్యమును 1వ ఋగనువాదముగా శ్రీనేమానివారు వ్రాసి వారే దీనిని పూర్తిగాఁ గొట్టివేసిరి.

(3)*గీ॥ క్షిప్ర గమనాశ్వములు కడు శీఘ్ర గతిని
యానము కదల్చు విధమున నమల సోమ
ములు కదల్చుచునుండెను ముదితు నన్ను
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3939

(4)*గీ॥ శబ్దమును జేయు గోవు వత్సమును మాట్కి
స్తోతృ విరచిత మైనట్టి స్తుతి విశేష
మెల్ల [1]ననుఁ బొందుచుండెను నుల్ల మలర
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3940

(5)*గీ॥ తక్ష యే విధిఁ బూని రథంబు సాధు
వుగ నొనర్చునోః యా విధిఁ దగిన వినుతి
మనసు దీరంగఁ జేయంగఁ జనుచు నుంటి
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3941

(6)*గీ॥ దేవ మనుజాదు లెల్లరు తివిరి నాదు
దృష్టి సంచారమును బహు దీక్షతోడ
నైన నరికట్టఁజాలంగ నరుగలేరు
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3942

(7)*గీ॥ దివియు భూమియు రెండును దీప్తిఁ గూడు
నట్టి నాదు సుపక్షంబు ననుసరింప
సదృశములు కాకయుండెనె సహజమైన
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3943

(8)*గీ॥ సహజ మైనట్టి మహిమ ప్రశస్తితోడ
దివమును దిరస్కరించెద దివ్య మహిమ
వలన భూమికి నే నభిభవముఁ గూర్తు
లీల సోమంబు మిక్కిలి గ్రోలియుంట ॥ 3944

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. విశేషముగ ననుం బొందుచుండెను ముదితు నేను. (తా.పా.)

(9)*గీ॥ అంతరిక్షంబునందునో! యఖిల దివము
నందునో! సహజ విస్తార మైన పృథ్విఁ
దాల్చుచున్నాఁడ నని నేను దలఁచుచుంటి
లీల సోమంబు మిక్కలి గ్రోలియుంట ॥ 3945

(10)*గీ॥ అంతరిక్షంబునందునో: యఖిల దివము
నందునో! పృథ్వి కాదిత్యు నంద మొప్ప
వెడలఁజేయుచునున్నాఁడ వేట్క నేను
లీల సోమంబు మిక్కలి గ్రోలియుంట ॥ 3946

(11)*గీ॥ నాదు పక్షము దివియందు మోద మలర
నునిచినాఁడ మరొక్కటి ఘనతర మగు
పృథ్విపైఁ బెట్టినాఁడను బ్రీతి మెరయ
లీల సోమంబు మిక్కలి గ్రోలియుంట ॥ 3947

(12)*గీ॥ అంతరిక్షంబుఁగూరిచి యధిక ప్రీతి
నుద్గతుఁడ నౌచు సూర్యుని యుచితరూప
మును ధరించుచు నే నౌచు ఘనుల ఘనుఁడ
లీల సోమంబు మిక్కలి గ్రోలియుంట ॥ 3948

(13)*గీ॥ హవ్యము గ్రహించువాఁడనై యఖిల సుజన
గణయుతుఁడ నౌచు దేవతా గణముకొఱకు
హవ్యముల నందఁజేయుచు నమరుచుంటి
లీల సోమంబు మిక్కలి గ్రోలియుంట ॥ 3949

ఇయ్యది
శ్రీభరద్వాజగోత్ర శ్రీవేఙ్కటేశ్వరపౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి
ముక్తాయమాన శ్రీభగవద్భక్తారాధక
నేమాని వేఙ్కటనరసింహశాస్త్రి
విరచితకృతులలో శ్రీమదాంధ్ర
ఋగ్వేదసంహితయందు
నష్టమాష్టకమున
షష్ఠాధ్యాయము
సంపూర్ణము

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—119

ఋషి—ఇంద్రుఁడైన లవుఁడు

దేవత—ఇంద్రుఁడు(ఆత్మ) లేక ఇంద్రలవుఁడు

## అర్థాంతరము—1

(1)†క॥ కాలాఽన్వితమై జగతుల
వేల లెనయు నియమ గతుల విలసిల్లుచుఁ జం
ద్రాళుల నమృత స్రావము
క్రాలఁగ విశ్వాన సోమ ప్రకృతులు వరలున్ ॥ 3950

†క॥ వినువీథి శక్తి మించుచు
మనశ్చలన వేగ శక్తి మహిమాఽన్వితమై
అనలాఽనిల జల మృత్తుల
ననవరతము మీరు సృష్టి నతిలోక గతిన్ ॥ 3951

†(2) సోమ సంభరితమై చోద్యమ్ముగాఁగ
రవి చంద్ర శక్తులన్ రాజిల్లి రూపొందు
అమృత పదార్థంబు లఖిల ఋత రూపమై
అతి ప్రకృష్టంబైన అతిలోక శక్తులన్
అనిల మరీచిగా నవర ప్రాణమ్ముగా
అలవోకగా విశ్వ మావరించుచును
అద్భుత రతిశక్తి నమల యౌవన గతులఁ
బునరుజ్జీవనపుఁ బూత శక్తుల నొసఁగు ॥ 3952

(3)†క॥ కాంతులతోఁ గదలాడెడి
అంతును బంతును నెనయని అల కాల గతిన్
గ్రాంతులు విరియఁగ నమితాఽఽ
శాంతముగా నమృత సోమ సారము తనరున్ ॥ 3953

†క॥ గగనమ్మున నతులిత గతి
నగణితమై తగు నయోమయ పదార్థజ పీ
తగ వర్ణ మహిత మద సహి
త గుణ రతిని నమృత సోమ తత్త్వము వరలున్ ॥ 3954

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఢ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4)†క॥ చంద్రాఽమృత శక్త్యఖిలము
సాంద్రముగా విశ్వ సృష్టి సంచలనరతిన్
ఇంద్రియ తరుణమయత్వ మ
తంద్రముగా వరలఁజేయుఁ దరణి శశి గతిన్ ॥ 3955

†క॥ చలువల వెన్నెలల విరియు
కలువల రాయనికి నమిత గతి సన్నిహిత
మ్మలరఁగ నిలిచిన మతి స్థితి
విలసితమౌ విశ్వరూప విస్తృత గతిమై ॥ 3956

(5)†క॥ అమృత రతుల హృచ్చక్షుల
నమలమ్మౌ పూర్ణ మహిత మతి ధృతి శక్తిన్
సుమతులు పెంపొందఁగ సో
మమయమ్మౌ రసము సత్యమయమై కురియున్ ॥ 3957

†అష్టపదకందము ॥
హృదయము విశాల గతులన్
అది ఇది హద్దనుచు లేక అంతట నిలువన్
ముదములు వలితమ్మై వి
శ్వ దివ్య తత్త్వమ్మై సోమ సంపాతమునన్
జదలున భువులను దివులను
బది దిశలన్ వ్యాప్తమౌచు వరలెడి నానా
విధ గోళ లోక తతు లవి
చెదరక క్రమగతులఁ దిరుగుఁ జెల్వొంద మతుల్ ॥ 3958

†(6) గగనమ్ము లనిలముల్ కాలు ననల సలిలాల్
పృథ్వితతులు సాక్షి పూర్ణ రూపమ్ముగా
విశ్వ చక్షువుగాఁగ వివిధ ప్రాణులు తనరు
నచ్ఛమై స్వచ్ఛమై అమృత సోమపు శక్తి
ద్రవరూపమై సృష్టిఁ దనరార నిత్యమ్ము
స్రవియించుచుండు విస్తారమౌ విశ్వాన
నెట్టి నిరోధమ్ము లే రీతినిన్ లేక
అమృతగతు లొప్పంగ నమరరతు లొప్పంగ ॥ 3959

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) సర్వవిధ గోళాలు జగచ్చక్షువు లౌచు
నిర్నిరోధమ్ముగా నిఖిలానఁ దిరుగాడ
రోదసిలో వరలు లోకాలు దివి భువులు
నన్నింటి నమృతమ్ము లపురూప గతులమై
సోమ శక్తులు మీఱ సురుచిర తత్త్వాల
నవినాభావాల ననుబంధ బంధాల
నతిలోక శక్తుల నతివేల గతులమై
నఖిల సృష్టిని బరివ్యాప్తి నొందుచునుండు ॥ 3960

†(8) సోమ శక్తులతోటి శుభ దీప్తు లొప్ప
నన్నృతరూపము కాని అమృతశక్తులు మీఱ
భూ లోకమే మహిత పూర్ణ దివిగా నిలువ
నాకాశ మార్గాల "నభి" దుష్ట శక్తులను
విధ్వస్త మొనరించి విశ్వ సంక్షేమాల
నఖిలభువనాఽఽవళుల నపురూపముగ నిల్పి
పునర్జన్మలు నిత్య పూర్ణ యౌవన గతులు
అనునిత్యమును సృష్టి నలరించుచుండులే: ॥ 3961

†(9) సోమశక్తుల మహా ధీమహిత దీప్తులన్
అమరమై అమలమై అఖిలమై స్రవియింప
నమృతశక్తులతోడ నంతరిక్షమునందు
సర్వవిధ దివి భువుల జగల్లోకాఽఽవళుల
నాకర్షణల రతుల నాపి నిలుపుచుఁ దిరుగ
నాత్మ ప్రదక్షిణాఽఽవళు లలరఁ బ్రదక్షిణల
దుష్ట శక్తుల నెల్లఁ దున్మాడి విశ్వాన
శిష్ట శక్తుల నెల్ల సంక్షేమముల నిలుపు ॥ 3962

†(10) సోమశక్తులు మహా ధీమహిత దీప్తులన్
అమరమై అమలమై అఖిలమై స్రవియింప
నాదిత్య శక్తులన్ అండాండ పిండాండ
బ్రహ్మాండ ఖాండాలు వరలంగ సర్వదా
అఖిల లోకావళులు నలరారు విహితమై
పృథ్వీ తత్త్వా లెల్ల వెలుఁగొంద దీప్తులన్ ॥ 3963

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(11) సోమశక్తులు మహా ధీమహిత దీప్తులన్
అమరమై అమలమై అఖిలమై స్రవియింప
దివిలోకమందును దేజరిలు లోకాల
నిత్యమై సోమమ్ము నిరతగతి స్రవియించు
నన్యలోకాలలో నపురూప గతి మీఱఁ
బక్షపరమై నియత శిక్షణ నడచు గతిఁ
గొన్ని దినములు క్రమ గూఢశక్తులు తనర
స్రవియించుఁ బ్రకృతిగా సౌరశక్తులు లేక
క్రమక్రమముగఁ దగ్గి స్రవియించకుండఁగా
నాగు నమృతమ్ము ఆ రోజు కా రోజు
తిరిగి క్రమతః పెరిగి దివ్యముగ స్రవియించుఁ
జక్రనేమిక్రమ సోమ సంక్రమణల
స్రవియించుఁ జంద్రుండు నవితథగతి జగతి
బహురూపములు దాల్చి పలురీతు లొప్పంగ ॥ 3964

†(12) సోమశక్తులు మహాధీమహిత దీప్తులన్
అమరమై అమలమై అఖిలమై స్రవియింప
నంతరిక్షమ్ములో నలరారు మహితగతి
మహామహితమ్ముగా నహరహము వెలుఁగొందు
నర్కాది గ్రహరాజు లఖిల లోకాఽఽవళులు
నమృత సోమము పీల్చి అత్యద్భుతముగ వెల్గు
అంతు పంతూ లేక కాంతి కాంతులు మీఱ
అమృతమ్ము సృష్టించు అమలమౌ దానినే
అమిత ప్రియముగఁ బీల్చు ననునిత్యము ను దృప్తి
నిత్య నవ శక్తు లవి సత్యమై తనరార ॥ 3965

†(13) సోమశక్తులు మహా ధీమహిత దీప్తులన్
అమరమై అమలమై అఖిలమై స్రవియింప
యామ సమయాలలో సోమశక్తులఁ జంద్రు
డసమానగతి నమృత మతివేలగతి నలరు
హవ్యవాహనశక్తి యపురూపగతి వరల
అగ్ని సోమాఽమృతము నలరించు విశ్వాన
దివ్య దేవావళుల తేజరిలు పరిగ్రహ
శక్తు లలరారఁగఁ బయనించు నువరాలఁ
వ్యక్త శక్తులు వరల అధోలోకాలలో
అలరించు నమృతము సలలిత శక్తులన్ ॥ 3966

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—119

ఋషి—లవుఁడు

దేవత—ఇంద్రుఁడు(ఆత్మ) లేక ఇంద్రుఁడైన లవుఁడు

### అర్థాంతరము—2

†(1) దుర్విదగ్ధములైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
అమృతమె విశ్వాన నఖిల మనసులు గాఁగ
విశ్వ గతమౌ మనసు లశ్వ శక్తులు మీఱ
నమృతముగ వరలుచు నఖిలమ్ము నలరించు
నతిలోక శక్తుల నతినవ్య దీప్తులన్
అతివేలమై తనరు నఖిల లోకాఽఽవళుల
అద్భుత గతి మీఱ నపురూప శక్తులన్ ॥ 3967

†(2) దుర్విదగ్ధములైన దుష్ట శక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
అనిలగతి సృష్టిలో నఖిలాన వ్యాపించు
నమృత శక్తులు మీఱ నమరత్వ మలరంగ
నమల దీప్తులఁ గురిసి అతివేల శక్తులన్
ఉన్నతోన్నతమైన ఉజ్జ్వలమ్మౌ కాంతి
పుంజాలఁ బంద్రిందు రంజితముగాఁ జేసి
అయోమయమై నిత్య యజ్ఞాగ్నిగా జగతిఁ
గంపితమ్మె చలన గతు లొప్పఁగా వరల
సకల సృష్టియుఁ బాన మకలుష గతిఁ జేయు ॥ 3968

†(3) దుర్విదగ్ధములైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
ఉన్నతోన్నతమైన ఉత్తమ మనశ్శక్తి
లఖిలాశలను నిత్య మపురూపగతి వ్యాప్తి
నొంది సర్వస్వమును నుత్సాహమయముగా
నుత్తమమ్మౌ నయోమయ రూప శక్తిగా
దృఢతరమై గాఢ బాధ దీప్తులు తనరఁగా
నుజ్జ్వల కాంతులన్ ఒనరు కాల రథ గతుల
నఖిల విశ్వమునందు నమృతమౌ మధుర రుచు
లొప్పార స్రవియించు నుత్తమగతు లెనయ ॥ 3969

†రచయిత—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) దుర్విదగ్ధములైన దుష్ట శక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులే,
ఉపస్థితి గతి వరలు నుడురాజు చంద్రరతి
విశ్వగోళాఽఽవళులు నశ్విలోకాఽఽవళులు
నలరార నతిలోకమౌ అనుంగు ప్రియ పుత్రి
ఖాతి సంవర్ధనము వరల సకలాఽమృతశక్తి
బుద్ధి వృద్ధులతోడఁ బూర్ణమౌ శబ్దగతి
శక్తులన్ విశ్వమ్ము సదమలమై వరల
స్థితిగతుల మతి నస్థిర రతుల నిత్యము
గోలోక తతులతో గూఢ శక్తులు వరలు ॥ 3970

†(5) దుర్విదగ్ధములైన దుష్ట శక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులే:
దివ్య దివరూపమౌ దిన కాంతి శక్తిగా
అతిదీప్త బంధురమ్మై అలరు నమృత శక్తి
హృచ్ఛక్తులను బెంచు నచ్ఛమౌ మతి శక్తి
నతిలోక గతి మించు నదృష్టమహిత గతి
ప్రాప్తమై సహజమౌ ప్రకృతి ప్రసాదముగ
జగిచ్ఛిల్పియె సృష్టి నగణితమౌ సృష్టి
నతిలోకగతి మీఱ నమరించి ఒసరించు
విశ్వమునె రథముగా నశ్వి శక్తులు వరల ॥ 3971

†(6) దుర్విదగ్ధములైన దుష్ట శక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులే:
విశ్వరూపుని దివ్య విమలాక్షులై వరల
పంచభూతాఽఽవళుల నంచితములై వరలు
అఖిల గోళాఽఽవళులు నన్ని లోకాలును
నపురూపగతి నొప్పు నమృతాస్వాదనల
శక్తివంతము లౌచు రక్తివంతము లౌచు
సంజనన శక్తులన్ సంజనక దీప్తులన్
అక్ష మహితమ్ములై ఆక్షి సహితమ్ములై
అలరుచుండును సదా అఖిలేశ లీలమెయి ॥ 3972

†రచయిత:—వాఙ్మయ మహోద్యోత, డాక్టర్ పట్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) దుర్విదగ్ధములైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విడుచులేః
అఖిలమౌ రోచసిని నపురూప గతి మీఱ
నాకాశమున సర్వవిధాఽనాకాశ పదార్థాల
నిహ పర గతు లొప్ప నహరహ దీప్తులన్
అమృతశక్తులు నిత్య దమ శమ శక్తులన్
నిఖిలమ్ము వ్యాపించు నిరత జనన ప్రాప్తి
తత్త్వాలు వరలంగ సత్వశక్తులు సృష్టి
సంజననమై బహు సంవర్ధనమ్ములన్
అలరించు విశ్వమును జలివెల్గు లమృతాన ॥ 3973

†(8) దుర్విదగ్ధము లైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
దివి భువుల నన్నింట నవిరళముగ నిత్య
"మఖి" శక్తు లెల్లను నతివ్యాప్తి వ్యాపింప
మహితమౌ శక్తులన్ బహు దీప్తు లొప్పఁగా
విధ్వస్త మొనరించు విశ్వ సంక్షేమాల
"నాభి"శక్తుల నిలిపి నవ్య నవ దీధితుల
దివి భువులు నన్యాలు దివులుగాఁ దనరారఁ
బృథ్వి శక్తులు మూఁడు పూవులై తావులన్
ఆరు కాయలు కాగ నలరారు సంసృష్టి ॥ 3974

†(9) దుర్విదగ్ధములైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
పంచభూతాఽఽవళుల వంచించి మృత్తతుల
విధ్వస్త మొనరింప విశ్వయత్నము చేయు
"నభి"శక్తులను దుష్ట హంతక శక్తులన్
నాశన మ్మొనరించి "నాభి"శక్తులు వెలుఁగ
నిత్య నవ జన్మాల సత్య జవ శక్తులను
అఖిలమ్ము వర్ధిల్ల నసాధారణ గతుల
సృష్టి తనరారులే స్రష్ట శక్తుల కృతిగ
ధరణధారణ శక్తి భరణభారణ శక్తి ॥ 3975

†రచయిత;—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) దుర్విదగ్ధములైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
అగ్ని దీప్తులు వరల నరుణారుణ గతుల
నమృతతత్త్వాలను గిరణాళు లలరఁగాఁ
జాంద్రిశక్తులు తనరు జ్వలితామృతము లౌచు
జరితామృతము లౌచుఁ జదలునన్ వ్యాపించు
నమృత తేజాలతో నపురూపమౌ వెన్నెల
లలరించి విశ్వాన నమల దీప్తులు మీఱ
దివ్యమై భవ్యమై నవ్య నవ దీప్తాళి
"ఓష" శక్తుల నెల్ల నుర్వ్యాది భూతాల
ఉజ్జ్వలముగాఁ జేయు నుష్ణాది శక్తులను
ఉత్తమ స్థితి గతులు నుత్పన్నమై పెరుగు ॥ 3976

†(11) దుర్విదగ్ధములైన దుష్ట శక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
దివులందు భువులందుఁ దేజరిలు లోకాల
నఖిల విశ్వమ్ములో నపురూప గతి వెలయ
నిత్య పాక్షిక మౌచు నిలుచు నపాక్షిక మౌచు
నమృత కిరణావళుల నమల ప్రిసారాలఁ
బానశక్తుల గతు లపార రతులను వరల
విశ్వమ్మ్మ వర్ధిల్లు నశ్వి దీప్తులు మీఱ
నుపరిలోకాఽఽవళులు నుర్వ్యాధోలోకాలు
నొప్పు నమృత గతుల నెప్పుడున్ విలసిల్ల ॥ 3977

†(12) దుర్విదగ్ధములైన దుష్టశక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
సృష్టిలో విస్తరిలు ఛిద్రమౌ "నభి" శక్తి
నాత్మీయమౌ దివ్య యజ్ఞ సంసృష్టిగా
నమర కిరణుని కాంతు లమృతములై వరలఁ
జాంద్రి శక్తుల మీరు సాంద్రాఽమృత శక్తి
ప్రసరించి ప్రికృతిని నసమ యౌవన రతులు
పసమించఁగా నిలిపి నసి పొందఁ బ్రాణితతి
సూర్యులకు సూర్యుఁడౌ నార్యుఁడౌ నాదిత్యు
నద్భుత శక్తులన్ అఖిల విశ్వము వెలుఁగు ॥ 3978

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(18) దుర్విదగ్ధములైన దుష్ట శక్తుల నెల్ల
సలిలమై సోమమ్మె స్రవియించి విరుచులేః
అమృతశక్తుల నెల్ల నఖిల గోశాఽఽవళుల
హవిషాఽఽశిగా దివ్య దేవాఽఽళుల కొసంగి
వాహకుండౌ నగ్ని పరిమార్చు\ తిమిరాళి
లోక వ్యవహారాల కాకరమ్మై వెలుఁగు ॥ 3979

ఇయ్యది
విశ్వసృష్టిప్రకృతిమాత్రైకైకపుత్ర
పతకమళ్ళ గోత్ర-వడ్లమూడి కుల సందీప్త-
శ్రీ సుబ్బన్న పౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అద్వితీయ ద్వితీయపుత్ర-
శ్రీ సరస్వతీమాతృ ప్రియపుత్ర-అపార వేద శాస్త్రసాహిత్యవిద్యా పారంగత-

అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకిక శక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సర్వ దేవతాస్వరూప-విద్వన్మణి పంచముఖాంజనేయోపాసక శ్రీవేదులరామశాస్త్రి గురువరాభిస్తుత"ముఖకలిత గోపాలసుపద"-మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమగురువర్యాభినుత "శతవర్షాశీర్వచన రక్షిత అగుణశోభిత నిష్కళాసహిత శ్రీ మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహిని హృదయ లక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్వాక్ స్వరూపిణి, అమలిన పవిత్ర పతి రక్తి భక్తి శక్తి స్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్య చైతన్యవతి, నిర్నిద్రమతి, వినిర్మలగతికలిత, ప్రియశరీరాంతర్విలీనగాన జ్ఞానధ్యానస్వరూపిణీతన్మయి, శివపూజితఫాలచంద్రకళామూర్తి-అకళంక సౌందర్యరాశి-సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త-జయశ్రీ సత్యశ్రీ పుత్రికారత్నద్వయ అజయ్య జయ విజయ పతాకయుక్త-శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహర రాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య ఛత్రాఽఽవరణయుక్త-పాణినీయాఽష్టాధ్యాయీపూర్వతాప్రసిద్ధసూత్రసహిత శబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త మహా వైయాకరణ వేదవేదాంతకోవిద దశభాషా కవితా విశారద పుంభావశారదామూర్తి శ్రీ గుండేరావు హర్కారే-సాష్టాంగనమస్కార పూర్వక ప్రస్తూయమాన- "శ్రీ వాఙ్మయ మహాధ్యక్ష-ప్రాచీన వైయాకరణానవద్య సంప్రదాయరక్ష-స్ఫోరితానేక జనాభినవోన్మేష శాలికావ్య నిర్మాణశక్తిమన్నికోచనాక్ష-మాధుర్యస్యందివీర్యవత్తరపదగుంఫాధురీణ - మహీధుగగోచరగాంభీర్యప్రకటనా పటిమాపారీణ-కల్పాంతారీణాఽనల్పకల్పనాభూషణ"- లీలామానుష విగ్రహ - ఆంధ్రవిశ్వకళాపరిషత్ సంభావితచతుర్వింశ దధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్

"కళా-ప్రపూర్ణ" సార్థక బిరుద విరాజిత - బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య
సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్త సహిత సుసమగ్ర
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
దశమమండలమున సప్తమాష్టకమునందలి
అర్థాంతరయుక్త షష్ఠాధ్యాయము
సమాప్తము

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"



# సమగ్రాల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—సప్తమోఽధ్యాయః

### సూక్తమ్—120

ఋషిః—ఆథర్వణో బృహద్దివః

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) తదిదాస భువనేషు జ్యేష్ఠం యతో జజ్ఞ[1] ఉగ్రస్త్వేషనృమ్ణః ।

సద్యో జజ్ఞానో ని రిణాతి శత్రూనను యం విశ్వే మదన్త్యూమాః ॥ 1376

(2) వావృధానః శవసా భూర్యోజాః శత్రుర్దాసాయ భియసం దధాతి ।

అవ్యనచ్చ వ్యనచ్చ సస్ని సం తే నవన్త ప్రభృతా మదేషు ॥ 1377

(3) త్వే క్రతుమపి వృఞ్జన్తి విశ్వే ద్విర్యదేతే త్రిర్భవన్త్యూమాః ।

స్వాదోః స్వాదీయః స్వాదునా సృజా సమదః సు మధు మధునాభి యోధీః ॥ 1378

---

1. జజ్ఞఽఉగ్ర. (వా.ప్ర.)

(4) ఇతి చిద్ధి త్వా ధనా జయన్తం మదే మదే[1] అనుమదన్తి విప్రాః ।
ఓజీయో ధృష్ణో స్థిరమా తనుష్వ మా త్వా దభన్ యాతుధానా దురేవాః ॥ 1379

(5) త్వయా వయం శాశద్మహే రణేషు ప్రపశ్యన్తో యుధేన్యాని భూరి ।
చోదయామి త [2]ఆయుధా వచోభిః సం తే శిశామి బ్రహ్మణా వయాంసి ॥ 1380

(6) స్తుషేయ్యం పురువర్పసమృభ్వ మినతమమాప్త్యమాప్త్యానామ్ ।
ఆ దర్షతే శవసా సప్త దానూన్ ప్ర సాక్షతే ప్రతిమానాని భూరి ॥ 1381

(7) ని తద్దధిషేఽవరం పరం చ యస్మిన్నావిథావసా దురోణే ।
ఆ మాతరా స్థాపయసే జిగత్నూ [3]అత ఇనోషి కర్వరా పురూణి ॥ 1382

(8) ఇమా బ్రహ్మ బృహద్దివో వివక్తీన్ద్రాయ శూషమగ్రియః స్వర్షాః ।
మహో గోత్రస్య క్షయతి స్వరాజో దురశ్చ విశ్వా[4] అవృణోదప స్వాః ॥ 1383

(9) ఏవా మహాన్ బృహద్దివో[5] అథర్వా ఽవోచత్ స్వాం తన్వమిన్ద్రమేవ ।
స్వసారో మాతరిభ్వరీరరిప్రా హిన్వన్తి చ శవసా వర్ధయన్తి చ ॥ 1384

---

1. మదేమదేఽఅను, 2. తఽఆయుధా. 3. జగత్నూఽఅతఽఇనోషి, 4. విశ్వాఽఅవృణోదప,

5. దివోఽఅథర్వా. (వ్రా.ప్ర.)



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—సప్తమాధ్యాయము

### సూక్తము—120

ఋషి—అథర్వ పుత్రుఁడు బృహద్దివుఁడు†
దేవత—ఇంద్రుఁడు†

(1) •గీ॥ దేనివలన మహోగ్రుఁడు దీప్త బలుఁడు
సూర్యరూప మహేంద్రుఁడు నూటి పుట్టె
నట్టి బ్రహ్మమె లోక త్రయంబునందు
నతిప్రశస్తతమంబయి యమరుచుండు ॥ 3980

•గీ॥ ఎట్టిదానిని జూచుచు నెల్ల వారు
పరమ సంతోషవార్ధిలోఁ బడుచునుందు
రట్టి బ్రహ్మమె పుట్టినయంతమాత్ర
సర్వశత్రుల హరియింపఁజాలుచుండు ॥ 3981

(2) •గీ॥ బలముచే వర్ధమానుఁడై బహుబలాభి
రాముఁడై శాతయుత యయి భ్రాజమానుఁ
డౌ మహేంద్రుఁడు దాసున కధిక భీతిఁ
బుట్టఁజేయుచునున్నాఁడు పూర్ణశక్తి ॥ 3982

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 129వ పుటలో నీ సూక్తమునకు ఋషి "అథర్వపుత్రుఁడు బృహద్దివుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు" గాను వ్రాసి, 156 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "బృహదివుఁడు" ఋషిగాను, "ఇంద్రుఁడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ హవ్యములచేత స్తుతులచే నధిక హర్ష
ముద్భవింపఁగ నీ కింద్ర! యోలిఁ బోషి
తంబులౌ సర్వ భూత జాతంబు లెల్ల
నిన్నుఁ బొగడంగ పఙ్క్తిగా నిలుచుచుండు ॥ 3983

(3)*గద్యము॥
తర్పకు లగు యజమానులు పూర్వ మేకాకు లగుచుండి పిదప ద్విరూపము శ్రీరూపముచేతఁ
బురుషరూపముచేతఁ బుట్టినవారలై పరల నపత్యముతోఁగూడఁ ద్వివారము జన్మమును
బొందుచున్నారు. కావున నో యింద్రుఁడా! యజమానులు నీయందుఁ బరిసమాప్తిఁ
జేయుచున్నారు. ఇంద్రుఁడా! నీవు గృహ ధనాదులకంటెఁ బ్రియతర మగు
నపత్యమును మాతా పిత్రాత్మక మగు మిథునముతోఁ గలుపుము! ఆ
యపత్యమును మదహేతు వగును. మదహేతు వగు మిథు
నాంతరముతోఁ (జౌత్రునితోఁ) గ్రీడింపుము! ॥ 3984

(4)*గీ॥ సోమపానజన్య కోధ జనింపఁగా
శత్రు విజయులైన శక్రదేవ!
స్తోత లెల్ల నీకు స్తుతులచే సంతుష్టి
నోలిఁ గలుగఁ జేయుచున్న వారు ॥ 3985

*గీ॥ శత్రుధర్షయితా! మహాశక్ర! బలము
గలుగునట్టి ధనం బిలఁ గలుగనిమ్ము!
యాతుధానులు నిన్నింద్ర! యనవరతము
హింస పెట్టకయుండ్రిగా కెట్టులైన ॥ 3986

(5)*గీ॥ అసులఁజేయంగఁ దగినట్టి యాయుధములఁ
బ్రేరణముఁ జేయుచున్నాము వైరిపయిని
దావకానుగ్రహము నింద్ర! తాల్చి మేము
శత్రుమండలి యుద్ధానఁ జంపఁగలము ॥ 3987

*గీ॥ ఇంద్రదేవుఁడ! నీకయి యొనఁగు మంత్ర
రాజమును గూడఁ కొనుచు విభ్రాజమాన
రుచిరరాన్నంబు బను నేను రూఢ మతిని
సంస్కరించుచునున్నాను జాల భక్తి ॥ 3988

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(6)*గద్యము॥
ఏ యింద్రుఁడు బలమున సప్త సంఖ్యాక దానవులను జంపుచున్నాఁడో; యే యింద్రుఁడు అసురులకుఁ బ్రతిరూపంబు లగు బహుబలంబులను సహించుచున్నాఁడో; స్తోతవ్యుఁడు బహురూపుఁడు సురుభానమానుఁడు నావృత్త్యుఁడు నగు నా యింద్రుని నేను వినుతించుచున్నాను ॥ 3989

(7)*గీ॥ ఎవని గృహమందు హవ్యంబు నెలమిఁ గొనుచుఁ
దృప్తిఁ గాచుచునుందువో; దీక్షఁ బూని
యట్టివాని గృహంబు ననల్ప మైన
ధనము నన్నంబు నుంచుదు ఘనతరేంద్ర! ॥ 3990

*గీ॥ గమన శీలంబులై కడుఁ గ్రాలు రోద
సులను నిజతలమందునఁ గలుగఁజేతు
వఖిల కార్యంబుల మహేంద్ర! యధిక ప్రీతిఁ
బొందుచున్నావు; నీ వెప్డుఁ బూర్ణభక్తి ॥ 3991

(8)*గీ॥ అగ్రభవుఁడు, ఋషి శ్రేష్ఠుఁ డైనవాఁడు
స్వర్గసంభక్త యగునట్టి సత్బృహద్ది
వుండు స్తోత్రంబులను నింద్ర పూత మూర్తి
సుఖము కలిఁగెడు నట్టులు నూటి పలుకు ॥ 3992

*గీ॥ బల నిహిత మైనయట్టి యా పర్వతమును
నెవఁడు నడలించెనో; మరి యెవఁడు బిలము
నందుఁ గల గోసమూహంబు నందె నట్టి
యింద్రునకు స్తోత్రముల నెల్ల నెలమిఁ గూర్తు ॥ 3993

(9)*గద్యము॥
ఋణాధికుం డగు బృహద్దివుఁ డింద్రుని నిమిత్తము విస్తారస్తుతిని రచించెను. మరియు నీ యింద్రునె సకల భూత నిర్మాతృ యగు భూమియందుఁ బావరహితలు స్వయముగఁ బొవ్వనవియు నగు గంగాది నదులు యాగసాధన మూలమున సంతసింపఁజేయు చున్నవి. (వృష్టి నిమిత్తము ఇంద్రుని బొందుచున్నవి) యాగజన్య బలమున నింద్రుని వృద్ధిపరచుచున్నవి ॥ 3994

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

## సూక్తము—120

ఋషి—అథర్వపుత్రుఁడు బృహద్దివుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) సకలమౌ సృష్ట్యాది సద్యోజాతమై
ఆదిదేవుఁడుగాఁగ నఖిల జ్యేష్ఠుఁడు గాఁగ
నవతరించిన దేవు ననుగ్రహమ్ము మెయి
నాదిత్య రవి శశులు నాదిగా గ్రహతతులు
జల వాయు పృథ్వ్యాది సర్వవిధ గోళాలు
ఉత్పన్నమై పెరుగు నుదయాస్తమయాల
నభ్యుదయాలతో నభివృద్ధులను జెందు
నంతరించును గ్రమశః ఆశ్చర్యకరముగా
ఆ ఆదిదేవు కృప నఖిల విధ శత్రుప్రలు
రూపు మాయుదురు మహా రూక్షశక్తి ధృతుల
నత్పదార్థపు శక్తి సర్వేశ రూపమై
విశ్వ విజేతగా నశ్వితేజము వరల ॥ 3995

†(2) బహుముఖాలుగ వరలు ప్రాణశక్తులు మీఱ
నిత్య నవమై సృష్టి సత్య మద శక్తులన్
అలరారు జీవాల నమరు నోజశ్శక్తు
లసాధారణగతులఁ బ్రసాదగుణ రతులఁ
బ్రాణ రహితమ్మైన నానావిధ జడపర
పద పదార్థా లెల్ల మద నిత్య శక్తులన్
సత్యమై తనరారు సకల విశ్వములోన
రవ్యాది గోళాలఁ గ్రాలు నగ్నులు మీఱి
జల మరుత్‌తతులతో జలదాల సృష్టించి
బహువిధ సలిలాల వర్షింపఁగాఁజేయు
నపురూపమౌ సృష్టి నతిలోకమౌ శక్తి
జీవకోటులను నిర్జీవకోటి జడమ్ములన్
మహితమౌ దీప్తాళి ముహుర్ముహుర్భవములన్
శత్రు నాశకశక్తి సర్వాన నుప్పతిలు ॥ 3996

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

†(3) స్వాదు రూపాలలో సర్వ సృష్టులు వరలు
నేకైకమై జగతి నాకృతుల వివిధమై
స్వాదీయమై మహా సంతోష రౌచ్యమై
స్థితిశక్తి వరలఁగాఁ జెలఁగి ద్వివిధమ్ముగా
స్వాదు కారణముగా సమద గతి వరలుచున్
నభ్యుదయంపు రూపు లలరఁగాఁ దివిధాల
నుత్పన్న శక్తులన్ యోధ తత్త్వాలతో
సృష్టి క్రతువుగాఁగఁ జెల్వొందు విశ్వమ్ము
అత్యంత మధురమై అపురూపమౌ శక్తి
ఆధిపత్యము పాలనాధికారము వరల
నదుపు చేసెడి శక్తు లమరంగఁ బ్రాకృత
తత్త్వమై సర్వమ్ము తరణి ధారక మౌను ॥ 3997

†(4) ఓజోమయ శక్తులన్ సృష్టిలో దేవాళి
చిద్విలాసాలతో సద్విశ్వ దీప్తులన్
ఆనంద రూపాల సఖిల విశ్వమునందు
విజ్ఞాన దీపాలు వివిధాలుగా వరల
సకల సంపత్తులును బ్రకృతి రూపాలుగా
అననురూపాలుగా నమూల్యములుగాఁగ
సర్వ సౌఖ్యాఽఽవళులు సమకూర్చ శోభలన్
గష్ట నష్టమ్ములను వ్యష్టి సమిష్టులుగ
సృష్టిలోఁ గలిగించు దుష్టరూపములైన
శత్రుతతిఁ బరిమార్చ సదమల బల మౌను ॥ 3998

(5)†నాగశ్రీవృత్తము ॥•
సృష్టి సద్రూపానఁ జెల్వొందు శబ్దాల
వ్యష్టిగా రూపాలఁ బ్రజ్ఞాన శక్తిన్ స
మిష్టిగా వర్తిల్లు మిన్నంటు దీప్తాళి
దృష్టి నాదిత్యాగ్ని దివ్యాయుధాలై ప్ర
కృష్టమై ఛేదింప ఋక్ష ప్రకర్షాల
దుష్టులౌ దుర్జాతి దుర్మార్గ హింసా ప్ర
తుష్టమౌ కర్కాంధ దుశ్శత్రు వర్గాల
నిష్టి సంహారాలె యెంతేని వెల్గొందు ॥ 3999

---
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"జగతీ"ఛ్ఛందము, (12), అష్టపది.

†(6) సప్తాఽఽవరణాల సప్తాఽనిలాలతో
సప్తాఽనలాలతో సప్త సలిలాలతో
సప్త విధ మృత్తతుల గుప్త మౌచును వరలు
బహురూపమౌ దుష్ట పదార్థాల నన్నింటి
విధ్వస్త మొనరించ విమలమౌ కాంతులన్
నిత్య దీప్తులు మీఱ నిఖిలాన బ్రసరించు
సూర్య చంద్రాది గ్రహ శుభ్ర ప్రకాశాలు
విశ్వ వ్యాప్తము లౌను వెలుఁగు నాదిత్యాది
దివ్య శక్తులు మీఱ దివి భువుల నన్నిటన్
శ్రీమహావిష్ణు కృప చిద్విలాసము కాఁగ ॥ 4000

†(7) ప్రకృతిమాత సర్వ ప్రభా భాసితముగా
దివి భువులు నన్నియున్ దేజరిలఁ గాంతులన్
అతిసమీపమ్ముగా నతిదూర తీరాల
నఖిలాన వర్తించు ననంత గోళాల
లోకాల నన్నిటిన్ రోదోఽంతరాళాన
నడుపాజ్ఞలనునుంచి ఆత్మ ప్రదక్షిణాల
నధిపతి ప్రదక్షిణ లలరార నిత్యమ్ము
నడుపు నా దేవుండు నానావిధాలుగాఁ
గాలబద్ధము లౌచుఁ గ్రాలఁగా సృష్టిలో
నతిలోక రక్తులన్ అతివేల శక్తులన్
నపురూప గతులమై నాకర్షణ శక్తు
లద్భుతముగా వరల నసాధారణ కృతుల ॥ 4001

†(8) ఆదిత్య గతులమై నఖిలాండములు వెలుఁగ
రవి చంద్ర గ్రహతతులు క్రాలఁగా విశ్వాన
దివులకే దివి గాఁగ దివ్యలోకము కాఁగ
బృహద్దివము గాఁగ వెల్గు వైకుంఠగమౌ
నింద్ర శక్తుల బ్రహ్మ యిష్టిగా సృష్టించుఁ
గాల బద్ధము లౌచుఁ గ్రాలఁగా గోళాలు
అతిలోకమై తనరు నమలమౌ శబ్దాల
నిశ్శబ్ద శక్తు లవి నిరతమ్ము వరలులేః ॥ 4002

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) దశదిశలలో సత్య వశ మౌచుఁ దనరారు
నానా రవి చంద్ర గ్రహ నక్షత్ర పుంజాలు
అఖిలాండ పిండాండ బ్రహ్మాండ భాండాలు
ఇహ పర లక్ష్యాల నహరహముఁ దిరుగుచు
నాత్మ ప్రదక్షిణల నధిపతి ప్రదక్షిణల
మాతృ రహితగ వరలు మాన్యమౌ శక్తులు
ప్రకృతిమాత సురూపు లకృతమ్ములై వరల
వైష్ణవీయపు శక్తి వర్ధిల్లు సర్వమ్ము ॥ 4003

## సూక్తము—120

ఋషి—అథర్వ పుత్రుఁడు బృహద్దివుఁడు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

†(1) అఖిలలోక దీప్తగతుల నంతరిక్షమునందు నలరు
దేశ కాల శక్తులతో దివ్యగతుల నలరుచుండు
విశ్వ సృష్టి జ్యేష్ఠుఁడైన విశ్వేశుని పర మేశుని
నుగ్రశక్తితో శత్రువు సుసురు లెగిరి పోవునులే,
మానవాళి ప్రాణికోటి మహిత రక్షకమ్మై తగు
సూర్యుం డుత్పన్న మగుచు నర్యముఁడై వెల్గొందుచు
నంతరిక్షమందు మొయిళు లంతరించకుండ నాపి
జల శక్తుల శత్రు తతుల సంహరించుచుండు సదా ॥ 4004

†(2) ఓజశ్శక్తులు మీరఁగ నుపర్యుపరి లోకాలను
విశ్వ శాంతి సౌభాగ్యపు విధ్వస్తము కావించెడి
దుష్ట శక్తు లన్నింటిని దున్మాడుచు దివ్యశక్తి
స్థావర జంగమ జగముల సర్వమ్మును నతిలోక
పరిశుద్ధములై తనరఁగఁ దరణీయములై వరలుచుఁ
బ్రకృతి హర్ష కారకమై సుకృత శక్తి తత్త్వాలను
బ్రాణి సంజనన శక్తి వర్ధిల్లును సృష్టిలోన
ననురూప పురుషశక్తు లసాధారణముగ వెలుఁగ ॥ 4005

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) సృష్టికర్తువు స్థితికర్తువులు చెలఁగెడి లయకర్తువులు
నేక ద్వి త్రి రూపాలుగ సృష్టిలోనఁ దనరారును
సర్వేశుని ఆజ్ఞ మీఁద సర్వజగము నడచుచుండుఁ
బ్రకృతిలోన సృజనశక్తి ప్రభావాలు విరాజిలఁగ
నొకదానినుండి వేరొకటి ఉత్పన్న మ్మొనరించును
అనుస్యూతమైన రతుల నమలమైన స్వాదుశక్తి
స్వాదీయమ్మౌ జగతిని స్వాదువులో మధువుగాఁగ
నఖిల సృష్టి సర్వస్వము నమృతగతులఁ దనరారును
సమద మౌచు సర్వసృష్టి శమదమౌజశ్శక్తుల[1]
శాంతిసౌభాగ్య రూప జల శక్తులు రక్షితముగ
"నభి" శక్తిని దుర్గించివైచి అసమానపు ఉగ్ని దీప్త
లలరంగా నజయ్యమై అమేయమై తనరారును ॥ 4006

†(4) విశ్వశాంతి సౌభాగ్యా లశ్వశక్తు లన్నింటిని
విధ్వస్తము కావించెడి విమద దుష్టరాక్షసాళి
సర్వమ్మును సంహరించి నదమలమౌ దీప్త విజయ
మలరారఁగ నఖిల సృష్టిఁ జెలువొందఁగ జలశక్తులు
బలరూపములై వరలెడి ప్రకృతి శక్తు లన్నింటిని
దన రూపాళిగ మలచుచుఁ దనరఁ బ్రకృతి ధాతృగతుల
స్థిర శక్తుల విజ్ఞతమై సస్థిరమౌ విశ్వమ్మునఁ
బంచభూత పదార్థాలు వరలు వివిధరూపాలై
చిదూర్జితాళుల విజయము సృష్టిని జెన్నొందఁజేయు
నపురూపపు శక్తులతో నఖిల విశ్వ మలరారఁగ ॥ 4007

†(5) విశ్వసృష్టి సహజ మౌచు వీరత్వము వరలంగాఁ
బ్రకృతిలోని పదార్థాలు బల శక్తుల ప్రదర్శనల
సంచలనపు గతులు మీఁద సర్వమ్మున విజృంభించి
అన్యప్రకృతి శక్తులపై జన్య సుకృతి బలాలతో
యుద్ధమ్మును బ్రకటించును శుద్ధ పౌరుషంపు దీప్తిఁ
బ్రకృతి విరుద్ధమై పెరిగెడి వికృతమౌ బలశక్తుల
విధ్వస్తము కావించును విశాలాభ్యుదయము వరల
సృష్టిలోని బ్రహ్మశక్తి వ్యష్టి సమిష్టి గతులఁ దనర
వివిధములౌ శబ్దశక్తు లవితథముగఁ బరఁగంగా
నాహార పదార్థాలు అమలములై సంస్కృతమౌ ॥ 4008

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. దమ+ఓజశ్శక్తులు.

†(6) అంతరిక్షములోన నపురూప శక్తులన్
రకరకాలుగ నింగి రాజిల్లు ఋభురాజు
లరుణులకు నరుణుఁడై అలరు నాదిత్యుండు
సప్త రూపాలైన గుప్త భేదాలతో
నలరారు నాకాశ మనిలాలు ననలాలు
సలిలాలు మృత్తతులు చలితమై జరితమై
జ్వలితమ్ములై వరఁగు సచ్చిదానందాల
"సభి" శక్తులను మీఱి "నాభి"శక్తుల వెలిఁగి
జలదమాలలు జగతి సలిలాల వెలయించఁ
బలువిధములౌ సీర మురక లెత్తును సదా
శత్రువర్గా లెల్ల సత్రి వరాభూత
నిర్వీర్య సర్గతుల నిస్తేజమై పోవ ॥ 4009

†(7) ప్రకృతిమాత సృష్టిలోన నకృత సుకృత కర్మలతో
నిహ పరాల నన్నింటను నెల్ల గోళ లోకాలను
భువు లెల్లను దివు లెల్లను బృథ్వ్యాది భూతాలు
నన్యోఽన్య సంబంధ మనుబంధ బంధాల
నవినాభావాల నపురూపమై నిలిచి
గుహ్యశక్తులతోటి గోళాలు గృహములై
చలన శక్తులు తనర సంచరించును సదా
ఇనశక్తు లొప్పార నెసఁగు మండలముల
రక్ష శక్తులు మీఱ రాణించు విశ్వాన
నాధిపత్యపు శక్తి నాకర్షితము లౌచు
నఖిలగోళమ్ములున్ ఆలర నుపగ్రహాలు
తనరారు జగతిలోఁ దరణి బాధ్యత లలర ॥ 4010

†(8) అఖిల విశ్వమ్ములో నచ్యుత గతు లొప్ప
లోకాలు గోళాలు లోలుపత్వము మీఱఁ
గాల బద్ధము లౌచు వేల లెసయుచు సౌర
మండలపరములై నండాండ పిండాండ
బ్రహ్మాండములలోన ఖండసమ్మున గెలిచి
ఆదిత్య శక్తులన్ అఖిలహో సూర్యాళు
లపురూప శక్తులన్ ఆధిపత్యపు రతుల
నలరారఁగాఁ దిరుగు నతిలోకగతి మీఱ
క్షుద్రశక్తుల వరలు శూరులౌ శాత్రవుల్
క్షయముగా విశ్వాన నజయ్యశక్తులు వెలుఁగు ॥ 4011

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) విశ్వసృష్టి మూలమైన విశ్వేశుని దీప్త లొవ్వు(
బ్రకృతిమాత సృష్టిలోన సుకృతవిజయ తత్త్వాలను
దుష్కృతి పరాభూతాల నకృత్య పరాజయాల
నలరారుచు నిహపరమౌ వివిధ గోళ లోక
జాల సర్వస్వము తిరుగు వేల లెనసి విశ్వమ్మున
స్వయంచలన శక్తులతో నభయంకర వర్తనలను
నాత్మ ప్రదక్షిణాళి నధిపతి ప్రదక్షిణల
ననవరత మ్మొనరించుచు నద్భుతగతి వరలంగా
విష్ణుపదమ్మై వరలెడి బృహద్దివము చేరంగా
సత్యవర్ధనమ్ము మీఱ నిత్యయాన మొనరించును ॥ 4012

## సూక్తమ్—121

ఋషిః—హిరణ్యగర్భః ప్రాజాపత్యః
దేవతా—కః(ప్రజాపతిః)
ఛందః—త్రిష్టుప్

(1) హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక [1]ఆసీత్ ।
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1385

(2) య [2]ఆత్మదా బలదా యస్య విశ్వ [3]ఉపాసతే ప్రశిషం యస్య దేవాః ।
యస్య ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1386

(3) యః ప్రాణతో నిమిషతో మహిత్వైక [4] ఇద్రాజా జగతో బభూవ ।
య [5]ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1387

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. రేకఽఆసీత్, 2. యఽఆత్మదా, 3. విశ్వఽఉపాసతే, 4. మహిత్వైకఽఇద్రా,

5. యఽఈశేఽఅస్య. (వ్రా.ప్ర.)

(4) యస్యేమే హిమవన్తో మహిత్వా యస్య సముద్రం రసయా సహాహుః ।
యస్యేమాః ప్రదిశో యస్య బాహూ కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1388

(5) యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృళ్హా[1] యేన స్వః స్తభితం యేన నాకః ।
యో [2]అన్తరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1389

(6) యం క్రన్దసీ[3] అవసా తస్తభానే[4] అభ్యైక్షేతాం మనసా రేజమానే ।
యత్రాధి సూర [5]ఉదితో విభాతి కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1390

(7) ఆపో హ యద్బృహతీర్విశ్వమాయన్ గర్భం దధానా జనయన్తీరగ్నిమ్ ।
తతో దేవానాం సమవర్తతాసురేకః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1391

(8) యశ్చిదాపో మహినా పర్యపశ్యద్ దక్షం దధానా జనయన్తీర్యజ్ఞమ్ ।
యో దేవేష్వధి దేవ[6] ఏక ఆసీత్ కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1392

(9) మా నో హింసీజ్జనితా యః పృథివ్యా యో వా దివం సత్యధర్మా జజాన ।
యశ్చాపశ్చన్ద్రా బృహతీర్జజాన కస్మై దేవాయ హవిషా విధేమ ॥ 1393

---

1. దృళహా, 2. యోఽఅన్తరిక్షే, 3. క్రన్దసీఽఅవసా, 4. భానేఽఅభ్యై, 5. సూరఽఉదితో,
6. దేవఽఏకఽఆసీత్. (ప్రా.ప్ర.)

(10) ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ ।

యత్ కామాస్తే జుహుమస్తన్నో [1]అస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥ 1394

## సూక్తము—121

ఋషి—ప్రాజాపత్యుఁడైన హిరణ్యగర్భాఖ్యుఁడు†

దేవత—"క"శబ్దాభిధేయుఁడగు ప్రజాపతి†

(1)*చ॥ అతుల మహా[2]ప్రపంచకపు టాదిని నల్ల హిరణ్యగర్భుఁడే‡
వితతుఁడు వాఁడు పుట్టఁగనె విశ్వమునందొకఁడై, లసజ్జగ
త్తతులకు [3]నీశ్వరుండునయి తాల్పఁ దొడంగె దివంబు భూమి నే
మతిశయ మే ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్ ॥♦ 4013

(2)*చ॥ చతురత సర్వ మెవ్వని వశంబునఁ [4]బుట్టుచునుండుఁ [5]బ్రాణి సం
తతి సురులేని యాజ్ఞమెయిఁ దా నమృతంబును నే.. మూర్తి తాన్
హిత మగుచుండు లోకమున కెప్పుడు సత్యవిభూతితోడ నే
యతిశయ మా ప్రజాపతికి నర్చలఁజేయుదు మన్ని భంగులన్॥ ‡‡ 4014

(3)*చ॥ అతుల సమస్త [6]జీవతతియందు గుణంబుల నద్వితీయుఁడై
**తతమును**[7] బాలకుండునయి[8] తా ద్విపదంబులకున్ జతుష్పద
ప్రతతులకున్ మహేశుఁడయి రాజిలు[9] నెవ్వఁడు సంతతంబు నా
యతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్ ॥ 4015

---

1. మ న్తన్నో ఽఅస్తు. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 133వ పుటలో నీ సూక్తమునకు ఋషి "హిరణ్యగర్భుఁడు"గాను, దేవత "క"శబ్దాభిధేయుఁడు ప్రజాపతి"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "హిరణ్యగర్భుఁడు" ఋషిగాను, "క (ka)" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

‡జగత్తుయొక్క మూలారంభమున హిరణ్యగర్భుఁడుండెను. వానిచే జగత్తంతయుఁ దాల్పఁబడినది. (నే.వేం.న.శా.)

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

2. ప్రపంచమున కగ్రమునందు, (తొ.పా.), 3. నీశ్వరుండగుచు దాల్చుచునుండె, (తొ.పా,),

♦ఈ సూక్తములోని తొలి ఋగనువాదముగా నీ క్రింది గద్యమును శ్రీనేమానివారు వ్రాసి వారే స్వయముగాఁ గొట్టివేసిరి.

1. (1)గద్యము॥ హిరణ్యగర్భుఁడు ప్రపంచోత్పత్తికి ముందుండెను.వాఁడు పుట్టగనే యద్వితీయుఁడై విరురజాతమగు బ్రహ్మాండాది సర్వజగత్తునకు నీశ్వరుం డయ్యెను. అంతయె కాక విస్తృతమగు దివమును పురోవర్తమానమగు భూమిని ధరించుచున్నాడు. ఏ ప్రజాపతిని దానాది గుణ యుతుని సేవింపఁగలము? ॥ (తొలి పాఠము).

4. బుట్టుయదాజ్ఞ, (తొ.పా.), 5. బ్రాణి సంతతుల మరాళికూడఁగడుఁదాల్త్రిమృతంబు యదీయఛాయమూహిత. (తొ.పా).

‡‡ చ॥ చతురత సర్వ మెవ్వని వశంబునఁ బుట్టు యదాజ్ఞఁ బ్రాణి సం
తతుల మరాళికూడఁ గడు దాల్త్రిమృతంబు యదీయ ఛాయ(యై)తాన్
హిత మగుచుండు లోకమున హెచ్చుగనట్టి మహా(నెప్పుడు సత్యవిభో) విభూతికే
మతిశయమే ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్॥ (తొలిపాఠము)

6. జీవుల మహాత్మ్యము చేతను, (తొ.పా.), 7. సతతము, (వ్రా.ప్ర.పా. యతి భంగము.), 8. బాలకుండగుచుఁ దా, (తొ.పా.), 9. రాజిలుచుండెడు నట్టివానికే. (తొ.పా.)

(4)*చ॥ క్షితి హిమ శైల ముఖ్య [1]గిరి సీమలు చాటెడు నేని శక్తి వి
స్తృత నదులున్ సముద్రమును జెప్పెర నెవ్వని భాగ్య మంచు సన్
మతులు పఠింతు రాశలును మానుగ నెవ్వని[2] వౌచు నుండు నా
యతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్ ॥ 4016

(5)*చ॥ అతనుదివంబు [3]భూతల మనారత మెవ్వని శక్తు లెన్ను దే
వతతి నివాసమౌ దివము బంధిత మెవ్వనిచేత సూర్యుఁ డ
చ్యుతుఁ దగుచుండు [4]నూర్ధ్వగమహోన్నతుఁడౌచును నేనిచేత నా
యతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁజేయుదు మన్ని భంగులన్ ॥ 4017

(6)*చ॥ వితతములైన రోదసులు వెల్గుచు నెవ్వనిఁ జూచుచుండు నే
మతిఁ గలవానియందు ననయంబు మహాత్ముఁడు సూర్యుఁ డెంతయున్
ధృతిని వహించి పుట్టు చతిదీప్తిని గాంచునొ॥ యెల్ల వేళ[5] నే
మతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్ ॥ 4018

(7)*చ॥ తత వియదాది భూతములఁ దాను జనింపఁగఁ జేయుచుండి సం
తతము హిరణ్యగర్భుని నితాంతముఁ గాల్చెడు నన్ జగంబులన్
ధృతి ధరియించు నెవ్వఁ డతిదీప్తిని జేయునొ॥[6] లోకమంత కే
మతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁ జేయుదు మెల్ల భంగులన్ ॥ 4019

(8)*చ॥ క్షితిపయి యజ్ఞమున్ నెరపఁ జేరెడు దక్షుని నాత్మయందుఁ దా
నతిశయ మొప్పఁ దాల్చెడు మహాంబువు నెవ్వఁడు గాంచె దేవతా
వితతికి నీశ్వరుం డగుచు[7] వెల్గెడు నెవ్వఁడు నిష్ఠతోడ నే
నతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్ ॥ 4020

(9)*చ॥ స్తుతుఁ డగు నెవ్వఁడీ పృథివి శోభిలఁ[8] బుట్టగఁజేయుచుండి సం
తతమతి సత్యధర్ముఁడయి తా జనియింపఁగఁజేసె లోక సం
తతుల మహోదకంబులను[9] ధన్యుఁడెవండొ॥ యహింసఁ జేత నే
మతిశయుఁడౌ ప్రజాపతికి నర్చలఁ జేయుదు మన్ని భంగులన్ ॥ 4021

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. గిరి సీమలు యన్మహిమంబుఁ జాటు, (తా.పా.). 2. నెవ్వనికేసు వానికే, మతిశయమే. (తా.పా.), 3. భూతలము యన్మహిమంబున స్థైర్యం మూను, దేవతతి నివాసనాకములను, (తా.పా.), 4. నూర్ధ్వగ మహోన్నత భాగమునుండి వానికే (మహోన్నతు డౌచుండు ప్రీతినే), (తా.పా.), 5. యెట్టి వానికే, (తా.పా.), 6. యట్టివానికే, (తా.పా.), 7. వెల్గుచునుండునా యట్టివానికే, (తా.పా.), 8. శోభల సృష్టి నొనర్చియుండి సంతతమతి, (తా.పా.), 9. ధన్యుఁ డహింసకుఁ డౌత మాకు. (తా.పా.)

(10)*గద్యము॥
ఓ ప్రజాపతీ! నీకంటె నన్యుఁ డెవ్వఁడును బ్రథమ వికారములను బొందిన నీ సమస్త భూతములను బొందలేదు. (నీవే వీనిని సృజించుచున్నావు!) మే మే ఫలముఁ గోరుచున్నవారమై నీకు హవిస్సుల నిచ్చుచున్నామో! యా ఫలము మాకుఁ గలుఁగుఁగాక! మేముకూడ ధనేశ్వరుల మగుదుము॥ 4022

## సూక్తము—121

ఋషి—ప్రాజాపత్యుఁడైన హిరణ్యగర్భుఁడు
దేవత—"క"శబ్దనామము గల ప్రజాపతి

## అర్థాంతరము—1

†(1) ఆ హిరణ్యగర్భుండె అలరార నగ్రిన
సర్వ విధ పృథ్వ్యాళి సకల ద్యో లోకాల
గోళాల నన్నింటి నేలుచున్ ధరియించి
ఆకాశ మనిలాల ననల జల మృత్ పంచ
భూతాల జాతమై పొలుపొందు విశ్వానఁ
జరాఽచరమ్ములకు జడాఽజడమ్ములకు
నేకైక పతిగాఁగ నెసఁగు నా దేవుని
నభినుతించి హవిషాళి నర్చింతు మెల్లపుడు ॥ 4023

†(2) సర్వాత్మల నెవ్వఁ డొసఁగు సకల బలా లెవ్వఁ డిచ్చు
నఖిల విశ్వ మే దేవుని నర్చించును నుపాసనల
నమృతత్త్వము మృతితత్త్వము నలరు నెవని ఛాయ లౌచు
శాస్తగాఁగ నే దేవుఁడు శాసించుచు నడుపు సృష్టి
దిక్కాలా లలరంగా దివ్య శక్తు లమరంగా
నా దేవుని నుపాసనల నర్చింతుము హవిషాళుల ॥ 4024

†(3) ఏ దేవు శక్తితో నెల్ల సృష్టియు మించి
ప్రాణవంతమ్మౌచు వరలుచునుండునో,
కాలబద్ధ మ్మౌచుఁ గ్రాలుచునుండునో,
యే దేవు శక్తితో నెల్ల గోళ లోకాలును
శక్తివంతమ్ములై సమైక్యతన్ దిరుగు
నె దేవదేవుండు నిహపరమ్ముల వెలుఁగు
నే దేవదేవుండు నెసఁగు చతుర్దిశల
నా దేవుని హవిషాళుల నర్చింతు మెల్లప్పుడు ॥ 4025

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహోద్యమ, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(4)†అష్టపదకందము ॥
హిమగిరి గిరు లెవని వశముః
సముద్రజాలమ్ము నదులు సకల మ్మెవ్వా
ని మహిమ నిలుచు దిశలఁ బా
పు మూర్తులై యే మహితున కొప్పునొః ఆ దే
వ మహితునకు హవిషాళుల
నమలినగతి విధివిధాన నర్చనల నొన
ర్తుము సృష్టి సర్వ విశ్వము
నమృత విష బహుళ పదార్థ మా దేవుఁడుగా ॥ 4026

†(5) ఎవని మహిమతో విశ్వ మ్మెల్లఁ దిరుగుచుండు సదా
యెవని శక్తి నగ్ని రూపపు టిన గోళాల్ మండుచుండు
నెవని మహిమఁ బృథ్వ్యాదులు నెల్ల లెనసి యెనఁగుచుండు
నెవని దీప్తి శోకరహిత భువననాక మలరుచుండు
ధూళిగాఁగ ధూళి ధూసరమ్ముగాఁగ సృష్టి
నంతరిక్షమందుఁ దిరుగు నఖిలాఖిలాండమ్ముల
నణుపరమాణువు లన్నింటిని బాలించెడి
నా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడును ॥ 4027

†(6) ఏ దేవుని దివ్యశక్తి నెల్ల సృష్టి వరలుచుండు
దివిభువు లెల్లను రోదసిఁ దిరుగుచుండు నే శక్తిని
మనశ్శక్తి యే విధిగా మహిమాన్విత మౌను సృష్టి
దృక్‌చక్షులు మహితములై తేజరిల్లు నే గతిమైఁ
జంద్ర సూర్య గ్రహ ఋక్షాల్ సౌరు మీఱ నే శక్తుల
నుద్భవించు సృష్టిలోన నుజ్జ్వలమౌ శక్తులతో
నే దేవుం డసహాయత నెల్ల సృష్టి రక్షించును
నా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడును ॥ 4028

†(7) అతి బృహత్తర మౌచు నలరారెడి విశ్వసృష్టి
ననంతగతుల సృష్టించుచు నగ్ని దీప్త లొప్పారఁగ
హేలగాఁగ జలరాశిని గేళి సల్పు దేవదేవుఁ
డాకాశ మ్మనిలాలను ననల జల మృత్తతులను

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

బుట్టించుచుఁ బాలించుచుఁ బూర్ణముగా ధరియించుచు
దివ్య దేవతాళి కెల్ల దేవుఁడుగా వెల్గొందుచు
నేకైకుండౌచుఁ దనరు నేకైకేశుని దేవుని
హవిషాళుల నెల్లపుడును నర్చింతు మ్మతిభక్తిని ॥† 4029

†(8) ఉష్ణ శీతలంపుశక్తు లుద్భవింపఁజేసి సృష్టి
ననిలాఽనల జల శక్తుల నాకాశపు మృత్తతులను
మహిమాన్విత శక్తులుగా నహరహమును వర్తిల్లఁగ
నణుపరమాణువు లఖిలమ్ముల నధిపతిగాఁ బాలించుచుఁ
బ్రకృతిమాత తత్త్వాలను ప్రకర్షరూప వర్తనముల
సృష్టించుచు రక్షించుచుఁ జెన్నొందఁగఁ జేయునట్టి
ఏకైకదేవుఁ డౌచును నెల్లఁడుగా వెల్గొందెడి
నా దేవుని నర్చింతుము హవిషాదుల నెల్లపుడును ॥ 4030

(9)†అష్టపదకందము ॥
సత్యము ధర్మము వరలఁగ
నిత్యము దివిభువితతిని విసీతగ దైవ
ప్రత్యయగతి వర్తిల్లఁగ
మృత్యంతర మొప్ప నమృత ఋత శక్తులమైఁ
గృత్యాఽకృత్య విసృష్టిజ
మత్యమల శశికళ సూర్య మహిమాఽన్వితమై
అత్యంతము వరల మహిత
సత్యుని నర్చింతుము హవిషాళుల నెపుడున్ ॥ 4031

†(10) హే ప్రజాపతిదేవః యీ సర్వ విశ్వమున్
సృష్టించి నిలుపుదువుః చెన్నొందఁజేసెదవుః
పెంపొందఁజేసెదవుః విశ్వాత్మగా వెలిఁగి
అన్యోఽన్య సంబంధ మనుబంధ బంధాల
నవినాభావాల నపురూప గతులతో
నఖిలాఽఖిలమ్మైన లోకాల ననంత గోళాల
కధిపతిగఁ దనరారి అజయ్య రక్షణల
నమూల్య సంపదల ననుగ్రహింతువుః నీవుః ॥ 4032

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—121

ఋషి—ప్రాజాపత్యుఁడైన హిరణ్యగర్భుఁడు
దేవత—"క"శబ్దనామముగల ప్రజాపతి

### అర్థాంతరము—2

†(1) అగ్నిగర్భుఁడై వెలిఁగెడి ఆ దేవదేవు క్రియ
అఖిల భూత రూపాలను నావరించి అవతరించి
విశ్వసృష్టి కధిపతిగాఁ బృథ్వీదివుల కధిపతిగా
సర్వసృష్టి ధరియించుచు సకలమ్మును భరియించుచు
నేకైకుండౌ పతిగా నెల్లఁడుగాఁ దనరారుచు
సృష్టి స్థితి లయావళుల స్రష్ట కాఁగ ద్రష్ట కాఁగ
భర్త కాఁగ నలరారుచు వరలుచు నఖిలేశుండౌ
నా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4033

†(2) నకలాత్మల ధారకుఁడై సకల బల ధారకుఁడై
సృష్టిలోక గోళ జాల వ్యష్టి సమిష్టి కాల రూప
ధారకుఁడై దారకుఁడై వరలు మహా పాలకుఁడై
మృత్యువుకే మృత్యువుగా మిన్ను నిండు నమృతశక్తి
నతిలోకపు దీప్తులతో నతివేలపు శక్తులతో
దివ్యదేవతాళి కెల్లఁ దేజరిలెడి నమరత్వము
నమృతత్వము నమలత్వము ననుగ్రహించు దివ్యదేవుఁ
డా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4034

†(3) ప్రాణ కాల బద్ధ మౌచు బహురూపాళుల వరలెడి
విశ్వలోక గోళ తతులు నశ్వీశక్తు లలరుచుండ
దృశ్యాఽదృశ్యమ్ము లౌచుఁ దేజరిల్లు సర్వస్వము
వశ్యశక్తి సత్యరూప భాగ్య మౌచు వర్తిల్లఁగ
ద్వైతాఽద్వైతమ్ముగాఁగ ద్వంద్వగతుల సృష్టి యెల్ల
నాలుగు పాదమ్ములతో వేల లెనయసట్టి కాల
నిత్య సత్య ధర్మ మొప్ప నిఖిలేశుండై తనరెడి
ఆ దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4035

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఏ దేవుని మహిమలతో హిమగతులను గోళము లగు
నే దేవుని మహిమలతో నెసఁగు నగ్ని గోళతతులు
నే దేవుని మహిమలతో నెల్ల సృష్టి రసమయమౌ
నదీనదము లొప్పారఁగ జలధు లెల్ల నలరారఁగఁ
జతుర్దిశలు బాహువులై చదలునఁ దిరుగాడునట్టి
సర్వ గోళ లోక జాల సర్వస్వము రక్షించుచుఁ
గాలగతుల నడుపుచుండి కాంతిలఁ జేయు నే దేవుం
డా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4036

†(5) అఖిలాగ్నుల జ్వాలలతో నత్యుగ్రమ్మై వెలిఁగెడి
సూర్యాది మహాగ్నిగోళ శుభ్ర దీప్తి వర్ధిల్లఁగ
మృద్వ్యాప్త విశాలమ్మౌ పృథ్విగోళ లోకాలను
శోకరహితమై వరలెడి నాకలోక తతు లన్నిటి
వివిధమైన వైశాల్యజ బృహదల్పగ రూపాలను
నణుపరమాణుతతుల నంతరిక్షమందు నలరు
నన్నింటిని నదుపాజ్ఞల నలరారఁగఁ జేసి నడుపు
నా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4037

†(6) మహిమాన్వితమై వెలిఁగెడి మానస సంకల్పముతో
అఖిలముతో పృథ్వితతుల ననంతమైన దివితతులను
రవి చంద్ర ఋక్ష గ్రహ రాజి నెల్ల సృష్టిగాఁగ
నావిష్కృతమ్ముఁ జేసి అవలీలగ నిలిపి నడిపి
సర్వమ్మును రక్షితముగ సంవర్ధన రతులతోడ
దివ్యకాలగతుల నిల్పి దీప్తమానమై వరలఁగ
విశ్వసృష్టి నెల్ల నడుపు నశ్వశక్తిరూపదేవుఁ
డా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4038

†(7) ప్రకృతిమాత బృహద్విశ్వ ప్రసవగతుల వరలంగా
నీళ్ళు పోసికొనుచు నే నిఖిలేశుని మాయ లీల
గర్భధారణమ్ము చేసి కాంతి ఉబ్బుచుండు నహా
యే దేవుని మహిత శక్తి నీ సృష్టి విశాలగతుల

---

†రచయిత: —వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నతిలోకపు వీర్య రతుల నగ్ని శక్తు లలరారఁగ
నావిష్కృతమై తోడ్తో నవినాభావ బంధములను
సచ్చిదానంద రతుల సర్వ సంపన్న మౌను
ఆ దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥† 4039

†(8) సృష్టియజ్ఞ సర్వమ్మున సృష్టసృష్ట శ్రేష్ఠ కాఁగ
మహితతత్త్వ శక్తులతో మర్మధర్మ దక్షతతోఁ
జిచ్ఛక్తియె జల మౌచును జిద్విలాస గతులు మీఱ
సద్గతులను నానందపు సంపద లవి వరలంగా
విశ్వసృష్టి జనియించును విమలగతుల వర్తిల్లును
ధరణధారణమ్ము లలరు భరణభారణముల్ తనరు
నే దేవుని దివ్యశక్తి నే దేవదేవు శక్తి
నా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4040

†క॥ జలశక్తుల రూపముతో
ఛలతత్త్వ విరహితగతి విశాల మ్మొచున్
అలరెడి చిచ్ఛక్తి హరిని
చలమున నా దేవు నర్చ సల్పెదము సదా ॥ 4041

†(9) సౌరకాంతి ఉష్ణరతులు కారణానఁ జందమామ
చల్లని వెన్నెల లిచ్చుచు నెల్ల ఋతువులు దివు లలరఁగ
జలశక్తులు వర్ధిల్లఁగఁ జడలఁ దిరుగు విశ్వమ్మున
దేవదేవ విశ్వరూప దివ్యసత్య ధర్మశక్తి
నంతరిక్షమంచుఁ దనరు ననేకానేకమైన
బృహత్ సూర్య చంద్రగోళ వితతు లెల్ల విరాజిలఁగ
నగ్నిశక్తితత్త్వమ్మును నమరఁగ జలతత్త్వమ్మును
నే దేవుని శక్తిఁ బుట్టు నే శక్తిని నిలిచి నడుచు
నే దేవుని శక్తితోడ నెల్ల గతుల వర్ధిల్లును
నా దేవుని నర్చింతుము హవిషాళుల నెల్లపుడున్ ॥ 4042

†తే॥గీ॥ చంద్రశక్తులఁ బ్రభువు లతంద్రమైన
ప్రాణ సంజీవ తత్త్వాలు వర్ధిలంగ
నిత్య చైతన్య రూపమై నిరత రతుల
నిల్పు దేవు నర్చింతు మనల్పగతుల ॥ 4043

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(10) విశ్వసృష్టి గోళలోక వితతి నెల్ల సృష్టించుచుఁ
ప్రజాపతిగ నధిపతిగా రాజిల్లెడి దేవదేవః
అండపిండ బ్రహ్మాండము లన్నింటికి నధ్యక్షుఁడ
వై వరలెడి విరాడ్రూపః అఖిలజనకః అఖిలేశ్వరః
నీవు లేక యీ విశ్వము నిఖిలమ్మును నిలువఁబోదు
అన్యోఽన్యానుబంధము లవినాభావ సంబంధము
లలర నాత్మప్రదక్షిణల నధిపతి ప్రదక్షిణలఁ
బరిభ్రమణఁ జేయలేవు చరింపలేవు క్రమగతులను
గోళతతులు లోకతతులు కాలము నణుపరమాణువులు
ప్రకృతి సంపదాళులకుఁ బ్రభు లౌదుము నీకృపమై ॥ 4044

†ఆ॥వె॥ నీవు కారణముగ నిఖిల గోళమ్ములు
లోకతతులు దివ్య లోలుపతలఁ
దిరుగుచుండు నెట్టి దేవదేవుని కృప
నర్చనలను జేతు మట్టి దేవు ॥ 4045

## సూక్తమ్—122

ఋషిః—చిత్రమహా వాసిష్ఠః
దేవతా—అగ్నిః
ఛందః—జగతీ; 1, 5-త్రిష్టుప్

(1) వసుం న చిత్రమహసం గృణీషే వామం శేవమతిథిమద్విషేణ్యమ్ ।
స రాసతే శురుధో విశ్వధాయసో ఽగ్నిర్హోతా గృహపతిః సువీర్యమ్ ॥ 1395

(2) జుషాణో[1] అగ్నే ప్రతి హర్య మే వచో విశ్వాని విద్వాన్ వయునాని సుక్రతో ।
ఘృతనిర్ణిగ్బ్రహ్మణే గాతుమేరయ తవ దేవా[2] అజనయన్నను వ్రతమ్ ॥ 1396

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. జుషాణోఽఅగ్నే, 2. దేవాఽఅజనయన్. (ప్రా.ప్ర.)

(3) సప్త ధామాని పరియన్నమర్త్యో దాశద్దాశుషే సుకృతే మామహస్వ ।
సువీరేణ రయిణాగ్నే స్వాభువా యస్త[1] ఆనట్ సమిధా తం జుషస్వ ॥ 1397

(4) యజ్ఞస్య కేతుం ప్రథమం పురోఽహితం హవిష్మన్త[2] ఈళతే సప్త వాజినమ్ ।
శృణ్వన్తమగ్నిం ఘృతపృష్ఠముక్షణం వృణన్తం దేవం వృణతే సువీర్యమ్ ॥ 1398

(5) త్వం దూతః ప్రథమో వరేణ్యః స హూయమానో[3] అమృతాయ మత్స్వ ।
త్వాం మర్జయన్ మరుతో దాశుషో గృహే త్వాం స్తోమేభిర్భృగవో వి రురుచుః ॥ 1399

(6) ఇషం దుహన్త్సుదుఘాం విశ్వధాయసం యజ్ఞప్రియే యజమానాయ సుక్రతో ।
అగ్నే ఘృతస్నుస్త్రిరృతాని దీద్యద్వర్తిర్యజ్ఞం పరియన్త్సుక్రతూయసే ॥ 1400

(7) త్వామిదస్యా[4] ఉషసో వ్యుష్టిషు దూతం కృణ్వానా[5] అయజన్త మానుషాః ।
త్వాం దేవా మహయాయ్యాయ వావృధురాజ్యమగ్నే నిమృజన్తో[6] అధ్వరే ॥ 1401

(8) ని త్వా వసిష్ఠా[7] అహ్వన్త వాజినం గృణన్తో[8] అగ్నే విదథేషు వేధసః ॥
రాయస్పోషం యజమానేషు ధారయ యూయం పాత స్వస్తిభిః సదా నః ॥ 1402

1. యస్తఽఆనట్, 2. హవిష్మన్తఽఈళతే, 3. మానోఽఅమృతాయ, 4. త్వామిదస్యాఽఉషసో, 5. కృణ్వానాఽఅయజన్త, 6. నిమృజన్తోఽఅధ్వరే, 7. వసిష్ఠాఽఅహ్వన్త, 8. గృణన్తోఽఅగ్నే. (వా.ప.)

## సూక్తము—122

ఋషి—వసిష్ఠపుత్రుఁడు చిత్రమహస్సు†
దేవత—అగ్ని†

(1)*గీ॥ అగ్ని వననీయ సుఖకరు నగ్ని చాయ
నీయ తేజస్సు వినుతింతు నెలమి నేను
వహ్ని శోక నివారక వర్ణనీయ
గోవులను వీర్యమును గడుఁ గూర్చుచుండు ॥ 4046

*గీ॥ అగ్ని హోత యగుచు నమరాళి కాహ్వాత
యగుచు యజ్ఞకరుల యఖిల సదన
ములకు నీశుఁ డగుచుఁ బూర్ణ శోభన వీర్యుఁ
డగుచు వెలుఁగుచుండు నంతటఁ గడు ॥ 4047

(2)*గీ॥ తెలియఁగలయట్టి యంతయుఁ దెలిసికొనుచు
వెలుఁగుచున్ నీవె యంతటఁ గలుఁగఁబట్టి
యనలుఁడా! ప్రియమానుఁడ వౌచు నాదు
స్తుతుల నీ వాలకింపుమా! సురుచిరముగ ॥ 4048

*గీ॥ ఘనతరేంద్రాది [1]దేవతలన్ కరుణఁ బూని
ఫలములను బుట్టఁజేసిరి పరమ ప్రీతిఁ
గాన యజమానునకు నగ్ని! మాన కీవు
యజ్ఞముసుఁ బొందఁజేయుమా! యతిశయముగ ॥ 4049

(3)*గీ॥ సప్త సంఖ్యాక తలముల సప్త జిహ్వ!
మరణ రహితుఁడవై నీవు కరము హవ్య
మును నొసంగెడువానికి మోద మలరఁ
గాంక్షిత ధనంబు నొసఁగుము! కరుణఁబూని ॥ 4050

†వ్రాతప్రతి 14వ సంపుటము 135వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వసిష్ఠపుత్రుఁడు చిత్రమహస్సు"గాను, దేవత "అగ్ని"గాను వ్రాసి, 15bసంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "చిత్రమహ" ఋషిగాను "అగ్ని" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నిండ్రగణమునకు మారు "భగురువు" ప్రయుక్తమైనది.

*గీ॥ అతిసమింధన సాధనంబైన యిధ్మ
మున మహానలః నినుఁ బొందు జనుని నీవు
వీర పుత్రాంచితం బగు విపుల ధనము
తోడ సేవింపుమాః ప్రీతిఁ గూడి మిగుల ॥ 4051

(4)*సీ॥ యాగంబు సూచింప నరుగుచుండెడువాని నమరు ముఖ్యుండయి యమరువాని
ఘన పురోహితుఁడయి కాంక్షలుచుండెడువాని బల విరాజితుఁడయి వరలువాని
సస్మత్స్తుతుల నెల్ల నాలకించెడువాని దీప్తాంగుఁడై కడుఁ దిరుగువాని
యాగమూలంబున నతివృష్టి నిడువాని ధనముల యజమానుఁ దనుపువాని
గీ॥ మంగళాంచిత ధనమును మనుజ వరుల, కిచ్చువానిని సంతుష్టి నిచ్చు నగ్ని
సప్త హోతలు [1]హవ్యంబుఁ జాలఁగొనుచు, సన్నుతించుచున్నారు చాలఁ బ్రీతి ॥ 4052

(5)*గీ॥ అగ్ని దూత కర్మయందు ముఖ్యుండవై
భజన లందుచుండి పరమ ప్రీతి
నమృతమునకు నస్మదాహూయమానుండ
వగుచుఁ దృప్తి నొందు హవ్యములను ॥ 4053

*గీ॥ వైద్యుత స్వరూప వర్తమానుని నిన్ను
శంక లేక సుర లలంకరింతురు
హవ్య మొసఁగువాని నావసథంబున
వెలుఁగఁజేయుచుందురు విమల వహ్ని ॥ 4054

(6)*గద్యము ॥

ఓ సుకర్ముఁడాః యగ్నిః దేవతలను బ్రీణింపఁజేయు యజమానునికొఱకు సర్వధారయిత్రియు, సుదుఘయు, యజ్ఞరూపిణియు నగు గోవును యాగరూప వయస్సును బితుకుచున్నావుః నీవు ఘృతస్నాతుఁడవుః పృథివ్యాది స్థానత్రయమును దీపింపఁజేయు వాఁడవుః అనుష్ఠీయమాన యజ్ఞమును గనుఁగొనుచు నా యాగనిష్పత్తికొఱకుఁ బ్రవర్తించుచున్నావుః ॥ 4055

(7)*చ॥ జనులు ప్రభాతమందుఁ గడు సంతస మొప్పఁగ సర్వ దేవతా
గణమునకున్ సుదూతగఁ బ్రకల్పనఁజేసి నుతింతురు నిన్ను నో
యనలుఁడః నీకుఁ బూజలను నందఁగఁజేయ సుహవ్య మెల్ల నీ
తనువున [2]నుంచుచుండెదరు తాము సురల్ బహుభక్తి యుక్తులై ॥ 4056

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. యఖిలదానాది యుక్తుని నగ్నిదేవు, (తా.పా.), 2. నుంచుచున్ మిగుల ధన్యులు కారె సురల్ తలంపఁగన్.(తా.పా.)

(8)●గీ॥ ఈ వసిష్ఠకుమారకు లిష్టులందు
నిన్ను నుతియించుచున్నారు సన్నుతాంగ!
యతిముఖ్యుల మగు మాకు నధికమైన
ధన సమృద్ధి నొసంగుము! ధర్మ నిష్ఠ ॥ 4057

## సూక్తము—122

ఋషి—వసిష్ఠపుత్రుఁడు చిత్రమహస్సు
దేవత—అగ్ని

### అర్థాంతరము—1

†(1) అనలరూప దివ్యశక్తి నమేయమైన రూపాలను
నతిలోకపు వీర్యశక్తు లద్భుతావహములుగా
సప్తవర్ణజాలాలను గుప్తవసుసంపదాళు
లలరుఁ జిత్రరీతు లొప్ప ననంతైశ్వర్యములుగా
మణులుగాఁగ రత్నాలుగ మహిత రజిత హేమాలుగఁ
బనలు మించు రసశక్తుల పరిణతులను వర్ధిల్లుచు
నిత్య నవ్యమై మెరిసెడి సత్య దివ్య ప్రకృతి భాగ్య
వైభవమ్ము లొప్పుచుండుఁ బ్రభాభాసితములుగాఁగ ॥ 4058

†— సర్వ రక్షక మౌచు సర్వ శిక్షక మౌచు
సర్వాంతర్యామిగాఁగ సచ్ఛక్తుల వరలుచుండి
శుచిగాఁగను విశ్వదీప్త రుచిగాఁగను వెల్గుచుండి
వనసీయమ్మౌ హోతగ వరణీయమ్మై నిలుచుచుఁ
గంటిలోను నొంటిలోను నింటిలోను మింటిలోను
దృక్పతిగా గాత్రపతిగ గృహపతిగా గ్రహపతిగా
సృష్టి బహుళ పదార్థాల వ్యష్టి సమిష్టి గతు లలరఁగ
నగ్నిశక్తి సమకూర్చును నమేయమైన రీతులమై ॥ 4059

†(2) చరాలకు నచరాలకు జడాలకు నజడాలకు
వివిధ గోళ తతుల కెల్ల విపులలోక జాలాలకు
గ్రహనక్షత్రశులకును గ్రాలు నుపగ్రహాళులకు
ధూమకేతు పుంజాలకు దుర్విదగ్ధ శకలాలకు
నంతరిక్షమందు నగ్ని అలరించును దీప్తశక్తి
సర్వవిష హారకమై శాంతి సౌభాగ్యద మౌ ॥ 4060

†రచయిత;—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ బహువిధమౌ "వయు" శక్తుల
నహరహము సుకృత మహా పదానుసరణముల్
ముహురంతర శబ్దజ సుప్రి
తిహార్యము లగుచుఁ దగు శుచి దేవ పరములై ॥ 4061

†(3) సప్తవిధమ్మౌ శక్తుల సుప్తరూపతతులు కాఁగ
సప్తాఽనిల రూపాలను సప్తనలిల రూపాలను
సప్త పృథ్వీ భేదాలను సప్త గగన తలములందు
సప్త వర్ణ భేదాలను సుప్త దీప్త శక్తులతో
సమర్త్యమైన సుకృతాలను సతిలోకమ్ముగ నింపుచు
నాహారము సమిధ కాఁగ సతివేలపు వీర్యశక్తి
నపారముగ నమేయముగ సువీరాశి కొనఁగుచుండ
స్వాభవమ్ము కాఁగ నగ్ని సర్వమ్మున వెల్గుచుండు ॥ 4062

†(4) సప్తవిధమ్మైన కీల శక్తు లెల్ల వరలంగా
సృష్టియజ్ఞమందు సదా వెలఁగుచుండు మహితముగా
తొలిశక్తిగ మలిశక్తిగ వెల తెలియని బలిదీప్తిగ
వహరతులను దేవదేవు వాహగతుల దౌత్యమ్ముల
నతులితమౌ సువీర్యమ్ము హవిస్సులను వృద్ధి పొంద
శబ్దధారకమ్ముగాఁగ సర్వానిల వృష్ఠగతుల
జ్వలితముగా ననల మ్మది జగతులలో విజృంభించు
సృష్టిని దొలి పురోఽహిత త్వష్టగాఁగ నిరతముఁదగు ॥ 4063

†(5) అగ్ని దీప్తులను నరుణుఁడు సఖిలమ్మున నలరుచుండు
అమృతశక్తు లుద్భవింప సతిలోకపు శక్తులతో
రుచ్యములై దివ్యశక్తి శుచ్యగ్నులు వర్తిల్లును
హోమాగ్నుల వెలుఁగునట్టి క్షేమంకర హవిషాళులు
భుగభుగలై భగభగలౌ ఒగణితమౌ నగ్నితతుల
స్తోమతలే విశ్వమునకు సామంతము లౌను సృష్టి
దివ్యదేవదేవు [illegible] జ్ఞఁ దేజమ్ముల వర్తిల్లును
శబ్దశక్తి సమూహాల జ్వలిత మౌను నగ్ని సదా ॥ 4064

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) వర్తమాన యుత శక్తిని భావి భూత యుత శక్తుల
విశ్వ సృష్టిలోన నగ్ని విమలమ్ముగ వెల్గుచుండు
సృష్టి యజ్ఞ ప్రియరూప మిష్టాపూర్తమ్ముగాఁగ
సృష్టి యజ్ఞకర్త చేయు సుకృతముగా బహుముఖమై
దివిభువులను సర్వమ్మునఁ దేజరిలుచు నిత్యమ్మును
నంతరిక్షమందు నలరి అపూర్వంపు దీధితులను
క్షేమంకరమౌ కర్మల సేవ్యమాన మౌచు జగతి
సర్వలోక గోళ జాల సర్వస్వము తనరంగా
సత్ఫలాల నొసఁగుచుండి సదమలమౌ కాంతు లీని
త్రివిధమ్ములఁ ద్రిరూపాలఁ ద్రికాలాలఁ బ్రజ్వలిల్లు ॥ 4065

†(7) విశ్వ మహా సృష్టి స్థితి విమలాధ్వర సత్వగతుల
మనుకాలపుఁ జైతన్యపు మాన్య మైన జీవకోటి
నగ్ని దౌత్య మొనరించుచు నపురూపపు శక్తులతో
నుషోదయా లాదిగాఁగ నుజ్జ్వలమౌ తేజాలను
నఖిలగోళ లోకతతుల నపూర్వముగ విలసిల్లఁగ
నతిలోకపు దీప్తులతో నతివేలపు శక్తులతో
ఖరకర కిరణుని కాంతుల నపుణుండౌ నిత్యమ్మును
నుజ్జ్వలగతి రోదసిలోఁ బ్రజ్వలించి వెలుఁగు లిచ్చు
నవారితంపు దీప్తులతో దివాకరుండుగా వరలుచు
ననలదేవః సృష్టిలోన నపుమవులేః ఆధారము ॥ 4066

†(8) ఓ అనలదేవుఁడా! ఓ జ్వలనదేవుఁడా!
అతిపవిత్రమ్మైన అత్యంత శుచి శక్తి
అఖిల సృష్టిని నిండి అద్భుతముగా వెలిఁగి
విశ్వమ్ములో వరలు వివిధ పదార్థాల
అంతరాంతరగతుల నఖిలమ్మునను నిండి
స్వస్తి కూర్చఁగ విశ్వశక్తిగా వర్ధిల్లి
సృష్టి మహేష్టిలో స్త్రేష్ట పూర్తమ్ముగ
నతిశక్తివంతమ్ముగ నఖిలమ్ము రూపొంద
వికృతి రహితమ్ముగాఁ బ్రకృతి సత్యము నిలువ
సుకృత శక్తుల నగ్ని శుచిరూపమై వెలుఁగు ॥ 4067

†రచయిత—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—122

ఋషి—వసిష్ఠపుత్రుఁడు చిత్రమహస్సు
దేవత—అగ్ని

## అర్థాంతరము—2

(1)†అష్టపదకందము ॥

వసు శక్తులు సంపదలుగ
నసమగతుల విశ్వగోళ నానా లోకాల్
వసిఁ దనరఁగ మహిత గతుల
నసదృశమౌ గతిని విశ్వ మఖిల భరిత మౌ
రస మెదలని గతి సద్రూ
ప సృష్టి యజ్ఞక్రియతతి పూర్ణ మ్మౌచున్
వినమును నమృతము వెలుఁగులు
మసురుఁ దిమిర పుంజములు సమూలము లౌచున్ ॥ 4068

†— అగ్ని గృహపతిగాఁగ నలరారు జగతి
అగ్ని యౌ లోకపతి అగ్ని మండల పతిగ
సృష్టిపతిగా నగ్ని సృష్టేష్టిపతిగాఁగ
వామశక్తిగ నగ్ని ఫాలాక్షమై వెల్గుఁ
గుడి యెడమ కనులుగాఁ గడిఁది రవి శశు లలర
నుష్ణశీతల రూప వైష్ణవీయాగ్ను లగు
విశ్వధారక మౌచు నశ్విధారక మౌచు
నలరారు నిత్యమ్ము నతిశుచ్య దీప్తాగ్ని ॥ 4069

†(2) హే దివ్యదేవాగ్ని! యీ సర్వవిశ్వాన
నిత్య నవ్య మ్మౌచు సత్యధర్మమ్ములను
శబ్ద శక్తులు వరల సంజ్వలన దీప్తులన్
సచ్చిదానందాల సర్వమ్ము తనరార
నంతరాంతర గతుల నవ్యరూప శక్తులన్
ననురూప గతులతో నఖిలమున్ నిండుచున్
జ్ఞానమై జ్ఞాతమై జ్ఞాతవ్యమై వరలు
బ్రహ్మ తేజస్సులను బ్రహ్మాండములు నిండి
అమృతేష్టులను సృష్టి సమరశక్తుల నలరి
దేవాళి హవిషాళి జీవికగ వరలెదవు ॥ 4070

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) సప్తధామాలుగాఁ జడ లెల్లఁ దనరారు
సప్తధామాలుగా సకలాఽనిలము లలరు
సప్తధామాలుగా సలిలాలు విలసిల్లు
సప్తధామాలుగా వ్యాప్త మృత్‌తతు లొప్పు
సప్తధామాలుగా సప్త జిహ్వాలు మీఱ
సప్త జ్వాలలు మీఱ సప్త కీలలు మీఱ
సప్త వర్ణాలతో సప్తాగ్ను లలరారు
సృష్టి పదార్థాలు చెలఁగఁగా సమిధలై
ఇష్టిగా విశ్వమ్మె సృష్ట క్రియగాఁ దనర
సుకృత ఫలిత మ్మొచుఁ బ్రకృతి వరఁగుచునుండు ॥ 4071

†(4) అగ్ని తొలి పురోఽహితుఁడుగ నగ్న మైన యజ్ఞమ్మున
నిత్య కేతు వౌచు జ్వాల సత్యదీప్త లొప్పంగా
సప్తాఽనిల వాజినాల సప్తాఽనల భాజనాల
హవిషాళులు వరలంగా నఖిల సృష్టి యజ్ఞ మలరు
శబ్దగ్రాహక శక్తులు జ్వలియింవగ సర్వాగ్నులు
ధృతదీప్తులమై జగతిని నతులిత శక్తుల వెల్గును
దేవతాళి వీర్యముగా దివ్యమైన బలముగాఁగఁ
బ్రకృతిపురుష బాహ్యాంతర సుకృత వీర్యశక్తిగాఁగ
సృష్టిలోన సంపదలై చెల్వొందును నసలమ్ములు
శుచిదీప్తులు వరలంగా రుచిరూపులు తనరంగా ॥ 4072

†(5) ప్రథమ వీర్యవంతమైన భాసమాన దౌత్య గతిని
విశ్వసృష్టి నగ్ని దేవుఁ డశ్విశక్తు లలరారఁగ
నమృత ఋత తేజాలను నతిలోకపు శక్తులతో
సప్త మరుత్‌తతులు మీఱ సకలపెశ్వ మావరించి
ఆకసమ్ము సలిలమ్ముల నావహించి మృత్‌తతులను
నపురూపమ్మౌ శక్తుల నన్నింటిని నాక్రమించి
అంతరాంతర గతులను సకృత్య కృత్య రతులు వరల
నసమానపు రూపాలను నసమగతుల సమగతులను
నఖిలమ్మున నలరు నగ్ని అసాధారణంపు రీతి
విశ్వపదార్థాళు లెల్ల విమలగృహములై వరలఁగ ॥ 4073

---

†రచయిత:—వాఙ్మయమహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) యజ్ఞప్రియుఁడై వెల్గెడి అఖిలేశుని సుకృతముగా
అగ్ని తనరు సృష్టిలోన నసాధారణంపు గతుల
యజ్ఞకర్త భర్త కాఁగ విజ్ఞానపు దీప్తు లలర
సత్యమ్ములు నిత్యములై సర్వసృష్టి తనరారఁగ
ఆతసమున గోళాళులు నలర ధారకములుగాఁగ
నగ్ని శక్తి జ్వాలలుగా నఖిలమ్మున వెలుఁగు లిచ్చి
ప్రకృతిమాత జాగృతిగా సుకృత దీప్తు లలరారఁగ
నిత్య చైతన్య రతుల నిస్తుల వీర్యమ్ము వరల
సచ్చిదానందమ్ముల సకల సృష్టి భాసిల్లును
భూత భావి వర్తమాన పూర్ణకాల గతులు నిండి ॥ 4074

†— విశ్వమ్మును ధరియించును నశ్వి శక్తి మేల్మి గాఁగ
యజమానుని శక్తులతో నజరమైన నగ్ని శక్తి
అద్భుతగతి వర్తిల్లును నమృతగతి వర్ధిల్లును
ఋత శక్తిగ నిత్యమ్మును ద్రికాలాల ధృతసృష్టుల ॥ 4075

†(7) మనుకాలపు మహితత్వము లనల శక్తు లెల్ల వెలుఁగ
సుషోదయాల్ దూతలుగా సృష్టిఁ దనరు నిత్యమ్మును
విశ్వసృష్టి యజ్ఞమ్మున విమలాగ్నులు సత్యములై
బహురూపుల వర్తిల్లును నహరహమ్ముఁ బ్రకృతిగతులు
ముహుర్ముహుర్జన్మలతో మోద సంవర్ధనాల
స్థితిగతులను లయగతులను జెల్వొందఁగ ననునిత్యము
సృష్టిపదార్థమ్ము లెల్ల నిష్టి కృతి నాజ్యములై
ననలమ్ముల నైక్య మౌను జనక జన్య భావమ్ముల
నాత్మైక్యముగా వరలుచు నగ్నీ! అఖిలమ్ముగాఁగ
సకల సృష్టి పాలితముగ సర్వాంతర్యామివిగా
సర్వాధిపత్యమ్మున సకల చరాऽచర ప్రపంచ
జడాऽజడమ్ముల నిలుచుచు జ్వలియింతువుః జ్వలనదేవః ॥ 4076

†— అగ్నిదేవా! నీవు అఖిల విశ్వమునందు
నద్భుత శక్తుల నలరారుచుందువే!
సృష్టి కాల జాలాలను జెలఁగు నధ్వరముగ నిలిచి
నిత్య స్థితి నొప్పారుదుః దౌత్య శక్తి వర్ధిల్లఁగ ॥ 4077

---

†రచయిత :—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) జ్ఞానకర్మ కలితముగా శబ్దశక్తు లలరారఁగ
నగ్నిరూపమైన శక్తి అఖిలమ్మున నలరారును
వేద కాఁగ బాధ కాఁగ సాధన శక్తుల వరలును
మేధస్సుకు మూల మౌచుఁ గోర్ధ్వాఽకోర్ధ్వగతులు వరల
నాపాతము శుచ్యమ్మై అపురూపపు దీప్తులతో
నోషశ్శక్తుల సృష్టిని నుజ్వల గతి నుత్తమ గతి
దరియించెడి నగ్నిరూపు లెరవు లౌను విశ్వమ్మున
సర్వ సృష్టి లోక గోళ జాల చరాఽచర ప్రపంచ
జడాఽజడా లన్నింటికి స్వస్తి ప్రసాదించు సదా
ఉష్ణ శక్తు లుజ్జ్వలగతి నుసురు లౌచు వరలంగా ॥ 4078

†—రుచివృత్తము ॥•
పతన మౌచు నగ్ని ప్రభలతో వెలుఁగు
జతన మౌచు నగ్ని జ్వలనుఁడై చెలఁగుఁ
బృతన శక్తి గాఁగ ఋతములై ప్రకృతు
లతులితంపు శక్తి నమరమై నిలుచు ॥ 4079

## సూక్తమ్—123

ఋషిః—వేనో భార్గవః
దేవతా—వేనః
ఛందః—త్రిష్టుప్

(1) అయం వేనశ్చోదయత్ పృశ్నిగర్భా జ్యోతిర్జరాయూ రజసో విమానే ।
ఇమమపాం సంగమే సూర్యస్య శిశుం న విప్రా మతిభీ రిహన్తి ॥ 1403

(2) సముద్రాదూర్మిముదియర్తి వేనో నభోజాః పృష్ఠం హర్యతస్య దర్శి ।
ఋతస్య సానావధి విష్టపి భ్రాట్ సమానం యోనిమభ్యనూషత వ్రాః ॥ 1404

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"శక్వరీ"చ్ఛందము. (14)

(3) సమానం పూర్వీరభి వావశానాస్తిష్ఠన్ వత్సస్య మాతరః సనీళాః ।
ఋతస్య సానావధి చక్రమాణా రిహన్తి మధ్వో [1]అమృతస్య వాణీః ॥ 1405

(4) జానన్తో రూపమకృపన్త విప్రా మృగస్య ఘోషం మహిషస్య హి గ్మన్ ।
ఋతేన యన్తో[2] అధి సిన్ధుమస్థుర్విదద్గన్ధర్వో [3]అమృతాని నామ ॥ 1406

(5) అప్సరా జారముపసిష్మియాణా యోషా బిభర్తి పరమే వ్యోమన్ ।
చరత్ ప్రియస్య యోనిషు ప్రియః సన్ త్సీదత్ పక్షే హిరణ్యయే స వేనః ॥ 1407

(6) నాకే సుపర్ణముప యత్ పతన్తం హృదా వేనన్తో [4]అభ్యచక్షత త్వా ।
హిరణ్యపక్షం వరుణస్య దూతం యమస్య యోనౌ శకునం [5]భురణ్యుమ్ ॥ 1408

(7) ఊర్ధ్వో గన్ధర్వో [6]అధి నాకే అస్థాత్ ప్రత్యఙ్ చిత్రా బిభ్రదస్యాయుధాని ।
వసానో [7]అత్కం సురభిం దృశే కం స్వర్ణ నామ జనత ప్రియాణి ॥ 1409

(8) ద్రప్సః సముద్రమభి యజ్జి[8]గాతి పశ్యన్ గృధ్రస్య చక్షసా విధర్మన్ ।
భానుః శుక్రేణ శోచిషా చకానస్తృతీయే చక్రే రజసి ప్రియాణి ॥ 1410

1. మధ్వోఽఅమృతస్య, 2. యన్తోఽఅధి, 3. గన్ధర్వోఽఅమృతాని, 4. వేనన్తోఽఅభ్య, 5. భురణ్యుమ్,
6. గన్ధర్వోఽఅధి నాకేఽఅస్థాత్, 7. వసానోఽఅత్కం, 8. యజ్జగాతి. (ప్రా.ప్ర.)

## సూక్తము—123

ఋషి—భార్గవుఁడైన వేనుఁడు†

దేవత—వేనుఁడు†

(1)*గద్యము ॥

వేనుఁ డగు మధ్యమస్థానదేవుఁడు ద్యోతమాన మేఘమధ్య నున్నాఁడు. ఉదక నిర్మాత యగు నంతరిక్షమున వెలుంగుచు వేనుఁ డాదిత్యునకు గర్భభూతములును నంతరిక్షస్థములు నగు నప్పులను బృథ్వినిగూర్చి ప్రేరేపించుచున్నాఁడు. శిశువును మాతా పిత్రాది బంధువులు స్తుతిపదములచే నుపలాలనముచేయునట్టు లుదకములయొక్కయు, సూర్యునియొక్కయు, సంగమమునం దీ వేనుని మేధావులు పూజించుచున్నారు ॥ 4080

(2,3)*గద్యము ॥

ఆకాశమందుఁ గల వేనుఁడు అంతరిక్షమునుండి జల సమూహమును నధోభాగమునకుఁ బడఁజేయుచున్నాఁడు. వేనుని సాధారణస్థానము నొంది అభితశ్శబ్దాయమానములై వత్సస్థానీయుఁ డగు వైద్యుతాగ్నికి మాతృభూతములై సమాన నిలయములై అంతరిక్ష భవములైన యప్పులు ఉన్నవి. అంతరిక్షమునఁ బ్రవర్తమానము లగు నుదక శబ్దములు ఈ వేను నలంకరించుచున్నవి॥ 4081

(4)*గీ॥ స్తోత లెల్లరు వేనుని పూత గర్జ
సంబు నాలించుచుండ్రు ముదంబుతోడ
కాన వేనుని రూపంబుఁ గనుచు వాని
సంస్తుతించుచునున్నారు సరస సూక్తి ॥ 4082

*గీ॥ ఉదకములఁ దాల్చు వేనుఁ డా యుదకములను
దెలిసికొనియుండుటంజేసి ధీరు లెల్ల
సత్య భూతేష్టిచే వాని సరసఁ జేరి
యిలను బొందుచునున్నారు జలము మిగుల ॥ 4083

(5)*గీ॥ అప్పులందుఁ గ్రీడకై చరించుచుఁ గాంతు
చెంత నవ్వుచుండి కాంత చంచ
లా మనోహరాంగి లరిఁ జారుని విధాన
వేనుఁ దాల్చుచుండె విపుల ప్రీతి ॥ 4084

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 139వ పుటలోను, 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలోను, నీ సూక్తమునకు ఋషి "వేనుఁడు" గాను, దేవత "వేనుఁడు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ ప్రియుని సుస్థానములయందుఁ బ్రీతిఁ దిరుగు
చుండు చంచల యను కాంత మెండు వేనుఁ
డామె కనుకూలుఁడై హిత మైన తనదు
మేఘమున[1] వెలుఁగుచున్నాఁడు మిక్కుటముగ ॥ 4085

(6)*చ॥ కనక వికారపక్షములఁ గల్గి సుపర్ణుఁడుగా వెలుంగుచున్
ఘన జల దేవదూత వయి కమ్రి నభస్సునఁ బక్షిరూపమున్
గనుచు సువృష్టిచేతను జగంబులఁ బోషణఁ జేయుచుండు నో
యనఘుఁడ! వేన! నిన్ను ననయంబు గనుంగొనుచుంద్రు పండితుల్ ॥ 4086

(7)*ఉ॥ స్వీయ మహాయుధంబులను జిత్రవిచిత్రములైన వానిఁ దాఁ
బాయక తాల్చి యూర్ధ్వమున భాసుర లీలఁ బ్రవర్తమానుఁడై
తోయములన్ ధరించు చతితుష్టిసి గూర్చుచు భూత పంక్తి న
త్యాయతమూర్తి వేను విభు వా దివమందు మెఱుంగుచుండెడున్ ॥ 4087

(8)*చ॥ ఘనతర తోయ బిందువులఁ గల్గి నభస్సున వెల్గుచుండి తా
మొనసి రసంబులం గడకఁ బొందఁగఁ గోరెడు సూర్యు కాంతిచే
తను విలసిల్లి మేఘమును దప్పక వేనుఁడు గాంచినప్పుడే
యనయము భానుమూర్తి కడు నంబువులం గలిపించుచుండెడున్ ॥ 4088

## సూక్తము—123

ఋషి—భార్గవుఁడైన వేనుఁడు

దేవత—వేనుఁడు

## అర్థాంతరము—1

(1)†ఆ॥వె॥ పితృదేవ పుత్రి ప్రేమలు వరలంగ
సౌర దీప్తికలనఁ జందుఁ డలరు
వరలు సూర్యుఁ డౌచు వైకల్పికమ్ముగాఁ
గాంతి విలసనములఁ గ్రాలుచుండి ॥ 4089

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నిందగ్రణమునకు మారు "పంచలఘు గణము" ప్రయుక్తమైనది.

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†— సౌరకాంతుల ప్రభల చారు శక్తులు మీఱ
నతిలోక వైరుధ్య ధృతి నుష్ణ వ్యతిరిక్త
స్వచ్ఛశీతల శ్వేత చంద్రకాంతులు వరలు
జగతిమతి వర్ధిల్ల జల సంగమము రీతిఁ
దరులతాతతు లెల్లఁ దరుణ శక్తుల వరల
సూర్య గర్భగ శక్తి సూక్ష్మరీతులఁ దనర
మిన్నులన్ దిరుగాడు మేఘ జాలాలతో
నమృత శక్తుల జలము లమితముగ వర్షించఁ
జరాఽచరా లెల్ల జడాఽజడా లెల్లఁ
ప్రాణవంతమ్ములై వరలుచుండును సదా ॥ 4090

†(2) సూర్యయోనిశక్తి వెలుఁగ నర్యమ రక్తులఁ బ్రకృతిఁ
జంద్రకాంతి పూర్ణదీప్తి సముద్రాలు పొంగిపోవ
నుచ్చలమౌ నూర్ములతో నుప్పొంగుచు నింగి నంటు
కాంతిసహిత కాంతిరహిత క్రాంతిశక్తు లలరారఁగ
వైకల్పిక సూర్యుఁ డౌచు వరలఁ బాక్షికంపు దీప్తు
లపరూపపు శక్తులతో నతివేలపు దీప్తులతో
నతిలోకపుఁ జల్లనైన శీతకాంతుల వెన్నెల లవి
విరిసి కురియు జగతిలోన విమల జనీనత వెలయఁగఁ
బ్రకృతిశక్తి వర్ధిల్లఁగ సుకృత సత్య శక్తులతో
నద్భుతమౌ వేన శక్తు లలరు శుక్లకృష్ణగతుల ॥ 4091

†(3) మాతృమూర్తి తన శిశువును మహిత ప్రేమ రూపు కట్టఁ
బెంచి పెద్దఁజేసి నిల్పి అంచితమౌ జీవనమున
నలరించెడి రీతి సృష్టి నలరు పంచభూతాఽఽళులు
నఖిల గోళ లోకతతులు నమృత శక్తు లొప్పారఁగ
నాదిరూపమై వెలిఁగెడి నా సత్య స్వరూపంపు
దివ్యశక్తులన్ వరలుచు నవ్యనిత్యతత్త్వ మలరఁ
జక్రనేమి క్రమముగాఁగ సర్వసృష్టి వర్తిల్లును
శబ్దశక్తు లమలములై సర్వమ్మున విస్తరిల్ల
నమృతరూపమై అలరును ననిలమ్ములు సలిలమ్ములు
నఖిలమైన ప్రకృతిమాత కర్బూరూపమ్ము లౌను ॥ 4092

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) మేషరాశి ఉరుములతో మృగశిరతో మహిషముగా
ఘోషించుచు జలధారల గుంభవృష్టి కురియించును
అమృతాంతర్గత శక్తుల నప్సరూపపు ప్రాణగణముల
ఋతరూపములై వరలుచు ఋతుప్రవృత్తులై తనరుచు
సింధువులై మృత్తతులకు బంధువులై గంధర్వుల
బహురూపుల ప్రాణిజాల మహారహమున బ్రవర్తిల్లఁ
గిరణతతులు సహజములై కెరల నంతర్గతులమెయిని
సలిలమ్ములు ననిలమ్ములు చదలు పృథ్వితలములు తనర
నాదిత్యుని దివ్యశక్తు లద్భుతముగ విస్తరిల్ల
నకృతమైన రూపాలుగ నతివిపులములై వరలును ॥ 4093

†(5) వ్యోమగాములౌ నప్సర యోష లెల్లఁ దనరారఁగ
జలశక్తుల ననలానిల సలిల గగన పృచ్ఛక్తులఁ
జలశక్తుల ప్రియ యోనిగ సర్వమ్మును బ్రభవించుచు
ఫేనరూప శుక్లకృష్ణ విమల పూర్ణ క్షీణ గతుల
నలరు చాంద్రదీప్తు లెల్ల నమర హిరణ్యాదులు లోచుఁ
బాక్షికమై తనరారును నక్షయ శక్తులు వరలఁగ
నప్సరశ్శక్తులతో నలరారఁగ నగ్ని దీప్తు
నప్సరోవనిత గతుల కాలవాలమై వెలయుచు
నంతరిక్ష మహిమలతో నలరారును బరమశక్తి
హంసగతుల విశ్వ మెల్ల నలవోకగ నడయాడును ॥ 4094

†(6) అమృతకిరణ చంద్రశక్తి నమలముగా బద్ధమౌచు
నాకమ్మున సువర్ణ గతులు నవనవముగ నిత్యమ్మును
బతన మౌచు జతనశక్తి వరుణ దౌత్య రూప దీప్తి
యోనిగాఁగ ననలాలకు నుజ్జ్వలమౌ జ్వలనశక్తి
యోనిగాఁగ సలిలాలకు నొప్పారఁగ యమరతులను
నిన కాంతుల దివ్యదీప్తి హిరణ్యరూపమై వరలఁగఁ
బక్షిగతులఁ జరియించుచు నక్షయమున నాకసమున
సృష్టి స్థితి లయ రూపపుఁ జేష్టలతో విశ్వమ్మది
వ్యష్టిగాఁగ సమిష్టిగాఁగఁ దుష్టి పుష్టి నష్టి నొంది
ననవరతము వర్తిల్లును నఖిలసృష్టి అపూర్వముగ ॥ 4095

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

† — స్వర్ణకాంతు లలరారఁగ నర్ణవమునయైన నిలుచు
జీవకోటి సర్వమ్మున నిర్జీవకోటి సకలమ్మున
నంతర్గతి నలరు నగ్ని అపురూపపు శక్తులతో
నఖిల సృష్టి నలరు నగ్ని ఆ రోదసి నలరు నగ్ని ॥ 4096

†(7) ఊర్ధ్వగతుల నొప్పారుచు నుపర్యుపరి లోకాలకు
శోకరహిత లోకమునకు శుద్ధశక్తు లొప్పారఁగఁ
జిత్రాతివిచిత్ర కాంతులతోఁ బవిత్రమైన శక్తులతో
స్వర్ణజలము ప్రవియింపఁగ జనితమ్మౌ నాకమ్మున
నాదిత్యుని దివ్యదీప్తు లాయుధములుగాఁ దనరఁగఁ
గామధేనుశక్తు లౌచు గగనస్థితి నలరారును
బ్రకృతిమాత రూపమ్మును బ్రభాభాసితముగఁ జేసి
దివ్యమైన శక్తులతోఁ దీర్చిదిద్దినట్లు తనర
సుందరతరమై వరలును శుభ్రదీప్తు లొప్పుచుండ
విశ్వాచ్ఛాదన రతమై విపుల కాంతు లెల్ల వెలుఁగు ॥ 4097

† — జల శక్తుల నంతర్గతి జ్వలిత మౌచు నలరు నగ్ని
శీతల శక్తుల వరలును వాతగ సృష్టిని దనరును
గీలలతో జ్వాలలతో వేల లెసయకుండ వెలుఁగు
నతిలోకపు శక్తులుగా నగ్ను లలరు నఖిలమ్మున ॥ 4098

†(8) జగమెల్లను సంద్రముగాఁ జద లెల్లను సంద్రముగా
సూక్ష్మ దృష్టిఁ జూచునెడలఁ జోద్యముగాఁ గాననగును
విశేష ధర్మ బద్ధ మౌచు విగతధర్మ బద్ధ మౌచుఁ
జక్రనేమి క్రమముగాఁగ సర్వమ్మును దిరుగుచుండు
భాను మహాదీప్తిరతుల ప్రభా శుక్ల శక్తు లెల్ల
యౌవనంపు శక్తు లొసఁగి అవ్యయగతి నలరారుచు
దివి భువి లోకా లన్నిట నవినాశపు టాకాశపు
దివ్యదేవ తేజస్సుల నవ్యనవ్య నిత్యశక్తు
లమృతములౌ జలరాశుల నావిర్భవములుగఁ జేయును
బ్రకృతిమాత సత్యశక్తి సుకృత వేన దీప్తు లలర ॥ 4099

†రచయిత:— వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—123

ఋషి—భార్గవుఁడైన వేనుఁడు
దేవత—వేనుఁడు

### అర్థాంతరము—2

†(1) ఆదిత్యుని ఉదయమ్మున అఖిల జగతి వర్ధిల్లును
చైతన్యమ్మున సర్వ ప్రాకృతాదికకాల విధుల
నిర్వర్తించును ప్రాణులు నిర్నిద్రిత వర్తిల్లుచు
సూర్యరశ్మిలో మర్మము చొప్పడు నా దీప్తశక్తి
చాంద్రి రూప శీతలంపు శక్తులనే సంతరించు
సూర్య దేవు శిశువుగాఁగ సుందరమౌ శుభ్రకాంతి
జలసంగమ సంచలనతఁ జడ లందెడి శక్తులతో
వెలుఁగొందెడి వెన్నెల లవి వెల్లివిరియ గోకాలను
వృక్షతతులు లతావళులు నక్షయమౌ భూతాళులు
ప్రాణికోటి బుద్ధిశక్తి పరివృద్ధమై పరికర్షమై
దీర్ఘాయుర్దాయశక్తి తేజరిల్లు నారోగ్యము
నైశ్వర్యాదులు నన్నియు నద్భుతగతి వర్ధిల్లఁగ
నభ్యుదయాది ముఖముగాఁగ నఖిలమ్మున విలసిల్లును
నతిలోకపు శక్తిగాఁగ నహరహమును వెల్లివిరియు ॥ 4100

†(2) ఆకసమున నద్భుతగతి నావిష్కృతమౌ దీప్తుల
నమృతశక్తు లొప్పారఁగ నతివేలపు శీతలగతి
శీతస్వచ్ఛరూపాలను జెల్వొందెడి వెన్నెలలను
జలధు లెల్ల నుప్పొంగును నలలతోటి వేల లొరిసి
పంచభూత యోని గతుల నంచితముగ నలరారెడి
అతులితమౌ ఋతశక్తుల నతిలోకముగాఁ దనరుచు
సృష్టిస్థితిలయగతు లవి చెన్నొందును విశ్వమ్మున
జననాభ్యుదయావళులు ననియమత మరణ గతులు
సమానముగ సర్వమ్మున విమానముల వర్తిల్లఁగ
సంభవించు జగద్యోని సర్వస్వము విస్తరిల్ల ॥ 4101

†రచయిత:—వాఙ్మయి మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) అనృతరహితమ్మైన అమృతశక్తులు మీఱ
ఋత దీప్తు లొప్పార నతిలోక వ్యాప్తిమెయి
నాత్మయే పుత్రులుగ నలరారు భాతిగాఁ
బంచభూతాఽఽవళులు వరలు నంతర్గతుల
నొకదానిలో నొకటి నొనరు నవినాభావ
సంబంధ బంధాలఁ జరాచరాల నిలువ
నతితుల్యమై వరలు నసమాన శక్తులన్
జక్రనేమి క్రమత సర్వపదార్థాలు
అనలాఽనిలాలతో నలర సలిలమృత్తతుల
రోదోఽంతరాళాల నాద్యంతములు మీఱ
సంచలన శక్తులన్ సంభ్రమించుచు సదా
విశ్వాన వర్తిల్లు నశ్వి శక్తులు వరల
నాదిత్య రూపమౌ నా విష్ణు దీప్తిమెయి
నఖిలమ్ము వర్తిల్లు నా స్థితి గతు లొప్ప ॥ 4102

†(4) గంధర్వరూపమౌ బంధిత శబ్దాల
శక్తు లెల్లను జగతిఁ జదలు గుణమై వెలయ
ఋతరూపమై వరలు నుతశక్తు లొప్పార
బంధమ్ములై జగతి సింధుగతు లలరఁగా
విజ్ఞానధునిగాఁగ విశ్వమ్ము వరలఁగా
నాదిత్యశక్తు లవి అతిలోక దీప్తులన్
గాలబద్ధమ్మౌచుఁ గ్రాలు మహిషమ్ముగా
మృగగతుల గగనాన నగణిత ఘోషలను
నలరార జలధార లమృత స్యందినులౌచు
నఖిల గోళాలలో నలరంగఁ గాల గతి
ఋతురూప శక్తులన్ ధృతమైన గగనమ్ము
అతిలోక గతులమై నతివేల రతులమైఁ
బ్రకృతిప్రాణులు నిత్య ప్రభాభాసితములై
మతిశక్తి వర్ధిల్ల నతులితముగాఁ దనరు ॥ 4103

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) అప్సరో[1] వనితలే అప్‌సరో[2] వనితలే
అతిలోక యానాల నఖిల రోదసిలోను
నమలమౌ లోకాల ననంత గోళాల
నాకర్షణ శక్తు లధిగమించుచుఁ దనర
వివిధ యోనుల జన్మ లవితథమ్ముగ వరల
దైవీయ పరగతులఁ దనరార నాదిత్య
సూర్యచంద్రుల దివ్య శుభ్రకాంతులు వరల
విశ్వ మెల్లను సృష్టి విమలమౌ స్థితిగతుల
లయతత్వ మొప్పఁగా క్షయరతులు విస్తరిల
మూఁడు గతులును గూడ ముప్పేటగా వరల
ముక్కాలములలోను దిక్కాలములలోను
హైరణ్య దీప్తులన్ మేరలన్ మీఱుచున్
గాంతి ప్రసారాలు క్రాంతి వైశద్యాలఁ
బాక్షికముగా వివిధ కక్ష్యలన్ దనరారు ॥ 4104

†(6) అపురూపమై నిత్య మతిలోకమై వెలుఁగు
చతివేలమై తనరు నాదిత్య దీప్తులన్
శోకరహితమ్మైన నాక లోకములోన
సుపర్ణ రూపమ్మైన శుభ్ర దీప్తులు వరల
జలనాభి దైవీయ సదమల శక్తులే
శాంతిదూతగ విశ్వ దాంతి కాంతుల నిలువ
యమనియమ గతులతో నాగమన రూపాల
నఖిలమున్ శకునమై అలరారఁ గ్రమగతుల
సంచరించును సర్వ చరాఽచర ప్రపంచమ్ము
సృష్టి యోనిగ వరలి యిష్టి కర్మగఁ దనరు
ధరణధారణ రతుల భరణభారణ గతుల
సర్వాధారక మౌచుఁ బర్వు వైష్ణవ దివ్య
శక్తు లెల్లను నిత్య రక్తిముక్తుల వరలు
విశ్వ హృదయ దీప్తు లశ్వరూపములుగా ॥ 4105

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1.అప్సరోవనిత=అప్సర స్త్రీ, 2. అప్‌సరోవనిత=జలకన్య.

†(7) ఊర్ధ్వగతుల విహరించెడి ఉచ్చలమౌ శబ్దశక్తు
లమలములై శోక రహిత విమల నాకలోకమ్మునఁ
జిత్రాఽతివిచిత్రగతులఁ జెలఁగు విభ్రమగతి
శాంతి దాంతి క్రాంతులమై కాంతి శక్తు లలరారఁగ
సృష్టిశక్తి వాసమ్ముగ వ్యష్టి సమిష్టి గతులు మీఱ
విశ్వకామ ధేనురూపు ప్రేమమీఱ జనితగతుల
స్వర్ణదీప దృశ్యశక్తి సర్వమ్మునఁ దనరుచుండ
రోదోఽంతర దివ్యదీప్త నాద శక్తు లలరారఁగ
విశ్వరూప సంగీతము విమల గాంధర్వముగా
జలశక్తుల నంతర్గతి నిలువెల్లను నిండి నిలుచు
విద్యుత్తుగ విశ్వమ్మున వెలయుఁ బంచభూతతతులు
అన్యోఽన్యానుబంధ మవినాభావ సంబంధపు
బంధాలను నతిలోకపుఁ బార్థివరతి నేతల గతి
నాకశమ్ము ననలమ్మును ననిలమ్మును సలిలమ్మును
మృత్తతు లవి వరలుచుండు సత్తు చిత్తు లానందము
వ్యష్టి సమిష్టి రూపాలుగ సృష్టిగాఁగ వెల్గొందఁగ ॥ 4106

†(8) అంతరిక్షగతమ్మైన ఆదిత్యపు శక్తులతో
అరుణారుణ కాంతు లలరి అరుణుఁడు వెల్గుచు నిత్యము
సృష్టిలోని సలిలమ్ముల స్వీకరించి ఆవిరిగా
మేఘరాజి సృష్టించుచు మిన్నులలో విహరింపఁగ
జలరాశులు వివిధగోళ సర్వమ్మున వర్తిల్లుచు
వర్షింపఁగఁ బ్రకృతిమాత హర్షామోదాల నలర
శుభరూపుల సృష్టియెల్ల శోభిల్లఁగ నాచ్ఛాదన
లతిలోకమ్మై వరలెడి నతివేలపు బహుగతులను
విశ్వసృష్టి సముద్రముగ విచిత్రముగ "నభి"శక్తుల
నధిగమించి భాను వీర్య విధి వర్తిల నిత్యమ్మును
శుచిరూపమ్మౌ తేజము శోభిల్లును విశ్వమ్మునఁ
జక్రనేమి క్రమముగాఁగ సకలమ్మును వర్తిల్లును ॥ 4107

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—124

ఋషిః—అగ్నిః,1,5-9-అగ్ని వరుణ సోమాః
దేవతా—1-అగ్నిః;2-4-అగ్నేరాత్మా;5,7-8-వరుణః;6-సోమః;9-ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్; 7-జగతీ

(1) ఇమం నో [1]అగ్న ఉప యజ్ఞమేహి పంచయామం త్రివృతం సప్తతన్తుమ్ ।
అసో హవ్యవాళుత నః పురోగా జ్యోగేవ దీర్ఘం తమ[2] ఆశయిష్ఠాః ॥ 1411

(2) అదేవాద్దేవః ప్రచతా గుహా యన్ ప్రపశ్యమానో[3] అమృతత్వమేమి ।
శివం యత్ సన్తమశివో జహామి స్వాత్ సఖ్యాదరణీం నాభిమేమి ॥ 1412

(3) పశ్యన్నన్యస్యా[4] అతిథిం వయాయా [5]ఋతస్య ధామ వి మిమే పురూణి ।
శంసామి పిత్రే [6]అసురాయ శేవమయజ్ఞియాద్యజ్ఞియం భాగమేమి ॥ 1413

(4) బహ్వీః సమా [7]అకరమన్తరస్మిన్నిన్ద్రం వృణానః పితరం జహామి ।
అగ్నిః సోమో వరుణస్తే చ్యవన్తే పర్యావర్ద్రాష్ట్రం తదవామ్యాయన్ ॥ 1414

(5) నిర్మాయా[8] ఉ త్యే అసురా అభూవన్ త్వం చ మా వరుణ కామయాసే ।
ఋతేన రాజన్ననృతం వివించన్ మమ రాష్ట్రస్యాధిపత్యమేహి ॥ 1415

---

1. నోఽఅగ్నఽఉప, 2. తమఽఆశయిష్ఠాః, 3. మానోఽఅమృతత్వ, 4. న్యస్యాఽఅతిథిం, 5. యాఽఋతస్య,
6. పిత్రేఽఅసురాయ, 7. సమాఽఅకర, 8. నిర్మాయాఽఉత్యేఽఅసురాఽఅభూవన్. (వాౖ.పౖ.)

(6) ఇదం స్వరిదమిదాస వామమయం ప్రకాశ[1] ఉర్వంతరిక్షమ్ ।

హనావ వృత్రం నిరేహి సోమ హవిష్ట్వా సన్తం హవిషా యజామ ॥ 1416

(7) కవిః కవిత్వా దివి రూపమాసజదప్రభూతీ వరుణో నిరపః సృజత్ ।

క్షేమం కృణ్వానా జనయో న సిన్ధవస్తా[2] అస్య వర్ణం శుచయో భరిభ్రతి ॥ 1417

(8) తా[3] అస్య జ్యేష్ఠమిన్ద్రియం సచన్తే తా[4] ఈమా క్షేతి స్వధయా మదన్తీః ।

తా[5] ఈం విశో న రాజానం వృణానా బీభత్సువో[6] అప వృత్రాదతిష్ఠన్ ॥ 1418

(9) బీభత్సూనాం సయుజం హంసమాహురపాం దివ్యానాం సఖ్యే చరన్తమ్ ।

అనుష్టుభమను చర్చూర్యమాణమిన్ద్రం ని చిక్యుః కవయో మనీషా ॥ 1419

## సూక్తము—124

ఋషి—అగ్ని 1,5-9-అగ్ని వరుణ సోములు†

దేవత—1-అగ్ని, 2-4-అగ్నియాత్మ, 5,7-8-వరుణుడు, 6-సోముడు, 9-ఇంద్రుడు†

(1)*గద్యము॥

ఓ యగ్నీ! యజమానపంచము లగు ఋత్విక్కులచే నియమిత మైనది, సవనత్రయవృత మైనది, సప్త వషట్కర్తలుగలది యగు మా యజ్ఞమునకు వచ్చి మా హవ్యమును వహింపుము! మరియు మా పురోగంత వగుము! మమ్ము విడచి చిరకాలము గుహయందు శయనించితివి! ఇక నా స్థానమును వీడి మమ్ములను బొందుమా! ॥ 4108

1. ప్రకాశ ఉర్వంన్త, 2. వస్తా అస్య, 3. తా అస్య, 4. తా ఈమా, 5. తా ఈం,

6. బీభత్సువో అప. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 141వ పుటలో నీ సూక్తమునకు ఋషి "అగ్ని"గాను, దేవత "అగ్ని" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "అగ్ని, అగ్నివరుణులు, సోముడు" ఋషులుగాను, "అగ్ని, ఇంద్రుడు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(2) *గీ॥ పూత సురలను యాచన హేతువునను
బొంది దేవన శీలంబు నొంది నేన
యపర కల్పిత మైనట్టి యజ్ఞము గని
దేవతాత్వంబు నందుచుఁ దరుగఁగలను ॥ 4109

*ఉ॥ నేను బరిత్యజించి గుహ నేకిమి యజ్ఞముఁ జేయుచుంటిఁగా
నైన నశోభనుండనయి యజ్ఞ సమాప్తి నొనర్చువేళ న
గ్ధానిని వీడి యాత్మ సఖితం బర మశ్వ సురూప సంపదం
బూని మహారణీ పదవిఁ బొందుచునుంటిని సర్వ భంగులన్ ॥ 4110

(3) *గీ॥ అఖిల పృథ్వికి దివమున కతిథియైన
సూర్యగతి [1]ననుసరించుచు సుందరేష్టి
బహు శరీరంబులను నేఁడు పరమతుష్టి
నేను నిర్మించుచున్నాను నిశ్చయముగ ॥ 4111

*గీ॥ అరి వినాశకుఁడై దివమందునుండి
పితగ నున్నట్టి వానికిఁ బెద్ద సుఖముఁ
గోరి యజ్ఞార్థ దేశంబుఁ జేరుచుంటి
వీడుచు నయజ్ఞదేశంబు వేట్కఁ బీర ॥ 4112

(4) *గద్యము ॥
ఈ వేది లక్షణస్థానమందు బహుసంవత్సరము లుంటిని. అచ్చట నింద్రుని సంభజించుచు నుత్పాదక మగు నరణ్యాత్మకమును త్యజించుచున్నాను. ఎపుడు దేవతల దగ్గరనుండి వచ్చి గుహయందు నిగూఢుఁడ నైతినో; యపుడు దేవతలు అగ్ని, వరుణుఁడును, రాష్ట్రమునుండి ప్రచ్యుతు లైరి. సురల వచ్చుచు నే ససురాపహృత మగు నే రాష్ట్రము(యజ్ఞభూమి) మదభిముఖముగ నావర్తమాన మగునో; ఆ రాష్ట్ర మసురవల్ల రక్షించుచున్నాను ॥ 4113

(5) *గద్యము॥
అనలుఁడ నగు నేను రాగా నా యసురులు మాయారహితు లైరి. ఓ వరుణుఁడా! నీవు నన్నుఁ గోరినట్లయిన నో యీశ్వరుఁడా! మా సత్యకర్మముచే మాయామయ మగు చరిత్రమును గొట్టుచు మత్సాధిత మగు రాజ్యాధిపత్యమును నీవు పొందుమా! ॥ 4114

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "నలల"ము ప్రయుక్తమైనది.

(6)*గీ॥ సోముఁడా! నాక మెంతయు సూర్యుఁ డయ్యె
స్వర్గ మంతయు వామమై పరఁగుచుండె
నీ ప్రకాశము నభ మౌచు నెసఁగుఁగాన
నీ సమస్తంబు చూడుము! భాసమాన! ॥ 41

*క॥ కావున నీ సమయంబున
నీవున్ నేను గలసి వృత్రు నిర్జించెద మో
పావన సోముఁడ! రమ్మా!
వావిరి నీ భజన జేసి వర లెదపుసుమా! ॥ 41

(7)*సీ॥ క్రాంత సందర్శియై క్రాంత దర్శనమున మిత్రుఁడు దివమందు మెలఁగుకతనఁ
దేజస్సుఁ జేయుచుఁ దిరుగు చల్పంబైన యత్నంబుచేతను నంబుదంబు
వలన జలంబులఁ గలిఁగించె వరుణుండు వానివల్లనె యెల్ల వారి విడువఁ
బడినయప్పుడు నదీవరములు పతి కెట్లు జాయ క్షేమంబును జరుపుచుండు
గీ॥ నట్లు జగమునకున్ సేమ మందఁజేయుచుండి శుద్ధంబులై వరుణోత్తముని సు
పర్ణ భాస్వర రూపంబుఁ బడసి మిగుల,స్యందమానంబులై కడు సాగుచుండు ॥ 41

(8)*క॥ వరుణుని వీర్యము నప్పులు
తరము ధరించుచును హవ్యగౌరవమున నీ
వరుణుం డప్పుల తేజో
త్కరమును గడుఁ బొందుచుండుఁ దద్దయుఁ బ్రీతిన్ ॥ 4

*క॥ ప్రజ లెల్ల స్వామి నెట్టులు[1]
భజియింతురో! యట్లు దివ్య వరుణుని నప్పుల్
భజియించి వృత్రు భయమున
నిజగతిఁ జని విశ్రమించు నిపుణత మెఱయన్ ॥ 4

(9)*గద్యము॥
బీభత్సువులకు సూర్యునకు సఖునిగా బ్రహ్మవాదులు చెప్పుచున్నారు. దివ్యము లగు
నప్పులు సఖ్యమందుఁ జరించుచున్నట్టియు స్తోతవ్యమైనట్టియు ఛందోయుక్త మగు
స్తుతి విశేషమునుగూర్చి మాటిమాటికిఁ జరించుచున్నట్టి యింద్రునిఁ గవులు
స్తుతులచేఁ బూజించుచున్నారు ॥ 4

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇవి మొదలగు వచనములనుబట్టి చూడ ఋగ్వేదకాలమునసయితము రాజు నెన్నుకొను నాచారము దేశమున నుండెడిదని స్పష్టమగుచున్నది. (ఈ ఫుట్‌నోటును శ్రీ నేమానివారు "వరుణుని" ఇత్యాది పద్యమునకుఁ బొరపాటున గుర్తుపెట్టి వ్రాసిరి.)

గమనిక:-"వరుణుని" నిత్యాది పద్యములోఁగాని తరువాతి పద్యమైన "ప్రజ లెల్ల స్వామి నెట్లులు భజియింతురో!" ఇత్యాది పద్యమునఁ గాని రాజు నెన్నుకొన్నట్లు లేదు. రాజును భజించినట్టున్నది. ఎన్నుకొనుట వేరు. భజించుట వేరు. (వ.గో.కృ,)

## సూక్తము—124

ఋషి—అగ్ని; 1,5-9-అగ్ని వరుణ సోములు
దేవత—1-అగ్ని; 2-4-అగ్ని యాత్మ, 5, 7-8-వరుణుఁడు 6-సోముఁడు 9-ఇందుృఁడు

### అర్థాంతరము—1

†(1) సప్తాగ్ని పుంజాలు సర్వాన వ్యాపించి
సృష్టి రూపమ్ములో స్రిష్ట దీపమ్ముగా
భూత భావి వర్తమాన పూర్ణకాంతి తతులలోను
అనిలాఽనలమ్ములును నాకాశము సలిలమ్ములు
మృత్తతులను సృష్టిలో సత్పదార్థ చిత్పదార్థపు
టానందరూపాల సతిదీర్ఘమై వెలయు
అంత మెనయని కాల మావరించిన రీతి
సపురూప శక్తులన్ అతిలోక శక్తులన్
అతివేల గతులమై నంతరాంతర గతుల
దిక్తటమ్ముల నిండి వ్యక్తాఽవ్యక్త గతి
విశ్వయజ్ఞమ్ములో విమల హవిషముగాఁగ
సభ్యుదయావహముగా నఖిల పురోగామిగా
వర్తిల్లి చిరకాలమూర్తిగా నుష్ణరతి
వైష్ణవీయపుఁ గృష్ణమాయ యామ మ్మోను ॥ 4121

†(2) అత్యంత దీప్తమై అనుపమ శక్తులన్
అంతరాంతర గతుల నఖిలాన వ్యాపించి
అద్వైవీయరూపాల ననసురూపాలుగా
అశివమౌ శక్తులు పశతత్త్వముల నిలువ
దైవీయమౌ శక్తి తాదాత్మ్యతలు మీఱ
శివతత్త్వమున సృష్టి అవశమై వెలుఁగంగ
మృతరూపములలోన నమృతదీపము వెలుఁగ
"ఋభి"శక్తులను దుృంచి "నాభి"శక్తులఁ బెంచి
విశ్వాన జలశక్తి నశ్విశక్తుల నిలిపి
అఖిలానఁ గళ్యాణమావహిల్లఁగఁ బ్రకృతి
నశుభపరంపరల నావలకు నెట్టుచున్
బంచభూతాలలో నంచితమ్మౌ మైత్రి
వర్తిల్ల సృష్టి స్థితి భావాలు వర్ధిలఁగ
విశ్వమే యజ్ఞమై విశ్వమే హవిషమౌ
నశ్విశక్తుల జగ మనశ్వరమ్మై నడచు
విశ్వేశుఁడౌ హోత శాశ్వత ధాతయౌ ॥ 4122

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) సృష్టియజ్ఞమ్మమరేష్టిగాఁ దనరార
నపురూపమై విశ్వ మతివేలమై నిలిచి
అతిలోక రతులతో నితరేతరజ మౌచు
నసురశక్తుల జగతి నసమగతులను రాల్చి
విషరూపముల నెల్ల మిషలుగాఁ బరిమార్చి
ఆయజ్ఞమై నిలుచు నసహజ ప్రకృతుల
నజ్ఞాన తత్త్వాల యజ్ఞతత్త్వాలతో
రూపుమాపుచు సదా రూక్షశక్తులు వరల
సత్యశక్తులు జగతి సర్వానఁ దనరఁగా
నభయంకరాలుగా శుభంకరాలౌచు
దివ్యశక్తులఁ దనరఁ దేజరిలు లోకాల
నాకర్షణ వికర్షణ లలరార సృష్టిలో
నతిథులై పంచభూతాలు లెల్లను బరఁగ
మాతృరూప మ్మౌచుఁ బితృరూప మ్మౌచు
మాతాపితల దివ్యజాత సంతతి కాఁగ
విశ్వ సృష్టియె వరలు విపులతత్త్వము మీఱ ॥ 4123

†(4) వివిధ గోళ లోకాలును విమల శక్తు లొప్పారఁగ
ననిలానల సలిలమ్ములు నాకాశము మృత్తతులును
నగ్నిశక్తు లమలమైన అమృత సోమ తత్త్వ మలరు
నఖిల గోళ లోకాలను నద్భుతగతి వరలంగా
జనన మూల శక్తినుండి అనవరతము జన్మించుచు
సర్వసమానత తనరఁగ సకలమ్మున వ్యాపించుచు
ననిల సలిలములనేకాక ఆకసములఁ బృథ్విలందు
నఖిలమ్మున నావరించి అన్యోన్యానుబంధాలను
నవినాభావ సంబంధ మభేద్యగతుల భేద్యరతుల
నపురూపముగా నిల్పుచు ననలశక్తి వర్తిల్లును
సృష్టి స్థితి లయ శక్తులు చెలువారఁగ జన్మించుచు
వర్ధిల్లుచు నైక్య మౌచుఁ బ్రకృతిలోన సహజగతుల
నుష్ణ శీతలంపు దీప్తు లొప్పారఁ గవోష్ణరతులు
వైష్ణవీయమైన శక్తి వర్తిల్లఁగ నిత్యమ్మై ॥ 4124

---

†రచయిత :—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) ధర్మశక్తి అధర్మమును విధ్వస్తము కావించుచు
సత్యరూప నిత్యదీప్తి ననత్యశక్తి రూపుమాపి
సృష్టి స్థితి లయ రీతుల వ్యష్టి సమిష్టిగతు లెల్లను
విశ్వమ్మున వరలుచుండు శాశ్వతరతు లలరారఁగ
సౌర చాంద్ర ఋక్ష గ్రహ సర్వస్వము వర్తిలంగ
నిర్మాయాశక్తు లలర నిఖిల సృష్టి నిల్పుచుండు
నాసురమౌ శక్తితతుల నభిఘాతము కావించుచు
వరుణశక్తి వాయుశక్తి వర్ధిలంగ గగనమ్మును
మృత్ప్రియపుఁ బృథ్వీతతులు ఋతశక్తుల రూపుదాల్చి
నిత్యమ్మును స్థితిగతులను గృత్యాకృత్యమ్ము లెంచుఁ
బ్రత్యవాయమ్ములేక నిత్యసత్య రతులు తనరఁ
బంచభూతా లొకటొక్కటి వరలు నంతర్గతినిఁ బరఁగఁ
బ్రకృతిలోనఁ బ్రకృతిరూపు భాగమై విలీనమౌను
జక్రనేమి క్రమముగాఁగ సర్వసృష్టి వర్తిల్లఁగ ॥ 4125

†(6) "అభి"శక్తులు రూపుగొన్న ఆ వృత్రుని దుశ్శక్తులు
అంతరిక్ష మెల్ల సృష్టి నావహించి విషశక్తుల
నత్యుగ్ర మహోగ్రమైన యతిలోకోష్ణత నిండఁగ
నపురూపపు శక్తులతో నతివేలపు దీప్తులతో
నతిలోకాద్భుత శక్తుల నాదిత్యుఁడు విజృంభించి
క్రాంతి వహ్ని కాంతితతులు సంతతాగ్ని జ్వాలలతో
విధ్వస్తము కావించుచు విశ్వశాంతి వర్ధిల్లఁగ
"నాభి"శక్తి నెల్ల నిలిపి నవశక్తులు విస్తృతముగఁ
బ్రకృతిమాత హర్షింపఁగ వర్షింపఁగ జలధారలు
సోమామృత శక్తితతుల శుచిశుభ్రత లలరంగాఁ
బ్రకృతిశక్తి హవిస్సై సుకృతదివ్యశక్తి గాఁగ
విశ్వసృష్టి సంక్రియలే విమల దివ్య దేవయజ్ఞ
తత్త్వముగా వర్తిల్లును సత్త్వ నిత్య సత్య రతుల
వామరూప లయ క్రియ లవి వర్తిల్లఁగ విశ్వమ్మున ॥ 4126

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) దివ్యదీప్త లోపార్చరఁగఁ బేజరిలెడి అనలశక్తి
ఆకసమ్ము మృచ్ఛక్తుల ననిల సలిల శక్తులతో
నంతర్గతి సలరుచుండు నద్భుతావహముగాఁగ
దివి భువులను వరుణ నాక దివ్యాగ్ని వాయు లోక
జాలమ్ముల సర్వమ్మున సర్వశక్తు లలరారఁగ
విశ్వ సంక్షేమ రూప విమలమైన వ్యాప్తిత్వము
దివ్య దైవీయశక్తి నవ్య నిత్య తత్త్వ మలర
సప్త వర్ణ కాంతులతో నదమలమై వరలుచుండు
శుచి శక్తులతో విశ్వము శుభ్రితమై వర్తిల్లఁగ
ధరణి ధారణముల శక్తి భరణభారణముల వరలి
అంతరాంతరములఁ దనరి అపురూపపు దీప్తులతో
దార్శనిక మ్మైన శక్తి దగద్ధగితమై తనరఁగ
విశ్వసృష్టి వర్తిల్లును విస్తృతాద్భుతంపు గతుల
సృష్టి స్థితి లయ రతులను వ్యష్టి సమిష్టులుఁగ నడవ ॥ 4127

†(8) "అభి"శక్తుల నాకట్టుచు నామిషముగఁ జేసి జగతి
జల"నాభి"ని విధ్వస్తము చల రూపులఁ గావింపఁగ
విషాగ్ని జాల రూప తతుల వృత్రాసుర శక్తు లెల్ల
లోక భీకరమ్ముగాఁగ రూక్షాగ్నుల వ్యాపించఁగ
నతిలోకమ్మై తనరెడి అద్భుత వీర్యంపు శక్తి
నాదిత్యుని వజ్రకాంతు లలరారుచు విజృంభించి
అవినాశపు శక్తులలర నంతరాంతరములఁ జొచ్చి
"అభి"రూపమ్మైన వృత్రు నభిచారము నెల్ల నాపు
పరివ్యాప్త దుశ్శక్తుల నరిమురిగాఁ దుంచి వైచి
"అభి"శక్తుల నన్నింటిని నతిలోకపు దీప్త శక్తి
విధ్వస్తము కావించుచు విశ్వశాంతి జీవ శక్తు
లలరారఁగఁ బునర్నవత నమలమైన ప్రకృతిరూపు
నిత్యనవ్యమై వరలెడి సత్య చైతన్య రతుల
నలరారుసు వైష్ణవీయ విలసనములు వర్తిల్లఁగ ॥ 4128

---

†రచయిత:—వాఙ్మయ మహాద్యత, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) అంతరాంతరముల నతిలోక గతి మీఱ
సనలాలననిలాలు ననిలాల ననలాలు
దివ్యశక్తులు తనరఁ దేజరిల్లుచు సదా
అంతరిక్షములోన నమృత సలిలాలతో
మృత్‌తతుల సన్నిటన్ మిత్రిగా మిత్రులకె మిత్రిగా
సఖ్యమ్ము మీరంగ సకల సంచారాల
నాదిత్య శక్తులన్ అతివేల దీప్తులన్
గాఢింత దర్శిత్వాల నాంతర్య గతి మీఱ
సచ్చిదానందాలు సర్వసృష్టిని దనర
సమృత శక్తుల దివుల హంసగాఁ బరఁగంగ
సత్య తత్త్వము వరలు నిత్య దివ్యత్వాన
సూనృతత్త్వము సృష్టి సూనరతులను వెలుఁగ
మేఘమాలల జలము మిన్నులన్ గురియుచున్
జలసంచయమ్ములన్ జలదముల్ రూపొందు ॥ 4129

## సూక్తము—124

ఋషి—అగ్ని, 1,5-9-అగ్ని వరుణ సోములు
దేవత—1-అగ్ని, 2-4-అగ్నియాత్మ, 5, 7-8-వరుణుఁడు, 6-సోముఁడు, 9-ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

†(1) గుప్తములౌ శక్తి తతుల సప్త కాంతి పుంజాలను
సృష్టి స్థితి లయ గతులను దిగ్రావృత్తముల వరలుచు
విశ్వమ్మున వ్యాప్తి చెందు విమల కాంతి సమూహాల
నాదిత్యులు నఖిల రవులు నద్భుత దీప్తుల వెలుఁగుచు
నతిదీర్ఘపు యానాలను బ్రితిలేని మహాభ్యుదయాల
తిరోగమన రహితత్వము పురోగామి మహితత్వము
పరఁగంగా సృష్టిక్రియ వరలు నగ్ని శక్తి మీఱ
విశ్వ జనన స్థిత్యభ్యుదయ విలయియజ్ఞతతులు వరలు
ననలానిల సలిలగతుల నాకాశపు మృత్‌తతులను
నంచితముగ సృష్టి స్థితి పంచత్వము తఁరంగా
అఖిలమ్మను విశ్వమ్మున హవిష్మై వరఁగుచుండు
నావిష్కృతమై నిలుచును నాహుతిగా నంతరించు 4130

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) దేవత్వము లేని శక్తి తేజరిల్లు గుహ్యతమై
దైవీయమ్మౌ దీప్తిగఁ దనరారును నమృత గతుల
నభయంకరమై జగతిని "నభి"శక్తుల రూపుమాపి
అశివంకరమౌ ప్రకృతుల నన్నింటిని సంహరించి
శివంకరమైన మహాశ్రేష్ఠ జ్యేష్ఠ మాంగల్యపు
మహితశక్తి సృష్టిలోన విహితమ్మై అహరహమ్ము
నవ్యనవతతో నిత్యము "నాభి"శక్తి వర్ధిల్లఁగఁ
బంచభూత తత్వాలను సంచితముగ నైకమత్య
మలరారును సంతర్గతి నన్యోఽన్య మహాశక్తి
నవినాభావత్వ మొప్ప దివిభువులను సర్వమ్మున
నమృతత్వపు గతులతోడ నలర నిత్య మృతితత్వము
పునర్జన్మ జీవరతులఁ బుణ్యపాప క్రియలు పరలఁ
"బునరపి జననము"గాఁగను "బునరపి మరణము"కాఁగను
జక్రనేమి క్రమముగాఁగ సర్వస్వము వ్యాప్త మౌచుఁ
జరాఽచర ప్రపంచ మెల్ల జడాఽజడ జగతు లెల్ల
వర్తిల్లును సృష్టిలోన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల
దివ్యదైవ శక్తితతుల భవ్యభవ భాగ్యాళుల
నదైవీయమై తనరును నశాశ్వతగతి వరలంగా ॥ 4131

†(3) ఋతశక్తులతో విశ్వము ధృతమై తిరుగును నిత్యము
ఆకర్షణ వికర్షణల నతిథికాఁగ సృష్టిలోన
సర్వ గోళ లోకా లవి పర్వంగా సంచరించుఁ
బుత్ర పితృ శక్తులుగాఁ బూర్ణాద్వైతమ్ము గాఁగ
ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులను నొకటొక్కటి మిన్నువోలె నైక్యమౌను
అన్యోఽన్యత వరలంగా నవినాభావాలమెయిని
ద్వైత గతుల విడివడులేః చేతనాఽచేతనగతి
యజ్ఞక్రియ సృష్టికాఁగ నయజ్ఞగతుల నఖిలమ్మును
బ్రదక్షిణ రతుల నాత్మ ప్రదక్షిణగతులమెయిని
లోక గోళ గతు లన్నియు లోలుపతలఁ దిరుగాడును
విడివడుచును గలివడుచును వినిమయగతు లొప్పారఁగ ॥ 4132

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) అనిలానల శక్తితతులు నాకాశము సలిలమ్ములు
మృత్తతులును సృష్టిలోన సత్తుచిత్తు లానందము
లావరింప నఖిలమ్మున ననంతకాల గమనములో
నంతరహితమౌ వ్యవస్థ సపూర్వముగ సృష్టి నిల్వఁ
జరాఽచర ప్రపంచము జడాఽజడజగతు లెల్ల
సర్వమ్మును సంచరించు సదా దైవలీల కాఁగ
వైష్ణవీయమైన శక్తి బహురూపంబై విశ్వము
అమృతసోమశక్తులతో సనృతత్వము నశింపఁగఁ
బంచభూత రూపాలను బహువిధాల గోళాలును
లోకాలును దనరంగా వ్యాకోచన వికుంచనల
నపురూపపు దీప్తులతో నతివేలపు శక్తులతో
నతిలోకమ్మైన రతుల నసాధారణంపు గతుల
సకలమ్మును బయనించును నికటముగా దైవశక్తి
పుత్రపితృ భావ మొప్పఁ జిత్రముగాఁ బ్రకృతి దనర ॥ 4133

†(5) పంచభూతశక్తులతోఁ బ్రపంచాలు వరలంగా
అసురశక్తు లన్నింటిని విసము రీతి విరిచివైచి
నిర్మాయాతత్త్వమ్మున నిఖిలమ్మును వర్ధిల్లఁగ
సౌరకాంతి భరితమైన చాంద్రశక్తి వెన్నెలలవి
సత్యగతుల చలివెలుఁగుల నిత్యాఽమృత స్రావముగఁ దగ
వరుణలోకగతులు మీరఁ జరాఽచర ప్రపంచానఁ
గామయమానమ్ము లౌచుఁ గ్రాలు కాంక్షితమ్ము లెల్ల
విశ్వప్రకృతిపరముగాఁగ నశ్విశక్తు లలరారఁగ
నాకాశాఽనిలగతులను నమరు సలిల మృత్తతిగతి
నాధిపత్య గోళ శక్తి ననుసరింప నఖిలమ్మును
ననుగతమౌ ప్రదక్షిణల నాత్మప్రదక్షిణలు తనర
సత్యరూప శక్తి వరల నసత్య శక్తు లన్నింటిని
విధ్వస్తము కావించును విశ్వశాంతి వర్ధిల్లఁగ
దైవీయమ్మౌ శక్తుల కేవలత్వ మలరారఁగ ॥ 4134

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అంతరిక్షమ్ములో నపురూప శక్తులన్
గ్రహ ఋక్ష రాజాలు కాగ్రిలు దివి భువు లలర
దివ్యతేజాలతోఁ దేజరిల దీధితుల
నఖిలమౌ విశ్వమును నశాంతిమయముగా
"అభి"శక్తిమయముగా నల్లకల్లోలముల
నశుభ పరిణామాల నతిశోక పరితప్త
కష్టాల నష్టాల దుష్టబాధితులఁ జేయు
విషవాయ్వగ్నిమయ వృత్రాసురుఁ బట్టి
శిరచ్ఛేదము చేసి చెండాడి కొండాడి
అండాండ పిండాడ బ్రహ్మాండ భాండాలఁ
గాపాడి సర్వవిధ దీప శక్తులు నిల్వ
"నాభి"శక్తులు మీరఁ బ్రాభవముగా జలము
ప్రకృతి హర్షమ్ములను వర్ష పులకాంకురాల
సంచితము లట్లుగాఁ బంచ భూతావళులు
ఆదిత్య మైనట్టి ఆ విష్ణుశక్తి మెయి
నఖిలమ్ము వర్ధిల్లు నద్భుతగతి తోప ॥ 4135

†(7) కాంతిదర్శిత్వానఁ గ్రాలు కాంతులు తనర
నరుణ శశి గోళాలు నపురూప గతులమై
అతివేలమై తనర నతిలోక గతులతో
భువి దివుల నన్నిటన్ నవకాంతి పుంజాలు
నిత్యమ్ము ప్రసరించ నత్యశక్తుల మహిమ
ధరణ ధారణగతుల భరణ భారణరతుల
జలశక్తులను నగ్ని చదలునన్ గ్రహియించి
వరలు మొయిళులుగాఁగ వర్షించి జలములను
బ్రకృతి పులకింపంగ సుకృత పునర్జన్మగ
సంజనన శక్తులన్ సంభవ రక్తులన్
నిరతాభ్యుదయముతో నిఖిలమ్ము వర్ధిల్ల
క్షేమంకరమ్ముగా నీప రతులను వరలఁ
బంచభూతావళులు నంచితములై శుచిగ
నశుచితత్త్వాలను నన్నింటినిన్ విరుచు ॥ 4136

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) సృష్టిలోఁ దొలిశక్తి చెన్నొందు నాదిత్య
దివ్యకాంతిగ మహాదీప్త తేజము లలర
నదియె తొలివీర్యమై అఖిలమున విలసిల్లు
నద్భుత శక్తిగా నతిలోక శక్తిగా
నతివేల శక్తిగా నపురూప శక్తిగా
సౌరపరమై వెలిఁగి చాంద్రపరమై తనరి
అంతరిక్షగమైన అఖిలమౌ గ్రహఋక్ష
తతులతో ధూమకేత్వాదులన్ దనరారు
విశ్వమున్ సంక్షోభ వికలమ్ము కావించ
"నభ"శక్తిరూపమై "నాభి"శక్తుల మ్రింగ
విషరూప దీప్తులన్ వృత్రుండు వ్యాపింప
విధ్వస్త మొనరించు విశ్వసంక్షేమ గతి
నుష్ణ శుచి శక్తులన్ వైష్ణవాదిత్య మహా
మహితకాంతులు సదా మహిమాన్వితములుగా ॥ 4137

†(9) ఆకాశ మనిలమ్ము లనలముల్ సలిలముల్
పృథ్వి శక్తులు కలిసి విశ్వమ్ముగా వరలి
మొదట నే భూతమో! పిదప నే భూతమో!
తెలియఁబడకయె దివ్యదీప్త శక్తులు మీర
నన్యోఽన్య సంబంధ మనుబంధ బంధాల
నవినాభావంపు టతిలోక బంధాల
నలరారు పంచభూతాఽఽవళు లన్నియున్
"ఆత్మా వై పుత్రనామాసి"గా వర్తిల్లఁ
దండ్రి యే భూతమో! తనయుఁ డే భూతమో!
తెలియంగ లేనట్టి దివ్య సఖ్యము తనర
హంసశక్తులతోడ నైదు ప్రాణము లలరఁ
జరాఽచరములు సర్వ జడాఽజడముల నెల్లఁ
బ్రాణప్రదమ్ములై ప్రాణధారకములై
ప్రాణహారకములునై వరలులే! సృష్టిలోఁ
బ్రకృతితత్త్వముగాఁగఁ గ్రాంత సచ్చిత్తతులఁ
జరియించు లక్ష్యమై జగదీశుఁడే వరల ॥ 4138

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—125

ఋషికా—వాగామ్భృణీ
దేవతా—ఆత్మా
ఛందః—త్రిష్టుప్ ; 2-జగతీ

(1) అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవైః ।
అహం మిత్రావరుణోభా బిభర్మ్యహమిన్ద్రాగ్నీ[1] అహమశ్వినోభా ॥ 1420

(2) అహం సోమమాహనసం బిభర్మ్యహం త్వష్టారముత పూషణం భగమ్ ।
అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే ॥ 1421

(3) అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్ ।
తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయన్తీమ్ ॥ 1422

(4) మయా సో[2] అన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య[3] ఈం శృణోత్యుక్తమ్ ।
అమన్తవో మాం త[4] ఉప క్షియన్తి శ్రుధి శ్రుత శ్రద్ధివం తే వదామి ॥ 1423

(5) అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః ।
యం కామయే తంతముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్ ॥ 1424

---

1. మిన్ద్రాగ్నీ ఽఅహ, 2. సోఽఅన్నఽమత్తి, 3. యఽఈం, 4. తఽఉపక్షయన్తి. (ప్రా.ప్ర.)

(6) అహం రుద్రాయ ధనురా తనోమి బ్రహ్మద్విషే శరవే హన్తవా[1] ఉ।

అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృథివీ[2] ఆ వివేశ ॥ 1425

(7) అహం సువే పితరమస్య మూర్ధన్ మమ యోనిరప్స్వం౧ న్తః సముద్రే।

తతో వి తిష్ఠే భువనాను విశ్వోతామూం ద్యాం వర్ష్మణోప స్పృశామి ॥ 1426

(8) అహమేవ వాత[3] ఇవ ప్ర వామ్యారభమాణా భువనాని విశ్వా।

పరో దివా పర[4] ఏనా పృథివ్యైతావతీ మహినా సం బభూవ ॥ 1427

## సూక్తము—125

ఋషిక—వాక్నామ్నీ బ్రహ్మవిదుషి†

దేవత—అంభృణునిదుహిత వాక్కనెడి బహ్మవిదుషి†

(1)*సీ॥ నేను జగద్ధేతువైన బ్రహ్మంబును నగుచు రుద్రాత్మతోఁ దగిన వసుగ
ణాత్మతోఁ జరియించి యతిశయించుచు నుంటి నుభయులుగా[1]నెప్పు డుండునట్టి
వరుణుని మిత్రుని బరమ బ్రహ్మీభూతనయి ధరియించుచునుంటి నగ్ని నిందుఁ
దాల్చి యశ్వులఁ గూడ దాల్చితి నాయందు జగము సర్వం బుండుఁ జారు శుక్తి
గీ॥ రజితముగ[2] వెల్గునట్టులు రమ్యరూప,మాయయు జగత్తుగా వెల్గు మాయచేత
సంగతము కాని బ్రహ్మ సుశక్తివలనఁ, బుట్టుచుండెను సర్వము పొలుపు మిగుల ॥ 4139

(2,3)*సీ॥ అధిక మా హంతవ్య మగు చంతరిక్షస్థమైన సోమంబు నందుచుండి
త్వష్టను బూషను భగుని నేనే ప్రీతి నింపుమీరఁగ వహియించుచుంటి
హవ్యవంతుం డౌచు నమరులకున్ హవ్య మిచ్చువానికి ధన మిచ్చుచుంటి
సర్వేశ్వరిని వసు సంగమయిత్రినై బ్రహ్మంబు నొందుచు బ్రతుకుచుంటి
గీ॥ జీవరాశుల నెల్ల నేఁ జిత్తమందుఁ, బెట్టుకొనుచుండుటంబట్టి వేల్పు లెల్ల
విశ్వరూపాత్మనౌ నాకు[3] వేయి విధులఁ,జేయు కర్మంబునంతయుఁ జేయుచుండ్రి ॥ 4140

---

1.హన్తవా ఉ, 2. పృథివీ ఆ వివేశ, 3. వాత ఇవ, 4. పర ఏనా. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 145వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వాక్నామ్నీ బ్రహ్మ విదుషి"గాను, దేవత "అంభృణుని దుహిత వాక్కనే బ్రహ్మ విదుషి"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "వాక్కు" ఋషిగాను, "వాక్కు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1.నుభయులుగా బ్రీతినుండునట్టి, (తా.పా.), 2. యందు రజతము చందాన నందమొప్పు, (తా.పా.),
3.నన్ను వివిధగతుల. (తా.పా.).

(4)*సీ॥ అన్నంబు సంప్రీతి నారగించెడు జనుఁ డన్నంబు నావల్ల నారగించుఁ
జోద్యం బలర నంతఁ జూచుచుండెడువాఁడు సుఖముగ[1] నావల్లఁ జూచుచుండుఁ
ప్రాణముల్ ధరియించి బ్రతుకుచుండెడువాఁడు సతతము నావల్ల బ్రతుకుచుండుఁ
జెప్పిన దంతయుఁ జెవులఁ బెట్టెడువాఁడు ఘనముగ నావల్ల వినుచునుండు
గీ॥ నిట్టి నన్నెరుఁగునట్టి తా[2] మెల్ల వారు,సంస్కృతి విహీను లగుచుందురు సఖుఁడ! నీకు
శ్రద్ధతో లభ్య మగునట్టి సత్యరూప,మైన బ్రహ్మంబుఁ దెల్పెద నతిశయముగ ॥ 4141

(5)*సీ॥ నేను గాంక్షించెడు నిఖిల పూరుషవరుఁ గాపాడుటకుఁ గడుఁ గ్రాలుచుందు
నేను గాంక్షించెడు నిఖిలపూరుషవరు నత్యుగ్రునిగఁ జేయ నరుగుచుందు
నేను గాంక్షించెడు నిఖిలపూరుషవరు సర్వాధిపతిఁ జేయ సాగుచుందు
నేను గాంక్షించెడు నిఖిల పూరుష వరు స్రష్టనుగాఁ జేయఁ జాలుచుందు
గీ॥ నెల్ల సుర సంచయముచేత నెల్ల నరుల,చేత సేవిత మైనట్టి పూత వస్తు
రూపమును బొందు సద్బ్రహ్మరూప మొంది,నేను వచియింతు బ్రహ్మంబు నిశ్చయముగ॥ 4142

(6)*గీ॥ బ్రహ్మవిద్వేషి యగుచుండి ప్రబల హింస
కునిగ నున్నట్టి యసురుని గూల్చుటకయి
యల మహాదేవునకు నేను లలిత చాప
మును గుణంబునఁ గూర్చితి మోద మలర ॥ 4143

*గీ॥ స్తోతృ జనుల నిమిత్తము సురుచిర మగు
జన్యమును జేయఁగాఁ దల్చి సాగుచుందు
భూ దివంబులలోపలఁ బూర్ణ గతిని
నేఁ [3]బ్రవేశించియున్నాను నిశ్చలముగ ॥ 4144

(7)*గద్యము॥
నేను దివమును బుట్టించుచుంటిని. తంతువులయందుఁ బటము వలె నాత్మయొక్క
మూర్ధ్నమందు వియదాది కార్యజాత మంతయుఁ బ్రవర్తిల్లుచున్నది. వ్యాపన
శీలము లగు ధీవృత్తులయందు నే బ్రహ్మచైతన్యము గలదో! యది నాకుఁ
గారణము. నే నిట్టిదాన నగుటచే సమస్తభూతలములయందు వసించు
చున్నాను. సమస్త వికారజాతమును మాయాత్మక మగు నా నా
దేహముచే సృజించుచున్నాను ॥ 4145

(8 *గీ॥ భూత జాతంబు నెల్లను బుట్టఁజేయు
చుందు స్వయము ప్రవర్తిల్లుచుందు నట్లు
పరులచేఁ బ్రేరితముకాని వాయు వెట్లు
స్వేచ్ఛగాఁ[4] దిరుగుచుందునో! విశ్వమందు ॥ 4146

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1.సూటిగ సుఖముగ నావల్లఁ జూచుచుండు, (తా.పా.), 2. ఇక్కడ నింద్రగణమునకు మారు "జగ"ము ప్రయుక్తమైనది. నన్నెరుగనటువంటి యెల్లవారు, (తా.పా.), 3. నేఁ బ్రవేశించియుంటి నిశ్చయముగ, (తా.పా.), 4. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

*గీ॥ పృథ్వికి దివమునకుఁ బైని వెలుఁగుచుండి
బ్రహ్మ చైతన్యరూపనై ప్రబల మహిమ
సర్వ జగదాత్మగా నేను సంభవించి
యున్న దానను నానంద మొందుచుండి ॥ 4147

## సూక్తము—125

ఋషిక—వాఙ్నమ్మి బ్రహ్మవిదుషి
దేవత—ఆంభృణుని దుహిత వాక్కనే బ్రహ్మవిదుషి

### అర్థాంతరము—1

†(1) నిర్మలాష్ట వసువులుగా నిరతమ్మును వర్ధిల్లుచు
రుద్రశక్తిగ వెలయ రూక్షగతులను నిలిచి
ఆదిత్య రూపాల నన్నింట వర్తిల్లి
మిత్రగతి రవిశక్తి మింటిలో వెలుఁగుచున్
ఆ రోదసిని జ్వలన్ మహా వరుణద శక్తి
నశ్వి శక్తులు సృష్టి సపురూప గతులమై
వైష్ణవీయమ్మైన మహోష్ణదీప్తులు వరల
అగ్నిరూపాల్ సృష్టి నతిలోకగతి మీఱ
శబ్ద శక్తులు దివ్య సచ్చిదానందాల
బ్రహ్మరూపముగాఁగ వాక్స్వరూపముగాఁగ
నఖిలాన వ్యాపించి అపురూప శక్తులన్
విశ్వరూపము నొచు విశ్వదేవత లౌదు! ॥ 4148

†(2) సోమాఽమృతశక్తు లలర శుభమయమౌ దీప్తులతో
విశ్వమ్మున వ్యాపింతును విమలప్రాణదమ్ము నొచు
అనారోగ్య రూపమైన వినాశంపు దుశ్శక్తుల
జగదుగ్రతల నన్నిటిఁ బ్రగతిశక్తి రూపుమాపి
నిత్యమైన మాంగళ్యపు సత్యశక్తు లలరారఁగ
భగరూపపు విష్ణు శక్తి వరలఁ బూష దీప్తులతో
నుదయ సృష్టి ప్రభవశక్తు లుజ్జ్వలమౌ నిత్య రతుల
దాత్రశక్తి ప్రసరశక్తి గ్రావలుగా వర్తిల్లఁగ
విశ్వ మెల్ల హవిషమ్మై అశ్విదీప్తులన్ వరలఁగ
సృష్టికర్త దివ్యశక్తి స్రష్టకర్త భవ్యశక్తి

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ధరణధారణములఁ దనర భరణభారణంపు రతుల
వ్యష్టి సమిష్టిగతు లొప్పఁగ సృష్టి యెల్ల విరాజిలఁగఁ
ద్రష్టగాఁగ నఖిలమునకుఁ దనరారఁగ నద్భుతగతి
నజరాఽమర శక్తుల నే నమృతగతుల నమరుచుందు ॥† 4149

†(3) నేనె సర్వజగమ్ములుగ నిరతమ్మును వర్తిల్లుదు
సంగమంపు శక్తులతో సంకలనపు రక్తులతో
నఖిల సృష్టి సంపదలుగ నష్టవసువు లలరారఁగఁ
బ్రప్రథమపు సిరులుగాఁగఁ బ్రకర్షముగ వెల్గుచుండి
విశ్వ సృష్టి తొలియజ్ఞము నశ్విదీప్తులను వరలఁగ
దివ్య దేవ శక్తు లెల్ల భవ్య నవ్య దీప్తులఁ దగ
ఉత్తిష్ఠపు శక్తులతో నొనరఁ దిష్ఠన్ మూర్తి స్థితి
శయనయానసకలరతుల జ్వలితజ్వలన మహితగతుల
బహురూపములను దాల్చుచు బ్రహ్మశక్తి వర్తిల్లఁగ
విశ్వసృష్టి సర్వమ్మున వెలిఁగి ప్రతిది నేనే యౌచు
విశ్వరూపమును దాల్చుచు వివిధగతుల నవితథరతిఁ
గార్య మేనె యౌచుందును గర్తనేనె యగుచుందును
గారణమ్ము నేనె యౌదుఁ గర్మ లెల్ల నేనె యౌచు
సృష్టికర్త సృష్టిరూపు వ్యష్టి సమిష్టిగతు లొప్పఁగ
నఖిలమ్మును నే నౌదును నండాండము పిండాండము
బ్రహ్మాండము లంతర్గతి బాహ్యరూపు లలరంగా ॥ 4150

†(4) అన్నశక్తి నే నౌదును నాహారపు రూపమ్మై
రసన శక్తి నౌచు నేను రాణింతును రుచిరూపుల
స్పర్శశక్తి నే నౌదును జ్ఞానరూపమై వరలఁగ
దృక్ఛక్తిని నే నౌదును దృష్టి దీప్తి గత మ్మౌచు
శ్రవణేంద్రియ శక్తి నౌదు నవితథమౌ ప్రీతిరతిగా
వినుకలిగాఁ దనరారుదు వినువీథుల గుణములుగా
ఘ్రాణశక్తిగాఁ దనరుదు రాణించెడి గాలిగాఁగఁ
బంచప్రాణగతుల మీఱ నంచితముగ సర్వమ్మును
చరాఽచర ప్రపంచమ్ము జడాఽజడ జగము లెల్ల
వర్తిల్లఁగ వర్ధిల్లఁగ బ్రహ్మరూపమై నిత్యము

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

తనరారెద సర్వగతుల ననురూప శక్తులతో
విశ్వరూపమ్ము నౌచు సర్వశక్తు లొప్పారఁగ
సర్వసృష్టి కర్మ నౌచు సకల సృష్టి కర్త నౌచు
నలరారఁగ నేనే విధి ననుసరించి తనరారెద ॥† 4151

†(5) సృష్టిపురుష శక్తి నెల్ల వ్యష్టిసమిష్టి గతు లొప్పఁగఁ
బ్రకృతిరూపు శక్తిగాఁగ నకృతదీప్తిఁ గాపాడుచుఁ
బ్రకృతి పురుషశక్తు లెల్లఁ బ్రజ్వలిల్లి మహోగ్రముగఁ
బ్రకృతి పురుష శక్తులపైఁ బరఁగ సర్వాధిపత్యము
ప్రకృతి పురుష శక్తులలో వరలు సృష్టిరూపు లెల్ల
దివ్య దేవ మానవాది దృష్ట రక్షఃపిశాచాది
సర్వమ్మును నౌచు సృష్టిఁ బర్వెదు నత్యంతశక్తిఁ
జరాచర ప్రపంచమ్ము జడాజడ జగతు లెల్ల
నే నౌచును దనరారుచుఁ బ్రాణముగా వెల్గొందుచు
బ్రహ్మలకే బ్రహ్మకాఁగ వరలఁ గామరూపాలను
దైవీయమ్మౌ శక్తులఁ దనరారుచు విశ్వమ్మున
నతిలోకమ్మౌ గతులను నతివేలమ్మౌ రతులను
నపురూపపు శక్తులతో నసాధారణంపు దీప్తు
లలరారఁగ నిత్యగతుల నమరుదు నే నఖిలమ్మై ॥ 4152

†(6) సృష్టి స్థితి లయగతులకు వ్యష్టిసమిష్టిరతు లొప్పఁగ
నన్నింటిని గాపాడుచు నతివేలపు శక్తులతో
విశ్వ సృష్టి విధ్వస్తము విషశక్తులఁ గావించెడి
దుష్టశక్తితతు లన్నిటిఁ దున్మాడుచు దీప్తశక్తి
రుద్రరూప మౌచు నిలిచి రూక్షదీప్త ధనూరాశి
శరశక్తుల లోలోపల జ్వలిత జ్వాలనంపు శక్తు
లంతరాంతరముల నిలిచి నలరారెద నఖిలమ్మున
విశ్వసృష్టి విలసిల్లెడి విమలమైన బ్రహ్మశక్తి
నిలుపు సర్వశక్తి నేనె నిఖిలమైన శక్తి నేనె
దివి భువి లోకా లన్నిటఁ దేజరిలెడి నగ్నిగోళ
సర్వమ్ముల ననిల గోళ జల గోళాలను నిండుచు
నాకాశము నావరించి అతివేలపు శక్తులతో
లోకహితముగాఁగ జగతిఁ బ్రాకృతగతి తనరంగా
సంకర్షణ రతులతోడ సర్వమ్మును నే నౌదును ॥ 4153

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) ఆకసముల ననిలమ్ముల ననలమ్ముల సలిలమ్ముల
మృత్తతులను నిండినిలిచి మించి సకలరూప మౌచు
సర్వసృష్టి యోనిగా నఖర్వగతుల నలరంగా
సకలలోకగోళా లవి సకృతవికృతసుకృతులుగా
నాత్మరూపమై తనరఁగ నఖిలమ్మును నే నౌదును
భువు లెల్లను మహితమైన దివు లెల్లను బ్రకృతిదీప్త
వరుణ వాయ్వగ్ని మహిత భగ గగనము లలరంగా
నే నౌదును నిత్యమ్మను బ్రాణశక్తి సత్యగతుల
నతిలోకపు శక్తులతో నతివేలపు రక్తులతో
నన్యోఽన్యపు టనుబంధా లవినాభావత్వ మలర
నంతర్గతు లమరంగా నతిబద్ధములై తనరును
నా శక్తియె విశ్వమ్ముగ నానారూపమ్ము లగుచు
నన్నియు సంద్రమ్ము లౌచు నంతరాంతరముల నలర
సర్వవ్యాప్తిత్వ మొప్ప సకలమ్మును నే నౌదును ॥ 4154

†(8) అఖిలాన వ్యాపించు ననిల శక్తులు గాఁగ
నగ్ని శక్తులు గాఁగ నాకాశ శక్తిగా
సలిల శక్తులుగాఁగ సకల మృత్తతులుగా
నా పంచ భూతాల నలరారు సర్వవిధ
గోళాలు లోకాలు వేల లెనయని దివియు
విపులమౌ విశ్వమ్ము నపరిమితమౌ శక్తి
ప్రదక్షిణల నాత్మ ప్రదక్షిణ గతు లలరఁ
జర శక్తు లలరార ధరణధారణ రతుల
భరణభారణరీతు లిరవులై తనరార
నే నౌచు సర్వమ్ము నిర్వికల్పపు దీప్తి
నఖిలమౌ సంసృష్టి కతీతమౌ శక్తిగా
నద్వైతశక్తిగా నమలమౌ ద్వైతముగ
నన్నింటి కధిపతిగ నలరారెదను నేను
సృష్టి స్థితి లయగతులఁ జెల్వొందుదున్ నేనె ॥ 4155

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—125

ఋషిక—వాఙ్నమ్మి బ్రిహ్మవిదుషి

దేవత—అంభృణునిదుహిత వాక్కనేబ్రిహ్మవిదుషి

### అర్థాంతరము—2

†(1) ఏకాదశ రుద్రులతో నెనలేకయె వర్ధిల్లుదు
నష్టవసు సంపదాళి నపురూపముగా వెల్గుదు
ద్వాదశాదిత్యాళులఁ బ్రిభాభాసితుఁడను నౌదు
విశ్వేదేవత లౌచును శాశ్వతదీప్తులఁ దనరుదు
నానాసూర్యులుకాఁగను నానా దిశలను వరలుదు
మిత్రులుగా సృష్టిలోన మింటిలోన వెల్గొందుచు
వరుణరూప మౌచు నేను వర్తిల్లుదు విశ్వమ్మున
ననిలములై పరఁగెద నే ననలములై తనరారెద
నాకాశము నే నౌచును నఖిలమృత్తు లౌదును నే
ననంతతేజములు నేనై నశ్విశక్తు లౌదు నేను
శబ్దశక్తిరూపములై సర్వమ్మున వర్తిల్లుచు
నఖిలమ్మున కాధారము నాధేయము నౌదు నేనె ॥ 4156

†(2) విశ్వసృష్టి రూపములను విధ్వస్తము కావించెడి
సోమామృత మహాశక్తి ధామ మౌచు వెల్గొందుదు
నతివేలపు గతులు మీర నఖిలసృష్టి నొనరించెడి
త్వష్టగాఁగ మూల మౌచుఁ దనరారెద నే నెపుడున్
గగనమునన్ గ్రాంతి కాంతు లగణితముగ వరలుచుండఁ
బూషదీప్తశక్తి నగుదుఁ బూర్ణాగ్నుల నిలయముగా
నాకసమున భగుఁడ నౌచు నతివేలపుఁ గాంతులతో
నైశ్వర్యాదుల నన్నిటి నతిలోకమ్ముగఁ దాల్తును
సృష్టి యెల్ల హవిషముగా నిష్టి హితముగాఁగ నిలువ
దివ్యశక్తు లొప్పారెడి దేవదేవు మహారూపు
నారాధించెడి పురుషుని యజమానుని నఖిలమ్మును
ఉత్తమమౌ పదార్థాల ఉత్పత్తిని గావించుచు
సచ్చిదానందరతుల సకలమ్మును తృప్తివరచి
నిరతగతుల వర్తిల్లును నిర్వికల్ప శక్తు లలర ॥ 4157

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) సకల సృష్టి విశ్వమునకు స్వామి నౌచుఁ దనరారుచు
వసుసంపద లన్నింటికి వరలుదు నేఁ బ్రభువు నౌచు
నిశ్చితమౌ కాలగతుల నిరతమైన క్రమశిక్షణ
లలరారఁగఁ బ్రథమప్రభువు నౌదు నేను నఖిలమ్మున
సత్కర్మల కన్నింటికి సదమల మౌ శక్తితతుల
సర్వ విజ్ఞానరూప జ్వలిత మహా దీప్త మౌచు
విశ్వసృష్టిలోన విపుల విశేషరూప బహుళ మౌచు
సౌర చాంద్ర రూపాళిగ సర్వశక్తి తత్త్వముగా
దేవరూప మౌచు నిలిచి దివ్యత్వము తనరారఁగఁ
బ్రాణికోటు లన్నింటిని బాలించుచు నిత్యమ్మును
జరాఽచరా లఖిలములకు జడాఽజడములకు నెల్లను
అధిపతినై సర్వమ్మును నదుపు లొప్ప నడిపెద నేఁ
బ్రకృతిపురుషపదార్థాలు వరల నవినాభావమైన
అన్యోఽన్యపు సంబంధపు టతిశక్తులు వరలంగా
బహురూపులు విశ్వసృష్టి అహరహమును దాల్చుచుండి
సలరారుదు నిత్యమ్మును నఖిలమ్మును నే నౌచును ॥ 4158

†(4) పంచభూతతత్త్వాలును నంచితమౌ గుణతతులును
నాహారపు మహాశక్తు లారగించు దివ్యశక్తి
గంధలక్షణములఁ బృథ్వి గ్రాలఁగ నే నౌచు నుందు
ఘ్రాణశక్తి ఘ్రాణమునై రాణించెద విశ్వమ్మున
రాజిల్లుచు జలముగాఁగ రసలక్షణమై నిత్యము
రసశక్తికి రసము నౌచు రంజిల్లెద సృష్టిలోన
రూప లక్షణాలు మీర సృష్టి నగ్ని నౌదు నేనె
రూపశక్తి రూపమునై రూపొందెద సృష్టిగతుల
స్పర్శలక్షణమ్ము వరలఁ బరఁగుదు ననిలమ్ముగాఁగ
స్పర్శశక్తి స్పర్శమునై సర్వమ్మును నౌదు నేనె
శబ్దలక్షణమ్ముగాఁగ సకలాఽఽకాశమ్ము లలర
శబ్దశక్తి శబ్దమునై చదలుకుఁ బద లౌదు నేను
బంచభూతరూపతత్త్వా లంచితముగ నే నౌదును
విశ్వసృష్టిలోన నిలుచు విరోధి శక్తు లన్నింటిని
విధ్వస్తము కావించెడి విమలశక్తి నే నౌదును
సృష్టి స్థితి లయ గతులకుఁ జెల్వొందుదు మూలముగా ॥ 4159

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) అక్షరమై అక్షయమౌ నఖిల శబ్దశక్తు లెల్ల
స్వయముగ నే నౌదు సృష్టి జయశక్తుల వెల్గొందెద
జ్ఞాన విజ్ఞాన దీప్తి ప్రాణప్రద శక్తులతో
వరలు జీవకోటి కఖిల పరశక్తిని బ్రాణశక్తి
సర్వస్వము నే నౌదుఁ జలనశక్తి నే నౌదు
మానవావళులతోడ మహిత దేవతాళితోడ
నలరారుదు ననంత చరాఽచరావళులు
జడాఽజడము లన్నియు సకలమ్మును నే నౌచును
గుణకర్మలఁ దనరారెడి అగుణగతుల నలరారెడి
అపురూపపు శక్తి నేను అతివేలపు శక్తి నేను
వ్యష్టి సమిష్టి గతులొప్పెడి సృష్టిరూపు నే నౌదును
సృష్టి స్రష్ట నే నౌదును స్రష్టలకే స్రష్ట నౌదు
స్రష్టస్రష్టల స్రష్ట నౌదు ధ్యానమూల మౌదు నేను
నామరూపగతులు మీరఁ గ్రాలుదు సర్వమ్ము నౌచు ॥ 4160

†(6) సృష్టిశక్తి సర్వమునకు స్థితిశక్తుల కఖిలములకు
బద్ధ విరుద్ధమై ప్రబలెడి బాధగాఢదుశ్శక్తుల
విధ్వస్తము కావింపఁగ విల్లు ధనూరాశిగాఁగ
రుద్రశక్తి కజయ్యమౌ భద్రగతుల శరదమ్ముల
నలరించెదు నిత్యమ్మును నమేయమైన శక్తితతుల
నాకసమున ననిలాలను ననలాలను సలిలాలను
మృత్తతులను దనరారెడి ఋతగోళా లఖిలమ్మును
దివి భువు లన్నియు నేనై తేజరిలుదు సత్యరతుల
జననశక్తి నేనె యౌచు జనకశక్తి నేనె యౌచు
సమదశక్తితో జగతిని సర్వమ్మును నే నౌచును
సృష్టి కారకుండ నౌచు వ్యష్టిసమిష్టి గతు లొప్పఁగ
సృష్టిరూపమౌచు నేనె చెలువొందఁగ సర్వ మౌచు
నాత్మభువమ్మైన శక్తి నఖిలమ్మును నే నౌచును
ఆవిర్భవించెదను నే నఖిలాంతర్యామిగాఁగ ॥ 4161

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) సర్వసృష్టి మాతృపితృ సర్వస్వము నే నౌదును
మూర్ధశక్తి నే నౌదును మూర్తిశక్తి నే నౌదును
యోనిశక్తి నే నౌదుఁ బ్రయోగాంతర్గతులు తనరఁ
బంచభూత పదార్థాల నంచితమౌ సముదాయిలు
నఖిల సృష్టి గోళాలై ఆధిపత్యముగ లోకాలై
అలరఁగ నన్నింటనుండు నఖిలాంతర్యామిగాఁగ
ఆకసముగ నావరించు ననంత గోళ లోకా లవి
ఆకర్షణ శక్తులతో నమరొందుచు స్థితిగతులను
ఆత్మ ప్రదక్షిణల నలరఁగఁ బ్రదక్షిణల
నన్నియుఁ జరించుచుండు నసాధారణంపు శక్తి
ననవరతము నద్భుతగతి నతివేలముగా వరలుచు
మదీయమ్మైన శక్తులతో మహిమాన్విత దీప్తులతో
అఖిలమ్మును సృష్టించుచు నమలమైన స్థితిగతులను
నలరారఁగ నే నౌదును నంతయు మత్ప్రకృతి కాఁగ ॥ 4162

†(8) వాయుశక్తి నౌచు నేను వరలి సర్వ విశ్వమ్మున
ననల సలిల గోళాలను నవనీతల గోళాలను
నన్నింటిని గదలించుచు నఖిలాంతర్యామి శక్తి
దివి భువి లోకా లన్నియుఁ బూర్ణగతులఁ దనరారఁగ
సృష్టించుచు సర్వమ్మును స్థితిగతులను గాపాడుచు
వామరూపమైన శక్తి నియమ మొప్ప సృష్టిలోన
లయగతులను నాశమ్మును లక్ష్యశుద్ధి నొనరించుచు
మహిమాన్వితమైన శక్తు లహరహమును వర్తిల్లఁగ
విహితమైన మూర్తిత్రయ మహితవిధులు వరలంగా
సృష్టి స్థితి క్రియలు చెలఁగంగా లయ క్రియలు
నఖిలమ్మును నేనె యౌచు నాధిపత్య దీప్తగతుల
నిహపరరూపావళులను నిష్ఠాపూర్తమ్ముగాఁగ
విశ్వరూపగతులు తోప శాశ్వతాఽశాశ్వత రతి
నఖిలమ్మును నడుపుదు నే నంతయు నా రూపముగా ॥ 4163

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†క॥ అనలాలకు మూలము నై
అనిలాలకు మూల మౌచు నాకసములకున్
వనములకున్ మూలము నై
తనరారుదు నాధిపత్య తత్త్వము వరలన్ ॥ 4164

## సూక్తమ్—126

ఋషిః—శైలూషిః కుల్మలబర్హిషో, వామదేవ్యోఽహోముగ్వా
దేవతా—విశ్వేదేవాః
ఛందః—ఉపరిష్టాద్బృహతీ; 8-త్రిష్టుప్

(1) న తమంహో న దురితం దేవాసో [1]అష్ట మర్త్యమ్ ।

సజోషసో యమర్యమా మిత్రో నయన్తి వరుణో [2]అతి ద్విషః ॥ 1428

(2) తద్ధి వయం వృణీమహే వరుణ మిత్రార్యమన్ ।

యేనా నిరంహసో యూయం పాథ నేథా చ మర్త్యమతి ద్విషః ॥ 1429

(3) తే నూనం నోఽయమూతయే వరుణో మిత్రో[3] అర్యమా ।

నయిష్ఠా[4] ఉ నో నేషణి పర్షిష్ఠా[5] ఉ నః పర్షణ్యతి ద్విషః ॥ 1430

(4) యూయం విశ్వం పరి పాథ వరుణో మిత్రో[3] అర్యమా ।

యుష్మాకం శర్మణి ప్రియే స్యామ సుప్రణీతయోఽతి ద్విషః ॥ 1431

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1.దేవాసోఽఅష్ట, 2. వరుణోఽఅతి, 3. మిత్రోఽఅర్యమా, 4. నయిష్ఠాఽఉ నో, 5.పర్షిష్ఠాఽఉ నః.(వా.ప్ర.)

(5) ఆదిత్యాసో [1]అతి స్రిధో వరుణో మిత్రో [2]అర్యమా ।

ఉగ్రం మరుద్భీ రుద్రం హువేమేన్ద్రమగ్నిం స్వస్తయేఽతి ద్విషః ॥ 1432

(6) నేతార[3] ఊ షు ణస్తిరో వరుణో మిత్రో[2] అర్యమా ।

అతి విశ్వాని దురితా రాజానశ్చర్షణీనామతి ద్విషః ॥ 1433

(7) శునమస్మభ్యమూతయే వరుణో మిత్రో[2] అర్యమా ।

శర్మ యచ్ఛన్తు సప్రథ[4] ఆదిత్యాసో యదీమహే[5] అతి ద్విషః ॥ 1434

(8) యథా హ త్యద్వసవో గౌర్యం చిత్ పది షితామముంచతా యజత్రాః ।

ఏవో ష్వంస్మన్ముంచతా వ్యంహః ప్ర తార్యగ్నే ప్రతరం న[6] ఆయుః ॥ 1435

## సూక్తము—126

ఋషి—శిలూషపుత్రుఁడు కుల్మలబర్హిస్సు లేక వామదేవ పుత్రుఁడు అహోముచుఁడు†

దేవత—విశ్వేదేవతలు†

(1)*గద్యము॥

అర్యమ, మిత్రుఁడు, వరుణుఁడు, వీరు ముగ్గురును సంగతులై శత్రువుల నతిక్రమించి యే స్తోతను నభిమతదేశమును బొందించుచున్నారో; ఓ దేవతలారా! ఆ మర్త్యుని దురితము, తప్పలరూప దుర్గమనమును బొందదు ॥ 4165

---

1. ఆదిత్యాసోఽఅతి, 2. మిత్రోఽఅర్యమా, 3. నేతారఽ ఊషుణ, 4. సప్రథఽఆదిత్యాసో,

5. యదీమహేఽఅతి, 6. ప్రతరం నఽఆయుః. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 149వ పుటలో నీ సూక్తమునకు ఋషి "శిలూషపుత్రుఁడు కుల్మలబర్హిస్సు"గాను, దేవత "విశ్వే దేవతలు" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "కుల్మాల బర్హిషుఁడు అహోముచుఁడు" ఋషిగాను, "విశ్వే దేవతలు" దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(2)*గీ॥ వరుణమిత్రార్యములు! మీరు నరుని పాప
హీనునిగఁ జేయ నెద్దానిఁ బూనుచుంద్రు
దేనిచేఁ గాంక్షితము నొందు [1]మానవుండు
నట్టి రక్షను గోరెద మతిశయముగ ॥ 4166

(3)*గీ॥ వరుణమిత్రార్యములు! మాకుఁ బరమ రక్ష
నొసఁగుటకు నుండుఁడీ! [2]మీర లుచిత రీతి
వివిధ పారయితవ్యహౌ [3]విషయమందు
దాఁటఁజేయుఁడు! మమ్ముల దరచు నరుల ॥ 4167

(4)*గీ॥ వరుణమిత్రార్యములు! మీరు కరము లోక
పాలనంబును జేయుఁడీ! లీల మమ్ము
యుష్మదీయ సుఖంబున నునిచి శత్రు
వులను దాఁటింపుఁడీ! కడు నెలమి మీర ॥ 4168

(5)*చ॥ వరుణముఖాది దేవతలు వైరుల మార్గమునుండి మమ్ములన్
స్థిరముగ బైటఁబెట్టఁ గడుఁ [4]దేకువ నిల్తురుగాకఁ బ్రీతితోఁ
బరమ మరుత్తులన్ మరియుఁ బావకు నింద్రుని స్వస్తి గోరి మే
మరమర లేక పిల్తుము మహోరుల వారలు నిగ్రహింపుతన్! ॥ 4169

(6,7)*గద్యము ॥

నేత లగు వరుణాదిదేవతలారా! మా పాపములు తిరోధానము లగునట్లు మీరు సేయుదురుగాక!
మనుజులకు స్వాములై దేవతలు సర్వదురితములను బాప ఫలరూపములైన వానిని మాకు
లేకుండఁజేయుదురుగాక! మా విద్వేషులను దొలఁగింతురుగాక! వరుణాది దేవతలు
రక్షకై సుఖము మా కిచ్చెదరుగాక! అదితి పుత్రు లగువారు సర్వతః విస్తీర్ణ మగు
సుఖమును మా కిచ్చెదరుగాక! శత్రువులను నశింపఁజేయుదురుగాక! ॥ 4170

(8)*గద్యము॥

వాసకులు యాగార్హులు నగు మిత్రాదిదేవతలారా! మీరు ప్రసిద్ధులరై పాదబద్ధయు,
గౌరవర్ణయు, సోమక్రయణియు, నగు గోవు గంధర్వులను విడిచినట్లు[5] మా
పాపములను దొలఁగింపుఁడు! ఓ యగ్నీ! మా యాయుర్దాయమును
వృద్ధిఁ జేయుఁడు! ॥ 4171

---

***రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి**

1.మానవుఁడు కడు, (వ్రా.ప్ర.పా. గణభంగము), 2.మీర లసమగతిని, (తా.పా.), 3.పారతవ్యహౌ, (వ్రా.ప్ర.పా.)
4. కడు శీఘ్రము నిల్తురుగాక, (తా.పా.), 5. విడిచినట్లు విడువుడు. అట్లే మా పాపములను. (తా.పా.)

## సూక్తము—126

ఋషి—శిలూషపుత్రుఁడు కుల్మలబర్హిస్సు లేక వామదేవపుత్రుఁడు అహోముచుఁడు
దేవత—విశ్వేదేవతలు

## అర్థాంతరము—1

†(1) దిక్పాలకు లెల్లరున్ దేజరిల్లు శక్తులతో
ప్రాగ్దిశలో నింద్రుండును నాగ్నేయమ్మున నగ్నియు
దక్షిణదిశలో యముఁడును దగ నైఋతి నిర్ఋతియును
బశ్చిమదిశ వరుణుండును వాయువు వాయువ్యమ్మున
నుత్తరదిశ నుబేరుండు నుజ్జ్వలగతిఁ దనరారఁగ
జాతవేద హౌచు నిలిచి సప్త జిహ్వాకాఁగ వెలిఁగి
హవ్యవాహనమ్ముగాఁగ నశ్వోదర శక్తిగాఁగ
వైశ్వానర రూపగతుల వరలు కౌమార రతుల
విశ్వముఖము దేవముఖము విశిష్టతల వెల్గొందును
నష్టమూర్తు లగు నగ్నులు నపురూపపు దీప్తులతో
మిత్ర వరుణ శక్తులతోఁ జిత్రచిత్రకాంతులపై
అష్టదిశల నావరించి నఖిల తమో దురిత రాశి
దుష్టరాక్షసాది వర్గ దుర్మార్గగ సంఘాలను
విధ్వస్తము కావించును విమలార్యమశక్తి గతుల ॥ 4172

†(2) అనిల సలిల శక్తులతో ననల మృత్తతులతోడ
నాకాశపు రూపమ్ముల నపురూపపు గుణ రాజుల
నతిలోకమ్మౌ దీప్తుల నర్యమ శక్తుల వరలుచు
వరుణ మిత్ర శక్తులతో నరిజాలము రూపుమాపి
పంచభూత సంచయాల నంచితగుణ రూపాళుల
నావరించుదుష్టతత్వ నాశనమ్ము నొసరించుచు
వ్యష్టి సమిష్టి రీతులతో సృష్టి నమరు కిల్బిషతతి
నఘజాలము లఖిలమ్మును నద్భుతగతి నాశముగా
ద్వేషించుచు నిరతగతుల విధ్వస్తము కావించుచు
సకలలోక జాలమ్ముల సంరక్షణఁ జేయుఁ బ్రగతి
నా సర్వేశుఁడు లీలగ నద్భుతమౌ మాయరతులఁ
బాపరహితమైన దివ్య పవిత్రతల పుణ్యగతుల ॥ 4173

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) అణిమ మహిమ లఘిమలతో నలర గరిమ మీశత్వము
వశిత్వమ్ము ప్రాప్తియు నా ప్రాకామ్యము లలరంగా
వరుణ ఋషభ నహుష జయ ప్రత్యూషాఽనిల ప్రభాస విష్ణు
దేవతాశి స్థితిశక్తులఁ దేజరిలుచు వరలంగా
నియమ రహితగతులు మీఱ నిరతమ్మును వర్తిల్లుచు
నఖిలమ్మున వ్యాపింపఁగ నాధిపత్యరూప మంద
విజృంభించు దుష్టదురిత విషశక్తుల నన్నింటిని
నతిలోకపు శక్తులతో నతివేలపు దీప్తులతో
విధ్వస్తము కావించుచు విశ్వసంక్షేమరతుల
సృష్టి స్థితి శక్తితతులు చెలువారఁగ నఖిలమ్మునఁ
బార మెనయనట్టి రూపు లవారితముగ నొప్పారఁగ
నఖిలమ్మున వ్యాప్త మౌచు నపురూపపు శక్తులతో
విశ్వదేవ శక్తు లెల్ల నశ్వి దీప్తు లొప్పారఁగ
నతిలోకమ్ముగ నిల్చును నతులితమౌ శక్తులతో ॥ 4174

†(4) వరుణార్యమ మిత్రదేవ ప్రభాభాసితమ్ము కాఁగ
నాకాశాఽనిలశక్తుల ననల సలిల మృత్తతులను
నఖిల గోళ లోకాలను నావరించు దుర్గుణతతి
రాక్షస గుణగణభరితపుఁ బక్షమ్మై దుష్టపూర్ణ
రూప మలరు కిల్బిషాల రూపుమాప నిత్యమ్మును
ఖరకరకర కాంతిజాల మరుణారుణ కాంతు లలర
నిరతమ్మును బ్రసరింపఁగ నిఖిలము సందీప్తముగా
విశ్వసంక్షేమగతుల శాశ్వతాఽశాశ్వతరతి
సృష్టి శుభంకరముగాఁగ వ్యష్టి సమిష్టి రతులతోడ
సర్వసౌఖ్య సంపదాశి పర్వుచు వర్ధిల్లుచుండ
సహజమైన శక్తులతో సర్వమ్మును విలసిల్లుచు
విశ్వగోళ లోకా లవి వివిధగతుల విరాజిలఁగ
ననుకూల శక్తితతుల తనురూపుల రూపుమాపి
అనుకూలపు శక్తిరతుల నభ్యుదయము వర్ధిల్లును ॥ 4175

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) అతిలోకమ్మౌచు వరలు నాదిత్యపు శక్తులతో
వరుణ మిత్ర దేవతాళి వరలెడు నా అర్యముండు
నాకసమ్ము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును నుగ్రములై రుద్రశక్తు లొప్పారఁగ
దుర్మలముల దుష్టతత్వ దుర్గుణముల నన్నింటిని
విద్వేషము చెలరేగఁగ విధ్వస్తము కావించుచు
వైష్ణవీయమైన యింద్ర భాసమేత జ్వలనశక్తి
అతిలోకపు శక్తులతో నతివేలపు దీప్తులతో
నపురూపపు మహనీయత లలరంగా సృష్టిలోన
నత్యంతము శుభకరమౌ నసాధారణంపు శక్తి
స్వస్తిమయముగా విశ్వము సర్వస్వము వర్ధిల్లఁగ
దివ్యమైన దైవశక్తి ధృతమై సర్వాస వరల
ననూహ్యమైన రక్తితతుల ననవరతము వర్తిల్లుచు
సృష్టిస్థితిలయగతు లవి చెలఁగు సర్వ కాలమ్ముల ॥ 4176

†(6) జలశక్తులఁ బాపమ్ములు ప్రక్షాళనమై పోవును
పరమ పవిత్రతలు సత్యపావనగతి వర్తిల్లును
శుద్ధ మౌచు సర్వస్వము శుచిమిత్రిత వరలంగా
నగ్నితనరుఁ బవిత్రతల భగ్నముగా నపవిత్రత
అనిల శక్తు లలరారును నపవిత్రత నవలఁ ద్రోయఁ
బృథ్వీశక్తి పవిత్రమై విషరూపపు దుశ్శక్తుల
విలీనముగ వినాశముగ విమలగతుల నొనరించును
సృష్టి స్థితి లయ శక్తులఁ జెల్వొందఁగ నర్యమగతి
వరుణాగ్నులు విశ్వమ్మున వరలంగా సత్యశక్తి
నాధిపత్యరతులు మీఱ నతిలోకపు ధారణగతి
భరణధారణములు తనర భాస్వంతము లౌచు సృష్టి
సర్వగోళ లోకా లవి చరాఽచరము లౌచుఁ దనరుఁ
బాపపుంజ పూరితమై ప్రబలు కిల్బిషముల నెల్ల
రూపుమాపి వైష్ణవీయ రూపశక్తి విజృంభించు ॥ 4177

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) సలిలశక్తి విశ్వమ్మున సదమలమౌ ప్రాణ మొసఁగి
మిత్రశక్తి అఖిలమ్మునఁ బవిత్రదీప్త తేజ మొసఁగి
అర్యమ దైవీయశక్తి అమలమౌ నారోగ్య మొసఁగి
బ్రతుకురక్ష నీయ సృష్టి బ్రహ్మశక్తు లిచ్చి సదా
ఆదిత్యాత్మక మైన విశ్వవేద మహారూప మలర
నఖిలపంచభూతములౌ నాకసమ్ము లనిలమ్ములు
ననలమ్ములు సలిలమ్ములు నామృత్‌తతు లన్నింటను
నావరించు దుశ్శక్తుల నన్నింటిని బారఁదోలి
విధ్వస్తము కావించుచు విమలశక్తు లలరారఁగ
విస్తృతమౌ శర్మమ్ములు విశ్వమ్మున వ్యాప్తి చెందఁ
జరాచర ప్రపంచముల శక్తిమత్తత్త్వములుగఁ
బనరారఁగఁ బ్రాణసత్వ మనుమేయముగా వెల్గఁగ
విశ్వసృష్టి శత్రుతతుల వినాశమ్ము కావించుచు
నశ్విశక్తు లొప్పారఁగ నా దైవత దీప్తు లలర ॥ 4178

†(8) అష్టవసురూపులౌ నఖిల దేవాఽఽవళులు
విశ్వసృష్టి యజ్ఞమ్మున విమలమైన శక్తులతో
అతిలోకమ్మైన దీప్తి నతివేలపురతులు మీఱఁ
జిదూప్రపవుఁ బాదములను సదూప్రపము తనరారఁగ
గౌరవర్ణ దీప్తితతులు గాఢములై ప్రకృతి మీఱ
నలరారఁగ నపురూపపు టమృత సోమ రసశక్తులు
నఖిల సృష్టి ననునిత్యము నత్యంతము ప్రాణదమై
అపూర్వ మౌచు నమేయమైన అనంతమైన శబ్ద శక్తు
లా రోదసు లెల్ల నిండి అంతరాంతరముల నిండి
విస్తృతముగఁ బుట్టి పెరిగి విశ్వమ్మున వ్యాపించెడి
దుష్టమైన కిల్బిషాల దురితములౌ కశ్మలముల
మర్మగతులు తనరారెడి మలరూపము లన్నింటిని
నిర్మూలన మొనరించుచు నిత్యదీప్తి పర్థిల్లఁగ
నాయుర్దాయమ్ము సృష్టి కమరఁజేయు దైవశక్తి ॥ 4179

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—126

ఋషి—శిలూషపుత్రుఁడు కుల్మలబర్హిస్సు లేక వామదేవ పుత్రుఁడు అంహోముచుఁడు
దేవత—విశ్వేదేవతలు

### అర్థాంతరము—2

†(1) అష్టదిశలను దనరు నా మర్త్యరూపముల
నావహించుచుఁ దమము లకృత పాపములుగా
నఖిలాన వ్యాపించి అంధకారము కాఁగ
నాదిత్య దేవతతి అద్భుతావహ దీప్తి
ఆ సూర్య కాంతులను సమాన గతులతో
నుషశక్తు లొప్పార నుజ్జ్వల ప్రభలమైఁ
దిమిరాళి దురితాళిఁ దేజమ్ములను దునుము
దైవీయమౌ శక్తి తనరార విశ్వాన
యమగతుల నొప్పారు సర్యమ శక్తులున్
మిత్ర రూపమ్మైన చిత్రకాంతులు వరలు
దివ్య సూర్యుల దీప్తి తేజరిల విశ్వాన
సలిల పతిగాఁ బరఁగు జలదేవ వరుణుండు
నపురూప శక్తుల నలరారఁగా సృష్టి
నంతయు దీప్తమౌ ససాధారణ ప్రభల ॥ 4180

†(2) అంతరాంతర గతుల ననలమ్ము తనరారు
జలదేవతా శక్తి సర్వాన వరలఁగా
మిత్రరూప మ్మొంచు మిన్నంటి వెల్గొందు
నగ్నిరూపగ దీప్తు లమరంగ నిత్యమ్ము
అతిలోకమై వెలయు నతివేల దైవీయ
శక్తి దీప్తులతోడ సకలాన వ్యాపించు
నర్యమ శక్తులే అపురూపమై తనర
నాకాశములలోను ననిలాల ననలాల
సలిలాల మృత్తతుల సర్వగతి వ్యాపించు
దుర్మృత్ప్రియమై తోయ వాయ్వాళులన్
ఉష్ణశక్తుల నిలిచి ఒనరఁ బాంచ భౌతికత
కపకృతుల నొనరించు నఖిలదుష్క్రమితతుల
విధ్వస్త మొనరించి విశ్వ సంక్షేమాల
వ్యాప్తిత్వమును జేయు వరల రక్షణ గతులు ॥ 4181

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) స్వయంప్రభాశక్తిదమై సర్వస్వము వరలంగా
వివిధాష్టవిధ వసువులు నవదీప్తులఁ దనరారఁగఁ
దొట్టతొలి సుసృష్టి మహాఽదృష్ట శక్తితత్త్వ మెల్లఁ
జంద్రదేవ దివ్యశక్తి సౌరమండలాల రూపు
లలరంగా విశ్వమ్మున నద్భుతమౌ పురుషశక్తి
ప్రకృతిమాత సుకృతరూప పవిత్రత పరఁగంగా
నతివేలమ్మౌ రూపుల నతిలోకమ్మౌ శక్తుల
నపురూపపు దీప్తులతో నసాధారణంపు గతుల
నా రోదసి మొదలుగాఁగ సనిలాఽనల సలిల శక్తు
లవనిరూప తతు లన్నిటి నన్యోఽన్యపు రతులు మీఱ
నవినాభావమ్ములైన అనుబంధాలెల్ల వరల
ననేకాఽనేకమైన అఖిలాఽఖిల రూపమ్ములఁ
బంచప్రాణరూపదీప్తు లంచితమ్ములై తనరఁగ
నంతరాంతరములఁగతుల నఖిలభూతములు వరలును ॥ 4182

†(4) నేనె! విశ్వప్రకృతికాఁగ నేనె! పురుషశక్తికాఁగ
నాహారము నే నౌచును నన్నిటి వీర్యమ్ము నౌచుఁ
బ్రాణరూపమై తనరుచుఁ బ్రాణప్రదమై వరలెడి
సోమాఽమృత శక్తు లెల్ల శూన్యమ్మున దీప్త మౌచు
సౌరచాంద్రశక్తుల నసాధ్యమైన దివ్యవీర్య
తత్త్వమ్ములు రోదసిలోఁ దనరారఁగ చిన్మయగతి
నుజ్జ్వలమై సత్యరతులఁ బ్రజ్వలమై నిత్యగతుల
సత్యతత్త్వ మఖిలజగతి సదమలగతి వర్తిల్లఁగ
శబ్దరూపమైన శక్తు లబ్ధకామ రూపాలుగ
ఘనములౌచు వ్యాప్తి చెంద గగనాఽనిలాఽనలముల
సలిలమ్ముల మృత్తులను విలసిల్లఁగ నిత్యదీప్తి
సర్వ మాహార మౌచు సకల మాహార్య మౌచు
సమస్త భక్షకమ్ము గాఁగ సర్వరక్షకమ్ము కాఁగ
విశ్వశక్తి తనరారును నశ్విదీప్తు లలరారఁగ
విశ్వసృష్టి నౌచు నేనె విశ్వశ్రవణమ్ము నౌచు
విశ్వప్రాణమ్ము నౌచు విమలోఛ్వాసనిశ్వాసలు
సర్వేంద్రియ రూప మలరి సకలేంద్రియ కర్మలునై
నలరుదు నే నిత్యసత్యత నఖిల చరాఽచరములలో ॥ 4183

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) సకలశక్తి సమన్వితుఁడు సర్వాంతర్యామిగాఁగ
నాకసంపురూపు లౌచు ననిలమ్ములుగాఁ దనరుచు
ననలమ్ములుగా వెలుఁగుచు నలరుచు సలిలమ్ముగాఁ
బృథ్వీరూపమ్ము లౌచు విశ్వసృష్టి రూపాలుగ
విరాడూర్ధ్వ మూల మౌచు వివిధపదార్థాళిగాఁగ
అణువరమాణువు లౌచును నఖిల గరీయమ్ము లౌచు
వరుణమిత్రరూపాలుగ వరలు దివ్యదేవాళిగ
నతిలోకమ్మౌ వ్యాప్తుల నతివేలమ్మౌ దీప్తుల
నప్రరూపమ్మౌ శక్తుల నఖిలమ్మును దా నౌచును
నాదిత్యమహారూప దేదీప్యమానగతుల
రుద్రశక్తి వర్ధిల్లఁగ ఋతమౌ నింద్రాఽగ్ని శక్తు
లలరారుచు దుష్టశక్తు లఖిలమ్మును ధ్వంసముగా
విష్ణుపరమ్మైన మహావిశ్వరూప దీప్తశక్తి
నిత్య సత్య మౌచు నిలిచి నిఖిలమ్మున వెల్గుచుండు ॥ 4184

†(6) సౌరమండలాధిపతిగ వేల లెనసి తనరారుచు
నరుణారుణ దీప్తులతో నలరారెడి నరుణులకును
నఖిల సౌరమండలాలు నద్భుతగతిఁ దనరంగా
నాధిపత్య మొప్ప నడుపు నాదిత్యద్వాదశకము
వరుణశక్తి మిత్రశక్తి వరదేవాఽర్యమ శక్తులు
నంత మెనయనట్టి జగతి నఖిలగోళ లోకాలను
విస్తరిల్లు మహాదురిత విష కిల్బిష శక్తితతుల
విధ్వస్తము కావించుచు విశ్వ సంక్షేమ గతుల
నతిలోకపు శక్తులతో నతివేలపు దీప్తులతో
ననంతమైన రూపాలను ననూహ్యమైన దివ్యతత్త్వ
పవిత్రతలు వరలంగా నవినాశన మహారూప
శక్తితత్త్వమై వెలుఁగుచు సత్యనిత్యతలు తనరఁగ
సర్వసృష్టి స్థితి లయాల చక్రనేమిక్రమ గతులను
నడుపు వైష్ణవీయ జగన్నాటకమ్ము కాఁగను హరి ॥ 4185

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) అఖిలసృష్టిరూప మౌచు నలరారుచు మహితశక్తి
నాకసమ్ము లనిలమ్ము లనలమ్ములు సలిలమ్ములు
మృత్తతు లవి పరంగంగా సత్తత్త్వము చిత్తత్త్వము
నానందపుఁ దత్త్వ మెనసి నన్యోఽన్యత వరలంగా
నవినాభావాల మీఱ ననుబంధపు సంబంధా
లతిలోకపు శక్తులతో నతివేలపు దీప్తులతో
ననంతమైన రతులతోడ ననూహ్యమైన గతులు మీఱ
నలరారును నిత్య సత్య చలనశక్తి తనరంగా
వరుణదేవ మిత్రదేవ తరణ్యాద్యర్యములును
ద్వాదశాదిత్యరూప పరవర దైవీయమైన
శక్తితతులు పరగంగా సర్వాధిపత్య మలర
సకల ప్రకృతి శుభదమ్మై శాంతిసౌఖ్య సంపదలను
వర్ధిల్లఁగఁ జేయ సృష్టి ప్రాకృతమౌ విషశక్తులఁ
గశ్మలములఁ గిల్బిషములఁ గ్రాంతిదీప్తు లెల్ల విరియ
విధ్వస్తము కావించుచు విశ్వారోగ్యాల భాగ్య
తత్త్వ మెల్ల వెల్లివిరియఁ దనరు వైష్ణవీయశక్తి ॥ 4186

†(8) నాలుగు పాదమ్ములతో నాలుగు యుగ కాలమ్ములఁ
జిద్రూపము నిత్యగతులఁ జెలఁగు విలాసాల రతుల
నఖిల గోళ లోకాలను నసాధారణముగ నలరి
వ్యాప్తిత్వము నందంగా వసుశక్తులు సకలమ్మును
బురుష వీర్య సృజనరతులు చరము లచరములును వెలయ
సృష్టియజ్ఞకర్తగాఁగఁ జెల్వొందుచు దేవదేవుఁ
డఖిలమైన విశ్వమునకు నాయువుగాఁ దనరారుచు
నాయుష్కర్తగ భర్తగ నద్భుతమౌ చలనశక్తి
సచ్ఛక్తుల నన్నింటిని సమూలముగ విసర్జించి
దుష్టశక్తితత్త్వాలను దురిత భరిత రూపాలను
ద్రుంచివైచి విశ్వమ్మునఁ బెంచి ఆనందపురతి
నతిదీర్ఘముగాఁ దనరెడి అనంతకాల బద్ధములై
నియతగతులఁ బ్రకృతిరూప నిఖిలలోక గోళాదులు
సంచరించుచుండు సృష్టి సర్వేశుని లీల కాఁగ ॥ 4187

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†ఆ॥వె॥ నింగు లనిలములును నిప్పులు సలిలముల్
నేల లన్నియును ననేక గతుల
నెడతెగని రతులను నెల్లని రూపమై
విశ్వరూప మొౘు వెలుఁగుచుండు ॥ 4186

## సూక్తమ్—127

ఋషిః—కుశికః సౌరభః,రాత్రిర్వా భారద్వాజీ
దేవతా—రాత్రిః
ఛందః—గాయత్రీ

(1) రాత్రీ వ్యఖ్యదాయతీ పురుత్రా దేవ్యఁక్షభిః ।
విశ్వా[1] అధి శ్రియోఽధిత ॥ 1486

(2) ఓర్వప్రా[2] అమర్త్యా నివతో దేవ్యుఁద్వతః ।
జ్యోతిషా బాధతే తమః ॥ 1487

(3) నిరు స్వసారమస్కృతోషసం దేవ్యాయతీ ।
అపేదు హాసతే తమః ॥ 1488

(4) సా నో[3] అద్య యస్యా వయం ని తే యామన్నవిక్ష్మహి ।
వృక్షే న వసతిం వయః ॥ 1489

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. విశ్వాఽఅధి, 2. ఓర్వప్రాఽఅమర్త్యా, 3. సానోఽఅద్య. (వా్ర.ప్ర.)

(5) ని గ్రామాసో అవిక్షత ని పద్వన్తో ని పక్షిణః ।
ని శ్యేనాసశ్చిదర్థినః ॥ 1440

(6) యావయా వృక్యం వృకం యవయ స్తేనమూర్మ్యే ।
అథా నః సుతరా భవ ॥ 1441

(7) ఉప మా పేపిశత్ తమః కృష్ణం వ్యక్తమస్థిత ।
ఉష [2]ఋణేవ యాతయ ॥ 1442

(8) ఉప తే గా[3] ఇవాకరం వృణీష్వ దుహితర్దివః ।
రాత్రి స్తోమం న జిగ్యుషే ॥ 1443

†(9) ఆ రాత్రి పార్థివం రజః పితరః[4] ప్రాయు ధామభిః ।
దివః సదాంసి బృహతీ వి తిష్ఠస ఆ త్వేషం వర్తతే తమః ॥ 1444

†(10) యే తే రాత్రి నృచక్షసో యుక్తాసో నవతిర్నవ ।
అశీతిః సంత్వష్టా[5] ఉతో తే సప్త[6] సప్తతీః ॥ 1445

---

1. గ్రామాసోఽఅవిక్షత, 2. ఉషఽఋణే, 3. తేగాఽఇవా, 4. పితురః ప్రాయి, పితరప్రాయు,పితురప్రాయి, పితురఃప్రాయు, 5. సన్త్యష్టా, 6. సప్తతిః, సప్తతి. (ప్రా.ప్ర.)

†ఋగ్వేదము దశమ మండలములోని యీ 127వ సూక్తములో 9 మొదలు 22 వరకుఁ బదునాల్గు ఋక్కు లధికముగాఁ గొన్ని వ్రాతప్రతులలోఁ గలవు. వీటిని "ఖిల" మంత్రములుగాఁ గొందఱు భావింపఁ బరిశిష్టములుగాఁ గొంద రను బ్రక్షిప్తము లని మరికొందఱును నధికపాఠము లని వేరొక కొందరును భావించిరి.

†(11) రాత్రీం ప్ర పద్యే జననీం సర్వభూతనివేశనీమ్ ।
భద్రాం భగవతీం కృష్ణాం విశ్వస్య జగతో [1]నిశామ్ ॥ 1446

†(12) సంవేశినీం[2] సంయమినీం గ్రహనక్షత్రమాలినీమ్ ।
ప్రపన్నోఽహం శివాం రాత్రీం [3]భద్రే ప్రారమశీమహి ॥ 1447

†(13) స్తోష్యామి ప్రయతో దేవీం శరణ్యాం బహ్వృచప్రియామ్ ।
సహస్రసంమితాం దుర్గాం జాతవేదసే సునవామ సోమమ్ ॥ 1448

†(14) శాన్త్యర్థం తద్ ద్విజాతీనామృషిభిః [4]సోమపాశ్రితాః ।
ఋగ్వేదే త్వం సముత్పన్నాఽరాతీయతో ని దహాతి వేదః ॥ 1449

†(15) యే త్వాం[5] దేవి ప్ర పద్యన్తి బ్రాహ్మణా హవ్యవాహనీమ్ ।
అవిద్యా బహువిద్యా వా [6]స నః పర్షదతి దుర్గాణి విశ్వా ॥ 1450

†(16) యే అగ్నివర్ణాం[7] శుభాం సౌమ్యాం కీర్తయిష్యన్తి యే ద్విజాః ।
తాంస్తారయతి దుర్గాణి నావేవ సిన్ధుం దురితాత్యగ్నిః ॥ 1451

†ఇవి "ఖిల" మంత్రములు. (చూ. 773వపుటలోని †గుర్తు కల తెలుఁగు ఫుట్‌నోటు.)

1. దిశామ్, 2. సంవేశనీం సంయమనీం గృహం, 3. భద్రే ప్రారమశీమహ్యోంనమః, 4. సముపాశ్రితాః,

5. త్వాం దేవ ప్రపద్యన్తే, 6. సా నః, 7. అగ్నివర్ణాం సోమ్యాం సౌమ్యాం. (వ్రా.ప్ర.)

†(17) దుర్గేషు విషమే ఘోరే సంగ్రామే రిపుసంకటే ।
అగ్నిచోరనిపాతేషు దుష్టగ్రహ[1]నివారిణి ॥ 1452

†(18) దుర్గేషు విషమేషు త్వం[2] సంగ్రామేషు వనేషు చ ।
మోహయిత్వా ప్రపద్యన్తే తేషాం మే [3]అభయం కురు ॥ 1453

†(19) కేశినీం సర్వభూతానాం పఞ్చమీతి చ నామ[3] చ ।
సా మాం సమా[4] నిశా దేవీ సర్వతః [5]పరి రక్షతు ॥ 1454

†(20) తామగ్నివర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టాం ।
దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః సుతరసి తరసే నమః ॥ 1455

†(21) ఉలూకయాతుం శుశులూకయాతుం జహి శ్వయాతుముత కోకయాతుమ్ ।
సుపర్ణయాతుముత గృధ్రయాతుం దృషదేవ ప్రమృణ రక్ష ఇంద్ర ॥• 1456

†(22) పిశంగభృష్టిమమ్భృణం పిశాచిమింద్ర సం మృణ ।
సర్వం రక్షో నిబర్హయ ॥* 1457

---

†ఇవి "ఖిల" మంత్రములు. (చూ. 773 వ పుటలోని †గుర్తు కల తెలుగు పుట్ నోటు.)

1.నివారిణి, 2. త్వాంకృణు, 3. అభయం కుర్వోనమః, 4. నాముత, సమాం దిశాం దేవీందేవీ, 5. పరి రక్షత్వోంనమః. (వ్రా.ప్ర.)

• "ఉలూకయాతుం" ఇత్యాది 11వ ఋక్కు ఋగ్వేదము సప్తమమండలములోఁగల 104వ సూక్తములోని 22వ మంత్రము. (చూ. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత: తృతీయ సంపుటము. 396వ పుట. 858వ ఋక్కు.)

* "పిశంగభృష్టి" మిత్యాది 22వ ఋక్కు ఋగ్వేదము ప్రథమమండలములోఁగల 133వ సూక్తములోని 5వ మంత్రము. (చూ. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత: ప్రథమసంపుటము. 404వ పుట. 1185వ ఋక్కు.) ఈ ఋక్కు

కొన్ని వ్రాతప్రతులలో ఋఙ్మంత్రాభాసము లైన యీ క్రింది ఐదు శ్లోకములును దరువాతి 777వ పేజీలోని ఆరు శ్లోకములును స్వరచిహ్నాయు క్తములుగా వ్రాయఁబడియున్నవి. ఇవి ప్రక్షిప్తములు.

*(1) దుర్గా దుర్గేషు స్థానేషు శం నో దేవీరభిష్టయే ।
య ఇమం దుర్గాస్తవం [1]పుణ్యం రాత్రౌరాత్రౌ సదా పఠేత్ ॥ 1
(రాత్రిః కుశికః సౌభరో[2] రాత్రిర్వా భారద్వాజో రాత్రిస్తవో గాయత్రీ)

*(2) రాత్రీసూక్తం జపేన్నిత్యం తత్కాలముపపద్యతే ।
న యోనిం పునరాయాతి సర్వపాపైః విముచ్యతే ॥ 2

*(3) క్షీరేణ స్నాపితా దుర్గా చన్దనేన విలేపితా ।
బిల్వపత్రకృతాపీడా నమో దుర్గే నమో నమః ॥ 3

*(4) సర్వభూతపిశాచేభ్యః సర్వసర్పసరీసృపైః ।
దైవేభ్యో మానుషేభ్యశ్చ ఉభయేభ్యోఽభిరక్ష మామ్ ॥ 4

*(5) యా ఋగ్వేదే స్తుతా దేవీ కాశ్యపేన ఉదాహృతా ।
జాతవేదప్రభా గౌరీ జాతవేదసే సునవామ సోమమ్ ॥ 5

*ఇవి ఋఙ్మంత్రాఽఽభాసము లైన ప్రక్షిప్త శ్లోకములు.
1. యుగ్యం రాత్రీ సూక్తం జపేత్సదా, 2. (i)రాత్రిః కుశికః సౌభరో రాత్రిస్తవో గాయత్రీ, 2. (ii)రాత్రి కుశికం సౌభరో రాత్రిర్వా భారద్వాజీ రాత్రిస్తవం గాయత్రం, 2. (iii)రాత్రిః కుశిక సౌభరో రాత్రిస్తమో గాయత్రి తత్కాల ఉపపద్యతే. (వ్రా.ప్ర.)

†(6) సురాసురైర్ద్విజవరైః పిశాచోరగరాక్షసైః ।
అరాతిభయ ఉత్పన్నే అరాతీయతో ని దహాతి వేదః ॥ 6

†(7) గజద్వారేఽపథే ఘోరే సంగ్రామేషు చ గౌతమీ ।
సర్వం రక్షతు దురితం స నః పర్షదతి దుర్గాణి విశ్వా ॥ 7

†(8) మహాభయే సముత్పన్నే స్మరన్తి చ జపన్తి చ ।
సర్వం తారయతే దుర్గా నావేవ సిన్ధుం దురితాత్యగ్నిః ॥ 8

†(9) య ఇమం దుర్గాస్తవం పుణ్యం శృణ్వన్తి చ జపన్తి చ ।
త్రిషు లోకేషు విఖ్యాతం త్రిషు లోకేషు పూజితమ్ ॥ 9

†(10) అపుత్రో లభతే పుత్రాన్ ధనహీనో ధనం లభేత్ ।
అచక్షుర్లభతే చక్షుర్బద్ధో ముచ్యేత బన్ధనాత్ ॥ 10

†(11) వ్యాధితో ముచ్యతే రోగాదరోగీ శ్రియమాప్నుయాత్ ।
దదాతి కామితం సర్వం కాత్యాయని నమోఽస్తు తే ॥ 11

†ఇవి బుఙ్మంత్రాఽఽభాసములైన ప్రక్షిప్త శ్లోకములు.

## సూక్తము—127

ఋషి—సౌభరుఁడైన కుశికుఁడు లేక భారద్వాజి యగు రాత్రి†
దేవత—రాత్రి†

(1)*గీ॥ వచ్చుచున్ దిక్కుల ప్రశస్తి మెచ్చునటుల
వివిధ దేశంబులం దాను వెలుఁగుచుండు
రాత్రి దేవతఁ గనుచుండె భ్రాజమాన
శోభలు ధరించుచుండెఁ దా సురుచిరముగ ॥ 4189

(2)*గీ॥ మరణరహితరాత్రి తరము వెలుంగుచు
దివము వృక్షలతలఁ దేజమునను
బ్రజ్వలింపఁజేసి ప్రబల తమస్సును
నోలి కొట్టుచుండె జ్యోతివలన ॥ 4190

(3)*గీ॥ దేవియై వచ్చుచున్నట్టి దివ్యరాత్రి
స్వస నుషస్సును మరలింపఁ జాలుఁగాక ;
నా యుషస్సున జనియించునట్టి తమము
పారఁద్రోలుచునుండెఁ దాఁ బ్రబల రాత్రి ॥ 4191

(4)*గీ॥ పక్షు లెట్టులు వృక్షానఁ బండుకొనునొ;
యట్టులే రాత్రి మే మెల్ల నధిక సుఖము
తోడ నుండమెః యా రాత్రి యధికసుఖముఁ
గూర్ప నిర్మల యగుఁగాకఁః గూర్మి మాకు ॥ 4192

(5)*గీ॥ జనులు, పక్షులు, పశువులు, చారు రాత్రి
వచ్చినప్పుడు నిద్రను బడయుచుండు
రట్టులే శ్యేనములు కూడ నట్టి రాత్రి
యెల్ల భూతంబులకు సుఖ మిచ్చుఁగాదెః ॥ 4193

†వ్రాతప్రతి 14వ సంపుటము 151వ పుటలో నీ సూక్తమునకు ఋషి "కుశికుడు"గాను, దేవత "రాత్రి"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "కుశికుఁడు లేక రాత్రి" ఋషిగాను, "రాత్రి" దేవతగాను, శ్రీనేమావారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(6)*గీ॥ మమ్ము హింసించు వృకమును నెమ్మి రాత్రి!
పాపద్రోహులము! తస్కరుఁ బాపద్రోహులు;
పిమ్మటన్ నీవు మా కిలఁ బెద్ద వగుచు
క్షేమమును గూర్చు దానవై చెలఁగుమమ్మ! ॥ 4194

(7)*గీ॥ అఖిల వస్తు సమాశ్లిష్ట మగుచుఁ గృష్ణ
మైన నైశ తమస్సు నన్నాక్రమించె
ధనముచే[1] ఋణము నట్టులు ఘన తమస్సు
పరిహరింపు ముషోదేవి! కరము నీవు! ॥ 4195

(8)*గీ॥ కడుఁ బయోదోగ్ధ్రి యౌ గోవు కరణి
రాత్రి నిన్నుఁ జేరుచు స్తుతులచే నెన్నుచుంటి
శాత్రవులఁ దుంచు నాయొక్క సంస్తవంబు
వలెను హవ్యంబు సంప్రీతిఁ బడయు మీవు! ॥ 4196

(9)†క॥ రాత్రికి రాజై తనరుచు
నేతృత్వమ్మున విశేష నియమ రజో గా
యత్రి మ్మగు సూర్య ప్రభల
పైతృకముగ రాత్రి వరలు భాస్వద్దీపమై ॥ 4197

†(10) సప్తసప్త దీప్తులతో గుప్తములై వరలుచుండు
సృష్టిపదార్థాల సంఖ్య త్వష్ట రూప ప్రతికృతిగా
నవరతులను బరఁగుచుండి నవగ్రహకాంతి జాల
మశీతి కాఁగ నఖిలమ్మున నద్భుతగతి వర్తిల్లుచు
రాజరూప ఋక్షచంద్ర రమ్య నేత్ర సముచ్చయాల
నలరుచుండు నిశీథమున నసాధారణంపు గతుల ॥ 4198

(11)†ఆ॥వె॥ రాత్రి జనని కాఁగ రాణించి జగములన్
బాద గతులు మీఱ భద్రరతుల
సర్వభూత జాల సంనివేశిని గాఁగ
వెలుఁగుఁ గృష్ణ శక్తి విశ్వమందు ॥ 4199

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1.ఇక్కడ నింద్రగణమునకు మారు "ఖల"ము ప్రయుక్తమైనది.
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†ఇవి "ఖిల" మంత్రానువాదములు.

†(12) సంవేశిని యౌను రాత్రి సంయమినీయ యౌను రాత్రి
గ్రహ నక్షత్రమాల యుక్తగా వరలుచు రాత్రిఁ
బ్రపన్నుండ నౌచు నేను భద్రరూప మలరారఁగ
శివ రూపమ్మైన రాత్రి వెలఁగ నమస్కరింతు నేను ॥ 4200

†(13) అతిసహస్రమ్మైన అద్భుత దుర్గాల
జాతవేద మ్మౌచు సంజాత మౌ సోమ
శక్తులన్ దనరారు శరణ్యమౌ దేవి
బహురుచి ప్రియను భజియింతు నిత్యమ్ము ॥ 4201

†(14) అగ్ని విజ్ఞానాల నద్భుతముగాఁ బుట్టి
శత్రుమూఁకల నెల్ల సంహార మొనరించి
ద్వైత రూపమ్మైన దైవీయ శక్తులన్
సోమపాశ్రిత మౌను సొరిది శాంత్యర్థ మై ॥ 4202

†(15) బ్రహ్మజ్ఞుల హవ్య వాహనిగ వర్తిల్లి
బహువిద్యగాఁగాని వరలు నవిద్యగఁగాని
విశ్వ దుర్గలు గాఁగ విమల రక్షలతోఁ
గ్రాలు దేవిగ నిన్నుఁ బ్రవద్య మొనరించు ॥ 4203

(16)†ఆ॥వె॥ అగ్ని వర్ణ యౌచు నఖిల శుభప్రద
యైన సౌమ్య రాత్రి నమల ద్విజులు
సంస్కృతి మెయి దురిత జాలాలఁ దరియింత్రు
బోటు నెక్కి నదిని దాఁటు రీతి ॥ 4204

†(17) విషమమై ఘోరమౌ విధుర దుర్గమమ్ముల
నంగ్రామమునందు రిపు సంకటమ్ములందుఁగూడ
శుచిగ్రస్తము కాక చోరగ్రస్తము కాక
దుష్టగ్రహపరముకాక దూరముగాఁ బోఁద్రోలుచు
నగ్ని వర్ణ యైన ఆ శుభప్రద యైన
సౌమ్య రాత్రి మమ్ముల సదా కాపాడుఁగాక ॥ 4205

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†ఇవి "ఖిల" మంత్రానువాదములు.

†(18) దుర్గమమౌ కష్టాలను దుర్విదగ్ధ విషమ గతుల
వనములలో సకలమైన బవరమ్ములయందుఁ జూడ
మోహింపఁగఁజేసి నిను నమోవాక మొనరింతును
బ్రిపద్యముగ రాత్రిదేవిః రక్షించుమః అభయ మొసఁగి ॥ 4206

†(19) సకల భూత కేశినిగా జగత్సృష్టి విరాజిలుచుఁ
బంచమిగా విశ్వమ్మున వరలి నామ మొంది తనర
నఖిల సమగా వరలు నా నిశా దేవియే
నన్నుఁ బరిరక్షణము నన్నింటఁ జేయుతన్ః ॥ 4207

†(20) తనరి అగ్ని వర్ణమ్ములఁ దపశ్శక్తిఁ జలియించుచుఁ
గ్రాలుచు వైరోచనిగాఁ గర్మఫలసంజుష్టయైన
దుర్గను దేవిని శరణము తొడరంగా వేఁడెద నేఁ
బ్రిపద్యముగ నమస్కరించి వరల సుతుఁడుగ రాత్రిని ॥ 4208

(21)†గద్యము॥
ఇంద్రాః ఉలూకముగ హింసించు రాక్షసుని సంహరింపుముః అల్పోలూకముగ వర్తమానుఁడౌ రాక్షసుని నశింపఁజేయుముః శ్వరూప వర్తమానుఁడైన రాక్షసుని, జక్రవాకరూపుఁడైన రాక్షసుని, శ్యేనరూపుఁడైన రాక్షసుని, గృధ్రరూపుఁడైన రాక్షసుని నా యా సర్వవిధ నానాకారములతో నున్న రాక్షసులను నో యింద్రాః పాషాణమువంటి వజ్రమున సంహరింపుముః ॥* 4209

(22)†గద్యము ॥
ఓ యింద్రుఁడాః యాషద్రక్తవర్ణయుక్తము నతిభయంకర శబ్దాయమానము నతిప్రవృద్ధము నైన పిశాచమును లేక జరను బాగుగా హింసింపుముః మమ్ములను రక్షించుటకునై రాక్షసాదులను నిరతము హింసింపుముః ॥* 4210

---

†(1) కష్టదమౌ స్థానమ్ములఁ గ్రాలుచుఁ గోటగ నిత్యము
నభీష్టముగ నొసఁగఁగాను నఖిలమంగళము నొసఁగఁగ
నెల్ల పుణ్యప్రదమై తగు నీ దుర్గాస్తవరాజముఁ
బ్రతిరాత్రియు మనము పఠియింపఁగ నౌను సదా ॥♦ 1

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†ఇవి "ఖిల" మంత్రానువాదములు.

*ఇవి సాయణాచార్య భాష్యానుగుణముగా ననూదితములు.

♦ఇది బుఙ్మంత్రోఽభాసమైన ప్రక్షిప్త శ్లోకానువాదము.

†(2) రాత్రిసూక్త మెల్లపుడును గ్రాల జపము చేయ నియతి
నుపపద్యమాన వతౌను నౌనరంగా నిశి సమయము
సకల దురిత సంచయాల సంపూర్ణ విముక్తి కలుగు
యోనిజమౌ పునర్జన్మ ముండఁబోదు మరల మరల ॥ 2

†(3) స్నాపితయై క్షీరములను జందనాల విలేపనాల
మారేడు దళాలతోడ మహితాఽఽవృతయౌ దుర్గను
దుర్గమాఽఽదుర్గమమౌ దుర్గను నమస్కరింతు
నా తల్లీ! ఓ దుర్గా! నమో నమోఽపీడా! ॥ 3

†(4) సకల భూతాఽఽవళులనుండి సమస్త పిశాచాలనుండి
సర్వ విధాలైన సర్ప సరీసృపతతులనుండి
దేవతాళినుండి మానవాఽఽవళులనుండికూడ
దేవమానవులనుండి ధృతి మానవదేవులనుండియు
నాపత్తులు రాకుండఁగ నభిరక్షించుము! నను నిశి! ॥ 4

†(5) ఋగ్వేదమ్మునందు రాత్రి యెంతేని స్తుతింపఁబడుచుఁ
గాశ్యపుం డుదాహరింపఁ గ్రాలి జాతవేద ప్రభ
గౌరి గాఁగ సోమశక్తి వేల లెనయకుండ వెలిఁగి
జాదవేదసముగ వెల్గు సత్యమ్మౌ సునవమ్ముగ ॥ 5

†(6) సురలవల్ల అసురులవల్ల సరసురద్విజవరులవల్లఁ
బిశాచాలవల్ల నురగ నిశాచరులవల్లఁగాని
అరాతితతులవల్లఁగాని ఆవహిల్లు భీతి నెల్ల
రాత్రిసూక్త విజ్ఞానము నిర్దహించివేయునులే! ॥ 6

†(7) గజద్వారమందుఁగాని కష్టాఽఽపథమందుఁగాని
భీకర సంగ్రామాలను వెలయుచు గౌతమిగాఁగను
సర్వవిధమౌ దురితజాలమ్ములనుంచి మమ్ము
విశ్వ దుర్గములను దుర్గ ప్రేమమెయిని రక్షించుత! ॥ 7

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†ఇవి ఋఙ్మంత్రాఽఽభాసములైన ప్రక్షిప్త శ్లోకానువాదములు.

## సూక్తము—127
ఋషి—సౌభరుఁడైన కుశికుఁడు లేక భారద్వాజి యగు రాత్రి
దేవత—రాత్రి

## అర్థాంతరము—1

†(1) రాత్రి విశేషరూపమై రాజిల్లుచుండు
ఋక్షగ్రహాలతో రోదోఽంతరాళాన
రంగురంగుల అభంగ సొంగ జ్వాలలను
దీధితులు వరలంగ దీప్తమౌ వర్ణాల
రంజిల్లు తేజాల రాజిల్లుచుండులే।
దివ్య దేవావళుల దేదీప్యమానతను
బలు స్థానముల నిచ్చి ప్రభాభాసితముగా
విశ్వరూప మ్మొంచు విలసిల్లుచుండు
శోభలకు శోభగా సొంపుఁ దనరారఁగాఁ
బ్రకృతిప్రభారూపిగఁ బరఁగులే। దేవిగ। ॥ 4211

---

†(8) మహాభయము పుట్టునెడల స్మరింపఁగా జపింపఁగా
సింధువును నావపైనిఁ జెలఁగి దాఁటు రీతిగాఁగ
నత్యగ్నియె దురితమ్మును నంతరింపఁజేయునట్లు
దాపురించు దుర్గతులను దరియింపఁగఁజేయు దుర్గ ॥* 8

†(9,10, 11) ముల్లోక విఖ్యాతమై ముల్లోక పూజితమ్మై
పుణ్యప్రదమై వెలైడి గణ్యదుర్గాస్తవము దీని
విన్నచో జపించుచోఁ గన్ను లొందు గుడ్డివాఁడు
పుత్రరహితులైనవారు పుత్రులను బొందఁగలరు
ధనవిహీనులైనవారు ధనలాభము నొందఁగలరు
బంధితమౌ బాధితాళి బంధ విముక్తులై పోదురు
వ్యాధి బాధియైన రోగి అరోగిగా విముక్తుఁ డౌను
గామితమౌ సకలమ్మును గాత్యాయని ప్రసాదించు
నమస్కారమమ్మ। నీకు। నమస్కారమమ్మ।సదా। ॥* 9

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*ఇవి ఋఙ్మంత్రోపలభానములైన ప్రక్షిప్త శ్లోకానువాదములు.

†(2) మరణరహితమ్మైన మాన్య దీప్తులతో
దివ్యదేవత్వాలఁ దేజరిలుచుండి
అతివిశాలమ్మైన అంతరిక్షమును
దమఃపూరితముగాఁ దనరారఁజేసి
ప్రాణికోటుల సకల ప్రకృతితత్త్వాలను
జరాఽచరమ్ములను జడాఽజడములను
దరు లతా వృక్షాలు తనరారఁ బ్రాణ
సంభరితమై నిత్య సంకీర్ణగతులఁ
దను శీతలకాంతి తనరారుచుండ
నలరారు మహా జగదంధతను విపుల
కాంతి పుంజాలతోఁ గ్రాలు నక్షత్రాలు
అంధకారము తరిమి అలరారుచుండు
నతిలోకమౌ శక్తి నా దేవిగాఁగ
దైవీయమౌ దీప్తిఁ దనరు రాత్రిగను ॥ 4212

†(3) నిరతరూపమ్మైన నిండు తమశ్శక్తి
రాత్రిగా రాజిల్లు రమ్యరూపిణి దేవి
భగినీ రూపమౌ భగకాంతు లలరారఁ
సాంధ్యోషఃకాంతి చయములన్ దనరు
నుదయోషస్తేజ ముజ్జ్వల దీప్తులన్
వరల దైవీయమౌ వరాఽపర కాంతులన్
దేవ్యాయుతరూప తేజాలు వెల్గొంద
విశ్వ సంస్కారము వెల్లివిరియంగ
నుదయ గతులను నిల్వ నుజ్జ్వలమౌ రీతి
నపగత మ్మగు రాత్రు లంధకారములు
భాసమానమ్మైన ప్రభాభాగ్యము లలర
హాసమానమ్ముగ నాకసము వరలంగ
నిత్య కాంతుల దీప్తి సత్యరూపాఽఽవళులఁ
బ్రకృతి శత్యంతమ్ము ప్రత్యవిద్యగఁబరఁగు ॥ 4213

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) సృష్టివిరహిత మౌచుఁ జిద్విలాసముకాఁగ
మాయగా యోమమై మహితకృష్ణ విరాజ
మానమై తనరారు మహి దివుల నన్నింట
సృష్టివృక్షం బొందు చెలువారు యౌవన
శక్తిగాఁ దనరారు జరారహిత మ్మౌచు
రాత్రిదేవతగాఁగ రాజిల్లు విశ్వాన
సుఖశాంతి నిలయమై శుభదాంతి వలయమై
బొగ్గువులసౌ గాలి పూర్ణశక్తిగఁ బగలు
తరు లతా రాజులను దనరారి నిశి వేళ
బాహిరమ్మై వెలికిఁ బయనించుఁ దిమిరముగఁ
బ్రకృతి యౌవన శక్తి ప్రభా భాసితముగా
నలరారు రీతిగా నపురూప శక్తులన్
నతిలోకమై వరలు నదృష్ట నియతగతి
సమరుచుండును సదా అమృతకిరణాలమై ॥ 4214

†(5) నియమ సహిత మ్మౌచు నిత్యశక్తులు మీర
నదూత్రవమై సృష్టి సర్వాత్మకమ్మై
పాదబద్ధమ్ముగాఁ బాత్రిభవ సమయమయ
పతనపాతనశక్తి వరలఁగా సృష్టిలో
స్థితిరూపమై నిలిచి చెన్నొంద నభివృద్ధి
క్షయగతులమై మరణలయతత్త్వమును బొంది
శ్వేనరూప రాత్రికాఁగ నిన శక్తుల శ్యామతత్త్వ
సహితమ్మౌ మహిత సృష్టి జ్ఞానదీప మలరారఁగ
నర్థవంత మౌచు నఖిల సార్థకతలఁ బ్రకృతి దనరఁ
గాలబద్ధ మౌచు రాత్రి వేల లెనసి వరలుచుండుఁ
బక్షసహిత మౌచుఁ జలన పాక్షికతల నలరారుచు
నఖిల గోళజాలాలను నదృష్టకాలబద్ధముగా
ననమానత నిశి తనరును గసిమసంగి కృష్ణరీతి
సుఖగాత్రిమసర్వస్వము శోభనగతి వరలంగా ॥ 4215

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) లక్కాకాఁగ నానావిధ దిక్కులఁ బలురూపులతో
నియమితమౌ గతులతోడ నిఖిలమ్మున వ్యాపించును
సౌరదీప్తి వ్యాప్తగతుల సర్వసృష్టి కృష్ణరాత్రి
దొంగవోలె నఖిలమ్మున నదృశ్య మౌను నద్భుతగతి
సూర్యకిరణ తేజా లెటఁ జొప్పడునోః అటనుండియె
యే శక్తికి నందకుండ యెవరికైనఁ దెలియకుండ
నే దిశకోః యే రీతినోః యే మాత్రముఁ గానరాక
అరుణకిరణ జాల మెల్ల నపురూపముగాఁ బరఁగఁగ
నతివేలపు శక్తులమై నా తిమిరాళులు వరలును
దైవీయమ్మౌ శక్తులఁ దనరారుచు విశ్వమ్మున
నరూపతల నదృశ్యమౌ నంతర్గతమహిత శక్తి
నంతరించకుండ నిలుచు నంతు తెలియనట్టిగతుల
నావిర్భావమ్ము నొందు నరుణకాంతు లదృశ్యముగఁ
దరణిదీప్తి రాత్రి తరుణి దాగుడుమూతల నాడును
సర్వసుఖము లొనఁగూర్చును జరాఽచరమ్మైన సృష్టి
నద్భుతలీలలఁ జెలఁగెడు నా సర్వేశుని మాయగ ॥ 4216

†(7) విశ్వసృష్టి స్థితిగతులను విమలచాంద్రరతులు మీఱ
రాత్రితరుణి పాలితయై రాణించును మహాదీప్తి
చలువల వన్నెల వెన్నెలల చెలువా లవి విలసిల్లఁగఁ
గృష్ణతిమిరరాజియెల్ల కృతుల నస్థిర మ్మగుచును
ఇంద్రునిద్వారా వెన్నెల చలువల కాంతి రూపముగా
సూర్యకిరణజాలాలను జొప్పడంగ ఋణముగాఁగ
జడాఽజడ స్వభావాలఁ జరాఽచర రూపమైన
ప్రకృతి యెల్ల స్వీకరించి రాత్రివేళఁ దనరారును
ఉపగతులను దిమిరాళులు ఉపస్థితములై వరలఁగ
వ్యక్తాఽవ్యక్తమ్ము లౌచు నంతర్గతి వెలుఁగు నీడ
లలరారఁగఁ బగలు రాత్రు లపురూపపు శక్తులతోఁ
బగలు రాత్రి సమీపమై పగటి సమీపమై రాత్రియు
వెలుఁగులఁ జీకట్లు కలిసి వెల్గులు కలిసి చీకటులను
నీడలుగా వెలుఁగులుగా నెగడును రాత్రింబవళ్లు ॥ 4217

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

†(8) విశ్వసృష్టి యజ్ఞములో విమలమైన గతులు మీఱ
మహితమైన దేవలోక దుహితకాఁగ నలరారుచు
సర్వగోళ లోకాలను శంపాగతు లంచితముగ
ననుగతమై అవినాభావగతి నంటిపెట్టుకొని తనరుచుఁ
దిమిరరాశి దుఃఖముగా నమరును బ్రాకృత మౌచును
రాజిల్లు రాత్రితరుణి కతిరాత్రి మైన దివ్య శక్తి
నుషోదయాల్ బల మిచ్చుచు నుజ్జ్వలమౌ శక్తికాఁగ
నుదయ సాంధ్యరూపాలను నూపిరి కూర్చుచు రాత్రికి
వెన్నంటెడి పగటివేళ వెలుఁగు నీడల చీకటు లవి
విపరీతపు గతులతోడ నపురూపపు టంతర్గతి
నలరారును దిమిరశక్తి ఆలివిమాలినట్టి రీతి
నవినాభావత్వ మొప్ప ననుబంధము తనరారఁగ
వెలుఁగు వెన్ను నంటి నీడ వెలుఁగు నీడవెన్ను నంటి
ద్వైతాఽద్వైతమ్ము గాఁగ వరలు రాత్రి పగలు సృష్టి ॥ 4218

†(9) విష్ణ్వంశతోఁ బుట్టు విమలపార్థివ తతికిఁ
దండ్రిగా దేవుండె తగ రక్ష నిచ్చుగతి
రాత్రి యువతికిఁ బితగ రాజిల్లు సూర్యుండె
దివి భువుల నన్నింటఁ దిమిర రూపాలలో
లఘురీతిమైని నలఘుబృహత్తరగతులమై
బ్రహ్మసృష్టిగ ద్వైతాఽద్వైతగతులను బరఁగు
సృష్టిశక్తికి శక్తి చెన్నొందఁగాఁ జేసి
స్థితిశక్తు లగు శక్తి ఋతమతిగ సమకూర్చి
సంచలన శక్తులన్ సంభార రక్తులన్
అతివేల మైనట్టి అతిశయ రూపాలఁ
బృథగ్భావాలతో నపృథగ్భావాలను
నతిలోక గతులమై నపురూప రతులమై
వెలుఁగు వెన్నంటుచున్ వెలుఁగులన్ నీడగా
నిశిదేవి తనరారు నియతాఽనియతగతి ॥* 4219

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ఖిల" మంత్రానువాదము.

†(10) దశదిశలలో నిత్య వశమానమై నిలిచి
నవగ్రహకాంతు లవి నవతిగాఁ[1] దనరారు
నవదీప్తు లొప్ప సంత్వష్ట శక్తులు మీఱఁ
బదిదిక్కులను నష్టవసువు లవి యెన్బదిగ[2]
సప్తాకాశంపు సంపదల్ వరఁగంగ
సప్తానిలరూప జాలాల వరలులే!
సప్తానల దివ్య జ్వాలలన్ దనరులే!
సప్త సలిల శక్తి సంచయమ్ములఁ బరఁగు
సప్తమృత్తతులతో సర్వస్వముగ నెగడు
సృష్టి సంస్థితి గతులఁ జెన్నొందఁగా రాత్రి
ఆ భవ్య శక్తు లవి అపురూప రతులతోఁ
దొంబదితొమ్మిదై[3] తొడర నెనుబది[2]గాఁగ
డెబ్బదిగా[4] నిలిచి యిబ్బడి ముబ్బడిగ
సప్తసప్తతు[5] లౌచు సర్వభూతము లలరు ॥ 4220

†(11) సకలప్రాణి జాలాలకు సర్వగోళ జాలాలకుఁ
జరాచరము లన్నింటికి జడాజడము లన్నింటికి
నివేశినిగఁ దనరారుచు నిఖిల జననిగాఁ బరఁగుచుఁ
బ్రపద్యమైన స్థానగతులఁ బ్రకర్షముగ వరలుచుండి
భగవతిగా సకలమైన జగత్తతుల కన్నింటికి
నంతరహితమై నిలిచెడి ఆ రోదసీవతిగాఁగను
విష్ణువర్ణ మొప్పారఁగఁ గృష్ణగాఁగ వర్ణితయై
నిశ్శబ్దగ రాష్ట్ర రాజ్ఞి నిశగాఁ దనరారు రాత్రి
భద్రగాఁగ వరలు విశ్వబంధువుగా శుభదగాఁగఁ
గామధేను రూపముగాఁ గ్రాలు మంగళదాయినిగా
అతిపవిత్ర మ్మౌచు నిలిచి ఆ రోదసి నలరారెడి
ఆ మందాకినిగా నిలిచి అపురూపపు శక్తులతో
వృషభరాశి రూప మొప్ప విశ్వసృష్టి జననిగాఁగ
నలరుచుండుఁ బాదగతుల నద్భుతావహముగా ॥ 4221

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.
1. నవతి=90; 2. అశీతి=80; 3. నవతిర్నవ=99; 4. సప్తతి=70; 5. సప్త సప్తతులు=70×7=490.

†(12) ఆదిత్యుని శక్తులతో నద్భుతగతిఁ దనరారుచు
నతివిశాల రూప మొంది అన్నింటిని నాకళించి
అత్యంత సుదృఢమైన యమరూపము వరలంగా
గ్రహనక్షత్రము లవెల్లఁ గ్రాలంగా మాలలుగా
భద్రరూపిణిగఁ బరఁగెడి పార్వతిగాఁ దనరారుచు
నఖిల శుభంకారిణిగా నాకాశపు శక్తిగాఁగ
సుఖదాయినిగాఁగ సకల శ్రీరూపిణిగాఁగ వరలి
అపవర్గముగాఁగఁ దనరు నా భద్రరూపిణి నేఁ
బార మెనసి అపారముగ వరలు రాత్రి రూపాఽహికిఁ
బ్రపద్యుండనౌదు నేను బ్రపత్తి పర్వఁగా నిత్యము ॥ 4222

†(13) శరణాగత వత్సలగా సర్వకాంతి క్రియగాఁగను
నకల శబ్ద రూపిణిగా జగద్వేద విజ్ఞాన
ప్రియగాఁగను మూర్తిగాఁగ జయరూపిణిగాఁగ వరలు
సహస్రరూపగాఁగ నశక్యగాఁగఁ బరఁగుచుండి
వేలలెనయకుండ నిలుచు వేలాదియైన "కాళిక"లుగ
జాతవేదమైన నిత్య జ్వలితాగ్నులు విస్తరిలఁగ
సోమశక్తు లెల్ల సృష్టిఁ జొప్పడఁగా నమృతగతుల
రాత్రిదేవి నర్చింతు మరాతితతులు మడియంగా ॥ 4223

†(14) అగ్ని విజ్ఞానగతి నఖిల విద్యుద్దీప్తు
లలర నుత్పన్నమై ఆ ఛాయగా నిలిచి
వెలుఁగు చీకట్లుగా ద్విజన్మ గతులమై
ఋషిదేవతలకెల్ల విషహరాఽమృతసోమ
శక్తులన్ బాలించు చంద్రాదులే నిలువ
నాశ్రితగతి మీఱ నమల శాంత్యర్థమై
అఖిలాన విస్తరిలు నరాతితతులను
నిర్దహించును రాత్రి నిత్యవేదగ నిలిచి ॥ 4224

†(15) విశ్వదుర్గాలుగా విలసిల్లు నో రాత్రి!
ఆ బ్రహ్మ సంతతియె హవ్యవాహిని! నిన్ను
అజ్ఞానమునఁగాని అనేక రూపమౌ
విజ్ఞానములఁగాని వినుతింతు సర్వదా! ॥ 4225

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(16) శుక్లాగ్నుల వర్ణగతుల శోభిల్లెడి రాత్రిదేవి
నీలాగ్నుల వర్ణగతుల నెగడొందెడు నిశీథినిఁ
పీతాగ్నుల వర్ణగతుల విలసిల్లెడి విభావరి
రక్తాగ్నుల వర్ణగతుల రాజిల్లెడు రజనిదేవి
హరితాగ్నుల వర్ణగతుల నలరారెడు తమస్వినిఁ
గపిశాగ్నుల వర్ణగతులఁ గ్రాలునట్టి క్షపారూపిఁ
జిత్రాగ్నుల వర్ణగతులఁ జెల్వొందెడు శర్వరిని
శుభంకరిని సౌమ్యను స్తుతియించెదు విజ్ఞానులు
బోటుతోడ నా సింధువు దాఁటెడుగతి తసరారఁగ
దురితాగ్నుల దుర్గమాలఁ దరియింతురు సత్యగతుల ॥ 4226

(17)†క॥ నరకముల విషమ ఘోరపు
దురముల రిపుసంకటముల దుష్టగ్రహ సం
హరణమ్ములఁ బిడుగులు దొం
గలు వడునెడ రాత్రి దుర్గగా రక్షించున్ ॥ 4227

†(18) అత్యంత విషమమౌ నా దుర్గములను
నఖిల సంగ్రామాల నడవులన్ గూడ
బహువిధ మోహాలఁ బ్రిపద్యమౌ నన్ను
నభయునిగాఁజేసి యామినీః రక్షించుః ॥ 4228

†(19) సకలభూత సంచయాల
సలిలరూప వరుణశక్తి
పంచ భూత తత్త్వాత్మని
వరల విశ్వ సృష్టిలోనఁ
గాల రూప నిశాదేవి
కాపాడును సర్వ గతుల ॥ 4229

†(20) అగ్ని వర్ణయుక్తముగా నలరు తపోజ్వాలితమై
వైరోచనిగాఁ గర్మ ఫలమ్ములను జుష్ట యైన
దుర్గయైన రాత్రిదేవిఁ దొడరి శరణము వేఁడెదఁ
గష్టపరంపరలనుండి గడదేర నమస్కృతుల ॥ 4230

†రచయితః—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(21) గుత్తగూబగా రాతిరి గూఢ శక్తిఁ జూచుశక్తి
సూక్ష్మలోకమ్ము దృష్టిఁ జూచు ప్రకృతి దివ్యశక్తి
శ్వా శక్తిగ ఘ్రాణశక్తి చలితమ్మౌ ననిల శక్తి
ఇల శక్తుల నిశి వేళల సంచరించు కోకమ్ముగ
సుపర్ణశక్తి మీఱి సూన్మతమయాఽలౌకిక
గృధ్రశక్తి తనరారఁగ దృషదముగా వర్ధిల్లుచు
విష్ణుదేవి ప్రమృణతమై విమల రక్షనిమ్ము: మాకు: ॥♦ 4231

†(22) రాత్రివేళ సంచరించు నరాతిశక్తి యుక్తమైన
పిశంగవర్ణభరిత మౌచు భృష్టి పిశాచాళినుంచి
అతిలోకపు శక్తులతో అత్యంతము రక్షించుము:
నిఖిల శత్రుతతు లన్నిటి నిబర్హించి నను( గావుము: ॥♦ 4232

---

†(1) సప్తవిధములై వరలెడి చదలు కోటచోటులందు
మా కభీష్టదాయినిగా మహిత రాజ్యలక్ష్మి నిచ్చు
నెవ్వ శ్రీ దుర్గాస్తవ మ్మెఱిఁగి నిశితాఁగను
బఠియింతురో: పుణ్యదమై వారి కభీష్టద మౌను సదా: ॥* 1

(2)†క॥ జపియింప రాత్రిసూక్తము
అపగతమౌ పాపపుంజ మఖిలము జగతిన్
ఉపపద్యమ్ముగఁ గాల మ
ది పునర్జన్మరహితపు గతిఁ దనరును సదా: ॥* 2

†(3) సలిలమ్ములమై స్నానము తగఁగా
మంచిగంధ విలేపన మంచితముగ వరలంగా
బిల్వావహ సామర్థ్యము విరిసెడు నో దుర్గా:
నమస్కారమమ్మ: దుర్గ: నమోనమః నమోనమః ॥* 3

†(4) అఖిలాఽష్టవిధమ్మైన నాగులనుండి
బంచభూతాలనుండి వర పిశాచాలనుండి
దేవాళినుండి మనుజాళినుండి దేవమానవాళినుండి
అభిరక్షించుము: అసుర: నిశి: నన్ను ॥* 4

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"ఖిల"మంత్రానువాదము.
*ఋఙ్మంత్రాఽఽభాస ప్రక్షిప్త శ్లోకానువాదము.

†(5) అగ్ని విజ్ఞానములో అభినుతింపఁబడిన దేవి!
చంచలగా మీనాక్షిగఁ జదలున నుదాహృతమై
జాతవేదాగ్ని ప్రభల జన్యమైన సోమశక్తి
నమృతమ్మున రాత్రి గౌరి! అర్చింతును సదా నిన్ను ॥ 5

†(6) సురాసురలవల్లఁగాని సురలవల్లనైనఁగాని
అసురులవల్లనుగాని ఆ పిశాచాలవలనఁగాని
బృహన్మత్స్య రాక్షసులను వీర శత్రుసర్వస్వము
ఉత్పన్నమ్మౌనప్పుడు నొనర దహించు నిశి విజ్ఞత! ॥ 6

†(7) విఘ్నరాజ ద్వారమ్మున విగతమైన పథములోన
ఘోరమైన యుద్ధమ్మున గో గౌరీదేవి! మమ్ము
విశ్వదుర్గ సంచయాల విపుల దురితాలనుండి
రక్షించునుగాక! రాత్రి రాజితమౌ న్యాయగతుల ॥ 7

†(8) దురితాగ్నిగ పరలునట్టి
జడధిఁ బడవ దాఁటు రీతి
మహాభయము సముత్పన్న
మగుచో నా నిశి దుర్గను
స్మరించుచో జపించుచోఁ
దరింపఁజేయు దురితాళిని ॥ 8

†(9) త్రైలోక్య విఖ్యాత త్రైలోక పూజిత
దుర్గా స్తవమ్మిద్ది దురిత హారక మౌను
వినిన జపించినన్ విమల పుణ్యద మౌను ॥ 9

†(10,11) పుత్రరహితుఁడైన వాఁడు పుత్రవంతుఁ డౌను జగతి
గోళ లోక సంక్షేమపు గో రహితుఁడు గోవు లొందు
నేత్రరహితుఁడైనవాఁడు నెగడు సృష్టి నేత్రుండై
రకరకాల బంధనాల వికృత బద్ధుఁడైనవాఁడు
విశ్వసృష్టి బంధనాలు విడివడఁగా ముక్తుఁడౌను
శృంగారాది వ్యాధులఁ జెండాడుచు ముక్తుండౌ
రోగి రోగ ముక్తుఁ డౌచు భాగశ్రీ ప్రాప్తి నొందు
నీప్సితముల సర్వస్వము నీడేర్చును నెల్లప్పుడు
నమస్కృతులు కాత్యాయిని! నమస్కారమమ్మ! నీకు! ॥ 10

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†ఋఙ్మంత్రోద్భాస ప్రక్షిప్త శ్లోకానువాదము.

## సూక్తము—127

ఋషి—సౌభరుఁడైన కుశికుఁడు లేక భారద్వాజి యగు రాత్రి

దేవత—రాత్రి

### అర్థాంతరము—2

†(1) విశ్వసృష్టిలో వరలెడి విమలరాత్రి నియమితమై
కాలచక్రములను దనరు క్రాంతిసంచలన గతులఁ
బత్త్రావుల వెల్గొందెడు బహుళగ్రహ ఋక్షమ్ములు
బహురూపమ్ములఁ బరఁగును మహితదీప్తులొప్పారఁగఁ
గాంతితతుల ధరియించుచుఁ గ్రాలు నిశీథిని ననిల
రోదోఽంతర తలమునందు ఋతశక్తులఁ దనరారును ॥ 4233

†(2) అత్యంత విశాల మౌచు నతిలోకముగా వరలుచు
దివ్యదేవ రూపశీల నవ్యరతుల నలరారుచుఁ
దిమిరాళుల విశ్వమ్మును సమరించును ననునిత్యము
విభావరిని వెలుఁగఁజేయుఁ బ్రభా భరిత నక్షత్రాల్
పంచభూత తత్త్వాలను వరలు లతా తరు తతులకు
నాయుష్కారక మౌచును నభ్యుదయము నందించును ॥ 4234

†(3) దివ్యమైన దేవశక్తిఁ దేజరిలెడి రాత్రిదేవి
ఉత్తమమై ఉజ్జ్వలమౌ సృష్టికాల ఉషాబాలఁ
బ్రసవించుచు నదృశ్యమౌను బ్రభాతతుల విలీన మౌచు
నానందపు హాసము నలరారఁగఁ గాంతితతులు
సాయంకాలము తనలో సంలీనము చేసికొనుచు
నిద్రించుఁ బగటికాంతి నియతగతిని నిశీథిని ॥ 4235

†(4) సకలసృష్టి వృక్షముగా సదమలగతిఁ దనరారును
గాలబద్ధ మౌచు సదా క్రాలు సృష్టిపాదపమ్ము
విశ్వసృష్టి వృక్షగతుల విలసిల్లును గాలశక్తి
కాలమూలసృష్టితరువు కాలము బంధించలేదు
సృష్టికాలబద్ధ మౌను సృష్టి కతీతమ్మౌ కాలము
కాలమ్మును నడుపు నెపుడుఁ గాలాతీత మ్మౌచును ॥ 4236

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) రవిచంద్రుల కాలకాంతు లవితథముగ వర్తిల్లఁగ
సంచరించు గోళలోక సంచయాలు నియమగతుల
క్షతి లేకను గాంతితతుల క్షపయె నిగ్రహించి నిలుచుఁ
బంచభూత తత్త్వాలను వరలుఁ బ్రాణికోటి సదా
భిన్నభిన్నరీతులలో వెలసి అతిశయించు సృష్టి
నిరతశాంతి పాలకమై నిగ్రహించి రాక్షసతతి
శ్యామవర్ణదీప్తమైన సౌరశక్తి బుద్ధిగతుల
సార్థకయై సుఖద యౌను నఖిలమైన అర్థులకును ॥ 4237

†(6) ముభావముగ విభావరి అభావముగ నస్తమింప
సూర్యకాంతి సర్వస్వము నర్యముగతి విశ్వమ్మున
నావరించుచుండు సదా అఖిలమ్మను నద్భుతముగ
జలధిలోని అలలుకాఁగఁ జదలులోని కాంతితతుల
కెరటా లవి ప్రసరించును జరాఽచర ప్రపంచాన
విస్తరిల్లు నత్యంతము వేగగతులు మీరంగా
నాకసంపు జలధిలోన నఖిల విశ్వ సర్వస్వము
పడవ వోలెఁ దేలియాడ నడయాడఁగఁ జేయుచుండు
రవిశక్తులు మహిత మౌచుఁ గ్రాలుచుండు విశ్వమ్మున
శక్తు లిచ్చి ప్రకృతు లెల్ల నక్తమ్మున ఋక్షగతుల
సౌరశక్తిఁ గౌముదు లవి చలువలుగా వెల్లివిరియఁ
బ్రభాభాసితముగ వెల్గు విభావరి విహిత మౌచు ॥ 4238

†(7) కృష్ణదీప్తమైన రాత్రి కెరలు సూర్యకాంతిగాఁగ
సంవలితపు సాన్నిహిత్య చంద్రకాంతి సంచయమ్ము
ఋక్షగ్రహ తేజా లవి అక్షయముగ విలసిల్లఁగ
సలరారును నిశీథమ్ము అపురూపపు కాంతిగతుల
దివశక్తుల తేజముగాఁ దేజరిల్లు పగటికిని
సౌరకాంతి ఛాయగాఁగ వేల లెనసి వరలు తిమిర
పుంజమ్ముల నిశీథినికిఁ బొందుగూర్చు సంధిగాఁగ
ఋతశక్తుల ఋణముగాఁగ నుద్భవించు నుషశ్శక్తి ॥ 4239

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) సకలగోళ లోకాలును సంచరింప సృష్టిలోన
దుఃఖరహితమైన మహా సంతోషపు దివ్యశక్తి
దైవీయమ్మైన సత్య భావ రూప సంతతిగా
వరలునట్లు విశ్వమ్మునఁ బరఁగు భాను దుహితగాఁగ
రాత్రిదేవి వర్తిల్లును రాజిల్లఁగ జ్ఞానదీప్తి
శశి ఋక్ష గ్రహ మహా సంచయములు వెల్గొందఁగ
సర్వగోళలోకా లవి సంఘటితపుఁ గాంతితతుల
సామీప్యగతుల వరలు సమారోహరతులు తనరు ॥ 4240

†(9) తిమిరరూపరాత్రి తనర దివ్యశాంతి రాజిశక్తి
పితృదేవుఁడైన సూర్య విశాలంపు దీప్తు లలరు
భారవహమ్మైన దీప్తి ప్రాభవమ్ము వర్ధిల్లఁగ
దివ్యమైన దివశక్తులఁ దేజరిలుచు సద్రూపుల
సర్వగోళలోకాలను బర్వుచుఁ దిష్ఠన్మూర్తిగ
రవిదీప్తుల ఛాయగాఁగ బ్రహ్మదేవు శక్తికాఁగ
సంచలనపు శక్తులతో సర్వాకాశమ్ము కాఁగఁ
బరబ్రహ్మనేత్రముగాఁ బరమాత్మగఁ బ్రాణమ్ముగ
నాకర్షణ వికర్షణల నతినిరోధ శక్తులతో
నేకత్వము భిన్నత్వము నెసఁగంగా రాత్రి తనరు ॥* 4241

†(10) నవతిర్నవశక్తులతో నానావిధ దీప్తులతోఁ
దొంబదిగాఁ దనరారుచుఁ దొమ్మిదిగా వరలుచుండు
రాత్రివేళ దీప్తగతుల రాజిల్లెడి రాజ ఋక్ష
శక్తితతులు మహాతేజ సంకలితములై వర్తిల
ఆ శక్తులు అశీతిగాఁగ నలరారును నా త్వష్టన్
ఆ శక్తు లఖిలమ్ములు నమరు సప్తసప్తతుల
నలర సల్వదెన్మిది వే లైచు వందల పదిగ
నాల్గు నూర్ల తొంబదిగా నానా రూపాలలో
సంవిలీనతమైని సంకలనతలమెయిని
బంచభూతాఽఽవళులఁ బరగంగా దిశ లెల్లను ॥* 4242

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ఖిల" మంత్రానువాదము.

†(11) పంచభూత తత్త్వాలకు సంచితమౌ ప్రాణితతికి
నివేశనిగ నలరెడి యా నిశిథిమాత కేను
విశ్వభద్రగా వెలుఁగుచు విశ్వాంతరాళగోళ
సంధారిణిగాఁగను సంభారవాహినిగా
భగోళపతియౌ సుషమ గ్రాలు జగన్నిశకు
వైష్ణవీయ భగవతి కేఁ బ్రపద్య నొనరింతును ॥ 4243

†(12) గృహములకున్ ఋషిణులకుఁ గ్రాలు మాలగా వరలుచు
సంవేశినిగాఁగఁ బూరి సంయమనిగఁ బరఁగుచు
శివరూపిణి యైన రాత్రి చెల్వొందెడు భద్రకుఁ
బార ములరు తిమిరాఽహికిఁ బాశికమౌ శక్తికిఁ
బ్రపన్నుండ నౌచు నే నపారమైన మహత్త్వము తగ ॥ 4244

†(13) జాతవేదమైన అగ్ని శక్తితత్త్వ మెల్లఁ దనరఁ
జంద్రాఽమృతశక్తు లెల్ల సదమలగతి వరలంగా
అనేకాఽనేకమైన అంతరిక్ష దుర్గణాల
సంమిళిగాఁ దనరారెడి సర్వ దుర్గను నా దేవిని
బహుకాంతులఁ బ్రేమించెడి పలు ఋక్కులఁ బ్రేమించెడి
యశస్వినియౌ యామిని నభినుతింతు శరణు వేఁడి ॥ 4245

†(14) సోమాఽమృత దివ్యశక్తి సౌమ్మె - పాలకు లౌచును
విజ్ఞానపు ద్విజన్మతల విలసిల్లెడి ఋషి దేవుల
దివ్యశక్తు లలరఁగ రవి తేజమ్ముల సముత్పన్న
నిఖిలశత్రు శక్తితతుల నిరతము దహించు విజ్ఞత ॥ 4246

†(15) హవ్యవాహినిగాఁగ నలరారు నిను దేవి!
విజ్ఞానవంతులు నవిజ్ఞానవంతులును
బ్రపద్య నొనరింతుర్ బ్రహ్మజ్ఞానులు
విశ్వగత దుర్గాళిని విషమదుర్గముముల నెల్లఁ
దరియించుచు రాత్రి తనరును సృష్టికి నాభిగ
సత్యజ్ఞానముగాఁగను నిత్యధ్యానముగాఁగను
సూక్ష్మముగా శూన్యముగా శుభంకారిణిగ వరలుచు
అతిక్లిష్టము శబ్దమయము త్యాగమయమునై అలరెడి
నిశీథిని దుర్గగాఁగ నిరతమ్మును రక్షించును ॥ 4247

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
† "ఖిల" మంత్రానువాదము.

†(16) సప్తవిధాగ్నితతి సప్త వర్ణాలతో
సప్తసప్తగ వెలుఁగు నక్తరూపిణిని
సౌమ్యరూపిణిని శుభ సర్వ రూపిణిని
నే యే ద్విజతతు లెనఁగఁ గీర్తింతురో।
ఆ ద్విజులు దురితాగ్నులన్ దుర్గాలఁ
దరియించుఁ బడవతో జలధిని దాఁటునటు ॥ 4248

†(17) విషమ దుర్గాలలో ఘోరభీకర సంగ్రామాల
రిపుల సంకటములను విపరీతముగఁ బెట్టి
నగ్నిచోర నిపాతాల నాచుకొనుచు నెల్లప్పుడు
దుష్టగ్రహా లన్నింటిని దూరముగాఁ దరుము రాత్రి ॥ 4249

†(18) అఖిల విషమ దుర్గాలను నభయునిగాఁ జేయుము। నను
సమరమ్మున నడవులందు సలిలములన్ గాపాడుము।
మోహతతులనుండి నన్ను విమోచనమ్ము గావింపుము।
అఖిల కష్టములఁ దీరిచి అభయ మొసఁగుమమ్మ।నీవు। ॥ 4250

†(19) సకలభూత కేశినిగా సర్వభూత పంచమిగాఁ
బంచభూతాత్మనియౌ పాంచాలిగఁ బంచమిగాఁ
బిలువఁబడిన సమరూపిణి పరిరక్షించునుగావుత।
నిరతమ్మును సర్వతః ఆ నిశా దేవి నన్ను ॥ 4251

†(20) సప్తాగ్నుల వర్ణాలను జ్వలియించుచుఁ దపస్సుతోఁ
గర్మఫలజుష్టకాఁగఁ గ్రాలు వైరోచనియౌ
దేవిని దుర్గను శరణము నే వేఁడెదఁ బ్రవద్యముగ
నమస్కృతుల నొనరింతును నానాకష్టాలఁ దరింప ॥ 4252

†(21) లౌకికాఽలౌకికములౌ ఉలూకాల శక్తులతో
నలౌకిక శ్వ శక్తుల నలౌకిక కోక గతుల
నలౌకిక సుపర్ణశక్తి నలౌకిక గృధ్రశక్తి
విష్ణుశక్తి రక్షించుత వృషతత్త్వము వరలంగా ॥ 4253

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

(22)†నిశా వృత్తము॥*
పిశంగవర్ణయుక్తమైన
అశాంతిపీడ శక్తిరూపి
విశాపరిదీప్త సోమ పూర్ణ
పిశాచి సంహరించి రాక్ష
స శత్రు సర్వమున్ హరించు ॥ ‡ 4254

---

†(1) ఈ దుర్గాస్తవము పుణ్యద మాదృతిమై నిత్యమ్మును
బ్రతిరాత్రియందుఁ బఠియించినఁ బ్రపత్తిమై
వివిధ దుర్గాలలో విషమ మైన స్థానాలను
మహితమైన విజయ మొసఁగు మాకు రాజ్య మొసఁగు దేవి ॥♦ 1

†(2) నిశీథినీ సూక్తమ్మును నిత్యమ్మును జపింపఁగా
ఆ రాత్రి కాల మెల్ల నాత్మీయముగా వశమౌ
వివిధాఽఖిలపాపమ్ముల విముక్తిని బొందుఁ బ్రాణి
ఒందఁబోదు తిరిగి యే యోని జన్మమ్మునైన ॥♦ 2

†(3) స్నాపితయై క్షీరమ్ములఁ జందనాల విలేపనాల
నొప్పు దుర్గ కభివాదము నొనరింతును నమస్కృతుల
బిల్వపత్ర సంచయాలఁ బీడారహితగఁ దనరెదు!
నమస్కార మో దుర్గా! నమోనమః నమోనమః ॥♦ 3

†(4) ఆకసంపుఁ బిశాచాలు ననిలాల పిశాచాలు
ననలాల పిశాచాలు నా జల పిశాచాలు
పృథ్వీతతి పిశాచాలు వివిధసర్పసరీసృపాల్
దేవాళులు మానవాళి దేవమానవావళులును
మానవదేవాళు లెవరును మాకుఁ గీడు చేయకుండ
రక్షనీయుమా! దుర్గా! రాత్రిదేవి! నిత్యమ్మున్ ॥♦ 4

†(5) ఋగ్వేద స్తుతగాఁగను ఋషి కాశ్యపుఁ డుదాహరింప
సోమాఽమృతపు శక్తు లలర స్తుతి నొందిన జన్మజ్ఞాని
జాతవేదపత్రిభా గౌరి జాదవేదసుని దయన్ గనుత! ॥♦ 5

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"బృహతీ"చ్ఛందము.(9) వియతిచ్ఛందము. ‡ "ఖిల"మంత్రానువాదము.
♦ఋఙ్మంత్రాఽఽభాస ప్రక్షిప్త శ్లోకానువాదము.

†(6) సురులవల్ల నసురులవల్ల
ద్విజవరులవల్లఁ బిశాచాలవల్ల
నురగమ్ములవల్ల నొగి రాక్షసాళివల్ల
శత్రుభయము సంభవింప
వేదరూప విజ్ఞానము
నిఖిలారుల నిర్దహించు ॥ 6

†(7) గజముఖ సింహద్వారమ్మున
ఆపథమ్మున నతిఘోరరణమ్మందు
సకల దురితములనుండి విశ్వ
దుర్గమ్ములనుండి మమ్ముఁ
దోడై రక్షించు గౌతమి! ॥ 7

†(8) మహాభయము పుట్టినపుడు
స్మరించుచో! జపించుచో!
దుర్గ సర్వము దాఁటించును
దురితాగ్నుల జలధి నెల్లఁ
దరించు గతిని బడవపైని ॥ 8

†(9,10, 11) త్రిలోకాల విఖ్యాతమై
త్రిలోకాలఁ బూజితమౌ
పుణ్యరూప మీ దుర్గాస్తుతి
విన్నచో జపించు నెడలఁ
బుత్రు లొందుదు రపుత్రకులు-
ధనహీనులు ధనలాభము
నొందఁగలరు!- కనులు లేని
గుడ్డివారు సనేత్రు లౌదురు-
బంధనాలబద్ధుఁడైనవాఁడు
బంధవిముక్తుఁడై వరలును
వ్యాధి ముక్తుఁ డౌచు రోగి
ఆరోగిగా శ్రేయ మందుఁ
గామితముల సర్వ మిచ్చు
కాత్యాయని! నీకు నతులు ॥ 9

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*ఋఙ్మంత్రాఽఽభాస ప్రక్షిప్త శ్లోకానువాదము.

## సూక్తమ్—128

ఋషిః—విహవ్య ఆంగిరసః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్; 9-జగతీ

(1) మమాగ్నే వర్చో విహవేష్వస్తు వయం త్వేన్ధానా స్తన్వం పుషేమ ।
మహ్యం నమన్తాం ప్రదిశశ్చతస్ర స్త్వయాధ్యక్షేణ పృతనా జయేమ ॥ 1458

(2) మమ దేవా విహవే సన్తు సర్వ[1] ఇన్ద్రవన్తో మరుతో విష్ణురగ్నిః ।
మమాన్తరిక్షమురులోకమస్తు మహ్యం వాతః పవతాం కామే[2] అస్మిన్ ॥ 1459

(3) మయి దేవా ద్రవిణమా యజన్తాం మయ్యాశీరస్తు మయి దేవహూతిః ।
దైవ్యా హోతారో వనుషన్త పూర్వే ఽరిష్టాః స్యామ తన్వా సువీరాః ॥ 1460

(4) మహ్యం యజన్తు మమ యాని హవ్యా ఽఽకూతిః సత్యా మనసో మే[3] అస్తు ।
ఏనో మా ని గాం కతమచ్చనాహం విశ్వే దేవాసో[4] అధి వోచతా నః ॥ 1461

(5) దేవీః షళుర్వీరురు నః కృణోత విశ్వే దేవాస[5] ఇహ వీరయధ్వమ్ ।
మా హాస్మహి ప్రజయా మా తనూభిర్మా రధామ ద్విషతే సోమ రాజన్ ॥ 1462

---

1. సర్వఽఇన్ద్ర, 2. కామేఽఅస్మిన్, 3. మేఽఅస్తు, 4. దేవాసోఽఅధివో, 5. దేవాసఽఇహ. (వా.ప్ర.)

(6) అగ్నే మన్యుం ప్రతినుదన్ పరేషామదబ్ధో గోపాః పరి పాహి నస్త్వమ్ ।
ప్రత్యంచో యన్తు నిగుతః పునస్తేఽమైషాం చిత్తం ప్రబుధాం వి నేశత్ ॥ 1463

(7) ధాతా ధాతౄణాం భువనస్య యస్పతిర్దేవం త్రాతారమభిమాతిషాహమ్ ।
ఇమం యజ్ఞమశ్వినోభా బృహస్పతిర్దేవాః పాన్తు యజమానం న్యర్థాత్ ॥ 1464

(8) ఉరువ్యచా నో మహిషః శర్మ యంసదస్మిన్ హవే పురుహూతః పురుక్షుః ।
స నః ప్రజాయై హర్యశ్వ మృళయేన్ద్ర మా నో రీరిషో మా పరా దాః ॥ 1465

(9) యే నః సపత్నా[1] అప తే భవన్త్విన్ద్రాగ్నిభ్యామవ బాధామహే తాన్ ।
వసవో రుద్రా[2] ఆదిత్యా ఉపరిస్పృశం మోగ్రం చేత్తారమధిరాజమక్రన్ ॥ 1466

## సూక్తము—128

ఋషి—ఆంగిరసుఁడైన విహవ్యుఁడు†

దేవత—విశ్వే దేవతలు†

(1)*గద్యము ॥

ఓ యగ్నీ! సంగ్రామములయందుఁగాని, యజ్ఞములయందుఁగాని, నీ యనుగ్రహమువల్ల దీప్తి కలుఁగుఁగాక! మేముకూడ నిన్ను సమిత్తులచే దీపింపఁజేయుచు నీ శరీరమును బోషింపఁగలము. నాల్గు దిక్కులయందుఁగల మనుజులు నాకు నమ్ర లగుదురుగాక! భవద్దత్త హవిర్భర్తృ డగు నీశ్వరునిచే శత్రుసేనల జయింపఁగలము ॥ 4255

---

1. సపత్నా౽అప తే, 2. రుద్రా౽ఆదిత్యా౽ఉపరి. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 158వ పుటలోను, 156 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలోను, నీ సూక్తమునకు ఋషి "విహవ్యుఁడు"గాను, దేవత "విశ్వే దేవతలు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(2)*గీ॥ అసురు లెల్లరు సంగ్రామమునందొ! యజ్ఞ
మందునో! నాకు సాధకు లగుచునుందు్రి
గాక! దిపమును శస్త్రప్రకాశకంబు
గా మెలంగునుగాక! నకారణంబ ॥ 4256

*గీ॥ అధికకామయితవ్యమౌ నతుల బలము
హేతు వగుచుండ సంతత పూతమైన
వాయువును దాను బ్రీతిని బాయకుండ
నేచి యనుకూలముగ నాకు వచ్చుఁగాక! ॥ 4257

(3)*సీ॥ స్తోతనౌ నా కిలఁ బూతదేవత లెల్లహెచ్చుగ ధనము నిచ్చెదరుగాక!
శంసనీయంబైన సవన సత్ఫల మెల్ల మెండుగ నాయందు నుండుఁగాక!
దేవతాహ్వానంబు తివిరి యొనర్చెడు యజ్ఞంబు నాయందు నమరుఁగాక!
నస్మదీయులకంటె నస్మత్పురుషు లెల్ల నౌగిఁ బాక్షధాన్యులై యుందురుగాక!
గీ॥ సురుచిరంబైన శారీర శోభతోడఁ, గూడుకొనుచు నాకమై హింసఁ గూడకుండ
వీరపుత్రకులం గల్గి వెలుఁగుచుండి, ప్రీతితోడ వసింతుము భ్రాతి మెఱయ ॥ 4258

(4)*చ॥ పురుషులు నా నిమిత్తమయి పూజ నొనర్తురుగాక! దేవతా
వరులకు, నాదు ప్రార్థన మవంధ్యముగా వెలుఁగొందుఁగాక! నే
దురితమునైన నే నెరుఁగ దోషమునైనను జేయుకుంటి నో
సురవరులార! మాపయిని జూపుఁడు! మీరలు పక్షపాతముల్ ॥ 4259

(5)*గీ॥ దేవతా షట్కమా! మాకు దివ్య ధనము
కల్పనంబును జేయుఁడీ! కరుణ మీరు
సర్వ సురలార! మా కెట్లు సకల ధనము
సంభవించునొ! యట్టులు సలుపవలయు ॥ 4260

*గీ॥ మేము పుత్రాదులను మరి మేము తనువు
లను విసర్జింపకుందుము ఘనుఁడ! సోమ!
వైరి చెంతకు మే మెల్లఁ జేరకుండు
నట్టు లొనరింపుఁడీ! ప్రీతి నందుచుండి ॥ 4261

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(6)*గీ॥ అరుల కోృధంబు నడ(చుచు నధికు( డైన
సెవనిచేతను హింసల నెరు(గకుండ
మాకు గోపాయితగనుండి పముల సర్వ
విధముల ¹గాచుచుండుమా! వేల్పు! నీవు ॥ 4262

*క॥ అరులార! మీరు భీతిన్
మరలుచు నవ్యక్త శబ్ద మహిమం గనుచున్
బిరబిర మీ స్థానమునకు
నరు(గుడు! మీ మనసు నాశ మందుత! వేగన్ ॥ 4263

(7)*గద్యము॥
సృష్టలకు సృష్ట సమస్తభూతజాతమునకు నింద్రు(డుగాని, సవితగాని, పతితాృతయు శతృషోధయు నగు నింద్రునిగాని, సవితనుగాని నేను స్తుతించుచున్నాను. అశ్వు లుభయులు బృహస్పతి మొదలగు దేవతలు నీ యజ్ఞమును యజమానుని బాపమునుండి తప్పించి రక్షింతురుగాక! ॥ 4264

(8)*క॥ విపుల వ్యాప్తిం గాంచుచు
నపరిమితాహూయమాను( డైన మహేంద్రుం
డురుతర యజ్ఞంబందున
గురుతర మౌ సుఖము మాకు( గూర్చుత(! బ్రీతిన్ ॥ 4265

*గీ॥ ఓయి! హర్యశ్వ! మమ్ముల( బాయకుండ(
బుత్ర పౌతాృదికమునకు( బూర్ణసుఖము
నొస(గి హింసల మా కెల్ల నొస(గకుండ
మమ్ము విడనాడుమా! నీవు నెమ్మి మీర ॥ 4266

(9)*గద్యము ॥
మా కే సపత్నులుగలరో! వా రపగతు లగుదురుగాక! అట్టి సపత్నులను స్తుతిచేతను బ్రసన్నులగు నిందాగ్నులచే ననుగృహీతుల మగు మేము నివారించుచున్నాము. వసువులు ఆదిత్యులు నన్ను నున్నతపదసంస్పృష్టగను జేయుదురుగాక! మరియు నుద్గూర్ణ బలునిగాను సర్వజ్ఞాతగను సర్వమున కీశ్వరునిగను నన్ను( జేయుదురుగాక! ॥ 4267

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. గాచుచుండుమా! కరుణ(బూని. (లొ.పా.)

## సూక్తము—128

ఋషి—ఆంగిరసుఁడైన విహవ్యుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

†(1) అగ్నిదేవా! నీవు అఖిల వర్ణాలతో
అపురూపశక్తుల నతిలోక దీప్తులన్
నలరారి సృష్టిలో నద్భుతావహముగా
సమరశక్తుల నిలిచి శాంతిదాంతుల నిలిచి
అఖిలాఽఖిల మ్మైన అనేకరూపాల
శబ్ద శక్తుల నిత్య చైతన్య తత్త్వాల
విస్తీర్ణతలమైని వెలుఁగుచున్ వ్యాపించి
దివ్య దీధితులతో దేదీప్యమానమై
జ్వలియింపఁగా దిక్చతుష్టయమ్ములో
మాకు విజయము కూర్చు మహితశక్తుల నిచ్చి
విశ్వమ్మె వశ మౌచు వినయగతు లలరఁగా
దిగ్విజయముల మేము దీప్త మౌదుముగాక! ॥ 4268

†(2) దివ్యదేవాళు లెల్ల దేదీప్యమానాలను
అఖిలమైన సమరాలను నందగాఁగ నిలిచి నాకు
అద్భుతశక్తుల నీయఁగ నలరుఁగాక! సనలశక్తి
కామరూపమైన శక్తి కాంలంగా బహురూపుల
సమల మౌచు స్వచ్ఛమైన అనిలశక్తి మహిత మౌచు
నానావిధ రూపాలను నానాగోళాల నెల్ల
నాకాది విశేష దివ్య లోకాలను వ్యాపించుచు
నపురూపపు శక్తులతో ననురూప మహిమలమై
హస్తగతమ్మై తనరఁగ నఖిలభూతతత్త్వాలను
జగతి నాకు వశ మౌచును శరణాగతి నొందంగా
నేనె! విశ్వవిజేతగాఁగ నిరుపమానగతి వెలుఁగఁగ
విశ్వజిద్యాగ మ్మది అశ్వజ్ఞుల నలరారును ॥ 4269

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) దివ్యదేవ శక్తు లెల్లఁ దేజరిలఁగ మహాదీప్తి
నగ్ని శక్తు లెల్ల సృష్టి నలరారును బలము లౌచు
బహురూపుల శబ్దశక్తు లిహపరాల నన్నింటను
అనేకాఽనేక మైన అనిలాఽఽవళి రూపాలను
సప్తవిధ కీలలతో సప్తవర్ణాఽనలాలు
ప్రకృతి సర్వస్వమందుఁ బ్రాణినౌ నాయందును
బ్రజ్వలిల్లి మహితశక్తి వర్ధిల్లును గాక! సదా
నిత్య సత్య వీరత్వము నిర్జించెడి పౌరుషమ్ము
నిండుఁగాక! నాలోపల నింగి నిండు రీతిగాఁగ
దైవీయపు దివ్యశక్తి తనరారఁగ హోతగాఁగఁ
బూర్వారిష్టము లన్నియుఁ బూర్తిగ నశియించంగా
నాలోపల దైవశక్తి వేల లెనయకుండ వెలుఁగు
విశ్వసృష్టి యజ్ఞముగా విమలమౌచు వెలుఁగుచుండ
విపుల విశ్వవిజేతనై అమలమౌ నజయ్యమైన
అతివేలపు శక్తులతో నతిలోకపు దీప్తులతో
ననిలాఽనలరూపాలను నలరారుదు నఖిలమ్మున ॥ 4270

†(4) పురుషశక్తి సృష్టిలోనఁ బరఁగుచు మహిత మ్మౌచును
విశ్వరూపమై వెలిఁగెడి విమల చైతన్యగతులఁ
బ్రకృతిదేవి నర్చించుచుఁ బ్రాకృతముగ నిత్యమ్మును
నక్షయమై అభేద్యమై అజయ్యమై అలరారుచు
నా వశమౌ నానావిధ దైవీయ సుశబ్దశక్తి
జాలము లవి జగచ్ఛక్తి నవిలసనతల విలసిల్లఁగఁ
బూర్వజన్మ పాపము లవి పూర్తిగ నశియించంగా
నే పాపము లేని నేను నేపారఁగఁ బుణ్యుఁడుగా
నమలమైన అమరమైన అమృతరూపశక్తులతో
నలరారఁగ నా పూజలు అసాధారణంపు గతుల
అఖిలాఽఖిల దేవతాళి యనన్యదయార్ద్ర దృష్టి
నాపైఁ బ్రసరింపఁజేసి నానావిధ కామ్యసిద్ధి
నిన దీప్తుల నిత్యసత్య మనశ్శక్తి వర్ధిల్లఁగ
ఋతయజ్ఞమ్మున దివ్య హృదయహవ్య మలరుచుండు ॥ 4271

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) చంద్రామృత సోమశక్తి స్రవియింపఁగ వెన్నెలలై
అమృతమయ ప్రాణతతుల నఖిలప్రకృతి వర్ధిల్లును
దివ్యమైన దైవశక్తి నవ్యనిత్య సత్యగతుల
అనుపమానమైన రీతి ననుగమించు ననుసరణల
షడృతువుల రూపాలవి సకలసృష్టి వరలంగా
విశ్వసృష్టి సంపదాళి విమలములై వర్ధిల్లును
ప్రకృతిమాత శక్తిపీఁ బరిఢవిల్ల వివిధగతులఁ
జరాచర ప్రపంచమ్ము జడాజడ పదార్థాలు
ప్రాణికోటి సర్వస్వము నాత్మావిష్కృతి వరలఁగ
సంతరంగ శక్తులతో నాంతర్యపు మూర్తులతో
నాత్మైక్యము తనరంగా నందుఁ బునర్జన్మ తానె
పంచభూతరూపాలను బరఁగంగా నఖిలమ్ములు
నపురూపపు శక్తులతో నంతర్గతి నలరుచుండు
అధికాధిక మౌచు నొకటి అల్పములై మిగులిన నాల్గు
తనరానును బంచభూతఘనరూపమ్ములు జగతిని
మహితమైన పురుషశక్తి మదీయమై వెలుఁగంగా ॥ 4272

†(6) అగ్నిరూప మహాశక్తు లలరారఁగ దివ్యగతుల
మన్యురూపమైన దీప్త మహితశక్తు లమరు సృష్టి
అభేద్యమై అజయ్యమై అసాధారణంపు గతుల
అమేయమౌ శక్తులతో అడ్డూ ఆగీ లేకను
అనుపమానమైనరతుల నమృతమైన శక్తులతో
నలరారెడి మహాశక్తి అతిలోకముగా వెల్గుచు
నవ్యయమై తనరారును నతిగోపమౌ శక్తుల
అఖిలలోక గోళాలను నలరఁ బ్రకృతితత్త్వాలను
ననాహతమ్మై తనరెడి అతిలోక మనశ్శక్తు
లసాధారణంపుగతుల ననుపమాన వేగాలను
నఖిలసృష్టి నలరారును నద్భుతమౌ శక్తిగాఁగ
సర్వాకర్షణశక్తిసహిత శత్రు చోర గోళ లోక
సర్వస్వమ్మును జయించి జ్వలిత మౌను మా మనస్సు
సమయించును శత్రుతతుల నమృతశక్తు లలరంగా ॥ 4273

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) సకల సృష్టిధాతకు నై। సర్వధాతధాతలకును
సర్వలోక గోళాలకు సంచరించు భువనాలకు
అఖిలసృష్టి జాలమ్మును నతివేలమ్మౌ ప్రకృతిని
జరాఽచరప్రపంచమును జడాఽజడజగత్తతుల
నన్నింటిని రక్షించెడి ఆ దేవుని దైవీయగ
సర్వాత్మశక్తితతుల సంస్తుతింతు నిత్యమ్మును
మహాబుద్ధి జ్ఞానరూపు మహితశక్తి వర్ధిల్లుచు
దైవీయానంత దివ్యభావ శబ్ద శక్తులెల్ల
వరలంగా విశ్వమ్మునఁ బ్రభాకలితమౌ దీప్తుల
నశ్విశక్తు లలరంగా నమలచాంద్రికాముదులే।
సర్వార్థక సంపత్తుల సాధనముగ విలసిల్లఁగ
యజ్ఞరూపశక్తి సృష్టి యజమానుని రక్షించును
"అభి" శక్తుల నన్నింటిని నశేషముగ రూపుమాపి
పంచభూతప్రకృతిశక్తు లంచితముగ నలరు సృష్టి ॥ 4274

†(8) విశ్వసృష్టి పరివ్యాప్త విరాడ్రూప మౌచు వరలు
నాకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును అఖిల గోళ లోకాలుగ వర్తిల్లుచు
బహిరంతర రూపమ్ముల సహి శక్తుల వ్యాప్త మౌచు
సౌర చాంద్ర గ్రహ ఋక్ష సర్వస్వము దీప్తముగా
అమలామరకాంతులతో నఖిలమ్మున నలరాఁరగ
వైష్ణవీయమైన శక్తి వరల సృష్టి స్థితిగతులను
జరాఽచరప్రపంచమ్ము జనితమౌచుఁ జలితమౌచు
ఆత్మగతుల సంతతిగా నపురూపపు శక్తులతో
నావిర్భావమ్ము నొందు నాత్మ పునర్జన్మకాఁగ
సప్తవిధమ్మైన శక్తి సర్వస్వము విశ్వమ్మున
వరలంగా ననల దివ్యభార శౌచరూపమహిత
కాంతిదీప్తి సకలమ్మును గ్రాలును బీడితరతులను
బరిత్యాగ కిరణజాల విరాజితముగ సుఖద మౌను ॥ 4275

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(9) విష్ణ్వాదిత్య సుశక్తులు విమలములై విశ్వసృష్టి
వర్తిల్లఁగ నమేయముగ వసుశక్తులు వర్ధిల్లును
నష్టవిధరూపములను ననుపమాన సంపదలుగ
సూర్య చంద్ర గోళతతుల నర్యమరతు లొప్పారఁగ
నవత్సులుగ నుపగ్రహ లపురూపపు భ్రమణగతుల
నలరారఁగ ననిలమ్ముల ననలమ్ముల నలిలమ్ముల
మృత్తతులను వరలు మింటి గోళ లోకాలకుఁ
బ్రపక్షిణ లొనరించు నాత్మ ప్రదక్షిణలఁ దనరు
నాకర్షణ వికర్షణాది యజ్ఞక్రియ స్పష్టగ్నుల
నప్తవర్ణ దివ్యదీప్తి సర్వస్వము విశ్వమ్మున
వరలంగాఁ బ్రకృతియెల్లఁ బురుషశక్తి వ్యాపితమై
అసాధారణంపు శక్తి నాత్మోన్నత్యమ్ము తనర
నక్షయమౌ నజయ్యమౌ నతిలోకపు శక్తులతో
సృష్టిసర్వప్రకృతి కెల్ల నీశ్వరుఁడుగఁ బురుషుఁ దలరు ॥ 4276

## సూక్తము — 128

ఋషి—ఆంగిరసు డైన విహవ్యుఁడు
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—2

†(1) సకల సృష్టి గోళ లోక సర్వమ్మున వర్తిల్లెడి
అంధతమము నెల్ల నేనె! అగ్ని రూప దీప్తులతో
నంతరింపఁజేయుచుందు నపురూపపు శక్తులమై
విశ్వసృష్టి నెల్ల నిండి విమలమైన దీప్తితతుల
నఖిల పదార్థాలలోన నంతరాంతరముల నిల్తు
నల్ దిక్కుల పర్యంతము నానావిధ రూపాలను
జరాఽచరములందు సర్వ జడాఽజడములందుఁ గూడ
నత్యంతము సూక్ష్మమౌ ననూనమౌ గరీయగతుల
శత్రుతతుల నిర్జించుచు సర్వవిజేతగా వరలుచు
అధ్యక్షుఁడనై సృష్టికి నాత్మనమస్కృతి నొనర్తు
అతిలోకమై తనరెడి అనలశక్తి రూపమ్ముల
నతివేలముగాఁ బరఁగఁగ నసాధారణంపుగతుల ॥ 4277

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) వైష్ణవీయమ్మైన పవనాగ్ని ద్వంద్వముల్
ఆకాశ సలిలమ్ము లవనీతలమ్ములున్
సకలేంద్రియంతమౌ చంద్ర సూర్యుల శక్తి
మదూ్రపమై వరలు మహితబ్రహ్మాత్మగా
"అహంబ్రహ్మాస్మి"నా నఖిలానఁ దనరఁగా
సృష్టి సర్వస్వమ్ము చెలఁగంగ బహుగతుల
దైవీయమౌ కామతత్త్వ రూపాఽఽవళుల
ననుకూల రూపాల నా పంచభూతాలు
ఆంతరంగిక శక్తి నాత్మప్రాణపగతుల
నలరార నిత్యమ్ము నతిలోక చైతన్య
జీవగతు లొప్పఁగా సృష్టి విలసిల్లులే!
విశ్వదైవీయమౌ విమలమౌ నా శక్తి
విశ్వరూపము నిండి విలసిల్ల నిత్యమ్ము
సృష్టి స్థితిలయాలు వ్యష్టిసమిష్టిగ జరుగు ॥ 4278

†(3) రవిచంద్రగ్రహదీప్తు లవిరళమ్ముగ దివ్య
దేవాఽఽళి శక్తులన్ దేజరిలు నాలోన
సృష్టి యజ్ఞమ్మెల్లఁ జెన్నొందు నాయందె
ఆశీఃపరమ్మైన ఆ సృష్టి స్థితి శక్తు
లఖిలముల్ నాయందె అంతర్భవమ్మౌను
బూర్వదుర్గతు లెల్ల బూర్ణమ్ముగ నశియింప
నత్యంత సూక్ష్మమౌ నలమమౌ శక్రగతి
తనురూపముల నిల్చి తనరారు సృష్టిలో
దైవీయశక్తు లవి తగ నిలువ హోతగ
విశ్వానఁ బ్రాణితతి వివిధమౌ తరులతలు
నాత్మసంతతిగాఁగ ననురూప రూపాల
ఆవిర్భవము చెంది ఆవిష్కృత మ్మౌచుఁ
బీడితగతులమై నపీడిత రతులమై
నలరారు సృష్టిలో నద్భుతాఽఽవృత్తులన్ ॥ 4279

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) సత్యమై నిత్యమౌ సర్వాత్మ రూపిగా
అక్షయ్యమై నిలిచి అజయ్యమై వెలిఁగి
అతిలోకమై తనరు నమేయ శక్తులన్
దనరారు మన్మనో ఘన దివ్యతత్త్వాల
శబ్దశక్తుల సృష్టి సర్వస్వ మలరారు
సత్యామలమై వరలు నిత్య యజ్ఞమ్ముగా
సత్య విజ్ఞానముగఁ జరాఽచర ప్రపంచ
జడాఽజడ పదార్థచయము హవిషముగా
విశ్వసృష్టిని వరలు విమలలోక గోళమ్ములు
సూర్యచంద్ర గ్రహ జ్యోతి ఋక్షాదులు
జాజ్వల్యమానగతి జగములన్ వరలఁగా
సత్యసంకల్పముల సకల విశ్వము వరఁగఁ
బ్రాణమయమౌ కాంతి వలయాలు విలసిల్ల
నంతరిక్షమ్ములో నఖిల జగములు తనరు ।  4280

†(5) ఆకసములు ననిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును నన్యోఽన్య మేళనగతి వరలుచుండు
అవినాభావాలమెయిని నంతర్గతి నలరారెడి
ప్రకృతిదేవిఋతుషట్కపుఁ బ్రాకృతనవ పరిణతులన్
బూర్ణరూపరతులు మీఱి పొందు క్షీణగతులు వికృతి
విష్ణ్వాదిత్యుని శక్తుల విమలదీప్తి ప్రభావాల
రవికాంతుల క్రాంతులు సంక్రాంతులుగా వరలుచు
ఖరకరకిరణావళులను జరాఽచర ప్రపంచానఁ
బ్రసరింపఁగఁ జేసి చంద్రమసుని వెలి చలువల
వెన్నెలలను బ్రకృతిపైని విరజిమ్ముచుఁ బ్రాణదముగ
సోమాఽమృతస్రావశక్తి క్షుద్రాఽక్షుద్రశత్రు
తతులన్నిటి సమయించుచుఁ దనరారఁగ ఋతగతులను
సత్యయౌవనంపు గతుల నిత్యజీవ జవశక్తుల
నీయంగాఁ బ్రకృతియెల్ల నెన్నోరూపాలఁ దనరు ॥  4281

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) అక్షయ్యమ్మౌచు నిలిచి అమేయ మై వర్ధిల్లుచు
అతిలోకపు దీప్తులతో నజయ్య మౌ శక్తులతో
ననాహతంపు రూప మౌచు ననన్యశక్తియుక్త మైన
మన్యు మహాశక్తితతులు మహిమాన్విత మై వరలఁగ
ఆరిపోని అగ్ని దీప్తు లలరారఁగ నఖిలమ్మున
సకల లోక గోళాలను సదా కాపాడుచుండి
సృష్టి స్థితి లయ గతు లవి చిద్విలాసములుగాఁగను
చరాఽచర ప్రపంచాలుగ జడాఽజడజగతులుగఁ
జక్రనేమిక్రమముగాఁగ సదా ప్రకృతిరూప మందు
ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
అవనిరూప గతులతోడ నా పంచభూతతతులు
మిశ్రిత మై మాయదేహాఽశ్రిత మై వర్ధిల్లుచు
శత్రుశక్తి పీడిత మై మిత్రశక్తి పాలిత మై
కృష్ణలీలగా విశ్వము ఉష్ణశీతలతలఁ దనరు ॥ 4282

†(7) సకలలోక ధాతగాఁగ సర్వసృష్టిధాతగాఁగ
ధాతలకే ధాతగాఁగ ధరాతలా లన్నింటిని
సలిలలోకజాలాలను జ్వలితాఽనల లోకాలను
మరుల్లోకతతు లన్నిటి మహితాకాశము లన్నిటి
ధాతగాఁగ సృష్టించుచుఁ దాతగాఁగ రక్షించుచు
నఖిల సృష్టి ప్రాణశక్తి హరింపంగ నతిలోకపు
ఘోర మైన విషాగ్నిగాఁ గ్రూరముగా వ్యాప్తి చెందు
దుష్ట మైన "అభి" శక్తులఁ దున్మాడుచు "నాభి"శక్తి
రక్షించుచు ఋతుగతులను ఋకృతిరూపు వర్ధిలంగ
సచ్చిత్తుల విలాసాల సర్వేశుని ఆనందపు
మహాదీప్తి లీల కాఁగ మహత్తుగా నశ్విశక్తి
వైష్ణవీయ యజమానత వర్ధిల్లుచు వ్యాప్త మౌచు
విశ్వసృష్టి యజ్ఞమ్మున విస్తరిలఁగ నిత్యరతుల
దివ్యదేవశక్తు లెల్లఁ దేజరిలును వివిధగతుల ॥ 4283

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును నేక మౌచు మించి సచ్చిదానందపుఁ
బ్రకృతిరూప పురుషశక్తి వ్యాప్త మౌచు సృష్టిగాఁగ
విశ్వరూపయజ్ఞమ్మున వెలుఁగు సౌరచాంద్ర దీప్త
కాంతిజాల సర్వస్వము క్రాలునులేః జగములపై
వైష్ణవీయ మహాశక్తి జిష్ణుగతికి మూలముగా
నాదిత్యుల దీధితులను నఖిల సృష్టి తనరారును
ప్రాణిజాల సర్వస్వపుఁ ద్రాణశక్తిగా పరలుచు
విశ్వలోకగోళాలను విమలములౌ సుఖ శాంతులు
విస్తరిలఁగ సృష్టిస్థితి వెలయఁ బ్రళయలయగతులను
జక్రనేమి క్రమముగాఁగ సకల ప్రకృతి తనరంగా
నాకర్షణ వికర్షణల నాత్మగతుల సంచరించి
నిత్యగతుల సత్యరతుల నిర్విరామ చలనమ్ముల
నపురూపముగా విశ్వమ్మతివేలముగాఁ బరఁగును ॥ 4284

†(9) ఆకసముల ననిలమ్ముల ననలమ్ముల సలిలమ్ములఁ
బృథ్వితతుల నలరారెడి విభిన్న మైన గోళా లవి
పంచభూత తతులు కలిసి నంచితముగఁ దనరారెడి
పలువిధముల లోకాలను బరఁగెడి దివిభువు లెల్లను
భువనాళులు విశ్వమ్మునఁ బూర్ణదేవ లోకమ్ములు
వర్ధిల్లును సృష్టిలోనఁ బరఁగు నాదిత్యశక్తి
గ్రహదీప్తులఁ గ్రాలుచుండి రవ్యాదులు సృష్టిలోన
నుపగ్రహ పరిభ్రమణ లుపోపగ్రహగతులను
భూమి చంద్ర గోళా లవి పొందు కలియ సూర్యునితో
ననేక సౌరమండలాలు ఆదిత్యుని నాధిపత్య
మలరారఁగ నాత్మగతుల నసాధారణంపు రీతి
సంచరించు విశ్వమ్మున సకలమ్మును దీప్త మౌచు
స్రష్ట విష్ణు రుద్రరూప సచ్చిదానందరతుల
సకలమ్మున్ దానె యౌచు సర్వాంతర్యామిగాఁగ
వైష్ణవీయ మైన మహాప్రాభవంపు శక్తు లెల్ల
మాయగాఁగ లీలగాఁగ మహిత విశ్వరూప మౌను ॥ 4285

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## †సూక్తమ్—129

ఋషిః—సనక-సనన్దన-సనాతనాదయః

దేవతా—హిరణ్యమ్

ఛందః—అనుష్టుప్; 5,8-9-త్రిష్టుప్; 7-అతిశక్వరీ, 11-జగతీ

†(1) ఆయుష్యం వర్చస్యం రాయస్పోషమౌద్భిదమ్ ।
ఇదం హిరణ్యం వర్చస్వజ్జైత్రాయా విశతాదిమామ్ ॥ 1467

†(2) ఉచ్చైర్వాజి పృతనాషాట్ సభాసాహం ధనంజయమ్ ।
సర్వాః సమగ్రా ఋద్ధయో హిరణ్యేఽస్మిన్ సమాహితాః ॥ 1468

†(3) శునమహం హిరణ్యస్య[1] పితుర్నామేవ[2] జగ్రభ ।
తేన మాం సూర్యత్వచమకరం పూరుష[3] ప్రియమ్ ॥ 1469

†(4) సమ్రాజం చ విరాజం చాభిష్టిర్యా చ మే ధ్రువా ।
లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మామిన్ద్ర సం సృజ ॥ 1470

†(5) అగ్నేః ప్రజాతం పరి యద్ధిరణ్యమమృతం యజ్ఞే అధి మర్త్యేషు ।
య ఏనద్వేద స [4]ఇదేనమర్హతి జరామృత్యుర్భవతి యో బిభర్తి ॥ 1471

---

†ఋగ్వేదము దశమ మండలములో 128వ సూక్తము తరువాత 11 ఋక్కులతో 129వ సూక్తమును 48 ఋక్కులతో 130వ సూక్తమును గొన్ని వ్రాతప్రతులలో నధికముగాఁ గలవు. ఇవి రెండును "ఖిల" సూక్తములు. వీనిని "ఖిల" సూక్తములుగాఁ గొందఱు భావింపఁ బరిశిష్టములుగాఁ గొందరును, ప్రక్షిప్తము లని మరికొందఱును నధికపాఠము లని వేరొక కొందరును భావించిరి. ("ఖిల"శబ్ద నిర్వచన వివరణకై 146వ పుటలోని తెలుఁగు ఫుట్నోటు చూడ నగును.)

1. హిరణ్య పితుర్నామేవ, 2. పితుర్నామేవ, 3. పురుషప్రియమ్। 4. (i) ఇదేయమర్హతి, (ii) ఇవేదమర్హతి, (iii) ఇదేనదర్హతి. (వ్రా.ప్ర.)

†(6) యద్వేద రాజా వరుణో యదు దేవీ సరస్వతీ ।
ఇన్ద్రో యద్వృత్రహా వేద తన్మే వర్చస ఆయుషే ॥ 1472

†(7) న తద్రక్షాంసి న పిశాచాశ్చరన్తి దేవానామోజః ప్రథమజం హ్యేతత్ ।
యో బిభర్తి దాక్షాయణా[1] హిరణ్యం స దేవేషు కృణుతే దీర్ఘమాయుః
స మనుష్యేషు కృణుతే దీర్ఘమాయుః ॥ 1473

†(8) యదాబధ్నన్ దాక్షాయణా హిరణ్యం శతానీకాయ సుమనస్యమానా[2] ।
తన్మ ఆ బధ్నామి శతశారదాయాయుష్మాన్ జరదష్టిర్యథా[3]సత్ ॥ 1474

†(9) ఘృతాదుల్లుప్తం[4] మధుమత్సువర్ణం ధనంజయం ధరుణం ధారయిష్ణు ।
ఋణక్ సపత్నాదధరాంశ్చ కృణ్వదాऽఽరోహ మాం మహతే సౌభగాయ ॥ 1475

†(10) ప్రియం మా కురు దేవేషు ప్రియం రాజసు మా కురు ।
ప్రియం విశ్యేషు [5]గోప్త్రేషు మయి దేహి రుచా రుచమ్ ॥ 1476

†(11) అగ్నిర్యేన విరాజతి సూర్యో యేన విరాజతి ।
విరాజ్యేన[6] విరాజతి తేనాస్మాన్ బ్రహ్మణస్పతే విరాజ సమిధం కురు ॥ 1477

---

†"ఖిల"మంత్రములు. (చూ-813వ పుటలోని తెలుఁగు పుట్‌నోటు)
1. దాక్షాయణం హిరణ్యం, 2. సుమనస్యమానః, తన్మఆ, తథాఆ, 3. యథాసన్, సన్, సత్‌వా, యథాసమ్ (వా.య.),4.ధృతాదులుప్తం, ధృతాదుల్లుప్తం, సపత్నాసధ, (అధి),5.గోతేష్రు, 6. విరాజ్యేన. (తై-సం-తై.బా-౨.), (వా.వ.)

## *సూక్తము—129

ఋషి—సనక-సనందన-సనాతనాదులు
దేవత—-హిరణ్యము

***

(1)†అష్టపదకందము॥
ఆయుష్కారక మౌచును
రాయిగ వర్చస్వతముగ రాజిల్లుచు జై
త్రాయతముగఁ బోషోద్బృద
మై యీ సుహిరణ్యము నను మహిత సుకృతిగాఁ
జెయుత! విశేష శత కృతి
దాయక మై ప్రతిఫలమ్ము తనరన్ బ్రకృతిన్
ద్రాయక మై బహురూపులఁ
బాయక ప్రభ లొప్ప నిలుచు బంగారముగాన్ ॥ 4286

†(2) ఉచ్చగతుల వియచ్చలన రతులమెయిని
ధనంజయ రూపముగాఁ దనరారుచు సృష్టిలోన
సర్వసమగ్రమైన బుద్ధ సమాహితముగ వర్తిలి
పృతనశక్తిగా పర్గిలి హిరణ్యరూపమౌ ధనము
ఉపర్యుపరి వాజిగతుల నుజ్జ్వలముగ వెలుఁగొందఁగ
సంఘసమిష్టి సంపదగా సత్సువర్ణ మలరారును ॥ 4287

(3)†ఆ॥వె॥ ప్రకృతిరూపమైన ప్రాభవ సుహిరణ్య
భాగ్యము మహిత పితృభాగ్యము గతిఁ
బురుషశక్తి ప్రియముగ రమణ మౌచును
నన్ను సూర్య శక్తి మిన్నుఁ జేర్చు ॥ 4288

†(4) సద్రాజ్యముగా సర్వము చదలంటుచుఁ దనరారఁగ
విశ్వసృష్టి ధ్రువ మౌచు విరాజమాన మౌచు వరలి
రాష్ట్రలక్ష్మిగాఁగఁ బరఁగి రాజిల్లుచు వైష్ణవీయ
ముఖశక్తిగ హిరణ్యము మూర్తిగాఁగ వెల్గొందును ॥ 4289

†(5) అగ్నిలోన జాత మౌను నగ్నిదీప్తి వెలుఁగొందుచు
సప్తృతశక్తి నలరారుచు సధిమర్త్యమ్ము లందు
యజ్ఞమ్ముల నిన శక్తుల నతివేలమ్మౌ విజ్ఞత
జరామృత్యు భరితముగా సర్వసృష్టి నెరపుచుండి
వశరూపపు దివ్యశక్తి ప్రకాశమాన మౌచుఁ దనరు
హిరణ్యమ్ము బుద్ధిద మై యినశక్తుల వరలుచుండు ॥ 4290

---

*"'ఖిల" సూక్తము, (చూ. 813వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు.)
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము. ***సామాన్యార్థము.

†(6) విజ్ఞానముగా వర్ధిలి వెలుఁగును రవి శశి దీప్తుల
జల శక్తిగ శక్తిగాఁగ సరస్వతీ రూపిణిగా
వృత్రఘాతమై తనరుచు విశ్వరూప వైష్ణవీయ
హిరణ్యము వర్చస్సు నెసఁగనొసఁగి ఆయుష్షు
నా కొనఁగూర్చుత నిత్యము నవదీప్తులు విస్తరిల్ల
వరుణ శక్తి విజ్ఞానము వర్ధిల్లను సర్వ గతుల ॥ 4291

†(7) నిశాచర రాక్షసతతి పిశాచాదులున్ నిలువవు
దేవాఽఽఽళుల ఓజోగుణ దివ్యశక్తిగాఁ దొల్తను
దాక్షాయణత హిరణ్యము తనరారుచుఁ బూర్ణగతుల
దేవతలకు మానవులకు దీర్ఘాయువు సంతరించు ॥ 4292

†(8) దాక్షాయణ హిరణ్యమ్ము అక్షయముగ బద్ధ మౌచు
శతానీకునికై సకల సుమనస్యమాన రతుల
జరదష్టి వ్యథానద్గతిగ సర్వమ్మును బద్ధముగా
శత శరదాయుష్మంతులుగా సతము బంధింతుము ॥ 4293

(9)†క॥ ఘృతమున నుద్లువ మ్మగు
నతిమధురముగాఁగఁ దనరు నపరంజి సువ
ర్ణ తరణి సపత్న మధుర మ
హత సుభగత్వమునకు ఋణ మాదృతిఁ దనరున్ ॥ 4294

†(10) మాకుఁ బ్రియము చేయుమా! హిరణ్యమా!
దేవతలకు రాజులకును దృప్తిఁ బ్రియము చేయుమా!
విశ్వ లోక గోళాలను బ్రియ మొనర్చు గోత్రమ్ముల
రుచులకు రుచియైన దీప్తి పచరించుము! నాయందునె ॥ 4295

†(11) ఏ హిరణ్యాన నగ్ని యెన లేక విరాజిలును
ఏ హిరణ్యాన సూర్యుఁ డెంతేని విరాజిలును
ఏ హిరణ్యాన విరాజ్య మీశతమై విరాజిలును
ఆ హిరణ్యమ్ము సమిధగ నమరింపుము! మా హరికై ॥ 4296

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ధమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

## సూక్తము—129

ఋషి—సనక-సనందన-సనాతనాదులు
దేవత—హిరణ్యము

### అర్థాంతరము—1

†(1) ఆయుష్యవంతమై అమల వర్చస్సు మై
పుష్టి శక్తుల నగ్ని ముఖ దీప్తు లొప్పార
నుత్పన్నమై సహజయోగ జన్మమ్ములో
వసు సంపదల రూపు వర్ధిల్ల విశ్వాన
నపురూపమౌ ప్రిభల నందచందాలతో
వజ్రిశక్తులు మీఱ భద్రిమౌ విజయాల
నకృత్రిమమై వరలు నా హిరణ్యము సృష్టి
దైవీయ వీర్యముగఁ దనరారుఁ బ్రాకృత
నైజరూప స్వభావ తేజాల వెలుఁగొంపఁ
జిత్రిమౌ రతులతో జైత్రియాత్రిను జేయు ॥ 4297

†(2) అత్యుచ్చ గతులమై నాకసమ్మునఁ దిరుగు
పంచభూతాత్మగ పృతన సంచయా లన్నింటి
నిందాగ్ని శక్తుల నెనలేని రీతిలో
సర్వసమగ్రిమౌ సమాహిత శక్తులన్
అత్యంత సమృద్ధి నలరారు సహజమౌ
నమల హిరణ్యమ్మ ఆలరంగ సృష్టిలో
రోదోఽంతరాళాన రుద్రి వీర్యముగాఁగ
హేమంతరూపమై యెనఁగి వెలుఁగుల మీఱఁ
బగటి శక్తులుగాఁగ నగణితభాగ్యమై
ప్రికృతిలో రూపొంది సుకృతశక్తుల వరలు ॥ 4298

†(3) బ్రిహ్మ మానము వోలె వరలు విశ్వములో
బ్రాహ్మ్యశక్తులతోడఁ బ్రాకృతముగాఁ దనరి
ఆత్మపుత్రిని పగిది నాంతరంగిక శక్తి
సౌరశక్తుల వెలిఁగి జగములన్ వ్యాపించి
పూరుషప్రియముగ నపార శక్తులు తనర
విష్ణు బ్రిహ్మ రుద్రి వీర్య రూపముగాఁగఁ
బగటి దీప్తులమైని పసిమి వెన్నెలలమై
పసిడి పరఁగును నిత్యభాగ్యమై ప్రికృతిలో ॥ 4299

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము. (చూ.813వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు 146వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు)

†(4) విశ్వ గోళా లెల్ల విలసిలన్ రాజ్యాలుగ
విభ్రమ భ్రమగతుల నభ్రమ్ములై తిరుగ
దైవీయమై సత్యతత్త్వమ్ము ప్రకృతిగా
ధ్రువ రూపమై వరలు నవదీప్తు లలరఁగా
సృష్టియే రాష్ట్రమై వ్యష్టి సమిష్టులుగ
విశ్వ ముఖముగాఁగ విమలదీప్తులు వరలఁ
ప్రాకృత హైరణ్య భాగ్య రూపముగాఁగ
సౌర చాంద్రగమైన శక్తి హేమద మగుచు
రాష్ట్ర లక్ష్మిగ సువర్ణ రమ్య సంపద తనర
వైష్ణవీయపు శక్తి వరలంగ సృష్టించు ॥ 430

†(5) జరామృత్యుసహితమైన సర్వ విశ్వసృష్టి రూపు
సౌరచాంద్ర శక్తులతో సకల విజ్ఞానగతుల
నావిర్భావము నొందు నభ్యుదయమ్ము నొంది
ప్రకృతశక్తి పూర్ణతత్త్వ రాశిత మై తనరారుచు
నన్తంగత ప్రాకృత బలమై వార్ధకముగఁ జరఁగు
ననల శక్తి సందీప్తుల నావిర్భావమ్ము నొంది
హిరణ్యమ్మై అమృతమై యిష్టిసృష్టి మర్త్యశక్తి
నతీతముగ నధిమర్త్యుల నావరించు సకృతగతుల ॥ 430

†(6) వరుణశక్తి రూపముగా వరలఁ జాంద్రదీప్తశక్తి
వరుణజలము సత్యగతులఁ బ్రకృతిరూప నిత్యరతుల
సరస్వతిగ వర్తిల్లును సర్వభూతతతులలోన
"నభి"శక్తుల రూపమ్మున నఖిల సృష్టి వ్యాపించుచు
"నాభి"శక్తి హరించుచు అభ్రమ్ముల రూపుమాపి
వృత్రాసుర రాక్షసు విష్ణుశక్తి హత మార్చుచుఁ
బ్రకృతిపురుషశక్తితతులఁ బ్రాణరూపముల నిల్పుచు
విజ్ఞానపు దీప్తి వరల వెలుఁగంగా వర్చస్సులు
ఆయుర్దాయము నొసఁగు నఖిల సృష్టి రూపమునకు
హిరణ్యమ్మ శక్తిదమై యొసఁగు నా పురుషశక్తి ॥ 430

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(7) ఆ హిరణ్యదీప్తశక్తి నా రక్కసు లాక్రమింప
వా హిరణ్య దీప్త శక్తి నా పిశాచా లావహిలవు
దేవతాళి సర్వస్వపు దివ్యశక్తిగాఁ బరఁగుచుఁ
బ్రథమశక్తిగాఁగఁ దనరి రాణ నోజోరూప మౌను
దాక్షాయణ రూప మౌచుఁ దనరఁ బ్రకృతిసహజమైన
హిరణ్యశక్తి ప్రకృతిలోన నెసఁగి అంతర్గతుల మీఱి
దైవీయమ్మౌ శక్తులఁ దనరించును దీర్ఘాయువు
మానవాళి దీర్ఘాయువు మహితముగా వృద్ధి చేయు ॥ 4303

†(8) దాక్షాయణ శక్తి మీఱఁ దనరారెడి హిరణ్యమ్ము
ప్రకృతిలోన నంతర్గతి బద్ధ మౌచు సత్కృతముగా
దేవతాళి కాధిపత్య దివ్యశక్తి నొంది వెలిఁగి
సత్త్వదార్ఢ్యయుక్తమైన శతామహితసుమనస్సు
జరారహితమైన దివ్యశక్తి రూప సర్వస్వము
శతశరత్తుల ప్రకృతి సర్వస్వము విలసితమై
అకృతమైనపంచభూత ప్రకృతిసహజ హిరణ్యమ్ము
బద్ధ మౌను విశ్వసృష్టి వరల సహజ సంపదలుగ
నాకాశము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
నవనీతలముసు జేయును నాయుష్మంతముగాఁగను ॥ 4304

†(9) జలశక్తుల విసర్జించు సలిలరతులను బీల్చుచు
మధురగుణము కలిగివెలిఁగి మలినరహితమై వరలుచు
సూర్యతేజవిహిత మౌచు సర్వమగతి సహితి మౌచు
ధనంజయ రూపశక్తి ధరణధారణంపు రతులఁ
గాంతిశక్తి ప్రాణశక్తి క్రిల నారోహణగతి
సుపర్యుపరి గోళాలను నొనర నధోగోళాలను
ధరణధారణగతులమై వరల నాధిపత్యశక్తు
లాధారము నాధేయము నౌచు హిరణ్యమ్ము తనరు
సృష్టిలోన మహిత మౌచుఁ జెలఁగు సౌభాగ్యనిగా
మా సువర్ణరూపాళిని మహితారోహ మ్మొనరుచు ॥ 4305

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
† "ఖిల" మంత్రానువాదము.

†(10) హితమౌ చంద్రుని కూర్చుమ! యెల్ల దేవతతులలోన
మాకుఁ బ్రేమ సమకూర్చుము! మబ్బులతో సకలమ్మున
సూర్యులతో మాకుఁ జంద్రుఁ జొప్పడంగఁజేయు మమరి
రవిదీప్తుల మాకుఁ బ్రియము రాజిల్లఁగఁజేయుమా!
విశ్వమ్ములలో మా కతిప్రియమారఁగఁ జేయుమా!
తరతరాలుగఁ బ్రియము మాకుఁ దనరారఁగఁజేయుమా!
హితమును సహితమును నిత్యము నెసఁగ మెసఁగునట్లుచేయు!
కాంతిసహిత మౌనట్లుగఁ గాంతిరహిత మౌనట్లుగ
సంపదాళి నాయందె సమకూర్చుము! ప్రియముగాఁగ
నింద్రులలోఁ బ్రేమమూర్తి నెసఁగంగా నొనఁగూర్చుము! ॥ 4306

†(11) ఏ దివ్యశక్తి మై నెసఁగ రాజిలు నగ్ని!
యే దివ్యశక్తి మై నెల్ల పవిత్రిత పరలు!
నే మహాశక్తి మై నెసఁగునో! సూర్యుండు
ఏ విశేష రాజ్యమున నెల్ల సృష్టి ప్రకాశించు
ఆ శక్తియె బ్రహ్మల అధినాథుని సమిధ యౌచు
వైష్ణవీయశక్తి నాకుఁ బరఁగంగాఁ జేయుఁగాక! ॥ 4307

## సూక్తము—129

ఋషి—సనక-సనందన-సనాతనాదులు
దేవత—హిరణ్యము

### అర్థాంతరము—2

†(1) విశ్వసృష్టి సర్వస్వము వెలుఁగ నిత్యసత్వశక్తి
నాయుష్కారక మౌచును ప్రాణశక్తి నలరఁజేసి
ప్రకృతిసంపదాళు లొప్పఁ బ్రభాభాసితముగఁజేసి
పోషితమౌ పదార్థాలఁ బూర్ణకృతిప్రమంపుగతుల
ససహజముగా హిరణ్య మావిర్భావమ్ము చెంది
విశ్వసృష్టి సర్వమ్మున విలసిల్లుచుఁ గ్రుత్రిమముగ
దివ్యమైన దీప్తులతోఁ దేజరిలుచు నిత్యమ్మును
నిందప్రథముగా విశ్వము నెసఁగ సంపదాళులతోఁ
బ్రకృతి దిగ్విజయముగాఁ బ్రకాశిత మ్మొచు సృష్టి
విజయశక్తి విస్తరిలును విశ్వమ్మున సువర్ణమ్ము ॥ 4308

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(2) ఉచ్చమైన శక్తులతో నుజ్జ్వలమౌ దీప్తులతో
యౌవనంపు సృష్టిశక్తి అతిలోకముగాఁ దనరఁగ
షడ్ఋతువుల రూపమ్ముల సహజసంపదలు పరఁగఁగఁ
బ్రకృతి సేనగా సృష్టిని వరలు సభాసహితముగా
ధనంజయపు శక్తితత్త్వ మనుపమానగతుల మీఱ
నగ్ని రూపమై జగతిని నలరారును నఖిలమ్మున
ననలతేజ జల సంపద తనరారఁగ మొయిళు లవుచు
నైంద్రశక్తి వరలంగా నమల సంపదాళులతో
ఆమూలాగ్రముగాఁగను నఖిలసృష్టి సర్వస్వము
కృతకమైన హిరణ్యాస సతము సమృద్ధమై వరలుచు
నమాహిత మ్మవుచుఁ బ్రకృతి సంపూర్ణసమగ్రగతుల
దివ్యమైన జ్యోతిగాఁగఁ దేజరిలుచుఁ గాలగతుల
హేమంతముగా సృష్టిని నెసఁగు సంపదలు మీఱఁగ
మృగశిర మర్మమ్ములతో మీరు పక్షిగాఁ గాలము
బుద్ధమౌచు వెలుఁగు హిరణ్యకృత్రిమంపు శక్తి
సృష్టిలోన నంతర్గతి వ్యష్టినమిష్టిరతుల వరల ॥ 4309

†(3) అసహజమై కృత్రిమమౌ అపరంజి హిరణ్యంపు
ఇన్యరూపమైన దివ్యజనకశక్తి సృష్టిలోన
మానితగతి విశ్వరూపమహిత మౌచు వర్ధిల్లఁగ
సృష్టియే కొల ఖద్దగాఁగ సృష్టియే ఒకహద్దుగాఁగ
జగ మెల్లను వర్తిల్లఁగ జాజ్వల్యమానరతుల
నతితీక్ష్ణమ్మైన దీప్తి నరుణాఽరుణ సూర్యకాంతి
తత్త్వమెల్ల సృష్టిలోనఁ దనరారఁగ బహురూపులఁ
గృత్రిమమై ప్రకృతి కెల్లఁ గీర్తనీయ సంపదలుగ
నలరారెడి హిరణ్యమ్ము అఖిలసృష్టిరూపు నెల్లఁ
పూరుషునకుఁ బ్రియముగా నపారమైన సిరిగాఁగను
నిన శక్తులమై సృష్టిని నను నమరఁగఁజేయుఁగాక!
విశ్వసృష్టి సామ్రాజ్యము విలసిల్లుత! ధ్రువముగాఁగ ॥ 4310

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†"ఖిల"మంత్రానువాదము.

†(4) సమస్తమైన విశ్వసృష్టి సదమల సామ్రాజ్యముగా
రాజిల్లఁగ మహిత మౌచు బ్రహ్మవిష్ణుకృత మ్మౌచు
విశ్వరూపమైన ప్రకృతి నశ్విశక్తు లొప్పారఁగ
నఖిలసృష్టి సంపదాళి నావిర్భావమ్ము నొంది
అసహజగతి ద్వైవీయపు టాత్మ సృష్టి కాఁగఁ
గృత్రిమగతి హిరణ్యమ్మై ధ్రువశక్తిగఁ దనరారుచు
విశ్వసృష్టి రాష్ట్రమునకు విమలముఖముగా వరలుచు
వైష్ణవీయమైన శక్తి వరలఁ జాంద్రరూపముల
సృష్టిసంవర్ధకమై చెలఁగు దివ్యకాంతులతోఁ
దౌలిశక్తిగ ముఖముగాఁగ నెలవౌచును నంతర్గతి
విశ్వబాధకమ్మౌ వ్యాప్తి విషమయమౌ నగ్నిరూపు
తాల్చు "నభి"శక్తుల విధ్వస్తము కావించుచు
"నాభి" శక్తి వర్ధిలంగ నానాజగముల లక్ష్మిగ
నలరఁజేయు జలసంపదజ్వలిత మౌను హిరణ్యముగ ॥ 4311

†(5) అగ్నిరూప బహుశక్తుల నపురూపముగాఁ దనరుచు
సంజనితమ్మౌ కృత్రిమ సంపదగా హిరణ్యమ్ము
విశ్వసృష్టి యజ్ఞమందు వెలుఁగొందుచు దీప్తగతుల
నధిగమించి మానవాళి అతిశక్తుల నఖిలమ్ముల
నలరించును నమృతగతుల నతిలోకముగా నిత్యము
దైవీయముగాఁ దనరెడి ఋతశక్తులు పరఁగంగా
విజ్ఞానప్రతిరూపపు విశ్వమ్మున నినశక్తుల
దీప్తిగతులఁ బ్రకృతియెల్ల వ్యాప్తమౌచు జరామృత్యు
రూపము లవి వెలయంగా సృష్టిలోనఁ బూర్ణగతుల
సృష్టికృత్రిమంపుగతులఁ గృత్రిమంపు స్థితిరతులను
గృత్రిమంపు లయగతులను ఋతువిశ్వము వరలంగా
దైవశక్తివశ మౌచును దాదాత్మ్యత తనరారెడి
స్థిరశక్తుల హిరణ్యంపు జీవతేజ దివ్యరతులు
అపురూపముగాఁ జెలఁగును నపారమైన సంపదగా ॥ 4312

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†"ఖిల"మంత్రానువాదము.

†(6) చాంద్రిదీప్త కౌముదీజ శక్తు లెల్ల వ్యాపింపఁగ
జలరూపము లెల్లఁ బొంగు వలితముగా వరుణశక్తి
ఆకసమున ననిలమ్మున ననలమ్మునఁ బృథ్వీతతుల
నంతర్గతి నలరారుచు నా సరస్వతిగాఁగను
బ్రికృతియెల్ల జలశక్తులు ప్రికర్షముగఁ గృతము లౌచు
నఖిలసృష్టి విస్తరిల్లు నద్భుతావహము కాఁగ
విశ్వసృష్టి జల శక్తుల విధ్వస్తము కావింపఁగ
"నాభి" శక్తు లన్నింటి వినాశనమ్ము నొనరింపఁగ
విషమయమౌ నగ్నిరూప వృత్రాసుర మహాశక్తి
సంహరించి సృష్టిశక్తి సంపదాళి జ్ఞానముగా
విస్తరిలఁగ వికసింపఁగ విశ్వప్రికృతి కెల్ల యెడల
వర్చస్సును సమకూర్చును బలుతేజము లలరంగా
బహిరంతర్గతులలోనఁ బరఁగంగా శక్తు లెల్ల
నాయుష్కారక మౌచును నలరించును విశ్వప్రికృతి ॥ 4313

†(7) పెంపొందగఁజేయకుండఁ బిశాచాల రాక్షసతతి
దివ్య దేవతాళి కెల్లఁ దేజరిలఁగ నోజోగుణ
మపురూపపు దీప్తులతో నావిర్భవించి తొలుత
విశ్వసృష్టి దక్షత్వము వెలయంగా సంపదలుగఁ
గృతముగాఁగఁ బ్రికృతిలోన హిరణ్యమ్ము తనరంగా
దేవాఽఽళిని మానవాళి దీర్ఘాయుర్దాయమ్ముఁ
దేజరిల్లఁజేయుచుండు దేదీప్యమానగతుల
నా హిరణ్యశక్తితతి ననిల మౌను ననల మౌను
నాకసమ్ముగాఁగఁ దనరు నగును సలిల మౌను బృథ్వీ
కృతకగతుల సృష్టిలోనఁ గెరలి నిత్యసత్త్వదీప్తి
ఆదిశేషరూప మైన మోద సత్య సర్వ మౌచు
నఖిల పదార్థముల నలరు నమలమైన సత్యగతులఁ
గాలరూపమై వరలి గగనశక్తి గమనగతుల
రథరూపపు శక్తిగాఁగఁ గ్రాలునులే! హిరణ్యమ్ము ॥ 4314

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(8) దక్షత్వపు మహాశక్తి తనరారఁగ బద్ధ మౌచు
సృష్టివిశ్వమందు మహిత హిరణ్యముగఁ దనరారఁగఁ
సుమనస్యమానస శక్తి శోభిలు శతానీకునికిఁ
బరిణామపు శక్తులతోఁ బ్రభా భాసితమ్ముగాఁగ
బద్ధమైన రీతిగానె ప్రకృతిసృష్టి సర్వమ్మున
హిరణ్యమ్ము బద్ధ మౌను నినుమడింప దీప్తతతులు
శతరూపమ్ములుగ శరత్తతి సంపూర్ణాయువుగాఁగను
సద్రూపమ్మౌ ప్రకృతిని జరదృష్టిగఁ దనరారఁగఁ
బ్రకృతిసృష్టి అకృత్రిమముగ భాసిల్లును గృత్రిమమై
హేమశక్తి మహావీర్యధామరూప శక్తిగాఁగ ॥ 4315

†(9) ఘృతశక్తిగ బుద్ధిశక్తి కెరల నిత్య సచ్ఛక్తుల
మధుమంతమ్మై వరలెడి మహితమైన సువర్ణమ్ము
వైష్ణవీయమై తనరెడి ప్రభాదీప్త దివ్యాఽనల
తేజమ్ముల హిరణ్యమ్ము భ్రాజమాన మౌచు సృష్టి
ధరణధారణములఁ దనరి భరణభారణముల వరలి
ఆకర్షణశక్తి తతుల నద్భుతమౌ గతి వరలఁగ
శుభగ పురుషశక్తి విభవప్రాభవాలు వర్ధిల్లఁగ
సృష్టికే ఋణముకాఁగఁ బృథ్వులన్ దనరారుచు
నా రూపముచేసి నిలుపు నన్నారోహము చేయుచుఁ
గర్మద మౌచును నిరతము గ్రాలును హిరణ్యంపుశక్తి ॥ 4316

†(10) వశ్యము చేయుము! చంద్రుని వశ్యము చేయుము! హితకృతి
సృష్టిలోని చలనశక్తి చెలఁగ వశ్య మొనరింపుము!
ప్రియము చేయు! దేవతాళి ప్రియము చేయు! దైవశక్తి
ఆధిపత్యశక్తు లలరు నధిపతికే ప్రియము కూర్చు
మాకర్షణ శక్తు లలరు నధినాథుని హితము చేయు
సకల విశ్వలోకాలను సర్వరూప గోళాలను
హిత మొనర్చుము! ప్రియమారఁగ హిరణ్యమునఁ బ్రకృతిశక్తి
రుచితతికే రుచికాఁగను సురుచిరమౌ దీప్తశక్తి
గుప్తగతుల సుప్తరతుల గోపమ్ములఁ దనరారుచు
నా పౌరుషశక్తిలోనె నవ్యదీప్తి వరలుచుండు ॥ 4317

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

‡(11) ఏ శక్తిని నగ్నిశక్తి యొసఁగలేక విరాజిలును
నే శక్తిని బరిసద్దత నెసఁగు విశ్వసృష్టిలోన
ఏ శక్తిని నింద్రశక్తి యినుమడించుచుండు సృష్టి
యే శక్తిని సూర్యచంద్రులీశత్వమై వెలుఁగుచుండ్రొ!
ఆ శక్తిని విరాజ్యమ్ము అలరు విరాజితముగాఁగ
నా శక్తి విశేషరాజ్య మమరఁజేయు విరాజితముగ
ఆ శక్తియె విగతమైన విషరాజ్య విరాజిత మగు
నా శక్తియె బ్రహ్మణస్పతి కపురూపపు శక్తి కాఁగ
నలరి సృష్టియజ్ఞమందు వెలుఁగఁజేసె సమిధగాఁగ
దైవశక్తి కృతక మౌచుఁ బసరు హిరణ్యమ్ము సృష్టి ॥ 4318

## *సూక్తమ్—130

ఋషిః—విహవ్య అంగిరసః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—అనుష్టుప్

†(1) యాం కల్పయన్తి నోఽరయః క్రూరాం కృత్యాం వధూమివ ।
తాం బ్రహ్మణాప నిర్ణుద్మః ప్రత్యక్కర్తారమృచ్ఛతు ॥ 1478

†(2) శీర్షణ్వతీం కర్ణవతీం విశ్వరూపాం భయంకరీమ్ ।
యః ప్రాహిణోదిహాద్య త్వాం వి తం త్వం యోజయాసుభిః ॥ 1479

†(3) యేన దిష్టేహ వహసి ప్రతికూలమహాయిని ।
తమేవేతో నివర్తస్వ మాస్మాన్ మృచ్ఛో అనాగసః ॥ 1480

†(4) అభివర్తస్వ కర్తారం నిరస్తాస్మాభిరోజసా ।
ఆయురస్య నికృన్తస్వ ప్రజాం చ పురుషాదిని । 1481

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ఖిల"సూక్తము. (చూ. 818వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు. 146వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు)
†"ఖిల"మంత్రములు.

†(5) యస్త్వా కృత్యే చకారేహ తం త్వం గచ్ఛ పునర్నవే ।
అరాతీః కృత్యే నాశయ సర్వాశ్చ యాతుధాన్యః ॥ 1482

†(6) క్షిప్రం కృత్యే నివర్తస్వ కర్తురేవ గృహాన్ ప్రతి ।
పశూంశ్చైవాస్య నాశయ వీరాంశ్చాస్య ని బర్హయ ॥ 1483

†(7) యస్త్వా కృత్యే ప్రజిఘాయ విద్వాగ్ం అవిదుషో గృహాన్ ।
తస్యైవేతః పరేత్యాశు తనుం కృధి పరుష్పరుః ॥ 1484

†(8) ప్రతీచీం త్వాపసేధతు బ్రహ్మ రోచిష్ణ్వమిత్రహా ।
అగ్నిశ్చ కృత్యే రక్షోహా రిప్రహా చాజ ఏకపాత్ ॥ 1485

†(9) యథా త్వాఙ్గిరసః పూర్వే భృగవశ్చాప సేధిరే ।
అత్రయశ్చ వసిష్ఠాశ్చ తథైవ త్వాప సేధిమ ॥ 1486

†(10) యస్తే పరూంషి సన్దధౌ రథస్యేవ విభుర్ధియా ।
తం గచ్ఛ తత్ర తేఽయనమజ్ఞాతస్తే అయం జనః ॥ 1487

---

†"ఖిల"మంత్రములు. (చూ. 813వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు, 146వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు)

†(11) యో నః కశ్చిదరణస్థో వా కశ్చిద్వాన్యోఽభి హింసతి ।
తస్య త్వం ద్రోగ్ధివేద్ధోఽగ్నిస్తనూమృచ్ఛస్వ హేశితా ॥ 1488

†(12) భవాశర్వా దేవహేళిమస్యత పావకృత్వనే ।
హరస్వతీ తం చ కృత్యే మోచ్చిషస్తస్య కించన ॥ 1489

†(13) యో నః కశ్చిదుగ్రహరాతీర్మనసా ప్రతిభూషతి ।
దూరస్థో వా నికస్థో వా తస్య హృద్యమసృక్ పిబ ॥ 1490

†(14) యేనాసి కృత్యే ప్రహితా దూడ్యేనాస్మజ్జిఘాంసయా ।
తస్య వ్యానచ్చావ్యానచ్చ హినస్తు హరసాశనిః ॥ 1491

†(15) యే నః శివాసః పన్థానః పరాయన్తి పరావతమ్ ।
తైర్ద్వివి రాత్ర్యః కృత్యా నో గమయస్వానుకృత్తయే ॥ 1492

†(16) యది వైషి ద్వివదస్మాన్ యది వైషి చతుష్పదీ ।
నిరస్తైతో వ్రజాస్మాభిః కర్తురష్టావదీ గృహాన్ ॥ 1493

†"ఖిల"మంత్రములు. (చూ. 813వ పుటలోని తెలుగు పుట్నోటు, 14రివ పుటలోని తెలుగు పుట్నోటు)

†(17) యో నః శపాదశపతో యశ్చ నః శపతః శపాత్ ।
వృక్షమివ విద్యుదాహ తమామూలాదను శోషయ ॥ 1494

†(18) యం ద్విష్మో యశ్చ నో ద్వేష్ట్యఘాయుర్యశ్చ నః శపాత్ ।
ఘనే పిష్టమివ క్షామం తం ప్రత్యస్య స్వమృత్యవే ॥ 1495

†(19) యశ్చ సాపత్నః శపథో యశ్చ యామీ శపాతి నః ।
బ్రహ్మా చ యత్ క్రుద్ధః శపాత్ సర్వం తత్ కృధ్యధస్పదమ్ ॥ 1496

†(20) సబన్ధుశ్చాప్యబన్ధుశ్చ యో అస్మాగ్ం అభి దాసతి ।
తస్య త్వం భిన్ధ్యధిష్ఠాయ పదా విస్ఫూర్య తచ్ఛిరః ॥ 1497

†(21) అభి ప్రేహి సహస్రాక్షం యుక్త్వా తు శపథం రథే ।
శత్రూనన్విచ్ఛతీ కృత్యే వృకీవావిమతో గృహాన్ ॥ 1498

†(22) పరి ణో వృఙ్ధి శపథాన్ దహన్నగ్నిరివ హ్రదమ్ ।
శత్రూనేవాభితో జహి దివ్యా వృక్షమివాశనిః ॥ 1499

---

†"ఖిల"మంత్రములు. (చూ. 813వ పుటలోని తెలుగు ఫుట్‌నోటు, 146వ పుటలోని తెలుగు ఫుట్‌నోటు)

†(23) శత్రూన్ మే ప్రోథ శపథాత్ కృత్యాశ్చ సుహృదోఽసుహృత్ ।
జిహ్మాః శ్లక్ష్ణాశ్చ దుర్హృదః సమిద్ధం జాతవేదసమ్ ॥ 1500

†(24) అసపత్నం పురస్తాన్నః శివం దక్షిణతః కృధి ।
అభయం సతతం పశ్చాత్ భద్రముత్తరతో గృహే ॥ 1501

†(25) పరేహి కృత్యే మా తిష్ఠ విద్ధస్యేవ పదం నయ ।
మృగస్య హి మృగాశిప్రో న త్వా నికర్తుమర్హతి ॥ 1502

†(26) అఘ్న్యస్యేవ ఘోరరూపే విషరూపేఽవినాశిని ।
జృమ్భితా ప్రతిగృహ్ణీష్వ స్వయమాదాయ చాదృతమ్ ॥ 1503

†(27) త్వమిన్ద్రో యమో వరుణస్త్వమాపోఽగ్నిరథానిలః ।
త్వం బ్రహ్మా చైవ రుద్రశ్చ త్వష్టా చైవ ప్రజాపతిః ॥ 1504

†(28) ఆవర్తధ్వం నివర్తధ్వమృతవః పరివత్సరాః ।
అహోరాత్రాశ్చాబ్దాశ్చ త్వం దిశః ప్రదిశశ్చ మే ॥ 1505

---

†"ఖిల"మంత్రములు. (చూ. 81వ పుటలోని తెలుగు పుట్‌నోటు.146వ పుటలోని [illegible] పుట్‌నోటు)

†(29) త్వం యమం వరుణం సోమం త్వమాపోఽగ్నిమథానిలమ్ ।
అత్రాహృత్య పశూంశ్చైవమృత్పాదయసి చాద్భుతమ్ ॥ 1506

†(30) యే మే దమే దారుగర్భే శయానం ధియా సహితం పురుషం నిజహ్రుః ।
కుమ్భిపాకం నరకం గ్రీవబద్ధం హతా ఏవం పురుషాసో యమస్య ॥ 1507

†(31) అభ్యక్తాక్తా స్వలఙ్కృతా సర్వం నో దురితం దహ ।
జానీథాశ్చైవ కృత్యానాం కర్తౄన్ నౄన్ పాపచేతసః ॥ 1508

†(32) యథా హన్తి పురాసీనం తథైవేష్వా సుకృన్నరః ।
తథా త్వయా యుజా వయం నికృణ్మ స్థాస్ను జఙ్గమమ్ ॥ 1509

†(33) ఉత్తిష్ఠైవ పరేహీతో ఽజ్ఞాతే కిమిహేచ్ఛసి ।
గ్రీవాస్తే కృత్యే పాదౌ చాఽథి కర్త్స్యామి విద్రవ ॥ 1510

†(34) స్వాయసాః సన్తి నోఽసయో విద్మ చైవ పరూంషి తే ।
తైస్తే నికృణ్మస్తాన్యగ్రే యది నో జీవయస్వరీన్ ॥ 1511

†"ఖిల"మంత్రములు. (చూ. 813వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు. 146వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు)

†(35) మాస్యోచ్ఛిషో ద్విపదం మోత కిఞ్చిచ్చతుష్పదమ్ ।
మా జ్ఞాతీననుజాన్ పూర్వాన్ మా వేశి ప్రతివేశినౌ ॥ 1512

†(36) శతూ్రయతా ప్రహితాసి దూద్యేనాభి యథాయతః ।
తత స్తథా త్వా నుదతు యోఽయమ స్తర్మయి శ్రితః ॥ 1513

†(37) ఏవం త్వం నికృతాస్మాభిర్బ్రహ్మణా దేవి సర్వశః ।
యథేతమాశ్రితా గత్వా పాపధీనివ నో జహి ॥ 1514

†(38) యథా విద్యుద్ధతో వృక్ష ఆమూలాదను శుష్యతి ।
ఏవం స ప్రతిశుష్యతు యో మే పాపం చికీర్షతి ॥ 1515

†(39) యథా ప్రతిశుకో భూత్వా తమేవ ప్రతిధావతి ।
పాపం తమేవం ధావతు యో మే పాపం చికీర్షతి ॥ 1516

†(40) యో నః స్వో అరణో యశ్చ నిష్ట్యో జిఘాంసతి ।
దేవా స్తం సర్వే ధూర్వన్తు బ్రహ్మ వర్మ మమాన్తరమ్ ॥ 1517

---

†"ఖిల"మంత్రములు. (చూ. 813వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు, 146వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు)

†(41) ఉత్త్వా మన్దన్తు స్తోమాః కృణుష్వ రాధో అద్రివః ।
అవ బ్రహ్మద్విషో జహి ॥ 1518

†(42) కుబేర తే ముఖం రౌద్రం నన్దిన్నానన్దమావహ ।
జ్వరమ్మృత్యుభయం ఘోరం విశ నాశయ మే జ్వరమ్ ॥ 1519

†(43) యో మే కరోతి ప్రద్వారే యో గృహే యో నివేశనే ।
యో మే కేశసఖే కుర్యాదఞ్జనే దన్తధావనే ॥ 1520

†(44) ప్రతిసర ప్రతిధావ కుమారీవ పితుర్గృహాన్ ।
మూర్ధానమేషాం స్ఫోటయ వధమేషాం కులే కృధి ॥ 1521

†(45) యే నో రయిం దుశ్చరితాసో అగ్నే జహుర్మర్తాసో అనృతం వదన్తః ।
తేషాం వపూంష్యర్చిషా జాతవేదః శుష్కం న వృక్షమభి దహస్వ ॥ 1522

†(46) కృష్ణవర్ణే మహదూపే బృహత్కర్ణే మహద్భయే ।
దేవి దేవి మహాదేవి మమ శత్రూన్ వినాశయ ॥ 1523

†"ఖిల"మంత్రములు. (చూ. 813వ పుటలోని తెలుగు ఫుట్‌నోటు, 146వ పుటలోని తెలుగు ఫుట్‌నోటు)

‡(47) ఖట్ ఫట్ జహి మహాకృత్యే విధూమాగ్నిసమప్రభే ।
జహి శత్రూంస్త్రిశూలేన క్రుధ్యస్వ పిబ శోణితమ్ ॥ 1524

‡(48) యే ద్రుహ్యుర్ఋజవే మహ్యమగ్నే కదాధియో దుర్మదా అశ్మనాసః ।
అబద్ధ్యైతాన్ శోచిషా విధ్య తన్వాన్ వైవస్వతస్య సదనం నయస్వ ॥ 1525

## సూక్తము—130

ఋషి—ఆంగిరసుఁడైన విహవ్యుఁడు
దేవత—విశ్వే దేవతలు
***

†(1) క్రూరమైన కృత్యాలను ఘోరగతుల నొనరించెడి
వధువు వోలెఁ బ్రకృతిదేవి బ్రహ్మకల్పములను నిలిచి
శాత్రవతతిఁ గల్పించుచుఁ జిత్రగతుల వర్తిల్లుచుఁ
బ్రత్యక్క్రియలను జరుపును బ్రహ్మ ప్రళయముగాఁగను ॥ 4319

†(2) శీర్షణ్వతిని గర్ణవతినిఁ జెలఁగు విషరూపిణిని
భయకారిణి! మహాదేవి! ప్రాణి హారిణిగ వరలెడి
మహాశక్తి స్వరూపిణి! నిను మహిత ప్రాణతత్త్వముగా
నర్చించెడి వారి కీవె ఆత్మరక్ష నొసంగెదవు! ॥ 4320

†(3) ప్రతికూలమ్మౌ శక్తుల విధ్వస్తము కావించుచు
నభ్యుదయావహము కాఁగ నఖిలమ్మును దరియించుచు
మముఁ గష్టపరంపరల నే మాత్రము ముంచఁబోకు!
ప్రకృతి విరుద్ధ దుశ్శక్తుల నప్రతిహతముగఁ ద్రుంచుము! ॥ 4321

---

‡"ఖిల"మంత్రములు.
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము. ***సామాన్యార్థము.

†(4) కర్మవీరుల మోచు నిత్యము ధర్మవీరగతులఁ దనరు
మా వినాశనమ్ము గోరు సదైవీయ దుశ్శక్తుల
ప్రాణితతుల వధియింపుమా! ఆయువునే హరియించుచుఁ
బ్రజలలోనఁ బురుషశక్తి వర్ధిల్లఁగఁ జేయు దేవి! ॥ 4322

†(5) ధర్మయుక్తమై వరలెడి కర్మమ్మును నొనరించెడి
పుణ్యమూర్తుల రక్షించఁగఁ బునర్నవ వౌదు! నీవు
సకల రాక్షసాళి సలుపు శత్రు చర్య లన్నింటిని
వినాశన మ్మొనరింపుము! విమల! మహాదేవి! మాత! ॥ 4323

†(6) గృహ విధ్వస్తమ్ముచేయు క్షిప్రకృత్యము లన్నింటిని
వినాశనమ్ము కావించును విశ్వసంక్షేమగతుల
నష్టపరచు క్షిప్ర పశుల నాశనమ్ము నొనరింపుమా!
దుష్టవీర తండాలను దున్మాడుము! మహాదేవి! ॥ 4324

†(7) అవిద్వాంసు లైన వార లకృత్యములు నొనరించుచు
గృహచ్ఛిద్రములఁ జేసెడి క్రూరకర్మ లన్నింటిని
క్షీణింపఁగఁ జేసి దేవి క్షిప్రగతులఁ దొలఁగించుచు
దుశ్శక్తుల బారినుండి నిశ్శంకగ రక్షించును ॥ 4325

†(8) బ్రహ్మతేజ మొప్పారఁగఁ బ్రతీచి శక్తిగా వరలుచు
శత్రుతతుల నన్నింటిని సంహరించుచుండు సదా
ఆర్యగ్నుల దుష్కృతులను నాహరించి మహాశక్తి
ఏకపాద్ బ్రహ్మముగా నెసఁగి రక్షింపుమమ్మ! ॥ 4326

†(9) అంగిరస్సులు పూర్వమ్మున నర్చించెడి భృగువులు
నా విధినే నర్చించెడి అత్రులును వశిష్ఠులను
దుష్కర్మల నిరోధింప దుష్టతతులు నశింపంగ
విషరూపాగ్నులు సర్వ వినాశమ్ము నొందంగా ॥ 4327

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(10) రాజిల్లఁగ దీశక్తులు రథము నడుపు రీతి విభుఁడు
పురుష శక్తు లన్నింటిని బూర్ణమ్ముగ ధరియింపుము!
అజ్ఞాతుండైన నరుఁడు ఆ శక్తుల నలరారుచు
దేవి! నీ ఆయనమ్మును దేజరిలఁగ నొందుచుండు! ॥ 4328

†(11) రణరంగమ్మునఁ గూ్రరత రాక్షసమై తనరారెడి
"అభి"శక్తుల హింసలమై నన్యాయపు రతులు మీఱు
దుశ్శక్తుల నన్నింటిని దున్మాడుచు స్వచ్ఛాగ్నుల
రూపుమాపుఁ దనుగతులను లోకహేళిగాఁగ దేవి! ॥ 4329

†(12) శివరూపిణి! శర్వా! నీ పరమదేవి హేళిమెయిని
బాపక్రియ లన్నింటిని భ్రష్టపరచు నో దేవి!
అరివీరుల దుశ్చర్యలఁ గరుణలేని గృత్యమ్ముల
నే దేనొక రూపములో నెన లేక హరించెదవు! ॥ 4330

†(13) మా మనశ్శక్తులను మహిత వైరమ్ముతో
అతిదూరమునుండియో! అంతికమ్మునుండియో!
యెదిరించెడి నరాతిహీనమ్మౌ కృత్యమ్ముల
హరియించుమా! దేవి! అతిలోక శక్తులన్ ॥ 4331

†(14) ఖడ్గక్షేత్రాలమై కర్కశ హృద్గతుల
కష్టజాలమ్మునుండి కాపాడుమా! మమ్ము
వ్యాన వాయుగతులమై నవ్యాన రతులమై
నఖిలమ్ము నీ కరుణ ననుపర్తితము కాఁగ ॥ 4332

†(15) శివ సంకలితమై చెలఁగు మార్గమ్మునన్
బయనించు మమ్ములన్ భద్రశక్తులఁ జేరు
నా భద్రశక్తులన్ నలరారు నో దేవి!
సత్కర్మలను మమ్ము సదమలముగాఁ జేర్చు! ॥ 4333

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వక్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదములు.

†(16) ద్విపదులు మమ్ములనె తేజరిల్లఁ బొంద నౌను
జతుష్పదులు కూడ మమ్ము సదా పొందుచుండు
మాచే నిరస్తమైన మహిమాన్వితాఽష్టపదులు
చేరుచుండు గృహమ్ములను జిద్విలాసదేవీగతి ॥ 4334

†(17) శవత్వమ్మునుండి మముల సదా కాపాడుమా!
అశవత్వములనుండి మముల నాదరించి కాపాడుము!
అతిలోకములై వరలెడి ఆ శవత్వశమమ్ములనుండియు
వృక్షమ్ముల విద్యుత్తు వినాశనమ్ము నొనర్చురీతి
దమోమూలమ్ము దేవి! తనర శోషింపు మీవు! ॥ 4335

†(18) మేష రహితమ్ముగా విపరీతశవత్వగతినుండి
మమ్ముఁ గాపాడుమా! మహితశక్తులు మీఱ
శునకపిష్టము గతిగ నెనయ హీన మొమ్మొచు
మృత్యువుతో మాకుఁ బ్రత్యవాయము లేక
తనరారఁజేయుమా! తగ క్షమారూపిణి! ॥ 4336

†(19) ఏ సాపత్నము నెనఁగునొ! శపథముగా
నే యామి మమ్ముల నెగసి శపించునో!
యే బ్రహ్మశపత్వమునుండి కృద్ధమౌనొ! అవియెల్లను
సద్యఃపతనమైపోవును నా దేవీమహత్వమున ॥ 4337

†(20) బంధు సహితమైగాని అబంధుసహితమైగాని
అలరు మమ్మ జగతి "నభి" శక్తుల బాధించెడి
శత్రుతతుల వధియింపుము! సదమలమౌ పదమునుండి
శిరచ్ఛేద మొనరించి విశీర్ణగతులఁ బారమ్మె ॥ 4338

†(21) ప్రతిజ్ఞతో రథముపైని బయనించుచు నిత్యమ్మును
సహస్రాక్షు నతిలోకపు శక్తులమైఁ బయనించుచు
గృహముచేరు వృకములఁ గ్రీడగ వధియించుగతిని
శత్రు కూ్రర కృత్యాశిని సమయింపఁగఁజేయు! దేవి! ॥ 4339

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(22) కాపాడుతఁ! బ్రతిజ్ఞమైఁ గష్టతతులనుండి మమ్ము
నగ్నితోడ జలాశయము అట్టుడికెడి రీతిగాఁగ
వృక్షములను దహియించెడి పిడుగుపాటు వోలె నీవు
శతృతతుల నో దివ్యా! సంహరించు! శీఘ్రమ్ముగ ॥ 4340

†(23) శతృతతుల నుండి నీవు నా శపథమ్మును గాపాడుము!
సహృదయులఁ గాపాడుము! సహృత్కృత్యమ్ముల
జాతవేదమైన అగ్ని సమిధముగా వెలుఁగు రీతి
శుభదమైన వాక్కులతో శోభిల్లుత! జిహ్వ యెపుడు ॥ 4341

†(24) అవిరోధము ప్రాగ్దిశతో నలరారుచు నుండు మాకు
దక్షిణదిశలో శివమ్ము తనరారుచునుండు మాకు
భయ రహితము పశ్చిమ దిశ వరలుచుండులే! సదా
ఉత్తర దిగ్భద్రమ్మగు గృహమునన్ సతతము మాకు ॥ 4342

†(25) తిష్ఠ వేయుమా! నీవు దివ్య కృత్యపదా! దేవి!
బ్రహ్మ జ్ఞానాల పదముఁ బడయఁజేయుమా! నన్ను
మృగమ్మునకు మహా మృగశతృవుగాఁగ నిల్చి
మమ్ము సదా రక్షించును మహాదేవి సమరమ్ముల ॥ 4343

†(26) ఆ రాత్రి ముఖము వోలె ఘోర రూపియైన దేవి!
ఆ విష రూపిణిగాఁగ వరలు నవినాశిని! మహాదేవి!
అద్భుతగతి స్వయముగా నాదాయమ్మైనఁ గాని
జృంభితవై సర్వమ్మును స్వీకరించుమా! నిత్యము ॥ 4344

†(27) నీవే! యింద్రుఁడ వౌదువు! నీవే! యముఁడవు నౌదువు!
నీవే! వరుణుండవు! నీవే! జలమవు నగ్నివి!
నీవే! అనిల మ్మవుదువు! నీవే! బ్రహ్మవు! రుద్రుఁడ
వీవే! త్వష్టవు! ప్రజాపతి వీ వౌదువుగా సృష్టిని ॥ 4345

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల" మంత్రానువాదము.

†(28) నీవే! ఆవర్తద్వము! నీవే! నివర్తద్వము!
నీవే! ఋతువులు! నీవే! పరివత్సరాలు!
అహోరాత్రిలును నీవే! అబ్దమ్ములు నీ వౌదువు!
నీవె! దిశలు నా దృష్టిని నీవే! ప్రదిశలును సౌదువు! ॥ 4346

†(29) నీవే! యముడిని వరుణుని నీవే! సోముని
నీవే! సలిలము నగ్నిని నీవే! అనిలమ్ములను
వివిధ పశు తతుల( బిల్చి యిచట
నద్భుతమ్మును నీవె! అవతరిల( జేయుదువు! ॥ 4347

†(30) దారు గర్భమ్ములో దమ శక్తి శయనించు
నాలోన ధీసహిత పూరుష శక్తిని నింపు
కంఠ బద్ధ మ్మొచు( గనలు కుంభీపాక
నరకాన యమునిచే( బురుషుండు హుతు(డౌను ॥ 4348

†(31) పాప చిత్తమ్ములన్ బగల( గర్మలన్ జేయు
నరుల క్రూర కర్మలను నెరి నెరు(గుచు దేవి!
అఖిల దోషాలతో అలంకృతమై వరలు
మా దురిత కార్యాల మసిచేయు! దహించి ॥ 4349

†(32) పురాశను నే విధిమై( బూర్తిగా వధియింతువో!
ఆ విధిగా( బాప కర్ము(డౌ నరు వధియించుదు!
నీతోడనె యోగమైన నిర్మలుల మగు మమ్ముల
ఉంగమ స్థానమ్ముల స్థాపింపుము! మా శక్తుల ॥ 4350

†(33) అజ్ఞాత మైనట్టి ఆ యిచ్చారతులను
బరేహితముగా(గను నరయంగా లేపు మీవు!
నీ కంఠమున( బాపమ్ముల నిఖిల కృత్యమ్ముల నన్నింటి
నభికర్తృత్వ మ్మొనరించుమ! అఖిలమ్మును విదగ్ధవముగ ॥ 4351

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(34) స్వాయశులై నాయందున ఆసయు లెల్ల నుండు
నీ పూరుష శక్తులలో నిరతమ్మును విద్మ మౌను
బ్రతుకుచుండు నట్టి మా పరమశత్రుతతు లన్నిటి
వారి ఉగ్రకర్మలతోఁ బరిహరించుమా! నిత్యము ॥ 4352

†(35) అక్కరలే దీ ఉచ్ఛిష్టపు ద్విపదమ్ములు
అక్కరలే దీ చతుష్పద చయము లివి
పూర్మానుజు లైన జ్ఞాతి వశ్యు లవసరమ్ము లేదు
ప్రతివేశిను లెవ్వరినిన్ బ్రవేశింపనీయరాదు ॥ 4353

†(36) నా అంతర్గతమందున నవముగ నంతర్మయిగా
శ్రిత మై నే గతి వైరము చెలఁగ దూర మై పోవునా!
ఆ రీతిగ నిన్నెపుడును నభయ మొనఁగి కాపాడుత!
నాయత మౌ "నభ" శక్తుల నద్భుతగతిఁ బరిహరించి ॥ 4354

†(37) బ్రహ్మలలో సర్వశః వరలంగా నో దేవీ!
యీ విధి మానుండి నివృతి నీ వొనరింపుమ! నిత్యము
పాపబుద్ధిమంతులైన వారిని మము జహించు గతి
నాశ్రిత మౌ దానిఁబొంది అఖిల పవిత్రత నొప్పుము! ॥ 4355

†(38) ఏ విధి విద్యుద్ధత మౌ వృక్ష మ్మది చూడంగా
సమూలముగఁ గాలి సర్వ మనుశోషమ్మౌ రీతిగ
నాలోఁ బాపము సర్వము నాశమ్మును జేయునట్టి
ఆ శక్తియె విధిగా మము నతిమహిమలఁ గాపాడును! ॥ 4356

†(39) ప్రతిశుక మై శబ్దశక్తి ప్రతిభావ మ్మొనరుచు దాని
ఆ పాపము నెల్లను సరూపముగఁ గడిగివేయు
నాలోఁ బాపము సర్వము నశియింపఁగఁ జేయుఁగాక!
నఖిల జీవనమ్ము శుద్ధమ్మై తనరును ననవరతము ॥ 4357

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(40) మమ్ముల నే అరణులు మహితగతుల నొందుచుండు
ఏ అరణులు నిష్ప్య గతుల నెసఁగి దీప్యమానమౌను
ఆ అరణులు బ్రహ్మవర్మ మంతర మౌచును నాకిఁక
సర్వదేవతాళి నెల్ల సదా దూర్వహ మ్మొదు ॥ 4358

†(41) ఆవహిల్లి ప్రవహించెడి ఆ నదీ సలిలాలకు
ధరణి నడుగాఁ గొండలు తనరారెడి రీతిగానె
బ్రహ్మ ద్వేషుల నందర వారింపుము॥ నిత్యమ్మున్
మందబుద్ధులౌ వారిని మ్రందింపుము॥ సదా దేవి॥ ॥ 4359

†(42) రౌద్రమైన నీ ముఖాన రాణించుత నానంద మ్మావహిల్లి
ఘోర జ్వర మృత్యుదమౌ కుబేరా॥ నా జ్వరమును
రూక్ష శక్తు లొప్పారఁగ రూపుమాపి వేయుమా॥ కడు ॥ 4360

†(43) ఏది ముఖద్వారమందు నెయ్యది గృహమ్మందును
ఏది నివేశమ్మందును నేది నాకు శుభము చేయుఁ
గేశమ్ముల నఖములందుఁ బేశాంజనమందును
దంతధావనమ్ములందుఁ దనరఁజేయునది శుభము ॥ 4361

†(44) పితుర్గృహమునుండి కుమారి ప్రతిసరమై ప్రతిధావమ్మౌ రీతిగ
నీ కుల పదమునుండి కృధిగా మూర్ధమ్మునందు
విస్ఫోటము చేసి నిలువు॥ విమలమైన శక్తులమై ॥ 4362

†(45) అగ్నిచేత వృక్షమ్మది ఆహుతియై పోవురీతి
నబద్ధమ్ము దుష్టబుద్ధి నారుచుండు దేహమ్మును
దుశ్చరితము వర్తిల్లెడి ధూర్తుని శరీరమ్మును
జాతవేదార్చిషాగ్ని సర్వమ్ము కృశింపఁజేయు ॥ 4363

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(46,47) కృష్ణవర్ణీ! మహారూపీ! బృహత్కర్ణీ! మహద్భయీ!
దేవి దేవీ! మహాదేవీ! తెగటార్చుము! నా శత్రుల
ధూమరహితాగ్నిసమవర్చిభ! తొడరు మహాకృత్యదేవి!
శత్రు తతులఁ ద్రిశూలాన సంహరించివేయుమా!
"ఖట్" "ఫట్" క్రియ దుష్టాశుల కారు రక్తమును ద్రావుమ! ॥ 4364

†(48) అశ్మమ్ములతో సహ అఖిల చర్మదుల నందర
నాయందలి ఋజ శక్తుల ననలమ్ముల దహియించుమ!
కాంతితంతువులు మీఱఁ గనల కోషిల్లఁగ బంధించి
యమసదనము నొందించుమ! అమిత పాపులను నెల్లర ॥ 4365

## సూక్తము—130

ఋషి—ఆంగిరసుఁడైన విహవ్యుఁడు
దేవత—మహాదేవి

### అర్థాంతరము—1

†(1) కాలదేవత సృష్టిఁ గ్రాలు నిర్దయ నియమ
గతు లొప్ప వరుసగా నతులిత శక్తులౌ
బ్రహ్మరూపిణులుగా రాజిల్లుచు ననంత
సమయ రూపమ్ముగాఁ జరాఽచరముల నెల్ల
నేకైకమైయుండి యెల్ల లేమియు లేక
అనేకరూపాల ననువహాన మ్మొను ॥ 4366

†(2) పంచేంద్రియ రతుల నంచితముగా మరలు
శీర్షాల మైఁ దనరి చెలఁగంగ శ్రవణగతి
శబ్ద శక్తులఁ బరఁగు సర్వ విషువత్కాల
భయకరీ! నుతియింతుఁ బాహి నను దివ్యగతి ॥ 4367

†(3) భూత భావి వర్తమాన చేతనాఽచేతనమౌ
రూప మెదియు లేకుండఁగ సృష్టిలో వ్యతిరిక్తత
లేకుండఁగఁ దనరారెడి సృష్ట్యతీత కాలశక్తి
సర్వ దురిత కష్టనష్టజాల మెడలఁ గావుత! మము ॥ 4368

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(4) న్యాయబద్ధ మౌచు మమ్ము మాయ లేలఁ బూర్ణమ్ముగఁ
గాలబద్ధమైన రీతిఁ గ్రాలఁ బరిత్యక్త మౌచుఁ
**బ్రకృతి పురుషరూపా లవి ప్రవర్తిలఁగ నాయుషమున**
నసాధారణంపు గతుల నలరించును మహాదేవి ॥ 4369

†(5) పునర్నవమ్మౌ రీతిగఁ బూర్ణశక్తి కాలరూపిణీ!
రాక్షసరూపాలఁ బ్రకృతి నరాతితతులుగాఁ బెరిగెడి
దుశ్శక్తుల దుష్కర్మలఁ దున్మాడుము! కృత్యా!
సర్వస్వము పరాస్తమై జగతిఁ గాంతి సమకూరఁగ ॥ 4370

†(6) విశ్వసృష్టి గృహములోన వెలసి కాలకర్త్రిగాఁగఁ
గ్రియారూపిణి! వధించు! క్షిప్రకార్యముల నన్నిటి
దుష్టరూప పశుతతులను దుర్వీర్యగ దుర్మార్గగ
సంచయాల సంహరించు! సర్వాఽరుల నిబర్హించు! ॥ 4371

†(7) విశ్వసృష్టి గృహములోన విజ్ఞానులు విద్వాంసులు
నవిద్వాంస దుర్విదగ్ధపు టకృత్యాల రూపు మాపి
దిక్తతులను ధర్మమ్మును దేజరిలఁగఁజేసి సదా
**తనురూపులఁ బాపమ్మును ధ్వంస మ్మొనరించు! దేవి!** ॥ 4372

†(8) ప్రతీచిని గాలరూపి పరాదేవతగ వరల
నమిత్రరూప చంద్రఋక్షాఽఖిల రోచిస్సులమై
బ్రహ్మ వరలఁజేయు సృష్టి వరఁగ నగ్ని కృత్యాలను
నేకపాద్గతులమైని నెసఁగంగాఁ బగలు రాత్రి
లతిలోకముగా సృష్టిని నసాధారణంపు గతుల
నొకటఁబగలు నొకటరాత్రి నొకటరాత్రి యొకటఁబగలు
గాఁగ సచ్ఛక్తుల సర్వస్వము వేగఁజేయు దుశ్శక్తులఁ
బరిహరింపు! మహాదేవి! వధియింపఁగ రాక్షసాళి ॥ 4373

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(9) ప్రాగ్దిశలో నాంగిరసపు ననలశక్తు లలరారఁగఁ
బశ్చిమగిరితటముపైని వరలఁగ శివశక్తితతులు
నాత్రేయపు దివ్యరతులు నలరారఁగఁ జిత్రగతుల
విశిష్టమై శిష్టత్వము విస్తరిల్లు విశ్వసృష్టి ॥ 4374

†(10) కాలరథమును విభుఁడు క్రాలు బుద్ధి నడుపుగతులఁ
బురుషశక్తు లెల్లఁ బ్రకృతి ధరియించుచుఁ దనరారును
నీ జనుం డజ్ఞతమై నెరుంగలేఁడు గాని నీవె
అయనగతిని నేగు మెపుడు నా మూలము చేరంగా ॥ 4375

†(11) పరస్పర విరుద్ధమౌ వాతావరణాలఁగాని
అన్యమైన స్థితిగతులను నఖిహింసలఁ బీడించెడి
పురుషశక్తిఁ గాలదేవి! పూర్ణాగ్నుల నాశపరచి
హేళిగాఁగఁ బ్రకృతితనువు ఋతశక్తుల నిలుపు మీవు! ॥ 4376

†(12) పాపకృత్యములు నశింప "భవ"గాఁగను "శర్వ"గాఁగ
దేవహేళి కాఁగఁ దనరి తేజరిల్లు కాలరూపి!
హరస్వతీ! రాక్షసాళి అఖిలక్రూరకృత్యతతుల
భావరూపములఁ జంపుమ! యే విధిచేనైనఁగాని ॥ 4377

†(13) దూరమందునున్నఁగాని చేరి అంతికమున నున్న
దుష్టశత్రుతతి రక్తము తృప్తి తీరఁగాఁ ద్రావుమ!
క్రూరమైన కృత్యాలను మేర లెల్ల మీరి చేయు
దుర్మార్గుల సంహరించి శర్మగతుల రక్షింపుమ!
కాలరూపి! కాలశక్తి! క్రాలు మనశ్శక్తిరూపి!
అసాధారణంపు రతుల నఖిలజగతి రక్షింపుమ! ॥ 4378

†(14,15) కాలగతులఁ గ్రాలునట్టి వేల లెనయు వాయుగతులు
వ్యానశక్తి వ్యానభిన్న ప్రాణాదుల వాయుతతులఁ
బరఁగు కాలశక్తి సృష్టి నరులఁ దుంచివైచు నశని
పాతగతుల నఖిలమ్మునఁ బరావతముగాఁగ జగతి

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

శివంకరమౌ పథాలఁ జెల్వొందెదు మము నెల్లర
సర్వగతులఁ గాపాడుము! సకలకాలరూపిదేవి!
రాత్రినుండి మృత్యుపు రాడినుండి కాపాడుచు
దివ్యానందానుకూల్య స్థితిగతులను నుంచు! దేవి! ॥† 4379

†(16) ఊర్ధ్వదిశను నధోదిశను నొనరఁగ వ్యాపించు మమ్ముఁ
జతుర్దిశల నందు రీతి సదమలముగఁ గాపాడుము!
అష్టదిశాగృహమ్ములకు నతిగతులను గర్తగాఁగ
విజయ శక్తులను మమ్ముల విలసిల్లఁగఁజేయుమా! ॥ 4380

†(17) నిర్జీవత్వమ్మునుండి నెగడఁగ జీవత్వ మ్మది
జీవత్వమునుండి తిరిగి చెలఁగంగా నిర్జీవత
వెలుఁగుల హద్దులు మీరఁగ వెలయు సృష్టి వృక్ష మట్లు
ఆమూలముగా మమ్ముల ననుశోషింపుము! దేవీ! ॥ 4381

†(18)ద్వైతరూపగతులు మీర వరలు మమ్ముల నెల్లర
నాయుష్మంతుల మము నందు నిర్జీవత్వమ్మునుండి
ఆడు కుక్క పిండ మట్టు లమరెడి దారిద్ర్యమ్మును
బోఁగొట్టెడిరీతి మృత్యుభూతమ్మును బోఁగొట్టుము!
కాలరూపి! మహాదేవి! క్రాలంగా దివ్యశక్తి
ద్వైధీభూతమ్ము కాఁగఁ దనరారఁగ దివ్యగతులు ॥ 4382

†(19) ఏ కాలము శపథమ్మై నే యమి మముఁ జంపివైచు
నే మృత్యువుఁ జూచి బ్రహ్మయు నెనయఁ గృద్ధుఁడై పోవును
ఆ మృత్యువు సర్వస్వము నధన్పదమ్మై పోవును
గాలశక్తిగతుల లీల క్రాలంగా సృష్టిలోన ॥ 4383

†(20) అనుబంధపు బంధాలను నలరు బంధు వైనఁగాని
ననుబంధ బంధాలను నలరు నబంధు వైనఁగాని
మము నెల్లరఁ గష్టమ్మున నమితమ్ముగ ముంచివైచు
"నభి"శక్తులఁ దుంచివేయుమా! శిరమును ముక్కలుగాఁ
జెక్కలుగా వ్రక్కలుగాఁ జెండాడుము! కాలరూపి!
అధిష్ఠించి భద్రపదము నతిలోకపు శక్తుల మై ॥ 4384

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(21) శపథరూపమైన రథము సదమలగతి నధివసించి
కాలరూపి! సహస్రాక్షుఁ గ్రాలఁగఁ బంపించుమా!
అభిమతమై గృహములలో నా వృకము వసించు రీతిఁ
గ్రూరకృత్యులైన శత్రు వీరవరులు నశింపంగా ॥ 4385

†(22) హ్రదములోని సలిలములను హరించుగతి సూర్యాగ్నులు
దుష్టశపథతతులనుండి దగ రక్షల నీయు మీవు!
అశనిపాతమున వృక్షము నశియించెడి రీతిగాఁగ
సంహరింపుమా! దివ్యా! శత్రుతతుల నఖిలములన్ ॥ 4386

†(23) మంచి హృదయమున్నవారు మంచి హృత్తు లేనివారు
నొనరించెడి క్రూరకృత్యా యోగమ్ముల సంహరించి
సంరక్షణచేయు! శత్రు శపథమ్ములనుండి మమ్ము
సమిద్ధమై వరలెడి జాతవేదసాగ్నితతుల
వక్రమైన దుష్టగతుల వధియించుచు నిత్యమ్మును
మమ్ము సదా కాపాడుత! మహిత కాలరూపి దేవి ॥ **4387**

†(24) "అసపత్న" మ్మలరు మాకుఁ బ్రాగ్దిశనుండి సదా
దక్షిణదిశనుండి "శివము" తనరారును నసముగతిఁ
బశ్చిమదిశనుండి "అభయ" భాగ్య మలరు నిత్యమ్మును
నుత్తరదిశనుండి "భద్ర" మొనఁగూడును గృహమునందు ॥ 4388

†(25) క్రూరకృత్యమా! మమ్ములఁ గోరి దిష్ఠ వేయకుండఁ
బరులపరముగాఁగఁ బొమ్ము!- భద్రపర గతులమైని
విద్వాంసుఁడుగా నిలుపుము! విశ్వపదము పొందించుము!
మృగము వధించివైచు మృగాఽరి వోలె మమ్ముల నెల్లఁ
గాపాడుము! శత్రుతతుల రూపడంచి మహాదేవి! ॥ 4389

†(26) రాత్రిదేవి ముఖము వోలెఁ గ్రాలు ఘోరరూపీ! మము
విషకాలపు రూపీ! వినాశినీ! ఓ జృంభిత!
అద్భుతముల స్వయముగా నావిష్కరించి పరిగ్రహింపు
మాదరణము మీర మమ్ము నతిలోకదయార్ద్ర దృష్టి ॥ 4390

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(27) విశ్వరూప విష్ణు వీవు: వెలుఁగు వరుణాదిత్యుండవు:
నిత్యకర్మరూపుఁడవై నెగడు యముఁడ వీ వవుదు:
పరిశుద్ధుఁడవౌ నగ్నివి: అనిలమైన వసు రూపివి:
బ్రహ్మవు: రుద్రుఁడ వీవే: ప్రజాపతివి: త్వష్ట వౌదు: ॥ 4391

†(28) చక్రనేమిక్రమముగాఁగ సంచరించు కాలగతుల
సుడిగుండముగాఁగఁ దిరుగు చొప్పదంగ స్థిరగతి మై
ఋతువులుగాఁ బరివత్సర తతులుగాఁగ వరలుచుండి
అహోరాత్ర లబ్దమ్ములు నౌదు: దిశలు ప్రదిశ లీవే: ॥ 4392

†(29) యమరూవపు నియమమ్మును నమరింతువు: సృష్టిలోన
వరుణరూపి ఆదిత్యుని వర్తిలంగఁజేయు దీవు
అమృతరూప సోమదేవు నమరింతువులే: నీవే:
సలిలమ్మును ననలమ్మును గరువలి సృష్టింతు వీవు:
అద్భుతముగఁ గాలరూపి: ఆకర్షణగతుల మెయిని
వివిధపశుసంపదాళి నవతరింపఁజేయు దీవే: ॥ 4393

†(30) దారువృక్షగర్భమ్మునఁ దనర శయన మొనరించెడి
బుద్ధిసహితుఁడౌచు నమరు పురుషుని నాలో నిలుపుము:
కుంభీపాక మౌచు వరలు ఘోరయముని నరకమందు
గ్రీవబద్ధుఁడైన పురుషుఁ గీలలలోఁ గాల్చుములే: ॥ 4394

†(31) సకలపుణ్య పుంజాలను సమలంకృతయైన దేవి:
మా దురితా లన్నింటిని మసిమసిగాఁ జేయు మీవు:
దుష్ట క్రూర కృత్యమ్ముల ముష్టికర్తలైన నరుల
పాపచేతనము లన్నిటి భస్మమ్మగ నొనరింపుము: ॥ 4395

†(32) సుకృతిరూపుఁడైన నరుఁడు శుభ్రముగా నా దురితుని
సంహరించురీతి గానె- జంగమరూపముగాఁగను
భవదీయమ్మౌ యోగము వరలు మేము నీ కృపమై
నఘ నిష్కృతులన్ నిరతము నలరుదుము రక్షలమై ॥ 4396

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(33) అజ్ఞాతమౌ మారతులను నలర నా వశమై తగు
నిచ్ఛాతతి నఖిలమ్మును నెసఁగఁ బారఁదోలు మీవు!
నీ శిరములఁ బాదమ్ముల నిరతమ్మును సుకృతముల
నర్చింతును గాలరూపి! అలరారఁగ విదగ్రి గతి ॥ 4397

†(34) "అయన"గతుల "నసయ"గతుల నమరమైన శక్తులతో
నలరారెడి మహాశక్తి ఆభయగతుల విజ్ఞానము
ఉగ్రక్రియ లన్నింటిని నున్మూలమ్ములతోడను
నిర్మూలన మొనరించుమ! నిఖిల శత్రుతతు లన్నిటి ॥ 4398

†(35) ద్విపదము కదిలించు! నీవు తేజోచ్ఛిష్టమ్ముగాఁగఁ
జతుష్పదము కదిలించుము! చతురతమైఁ గొంచెమ్ముగఁ
జలన గుణము తనరారెడి జ్ఞాతివర్గ జాతమ్ములఁ
బ్రతివేశి ద్వంద్వమ్ముల వరలఁ జాంద్రసూర్య గతుల ॥ 4399

†(36) శత్రుత్వము రూపు మాపి సర్వశుభంకరి వౌదువు!
ఆయతమౌ "నభి"శక్తుల నన్నింటిని ధ్వంసపరచి
అంతర్మయి గతులు మీఱ నాశ్రితగాఁ దనరారెడి
నిన్ను సదా నుతియింతుము నిరత విశ్వకాలరూపి! ॥ 4400

†(37) సర్వత్రా వరలుచుండు సకల బ్రహ్మలసద్దేవీ!
నిన్ను నర్చింతు మేము నిష్కృతులను బారఁదోల
నాశ్రితమౌ మముఁ జేరుచు నఘతతులను రూపుమాపి
పాపబుద్ధులను దహించు పగిదిగ మా దుర్గతులను
బోఁగొట్టుచు శుద్ధగతులఁ బూర్ణమ్ముగ రక్షించుమా! ॥ 4401

†(38) ఏ విధి విద్యుద్ధతమై వృక్ష మామూలముగా
ననుశోషించును నా విధి నాలో నిలిచిన
పాపపుంజముల నెల్లను వరలు నా విద్యుత్తే
ప్రతిశష్య మ్మొనరించును బ్రభా భాసితముగాఁగను ॥ 4402

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

† "ఖిల" మంత్రానువాదము.

†(39) సృష్టిలోని పదార్థాలు చెలఁగి తమకుఁ దామె స్వయం
మారకమ్ము లౌచు వరలి మ్రందు రీతిగానె జగతిఁ
బాపమ్మునె పావ మ్మది భస్మమ్ముగ నొనరింపఁగ
నాలోఁ గల పాప మెల్ల నశియించునుగాక! దేవి! ॥ 4403

†(40) ఏవి మాకు నరణములో! యే విమలశక్తితోడ
ననలశక్తు లఖిలమ్ములు నద్భుతగతి జ్వలియించునా!
ఆ శక్తులు సర్వమ్మును నమరదేవతాళి నెల్ల
బ్రహ్మ మొదలు బ్రాహ్మ్యశక్తి రాజిలు కవచమ్ముతోడ
నావటుకును ధరియించుత! జ్ఞానరూపకాలరూపి! ॥ 4404

†(41) ఆద్రి సమూహాలతోడ నఖిల విశ్వగోళమ్ములు
సృష్టి స్థితిగతులతోడ స్తోమములై మందుఁగాక!
బ్రహ్మద్వేషుల నెల్లరఁ బరఁగంగా దహియింపుము! ॥ 4405

†(42) నిర్ఋతిరూపమ్ము నొంది నిఖిల రౌద్రమూర్తియైన
కుబేరా! నీ మోమునఁ గూడు నానంద మ్మావహమై
ముసలితనము నిచ్చుచుండి మృత్యుభయద మౌచు ఘోర
మైన నా జ్వరమును మట్టిఁ గలుపుమా! దేవీ! ॥ 4406

†(43) సింహద్వారమ్మునందుఁ జెలఁగు గృహమ్మునందును
నివేశనమ్మునందు నీవు తొలఁగుమ! ఓ పాపమ్మా!
సలిలమ్ముల నపుంసకత చాఁగునఁ దొలంగు మీవు!
పన్నులలోఁ బాసి వోలెఁ బాపమ్మా! పోవు మీవు! ॥ 4407

†(44,45) తండ్రియింట నుండు దుష్టతనయ వోలెఁ దరలు మీవు!
వంశమ్మున దుష్టయైన పాపమూర్ధమును ద్రుంచుము!
అమృత భాషణములతోడ నపమృత్యువు దూర మౌను
శుష్కమైన వృక్షమ్మును శుచి దహించురీతిగానె
జాతవేదమైన అగ్ని జ్వలిత జన్య తేజాలను
దుశ్చరిత కుసంపదాళి దుర్విదగ్ధ మొనరించుత! ॥ 4408

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(46,47, విష్ణువర్ణా! మహారూపా! బృహత్కర్ణీ! మహద్భయా!
48) దేవిదేవీ! మహాదేవీ! తెగటార్చుము! నా శత్రుల
"ఖట్" "ఫట్" క్రియల మెయిని గ్రాలెడి మహాకృత్యా!
విధూమాగ్ని సమప్రభా! పీల్చునుఁ దాపుము! రక్తము
త్రిశూలాన శత్రువులను దెగటార్చుము! దివ్యశక్తి
భుజశక్తుల మహితాగ్నీ! ద్రోహుల దుర్మదమృత్తులను
బంధింపుము! తంతువులను బంపుము! యమసదనమునకు
శుచి జ్వలిత దివ్యశక్తి శోభిలంగ ధర్మరతులు ॥ 4409

## సూక్తము—130

ఋషి—అంగిరసుఁడైన విహవ్యుఁడు
దేవత—మహాదేవి

### అర్థాంతరము—2

†(1) కఠినోష్ణత లలరారెడి కాలు గంధఫలము పోలె
నెల్ల శివము నొసఁగునట్టి యేకాదశ రుద్రులు
సృష్టి నవబ్రహ్మకృతులఁ జెలఁగునట్లు చేసి సుకృత
సంక్రియలను బుచ్ఛక్తుల సర్వప్రత్యక్తత్త్వ మలరు ॥ 4410

†(2) బహుశీర్షమ్ముల వరలుచు పరఁగు శబ్దజలము
నాకాశావృతమైనదాని నాదిశేషగతులఁ దనరు
"నహ" శక్తుల వెలుఁగు నిన్నుఁ బ్రాణి సంయోజితముగఁ
బరమాత్మయె సలిపి నిలుపుఁ బ్రకృతి పురుష శక్తులమై ॥ 4411

†(3) అగ్నికిఁ బ్రతికూలమైన ఆ సలిల స్వరూపాలు
అంతర్గతి రూపముగా నవినాభావత్వ మలర
నావరించి అద్భుతరతి నవుపించని విద్యుత్తుగ
విభజితమై తేజరిల్లుఁ బ్రబల ద్వైతగతులు మీఱ ॥ 4412

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(4) స్రష్టపురుషశక్తి నెల్ల సంవర్ధక మొనరింపుము!
వృద్ధినొందు నోజస్సుల విడివడ మూలమ్మునుండి
ప్రజలలోన జీవాళులు పరఁగు పురుషశక్తి హరించి
సృష్ట్యాయువు పెంచు మీవు చెల్వొందెదు సలిల ప్రకృతి ॥ 4413

†(5) ప్రకృతిలోనఁ బ్రవహించుచు నమృతశక్తిహారిత మై
అదృశ్యమై పునర్నవగ నద్భుతగతి నవతరించి
సృష్టి యాతుదానశక్తి నష్టపరచి భ్రష్టపరచి
విశ్వమ్మునఁ గ్రూరకృత్య వితతి నాశపరచు జలము ॥ 4414

†(6) ఆపరకల్పవృక్షగతుల నప్ఛక్తులు క్షిప్రమ్ముగ
నన్నింటి నశింపఁజేయు నావలకే త్రోసివేయు
నధోగతుల కుపరిగతుల కపగతమ్ములై పోవఁగ
దుష్టములౌ పశుతతులను దున్మాడుము! జలదేవీ!
నికృష్ట దుష్ట వీరాళుల నీ శక్తిని నిబర్హించు! ॥ 4415

†(7) అజ్ఞానపు నిలయమ్ముల విజ్ఞానపు శక్తులమైఁ
గ్రూరకర్మతతు లన్నిటిఁ బారఁద్రోలవలయు జగతి
ముడులకు ముడిగాఁగ నిలుచు సుడుల జలము తనుగతులను
వేగమాత యౌచుఁ జలన విన్యాసము లలరుఁ బ్రకృతి ॥ 4416

†(8) రవిశత్రు సంహారము ప్రకృతిశత్రు సంహారము
నొనరించెడి బ్రహ్మతేజ మొప్పెడి జలశక్తు లెల్లఁ
బశ్చిమదిశఁ బ్రజ్వలిలును బ్రబలు క్రూరరాక్షసాళి
నగ్ని సంహరించుచుండు నజైకపాత్తు కాఁగ సృష్టి ॥ 4417

†(9) ప్రాగ్దిశలో నగ్నిశక్తు లా శుక్రప్రదీప్తు లెల్ల
జనన పరమ్మై పరఁగెడి వినిమయాత్రి శక్తితతులు
స్థితిధర్మవిశిష్ట మౌచుఁ జెలఁగు వశిష్ఠశక్తితతులు
చలనగతుల విడివడుచును సర్వమ్మున వ్యాప్త మౌను ॥ 4418

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†"ఖిల"మంత్రానువాదము.

†(10) విభు బుద్ధుల నదుపాజ్ఞల విధి నడచెడు రథము పగిది
నీ పరశక్తులు కాలము నిరతమ్ము ధరించ నిలుచు
నేకైకమ్మై తనరెడి ప్రాకృతాఽయనమూల శక్తి
అజ్ఞత మై బుద్ధిహీనుఁడైన జనుఁ డెరుంగలేఁడు ॥ 4419

†(11) శబ్దక్రియల నున్నఁగాని సకలసృష్టిలోన వరలు
రంగురంగులను దనరుచు నింగి నంటు మూలశక్తి
నున్నఁగాని ప్రకృతిలోని సృష్టి విరుద్ధ శక్తితతుల
సంహరించి ఆగ్నిమూల సదా హేళిఁ గాపాడుత!
రోగ నాశనమ్ము చేసి ఋతశక్తుల నిలుపుఁగాక! ॥ 4420

†(12) దేవహేళియైన శక్తి! దివ్యా! భవా! ఓ శర్వా!
పాపక్రియ లొనరించెడి పాపాత్ముల హరించు
సృష్టి స్థితి లయకారిణి! క్రూరకృత్యములఁ దున్ముచుఁ
బరిహరించుమా! అఘమును నరిమురి నే విధినైనను ॥ 4421

†(13) దూరమందు నంతికమునఁ దొడరెడు నా శత్రుతతుల
మనశ్శక్తు లెల్ల జగతి మహితముగా వశ మౌచును
నలరారఁగ హృద్యమైన అమృతశక్తి సేవింపుమ!
క్రూరకృత్యులైన అరుల రుధిరమ్మును ద్రావు! దేవి! ॥ 4422

†(14) అసికృత్యమ్ముల నన్నింటి నతిహింసలఁ బెట్టుచుండు
శత్రుతతుల సంహరించి శాంతికూర్చు ప్రహిత నీవు!
ఉపర్యధస్స్థలములందు నుండు దుష్టశక్తితతుల
నశనిపాత శక్తులతో హరియించుమ! మహాదేవి! ॥ 4423

†(15) శివసహిత పంథాలఁ జెన్నొందు మమ్ములన్
బరము నొందించుతన్! నిరత భాగ్యముగాఁగ
ఆ పరరాత్రిల నఖిల కర్మల దేవి!
ధర్మకర్మానుకృతిని దనరఁ బొందించుతన్! ॥ 4424

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(16) ఏది పొందు మము ద్విపదుల నేది పొందుఁ జతుష్పదుల
నష్టాపదియైన గృహము నఖిల మొందు నా కర్తను
నిరస్తగతులమైని నిఖిలమైన శుభాఽఽపవళులు
క్రమముగాఁగ మముఁ జెందుతఁ గ్రాలు సకలదేవి దీప్తి ॥ 4425

†(17) మరణగతినుండి మము మరణరాహిత్యమ్మునుండి
అమృతిగతినుండియు నా మృత్యుగతినుండిః
విద్యుచ్ఛక్తినుండి వృక్షమ్ము నామూలముగఁ
గాపాడెడి రీతి దేవిః కాపాడుముః మము సదాః ॥ 4426

†(18) ఇహపరగతులమై నెసఁగు జీవపరమాత్మలను
మమ్ముఁ గాపాడుతను మరణగతులనుండి
శ్రవణశక్తి పిష్ట మౌచుఁ జెలఁగి సూక్ష్మమౌ రీతిగ
స్వకీయమైన మృత్యుతతుల శక్తులనుండి కాపాడుముః ॥ 4427

†(19) సాపత్న్యమ్మై వరలెడి శపథమ్మునుండి మమ్ము
నిశిమృత్యువునుండి మమ్ము వశగతిఁ గాపాడుఁగాకః
సృష్టిఁ జేయు బ్రాహ్మ్యశక్తి మృత్యువు గని క్రుద్ధమౌ గతిఁ
దద్దేవీశక్తు లెల్లఁ దనరు మృత్యు శత్రువులై ॥ 4428

†(20) బంధుసహితముగా బంధురహితముగా
మమ్ములను హింసించు మరణశక్తుల శిరము
ముక్కలన్ జేయుమాః మూర్తి సంక్షేమ పదము
దేవిః అధివసించుచున్ దివ్యశక్తులు మీఱ ॥ 4429

†(21) గృహము చొచ్చు వృకముఁ బట్టి క్రూరముగాఁ జంపు రీతి
శత్రు క్రూరకృత్యాలను సమయింపఁగఁ జేయంగా
సంక్షేమపు రాజ్యపథాన శపథరథమ్మున వరలుచు
సహస్రాక్షుఁ గింపించును సర్వశక్తి మహాదేవిః ॥ 4430

†రచయితః—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల" మంత్రానువాదము.

†(22) సకలవ్యాప్తమైన మాదు సదమల విజ్ఞత యెల్లను
సంహరించుఁగాక! మహాజగతి నజ్ఞానము
అగ్ని హ్రదము దహించునట్లు అశనిపాతము తరువు నెల్లఁ
గాల్చు రీతి శత్రు తతులఁ గాల్చివేయు! దివ్యదేవి! ॥ 4431

†(23) సుహృత్కృత్యములనుగాని అసుహృత్కృత్యములనుగాని
ప్రతిజ్ఞమెయిని నా శత్రులఁ బారఁద్రోలుమా! ప్రాజ్ఞత
జాత మౌచు వెలుఁగు బహుళ సమిధాగ్నిజిహ్వ లెల్ల
దహియించుతఁ బ్రకృతి దుష్టతతుల మహాదేవీకృప ॥ 4432

†(24) అసపత్నము ప్రాగ్దిశమై నలరు మాకు నమృతగతుల
శివశక్తులు దక్షిణదిశఁ జెల్వొందునుగాక! సతము
పడమరదిశలో నెపుడున్ వరలును నభయత మహిమన్
గృహములోన భద్రత తగు నుత్తరదిశలోన మాకు ॥ 4433

†(25) పరాశక్తి కృత్యమ్ముల వసింపదు తిష్ఠన్గతి
విద్ధగతుల రీతిఁ బదము వెలుఁగఁ బొందించు పగిది
మృగారి మృగముఁ ద్రుంచురీతి రిపుసంఘము లన్నింటిని
విధ్వస్త మ్మొనరించును విమలమహాదేవి సతము ॥ 4434

†(26) రక్తదీప్తకలిత మైన రాత్రిముఖము వోలె వరలు
ఘోరరూపి! అవినాశిని! క్రాలెడు నో విషరూపీ!
అద్భుతములఁ దెచ్చి నీవు అమలగతుల జృంభితవై
ప్రతిగ్రహించుమా! సృష్టిని! పరమశక్తు లన్నింటిని ॥ 4435

†(27) నీ వైంద్రిమ్మో దేవీ! నీవె యమము! వరుణ వీవె!
అబ్ రథమ్ము ననలరథము ననిలరథము నీ వౌదువు!
నీవే బ్రహ్మవు! రుద్రుఁడ వీవే అగుదువు! త్వష్టవు!
బ్రజాపతివి నీ వౌదువు! వరలు వైష్ణవీయమాయ ॥ 4436

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(28) భావివర్తమానగతుల వరల నాగత కాలమ్ముల
నిత్యమ్మును వర్తిల్లెడి నిరత కాలరూపమ్ముల
ఋతువులు పరివత్సరాలు ఋతగతులను వర్తిల్లఁగ
నహోరాత్రు లబ్ధమ్ములు నగు దిశలు ప్రతిదిశలు మాకు ॥ 4437

†(29) యమశక్తిని వరుణశక్తి నప్ఛక్తిని సోమశక్తి
నగ్నిశక్తి సలిలశక్తి నఖిలమైన పశుతతులను
ఈ ప్రదేశమ్మునకు నీవే ఆహ్వానించుచుఁ
బుట్టింతురు అద్భుతమ్మ పూర్ణశక్తి మీఱంగా ॥ 4438

†(30) దారు గర్భ దమమ్మందుఁ దనరంగా శయనించిన
ధీనహితుండౌ పూరుషు దీక్ష మెయిని గాపాడుము!
గ్రీవబద్ధమై యమ నరకానఁ గెరలుచుండు నా పురుషుని
హతునిగ నొనరింపు! దేవి! అసాధారణంపు శక్తి ॥ 4439

†(31) అవ్యక్తమౌ దీప్తి నద్భుతాలంకృతుల నలరు నో దేవి!
మా సర్వదురితాల మసిమసిగఁ జేయుమా!
పాప కర్మలు చేయు పాపచేతస నరులఁ
గ్రూరకృత్యమ్ములను రూక్షాగ్నులను గాల్చు! ॥ 4440

†(32) సత్కర్మలు చేయు నరుని సచ్ఛక్తులఁ గాపాడుచు
దుష్కరుఁడౌ రాక్షసునిన్ దున్మాడెడి రీతిగానె
ఇహపరశక్తుల నెల్లను నెనఁగెడి లౌకికాऽలౌకికగతి
జంగమముల సకలమ్మును సమయించుమ! కాపాడుమ! ॥ 4441

†(33) నీ కంఠము పాదమ్ముల నిరతము పూజించుచు
నజ్ఞాతమ్మై వరలెడి ఆనంతరూప పరాదేవి!
స్వేచ్ఛాశక్తులు మీరఁగ సిద్ధసంకల్ప గతుల
లెమ్ము! ప్రకృతిఁ బురుషశక్తి సృష్టి నెల్లఁ గాపాడుమ! ॥ 4442

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(34) కలవు స్వాయనశక్తులుః కలవు అనయశక్తితతులు
అనులోమపు గతులు మీఱ నలరు సృష్టి స్థితి లయాలు
మా జీవాళుల నన్నిటి మాయించెడి హరియించెడి
అరుల ఉగ్రకృత్య తతుల అపగత మ్మొనరింపుముః ॥ 4443

†(35) ఉపర్యధోతలములందు నొనరు ద్విపద ప్రాణశక్తి
కొంతవఱకుఁ జతుష్పదాలఁగూడి వర్తిలు ప్రాణశక్తి
వేశిని ప్రతివేశినులై వెలుఁగు జ్ఞాతిపూర్వానుజుల
అంతర్గతి నలరారుచు నద్వైత మ్మొ గతులను
ద్వైతముగా విడివడుచును వరలఁ బంచభూతతతులు
సృష్టి సర్వ మలరారును జిదానంద సద్గతిగా ॥ 4444

†(36) రూపుమాపు శత్రుత్వము రూక్షగతులు నశియింపఁగ
"సఖి"శక్తుల నన్నింటిని సఖ్యముగ ధ్వంసపరచి
మహితాంతర్గతుల మెయిని మహాతత్త్వ మలరంగా
నిన్ను నిలుపుః విజేతగాఁగ నిరతాక్షయమహాదేవిః ॥ 4445

†(37) మహాదేవిశక్తితతుల మహితమ్ముగ నాశ్రయింపఁ
బాపాకరము లెల్లను భ్రంశ మౌను నాశ మౌను
విద్యుచ్ఛక్త్యగ్నులమై వృక్ష మ్మది దహన మౌచు
ననుశోషించెడి రీతిగ నరులు నఘము నాశ మౌను ॥ 4446

†(38) విద్యుద్ఘాతమ్ముతోడ వృక్ష మ్మది దహన మౌచు
నామూలాగ్రమ్ముగాఁగ ననుశోషమ్మౌ రీతిగ
నాలోపల నిబిడ మౌచుఁ గ్రాలు పాప మణువణువును
నశియించుతః సర్వస్వము నామరూపములు లేకను ॥ 4447

†(39) ప్రతిశుకమ్మె ప్రతిశుకమును బ్రక్షాళన మొనరుచుగతి
నాలోపల నిబిడ మైన మాలిన్యౌఘమ్ము తానె
పాప మ్మది నశియింపఁగఁ బ్రక్షాళన మ్మొనరించును ॥ 4448

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

†(40) అగ్నులు మమ్ముల సృష్టిని నలరించును నే విధిమై
సచ్ఛక్తులు నా విధిమై సకలము చిన్మయము చేయు
బ్రహ్మ మొదలు వర్మవఱకు వరలు సంతరమ్ములతో
ధరియింతురుగాక! సురలు తనర సర్వశక్తితతుల ॥ 4449

†(41) అఖిల లోక గోళతతుల నదిసమూహము లెల్లను
స్థితిశక్తుల స్తోమమ్ములఁ జెల్వొందఁగఁ జేయుఁగాక!
సృష్టి స్థితి వ్యతిరిక్త విశేష దుశ్శక్తితతుల
బ్రహ్మద్వేషుల నెల్లర వధియింపుమ! మహాదేవి! ॥ 4450

† (42) రౌద్రమైన నీ ముఖమ్ము రాజిల్లుతఁ గుబేరా!
ఆనంద మ్మావహిలఁగ నలర నంది శక్తులమై
నా జ్వరగతుల నెల్ల నశియింపఁగఁ జేయుమా!
జ్వరమృత్యు ఘోరమైన భయమును బోఁగొట్టు! దేవి! ॥ 4451

†(43,44) నా ప్రద్వారమ్మునందునుండి నా గృహమ్మునందునుండి
నా నివేశనమ్మునందునుండి నా కేశమ్ముల నఖములనుండి
నా నేత్రాంజనమందునుండి నా దంతధావనమునునుండి
దొలఁగిపొమ్ము! శుభ్ర మగుము! దుష్టత్వ మెల్లఁ బోవఁ
దండ్రి గృహమ్మందునుండి తరలిపోవు కుతనయగాఁ
నీ కశ్మలముల మూర్ధమ్మెంతేని నశింపంగ
వీటి వంశపదమ్ము నెల్ల విధ్వస్తమ్మొనరింపుమ! ॥ 4452

†(45) దుశ్చరితల కుసంవదల దుష్టత్వమ్మును ననలము
రూపుమాపు రీతిగా నన్నృతముల నాడు జనుల
పాపమ్ములు బోవుఁగాక! వపువులందు వెలుఁగొందెడి
జాతవేదాఽర్చస్సులు మా సకలాఘతరుతతులను
శుష్కమ్ముగఁ జేసి సర్వ శుచిగాఁగ దహించుఁగాక! ॥ 4453

†(46,47, 48) కృష్ణవర్ణ! మహదూప్రా! బృహత్కర్ణీ! మహాభయా!
దేవిదేవి! మహాదేవీ! తెగటార్చుము! నా శత్రుల
విధూమాగ్ని సమప్రభ! విరాజిలెడి మహాకృత్యా!
"ఫట్" "ఫట్"లను శత్రుతతులఁ గాఁలు నీ త్రిశూలానఁ
బొడిచిచంపి శోణితమున్ బూర్ణమ్ముగఁ ద్రావుమా!
దుర్మదాళి అశ్మనాశకర్మల నొనరించి ఋజాగ్ని
తంతువులను బంధించుచుఁ దనువులు శోషిల్లంగా
వైవస్వత సదనమునకుఁ బంపించుమ! దుష్కర్మల ॥ 4454

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
†"ఖిల"మంత్రానువాదము.

## అనువాకః—11; సూక్తమ్—131†

ఋషిః—ప్రజాపతిః పరమేష్ఠీ

దేవతా—భావవృత్తమ్

ఛందః—త్రిష్టుప్

(1) నాసదాసీన్నో సదాసీత్ తదానీం నాసీద్రజో నో వ్యోమా పరో యత్ ।

కిమావరీవః కుహ కస్య శర్మన్నమ్భః కిమాసీద్గహనం గభీరమ్ ॥ 1526

(2) న మృత్యురాసీదమృతం న తర్హి న రాత్ర్యా [1]అహ్న ఆసీత్ ప్రకేతః ।

ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కిం చనాస ॥ 1527

(3) తమ[2] ఆసీత్ తమసా [3]గూళ్హమగ్రే ఉప్రకేతం సలిలం సర్వమా[4] ఇదమ్ ।

తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్ తపసస్తన్మహినాజాయతైకమ్ ॥ 1528

(4) కామస్తదగ్రే[5] సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్ ।

సతో బన్ధుమసతి నిరవిన్దన్ హృది ప్రతీష్యా కవయో మనీషా ॥ 1529

(5) తిరశ్చీనో వితతో రశ్మిరేషామధః స్విదాసీ3దుపరి స్విదాసీ3త్ ।

రేతోధా[6] ఆసన్ మహిమాన ఆసన్ త్స్వధా అవస్తాత్ ప్రయతిః పరస్తాత్ ॥ 1530

---

†ఇది "నాసదీయ"సూక్తము. ముద్రిత ఋగ్వేద ప్రతులలోను శ్రీనేమానివారి "శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" వ్రాతప్రతి 14వ సంపుటములోను (157వపుట.) నీ సూక్తము 129వ సూక్తముగాఁ గలదు. 128వ సూక్తము తరువాత ప్రాచీన తాళపత్ర గ్రంథములనుండి సేకరించిన రెండు "ఖిల"సూక్తము లధికముగా నీగ్రంథమునఁ జేర్చినందువల్ల నీ "నాసదీయ" సూక్త సంఖ్య 131గా మారినది. వ.గో.కృ.

1. రాత్ర్యాఽఅహ్నఽఆసీత్, 2. తమఽఆసీత్, 3. గూళహమగ్రే, 4. సర్వమాఽఇదమ్,

5. కామస్త దగ్నే, 6. ధాఽఆసన్మహిమానఽఆసన్త్స్వధాఽఅవస్తాత్. (వ్రా.ప్ర.)

(6) కో [1]అద్ధా వేద క ఇహ ప్ర వోచత్ కుత [2]ఆజాతా కుత ఇయం విసృష్టిః ।
అర్వాగ్దేవా[3] అస్య విసర్జనేనాఽథా కో వేద యత[4] ఆబభూవ ॥ 1531

(7) ఇయం విసృష్టిర్యత[5] ఆబభూవ యది వా దధే యది వా న ।
యో[6] అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో[7] అంగ వేద యది వా న వేద ॥ 1532

## అనువాకము—11 ; సూక్తము—131‡

ఋషి—పరమేష్ఠి యగు ప్రజాపతి†

దేవత—పరమాత్మ లేక భావవృత్తము లేక సృష్టి†

(1)*గద్యము ॥

ప్రళయదశయందు జగత్తునకేది కారణమో: యది యసత్తు కాదు. ఆత్మ వలె సత్త్వముచే నిర్వాచ్యము కాదు. పృథివ్యంతములు గల పాతాళాదులు వ్యోమమునకుఁ బదిదేశమున నున్న ద్యులోకప్రభృతి సత్యలోకాంతములు లేకుండెను. ఆ నరకముకూడ లేకుండెను. భోగ్యప్రపంచము వలె భోక్తృ ప్రపంచముకూడ లేకుండెను. దుష్ప్రవేశము[8] సత్యగాథము నగు నంపస్సునయితము లేదు॥ 4455

1. కోఽఅద్ధవేదకఽఇహ, 2. కుతఽఆజాతా కుతఽఇయం, 3. దేవాఽఅస్య, 4. యతఽఆ,
5. విసృష్టిర్యతఽఆ, 6. యోఽఅస్యా, 7. త్సోఽఅంగ. (వ్రా.ప్ర.)

‡ఈ సూక్తమును నాసదీయ సూక్తమనెదరు. దీనికిఁ బరమాత్మ దేవత. ఋషి ప్రజాపతి. అతిప్రాచీనకాలమునుండి యీ దేశమున జ్ఞానము ప్రాదుర్భవించి యిప్పటికిఁ గ్రమక్రమముగ నుపనిషత్తులలోని విచారముల మూలమున వృద్ధి చెందె నను మాట అందరకుఁ దెలియును. బ్రహ్మవిద్యకు మూలభూతము లగు వానిలో నీ సూక్త మతిప్రధానమైనది. సృష్టికి నగమ్య మగు మూలతత్త్వ మేది? దానియందుండి యీ వివిధ మగు దృశ్యసృష్టి యెట్లు కలిఁగి యుండును?అను విషయము నిరూపింపఁబడినట్లు ఏ మూలగ్రంథమందునను నిరూపింపఁబడలేదు.ఇంత యధ్యాత్మ విచారముతో నిండియున్నదియు నతిప్రాచీనమైనదియు గ్రంథ మెచ్చటను లేదు. కావున ననేకు లగు పాశ్చాత్యులు నయితము ధార్మిక మగు నితిహాసదృష్టితోఁ గూడ తమతమ భాషలలోనికి భాషాంతరీకరించుకొనియున్నారు. ఇది తైత్తిరీయబ్రాహ్మణమునందు (2-8-9) చెప్పఁబడినది. మహాభాగవతమునందు భాగవత ధర్మములందును జెప్పఁబడినది. (నే.వేం.న.శా.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 157వ పుటలో నీ సూక్తమునకు ఋషి "ప్రజాపతి"గాను, దేవత "పరమాత్మ"గాను వ్రాసి, 156 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "ప్రజాపతి, పరమేష్ఠి" ఋషిగాను, "సృష్టి"దేవతగాను శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

8. దుఃప్రవేశము. (వ్రా.ప్ర.పా.)

(2)*గద్యము ॥
ఆ ప్రతిహార సమయమందు మృత్యువు లేదు. అమరణము లేదు. దివా రాత్రముల ప్రజ్ఞానము లేదు.సూర్యచంద్రులు లేకుండిరి. కాన( చదాత్మకము లగు మాసర్తు సంవత్సర ప్రభృతులు లేవు. సకల వేదాంతప్రసిద్ధ మగు బ్రహ్మత్వ ముండెను. అది యప్రాణము. అమనస్కము. శుద్ధము. మాయచే నా బ్రహ్మ యవిభాగాపన్న మయ్యెను.పూర్వోక్త మగు మాయాసహిత బ్రహ్మమునుండి భూతభౌతికాత్మక మగు జగత్తు కలుగకుండెను.సృష్టికి ఊర్ధ్వమందు వర్తమాన మగు జగత్తు అపుడు లేదు ॥ 4456

(3)*గద్యము ॥
సృష్టికి( బూర్వమందు (ప్రళయదశయందు) భూతభౌతిక మగు సర్వజగత్తు మాయాపరసంజ్ఞగల భావరూపాఽజ్ఞాన మనెడు తమస్సుచే నాచ్ఛాదిత మైనది.నామరూపములచే నా తమస్సుయొక్క ఆవిర్భవన మేది గలదో? యదియే జగజ్జన్మము.అది యప్రజ్ఞాయమానమైనది.[1] ఈ దృశ్యమాన మగు సర్వజగత్తు కారణముతో సంగత మైనది. (అనగా అవిభాగాపన్నము) అది సదసద్విలక్షణ మగు తుచ్ఛ కల్పనచే నాచ్ఛాదిత మయ్యెను.అది యేకమై కారణ మగు తమస్సుచే సవిభాగతను బొందినను దత్కార్యజాతమగు తమోమాహాత్మ్యమువలన( బుట్టెను ॥ 4457

(జగత్తుయొక్క పునరుత్పత్తికి( గారణమును జెప్పుచున్నా(డు.)

(4)*గద్యము ॥
ఈ వికారసృష్టికి( బ్రాగవస్థయందు( బరమేశ్వరుని మనస్సునందు సిసృక్ష కలి(గెను.అంతఃకరణ సంబంధ మగు వాసనా జలముచే మాయయందు విలీన మగు నంతఃకరణమందు సమవేత మగు రేతస్సు భావిప్రపంచమునకు బీజభూత మైనది.అతీతకల్పమందు( బ్రాణికృతపుణ్యాత్మకకర్మ యే కారణమువల్ల సృష్టిసమయమందుండెనో? ఆ కారణమువల్ల( బరమేశ్వరుని మనస్సులో సిసృక్ష కలి(గెను.పిమ్మట సత్వముచే నిపు డనుభూయమాన మగు సర్వజగత్తునకు హేతుభూత మగు కర్మసమూహమును యోగులు చిత్తమందు నిరుద్ధమగు బుద్ధిచే విచారించి తెలిసికొనిరి ॥ 4458

(5)*గద్యము ॥
సూర్యరశ్మి యుదయానంతరము నిమేషమాత్రమున నొక్కమారు జగత్తంతట వ్యాపించు నట్లు కార్యవర్గము మొదట( దిర్యగవస్థిత మై మధ్యమం దయ్యెనా? అధస్స్థలమం దయ్యెనా? ఊర్ధ్వమం దయ్యెనా? ఈ సృష్టికార్యముల మధ్య( గొన్నిభావములు బీజభూతకర్మకు( గర్మలు భోక్తలు నగు జీవము లయ్యెను.ఇట్లు మాయాసహితు(డగు పరమేశ్వరు(డు సర్వజగత్తు సృజించి స్వయముగ నందు( బ్రవేశించి భోక్తృభోగ్యాదిరూపములచే విభాగమును జేసెను. భోక్తృభోగ్యమధ్యమందు భోగ్యప్రపంచము నికృష్ట మయ్యెను. భోక్త యుత్కృష్టు( డయ్యెను ॥ 4459

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. శ్లో॥ ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్ ।
అప్రతర్క్య మనిర్దేశం ప్రసుప్త మివ సర్వతః ॥ (మనువు)

(6)*గద్యము ॥
ఏ పురుషుఁడు పరమార్థముగాఁ దెలిసికొనఁగలఁడు? ఏ పురుషుఁ డీ లోకమునందుఁ జెప్పఁగలఁడు? భూతభౌతిక భోక్తృభోగ్యాదిరూపముచే బహుప్రకారయగు సృష్టి యే యుపాదానకారణమునుండి యే నిమిత్తకారణమునుండి ప్రాదుర్భవించెనో? ఆ రెండింటిని బాగుగఁ జెప్పుటకు నెవఁడు శక్తుఁ డగును? దేవతలుకూడ భూతసృష్టికిఁ దర్వాతనే పుట్టిరిగదా! అట్టివారు దాని నెట్టు లెరుంగఁగల్గుదురు? దేవతలే యెరుంగనియప్పుడు తద్వ్యతిరిక్తుఁ డగు నెవఁడు జగదుత్పత్తికారణమును దెలిసికొనఁగలఁడు? ॥ 4460

(7)*గద్యము ॥
ఉపాదానకారణ మగు నే పరమాత్మ వలన గిరి నదీ సముద్రాదిరూపములచే విచిత్రమైన యీ సృష్టి పుట్టునో! యా పరమాత్మ మే దానిని ధరించును. అన్యులు ధరింపలేరు. భూత భౌతికాత్మక మగు జగత్తున కెవఁ డీశ్వరుఁడో! యెవఁడు సత్యభూత మగు స్వప్రకాశమందుఁ బ్రతిష్ఠితుఁ డయ్యెనో! యట్టి ప్రసిద్ధుఁడు సృష్టిని దెలిసికొనును. సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడే గుర్తెరుంగుచున్నాఁడు! ॥ 4461

## సూక్తము—131

ఋషి—పరమేష్ఠి యగు ప్రజాపతి

దేవత—పరమాత్మ లేక భావవృత్తము లేక సృష్టి

### అర్థాంతరము—1

†(1) వ్యష్టి సమిష్టి రూపమైన సృష్టి జరుగుటకుఁ బూర్వము
లేదు పృథ్వి జలము లేదు లే వనలాఽనిలమ్ములు
లేదు గగనతల మ్మెల్ల లేవు రజస్తమోగుణాలు
సదసత్తులు లేవు జగద్వ్యక్తాఽవ్యక్త స్థితులు లేవు
ఇహము లేదు పరము లేదు ఏ లోకలోకాంతరమును లేదు
సృష్టి స్థితిలయగతు లవి చెలఁగు నావృత్త మౌచు
నే శక్తిని వర్తిల్లును? ఏ శక్తిని సృష్టి జరుగు?
సుఖము కష్ట మెట్లు కలుగు? శోకానందము లెట్లు కలుగు?
కుహనమైన యీ సృష్టిని గూఢశక్తు లెట్లు నిలుచు?
నవినాభావమ్ములైన అనుబంధపు బంధాలను
నంతర్గత రూపాలను నతిలోకపు వర్తనలను
నాకాశము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
మృత్తు నలరు నద్భుతముగ మిశ్రిత మై ఆశ్రిత మై
గహన మౌచు గభీర మౌచుఁ గ్రాలు సృష్టికారణమ్ము ॥ 4462

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) మృత్యువు లే దమృతము లేదు వేల లెనయు కాలమ్ము లేదు
రాత్రి లేదు పగలు లేదు రవిచంద్రులు గ్రహబుఌషా
లెనయ లేవు వెలుఁగు చీక ట్లెవియు లేవు విశ్వసృష్టి
సర్వమ్మున స్ఫూర్తి మీఱ సకలాంతర్యామిగాఁగ
విశ్వరూప మై వరలెడి విశ్వేశ్వర రూపశక్తి
భిన్న మైన దెదియు లేదు వెలుఁగు సహసశక్తి లేదు
ఏ రూపముగా నైనను నే మాత్రము దాని మించు
శక్తి వేరె యెదియు లేదు సర్వసృష్టిలోనఁ జూడ
సృష్టి మూల కారణ మై చెల్వొందెడు నా శక్త్యవస్థ
అలరారును నద్భుత మై అసాధారణంపు గతుల ॥ 4463

†(3) తమమువల్లఁ దమవ్యాప్తు లమితముగాఁ దనరు సృష్టి
విశ్వాఽఽవిర్భావమునకు వెలయు తొలి రూపుగాఁగ
సలిలరూప మౌచు సృష్టి సర్వస్వము వరలుచుండు
నాకాశము లనిలమ్ము లు ననలమ్ములు మృత్తతులును
నంతర్గతి నలరంగా నలలలోన సలిలమ్ముల
నఖిల లోక గోళ సృష్టి ఆవిష్కృత మౌను గ్రమత
జలము కృశత్వమ్ము నొంద సకల భూతాంతర్గతి
వ్యాపకరూపానఁ బ్రకృతి వ్యాప్తిత్వము నొంది సృష్టి
అద్వితీయ మై వరలెడి ఆ పర మేశ్వర తపశ్శక్తి
కారణముగఁ బ్రకటిత మౌ కార్యరూపోత్పన్నత ॥ 4464

†(4) విశ్వరూప మౌచు సృష్టి వివిధ కామ రూపములను
మృత్యుతత్త్వ మొప్పారఁగ సత్యమైన దేవదేవు
మనశ్శక్తి రేతస్సై మహిమాన్విత శక్తిగాఁగఁ
దొట్టదొలుత సృష్టి సర్వ ముద్భూత మ్మై నిలుచును
గ్రాంతదర్శిత్వ మలరి కాంలు విశ్వసృష్టిలోనఁ
గారణతత్త్వానఁ బ్రకృతి గభీర మైన కేంద్రమ్మున
వరలెడి ఆ భగవంతుని పరాజ్ఞాన తత్త్వమ్మునఁ
బ్రేరిత మై వ్యక్తాఽవ్యక్త మౌ విపుల బంధములఁ దనరుచుఁ
గార్య కారణములఁ బ్రకృతి గ్రాలుచుండు నిత్యమ్మును
నవ్యక్త మ్మై తనరెడి అపురూపపుఁ గారణగతి ॥ 4465

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) ఉపర్యధోగతులతోడ నుజ్జ్వలముగ నఖిలదిశల
సత్యగతుల నిత్యరతుల జ్వలియించెడి కాంతిశక్తి
విశ్వ సృష్టి సర్వమ్మును వెలుఁగు నుద్భూత మౌచు
స్థితిగతులను వర్ధిల్లును జీవదీప్తశక్తు లలర
సకలకర్మ ధారక మై ప్రకటిత మౌ బద్ధజీవ
గతులు మీఱ ముక్తజీవ రతులు తనర దృశ్యగతుల
నధోగతులఁ బ్రకృతి తనర నలరు నుపరిగతులు మీఱఁ
బరమేశుని ప్రయత్నమ్ము ప్రవర్తిత మై నిలుచును ॥ 4466

†(6) సృష్టిచేయు దేవదేవుఁ డెరుఁగు నెల్ల రహస్యములు
సృష్టిచిత్త మౌచు నిలిచి చెలఁగు నా పరమేశుఁడు
విశేషమైన వివిధరూపు లశేషముగ వర్తిల్లెడి
సృష్టి యెట్లు రూపొందెను? స్థితిరతు లెట్లలరారెను?
ద్వైవీయమ్మౌ శక్తులఁ దనరు నెట్లు వివిధగతులఁ?
ద్వ్యక్త మౌచు విశ్వసృష్టి ముక్త మౌచు నెట్లు వరలు?
సృష్టి స్థితి లయ క్రియల ఋతవిజ్ఞాన మ్మెరికతనఁ
దనరారును? ఆ దేవుని తత్త్వశక్తి సృష్టిమూలకమౌ ॥ 4467

†(7) ఈ విశేషమైన సృష్టి యే విధి మై నవతరించు
నీ సృష్టిని నే శక్తి యొనఁగ ధారణ మ్మొనర్చు
నే విధి మై నీ విశ్వ మెల్ల వరలు సృష్టిలోన
నకారణముగ నదారణతను నఖిలాధ్యక్షుం డౌచును
నలరు నా పరమేశుని ఆకాశాఒంగపు శక్తుల
ననిలగతుల ననలగతుల నలరారెడి సలిలగతుల
మృద్గతులను విజ్ఞానము మూర్తమ్మౌ శక్తి నెల్ల
నెరుఁగు నా విశ్వేశుఁడే సృష్టి స్థితి లయగతులను
నిర్వర్తింపఁగఁజేయఁగఁ బరఁగును సర్వాధిపత్య
మహారూప శక్తి సృష్టి మహిమాన్విత మై వరలఁగ ॥ 4468

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—131

ఋషి—పరమేష్ఠి యగు ప్రజాపతి

దేవత—పరమాత్మ లేక భావవృత్తము లేక సృష్టి

### అర్థాంతరము—2

†(1) వ్యష్టిసమిష్టిగతు లొప్పెడి సృష్టిరూపు దిద్దుకొనెడి
కాలమునకుఁ బూర్వమ్మునఁ గ్రాలెను సత్పదార్థమ్ము
అసత్పదార్థ మసలె లేక ఆవరించె నా తదుపరి
ఆకసమ్ము ననిలమ్మును ననల సలిల రూపమ్ముల
మృదూప్రవమ్ములతోడను మిశిత మ్మై సర్వమ్మున
నత్యంతము గహనమ్మై అపురూపపు గంభీరత
నీ సృష్టి విరాజిలెను నే పరాత్పర శక్తి మెయిని
ఆ శక్తియె సృష్ట్యాదిగ నలరు సత్పదార్థమూల మ్మై ॥ 4469

†(2) అమృతత్వమునకు నమరదు మృత్యువు
ప్రకృతికిఁ గాలము రాత్రిందివళ్ళు లేవు
సమయ వ్యవహారము సకలరూప మై సర్వాన
జ్ఞాపకచిహ్నా మై జగతి జ్ఞానరూప మ్మౌచు
వ్యవహారితము కా దస్థిరమౌ సృష్టిని
బ్రకృతియుక్త మై తనరెడి వికృతిరహిత రూపమ్మున
నేకైకబ్రహ్మ మ్మది యెనఁగును గంపమాన
రాహిత్యమ్మున స్ఫూర్తితోడ రాజిల్లును నిత్యమ్మును
స్వధలో నేకైక మ్మై సదా పరశక్తిగాఁగ
వర్ధిల్లెడి దివ్యశక్తి వర్తమానగతుల సృష్టి
వర్తిల్లఁగఁజేయు జగతిఁ గర్తగాఁగ భిన్నగతుల
సమానతాధిక్యతలను సరితూఁగఁగఁబోదెదియును ॥ 4470

†(3) తమ మాయెను సర్వసృష్టి తనరారెను దమములోనె
సకలాంతరిక్షమ్మును సర్వప్రకృతిరూపము
అనిలానల సలిలమ్ముల నలరు పృథ్వితతులతోడ
నఖిలసృష్టి వర్తిల్లుచు నమరు భూతభావిగతుల
వర్తమాన స్థితి రతులను బ్రవర్తిల్ల సకలమ్మును
బ్రకృతియే మాత యౌచు వర్తిల్లును సృష్టిగతులఁ

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

దవశ్శక్తి మహితమ్మై తనరారఁగ నిత్యమ్మును
నేకమై విశ్వప్రకృతి ఆకృతి మై నవతరించె
వ్యాపకప్రదానమైన ప్రకృతితత్త్వ కారణాల
వ్యాప్తిత్త్వము వరలుచుండుఁ బరమేశ్వర నిమిత్తతలఁ
గార్యరూప ప్రకటితమై కాృలు నద్వితీయమ్ముగ
నా దివ్య దేవుశక్తి అపురూపమ్మై వరలును ॥† 4471

†(4) కామరూప మలరారఁగఁ గాృలు సృష్టిసర్వస్వము
అధిమానస శక్తితోడ నతిలోక సమవర్తమౌను
దొలి రేతస్సుల సృష్టిని నలివిమాలినట్టి శక్తి
దైవీయమ్మౌ శక్తులు తనరారఁగ సచ్ఛక్తుల
ఆసద్గతులు లౌకికమౌ నఖిలమ్మున వర్తిలును
గాృంతదర్శనముల వరలు కారణతత్త్వాల ప్రకృతి
కేంద్ర విద్యమానమైన యింద్రరూప వైష్ణవీయ
భగవత్సజ్జ్ఞానశక్తి వర్తిల్లఁగఁ బ్రేరితమై
వ్యక్తబంధనాలఁ దనరు అఖిలకార్యప్రపంచమ్ము
కార్యకారణానుగతులఁ గాృలు నవ్యక్తకారణానఁ
బ్రాప్తరూపమై విశ్వము వరలు మహితమై నిత్యము
విశ్వమ్మున విచిత్రింపు విశ్వరూపగతులు తోప ॥ 4472

†(5) సృష్టిరశ్మి శక్తులలోఁ జెలఁగుఁ బ్రకృతి సర్వస్వము
చైతన్యపుఁ బ్రాణగతుల శక్తితత్త్వ మొప్పారఁగఁ
జరరూపమ్మౌ ప్రకృతి సర్వకాల గతులమెయిని
గార్యకర్మ లలరారఁగఁ గామ్యకర్మలను బొందఁగఁ
గర్మధారణముల సృష్టి కర్మఫలము లందుచుండి
బద్ధ జీవగతులమెయిని వరలుచుండుఁ బ్రకృతి యెల్లఁ
బ్రకృతివర మ్మొచు నిల్చి ప్రకృత్యతీతమ్ముగాఁగ
నతిలోకపు శక్తులతో నసాధారణంపుగతుల
వర్తిల్లును బరమేశుని వర్తమాన నిత్యశక్తి
మహిమాన్వితగతులమెయిని మలఁగ విశ్వసృష్టి యెల్ల ॥ 4473

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) బ్రహ్మ యౌను నీ సృష్టియె పంచభూతములును నౌను
రవిచంద్రులు గ్రహ ఋక్షా లవకాశము నొందు- నలరు
నఖిల లోక గోళా లవి అంతరిక్షమ్ముతోడ
ననంతగతుల బ్రహ్మ మౌచు నాత్మ యౌను జ్ఞాన మౌను
నా విష్ణువె నలువగాఁగ నలరుఁ గాలరూప మ్మై
నవ్యయ గతు లొప్పారఁగ నతిశక్తత తనరంగా
యమనియమపుఁ గాలగతుల నమరఁ గ్రమశిక్షణలను
జలనగతుల సంచరించి సదా వర్తిల్లు సృష్టి ॥ 4474

†(7) ధరణధారణంపు గతుల నధారణంపు రతుల
సృష్టివిశ్వ సర్వస్వము చెలువొందఁగఁ జలనగతులఁ
గాలగతుల సృష్టిస్థితి వేల లెనయ లయగతులను
నాకాశమె అంగముగా నలరారఁగ విశ్వ మ్మది
విజ్ఞానపు రూప మ్మై వెలుఁగు దైవ విజ్ఞతగతి
నధ్యక్షుండై సృష్టిని నలరఁగఁ బూర్ణమ్ముగాఁగ
నెలుఁగు నా దేవ దేవుఁ డఖిలాంతర్యామిగాఁగ
నన్యుఁ డెఱుఁగలేఁడు సృష్టి నా పూర్ణమ్ముగఁ బ్రకృతిని ॥ 4475

## సూక్తమ్—132

ఋషిః—యజ్ఞః ప్రాజాపత్యః
దేవతా—భావవృత్తమ్
ఛందః—త్రిష్టుప్; 1-జగతీ

(1) యో యజ్ఞో విశ్వత స్తన్తుభి స్తత[1] ఏకశతం దేవకర్మేభిరాయతః ।
ఇమే వయన్తి పితరో య[2] ఆయయుః ప్ర వయాప వయేత్యాసతే తతే ॥ 1538

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. స్తతఒఏక, 2. యఒఆయయుః. (ప్రా.ప్ర.)

(౨) పుమాగ్ం[1] ఏనం తనుత ఉత్ కృణత్తి పుమాన్ వి తత్నే [2]అధి నాకే అస్మిన్ ।
ఇమే మయూఖా[3] ఉప సేదురూ సదః సామాని చక్రుస్తసరాణ్యోతవే ॥ 1534

(౩) కాసీత్ ప్రమా ప్రతిమా కిం నిదానమాజ్యం కిమాసీత్ పరిధిః క[4] ఆసీత్ ।
ఛన్దః కిమాసీత్ [5]ప్రఉగం కిముక్థం యద్దేవా దేవమయజన్త విశ్వే ॥ 1535

(౪) అగ్నేర్గాయత్ర్యభవత్ సయుగ్వోష్ణిహయా సవితా సం బభూవ ।
అనుష్టుభా సోమ[6] ఉక్థైర్మహస్వాన్ బృహస్పతేర్బృహతీ వాచమావత్ ॥ 1536

(౫) విరాణ్మిత్రావరుణయోరభిశ్రీరిన్ద్రస్య త్రిష్టుబిహ భాగో[7] అహ్నః ।
విశ్వాన్ దేవాంజగత్యా వివేశ తేన చాక్లృప్ర[8] ఋషయో మనుష్యాః ॥ 1537

(౬) చాక్లృప్రే తేన[9] ఋషయో మనుష్యా యజ్ఞే జాతే పితరో నః పురాణే ।
పశ్యన్ మన్యే మనసా చక్షసా తాన్ య[10] ఇమం యజ్ఞమయజన్త పూర్వే ॥ 1538

(7) సహస్తోమాః సహఛన్దస[11] ఆవృతః సహప్రమా[12] ఋషయః సప్త దైవ్యాః ।
పూర్వేషాం పన్థామనుదృశ్య ధీరా[13] అన్వాలేభిరే రథ్యో౩ న రశ్మీన్ ॥ 1539

---

1. పుమాగ్ంఽఏనంతనుతఽఉత్, 2. తత్నేఽఅధినాకే, 3. మయుఖాఽఉప, 4. కఽఆసీత్, 5. ప్రఽఉగం, 6. సోమఽఉక్థై, 7. భాగోఽఅహ్నః, 8. క్లృప్రఽఋషయో, 9. తేనఽఋషయో, 10. యఽఇమం, 11. ఛన్దసఽఆవృతః, 12. మాఽఋషయః, 13. ధీరాఽఅన్వా. (వ్రా.ప్ర.)

## సూక్తము—132

ఋషి—ప్రజాపతి పుత్రుఁడు యజ్ఞాఖ్యుఁడు†
దేవత—ప్రజాపతి-సృష్టి†

(1)•గద్యము ॥
వియదాదిభూతములచే సర్గాత్మక మగు నే యజ్ఞము సర్వతోవ్యాప్త మైనదో! యది బ్రహ్మయొక్క-శతవత్సరపర్యంతము[1] దీర్ఘభూత మైనది.(అంతకాలముండునది) పాలకులు ప్రజాపతికిఁ బ్రాణభూతులు నగు నే దేవతల సృష్టవ్య మగు జగత్తును స్వ యవనముచే వ్యాపించిరో! యా దేవతలు విస్తృత మగు సత్యలోకమందుఁ బ్రాణరూపమునఁ బ్రజాపతిని సేవించుచున్నారు ॥ 4476

†వ్రాతప్రతి 14వ సంపుటము 163వ పుటలో నీ సూక్తమునకు ఋషి "యజ్ఞాఖ్యుఁడు"గాను, దేవత "ప్రజాపతి"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "ప్రజాపతి, పరమేష్ఠి" గాను, దేవత "సృష్టి" గాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

•రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. బ్రహ్మయొక్క- శతసంవత్సరములు—మొదట బ్రహ్మదినము నిరూపింపవలయును. ప్రపంచ మంతయు బ్రహ్మదినమందుఁ గార్యరూపముగానుండి బ్రహ్మరాత్రియందుఁ గారణరూపమందు విలీన మగుచుండును. అథర్వవేద ప్రమాణము ననుసరించినచో బ్రహ్మదినమునకు 432,00,00,000 సంవత్సరములు కలవు. ఇట్లుండ మనువు

శ్లో॥ దైవికానాం యుగానాంతు సహస్రపరిసంఖ్యయా ।
బ్రాహ్మమేకమహర్జ్ఞేయం తావతీ రాత్రిరేవ హి ॥ (1-72)

కృత త్రేతా ద్వాపర కలియుగములు నాల్గును జేర్చినకాలము చతుర్యుగ మనియు దివ్యయుగ మనియుఁ బిలువంబడుచున్న ది. అట్టి దివ్యయుగము లనం బరఁగు చతుర్యుగములు 1000 కలిసినచో బ్రహ్మదిన మగు నని మనువు నిర్ణయించినాఁడు. చతుర్యుగమునకు 12,000 దివ్యవర్షములు. దివ్యవర్షమునకు 360 లౌకిక సంవత్సరములు.

| | దివ్యవర్షములు | లౌకికవర్షములు |
|---|---|---|
| కృతయుగమునకు | 4800×360 | 17,28,000 |
| త్రేతా ,, | 3600×360 | 12,96,000 |
| ద్వాపర ,, | 2400×360 | 8,64,000 |
| కలి ,, | 1200×360 | 4,32,000 |
| | 12,000 | 43,20,000 |

కావునఁ జతుర్యుగము (దివ్యయుగము) 43,20,000 సంవత్సరము లగుటంజేసి 1000 దివ్యయుగములకు 4,32,00,00,000 సంవత్సరములు చేరి బ్రహ్మదిన మగుచున్న ది. ఇట్టి దినములతోఁ గలిసిన నూరు సంవత్సరములు బ్రహ్మ యొక్క- శతసంవత్సరములు. ఈ కోట్ల లెక్కకు నాంగ్లేయు లత్యాశ్చర్య పడుచుండిరి. అట్లగుటకు వారి 6000 సంవత్సరముల నాఁటి సృష్టియే కారణము.-

కావ్యతీర్థ, నేమాని వేంకటనరసింహశాస్త్రి

(2)*గద్యము ॥
ఆదిపురుషుఁ డగు ప్రజాపతి యా యజ్ఞమును సృజించెను. ఆ పురుషుఁడే సృష్ట మగు నా
యజ్ఞమును ద్వేషించుచున్నాఁడు. ఆ పురుషుఁడే యచ్చట విస్తరింపఁజేయుచున్నాఁడు.
రశ్మిభూతలు ప్రజాపతియొక్క ప్రాణాత్మికలునగు దేవతలు దేవయజనమందుండిరి.
ఆటులు వారు కూర్చుండి యజ్ఞాఖ్యవస్త్రమును నేయుటకుఁ దిరశ్చీన సూత్రములను
జేసిరి ॥ 4477

(విశ్వసర్జనోపాయత్వముచేఁ బ్రజాపతివల్లసృష్ట మగు యజ్ఞమునందు దేవతలు
విశ్వసర్జనముకొఱకు యజ్ఞ మొనర్చిరి. ఆ సమయమున జగదుత్పత్తికి జగ
దంతఃపాతము లగు యాగోపకరణభూతము లగు పదార్థములేవి యయ్యెను?
అనునది యీ క్రింది ఋక్కువలనఁ బ్రశ్నింపఁబడుచున్నది.)

(3)*గద్యము ॥
ఎప్పుడు దేవతలు ప్రజాపతినిగూర్చి యజ్ఞ మొనర్చిరో! యపుడు ఆ యజ్ఞముయొక్క యుత్పత్తి
యెట్టిది? ఆ యజ్ఞమునకు దేవత యెవతె? దాని కాది కారణ మేది? ఆ యజ్ఞమునకు ఘృత మేది?
పలాశాది వృక్షజన్యము లగు పరిధు లేవి యయ్యెను? ఆ యజ్ఞమునకు గాయత్ర్యాది ఛంద
స్సేది? ఆజ్య శస్త్రము లేవి యయ్యెను? ॥ 4478

(4)*గద్యము ॥
యష్టవ్యప్రజాపతిముఖమువల్ల దేవతలమధ్య నగ్నియు ఛందస్సులలో నగ్నియు గాయత్రియు
నీ రెండును బుట్టెను. ఉష్ణిక్ఛందస్సుతో సవిత పుట్టెను. తేజస్వి యగు సోముఁడు అనుష్టుప్
ఛందస్సుతో నా ప్రజాపతివల్ల జనించెను. బృహస్పతియొక్క వాక్యము బృహతీ
ఛందస్సువలన నుద్భవించెను. (బృహస్పతికూడఁ బ్రజాపతివల్లనే జననమందెను)॥ 4479

(5)*గద్యము ॥
విరాట్టుతో మిత్రావరుణులు ప్రజాపతివల్లఁ బుట్టిరి. ఈ యజ్ఞమందు సవనత్రయరూపభాగ మగు
మాధ్యందిన మను నంశము త్రిష్టుప్ఛందస్సును నింద్రునకు నాశ్రయణీయములై యున్నవి.
అవ్వియు నింద్రుఁడు ప్రజాపతివల్లఁ బుట్టుచున్నారు. సర్వదేవతలను జగతీఛందస్సు
ప్రవేశించెను. (విశ్వే దేవతలు, జగతీఛందస్సును, బ్రజాపతివల్లఁ బుట్టుచున్నవి.)
ఇట్టి యజ్ఞముచే ఋషులు మనుష్యులు సృజింపఁబడిరి ॥ 4480

(6)*గద్యము ॥
చిరంతన మగు నా యజ్ఞము దేవతలచే జరిపింపఁబడఁగా నా యజ్ఞమువల్ల ఋషులు, మనుజులు,
మా పూర్వపురుషులు, సృజింపఁబడిరి. ప్రజాపతికిఁ బ్రాణభూతు లగు నే దేవతలు యజ్ఞమును
జేసిరో! యా దేవతలను బ్రాణాత్మచే సర్వత్ర వర్తమానులను దర్శనహేతువగు మనస్సుచేఁ
దెలిసికొనుచు వారిని స్తుతించుచున్నాను ॥ 4481

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

(7)*గద్యము॥
త్రివృత్పంచదశాదిస్తోమములచే వర్తమానులు గాయత్ర్యాది ఛందస్సులతో సహవర్తమానులు నావర్తమానులు సహప్రమం గలవారునగు మరీచ్యాది సప్తఋషులు పూర్వపురుషులగు నంగిరః ప్రభృతుల యనుష్ఠానమార్గము క్రమముగాఁ దెలిసికొని క్రమముగా ధీరులై ఆనుక్రమముగా యాగానుష్ఠానమందుఁ బ్రవృత్తు లయిరి. రథనేత లగు సూతు లశ్వని యోజనముకొఱకుఁ బ్రగ్రహములను దరించి రథమును బ్రవర్తింపఁజేయునట్లు ఋషులుకూడ ననుష్ఠాన మార్గమును శ్రుతివల్లఁ దెలిసికొనుచున్నారు ॥ 4482

## సూక్తము—132

ఋషి—ప్రజాపతి పుత్రుఁడు యజ్ఞాఖ్యుఁడు
దేవత—ప్రజాపతి-సృష్టి

### అర్థాంతరము—1

†(1) సప్తాఽఽకాశములు సప్తాఽనిలాలు సప్తాఽనలాలు
సప్తసలిలాలు సప్తపృథ్వ్యల జగతులవి వెలయంగ
ద్వాదశాదిత్యులును దశదిశలు త్రిగుణాలు
నేకాదశ బ్రహ్మ కళ లేకాదశ విష్ణు రూపు
లేకాదశ రుద్రులును నెసఁగు నష్టవసుసంపదలు
విశ్వసృష్టి శక్తు లెల్ల విమల శతైక సంఖ్యగాఁ‡
దంతువులుగ వర్తిల్లును దనరఁగఁ ద్రికాలాల
దేవకర్మ లౌచు సృష్టి దివ్యశక్తి వర్తిల్లును
ఆధిపత్యశక్తులతో నియతగతుల నిల్పుచు నీ
వివిధగతుల లోకగోళవితతు లెల్ల సంచరించు
నాయతగతి నఖిలాండ పిండాండ బ్రహ్మాండాలు
ననన్మయము లౌచు నతివేల రతులమై
సృష్టికర్తల విధులఁ జెల్వొందు నాయువుల
నఖిలమ్ము వర్తిల్లు నద్భుత గతులమై ॥ 4483

†(2) అనంతగతులమై నాకాశ కుహరాన
నీ విశ్వ లోకాలు నిఖిల గోళాదులున్
గాల పదార్థాలఁ గ్రాలుచున్ వేలలన్
సృష్టిపర మై వెలసి స్థితిగతుల వర్తిల్లి

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡శతైకసంఖ్య=101. (చూడు. పీఠిక)

ప్రకృతిరూప మ్మెల్ల వరలుఁ బురుషశక్తి
నాక లోకావళుల నవ్యాదివ్యతత్త్వము వరల
సచ్ఛక్తిరూపంపు జ్వలిత ప్రభావాలఁ
గాలబద్ధ మ్మౌచుఁ గ్రొలు శబ్దాఽఽవళుల
దేదీవ్యమానమౌ దివ్య మయూఖాల
రవిచంద్రగ్రహఋక్ష నవ నిత్య దీప్తులన్
ద్రసరేణువుల సృష్టి తనరారుచుండులేః
సచ్ఛక్తి ప్రభావాన సర్వాఃఽన్ వర్తిల్ల
సూక్ష్మాతిసూక్ష్మ మై చోద్య మౌ శక్తులన్
వ్యష్టి సమిష్టులౌ సృష్టి స్థితిలయగతుల
నల్పాల్పరతుల మై ననల్పగతుల మెయి
నిత్యమ్ము తనరారు సత్యయజ్ఞము కాఁగ ॥† 4484

†(3) సర్వశక్తి పదార్థాల ధర్మశక్తిరూప మైన
ప్రమయె యీ విశ్వసృష్టి ప్రతిమగ రూపొంది తిరుగు
నే యజ్ఞ మ్మైనఁగాని యే యాజ్య మ్మైనఁగాని
ఆకసమున వర్తిల్లును నద్భుతగతి వర్ధిల్లఁగ
నే కాలమ్మందైనను నే పరిస్థితిలో నైనను
నాశనమ్ము కానిశక్తి నాటక మాడఁగ నిత్యము
దివ్యదేవతాళి చేయు సవ్యనిత్య రూప మైన
సృష్టియజ్ఞసర్వమ్మునఁ జెన్నారును సత్యగతుల
విశ్వరూపమ్ముగాఁగ వెలయఁ జక్రనేమి క్రమత
జనిత మౌచుఁ జలిత మౌచు సంవర్ధన మౌచుఁ బెరిగి
అభ్యుదయ మ్మొందుచుండి అఖిలమ్మును లయ మ్మౌచు
శబ్దశక్తు లెవియు లేక ధంచమ్మును లేకుండఁగ
నే సాధనమును లేక యిష్ట ధ్యేయ మెదియు లేక
ఘృతము లేక పరిధి లేక గుండ మెదియు లేకుండఁగ ॥ 4485

†(4) అగ్నిశక్తి గోళమ్ములు అఖిలములును ధారణమౌ
ఉష్ణశక్తి తతుల మెయిని బొనరు సంయోజనగతి
ఆకర్షణ శక్తులతో నఖిలమ్మును ధరింపంగ
నాదిత్యుని మహారూపు లవతరించె నీ సృష్టిని

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ఆ ఆదిత్యుల శక్తుల ననుసరించి అఖిలమ్మున
సోమాఽమృత శక్తు లెల్ల సొబగొందఁగ నవతరించె
బృహస్పతియౌ బుద్ధిశక్తి విమల వచశ్శక్తిపతిగ
నలరించును శబ్దశక్తు లావహించ విశ్వమ్మున ॥† 4486

†(5) మిత్రవరుణశక్తులతో మించి వెలుఁగు విరాట్ఛక్తి
ఐంద్రమైన శక్తులతో నాకాశము సహస్రులును
ఉదయమ్మును మధ్యాహ్నము నొనర సాయంసంధ్యయై
భూత భావి వర్తమాన జాత కాల రూపమైన
త్రిష్టుప్పది వర్తిల్లును దివ్య విశ్వదేవతాళి
సర్వజగత్సృష్టి జరిగె సకలఋషి మను శక్తుల
నతివేలమ్మై వరలెడి అతిలోకపు దైవశక్తి
అఖిలసృష్టి తనరారుచు నద్భుతమౌ కాలగతుల ॥ 4487

†(6) దృశ్యమాన సంశక్తు లదృశ్యమాన కాలగతులు
నతిలోకపు దైవీయపు టజయ్యమౌ శక్తులతో
బ్రహ్మ విష్ణు రుద్రాళి ప్రభవింపక పూర్వమ్మే
పితృభూత దైవశక్తి విలసిల్లెడి నపూర్వమై
అభేద్యమై అసాధ్యమై అననురూప రతులమైని
అమేయమౌ అక్షయమౌ ననాహతంపు దివ్యరూప
మనశ్శక్తి వర్తిల్లఁగ మహిమాన్వితమౌ గతులను
సృష్టియజ్ఞ మొనరించెను స్రష్టస్రష్టస్రష్ట తొలుత ॥ 4488

†(7) సర్వశక్తి సమన్వితము సకలానంద సహితమ్మును
బ్రభావిహితమై వరలుచు రాజిల్లెడి దేవతాళి
సప్తాఽఽకాశపు శక్తుల సప్తాఽనిల శక్తులతో
సప్తాఽనల శక్తులమై సప్త సలిల శక్తులతో
సప్త మృచ్ఛక్తులమై సర్వాఽనుగమాలమై
సృష్టిగతుల స్థితిగతులను జీర్ణ శీర్ణ లయగతులను
జక్రనేమి క్రమముగాఁగ సర్వసృష్టి వరలుచుండుఁ
బుట్టుచుండుఁ బెరుగుచుండు గిట్టుచుండు నిత్యమ్మును
జరిగినవే జరుగురీతి జరుగుచుండు సకలగతులఁ
జర్వితచర్వణ మట్లుగ సర్వమ్మును సంచరించు
నత్యల్పమ్మైన రూపు నతిగరీయమైన రూపు
శూన్యశక్తిరశ్ములమై చోద్యమౌచు వరలు సృష్టి ॥ 4489

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—132

ఋషి—ప్రజాపతి పుత్రుఁడు యజ్ఞాఖ్యుఁడు
దేవత—ప్రజాపతి-సృష్టి

### అర్థాంతరము—2

†(1) దేవయజ్ఞ కర్మలతోఁ దేజరిలుచు నాయతమౌ
శతవత్సర కాలమితుల సర్వసృష్టి బ్రహ్మ వరలు
ఏకశతము నెల్ల సృష్టి యెనఁగఁగఁ గోట్లాదియైన*
పరిమితిగా వత్సరాలు వరలు సృష్టిస్థితి లయాలు
ససత్పూర్ణమై తనరెడి అఖిలాండము పిండాండము
బ్రహ్మాండము లెల్ల సృష్టి పరఁగుఁ బునరుత్పత్తిగ
నవతరించి లయగతులను నంతరించుచుండు సదా!
సృష్టిరూపు స్థితిరూపును జెలఁగంగా లయరూపును
బరిమితమౌ కాలరూప బ్రహ్మదినము లలరంగా
దినములు సంవత్సరాలు తనరును బ్రహ్మ యువుగా ॥ 4490

†(2) సకలసృష్టి గోళ లోక సర్వస్వము నెల్లఁ బురుష
శక్తిని పర్తిల్లంగా సహజమైన ప్రకృతి యెల్ల
నై జగతులఁ బుట్టి పెరుగు నాక శక్తు లమరంగా
ఆధిపత్యమైన గతుల నఖిలమ్మును సంచరింప
దివ్యమయూఖాలు వెలుఁగఁ దేజరిలెడి విశ్వ మ్మది
సత్పదార్థ సంశక్తుల శబ్దరూప గాన మౌచు
నతిసూక్ష్మములై వరలెడి అణుపరమాణు త్రసరేణువు
లెల్ల విశ్వసృష్టిరూప మెనసి పుట్టి పెరిగి తిరుగ
గ్రహము లౌచు నుపగ్రహ భ్రమణగతుల ననుబంధపుఁ
దత్త్వ మొప్ప నలరారును దనరంగాఁ గాల గతులు ॥ 4491

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*432,00,00,000 మానవ సంవత్సరాలు బ్రహ్మ కొక పగలు.అంతకాలమే ఒక రాత్రి.అటువంటి పగలు రాత్రి కలిసిన 360 రోజులు ఒక సంవత్సరము. అటువంటి సంవత్సరాలు వంద బ్రహ్మయుర్దాయము.
$432,00,00,000 \times 720 = 311040,00,00,000 \times 100 = 31104000,00,00,000.$

†(3) నిత్యసత్య శక్తులతో నిరతమ్మును వర్తిల్లెడి
అఖిలేశుని శబ్దశక్తు లలరంగా నదములమై
సర్వాంతర్యామి శక్తి చంచత్ప్రమశక్తికాఁగ
విశ్వరూపమే ప్రతిమగ విమలగతుల వర్తిల్లఁగ
సృష్టియజ్ఞ సకలమ్మున వ్యష్టిసమిష్టి శక్తులమై
నఖిల జగతి కధిపతిగా నలరారెడి జ్ఞానశక్తి
ఆద్యమ్మై తనరారఁగ నమరు నర్వసౌందర్యమె
ఛందమ్మౌ ప్రకృతిగాఁగ శబ్దశక్తిరూపాలవి
చలనగతులఁ బరగతులై సర్వసృష్టి వరలంగా
నిమిత్తమాత్ర మౌచుఁ దనరు నిఖిలేశుని సృష్టి యిష్టి ॥ 4492

†(4) షాణ్మాత్రరూపాల జ్వలియించు నగ్నులు
క్రాలి సంభవించును గాయత్రివరములై
ద్వాదశమౌ దివ్యప్రభలు కోట్లాదిగా
నురలు నాదిత్యగతములై ఉష్ణిగుద్భవములై
సోమశక్తులు దివ్య సృష్టి సంభవములై
ఆవిర్భవము చెందు ననుష్టుప్ వరములై
దూరశ్రవణ శక్తి దూరదృష్టుల శక్తి
అనాహతగతులమై నలరు మనోబుద్ధి
భావ పదార్థాలు పద వాక్యముల్ వరలు
పంచభూతాత్మకత పరగంగ బహురూప
బృహతీవరమ్ములై ఇహపరమ్ములలోనఁ
బ్రకృతితత్త్వము మీఱ నకృత సుకృతగతుల
ద్వైతీయమౌ శక్తి తనరార మహితమై
రోదోఽంతరాళాన వేదమోదపు దీప్తు
లలరార ననునిత్య మద్భుత గతులమై
అనుపమానమ్మైన అసమాన శక్తులన్ ॥ 4493

†(5) అగ్ని తేజము లొప్పు ఆ మిత్ర దీప్తులన్
వరుణశక్తుల నలరు సలిలాగ్ని తేజాల
విరాడ్రూపము పరఁగు విశ్వసృష్టిని సదా
ఐంద్రిశక్తులు తనర నద్భుతగతులమై

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సింగిలో వెల్గుచున్ నిత్యాన్న మై ప్రబల
సర్వకాలాలలో సదసత్తులన్ మరలు
దిక్కాల్పములలోన ముక్కాలములలోనఁ
ద్వివిధ రూపాలలోఁ దృష్టుప్పు తనరారు
సృష్టి స్థితి గతులతోఁ జెలఁగు లయగతులతో
విశ్వదేవశక్తుల మై విశాలమైన జగతు లెల్ల
లీల కాఁగ మాయ కాఁగ వేల లెనసి వర్తిల్లును
వివిధ ఋషులు దేవర్షులు విశ్వసృష్టి మానవాళి
ప్రాణికోటి సర్వస్వము ప్రకృతిరూపు తనరారును
జరాఽచరమ్మైన సర్వ జడాఽజడ పదార్థాళి ॥† 4494

†(6) అనంతమైన కాలగతుల నతిపురాతనమునుండి
ఋషి మనుష్యాది ప్రాణి సృష్టి యజ్ఞ మలరారును
ననుస్యూతమ్ముగాఁగ ననంతరతు లొప్పారఁగ
నతిపురాణ జంపతు లగు నాడి దంపతుల కృతుల
మన్యుశక్తి మహితమౌచు మహిమాన్విత గతులతోడ
నజయ్యమై నిగమ్యమై అక్షయమై అద్భుతమై
ననాహతంపు దివ్యగతుల ననుమేయముగా వర్తిల
మానసికమ్మై వెలిఁగెడి అనాకార శక్తుల మై
అదృశ్యమాన మౌచు వరలు నక్షిపురుష విద్యలమై
దృక్ఛక్తుల దశదిశలను సృష్టియజ్ఞ మెల్లప్పుడు
నలరారఁగ ననంతముగ నమరుఁ బూర్వశక్తు లెల్ల
సృజనక్రియ లెల్ల నడుపుఁ జిరంతనగతులు తోపఁ
బ్రకృతిమాత సుకృతశక్తి వరల దివ్యపురుషశక్తి
సర్వజననకారకమై సమ్మేళన మొంది తనరు ॥ 4495

†(7) సప్తాఽఽకాశావళులను సప్తాఽనిల సప్తాఽనల
సప్త సలిల సప్తపృథ్వి శక్తులతో సహవ్రజల
తాళలయబద్ధమైన వేల లెనయు కాలగతుల
బహురూపపు టావృత్తులఁ బలు ఛందము లలరంగా

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సృష్టియజ్ఞ సర్వస్వము చెల్వొందును నిరతమ్మున్
సంజనన స్థితి లయాల సర్వవిశ్వ మలరారఁగఁ
జర్వితచర్వణ మట్లుగ సర్వజగతి వరలుచుండుఁ
బుట్టినదే పెరుగుచుండు గిట్టుచుండుఁ దిరిగిపుట్టుఁ
దిరిగి పెరుగు సురుగుచుండు మరలమరలఁ బుట్టిపెరిగి
చచ్చుచుండు సకలసృష్టి సర్వాంతర్యామి లీలఁ
బ్రసరించెడి తేజస్సులు ప్రకాశించుచున్ నిత్యము
కాలరథమ్మందు వెలిఁగి కాలు మహాదీప్తు లొప్ప
సప్త గగన దేవతాళి సప్తానిల దేవతాళి
సప్తానల దేవతాళి సప్త సలిల దేవతాళి
సప్త మృద్దేవతాళి సదా సృష్టి వరలుచుండు
బంచభూత తత్త్వాలను వరలఁగఁ దనురూపు లెల్ల ॥† 4496

†క॥ సత్యమ్మౌ శక్తులతో
నత్యమలమ్మైన గతుల నతిలోకముగా
నిత్యముఁ జలియించెడి సా
పత్యత వర్ధిల్లుఁ బాంచ భౌతిక శక్తుల్ ॥ 4497

†క॥ కాలము లేకయు నుండియు
వేంలెనయనట్టి సమయ విస్తృత రూపం
బాలనయుం బాలనములఁ
జాలనములఁ గాల గతులు చద లంటు మితిన్ ॥ 4498

## సూక్తమ్—133

ఋషిః—సుకీర్తిః కాక్షీవతః
దేవతా—ఇన్ద్రః; 4-5-అశ్వినౌ
ఛందః—త్రిష్టుప్; 4-అనుష్టుప్

(1) అవ ప్రాచ[1] ఇన్ద్ర విశ్వాగ్ం అమిత్రానపాపాచో అభిభూతే నుదస్వ ।
అపోదీచో[2] అవ శూరాధరాచ[3] ఉరౌ యథా తవ శర్మన్ మదేమ ॥ 1540

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ప్రాచఽఇన్ద్ర విశ్వాగ్ంఽఅమిత్రానపాపాచోఽఅభి, 2. దీచోఽఅవ, 3. చఽఉరౌ. (వా.ప్ర.)

(2) కువిదంగ యవమన్తో యవం చిద్యథా దాన్త్యనుపూర్వం వియూయ ।
ఇహేహైషాం కృణుహి భోజనాని యే బర్హిషో నమోవృక్తిం న జగ్ముః ॥ 1541

(3) నహి స్థూర్యృతుథా యాతమస్తి నోత శ్రవో వివిదే సంగమేషు ।
గవ్యన్త[1] ఇన్ద్రం సఖ్యాయ విప్రా[2] అశ్వాయన్తో వృషణం వాజయన్తః ॥ 1542

(4) యువం సురామమశ్వినా నముచావాసురే సచా ।
విపిపానా శుభస్పతీ[3] ఇన్ద్రం కర్మస్వావతమ్ ॥ 1543

(5) పుత్రమివ పితరావశ్వినోభేన్ద్రావథుః కావ్యైర్దంసనాభిః ।
యత్ సురామం వ్యపిబః శచీభిః సరస్వతీ త్వా మఘవన్నభిష్ణక్ ॥ 1544

(6) ఇన్ద్రః సుత్రామా స్వవాగ్ం[4] అవోభిః సుమృళీకో భవతు విశ్వవేదాః ।
బాధతాం ద్వేషో[5] అభయం కృణోతు సువీర్యస్య పతయః స్యామ ॥ 1545

(7) తస్య వయం సుమతౌ యజ్ఞియస్యాఽపి భద్రే సౌమనసే స్యామ ।
స సుత్రామా స్వవాగ్ం[6] ఇన్ద్రో అస్మే ఆరాచ్చిద్ ద్వేషః సనుతర్యుయోతు ॥ 1546

---

1. గవ్యన్తఽఇన్ద్రం, 2. విప్రాఽఅశ్వా, 3. శుభస్పతీఽఇన్ద్రం, 4. స్వవాగ్ంఽఅవోభిః,
5. ద్వేషోఽఅభయం, 6. స్వవాగ్ంఽఇన్ద్రోఽఅస్మేఽఆరాచ్చిద్. (వా.ప.)

## సూక్తము—133

ఋషి—కక్షీవతుని పుత్రుఁడు సుకీర్తి†

దేవత—ఇంద్రుఁడు; 4,5-అశ్వి దేవతలు†

(1)*సీ॥ మాకుఁ [1]బ్రాగ్దిక్కున భీకరంబుగ నుండు శాత్రవ మండలిఁ జంపవలయుఁ
బృష్ఠభాగంబునఁ బెనఁగులాడుచు నుండు వైరి సమూహంబు వంచవలయు
నుపరిదేశంబున నున్నట్టి యరులను సత్వరంబుగఁ దగఁ జంపవలయు
నీ వధస్థలియందు నిలిచిన శత్రుల నతిశయంబుగఁ దునుమాడవలయు
గీ॥ నే యుపద్రవములు లేక యెక్కుడైన,సుఖము నొందుచు సురుచిర శోభఁ గూడి
త్వత్ప్రదత్త గృహంబునఁ దద్దఁబ్రీతి,నుండఁగలవారమయ్య! యాఖండలుండ! ॥ 4499

(2)*గీ॥ హవ్యములఁ జేతఁ దాల్చుచు నధికము నిను
సన్నుతించెడు వారలు సత్వరముగ
నే ప్రదేశంబునందున నే ధనంబు
గోరుదురొ! [2]యచటఁ నట్టిది యందనిమ్ము! ॥ 4500

(3)*గద్యము ॥

ఏక ధుర్యముచే యుక్త మగు శకటము శీఘ్రముగ గంతవ్య దేశమును జేరలేకుండును. సంగ్రామమందు సన్నమునుగాని యశస్సునుగాని బొందలేకుండును. ఇంద్రుఁడుక్త లక్షణవిలక్షణుఁడు. అశ్వములను గోరుచు నన్నకాములము బలకాములమునై మేధావుల మగు మేము సఖ్యముకొఱకు వర్షిత యగు నింద్రుని బిలుచుచున్నాము ॥ 4501

---

†వ్రాతప్రతి 14వ సంపుటము 165_167 పుటలలో దేవత "4,5 విశ్వే దేవతలు మిగిలిన వానికి ఇంద్రుఁడు"గాను, ఋషి "సుకీర్తి"గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "సృకృతి"గాను, దేవత "ఇంద్రుఁడు, అశ్వులు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఓ వీరుఁడా! మా దారిలో శత్రువులు రాకుండఁ గాపాడుము: ప్రాగ్దిక్కున నున్న పృష్ఠభాగమున నున్న అధో భాగమున నున్న శత్రువులను బారఁద్రోలు మని యుండుటచే సృష్ట్యాదినుండి ఆర్యావర్తములో నిలిచి కొంత కాలమైన తర్వాత నూతన రాజ్యములను కనిపెట్టవలె నను మహోత్సాహముతో నన్ని దిశలకుఁ బ్రాకి భిన్న భిన్న దేశములలో రాజ్యములు స్థాపించిన ట్లూహింపవచ్చును. ఆర్యు లే దేశములకు వెడలిరో! యా యా దేశములకు సోముఁడు కూడ వ్యాపించె ననుటలో సందేహము లేదు. ఆర్యులు విదేశముల కేగినను సోమపానమును విడువ నట్టులు తోచుచున్నది. (నే.వేం.న.శా.)
2. ఇక్కడ నిందగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(4)*గీ॥ ఉదకపాలకులౌ మీరు సదయు లగుచు
సురుచిరంబైన హవ్యంబు కరను గొనుచుఁ
గదనమున[1] నముచిహంతప్య కర్మయందు
నశ్వివరులార! యింద్రున కవన మిడుఁడు! ॥ 4502

(5)*గీ॥ తల్లిదండ్రులు పుత్రుని దనుపు నట్టు
లింద్ర! యశ్వులు నిన్ను రక్షించినారు
హవ్యమును నీవు భక్షించి యమరుచుంట
నల సరస్వతి సేవించెనయ్య! నిన్ను! ॥ 4503

(6)*గద్యము ॥
ఇంద్రుఁడు దృఢ త్రాత. సహాయము జేయువాఁడు. సర్వ వాహకుఁడై దయఁ గలిఁగి
యుండుఁగాక! మా శత్రువుల దూరముగఁ ద్రోలుఁగాక! మేము వీరులకు
నాయకుల మగుదుముగాక! ॥ 4504

(7)*గద్యము ॥
మే మింద్రుని సంపూర్ణ దయను బొందెదముగాక! మే మతనివలనఁ బవిత్రుల
మగుదుముగాక! ఇంద్రుఁడు మమ్ము రక్షించుఁగాక! పరిరక్షకుఁడు వలె
నింద్రుఁడు మా శత్రువులం ద్రోలుఁగాక! ॥ 4505

అక్షరార్థము

(6,7)*గద్యము ॥†
సుఖత్రాత, ధనవంతుఁడు, సర్వదేవత యగు నింద్రుఁడు రక్షణములచే సుఖయుత యగుఁగాక!
శత్రువులను హింసించుఁగాక!భయరాహిత్యమును జేయుఁగాక!కావున మేము శోభనవీర్యోపేత
మగు ధనమునకు స్వాముల మగుదుము. యజ్ఞార్హుఁ డగు నింద్రుని యనుగ్రహబుద్ధియందు
భజనీయ సౌమనస్యమునందును మేము విషయ భూతుల మగుదుము. సుఖత్రాతయు
ధనవంతుఁడు నగు నింద్రుఁడు మాకు దూరదేశమునందున్న శత్రువులను
నంతర్ధానులుగఁ జేయునుగాక! ॥ 4506

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

† ఈ సందర్భములో వ్రాతప్రతి 14వ సంపుటము 167వ పుటలో దిగువను 4, 5, 6, 7 ఋగనువాదాల ప్రక్కన నడ్డముగా-"6,7 "త్రాతార మిన్ద్ర" అను వర్గమందు ఋక్-వే. (4-7-32) భాషాంతరీకరింపఁబడినవి"అని శ్రీనేమాని వారు వ్రాసిరి. ఈ "త్రాతార మిన్ద్ర" అనుమంత్రము 4వ అష్టకము, 7వ అధ్యాయము, 32వ వర్గములోనిది. అనఁగా 6వ మండలము, 4వ అష్టకము, 47వసూక్తములోని 11వమంత్రము. ఈ వర్గములోనే (47వ సూక్తములో) 12వ ఋక్కుగా "ఇన్ద్రః సుత్రామా" ఇత్యాది ఋక్కు 12వదిగాను, "తస్యవయం" ఇత్యాది ఋక్కు 13వదిగానునున్నది. ఈ రెండు ఋక్కుల ఆంధ్రానువాదములు వ్రాతప్రతి 6వసంపుటము 51,52పుటలలోఁ గలవు. "సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత:" ద్వితీయ సంపుటము 970వ పుటలో నీ రెండు ఋక్కులును-977వ పుటలో నీఋక్కులకు శ్రీ నేమానివారి యనువాదములును 554, 555 పద్యాలుగాఁగలవు.

## సూక్తము—133

ఋషి—కక్షీవతుని పుత్రుఁడు సుకీర్తి
దేవత—ఇంద్రుఁడు; 4,5-అశ్వి దేవతలు

### అర్థాంతరము—1

†(1) ప్రాగ్దిశలో శత్రుతతులఁ బశ్చిమదిశ శాత్రవులను
దక్షిణదిశ నరివీరులఁ దగు నుత్తరదిశ శత్రుల
నన్ని మూలల నెల్లను నధోదిశను నుపరిదిశను
వర్తిల్లెడి వైరివీర ఘోర్తతండముల నెల్లను
నాకాశపు శత్రుతతుల ననిలాఽరుల ననలాఽరుల
సలిలాఽరులఁ బృథ్వీశత్రు సర్వస్వము నాశపరచి
అక్షయమౌ నజయ్యమౌ ననంతమైన శక్తులమై
సర్వసృష్టి స్థితి శక్తుల సదమల రక్షల నిల్పుచు
శర్మగతుల నఖిలమ్మున ఛద్మఘటిత శక్తులతో
నైంద్రగతులఁ గాపాడుమః అఖిలేశాః నిరతమ్మున్ ॥ 4507

†(2) దుష్టాకాశమ్ములోన దుర్విదగ్ధగతుల నెల్లఁ
గశ్మలాఽనిలమ్ముల దుర్గంధమ్ముల నన్నింటిని
గ్రూర విషాఽనల వికారరూప శక్తితతుల
మురికి పంకముల నింపెడి సలిలమ్ముల నన్నింటిని
నుప్పు నేల విసపు నేల యూసర క్షేత్రాల నెల్ల
నన్నింటిని ధ్వంసపరచి నన్నింటిని శుభ్రపరచి
అపురూపపు శక్తులతో నలర భక్ష్యభోజనాల
పదార్థాలు సృష్టిలోన వరలంగా సహజముగాఁ
జరాఽచరప్రకృతు లెల్ల జడాఽజడ ప్రపంచాన
నాహారము స్వీకరించి అభ్యుదయ మ్మొందుచుండు ॥ 4508

†(3) కృత్తికలై విశ్వమ్మునఁ గెరలంగా నగ్ని కీల
రోహిణిగా సలిలమ్ముల పృథుశక్తులు వరలంగా
మృగశిరయై మృత్తతు లవి మిన్ను గాలి నిప్పు నీరు
మిళితమైన శక్తిగాఁగ మిన్నేరుల మున్నీరుల

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శక్తిగాఁగ సృష్టిలోన సర్వగంతవ్యగతుల
పృషభరాశి పయనించును సృష్టి స్థితి గతుల నిల్పి
ఋతు శక్తులు వర్తిల్లఁగ ఋతాఽమృత శక్తు లలర
అస్థిరమౌ నగమ్యమౌ ననంతమౌ యానమ్ముల
కాంతిపరిధి దీప్తగతులు క్రిల నాకర్షణరతి
యాతాయానమ్ములతో నఖిలమ్మున సంచరించు
శబ్దశక్తు లలరంగా సర్వము ప్రతిధ్వనింప
సంగమాల నభ్యరతుల సంఘర్షణగతులతోడ
నఖిల విశ్వ మలరారుచు నచ్యుతగతి సంచరించు
"అస్తి-నాస్తి" విచికిత్సల నంకురించు నంతరించు ॥† 4509

†(4) అద్భుతమౌ అగ్నిజ్వాల లనవరతము విలసిల్లఁగ
నప్పురూపపుఁ గాంతికిరణావళు లవి విశ్వమ్మున
సలిలమ్ముల నన్నింటిని సదా స్వీకరించుచుండి
ఆవిరిగా నాకసమున నవికలంపు జలశక్తుల
నంతర్గర్భిత మౌచును నలరారును మొయిళులుగా
నఖిల ప్రకృతి మధురమైన నబ్ధారల వర్షించుచుఁ
బ్రకృతి అసాధారణగతిఁ బరఁగంగాఁ బులకింతలు
వరలఁజేయు దైవీయపు నిరతనిత్యశక్తితతులు
"నభి"శక్తుల పరివ్యాప్తి "నాభి"శక్తి నష్టపరచి
"జలనాభి"ని రూపుమాపి జ్వలితాగ్ని "నాభి"రూపు
విషమయమై విస్తరిల్లు వృత్రశక్తి సంహరించి
ఋతరూపపుఁ బ్రకృతులైన ఋతుశక్తుల ఋజుగతులను
"నాభి"త్రయ రూపా లవి పార్థివముల రోదసిలో
వర్తిల్లఁగ నక్రమగతి వర్ధిల్లును విశ్వసృష్టి ॥ 4510

†(5) పితృపురుషశక్తితతులు సుతుని రక్షించుగతిని
మన్యురూప నిత్యదివ్య జన్యుశక్తి కాంతితతులు
నమేయమై అభేద్యమౌ నక్షయమౌ నజయ్యమౌ
ననూనమౌచు ననంతమైన అనాహతంపు మహాశక్తి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

"అథ"రూపమ్మౌ విషాగ్ని నవమశ్శక్తిని దున్ముచు
"నాథి"శస్త్రు లన్నింటి వినాశరహిత మొనరించుచు
దివ్యమైన దేవశక్తి "త్రినాభు" లవి వర్తిల్లఁగ
విచలితమైన శచీశక్తి సుచలితమైన విద్యుత్తుఁ
సరస్వతీ రూపమైన జలశక్తులె అంతర్గతి
శబ్దశక్తులన్ వర్తిలి సర్వమ్మున విస్తరిల్ల
నుత్తమత్వ తత్త్వమ్మున నుజ్జ్వలమౌ దీప్తుఁతో
వసుసంపచ్ఛక్తులతో వరలంగా రకరకాల
లోక గోళ జాలా లవి ఋతశక్తులఁ దనరారఁగ
విశ్వరూప మౌచు వరలు విపులరోదసి సర్వమ్మును ॥† 4511

†(6) అష్టవసు సంపదల నఖిల విశ్వ మలరారఁగ
వైష్ణవీయమైన ఐంద్రి వరశక్తులు విస్తరిల్ల
సృష్టిరతులు నిత్యగతుల స్థితిశక్తుల వెలయంగా
విశ్వవేద మై వరలెడి విజ్ఞానపు శక్తితతులు
ప్రకృతివిరుద్ధమై తనరెడి వికృతశక్తు లన్నింటిని
విధ్వంసము కావించుచు విశ్వశాంతి వర్ధిల్లఁగఁ
జరాఽచర ప్రకృతిలోన జడాఽజడ ప్రపంచాన
సద్వీర్యపుఁ బురుషశక్తి శంకరమౌ ప్రకృతిశక్తి
సత్యశక్తివంత మౌచు నిత్యచలన వీర్యరతులఁ
బతనగతుల వినిమయమై సతతజన్యజనకశక్తు
లలరంగా సృష్టిలోన నఖిలమ్మున నభయగతుల
రక్షితమై తనరారును ప్రాణ విశ్వసృష్టి యెల్లఁ
బ్రకృతి సౌఖ్యసంపదాళి వరలంగా సహజగతుల
నలరారును విశ్వసృష్టి అమృతగతుల సమలరతుల ॥ 4512

†(7) సచ్ఛక్తుల బుద్ధి యెపుడు సన్మనస్సు నమరించును
సద్బుద్ధులు సన్మనస్సు సద్గతులను బొందించును
సృష్టిభద్రరూపమైన చిన్మయశక్తులు తనరఁగ
విద్వేషపు శక్తితతుల విశ్వసృష్టి సర్వమ్మున

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

విధ్వస్తము కావించును విఘ్న మహాశక్తితతులు
 స్థితికర్తగ నా దేవుఁడు చింతించును గరుణాఽమృత
మమేయమైన దయార్ద్రిత నపారముగ నఖిల సృష్టి
 నక్షయమౌ శక్తులతో రక్షించును నభయ మొసఁగి ॥† 4513

## సూక్తము—133

ఋషి—కక్షీవతుని పుత్రుఁడు సుకీర్తి
దేవత—ఇంద్రుఁడు; 4,5-అశ్వి దేవతలు

### అర్థాంతరము—2

†(1) ప్రాక్పశ్చిమ దిశలందును వరల దక్షిణోత్తరముల
 నలుమూలలు క్రింది దిక్కు నభోభాగమందుఁ జూడఁ
బ్రికృతిశక్తి తతు లన్నిటిఁ బంచభూత వైరితత్వ
 దుశ్శక్తుల నఖిలమ్మును దుష్కామ్మతంబు సమూలముగ
"నభి"శక్తుల అతివ్యాప్తి నాసాంతము "జలనాభి"ని
 హరించివైచు దుష్టవిషాఽగ్నిమయ రూపాలను
నాశపరచి విశ్వమ్మున నవశక్తులు సృష్టిలోన
 నానారూపాలుగాఁగఁ బ్రాణ మొంది త్రాణ నొంది
సంభవమ్ము నొందుచుండి శక్తిసమన్వితము గాఁగ
 సర్వమ్మున దృఢతర మై సత్వ సత్య రూపాలను
బురుషశక్తి ప్రికృతిరూపపర మై విలసిల్లుచుండు
 జలశక్తులు సకలమ్మును శర్మరతుల నొందింపఁగ
శూరాధారమ్ముగాఁగ సృష్టిపురుషశక్తి సెల్ల
 నసాధారణంపు గతుల నఖిల విశ్వ మలరారును
దిక్కాలము లలరంగా దివ్యశక్తు లమరంగా
 రక్షాశ్రియ మౌచు దేవ! ప్రసన్నుండవ వగుము! నీవు ॥ 4514

†(2) కుటిల మౌచు దుష్ట మౌచుఁ గ్రూరమైన కుజ్ఞానము
 అఖిలసృష్టిలోన శాంతి నధ్వాన్నము కావించుచు
నభ్యుదయావహములైన అనుమాన ప్రాణ త్రాణ
 శక్తుల నన్నింటిఁగూడ సంకులితము చేసిచేసి

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

కశ్మల తత్త్వాలు మీఱఁ గకావికలుగాఁ జేయుచు
విస్తరిల్లు రకరకాల విషశక్తులు వ్యాప్తి చెంది
ప్రకృతిలోని ఆహారపుఁ బ్రాకృతపదార్థాలఁ జెరచు
ఆ దుష్టవిరూప వికృత మహా విషశక్తుల రూపుమాపి
ఆనుపూర్వీ గతులు మీఱ నఖిలసృష్టి వ్యాప్తి చెందు
చిత్పూర్ణమ్మైన మహాజీవశక్తి విస్తరిల్లఁ
గాంతి రూపమైన శక్తి తనరారఁగ సృష్టిలోన
ననుక్రమత వరలంగా ననవరతమ్మనుగతమై
ప్రాణశక్తి త్రాణశక్తు లనుపమముగఁ బ్రసరింపఁగ
మాయుగతుల లీలరతుల మహితదైవశక్తి వరఁగు ॥† 4515

†(3) రవి చంద్రులు గ్రహయుక్తా లవిరళముగ సంచరించు
నవితథమౌ మహాకాంతు లనవరతముఁ బ్రసరింపఁగ
సవినాభావత్వ మలరు ననుబంధపు బంధాలను
నక్రమమౌ క్రమశిక్షల నత్త్వము చర్వితచర్వణ
గతు లొప్పఁగఁ గాంతితతులఁ గ్రాలు నుదయాస్తమయాల
నలరారును గాలరూపు లద్దు లెనసి స్వకీయమౌ
నాత్మప్రదక్షిణల నలరు ప్రదక్షిణలమెయిని
కాలగతులు తనరారఁగ వేల లెనసి వర్తిల్లును
వివిధ గోళ లోకాలకు భిన్నబంధ శక్తులమై
సంగమములు తనరారఁగ సఖ్యమ్ములు వరలంగా
శబ్దశక్తులను విశ్వము సర్వస్వము వ్యాప్తమౌచు
యాతాయాతమ్ములమై ఆశ్రితగతు లొప్పంగా
నేకైకమ్మై చెలఁగెడి వృషభవాహనంపు యాన
కాలరథము సంచరించు వేల లెనసి యెనయకుండ ॥ 4516

†(4) షడ్రూప విశాలగతుల సమతత్త్వము వరలంగా
నగ్నిశిఖలు పురోభాగమందు జ్వలితగతుల వరలఁ
గోటికోట సూర్యప్రభలు దాఁటి వృష్ఠభాగమ్మున
రుద్రపరమ్మైన మహాఋషప్రభ తనరంగా

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నసాధారణంపు గతుల ననవరతము సంచరించు
రాశిచక్ర సర్వస్వము గ్రహఋక్షరాజి వివిధ
కాంతి విరాజితమై క్రాలును రాత్రింబవళులు
కాలగతుల బద్ధ మౌచు వేల లెనసి మండలమున
రాక్షస శక్తుల ప్రగతిని రాపిరంపమునఁ బెట్టుచు
ముక్కలు చెక్కలుగాఁగను మూర్తి నాశనము చేయుచు
గతి తప్పని నిత్యగతులఁ గ్రాలంగా సృష్టిలోన
విశ్వరూపగోళా లవి అశ్విరతుల వర్తిల్లుచు
సంజననాభ్యుదయపు సంక్షయ గతు లలరంగా
సృష్టి స్థితి లయ శక్తుల వ్యష్టి సమిష్టి ప్రతికృతులను ॥ 4517

†(5) తానే తన పుత్రుఁడుగాఁ దనరారఁగ సృష్టిలోన
విశ్వ లోక గోళాదులు విరాజిలును విమలగతుల
జగతి సకల పదార్థాలు శబ్దశక్తు లలరంగా
నాకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును నొకటొక్కటి మూల మౌచు నితరమునకు
నాకాశము మూలమ్మై అనిలాఽనల జల మృత్తులు
అనిలమ్మే మూలమ్మై అగ్ని జలమ్మృద్గగనమ్ములు
అనలమ్మే మూలమ్మై అనిల జల మృద్గగనాలు
సలిలమ్మే మూలమ్మై అనిలాఽనల మృన్నభాలు
తనరారును నన్యోఽన్య సంజనన జనక వినిమయగతు
లలరారఁగఁ బ్రకృతిగతుల నఖిలమ్మును సరస్వతిగ
శబ్ద పదార్థ రూపమ్ముగా సకలసృష్టి వర్తిల్లుచు
శక్తితత్త్వ మొప్పారఁగ రక్తిమ వైరక్తితతుల
సృష్టికావ్యమై వరలును స్రష్టకర్తగాఁ దనరఁగ ॥ 4518

†(6) విశ్వవేద విజ్ఞానము విస్తృతముగ విమలమ్ముగ
నశేషముగ విశేషముగ ననంతమైన శక్తులతో
నజయ్యముగ నక్షయముగ నతిలోకపు మూర్తిగాఁగ
నతిలోకపు వర్తిగాఁగ నపూర్వదీప్తరూపమ్ముల

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

విశ్వకళ్యాణగతుల నశ్వర మౌ స్థితిగతులను
నఖిలమ్ము న నలరారుచు నద్భుత మౌ శక్తులతో
విశ్వసృష్టి సర్వమ్ము న విషశక్తుల రూపుదాల్చు
కూ్రరమైన అగ్నిశక్తి: ధారణగతు లెల్లఁ బ్రబలి
అతివేలములై సృష్టిని సతలాకులతలమ్ముగాఁగ
"జలనాభి"ని నింకఁజేసి విలయాగ్నులుఁ బ్రళయాగ్నులు
వరలఁ జేయు రాక్షసమయ నిరయశక్తు లన్నింటిని
విశ్వ సంక్షేమగతుల వినాశంపు విద్వేషపు
విషమయమౌ ధిషణాగతి వికృత దుష్టశక్తితతుల
నాశ మొందఁజేయు నట్టి యాశ సర్వేశ దీప్తి
అభయపర్రదమై వెల్గును నక్షయమౌ రక్షలతో
నఖిల సృష్టి వర్ధిల్లఁగ నభ్యుదయావహముగాఁగ ॥† 4519

†(7) విశ్వసృష్టి సర్వమ్ము న విరాజిలెడి గోళలోక
జాలమ్ములుఁ గర్మశిక్షణ కాలబద్ధ మౌచు వరలి
వివిధగతులఁ దనరారఁగ విధిగాఁ బరిభ్రమించు
నాత్మపర్దక్షిణలమెయిని నలరఁగఁ బ్రదక్షిణలను
సద్బుద్ధులతో సృష్టిని సర్వమ్మును సంక్షేమపు
సంగమాల సంచరింప సౌమనస్య మలరంగా
దైవీయమ్మౌ శక్తులఁ దనరారుచు విశ్వమ్మునఁ
జిన్మయమై సృష్టిలోనఁ జెలువొందెడి శక్తితతుల
విధ్వస్తము చేయంగా విషరూపపు ద్వేషరతుల
నజ్ఞానపుఁ దిమిర మ్మది అవహల్ల నఖిలహృదిని
నైంద్రమైన వైష్ణవీయ చంద్రామృతశక్తితతులు
సచ్చిదానందమ్ముల సదా వర్ధిల్లుచుండు
నవికలముగ నజయ్యముగ నక్షయముగ నపూర్వముగ
నిర్వికార నిర్వికల్ప నిరంజనమ్మైన గతుల ॥ 4520

†రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-పర్పూర్ణ"

## సూక్తమ్—134

ఋషిః—శకపూతో నార్మేధః

దేవతా—మిత్రావరుణౌ; 1-ద్యావాభూమ్యశ్వినః

ఛందః—విరాడార్షిపా; 1-న్యంకుసారిణీ; 2, 6-ప్రస్తారపంక్తిః; 7-మహాసతోబృహతీ

(1) ఈశానమిద్ ద్యౌర్గూర్తావసురీజానం భూమిరభి ప్రభూషణి ।
ఈజానం దేవావశ్వినావభి సుమ్నైరవర్ధతామ్ ॥ 1547

(2) తా వాం మిత్రావరుణా ధారయత్క్షితీ సుషుమ్నేషితత్వతా యజామసి ।
యువోః క్రాణాయ సఖ్యైరభి ష్యామ రక్షసః ॥ 1548

(3) అధా చిన్ను యద్దిధిషామహే వామభి ప్రియం రేక్ణః పత్యమానాః ।
దద్వాగ్ం వా యత్ పుష్యతి రేక్ణః సమ్వారన్ నకిరస్య మఘాని ॥ 1549

(4) అసావన్యో[1] అసుర సూయత ద్యౌస్త్వం విశ్వేషాం వరుణాసి రాజా ।
మూర్ధా రథస్య చాకన్ నైతావతైనసాన్తకధ్రుక్ ॥ 1550

(5) అస్మిన్త్స్వేతచ్ఛకపూత[2] ఏనో హితే మిత్రే నిగతాన్ హన్తి వీరాన్ ।
అవోర్వా యద్ధాత్ తనూష్వవః ప్రియాసు యజ్ఞియాస్వర్వా ॥ 1551

---

1. వన్యోఽఅసుర, 2. పూతఽఏనో. (వ్యా.ప్ర.)

(6) యువోర్హి మాతాదితిర్విచేతసా ద్యౌర్న భూమిః పయసా పుపూతని ।

అవ ప్రియా దిదిష్టన సూరో నినిక్త రశ్మిభిః ॥ 1552

(7) యువం హ్యప్నరాజావసీదతం తిష్ఠద్రథం న ధూర్షదం వనర్షదమ్ ।

తా నః కణూకయన్తీర్నృమేధస్త్రే[1] అంహసః సుమేధస్త్రే[1] అంహసః ॥ 1553

## సూక్తము—134

ఋషి—నృమేధపుత్రుఁడు శకపూతుఁడు†

దేవత—మిత్రావరుణులు†

(1)*గీ॥ స్తోతలకు ధన[2] మొసంగు విఖ్యాత దివము
భూమి యజ్ఞేష్టవంతుఁడౌ పూత పురుషుఁ
బూర్ణ దానాది గుణ గణ భూషితాశ్వ
లెలమి వెల్గించుచున్నార లిద్ధ మహిమ[3] ॥ 4521

---

1. స్త్రే౽అంహసః. (వ్రా.ప్ర.)

† వ్రాతప్రతి 14వ సంపుటము 16[illegible]వ పుటలో నీ సూక్తమునకు ఋషి "నృమేధ పుత్రుఁడు శకపూతుఁడు" గాను, దేవత "మిత్రావరుణులు"గాను వ్రాసి, 1[illegible] సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "శకపూతుఁడు" ఋషిగాను, "భూమ్యాకాశములు, అశ్వులు, మిత్రావతుణులు" దేవతగాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

2. ఇక్కడ నింద్రగణమునకు మారు "పంచలఘు"గణముగాని "జగ"ముగాని ప్రయుక్తమైనట్లు భావింపవలయును.

3. గీ॥ స్తోతలకు ధన మొసంగెడు ఖ్యాత దివము
భూమి దానాది గుణగణ భూషితాశ్వ
లెలమి యజ్ఞేష్టవంతుఁడౌ యమల పురుషు
వృద్ధిఁ జేయుచునున్నారు వివిధగతుల ॥ (తొలి పాఠము)

(2)*గీ॥ మిత్ర! వరుణుఁడ! మీరలు మేలు ధనము
దాల్చుచున్[1] సుముఖులై యిషితవ్యహేతు
వునను సురమధ్యమునఁ బ్రీతిఁ బొందువారు
కానఁ బూజించెదము మిమ్ముఁ గరము భక్తి ॥ 4522

*గీ॥ మిత్రుఁడా! వరుణదేవుఁడ! మీ సుసఖ్య
మునను యజమానునకుఁ గడు ముదము కలుఁగ
బాధకాత్మక రాక్షస వర్గములను
నభిభవింపఁగఁగలవార మధిక శక్తి ॥ 4523

(3)*గీ॥ మీ నిమిత్తము హవ్యంబు మిత్ర! వరుణ!
దాల్చునప్పుడె హవ్యము దాల్చఁగలము
హవ్య మొసఁగిన జనుని సత్యాధిక ధనము
లంచితంబుగఁ దాము సేవించుచుంద్రు ॥ 4524

(4)*గీ॥ ఎల్ల జనులకుఁ బ్రాణంబు లిచ్చువాఁడ!
మిత్రుఁడా![1] దివము నీ కతిమిత్రుఁడైన
వరుణదేవునికంటెను బరుఁడ వైన
నిన్నుఁ గనియుండెఁగాదటె! యెన్నునటుల ॥ 4525

*గీ॥ ప్రాణులకు నీశ్వరుండవై వరలుచున్న
వరుణ! మిత్రుఁడ! మీ రథవరము మూర్ధ్న
మును మదీయేష్టిఁ గాంక్షించుఁ గనుక యద్ది
కల్మష విహీనమై భువిఁ గ్రాలుఁగాదె! ॥ 4526

(5)*గీ॥ తర్పయితయైన పురుషుని తగిన యజ్ఞ
కర్మలందునఁ దనువుల ఘనుఁడు మిత్రుఁ
డవన ధనమును నత్యంత మైన ప్రీతి
స్థాపనముఁ జేయు నెప్పుడున్ సంతసమున ॥ 4527

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది.

*గీ॥ మిత్రదేవుఁడు హితుఁడయి మెలఁగుచున్న
మౌని శకపూతుఁ డని వానిఁ బూనియున్న
పాప పుంజంబు హంతవ్య వైరి పుత్ర
కులను నిశ్శేషముగఁ దాను గూల్చుచుండు ॥ 4528

(6)*గీ॥ కరము విజ్ఞానులైనట్టి వరుణ మిత్ర
లార! మీ కల్ల యదితియౌ నంబ[1]యధిక
వృష్టిచే[2] దివము జగమును వెలుఁగఁజేయు
నట్లు శోధించు నరులను నతిరసమున ॥ 4529

*గీ॥ మీరు ప్రియమైన ధనము[3] నమేయశక్తి
నస్మదభిముఖముగ మాకు నందనిండు!
మరియు సూర్యుని సుందర[4] కిరణ పఙ్క్తి
మమ్ముఁ బోషింపుఁడీ! ప్రీతి మాన్యులార! ॥ 4530

(7)*గీ॥ వర్షణాదికమున వర్ధిల్లు మీరలు
స్వీయతలమునందుఁ జెలఁగుఁడిపుడు!
వరుణ! మిత్రదేవ! కరము శబ్దముఁ జేయు
నరులఁ దృంప నెక్కుఁ డరద మిపుడు ॥ 4531

*గీ॥ అశ్వవహనంబునకుఁ గడు నమరునట్టి
దేశమందుండునది వనదేశమందు
క్రీడకు నమరు నరదంబుఁ గీర్తనీయు
లార! వేగ నధిష్ఠింపుఁ డీరు ప్రీతి ॥ 4532

*గీ॥ పాపముననుండి నా పిత పరమ ముక్తుఁ
డైన విధమున మీవల్ల నతిశయముగఁ
బాపముక్తుఁడనైతి నా పగిది యజ్ఞ
కరుఁడు పావ విముక్తుని గాంచుఁగాదె! ॥ 4533

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. నంబనుండు, (తౌ.పా.), 2. ఇక్కడ నిందగణమునకు మారు "ఖల"ము ప్రయుక్తమైనది.
3. ధనమును మిక్కుటముగ, (తౌ.పా.), 4. కిరణములను.(తౌ.పా.)

## సూక్తము—134

ఋషి—నృమేధ పుత్రుఁడు శకపూతుఁడు
దేవత—మిత్రావరుణులు

### అర్థాంతరము—1

†(1) విశ్వసృష్టి యజ్ఞమ్మున విమలమైన శక్తులతో
ఆకసమున ననిలమ్మున ననలమ్మున సలిలమ్మున
నహోరాత్రులందు వెలుఁగు మహిమాన్వితమైన మణులు
నానావిధ రత్నమ్ములు సదరైన రజిత హేమ
మష్టవిధములైన వసువు లలరారును రకరకాల
గోళాలను లోకాలను గోళగతుల వ్యాప్తి చెంది
పలు గుణాల రూపాలను వరలెడి మృదూష్ణమ్ముల
గర్భితమై జనిత మౌచుఁ గాంతికాంతు లీనుచుండి
బహురూపుల బహుగుణాల పార్థివ రతు లొప్పంగాఁ
జిరకాలము వెలుఁగుచుండు చరితాత్మకగతుల వెల్గి
అలంకారప్రియములై ఆభరణమ్ములు నౌచును
ఆరోగ్యప్రదము లౌచు నాయుష్కారకము లౌచుఁ
బ్రాణాంతకము లౌచుఁ గూడ వరలెడి గుణ రూపాలను
బ్రకృతి సహజ సంపదలుగఁ బరఁగుఁ జిత్రమైన గతుల ॥ 4534

†(2) మిత్రగోపశక్తులతో మించు సూర్యకాంతమణులు
చలువల వెన్నెల రతులను జద లందెడి వరుణశక్తిఁ
జంద్రకాంతమణు లెల్లను సదా వర్ధిల్లు జగతి
రకరకాల రత్నమ్ముల రాజి వెలుఁగు సృష్టిలోన
సద్గుణగణ సంవర్ధిత సంపూజిత ధర్మమూర్తి
శక్తులుగా సంపదలుగ సహజములై తనరారుచు
దుష్టశక్తి సంపదాళి దుర్విదగ్ధ దుర్మతులను
భ్రష్టపరచి నష్టపరచి కష్టమ్ములపాలు చేసి
ప్రాణహారకమ్ము లౌచుఁ బ్రకటితమౌ దీప్తరతుల
సత్యమలమ్మౌ సూక్తుల నలరారును విశ్వమ్ముల ॥ 4535

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) చంద్రకాంతి సూర్యకాంతి సంశక్తులు విశ్వమ్మున
విమల ప్రాణదమ్ములౌచు విశ్వజననమ్ములౌచుఁ
చరాచర ప్రకృతితతులు జడాజడ ప్రపంచమును
సంచలింప సంచరింప సంవర్ధన శక్తులతో
సంజననపు శక్తిదీప్త సంపదాళి విస్తరిల్ల
రేయింబవళులు నడచును ఋతు దీప్తులు ప్రసరింపఁగ
సచ్ఛక్తుల బుద్ధిగతులు సవమలమై వర్తిల్లఁగ
వర్ధిల్లఁగఁ బ్రాణికోటి సార్థకమై సత్యమైన
మహితమైన చిత్తవృత్తి మాన్యగతులు విలసిల్లఁగ
లోకసంక్షేమ రతుల లోలుపతల ధిషణశక్తి
అభ్యుదయ మ్మందనౌను నద్భుత చైతన్య గతుల
నసాధారణముగ జగతి నలరు సృష్టి స్థితి లయాలు
సృష్టిలోనె హవిషముగాఁ జెలఁగు సహజ పదార్థాలు
కృతములౌచు నకృతములై కృతాకృతములౌచుఁ బ్రకృతి ॥ 4536

†(4) దివ్యమైన బ్రహ్మశక్తి తేజరిలఁగ సహజగతుల
నఖిలప్రాణ దాతవుగా నమలకాంతి ప్రదాతగా
నపూర్వమౌ శక్తులతో నమేయమౌ శక్తులతో
ననవరతము ప్రసరించెడి ననంతమైన దీప్తులతో
ననూనమైన వ్యాప్తిత్వపు టనలానిల శక్తులతో
నతిలోకమ్మైన మైత్రి నా సలిలము నాకర్షణ
నంతర్గతమ్ముగాఁగ నావిరిగా లీనముగా
నతిలోకమ్మై వరలెడి అపురూపపు శక్తులతో
నా జలమునె మొయిళులుగా నవతరింపఁజేసి నీవు
మధురరుచుల రూపముగా మహితమైన జలధారల
వర్షింపఁగఁజేసి ప్రకృతి ప్రాణదాతవై తనరుచుఁ
చరాచర ప్రపంచమును జలభూచరతతు లన్నిటి
ననిలానల జలమృత్తతు లన్నింటను మిత్రదేవ!
సంపదాళి సృజియించుము! సంవర్ధన మొనరింపఁగ ॥ 4537

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) మించు దైవీయమైన మిత్రశక్తి విశ్వమ్మున
వర్తిల్లఁగ నిత్యమ్మును వర్ధిల్లఁగఁ బ్రకృతి యెల్ల
యుగయుగాల మహితశక్తి యోగములో లోకమ్మున
ఋతదీప్తుల సభములోన ఋభుగణములు వర్తిల్లఁగ
శకపూరుషుఁ డవతరించి ప్రకృతిదీప్త ధర్మ మెనయ
సద్ధర్మమయమ్మైన సత్పురుషులఁ గాపాడుచు
హింసాశక్తులతోడను శంసనీయ ధ్వంసగతుల
అధర్మమై అసత్యమౌ విధుర దుష్ట ధర్మరూప
దుర్మదాంధ దుశ్శక్తులఁ దున్మాడుచు నజయ్యముగఁ
బూర్వదుర్గతీనాశని పూర్ణశక్తి యోగమహిత
శక్తిదీప్త స్వచ్ఛగతుల సంపత్ప్రదమై తనరఁగ
సకలపాప పుంజాలను వికృతములుగ నాశపరచి
పుణ్యయోగ పుంజము లనన్య మౌచు ననంతమైన
శక్తిగాఁగ వర్ధిల్లును జక్రనేమిక్రమత సృష్టి ॥ 4538

†(6) అంతర్గతి నగ్ని వరల నపురూపపు శక్తులమైఁ
దనరు జలము సృష్టిలోన ననల మైత్రి వరలంగాఁ
బ్రకృతిలోని జలసంపదఁ బ్రాకృతమౌ కిరణా లవి
మిత్రాగ్నుల శక్తు లెల్ల మించి స్వీకరించి నింగి
కావిరిగా నంతర్గతి నాత్మైక్యముగాఁగ వరల
ద్వైతశక్తి రూపాంతర జాతములుగ మొయిళులుగా
జలశక్తుల పరిపూర్ణత వెలయంగా నిర్మలముగ
రూపొందఁగఁజేసి నిలిపి ఆపాతమధురములౌ
వర్షధారలను బ్రకృతికిఁ బ్రసారించు మిత్రవరుణ
శక్తు లెల్ల సృష్టిలోన నదమలమౌ పవనాగ్నుల
సలిల పృథ్వ్యాకాశము లలరంగా నిత్యమును
నపూర్వమై అజయ్యమై అమేయమౌ ననంతమౌ
ననూనమౌ నతిలోకపు టతివేలపు మహితగతుల
వర్తిల్లును నిత్యమ్మును వరలఁగ ఋత ఋతు ధర్మము ॥ 4539

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) దివ్యమైనకాంతితతులఁ దేజరిల్ల గగనమ్మునఁ
గాలశక్తి నియతగతులఁ గ్రాల నిత్యసత్య మౌచు
వసంతానఁ బ్రకృతిశక్తి వర్తిల్లఁగఁ బునర్నవగ
గ్రీష్మమ్మునఁ బ్రకృతిశక్తి దృఢతరమై పెరుగంగా
వర్షఋతువునందుఁ బ్రకృతి వర్తిల్లఁగ జలసంపద
హేమంతమునందుఁ బ్రకృతి హిమహేమపు మహిమలతో
వర్ధిల్లఁగ రకరకాల ఫలితమ్ముల విలసిల్లుచు
శిశిరమ్మున శక్తు లుడుగు నవశ గతుల రాలిపోవ
నుష్ణనాభి శక్తులతో నుజ్జ్వలముగ వర్తిల్లఁగ
జలనాభి శక్తితతుల సలిల సమృద్ధి తనరంగా
శీతనాభి సర్వరతులఁ జెల్వొందఁగఁ బ్రకృతిశక్తి
ఆకాశపు శక్తులతో ననిలాఽనల శక్తులతో
సలిల పృథ్వి రూపాలను సర్వసృష్టి వర్తిలంగ
నన్యోఽన్యపు టనుబంధపు టవినాభావంపు మైత్రి
తనరారఁగఁ బంచభూత తత్త్వరూప తతు లెల్లను
మిత్రావరుణుల మహిమల మించి నంచరించు సృష్టి ॥ 4540

## సూక్తము—134

ఋషి—నృమేధ పుత్రుఁడు శకపూతుఁడు
దేవత—మిత్రావరుణులు

### అర్థాంతరము—2

†(1) మహితమైన దివ్యశక్తి మహిమాన్విత లోకమ్ములు
గోళమ్ములు క్రాంతికాంతి జాలమ్ములఁ బ్రసరించుచు
విమలమైన శక్తులతో విశ్వసృష్టి ప్రకృతిలోనఁ
జైతన్యపు రతుల మీఱ జాతముగాఁ జిచ్ఛక్తులు
నిత్యపరిణామరూప సత్యతత్త్వ మలరారఁగ
సృష్టిలోన సుఖసంపద వ్యష్టిసమిష్టిగతుల నొప్ప
నసాధారణంపు గతుల నభ్యుదయావహముగాఁగ
నలరు దైవలీలగాఁగ నతిలోకపు మహాశక్తి
దివి భువులును ననిలానల పవన గగన గోళా లవి
వర్తిల్లును నిత్యమును బరిభ్రమణగతులమెయిని ॥ 4541

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) అనల సలిల శక్తులతో ననిల గగన తత్త్వాలను
నలరారుచు క్షితితలాన నమరు సుషుమ్నగ సృష్టిని
బ్రకృతిదేవి నాడికాఁగఁ బ్రభాభాసితమ్ము కాఁగ
నవినాభావమ్ములైన అనుబంధపు బంధాలను
నన్యోఽన్య సుసంబంధ జన్యజనక మూర్తులతో
నఖిలరూపు లవనిమీద సుఖరతులను సఖ్యగతుల
నలరారును సృష్టిస్థితు లభ్యుదయాలు లయగతులను
నక్షయమౌ నిత్యగతుల రక్షకమౌ తత్త్వాలను
నమరొందఁగఁ బంచభూత యజ్ఞక్రియ లెసయ సృష్టి
"నాభి"శక్తు లన్నింటిని నాశపరచు "నభి"శక్తుల
విధ్వస్తము కావించుచు విమలమైన దివ్యదీప్త
మహాశక్తి విశ్వమ్మున విహరింపఁగ నజయ్యమై
అభేద్యమై అమేయమై అమరమ్మై అనంతమై
లతివేలపు శక్తులతో నతిలోకపు మహిమలమై
నలరు సర్వసృష్టిరూప మమరంగా సహజగతుల
సత్యధర్మవిజయ మొప్ప నిత్యమైన ఋత ఋతులను ॥ 4542

†(3) అతిదుష్ట విషాగ్ని కాఁగ నఖిలమ్మును నాక్రమించి
ఆకాశము లనిలమ్ముల ననలమ్ముల సలిలమ్ముల
మృత్తులను నలరారెడి మించు పంచభూతమ్ముల
గోళమ్ముల లోకమ్ముల హాలాహల రూపాగ్నుల
ధ్వంసపరచి "నాభి"శక్తి తత్త్వమ్ముల రూపుమాప
యత్నించుచు మృషశక్తుల నసహ్యమౌచు దుష్టమైన
"అభి"శక్తుల నన్నింటిని నద్భుతముగ నాశపరచి
విశ్వప్రకృతి సంపదలను విమలమ్ముగ మలిపినిలిపి
సృష్టి యజ్ఞ సర్వస్వము స్థితిగతులను గాపాడుచు
నభ్యుదయావహముగాఁగ నఖిలమ్మును వర్ధిల్లఁగ
నసాధారణంపు గతుల సమల ప్రకృతివర్తిల్లును
దేవదేవపురుషశక్తి దివ్యతత్త్వ మహిమలమై ॥ 4543

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును వివిధగతుల మించి రూపుదాల్చునట్టి
విశ్వగోళలోకా లవి విరాజిలుచుఁ బరుగు లెత్తఁ
బంచభూతతత్త్వా లవి అలరారఁగ నశ్వములై
కాలరథము పయనించును గ్రాల ననంతయానమ్మును
అమలమైన ప్రాణశక్తి నతులమైన దీప్తశక్తి
ఆ ద్వంద్వము లంతర్గతి నలరారఁగఁ బ్రవాహముగ
నగును మృత్తత్త్వముతో నఖిలమైన ప్రకృతిరూపు
ఆ వెలుఁగుల వెల్లువగా నావిష్కృత మౌ సూర్యులు
వివిధ గోళ లోకాలకు విమలాధార మ్మౌచును
మండలములుగాఁగ సృష్టి మహత్తమ్ముగ నెరయుచుండఁ
గాలరథము మూర్ధములై క్రాలు నిత్య సత్యరతుల
మృత్యురహితమై వెలిఁగెడి ఋతరూపము- పాపరహిత
మహాశక్తి లీలకాఁగ మాయగాఁగ సకిల మౌచు ॥ 4544

†(5) ప్రకృతిపురుష హితకారిగ సుకృతదీప్త శక్తి కాఁగ
వరల పితృశక్తు లెల్లఁ బరిభ్రమణగతులు మీఱ
నధిపతియౌ గ్రహరాజుకు నభివందనకృతికాఁగను
నాత్మప్రదక్షిణలను నలరఁగఁ బ్రదక్షిణలను
మండలగత లోక గోళ తండా లవి తనరారును
సత్యరతుల నిత్యగతుల సంచరించుచుండి సదా
చరాఽచర ప్రకృతిలోన జడాఽజడ ప్రపంచాన
సకల ప్రాణికోటి దేహజాలమ్ముల నిండి యుండు
నంతరాంతరముల నుండు అల్పాల్ప మ్మగు పాపము
లవలేశ మ్మున్నఁగాని అవలీలగ రూపుమాపు
పూర్వదుర్గతీ నాశని పూతశక్తి సృష్టిలోన
వర్తిల్లఁగఁ గశ్మలాలు పటాపంచలై పోవును
నిత్యదీప్తమై వెలిఁగెడి సత్యరూప పుణ్యశక్తి
అజయ్య మౌ వీరతమై నలరారును సృష్టిలోన ॥ 4545

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) పంచభూతమాత్రరూప ప్రకృతిగాఁగ వరలుచుండు
నాకాశము లనిలమ్మును ననలమ్మును సలిలమ్మును
మృత్తతులును బలు పాళుల మించు గోళ లోకములై
రకరకాల దివులు కాఁగ వికృతులైన భువులు కాఁగ
జల వాయు లోకాలుగ జ్వలియించెడి గోళాలుగ
నపురూపపుఁ జలనశక్తి నమర ధరణ ధారణముల
ననుబంధపు గమనాలను నఖిలమ్మును సంచరింప
నిరంతర ప్రసారాల నిర్వికల్ప కాంతి కిరణ
జాలమ్ముల రవిశక్తులు సర్వప్రకృతి ప్రాణదమై
సదా వర్తిల్లుచుండుఁ జరాఽచర ప్రపంచాన
జడాఽజడ ప్రకృతి కెల్లఁ జైతన్యముఁ గలిగించెడి
ప్రియశక్తిగఁ జంద్రామృత ఋక్షదీప్త సర్వస్వము
విశ్వసృష్టి సకలమ్మున విషకల్మషము లన్నిటి
నాశపరచి పవిత్రతను నల్దిక్కుల నలరించును ॥ 4546

†(7) మిత్ర వరుణ రూపాలను మిన్నంటెడి అగ్ని జలము
లనిల మృత్తతులతో నాకృతిగా సదమలగతి
నలరారుచు సృష్టిలోన నద్భుతమౌ తేజాలను
సృష్టి స్థితి ప్రకృతిరూప చిద్విలాసముల నన్నిటిఁ
జెదరఁగొట్టి భ్రష్టగతుల ఛిన్నమ్ముగఁ జేయునట్టి
కశ్మలముల నన్నింటిని గకావికలుగాఁ జేయుచుఁ
గ్రాంతికాంతి శక్తులన్ నితాంతమైన దీప్తగతుల
నఖిల సృష్టిఁ బవిత్రముగ నలరారఁగఁజేయుచుండు
దైవీయమ్మౌ శక్తుల ధర్మమ్మది నిత్యమ్మును
రవి చంద్ర గ్రహ ఋక్ష రాజి రూపములుగ వరల
ధరణ ధారణంపు గతుల భరణ భారణంపు రతుల
సకల గోళ ప్రకృతులలో నకలుషగతి వరలంగాఁ
గశ్మలముల ధ్వంసపరచి క్రాలంగా శుభ్రగతులు
నారోగ్యమహాభాగ్య మైశ్వర్యము లందమ్ములు
ప్రకృతిపరములై వరలఁగఁ బ్రతినిత్యము చైతన్యపు
దివ్య నవ్య భవ్య గతులు నవ్యయమై పరఁగు సృష్టి ॥ 4547

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—135

ఋషిః—సుదాః పైజవనః; 8-విహవ్య ఆంగిరసః
దేవతా—ఇన్ద్రః
ఛందః—శక్వరీ; 4-6-మహాపంక్తిః; 7-త్రిష్టుప్; 8-జగతీ

(1) ప్రో ష్వస్మై పురోరథమిన్ద్రాయ శూషమర్చత ।
అభీకే చిదు లోకకృత్ సంగే సమత్సు వృత్రహా ఽస్మాకం బోధి చోదితా
నభన్తామన్యకేషాం జ్యాకా[1] అధి ధన్వసు ॥ 1554

(2) త్వం సిన్ధూగ్ంరవాసృజో ఽధరాచో[2] అహన్నహిమ్ ।
అశత్రురిన్ద్ర జజ్ఞిషే విశ్వం పుష్యసి వార్యం తం త్వా పరి ష్వజామహే
నభన్తామన్యకేషాం జ్యాకా[1] అధి ధన్వసు ॥ 1555

(3) వి షు విశ్వా[3] అరాతయో ఽర్యో నశన్త నో ధియః ।
అస్తాసి శత్రవే వధం యో న[4] ఇన్ద్ర జిఘాంసతి యా తే రాతిర్దదిర్వసు
నభన్తామన్యకేషాం జ్యాకా[1] అధి ధన్వసు ॥ 1556

(4) యో న [4]ఇన్ద్రాభితో జనో వృకాయురాదిదేశతి ।
అధస్పదం తమీగ్ం కృధి విబాధో[5] అసి సాసహి
ర్నభన్తామన్యకేషాం జ్యాకా[1] అధి ధన్వసు ॥ 1557

---

1. జ్యాకాఽఅధి, 2. ధరాచోఽఅహన్నహి, 3. విశ్వాఽఅరాతయో, 4. యో నఽఇన్ద్ర,
5. విబాధోఽఅసి. (వా.ప.)

(5) యో న¹ ఇన్ద్రాభిదాసతి సనాభిర్యశ్చ నిష్ట్యః ।
అవ తస్య బలం తిర మహీవ ద్యౌరధ త్మనా
నభన్తామన్యకేషాం జ్యాకా² అధి ధన్వసు ॥ 1558

(6) వయమిన్ద్ర త్వాయవః సఖిత్వమా రభామహే ।
ఋతస్య నః పథా నయాఽతి విశ్వాని దురితా
నభన్తామన్యకేషాం జ్యాకా² అధి ధన్వసు ॥ 1559

(7) అస్మభ్యం సు త్వమిన్ద్ర తాం శిక్ష యా దోహతే ప్రతి వరం జరిత్రే ।
అచ్ఛిద్రోధ్నీ పీపయద్యథా నః సహస్రధారా పయసా మహీ గౌః ॥ 1560

‡(8) అర్వాఞ్చమిన్ద్రమముతో హవామహే యో గోజిద్ధనజిదశ్వజిద్యః ।
ఇమం నో యజ్ఞం విహవే జుషస్వాఽస్య కుర్మో హరివో మేదినం త్వా ॥ 1561

## సూక్తము—135

ఋషి—పిజవన పుత్రుఁడు సుదాసుఁడు; 8-ఆంగిరసుఁడైన విహవ్యుఁడు†
దేవత—ఇంద్రుఁడు†

(1)*గీ॥ స్తోత్రవరులార! మీరలు స్తుత్యుఁడైన
యీ మహేంద్రుని ముంద టారాముమైన
యరదమొక్కటి కలిఁగె నా యరదము దరి
బలమునకు నర్చఁ జేయుఁడీ! పరమ భక్తి ॥ 4548

1. యోనఽఇన్ద్ర, 2. జ్యాకాఽఅధి. (వ్రా.ప్ర.).

‡"ఖిల" మంత్రముగా నిది కొన్ని వ్రాతప్రతులలోఁ గలదు. కొందరు దీనిని నధిక పాఠముగా భావింప మరి కొందరు ప్రక్షిప్తముగా భావించిరి.

†వ్రాతప్రతి 14వ సంపుటము 171వ పుటలో నీ సూక్తమునకు ఋషి "పిజవన పుత్రుఁడు సుదాసుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు" గాను వ్రాసి, 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో "సూదస్సు" ఋషి గాను, "ఇంద్రుఁడు" దేవత గాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ నిఖిల సంగ్రామ సంగమనీయమైన
వైరి బల మెల్లఁ జెంతకు వచ్చి యున్న
స్తోతలకు ధన[1] మొసంగుచుఁ దుష్టి మేము
జరుపు పరిచర్యలన్ హరి యెరుఁగుఁగాదె ॥ 4549

*గీ॥ మరియుఁ గుత్సితులైనట్టి కరము హింస
సలుపుచున్నట్టి యవరులై సాగునట్టి
శాత్రవుల కార్ముకంబుల జ్యాలు నష్ట
పడునుగావుత! నిజమైన పస దొరంగి ॥ 4550

(2)*చ॥ చెలఁగెడు నంతరిక్షమునఁ జేరెడు మేఘము గొట్టి యుండుటన్
జలము లధో ముఖంబులయి జారె భువిం గడు వేగఁ గావునన్
జెలువుఁడ వౌచు మాకు నిల శ్రీధన మిచ్చుచునుంటి విందర! ని
న్నిల నుతి హవ్య సంపదల నెక్కుఁవ వశ్యునిగా నొనర్పమే! ॥ 4551

*గీ॥ మరియుఁ గుత్సితులైనట్టి కరము హింస
సలుపుచున్నట్టి యవరులై సాగునట్టి
శాత్రవుల కార్ముకంబుల జ్యాలు నష్ట
పడునుగావుత! నిజమైన పస దొరంగి ॥ 4552

(3)*గీ॥ సర్వ శాత్రవ సంఘంబు సమయుఁ గాక!
నీ నిమిత్తము సన్నుతుల్ నిలుచుఁగాక!
నిందర! మమ్ములఁ జంపంగ నేగుదెంచు
వానిపై నాయుధంబుల వదలినావు! ॥ 4553

*గీ॥ ఇంద్ర! నీదు హస్త మెద్ది ధనంబును
నందఁజేయ హేతు వగునొ! యట్టి
కరము మాకు ధనముఁ గల్పించుటకుఁ గడు
దాత యగునుగాకఁ! దక్షిణంబ ॥ 4554

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

*గీ॥ మరియుఁ గుత్సితు లైనట్టి కరము హింస
సలుపుచున్నట్టి యన్యులై సాగునట్టి
శాత్రవుల కార్ముకంబుల జ్యాలు నష్ట
పడునుగావుత! నిజమైన పస దొరంగి ॥ 4555

(4)*గీ॥ శాత్రవుల నెల్ల యతిశయ శక్తితోడ
నభిభవించితి వో యింద్ర! యందువలన
నాయుధంబులు మా పైకి ననుపునట్టి
హింసకుని బాధపెట్టుమా! యెల్ల వేళ ॥ 4556

*గీ॥ మరియుఁ గుత్సితు లైనట్టి కరము హింస
సలుపుచున్నట్టి యన్యులై సాగునట్టి
శాత్రవుల కార్ముకంబుల జ్యాలు నష్ట
పడునుగావుత! నిజమైన పస దొరంగి ॥ 4557

(5)*గీ॥ సదృశ జన్మము గలిఁగిన శత్రు జనుని
నీచ జన్మము గలిఁగిన నీచ జనుని
బలము ద్యోలోక విస్తృతి వెలుఁగు దాని
స్వయముగా నాశనముఁ జేయు! వాసవుండ! ॥ 4558

*గీ॥ మరియుఁ గుత్సితు లైనట్టి కరము హింస
సలుపుచున్నట్టి యన్యులై సాగునట్టి
శాత్రవుల కార్ముకంబుల జ్యాలు నష్ట
పడునుగావుత! నిజమైన పస దొరంగి ॥ 4559

(6)*గీ॥ నిన్నుఁ గాంక్షించు మే మెల్ల నిర్మలేష్టి
సలుపఁబూనుచునున్నాము సవన మార్గ
మునను మా సర్వ పాపంబులం దదీయ
ఫలములన్ ద్రుంచివేయుమా! వాసవుండ! ॥ 4560

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
1. నిజమైన శక్తితోడ. (వ్రా.ప్ర.పా. యతిభంగము.)

*గీ॥ మరియుఁ గుత్సితు లైనట్టి కరము హింస
సలుపుచున్నట్టి యన్యులై సాగునట్టి
శాత్రవుల కార్ముకంబుల జ్యాలు నష్ట
పడునుగావుత! నిజమైన పన దొరంగి ॥ 4561

(7)*గద్యము॥
ఏ గోవు స్తోతకుఁ బ్రతిదినము పయస్సు నిచ్చుచుండునో! ఆ గోవు నిబిడోధస్క యగుటచే
బహు క్షీర ధారోపేతయై మహతియై యున్నది. మమ్ము క్షీరములచేఁ బ్రవర్ధింపఁజేయు
నట్లు దాని నొనర్చి స్తోతల మగు మా కొసంగు మింద్రుఁడా! ॥ 4562

(8)†క॥ మహితాఽజయ్య సుశక్తుల
విహితుం డౌ వైష్ణవుఁ డతివేలము లొచున్
రహి మించు ప్రదక్షిణలను
సుహవ్య మాత్మప్రదక్షిణోజ్జ్వల గతులన్ ।♦ 4563

†క॥ గోశమ్ముల ధన సంచయ
జాలమ్ముల నశ్వితతుల జయ మొందంగాఁ
గాలాఽధిపతిగ వరలుచు
లోలుపతల నాధిపత్యరూపుఁడు హరి యౌ ॥♦ 4564

## సూక్తము—135

ఋషి—పిజవన పుత్రుఁడు సుదాసుఁడు 8-ఆంగిరసుఁడైన విహవ్యుఁడు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) అదృశ్యమాన రూపమ్మున ననిలమ్ములు పయనించును
వైష్ణవీయమైన దివ్య భావాంతర్గత శక్తులు
గోచరమ్ము కాకుండఁగ గోవ్య దీప్త గతు లొప్పఁగ
ముందుదారి చూపుచుండఁ బురోగామి యౌచు నిలిచి
కనిపించని కాలరథము క్రాలి సంచరించు నిలిపి
అనిలరథము కూడఁ దిరుగు నదృశ్యంపు గతులు మీఱ

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి
†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము.

నసాధారణంపు గతుల నమేయంపు స్థితులతోడ
"నభి"శక్తుల రూపు దాల్చి అఖిలమ్మున వ్యాపింపఁగ
జలనాభిని హరియించెడి ఛల వృత్రుని సంహరించు
నసూనమైన అగ్నిశక్తి అనాహతంపు రూపమ్మున
నగమ్యముగ నగోచరముగ నగణితమౌ వేగమ్మున
దశదిశలను దాఁటిపోవు నిశి దినాల దిగంతాల
నజయ్యమై తనరారును విజయపతాక నెగురవేయు
చిన్మయగతి మనో రూప తన్మయ శక్తులు వరలఁగ
నపరాకాశమ్ముగాఁగ నద్భుతగతి పరఁగంగా
ననాకార మభేద్యమై నాకాశము నధిగమించు ॥† 4565

†(2) పంచభూత తత్త్వాలకు సంచితముగ మైత్రి మీఱ
నాధిపత్యమును వహించు ననంతమైన ఐంద్రిశక్తి
వైష్ణవీయ పంచేంద్రియ కృష్ణశక్తు లలరారఁగ
నశత్రుతా రతులమెయిని నతిలోకపు శక్తులతో
నతివేలపు రక్తులతో నసాధారణంపు గతుల
నజయ్యమౌ నమేయమౌ నభేద్యమౌ ననంతమౌ
దివ్యశక్తు లలరారఁగ దీవ్యమాన గతులు వెలయ
విశ్వమ్మున వాయుగతుల వెలుఁగు ప్రాణతతులు వరల
మధురమైన జలగతులను మహిమాన్విత త్రాణశక్తి
వ్యాప్తి చెంద నిత్యగతుల గుప్తశక్తు లలరారఁగ
నిజము దేవుఁ డెరుఁగు రీతి నీరు పల్ల మెరుఁగు పగిది
విష్ణుపాదోద్భవిగా వెలువడు జల ముపరి గతులఁ
గ్రిందఁ గారి ఝడితిమెయిని నిందుమౌళి దివ్యమైన
శిరోభాగమందు నిరత సరాగాలు మీఱఁ బడుచు
సతతమ్మను బ్రవహించును జ్వలితాగ్నులు గర్భితముగఁ
బ్రకృతిమాత ప్రాణదముగ సుకృతమైన త్రాణదముగ
"నభి"శక్తుల వృత్రాసురు నంత మొందఁజేసి సృష్టి
"జలనాభు"లఁ గాపాడెడి శంకరమౌ మనశ్శక్తి
అపరాకాశమ్ము కాఁగ నద్భుతగతి పరఁగంగా
ననాకార మభేద్యమై ఆకాశము నధిగమించు ॥ 4566

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) అమలమైన అనలశక్తి అనిలశక్తి జలశక్తులు
మృణ్మయమౌ తత్త్వశక్తి మింటిగతుల స్వచ్ఛతమై
సకల విశ్వ సృష్టిలోన సర్వ కల్మషావళులను
నాశపరచి పంచభూత నవ్య నిత్యగతుల వరలు
పరిశుద్ధతా గరిమ వెలుఁగఁ బవిత్రతా భరితముగా
నపురూపమౌ శక్తుల ననిల సలిల సముచ్చయాలు
ననలరూప స్వచ్ఛతమై నలరారఁగ నమృతగతులఁ
బ్రకృతి సంపదలు వరలఁగ రామణీయమైన సహజ
శక్తితత్త్వ రూపమ్ముల సర్వమ్మున వ్యాప్తి చెంది
ధిషణా రతి రకరకాల దివ్య భాగ్యమ్ముల జగతిని
నజయ్యమై అభేద్యమౌ ననాహతంపు దివ్యశక్తి
అర్యముఁడౌ నాదిత్యుని నపూర్వంపు దీప్తగతుల
మనోరూప గుప్తశక్తి మహిమాన్వితమై వరలును
బుద్ధి శక్తి కతీతమై పూర్ణ పవిత్ర రూపమ్మున
నపరాకాశమ్ముగాఁగ నద్భుత గతి వరఁగంగా
ననాకార మభేద్యమై ఆకాశము నధిగమించు ॥ 4567

†(4) అఘరూపపుఁ బ్రతికృతిగా "నభి"శక్తి స్వరూపముగ
నావరించి అఖిల సృష్టి నాకాశము కలుషగతుల
నమరమైన అమలమైన హాయి గొలుపు సుగంధాల
ననిల మ్మది దుర్గంధపు టతిమలముగ రూపొందఁగ
నతి శుచిగా వెలుఁగొందుచు నతిలోకపు దీప్తి గలుగు
ననల మ్మొక క్రూరాగ్నిగ నతివిషమై వెల్గొందుచు
మధురమైన సలిలమ్ములు మలినమయము లౌచు నిలువ
శక్తివంతమైన పృథ్వి చండాలపు మరుభూమిగ
రూపొందఁగఁ జేయునట్టి క్రూరమైన విషశక్తులు
వృత్రాసుర శక్తులుగా సృష్టిలోన విస్తరిల్ల
ధ్వంసపరచి సంహరించుఁ బరాభూతమై నశింప
వైష్ణవీయ మహాశక్తి వజ్రరూపమున వెల్గుచు
విశ్వ ప్రకృతిరూపమునకు విజయ శక్తి రక్షగాఁగ
విలసిల్లును నిత్యమ్మును విధికే విధి యౌచు నిలిచి

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

పంచేంద్రియ తత్త్వమ్ములఁ బంచభూత శక్తితతుల
నఖిలమ్మును విస్తరిలఁగ నమలమైన నిత్యగతుల
సృష్టి స్థితు లలరారుచు వ్యష్టి సమిష్టి రతులమైని
చిన్మయగతి మనోరూప తన్మయమౌ విజయమ్మున
నపరాకాశమ్ముగాఁగ నద్భుతగతి వరఁగంగా
ననాకార మభేద్యమై ఆకాశము నధిగమించు ॥† 4568

†(5) దివి భువి లోకా లన్నిట వివిధ గోళ సర్వాలను
నస్తవ్యస్తము కాఁగను నవకాశము లేకుండఁగ
నాకసమునఁ జికాకుగా నావహిల్ల మలినాళులు
నతిలోకిపుఁ జలనమ్ముల నఖిలమ్మున సంచరించు
ననిలమ్మును బంధించుచు నలమటింపఁ జరాచరాలు
ననలమ్ములు స్తంభింపఁగ నతివేలపు జ్వాల లెల్ల
నణఁగారఁగ దీప్తిరహిత కణములుగా రూపొందఁగ
సృష్టిలోని జలశక్తులు నష్టమౌచు నింకిపోవ
ధూళి ధూసరమ్ము కాఁగ దుమ్ము కాఁగఁ బృథ్వి యెల్ల
శక్తి శైణ్యమ్ముతోడఁ దృక్తములై రిక్తములై
పంచభూత రూపా లవి వరలఁగ నన్యోఽన్య బంధ
సంబంధాఽవినాభావము లంబరములై బలహీనత
జవజవలాడఁగఁ జేసెడి శత్రుశక్తు లన్నింటిని
శమయింపఁగఁ జేసి ప్రకృతి సహజత్వమును నిల్పుచు
ననాహతమ్మై తనరెడి మనశ్శక్తి మహితముగా
అజయ్యమై అభేద్యమై అఖిలమ్మును ధిక్కరించి
అపరాకాశమ్ముగాఁగ నద్భుతగతి వరఁగంగా
ననాకార మభేద్యమై ఆకాశము నధిగమించు ॥ 4569

†(6) సత్యరూప మార్గమ్ముల సర్వ జగతి వర్తిల్లఁగ
వైష్ణవీయమైన శక్తి వర్తిల్లుచు వర్ధిల్లుచు
సృష్టిలోని దుష్టశక్తి వ్యష్టి సమిష్టి రూపాలను
నన్నింటిని నాశపరచి విన్నాణపు విశ్వమ్మును
విరాజిల్లఁజేయు మహా విరాడ్రూప గోళ లోక
జాలమ్ములు సంచరింప సత్ప్రథాన మహితగతుల

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ఆకాశముతో ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
మృత్తులును సఖ్యముగా మిన్నంటుచుఁ దనరారఁగ
ననిలముతో నాకాశము ననలమ్ములు సలిలమ్ములు
మృత్తులును సఖ్యముగాఁ దత్తత్త్వమ్ముగఁ బరఁగఁగ
ననలముతో నాకాశము ననిలమ్ములు సలిలమ్ములు
మృత్తులును సఖ్యముగా మేళనమ్ము నొంది వెలుఁగ
సలిలముతో నాకాశము కరువలియును ననలమ్మును
మృత్తులును సఖ్యముగా హత్తుకొనఁగ నభిన్నతల
మృత్తులతో నాకసమ్ము మరుత్తు లనలమ్ములు
సలిలమ్ములు సఖ్యముగా వెలుఁగు విష్ణు మనశ్శక్తి
అపరాకాశము కాఁగ నద్భుతగతి వరఁగంగా
ననాకార మభేద్యమై ఆకాశము నధిగమించు ॥† 4570

†(7) వైష్ణవీయమైన శక్తి వరలు సహస్రధార కాఁగ
ఆకసంపు రూపమ్ములు ననిలమ్ముల రూపమ్ములు
ననలమ్ముల రూపమ్ములు నా జల రూపావళులును
బృథ్వుల రూపమ్ము లెల్ల విలసిల్లును నొకటొక్కటి
సహస్రరూప ధారలుగా సకలసృష్టి వర్తిల్లుచు
శిక్ష కాఁగ రక్ష కాఁగ నక్షయమౌ సఖ్యమ్ముగ
భేద్యమై అభేద్యమౌచు భిన్నమై అభిన్నమౌచు
అవినాభావత్వ మలరు నదృష్టంపు శక్తులమై
నఖిల లోక గోళాదులు నలరంగాఁ బంచభూత
రూపమ్ముల మహిత మౌచు రోదోఽంతరాళమ్మున
నిత్య చలన భావమ్ముల సత్యగతుల సంచరించు
విశ్వసృష్టి సర్వమ్మున విమలాఽమృత శక్తులతోఁ
గాంతికిరణజాలమ్ములు కాంతిలంగా బహుముఖాలఁ
బంచభూత తత్త్వాలను వరలంగా దివ్యశక్తి
మధురమైన విహితగతుల మహితములై తనరారఁగ
శబ్దశక్తు లెల్ల సృష్టి సహజములై వ్యాపింపఁగ ॥ 4571

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(8) సకల లోక గోళమ్ముల జయించి వెలుఁగు నా విష్ణువు
సర్వవసు సుసంపదాళి శాశ్వతగతిని జయించుచుఁ
గాంతితతుల నన్నింటిని గ్రాలఁగ జయించివైచి
ప్రకృతిరూప శక్తితతుల ప్రభా దీప్తగతులమెయిని
విశ్వసృష్టి యజ్ఞమ్మున వెలుఁగు హవ్య మౌచు వరలు
అఖిలాఽఖిలమైన ప్రకృతి నద్భుతగతి తోడంగా
నాకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును దేవదేవ ఋషియజ్ఞమ్మందు మహిత
హవముగాఁగఁ బ్రజ్వలిల్లు హరి నైవేద్యమ్ముగాఁగ
నణుపరమాణువులై సకలము నాజ్యముగాఁ దనరారుచు
ననలాంతర్గత శక్తుల నైంద్రరూప పంచభూత
రూపతత్త్వ సర్వస్వము రోదసిలో సంచరింపఁ
బరిగ్రహించుఁ బ్రకృతి నెల్లఁ బరమేశుని లీలగాఁగఁ
బ్రభవించును నావిష్కృతి బహురూపుల విశ్వమ్మై ॥• 4572

## సూక్తము—135

ఋషి—పిజవనపుత్రుఁడు సుదాసుఁడు; 8-ఆంగిరసుఁడైన విహవ్యుఁడు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

†(1) ప్రకృతిరూప విశ్వరథము ప్రార్చనమై ముందు సాఁగ
నింద్రునికై శోష లేని యింద్రియ తత్త్వమ్ముతోడ
నశ్వదీప్త లొప్పారఁగ నపురూపపుఁ దేజమ్ముల
నశ్వములై ముందు నడువ- నఖిశక్తులతో సృష్టిని
"నాక" శక్తి మింగివైచు నానావిష కలుషాగ్నుల
నార్పివైచి ధ్వంసపరచి నారాయణ దీప్తగతుల
నారాచము విజృంభింపఁ బార మెనయనట్టి వృత్రుఁ
బరాభవించి పరాక్రమించి చరాచరము [illegible]
[illegible]హరించి అరిమూఁకల [illegible] శంకరతత్త్వము
దశదిశలను విలసిల్లఁగ [illegible] తోడ
[illegible] దనుశక్తి సమల భూతతత్త్వమ్ముల
[illegible]లోకముగా నిల్చును సఖిలమ్మును సంచరింప ॥ 4573

---

†రచయిత:—వాఙ్మయ మహోద్యమి, డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"ఖిల" మంత్రానువాదము.

†(2) విధ్వంసము కాకుండఁగ నరిగి పోక విష శక్తుల
దీప్తు లెల్ల సృష్టిలోనఁ దేజరిలుచు నిత్యమ్మును
నాదిశేషు వౌచు సత్య మాది రూప మై వరలఁగ
నాకసంపు ఘుక్కు కాఁగ ననిలషుక్కు ననలఘుక్కు
సలిలఘుక్కు మృద్ఘుక్కుగ నదమలమౌ శక్తులతో
సర్వ భూత సంచయాల సంచరించి అంతర్గతి
బాహిర రూపమ్ములతోఁ బ్రాణశక్తి విలసిల్లఁగ
నశత్రు వౌచు నఖిలమ్మున నద్భుతముగ భరియించుచుఁ
గ్రిందు మీఁదు లోకాలను ఋష గ్రహ గోళాలను
విశ్వమ్మునె కాపాడును విషరూపపు శత్రుతత్త్వ
శక్తుల నన్నింటిఁ గూడ త్యక్త విగత ప్రాణగతుల
విధ్వస్తము కావించుచు విశ్వగతిని గాపాడుచు
నాకసమున ధనుశ్శక్తి అమల భూతతత్త్వమ్ముల
నతిలోకముగా నిల్పును నఖిలమ్మును సంచరింప ॥ 4574

†(3) ఆర్యముఁడౌ నాదిత్యుని నమృతమౌ శక్తులతో
విశ్వమ్మున వ్యాప్తి చెందు విషప్రాయ శత్రుతతుల
దీ శక్తులు తేజరిలఁగ దివ్యశక్తి వర్ధిల్లఁగ
నతిలోకమ్మై తనరుచు నతివేలమ్మై వెలిఁగెడి
అజయ్యమైన మనశ్శక్తి అనాహతంపు గతులమెయిని
నష్టపరచి నాశపరచి నవశక్తులఁ బ్రకృతిలోన
నసాధారణంపు గతుల నమృతమయముగాఁగ జగతి
నఖిలమ్మున విస్తరిలుచు నైంద్రశక్తి వ్యాపింపఁగ
అష్టవసు సుసంపదాళి అపురూపముగా వెలయఁగ
ధనరాశులు ప్రకృతి కెల్ల ననంతముగ సహజముగా
నాకసమున దనుశ్శక్తి అమల పూతతత్త్వమ్ముల
నతిలోకముగా నిల్పును నఖిలమ్మును సంచరింప ॥ 4575

†(4) తమశ్శక్తు లన్నింటిని దరిమివైచి- నీచమ్ముగ
నధోగతుల నందంగా నధఃపాతాళ మందఁ
బ్రకృతిఁ బంచభూతమ్ముల సుకృతములౌ శక్తులతో
జలశక్తుల నాకాశము ననిలమ్మును ననలమ్మును

†రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాకర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సలిలమ్ములను మృత్తతులను సర్వమున సమైక్యగతుల
నన్యోఽన్యమౌ బంధమ్మతివేలపు సంబంధపు
టవినాభావాలమెయిని నఖిల సృష్టి వర్తిల్లఁగ
వైష్ణవీయమైన ఐంద్ర ప్రభాదీప్త శక్తు లలర
సర్వశత్రు తండాలను సంహరింప నిత్యమ్మును
సత్యగతుల సృష్టిలోన జ్వలితమౌ నసిధారల
నపురూపపు దీప్తులతో నఖిలసృష్టి తనరారఁగ
నజయ్యమౌచు నభేద్యమౌచు నలరారఁగ నపురూపత
నాకసమున ధనుశ్శక్తి నమల భూతతత్త్వమ్ముల
నతిలోకముగా నిల్పును నఖిలమ్మును సంచరింప ॥† 4576

†(5) అభేద్యమైన శక్తులతో నైంద్రమైన ప్రకృతిరూపు
నష్టనాభి జలనాభియు నొనరంగా శితనాభి
ఉపర్యధోలోకాలను నుత్తమమౌ దీప్తరతుల
బహిరంతర రూపమ్ములఁ బ్రాకృతమై వ్యాపించును
సత్యగతుల సంచరించి నిత్యతత్త్వ మహిమలమై
దివి భువి లోకా లన్నిటి నవికలముగ విస్తరిల్లి
సర్వకాలములనుగూడ సదమలగతి వర్తిల్లఁగ
"నభి"శక్తులు నాశమౌచు నతిలోకపు దీప్తులమై
నతివేలపు రూపాలను నపురూపపు శక్తులతోఁ
బ్రాకృతమై తనరారెడి బలీయ సహజరూపమ్ములఁ
బ్రకృతి శత్రుతత్త్వాలవి భ్రష్టమౌచు క్షీణగతుల
విధ్వస్తమ్మై పోవఁగ విశ్వ సౌభాగ్య మలర
నాకసమున ధనుశ్శక్తి అమల భూతతత్త్వమ్ముల
నతిలోకముగా నిల్పును నఖిలమ్మును సంచరింప ॥ 4577

†(6) విశ్వసృష్టి నేతృత్వము విష్ణుమహాశక్తిమెయిని
నైంద్రతత్త్వ మలరారఁగ నఖిల పంచభూతమ్ముల
నలరారును జగము లెల్ల నపురూపమౌ గతులను
నాకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
పృథ్వులు నీ సర్వసృష్టి ఋత ఋతువుల రూపు లలర
నిత్యసత్యగతులతోడ నిరతప్రకృతి శక్తులతో

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నఖిల సృష్టిలోన నిలుచు నఘరూపము లన్నింటిని
గశ్మలాలఁ గల్మషాల రశ్మిరహిత తిమిరాళుల
విధ్వంసము కావించుచు వినాశమ్ముఁ జేసివైచి
దురితపుంజముల నెపుడును దరిని జేరనీయకుండ
నజయ్య మౌచు నభేద్య మౌచు నఖిలలోక రూపమ్ముల
నా పంచభూత తతుల నాదిభూతగత మ్మౌచు
నాకనమున ధనుశ్శక్తి నమల భూతతత్త్వమ్ములు
నతిలోకముగా నిల్పును నఖిలమ్మును సంచరింప ॥† 4578

†(7) ఐంద్రిమైన వైష్ణవీయ యజ్ఞసృష్టి సర్వశక్తి
సచ్చిదానందమ్ముగ సర్వప్రకృతి వరలంగా
సహస్రిమైన ధారలుగాఁ జద లెల్లను దనరారును
సహస్రిమైన ధారలుగా సకలమ్మున ననిల మలరు
సహస్రిమైన ధారలుగా సర్వమ్మున ననల మలరు
సహస్రిమైన ధారలుగా సలిల మలరు సృష్టిలోన
సహస్రిమైన ధారలుగా మహీరూప మ్మలరుచుండు
నపురూపపు శక్తుల మై నతిలోకపు శక్తుల మై
నతివేలపు రూపుల మై నసాధారణంపు గతుల
నన్యోఽన్యసుసంబంధ మ్మవినాభావాల మెయిని
ననుబంధము లలరారఁగ నభేద్య మైన సత్యగతుల
వివిధములౌ గోశమ్ములు వెలయఁ బంచభూతములును
అధికాధిక మై పంచభూతైకత్వము సృష్టిలోనఁ
బరఁగంగా బహుగతులను వరలు గోశ లోకమ్ములు ॥ 4579

†(8) నిత్యగతుల విశ్వసృష్టి సత్యరతుల వ్యాప్త మౌచుఁ
దనరారెడి విశ్వరూప ఘనశబ్దమయమ్మైన
శక్తిరూప సర్వస్వము జయించివైచి అమేయముగ
వ్యష్టి సమిష్టిగతుల నలరు సృష్టిలోని ధనసంపద
నంత మెసయకుండ వెలుఁగు సర్వ సముచ్చయా లన్నిటి
కాధిపత్య గతులు నిలుప నఫలవిజయ మంద నిత్య
దీప్తరతుల సృష్టిలోనఁ దేజరిల్లఁ బ్రకృతి నెల్ల
హవము చేసి విశ్వమ్మునె హవ్యముగా నలరించుచు
హరి విలసిల్లఁగఁ జేయును నఖిల పంచభూతాలను
సృష్టి స్థితి లయరతులను జెన్నొందఁగ నిత్యగతుల ॥ 4580

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—136

ఋషిః—1-6(పూర్వార్ధస్య)మాన్ధాతా యౌవనాశ్వః
ఋషికా—6-(ఉత్తరార్ధస్య); 7-గోధా
దేవతా—ఇన్ద్రః
ఛందః—మహాపంక్తిః, 7-పంక్తిః

(1) ఉభే యదిన్ద్ర రోదసీ [1]ఆపప్రాథోషా ఇవ ।
మహాన్తం త్వా మహీనాం సమ్రాజం చర్షణీనాం
దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్ ॥ 1562

(2) అవ స్మ దుర్హణాయతో మర్తస్య తనుహి స్థిరమ్ ।
అధస్పదం తమీం కృధి యో[2] అస్మాగ్ం ఆదిదేశతి
దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్ ॥ 1563

(3) అవ త్యా బృహతీరిషో విశ్వశ్చన్ద్రా[3] అమిత్రహన్ ।
శచీభిః శక్ర ధూనుహీన్ద్ర విశ్వాభిరూతిభి
ర్దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్ ॥ 1564

(4) అవ యత్ త్వం శతక్రతవిన్ద్ర విశ్వాని ధూనుషే ।
రయిం న సున్వతే సచా సహస్రిణీభిరూతిభి
ర్దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్ ॥ 1565

---

1. రోదసీఽఆపప్రాథోఽఇవః, 2. యోఽఅస్మాగ్ంఽఆదిదే, 3. విశ్వశ్చన్ద్రాఽఅమిత్ర. (వ్రా.ప్ర.)

(5) అవ స్వేదా [1]ఇవాభితో విష్వక్ వతస్తు దిద్యవః ।

దూర్వాయా[2] ఇవ తన్తవో వ్యంగస్మదేతు దుర్మతి

ర్దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్ ॥ 1566

(6) దీర్ఘం హ్యంకుశం యథా శక్తిం బిభర్షి మన్తుమః ।

పూర్వేణ మఘవన్ పదా ఒజో వయాం యథా యమో

దేవీ జనిత్ర్యజీజనద్భద్రా జనిత్ర్యజీజనత్ ॥ 1567

(7) నకిర్దేవా మినీమసి నకిరా యోపయామసి మన్త్రశ్రుత్యం చరామసి ।

పక్షేభిరపికక్షేభిరత్రాభి సం రభామహే ॥ 1568

## సూక్తము—136

ఋషి—మాంధాత యగు యౌవనాశ్వుఁడు†

ఋషిక—గోధ†

దేవత—ఇంద్రుఁడు†

(1)*చ॥ అనువుగ రోదసీతలము నత్యధికం బగు కాంతి చేత నే
నొనరఁగఁ గప్పియుంట నిఁక నుచ్ఛ్రిత కల్యము సర్వలోకమున్
గనునటు చేసియుంట నతిగౌరవ మందితి విందర! యీశ్వరున్
నినుఁ గని దేవియా నదతి నిత్యము భద్రగ నుండు[3]గాదొకో! [4] ॥ 4581

---

1. స్వేదా॰ఇవా, 2. దూర్వాయా॰ఇవ. (వ్రా.వ్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 175వ పుటలోని సూక్తమునకు ఋషి "యువనాశ్వ పుత్రుఁడు మాంధాత. 7వ దానికి గోధ యను బ్రహ్మవాదిని"గాను. దేవత "ఇంద్రుఁడు"గాను వ్రాసి, 1 నుండి సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "మాంధాత, గోధ"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీవేమూరివారు వ్రాసిరి.

3 గాదెకో. (వ్రా.వ్ర.పా.)

*రచయిత:—శాస్త్రరత్న, శ్రీ వేమూరి వేంకటనరసింహశాస్త్రి

4. చ॥ అనువుగ రోదసీతలము నత్యధికంబగుఁ గాంతిచేత నీ
వొనరఁగఁ గప్పియుంట యిఁక నుచ్ఛ్రిత కల్యము సర్వలోకముం
గనునటు లింద్ర! దేవతల గౌరవ మందిన వాని నీశ్వరున్
నిను గని దేవియా నదితి నిత్యము భద్రగనుండు చూడగన్ ॥ (తొలి పాఠము)

(2)*చ॥ అనయము మాకు బాధ లిడునట్టి కుశత్రుని బాదవర్తిగా
నొనరిచి దుఃఖపద్ధతి మహోన్నతరీతిని గల్గఁజేయు దు
ర్గుణుల బలంబు నీచముగఁ గూర్పు మహేంద్రుఁడ! నీవు ప్రీతితో
నినుఁ గని దేవియౌ నదితి నిత్యము భద్రగ నుండుఁ [1]గాదొకో ॥ 4582

(3)*చ॥ అనయము శత్రుహంతక! మహాత్మక! నీ బహు శత్రులన్ సదా
ఘన మగు సట్టి స్వర్ణములఁ గల్గినయట్టి మహాన్నరాశితోఁ
గనలెడు రక్ష మా కిపుడు కల్పనఁజేయుము! ప్రీతి ముందరన్
నినుఁగని దేవియౌ నదితి నిత్యము భద్రగ నుండుఁ [1]గాదొకో! ॥ 4583

(4)*చ॥ అనయము సోమమున్ గొనెడు నా యజమానున కెప్పు డీవు స
ద్వినుత మహాన్న మిచ్చెదవొ! దీక్షగ నప్పుడె పుత్రులన్ గన
ద్ధనములఁ బెక్కు రక్షలను దద్ద నొసంగు మహేంద్ర! ప్రీతితో
నినుఁ గని దేవియౌ నదితి నిత్యము భద్రగ నుండుఁ జూడఁగన్ ॥ 4584

(5)*చ॥ తనువులనుండి స్వేద మెటు తద్దయుఁ గారునొ! యట్టు లింద్ర! నీ
ఘనతర దీప్తిఁ దా బహు ముఖంబుల వచ్చునుగాక! వెండియున్
దృణము విధాన నీ దయినదీప్తియు విస్తృతిఁ గాంచు నంతటన్
నినుఁ గని దేవియౌ నదితి నిత్యము భద్రగ నుండుఁ జూడఁగన్ ॥ 4585

(6)*చ॥ సృణిని విశేషశక్తిని ధరించుచునుంటివి జ్ఞానవంతుఁడా!
ధనపతి! యింద్ర! ఛాగ మెటు దాల్చునొ! శాఖను నట్లు శక్తి నీ
వును నరి మండలిన్ దునుమఁ బొందుచునుంటివి! కిన్కఁ బ్రీతితో[2]
నినుఁ గని దేవియౌ నదితి నిత్యము భద్రగ నుండుఁ జూడఁగన్ ॥ 4586

(7)*గద్యము ॥
ఓ యింద్రాదులారా! మీ విషయమై యేమియు హింసింపము. అననుష్ఠానమున మోహింపఁ జేయము! కాని మంత్రస్మార్యము శ్రుతి ప్రతిపాద్యము నగు యుష్మద్విషయకర్మము నాచరింపఁగలము. పక్షస్థానీయము లగు స్తుత శస్త్రములచేతను హవ్యములచేతను నీ యజ్ఞమందు నన్ని విధముల మిమ్ము నవలంబింపఁగలము ॥ 4587

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. గాదెకో! (తా.పా.), 2. కిన్కఁబూనుచున్. (తా. పా.)

## సూక్తము—136

ఋషి—మాంధాత యగు యౌవనాశ్వుఁడు

ఋషిక—గోధ

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

†(1) ఆకాశము కాంతితతుల నలరారఁగ నిత్యమ్మును
నసిలమ్ములు సలిలమ్ములు నంతర్గతిఁ దనరారఁగ
గాంతితతుల నిత్యమ్మను గ్రిలంగా మృత్తతులును
అగ్నిరూప మహోరాత్రు లపురూపపుఁ దేజమ్ముల
ననునిత్య మ్మనుస్యూత జనితగతుల వెల్గుచుండ
మహత్త్వాల మహత్త్వముల నహరహమ్ము తనరారుచు
నణు పరమాణువులందు సతత మంతర్గతి జ్వలియించుచు
దివిభువులను నన్నింటను దివ్యతత్త్వ మనువొందఁగ
నిత్యగతుల సత్యగతుల నిఖిలమ్మునఁ బంచభూత
తత్త్వా లవి రూపమ్ములఁ దనరారుచు మహిత శక్తి
ప్రకృతిరూప సర్వస్వము ప్రభవించును దేవి కాఁగఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును భద్ర కాఁగ ॥ 4588

†(2) మృదూపమ్ముకన్న మించు సలిల శక్తి సృష్టి
సలిలరూపముకన్న శక్తివంత మౌను నగ్ని
అనలరూపముకన్న ననిలమ్ము బలీయ మౌను
ననిలమ్ములకన్నను నతిబలీయమౌ గగనము
చలిత మౌచు జ్వలిత మౌచు స్థిరమౌ నది పృథ్వి రూపు
సూక్ష్మాతిసూక్ష్మమ్ముగ సృష్టి సర్వరూపాలను
వెలుఁగొందుచు నిత్యమ్మను విశ్వ మ్మది వర్తిల్లఁగఁ
దమోరూప తండాలను దరిమివైచి దూరముగా
నధఃపాతాళమునకు నధఃకరించి పంపివైచు
ద్వైపీయమ్మౌ దీప్తుల త్రిసరేణువు లలరంగా
నసాధారణంపుగతుల నాదిత్యపు శక్తులతో
వైష్ణవీయ పంచభూత కృష్ణైంద్ర శక్తుల మైఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును దేవి గాఁగఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును భద్ర కాఁగ ॥ 4589

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(3) విశ్వసృష్టిలోన వరలు వివిధ చాంద్రశక్తు లెల్లఁ
జలువల వెన్నెలల మై నలరారఁగఁజేసి ప్రకృతి
ప్రాణాంతకాఽనారోగ్య మతిరూప మ్మై తనరుచుఁ
జరాఽచర ప్రపంచాన జడాఽజడ ప్రకృతులందు
నమిత్రమైన తత్త్వాలను నంతర్గత బహిర్గతుల
రకరకాల రుగ్ణతలను వికల మ్మొనరించు దుష్ట
త త్త్వమ్ముల నన్నింటిని ధ్వంస మ్మొనరించుచుండు
సృష్టిలోని వివిధగోళ లోకాలను సకలమ్మును
గ్రాంతి కాంతి సర్వస్వము గగనమ్మున విలసిల్లఁగ
ధనుశ్శక్తి రూపమ్మునఁ దనరారుచు మహాశక్తి
శక్రశచీరూపమైన సౌందర్యోపేతగతుల
నసాధారణంపు రీతి నైశ్వర్యము నొనఁగి జగతిఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును దేవి గాఁగ
బ్రకృతిరూప సర్వస్వము బ్రభవించును భద్ర కాఁగ ॥ 4590

†(4) మహావిష్ణు దివ్యశక్తి మహిమాన్వితమై జగతిని
నఖిలలోక గోళాలను నపురూపపు శక్తులతో
నభ్యుదయావహము కాఁగ నఖిలాంతర్యామి గతుల
బహిరంతరరూపమ్ముల బహురూపమ్ములఁ బ్రకృతిన్
శత క్రతువు లొనరించుచు సతతమ్మును బ్రభా జాల
సంచయాలు ప్రసరించుచు సకల వసు సుసంపదాళి
ప్రాకృతమౌ శక్తితతుల సుకృతాన్విత దీప్తి భరిత
సంరక్షణ శక్తు లెల్ల సహస్రగతుల సృష్టిలోన
విశ్వరూప మొచుఁ బ్రబలి విశదగతుల వ్యాపించుచు
సృష్టిలోని స్థితిశక్తిని జీవగతుల బలపరచుచు
నభ్యుదయావహము గాఁగ నఖిలమైన చైతన్యము
సంవర్ధకగతులు వరల సదా పరఁగఁ బురుషశక్తి
ప్రకృతిశక్తి రూపమ్మునఁ బ్రభవించును దేవి గాగఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును భద్ర కాఁగ ॥ 4591

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(5) విశ్వ లోక గోళమ్ముల వివిధములౌ సూర్యచంద్ర
ఋక్షగ్రహరాజిలోన ఋతశక్తుల ప్రభావాల
అసమానత వెలుఁగొందెడు నసాధారణమ్ములైన
గోళమ్ములు తనరారును గూఢ దివ్యశక్తు లలర
నంతరిక్షమందుఁ బొంది అతిలోకపు శక్తులతో
నీవాః నేనాః అనుచును నిరతాఽఽకర్షణశక్తుల
సతతమ్మును బోటీపడ సంవర్ధక మౌచునుండు
అల్పాఽల్పములౌ గోళమ్మ లనేకమైన రూపాలను
రకరకాల స్థాయులలో వికటములౌ శక్తులతో
వికృతములై దేవదేవు విశ్వజనీనమౌ దీప్తిని
వికటములై ధ్వంస మగును గశావికలు కాఁగ సృష్టి
సమానమైన శక్తులతో నమానుషంపు దుర్గతులను
దుర్మార్గగ ప్రభావాల ద్యోలోకము ధిక్కరించు
దుష్ట చరాఽచర ప్రకృతిని భ్రష్టపరచు నాశపరచుఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును దేవి కాఁగఁ
బ్రకృతిరూప సర్వస్వము ప్రభవించును భద్ర కాఁగ ॥ 4592

†(6) వైష్ణవీయ మౌచు వెల్గు ప్రభారూప దివ్యశక్తి
ననుగ్రహము నొందంగా నపురూపపు గతులు మీఱ
నడుగులకును మడుగు లొత్తు ననుగమాల ననుసరించి
ఆధిపత్య శక్తితతుల నౌదలఁ దాల్చుచు నిత్యము
అనంతముగఁ బురుషశక్తి అలరఁజేయు సృష్టిగతుల
నిరతమ్మును నుద్భవించి నిత్యజనన స్థితి రతులను
సదసత్తులఁ దనరారెడి సర్వసృష్టిలోని మహా
పాపపంకిలముల నెల్ల రూపకల్పిత కశ్మలముల
నన్నింటిని రూపుమాపి ఆ దుష్టప్రభావాల
నామూలాగ్రము కాఁగను ననుక్షణము నాశపరచి
నన్మయమౌ స్థితిశక్తుల శర్మగతుల నిల్పుచుండి
అమలమైన సృష్టిక్రియ నమృతగతుల నలరించుచుఁ
బ్రకృతిరూవ సర్వస్వము ప్రభవించును దేవి కాఁగఁ
బ్రకృతిరూవ సర్వస్వము ప్రభవించును భద్ర కాఁగ ॥ 4593

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(7) యమశక్తుల సర్వస్వము నమలగతుల వర్తిల్లఁగ
వైష్ణవీయమైన మహాభవ్య దివ్య నిత్య నవ్య
సత్యశక్తి సృష్టిస్థితి సర్వస్వము నడుపుచుండ
నమృత మధుర క్షీరధార లనంతముగ నొసఁగునట్టి
నిత్యపూర్ణమైన పొదుగు నెగడు సత్యదీప్తిగతుల
దివ్యమైన అమరకామధేనురూప మట్లు వెలుఁగు
చాంద్రరూప మిచ్చు మహాసాంద్రామృతశక్తితతులు
సర్వజగతిఁ బ్రసారమై సంప్రాణద మౌచు వరలి
సదారోగ్యభాగ్యతమై సంవర్ధక మౌచుఁ దనరి
సర్వగోళ లోకాలను జరాఽచర ప్రపంచాన
జడాఽజడ రూపమ్ముల సన్మయరతు లొప్పంగా
నసద్రూప కలుషమ్ముల విసములనే సమయించుచుఁ
ప్రకృతిరూప సర్వస్వము ప్రభవించును దేవి కాఁగఁ
ప్రకృతిరూప సర్వస్వము ప్రభవించును భద్ర కాఁగ ॥ 4594

## సూక్తము—136

ఋషి—మాంధాత యగు యౌవనాశ్వుఁడు

ఋషిక—గోధ

దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

†(1) ఇహవరాల నన్నింటను నహోరాత్ర మహాకాల
గతులు నిత్య దీప్తరతులఁ గ్రాలంగా సకల సృష్టి
చరాఽచర బహుళరూప జడాఽజడ ప్రపంచమును
రోదసీతలములోన దీధితులను సంచరింప
మహీతలములై వెలిఁగెడి మహిమాఽన్విత రూపములే
దివిభువు లవి సకలమ్మును దివ్యముగాఁ దనరారఁగ
నాధిపత్యశక్తితతుల నఖిలేశుండౌ విష్ణువు
వ్యష్టిసమిష్టిగతులు తోవ సృష్టి సామ్రాజ్యమ్మును
నుషోదయములన్ వరలఁగ నుజ్జ్వలమౌ దీప్తిరతుల
అంతరిక్ష కుహరమ్మున నఖిలమ్మును నమరి తిరుగ
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును ప్రకృతిదేవి
జన్మనిచ్చు జనయిత్రిగ జనియించును భద్రప్రకృతి ॥ 4595

†రచయిత:—వాజ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(2) ఆకసముల రూపమ్మున ననిలమ్ముల రూపమ్మున
నసలమ్ముల రూపమ్మున నా సలిలపు రూపమ్మున
మృణ్మయమౌ రూపమ్మున మేళనమై అవతరించు
పాంచభౌతికంపుఁ బ్రకృతి పంచత్వము రూపుమాపి
అధోగతుల నూర్ధ్వగతుల నసాధారణంపు ఇనన
తనురూపము లలరంగా ఘన శక్తుల వరలంగా
మహితమైన బలశక్తుల మలినపు విష మాక్రమించి
పీల్చిపీల్చి పిప్పిచేసి పీడించుచు నిత్యమ్మును
శీర్ణగతుల జీర్ణగతుల ఛిద్రమ్ముగ క్షుద్రమ్ముగ
భద్రగతుల సంవర్ధన భాగ్యమ్మును నాశవరచు
దుశ్శక్తుల సర్వమ్మును దున్మాడుచు మహాశక్తి
విరాజిలును సృష్టిలోన నరాతితతుల నిరాకరించి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును బ్రకృతిదేవి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును భద్రప్రకృతి ॥ 4596

†(3) విశ్వ వ్యాప్త మొప్పుచును నశ్వశక్తు లలరారఁగఁ
జాంద్రదీప్తమై వరలెడి ఐంద్రామృత వైష్ణవీయ
దివ్యశక్తి సృష్టిలోన గవ్య దుష్టశక్తితతుల
నమిత్రతను సంహరించి సుమిత్రత పవిత్రత
లత్యంత బృహత్తరమౌ నమర ధనూ రూప మొందు
నంతరిక్షతలములోన నైంద్రచాపమై తనరఁగ
నమరదీప్తు లెల్ల సృష్టి ఆమలగతుల వ్యాపింపఁగ
నానంద మ్మభ్యుదయము నంతరంగరతులు విరియఁ
బ్రేమరూప శచీశక్తి వెలుఁగంగా శక్రదివ్య
మహానందరూపముగా మహిత మ్మై వలరంగా
"అభి"రూపపు దుశ్శక్తుల సాంతమ్ముగ నాశవరచి
"జలనాభి"ని గాపాడుచు సంవర్ధనమౌ వర్షము
హర్షమ్ములు విశ్వమ్మున నలరారఁగ బహుగతులను
సృష్టి స్థితి శక్తి సర్వచేష్టా చైతన్య మలర
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును బ్రకృతిదేవి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును భద్రప్రకృతి ॥ 4597

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4) ఐంద్రమైన ఆనందపు టద్భుతమౌ శక్తులతో
విశ్వగోళలోకమ్ములు నశ్వగతుల సంచరింప
శతరూపక్రియల గోళసకలమ్మును వర్తిల్లుచు
సృష్టిరూప నిత్యయజ్ఞ స్థితిఫలితము లలరంగా
సహస్రములు గాఁగఁ బ్రకృతి సర్వస్వము వరలంగా
బహురూపుల నవతరించి పలుముఖాల విస్తరిల్లి
సృష్టియిష్టి ఫలములుగా నష్టావిధ వసు సంపద
నఖిలగోళ లోకమ్ముల ననంతగతుల విరాజిలఁగ
సృష్టి కుపాదాన మౌచుఁ జెలువొందెడు సత్యప్రకృతి
జగదుత్పాదక మౌచును సకల కళ్యాణదముఁగ
రక్షామయ భద్రగతుల రాజిల్లఁగ విశ్వమ్మది
సర్వకర్మకారకుఁడౌ సర్వేశుని యజమానత
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును బ్రకృతిదేవి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును భద్రప్రకృతి ॥ 4598

†(5) విశ్వపురుష ప్రకృతిదివ్య విమల మోద స్వేదముగాఁ
జరాఽచర వ్రకృతిలోన జడాఽజడ ప్రపంచాన
నమృతరూప బిందుతతులు నఖిలాఽఖిలముఖమ్ములన్
నలరించును బరివ్యాప్తి నావిష్కృత మౌచు జగతి
నా రోదసి స్రవియింపఁగ నద్భుతమౌ సత్యగతుల
నసాధారణమ్మై తగు నమరమైన నిత్యరతుల
విపుల సృష్టి సర్వమ్మున విమల మౌచు వ్యాపించుచు
నంతరాంతరమ్ములైన నపురూపపు జీవశక్తు
లలరించుచుఁ బ్రకృతిలోన ననురూప యువ దీప్తుల
నవశక్తులు నిత్యమ్మును భవము లౌచు వెల్లివిరియ
వివిధ గోళ లోకాలను విశ్వమ్మున వ్యాప్తి చెందు
తేజమ్ముల తంతువు లవి ఓజశ్శక్తుల వరలెడి
దివ్యమైన కాంతితతులు గవ్య దుష్టతత్త్వమ్ముల
రూప నాశనమ్ముతోడఁ బాప దుర్మతిని వధించి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును బ్రకృతిదేవి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును భద్రప్రకృతి ॥ 4599

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(6) యమ నియమము లొప్పంగా నఖిల సృష్టి స్థితి గతులను
నపురూపపు బ్రాహ్మ్యశక్తి ఆధారము నాధేయము
నౌచు సృష్టి ప్రకృతి నెల్ల లలరు ప్రకృతి వైష్ణవీయ
దివ్యశక్తి సృష్టి స్థితు లవ్యయమౌ లయగతులను
నలరారఁగఁజేయునట్టి అనంతమైన మహారూప
ప్రభాశక్తి అంకుశమై వరలు సృష్టి గజమ్మునకు
అతిదీర్ఘ మ్మౌచుఁ దనరు నతివిస్తృతమై పరఁగును
జ్ఞానపూర్ణ మౌచు నిత్య సత్య శక్తిరూపముగా
నత్యంతము పూర్వగతుల నద్భుతమౌ మఘదీప్తుల
నలరంగాఁ బురుషప్రకృతి నంతరాంతరముల వెలుఁగ
నాత్మగత మ్మౌచు వరలు నద్భుత నియంత్రిణలమెయిని
సృష్టిగోళలోకా లవి చెల్వారఁగ నిత్యమ్మును
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును బ్రకృతిదేవి
జన్మ నిచ్చు జనయిత్రిగ జనియించును భద్రప్రకృతి ॥ 4600

†(7) దివ్యమైన దైవశక్తు లవ్యయగతులను సృష్టిని
గల్లోలము నే వేళను గల్పింపవు అల్పమైన
శబ్దశక్తి సంభారము చదలులోన సంచరింప
క్షీరామృత శక్తితతులు సేవ్యమాన మౌచుఁ బ్రకృతి
నలరించును నావిష్కృతి నద్భుతముగ స్రవించుచుండు
దైవీయమ్మౌ శక్తులఁ దనరారుచు సకలసృష్టి
సహయోగిత్వమ్ము మీఱు సకలలోక ప్రకృతులలో
నతివేలమ్మౌ దీప్తుల నతిలోకముగా వర్ధిలి
బహుముఖమౌ శబ్దాలను బరఁగుచు సంశక్తు లెల్లఁ
గ్రియలు మీఱ విశ్వమ్మున ఋతప్రతిక్రియ లలరఁగఁ
గర్మలమై కర్మఫలిత మర్మమ్ముల ప్రకృతి వరల
సర్వదా సంచరించు సదసత్తుల రూపులమైఁ
జరాఽచర ప్రకృతి గాఁగ జడాఽజడ పదార్థాల
నసాధారణంపు గతుల నపురూపపు శక్తులమై
నాత్మహనన దృష్టి లేక అపకారపుఁ గృతుల గతుల
గడబిడలేనట్టి జగతి క్రాలు నిత్యవీర్య రతుల ॥ 4601

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—137

ఋషిః—కుమారో యామాయనః
దేవతా—యమః
ఛందః—అనుష్టుప్

(1) యస్మిన్ వృక్షే సుపలాశే దేవైః సంపిబతే యమః ।
అత్రా నో విశ్పతిః పితా పురాణాగ్ం[1] అను వేనతి ॥ 1569

(2) పురాణాగ్ం[1] అనువేనన్తం చరన్తం పాపయాముయా ।
అసూయన్నభ్యచాకశం తస్మా[2] అస్పృహయం పునః ॥ 1570

(3) యం కుమార నవం రథమచక్రం మనసాకృణోః ।
ఏకేషం విశ్వతః ప్రాంచమపశ్యన్నధి తిష్ఠసి ॥ 1571

(4) యం కుమార ప్రావర్తయో రథం విప్రేభ్యస్పరి ।
తం సామాను ప్రావర్తత సమితో నావ్యాహితమ్ ॥ 1572

(5) కః కుమారమజనయద్రథం కో నిరవర్తయత్ ।
కః స్విత్ తదద్య నో బ్రూయాదనుదేయీ యథాభవత్ ॥ 1573

---

1. పురాణాగ్ం=అను, 2. తస్మా=అస్పృహ. (ప్రా.ప్ర.)

(౬) యథాభవపనుదేయా తతో[1] అగ్రిమజాయత ।

పురస్తాద్బుధ్న[2] ఆతతః పశ్చాన్నిరయణం కృతమ్ ॥ 1574

(7) ఇదం యమస్య సాదనం దేవమానం యదుచ్యతే ।

ఇయమస్య ధమ్యతే నాళీరయం గీర్భిః పరిష్కృతః ॥ 1575

## సూక్తము—137

ఋషి—యమగోత్రుఁడగు కుమారుఁడు†

దేవత—యముఁడు†

("నచికేత స్సను కుమారుఁడు వాజశ్రవ స్సను తండ్రితో యమలోకమునుగూర్చి ప్రస్థాపితుఁడై యముని జూచి మరల నీ లోకమునకు వచ్చెను. ఈ యర్థమే యీ సూక్త[3]మంత్రములచే నభివర్ణింపఁబడియె".♦)

(1)*గీ॥ సురుచిర పలాశములతోడ శోభఁ గాంచు
శాఖి మూలంబు సుఖ మిచ్చు చాడ్పునఁ గడు
సౌఖ్య మిచ్చెడు స్థలమున శక్త యముఁడు
దేవతలతోడ సోమంబు ద్రావుచుండె ॥ 4602

1. తతోఽఅగ్ర, 2. బుధ్నఽఆతతః. (వ్రా.ప్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 177వ పుటలో నీ సూక్తమునకు ఋషి "యమగోత్రుఁడగు కుమారుఁడు"గాను- దేవత "యముఁడు"గాను వ్రాసి, 16సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "కుమారుఁడు"గాను- దేవత "యముఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

3. యీ మంత్రములచే. (వ్రా.ప్ర.పా.)

♦నచికేత స్సను వాని చరిత్రము కఠోపనిషత్తునందును గలదు. ఆ కథాసార మిది.నాచికేతస్సు యమగృహమునకుఁ బోయినపిమ్మట యముని "మనుజుఁడు మరణించినపుడు చావలేదని కొందరును చచ్చె నని కొందరును అనెదరు." అను వాక్యమునకుఁ గల రహస్యార్థమును జెప్పు మని వేఁడెను. యముఁడు దాని కుత్తర మీయుక "పుత్రులను బౌత్రులను గోరుకొనుము: వారు శతవత్సరములు జీవించియుండునట్లు వేఁడుము: గోగణములను, గజములను, స్వర్ణము, నశ్వములను నడుగుము: భూమి కావలయు నని గోరి యందుఁ జాల హేమంతము లుండుము:" అనెను.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

*గీ॥ జనులకున్ నాథుఁడైన నా జనకుఁ డిట్టి
స్థానమున నున్న పితరుల సరస నున్న
నుత్తమ ప్రదేశమందున నుండు మనుచు
నన్నుఁ గాంక్షించుచుండె ననారతంబు ॥ 4603

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

నచికేతుని కథ కఠోపనిషత్తు తాత్పర్యము. నచికేతుఁడు మృత్యులోకమునకు (యమలోకమునకు) వెళ్ళఁగా యముఁడు నచికేతుని మూఁడు వరము లడుగు మని కోరెను. తదనుసారముగ నాతఁ డడిగిన మూఁడు వరములను నిచ్చెను. అప్పుడు నచికేతుఁడు బ్రహ్మజ్ఞానముగురించి[1] చెప్పు మని యడుగక "నా తండ్రి కోపించినాఁడు. అతనిని బ్రసన్నునిగఁ జేయుము: ఐహిక సమృద్ధినిఁ బొందించుటకు సమర్థ మగు యజ్ఞాదికర్మలయొక్క జ్ఞాన ముపదేశింపు" మని యడిగెను. ఈ వరములను బొంది పిమ్మటఁ దుదకు "నా కాత్మవిద్యను బోధింపు"మని మూఁడవ వరమును నడిగెను. కాని యముఁడు ఈ మూఁడవ వరమునకు మారుగ "నింక విశేష మగు సంపత్తు నిచ్చెద"నని అనఁగా నిది యంతయు విని నచికేతుఁడు "ఆర్యా! ఇవి యన్నియు రేపు నశింపవలసినవే: అన్నియు నస్థిరములే" అనియెను. ఇదియే గొప్ప రహస్యము. ఇదే సర్వోపనిషత్సారము. ఇదే హిందూమత ధర్మము.

కావ్యతీర్థ
నేమాని వేంకటనరసింహశాస్త్రి

గమనిక-నచికేతుని నాచికేతుఁ డని కొందఱు పేర్కొనిరి. నచికేతుని చరిత్ర ఉపలభ్యమానమైనంతలో నీ క్రింది విధముగాఁ గఠోపనిషత్తునందును మహాభారతమునందును గథలుగాఁ గలదు. వ.గో.కృ.

"నచికేతుఁడు వాజశ్రవసుని కుమారుఁడు.వాజశ్రవసుఁడు తన భాగ్య మంతయు నందఱకును బంచిపెట్టెను. అపుడు నాచికేతుఁడు "తండ్రీ! న న్నెవరి కిచ్చెద"వని అడిగెను. తండ్రి బదులు చెప్పలేదు. నాచికేతుఁ డదే విషయమును మరలమరల నడుగుటచేఁ దండ్రికిఁ గోపము వచ్చి "నిన్ను యమున కిచ్చెద"నని చెప్పెను. "యమునకు నేను జేయవలసిన దేమి"యని నాచికేతుఁ డాలోచించెను. ఇంతలోనే తండ్రి వాక్యప్రభావమున నాచికేతుఁడు నిశ్చేష్టుఁడై పడిపోయెను. అతఁడు యముని సదనమునకుఁ జనియెను. కాని ఆ యమలోకమున యముఁడు లేఁడు. యముఁడు మూఁడు దినములైన పిదప వచ్చి నాచికేతుని జూచి "నీవు నా యింటి కతిథిగ వచ్చి సత్కరింపఁబడక మూఁడు దినము లుంటివి. కావున నీకు మూఁడు వరము లిచ్చెదను. గోరుకొను" మని అనెను. అందుకు నాచికేతుఁడు "నా తండ్రి శాంతుఁడై నేను మరల నీచేఁ బంపఁబడిన పిమ్మట నాయం దాదరము కలిగి యుండునట్లు చేయుము! నా కగ్నినిగురించియు, మరణానంతరమునందలి జీవుని అవస్థనుగూర్చియుఁ జెప్పు"మని గోరి కొంత జ్ఞానము వడసి మరల భూలోకములోని తనతండ్రి గృహమునకు వచ్చెను.

-కఠోపనిషత్తు

మహాభారతములో నాచికేతుని కథ యీ క్రింది విధముగాఁ గలదు.

"నాచికేతుఁడు ఔద్దాలకి అను ముని పుత్రుఁడు. ఔద్దాలకి స్నానము చేసి ఒకసారి నదియొడ్డున దర్భలు, జల కలశమును, మరచి వచ్చెను. తాను మరచిన దర్భలను జలకలశమును దీసికొని రమ్మని తన కుమారుఁడైన నాచి

1. బ్రహ్మజ్ఞాన మడుగుమని చెప్పుమని యడుగక. (వ్రా.ప్ర.పా.)

(2)*గద్యము ॥

పురాతను లగు పితరులను అనుగతుఁడ నగు నన్నుఁ గోరుచున్నట్టియు, నికృష్టబుద్ధితోఁ జరించుచున్నట్టియుఁ, బితను(వాజశ్రవస్సును)గూర్చి సుఖముగ జీవించు నన్ను మృత్యు సమీపమునకుఁ బంపుము! అనిపలికితిని. ఇట్టి యుపతాపముతోఁ గూడుకొనినవాఁడ నైతిని. పిమ్మటఁ బితాజ్ఞచే నా మృత్యువును బొందుటకు నిచ్చగించితిని ॥ 4604

(యముఁ డీ ఋక్కుచే నచికేతుఁ డను కుమారుని మోహపెట్టుచున్నాఁడు.)

(3)*గద్యము ॥

ఓ కుమార! చక్రరహితము, ఏకేషము, కనుకనే యభినవ మగునది, అంతటకుఁ బోవునది, యగు నే రథము నా సమీపమునకు వచ్చునట్లు చేసితివో! యా రథమును గర్తవ్యాఽకర్తవ్య ములను దెలిసికొనకుండ నెక్కుచుంటివి! ॥ 4605

అర్థాంతరము

(స్తోత యగు కుమారునకు నాదిత్యుఁడు ప్రత్యక్షమై దేహాత్మ వివేకమును బోధించుచున్నాఁడు.)

*గద్యము ॥

ఓ కుమార! ఋషీ! ఏకచక్రము, ప్రాణస్థానీయము, అభినవము, సర్వతోగమనశీలము, శరీరాత్మకము నగు నే రథమును గల్పించితివో! యీ శరీలాత్మక రథమును దెలిసికొనకుండ స్వీకరించుచున్నావు! ॥ 4606

(4)*గద్యము ॥

ఓ కుమార! నచికేతుఁడా! నీవు పూర్వోక్త మగు నే రథంబును యమ సమీపంబునకుఁ బ్రవర్తింపఁజేసితివో! యంతరిక్షమునం దా రథమున యమ సమీపమునకుఁ బోయి నీ విట్లు చెప్పవలయు నని విధించి దానిని బ్రవర్తింపఁజేయుము! ॥ 4607

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

---

కేతునితోఁ జెప్పెను. నాచికేతుఁడు అవి తెచ్చుటకు వెళ్ళఁగా అప్పటికే నా దర్భలును జలకలశమును నీటిలోఁ గొట్టుకొని పోయెను. కాగా నవినాచికేతునికిఁగనపడలేదు. అవి కనపడలేదని నాచికేతుఁడు తండ్రికిఁ జెప్పెను. ఔద్దాలకికిఁ గోపము వచ్చి "నీవు యమునిని దర్శింపు" మని శపించెను. నాచికేతుఁడు విగతచేష్టుఁడై పడిపోయెను. నాచికేతుఁడు మరణించిన తరువాత ఔద్దాలకి చాల విచారపడెను. ఆ మరునాఁ డుదయమున నాచికేతుఁడు లేచి యముని దర్శించితి ననియు, యముఁడు తనను వాహన మెక్కించి భోగ యోగ్య పదార్థములు మహారాశులై యున్న పుణ్యలోకములు చూపించె ననియును అవి గోదానములు చేసినవారికి లభ్యపడు నని తెలిపె ననియును జెప్పెను.

-మహాభారతము.

వాఙ్మయ మహోద్యమ
డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

అర్థాంతరము

*గద్యము ॥

ఓ కుమారఋషీ! నీ వే శరీరాత్మక మగు రథమును సంసారమందుఁ బ్రివర్తింపఁ జేసితివో! మేధావుల మధ్య నా రథమును బ్రివర్తింపఁజేయుము! ఋక్సామాది సాధ్య మగు స్తోత్రము నౌక వలెఁ దారయిత్రి యగు వేదాత్మక వాక్కునందు సమ్యక్ప్రతిపాద్యముచే హిత మగు కర్మయు లోకమునందుఁ బ్రివృత్త మయ్యెను ॥ 4608

(5)*గద్యము ॥

ఎవఁ డీ కుమారుని గనెను? ఎట్టి బాలుని యమ సమీపమున కంపెను? తజ్జనకుఁ డెట్లు నపహీనుఁ డగును? ఇది యంతయు నటుండనిమ్ము! ఏ పురుషుఁ డీ బాలుఁడు యమసమీపమునకుఁ బోవుటకు రథమును దోలెనో! వాఁడును బరమమూర్ఖుఁడే! ఎట్టి కుమారుఁ డను బాలవృద్ధుఁడో! తత్తదనుగుణ మగు వచనమును నిపుడు మా కెవ్వఁడు సెప్పఁగలఁడు? (తొల్లి యమ సమీపమునకుఁ బోయి పిమ్మట నచ్చటనుండి మరలెను విధము చెప్పుచున్నను వాఁడు ప్రాజ్ఞుఁడు కాఁజాలఁడు) ॥ 4609

అర్థాంతరము

(కుమారాఖ్యుఁ డగు ఋషి తన సర్వాత్మ్యమును దెలిసికొనుచుఁ బలికిన దది.)

*గద్యము ॥

కుమారుఁ డగు నన్నుఁ గనిన జనకుఁ డెవ్వఁడు? (ఎవ్వఁడును లేఁడు) ఎవఁడు శరీరాత్మక రథమును నివర్తింపఁగలఁడు? సర్వాత్మ్యానుభవదశయందు నా యా ప్రకార మెవ్వఁ డెరింగించెను? ఏ ప్రకారము మద్వ్యతిరిక్త పదార్థసత్తు ఆగునో! యా ప్రకారము దుర్వచము ॥ 4610

(6)*గద్యము ॥

పిత నుద్దేశించి యెట్టి కుమారుఁడు యమునిచే నొసంగఁబడెనో! యట్లు "వాజశ్రివస్సునుండి యమ సమీపమునకుఁ బొమ్ము!" అను వాక్యమునకు ముందుచెప్పఁదగిన దానిని బిత యుపదేశించెను. పిమ్మట నుక్తాగ్రమునకు మూలభూత మగు "యమ గృహమునకుఁ బొమ్ము!" అను వాక్య మతివ్యాప్త మయ్యెను. తర్వాతఁ గ్రోధము వీడి యమునినుండి నిర్గమనోపాయము పితచేఁ జెప్పఁబడెను ॥ 4611

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

### అర్థాంతరము

*గద్యము ॥

ఆత్మస్వరూపాన్యపదార్థసత్త యెట్లగునో! తదనుగుణముగ ♦మాయావిశిష్ట మగు నాత్మయొక్క
మనస్తత్వము పుట్టెను. సృష్టికిఁ బ్రాగవస్థయందు మాయాత్మక మగు కారణమే విస్తృత
మయ్యెను. తర్వాతఁ దమస్సు పుట్టెను. అటుపైని ఘట పటాది భేదముచే స్వరూపాఽఽ
లంబనము చేయఁబడినది. ఆదిత్యుని యనుగ్రహమువలన బ్రహ్మ భావమును
బొందిన నాకుఁ బ్రపంచ సత్యము కాఁజాలదు ॥ 4612

(7) తే॥గీ॥ దేవ నిర్మిత మని యేది తేజరిల్లు
నట్టిదె యముని గృహ మని యనఁగవలయు
వేణు గానముచేఁ గడుఁ బ్రీతిఁ జెందు
యముఁ డలంకృతుఁ డయ్యెఁ దా నమల గతిని ॥ 4613

## సూక్తము—137

ఋషి—యమపుత్రుఁ డగు కుమారుఁడు

దేవత—యముఁడు

### అర్థాంతరము—1

†(1) విశ్వసృష్టి వృక్షమునకు వెలయు సుపత్రములుగా
నిహపరమ్మైన ద్వంద్వమహిత మహా వ్యవస్థలను
దేవతాళి ఆహారము దివ్యమ్ముగ స్వీకరించు
నిత్యమ్మను నియతగతుల నిఖిలలోకతతులు పెరుగ
విశ్వపతియె సకలమునకుఁ బిత గాఁగను వెల్గొందుచుఁ
జరాఽచర ప్రకృతులకును జడాఽజడ ప్రపంచమునకు
ననుస్యూతగతులమెఁబని నాదికాలమ్మునుండి
సూనృతశక్తులు పరలఁగ శుభపరంపగ సమకూర్చును ॥ 4614

†(2) అనంతమైన కాలగతుల నతిపురాతనమునుండి
చక్రనేమి క్రమముగాఁగ సకల చరాఽచరమ్ములను
పాప పుణ్య ప్రభావాల ప్రభవించుచునుండు జగతి
స్థితిగతులను దనరారుచు జీర్ణ మౌచు లయపరమై

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

♦సృష్టికిఁ బ్రాగవస్థయందు మాయాత్మక మగు కారణ ముండె నని యీ ఋక్కునఁ జెప్పఁబడినది. ఛాందోగ్యము (4.2) నందు సృష్టి ప్రారంభమున ఒక్కటే యుండియుండె ననియు, రెండవది లేదనియు, దానివలన అగ్ని జనించె ననియు, అగ్నివలన జలము పుట్టె ననియు, జలమువలన భూమి కలిఁగెననియుఁ గలదు.(నే.వేం.న.శా.)

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ప్రేమాదర మైత్రి ప్రకృతి విశ్వశ్రేయస్కరమౌ
సద్గుణాల సముచ్చయాల నమద మోహ మాత్సర్యా
లీర్ష్యా ద్వేషాది సర్వ హేయ దుర్గుణావళులను
బునరపి జననము కాఁగను బునరపి మరణము కాఁగను ॥† 4615

†(3) సర్వవిశ్వసృష్టిలోనఁ జక్రరహితమై తనరుచు
నపూర్వమై అభేద్యమై అనాహతమ్మౌచుఁ దనరు
మనశ్శక్తి మహితమ్మై అనంతరూపమౌచు నలరుఁ
గుమారరూప షణ్ముఖాల గూఢశక్తు లలరారఁగ
ఋతఋతువుల గతులు మీర నతిలోకపు నవ రతులను
గాలసహిత శక్తులతోఁ గాలరహిత శక్తులతో
నదృష్టమౌచు నద్భుతమౌ నతిలోకపుఁ జలనశక్తి
బహిరంతర ప్రపంచానఁ బ్రాంచితగతి నరయుచుండి
సకలమ్మున సంచరించు సద్రూపమ్మదృశ్యముగ
విశ్వమ్మున వరలంగా విరాడ్రూప తిష్ఠమౌచు ॥ 4616

†(4) ఆహితమైన ప్రకృతిరూప మదృశ్యమై పరఁగుచుండు
విశ్వసృష్టి జలమ్ములో విపులమైన నావ కాఁగ
షణ్ముఖాల దశదిశలను సర్వమ్మున వర్తిల్లుచుఁ
జక్రరహితమైన రథము సర్వజ్ఞత నధివసించి
నిర్నిద్రిత తనరారెడి నిశ్శబ్దగ శక్తితతులు
నిఖిలమ్మును జయింపంగ నిండు విశ్వశాంతి వరల
నపురూపపు మహాశక్తి నమేయమైన దివ్యగతులఁ
బవిత్రమైన మనశ్శక్తి వరలుచుండు సత్యగతుల ॥ 4617

†(5) బ్రాహ్మ్యమైన విష్ణుశక్తి వరలు సృష్టిశక్తి కాఁగ
సంప్రాణద సంత్రాణద సచ్ఛక్తిగఁ బెరుగు విష్ణు
వైష్ణవీయమైన శక్తి పరఁగును స్థితిశక్తి కాఁగ
హారకమౌ విష్ణుశక్తి అలరును లయశక్తి కాఁగ
బహురూపమ్ములమెయి బహుముఖాల సృష్టిలోన
నియతగతుల చలనశక్తి నిఖిల చరాఽచరప్రకృతి

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సంచరించు పదార్థాల సర్వమ్మును నాకట్టుచు
నదృశ్యమై అసంభవమై అజననమ్మైన రథము
నధివసించి విష్ణుశక్తి అఖిలమ్మును బాలించును
నద్భుతమౌ శక్తులతో నజయ్యమౌ గతులమైని ॥† 4618

†(6) అపురూపమ్మౌ శక్తుల ననుమేయపు రూపమ్ముల
సృష్టిప్రకృతిగతి నావిష్కృత మ్మౌచు నిలిచి
అనాహతంపు మహితశక్తి నగ్రజమై మన స్సలర
మూలతత్త్వరూప మ్మది మోక్షశక్తిగాఁ దనరఁగ
సృష్టి స్థితి లయగతులను జిద్విలాస నిరయముగాఁ
దొట్టదొలుత మహానంద ధృతిగతులను వృద్ధి నంది
బాధిత తాడిత పీడిత భావ సంఘర్షణాళి
ప్రకృతిరూపు వర్తిల్లఁగ వికృతముగ విస్తరిల్లు
మనశ్శక్తి విజ్ఞానము మాన్యమహితరూప మౌచు
అంతు వంతు హద్దు లేక అఖిలమ్మును నధిగమించు ॥ 4619

†(7) నియతగతుల సంచరించు నిఖిలసృష్టి సర్వస్వము
దేవమాన కాలగతుల దివ్యమ్ముగఁ దనరారును
సృష్టిరూపమహితమైన స్థితిరూపపు విహితశక్తి
నాడి గాఁగఁ దనర నిత్య నవ శక్తుల వరలంగా
శబ్ద శక్తి సంచయాల సర్వప్రకృతి పరిశుద్ధత
బహిరంతర్గతులలోన విహితమ్మై సకల విధుల
విశాలాఽంతరిక్షమ్మున విష్వాదిత్యుని కాంతుల
సర్వస్వము సృష్టిలోన శబ్దమూలకమ్మై తగు ॥ 4620

## సూక్తము—137

ఋషి—యమపుత్రుఁ డగు కుమారుఁడు

దేవత—యముఁడు

## అర్థాంతరము—2

†(1) ప్రకృతి పురుష శక్తులతో వరలు విశ్వ వృక్షమునకు
సువర్ణపత్రతతు లలరఁగ సుఫలాళులు విలసిల్లును
నియమగతుల ఫలరసమ్ము నిరతమ్మును ద్రాగుచుండి
విశ్వపతిగ సృష్టిపితగ విమలమైన శక్తులతో

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

అతి పురాతనమ్మాదిగ ననంతమైవ సృష్టిలోన
దివ్యమైన దైవశక్తు లవ్యయ మై వెలయంగా
సృష్టి స్థితి లయగతు లవి వ్యష్టి సమిష్టిగా వరలును
ననుక్రమాల ననుగమాల నసాధారణంపు రతుల ॥† 4621

†(2) ఆదికాలమ్మునుండి ఆజన్మమ్ముగ వచ్చెడి
పూర్వజన్మ కర్మమ్ములఁ బర్వు కర్మ ఫలమ్ముగఁ
బ్రాకృతముగఁ బరిఢవిల్లు పాప కిల్బిషమ్ము నెల్లఁ
బూర్వదుర్గతీ నాశని పూర్ణశక్తి వర్తిల్లఁగ
నిత్యగతుల నాసాంతము నిర్మూలన మొనరించుచుఁ
బ్రకృతిలోనఁ బవిత్రతా సుకృత రమ్యశక్తి తనర
విశ్వమ్మును సర్వమ్మును బ్రేమరూప మహితముగా
వరలఁజేయు వైష్ణవీయ పురుషశక్తి సర్వస్వము ॥ 4622

†(3) విముఖమైన పురుషశక్తి విమలాఽజయ్యాఽనల
తేజమ్ములతోఁ గుమారు దేహరహితుఁగాఁ జేయఁగ
నేకమ్మౌ నిచ్ఛాగతి నెల్ల లెనయకుండ మహా
వేగమ్మున నతిలోకపుఁ బ్రేమశక్తి నతివేలపు
దీప్తగతులఁ దనరారెడి దవ్యమైన మనశ్శక్తి
రూపమ్మే లేకుండఁగ ఋత మహితముగాఁగ సృష్టి
నిత్యనవమ్మై వెలిఁగెడి నిరాకార రథము నెక్కి
నిగూఢంపుఁ గామరతుల నిరతమ్మును బ్రకృతి పురుషు
లలరంగా సృష్టిలోన నానందము రూపొందును
జరాఽచర ప్రపంచాన సంజననపు శక్తులమై ॥ 4623

†(4) ప్రవర్తించు నింద్రియాళి ప్రకర్షముగ విజృంభింప
నదృశ్యమానమైన రథము నధిరోహించుచు నిత్యము
గుమారత్వ[1] మలరంగాఁ గొమరు దుష్టమన్మథుఁడై
గానరూప శబ్దశక్తి క్రాలంగాఁ బ్రాకృతమై
విశ్వసృష్టి సాగరాన విపుల మనో నౌక నెక్కి
సకలమ్మును నధిగమించు చాఁగునఁ గోరిక లెరిక
లెత్తుచు నానందము నెనఁగఁజేయుచుండు జగతి
సతము సంఘశక్తి మీఱి సంఘటితమ్మౌచుఁ దనర ॥ 4624

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. కు+మార=కుమార.

†(5) విష్ణు హృత్తు కుమారునికి విపులరథ మ్మొచు వరలు
నిరత చలనరతుల హృదయ నిర్నిద్రిత మీఱంగా
నత్యంతము గూఢమైన అంతరంగ రూపమ్మున
నానందపు సంచలనపు టనురాగము లుప్పతిలఁగ
రణితముగా శబ్దశక్తి రాజిల్లఁగ రాగరూప
సృష్టిస్థితిలయా లవి చెలఁగు వైష్ణవీయ మాయ ॥ 4625

†— దుష్టమన్మథరథ మ్మదృశ్య శక్తులమై
సృష్టి నెల్ల నావరించుఁ జీద్విలాసగతులు తోప
నతిపవిత్ర హృచ్చక్షుల అగ్నిదీప్తితతుల నెపుడు
నావహింపఁబోదులె అతిలోకపు రతులనైన
ననాహత మ్మొచుఁ దనరు నభేద్యమౌ మనశ్శక్తి
అహితమ్ముల నన్నింటిని నధిగమించు నిగమదీప్తి ॥ 4626

†(6) ఆద్యమ్మై జన్మించుచు నంతరంగ మగ్రరతుల
సకలసృష్టిలోన నిలిచి శరీర మై అతనుగతుల
సర్వాధారమ్ముగాఁగ శాంతానందమతుల
దేహరూప మధివసించి దివ్యతత్త్వ మలరారఁగ
వ్యక్తగతులఁ బ్రకృతిపురుష పరభావ నిరయణమ్ము
మూల మవ్యక్త మౌచు ముదముఁగూర్చు నిరతమ్మును ॥ 4627

†క॥ తను మనములలోఁ దనువున
గుణవిగతగతులమెయి నొనఁగూడుచు మరణం
బనియతమౌ కాల పురుషు
ని నియంత్రణతల మన స్సనిరయణ రతమౌ ॥ 4628

†(7) ఆదిత్యుని స్థానమ్మై అంతరిక్ష మలరారఁగఁ
గాంతికాంతితతులు నిత్య రాజితమ్ము లౌచుఁ దనర
శబ్దరూపమ్మైన శక్తి సర్వసృష్టి వరలంగా
సంచలనపుఁ జైతన్యపు శక్తిజీవతత్త్వ మ్మది
సదా సృష్టి వర్తిల్లఁగ సాదర మై యమ శక్తుల
దేవమానరూపగతుల దివ్యతత్త్వ మనుభూతిగ
నమేయమైన గతులతోడ నంతరంగ మలరుచుండుఁ
బరిష్కృతముగాఁగఁ బురుషప్రకృతి సృష్టిక్రియ నెఱవఁగ ॥ 4629

†క॥ దుష్కృతి రూపాశుల నా
విష్కృతమౌ నరకరూప విపదాశులకే
నిష్కృతి కల్పించును హృ ద[1]
ముష్కర నిర్మల పవిత్ర పుణ్య సుమూర్తుల్ ॥ 4630

†రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. హృత్+అముష్కర=హృదముష్కర.

## సూక్తమ్—138

ఋషిః—1-జూతిః; 2-వాతజూతిః; 3-విప్రజూతిః; 4-వృషాణకః;
5-కరిక్రతః; 6-ఏతశః; 7-ఋష్యశృంగః
దేవతా—కేశినః; అగ్ని-సూర్య-వాయవః
ఛందః—అనుష్టుప్

(1) కేశ్యంగ్నిం కేశీ విషం కేశీ బిభర్తి రోదసీ ।
కేశీ విశ్వం స్వర్దృశే కేశీదం జ్యోతిరుచ్యతే ॥ 1576

(2) మునయో వాతరశనాః పిశంగా వసతే మలా ।
వాతస్యాను ధ్రాజిం యన్తి యద్దేవాసో[1] అవిక్షత ॥ 1577

(3) ఉన్మదితా మౌనేయేన వాతాగ్ం[2] ఆ తస్థిమా వయమ్ ।
శరీరేదస్మాకం యూయం మర్తాసో[3] అభి పశ్యథ ॥ 1578

(4) అన్తరిక్షేణ పతతి విశ్వా రూపావచాకశత్ ।
మునిర్దేవస్యదేవస్య సౌకృత్యాయ సఖా హితః ॥ 1579

(5) వాతస్యాశ్వో వాయోః సఖా ఒథో[4] దేవేషితో మునిః ।
ఉభౌ సముద్రావా క్షేతి యశ్చ పూర్వ[5] ఉతాపరః ॥ 1580

---

1. ద్దేవాసోఽఅవిక్షత, 2. వాతాగ్ంఽఆతస్థి, 3. మర్తాసోఽఅభి, 4. సఖాథదేవేషి,
5. పూర్వఽఉతాపరః. (వ్రా.వ్ర.)

(6) అప్సరసాం గన్ధర్వాణాం మృగాణాం చరణే చరన్ ।
కేశీ కేతస్య విద్వాన్ త్సఖా స్వాదుర్మదిన్తమః ॥ 1581

(7) వాయురస్మా[1] ఉపామన్థత్ పినష్టి స్మా కునన్నమా ।
కేశీ విషస్య పాత్రేణ యద్రుద్రేణాపిబత్ సహ ॥ 1582

## సూక్తము—138

ఋషి — 1-జూతి; 2-వాతజూతి; 3-విప్రజూతి; 4-వృషాణకుఁడు;
5-కరికత్రుఁడు; 6-ఏతశుఁడు; 7-ఋష్యశృంగుఁడు†
దేవత — అగ్నిసూర్య వాయువులు†

(1)*ఉ॥ సూర్యుఁడు హవ్యసంపదల శోభిలఁ జేయును నగ్నిహోత్రునా
సూర్యుఁడె రశ్మిమూలమున సుందర వారి ధరించుచుండు నా
సూర్యుఁడె రోదసీద్వయము సొంపు దలిర్ప వహించుచుండు నా
సూర్యుఁడె సర్వమౌ జగముఁ జూచుటకై వెలుఁగొందఁజేసెడున్ ॥ 4631

*గీ॥ దృశ్యమాన మగుచుఁ దేజరిల్లుచునుండి
యమల మండలస్థ మైన జ్యోతిఁ
గాంచి మిగులఁ బ్రీతి కమనీయ కేశిగఁ
బిలుచుచుంద్రు[1] దానిఁ బెద్ద లెల్ల ॥ 4632

(2)*గీ॥ వాత రశనుని పుత్రులౌ ఖ్యాత మునులు
కపిల వర్ణంబులం గల్గి గ్రాలుచుండి
మలిన వల్కలములఁ దాము లలిత రీతిఁ
గట్టుకొనుచున్నవారలు కాదెః తలఁప ॥ 4633

---

1. రస్మా ఉపా. (వ్రా.వ్ర.)

†వ్రాతప్రతి 14వ సంపుటము 181వ పుటలో నీ సూక్తమునకు ఋషి "వాతరశనాజూతిప్రభృతులు"గాను, దేవత "అగ్ని సూర్య వాయువులు" గాను వ్రాసి, 136 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఋషి "సప్తమునులు, జూతి, వాతజూతి, విప్రజూతి, వృషణకుఁడు, ఈతశుఁడు, ఋష్యశృంగుఁడు" గాను, దేవత "కేశులు" గాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. చెప్పుచుంద్రు బుధులు (దాని) చిత్త మలర. (తొ.పా.)

*గీ॥ ఎక్కువ తపస్సుచేతఁ దా మిట్టు మునులు
వెలుఁగుచున్ దేవ భావంబుఁ గలిఁగినారు
ప్రాణ రూపంబు నందిన వాయు భావ
మును గడుం బొందినారు ప్రమోద మొప్ప ॥ 4634

(3)*గీ॥ మౌని భావంబుచేత సమ్మదము మీర
వాయు భావంబుఁ బొందుచు వరలినాము
తనువులనె మీరు జనులార! కనుఁడు! ప్రీతి
వాయు సాయుజ్యమును మేము వడిసినాము ॥ 4635

(4)*గీ॥ ముని వృషాణకుఁ దను వాఁడు మోద మలర
విశ్వ రూపంబులను నెల్ల వేడ్కఁ గనుచు
దివమునుండి మహాగతి దిగుచు నుండి
స్థాపితుం డగు దేవతా సమనమునకు ॥ 4636

(5)*గీ॥ వాయుగతి వలె నంతట వ్యాప్తుఁ డగుచు
వాయు సఖుఁ డౌచుఁ బిమ్మట వాయువుఁ దగఁ
బొందినట్టి మునీశుఁడు పూర్వ జలధి
నపర జలధిని రెంటిని నాశ్రయించు ॥ 4637

(6)*చ॥ సురయువతీ లలాము[1] బహుసుందర మౌ దివమందు [2]నింకనున్
విరివిగ సింహముల్ దిరుగుఁ బృథ్విపయిం దిరుగాడు కేశి తా
నరమర లేక సర్వమును నారయుచుండి రసంబు[3] స్వేచ్ఛగాఁ
బరగెడున ట్లొనర్చుచు నపార ముదంబును గూర్చుచుండెడున్ ॥ 4638

(7)*గీ॥ సూర్యుఁడు మరుద్గణంబుల[4] తోడఁ దేలి
కిరణజాలము మూలానఁ గరము జలము
గ్రోలునప్పుడె కేశికి లీల వాయు
వఖిల రసమును బుట్టించు చమరుచుండు ॥ 4639

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

1. సురయువతుల్ జరించు బహుసుందర. (తా.పా.), 2. నింకయున్, (వ్రా.ప్ర.పా.) నట్టులే, (తా.పా.),
3. రసంబు నంతటన్. (తా.పా.), 4. మరుద్గణంబుతో నూటికూడి. (తా.పా.)

*గీ॥ క్రింద స్రవియించు విధమున నంద మైన
సలిలమును మాధ్యమిక వాక్కు [1]కలుగఁ జేసి
యంతట స్వతంత్ర యగుచుఁ దా[2]నంబువును స•
†చూర్ణముగఁ జేయుచుండె సుశోభ కలుగ ॥ 4640

ఇయ్యది
శ్రీభారద్వాజ గోత్ర శ్రీవేఙ్కటేశ్వరపౌత్ర
సంగమేశ్వర పుత్ర సీతాంబాగర్భ శుక్తి
ముక్తాయమాన శ్రీభగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి
విరచిత కృతులలో శ్రీమదాంధ్ర
ఋగ్వేద సంహితయందు
దశమమండలమునందు
నష్టమాష్టకమందలి
సప్తమాధ్యాయమున
నేకశతాష్టాత్రింశత్
సంఖ్యాకసూక్తము
సంపూర్ణము‡

---

*రచయిత:—కావ్యతీర్థ, శ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రి

•ఇక్కడితో కావ్యతీర్థ, శ్రీనేమాని వేంకటనరసింహశాస్త్రిగారి కవిత ముగిసినది. ఈ పద్య మసంపూర్ణము.

†పూరణకర్త:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡ఈ గద్యమును శ్రీనేమానివారు వ్రాయలేదు. వారి రచన ముగింపుకు గుర్తుగా నీ గద్యము చేర్చఁబడినది. శ్రీనేమానివారు బహుశా ఈ అష్టమాష్టకమున సప్తమాధ్యాయాంత్యమువరకైనను నాంధ్రీకరించిరో! లేదో! చెప్పఁజాలము. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 14వ సంపుటము 184వ పుటలో (ఎడమప్రక్కపుట)నేదియో ఒక వివరణ-ఫుట్‌నోటు వ్రాసి కొట్టివేయుట జరిగినది. దీనినిఁ జూడగా 185వ పుటలోఁగూడ ననువాదరచన ముండియుండునని అనిపించును. ఈ 4640వ పద్యములోని 4వపాదమును నేనే విరచించి పూరించితిని. ఈ సూక్తము తరువాత నున్న సప్తమాధ్యాయశేషభాగమును నష్టమాధ్యాయమునుగూడ సాయణాచార్యభాష్యానుసారముగా నేను 1957లో నాంధ్రీకరించుట జరిగినది. ఈ పూరణభాగమంతయు-మేము ప్రతివ్రాసిఁగా "ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము-పరిశోధనాలయము"లో భద్రపరచఁబడిన "శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత" 46 ఎక్సర్‌సైజు పుస్తకాలలోఁగూడ 45వ పుస్తకముగా Acc. No. 3789, Call No. T. 25-45 గా నున్నది. శ్రీనేమానివారు వ్రాసిన వ్రాతప్రతి 14వ సంపుటము 1వ పేజీనుండి 184వపేజీవరకు పేజీల క్రమసంఖ్యలు పెద్దవిగాను, 185వ పేజీనుండి 284వ పేజీవరకును నున్న పేజీల క్రమ సంఖ్యలు చిన్నవిగాను, ఆ పిదప పది కాగితములు (అనఁగా 20పేజీలు) క్రమసంఖ్యావిరహితములుగాను, ఆతరువాత 295వ పేజీనుండి 364వపేజీవరకు గ్రంథము మొదటి పుటల వలెనే పెద్దసంఖ్యలు వేయఁబడి యున్నవి. కాని 301, 302, 303, 304 పేజీలుమాత్రము తిరిగి చిన్న సంఖ్యలు వేయఁబడినవి. 185వ పేజీ మొదలు 284వ పేజీవరకునున్న కాగితములు శిథిలములైనవి. కాఁగా నీ నూరు పేజీలను సరిగా లెక్కించి 50 కాగితములు కలిపి సరిగా క్రమసంఖ్యలు వేసి 184-285 పేజీల మధ్య శైథిల్యమును దొలఁగింపవచ్చును. కాని పొరపాటున 60 కాగితములు కలిపి బైండుచేయించి 185 పేజీమొదలు 284వ పేజీవరకు క్రమసంఖ్యలు వేయఁగా తరువాతి 10 కాగితములు అనఁగా 20 పేజీలు సంఖ్యా విరహితము లైనవి. శ్రీనేమానివారి రచన ముగిసిన యీ "అగ్నిసూర్యవాయు" దేవతాత్మక సూక్తము ఏకశతషట్త్రింశత్ సంఖ్యాత్మకమగు (136) సూక్తము. ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితలో దశమ మండలములోని యీ అష్టమాష్టకమున 128వసూక్తము తరువాత 129, 130 సూక్తములుగా రెండు "ఖిల" సూక్తములను నధికముగా నేను జేర్చినందువల్ల శ్రీనేమానివా రాంధ్రీకరించిన 136వ సూక్తము 138వ సూక్తముగా మార్పు చెందినది-వ.గో.కృ.

1. వాక్కు నలుపుచుండి. (తా.పా.), 2. స్వతంత్ర యగుచుఁ దానతిశయముగ, (తా.పా.)

## సూక్తము—138

ఋషి—1-జూతి; 2-వాతజూతి; 3-విప్రజూతి; 4-వృషాణకుఁడు;
5-కరిక్రతుఁడు; 6-ఏతశుఁడు; 7-ఋష్యశృంగుఁడు

దేవత—అగ్ని సూర్య వాయువులు

### అర్థాంతరము—1

†(1) అనలములో జ్వాలలు తగు హాలాహల రూప విషాన
నలరెడు జ్వాలాళుల నాకసమ్ము ధరియించుచు
జ్వాలలె విశ్వ మ్మెల్లన్ సందర్శింపఁగఁజేయుచుండు
సృష్టి సర్వమున జ్వాలలె జ్యోతిగఁ దనరారుచుండు ॥ 4641

(2)†ఆ॥వె॥ సప్త విధములైన శ్వసనుండు గుప్తమౌ
శక్తితతుల మలిన సకలములను
మ్రింగులే! సదా పిశంగవర్ణగతుల
సర్వ సృష్టిఁ బ్రాణ శక్తిగఁ దగి ॥ 4642

†క॥ ద్వైపీయమ్మౌ శక్తుల
నా వాయువె ఆకసమున నఖిలమ్మంచున్
జీవ గతులఁ బ్రాణదమై
భావ జగతి రూప మొొచు వరలున్ సుగతిన్ ॥ 4643

(3)†ఆ॥వె॥ సప్త రూపములను సంచరించెడు గాలి
నతిబలీయ మొొచు నలరి నింగి
సృష్టి స్థితి లయాలఁ జిద్విలాస గతుల
నుజ్జ్వల గతి నొందు నున్మదముగ ॥ 4644

†ఆ॥వె॥ పంచభూతరతుల వరలు మృత్తుగ సృష్టి
మల విష మగు "నఖి"ఁ బ్రమాద శక్తి
ననిలుఁడు హరియించు నద్భుత రూపాల
నుభయ గతుల దీప్తు లొనరఁ దనరు ॥ 4645

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

†(4)ఆ॥వె॥ అంతరిక్షమందు నతిలోక రతులతో
విశ్వరూప మందు వివిధ గతుల
నావహించు సృష్టి నంతటన్ వ్యాపించి
అనిల మనల శక్తు లలరుచుండు ॥ 4646

†ఆ॥వె॥ దేవదేవు దివ్య భావ రూప గతుల
సప్త విధము లౌచు సకల సృష్టి
ననిల మలరుచుండు ననలమ్ము నలరును
సుకృత రతుల స్నేహ సూనృత గతి ॥ 4647

(5)†క॥ సప్తానల దీప్త గతుల
సప్తానిల ప్రాణతతులు సఖ్యత్వమునన్
ఆప్త గతుల సవితథమౌ
ప్రాప్తిని భక్షకమయి తగు రక్షకము నగున్ ॥ 4648

†క॥ ప్రాగ్దిక్కౌక సందర్భముగా
దృగ్దర్శిత గతుల నపర దిక్కౌ కడలిగా
దిగ్దిక్కుల నంతమ్ముల న
సృగ్ధృత మౌచు ననలానిలేష్టులు వరలున్ ॥ 4649

(6)†క॥ జల సరసమ్మై సృష్టిని
విలసితమౌ నగ్నిదీప్తి వెల్గును సతతం
బు లగు బృహచ్ఛక్తులమై
బలు రూపమ్ముల చలన ప్రభా భాసితమౌ ॥ 4650

†క॥ అమలినమౌ దీప్త గతుల
దమముం బోల్దోలి సృష్టితత్త్వం బెల్లన్
శమ దమ ప్రకృతుల జ్వాలలు
రమణీయ స్వాదు సఖ విరాజిత మౌలేః ॥ 4651

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(7)†క॥ అనల జ్వాలలు సృష్టిఁ బ
వన రూప విశేష దివ్య వర్తన గతులన్
అనవరతము విస్తృతమై
వినిమయగతి సలిలములను బీల్చి యొసంగున్ ॥ 4652

†క॥ హాలాహల శక్తులతో
హేలాఽనల ప్రజ్వలాగ్ని హృద్దీప్తులమై
లీలగ రుద్రాత్మ గతులఁ
జాలితమౌ వాయుతతులు సర్వాత్మకమై ॥ 4653

## సూక్తము—138

ఋషి—1-జూతి; 2-వాతజూతి; 3-విప్రజూతి; 4-వృషాణకుఁడు;
5-కరిక్రతుఁడు; 6-ఏతశుఁడు; 7-ఋష్యశృంగుఁడు
దేవత—అగ్ని సూర్య వాయువులు

### అర్థాంతరము—2

(1)†క॥ నిరతాగ్నుల రూపమ్ములు
వరుణాత్మక దివ్యశక్తి వరలును సృష్టిన్
భరితమ్మౌ విష గతులన్
నిరంతరముఁ దిరుగు రోదసీతలమందున్ ॥ 4654

†క॥ జలమే విశ్వమ్మై తగు
జలమునె జ్యోతిగఁ బిలుతురు స్వర్ దృశ్య గతిన్
విలసితమౌ నిరతమ్మును
మలిన రహితమైన అనల మహిత గగనమై ॥ 4655

(2)†క॥ సప్తాఽనిల రూపమ్ముల
సప్తాఽగ్నులు నశనముగను స్వాహా చేయున్
గుప్త పిశంగాఽనలముల
సుప్తగతుల విస్తరిలును సృష్టి నఖిలమున్ ॥ 4656

---

†రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡క॥ దైవీయమ్మౌ శక్తుల
తో వాయువు సంచరించు ద్యుతి రవి ప్రభలన్
అపాన మ్మై రోదసి
వ్యాపా ఘనములను దిరుగుఁ దాదాత్మ్యమునన్ ॥ 4657

(3)‡క॥ ఉన్మదిత మ్మగు వాయువు
తన్మయ మై సప్తగతులఁ దనరుచు సృష్టిన్
జిన్మహిత మ్మగు నాత్మగ
సన్మాన్యత విశ్వరూప సావత్యమునన్ ॥ 4658

‡తే॥గీ॥ మట్టి రూపాల రూపొంది మహితమైన
గగన మనిలాఽనల సలిల గతులఁ గ్రాలు
పంచ భౌతిక దేహమ్ము లంచితముగ
నంతరాంతర గతుల నాత్మాఽఽశ్రిత మగు ॥ 4659

(4)‡క॥ అనిలాఽనల సలిలమ్ముల
ననంత గగనమ్ము మృత్తు లలరన్ సృష్టిన్
వినిమయ గతులను రోదసి
ననవరతము గోళజాల మావిష్కృతమౌ ॥ 4660

‡— పంచభూత తత్త్వాలను బంచేంద్రియ రూపా లవి
సఖ్యముగాఁ దనరారును సకలమ్మై సృష్టిలోన
హితకర మై సుకృతగతుల నతులితమౌ నైక్యరతుల
దీధితులను వరలుచుండు దృశ్యమాన శక్తు లలర ॥ 4661

‡(5) సప్తాఽనల కిరణాఽఽళులు సప్తాఽనిల రూపమ్ములు
దైవీయమ్మౌ శక్తులఁ దనరారును సృష్టిలోన
నతిలోకపు సఖ్యమ్ముల నాకసములు సలిలమ్ములు
నలరఁ బృథ్వీరూపమ్ములు నంతర్గతిరతుల వెలయు ॥ 4662

---

‡రచయిత:—వాఙ్మయ మహోద్యోత, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

÷ అష్టపదకందము ॥

ఇహ పరముల నన్నింటను
సహశక్తులు మీఱఁ బూర్వ జలధి నపరమౌ
మహితోదయాఽ స్తమయ రతు
లహరహమున్ జరుగు నియత యజ్ఞ క్రియగా
విహిత మ్మై అనిలాఽనల
మహీ సలిల గగన తత్త్వ మైత్రి గతులమై
ని హితాఽహిత సంఘర్షణ
విహితమ్మౌ సఖ్యగతుల విశ్వము వరలున్ ॥ 4663

÷(6) చరణరహితము లౌచు సృష్టిఁ జలనగతుల సంచరించు
చదలులోని అనిలమ్ములు సలిలమ్ములు ననలమ్ములు
మృత్తతులును గామ రూప ఋతశక్తుల వరలంగా
విశ్వసృష్టి పథములలో విమలగతుల నడుచు సదా! ॥ 4664

‡— లనిలాఽనల సలిల మృత్తు లలరంగా నాకసమ్ము
బలీయ మై వరలుచుండు బహురూపాఽంతర్గతులన్
గగనాఽనల సలిల మృత్తు లగణితగతి నలరంగా
ననిల మ్మది బలీయమౌ నంతర్గతి బహురూపుల
ననిల సలిల మృద్గగనా లలర ననల శక్తు లెల్ల
బలీయ మై వరలుచుండు బహురూపాఽంతర్గతులను
ననిలాఽనల మృద్గగనా లమరంగా సలిలమ్ములు
బలీయ మై వరలుచుండు బహురూపాఽంతర్గతులను
ననిలాఽనల సలిల గగనా లలరంగా మదూ్రిపము
బలీయమై వరలుచుండు బహురూపాఽంతర్గతులను
విజ్ఞానపు రూపముగా విశదగతుల నఖిత్వమున
స్వాదుపుగా సృష్టిలోన సర్వపదార్థ కేతువులై
సూర్యకిరణ కాంతిజాల శోభ లెల్ల వ్యాపించుచు
సౌఖ్య దాయకమ్ము లౌను సకలమౌ సృష్టిలోన ॥ 4665

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(7) సప్తరూపదీపములౌ సౌరకాంతిశక్తు లెల్ల
సప్తవాయు తతుల మహిత గుప్తశక్తులన్ జనించి
సంగ్రహించి జలశక్తుల సదా స్వాధీనగతుల
నలరించుచు నావిరిగా నతివేలమ్మౌ రతులన్
మేఘరాజి రూపొందఁగ మింటి గతుల నంటి నిలిచి
మధుర సలిలములను వృష్టి మర్మగతులఁ గురియించుచు
ననలానిలశక్తితతులు ననుగుణమై ఆకసమున
విహరించుచు నతివేలపుఁ బృథ్విగత పవిత్రములై ॥ 4666

‡క॥ అనలము విషమును రుద్రుఁడు
కనదనిలమ్ములను బృథ్విగణనప్తకమున్
ఘన నిటలమ్మునను గళ
మ్మునఁ దనరార నిరతమ్ము మూర్తిగ నిల్పున్ ॥ 4667

‡క॥ రవికాంతులు విశ్వమ్మున
నవ దీప్తుల సలిలతతుల నదముల నమలన్
వివిధములౌ సంద్రములన్
దివిగతమై ఆవిరిగను నిరతము పిల్చున్ ॥ 4668

‡— శబ్దశక్తుల గగన సర్వస్వ మలరార
ననిలానలమ్ములున్ అవని సలిలమ్ములున్
శబ్దగుణకము లౌచు నబ్దరతులను వరలు
నదనత్తులన్ సృష్టి సర్వస్వ మలరారు
నమృత విషముల నెల్ల నావిష్కృతము చేసి
అంతర్గతిరతుల ననుభూత గతిఁ బిల్చు ॥ 4669

## సూక్తమ్—139

ఋషిః—1-భరద్వాజః; 2-కశ్యపః; 3-గోతమః; 4-అత్రిః;
5-విశ్వామిత్రః; 6-జమదగ్నిః; 7-వసిష్ఠః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—అనుష్టుప్

(1) ఉత దేవా[1] అవహితం దేవా[2] ఉన్నయథా పునః ।
ఉతాగశ్చక్రుషం దేవా దేవా జీవయథా పునః ॥ 1583

‡రచయిత:—వాఙ్మయ మహాద్యుత, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. దేవ ఉఅవహితం, 2. దేవాఉన్న. (ప్రా.ప్ర.)

(2) ద్వావిమౌ వాతౌ వాత[1] ఆ సిన్ధోరా రావపతః ।
దక్షం తే[2] అన్య ఆ వాతు పరాన్యో వాతు యద్రపః ॥ 1584

(3) ఆ వాత వాహి భేషజం వి వాత వాహి యద్రపః ।
త్వం హి విశ్వభేషజో దేవానాం దూత[3] ఈయసే ॥ 1585

(4) ఆ త్వాగమం శన్తాతిభిరథో[4] అరిష్టతాతిభిః ।
దక్షం తే భద్రమాభార్షం పరా యక్ష్మం సువామి[5] తే ॥ 1586

(5) త్రాయన్తామిహ దేవాస్త్రాయతాం మరుతాం గణః ।
త్రాయన్తాం విశ్వా భూతాని యథాయమరపా[6] అసత్ ॥ 1587

(6) ఆప[7] ఇద్వా ఉ భేషజీరాపో అమీవచాతనీః ।
ఆపః సర్వస్య భేషజీస్తాస్తే కృణ్వన్తు భేషజమ్ ॥ 1588

(7) హస్తాభ్యాం దశశాఖాభ్యాం జిహ్వా వాచః పురోగవీ ।
అనామయిత్నుభ్యాం త్వా తాభ్యాం త్వోప స్పృశామసి ॥ 1589

---

1. వాతఽఆసిన్ధో, 2.తేఽఅన్యఽఆవాతు, 3. దూతఽఈయసే, 4. రథోఽఅరిష్ట, 5. సువాంమితే,
6. రపాఽఅసత్, 7. ఆపఽఇద్వాఽఉ భేషజీరాపోఽఅమీవ. (వ్రా.వ్ర.)

## సూక్తము—139

ఋషి—భరద్వాజ, కశ్యప, గౌతమ, అత్రి, విశ్వామిత్ర,
జమదగ్ని, వశిష్ఠులు*
దేవత—విశ్వే దేవతలు*

(1)‡తే॥గీ॥ నేరమును జేయు నాపైని నెనరు నునుచి
యుద్ధరింపుఁడు! మీరు సమిద్ధులార!
నన్ను రక్షించి పిమ్మట నన్నుఁ బ్రీతి
బహు చిరంజీవిగాఁజేసి వరలు బొవ్వ॥ 4670

(2)‡తే॥గీ॥ వాయువులు రెండు కడు వేగ వార్ధివఱకుఁ
బోవుచున్నవి వానిలోఁ బూర్ణమైన
వాయు వొకఁటి బలమును జేయుఁగాత!
నొకటి పాపంబు హరియించుచుండుఁగాక!॥ 4671

(3)‡తే॥గీ॥ ఔషధంబును నొడఁగూర్పు మాశుగంబ!
పాపమును సంహరింపుమా! వాతమూర్తి!
అమర దూతగ నీవుండి యఖిల భేష
జుండవై వెల్గుచున్నా వఖండితముగ॥ 4672

(4)‡తే॥గీ॥ సుఖకరము లౌచు హింసలు చూపనట్టి
యవనములతోడ వచ్చితి వార్యపురుష!
నీకు భద్రముఁ గూర్చుచు నీదు రోగ
మును హరించుచునున్నాఁడ మోద మలర॥ 4673

(5)‡తే॥గీ॥ అస్మదీయ శరీర మత్యధికపాప
రహిత మౌనట్టి విధమున భ్రాజమాన
సకల సురలు మరుద్దేవ సమితి భూత
ములును రక్షింతురిగాతఁ! దా మెలమి మమ్ము॥ 4674

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సప్తఋషులు"గాను, దేవత "విశ్వే దేవతలు"గాను, శ్రీనేమానివారు వ్రాసిరి.

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1977 సంవత్సరములో ననూదితము.

(6)‡గద్యము ॥
అప్పు లోషధిరూపమునఁ బరిణతములై రోగోపశమన హేతువు లగుచున్నవి. పారిజాతమునకు
భేషజభూతము లగుచున్నవి. అట్టి యప్పులు ఓయి! స్తోత! నీకు భేషజమును జేయుఁగాక! ॥* 4675

(7)‡గద్యము ॥
దశాంగళులు గల్గు ప్రజాపతిహస్తములచే సృజియింపఁబడిన రసన[1] శబ్ద పురోగంత్రియై
పుట్టెను. ఆరోగ్యహేతువు లగు హస్తములచే నో స్తోత! నిన్ను స్పృశింపఁగలము ॥* 4676

## సూక్తము—139

ఋషి—భరద్వాజ, కశ్యప, గౌతమా,ఒత్రి, విశ్వామిత్ర,
జమదగ్ని, వశిష్ఠులు
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము—1

‡(1) దేవాళి సర్వమ్ము దివ్యశక్తులు మీర
మత్కృతమ్మైనట్టి చిత్క్రియల దుష్కృతుల
పావపుంజము నెల్ల రూపుమాపుచు సదా
శక్తివంతముగాఁగ సద్గతుల స్థితిరతుల
నిత్య పునర్నవ సత్యదీప్తులు వరఁగ
దేవ దేవుల దివ్య తేజాలు విలసిల్ల
జీవశక్తుల ప్రాణ సృష్టి పవనము లలరు
సమేయమౌ గతులతో ననుపమానపు జతుల ॥ 4677

‡(2) అనిలశక్తులు మహితాఽనలముగా వెలుఁగు
హరియించు మలములన్ హరియించుఁ బాపమ్ము
విశ్వరూప మ్మొంచు నశ్విదీప్తులు మీర
ననృతరహితమ్మైన అమృతవర్షిణి కాఁగ
నతిలోక శక్తులన్ నతిమధురరూపాల
శబ్దదీప్తుల దివ్యసత్త్వశక్తులు తనర
ద్వైరూప్య గతులతోఁ దనరారు మరుదాళు
లిహపరమ్మౌ గతుల నెనఁగు ననంతముగ ॥ 4678

‡(3) ఔషధశక్తుల గంధము నపురూపముగా వహించి
అమలగతుల సృష్టి నెల్ల నావహిల్లఁగాఁ జేయుచు
రోగగుణగణమ్ములన్ రూపుమాపుచుండు సదా!
సంవర్ధక శక్తులతో సంభారక సుగంధాల

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
1. రసన=జిహ్వ.

సకలమ్ముల వ్యాపించుచుఁ జరాఽచర ప్రపంచమునఁ
పుష్టిపుష్టి కలిగించుచు వ్యష్టి సమిష్టిగతులమెయిని
దేవదూతగాఁగ వరలు దివ్యమైన పవనమ్ములు
విశ్వమ్మునె ఓషధులై విమల శక్తులను వర్తిలు ॥ 4679

‡(4) సృష్టియక్ష్మ దుర్గతులను జెండాడుచు నిత్యమ్మును
బహిరంతర్గతులతోడఁ బ్రబలు సరిష్టాళి నెల్లఁ
బొలఁగించుచుఁ బ్రకృతిలోన వెలయంగా సుకృతగతులు
ప్రాణరతులఁ ద్రాణగతుల నవికలమౌ దివ్యతతుల
మృత్తతులును సనలమ్ములు మిన్నులు సలిలమ్ములును
నక్షయగతులను వరలుచు దక్షత్వమ్మును బెంచుచు
నిత్యభద్రరూపమైన సత్యశక్తిపర మ్మొంచు
శాంతిభరితమైన దివ్య సత్త్వ శక్తి వరలంగా ॥ 4680

(5)‡అక్షివృత్తము ॥*
రక్షించునుగాక నిహము
రక్షించునుగాకఁ బరము
రక్షించునుగాక! సురలు
రక్షించునుగాక! మరుత
మక్షయ్యుదమైన మహిత
దక్షత్వము లెల్ల వరల
సాక్షీవర విశ్వ ప్రకృతి
పక్షమ్మగు భూత తతుల
రక్షించునుగాక నమర
దాక్షిణ్యము మీర జగతి ॥ 4681

(6)‡క॥ వశశక్తిగ వరలి జల మ
వశగతి స్థితిశక్తిగఁ దగి ప్రకృతిని నారో
గ్య శమ దమ కర మగుచు ని
త్య శర్మపౌషధిగ సలిల మలరును సృష్టిన్ ॥ 4682

‡ఆ॥వె॥ అంబురాశి రుజల నంతరింపఁగఁ జేయుఁ
బ్రాణి తతికి వృక్ష ప్రకృతులకును
నాకనమ్ము నకును ననిలాఽనలములకు
మృత్తులకు నొనఁగు సరోగ గతులు ॥ 4683

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్మమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"బృహతీ"చ్ఛందము. (9)

‡(7) దశదిశలను శబ్దశక్తి తనరారుచు విశ్వరూప
మనిలానల హస్తగతుల నలరారఁగ జిహ్వలుగా
ననామయత్వ మహితమ్మౌ నద్భుతమౌ స్పర్శశక్తి
ప్రకృతి పురోగామిగాఁగఁ బయనించును నిత్యమ్మును
నారోగ్యప్రదమ్ము లౌచు ననుపమాన గతులమైని
ననిల శక్తు లనల శక్తు లనునిత్యము వర్తిల్లఁగ ॥ 4684

## సూక్తము—139

ఋషి—భరద్వాజ, కశ్యప, గౌతమా,ఽత్రి, విశ్వామిత్ర,
జమదగ్ని, వశిష్ఠులు
దేవత—విశ్వే దేవతలు

## అర్థాంతరము —2

‡(1) ఊర్ధ్వగతుల నభోగతుల[1] సృష్టిగోళ లోకాళులు
చక్రనేమి క్రమముగాఁగ సర్వదా చరించుచుండు
దివ్యమైన దైవశక్తి సత్యనిత్యగతులఁ దనరఁ
జతుర్దిశల విశ్వప్రకృతి సంజనితమ్మౌచు వెలిఁగి
లయమౌచును బునర్జన్మ రాజిల్లును దిరిగి తిరిగి
సదసత్తులు సంభృతమై సకల చరాచరము లలర ॥ 4685

‡(2) తుదిమొద లంటుచు సృష్టిని హృదయరతుల దివ్యశక్తి
గుహ్యగతులఁ దనరారెడి కొమరు మిగులు ననిలమ్ముల
కల్మషతతులను నొక కరువలి తొలఁగించంగాఁ
బ్రాణ త్రాణ దాతగాఁగ వరలంగా నొక వాయుప్ర
సర్వ సృష్టిఁ జరాచర జన్యజనక ప్రాణతతులు
దక్షతమై సక్షతగతిఁ దనరారఁగఁ బునర్జన్మ
ప్రకృతిలోని అమృతశక్తి ప్రాకృతమై వరలంగా
సృష్టి స్థితి లయ రతు లవి ఋతగతులను వర్తిల్లుచుఁ
జక్రనేమి క్రమముగాగ సంక్రమించుఁ గ్రమగతులను
ననంతమైన దివ్యగతుల ననింద్యాంద్యశక్తు లలర ॥ 4686

‡(3) స్రష్టాదిగ ననిలమ్మది వెలుఁగు భేషజమ్ము గాఁగ
మృద్గగన సలిలమ్ముల మిన్నంటెడి శక్తులలోఁ
బ్రకృతిలోని రోగజుష్టబాధక కల్మష తతులను
నిర్మూలన మొనరించెడి నిర్మలానిలములు జగతి

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పట్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఇక్కడ "ఊ-ఋ"లకు యతి.

దేవదూతగాఁగ నిలిచి దివిషువి లోకా లన్నిట
సంచరించి అనవరతము సచ్చిన్మయశక్తితతులు
సకల సృష్టి వ్యాపింపఁగ సర్వప్రాణద మౌచును
విశ్వమునకె ఔషధమై విమలశక్తిగా నిల్చును
నిఖిల సృష్టి నలరించుచు నిరతమ్మును బహిరంతర
రూపమ్ముల వర్తిల్లును నిరుపమాన మార్గగతుల ॥‡ 4687

‡(4) శాంతి సౌఖ్య దాయకమై సర్వమ్మున నలరారెడి
అనిలశక్తి అహింసక మౌచు నలరు నఖిల సృష్టి
క్షీణపూర్ణ బహుళగతులఁ జెలొందెడు చాంద్రిశక్తి
ననిలగతుల నావృతమై ఆయుష్కారక మౌచును
దక్షత్వమ్మును సృష్టికి నక్షయగతి నొసఁగూర్చుచు
భద్రమహిత మౌచుఁ దనరి భవ మౌచును స్థితిశక్తుల
సంవర్ధనగతుల సృష్టి సర్వస్వము తనరారుచు
ద్వంద్వ పరికృతు లలరారును వాయు మహాశక్తి వితతి ॥ 4688

‡(5) పరబ్రహ్మ తత్త్వమునకు బాహిర మౌ నిహగతులను
దివ్య దేవతాఽఽళు లెల్ల భవ్యగతుల రక్షించును
దైవీయములై నిత్యము తనరారెడి గణజాలము
అఖిలాఽఖిల మరుత్తతుల ననవరతము రక్షించును
అసత్పరమ్మైన సృష్టి నంతయు సత్పరమ్ముగాఁగ
ననిలాఽనిల సలిలమ్ములు నాకనమ్మ మృత్తతులును
రక్షితమ్ము లౌచుఁ దనరు రాక్షస విష శక్తితతుల
నాశనమ్ము నొనరించుచు నాశాంతముగాఁగ జగతి
సంక్షేమత్వము తనరఁగ నకలసృష్టి స్థితిగతులను
బ్రికృతి నిర్దుష్ట మగుచు వరలుచుండు సత్త్వరతుల ॥ 4689

(6)‡క॥ విష్ణువు జలగతుఁ డౌచుఁ గ
వోష్ణోష్ణగ శీతలాచ్ఛ యుగ్మత లలరన్
దృష్ణ రహిత భేషజమై
కృష్ణ మహాదీప్త గతుల సృష్టిన్ దనరున్ ॥ 4690

‡(7) దశదిశలను దనరారెడి అశరీరపు శక్తులమై
సనంతమైన దంష్ట్రిలతో నలరారెడి మత్స్యమ్ముల
వేద విజ్ఞాన రూప మోదశక్తి విస్తరిల్ల

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శబ్దశక్తి జాలా బవి సర్వమ్మున వ్యాప్తి చెందు
ఆరోగ్యప్రద మై తగు నమృతశక్తి సర్వస్వము
స్వర్ణాగ్నుల దివ్యశక్తి సాఽనిల మై దైవజమౌ ॥‡ 4691

‡— స్వర్యశక్తి తనరారఁగఁ బ్రాకృతమౌ దివ్యగతుల
ననిలమ్ముల గుప్తతతుల ననలమ్ముల శక్తిరతుల
నక్షయ మై నక్షరమౌ ననాదియై అనంత మౌచు
నవిచ్ఛిన్నమౌ గతులను నభేద్యమైన శబ్దశక్తు
లలరారును సృష్టిలోన నాకసంపు గుణరతులను
నిర్వికార నిరంజన నిర్వికల్ప నిర్గుణ గతి ॥ 4692

## సూక్తమ్—140

ఋషిః—అంగ పౌరవః
దేవతా—ఇన్ద్రః
ఛందః—జగతి

(1) తవ త్య[1] ఇన్ద్ర సఖ్యేషు వహ్నయ[2] ఋతం మన్వానా వ్యదర్దిరుర్వలమ్ ।
యత్రా దశస్యన్నుషసో రిణన్నపః కుత్సాయ మన్మన్నహ్యశ్చ దంసయః ॥ 1590

(2) అవాసృజః ప్రస్వః శ్వఞ్చయో గిరీనుదాజ[3] ఉస్రా అపిబో మధు ప్రియమ్ ।
అవర్ధయో వనినో[4] అస్య దంససా శుశోచ సూర్య[5] ఋతజాతయా గిరా ॥ 1591

(3) వి సూర్యో మధ్యే[6] అముచద్రథం దివో విదద్దాసాయ ప్రతిమానమార్యః ।
దృళ్హాని[7] పిప్రోరసురస్య మాయిన[8] ఇన్ద్రో వ్యాస్యచ్చకృవాగ్ం[9] ఋజిశ్వనా ॥ 1592

---

స్వరపయితః—వాఙ్మయ మహర్షి, డాక్టర్ పస్నమూడి గోపాలకృష్ణయ్య "శిక్షా-ప్రవీణ"

1. తవత్యఽఇన్ద్ర, 2. వహ్నయఽఋత, 3. ఆజఽఉస్రాఽఅపిబో, 4. వనినోఽఅస్య, 5. సూర్యఽఋత, 6. మధ్యేఽఅము, 7. దృళహాని, 8. మాయినఽఇన్ద్రో, 9. వాఁఽఋజిశ్వ. (ప్ర.ప్ర.)

(4) అనాధృష్టాని ధృషితో వ్యాస్యన్నిధీగ్ంరదేవాగ్ం[1] అమృణదయాస్యః ।
మాసేవ సూర్యో వసు పుర్యమా దదే గృణానః శత్రూగ్ం[2]రశృణాద్విరుక్మతా ॥ 1593

(5) అయుద్ధసేనో విభ్వా విభిన్దతా దాశద్వృత్రహా తుజ్యాని తేజతే ।
ఇన్ద్రస్య వజ్రాదబిభేదభిశ్నథః ప్రాక్రామచ్ఛున్ధ్యూరజహాదుషా[3] అనః ॥ 1594

(6) ఏతా త్యా తే శ్రుత్యాని కేవలా యదేక[4] ఏకమకృణోరయజ్ఞమ్
మాసాం విధానమదధా[5] అధి ద్యవి త్వయా విభిన్నం భరతి ప్రధిం పితా ॥ 1595

## సూక్తము—140

ఋషి—ఉరు వనెడు వాని పుత్రుఁడు అంగాఖ్యుఁడు*
దేవత—ఇంద్రుఁడు*

(1)‡తే॥గీ॥ నీదు చెలికారమును బొంది నిఖిల సంస్త
వంబుల వహించు నంగిరోవర్గ మెల్ల
గోగణంబుల హరియించు కుచ్చితాఽసు
రుని వధించినవారలు ఘనతఁ గలుగ ॥ 4693

‡తే॥గీ॥ కుత్సుఁడను పూనికిం గడుఁ గూర్పఁదలఁచి
ప్రత్యుషస్సుల నెనఁగుచుఁ బ్రబల వృత్ర
పరివృషములైన జలములు పరిగిడునటు
చేయుచున్ వెల్గుచున్నావు! శీఘ్ర మింద్ర! ॥ 4694

1. ధీగ్ం-దేవాగ్ం-అమృణ, 2. శత్రూగ్ం-రశృణా, 3. దుషా-అనః, 4. యదేక-ఏక,
5. దధా-అధి. ప్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఈ సూక్తమునకు ఋషి "అంగుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(2)‡సీ॥ జన్మ హేతువులైన జలముల నెల్లను వీడునట్టు లొనర్చి వెలిఁగినావు!
గోనిష్ఠబిలముపైఁ గూర్చిన కొండల ముక్కముక్కలు సేయ మొనసినావు!
మధుర పదార్థముల్ మరుగుచుఁ దియ్యనౌ హవ్యంబు తాఁవి నీ వమరినావు!
శ్రవణసాధనములౌ సకల గోవులయందు నతిమధురసమును నానినావు!
తే॥గీ॥ వృష్టిమూలాన వార్థుల వృద్ధిఁబరచు,చున్నవాఁడవు! వనముల నున్న వృక్ష
జాలముల నెల్ల నభివృద్ధి లీల మాత్రఁ,జేయుచున్నావుకావఁ బే! శ్రీమహేంద్ర! ॥ 4695

‡తే॥గీ॥ యజ్ఞము నిమిత్తమై పుట్టినట్టి వేద
వాక్కుచే స్తూయమానుఁడౌ వాసవుండు
చెనటి వృత్రుని హననంబుఁ జేయ నపుడె
దివమునందె వెలింగెను దినకరుండు ॥ 4696

(3)‡తే॥గీ॥ దాసుఁడైనట్టి వృత్రుని దరికిఁజేరి
యపకృతిని జేయ వాసవుఁ డరిగినపుడె
దినము[1] మధ్యమునందు నాదిత్యుఁ డెలమి
నరదము విడిచిపుచ్చె నత్యాదరమున ॥ 4697

‡తే॥గీ॥ అల ఋజిశ్వ మునీశుని యమలమైన
చెలిమి గావించి మాయలఁ జేయునట్టి
పిప్రుఁ డను వాని యెక్కువ పీచ మడఁచి
వాని పురములఁ గొట్టితి! వాసవుండ! ॥ 4698

(4)‡గద్యము ॥
ప్రగల్భుఁ డగు నింద్రుఁడు పూర్వ మబాధిత లగు నసురబలములఁ బొలఁగఁజేసెను. అయాస్య ఋషిచే స్తుత్యుఁ డగు నింద్రుఁడు అసురనిహతము లగు ధనములను హింసించెను. మరియు మాన విశేషముచే సూర్యుఁడు రసాదుల నెట్లు గ్రహించుచున్నాఁడో! యట్లే యింద్రుఁడు అసుర ధనములను సంగ్రహించుచున్నాఁడు. స్తోతలచే స్తూయమానుఁడై శత్రువులను వజ్రముచే మోదెను ॥ 4699

(5)‡తే॥గీ॥ అప్రహత సేనుఁ డగుచుఁ దా నరులఁ దున్ంచు
వజ్రమున శత్రు బలమును వంచినట్టి
యింద్రుఁ డిల స్తోతృవరులకు నెల్ల ధనము
నిచ్చుచున్నాఁడు జను లెల్ల మెచ్చునటుల ॥ 4700

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

1.సూర్యుఁ డాకాశమధ్యమందు రథము నిల్పినాఁడని యున్న యీ వర్ణనమునుబట్టియు, మఱికొన్ని ఋక్కులందు వర్ణింపఁబడిన యంశములనుబట్టియుఁ జూడఁగా నీ ఋగ్వర్ణిత ప్రదేశమునందుఁ బగటివేళ సుమా రేడు మాసముల కాల ముండు నని యూహింప నగు నని కొందరు భావించిరి. ఈ యేడు మాసముల కాలము సూర్యాస్తమయ మనునది యెట్టిదో! తెలియక యుండుటచే సూర్యుఁడు తన ప్రయాణమున కంతము లేకుండఁజేసికొనుచున్నాఁ డనికూడఁ గొందరు భావించిరి.

‡తే॥గీ॥ శత్రు నాశకుఁడైనట్టి శక్ర విభువు
వజ్రమును జేతఁబట్టుచు వైరి బలము
వంచ సూర్యుఁడు దీపించెఁ బ్రత్యుషస్సు
స్వీయ రథమును విడచెఁ దా శీఘ్రగతికి ॥* 4701

(6)‡తే॥గీ॥ నిస్సహాయుండవై! యింద్ర! నీవు యజ్ఞ
హీను నసురుని గొట్టితి వేపు గదుర
మాన కర్తగ నున్నట్టి భానమాన
సూర్య దివమందుఁ దాల్చుచు శోభఁ గంటి ॥* 4702

‡ఆ॥వె॥ దుష్ట వృత్రువలనఁ దూలఁగొట్టఁగఁబడు
సూర్యయాన చక్ర శోభి పార్శ్వ
ఫలకమును దివంబు పట్టుచుండెడు నట్లు
నీవె చేసినావు! పావనేంద్ర! ॥* 4703

‡తే॥గీ॥ ఇట్టి కర్మం బెవ్వియో! యింద్ర! నీవు
చేసినాఁడవు! జగతికి శ్రీలు కలుగ
నవి యసాధారణంబులై యమరుచుంట
స్తుతుల కర్హము లగుచుండెఁ జూడఁజూడ ॥* 4704

## సూక్తము—140

ఋషి—ఉపవేశపాని పుత్రుఁడు అంగాఖ్యుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

‡(1) ఐంద్రమైన శక్తులతో ననాద్యంత మౌచు నిలచి
నిత్యసత్య రూప మౌచు నిఖిల సృష్టి వ్యాపించుచుఁ
బ్రకృతి సమ్యగతులు వరల బ్రాహ్మ్యశక్తి వర్తిల్లఁగ
దశదిశలను వృత్రాసుర దహ్యమాన విషానలము

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో సమాచితము.

"అభి"రూపమ్మై సృష్టిని "నాభి"శక్తి హరియించుచు
గోళ లోక సర్వస్వము కుటిలగతులఁ గుతలములుగఁ
గల్లోలము పాలుచేయు కలుషాత్ముని వృత్రాసురు
నతిపవిత్రమై వరలెడి అగ్నిదీప్తులన్ వధించి
మేఘరాజి రంజిల్లఁగ మిత్రగతుల జలధారలు
వర్షింపఁగఁ బ్రకృతియెల్ల హర్షపులకిత మ్మై తగు ॥‡ 4705

‡(2) ఐంద్రమైన దివ్యశక్తి అలరారుచు నగ్నిదీప్తి
జలదమ్ముల నలరించుచుఁ జైతన్యపు విద్రావణ
శక్తులతో వర్షమ్మును సర్వప్రకృతి వరముగాఁగ
గిరి తరువులు లతలు సకల ప్రాణిశక్తుల సంతర్గతి
నలరారుచు సృష్టిలోన నసాధారణమ్మౌ మధు
రసస్యందనములఁ గురిసి ప్రకృతి జీవశక్తు లెల్ల
సంజనితమ్మై సరళము సంవర్ధక మౌచు నిలిచి
శబ్దశక్తి సంచయాల సర్వస్వము విలసిల్లును ॥ 4706

‡క॥ వృత్రాసురు సంహరణాఽ
మిత్ర విచిత్రంపు శత్రు మృత్యు క్రియలన్
మిత్రుని సందీప్తులను స
రిత్ర గతుల దైవశక్తి ఋతరతి వెలుఁగున్ ॥ 4707

‡(3) ఆకాశము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
మృత్తతులును వర్తిల్లఁగ మిశ్రములై అవితథముగ
నవినాభావత్త్వగతుల నన్యోఽన్యము కలివిడి మై
నలరంగా నర్యముఁడౌ నా దేవుని దివ్యశక్తి
నాదిత్యుని సంశక్తుల నఖిలమ్మును బద్ధముగా
సౌరమండల మెల్లను సంచరించు సూర్యు పగిది
ననువర్తిత మౌచుఁ దిరుగు ననుగమ మ్మౌచు వరలు
కాల రథము నధిపసించి కదలుచుండు రవిగతులను
మాయరూప మౌచు ఛాయ మర్మగతుల ననుసరింప
వెలుఁగు నీడ లౌచు జగతి విలసిల్లును నిత్యమ్మును ॥ 4708

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(4) సచ్ఛక్తులె అసద్గతుల సర్వస్వము హరించుగతిని
బూర్వదుర్గతుల నెల్లఁ బుణ్యమ్మది పోఁగొట్టును
సౌరకాంతి కిరణాలవి నీరములను స్వీకరించి
ఆవిరిగా నమర నింగి నల మొయిళుల రూపు నిల్పు
నఖిల ప్రకృతి కాత్మతృప్తి నభినవముగఁ గల్పించుచు
జలధారల వర్షించును జల్లఁబడఁగ జగతి యెల్ల
వివిధ గోళ లోకాలను విరాజిలెడి వసుసంపద
లెల్ల మహా దీప్త గతుల సల్లీలగఁ జెల్లీలగ
నఖిలేశుని ఆనందపు టమృతతత్త్వ లక్ష్యముగా
శత్రుతతుల సర్వస్వము సంహరించుచుండును హరి ॥ 4709

‡(5) దనుజశక్తి వర్ధిల్లుచు దశదిశలను వ్యాపింపఁగ
"నభి"శక్తుల రూపుదాల్చి అఖిలమ్మున విషపూషిత
సంక్షోభమ్ముల సృష్టిని సంకులితముగాఁగఁజేయు
వృత్రాసురు దుశ్శక్తిని జిత్రపఁగఁ జేసి మహా
మిత్రశక్తి వర్ధిల్లఁగ మిన్నంటెడి హృద్దీప్తుల
వజ్రశక్తి విశ్వమ్మునఁ బరాజితము కాక నిలచి
అజయ్యమై అక్షయమై అక్షరమై అభేద్యమై
విశ్వసృష్టి సుషోదయము సన్నగిలుటఁ దనరాఁగ
గతి తప్పని నిత్య సత్యకాంతి "నాభి" శక్తు లలర
శీతలోష్ణ జల నాధులు వెల్వొందును గ్రహగతులను ॥ 4710

‡(6) సృష్టియజ్ఞతత్త్వములోఁ జిద్వస్తుల నిమంగిరులఁ
వసరారెడి ప్రకృతి పురుష తాదాత్మ్యమ్ములు నిరతము
నేకైకమ్మై పరఁగెడి రాకా శశి ప్రాహ్యశక్తి
సౌరకాంతి ప్రతిఫలమై సర్వమ్మున వెలిగిల్లఁగ
వివిధములను బహుళ ఘోరదీప్తమాన లోకమ్ముల
భిన్నమైన రీతులతోఁ జిన్న పెద్ద పరిధులతో
మహిత శక్తి రక్తములను మాని గరులు వర్తిల్లను
బహుశక్తుల యుదలతు లవి క్రియలుగాఁ బ్రకృతిలోన
సహజములో పరిణామము లహరహమున్ గల్పించుచు
శబ్దశక్తు లలరారఁగ సర్వమునకుఁ బెరుగ వరలు ॥ 4711

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వక్షమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—140

ఋషి—ఉరు వనెడు వాని పుత్త్రుఁడు అంగాఖ్యుఁడు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

‡(1) ఋతశక్తుల సంఘాతము లతులితమై వరలంగా
నాకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును నన్యోఽన్యము మిళితములై మైత్రి మీర
నవినాభావత్వ మలరు ననుబంధపు బంధాలను
భిన్నతలో నభిన్నత నభిన్నతను భిన్నతమై
నసాధారణంపు గతుల నలరుఁ బంచభూతతతులు
సర్వాఽతీత మ్మౌచును సకలమ్మున సంచరించు
హృచ్ఛక్తుల సందీప్తుల నెల్ల సృష్టి వర్తిల్లఁగఁ
బ్రకృతిలోని మశ్శక్తులఁ బటాపంచలుగఁ జేయుచు
దశదిశలను గోళమ్ముల విశద మౌను దైవశక్తి ॥ 4712

‡(2) సత్య శబ్ద శక్తులమై సర్వకాంతి తతులు వరల
నుదధిలోన నుప్పులైన నుదకములను నుర్విమీఁదఁ
జెరువులందు రకరకాల దొరువులందు బావులలో
నదీ నదమ్ములను వరలు నానావిధ సలిలాలను
నావిరిగా స్వీకరించి అలరించుచు మధురగతుల
మొయిళులలో నిలిపి నింపి మూర్తిగొన్న జలదేవత
పరవశించి పరవశులను నురుకు లెత్తి పరుగు లెత్తి
ప్రకృతిమాత ఒడిలోపల సుకృతిగతుల ప్రియమారఁగ
బంచభూతతత్త్వా లవి సంచితములుగాఁ దనరును
శబ్దశక్తు లలరారఁగ సౌరాగ్నులు ప్రజ్వలిల్లు
వేదరూప విజ్ఞానము మోదాన్వితమౌ నిత్యము
భూత భావి వర్తమాన పూర్ణకాల రూపమ్ముల ॥ 4713

‡(3) వైష్ణవీయమ్మైన శక్తి వర్తిల్లఁగ సృష్టిలోనఁ
గాలరథ మ్మధివసించి క్రాలంగా మధ్యస్థితి
రవిమండల మలరారఁగ సవితథమౌ నవదీప్తుల
నాత్మప్రదక్షిణల నన్నియున్ ప్రదక్షిణలను

‡రచయిత:—వాఙ్మయ మహర్షి, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

నకల గోళ లోకాళులు స్థాన భ్రంశమ్ము కాని
చలనగతులఁ జదలులోన సంచరించు మహితముగా
ననునిత్యము పరిభ్రమింప నసాధారణంపుగతుల
దశదిశలను నానావిధ తరణి రూప ఘృణి దీప్తులు
తనరారఁగ సర్వసృష్టి ఏనిమయ మౌ పంచభూత
రూపమ్ములు వరలుచుండు వృద్ధిని నధికాధికముగ
నొకదాని కొకటి బంధువుగా నుండు గర్భితముగ సృష్టి
భేద్యమౌచు నభేద్యమౌచు విశదమౌచు విశ్వమ్మున ॥‡ 4714

‡(4) వృత్రాసురు దుష్టశక్తి విశ్వరూప మొంది నిలువ
"నభి"శక్తుల నాహరించి అతిఘోరమ్మౌ విష
పంచభూత రూపమ్ముల వ్యాప్త మౌచు సృష్టిలోన
దుష్టమైన పెనుగాలుల దుర్విదగ్ధ రూప మంది
సలిలమ్ముల వర్షించెడి జలదమ్ములఁ జదలులోనఁ
జెల్లాచెదరుగఁ జేయుచు ఛిన్నాభిన్నము చేయుచు
దుష్టాగ్నుల రూప మంది ఘూశిఘూసరమ్ము కాఁగఁ
బ్రకృతిలోని జలసంపద వికృతగతిన్ నాశపరచు
ననిలమ్ముల నన్నింటిని నాకైనను నల్లాడక
ఉండునట్లు బంధించును నుసురు లుడుగఁజేయుచుండు
దుష్ట నలిల రూప మంది దుర్మార్గగ ప్రభంజనపు
రూక్షగతుల సృష్ట్యగ్నుల రాక్షసరతి నార్పివేయు
జలప్రళయ పరముకాఁగ సర్వప్రకృతి ధ్వంసపరచు
సలిలాఽనలాఽనిలమ్ముల సర్వశక్తి సంచయాలు
మట్టిఁ గలిపివేయు ప్రాణ మహితమైన తనుజాలము
అనిలమ్ముల సలిలమ్ముల ననలమ్ముల మృత్తులను
నదృశ్యముగ ధ్వంసపరచి ఆకసమును జేయఁదలఁచు
దుశ్శక్తుల రూపమైన దుష్టవృత్రు వధియించును
వైష్ణవీయమైన శక్తి వరలంగా విశ్వశాంతి
సృష్టి స్థితి లయగతు లవి చెలఁగంగాఁ గ్రమగతులను
నిత్యశత్రు నాశనముల సర్వశక్తు లలరారఁగ
విశ్వమ్మున వసుసంపద లక్ష్మీ దీప్తులన్ వరలును ॥ 4715

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(5) వృత్రరూప దుష్టశక్తి ప్రేర్యమాణ మౌచు సృష్టిఁ
బంచభూత తత్త్వాలను వంచించుచు విరసముగా
వ్యాప్తి చెంద విశ్వమ్మున వైష్ణవీయమైన మాయ
దివ్యమైన దీప్తులతోఁ దేజరిలఁగ వజ్రశక్తి
సంహరించుచుండునులే! సదా రూక్షరాక్షసతతి
శీతలోష్ణ జలనాభుల జీవరూపగతులు మీఱఁ
జక్రనేమిక్రమత మెయిని జగతిఁ గాల త్రితయ మలరు
నైంద్రమైన శక్తులతో నఖిలదుష్ట తత్త్వాలను
భేదించుచు నిత్యమ్మను భిన్నాభిన్న మ్ముకాఁగఁ
బ్రకృతిపురుషశక్తితతులఁ బ్రాకృతగతిఁ గాపాడును ॥ 4716

‡ఆ॥వె॥ యుద్ధ మెరుఁగకుండ యుద్ధగతుల నిల్చు
సేనవంటి దుష్ట శీర్ణ ప్రకృతి
వికృత మౌచు సర్వవిధ్వస్తమై పోవు
నిరత ముప్పతిల్లి నిఖిల సృష్టి ॥ 4717

‡(6) ఏకైకమ్మై తనరెడి యింద్రరూప విష్ణుశక్తి
ప్రకృతిపురుష పరముకాఁగ బ్రాహ్మ్యరూపమై వరలును
"ఘృణి"శక్తులతో సృష్టిని "కృణి"శక్తుల నాశపరచి
యజ్ఞాగ్నుల దివ్య శక్తి నజ్ఞానాయజ్ఞ తతుల
మష్కృతువుల వాతానల దుష్టజుష్ట ప్రభావాల
విధ్వంసము కావించుచు విశ్వసృష్టి వర్ధిల్లఁగ
వివిధ లోక గోళాలను భిన్నమైన మాసగతుల
ఋతు గతులను వర్షమ్ములు ఋతశక్తుల వర్తిల్లును
దివి భువి లోకా లన్నియు దివ్యగతుల సంచరింప
నాదిత్యుని శక్తులతో నఖిల సృష్టి తనరారును ॥ 4718

‡ఆ॥వె॥ భిన్నమైన గోళవితతి లోకాలయులు
కాల బద్ధములుగఁ గ్రాల సృష్టి
సంచరించు దివ్య సర్వజగత్పిత
పాలితములుగను సకాల గతుల ॥ 4719

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—141

ఋషిః—దేవగన్ధర్వో విశ్వావసుః
దేవతా—సవితా; 4-6-ఆత్మా
ఛందః—త్రిష్టుప్

(1) సూర్యరశ్మిర్హరికేశః పురస్తాత్ సవితా జ్యోతిరుదయాగ్ం[1] అజస్రమ్ ।
తస్య పూషా ప్రసవే యాతి విద్వాన్ త్సంపశ్యన్ విశ్వా భువనాని గోపాః ॥

(2) నృచక్షా[2] ఏష దివో మధ్య ఆస్త[3] ఆపప్రివాన్ రోదసీ అన్తరిక్షమ్ ।
స[4] విశ్వాచీరభి చష్టే ఘృతాచీరన్తరా పూర్వమపరం చ కేతుమ్ ॥

(3) రాయో బుధ్నః సంగమనో వసూనాం విశ్వా రూపాభి చష్టే శచీభిః ।
దేవ[5] ఇవ సవితా సత్యధర్మేన్ద్రో న తస్థౌ సమరే ధనానామ్ ॥

(4) విశ్వావసుం సోమ గన్ధర్వమాపో దదృశుషీస్తదృతేనా వ్యాయన్ ।
తదన్వవైదిన్ద్రో రారహాణ[6] ఆసాం పరి సూర్యస్య పరిధీగ్ం[7]రపశ్యత్ ॥

(5) విశ్వావసురభి తన్నో[8] గృణాతు దివ్యో గన్ధర్వో రజసో విమానః ।
యద్వా ఘా సత్యముత యన్న విద్మ ధియో హిన్వానో ధియ[9] ఇన్నో అవ్యాః ॥

---

1. దయాగ్ం౽అజస్రమ్, 2, నృచక్షా౽ఏష, 3. ఆస్త౽ఆపప్రివాన్‌రోదసీ౽అన్తరిక్షమ్, 4. స౽విశ్వాచీ,

5. దేవ౽ఇవ, 6. రారహాణ౽ఆసాం, 7. ధీగ్ం౽రపశ్యత్, 8. తన్నో౽గృణాతు,

9. ధియ౽ఇన్నో౽అవ్యాః. (వా.వ).

(6) సస్నీమవిన్దచ్చరణే నదీనామపావృణోద్దురో[1] అశ్మవ్రజానామ్ ।
ప్రాసాం గన్ధర్వో[2] అమృతాని వోచదిన్ద్రో దక్షం పరి జానాదహీనామ్ ॥ 1601

## సూక్తము—141

ఋషి—విశ్వావసు వను గంధర్వుఁడు*
దేవత—సవిత; 4-6-ఆత్మ*

(1)‡తే॥గీ॥ సూర్యరశ్ములఁ గల్గి సంశోభి హరిత
వర్ణమును గల్గి సవిత యవారితముగ
బూర్వదిశయందజస్రము పూర్ణమైన
జ్యోతిఁ బుట్టించుచుండెను జోద్యమలర ॥ 4720

‡తే॥గీ॥ సవిత ప్రేరణమును దాను జక్కఁ జేత
వెలుఁగుచుం బూష భూతాళి నెమ్మిఁ గనుచు
వెల్గఁజేయుచు లోకాళి వేయి విధుల
వెడలుచున్నాఁడు వేడ్కతోఁ గడు రయాన ॥ 4721

(2)‡సీ॥ ప్రాచ్యాది దిక్కులఁ బ్రాభవంబును గని చక్కఁగ వెల్గించు సవితృమూర్తి
యాగ్నేయ ముఖ్యంబులైన విదిక్కులఁ జక్కఁగ వెల్గించు సవితృమూర్తి
పూర్వభాగంబును బొలుపారు కాంతితోఁ జక్కఁగ వెల్గించు సవితృమూర్తి
పృష్ఠభాగంబును స్పష్టమయ్యెడునట్లు చక్కఁగ వెల్గించు సవితృమూర్తి
తే॥గీ॥ రోదసుల నంతరిక్షంబు సాదరమున,స్వీయతేజస్సు మూలాన శ్రీలు మెఱయ
నిండఁజేయుచు మనుజుల నెమ్మిఁ గనుచుఁ,దేజరిలుచుఁ బ్రవర్తిల్లు దివమునందు ॥ 4722

(3)‡తే॥గీ॥ ధనమునకు మూలభూతమై ధనము బొందఁ
జేయువాఁడునునయి యుండు వెలుఁగు సవిత
యఖిలమైన పదార్థాళి నధిక దీప్తి
వెలుఁగఁజేయుచున్నాడు వేడ్క మీఱ ॥ 4723

1. దురోఽఅశ్మ, 2. గన్ధర్వోఽఅమృతాని. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "విశ్వావసువు"గాను, దేవత "సూర్యుఁడు, విశ్వావసువు"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

‡రచయిత:—వాఙ్మయ మహోద్యక్షు, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

‡తే॥గీ॥ ఆ విధంబైన ధర్మంబు ననుసరించి
ధన చయ ప్రాపణమునకు ఘన మహేంద్రుఁ
బోలుచున్నట్టి సవితయుఁ బూర్ణ దీక్షఁ
దాఁ బ్రయత్నించుచుండెను దగిన రీతి ॥ 1724

(4)‡గద్యము ॥
ఓ సోమమా! నీతోఁగూడునట్టియు గీతరూప మగు శబ్దమును ధరించునట్టియు విశ్వావసుండ
నగు నన్ను నెప్పుడు వనతీవర[1]జలములు చూచినవో! యప్పుడు యజ్ఞ హేతువులై
వివిధమును బొందుచు నప్పులను బొందింపఁజేయు సింధువులు యజ్ఞ మెక్కడను
బ్రవృత్త మయ్యెనో! తెలిసికొని ప్రాచ్యాది దిగ్భాగములను దర్శించెను. 1725

(5)‡తే॥గీ॥ ఎద్ది యవిదిత కర్మ మో! యెద్ది మే మె
ఱుంగమో! యట్టి రెండు తురంగరింప
జల వినిర్మాతయైన విశ్వావసుండు
చెప్పుచున్నాఁడు మా కిప్డు తప్పకుండ ॥ 1726

‡తే॥గీ॥ ఓయి! విశ్వావసూ! ప్రీతిఁ బాయకుండ
సోమమున బుద్ధులం గడు శోభ దేల్చి
మాకుఁ గల కర్మ లనియెడు మంచి బుద్ధి
బలము రక్షింపుమా! నీవు తొలఁగకుండ ॥ 1727

(6)‡తే॥గీ॥ జగము తడిపెడు మేఘంబు శక్రుఁ డెలమి
సంతరిక్షంబునందున నధిగమించి
యంబుదంబులఁ గలయట్టి యంబు చయము
ద్వారములను దెరచివేసె వీరుఁ డగుచు ॥ 1728

‡తే॥గీ॥ అమృతసాధక జలముల నతిశయముగఁ
దాల్చి విశ్వావసుం డను తగిన రూప
మున వెలింగెడు నింద్రుండు మోద మలర
వర్షణ సమర్థ మేఘము వంచియుండె ॥ 1729

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో సమాపితము.
1. వనతీవరు లనెడి పేరుగల నీళ్ళు.

## సూక్తము—141

ఋషి—విశ్వావసు వను గంధర్వుఁడు

దేవత—సవిత; 4-6-ఆత్మ

### అర్థాంతరము—1

‡(1) ఆదిత్యుని దివ్యదీప్త యజ్ఞముతో సృష్టిలోన
సూర్యకాంతి ప్రజ్వలిలును జోద్యగతుల నిత్యమ్మును
బహుముఖమౌ నగ్ని తేజ మహరహమును జ్వలియింపఁగ
వెలుఁగు లిచ్చి విశ్వమునకు వెలుఁగంగా గ్రహఋక్ష
లఖిలమ్మును దృశ్యమాన మౌచుఁ దనర విజ్ఞులకున్
వాయు చలనశక్తులతో దేయములై దివ్యగతులు
ఉదయగతులఁ బూర్వదిశను నుజ్జ్వలముగఁ దనరారఁగ
ననునిత్యము ఋక్షాలవి ఆవిష్కృతమై వెల్గును
గుప్తమైన దీప్తగతుల గోపాలపు దివ్యశక్తి
సత్యప్రభా సంశక్తుల నిత్య సంచలన గతుల ॥ 4730

‡(2) పూర్వాఽపరదిక్కులను నపూర్వమైన శక్తులలో
విస్తృతగతిమెయి విదిగ్వితతులందు నింగి నేల
నఖిలమ్మున వెలుఁగు లిచ్చి అరుణుం డలరారుచుండు
దివి భువి తతి మధ్యస్థితిఁ దేజరిలుచు సత్యగతుల
రోదోఽంతరాళమ్మున ధ్రువరతులను దనరారుచు
జ్వలన జ్వాలనంపు దివ్యప్రభలు కేతనములుగాఁగ
నలరారుచు సంచరించు నా రవి సంకాశశక్తి
సర్వ లోక గోళాలను సదమలమౌ కాంతులలో
విశ్వమ్మును వెలుఁగఁజేయు వివిధ దిగ్విదిక్కులను
నంతరాంతరాళమ్ముల ననునిత్యము ప్రభల నొసఁగు ॥ 4731

‡ఆ॥వె॥ నయనశీల తత్త్వ సగ్నమౌ సందృశ్య
ద్రష్ట గతుల సూర్యు క్రాంతి కాంతి
కిరణజాల మెల్ల నరుణాఽరుణజ దివ్య
దీప్తి జాలములను దేజరిల్లు ॥ 4732

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పప్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(3) దివ్యదేవదేవుఁ డట్లు తేజరిలుచు దీప్తులమై
సత్యశక్తితతులమైని జ్వలియించెడి ఆదిత్యుఁడు
ధర్మేంద్రుఁడుగా వరలుచుఁ గర్మరూపమౌ సృష్టిని
జరుగునట్టి సంచలనపు సమరాంగణమందు మహా
వీర శూర ధీర కాంతి వితతు లెల్ల విజృంభింప
విశ్వలోక గోళ రూప విభవమ్ము లఁ గాపాడుచు
అష్టావిధమై వెలిఁగెడి ఆ వసుసంపద లన్నిటి
నపురూపపు ధనములుగా నసాధారణంపు దీప్తి
నిత్యమ్మును గాపాడుచు నిఖిలజగతి సత్యనిరతి
ధర్మబద్ధ మౌచు భ్రమణ కర్మలతో వరలంగా
గ్రహఋక్ష మహావితతి క్రాలు యథాతథగతులను
సక్రమమౌ గతులతోడఁ జదలులోన విరాజిలుచు
నసాధారణంపు దీప్త ప్రసాదకాంతి గుణతతు లవి
వరలంగా సృష్టిలోనఁ బరఁగు సృష్టి స్థితి లయాలు ॥ 4733

‡(4) విశ్వగతమ్మై వరలెడి విమల వసుసంపదాళి
సోమాఽమృత దివ్యప్రభల శుభ్రగాంధర్వ శక్తి
కామరూప గతుల వరలి క్రాలుచుండు సృష్టిలోన
నిత్యధర్మ బద్ధమైన ప్రత్యభిజ్ఞ ఋతగతులను
సర్వకాలగతులందును సత్యబద్ధమై తనరుచు
సృష్టి లోక గోళా లవి చెలఁగంగా గ్రహ ఋక్షా
లపురూపపు స్థానగతుల నంతరిక్షమును నలరుచు
నాకర్షణ శక్తులతో నన్యోఽన్యాఽనుబంధాలను
బద్ధాలై క్రమగతులను బరమాత్ముని ఆజ్ఞా ఋత
శిక్షణలను క్రమశిక్షణలను సృష్టి సర్వస్వమందుఁ
దనరారుచు సౌరశక్తి ఘన దీప్తులు వర్తిల్లఁగ
సౌరమండలాల పరిధి పార మెనసి సంచరింప
నపారమైన ఆదిత్యుని ఆపగ సర్వాత్మశక్తి
ఐంద్రగతుల సృష్టిలోన నఖిలమ్మును దృశ్య మౌను ॥ 4734

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పప్పుమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(5) విశ్వగతమ్మై వెలిఁగెడి వివిధములౌ వసుశక్తులు
కామరూపగతులు మీరి కాంతులతోఁ గ్రాలుచుండు
నాకసమును ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
అవనితత్త్వ రూపాలను నా పంచభూతరతుల
నలరు సంపదాళు లెల్ల వెలకట్టని భాగ్యములై
దివ్యమైన రుజ నాశక నవ్యశక్తితతులు వరల
వివిధములౌ కాలమాన విశేషతలమైని జగతి
రాత్రి దిన కాల పరిధి రకరకాల వర్తిల్లఁగ
మాసర్తు కాల తత్త్వ భాసమాన మౌచు వర్ష
రూపమ్ములు బహుగతులను లోక గోళముల వరలును
సత్యశక్తి రూప మలరు సదసత్తుల కతీతమై
నిశి దినముల కతీతమై దిశ విదిశా కాల రహిత
మనంతమై అసాధ్యమై అవినాశన రూపమ్మున
నసాధారణముగ సృష్టి నదృశ్యశక్తి నడుపుచుండు ॥ 4735

‡(6) బహు రూపపు టసంఖ్యాక పాదగతుల వర్తిల్లెడి
సూర్యకాంతి తేజాలవి శుభ్రదీప్తు లలరారఁగ
వివిధ గోళ లోకమ్ముల విచిత్రగతులఁ గాలమ్మును
రకరకాల మానములుగఁ జకితములుగ నిల్పుచుండుఁ
బలురూపుల జలశక్తుల పయోధినుండి నదులనుండి
స్వీకరించి ఆవిరిగాఁ జెన్నొందఁగ మొయిళు లౌచు
సకాలముగ నకాలముగ సర్వగోళ లోకాలకు
జలప్రదాత అగుచు వెలుఁగు సర్వేశుఁడు సూర్యుఁ డౌచుఁ
బంచభూతరూపమ్ములఁ బ్రభవించుచు స్థితిగతులను
దనరారుచు లయమౌచును వినిమయమౌ రూపాళుల
నధికాధిక మౌచు సృష్టి నలరారును గోళాలుగ
నాదిదేవు లీలకాఁగ నా దేవుని మాయకాఁగ
ననిలానల సలిల మృత్తు లాకసంపు రూపమ్ముల
నలరారును సఖిలసృష్టి అద్భుతమౌ విచిత్రముగ ॥ 4736

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—141

ఋషి—విశ్వావసు వసు గంధర్వుఁడు
దేవత—సవిత; 4-6-ఆత్మ

### అర్థాంతరము—2

‡(1) ఆదిత్యుని శక్తులతో నావిర్భవ మౌను జ్యోతి
ఉదయించును నిత్యమ్మును నుజ్జ్వల మౌ దీప్తులతో
సూర్యకాంతి కిరణాళులు చోద్యమ్ముగ విస్తరిలుచు
సరణశీల రక్తులతో హరణశీల శక్తులతో
హరికేశాలుగ సృష్టిని నలరారును నద్భుతముగ
నిత్యోదయశక్తులతో నింగి వెలుఁగు పూష కాఁగ
లోకపాలకుని దివ్య లోలుపత్వ లీలలతో
విశ్వమ్మున భువనమ్ములు విమలగతుల సంచరించు
విజ్ఞులైన మహామహులు విశదమ్ముగ దర్శింపఁగఁ
బ్రాణికోటి దృశ్యశక్తి ప్రాకృతరతి వరలంగా
అంతరాంతరమ్ములైన అఖిలమ్మున బహుముఖాల
వాయువాహ మౌచుఁ గాంతి వర్తిల్లును బలువిధాల ॥ 4737

‡(2) రోదసిమధ్యస్థమ్మై పృథ్వీదివము లన్నింటిని
దృశ్యమానగతులతోడఁ దేజరిల్లఁజేయుచుండి
అతిలోకమ్మౌ కాంతుల నంతరిక్ష మలరారఁగఁ
బూర్వాఽపరదిశలలో నపూర్వమైన కేతువుగా
దక్షిణమున నుత్తరమునఁ దగు నాల్గు విదిశలన్
విశ్వదీప్తులొప్పారఁగ విలసిల్లుచు బహుగతులను
సవితృరూప దివ్యశక్తి సర్వాంతర్యామిగాఁగ
నంతరిక్షలోకమ్ముల నఖిలాఖిల గోళమ్ముల
ఆపూర్వ్యమాన శక్తి నతి ప్రసార శక్తులతో
నను నిత్య మ్మావహించి అసాధారణ స్థితిగతులను
బంచభూతతత్త్వాలను వరలు సర్వప్రకృతిలోన
దృశ్యమౌచు నదృశ్య మౌచు దీప్యమాన జ్వలనశక్తి
గుప్తమ్మై సుప్తగతి నిక్షిప్త మ్మౌచు నిలిచి
ఆకసమునఁ బృథ్వులలో ననిలమ్ముల సలిలమ్ముల
నన్నింటను నఖిలేశుని అనలశక్తు లలరారఁగ
నాదిత్యుఁడు నిత్యమ్మును నలరించును నిఖిలసృష్టి ॥ 4738

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(3) సృష్టిలోని సంపదలకు వ్యష్టిసమిష్టి రూపమ్ములఁ
ప్రాణత్రాణశక్తు లిచ్చి ప్రజ్వలింపఁజేయు జగతి
నష్టవిధములై వరలెడి ఆ వసుసంపద లన్నియు
నైశ్వర్యములకు మూలములై అలరంగా సృష్టిలోనఁ
బలురూపమ్ముల వరలఁగ నెల వౌపుచును ధనమ్ములకు
నాదిత్యుని దివ్యశక్తి నలరారుచు సృష్టిలోనఁ
బ్రాకృతమౌ రూపములకు సత్కృతసుకృత దీప్తులతో
నతివేలమ్మౌ శక్తుల నలరించుచు ననునిత్యము
సత్యశక్తి తనరారఁగ నిత్యధర్మశక్తి వరలఁ
జరాఽచరమ్మైన ప్రకృతి జడాఽజడ ప్రపంచమ్ము
దైవీయమ్మౌ శక్తుల భావరూప ప్రతికృతులై
దేవతలా! అన్నట్లుగఁ దనరారును బంచభూత
ప్రకృతిప్రాణిరూపాలుగఁ బరఁగెడి తరు లతలు గాఁగ
గిరి ఝరులై నందములై క్రిందు మీఁదు లోకాలై ॥ 4739

÷(4) కామరూపగతులు వరలఁ గ్రాలంగాఁ బలు విధాల
నగ్నితాపశక్తులతో నలరారుచుఁ బ్రసరింపఁగ
సౌరకాంతి కిరణదీప్తసర్వస్వము జలశక్తుల
నావిరిగాఁ స్వీకరించి అలరించుచు మొయిళులుగా
మధురమైన జలధారల మహితముగా వర్షింపఁగ
నలరఁజేయుచుండు సృష్టి నపురమైన శక్తులతో
నిత్యమ్మును ధర్మగతులు సత్యములై వర్తిల్లఁగఁ
జక్రనేమి క్రమముగాఁగ సకలమ్మౌ ఋతుచక్రము
సంచరించుచుండు సదా అసాధారణంపుగతుల
వివిధములౌ గోళమ్ములఁ బృథివిప్రకృతి లోకమ్ముల
రకరకాల పరిమితులను రాణించఁగ మానమ్ములు
విశ్వరూపగతులు లోప విపులాఽజయ్యరతుల
వైష్ణవీయమైన శక్తి వర్తిల్లఁగ సకలసృష్టి
సంచరించు నిత్యమ్మును జగతి లీల మాయ కాఁగ ॥ 4740

÷రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(5) ఆకాశము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును సృష్టిలోన మించు శక్తు లలరారఁగ
వ్యష్టిసమిష్టిరూపమ్ముల యమ నియమ కాంగతుల
నాత్మప్రదక్షిణలును నలరంగాఁ బ్రదక్షిణలు
భూతాధిక్యరూపమ్ములఁ బృథ్వీజలగోళమ్ముల
తేజోఽనిల గోళమ్ములు నాకసంపు గోళమ్ములు
సంచరింప నిత్యమ్మును సంజనితమ్మౌచు నిల్చి
స్థితివృద్ధుల లయగతులను జిద్విలాసరతులు వరల
సత్యధర్మశక్తులతో సకలమ్మును వర్తిల్లుచు
భక్ష్య భోగ్య భాగ్య మహిత పరమరూప దీపమ్మై
భక్షకాఽనుభవములమై వరలంగాఁ బ్రకృతిరూపు
లాధారము నాధేయము లౌచు సంచరించు జగతి
వసుశక్తులతో విశ్వము ననమగతుల విలసిల్లఁగ
వైష్ణవీయమైన లీల వరలు మహామాయ కాఁగ
దివ్యమైన గతులుతోపఁ దేజరిలఁగ గాంధర్వపు
బహురూపుల చరాఽచరప్రకృతి వరఁగు నిత్యమ్మును ॥ 4741

‡(6) సౌరకిరణదీప్తితతు లవారణంపు శక్తులతో
నదీనదము లందెకాక చదలేటిని సంద్రమ్ముల
లోన వరలు రకరకాల కలుషమ్ముల మిశితమైన
జలరాశుల విభజించుచు సదమలముగ స్వీకరించి
ఆకసమున నావిరిగా నలరఁజేసి కామరూప
తత్త్వాలను మొయిళులుగాఁ దనరించుచు జలదమ్ముగ
నలరించుచు మధురమౌచు నమలమైన జలధారల
నవ్య దివ్య భవ్య శక్తి నానాప్రకృతుల వరలఁగఁ
గురియించుచు విశ్వమునకు గూఢశక్తు లొసఁగుచుండి
అసాధారణంపు మహిత హార్దదేవ సృష్టియజ్ఞ
రూప మొప్పు నిత్యమ్మును సపురూపపు శక్తులతోఁ
జక్రనేమిక్రమముగాఁగఁ జరాఽచర ప్రపంచమ్ము
జడాఽజడ ప్రకృతియెల్ల సదా సృష్టిలయాలతో
నలరారును నద్భుతముగ నా పరమేశుని లీలగ ॥ 4742

‡రచయిత:—వాఙ్మయ మహోద్యత, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—142

ఋషిః—అగ్నిః పావకః

దేవతా—అగ్నిః

ఛందః—సతో బృహతీ; 1-2-విష్టారపంక్తిః; 6-ఉపరిష్టాజ్జ్యోతిః*

(1) అగ్నే తవ శ్రవో వయో మహి భ్రాజన్తే[1] అర్చయో విభావసో ।

బృహద్భానో శవసా వాజముక్థ్యం౧ దధాసి దాశుషే కవే ॥ 1602

(2) పావకవర్చాః శుక్రవర్చా[2] అనూనవర్చా ఉదియర్షి భానునా ।

పుత్రో మాతరా విచరన్నుపావసి పృణక్షి రోదసీ[3] ఉభే ॥ 1603

(3) ఊర్జో నపాజ్జాతవేదః సుశస్తిభిర్మన్దస్వ ధీతిభిర్హితః ।

త్వే[4] ఇషః సం దధుర్భూరివర్పసశ్చిత్రోతయో వామజాతాః ॥ 1604

(4) ఇరజ్యన్నగ్నే ప్రథయస్వ జన్తుభిరస్మే రాయో[5] అమర్త్య ।

స దర్శతస్య వపుషో వి రాజసి పృణక్షి సానసిం క్రతుమ్ ॥ 1605

(5) ఇష్కర్తారమధ్వరస్య ప్రచేతసం క్షయన్తం రాధసో మహః ।

రాతిం వామస్య సుభగాం మహీమిషం దధాసి సానసిం రయిమ్ ॥ 1606

---

*సాయణ, మాక్సుముల్లర్ ప్రతులలో 5-ఉపరిష్టాద్ జ్యోతిః అనియు, 6-త్రిష్టుప్ అనియుఁ పేర్కొనఁబడినది.

1. భ్రాజన్తే౽అర్చయో, 2. వర్చా౽అనూనవర్చా౽ఉదియర్షి, 3. రోదసీ౽ఉభే, 4. త్వే౽ఇషః,

5. రాయో౽అమర్త్య. (వ్రా.ప్ర.)

(6) ఋతావానం మహిషం విశ్వదర్శతమగ్నిం సుమ్నాయ దధిరే పురో జనాః ।
శ్రుత్కర్ణం సప్రథస్తమం త్వా గిరా దైవ్యం మానుషా యుగా ॥ 1607

## సూక్తము—142

ఋషి—పావకగుణ విశిష్టుఁడైన అగ్ని*
దేవత—శుద్ధాగ్ని*

(1)‡తే॥గీ॥ అగ్ని! నీ యన్నమే ప్రశస్యంబు సుమ్ము!
నీదు జ్వాలలు బహుళముల్ నెఱ వెలుంగు
కాంతి ధనుఁడా! బృహద్భాను చెంతఁ జేరి
యన్న మొసఁగినవానికే యన్న మిడుదు! ॥ 4743

(2)‡గద్యము ॥
శోధక దీప్తి గలవాఁడవు! నిర్మల తేజస్కుఁడవు! సంధి పూర్ణతేజస్కుఁడవు నగు నో యగ్నీ!యిట్టి నీవు తేజస్సుచే నుదయించుచున్నావు!పుత్రుఁడవై మాతృభూతములగు నరణులయందుఁ దిరుగుచు వచ్చి నీ యజమానులను రక్షించుచున్నావు! ద్యావా భూముల రెండింటిని సమకూర్చుచున్నావు! హవిస్సుచే ద్యులోకమును వృష్టిచే నీ లోకమును బూరించుచున్నావు! ॥ 4744

(3)‡తే॥గీ॥ అన్నపుత్రుఁడ! యో వేదితాగ్ని! మా ప్ర
శస్తులన్ మోద మందుము! సకల కర్మ
ములకుఁ జాల హితుండవై మోదమునను
దృప్తిఁ గాంచుము! సంతత దీప్తితోడ ॥ 4745

‡క॥ ఘనతర దీప్తిన్ గాంచుచు
వననీయ సుజన్మఁ గొనుచు వర్ధిల్లెడు నీ
వినిహిత హవిస్సు లన్నియు
గనలుఁడ! నీయందె యుంత్రు యజమాను లొగిన్ ॥ 4746

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15ь సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అగ్నిపావకుఁడు"గాను, దేవత "అగ్ని"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.
‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(4)‡తే॥గీ॥ శత్రువులతోడ నీర్ష్యను జాలఁ గొనుచు
నీశ్వరుఁడ వౌ చమర్త్యుఁడా! యెంతయేని
ధనము మా కిచ్చి దానిని దగిన రీతి
విస్తరింపంగఁజేయుమా! వివిధ గతుల॥ 4747

‡తే॥గీ॥ దర్శనీయ వపుస్సుచేఁ దగినయట్లు
దీప్తిఁ గాంచుచునున్నావు! వ్యాప్తి నొంది
మే మొనర్చెడు కర్మకు మిక్కుటమగు
ఫలముఁ గూర్చుచునున్నావు! తొలఁగకుండ॥ 4748

(5)‡తే॥గీ॥ అధ్వరము సంస్కరించుచు నధికమైన
సుప్రచేతస్సు గలుగుచు సురుచిరాన్న
పతివిగా నుండి తత ధన పరమ దాత
వని నిను నభినుతింతుము ఘనతరాగ్ని!॥ 4749

‡తే॥గీ॥ అధిక సౌభాగ్యయుత మౌచు నమరునట్టి
యధిక సంభక్తమై కడు నమరునట్టి
ధనము స్తోతలకున్ నీవు తద్ద నిడుచు
నున్నవాఁడవు! పావకా! యెన్నునటుల॥ 4750

(6)‡తే॥గీ॥ సత్యవంతుని బూజ్యుని సకలధర్మ
నేయుఁడైనట్టి యగ్నిని బాయకుండ
సర్వ కర్మలకున్ ముందు చాల భక్తిఁ
దాల్చుచున్నారు యజమానతనయు లెల్ల॥ 4751

‡తే॥గీ॥ తగిన శ్రోత్రేంద్రియము గల్గి తద్ద ఖ్యాతిఁ
బడసి సురదౌత్యమును గడు నడుపు నిన్ను
మనుజు లెల్లరు పావకా! ఘనములైన
స్తుతులచే వేఁడుచున్నారు శోభఁ దేల॥ 4752

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—142

ఋషి—పావకగుణ విశిష్టుఁడైన అగ్ని
దేవత—శుద్ధాగ్ని

### అర్థాంతరము—1

‡(1) అగ్ని దీప్తతేజమ్ముల నగ్ని గుప్త సప్తవర్ణ
సంచయాల సృష్టిలోన జ్వలియించును నిత్యమ్మును
జలనరూప స్వభావాల సర్వమ్మున సంచరించు
నతిప్రశస్తమైన కాంతి ప్రతతు లవ్వి జగతిలోన
ధనశక్తుల రూపమ్ములఁ దనరారఁగఁ బ్రకృతిలోని
రకరకాల పదార్థాలు రమ్యదీప్తులన్ వరలఁగ
నిలాతల ప్రభావాల శిలారూప సంచయాలు
బహురూపుల లోహమ్ములు నిహపరముల వర్తిల్లఁగ
రవి శశి గ్రహ ఋక్ష కాంతు లవితథముగఁ బ్రసరింపఁగఁ
బ్రకాశించు మణి సంచయ రత్నరాజి సృష్టిలోన
సప్తవర్ణ కాంతులతో సాంకర్యపు రూపాలను
ముదురు లేత వర్ణాలను మూర్తిగొన్న ప్రకాశాల
వర్తిల్లుచుఁ జరాచర ప్రపంచమును బ్రభావితము
చేసి అగ్నీ! అన్నదాతవై సకలము పుష్టితోడ
వర్ధిల్లఁగఁ జేయు! నీవు భక్షణరతు లొప్పంగా
భక్షకుండ వౌచు సర్వరక్షకుండ వౌచు సదా ॥ 4753

‡(2) హుతపదార్థ సంచయాల సతతమ్మును బూర్ణమ్మై
అష్టదిశల నూర్ధ్వతలము నధోతలమ్మందు నెల్ల
శుద్ధ మౌచు దివ్య మౌచు శోధకమౌ దీప్తులతో
శుక్రకాంతి పుంజాలను సృష్టిలో ననూన మౌచు
భానుదీప్తితతులు వరల సుప్రభాతోదయాలఁ
బుత్రమాతృరూపమ్ములఁ బూర్ణానుబంధాలుగ
నగ్నిశక్తి సలిలమ్ముల ననిలమ్ముల మృత్తులను
నాకసముల సన్నింటను సద్భుతమౌ శక్తులతోఁ
బ్రభవింపఁగఁ జేయు నగ్ని ప్రభవించుచునుండు నగ్ని
ఇహపరాల సుభయగతుల నెల్ల లెనసి యెసయకుండ
బహురూపుల వర్తిల్లుచు నహరహమున్ దీప్తులతో
బహిరంతర్గతులతోడఁ బ్రకృతిలోన వర్తిల్లుచు
దృశ్య మౌచు నదృశ్య మౌచు వశ్యదహ్యమాన రతుల
సర్వభక్షకమ్ముగాఁగ సర్వ రక్షకమ్ము గాఁగ ॥ 4754

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(3) ఉత్తమోత్తమమ్మైన ఉసురులతో నుద్భవిల్లు
శబ్దశక్తిమహత్త్వాల సదమలమై వరలు నగ్ని
సృష్టిప్రకృతి సర్వమునకు శుభదమ్మై శోభఁగూర్చి
హర్ష మొసఁగు నిత్యమ్మును శీర్షగతుల నధోగతుల
జ్వలితమ్మై దివ్య కాంతిజాలా లవి ప్రసరింపఁగ
విశ్వరూప హవిర్ధాన మశ్వి శక్తులన్ గ్రహించి
తృప్త మౌచు దీప్త మౌచుఁ దేజమ్ములఁ బ్రసరించుచుఁ
జిత్రవిచిత్రమౌ వర్ణవిశేషకాంతు లలరారఁగ
నానావిధరూపమ్ములఁ బ్రాణశక్తు లొప్పారఁగ
సృష్టిలోని పదార్థాలు చెన్నొందఁగ హవిషముగా
హవన మౌచు నిత్యమ్మును నసలశక్తి వర్ధిల్లఁగ
నుత్తమమౌ పదార్థాల నుద్భవించు నగ్ని శక్తి
నసాధారణంపు గతుల నఖిల సృష్టిలోన వరలి
అద్భుతమౌ దీప్తులతో నలరు జ్వలితగు ప్తగతుల ॥ 4755

‡(4) అమర్త్యులకు మర్త్యులకును నఖిలమైన జంతుతతికిఁ
బ్రాణికోటి కంతర్గతి నగ్ని ప్రాణదమ్మై తగు
నచరమ్ముల జడములందు నలరుచుండు నిత్యమ్మును
విశ్వసృష్టి సర్వమునకు ధారకమై భారకమై
హారకమై బహుళగతుల నగ్ని తనరుఁ బ్రాకృతముగ
సంధానకరణశక్తి సంవిభాజక శక్తులతో
సంయోగ వియోగాల సంకీర్ణత లలరంగా
సంభజనీయమ్మౌ కర్మల సదా వర్తిల్లుచుండుఁ
బ్రకృతిరూప సర్వస్వము వరలఁ గర్మరూప మౌచు
సృష్టియజ్ఞ సకలమ్మునఁ జెన్నారును ననలమ్ములు
ప్రాణశక్తి త్రాణశక్తి బహుముఖమౌ శబ్దశక్తి
సర్వస్వము నగ్నులలో చర్మ ప్రకట రూపమ్ముల
దహ్యమాన రాహిత్యము దహ్యమాన సహితత్త్వము
సద్భుతగతి పరలంగా నఖిలమ్మున నిలుచు నగ్ని ॥ 4756

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(5)‡క॥ విశ్వగతాఽష్ట వసువులు ది
వీశ్వర ఘృణిదీప్తులమెయి ధృఢతర శక్తిన్
సాఽశ్వీ మహత్తర మౌచున్
శశ్వద్ధనరూపగతుల సంభృత మౌలే॥ 4757

‡క॥ రవి కాంతులు విరఁజిమ్మఁగ
సవితథముగ ననుదినమ్ము నద్భుత గతిమై
రవి చంద్రకాంత మణులును
నవరత్నా లలరు దివ్య సవమౌ ద్యుతులన్॥ 4758

‡క॥ సత్యములౌ బహుగతులను
నిత్యమ్మను బ్రికృతిపైని నిర్నిద్రిత మై
సత్యమల సప్తవర్ణగ
కృత్యకిరణ సత్ప్రభావ ఋభు రవి తనరున్॥ 4759

‡క॥ బహురూపుల శక్తులతో
నహరహమున్ దివ్యగతుల నమృత కిరణముల్
ఇహపర లోక ప్రికృతుల
మహనీయమ్ముగ సవిత సమాదృతి నిలుపున్॥ 4760

(6)‡క॥ నదులన్ నదముల జలధులఁ
జదలేటి నిలాతలముల సకల విధములన్
బదిలములౌ నీరముల న
విదితగతిమెయి రవికిరణవితతుల్ పీల్చున్॥ 4761

‡క॥ అవిరిగా నీరమ్ము ల
భావితగతిఁ బలు విధములఁ బ్రాకృత మౌచున్
జీవనములు మొయిళులలో
జీవికలై గూఢ గతులఁ జెలఁగి పతితమౌ॥ 4762

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡అష్టపదకందము ॥

పులకించుచు మేఘమ్ముల
నిలగతులఁ బ్రకృతుల మీఁద నీర సుధారాఽఽ-
వళి వర్షింపఁగ మధుర రు
చులమైఁ బ్రాణములు త్రాణ శోధన శక్తిన్
విలసితమై సర్వమ్మునఁ
గలుషాఽకలుషగతులను బ్రకాశిత మౌచున్
నిలువెల్లను నంతర్గతి
వెలుఁగంగా నగ్ని దీప్తి వెలయు సలిలముల్ ॥ 4763

## సూక్తము—142

ఋషి—పావకగుణవిశిష్టుఁ డగు నగ్ని

దేవత—శుద్ధాగ్ని

### అర్థాంతరము—2

‡(1) అసాధారణంపు గతుల నగ్ని శుద్ధ మౌచు వెలిఁగి
వయోరహితమై తనరుచుఁ బ్రాకృతగతి వర్తిల్లఁగ
దివ్యదీప్త దీధితు లవి తేజరిలును సత్యగతుల
నిత్య నవ్య వ్రిభాకలిత కృత్యభిజ్ఞ ఘృణి దీప్తుల
బహిరంతర్గతులు మీర భాసిల్లుచు జీవరతులఁ
జ్వలనశక్తు లలరారఁగ జ్వలితమతుల వర్తిల్లుచు
నఖిల ప్రకృతులనుండి సర్వ హవిషాళుల స్వీకరించి
దివ్యదైవపరముగాఁగఁ దేజోఽనిల శక్తులతో
వాహకత్వ మలరారఁగఁ బయనించుచు రోదసిలో
సంభృతముగ సర్వమ్మును సమర్పించి విధిగాఁగను
బ్రకృతిలోని చరాఽచర ప్రపంచమున కనుగతిమై
నన్నదాన మొసఁగుచుండి ప్రాణదాన మొసఁగుచుండి
ప్రాణదీప్త శక్తులతోఁ దనరారఁగఁ జేయుచుండి
స్వాహామయ లయరతులను సర్వమ్మును హరియించుచు
సృష్టి స్థితి లయమయముగ వ్యష్టి సమిష్టి రూపమ్ముల
దైవీయమ్మౌ విధులను దనరారఁగఁజేయు నగ్ని ॥ 4764

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(2) జ్వలియించుచుఁ దప్తగతుల ఘర్మ బాహ్య రూపాలను
బావకాగ్ని అర్చు లెల్లఁ బరఁగుచుండు సృష్టిలోన
నాకసమ్ము లనిలమ్ముల ననలమ్ముల సలిలమ్ముల
మృత్తితులను దనరారెడి బుతదీప్తుల ఁకరిరూప
జీవసంజననాల శక్తి చెలఁగు నగ్ని అంతర్గతి
ననూనమైన రతులతోడ నఖిల చరాఽచరమ్ములను
బుత్రిమాతృరూప మౌచుఁ జిత్రివిచిత్రి శక్తులతో
నుద్భవింపఁజేయు నగ్ని ఉద్భవించుచుండు నగ్ని
సర్వగోళ లోకాలను సదమలమౌ దీప్తులతో
నధోగతుల నూర్ధ్వగతుల నాకసమున నలరారుచు
భానురూప మహాదీప్తిఁ బ్రిజ్వలించు సకలమ్మును
దివిభువులను నన్నింటిని దివ్యగతుల వెల్గొందుచు
హవ్యమ్ముల హుతద్రివ్య గవ్యమ్ముల నిత్యమ్మును
బూరించుచు మహాశక్తి పూర్ణరతుల విలసిల్లును ॥ 4765

‡(3) దివ్యదీప్త కిరణాలను దేజరిల్లఁజేసి జగతి
హర్ష మొనఁగుచుండి సృష్టి యజ్ఞతత్త్వ మలరారఁగ
హవిర్ధాన మాదియైన అఖిలాఽఖిల కర్మలతోఁ
దృప్తి నొంది వెలుఁగు నగ్ని దీప్తమ్మై వర్ధిల్లును
నాద్యశక్తి నమృతగతుల నమలఘృతము వర్తిల్లఁగఁ
జిత్రివిచిత్రిశక్తులతోఁ జెలఁగు జీవజాల మెల్ల
నానావిధ రూపమ్ముల నవ్యాగ్నుల శక్తులతో
నుత్పన్న మ్మగుచునుండి ఉర్విలోను నుదధిలోను
వాయుతతుల నాకసములఁ బ్రిభవించును సర్వ లోక
గోళాలను దివులందును గుహ్య మహచ్ఛక్తులతో
వామరూప శక్తులతో వధియించుచు రాక్షసగణ
సర్వస్వముఁ బంచభూత సంచయాల వర్తిల్లెడి
ప్రికృతిరూపు లన్నింటిని బ్రిభాగతుల రక్షించుచు
దివ్యదీప్త శక్తులతోఁ దేజరిలును నగ్నిచయము ॥ 4766

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

‡క॥ దివ్య మ్మగు దీప్తులతో
నవ్యయగతు లొప్పుచుండ నమరాళులకున్
నవ్యములౌ రవి శక్తుల
భవ్యమ్ముగ నొసఁగు మహిత పావక కీలల్ ॥ 4767

‡— వివిధ వస్తు రూపమ్ముల సవితథముగ నంతర్గతి
పర్తిల్లెడి అనలమ్మది ప్రభవించును జ్వలితమ్మై
చరాఽచర ప్రపంచాల సర్వమథన శక్తులతోఁ
బ్రాణిలోక ప్రియత్నాల రాయి రప్ప వృక్షాదుల
రాపిక్కను నుద్భవించు రాజిరాజి అనలమ్మది
అసాధారణంపు గతుల సనిల శక్తి విలసిల్లఁగ ॥ 4768

‡(4) సర్వాంతర్యామిగాఁగఁ జరాఽచరము లన్నింటను
దైవీయపు శక్తులతో జీవరూప ప్రాణ త్రాణ
జ్వలన జ్వాలనంపుగతుల వరలు నగ్ని సృష్టిలోన
నసాధారణంపు గుప్తయజ్ఞ ప్రకృతితత్త్వ మలర
మృత మౌచును నమృతముగా మింటిలోన మంటిలోన
ననిలాలను సలిలాలను నన్నింటను సలరారుచు
సకలభూత ధర్మాలను వికలరహిత బద్ధముగా
నకృత మౌచుఁ బ్రాకృతమై అదృశ్యగతుల గూఢముగా
నంతరాఽంతరములనుండి ఆశ్చర్యకరముగాఁగఁ
బ్రజ్వలించి ప్రాకృతగతిఁ బ్రకాశమాన మౌచు వెలుఁగు
ధనశక్తుల నఖిలమ్ముల ఘనశుభ్రత మీరంగా
దివ్యదీప్త తేజమ్ములు సత్యనిత్యగతుల వరల
వెలుఁగులతో మెరుఁగులతో వెలుఁగొందంగాఁ జేయుచు
సర్వకర్మ కారికాఁగ సకలధర్మ సాక్షికాఁగ
నలరారుచునుండు నగ్ని అపురూపమ్మౌ శుచిగా
నభ్యుదయావహపుమార్గ మనూనమై విరాజిలఁగ ॥ 4769

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡— విశ్వసృష్టి యజ్ఞమ్ముల విమలమైన దీప్తులతోఁ
బ్రకృతిరూపమందుఁ దనరి ప్రాకృతమై విలసిల్లెడి
అకృతమైన త్వక్కుగాఁగ నఖిల చరాచరములకును
భూతపంచకమ్ము వరల పూర్ణపరివ్యాప్తి నొంది
కవోష్ణంపు శక్తులతోఁ గ్రాలు చంతరాంతరముల
జీవగతుల నొసఁగు సంజీవనిగాఁ బరఁగి అగ్ని ॥ 4770

‡— పంచలోహ రూపాలను సంచితముగ నతుకుచుండి
విడఁదీయుచు విశిష్టముగ విమలాగ్నులు వరలుచుండి
సంధానకరణవిద్య సంవిభజన తరణకృతుల
నమృతములై మృతము లౌచు నమరగతుల నఖిలమ్మున
నంతరిక్షగత మ్మౌచు ననిల సలిల గత మ్మౌచు
నవనీతల మహిత మౌచు నలరుచుండు ననలశక్తి ॥ 4771

‡(5) మహోత్కృష్ట చిత్తముతో మహిమాన్విత సృష్టి నెల్లఁ
గావించెడి దేవదేవు భావదీప్త గమ్యము లవి
విష్ణుదేవు మాయగాఁగ విశ్వరూప లీలకాఁగ
నగ్ని సర్వభూతములను నంతరాంతరముల నిలిచి
దృశ్యమాన మౌచు నదృశ్యమౌ గతులు మీర
ననిలమ్ములు సహజమ్ముగ నంతర్ధానములై నిల్చును
సలిలమ్ములు దృశ్యము లదృశ్యములునై నిలుచు
మృత్తుకూడ వివిధగతుల ఋతరూపుల సూక్ష్మ మౌచు
నంతర్హితమై నిలుచు నదృశ్యంపు గతులమైని
నా చతుర్భూతమ్ముల నలరును నైదవభూతము
ప్రతిభూతము సృష్టిలోనఁ బ్రభాదీప్తమై వరలుచు
నష్టావిధ వసుసంపద లలరఁజేయు మహితములుగ
నగ్ని రూప దీప్తులతో నపురూపపు శక్తులతో
నైశ్వర్యము లుప్పతిలును నఖిలభూతములనుండియు
నా దీప్తులు పెరిగిపెరిగి అణఁగారుచుఁ గ్రమమ్ముగా
నంతర్హిత మౌను బ్రకృతి నదృశ్యముగఁ గలిసిపోయి ॥ 4772

---

‡రచయిత:—వాఙ్మయ మహాద్యుతి, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡— సృష్టియజ్ఞ సర్వస్వము చిద్విలాసగతుల నడపి
సకల సంపదాళి కెల్ల స్వామిగాఁగ నలరారుచు
వననీయములై వరలెడి ఘనశక్తుల నన్నింటిని
ననుగ్రహించు ననలదేవుఁ డద్భుతమౌ దీప్తులమైఁ
గర్మధర్మసాక్షికాఁగ ధర్మకర్మకర్తకాఁగ
నతు లందుచు నిత్యమ్మును నుతులందుచు సత్యమ్ముగ ॥ 4773

‡— ప్రకృతిలోని బ్రకృతి యౌచుఁ బ్రాకృతగతి నధిపతిగా
పరలు ప్రాణికోటి "కన్న" ప్రసాద మొసఁగుచుండి
సేవనీయమైన బహుళ శిష్టవస్తువులను నిచ్చి
ధనసంపద లన్నింటిని ననూనగతిగఁ బ్రసాదించు
ననల శక్తి వివిధరతుల నాంతర్బాహిరగతులను
నావరించి సర్వసృష్టి నపురూపపు శక్తులుగా ॥ 4774

‡(6) నిత్యసత్య ధర్మరూప నిర్వికల్ప శక్తులతో
సృష్టి స్థితి లయ కర్మలు చెన్నారును వివిధాలుగఁ
బ్రకృతి పురుష శక్తులతో వరలంగా సకలసృష్టి
ద్వైతగతుల స్త్రీపుంస్త్వప్రభావిత సృజనశక్తి
ప్రాణికోటిఁ దరు లతాఽఽవళులందును వరలుచుండు
దైవమానుషంపు శక్తి దారుణ రక్షశ్శక్తుల
నసాధారణంపు గతుల నమరుచుండు సృష్టి యెల్ల
శబ్ద శక్తి నిశ్శబ్దగశబ్ద శక్తి సకల జగతి
ననలాఽనిల సలిలమ్ముల నవనీతల గగనమ్ముల
నన్నింటను వర్తిల్లఁగ ననంతముగ సృష్టి యజ్ఞ
క్రియ లెల్లను ననవరతము కృష్ణ[1] లీలగాఁగ నడచు
బహురూపుల విశ్వమెల్లఁ బ్రభవించుచుఁ బ్రకృతిగతుల
స్థితిగతులను వర్ధిల్లుచు సతతమ్మును జెన్నొందును
లయరతులను నశియించుచు రాజించును బునర్జన్మ
గతు లొప్పఁగఁ జక్రనేమి క్రమముగాఁగ ననునిత్యము
రకరకాల నగ్ని శక్తి రాజిల్లఁగ సృష్టిలోన ॥ 4775

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. కృష్ణ=అగ్ని.

‡ఆ॥వె॥ అగ్ని దీప్తగతుల నఖిల విశ్వమ్మును
దర్శనమ్ము చేసి ధన్య మగును
గుణగమైన మహిత గుహ్యాఽగ్ని శక్తులన్
దివిజ మనుజ తతులు దివ్య దృష్టి॥ 4776

‡క॥ నిత్యమ్మౌ ఋత శక్తుల
సత్యమలమ్మైన బహుళ మక్షర మక్ష
య్యాఽత్యంతాఽనల్ప మహిత
వ్యత్యయ నిశ్శబ్దగ శుచి పాలిత మౌలే!॥ 4777

## సూక్తమ్—143

ఋషిః—అగ్నిస్తాపసః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—అనుష్టుప్

(1) అగ్నే[1] అచ్ఛా వదేహ నః ప్రత్యం నః సుమనా భవ।
ప్ర నో యచ్ఛ విశస్పతే ధనదా[2] అసి నస్త్వమ్॥ 1805

(2) ప్ర నో యచ్ఛత్వర్యమా ప్ర భగః ప్ర బృహస్పతిః।
ప్ర దేవాః ప్రోత సూనృతా రాయో దేవీ దదాతు నః॥ 1809

(3) సోమం రాజానమవసే ఽగ్నిం గీర్భిర్హవామహే।
ఆదిత్యాన్ విష్ణుం సూర్యం బ్రహ్మాణం చ బృహస్పతిమ్॥ 1810

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. అగ్నేఽఅచ్ఛా, 2. ధనదాఽఅసి. (వా.ప్ర).

(4) ఇన్ద్రవాయూ బృహస్పతిం సుహవేహ హవామహే ।
యథా నః సర్వ[1] ఇజ్జనః సంగత్యాం సుమనా[2] అసత్ ॥ 1611

(5) అర్యమణం బృహస్పతిమిన్ద్రం దానాయ చోదయ ।
వాతం విష్ణుం సరస్వతీం సవితారం చ వాజినమ్ ॥ 1612

(6) త్వం [3]నో అగ్నే అగ్నిభిర్బ్రహ్మ యజ్ఞం చ వర్ధయ ।
త్వం నో దేవతాతయే రాయో దానాయ చోదయ ॥ 1613

## సూక్తము—143

ఋషి—తాపసగుణవిశిష్టాగ్ని*
దేవత—విశ్వే దేవతలు*

(1)‡ఆ॥వె॥ అనల! మాకుఁ బ్రియము నాచరించుచు నీవు
సుఖద మనసు వాఁడ! సుఖ మొసంగు
వారి కెల్ల ధనముఁ జేరుచుమా! ధన
దాత వగుచు నుంటఁ బూత మతిని ॥ 4778

(2)‡తే॥గీ॥ అల బృహస్పతి యర్యముం డఖిల సురలు
భగుఁడు దీవన శీలయౌ వాక్సురూప
యౌ సరస్వతి మాకయి యధిక ధనము
నిచ్చుఁగావుత! మే మెల్ల మెచ్చునటుల ॥ 4779

1. సర్వఽఇజ్జనః, 2. సుమనాఽఅసత్, 3. నోఽఅగ్నేఽఅగ్ని. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద స హిత వ్రాతప్రతి 156 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అగ్నితాపసుఁడు"గాను, దేవత "విశ్వేదేవులు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)‡తే॥గీ॥ ఈశ్వరుని సోము నగ్నిని నింతి యదితి
పుత్రులను విష్ణు సూర్యుని బూత బ్రహ్మ
నల బృహస్పతి యను వాని నవనమునకుఁ
బిలుచుచున్నాము వారలు పెద్ద లపుట ॥* 4750

(4)‡తే॥గీ॥ వాసవుఁడు వాయువును బృహస్పతియు ధనమః
సంభవించెడు నట్టులు సరస మాన
సంబుఁ గల్గెడు నట్టులు సరవిఁ జేయుఁ
బిలువఁగలవార మగుదుము ప్రీతి వారి ॥* 4751

(5)‡తే॥గీ॥ అర్యము సమరసవితల సల్ల వాయు
విష్ణుల సరస్వతీదేవి విపుల ధనము
మాకు దానము నొసఁగంగ మాన్య! స్తోత!
ప్రేరణంబును జేయుమా! పెద్ద వగుచు ॥* 4752

(6)‡తే॥గీ॥ అనలుఁడా! నీ విభూతిచే నమరు నగ్ని
వరులతో స్తోత్రమిష్టిని గరము వృద్ధిఁ
బరుపుమా! నీవు యాగంబు జరుప మాకు
ధనము దాన మొసంగుమా! తత్క్షణంబు ॥* 4753

## సూక్తము—143

ఋషి—తాపసగుణ విశిష్టాగ్ని
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

‡(1) అఖిల సృష్టినె కాక ఆకసమ్ములఁ గూడ
నంతరాంతరముల నలరారు నిశ్శబ్ద
శక్తు లెల్లను విశ్వ రక్తులన్ దీప్తులన్
విలసిల్ల బహురూప వికృతులన్ బ్రికృతులన్
వైశిష్ట్యములు మీఱ వరలు నెల్ల జగమ్ము
లతిలోకమౌ నగ్ను లతివేలమై తనర ॥ 4754

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

÷— కృతాఽకృతమౌ కర్మలఁ బ్రతాపాగ్ని ప్రజ్వలిలుచు
మహితాన్విత మనశ్శక్తి బహురూపమ్మౌ దీప్తుల
దహియింపని సుమములుగా నహోరాత్రు లలరారఁగ
నచ్ఛమైన శక్తితతులు నద్భుతగతి వరలంగా
శుభంకరమ్మౌను నగ్ని సుమనస్సుల నిచ్చునగ్ని
విశ్వ లోక గోళాదులు విస్తృతగతి రూపొందఁగ
నభేద్యమైన సూక్ష్మగతుల ననంతమౌ పతిగాఁగను
నలరారుచు నిత్యమ్మును విలసిల్లెడి దీప్తాగ్నులు
అపురూపపు భాగ్యములై అష్టావసురూపములౌ
మహాసంపదాళి నెల్ల మర్మగతుల వెలయించుచు
సఫలమ్మునఁ బరఁగు మహాయజ్ఞాగ్నిగ సృష్టిలోన
ననాదికాలమ్మునుండి అఫలములౌ భూతరతుల
నగ్ని తనరు నసాధారణాఽద్భుతగతి వరలంగా
ననృతాఽన్వితమ్ముకాని దివ్యాఽమృత శక్తులమై ॥ 4785

‡(2) అక్షయమౌ శక్తులతో నర్యముఁడౌ విష్ణువు తగ
నసాధారణంపు గతుల సంతరిక్ష మలరారఁగ
ననూనమైన మహితమ్ముల నల్ల బృహస్పతి వరలఁగ
నమేయమౌ మహిమాళుల నఖిల దేవతాళి వెలుఁగఁ
బ్రకృతి పురుష విశ్వరూప రాజితమౌ భావదీప్త
శక్తులతో బహుగతులను వ్యక్తాఽవ్యక్తమ్ములౌచు
లౌకికాఽలౌకికమౌ ప్రాకామ్యపు సంపదాళి
సత్యరూప మహాదివ్య నిత్యదీప్తు లఖిలమ్మున
నగ్ని మహామహితశక్తి నపురూపపుగతులు తోప
సృష్టిసహజ సంపదలుగ ఋతగతులను దనరారుచు
సంక్షేమపు రతులు మీఱ సౌభాగ్యాలై తనరఁగ
దేవమానవాళి రాక్షసాపశులకు సౌఖ్యమ్ముల
వరలఁజేయు దుశ్శక్తుల ప్రాభవాలతో బాధలఁ
గలిగించును రక్తరాజి క్రాంతి కాంత్యనలగతుల ॥ 4786

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(3) విష్ణ్వాదిత్యుని శక్తులు విమలములై వర్ధిల్లఁగ
దశదిశలను వర్ధిల్లెడి తరణుల దీప్తులు వరలఁగ
నవరూపుల పరబ్రహ్మ లవిరళమౌ సృష్టిశక్తి
నలరారఁగ బృహస్పతిగ సంతరిక్ష జగమ్ములో
బహురూపుల దివ్య మౌచు భవ్యమైన శబ్దశక్తి
సోమాఽమృతసారముతో శోభిల్లుచు ద్విగుణముగాఁ
బ్రజ్వలించుచుండు నగ్ని నుజ్జ్వలగతి సృష్టి వరల
నసాధారణంపుగతుల నా దేవున కాయుధమై
దహ్యమాన సహితశక్తి దహ్యమాన రహితశక్తి
నమృతమ్మై తనరారును నసల మసాధారణగతి ॥ 4787

‡ఆ॥వె॥ సృష్టి యజ్ఞ ఫలిత మిష్ట పూర్తమ్ముగా
నగ్నివల్ల విష్ణు నందు రవిని
నందు బ్రహ్మనున్ బృహస్పతిని మహిత
సాంద్ర దీప్త సోమ చంద్రికలుగ ॥ 4788

‡(4) అమలాఽనల దీప్తులతో నక్షయమై వెల్గొందుచు
నజయ్యమై అభేద్యమై అనూనమౌ మనశ్శక్తి
హాయి మీఱు దివ్యగతుల నగ్ని పూవులై పరఁగఁగ
విశ్వరూప మహిత రతుల విశదమ్మౌ సద్గతులను
మహాబుద్ధిశాలితోడ మహేంద్రవాయుశక్తితతుల
మిళిత మ్మొనరించు సృష్టి విలసిల్లఁగఁ బ్రకృతిపురుష
శక్తుల సంకలనమ్ముల సకలమ్మును యజ్ఞముగా
హవన మౌచు వర్తిల్లును నగ్ని మహాశక్తులమై ॥ 4789

‡— అత్యుత్తమ శక్తులతో ననల మ్మది ప్రస్తుతమౌ
ననిల సలిల సంగమాల నమృతశక్తు లలరారఁగ
మృదూర్జవమ్మౌ దీప్తుల మిన్నంటుచు వెల్గొందెడి
దివ్యాగ్నుల సంపదాళి తేజరిల్లు వసువులుగా
నఖిలమైన ప్రాణికోటి కపురూపపు టైశ్వర్యపు
ధనముగాఁగ ఘనముగాఁగఁ దనరారును సృష్టిలోన ॥ 4790

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(5) అర్యముఁడౌ నాదిత్యుఁడు నా బృహస్పతి యింద్రుఁడున్
నని లమ్మును ననలమ్మును నమలమ్మౌ సలిలమ్మును
సవితయు నా విష్ణువు సర్వవాజినంపు శక్తిఁ
బరిశుద్ధ మ్మొనరించును వరలు విశ్వసృష్టి నెల్ల
శక్తి నొసఁగు ప్రకృతి పురుష సంజననప్రదత్త్వాలకు
మైత్రి మీఱఁ బ్రేమ మీఱ మహితమైన ప్రతాపాన
బలదీప్తుల భేదించును వరలంగా ధ్వంసపరచు
సకలవిధములైన విశ్వశత్రుశక్తు లన్నింటిని
నాశ మ్మొనరించుచుండు సవదీప్తులు వర్తిల్లఁగ
నాకర్షణ శక్తులతో నాధిపత్య రక్తులతో
సర్వసృష్టి నెల్ల నిలిపి సంచరించు రీతిగాఁగఁ
గాలకత్వ మలరారఁగఁ బరఁగు నిత్యగతులమైని ॥ 4791

‡ఆ॥వె॥ వస్తుతతుల సృష్టి వరలంగఁజేయుచుఁ
బద పదార్థము లను బ్రకృతిగతులఁ
బుట్టఁజేయు దైవ పూర్ణ శక్తులు మీఱ
భక్ష్య భోజ్య "మన్న" భాగ్య మలర ॥ 4792

(6)‡క॥ సి త్యాగమ్ముగ ననలము
నిత్యమ్మును జనన మౌను నిఖిలేశ! హరీ!
సత్యములౌ నాయగ్నుల
అత్యమలగతిమెయి సృష్టి నజుఁ డొనరించున్ ॥ 4793

‡క॥ శూన్యమ్మౌ విశ్వములో
నన్యోఽన్య మ్మౌచు సర్వ మవినాభావాల్
గణ్యాఽగణ్యములౌ భూ
త న్యాయమ్ములు విసృష్టి ధర్మము నెరపన్ ॥ 4794

‡క॥ శుభమును గోరుచు సురతతి
సభమున ననిల సలిల మృదనలముల నిత్య
మ్మభ రహిత గతుల నిల్పుచుఁ
బ్రభా మహిత శుద్ధ గాన భాగ్య మొసంగున్ ॥ 4795

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—143

ఋషి—తాపసగుణ విశిష్టాగ్ని
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

‡(1) అచ్ఛమ్మై అనలమ్మై అమృతగతుల వర్తిల్లుచు
రోదసిలో వెలుఁగొందెడి ఋతమహితపు టుష్ణ"నాభి"
శక్తులతో సృష్టిలోన జాగృత మగు దీప్తరతుల
బహిరంతర్గతులతోడ వరలు గుహ్యమైన ప్రీతుల
ననల మ్మది వరఁగుచుండు నంతరిక్ష గోళమ్ముల
అమలవర్ణదీప్తులతో నలరుచుండుఁ బుష్పములై
ప్రాకృతముగఁ బ్రశస్తముగఁ బ్రత్యగ్రూపమ్ముగాఁగ
సమేయ మౌచు నభేద్యమైన అజయ్యమౌ మనశ్శక్తి
సర్వకాంతి నాథుఁడైన సకలేశుని విశ్వపతిని
నధిగమించు నఖిలమ్మును నాకసమ్ము లన్నింటిని
అవలీలగ నవలీలగ నవితథమౌ హేలగాఁగ
విశ్వరూపమై వెల్గుచు విరాజిలును నగ్నిశక్తి ॥

‡ఆ॥వె॥ అగ్ని సృష్టిలోన నపురూప దీప్తులన్
అష్టవసు సుసంపదాఢ్యు లౌనఁగి
విశ్వ లోకములను విమలమౌ ధనదగా
వరలు నిత్య సత్య ప్రకృతిగాఁగ ॥

‡(2) న్యాయధర్మబద్ధ మౌచు సవప్రికర్ష శక్తులతో
నలరారును నర్యముండు నాదిత్యుఁడు భవ్యుఁడై తగ
నపురూపపు శక్తులలో నధిపతిగా మహాపతిగ
ఋతరూపపు దివ్యగతుల సతతమ్మును వర్తిల్లఁగఁ
బ్రకృతిశక్తి స్త్రీదేవత భావరూపగతుల వరలఁ
బురుషశక్తి దేవులుగాఁ బుణ్యరతుల ప్రతికృతులుగఁ
జరాచర ప్రపంచమ్ము జడాజడ ప్రకృతు లెల్ల
నుద్భవించి పెరుగుచుండు నద్భుతముగ సురుగుచుంటు
మహితములౌ ధనరాశుల మాన్యగతుల నొనఁగుచుండి
జ్ఞానరూప దీప్తశక్తి సదా ప్రసాదించుచుంటు ॥

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡ఆ॥వె॥ అగ్ని తనరులే! పదార్థ రూపమ్మున
నగ్ని ఊన్యరతుల నలరుచుండు
నిత్య సత్య మౌచు నిఖిలమౌ గోళాల
నంతరిక్షమందు నమరు నగ్ని ॥ 4799

‡(3) చంద్రసూర్యాదీప్తరతులు శబ్దశక్తు లఖిలమ్మున
విస్తరిలఁగఁ బ్రకృతిలోన వ్యస్తన్యస్త సమస్తగతులఁ
గాంతిద్రవరూప మౌచుఁ గ్రాలు నమృతంపు శక్తి
అంతరిక్షమ్మునుండి అఖిలసృష్టిఁ బ్రసరించుచు
మహాయోగ శక్తులతో మహిమాన్వితు లుద్భవింతు్ర
శాశ్వతాఽశాశ్వతగతి సకలమైన బుద్ధిదీప్త
చిత్ సత్తుల జ్ఞాను లెల్లఁ జిన్మయులై వెలుఁగంగాఁ
జరాఽచర ప్రకృతిరూప జడాఽజడ ప్రపంచాల
సర్వ విశ్వ గోళ లోక సంచయాల శోధించుచు
వైజ్ఞానిక మూర్తులుగాఁ బద పదార్థ ప్రకృతితత్త్వ
విశ్లేషణ చేసి సత్య విజ్ఞతమైఁ దనరారఁగ
నక్షరమై నక్షయమౌ నమరశబ్ద శక్తిరూప
వేదమంత్ర పదార్థాల విశ్వధర్మోత్తరగతి
సత్కర్మలఁ దనరు బ్రహ్మజ్ఞాను లెల్ల వెల్గుచుండ్రు ॥ 4800

‡— ఆదిత్యులు విష్ణువు నగ్ని సూర్య నవబ్రహ్మ
లఖిలమ్మున బృహస్పతియు నలరారఁగ దివ్యశక్తి
రవి చంద్రుల అమృతకిరణరాజి మహామధురగతుల
శబ్దశక్తి జీవరాశి చైతన్య మ్మిచ్చు నిత్య
యౌవనంపు దివ్యశక్తి దైవజమ్ముగాఁ బరఁగుచు
రమ్యగతుల సృష్టిలోన రక్షణరక్తుల నొసఁగును ॥ 4801

‡(4) అమల సుమసంగమాల నలరంగా ననిల శక్తు
లఖిల జగతి హవనమ్మై అమరు శబ్దదీప్తులతోఁ
బ్రకృతి పురుష శక్తులతోఁ బవనాఽనల సలిల మృద్
గగనమ్ముల సంగమాలఁ బరఁగుచుండు విశ్వసృష్టి ॥ 4802

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡— సుమనస్సుల సంగమాల సృష్టిలోని అసత్తెల్ల
క్షీణగతుల వర్తిల్లను గ్లిష్టగతుల నాశముగా
సదూర్జివములౌ శక్తులు సర్వసృష్టి వర్ధిల్లఁగ
నసాధారణంపు సృష్టి యజ్ఞాగ్నులు దివ్యశక్తు
లలరారును నిత్యమ్మును నతిలోకపు ఋతగతులను
అనలాఽనిల సంగమాల నతివేలపు శక్తులతోఁ
జిద్విలాన బృహస్పతియె అద్వితీయ మహామేధ
స్నసాధారణంపు గతుల నధిపతిగా విలసిల్లఁగ
సర్వసృష్టి వశీకరణ శక్తులతో జనితమ్మై
ప్రకృతి పురుష సంగమాల భవ్య భోగ భవరతులను
శక్తు లెల్ల వినిమయమై సంభవమౌ నవరశక్తి
ద్వైతరూప శక్తుల నద్వైతరూప మంకురింప
విశ్వసృష్టి వర్తిల్లును విమలగతుల వర్ధిల్లును
సంజననపు స్థితిగతిమై సంవర్ధన సంశయరతి ॥ 4803

‡(5) అజయ్యమై అమేయమై అతిలోకపు శక్తులతో
నవ్యయస్థితి నఖిలమునకు నధిపతిగాఁ దనరారుచు
నా మహాదేవదేవుఁ డగ్ని రూప శక్తులతో
దివ్యమైన దీధితులను దేజరిల్లు తటిల్లతల
ననిలమ్ముల దివ్యశక్తి యజ్ఞ సత్య శబ్దశక్తి
జ్ఞాన విజ్ఞానాలను సమృద్ధిగ వృద్ధిపరచి
జలరూపుల మధురరస సారమ్ముల నొనరించుచు
సవిత్ృమూర్తి కర్మముగా సర్వమ్మును బరివర్తిలఁగ
నన్యోఽన్య ప్రేరణతో నవినాభావత్వ మలర
నఫలఘాతములు వరలును నద్భుతగతి సృష్టిలోన ॥ 4804

(6)‡ఆ॥వె॥ నీవు లేక లేదు నిత్యాగ్ని చయ మెల్ల
సృష్టి సత్యవృద్ధి జెందుచుండు
నభ్యుదయము నొందు ననలాన బ్రహ్మమ్ము
నీదు దివ్య సత్య నిరతి దేవ! ॥ 4805

‡రచయిత:—వాఙ్మయ మహోద్యత, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

కం॥ నీవే! అగ్నిగ వెల్గుచు
నీవే! అగ్నులను బ్రహ్మనిరత గుణమ్మై
నీవే! యజ్ఞమ్మౌచును
దేవాఽఽఋషుల సంపదాశిఁ దీర్చెదు! దేవా! ॥ 4806

## సూక్తమ్—144

ఋషిః—శార్ఙ్గాః; 1-2-జరితా; 3-4-ద్రోణః;
5-6-సారిసృక్వః; 7-8-స్తమ్బమిత్రః
దేవతా—అగ్నిః
ఛందః—త్రిష్టుప్; 1-2-జగతీ; 7-8-అనుష్టుప్

(1) అయమగ్నే జరితా త్వే[1] అభూదపి సహసః సూనో నహ్యన్యదస్త్యాప్యమ్ ।
భద్రం హి శర్మ త్రివరూథమస్తి త[2] ఆరే హింసానామప దిద్యుమా కృధి ॥ 1614

(2) ప్రవత్ తే[3] అగ్నే జనిమా పితూయతః సాచీవ విశ్వా భువనా న్యృఞ్జసే ।
ప్ర సప్తయః ప్ర సనిషన్త నో ధియః పురశ్చరన్తి పశుపా[4] ఇవ త్మనా ॥ 1615

(3) ఉత వా[5] ఉ పరి వృణక్షి బప్సద్బహోరగ్న[6] ఉలపస్య స్వధావః ।
ఉత ఖిల్యా[7] ఉర్వరాణాం భవన్తి మా తే హేతిం తవిషీం చుక్రుధామ ॥ 1616

(4) యదుద్వతో నివతో యాసి బప్సత్ పృథగేషి ప్రగర్ధినీవ సేనా ।
యదా తే వాతో[8] అనువాతి శోచిర్వప్తేవ శ్మశ్రు వపసి ప్ర భూమ ॥ 1617

---

1. తేఽఅభూ, 2. తఽఆరే, 3. తేఽఅగ్నే, 4. పశుపాఽఇవ, 5. వాఽఉ, 6. రగ్నఽఉల, 7. ఖిల్యాఽఉర్వ,
8. వాతోఽఅనువాతి. (వా.ప్ర.)

(5) ప్రత్యస్య శ్రేణయో దదృశ్ర[1] ఏకం నియానం బహవో రథాసః ।
బాహూ యదగ్నే[2] అనుమర్మృజానో న్యఙ్ఙుత్తానామన్వేషి భూమిమ్ ॥ 1618

(6) ఉత్ తే శుష్మా జిహతాముత్ తే[3] అర్చిరుత్ తే అగ్నే శశమానస్య వాజాః ।
ఉచ్ఛ్వఁచస్వ ని నమ వర్ధమాన[4] ఆ త్వాద్య విశ్వే వసవః సదన్తు ॥ 1619

(7) అపామిదం న్యయనం సముద్రస్య నివేశనమ్ ।
అన్యం కృణుష్వేతః పన్థాం తేన యాహి వశాగ్ం[5] అను ॥ 1620

(8) ఆయనే తే పరాయణే దూర్వా రోహన్తు పుష్పిణీః ।
హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య గృహా[6] ఇమే ॥ 1621

## సూక్తము—144

ఋషి—శార్ఙ్గ[7] లగు జరితృఁడు, ద్రోణుఁడు,
సారిసృక్వుఁడు, స్తంబమిత్రుఁడు*
దేవత—అగ్ని*

(1)‡చ॥ బలసుత! నీవు మాకుఁ గడు బంధువరుండవు! మూఁడు భూములన్
గలిగిన గేహ రాజమును గల్గినవాఁడవు! కాన హింసలం
గలిగిస మాకు నీదయిన గ్రాలెడు జ్వాలను మళ్లచేయుచో
నిలఁ గల నీ మునీశవరుఁ డెంతయు స్తోతగ వెల్గుచుండఁడే! ॥ 4807

---

1. దదృశ్ర౽ఏకం, 2. దగ్నే౽అను, 3. తే౽అర్చిరుత్తే౽అగ్నే, 4. మాన౽ఆ, 5. వశాగ్ం౽అను,
6. గృహా౽ఇమే. (వ్రా.ప్ర.). 7. శార్ఙ్గ మొక పక్షివిశేషము.

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "జరిత, ద్రోణుఁడు, సారిసృక్వుఁడు. స్తంబమిత్రుఁడు"గాను, దేవత "అగ్ని"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(2)‡ఆ॥వె॥ అన్న మిచ్చగించు ననలుఁడా! నీ జన్మ
మతుల మౌను మరియు నఖిల భూత
జాతములను నీవు చాతుర్యమునఁ జేసి
వశ్యములుగఁ జేసి వరలుచుండు॥ 4808

⁑తే॥గీ॥ పశుల కావరు లే రీతిఁ బశుల చెంతఁ
దిరుగుచుందురో! యా రీతి దీప్త వహ్ని!
యస్మదీయ సుబుద్ధులు నిస్మయంబు
నొంద నీ చెంతఁ దిరుగాడుచుండు నెప్డు॥ 4809

(3)‡తే॥గీ॥ బహుళ తృణజాత వనమును బావకుండ!
నాశనముఁ జేయుచున్నాఁడ వీశుఁడవయి
నీవు కాల్చిన భూములు నిఖిల పశు గ
ణంబు తిరుగాడఁదగినది డంబు మీఱ॥ 4810

⁑తే॥గీ॥ దీప్తిమంతుఁడ! యనలుఁడా! వ్యాప్తి గాంచి
హనన హేతువుగానుండి ఘనతర మగు
నీదు సుజ్వాల మే మెల్ల సాదరముగ
స్తుతుల వినుతించుచున్నాము సొంపు కలుగ॥ 4811

(4)‡చ॥ పరుల పరిశస్త్రరాష్ట్రములపైఁ బడు భూపతిసేన యచ్చటన్
స్థిర ధన రాశులం గొనఁగ శీఘ్రముగాఁ జనునట్లు పావకా!
వెరపున నుచ్ఛ్రితంబు లగు వృక్షలతాదులఁ గాల్చి పిమ్మటన్
విరివిగఁ బోవుచుండెదవు: వెల్గెడు జ్వాలలతోడ నీ వొగిన్॥ 4812

⁑తే॥గీ॥ వాయువసువాఁడు నీ దీప్తిఁ బడయునపుడు
వప్త కేశాదికంబును వరున ముండ
నంబుఁ జేసెడు చందాన దంబు మీఱ
వనముఁ గాల్చుచునున్నావు! వలసినట్లు॥ 4813

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
⁑సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(5)‡తే॥గీ॥ జ్వలనుఁడా! బాహుభూత సుజ్వాలలఁ గడు
వనము శోధించుచున్ నమ్రతను వహించి
యున్నతంబైన భూమిని నొందునపుడు
నీదు జ్వాలలు కనిపించు నిశ్చలముగ ॥ 4814

(6)‡ఆ॥వె॥ అగ్ని! శోషకంబులైన నీ జ్వాలలు
పుట్టుఁగాక! నీదు పూర్ణ దీప్తి
జనన మొందుఁగాక! జ్వలనుఁడా! నీవైన
వేగములు జగాన వెలుఁగుఁగాక! ॥ 4815

తే॥గీ॥ వర్ధమానుండవై నీవు వనములఁ గడుఁ
గాల్చుచున్ నమ్రతం బొంది గ్రాలు మనల
యిట్టి నిన్నిట్టి కాలాన నెల్ల సురలు
పొందుదురుగాక! నే వేళఁ బొలుపు మిగుల ॥ 4816

(7)‡తే॥గీ॥ అప్పులకు వాసభూత మా హ్రదము జలధి
కాల్పఁబడుటకు శక్యమ్ము కానియట్టు
లనల! మా గృహసీమ మహాంబురాశి
కనుక దానిని దహియింపఁ జనెద రెట్లు ॥ 4817

‡తే॥గీ॥ ఇట్టి మా స్థానమును వీడి యితరమైన
మార్గము వెదకుకొనరాదె! మాన్యచరిత!
యట్టి మార్గమునం బడి యతిరయమునఁ
బోవుమా! నీవు స్వేచ్ఛను బూనుచుండి ॥ 4818

(8)‡సీ॥ నీ రాకపోకల నిర్మలుఁడా! యిటఁ బుష్పవద్దూర్వలు పొలుచుఁగాక!
సురుచిరాంబోధుల శోష్యోదకంబులై కాలత్రయమునందుఁ గ్రాలుఁగాక!
హ్రదంబులయందు నంబుజముల్ చాలఁ బొలుపొందఁగాఁ దాము పుట్టుఁగాక!
నీ నివాసంబందునే మాకు ననలుఁడా! యుచితాశ్రయ గృహంబు లుండుఁగాక!
తే॥గీ॥ నుదధియందుఁ బ్రకాశించుచున్న వాస, మెపుడు దహియింపఁబడకుండు నెట్టులైనఁ
గావునన్ మా నివాసంబు పావకుండ!, వరలుఁగావుత! దహియింపఁబడక యెపుడు ॥ 4819

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—144

ఋషి—శార్ఙ్గులైన జరితృఁడు, ద్రోణుఁడు,
సారిసృక్వుఁడు, స్తంబమిత్రుఁడు*
దేవత—అగ్ని

## అర్థాంతరము—1

÷(1) అనలరూప మహాశక్తి అంతరిక్ష మదోదిశయుఁ
జరాచరాకృతి సర్వదిశలు సదసత్ప్రియమై తనరఁగ
బహిరంతర్గతులతోడ వరల దృశ్యా దృశ్యముగ
నంతరాంతరముల నిండి అద్భుతగతి వరలుచుండు
నదృశ్యముగ గుప్త మౌను నావిష్కృత దృశ్యగతుల
జరాచర ప్రపంచమ్ము జడాజడ ప్రకృతు లెల్ల
భిన్న భిన్న సదనములై చిన్న పెద్ద దేహములై
ఉష్ణశీతలంపు శక్తి ఉండియు లేనట్టులుగాఁ
దనరారుచు నిర్నిద్రిత నసాకార రూపముగా
నజ్వలితపు టగ్నిశక్తి అంతట నలరారుచుండు ॥ 4820

÷(2) దివ్యదేవతాళి కెల్ల నవ్యయగతి హవిష్మ్యును
నందించెడి అనల మ్మది అమేయముగ జరితమ్మౌ
ననిలమ్ముల సలిలమ్ముల నాకసముల మృత్తులను
నంతరంగ శక్తులతో నాకర్షణ మొనరించును
నన్నియుఁ దా నౌచు వెలిఁగి అంతటఁ దా నిండి వెలుఁగు
విశ్వ సృష్టిలోనఁ దిరుగు వివిధ గోళ లోకమ్ముల
భువనమ్ముల నన్నింటను బూర్ణశక్తి వర్తిల్లుచు
సప్తవర్ణకాంతి దీప్త జ్వలితజ్వాలసంపు శక్తి
అతిలోకమ్మై తనరుచు నతివేలమ్మై వరలుచు
మనశ్శక్తి మహారూప మనుపమమై విస్తరిలఁగ
నణుధూళుల విషశక్తుల నన్నింటిని నాశపరచు
దివ్యమైన గోశక్తులఁ దేజరిల్లఁజేయుచుండుఁ
బాలకత్వ శక్తులతో వేల లెనయకుండఁ దనరి
ఉత్కృష్టమ్మౌ శక్తుల నుపరిపురోగతులఁ బరఁగు ॥ 4821

---

÷రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*"శార్ఙ్గ" నామకమైన వైష్ణవీయ శంఖాంశతో జనించిన వేదర్షులు. (చూ.పీఠిక.)

‡(3) పునఃపునఃక్రియలు మీఱఁ బునరావృత్తులు గాఁగను
సంచలించు పంచభూత స్వరూపా లన్నింటిని
ఛిద్రమ్ముల క్షుద్రమ్ముల క్షిప్రమ్ముల నప్రమేయ
మహారూప చరాఽచరము లిహపరాల నగ్ని శక్తి
సర్వ భక్షకమ్ముగాఁగ సకలరక్షకమ్ముగాఁగ
ననిల గమన శక్తులతో నాకసమున నడయాడుచు
సలిలమ్ముల మృత్తతులను జరియించుచు మిళితమ్మై
పాంచభౌతికంపు శక్తి ప్రకృతితతుల నన్నింటను
నంతర్గతి నలరుచుండి అఖిలములౌ చరము లెల్ల
సంచరింపఁజేయు నగ్ని సదమలమౌ ప్రాణదీప్తిఁ
బంచప్రాణముల నిండు చుదంచితముగ జననశక్తి
వర్తిల్లుచు ననంతమౌ ప్రకృతి నెల్ల నావరించి
అద్వైతమ్ముగ వర్తిలి అపురూపపు దీప్తులతో
అగ్నిగోళములుగాఁగను నలరారును ద్వైతగతుల ॥ 4822

‡(4) ఆకసముల సలిలమ్ముల ననిలమ్ముల మృత్తతుల
సంశక్తుల రూపమ్మున జ్వలియించుచు బీజగతులఁ
బతిగాఁగను ననలశక్తి పరఁగ బీజముల వేయుచుఁ
బ్రకృతి బహుళ రూపమ్ములఁ బ్రభవింపఁగఁజేసి సృష్టి
రోదోఽంతర మహారంధ్ర రూపాంతర్గతుల వెలిఁగి
పృథగ్రూప దీప్తులతో బృహద్రూప జ్వాలలతో
బిలగతులను శైలగతులఁ బృథ్వీతల సలిలాఽనిల
గోళగతుల బహిరంతర్గుప్తరతుల భాను సహస్ర
రూపమ్ముల వరలు నగ్ని ఘృణిరక్తుల ఘనశక్తుల
ననిల సంవలితమ్మై అఖిలమ్మున వర్తిల్లుచు
శుచిగాఁగను దివ్యశక్తి విచిత్రముగ సలిలమ్ముల
నంతర్గతి నలరుచుండె ఆవిష్కృత మౌను జగతి
విద్యుత్తుగ విశ్వజనీన హృద్యదీప్తు లొప్పారఁగ
జనన సంవర్ధనాల ధన వన ధారణరతులను
హసనశక్తు లొప్పారఁగ నలరు నిత్య మనలమ్ములు
అమేయమౌ శక్తులతో ననూనమౌ దీప్తులతో ॥ 4823

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(5) ఆకసములనుండి అగ్ను లావిష్కృత మౌను సృష్టి
ననిలమ్ములనుండి అనల మావిర్భవ మొందుచుండు
ననలమ్ములనుండి కూడ ననలమ్ములె పుట్టుచుండు
సలిలమ్ములనుండి శుచులు సంభవించుచుండునులే!
మృద్రూపమ్ములనుండియు మించి జనించు ననలమ్ములు
రేణువులై అణుపరమాణువులై సూక్ష్మరతుల
బృహద్రూప మహిత్వాల విశ్వమ్మున వెలుఁగుచుండు
నేకైకమ్మౌ నగ్నియె యెన్నెన్నో రూపాలుగ
బహిరంతర్గతులు మీఱఁ బ్రజ్వలిలుచుఁ బరఁగుచుండు
నంతరిక్షమార్గమ్మున ననంత మహా యానగతుల
సకల లోక గోళాలకు సంచలనపు రూపమ్ముల
రాత్రింబవళుల నొసఁగుచు రాజిల్లఁగఁ గాలగతులు
విశ్వసృష్టి నగ్నికాల విలసితముగ నొనరించును
సౌప్తికగతి జాగృతరతిఁ జక్రనేమి క్రమముగాఁగ ॥ 4824

‡(6) అనలశక్తి శోషమ్మై అంతరిక్షమందు గలియు
నత్యంతము శీఘ్రమ్మై అసాధారణంపు గతుల
నుపర్యుపరి తలములకు నుజ్జ్వలగతి వెడలిపోవు
సలిలమ్ములఁ దరులతలను సకలమ్మౌ మృచ్ఛిలలను
నంతర్గతి నలరారును నదృశ్యంపు శక్తులతో
ననల మహాదివ్యశక్తి ధనదభావరూపగతుల
నఖిల విశ్వ గోళమ్ముల ననేక ధూమకేతువులను
నలరారఁగఁ జేయు వివిధ హైమ బహుళ మణి రత్నా
లష్టావిధ వసు సంపద లపురూపపు దీప్తులతో
నమూల్యములుగాఁగ వెలుఁగ నైశ్వర్యములై చెలఁగఁగ
వివిధానల శక్తితతులు విలసిల్లఁగఁ జేయు సృష్టి
సంజనన క్రియలు మీఱ సంవర్ధక క్రియలు మీఱ
ఋతశక్తుల సలిలమ్ముల మృచ్ఛిలాతతులలోన
బహిరంతర్గతుల మెయిని బహుకాలము నిలిచి వెలుఁగు ॥ 4825

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(7) అగ్ని శక్తి సలిలమ్ముల హరియించును మహాదీప్తి
నసలమ్మును సలిలమ్ములు నార్పివేయు నాదరితమై
హ్రదములలో నదులలోన నంబుధిలో జలాలలో
సర్వాంతర్యామిగాఁగ జ్వలన ముండుఁ గుప్తగతుల
బడబాగ్నులు గుహ్యములై జడధిలోనఁ దనరారును
నారిపోని శక్తులుగా నదిరూపాఽనలముగ
విశ్వపురుష నయనముగా విశదప్రకృతి నయనముగా
మున్నీటి నివేశనముగఁ బెన్నేరుల పాశముగా
నలరారును నగ్ని శక్తి అతిలోకపు గుహ్యగతుల
నాకసముల ననిలమ్ముల నంబువులను మృత్తులను
విహితమౌ మిహరమ్ముల బహురూపమ్ములఁ దనరును
నసాధారణంపు గతులఁ బ్రసాదమౌ గుణ సంపద
బహుళమార్గగామిగాఁగ నహోరాత్రు లలరారును
ద్వైతగతులు మీఱఁగ నద్వైతగతులు వరలంగా ॥ 4826

‡(8) అనలదీప్త శక్తులతో నఖిలజగతి ప్రకాశించు
బహుళములౌ పుష్పమ్ములు ప్రఫుల్లమై విరాజిలును
సర్వసంపన్నిలయమైన స్వచ్ఛశిత కమలముగా
బహుళవర్ణముల వెల్గుచుఁ బ్రత్యహమును వికసించును
హృద్యగతుల సృష్టి నెల్ల నింపారెడి చైతన్యపు
నిత్యకృత్య కర్మమ్ముల నెగహొందఁగఁ జేయుచుండు
సలిలమ్ములు ననలములకు సర్వసదనమై తనరఁగ
గూఢమైన గృహముగాఁగ బాడబజలధి వరఁగుచుండు
ననిలశక్తి హృద్గతులను ననలశుచిత్వమ్ము వరలఁ
జంద్రశక్తి ధనుస్సుగా సాంద్రబహుళ వర్ణగతులఁ
బద్మసదన సృష్టి యజ్ఞ బ్రహ్మక్రియగఁ దనరారుచు
నన్నింటను నంతర్గతి నలరు ననల మద్భుతగతి
నాకసములు సలిలమ్ములు ననిలమ్ములు మృత్తులును
దన్మయగతి నుష్ణగతులఁ దనరుఁ జితరతులమైని ॥ 4827

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పల్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—144

ఋషి—శార్ఙ్గులైన జరితృఁడు, ద్రోణుఁడు,
సారిసృక్వుఁడు, స్తంబమిత్రుఁడు
దేవత—అగ్ని

### అర్థాంతరము—2

‡(1) భూత భావి వర్తమాన పూర్ణకాల వరూధమ్ము
నగ్నిశక్తి సృష్టిలోన నలరించును గోళాదుల
నఖిల లోక భువనమ్ముల నావృతమౌ భిన్నభిన్న
కాలవరిధు లొప్పారఁగఁ గాలనేమి శక్తులతో
నాభి భౌతికంపు రతుల నాధిదైవ నిత్యగతుల
నాధ్యాత్మిక నిష్ఠామయ ధ్యానతత్త్వ ఋతగతులను
ననిల సలిల మృద్గతులను నంతరిక్షమహితతత్త్వ
సంభరితపుఁ దేజమ్ముల సంచలనపు దీప్తులతో
నిత్యమైన పరిసారాల నత్యమలమ్మౌ కాంతులు
కళ్యాణకరమ్ముగాఁగఁ గ్రాలఁజేయు ప్రకృతి నెల్ల
హింసాశక్తుల నెల్లను ధ్వంసపరచు మహితమ్ముగ
హంసగాఁగఁ బ్రాణగతుల ననలమ్మది వరలుచుండు
ననిలాంతర్గతులు మీఱ నన్యోఽన్యపు టైక్యరతుల
నవినాభావత్వ మలరు ననుబంధపు బంధాలను ॥ 4828

‡(2) తండ్రిగాఁగ ననలశక్తి తనరారును సృష్టిలోన
నసాధారణంపు రతులఁ బ్రసాదరూప కవోష్ణతల
సకలలోక భువనమ్ముల సర్వ గోళ సంచయాల
రకరకాల ధూమకేతు రాజిలోన వర్తిల్లుచు
సప్తాఽఽకాశమ్ములతో సప్తాఽనిలరూపమ్ముల
సప్త సలిల సంచయాల సప్త పృథ్వితతులతోడ
బహుళములౌ రూపమ్ముల వరలు నల్పాఽనల్పములై
అతిలోకపు మనశ్శక్తు లతివేలములై వరలెడి
రీతిగాఁగ నగ్ని దివ్య లీల శక్తి ప్రకృతిలోన
వర్తిల్లును నిత్యమ్మును బరమేశుని మాయగాఁగ
మృతాఽమృత తత్త్వాలను గృతాఽకృత ప్రాణతత్వ
జీవనంపుగతుల సంజీవకరణిగాఁగఁ దనరి
నంతరిక్ష మాదిగాఁగ గంతవ్యపుఁ బదముగాఁగ
నావిర్భావమ్ముఁ నొందు నంతర్గతి నావరించు ॥ 4829

---

‡రచయిత:—వాఙ్మయ మహర్షి, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡(3) సకలరూప పదార్థాలు జ్వలన జ్వాలనంపు గతుల
నసలపూర్ణ రూపములుగ నలరించుచు స్వయంభూ
దీప్తమహిత శక్తులుగా దివి భువి లోకా లన్నిట
నఖిలభూత పదార్థాల వ్యష్టిసమిష్టిగతుల మెయిని
వర్తిల్లుచు భూత భావి వర్తమాన కాలమ్ముల
బహిరంతర్గతులతోడఁ బ్రజ్వలనపు టజ్వలనపు
దృశ్యాఽదృశ్య మహితమ్మై వశ్యాఽవశ్య శక్తులతోఁ
బంచభూతాత్మకమౌ బాహ్యసృష్టి రూపమ్మున
భాగస్వామ్యమ్ము నొంది భాస్వంతమ్ముగఁ దనరుచు
హనన హేతుభూత మౌచు నఖిలమ్మును నావరించి
బృహద్‌బృహత్తరములైన పృథ్వీతత్త్వ రూప వస్తు
సంజాతము నణువులుగా సామాన్యపు టల్పాఽల్పపు
మసిగాఁగను నుసిగాఁగను గసిమసంగి పసలు విడువఁ
జేయు నగ్ని బుతశక్తుల సింగారపు దీప్తులతో ॥ 4830

‡(4) ఉద్ధతమౌ శక్తులతో నుపర్యధోగతులు మీఱ
మహాదీప్తు లొప్పారఁగ విహరించుచు విశ్వమ్మున
సృష్టిభూత సంచయాల నష్టావిధ వసువులలో
నసాధారణంపు గతులఁ బ్రసాదగుణము నిండంగాఁ
బ్రజ్వలనపు శక్తులతో భాను సేన దీప్తులతో
సంఘటించు క్రియాశక్తి సంవిభజన సందీప్తుల
ననిలగతుల నఖిలదిశల నావరించుచుండి సదా
అధికాఽధికమౌచు వెలుఁగునల్పాఽల్పమ్మౌచు నారు
నణుపరమాణురూపమ్మై అఖిలాండమ్మై వెల్గుచు
సూక్ష్మ బృహద్‌రూపమ్ముల శుచి మహత్వమ్ము వరల
నిత్య సత్య గతులమెయిని నిర్మలత్వమ్ము తనర
నగ్ని సృష్టిలోన వెలుఁగు నఖిల భక్షకమ్ముగాఁగ
నఖిలాఽఖిల రక్షకమై అతివేలపు దక్షతమై
నసాధారణంపు గతుల నమరత్వము వర్తిల్లఁగ ॥ 4831

(5)‡ఆ॥వె॥ అగ్ని ఉజ్వలమ్మునై ప్రజ్వలిల్లుచున్
ఉపరితలము కెగయు నుజ్జ్వలముగ
భూ పతన మగుచును బూర్ణమౌ శక్తులన్
మించి వెల్గ సంకుచించుకొనును ॥ 4832

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡క॥ బహుమార్గగ దశదిశలను
నహరహమున్ దివ్యశక్తి ననలపు రూపం
బిహ పర లోకమ్ములలో
బహుళములౌ గోళములను వరలున్ దీప్తిన్ ॥ 4833

‡క॥ అంచెలు నంచెలు గాఁగను
నంచులునంచులునయి శుచు లర్చులుగాఁగన్
అంచితమై అర్చిల ను
దంచితగతిమెయిని నగ్ని అందము లొలుకున్ ॥ 4834

‡క॥ నిర్ణీతపు మార్గముల ను
దీర్ణంపు టనేక నిత్య దీప్తుల మైఁ గా
లాఽర్ణవ బద్ధముగాఁగ వి
శీర్ణాఽనిర్ణీత బహుళ జిహ్వల నలరున్ ॥ 4835

(6)‡క॥ అనలము శోషక శక్తి గ
గనమ్మున కెగసి మహా ప్రకాశము లలరన్
దనురూప బృహద్రూపము
లనవరతము సృష్టిని దగు నద్భుతగతి మై ॥ 4836

‡క॥ పవనమ్ముల వేగముతో
నవనమ్ముల వనములందు నంతట నిండున్
అవినాభావత్వమ్మున
నవిభాజ్యత తనరు వివిధమౌ భూతములన్ ॥ 4837

‡క॥ సర్వ సమత్వము వరఁగఁగ
నుర్వీతల దివ్య త్రిభువనోర్ధ్వాఽధో లో
కాఽర్వాణ భూతమ్ములను న
ఖర్వగతిన్ శుచి జ్వలించు గమ్య రహిత మై ॥ 4838

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡క॥ నిత్యమ్మౌ యౌవన గతి
సత్య పదార్థంపు దీప్త జ్వాలలు మీరన్
అత్యమలమ్మౌ నగ్నులు
స్తుత్యాఽష్టవిధ సువసువుల శోభిలఁజేయున్ ॥ 4839

(7)‡క॥ జలశక్తుల కయనమ్మై
నిరతమ్మును నాంతరగతి నిశ్చల రతులన్
విరసమ్ముగ సరసమ్ముగ
జలధుల నగ్నులు వెలుంగు జ్వలిత జలమ్మై ॥ 4840

‡క॥ నదులును నదములు హ్రదములు
సదనములుగ నగ్ని తనరు జలధులలోనన్
విదితమ్ము కాని గుహ్యగ
పద మలరఁగ నజ్వలనపుఁ బ్రభ తనరారన్ ॥ 4841

‡క॥ ఛిన్న పథమ్ములను నవి
చ్ఛిన్న గతుల మై శుచుల విశీర్ణత వరలన్
వన్నెల వన్నెల కీలుల
మిన్నేటి జలధి వనాల మించి జ్వలించున్ ॥ 4842

‡క॥ అనలము జలముగ మారును
ననిలమ్ముగ మారు సృష్టి నపురూపగతిన్
ననల మ్మాకాశమును న
వనీతల మగుచుఁ దనరును బహు రూపములై ॥ 4843

‡(8) అన్నింటను నలరారుచు నఖిలమ్ములఁ జరించుచున్
అవితథమౌ యానమ్ముల ననలమ్ములు తనరారును
సకల పదార్థమ్ములందు జ్వలన జ్వాలనంపు గతులఁ
బ్రకటితమై వెలిఁగి అప్రకటితమై నిండి నిగుడు
దివ్యదీప్తు లలరారఁగఁ దేజరిలుచుఁ బుష్పములై
నసాధారణంపు రతుల ననల మ్మది ప్రకాశించు
నగ్ని పుండరీక మౌచు నంబోధిని నంతర్గతి
నలరారును నద్భుతముగ నారిపోని దీప్తులతో

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

ఆమోఘమైన శక్తులతో నతివేలపుఁ బ్రాణగతుల
బడబానల మౌచుఁ దనరి జడధి జలము నింకఁజేయు
నంత మెనయకుండ శుచి దిగంతాల దీప్త మౌచు
గగనాంతరాళమ్మునఁ గ్రాలు సర్వ సృష్టిలోన ॥ 4844

## §సూక్తమ్—145

ఋషిః—అగ్నిస్తాపసః
దేవతా—అగ్న్యాదయః
ఛందః—అనుష్టుప్

•(1) హిమస్య త్వా జరాయుణా[1] శాలే పరి వ్యయామసి ॥* 1622

•(2) శీతహ్రదో[2] హి నో ధియో ఽగ్నిర్దదాతు భేషజమ్ ।
అన్తికామగ్నిమజనయ[3] దూర్వాదిః [4]శశహాగమత్ ॥ 1623

•(3) అజాతపుత్రపక్షాయా హృదయం మమ[5] దూయతే ।
విపులం వనం బహ్వాకాశం చర జాతవేదః కామాయ ॥ 1624

•(4) మాం[6] చ రక్ష పుత్రాంశ్చ శరణమభూత్ తవ ।
పింగాక్ష లోహితగ్రీవ కృష్ణవర్ణ నమోఽస్తు తే ॥ 1625

•(5) అస్మాన్నిబ[7]ర్హ రస్యేనాం సాగరస్యోర్మయో యథా ।
ఇన్ద్రః[8] క్షత్రం దదాతు వరుణమభి షించతు ॥ 1626

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" సూక్తము- "ఖిల" మంత్రములు కలది "ఖిల" సూక్తము. ఋగ్వేదము దశమమండలములోని యీ 145వ సూక్తము 13 ఋక్కులతోఁ గొన్ని వ్రాతప్రతులలో నధికముగాఁ గలదు. దీనిని "ఖిల" సూక్తముగాఁ గొందఱు భావింపఁ బరిశిష్టముగాఁ గొందరును, బ్రక్షిప్తమని మఱికొందరును నధికపాఠమని వేరొకకొందరును భావించిరి. ("ఖిల"శబ్ద నిర్వచన వివరణకై 146వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు చూడ నగును.) •"ఖిల" మంత్రము.

*ఉతహ్రదో హి నో ధియోఽగ్నిర్దదాతు భేషజమ్॥ (పా.)

1. జరాయుణాగ్నే, 2. శీతహ్రదా, 3. జరదూర్వాదః, జనయదూర్వాసః, జనపూర్వాదః, జనయదూర్వారః, 4. శిశురాకమిత్, 5. దూయతే, హూయతే, 6. మాంశ్చ, 7. అస్మాద్విబర్హ స్యోనాం, అస్యాన్నిర్బహరస్యోనాం, అస్మాన్నిబర్హణస్యోనాఁ, అస్మాన్నిబర్హ రస్యోనాం, అస్మాన్నివర్జయస్థానం, 8. ఇన్ద్రం, ఇన్ద్రశత్రుం. (పా.వ్ర.)

*(6) శత్రవో నిధనం యాన్తు జయ[1] త్వం బ్రహ్మతేజసా ॥ 1627

*(7) కపిలజటీం సర్వభక్షం చాగ్నిం ప్రత్యక్షదైవతమ్ ॥ 1628

*(8) వరుణం చ వశామ్యగ్రే మమ పుత్రాంశ్చ రక్షతు ॥ 1629

*(9) సాగ్రం వర్షశతం జీవ పిబ ఖాద చ మోద చ ॥ 1630

*(10) దుఃఖితాంశ్చ[2]ద్విజాంశ్చైవ ప్రజాం చ పశు పాలయ ॥ 1631

*(11) యావదాదిత్యస్తపతి యావద్భ్రాజతి చన్ద్రమాః ।
యావద్వాయుః[3] ప్లవాయతి [4]తావజ్జీవ జయా జయ ॥ 1632

*(12) యేన కేన ప్రకారేణ కో హి[5] నామ ను జీవతి ।
పరేషాముపకారార్థం యజ్జీవతి స జీవతి ।
ఏతాం వైశ్వానరీం[6] సర్వదేవాన్నమోఽస్తు తే ॥ 1633

*(13) న చోరభయం న చ సర్పభయం న చ వ్యాఘ్రభయం న చ మృత్యుభయమ్ ।
యస్యావ[7]మృత్యుర్న చ మృత్యుః[8] సర్వం లభతే సర్వం జయతే ॥ 1634

ఇతి
అష్టమోఽష్టకే సప్తమోఽధ్యాయ
స్సమాప్తః

---

*"ఖిల" మంత్రము.

1. జయస్త్వం, 2. దుఃఖితాం చ, దుఃఖితాంతం, తాన్న, 3. వాయుఃప్రవాజతి, 4. జయతావజ్జీవజయాజయ,
5. వినామను, హినామన, పీనామను, హీనమను, 6. వైశ్వానరం, వైశ్వానరందేవంసర్వదేవ, 7. యస్యాపిమ్నం,
8. స సర్వంలభతే స సర్వంజయతే. (వ్రా.ప్ర.)

## §సూక్తము—145

ఋషి—తాపసాగ్ని
దేవత—అగ్న్యాదులు
***

‡(1) హిమరూపమ్మును నగ్నీ!గు యెన( జలమ్ములుగా(గను
బ్రాణధారకమ్ములుగా( బరిత్యజించెదవు! నీవు!
శక్తివంతు(డ వౌచు( జదలునన్ వెలి(గెదవు! ॥ 4845

‡(2) అతిచల్లని హ్రిదమ్మునకు నగ్ని ఔషధమ్ము లిచ్చు
బుద్ధిభరితమైన శుభము పూర్ణమ్ముగ వర్ధిల్ల(గ(
సలిలాంతకముగ జ్వలను(డు సంభవింప శశగతులను
జందమామ ఉదయించును సంత్రాణపు శక్తులతో ॥ 4846

‡(3) జన్మరహిత పుత్రశక్తి ఉన్మనోదీప్తులతో
విపులమైన జలములతో విస్తృతాకాశమ్మున(
గామ్యమ్ముల సిద్ధి వెలయ( గ్రాలు బహుశరూపమ్ముల(
జరియించును సృష్టిలోన జాతవేదాఽనలమ్ము ॥ 4847

‡(4) నిర్మలమౌ హృద్గతులను నీదు శరణు వే(డి నిలుచు
నన్ను నా పుత్రులను నెన్నుచు రక్షించు మగ్నీ!
కృష్ణవర్ణ! పింగాక్షా! లోహితగ్రీవా! నీకు
నమస్కార మొనరింతును నా త్రికరణమ్ముల శుద్ధిగ ॥ 4848

‡(5) అనలరూప మహాశక్తి హరి క్షత్ర బల పౌరుష
వీర్య వీర శూరతలను నీరాఽభిషేకమ్ముల
నొనరించుత! నిత్యమ్మును సృష్టిలోని శత్రుశక్తు
లంబుధిలో నూర్ములట్లు హద్దులతో( బుట్టి పోవు ॥ 4849

---

§"ఖిల" సూక్తము. ***సామాన్యార్థము.
‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡"ఖిల" మంత్రానువాదము.

‡(6) నీ బ్రహ్మతేజాన నిఖిలమౌ శత్రువుల్
చనిపోవఁగా నీవు జయ మొందుమా! అగ్ని! ॥ 4850

‡(7,8) ప్రత్యక్ష దైవతముగ వరలు సర్వ భక్షక మై
కపిల సర్పజడకాంతులఁ గ్రాలుచుండు దివ్యాగ్ని యె
వరుణునితోసహా నాకు వశమాన మ్మొచు ముందు
నా పుత్రుల రక్షించుత! నా యిచ్ఛారతుల మెయిని ॥ 4851

‡(9,10) సాలంబన శక్తులతో శతవర్షమ్ములు బ్రతుకుము!
సేవించుము! భక్షించుము! చెల్వారఁగ మోద మ్మది
ద్విజన్ములను దుఃఖితులను బ్రజలను బశువుల నెల్లను
బాలించుము! సత్యగతుల వరలుచు నాధారమ్ముగ ॥ 4852

‡(11) ఆదిత్యుని ఉష్ణోగ్రత లలరు నంతకాలమ్మును
చందమామ నెల్ల సృష్టిఁ జల్లని వెన్నెల కాంతుల
నెంతకాల మొసంగునో! యెల్ల వాయుతతుల జగతి
నెంతవఱకు సంచరించు నంతకాల ముండి నీవు!
జయాలనే జయించుచున్ జ్వలసుండా! వెలుఁగు! నీవు! ॥ 4853

‡(12) సకల ప్రాణికోటి వివిధ ప్రకారాల జీవించును
బరోపకార శక్తులతో వరలి జీవించుచుండు
సర్వదైవ రూపమైన జ్వలితాగ్ని! వైశ్వానరా!
నిరత పురోవర్తీ! శుచి! నీకు నమస్కార మిడుదు ॥ 4854

‡(13) చోరభయము లేకుండఁగఁ గ్రూరసర్పభయము లేక
వ్యాఘ్రభయము లేక మృత్యుభయ మన్నది లేకుండఁగ
నపమృత్యువు లేకుండఁగ నసలే మృతి లేకుండఁగ
సర్వమ్మును వశ మ్మొను జయ మొందును సకలమ్మున ॥ 4855

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡"ఖిల" మంత్రానువాదము

### *సూక్తము—145

ఋషి—తాపసాగ్ని
దేవత—అగ్న్యాదులు

### అర్థాంతరము—1

‡(1) హిమమ్మునకు స్తంభనగతి యెంతేనియు విరాజిలఁగ
నత్యధికమ్మై అనలము అలంకారమై తనరును ॥ 4856

‡(2) అగ్నిశక్తివల్ల శీతహ్రదము లెల్ల క్షీణించును
ననలశక్తి బుద్ధి నిచ్చు నౌషధమై తనరారును
నంతికమున నగ్ని శక్తు లలరారఁగఁ జందమామ
చల్లని వెన్నెలల విరియు సకలమునకుఁ బ్రాణదమై ॥ 4857

‡(3) అజాతపుత్రపక్షముగా నజాతమౌ హృదయముగా
నన్ను ననలశక్తి నిలుపు మిన్నులలో బహు విధాల
విపులమైన సప్తగతుల విశద కామ రూపమునకు
జాతవేదుఁ డౌచు నిలిచి చరియించును సర్వమ్మున ॥ 4858

‡(4) నీకుఁ బుత్రుఁ డౌచు వెలుఁగు నిఖిల లోక గోళములఁ
జంద్రుని రక్షించు! నీవు! శరణముగా నీ పదము లె!
లక్ష్మివర్ణ! ఉమానేత్ర! బ్రాహ్మ్యమైన రక్తగ్రీవ!
అమరుండౌ జ్వలనుండా! నమస్కృతులు నీ కెపుడును ॥ 4859

‡(5) సంద్రమ్ముల కెరటాలుగ సకలారుణ కాంతులకును
హద్దుపద్దు లుండు సృష్టి నాకర్షణ వికర్షణల
వైష్ణవీయమైన వీర్య వర్ధమాన క్షాత్రశక్తి
వరుణాదిత్యుండు జగతి వరలఁజేయు నభిషిక్తత ॥ 4860

---

*"ఖిల" సూక్తము.
‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡"ఖిల" మంత్రానువాదము.

‡(6,7) బ్రహ్మ తేజ మలరంగాఁ బ్రత్యక్షదైవమ్ముగ
బ్రాహ్మ్యవర్ణ దీప్తులఁ మై వరలెడు నా జటలు గల్గి
సర్వభక్షకి గాఁగ వెలుఁగు జ్వలితాగ్నీ! విశ్వమ్మున
నరితతులు మరణించును వరియించును జయము! నిన్ను ॥ 4861

‡(8) శత్రు పరాజయము వరల జయ మొందుచు బ్రాహ్మ్యమ్మునఁ
గపిలవర్ణజములతోడఁ గ్రాలు సర్వ భక్షకిగాఁ
బ్రత్యక్ష దైవతముగ వరలు వరుణదేవుండును
ననలముతో వశ మొాచును నగ్రభాగమందు నిలిచి
అఖిలమ్మును నా పుత్రుల ననుగ్రహించి రక్షించుత! ॥ 4862

‡(9,10) త్రాగుచుఁ దినుచును నిత్యముఁ దనరారుచు మోదమ్మున
నవిచ్ఛిన్న గతులమెయిని నాద్యంతము లలరంగా
శతవర్షము లలర జీవగతులు మీఱ వరుణాగ్నులు
వ్రజావశుల ద్విజుల దుఃఖితాళిఁ బశువులఁ బాలించుఁగాక! ॥ 4863

‡(11) ఆదిత్యుని అగ్ని దీప్తు లలరునంతకాలమ్మును
జందమామ వెన్నెలలు ప్రసరించెడు నంతకాల
మనిలమ్ములు సంచరించునంతకాలమ్ము వఱకు
సృష్టిలోనఁ బలు జయాల జీవ శక్తు లలరారును ॥ 4864

‡(12) భిన్న భిన్న గతులతోడ వెలుఁగు సర్పములుగ నిలిచి
వైశ్వానర నామకాగ్ని ప్రకృతి జీవగతుల నిలుపుఁ
బరోపకారపర మ్మొాచు వరలు జీవ జీవముగాఁ
బరఁగు సర్వదేవతతికి జ్వలనుండా! వందనమ్ము! ॥ 4865

‡(13) దొంగల భయమ్ము లేదు! తొలఁగిపోవు! సర్పభయము
ఉండఁబోదు! వ్యాఘ్రభయము! నుండదులే! మృత్యుభయము
అపమృత్యువు లేదు! మృతికి-నఖిలమ్మును బొందుచుండు
లయము సర్వసృష్టి మీఁద జయము నొందుచుండు సదా! ॥ 4866

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡"ఖిల" మంత్రానువాదము.

§సూక్తము—145

ఋషి—తాపసాగ్ని

దేవత—అగ్న్యాదులు

**అర్థాంతరము—2**

‡(1) మంచుకు జలమాయువుగా నంచితముగ నగ్ని నిలుపు
నన్యోఽన్యపు టనుబంధత నావరించి అఖిలమ్మున ॥ 4867

‡(2) శీతలమౌ హ్రదములోన నహి రూపాగ్నులు తనరుచు
నౌషధశక్తుల నొసఁగుచు నద్భుతముగ బుద్ధిఁ బెంచు
నంతికముగ ననలశక్తి ఆవిర్భవ మౌచు నిలిచి
శీతలాగ్ని శశగతులను జెన్నొందును జంద్రికలై ॥ 4868

‡(3) జన్మరాహిత్యగతిని సంచరించు పుత్రుఁడుగా
నా హృదయము వర్తిల్లును నాట్యరతులు మీఱంగా
విపులమైన జలరతులను వియత్తలములందు నిండి
కామరూప ప్రకృతికినై క్రాలు జాతవేదాగ్నియె
సంచరించుచుండు సదా సంచలనపుగతులు మీఱ ॥ 4869

‡(4) వైష్ణవీయవర్ణగతుల వరలు శైవాక్షమ్మున
బ్రాహ్మ్యమ్మౌ గీర్వరతుల వర్తిల్లెడి దేవా! నమో!
నిన్ను శరణు వేఁడునట్టి నన్ను నా పుత్రులను
రక్షించుము! సర్వగతులఁ బ్రజ్వలించు ననలుండా! ॥ 4870

‡(5) సంద్రములో నూర్ములుగా సంచరించు నిన కాంతుల
నాత్మగతుల హద్దు లెనయ నాకట్టుమ! అనలమ్మా!
ఐంద్రశక్తి క్షాత్రమ్మును నఖిలమ్మున నలరించుచు
వరుణాభిషేకమ్ములఁ గరుణించును బ్రకృతి నెల్ల ॥ 4871

§"ఖిల" సూక్తము.

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡"ఖిల" మంత్రానువాదము.

‡(6,7) వెలుఁగు బ్రహ్మ తేజమ్ముల విలసిల్లెడి షడూర్ప్రవపుఁ
బ్రకృతివంశముల నొందుచు జ్వలనా! జయ మలరు నీకు!
నర్ధాంగ మ్మౌచు వెలుఁగు నగ్ని! కపిలరూపమ్మా!
ప్రత్యక్ష దైవతమై కాలు సర్వ భక్షకముగ! 4872

‡(8) అనలముతో వరుణుండును నగ్రమ్మున వశ మౌచును
నన్ను నా పుత్రులఁ ఋషుల నెన్నఁగ రక్షించుఁగాక! ॥ 4873

‡(9,10) వాయుపూర్ణ మౌచు నిలిచి బహువర్ణమ్ములు మీఱఁగ
జీవించుచుఁ దాగి తిని చెల్వారఁగ మోద మగ్ని!
ప్రజల ద్విజుల దుఃఖితాళిఁ బాలించుమ! సమ్యగ్గతి ॥ 4874

‡(11) ఆదిత్యం డెంత కాల మగ్నులతో మండుచుండు
నెంత కాల ముండెదరో! యీ చందమామ ప్రకృతిమాత
లెంత కాల మనిలమ్ములు వింతగ వీచును సృష్టిని
నంతవఱకు జీవించుమ! అగ్ని! జయాలకే జయమ్ముగను! ॥ 4875

‡(12) ఏ యే ప్రకారమ్ముల నీ విశ్వ మ్మహి శక్తుల
జీవించును జిద్గతులను జెన్నొందుచు నితరేచ్ఛలఁ
బరహితమౌ నుపకృతులకు వరల నేది జీవించునో!
ఆ సకలము జీవించును నలర సర్వదేవతాళి
నీ వైశ్వానరాగ్ని నెన్ని నమస్కరింతు నేను! ॥ 4876

‡(13) లయశక్తికిఁ జోరభయము! లయశక్తికి సర్పభయము!
లయశక్తికి వ్యాఘ్రభయము! లయశక్తికి యమభయమ్ము!
లయశక్తికి నపమృత్యు భయమ్ము! లేదు! లేదు! సృష్టి
మృత్యురూప లయశక్తికి సత్యమ్ముగ సర్వమ్మును
లభ్య మౌను నఖిలమ్మున నమరు సర్వ విజయమ్మును ॥ 4877

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
‡"ఖిల" మంత్రానువాదము.

‡— పరాకర్షణగ్రహణభయము వరలు నల్ప మౌచు సృష్టి
నల్ప మౌను గాల సర్ప వ్యాఘ్ర భయమ్ములను గూడ
మృత్యుభయ మల్పమౌ నపమృత్యుభయ మల్పమౌ
నీశ్వరుఁడే లయశక్తుల నెసఁగి అఖిల మొందుచుండు
సర్వప్రకృతి రూపమ్ముల జయించివైచు నజయ్యముగ ॥ 4878

ఇయ్యది
విశ్వసృష్టిప్రకృతిమాత్రైకైకపుత్ర
శతకమళ్ళగోత్ర-వడ్లమూడికులసందీప్త-
శ్రీసుబ్బన్న పౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అద్వితీయ ద్వితీయపుత్ర-
శ్రీసరస్వతీమాతృ ప్రియపుత్ర-అపార వేద శాస్త్రసాహిత్యవిద్యా పారంగత-

అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకిక శక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సర్వ దేవతాస్వరూప-విద్వన్మణిపంచముఃఖాంజనేయోపాసక శ్రీవేదుల రామశాస్త్రి గురువరాభిస్తుత "ముఖకలితగోపాలసుపద"-మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమ గురువర్యాభినుత "శతవర్షాశీర్వచన రక్షిత అగుణశోభిత నిష్కళాసహిత శ్రీ మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహినీ హృదయలక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్వాక్ స్వరూపిణి, అమలినపవిత్ర పతిరక్తి భక్తి శక్తిస్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్యచైతన్యవతి, నిర్నిద్రమతి, వినిర్మలగతికలిత, ప్రియశరీరాంతర్విలీనగాన జ్ఞానధ్యానస్వరూపిణీతన్మయి, శివపూజితఫాలచంద్రకళా మూర్తి-అకళంక సౌందర్యరాశి-సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త- జయశ్రీ సత్యశ్రీ పుత్రికా రత్నద్వయ అజయ్య జయ విజయ పతాకయుక్త - శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహర రాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య ఛత్రాఽఽవరణయుక్త-పాణినీయాఽష్టాధ్యాయీపూర్వత్రాసిద్ధసూత్రసహిత శబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త-మహావైయాకరణ-వేదవేదాంతకోవిద-దశభాషా కవితావిశారద-పుంభావశారదా మూర్తి- శ్రీ గుండేరావు హర్కారే సాష్టాంగనమస్కార పూర్వక ప్రస్తూయమాన- "శ్రీ వాఙ్మయమహాధ్యక్ష-ప్రాచీన వైయాకరణానమయ సంప్రదాయరక్ష-స్ఫోరితానేక జనాభినవోన్మేష శాలికావ్య నిర్మాణశక్తి మన్నికోచనాక్ష-మాధుర్య స్యందివీర్యవత్తరపద గుంఫాధురీణ - మహీభుగగోచరగాంభీర్యప్రకటనాపటిమాపారీణ - కల్పాంతారీణాఽనల్పకల్పనా భూషణ"- లీలామానుష విగ్రహ-ఆంధ్రవిశ్వకళాపరిషత్ సంభావిత చతుర్వింశదధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్

"కళా-ప్రపూర్ణ" సార్థక బిరుద విరాజిత-బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య
సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్త సహిత సుసమగ్ర
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
దశమమండలమున నష్టమాష్టకమునందలి
సాయణాచార్యభాష్యానుసారాంధ్రీకరణ
శేషభాగపూరణయుక్తంబును
నర్థాంతరయుక్తంబును నగు
సప్తమాధ్యాయము
సంపూర్ణము

---

‡రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡"ఖిల" మంత్రానువాదము.



# సమరాల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## దశమం మండలమ్

### అష్టమోఽష్టకః—అష్టమోఽధ్యాయః

### సూక్తమ్—146

ఋషిః—అత్రిః సాంఖ్యః

దేవతా—అశ్వినౌ

ఛందః—అనుష్టుప్

(1) త్యం చిదత్రిమృతజురమర్థమశ్వం న యాతవే ।

కక్షీవన్తం యదీ పునా రథం న కృణుథో నవమ్ ॥ 1635

(2) త్యం చిదశ్వం న వాజినమరేణవో యమత్నత ।

దృళ్హం[1] గ్రన్థిం న వి ష్యతమత్రిం యవిష్ఠమా రజః ॥ 1636

(3) నరా దంసిష్ఠావత్రయే శుభ్రా సిషాసతం ధియః ।

అథా హి వాం దివో నరా పునః[2] స్తోమో న విశసే ॥ 1637

---

1. దృళహం, 2. పునస్తోమో. (వ్రా.ప్ర.)

(4) చితే తద్వాం సురాధసా రాతిః సుమతిరశ్వినా ।
ఆ యన్నః సదనే పృథౌ సమనే పర్షథో నరా ॥ 1638

(5) యువం భుజ్యుం[1] సముద్ర ఆ[2] రజసః పార ఈంఖితమ్ ।
యాతమచ్ఛా పతత్రిభిర్నాసత్యా సాతయే కృతమ్ ॥ 1639

(6) ఆ వాం సుమ్నైః శంయూ[3] ఇవ మంహిష్ఠా విశ్వవేదసా ।
సమస్మే భూషతం నరోత్సం న పిప్యుషీరిషః ॥ 1640



# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## దశమ మండలము

### అష్టమాష్టకము—అష్టమాధ్యాయము

### సూక్తము—146

ఋషి—సంఖ్యపుత్రుఁడు అత్రి*
దేవత—అశ్వులు*

(1)§తే॥గీ॥ బంధనమునుండి ముక్తమౌ బాడబంబు
త్వరితగతిఁ బోవునట్టులు దస్రులార!
యసుర కృద్రోగమున బాధ నందు నత్రి
నర్థవంతునిగాఁ జేయ నరుగుఁడీరు! ॥ 4879

---

1. భుజ్యుం, 2. సముద్ర౽ఆ రజసః పార౽ఈం, 3. శంయూ౽ఇవ. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అత్రి" గాను, దేవత "అశ్వులు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§తే॥గీ॥ శిల్పి శీర్ణ రథంబును శీఘ్రలు కలుగఁ
జేయునటు దీర్ఘతమసుని జిన్ని పుత్రు
మంద బుద్ధిని గలవాని మాన్య బుద్ధి
గలుగువానిగఁ జేసితి రెలమి మీరు ॥ 4880

(2)§తే॥గీ॥ అశ్వమును బోలి యత్రిని నసుర వరులు
బద్ధునిగఁ జేసి యుండ నా బంధనమును
గ్రంథి వలె విప్పి మీరలు కరుణ నట్టి
నత్రి విడిపించినా రీర లశ్వులార! ॥ 4881

(3)§తే॥గీ॥ దర్శనీయులు నేత లౌ దస్రులార!
యత్రి నగు నాకు బుద్ధుల నందనిండు!
నా కృతంబైన స్తోత్రము నరుల మిమ్ము
నన్నుతించుటకుం గడుఁ జాలుఁగాదె! ॥ 4882

(4)§ఆ॥వె॥ అశ్వులార! మీకు నస్మదీయ స్తుతి
జ్ఞానమునకు సుండు! సదనమందు
మాకు నవన మొనఁగి మా కృత పరిచర్య
తెలిసికొని రటంచుఁ దలఁతు మేము ॥ 4883

(5)§ఆ॥వె॥ ఉదధిమధ్యమందు నున్నట్టి భుజ్యుని
నొడ్డుఁ జేర్చినార లుడుపములను
నట్లు చేసి పిదప నతనిని [1]యువకుని
గను నొనర్చినారు కరుణ మీరు ॥ 4884

(6)§తే॥గీ॥ అఖిల ధనులార! నరులార! యశ్వులార!
రాజమాన సుఖాఢ్యతా రాజుల వలె
నిఖిల పూజ్యులరై మీరు! నిఖిల సౌఖ్య
సహితులై రండు! కడుఁగడు సంతసమున ॥ 4885

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
1. వృద్ధునకు యౌవనప్రాప్తి యోగము. (చూ. పీఠిక.)

§తే॥గీ॥ ధేను సంబంధమయి కడుఁ దీప్తి గాంచు
వత్స మెట్టులు పాలతో బ్రతుకు నట్లె
బహువిధ ధనంబులన్ మమ్ముఁ బరమలంకృ
తులనుగాఁ జేయుఁ డశ్వులః చెలఁగి మీరు ॥* 4886

## సూక్తము—146

ఋషి—సంఖ్యపుత్రుఁడు అత్రి
దేవత—అశ్వులు

### అర్థాంతరము—1

§(1) ఋతశక్తుల తేజమ్ముల నతులితమౌ దీప్తుల మై
జ్ఞాన సూర్య దివ్యకాంతి సార్థక మై సృష్టిలోన
నిత్యయానగతుల మెయిని సత్యరతులఁ బయనింపఁగఁ
గక్షివశ మ్మొచు నింగి నక్షమ్మున సంచరించు
రవి నిత్యమ్మును దిరుగును గ్రాలంగా దీధితు లవి
నవశక్తులతో వెలుఁగుచు వివిధకాంతి పుంజాలను
బ్రసరించెడి కృత్తిక గత రస కాంతుల దుష్టశక్తిఁ
దున్మాడుచుఁ గాల రథముతో నడచును దివ్యగతుల ॥ 4887

(2)§క॥ యమ నియమమ్ముల సూర్యుఁడు
సమయాఽన్వితమైన శక్తి సంచయరతులన్
అమరమ్మొ జ్ఞాన మహిత
విమలాఽరేణు తతి సర్వ విశ్వము నిండున్ ॥ 4888

§— గగన మ్మొక గ్రంథి కాఁగఁ గ్రాలంగాఁ గాంతుల మై
నసాధారణంపు రజము లఖిల ప్రకృతి నావహింప
దివ్యమైన దీప్తులతోఁ దేజరిలుచుఁ బ్రభాకరుఁడు
సర్వ జగచ్చక్షువుగా నకల జగత్ సాక్షి కాఁగ
నసాధారణంపుగతుల నాకసమునఁ బయనించుచు
నకృతమైన అనలమూర్తియై వెల్గును బ్రకృతిగాఁగ ॥ 4889

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(3) భూత భావి వర్తమాన పూర్ణకాలరతులమెయిని
శుభ్రమైన శక్తులతో శోభిల్లఁగ ధీగతు లవి
బ్రతుకుబాటలన్ వెలార్చి వరలుచుండు నీరమ్ములు
దైవీయమ్మౌ శక్తులఁ దనరారుచు విశ్వమ్మున
గగనమ్మున గోళాలను గ్రాలి తమోవిరహితమై
ఆవిరిగా నదృశ్యమై ఆకసమున నలరారుచుఁ
బునరావృత్తగతుల ననిలశక్తి నద్భుతముగ
నావిర్భవించు సలిల మంతర్గతి ననల మలర ॥ 4890

(4)§మహావృత్తము ॥*
అరాతిదివ్యశక్తులతోఁ బరాత్పరుని మహిమ లొప్ప
నిరాకృతమ్ము కాని మహా చరాచర ప్రకృతి నిత్య
జరాశి దూర మౌచు సదా పరాక్రమతమెయిని జిత్తు
మురారిదీప్తిగాఁగఁ దగన్ బురాఽవర సకల సుబుద్ధి
నరాన్న రూపమైన గతిన్ ధరాఽధరములను విరించి
వరాల దివ్య జన్మగతుల్ నిరాకృతుల నెఱుఁగకుండ
ధరాతలమ్ము నాకసమున్ విరాళగతుల నసలమ్ము
కరాళ మౌచు వాయురతిన్ భరాజరిత మగుచు వెల్గు ॥ 4891

§— ఇలాతలము రక్షణగా నెల్ల సృష్టి నీరు నిల్పు
జలగోళములందు మృత్తు లలరించును నిలువ జలము
అంతర్గతిఁ దనరారఁగ ననిలాఽనల శక్తితతులు
ప్రసరణంపు మహితగతుల ననమముగా విలసిల్లును ॥ 4892

(5)§అష్టపదకందము ॥
సత్యమ్మౌ శక్తులతో
నిత్యమ్మును నియతి నిల్పు నిండు జలధులన్
గత్యంతరగతుల గగన
కృత్యమ్ముగతిని నదృశ్య క్రీడల దైవాఽ
పత్యమ్ముగ మధురరతుల
స్తుత్యములై పులుకడిగిన శుభ్రిత వరలన్
ముత్యమ్ముల గతి బిందువు
లత్యమలమ్మై తగు జల మపురూపమ్మై ॥ 4893

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"అతిధృతి" ఛందము. (19) ప్రాసయతి వృత్తము. అష్టపది.

§(6) సకలమైన కర్మతతికిఁ జలనరహిత నేతకాఁగ
మహితమైన సుమనస్సుల విహితవిశ్వ వేదమ్ముగ
నలరు నా దేవదేవుఁ డఖిల పంచభూతాళుల
కాధార మ్మౌచు వెలిఁగి ఆధేయ మ్మౌచు నిలిచి
అద్వైతమ్మౌ గతులను నఖిలసృష్టి భూషణమై
పరిగ్రహించి పరిత్యజించుఁ బరాత్పరుని శక్తి వెలయ
సృష్టి స్థితి లయ గతులను జెన్నారును నంతర్గతి
దృశ్యాఽదృశ్యమైన మహిత దివ్యశక్తితత్త్వ మలర ॥ 4894

## సూక్తము—146

ఋషి—సంఖ్యపుత్రుఁడు అత్రి
దేవత—అశ్వులు

## అర్థాంతరము—2

§(1) అనలాఽనిల సలిల మృత్తు లాకాశపు శక్తులతో
నర్ధరూపమైన గతుల నలరును జిదూర్వ మ్మది
యాతాయాతంపుగతుల నశ్విశక్తు లలరారఁగఁ
బ్రకృతిరూపు లెల్ల సృష్టిఁ బ్రభవించును నిత్యమ్ము
నవగతులను జెన్నొందుచు జవశక్తుల నిలిచి ఉడుగుఁ
బునఃపునర్ జన్మగతులఁ బూర్ణకాలరథము నెక్కి
అఖిలమ్మును సంభవించు ననునిత్యము సంచరించు
నసాధారణంపుగతుల నాత్మైక్యము నొందు నిలచి ॥ 4895

§(2) జ్ఞానరూపమైన కాంతి సర్వప్రకృతి వరలుచుండు
నయత్నముగ నఖిలమ్మున నావరించి నిండి నిలుచు
నగ్ని రూపమైనశక్తి ఆదిత్యుని దీప్తులతో
నఖిలమ్మున నావరించి నలరుచుండు నిత్యమ్మును
బహిరంతర్గతులు మీఱ నహిశక్తుల వరలి వెలుఁగు
రజము లౌచుఁ గాంతితతులు అజశక్తుల వర్తిల్లఁగ
విశ్వసృష్టి వెలుఁగుచుండు విశిష్టమౌ శక్తులతో
గ్రంథిగ్రంథరూపమ్ములఁ గ్రాలు మహాదీప్తి రతుల ॥ 4896

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(3) త్రికాలాల బద్ధ మౌచుఁ దేజరిలుచు దివ్యశక్తి
నేతలుగా సృష్టిఁ బంచభూత పురుషశక్తు లలరఁ
బ్రకృతిరూపు దిద్దుకొనును బ్రభవ విభవ శక్తులతో
నహిరూపుల సర్వశక్తు లంతర్గతి వరలంగా
దివాలుగా సర్వమ్మును సవాలక్షరూపమ్ముల
వర్తిలంగ సంభవించు వర్తులగతి వరలంగాఁ
జక్రనేమి క్రమముగాఁగ సర్వస్వము విశ్వమ్ముగ
సృష్టి స్థితి లయ రతులను వ్యష్టి సమిష్టి గతుల వరలు ॥ 4897

§(4) దివ్యదీప్తకాంతిశక్తి తేజరిలఁగ మైత్రిగతుల
బుద్ధిబలము చిన్మయసంబద్ధమ్ముగ నానందము
ప్రకృతి పురుష ప్రాణశక్తి సుకృతముగా నంతర్గతి
వర్తిల్లును బహురూపుల ప్రకాశంపు ఉపప్రకాశ
మహాశక్తి అగ్ని లేని మహాగ్నిగాఁగ నావరించి
విశ్వసృష్టి మాయలుగా విశ్వేశుని లీలలుగా
నఖిలమ్మును విలసిల్లును నలరంగా భూతాళులు
సమగతులను సమైక్యమై అసమగతుల నంతర్గతి
నద్భుతమై అధికాధిక వ్యక్త భిన్న రూపమ్ముల
నఁరుచుండు సృష్టి యెల్ల నసాధారణంపు గతుల ॥ 4898

§(5) పార మెనసి తనరారెడి పాథోధుల జలమ్ములను
నద్భుతమౌ శక్తులతో నదృశ్యముగ గగనమ్మున
కాకర్షించెడి అరుణుని అమలకాంతి విశ్వమ్మున
భక్షించుచు ద్రవశక్తులఁ బరఁగ స్వచ్ఛమధురరతుల
మొయిళులలో నిల్పి సలిల మూర్తులుగా వర్షగతులఁ
ద్రికాలాల స్వచ్ఛరతుల దివ్యశక్తి వరలుచుండు ॥ 4899

§(6) విశ్వవేద తత్త్వజ్ఞత విశ్వదేవ విజ్ఞతమై
వరలుచుండు సృష్టిలోనఁ బ్రకృతిపురుష శక్తితతులు
అధికాధికరూపమ్ముల నఖిల పంచభూతతతులు
నంతర్గతిఁ బరఁగుచుండు నవినాభావత్వ మలర
నాకర్షణ వికర్షణల నఖిలాఖిల గోళ లోక
సర్వస్వము వరలుచుండు సత్యపరిధు లొప్పారఁగ ॥ 4900

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—147

ఋషిః—తార్క్ష్యః సుపర్ణః, యామాయన ఊర్ధ్వకృశనో వా
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ; 2-బృహతీ; 5-సతోబృహతీ; 6-విష్టారపంక్తిః

(1) అయం హి తే[1] అమర్త్య ఇన్దురత్యో న పత్యతే ।
దక్షో విశ్వాయుర్వేధసే ॥ 1641

(2) అయమస్మాసు కావ్య[2] ఋభుర్వజ్రో దాస్వతే ।
అయం బిభర్త్యూర్ధ్వకృశనం మదమృభుర్న కృత్వ్యం మదమ్ ॥ 1642

(3) ఘృషుః శ్యేనాయ కృత్వన[3] ఆసు స్వాసు వంసగః ।
అవ దీధేదహీశువః ॥ 1643

(4) యం సుపర్ణః పరావతః శ్యేనస్య పుత్ర[4] ఆభరత్ ।
శతచక్రం యో[5]ఽహ్యో వర్తనిః ॥ 1644

(5) యం తే శ్యేనశ్చారుమవృకం పదాభరదరుణం మానమన్ధసః ।
ఏనా వయో వి తార్యాయు[6]ర్జీవస ఏనా జాగార బన్ధుతా ॥ 1645

1. హి తేఽఅమర్త్యఽఇన్దు, 2. కావ్యఽఋభు, 3. కృత్వనఽఆసు, 4. పుత్రఽఆభరత్,
5. యోఽహ్యోవర్తనిః, 6. యుజర్జీవసఽఏనా. (వా.ప్ర.)

(6) ఏవా తదిన్ద్ర[1] ఇన్దునా దేవేషు చిద్ధారయాతే మహి త్యజః ।

క్రత్వా వయో వి తార్యాయుః సుక్రతో క్రత్వాయమస్మదా సుతః ॥ 1646

## సూక్తము—147

ఋషి—తార్క్ష్య పుత్రుఁడు సువర్ణుఁడు లేక
యామాయనుఁడైన ఊర్ధ్వకృశనుఁడు*
దేవత—ఇంద్రుఁడు*

(1)§చ॥ సురచిరవాసవుండః యల సోముఁడు నీకు నమర్త్య ధర్మముల్
విరివిగఁ గూర్చుచుం గడు వివేకముఁ బూనుచు దక్షుఁ డౌచు సత్
పరిజన సేవ్యమానుఁడయి భవ్యతరాఽశ్వము మాడ్కిఁ సంతతాఽఽ
దరమునఁ బోవుచుండెఁగదః తాను మహాన్నముతోడఁ గూడుచున్ ॥ 4901

(2)§తే॥గీ॥ మాకు ముఖ్యుఁడుగానున్న మఘవ పురుష
శత్రు వర్జకుఁ డగుచుండె శక్తి నాతఁ
డూర్ధ్వ కృశనుని బోషించె నొనర ఋభువు
మాడ్కిఁ గర్మలఁజేసెడు మనుజుఁ గాచు ॥ 4902

(3)§ఆ॥వె॥ ప్రజలయందు ముఖ్య వననీయగతి కల్గి
దీప్తుఁ డౌచు నింద్రదేవుఁ డెలమిఁ
గర్మకరసువర్ణ నిర్మల పుత్రుల
వెలుఁగఁజేయుఁగాక! వేడ్కఁ మీఱ ॥ 4903

(4)§ఆ॥వె॥ అతిధనంబుఁ గలిగి యహివర్తయిత్రమౌ
సోమమును సుతార్క్ష్యసూనుఁడౌ సు
పర్ణుఁ డంతరిక్షభాగమ్ము నుండి తాఁ
దెచ్చెఁగాదెః జగము మెచ్చునటుల ॥ 4904

1. త దిన్ద్రాఽఇన్దునా. (ప్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సువర్ణుఁడు, ఊర్ధ్వపకృసనుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయితః—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్ఠమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(5)§ఉ॥ చారుతరం బబాధకము చంచదమేయమహాన్నకారియౌ
భూరిగ సోమమున్ గగన పూర్ణతలంబుననుండి యింద్రుఁడా!
వీరుఁడు పక్షిరాట్టు కడు వేడ్కను దెచ్చెను దానిచేతనే
పేరును నన్నసంపదలు చెన్ను వహించెడు బంధురాజియున్ ॥* 4905

(6)§గద్యము ॥
ఈ విధముగ నా సోమముచే నింద్రుఁడు తృప్తి నొందుచు దేవతలయందు మాయందుఁ దేజస్సును ధరించుచున్నాఁడు. శోభనకర్మ గల యింద్రుఁడా! మా కృతకర్మచేఁ బ్రీతుఁడవైన నీచేత నాయుస్సును జీవనమును నొసఁగఁబడినవి. ఆ సోమము జ్ఞానము మూలమున మాచే నభిలషిత మయ్యెను ॥* 4906

## సూక్తము—147

ఋషి—తార్క్ష్య పుత్రుఁడు సుపర్ణుఁడు లేక
యామాయనుఁడైన ఊర్ధ్వకృశనుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

§(1) అమర్త్యమైన శక్తులతో నమృతతత్త్వ మలరారఁగ
నంతరిక్షమందుఁ దనరు నమలమైన చందమామ
దివ్యమైన దీప్తులతోఁ దేజరిల్లఁ దెలివెన్నెల
నింద్రత్వము వరలంగా నెల్ల ప్రకృతి పురుషులలో
నలరింతువు! ప్రాణశక్తి నద్భుతగతి నో శశికళ!
అసాధారణంపు రతుల నక్షయమౌ క్షయగతులను ॥ 4907

(2)§క॥ ఈ విశ్వపు సంసృష్టిని
వేవేలౌ ఋభు గణాల విస్తృత దీప్తుల్
దేవాళుల దివ్యగతులఁ
బావనముగ నగ్ని నింగిఁ బ్రభలన్ వెల్గున్ ॥ 4908

§క॥ అదవదమౌ మదశక్తి న
విదితముగ ముదిత సుదివ్య విశద మహాగ్నుల్
చిదచిత్తుల నద్భుతగతి
సదమలమై వెల్గు నిత్య చలనమ్ములమై ॥ 4909

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)§క॥ ప్రకృతిని నమృతపు శక్తుల
నకృతకమైన మహిత విభవాఽన్విత రతులన్
సుకృతులను హవన మగుచు న
వికల మగుఁ బ్రిభాకలిత సువిస్తృత శుచులన్ ॥ 4910

§(4) అతి పవిత్రదైవశక్తి కావిర్భవ మొంది పుత్రి
గతిగ నాత్మరతులఁ గ్రాలంగా సుపర్ణ సృష్టి
శతచక్రమ్ముల నింగిన్ సంచరించు మహాశక్తి
దివి భువులను నన్నింటిని దేజరిల్లుచుండు సదా! ॥ 4911

§(5) కాలమాన రీతులతోఁ గ్రాలంగా దినరాత్రులు
పాదకిరణకాంతిజాల మోదశక్తి విశ్వమ్మున
ననవరతము విరాజిలుచు నమృతగతి నిత్యమ్మును
దివ్యమైన ప్రభలు మీఱఁ దేజరిల్లుచుండు నరుణ
దేవుఁడసాధారణంపు దివ్యగతులు వరలంగాఁ
బ్రాకృతమౌ నత్యరూప బంధుత్వము పరఁగంగా
జీవగతుల సృష్టి నెల్లఁ జెల్వారఁగఁజేసి సదా!
సద్యజ్ఞముగాఁగ సృష్టి సర్వకర్మ నెఱపుచుండు
నిన శక్తులు విశ్వమ్మున ఘన దీప్తుల వర్తిల్లును
నమృతగతులఁ బురుషశక్తు లతివేలములై పరఁగును ॥ 4912

§(6) మృత్యుభావతత్త్వమ్ముల మృచ్ఛక్తులఁ దొలఁగించుచు
నైంద్రమైన శక్తులతో నమృతత్వము వరలంగా
నింద్రశక్తి సృష్టిలోనఁ బొందించును జిచ్ఛక్తిని
దేవాఽఽళుల దివ్యశక్తిఁ దేజరిల్లఁజేయు సతత
సంజననపు సంజీవపు సంశక్తుల సుతగతులను
విశ్వమ్మది పరఁగంగా విమలమ్మౌ సుకృతువుగ
సృష్టి జరుగు నిత్యమ్మును వ్యష్టిసమిష్టి గతులమైని
నఖిలప్రకృతి మాతగాఁగ నఖిలపురుషశక్తి పితగ
నావిర్భవ మొందుఁ జరాఽచర ప్రపంచ మెల్ల
సుతరూప మ్మౌచు జగతి శుచిశక్తులు వర్ధిల్లఁగ ॥ 4913

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—147

ఋషి—తార్క్ష్య పుత్రుఁడు సుపర్ణుఁడు లేక
యామాయనుఁడైన ఊర్ధ్వకృశనుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

§(1) సత్యశక్తి కారణానఁ జందమామ వెన్నెల లవి
చలువలమైఁ దెలివన్నెల లలరించును సృష్టిలోనఁ
గాలపరిధి బద్ధ మౌచుఁ గ్రాలు ప్రకృతిపైని సదా!
అమృతవృష్టి కురియఁజేయు నమేయమైన దివ్యశక్తి
ఆయుష్కారక మౌచును నారోగ్యసుభాగ్యదమై
ఆ మహా జీవ శక్తి కలరు సృష్టి కర్త గాఁగ
నమరుచుండు నిత్యమ్మును నసాధారణంపు గతులఁ
బతిసహితమ్మైన గతులఁ బతిగాఁగను సర్వమునకు ॥ 4914

§(2) ఋభుగణముల శుక్రశక్తి సృష్టిలోన వ్యాప్తి చెందు
వజ్రరూపశక్తి కాఁగ వర్ధిల్లుచు విజయమ్ముల
నసాధారణంపుఁ గాంతి ప్రసారాలు విశ్వమ్మునఁ
బ్రసరింపఁగ నిత్యమ్మును బ్రజ్వలిల్లుచుండు సదా!
ఊర్ధ్వగతుల నధోగతుల నుజ్జ్వలమౌ దీప్తులతో
నింద్రియాల చైతన్యము లిష్టాపూర్తములుగాఁగ
నానందపు టనుభవాల నఖిలమ్మును నోలలాడ
సృష్టిక్రియ వర్తిల్లును వ్యష్టిసమిష్టిగతులమైని ॥ 4915

§(3) అనిలశక్తి గత మ్మౌచు నఖిలసృష్టి సంచరించు
నాకర్షణ వికర్షణల హద్దు పద్దు లెనసి తిరిగి
అపూర్వ మౌచు నమేయ మౌచు నసాధారణంపు గతుల
ద్వైతాఽద్వైతమ్ముగాఁగఁ దనరంగా సర్వప్రకృతి
అవినాభావత్వ మెసయు ననిలాఽనల సలిల మృత్తు
లాకసముల రూపమ్ముల నలరుచుండు సకలసృష్టి
ఆదిశేషు మహారూప మోద సచ్చిదానందపు
దివ్యశక్తిఁ బురుషగతులఁ దేజరిల్లుఁ బ్రకృతిశక్తి ॥ 4916

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(4) ఆ సువర్ణశక్తులతో నఖిల సౌరకుటుంబాల
వివిధగోళలోకాళులు విరాజిలుచుఁ గాలరతుల
ననేకమైన చక్రగతుల నపూర్వముగఁ దిరుగుచుండి
ఆత్మప్రదక్షిణలను నధిపతిప్రదక్షిణలను
రాత్రింబవళుల రూపుల రాజిల్లుచు నిత్యమును
బితృపుత్రభాతిగాఁగఁ జిత్రవిచిత్ర శక్తులతో
సృష్టి స్థితి లయగతులను జెన్నొందుచు సర్వమ్మును
నలరారుచునుండు జగతి నమరలోక శక్తులమై ॥ 4917

§(5) సౌరకుటుంబమునఁ దనరు సకలగోళజాలా లవి
సూర్యాధారమ్ముగాఁగఁ జొప్పడంగ నాధేయత
నిత్యమైన జాగృతగతి సత్యబద్ధమౌచు సృష్టిఁ
గాలాత్మత వరలంగాఁ గ్రాలుచు బహిరంతరాల
మహిమాన్వితమైన శక్తి మానతత్త్వ మొప్ప నిలువఁ
దరణి దీప్తు లలరంగాఁ దమసాంధత వరలంగా
ధూమకేతు వృకమ్ముల దూరముగాఁ ద్రోసివైచి
వేధాసహితమ్ములౌచు బాధారహితమ్ములౌచు
నఖిల గోళలోకా లవి అమరు ఋక్షగ్రహతతులును
నలరారును నిత్యమ్మును నద్భుతమౌ భ్రమణగతుల ॥ 4918

§(6) ఆ మహావిష్ణుశక్తి అఖిలాఽఖిల సృష్టిలోన
దేవాళులలోనఁగూడ దివ్యమౌ రూపమ్ములఁ
జందమామ అమృతంపు నచ్చంద్రిక లలరంగా
మృద్రూపపు మృత్యుశక్తి రిక్తమ్ముగఁ దనరఁజేసి
గుణగణాల ధారణలను ననంతమైన పదార్థాలఁ
జిచ్ఛక్తుల సత్కర్మల సృష్టియెల్ల వర్తిల్లఁగ
రవిచంద్రుల యజ్ఞమ్ముల నవితథమౌ సత్యగతులఁ
బ్రకృతిపురుషశక్తులతో వరలంగా నిత్యక్రతువు
చరాఽచర ప్రపంచమ్ము సంభవించి స్థితిశక్తుల
రాగపూర్ణమై తనరుచు రాజిల్లుచు లయ మొందును ॥ 4919

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—148

ఋషిః—ఇన్ద్రాణీ
దేవతా—సపత్నీ బాధనమ్(ఉపనిషత్)
ఛందః—అనుష్టుప్; 6-పంక్తిః

(1) ఇమాం ఖనామ్యో[1]షధిం వీరుధం బలవత్తమామ్ ।
యయా సపత్నీం బాధతే యయా సంవిన్దతే పతిమ్ ॥ 1647

(2) ఉత్తానపర్ణే సుభగే దేవజూతే సహస్వతి ।
సపత్నీం మే పరా ధమ పతిం మే కేవలం కురు ॥ 1648

(3) ఉత్తరాహముత్తర[2] ఉత్తరేదుత్తరాభ్యః ।
అథా సపత్నీ యా మమాఽధరా సాధరాభ్యః ॥ 1649

(4) నహ్యస్యా నామ గృభ్ణామి నో[3] అస్మిన్ రమతే జనే ।
పరామేవ పరావతం సపత్నీం గమయామసి ॥ 1650

(5) అహమస్మి సహమానా ఽథ త్వమసి సాసహిః ।
ఉభే సహస్వతీ భూత్వీ సపత్నీం మే సహావహై ॥ 1651

---

1. ఖనామ్యోషధిం, 2. ముత్తరఽఉత్తరే, 3.నోఽఅస్మిన్. (పా.వ.)

(6) ఉప తేఽధాం సహమానామభి త్వాధాం సహీయసా ।

మామను ప్ర తే మనో వత్సం గౌరివ ధావతు పథా వారివ ధావతు ॥ 1652

## సూక్తము—148

ఋషి—ఇంద్రాణి*

దేవత—సపత్ని*

(1)§తే॥గీ॥ ఎట్టి లత చేతఁ బతి బాధపెట్టు వధువు
సవతి బాధించునట్టి యసరన లతను
సహజ కార్యంబుఁ జేయంగఁజాలు దాని
ఖంబు మీఱంగ నున్మీలనంబుఁ జేతు ॥ 4920

(2)§తే॥గీ॥ ఊర్ధ్వముఖ పర్ణములు గల్గి యున్న యట్టి
యఖిల సౌభాగ్య హేతువై యమరునట్టి
యభిభవనవతియై యున్న యట్టి పాఠ
సవతిఁ బొలఁగించి కూర్చుసు ధవుని నాకు ॥ 4921

(3)§తే॥గీ॥ నీ ప్రసాదంబుచేఁ బాఠ! నేను యువతు
లందు నుత్కృష్టతరనయి యుందుఁగాక!
వెండి నాదు సపత్నియు విశ్వమందు
నధరయగుఁగాక! లోకంబునందు మిగుల ॥ 4922

(4)§తే॥గీ॥ సవతి పేరును దలఁప నా సవతి సంఘ
మందు నెవతెయుఁ గ్రీడింప నరుగఁబోవ
దిఁక సపత్నిని భర్తతో నెట్టులైన
వేరుగాఁ జేయఁగల్గెడు వారముకద! ॥ 4923

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ఇంద్రాణి" గాను, దేవత "శత్రునాశనము" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(5)§తే॥గీ॥ నీవు నేనును సవతిని నిశ్చలముగ
నభిభవించుచునున్నార మతిశయముగ
నట్టు లౌట మహౌషధీ! యెట్టులైన
సవతిని దిరస్కరింతుము సత్య మిదియ ॥* 4924

(6)§గద్యము ॥
ఓ పతీ! సపత్నిని నభిజనించు నోషధిని శిరసు నీ కుపధానముగఁ జేయుచున్నాను. అభిభవిత్రి యగు నీ యుపధానముచే నిన్నంతటను ధరించుచున్నాను. భర్తవగు నీ మనస్సును గోవు వత్సమును జేరునట్లు, వారి నిమ్న మార్గమును జేరునట్లు, శీఘ్రముగ నన్నుఁ బొందుఁగాక ॥* 4925

## సూక్తము—148
ఋషి—ఇంద్రాణి
దేవత—సపత్ని

### అర్థాంతరము—1

(1)§ఆ॥వె॥ అతిబలీయమైన అద్భుతౌషధశక్తి
అమృతతత్త్వ మలర నణఁచి సర్వ
దుష్టరోగతతి విశిష్టమౌ గుణముల
నాశపరచుఁ బ్రకృతి నవముగాఁగ ॥ 4926

§ఆ॥వె॥ సౌరమండలాల సంచరించు వివిధ
గోళతతులు మహిత గూఢశక్తి
వేధ నొందు నిలుచు బాధ నొందుఁ దిరుగు
వక్రగతిని రవిజ సక్రమగతి ॥ 4927

§(2) ఉపరగతుల నద్భుతముగ నుజ్జ్వలముగ వెల్గుచుండి
దైవీయమ్మౌ శక్తులఁ దనరారఁగ ఖగోళమ్ము
సంశుభమౌ కాంతితతిని సర్వమ్మును విరాజిలఁగఁ
బతిపత్నుల గతులు మీఱ బహుళములౌ గోళమ్ములు
ర వ్యాధారమ్ముగాఁగఁ గ్రాలుచు నాధేయములై
ప్రకృతిపురుష శక్తులతో వరలు కేవలత్వ మొప్ప ॥ 4928

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)§ఆ॥వె॥ అగ్ని నౌదు నేను నఖిలాన శ్రేష్ఠమై
ఉత్తమముల సుత్తమోత్తమమయి
గ్రిహములందు నుందుఁ గ్రాలు నుపగ్రిహ
తతుల నుందుఁ బత్నిధర్మ మెనసి ॥ 4929

(4)§ఆ॥వె॥ దివ్యమైన శక్తి తేజరిల్లుచు వెల్గి
ప్రాణిజాలమందు నంచరించుఁ
బంచభూతములను బాదపాల శిలల
నంతరంగగతుల నగ్ని నిలుచు ॥ 4930

§ఆ॥వె॥ పత్ని సహితుఁ డౌచుఁ బతి చరించు గతిని
గూఢ శక్తు లలర గోళ లోక
తతుల నెల్ల వేళఁ దరణి తనదు వెంటఁ
దిరుగ నడుపుఁ గాల దివ్య గతుల ॥ 4931

(5)§తే॥గీ॥ ద్వంద్వశక్తులఁ బ్రికృతులు వరలుచుండ
వివిధ వైరుధ్య తత్త్వాలు విస్తరిలఁగ
నన్నిటిని రూపుమాపుచు నద్భుతముగ
ద్వైత మద్వైతగతులను దనర నగ్ని ॥ 4932

§క॥ అర్ధాంగిగఁ బ్రికృతిగతుల
సార్థకమై పంచభూత సకలము తనరున్
వ్యర్థరహితమౌ మహిత ప
దార్థచయ మలరు సృష్టి నపురూపగతిన్ ॥ 4933

§(6) అన్యోన్యమ్మౌ మైత్రిని నవినాభావత్వ మలర
నాకసమ్ము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును నలరారును జిత్తును నచిత్తును జగతి
సత్తు ననత్తును దగ సంతోషము నిస్సంతోషము
వరలంగా సకల గోళభరిత మౌచు విశ్వసృష్టి
ద్వైవీయమ్మౌ శక్తులఁ దనరుచుండు నిత్యగతుల ॥ 4934

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

§— వైష్ణవీయ మనశ్శక్తి వరలంగా దివ్యగతుల
సర్వమ్మును నధిగమించు సకల సృష్టికతీతమై
నఖిల లోక గోళమ్ములు నలర నావురూడలట్లు
నంచరించు వెంటనంటి సమయబద్ధ మౌచు వరలి ॥ 4935

## సూక్తము—148

ఋషి—ఇంద్రాణి
దేవత—సపత్ని

### అర్థాంతరము—2

(1)§ఆ॥వె॥ దివ్యమైన చాంద్ర తేజౌషధిని మహా
మహిత రీతిఁ బ్రకృతి విహితగతుల
ననుభవించుఁ బత్ని మనసైక్యమై దేహ
మద్వయమ్ముగాఁగ నలరు రీతి ॥ 4936

§ఆ॥వె॥ వివిధ ప్రకృతులందు వెలయఁ బురుషశక్తి
ద్వంద్వగతుల వేధ బాధలందు
అద్వయమ్ముగాఁగ నన్నింట నలరారు
పతి సపత్ని గతుల నతులితముగ ॥ 4937

(2)§అష్టపదకందము ॥
ఉత్తానమ్మౌ గతిని వి
యత్తలము వరలు విశిష్ట "హన్వతి"యుక్తం
బుత్తమమౌ శక్తులతోఁ
జిత్తై సత్తై విశిష్ట సృష్టి వరలఁగన్
సత్తైమ్మౌ దేవజ మగు
హృత్తు మహత్త్వమ్ము వరఁగ నెల్ల భువనముల్
మృత్తుల ననిలాఽనల జల
వృత్తి సపత్నులుగ గోళ[1]లోకము లలరున్ ॥ 4938

(3)§క॥ ఉత్తమమౌ శక్తుల స
త్యుత్తమ గతులను మహోన్నతోన్నతపదమై
ఉత్తరదిశ కుత్తరమై
చిత్తుల సత్తుల సపత్ని సృష్టి చరించున్ ॥ 4939

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ఇక్కడ "ఋ-లో"లకు యతి మైత్రి.

(4)§తే॥గీ॥ విశ్వసృష్టికి సత్యత వెలయకుండ
లయ విశిష్టశక్తులు సర్వలక్ష్య మౌచు
నాత్మగతులను లోఁగుచు నంతరాఽంత
రములఁ బత్నిసహితగాఁగఁ గ్రాలు జగతి॥ 4940

(5)§క॥ నేనే ప్రకృతిగ సృష్టిని
నేనే పురుషుండ నౌచు నిర్ణీత గతిన్
నేనున్ నీ వన ద్వైతగ
భాను సపత్నిగ జగమ్ము వరలు బహుళమై॥ 4941

(6)§క॥ "అభి"శక్తుల దుష్టత్వము
నభయగతి నధఃకరించి అపురూప మ్మౌ
నభముగ నొక దైవీయపుఁ
బ్రిభాకలిత దివ్యహృత్తు వరలు మహితమై॥ 4942

## సూక్తమ్—149

ఋషి—ఐరమ్మదో దేవమునిః
దేవతా—అరణ్యానీ
ఛందః—అనుష్టుప్

(1) అర॑ణ్యాన్యర॑ణ్యాన్యసౌ యా ప్రే॑వ నశ్య॑సి।
కథా గ్రామం న పృ॑చ్ఛసి న త్వా భీరి॑వ [1]విన్దతీ౩ఁ॥ 1653

(2) వృషారవాయ వద॑తే యదుపావ॑తి చిచ్చికః।
ఆఘాటిభిరి॑వ ధావయ॑న్నరణ్యానిర్మ॑హీయతే॥ 1654

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. విన్దతీఁ. (ప్రా.ప్ర.)

(3) ఉత గావ[1] ఇవాదన్త్యుత వేశ్మేవ దృశ్యతే ।
ఉతో[2] అరణ్యానిః సాయం శకటీరివ సర్జతి ॥ 1655

(4) గామంగైష[3] ఆ హ్వయతి దార్వంగైషో[4] అపావధీత్ ।
వసన్నరణ్యాన్యాం సాయమక్రుక్షదితి మన్యతే ॥ 1656

(5) న వా[5] అరణ్యానిర్హన్త్యన్యశ్చేన్నాభిగచ్ఛతి ।
స్వాదోః ఫలస్య జగ్ధ్వాయ యథాకామం ని పద్యతే ॥ 1657

(6) ఆంజనగన్ధిం సురభిం బహ్వన్నామకృషీవలామ్
ప్రాహం మృగాణాం మాతరమరణ్యానిమశంసిషమ్ ॥ 1658

## సూక్తము—149

ఋషి—ఇరమ్మదపుత్రుఁడు దేవముని*
దేవత—అరణ్యములు (అరణ్యదేవత)*

(1)§తే॥గీ॥ అటవిఁ బాలించు నో యరణ్యాధిదేవి!
నిర్జనం బగు దేశాన నిలిచె దీవు!
గ్రామమున నేలయుండవు! కలుగ దెట్టి
భయము నీ కెంతయేనియు భవ్యచరిత! ॥ 4943

1. గావఽఇవాద, 2. ఉతోఽఅరణ్యానిః, 3. గైషఽఆ, 4. గైషోఽఅపావ, 5. నవాఽఅరణ్యానిః. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "దేవముని"గాను, దేవత "అరణ్యాని"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(2)§గద్యము ॥
చీచీ శబ్దమును జేయు ఝిల్లి యను సూక్ష్మజంతువిశేషమునకుఁ జీచీ శబ్దమును జేయు నవ్యజంతు
వెపుడు పాలయిత యగునో! కాండవీణలచే [1]నిషాదాది సప్తస్వరములను శోధించుచుండు
గాయకుని వలె నరణ్యతతి పూజింపఁబడుచున్నది ॥ 4944

(3)§ఉ॥ ఈ యడవిం దినుంగద! యమేయ తృణాదికమున్ మృగంబు లా
స్థాయి లతాదికంబు కడుఁ జారు గృహంబును బోలి చూడనౌ
స్నా యమునందుఁ గండ్లవయి చక్కని కక్షము లుంచుచుండి తా
మా యటవిం ద్యజించుచు రయంబునఁ దెత్తురు మానవోత్తముల్ ॥ 4945

(4)§తే॥గీ॥ ఓ యరణ్యాని! ప్రీతి నీ వున్న యడవి
యందు నొక్కఁడు గోవును నమరఁ బిలుచు
నన్యుఁ డొక్కఁడు కాష్ఠము లాదియైన
యట్టివానిని గొట్టుచు నమరుచుండు ॥ 4946

§తే॥గీ॥ నిశి నరణ్యంబునందున నిలిచి మనుజుఁ
డఖిల మృగపక్షి శబ్దంబు నాలకించి
యద్ది భీతిని గలిగించునట్టి శబ్ద
మనుచుఁ దెలియఁగనున్న వాఁ డాదరమున ॥ 4947

(5)§తే॥గీ॥ ఆ యరణ్యాని మనుజుని నచట నిలుచు
వానిఁ జంపదు [2]వ్యాఘ్రాదివర్గ మెపుడు
వాని ముట్టదు వాఁ డామ్రఫలము దినుచు
స్వేచ్ఛగా నట వర్తించు శ్రీలు కలుగ ॥ 4948

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

1. వీణచే నిషాదాది సప్తస్వరములు—వేదమున వీణ మొదలగు సంగీతసాధనములు వాడుకలోనున్నట్లును, నార్యులకు నిషాదాది సప్తస్వరములు దెలిసియున్నట్లును, భరతశాస్త్ర విషయములు వేదకాలముననే ప్రసిద్ధమైనట్లును, నూహింపఁదగును.
2. వ్యాఘ్రాదివర్గము—వ్యాఘ్ర మను జంతువు సప్తసింధుదేశమున లేదనియు దక్షిణదేశస్థ జంతు వనియుఁ గావున నది వేదమున వర్ణితము కాదనియుఁ బాశ్చాత్యపండితు లనాలోచితముగ వ్రాసిరి. కాని వ్యాఘ్ర శబ్ద మిచట నుండుటచే వారి వ్రాతలు నిరాధారము లనవచ్చును. ఇది సామాన్యదృష్టి విశేషము. సాయణాచార్య భాష్యానుసారము.

(6)§సీ॥ కస్తూరికా[1]గంధకలితమౌ నటవిని దగినయట్టులు నేను బొగడుచుంటి
సౌరభ్యయుత మౌచు సరసమౌ నటవిని దగినయట్టులు నేను బొగడుచుంటి
రుచిర ఫలాదుల రూఢి కెక్కినదానిఁ దగినయట్టులు నేను బొగడుచుంటిఁ
గడు కృషీవలులతోఁ గ్రాలెడు నటవిని దగినయట్టులు నేను బొగడుచుంటి
తే॥గీ॥ మృగములకు నిత్యమాతయై మెప్పుగాంచు, జీవసంతతి కే వేళ శ్రీల నొసఁగు
నా యరణ్యాని యిట్టి యమేయ నుతుల, సన్నుతించినవాఁడను జాల భక్తి ॥* 4949

## సూక్తము—149

ఋషి—ఇరమ్మదపుత్రుఁడు దేవముని
దేవత—అరణ్యములు(అరణ్యదేవత)

### అర్థాంతరము--1

(1)§తే॥గీ॥ శాంతి శక్తుల వనములు కాంతి రూప
పంచ భూతాల నలరారు నంచితముగ
సంఘ శక్తుల ధైర్యాన సకల సృష్టి
భయ విరహితమ్మునఁ బ్రకృతి వరలుచుండు ॥ 4950

§(2) శాంతిశక్తులు వరల సర్వప్రకృతిలోనఁ
బరిశుద్ధమౌ వీర్యప్రాభవము విలసిల్లఁ
బూజ్యమౌ రూపముగఁ బూర్ణత్వ మలరార
ధర్షణ రూపమౌ ఘర్షణలు లేకుండ
హర్ష పులకాంకురా లఖిలాన వరలంగ
వనసంచయాలలోఁ బరఁగులేః శోభలు ॥ 4951

§(3) దేవదేవు దివ్యశక్తిఁ దేజరిల్ల నిత్యమ్మును
సృష్టిలోనె గోళా లవి చెల్వొందును గృహాలై
సమర మెరుఁగనట్టి శాంతి శక్తి శకట రూపాలుగ
సంచరించు గగనమ్మున సానందపు గతులు మీఱ ॥ 4952

§(4) లోకములును శాంతిశక్తి లోలుపతల నంగమ్మై
ప్రాణిపెట్టనట్టి అగ్ని ప్రజ్వలిల్లి ప్రభలు మీఱుఁ
బ్రకృతి పదార్థాది సృష్టిఁ గ్రాలంగాఁ గాష్ఠములై
బహుళాగ్నులు ప్రజ్వలిలును భగవంతుని శక్తిగాఁగ
దివరాత్రులు వెల్గొందుచు దివ్యాఽరుణ కాంతులతో
నానందపు టోలలలో నఖిల సృష్టి వర్తిలంగ ॥ 4953

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
1.కస్తూరి- కస్తూరిమొదలైన సువాసనద్రవ్యముల నార్యు లెఱుంగుదు రనుటకు నిది నిదర్శనము. అప్పటి యరణ్యములు లోకమున కెంత యుపయోగకరములై యుండెనోః గమని పఁదగిన విషయము.

§(5) రణరహితపు రాజ్యముగా రాజిల్లఁగ విశ్వసృష్టి
విషరూపపు టగ్నులతో విజృంభించు "నఖి"శక్తులు
ధ్వంస మౌను రూపుమాయఁ బ్రగతిశాంతి శక్తులమై
నసాధారణంపు గతుల నఖిలమ్మును నలరారఁగ ॥ 4954

§ఆ॥వె॥ శుభఫలమ్ము లొప్ప సృష్టి స్థితి గతుల
సభయ మైన శాంతి ననుభవించు
నభ్యుదయము మీఱ నఖిల సంపద లొప్పఁ
బ్రకృతిమాత దివ్య సుకృతి యగును ॥ 4955

§(6) శాంతిమాత శక్తు లెల్ల సౌభాగ్యమ్ముల నొసఁగుచు
సదూర్జవములై వరలెడి సలిలానిలమృత్తతులను
ననలమ్ముల నాకసముల నలరారును సత్ఫలాల
సుమధురాల సుగంధాల శుద్ధత్వము లలరంగాఁ
బ్రకృతిమాత సంపదలుగ భవ్యభోగ భాగ్యాలై
అఖిలమ్మును దనరారును నఖిలేశుని లీలకాఁగ ॥ 4956

## సూక్తము—149

ఋషి—ఇరమ్మదపుత్రుఁడు దేవముని
దేవత—అరణ్యములు (అరణ్యదేవత)

## అర్థాంతరము—2

§(1) అఖిలములో శబ్దగతుల నలరు నిశ్శబ్దరతుల
స-రి-గ-మ-ప-ద-ని-స స్వర సంగ్రామమ్ములు సృష్టిని
నాకసమున ననిలాలను ననలాలను సలిలాలను
మృత్తతులను నలరారఁగ మించి శాంతిశక్తులతో
నభయమ్ముగ నయాచితముగ నభ్యుదయావహముగాఁగ
నలరారును బ్రకృతియెల్ల నభివందనార్హమ్మై ॥ 4957

§(2) ధర్మ బద్ధ మౌచు సృష్టిఁ దనర శాస్త్రనియతగతుల
వీణావాదన వోలెను విలసిల్లును సంగీతము
గ్రామ సముచ్చయాల నింగిఁ గరువలి నగ్నిని జలమున
మట్టిని నిత్యమ్మును మర్మగతుల ధ్వనియించుచుఁ
బ్రతిధ్వనుల విలసిల్లుచుఁ బ్రతిఫలింప నభ్యుదయము
మహితమైన శాంతిగీతి సుహితమ్ముగఁ బ్రకృతికొసఁగు ॥ 4958

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(3)ఆ॥వె॥ ప్రకృతిపురుషు లలరు బహుళ గృహాలుగా
విశ్వ గోళ లోక వితతి వరఁగ
సర్వ శుభద మౌచు నుర్వి జలాఽనల
పవన గగనము లవి వరలు సృష్టి ॥ 4959

ఆ॥వె॥ కాల కర్మ లొప్ప వేల లెనసి సృష్టి
నినుము రాగి వెండి హేమతతుల
నెల్ల గోళములును నెనయఁగాఁ బ్రకృతులన్
సంచరించు నిత్య చలన గతుల ॥ 4960

(4)క॥ అంగమ్మై మహితమ్ముగ
సంగీతము ప్రకృతి కీశు శక్తులు ప్రభలన్
అంగములై తగ లోహ త
రంగాలుగ ద్రవ వితతి విరాజిలు సృష్టిన్ ॥ 4961

తే॥గీ॥ శాంతిశక్తుల సృష్టిని సకల ప్రకృతిఁ
బంచ భూతాల మిళితమై సంచితముగ
సర్వవిధ శబ్ద శక్తులు సంగమించి
గానరూపాలఁ దగుఁ గాలమాన రతుల ॥ 4962

(5)ఆ॥వె॥ దివ్యమైన శాంతి భవ్యశక్తి యెపుడు
నవ్యయగతిఁ దనర "నభి"జ మైన
క్రూర విష మహాగ్ని నీఱు చేయును సదా!
శుభద క్రియల సకల సృష్టి వరల ॥ 4963

తే॥గీ॥ ప్రకృతి పురుషుల సంకల్ప సుకృత కామ్య
సిద్ధు లౌచును సృష్టిని జెలఁగు సర్వ
ఫలము లౌచు మహా విభవగతు లలర
స్వాదు రూప మౌచును విశ్వశాంతి పరఁగు ॥ 4964

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

(6)ఆ॥వె॥ కర్మమాయ కాఁగఁ గ్రాలుచుఁ బ్రకృతిలో
బహుళ గతులఁ దనరు సుహిత రతుల
మధుర సురభిళాల మహిత శక్తి వరలఁ
బ్రకృతి భేద మొాచు సుకృతి గతుల ॥ 4965

ఆ॥వె॥ సృష్టిలోని పురుష చిద్విలాసవుఁ గర్మఁ
బ్రకృతిలో సమృద్ధ ఫలము లలరు
సృష్టి నైజ మనఁగ వ్యష్టి సమిష్టుల
సృష్ట క్రియగ వెలుఁగు సర్వ గతుల ॥ 4966

## సూక్తమ్—150

ఋషిః—సువేదాః శైరీషిః
దేవతా—ఇన్ద్రః
ఛందః—జగతీ; 5-త్రిష్టుప్

(1) శ్రత్తే దధామి ప్రథమాయ మన్యవే ఽహన్యద్వృత్రం నర్యం వివేరపః ।
ఉభే యత్త్వా భవతో రోదసీ[1] అను రేజతే శుష్మాత్ పృథివీ చిదద్రివః ॥ 1659

(2) త్వం మాయాభిరనవద్య మాయినం శ్రవస్యతా మనసా వృత్రమర్దయః ।
త్వామిన్నరో వృణతే గవిష్టిషు త్వాం విశ్వాసు హవ్యాస్విష్టిషు ॥ 1660

(3) ఐషు చాకన్ధి పురుహూత సూరిషు వృధాసో యే మఘవన్నానశుర్మఘమ్ ।
అర్చన్తి తోకే తనయే పరిష్టిషు మేధసాతా వాజినమహ్రయే ధనే ॥ 1661

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. రోదసీఽఅను. (ప్రా.ప్ర.)

(4) స[1] ఇన్ను రాయః సుభృతస్య చాకనన్మదం యో[2] అస్య రంహ్యం చికేతతి।

త్వావృధో మఘవన్ దాశ్వధ్వరో మక్షూ స వాజం భరతే ధనా నృభిః॥ 1662

(5) త్వం శర్ధాయ మహినా గృణాన[3] ఉరు కృధి మఘవంఛగ్ధి రాయః।

త్వం నో మిత్రో వరుణో న మాయీ పిత్వో న దస్మ దయసే విభక్తా॥ 1663

## సూక్తము—150

ఋషి—శిరీషపుత్రుఁడు సువేదస్సు*

దేవత—ఇంద్రుఁడు*

(1)§తే॥గీ॥ ఎట్టి తేజస్సుతో వృత్రుఁ బట్టితివహా!
యెట్టి తేజస్సుతో వారి నిలకుఁ దెచ్చి
పెట్టినాఁడవో! యింద్రుఁడా! పెద్ద వగుచు
నట్టి తేజస్సు మిక్కిలి యాదరింతు॥ 4967

(2)§క॥ అనవద్య! యింద్ర! మాయా
విని వృత్రుని వంచనముల వేయి విధములన్
గనుఁగొని కీర్తిని గోరుచు
నెన రుంచక దునిమినావు! నిశ్చయ మిదియే!॥ 4968

§క॥ సునరాంగిరసులు నిన్నే
ఫణిహృత గోవిషయమందుఁ బరమ ప్రీతిన్
ఘన యాగకర్మమందునె
కనుఁగొని వరియించుచుంద్రుకాదె! మహేంద్రా!॥ 4969

---

1. సఽఇన్ను, 2. యోఽఅస్య, 3. గృణానఽఉరు. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సువేదస్సు" గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)§సీ॥ తద్వర్ధమానులై ధనము గోరెడు వేళ వినుతించుచుందురు వేల్పుఱేఁడ!
పరమయజ్ఞమునందు బలము గల్గి నిన్ను వినుతించుచుందురు వేల్పుఱేఁడ!
పుత్రాదికంబును బొందువేళల నిన్ను వినుతించుచుందురు వేల్పుఱేఁడ!
అఖిల ఫలంబులు నాశించువేళ నిన్ వినుతించుచుందురు వేల్పుఱేఁడ!
తే॥గీ॥ ధనము లోనగు వానిని దాము కోరు, నట్టివేళలఁ బ్రీతి నుత్యాదికముల
నిన్నె పూజించుచుందురు నిఖిల మనుజు,లట్టి ఘనులందఱఁ బూజల నందు మీవు! ॥* 4970

(4)§చ॥ సురుచిరమైన యన్నమును జూడఁగఁగోరెడువాఁడె స్తోతయౌ
సురపతి! సోమజన్య మగు శోభ నెఱింగినవాఁడు సూక్తులన్
పరమ ధనాఢ్య! నీవలన వర్ధితుఁడైన జనుండు నిత్యమున్
విరివిగ భృత్యులన్ ధనము వేగమె పొందుచునుండుఁ గృష్ణతోన్ ॥* 4971

(5)§తే॥గీ॥ స్తూయమానుండవై! యింద్ర! సురచిర మగు
బలము విస్తీర్ణముగఁజేసి వెలుఁగుమయ్య!
యోయి! మఘవ! ధనంబులఁ బాయకుండ
నీవు మాకు నొసంగుమా! నిశ్చలమతి ॥* 4972

§తే॥గీ॥ దర్శనీయేంద్రుఁడా! కడు ధనము దాల్చు
వాఁడ! మిత్రుని మఱియును వరుణుఁ బోలి
సత్ప్రతిజ్ఞాన్వితుండవై! చాల మాకు
నన్నమును నిచ్చుచున్నాఁడ వాదరమున ॥* 4973

## సూక్తము—150

ఋషి—శిరీషపుత్రుఁడు సువేదస్సు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

(1)§ఆ॥వె॥ మన్యు శక్తి మీఱ మహితమౌ దీప్తులన్
వృత్ర రూపమైన విషమ శక్తి
నభిభవించి వంచి అసమాన గతులమై
నాశపరచును-హరి "నాభి" నిలువ ॥ 4974

§రచయిత:—వాఙ్మయ మహార్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§— రోదోఽంతరాళాన రూఢశక్తులు వరలఁ
జిద్రూప గతులమై నద్రిగా స్థిర మౌచుఁ
బృథ్వ్యాది గోళాలఁ బూర్ణ వీర్యమ్ముతో
నిహ పరా లన్నింట నెసఁగంగ గోళాలు
బలయుక్తమై సదా భ్రమణగతులను వరల
వైష్ణవీయపు శక్తి భరియించు ధరియించు ॥

§(2) అభేద్యమై అమేయ మై అజయ్యమై అక్షయ మై
అక్షరమౌ మనశ్శక్తి అపురూపపు వైష్ణవీయ
మాయలతో వృత్రాసుర మర్మపూర్ణ ధర్మరహిత
దుర్మదాంధ దుర్మార్గగ దుశ్శక్తులఁ దున్మాడుచు
“నభి” శక్తుల నాశపరచి “నాభి”శక్తిఁ గాపాడుచు
విశ్వ గోళ లోకాలను విమలాఽష్ట వసుసంపద
నాకసముల ననిలమ్ముల ననలమ్ముల సలిలమ్ముల
మృత్తతులను గాపాడును మించెడి సౌభాగ్యతతుల ॥

§ఆ॥వె॥ వివిధ గోళ తతులు వెలయంగ హద్దులు
సంచరించుచుండు సమయ మెనసి
సౌరమండలమ్ము మీఱ గ్రామ గతుల
నిత్య యానములను సత్య రతుల ॥

§(3) ఆవిర్భవ మందఁగానె అఖిల గోళ లోకాలవి
అర్చించుచుఁ దిరుగుచుండు నాత్మప్రదక్షిణల
నధిపతిప్రదక్షిణల ననంతయానగతుల నడచి
ధ్వని ప్రతిధ్వనులుకాఁగఁ దనరఁ గర్మకర్మఫలాలు
నంతరాంతరముల నిలువ నఖిల పంచభూతాలును
నవినాభావత్వమ్మున నన్యోఽన్యత లలరంగా
బాహిరమౌ రూపమ్ములఁ బ్రకాశించు రీతిగాఁగ
విద్యుత్తై సలిలమ్మై వినువీథిగ ననిలమ్మై
అవనీతల మౌచు నిలిచి అభ్యుదయావహముకాఁగ
ననంతవిశ్వ మలరారును ఆ అనంతుని లీలకాఁగ ॥

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”

§(4) ఆకసమ్ము యజ్ఞముగా ననిలమ్మును యజ్ఞముగా
నసలమ్మను యజ్ఞముగా వనమును యజ్ఞమ్ముగాఁగఁ
బృథివి యజ్ఞమ్ముగాఁగ నెల్ల సృష్టి సంభవింపఁ
బంచభూత సంచయాలఁ బంకృతు లెల్లఁ బరఁగుచుండుఁ
బ్రాకృతమౌ సిరిసంపద లాకృతమై వర్ధిల్లఁగ
పసరులఁగా వరలుచుండు వైష్ణవీయమైన మాయ
నాదిశేషరూపమైన అహి దీప్తుల మహితశక్తి
విశ్వవ్యాపితమై తగు బహుళగతుల వీర్యమ్ముగ ॥ 4979

§(5) ఆకాశము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
మహీసృష్టి సర్వగతుల మఘవశక్తి వర్తిల్లును
విమలమ్మౌ పాకృతగతి వివిధ సంపదాళి వెలయఁ
బ్రాణరూప శక్తులతోఁ దాణదీప్త రక్తులతో
సఖిల ప్రకృతి వర్ధిల్లఁగ ననంతరూప! దేవదేవ!
సృష్టి స్థితు లొప్పారఁగఁ జెన్నొందఁగఁజేయు దీప! ॥ 4980

## సూక్తము—150

ఋషి—శిరీషపుత్రుఁడు సువేదస్సు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము— 2

§(1) అమేయమై అభేద్యమై అజయ్యమౌ మన్యు శక్తి
హృద్దీప్తులు వెల్గొందఁగ వృత్రాసురు సంహరించి
అభిరూప విషానలాల నపహృతమౌ జల"నాభి"ని
నావిష్కృత మొనరించుచు నఖిలసృష్టి శాంతిగతులఁ
బ్రాణతతులఁ దాణమహితమై వర్ధిలఁజేయును హరి
సౌరచాంద్రగతులతోడ సర్వమ్మును సంచరింప
నారోదస్యంతమ్ముగ నఖిలము చిన్మయమ్ముగాఁగ
ద్వైతాఽద్వైతగతులఁ దనరంగా నిహపరాలు ॥ 4981

§(2) అనూహ్యమౌ మాయలతో నమేయమౌ శక్తులతో
హృచ్ఛక్తులు వర్తిలంగ వృత్రాసురు వధియించుచు
"నాభి"చక్ర సర్వస్వము నభోరథముతో నిల్పుచు

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

యథాస్థితిగ యథావిధిగ నఖిలమైన సృష్టిష్టులు
వర్తిల్లఁగ వివిధ గోళ ప్రతతిలోన హవిషాళిగఁ
బ్రకృతిసంపదాళి దేవః ప్రివర్తిల్లఁజేయు దీవుః ॥§

§(3) వైష్ణవీయ శక్తులతో వరలు పురుహూత శక్తి
కాలచక్రగతులతోడఁ గ్రాలంగా రవుల నిల్పి
దివి భువులను గాంతులతోఁ దేజరిల్లఁజేయుచుండు
బహు ముఖాల సంపదాళి వర్ధిల్లఁజేయు సృష్టి
అనిలాఽనల సలిల మృత్తు లాకసములు దేవదేవు
పుత్రలుగా వర్తిలుచుఁ బొనరు సౌఖ్యదమ్ము లొచు ॥

§(4) అత్యంతము వేగముగా నఖిల గోళ లోకాలవి
సంచరింప రోదసిలో సర్వేశుని లీలలుగా
నింగిగతులఁ బవనగతుల నీలిగతుల నీరగతుల
మృద్గతులను నధ్వరమై చిద్గతులను వర్ధిల్లఁగ
విశ్వసృష్టి జరుగుచుండు వెలుఁగ నాధిపత్యరతుల
నష్టవసు సుసంపదాళి నాదిత్యులు వెలయింపఁగ
సంతోష మ్మఖిలగతుల సంభృతముగఁ దనరారఁగ
సౌరమండలాలతోడ సర్వమ్మున్ భరియించును హరి ॥

§(5) ఆకసమ్ము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
మృత్తతులును మహత్త్వాన మించి ప్రకృతి సంపదాళి
ఆకర్షణ వికర్షణల నన్యోఽన్యము నంతర్గతి
నలర విశ్వసర్వస్వము నావిష్కృతిఁ జేయు దీవెః
అంతర్లీనమ్ముగాఁగ నతిలోకగతిని నారగింతుః
సకలమ్ము సమిష్టిగాఁగ సంవిభక్తమై తనరఁగ
ద్వైతమ్ముగఁ ద్వైతమ్ముగ నద్వైతమ్ముగ సృష్టియె
అనేకగతుల వర్తిల్లఁగ నలరించెద వీవెః హరిః
అణుపరమాణుల గతులను నధికాధిక గరీయాల
ననుక్షణము సంభవించి అంతరింప వివిధగతులఁ
బలు విధాల కాలగతులు వర్తిల్లఁగ జగతు లెల్లఁ
బరిభ్రమించుచుండు సదాః పరాఽపర ప్రభావాల ॥

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—151

ఋషిః—పృథుర్వైన్యః
దేవతా—ఇన్ద్రః
ఛందః—అనుష్టుప్

(1) సుష్వాణాస[1] ఇన్ద్ర స్తుమసి త్వా ససవాంసశ్చ తువినృమ్ణ వాజమ్ ।
ఆ నో భర సువితం యస్య చాకన్ త్మనా తనా సనుయామ త్వోతాః ॥ 1664

(2) ఋష్వస్త్వమిన్ద్ర శూర జాతో దాసీర్విశః సూర్యేణ సహ్యాః ।
గుహా హితం గుహ్యం [2]గూళ్హమప్సు బిభృమసి ప్రస్రవణే న సోమమ్ ॥ 1665

(3) అర్యో వా గిరో[3] అభ్యర్చ విద్వానృషీణాం విప్రః సుమతిం చకానః ।
తే స్యామ యే రణయన్త సోమైరేనోత తుభ్యం రథోళ్హ[4] భక్షైః ॥ 1666

(4) ఇమా బ్రహ్మేన్ద్ర తుభ్యం శంసి దా నృభ్యో నృణాం శూర శవః ।
తేభిర్భవ సక్రతుర్యేషు చాకన్నుత త్రాయస్వ గృణత[5] ఉత స్తీన్ ॥ 1667

(5) శ్రుధీ హవమిన్ద్ర శూర పృథ్యా[6] ఉత స్తవసే వేన్యస్యార్కైః ।
ఆ యస్తే యోనిం ఘృతవన్తమస్వారూర్మిర్న నిమ్నైర్ద్రవయన్త వక్వాః ॥ 1668

1. సఽఇన్ద్ర, 2. గూళహమత్సు, 3. గిరోఽఅభ్యర్చ, 4. రథోళహ, 5. గృణతఽఉత,
6. పృథ్యాఽఉత. (వ్రా.వ్ర).

## సూక్తము—151

ఋషి—వేనపుత్రుఁడు పృథువు*
దేవత—ఇంద్రుఁడు*

(1)§తే॥గీ॥ సోమమునుగూర్చు మే మెల్ల స్తుతులవలన
నిన్ను వినుతించుచున్నాము నిఖిల ధనుఁడ!
యన్నమును మేము కోరుచు నమరుచుంటఁ
బ్రాప్యధనమును మా కిమ్ము! ప్రభవమున ॥ 4986

§తే॥గీ॥ నీవు రక్షితవైన మే మోః వదాన్య!
యన్యుల యపేక్ష లేకుండ నధిక ధనము
నీ ప్రసాదంబువల్లనే నిశ్చయముగఁ
బొందఁగల్గెడువారము భూతి మెఱయ ॥ 4987

(2)§ఆ॥వె॥ జాతమాత్ర మీవు! శౌర్యవంతా! దుష్ట
దాన జనుల నెల్లఁ ద్రిచ్చినావు!
గుహ్యుఁడైన నరుని గూఢుఁడౌ కుత్సుని
ద్రచ్చ సోమరసము దాల్తు మేము ॥ 4988

(3)§తే॥గీ॥ నీవు మేధావి వగుదువు! నీవు సుమతిఁ
గోరువాఁడవు! సర్వము మీరు వాఁడ
వగుచు నింద్రుఁడ! సామిగ నమరుచుండు
నీవు పూజింపుమా! స్తుతిని గరములను ॥ 4989

§తే॥గీ॥ నిన్ను సోమములను బూని యెన్నుచుంటి
నరదమును నెక్కువాఁడ! యో యఖిల పూజ్య!
వరభరణి యంబులం జేతఁబట్టి నీకు
స్తోత్రములఁ జేయుచున్నాము చూడు మీవు! ॥ 4990

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "పృథువు, వైన్యుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(4)§తే॥గీ॥ ఇంద్రుడా! నీ నిమిత్త మే మెల్ల స్తోత్ర
ములు కడుం జెప్పుచుందుము మోద మలర
శూరుడ! నరుల మధ్యను జేరి నీవు!
వారి కిమ్ము! బలంబును వలసినంత ॥* 4991

§ఆ॥వె॥ మరియు జనముతో సమాన కర్ముండవై
జనుల హవ్య మెలమిఁ గనుచు నుంటి
వింద్ర! స్తోతృవరుల నెల్ల స్తోతృవ్రాత
ములకు రక్ష నిడుము! మోద మలర ॥* 4992

(5)§తే॥గీ॥ ఉదకరాజితమౌ భవద్యోని నెవఁడు
వేయి విధముల సంప్రీతి వినుతిఁజేయు
నట్టి పృథువు మహాఽఽహ్వాన మాలకింపు
మధిక మగు నుతుల్ పడయుదు వార్య! యింద్ర! ॥* 4993

§తే॥గీ॥ నిమ్నముగ వెలయుచునున్న నిఖిల మార్గ
ములను నుదకంబు ద్రవియింపఁగలుగునట్లు
స్తోత లెల్ల మహేంద్రుడా! స్తుతులతోడ
నిన్నె పొందుచునున్నారు నేరిమి మెయి ॥* 4994

## సూక్తము—151

ఋషి—వేనపుత్రుఁడు పృథువు

దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—1

§(1) హే! దేవదేవా! యీ విశ్వ విశ్వాల
సర్వమ్ము పరిభవింప సాగించెదవు! సృష్టిఁ
బంచభూతావళులు వరలంగ హవిషమై
పరిగ్రహింతు వీవె! నిరత ప్రాకృతగతిని
సోమామృతశక్తుల శోభితమై యౌవనమ్ము
ప్రకృతుల దివ్యముగఁ బ్రకాశింపఁజేయు దీవె! ॥ 4995

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(2) ఐంద్రమైన శక్తులతో నఖిల సౌరమండలాలు
సంరక్షిత మౌచుఁ దిరుగు సదా। విశ్వేశు మాయ
అతిగుహ్యమ్మౌ శక్తుల నపురూపపు దీప్తులతో
సోమాఽమృత స్రావమ్మును శుభదమ్ముగఁ బ్రసరించుచు
వీర శూర ధీరతల విశ్వసృష్టి ప్రకృతి వరలు
మహిమాన్విత దివ్యశక్తి మహిత సచ్చిదానందాల ॥ 4996

§(3) అర్యముఁడౌ నాదిత్యా! అభ్యర్చింతురు వాక్కుల
సుమతులైన దేవాశుల శూరుల ఋషులన్ జ్ఞానుల
బుధులుగాఁగఁ బరిగ్రహించి పూర్వాఽపర కల్పాలను
ప్రాజ్ఞులైన తత్త్వజ్ఞులు నమరమైన స్తుతులు మీఱఁ
గాలరథము సంచరింపఁ గ్రాలెడి సోమాఽమృతమ్ము
స్రవియింపఁగ సకలమ్మున నవితథమౌ శక్తి నిచ్చు
నాయుర్దాయమ్ము నొసఁగు నఖిలమ్మౌ ప్రకృతులకును
నరుణుని కే ఆజ్యమ్మై అమితమ్ముగ జ్వలింపఁ జేయు ॥ 4997

§(4) సృజనరూప బ్రహ్మశక్తి। స్థితిశక్తుల నైంద్రశక్తి।
శుభదాయకమౌ మహా సూర్యాధిప। చంద్రాధిప।
గగనాధిప। అనిలాధిప। క్రాలెడు ననలాధిప।
సలిలాధిప। పృథ్వ్యధిప। సర్వశూర తత్త్వాలను
సృష్టియజ్ఞక్రతువులతో వ్యష్టిసమిష్టిగతుల మెయిని
ప్రభవింపఁగఁ జేసి ప్రకృతిఁ బరిరక్షించెద రీరలు
క్రమగతులను దనరారెడి కాలగతులఁ బరిభ్రమింప
వైష్ణవీయ స్థితిశక్తులు వర్తిల్లఁగ నిరతమ్మును ॥ 4998

§(5) అనిలానలసలిల మృత్తు లాకసంపు యోనియౌచు
గగనాఽనల జల మృత్తులు కరువలియే యోని యౌచు
నింగి నిప్పు గాలి నేలలకు నీరమ్మే యోనియౌచు
నింగి నిప్పు గాలి నీరములకు నేలయె యోని యౌచు
ధరణధారణంపు రతుల భరణభారణంపు గతుల
ఘనశక్తుల ద్రవశక్తులఁ గ్రాలు నర్కమండలాల
నిమ్నోన్నతగతులు వరల నిత్యచలనరతులు వరఁగ
నవ్యముగా భవ్యముగా హవ్యముగా సృష్టి వరలు ॥ 4999

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—151

ఋషి—వేనపుత్రుఁడు పృథువు

దేవత—ఇందుర్ఁడు

## అర్థాంతరము—2

§(1) విష్ణురూప దివ్యశక్తి విశ్వమ్మున వ్యాపించుచు
స్థితిశక్తుల సర్వమ్మును ఋతగతులను ధరియించును
బ్రకృతిరూపశక్తులతోఁ బ్రభవింపఁగఁజేసి వివిధ
ఫలాదుల నాహారముగఁ బ్రాణితతికిఁ బ్రసాదించి
ప్రాణపోషణమ్ము చేసి తాప్రాణశక్తి సమకూర్చుచుఁ
బ్రాణదాతగాఁగ నిలిచి ప్రాణత్రాతగాఁగ వెలిఁగి
నాత్మైక్య మ్మొచుఁ బ్రకృతి నసాధారణంపు గతుల
విశ్వరూప మొంది నిలుచు వివిధమాయ లీల లలర ॥ 5000

§(2) సౌరశక్తులొప్పారఁగ సలిలమ్ముల నావిరిగాఁ
బరిగ్రహించి పరిశుద్ధత జలదములుగఁజేసి నిలిపి
అతిమధురమ్మె తనరెడి హర్షాంకిత వర్షమ్ముల
గురియించుచు మహాశక్తి గూఢగతుల వరలంగాఁ
జల సేచన మంది ప్రకృతి విలసిల్లఁగఁ బ్రాణతతులఁ
జంద్రభరిత రవికాంతులు చలువల వెన్నెలలుగాఁగ
సోమాఽమృతవృష్టి నిచ్చి సృష్టి నెల్ల నవయౌవన
శక్తులతో దీప్తులతో రక్తి నొందఁజేయు సతము ॥ 5001

§(3) విద్వాంసుల ఋషీశ్వరుల విప్ర సుమతి సంఘమ్ముల
అమరమైన వాక్కులతో నభ్యర్చింతురు సదా! విష్ణుఁ
బ్రకృతిరూప శబ్దమ్ముల ప్రాభవాల సృష్టిలోన
బహుముఖాల ఫలితమ్ములు విహితములై నిత్యగతులఁ
గర్మమ్ములు కర్మఫలాల్ క్రాలంగా సత్యరతుల
సర్వ గోళ లోకాలును సంచరించు సృష్టిలోనఁ
గాల చక్ర గమనమ్ములు వేల లెనయ బహుగతులను
సకల సౌరమండలాల సంరక్షించును శ్రీహరి ॥ 5002

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(4) బ్రహ్మేంద్రులుకూడ నిన్నుఁ బరమపదాన్వితునిగా
రాజులకే రాజుకాఁగఁ గ్రాలంగా దివ్యగతుల
దేవతలకె దేవుఁడుగాఁ దిరుగులేని ఈరుఁడుగాఁ
బలు నుతులను వర్ణింతురు పరంధామ! మహావిష్ణు!
నీవల్లనె సర్వసృష్టి నిరతమ్మును సంభవించు
నీవల్లనె నిఖిల జగతి నిరత స్థితిగతుల వరలు
నీలోనే సర్వప్రకృతి ఆలోల విలోలగతుల
నంతర్గతి నమరుచుండు నంతర్హిత మౌచునుండు
నుత్తమమౌ కర్మమ్ముల నిత్తెములౌ సచ్చిత్తుల
నానందమయమ్ముగాఁగ నఖిలజగతిఁ గాపాడుచు
సృష్టిరూప సత్‌క్రతువుల సృజనాత్మక శక్తులతో
నెరపుచుండి ప్రకృతిగతుల నిత్యసత్య క్రియలుగాఁగ
నసాధారణంపు గతుల నభ్యుదయావహముగాఁగ
నవ్యయమౌ వ్యయరతులను నఖిలమ్మును సంచరించు ॥ 5003

§(5) దివ్యమైన దీప్తులమైఁ దేజరిల్లు నర్కులతో
వేనరూప మహాశక్తి విశ్వ మెల్ల వర్తిల్లుచు
దివిభువులును మహితములౌ పవన వరుణ లోకాదులు
గగనమ్ములు సంచరించు దిగంతాల పర్యంతము
సచ్చిత్తుల గగన మ్మొక సదమలానందమ్ముగ
దైవలీలగాఁగ నిలువఁ దనరంగా సర్వ సృష్టి
హవిషమ్మై ప్రాకృతగతి నమృతరతి వర్తిల్లఁగ
మహావిష్ణుయోనిగాఁగ మహిమాన్విత శక్తులతో
సకల సృష్టి వర్తిల్లఁగ శశ్వద్రూపమ్ము లౌచు
నాకసమ్ము లనిలమ్ములు ననలమ్ములు సలిలమ్ములు
క్షమతతులును గెరటాలుగ సచ్చిన్మయమ్ము లౌచు
నుద్భవించి నిల్చి తరలు నుపర్యధోగతులుగాఁగ
సంచరించు నంతరించు సత్య నిత్య కర్మలుగా
నసాధారణంపు గతుల ననంత సృష్టి యజ్ఞమ్ముగ ॥ 5004

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—152

ఋషిః—అర్చన్ హైరణ్యస్తూపః
దేవతా—సవితా
ఛందః—త్రిష్టుప్

(1) సవితా యన్త్రైః పృథివీమరమ్ణాదస్కమ్భనే సవితా ద్యామదృంహత్ ।
అశ్వమివాధుక్షద్ధునిమన్తరిక్షమతూర్తే బద్ధం సవితా సముద్రమ్ ॥ 1669

(2) యత్రా సముద్రః స్కభితో వ్యౌనదపాం నపాత్ సవితా తస్య వేద ।
అతో భూరత[1] ఆ ఉత్థితం రజో ఽతో ద్యావాపృథివీ[2] అప్రథేతామ్ ॥ 1670

(3) పశ్చేదమన్యదభవద్యజత్రమమర్త్యస్య భువనస్య భూనా ।
సువర్ణో[3] అంగ సవితుర్గరుత్మాన్ పూర్వో జాతః స[4] ఉ అస్యాను ధర్మ ॥ 1671

(4) గావ[5] ఇవ గ్రామం యూయుధిరివాశ్వాన్ వాశ్రేవ వత్సం సుమనా దుహానా ।
పతిరివ జాయామభి నో న్యేతు ధర్తా దివః సవితా విశ్వవారః ॥ 1672

(5) హిరణ్యస్తూపః సవితర్యథా త్వా ఽఽఙ్గిరసో జుహ్వే వాజే[6] అస్మిన్ ।
ఏవా త్వార్చన్నవసే వన్దమానః సోమస్యేవాంశుం ప్రతి జాగరాహమ్ ॥ 1673

---

1. భూరతఽఆఽఉత్థితం, 2. పృథివీఽఅప్రథేతామ్, 3. సువర్ణోఽఅంగ, 4. సఽఉఽఅస్యాను,
5. గావఽఇవ, 6. వాజేఽఅస్మిన్. (వా.ప.)

## సూక్తము—152

ఋషి—హిరణ్యస్తూపపుత్రుఁడు అర్చ*
దేవత—సవిత*

(1)§తే॥గీ॥ వృష్టి దానాదులన్ సవితృండు పృథ్వి
స్థాపనముఁ జేయుచున్నాఁడు సవిత దివము
క్రిందఁ బడకుండునట్టు లానంద మొప్ప
దృఢముగాఁజేసియుండె సుదీక్షఁ బూని॥ 5005

§తే॥గీ॥ అశ్వరాజము చందాన నధికతరము
"కం"యిత యయిన యంతరిక్షంబునందు
వాయురూప మహాపాశ వర్గములను
జలము నొసఁగుచునున్నాఁడు సవిత మిగుల॥ 5006

(2)§తే॥గీ॥ అంబుదం బేడ స్తంభితం బౌచు వాయు
పాశములచేత దృఢముగా బంధిత మగు
వైద్యుతాగ్ని మహావిభూ! పరమ సవిత
యట్టి సుస్థలి నెరుఁగుచు నమరుచుండు॥ 5007

(3)§ఆ॥వె॥ మరణ రహితమైన మహిత స్వర్గంబును
నందుఁ బుట్టినట్టి యమల మైన
యట్టి సోమమునకు హంసుఁడే యష్టవ్యుఁ
డయ్యె నమరగణమునందుఁ జాల॥ 5008

§తే॥గీ॥ తగిన పతనము గల్గిన తార్క్ష్యుఁ డనెడు
వాఁడు సవితకుఁ బూర్వుఁడై పరఁగుచుంట
వలన గరుడుండు సవితుని పరమ ధర్మ
ధారణముఁ బట్టి వర్తించు ధీరుఁ డగుచు॥ 5009

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అర్చ"గాను, దేవత "సవిత"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(4)§సీ॥ దివ్యాటవిఁ జరించు ధేనువుల్ గ్రామంబు శీఘ్రముగాఁ బోయి చేరు మాడ్కి-
యుద్ధార్థి యైనట్టి యోధుఁడు సత్వర మశ్వంబులను బొంద నరుగు రీతి
సంబారవముఁ జేయు నావు వత్సంబును బొందుటకై వేగఁ బోవు కరణి
భర్త స్వకీయయౌ భార్యను గలియంగ సరస మానసముతోఁ జనెడు భంగి
తే॥గీ॥ దివము ధరియించువాఁడయి తేజరిల్లువాఁడునై మెలంగుచునుంటఁ బరమ భక్త
సంఘ వరణీయుఁడైనట్టి సవిత మిగుల,నంద మైనట్లు మమ్ములఁ బొందుఁగాక! ॥* 5010

(5)§గద్యము ॥
ఓ సవిత![1] అంగిరఃపుత్రుఁడ నగు నాయొక్క తండ్రి యీ యస్నము నిమిత్తమై యెట్లు పిలచెనో! యట్లు లర్చనామకుండ నగు నేను రక్షణార్థమై నిన్నాహ్వానించుచున్నాను. యజమానులు సోమయాగ పర్యంతము సోమలతనుగూర్చి ప్రబుద్ధులై యుండునట్లు నీ పరిచర్య విషయమై జాగ్రత్తపడుచున్నాము ॥* 5011

## సూక్తము—152

ఋషి—హిరణ్యస్తూప పుత్రుఁడు అర్చ

దేవత—సవిత

### అర్థాంతరము—1

§(1) ఆకర్షణ యంత్రాలను నద్భుతముగ సవిత సృష్టిఁ
బృథ్వ్యాదులఁబట్టి నిలిపి విశిష్టముగ నడుపుచుండు
నిరాధార స్థితిగతులను బరాధీనతలు పరలఁగ
నంతరిక్షమునఁ బరఁగును నసాధారణంపు గతులఁ
గాంతిదీప్తి శక్తు లెల్లఁ గ్రాలంగా బహుముఖాల
నబద్ధమయ్యు బద్ధగతుల నపూర్వముగ పరలు జగతి ॥ 5012

§(2) ఆకాశపు జలశక్తుల నసాధారణంపు గతుల
నడుగంటని రూపముతో నంబోనిధు లలరారఁగ
నంతరిక్ష విజ్ఞానపు టద్భుత మౌ శక్తులతో
దివి భువి లోకా లన్నియుఁ దేజరిల్లు నిత్యమ్మును ॥ 5013

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పల్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
1. ఓ సవిత:=ఓ ప్రేరకుఁడా:

§(3) మర్త్యశక్తి రహితమైన మహిమాన్విత భువనమునకు
నతిలోకపు శక్తులతో నతివేలపు దీప్తులతో
సవితృమూర్తి అందముగా జ్వలియించెడి సువర్ణుండు
గరుత్మంతుఁ డమేయముగఁ గ్రాలంగాఁ బూర్వజముగ
వైష్ణవీయ స్థితిశక్తుల భాగ్యగరిమ విలసిల్లఁగ
వ్యష్టిసమిష్టి రూపమ్ముల సృష్టిధర్మ మలరంగా
నంతరమంతరములుగా సఖిల జగతి తనరారును
నానుపూర్వ్య వర్ధతులను నావిర్భవ మొంది వరలు ॥ 5014

(4)§ఆ॥వె॥ గోవు వత్స మట్టు లీ విశాలాఽనేక
సృష్టి గోశతతులు సూర్యు నెనసి
సంచరించుచుండు సౌరమండల గతులఁ
బ్రకృతి వర్ధనముల భావ్య మొౕచు ॥ 5015

§ఆ॥వె॥ విశ్వ గోశతతులు విమల సూర్య గతుల
సంచరించు రీతి స్వచ్ఛ ధర్మ
పత్ని నడచుకొనును బతిని ననుసరించి
అతిపవిత్ర హృదయ యజ్ఞ రతుల ॥ 5016

§(5) అద్భుతమౌ నగ్ని తేజ మలరంగా నిత్యమ్మును
సవితృదేవు దివ్యశక్తి సర్వశబ్ద మొౕచు నిలిచి
హైరణ్యస్తూప మలర నసాధారణంపు రతుల
సోమాఽమృత శక్తిరీతి శుచ్యంతర్గతులమెయిని
నిత్యనవమ్మైన మహిత సత్యదీప్తు లొప్పారఁగ
సౌరరూపమైన కాంతి సర్వస్వము నఖిలమ్మున
వర్తిల్లఁగ నైగనిగ్య ప్రభాభాగ్య మహితమ్మై
అనునిత్యముఁ దనరారును నసాధారణంపు గతుల ॥ 5017

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్మమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—152

ఋషి—హిరణ్యస్తూప పుత్రుఁడు అర్చ

దేవత—సవిత

### అర్థాంతరము—2

§(1) సవితశక్తి యంత్రిలుగ సర్వగోళవితతి తిరుగు
సవితశక్తి గోళ లోక సర్వస్వము నిలుచు నింగిఁ
గాంతి దీప్తు లలరారఁగఁ గ్రిలంగా దివ్యశక్తి
అంతరిక్షమందు నలర సద్భుతమౌ మహాశక్తి
మూర్తమ్మై తనరారెడి మున్నీరుల రూపమ్ములు
ప్రకృతిదివ్య శక్తులుగా వరలు సకల జగాలలో
జలస్థావరమ్ము లౌచు జలద మూలకమ్ము లౌచు
నాదిత్యుని యమలశక్తి నమృతత్వము నొంది నిలుచు ॥ 5018

§(2) సవితశక్తి సంబోధుల జలగతులవి చద లంటుచు
నాకసమున నమల జలము లలరంగా సత్యగతుల
నావిష్కృతమై ప్రకృతికి నద్భుతమౌ ప్రాణదమై
ప్రాణశక్తి సమకూర్చుచు ధరణి దివుల నన్నింటను
విస్తృతమౌ రూపమ్ముల విశాలమైన శక్తులతో
వర్తిల్లఁగఁ బృథ్వీరూప భావాలవి తనరారును
నఖిల చరాఽచరము లలర నసాధారణంపు గతులఁ
బాంచభౌతికంపు జగతు లంచితముగ వరలు సృష్టి ॥ 5019

§(3) అమేయమైన దైవశక్తు లలరంగా నద్భుతగతి
ద్వైవిధ్యమ్మౌ శక్తుల పరస్పర సంయోగపు
సంధానమ్ముల విశ్వము సర్వస్వము రూపొందును
నమర్త్యమైన భువనా లవి అసాధారణంపు గతుల
నమృతమౌ శక్తులతో నపురూపములై వెలయఁగ
వైష్ణవీయ దివ్యశక్తి వరలఁ బూర్వాంగమ్ముగాఁగ
సువర్ణాంగమైన దివ్య శుభ్ర గరుత్మంతుఁ డలర
నజయ్యమైన మహారూప మద్భుతముగ నలరుచుండు ॥ 5020

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(4) ఊర్ధ్వలోకతతులుగాఁగ నొనర నధోలోకాలుగ
నారోహణాఽవరోహణ లలరంగా సప్త స్వర
సంగ్రామము సృష్టిలోన సదా! వర్తిల్లుచుండుఁ
బ్రకృతిమాత సంగీతపు భావ దివ్యగీతమ్ముగ
నమలమైన హృచ్ఛక్తియె అమరంగా వత్సమ్ముగఁ
బతి పత్నిని బవిత్రముగ ధరియించెడి భాతిగానె
సవిత ధర్మ శక్తులతో శబ్ద శక్తు లలరారఁగ
సకల సృష్టి ధరియించును సమవర్తత పరఁగంగా ॥ 5021

§ఆ॥వె॥ సకల ప్రకృతిరూప సర్వస్వ జీవమై
తనరును సుమనస్సు ధన్య గతుల
మనసు లేకసృష్టి మలినమౌ మసి యౌసు
శాంతి దాంతి లేక కాంతి లేక ॥ 5022

§(5) సవితాగ్నులు సృష్టి స్వచ్ఛమ్మై సత్యగతుల
వరల హిరణ్యస్తూప భాగ్యము సుస్థిర మ్మౌచు
వాజి శక్తు లొప్పారఁగ భ్రాజమాన మౌచు నింగి
చంద్రామృత దీప్తులతో సౌందర్యమైన నవశక్తుల
జాగృత గతు లొప్పారఁగఁ జైతన్యపు రతులు మీఱ
నర్చనీయ మౌచు సృష్టి నఖిల వందమాన మౌచు
నావిష్కృత మౌను బ్రకృతి అసాధారణంపు గతులఁ
బంచభూత రూపాలుగ నంచిత మై అఖిల మలర ॥ 5023

§ఆ॥వె॥ సవిత దీప్తు లలర సర్వాఽగ్నులై సృష్టి
నిత్య శుద్ధ మౌచు నిఖిల గతుల
నమరు నింగిలోన హైరణ్యమౌ స్తూప
మద్భుతముగ నిరత మనల గతుల ॥ 5024

§— చంద్రాఽమృత దీప్తులుగా సర్వార్చ మ్మౌచు వరలి
జాగృత మౌ శక్తి నిచ్చు సవిత దివ్యశక్తి నిరత
మమర్త్యనీయ మౌచు సృష్టి నభివందనీయ మౌను
నాయుష్కారక మౌచును నఖిలమ్మున వర్తిల్లుచు ॥ 5025

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—153

ఋషిః—మృళీకో వాసిష్ఠః

దేవతా—అగ్నిః

ఛందః—బృహతీ; 4-5-ఉపరిష్టాజ్జ్యోతిః; 4-జగతీ వా

(1) సమిద్ధశ్చిత్ సమిధ్యసే దేవేభ్యో హవ్యవాహన ।
ఆదిత్యై రుద్రైర్వసుభిర్న[1] ఆ గహి మృళీకాయ న[2] ఆ గహి ॥ 1674

(2) ఇమం యజ్ఞమిదం వచో జుజుషాణ[3] ఉపాగహి ।
మర్తాసస్త్వా సమిధాన హవామహే మృళీకాయ హవామహే ॥ 1675

(3) త్వాము జాతవేదసం విశ్వవారం గృణే ధియా ।
అగ్నే దేవాగం[4] ఆ వహ నః ప్రియవ్రతాన్ మృళీకాయ ప్రియవ్రతాన్ ॥ 1676

(4) అగ్నిర్దేవో దేవానామభవత్ పురోహితో ఽగ్నిం మనుష్యా ఋషయః సమీధిరే ।
అగ్నిం మహో ధనసాతావహం హువే మృళీకం ధనసాతయే ॥ 1677

(5) అగ్నిరత్రిం భరద్వాజం గవిష్ఠిరం ప్రావన్నః కణ్వం త్రసదస్యుమాహవే ।
అగ్నిం వసిష్ఠో హవతే పురోహితో మృళీకాయ పురోహితః ॥ 1678

---

1. సుభిర్నఽఆ గహి, 2. నఽఆ గహి, 3. జుజుషాణఽఉపాగహి, 4. దేవాగంఽఆ వహ. (ప్రా.వ్రు.)

## సూక్తము—153

ఋషి—వాసిష్ఠపుత్రుఁడు మృళీకుఁడు*
దేవత—అగ్ని*

(1)§తే॥గీ॥ హవ్యవాహ సమిద్ధుండ వైన నీవు
కడు సురేష్టికి నెనఁగింపఁబడుదు; సురల
గణములం గూడుకొని మమ్ముఁ గాన వచ్చి
యీ మృళీకునకున్ సుఖ మిమ్ము; ప్రీతి॥ 5026

(2)§తే॥గీ॥ అనల; అస్మత్కృతంబులౌ యజ్ఞ నుతుల
నాలకించుటకున్ రమ్ము; లీల నిన్నుఁ
బిలిచెదములే; మృళీకుని లలిత సుఖము
కొఱకుఁ బిలుచుచునున్నాము కోర్కెలూర॥ 5027

(3)§తే॥గీ॥ విశ్వవరణీయుఁడవు; జాతవేదిత వగు
నిన్ను నుతియించుచున్నాను నిర్మల మతి
మాకు సౌఖ్యము కలిగింప మాన్య సురలఁ
బిలుచుకొనిరమ్ము; పావకా; పెద్ద వగుచు॥ 5028

(4)§తే॥గీ॥ బహు గుణంబులఁ గల్గిన పావకుండు
సురలకుఁ బురోహితుం డౌట సూరు లతని
వెలుఁగఁజేయుదు రిఁక నేను విత్తమునకు
వేఁడఁ బిలిచెద ననుఁ బొందుఁగాక నతఁడు॥ 5029

(5)§తే॥గీ॥ అల భరద్వాజుఁ డసువాని సత్రి మునిని
గణ్వుఁ ద్రసదస్యుఁ డసువాని కర్మపర గ
విష్టిరుని యుద్ధమందున వేఁడి వేల్పు
భీకరంబుగ రక్షించుఁగాక నెపుడు॥ 5030

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15వ సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "మృళీకుఁడు" గాను, దేవత "అగ్ని"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—153

ఋషి—వాసిష్ఠపుత్రుఁడు మృళీకుఁడు
దేవత—అగ్ని

## అర్థాంతరము--1

§(1) ప్రకృతి సృష్టి యజ్ఞమ్మునఁ బ్రజ్వాలిల్లు నగ్ని లెల్ల
ద్వాదశాదిత్యులును దగ నేకాదశ రుద్రులును
అష్ట వసు సుసంపదాళు లసాధారణంపు గతుల
నద్భుతముగ వెల్గొందఁగ నమరాళుల హవ్యమ్ము సు
వహియించెడి అనలదేవు మహాశక్తి నిత్యగతుల
సౌఖ్యప్రదాతగాఁగ సదా! వర్తిల్లుచుండు ॥ 5031

(2)§ఆ॥వె॥ ప్రకృతియజ్ఞ మద్ది వాక్ఛబ్ద యజ్ఞమ్ము
సృష్టి సేవకునయి చెలఁగుచుండు
సర్వ సుఖముఁ గోరి సకలమ్ము సమిధలై
హవము చేయు దేవుఁ డద్భుతముగ ॥ 5032

(3)§ఆ॥వె॥ పదపదార్థములను బ్రజ్వాలిల్లెడి జాత
వేద మైన అగ్ని విశ్వమందుఁ
బ్రాణదాతగాఁగఁ బ్రాణ త్రాతయుఁగాఁగ
సౌఖ్యదాయి యగును సదమలమయి ॥ 5033

(4)§ఆ॥వె॥ అనల దేవుఁ డలరె నఖిల దేవాళికై
ఋషి మనుష్యులును మృళీక గతుల
సకల సంపదాళి సమకూర్ప సృష్టిలో
నఖిల హితము సహిత మలరు సృష్టి ॥ 5034

§(5) సమరములో సర్వ శత్రు సంహారకముగ వెల్గుచు
నన్నదాత బుద్ధిదాత యెన్నంగా జితేంద్రియత
దస్యుతతుల సంహరించి తగ రక్షించును సర్వుల
యాజ్ఞికులౌ పురోహితుల ననలమ్మే రక్షింపఁగ
సర్వ సుఖాళులకు నై సమక్షాన నిలిచి వెలుఁగు ॥ 5035

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—153

ఋషి—వాసిష్ఠపుత్రుఁడు మృళీకుఁడు
దేవత—అగ్ని

## అర్థాంతరము—2

(1)*ఆ॥వె॥ హవ్యవాహనంపు టనలమ్ము సృష్టిలోఁ
జిద్విశిష్ట మౌచుఁ జెలఁగి దేవ
తాళి రుద్రులమెయి నాదిత్యులను నష్ట
వసు సుసంపదాళి వరలు సుఖము ॥ 5036

*(2) ఈ యజ్ఞ శక్తిమై నీ వశ శక్తులను
మర్త్య శక్తులు సత్త్వ మహితమ్ములై వెలుఁగు
సౌఖ్యదాయక మౌచు సకల యజ్ఞము లలర
హవనముల్ తగు సృష్టి నా మృళీకార్థమై ॥ 5037

*(3) సర్వ పదార్థములను జ్వలియించు నా యగ్ని
విశ్వవార మ్మౌచు విమలాఽగ్నుల నొసంగు
జాతవేద మ్మౌచు సకల దేవాఽఽశులకుఁ
బ్రియము కూర్చుచుండుఁ బ్రియ వ్రతాలమై ॥ 5038

*(4) అగ్ని దేవుఁడు సృష్టి సమరుల మనుష్యుల
ఋషుల నఖిల ప్రాణి ఋతమ్ములను గూడ
సంభవింపఁజేయు సర్వశక్తులు పరల
మహిత శుభాఽఽశల మహదైశ్వర్యాల
నసాధారణంపు గతుల నలరంగా జగతి యెల్ల ॥ 5039

*(5) అరి భక్షకమై వరలెడి అత్రి శక్తి వర్ధిల్లఁగ
భక్ష్య భోజ్య పదార్థదాత భరద్వాజ శక్తిమెయిని
గ్రాలంగా జితేంద్రియత గవిష్ఠిర శక్తులమై
నాపదలను రక్షించెడి ఆ కణ్వ మహా శక్తి
రాకాసుల నెల్లర రాచి అంపమునఁ బెట్టెడి
త్రసదశ్వపు సంశక్తులఁ దనరు విశిష్ట దివ్యశక్తి
యజ్ఞగతుల సృష్టి యెల్ల నమేయ పురోహితగతులను
సుఖ స్థాపితమ్ముగాఁగ శుచ్యగ్నులు తగును సృష్టి! ॥ 5040

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—154

ఋషిః—శ్రద్ధా కామాయనీ
దేవతా—శ్రద్ధా
ఛందః—అనుష్టుప్

(1) శ్రద్ధయాగ్నిః సమిధ్యతే శ్రద్ధయా హూయతే హవిః ।
శ్రద్ధాం భగస్య మూర్ధని వచసా వేదయామసి ॥ 1679

(2) ప్రియం శ్రద్ధే దదతః ప్రియం శ్రద్ధే దిదాసతః ।
ప్రియం భోజేషు యజ్వస్విదం మ[1] ఉదితం కృధి ॥ 1680

(3) యథా దేవా[2] అసురేషు శ్రద్ధాముగ్రేషు చక్రిరే ।
ఏవం భోజేషు యజ్వస్వస్మాకముదితం కృధి ॥ 1681

(4) శ్రద్ధాం దేవా యజమానా వాయుగోపా[3] ఉపాసతే ।
శ్రద్ధాం హృదయ్యయాకూత్యా శ్రద్ధయా విన్దతే వసు ॥ 1682

(5) శ్రద్ధాం ప్రాతర్హవామహే శ్రద్ధాం మధ్యందినం పరి ।
శ్రద్ధాం సూర్యస్య నిమ్రుచి శ్రద్ధే శ్రద్ధాపయేహ నః ॥ 1683

---

1. మఽఉదితం, 2. దేవాఽఅసురేషు, 3. గోపాఽఉపాసతే. (వాౕ.ప్రౕ.)

## సూక్తము—154

ఋషి—కామగోత్రజ యగు శ్రద్ధ*

దేవత—శ్రద్ధ*♦

(1)§తే॥గీ॥ శ్రద్ధచేతనె యగ్ని సమిద్ధుఁ డగును
శ్రద్ధచేతనె హవ్యంపు సార మెల్ల
నగ్నిహోతృనియందు ననాదరమున
విడువఁబడుచుండదేః కడు వేడ్క మీఱ ॥ 5041

§తే॥గీ॥ ధనమునకు ముఖ్యమైనట్టి స్థానమందు
మనుచునున్నట్టి శ్రద్ధాభిమాని దేవి
స్తోత్ర పద్ధతులన్ మేము సొంపు గదుర
వెల్లడించుచునున్నాము విమల సూక్తి ॥ 5042

(2)§తే॥గీ॥ హవ్యము నొసంగుచున్నట్టి యార్యమతికి
హవ్యము నొసంగనున్నట్టి యజ్వకు మఱి
యజ్ఞమును జేయువానికి నధికమైన
ప్రియము నో శ్రద్ధః యొనఁగుముః ప్రీతి మెఱయ ॥ 5043

(3)§తే॥గీ॥ శ్రద్ధఁ బూనుటచేతనే సకల సురల
కసురు లెల్లరున్ హంతవ్యులైరి కాదేః
యట్టి శ్రద్ధను గల్గిన యజ్వలు మదిఁ
గోరు ఫల జాతము శ్రద్ధ కూర్చుఁగాదెః ॥ 5044

(4)తే॥గీ॥ శ్రద్ధ కలిగిన పురుషులు సకల ధనముఁ
బొందుచుండుటచేతనే పూత వాయు
రక్షితలు దేవ మానవ రాజు లెల్ల
శ్రద్ధ సేవించుచుండిరి చాల క్రియల ॥ 5045

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 156 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "శ్రద్ధ" గాను, దేవత "శ్రద్ధ" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

♦ ఆర్యులు"శ్రద్ధ"ను దేవతగా వర్ణించినారు. ఎట్టి ఘనకార్యములైనను శ్రద్ధఁబూనినవారిచేఁ జేయఁబడు ననెడి సిద్ధాంత మేర్పడినది. ఇది ఆధునిక మత సాంస్కృతిక చారిత్రకుల యభిప్రాయము.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(5)§గద్యము ॥
ప్రాతర్మధ్యాహ్న సాయంసమయములందు మేము నిను నాహ్వానింతుము.
ఓ శ్రద్ధా! నీవు లోకమందు మమ్ము శ్రద్ధావంతులుగాఁ జేయుము! ॥* 5046

## సూక్తము—154

ఋషి—కామగోత్రజయగు శ్రద్ధ
దేవత—శ్రద్ధ

### అర్థాంతరము—1

§(1) సత్యముతో నగ్ని సృష్టి సంభవించుచుండు సదా!
సత్య శక్తి హవిష మగ్ని సకల సృష్టి హవన మౌను
ఆరోదసి మూర్ధమ్మున నలరు నగ్ని సత్య శక్తి
సత్యాఽగ్నుల శక్తితతులు శబ్దగతుల నెరుఁగ నౌను ॥ 5047

§(2) సత్యశక్తి ప్రియ మొనఁగును సత్యశక్తి ప్రియతర మౌ
సత్యశక్తి ప్రియఫలదము సకలసృష్టి యజ్ఞక్రియ
కారకమై యజ్ఞగతులఁ గ్రాలంగా స్థితి శక్తుల
వర్తిల్లును సత్యాగ్నులు ప్రభవ మహాప్రభాగతుల ॥ 5048

§(3) రాక్షస సంహారమ్మున నక్షయ మౌ శక్తులతో
దేవాఽఽళులు సత్యశక్తిఁ దేజరిల్లు నుగ్ర గతుల
భోజ్యమ్మౌ సద్గతులను భోగకర్తగాఁ దనరుచు
విశ్వసృష్టిఁ బ్రియకరమై విలసిల్లును మహాగ్నిచయము ॥ 5049

§(4,5) సత్యాగ్నుల దేవతాళి సంభవించు గుప్తాఽనిల
శక్తితతుల హృచ్ఛక్తుల సదా! వర్తిల్లుచుండు
నంతర్గతి నలరఁగా సప్తవసు సునంపదాళి
నలరించును నఖిల సృష్టి ననల మహాదివ్యశక్తి
సత్యాగ్నులు నుదయమ్ముల సత్యాగ్నులు మధ్యాహ్నము
సత్యాగ్నులు సాయంత్రము సత్యాగ్నులు నర్ధరాత్రి
సర్వకాల సర్వగతుల సత్యాగ్నులు వర్తిల్లును
సృష్టి స్థితి లయకారక వ్యష్టి సమిష్టి రతులు వరల ॥ 5050

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—154

ఋషి—కామగోత్రజ యగు శ్రద్ధ
దేవత—శ్రద్ధ

### అర్థాంతరము—2

§(1) అస్తిత్వపు శక్తి నగ్ని అలరఁజేయు సమిద్ధగతుల
నస్తిత్వపు శక్తి నగ్ని హవన మ్మొనరించు హవిసు
నస్తిత్వపు శక్తి నగ్ని నలరు మూర్ధగతుల నింగి
నస్తిత్వపు శక్తి నగ్ని నమరశబ్ద వేదిత మగు ॥ 5051

§(2) అస్తికత్వమైన శక్తి నగ్ని ప్రియ మ్మలరఁజేయు
దాన భావ మహితమ్ముగఁ దనరుఁ బ్రియగతులమైని
యజ్ఞార్థుల భోగార్థుల కగ్ని సదా ప్రియకరమౌ
సర్వ పదార్థాలలోన సదా గుహ్య గతుల వరలు ॥ 5052

§(3) అస్తిత్వపు శక్తులలో నగ్ని దేవతాళి నిల్పి
దుష్ట రాక్షసాళి నెల్ల దున్మాడును నిత్యమ్మును
ఉగ్రకర్మ లన్నింటిని హృచ్ఛక్తుల ధ్వంసపరచు
యజ్ఞార్థుల భోగార్థుల కగ్ని సదా ప్రియకరమౌ
సర్వ పదార్థాలలోన సదా గుహ్య గతుల వరలు ॥ 5053

§(4) అస్తిత్వపు శక్తి నగ్ని అనిల గుహ్యమాన మౌచు
దేవాళుల యజమానుల దివ్యోపాసనలఁ బరగు
హృదయాంతర్గత మ్మౌచు నెనయ సంకల్పమాత్ర
శక్తిగతుల నష్టావసు సంపదాళి వృద్ధిపరచు ॥ 5054

§(5) అస్తిత్వపు శక్తి నుదయ మలరారును నిత్యమ్మును
నస్తిత్వపు శక్తి మధ్యాహ్న మలరారును నిత్యమ్మును
నస్తిత్వపు శక్తి నలరు సాయంత్రము నిత్యమ్మును
నస్తిత్వపు శక్తి రాత్రి అలరారును నిత్యమ్మును
నస్తిత్వపు శక్తిమైని నఖిల సృష్టి తనరారును ॥ 5055

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## *సూక్తమ్—155

ఋషిః—శ్రిద్ధా
దేవతా—మేధా
ఛందః—అనుష్టుప్

•(1) మేధాం మహ్యమఙ్గిరసో మేధాం సప్త ఋషయో దదుః ।
మేధామిన్ద్రశ్చాగ్నిశ్చ మేధాం ధాతా దదాతు[1] తే ॥ 1684

•(2) మేధాం[2] తే వరుణో రాజా మేధాం దేవీ సరస్వతీ ।
మేధాం తే అశ్వినౌ దేవా వా ధత్తాం పుష్కరస్రజా ॥ 1685

•(3) యా మేధా అప్సరస్సు[3] గన్ధర్వేషు చ యన్మనః ।
దైవీ యా మానుషీ[4] మేధా సా మామా[5] విశతాదిమామ్ ॥ 1686

•(4) యన్మే నోక్తం తద్రమతాం శకేయం [6]యదనుబ్రువే ।
నిశామితం ని [7]శామహై మయి వ్రతం సహ వ్రతేషు భూయాసం బ్రహ్మణా సం గమేమహి ॥ 1687

•(5) శరీరం మే విచక్షణం[8] వాఙ్ మే మధుమద్[9] దుహామ్ ।
అవృద్ధమహమసౌ[10] సూర్యో బ్రహ్మణానీ స్థః శ్రుతం మే మా ప్ర [11]హాసీః ॥ 1688

---

*"ఖిల" సూక్తము- "ఖిల" మంత్రములు కలది "ఖిల" సూక్తము. ఋగ్వేదము దశమమండలములోని యీ 155వ సూక్తము 11 ఋక్కులతోఁ గొన్ని వ్రాతప్రతులలో నధికముగాఁ గలదు. దీనిని "ఖిల" సూక్తముగాఁ గొందరు భావింపఁ, బరిశిష్టముగాఁ గొందరును, బ్రక్షిప్తమని మరికొందరును, నధికపాఠమని వేరొకకొందరును భావించిరి. ("ఖిల"శబ్ద నిర్వచన వివరణకై 14వ పుటలోని తెలుఁగు ఫుట్ నోటు చూడ నగును.) •"ఖిల" మంత్రము.

1. ద ధాతు తే, 2. మేధాం మే, 3. అప్సరాస్సు, అప్సరాసో, అప్సరేషు, 4. మానుషీ యుగా, 5. సా మాయా, మేధా విశతాదుమాం, మామా విశతాదిహ, 6. యదనుదవ్రే, 7. శామహై మయి వ్రతం సహ బ్రహ్మణా సంగమేమహి, నిశామయి మయి ప్రియేణ భూయాసం, 8. విచక్షణ, 9. మధుమద్దుహా, మదహా, మదుహాం, మధుమత్తమా. 10. అవృతమహ, 11. ప్ర హాసీత్. (వ్రా.ప్ర.)

•(6) మేధాం దేవీం[1] మనసా రేజమానాం గన్ధర్వజుష్టాం ప్రతి నో జుషస్వ ।

మహ్యం మేధాం వద మహ్యం శ్రియం వద మేధావీ[2] భూయాసమజరా [3]జరిష్ణు ॥ 1689

•(7) సదసస్పతిమద్భుతం ప్రియమిన్ద్రస్య కామ్యమ్ ।

సనిం మేధామయాసిషమ్ ॥ 1690

•(8) యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే ।

తయా మామద్యమేధయా[4]ఽగ్నే మేధావినం కురు ॥ 1691

•(9) మేధావ్యహం సుమనాః[5] సుప్రతీకః శ్రద్ధామనాః సత్యమతిః సుశేవః ।

మహాయశా ధారయిష్ణుః ప్రవక్తా[6] భూయాసమస్మై శరయా[7] ప్రయోగే ॥ 1692

•(10) నాశాయిత్రి పలాశస్యారుషసౌ పథికామసు ।

అథో తతస్య యక్ష్మాణమపాపా రోగనాశిసి ॥ 1693

•(11) బ్రహ్మవృక్ష పలాశ త్వం శ్రద్ధాం మేధాం చ దేహి మే ।

వృక్షాధిప నమస్తేఽస్తు అత్ర త్వం సంనిధౌ భవ ॥ 1694

---

•"ఖిల" మంత్రము.

1. దేవీ మనసో, దేవీం సమనసాం, 2, మేధావి, 3. జరిష్ణుః, 4. మేధయా మేధా, మామహ్యమేధాగ్నే మేధావినయం,

5. సమనాః, మేధావ్యం సగణః, మేధావ్యం సుమనః, మనాః సత్యముపః, మనాస్యప్రమతిం సువీరః,

6. ప్రవిక్తా భూయాసమస్యే, సమర్యే, 7. స్వధయా ప్రయోగే. (వ్రా.ప్ర.)

## *సూక్తము—155

ఋషి—శ్రద్ధ
దేవత—మేధ

§(1) మహితమైన మేధస్సును విహితాంగిరస్సు దాల్చు
సప్తఋషులు మేధస్సును సదా! దాల్చుచుందురులే!
బ్రహ్మఒగ్నులు శ్రీవిష్ణువు శ్రద్ధా! నీకిత్రు మేధ ॥ 5056

§(2) సలిలమ్మా! చందురుఁడా! సరస్వతీ! ఓ దేవీ!
అశ్వినీదేవులార! హారమ్మౌ మేధ మీకు ॥ 5057

§(3) మనః పూర్వమైన మేధ మలఁగుచుండు సలిలమ్ముల
గంధర్వులలోనఁ గాలిఁ గాలిను దై వీయమ్మై
అలరు మానవులను మేధ నెలతేఁడుల శక్తివశత
సతిశతమౌ విశేషశక్తి సమర రూప పరమై తగు ॥ 5058

§(4) పగలు రాత్రి లేని శక్తి ప్రాతిశయపు టాధిపత్య
శక్తి మీఱ నాలో వ్రత సహవ్రతాల వర్తిల్లుచు
మహితమ్మౌ బ్రాహ్మ్యమ్ముల మహాశక్తి సంగమించి
అనుక్తమైన శక్తులతో నా మేధ రమించుఁగాక!
సనుఋప మైన మేధ ననుసరించుఁ జాంద్రి శక్తి ॥ 5059

§(5) అతి విచక్షణమైన మదీయాంగమ్మున వాక్ఛక్తులు
మధుశక్తులఁ గురియించుత! మహితమ్ముగ మేధాగతి
వరల నవార్ధక్య శక్తి బ్రాహ్మ్య సూర్య శక్తు లెల్ల
శబ్ద శక్తి చాంద్రశక్తి శ్రౌతమ్మౌ నాలోపల
మహదానందమ్ము నొనఁగు విహితమ్మౌ మేధాగతి ॥ 5060

---

*"ఖిల" సూక్తము. ("ఖిల"సూక్త నిర్వచనమునకై 1036వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు చూడనగును.)
§రచయిత:—వాఙ్మయ మహర్షి, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.
§సామాన్యార్థము.

§(6) ద్వైపీయపు మహామేధ తనరఁ గామ రూప గతుల
మనశ్శక్తి మహితమ్మై అనవరతము వర్తిల్లును
నాలో మేధను నుడువుమ! నాలో శ్రేయము పలుకుమ!
అజరత్వము మేధావీ! అసాధారణత నొందుము! ॥ 5061

§(7) సచ్ఛక్తుల నద్భుతమౌ నచ్ఛమ్మౌ కామ్యమ్ముల
నైంద్ర శక్తి ప్రియమ్మౌను నమేయమౌ మేధాగతి
నా ఆశిష శక్తి గాఁగ నవ్యౌ నిత్య గతులఁ దనరు ॥ 5062

§(8) దేవగణము పితరులును దివ్యమ్ముగ నే మేధను
నుపాసించుచుందురో! అపూర్వమౌ నా మేధను
నగ్నీ! నన్ను మేధావిగ నలరింపుమ! సచ్ఛక్తుల ॥ 5063

§(9) సుమనస్సులు సుప్రతీకులు సుకేశులు సత్య మతులు
శ్రద్ధమానులు మహాబుధులు ప్రవక్తలున్ ధారయిష్ణు
లద్భుతమౌ శరశక్తుల నసాధారణ ప్రయోగాల
నలరెద నే మేధావిగ నందటి శక్తులు వరలఁగ ॥ 5064

§(10) రాక్షస నాశము చేయుచుఁ గ్రాలు నార్ష పథమ్ములను
నపాపత్వ మలరంగా యక్ష్మ గతులఁ దొలఁగించుచు
రోగ నాశనిగ వరలును ఋషి శక్తుల మేధ స్సది ॥ 5065

§(11) అజా వృక్షమై వరలెడి అపరాఽఽశా పరమ్మైన
హే! శ్రద్ధా! మేధస్సును నెంతేని ననుగ్రహించు!
బ్రహ్మ వృక్ష సర్వాధిప! పరంధామ! నీకు నతులు
నీ విట నాకే వేళను సన్నిధిగాఁ దనరారుమ! ॥ 5066

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§"ఖిల" మంత్రానువాదము.

§సామాన్యార్థము.

## *సూక్తము—155

ఋషి—శ్రద్ధ

దేవత—మేధ

### అర్థాంతరము—1

§(1) అంగిరసుఁడు మహీస్థితికి యజ్ఞమ్మును నొనరించును
సప్తఋషులు యజ్ఞమ్మును సంధాన మ్మొనరింతురు
బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వరల యజ్ఞ మొనరింతురు
శ్రద్ధామయ మేధాగతి సర్వమ్మున వర్ధిలంగ। 5067

§(2) గిరి! నీకై యజ్ఞమ్మగు నరుణుండా! నీకు నిష్టి
దేవీ! సరస్వతీ! నీకుఁ దేజరిల్లు యజ్ఞమ్మిదె!
అమరులార! మీకుఁ గ్రతువు అశ్వులార! జన్న మీకు
నీరమ్మా! నీకుఁ గ్రతువు హారమ్మై తనరుఁగాక!॥ 5068

§(3) జల సరోవరాల వరలు జన్న మ్మది నిత్యమ్మును
నజయ్యమైన మనశ్శక్తి నలరు గంధర్వగతుల
దైవీయము మానుషమై తనరారెడి యజ్ఞమ్మది
ప్రతిమానము వశ్యగతులఁ బరఁగు దివ్యసృష్టి మహిమ॥ 5069

§(4) అనుక్తమైన శక్తితతుల సంతరంగమున రమించు
విశిష్టమైన చాంద్రశక్తి విమల సౌఖ్యదాయకమై
పసుపు వర్ణ విశేషాల బ్రాహ్మ్య శక్తు లలరారఁగ
నాయందునె సద్భావ మమేయవ్రత సహవ్రతముగాఁగ
ననుభూతికి రాని శక్తు లావిష్కృత మౌనుగాక!॥ 5070

§(5) తనరు విచక్షణల నాదు తనువు మహిత మౌను జగతి
నమృత మ్మది నా వాక్కుల నసమగతుల వర్షించుత!
నజరమైన శక్తులతో నరుణ బ్రాహ్మ్యతత్త్వ స్థితి
అక్షరమౌ ఘ్రతశక్తులు హాసాఽమృత చాంద్ర వృష్టి
నాలో నావిర్భవించు నవ యౌవన నిత్య రతుల॥ 5071

---

*"ఖిల" సూక్తము.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§"ఖిల" మంత్రానువాదము.

§(6) మఖ దీప్తులఁ బ్రకృతికిసై మానసంపు శక్తి వెలుఁగ
గాంధర్వమయమ్మైన కామరూప దివ్య గతులు
నాలోఁ బ్రతిరూప మౌచు వేల లెనయకుండ నిలుచు
నాలో జన్నము నుడుపుము! నాలో శ్రేయము నుడుపుమ!
మేధావిగ రెట్టింపుగ మించు నజర తత్త్వ మెనయ ॥ 5072

§(7) వైష్ణవీయ కామ్యమ్ముగ వరలి ప్రియ మ్మౌచు వెలుఁగు
నద్భుతమై సదసస్పతి యౌచు నిత్య మలరునట్టి
బహు రూపుల జన్న మ్మది పరఁగును నా ఆశిషముగ ॥ 5073

§(8) ఏ యజ్ఞము దేవ గణము లెల్ల పితరు లుపాసింత్రో!
ఆ యజ్ఞముచేత నన్ను నగ్ని! మేధావి గాఁగఁ
జేయుమ! యిపుడే నిస్తుల చిత్తత్త్వము వరలంగా ॥ 5074

§(9) సుమనస్సుల సుప్రీతుల సుశేవుల శ్రద్ధాఽన్విత
మనోఽన్వితుల సత్యమతుల మహాయశులఁ బ్రవక్తలను
ధారయిష్ణుల ప్రయోగాలఁ దనరంగా శరగతులను
నేను యాజ్ఞికుండ నౌచు నిరతము క్రతు వొనరింతును ॥ 5075

§(10) నిరాటంక యానమ్ముల నిఖిల రాక్షసులఁ దుృంచుచు
క్షీణత్వము లేకుండఁగఁ గెరల నపాపత్వమ్మును
బుణ్యశక్తి రోగమ్ములఁ బూర్ణమ్ముగ నాశపరచు
నార్షేయపు యజ్ఞాలను సతిపవిత్ర గతులఁ జేయ ॥ 5076

§(11) బ్రాహ్మ్యశక్తి వృక్షమ్ముగఁ బలాశమైన వరా దిక్కు-
శ్రద్ధాగతి యజ్ఞమ్మును సదా! ప్రసాదించు నాకు
సృష్టి రూప వృషాధిప! చెలఁగు నీకు సమస్కృతులు
నీవు నాకు సన్నిధిగా నిరతము వర్తిల్లు మిచట ॥ 5077

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పన్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

## *సూక్తము—155

ఋషి—శ్రద్ధ

దేవత—మేధ

### అర్థాంతరము—2

§(1) అంగిరసులు సప్తర్షులు హరిహర బ్రహ్మ లెల్ల
రథంతర గతుల స్వర రాగ సామ శక్తి తతులు
నాకుఁ బ్రసాదింత్రుగాక! నాలో నావిర్భవించుఁగాక! ॥ 5078

§(2) ఆదిత్యుల నాకసముల నలరు పరబ్రహ్మములో
దేవి వాణి రూపమైన దివ్యాఽశ్వల శక్తులతో
దైవీయ మ్రోచు నీకుఁ దనరు రథంతర సామము
శబ్ద స్వర రాగ సహిత సంశక్తుల హారమ్మై ॥ 5079

§(3) గాంధర్వగ కామరూప క్రాంతి మనశ్శక్తి నాకు
మానుషగతి దైవీయపు మహిమాఽన్విత సంశక్తుల
వశమానతఁ జాంద్రశక్తిఁ బ్రసరింపఁగ రథంతర
సామ గాన స్వర శక్తుల శత విశేష ఫలద మౌను ॥ 5080

§(4) శక మహితపు సర్వ స్వరాఽనుభవమ్ముగాఁగ
నాలో నంతర్గతులను వేలాఽతిరతి నుక్తమ్మై
నిషాదంపు స్వరశక్తుల నిర్గత మౌ రథంతరము
సామ రూప దీప్తులతో సర్వాంధత రూపు మాపి
బ్రాహ్మ్య రూప వ్రతశక్తులు వరలంగా సహవ్రతమై
నాలోపల రమించుఁగాక! నవశక్తులు పదే! పదే! ॥ 5081

§(5) ఆ రథంతర సామ శక్తి అమృత దేహ మొసఁగు నాకు
మధు వర్షము లొలుకుచుండు మహితాఽమృత వాక్కు లిచ్చు
బ్రాహ్మ్య వైష్ణవీయ శక్తి వరల నజర శక్తు లొసఁగు
ప్రితము కాఁగ నాలోపల శుక్ల సాంద్ర చంద్రిక లగు ॥ 5082

---

*"ఖిల" సూక్తము.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§"ఖిల" మంత్రానువాదము.

§(6) దేవి మానసంపు గాన దివ్యశక్తి వరలుచుండు
గాంధర్వపుఁ గామ రూప గతుల స్వరము లలరంగా
రథంతర సామ గాన రంజిత మై మహాశక్తి
నాలో సామము పలుకుము! నాలో శ్రీయము నుడువుము!
అమర సామ లోలుపతల నజరామర సద్గతులను ॥ 5083

§(7) అద్భుత మై సదసస్పతి నా శ్రీహరి కామ్యమ్మై
ప్రియ మౌచును వెలయు నా రథంతర సామ
మయ మ్మౌచు నాశిషమ్ము మహిత సత్త్వగతుల నొసఁగు ॥ 5084

§(8) ఏ రథంతర సామమ్మును సెల్ల పితరులు దేవగణా
లుపాసింత్రౌ! ఆ సామపు టుజ్జ్వలమౌ మహాశక్తి
నగ్ని! నన్ను మేధావిగ నలరింపుమ! యెల్లప్పుడు ॥ 5085

§(9) సుమనస్సులు సుప్రీతికలు సుశేవులును సత్యమతులు
శ్రద్ధమాన మహాయశులు ప్రవక్తలును ధారయిష్ణు
లమృత శర ప్రయోగాల నలరు రథంతర సామము
మాటి మాటికిని నాలో మహిత మౌను మేధావిగ ॥ 5086

§(10) నిరాటంక పథ గామిగ నిశాచరుల నాశపరచి
ఆర్షేయ మ్మౌచు వెలుఁగు నా రథంతర సామ శక్తి
అపాపత్వ పుణ్యశక్తు లలర క్షీణగతులు లేక
సర్వ రోగ నాశినిగా నచ్ఛక్తుల వెల్గుచుండు ॥ 5087

§(11) పరాశక్తిగా వరలెడి బ్రాహ్మ్య రూప వృషమ్మా!
శ్రద్ధామయ సామ గాన రథంతర శక్తి నిమ్మ!
బ్రహ్మతత్త్వ శక్త్యధిపా! వందన మొనరింతు నీకు
నిత్య సత్య సన్నిధిగా నీవు నాకు వర్తిల్లుము! ॥ 5088

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

## అనువాకః—12 ; సూక్తమ్—156

ఋషిః—శాసో భారద్వాజః
దేవతా—ఇన్ద్రః
ఛందః—అనుష్టుప్

(1) శాస[1] ఇత్థా మహాగ్ం అస్యమిత్రఖాదో[2] అద్భుతః ।
న యస్య హన్యతే సఖా న జీయతే కదా చన ॥ 1695

(2) స్వస్తిదా విశస్పతి ర్వృత్రహా విమృధో వశీ ।
వృషేన్ద్రః పుర[3] ఏతు నః సోమపా[4] అభయంకరః ॥ 1696

(3) వి రక్షో వి మృధో జహి వి వృత్రస్య హనూ రుజ ।
వి మన్యుమిన్ద్ర వృత్రహన్న మిత్రస్యాభిదాసతః ॥ 1697

(4) వి న[5] ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః ।
యో[6] అస్మాగ్ం అభిదాసత్యధరం గమయా తమః ॥ 1698

(5) అపేన్ద్ర ద్విషతో మనోఽప జిజ్యాసతో వధమ్ ।
వి మన్యోః శర్మ యచ్ఛ వరీయో యవయా వధమ్ ॥ 1699

---

1. శాసఽఇత్థామహాగ్ంఽఅస్య, 2. ఖాదోఽఅద్భుతః, 3. పురఽఏతు నః, 4. సోమపాఽఅభయంకరః,
5. వి నఽఇన్ద్ర, 6. యోఽఅస్మాగ్ంఽఅభిదాసత్యధరం. (వ్రా.ప్ర)

## అనువాకము—12 ; సూక్తము—156

ఋషి—భారద్వాజుఁడగు శాన నామకుఁడు*

దేవత—ఇంద్రుఁడు*

(1)§చ॥ అరులను దుృంచు వాఁడవయి యద్భుత రూపముతోడ వెల్గుచున్
గరముఁ బ్రకాశ మొందెదవు! కమ్ర భవత్ సఖుఁ డెల్ల వేళలన్
బరుల కహింస్యుఁడై సకల వైరి గణీజితుఁ డౌను గాన నో
హరిహయ! పూజ్యతం గను మహాత్ముఁడ వౌటను నిన్నె కొల్చెదన్ ॥ ‡ 5089

(2)§ఉ॥ భావుక మిచ్చు వాఁడు జనపాలకుఁడై వెలుఁగొందు వాఁడు తా
నే విధి నైన శత్రువుల నెల్ల హరించెడు యుద్ధ కార్యమున్
వావిరిఁ జేయు వాఁడు కడు వర్షితయై విలసిల్లు వాఁడు నౌ
దేవుఁడు ఛేతి హర్తయయి దీక్షగ మమ్ములఁ బొంపుఁగాపుతన్! ॥ ‡ 5090

(3,4,§సీ॥ రాక్షస గణముల రహిని జయింపుము! శాత్రవమండలిఁ జంపు! వృత్ర
5) హనువులఁ గొట్టుమీ! మొనసి వైరుల క్రోధమును నష్టపెట్టంగఁ జనుము! మమ్ము
బాధించు వానిని బరమ నీచుని జేసి జంపు! మహేంద్రుఁడా! శక్తితోడ
శత్రు మాననమును శాంతితోడ జయింపు మస్మద్వయోహాని నాచరించు
తే॥గీ॥ వానిపై నాయుధంబును వదలి మాకు, నెక్కుడైన శుభంబుల నిచ్చి మమ్ము
వైరి కృతమైన హననంబు చేరకుండఁ, జేరు మోయి! మహేంద్రుఁడా! చిత్తమలర ॥ ‡ 5091

## సూక్తము—156

ఋషి—భారద్వాజుఁడగు శాన నామకుఁడు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

(1)§ఆ॥వె॥ అఖిలమైన సృష్టి నధిశాసనము చేయు
నద్భుతముగ నరుణు నారగించు
సృష్టి సఖుఁడుగ హరి జీవింపఁజేయుచు
నమయఁ జేయు సర్వ శత్రు తతుల ॥ 5092

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఈ సూక్తమునకు ఋషి "సానుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీనేమానిగారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

‡సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(2)§క॥ ఓజశ్శక్తుల నిందు్రఁడు
తేజోఽనల దివ్య వజ్రి దీప్తులు ప్రబలన్
ఆజిన్ శత్రులఁ దున్ముచు
భ్రాజితమౌ జయపతాక వరలన్ జేయున్ ॥ 5093

(3)§ఆ॥వె॥ అంతరిక్ష మెల్ల నాక్రమించెడు వృత్రి
నభిజ దుష్ట రుజ విషాఽనలముల
సంహరించి నింగి స్వచ్ఛ విశాలత
పరఁగఁజేయు నింద్రి పవిజ శక్తి ॥ 5094

(4)§ఆ॥వె॥ వజ్రరూప దివ్య భద్ర విజయ శక్తి
అర్క సహిత మౌచు ననిల గతుల
ఉజ్జ్వలముగ వెల్గు నోజో గుణాళితో
సృష్టి రక్షకముగ నేడుగడగ ॥ 5095

(5)§క॥ ఓజో గుణ శక్తులతో
భ్రాజితమౌ విష్ణు శక్తి వరలెడు సృష్టిన్
రాజితముగ స్థితి గతులన్
దేజోఽనిల మృజ్జలముల నింగిన్ నిండున్ ॥ 5096

## సూక్తము—156

ఋషి—భారద్వాజుఁడగు శాసనామకుఁడు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

§(1) అఖిలాఽఖిల సృష్టి క్రియలు నాదిమధ్యాంతమ్ములు
ఆమూలాగ్రము గాఁగను నలరుఁ గర్మరూపాలై
అతిలోకపు శక్తులతో నమరు విష్ణుకర్త కాఁగ
మంచి చెడుల సంచితమై అంచితమౌ నానందము
ఖేదాలుగ- సుఖగతులను క్లిష్టకష్ట గతులమెయిని
సంరక్షణ మొనరించును సకల సువీర్యాలు వరల ॥ 5097

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) ధర్మరూప పుణ్యములై తనరారఁగ జల శక్తులు
సకాలాన సకల సృష్టి సంపత్ప్రదమై వర్తిలుఁ
బ్రాణదమై త్రాణదమై వైష్ణవీయ దివ్య శక్తి
వృత్రాసురు "నభి" శక్తులు విధ్వస్తమ్మై పోవఁగః॥ 5098

§— అతిలోక బలాలతో నతివేలపు సాహసాల
నోజశ్శక్తులు నిండఁగ నుజ్జ్వలమౌ దీప్తులతో
ఈ జనన స్థితివర్ధక భ్రాజమాన శక్తు లెల్ల
నిత్య ధర్మ పరము లౌచు సత్య గతుల వర్తిల్లును॥ 5099

§(3) అంతరిక్ష గతుల కెల్ల నతీతముగ నలరారుచు
వృత్రాసుర శక్తితతుల విధ్వస్తము కావించుచు
"నభి" శక్తుల నాశపరచి "నాభి"శక్తిఁ గాపాడుచు
నుజ్జ్వలముగ దివి భువులను సృష్టి రక్షకుండగు హరి॥ 5100

§(4) ఉషశ్శక్తి దీప్తులతో నుద్భవించు నర్కుండౌ
నోజశ్శక్తుల మీఱఁగ సృష్టి నెల్ల దీధితులను
వెలుఁగఁజేయు నిత్యమ్మును విస్తరిల ఖర కరకిరణా
లనిల జల మృద్గగనా లలరంగా మహితమ్ముగ॥ 5101

§(5) ఐంద్రమైన శక్తులతో నఖిల సృష్టి వర్తిల్లఁగ
నింగి గాలి నిప్పు నీరు నేలలనే అధిగమించి
ఓజశ్శక్తుల నిత్య మ్మోటమినే యెరుఁగకుండ
విశ్వ లోక భువనాళుల వేల్పై రక్షించును హరి॥ 5102

§ఆ॥వె॥ అఖిల భూతములను నవతరించిన సృష్టి
నభిభవించి నిత్య నవ్య శక్తి
విశ్వ లోక భువన వితతి కెల్లను సదా!
హరియె రక్ష నిచ్చు నఖిల గతుల॥ 5103

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—157

ఋషికా—దేవజామయ ఇన్ద్రమాతరః
దేవతా—ఇన్ద్రః
ఛందః—గాయత్రీ

(1) ఈంఖయన్తీరపస్యువ[1] ఇన్ద్రం జాతముపాసతే ।
భేజానాసః సువీర్యమ్ ॥ 1700

(2) త్వమిన్ద్ర బలాదధి సహసో జాత[2] ఓజసః ।
త్వం వృషన్ వృషేదసి ॥ 1701

(3) త్వమిన్ద్రాసి వృత్రహా వ్యన్తరిక్షమతిరః ।
ఉద్ద్యామస్తభ్నా[3] ఓజసా ॥ 1702

(4) త్వమిన్ద్ర సజోషస మర్కం బిభర్షి బాహ్వోః ।
వజ్రం శిశాన[4] ఓజసా ॥ 1703

(5) త్వమిన్ద్రాభిభూరసి విశ్వా జాతాన్యోజసా ।
స విశ్వా భువ[5] ఆభవః ॥ 1704

---

1. స్యువఇన్ద్రం, 2. జాతఓజసః, 3. ద్యామస్తభ్నాఓజసా, 4. శిశానఓజసా, 5. భువఆభవః. (వా.ప్ర.)

## సూక్తము—157

ఋషిక—ఇంద్రమాతలు*

దేవత—ఇంద్రుఁడు*

(1)§ఆ॥వె॥ స్తుతులచేత నింద్రు స్తుతియించుచుం గర్మ
గోరుచున్న యింద్ర వీర మాత
లింద్రుఁ గాంచుచుండి యెక్కువ ధనమును
వానివలన లీలఁ బడయుచుంద్రు॥ 5104

(2)§తే॥గీ॥ వృత్ర వధ హేతుకంబైన విపుల భూమి
వలనఁ బ్రఖ్యాతి గాంచితి! లలిత ధైర్య
పద్ధతిం బుట్టినాఁడవు! వర్షితవు సు
కాంక్షితంబుల నెసఁగెదు! కరుణ నీవు॥ 5105

(3)§తే॥గీ॥ శత్రువులఁ జంపువాఁడవు! శక్తి నంత
రిక్షమును వృద్ధిపరచితి వింద్ర! దివము
క్రిందఁ బడకుండునట్లుగా నంద మొప్పఁ
జేసినాఁడవు! దానిని జెన్ను మీఱ॥ 5106

(4)§తే॥గీ॥ ప్రియమాణము స్తుత్యమై వెలుఁగునట్టి
నీ మహాఽఽయుధరాజము నీ బలంబు
వలనఁ దీక్ష్ణంబుగాఁ జేసి బాహుల నిఁకఁ
దాల్చువాఁడవు! శత్రులఁ ద్రిచ్చుటకయి॥ 5107

(5)§తే॥గీ॥ ఇంద్రదేవుఁడ! భూతాళి నెల్ల బలము
చే జయించుచున్నావు భ్రాజమాన
సర్వ భూముల నే వేళ సరస రీతి
వ్యాప్తి గాంచితివయ్య! యో వాసవుండ!॥ 5108

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ఇంద్రమాత"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—157

ఋషిక—ఇంద్రమాతలు
దేవత—ఇంద్రుడు

### అర్థాంతరము—1

(1)§ఆ॥వె॥ సత్య వీర్య గతుల నిత్య శక్తులు తోప
నైంద్రమైన మహిత యజ్ఞ దీప్తి
సర్వ కాలములను సంరక్షిత మ్మౌను
సృష్టి కర్మ కాఁగ నిష్ట గతులః ॥ 5109

(2)§ఆ॥వె॥ ధర్మ విరహితముగఁ గర్మ మార్గము తప్పి
జీవ రహిత గతుల ఛిన్న మగుచు
నిలుచుఁ బంచభూత నిచయమ్ము కాపాడి
వృత్రుఁ జంపి వెలుఁగు నింద్రుఁ డెలమి ॥ 5110

§(3) అంతరిక్షమ్ముతో నఖిల భూతావళుల
సద్భుత శక్తిమెయి నతిలోక గతి గాఁగఁ
గాపాడుచును వృత్రు నేపడంచుచు సృష్టి
స్థితి శక్తి రక్షించి అతివేల గతుల మై
సకలాఽతీతమౌ సర్వాధిపత్యాన
వర్తిల్లి నిఖిలమ్ము ప్రకాశింపఁగ నిల్చు ॥ 5111

§(4) ఓజస్సహిత మ్మౌచును నుజ్జ్వలముగ వెల్గొందెడి
అర్క-దీప్తు లలరంగా నజయ్యమైన శక్తులతోఁ
దనరారెడి వజ్రశక్తి అనుపమాన మౌచు నిలుచు
నభేద్య మౌచు నమేయ మౌచు నపూర్వముగ నైంద్రముగాః ॥ 5112

§(5) సకల భూతాఽంతర్యామిగాఁగ సదాః వెల్గొందుచుండుఁ
బంచభూత రూపాలను సంచితముగ రక్షించును
నోజశ్శక్తుల సృష్టిని దేజోవంతముఁ జేయుచు
మహా విజేతగాఁగ నింద్రుఁ డహోః యనఁగ వర్తిల్లును ॥ 5113

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—157

ఋషిక—ఇంద్రమాతలు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

(1)ఆ॥వె॥ వైష్ణవీయ మౌచు వరలెడి సచ్ఛక్తి
కర్మ శీల మౌచుఁ గ్రాలు సతత
మఖిల సృష్టిలోన నాత్మైక్య గతుల మై
నాశ్రితమ్ము గాఁగ నలరుఁ బ్రకృతి ॥ 5114

(2)ఆ॥వె॥ సృష్టి ధర్మ మెల్ల వ్యష్టి సమిష్టుల
నతి బలీయ మౌచు నలరుచుండ
నీవు వైష్ణవీయ నిత్య శక్తి వరల
నోజ గతుల నిలుపు దుజ్జ్వలేంద్ర ॥ 5115

(3)ఆ॥వె॥ ఇంద్ర దేవుఁడవయి వృత్రాసురు వధను
నిర్వహించి విష్ణు నిత్య శక్తి
పతిగ వర్ధిలంగఁ బరమ భద్రత మీఱ
నోజ మెల్ల సృష్టి నుజ్జ్వల మగు ॥ 5116

§(4) అర్క దేవ దీప్తమైన అఖిల కిరణ సముచ్చయము
లలరంగా బాహువులై అఖిలమ్మును బట్టి నిలిపి
ఓజశ్శక్తుల నింపుచు నుజ్జ్వలమౌ వజ్రమ్మున
నఖిల గోళ లోకాలను గాదుకొనెడ వో యింద్రా ॥ 5117

§(5) ఆకసమ్ము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
నవనీతల మెల్ల సృష్టి నవినాభావత్వ మొప్ప
నుద్భవించి నిలుచుచుండు నుపర్యధోలోకాలుగ
నన్నింటికి నధిపతివై యథాస్థాన స్థితి గతులను
నిల్పి నిత్య రక్ష నొసఁగి నిరత కర్మ కర్త వౌదు
నిఖిల సృష్టి విష్ణుదేవ నీ కనుసన్నల వెలుఁగఁగ ॥ 5118

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పట్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—158

ఋషికా—యమీ వైవస్వతీ
దేవతా—భావవృత్తమ్
ఛందః—అనుష్టుప్

(1) సోమ ఏకేభ్యః పవతే ఘృతమేక ఉపాసతే ।
యేభ్యో మధు ప్రధావతి తాగ్ంశ్చిదేవాపి గచ్ఛతాత్ ॥ 1705

(2) తపసా[1] యే అనాధృష్యాస్తపసా యే స్వర్యయుః ॥
తపో యే చక్రిరే మహస్తాగ్ం[2]శ్చిదేవాపి గచ్ఛతాత్ ॥ 1706

(3) యే యుధ్యన్తే ప్రధనేషు శూరాసో యే తనూత్యజః ॥
యే వా సహస్రదక్షిణా[3]స్తాగ్ంశ్చిదేవాపి గచ్ఛతాత్ ॥ 1707

(4) యే చిత్ పూర్వ ఋతసాప ఋతావాన ఋతావృధః ।
పితౄన్ తపస్వతో యమ[4] తాగ్ంశ్చిదేవాపి గచ్ఛతాత్ ॥ 1708

(5) సహస్రణీథాః కవయో యే గోపాయన్తి సూర్యమ్ ।
ఋషీన్ తపస్వతో యమ తపోజాగ్ం అపి గచ్ఛతాత్ ॥ 1709

1. తమసా యే, 2. మహస్తాంశ్చ, 3. దక్షిణాస్తాంశ్చ, 4. యమ తాంశ్చ. (పా.వ.)

## సూక్తము—158

ఋషిక—వివస్వద్దుహిత యమి*

దేవత—యజమాన పరివర్తనము (భావవృత్తము)*

(1)§గద్యము ॥

పితృదేవతలలోఁ, గొందఱి యుపభోగమునకు సోమమును దార్చుచున్నారు. ఏ పితరుల యుపయోగమునకు మధువు ప్రవహించుచున్నదో; యెవరు మంత్రముల బ్రహ్మ యజ్ఞార్థము పఠించుచున్నారో; వారల నో ప్రేతా! నీవు పొందుము! ॥ 5119

(2)§గద్యము ॥

ఎవరు కృచ్ఛ్ర చాంద్రాయణాది యుక్తులై పాపముల నప్రధృష్యు లగుదురో; యెవరు యాగాది సాధనముల స్వర్గమును బొందుచున్నారో; ఓ ప్రేతా! యట్టి తపోనిష్ఠా గరిష్ఠులను నీవు పొందుము! ॥ 5120

(3)§గద్యము ॥

సంగ్రామములయం దెవ్వరు శూరులై శత్రువులను జంపుచున్నారో; యెవరు శరీరత్యక్తులో; యెవరు సహస్ర దక్షిణలు గల క్రతువుల నాచరించుచున్నారో; వారి నందరిని నీవు పొందుము; ఎవ రుత్తమలోకములయందు నివసింతురో; వారిని, వారు నివసించు నా యుత్తమ లోకములను, నీవు పొందుము! ॥ 5121

(4)§గద్యము ॥

ఏ పుణ్యపురుషులు సత్యమును స్పృశించుచున్న వార లౌట సత్యపరీతులై సత్యవర్ధకులై నివసించుచున్నారో; తపోధన యుక్తు లగు నట్టివారిని నో యముఁడా! నీవుకూడఁ బొందుము! ॥ 5122

(5)§గద్యము ॥

సహస్ర నయనులు క్రాంతదర్శనులు నగు నెవ్వ రాదిత్యుని రక్షించుచున్నారో; తపో యుక్తులు తపస్సువల్లనే పుట్టువారును నగు నట్టివారి నో యమా! నీవు పొందుము! ॥ 5123

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 155 సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "యమి" గాను, దేవత "నూత్న జీవము" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—158

ఋషిక—వివస్వద్దుహిత యమి
దేవత—యజమాన ప్రవర్తనము (భావవృత్తము.)

### అర్థాంతరము--1

§(1) సోమశక్తి నెల్లప్పుడు శుభ్రదీప్తు లొప్పారఁగ
నేకుండౌ దేవదేవుఁ డిష్టి యుపాసన నెంచుచుఁ
దరియించుచు మధురూపము లరిమురిగా వర్ధిల్లఁగ
జ్ఞాన ప్రదాతగాఁగ సకలమ్మునఁ బ్రకాశించు ॥ 5124

§(2) తపస్సుతో నజయ్యమౌ నపరశక్తి లభ్యమ్మౌఁ
దపస్సుతో నమరమ్మై తనరు దివి లభ్యమ్మౌఁ
దపస్సుతో నఖిలమ్మును దరియింపఁగ నౌను సృష్టిఁ
దపస్సుతో జ్ఞానమ్మును నపూర్వముగఁ బొంద నౌను ॥ 5125

§(3) ఎవరు యుద్ధముల వీరత నెంతేనియు వెల్గొందుదు
రెవరు తమ శరీరమును నిష్టే త్యజించివైతు
రెవరు సహస్రదక్షిణ లీవి గాఁగ నొసంగుదురో!
వారే చిద్రూపమ్మును నవారితముగ నొందఁగలరు ॥ 5126

§(4) ఎవరు ఋతము గౌరవింత్రో! యెవరు సత్యమూర్తు లౌదు
రెవరు సత్య ప్రసారకు లౌదు రీ సృష్టిని వారే మఱి
ప్రకృతికి మాతృపితలు పగిది గాఁగ వెల్గుచుంద్రు
వారే చిద్రూపు లౌచుఁ బ్రకాశింతురు విశ్వమ్మున ॥ 5127

§(5) వేయివేయి దృక్పథాల వెలుఁగు ఋషీశ్వరుల జగతి
రవినే సంరక్షించుచుఁ గ్రాలుదు రసాధారణ గతి
యమ శక్తుల ఋషీశ్వరులు నమర తపోధను లౌచును
జ్ఞానకర్మ లన్నింటిని సంధారణ నొనరింతురు ॥ 5128

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—158

ఋషిక—వివస్వద్దుహిత యమి

దేవత—యజమానప్రవర్తనము (భావవృత్తము.)

### అర్థాంతరము—2

§(1) ఏకోపాసన శశికళ యేకునికై వెల్గుచుండు
మధురూప స్రవగతులను మహితామృత పదార్థ మిచ్చి
సాంద్ర చంద్రికలు పరలఁగ సర్వమ్మున వ్యాప్తి చెంది
చిద్రూపముగా సృష్టిని జెన్నొందఁగ జేయు సదా॥ 5129

§(2) ఎవరు తపోధనవంతులో? యెవరు తపశ్శబ్ద రూపు
లెవరు తపఃకర్త లౌదు లెవరు తపఃకర్మగులై
వారె మహిత శక్తులతో వర్ధిల్లుదు రీ సృష్టిని
వారే చిన్మయులుగాఁగఁ ప్రకాసించుచుంద్రు సదా॥ 5130

§(3) మహోత్కృష్ట ధనమ్ముగా మహిత సూక్ష్మ గతుల నొంది
బ్రహ్మ శక్తి గాఁగ నెవరు ప్రకృతిఁ బరఁగుచు నుందురో!
యెవరు సహస్ర రూపము లౌ నెన లేని దక్షిణలను
నెనఁగుచుంద్రో? వారె మహిత సృష్టిఁ జిన్మయత నుందురు॥ 5131

§(4) ఏ యమ మహాశక్తి యెనఁగఁ జిత్పూర్వమ్మై
యే యమ మహాశక్తి యెనఁగు ఋత పూర్ణమ్మై
ఋతబద్ధమ్ముగఁ బరఁగును ఋతావృతమై పరలును
నా చిచ్ఛక్తుల తపముల నా పితరుల నంద నౌను॥ 5132

§(5) సహస్రరూప దృక్పథాల మహిత గోప శక్తులతో
సూర్యు నైన ఋషీశ్వరులు నర్యమరతి నంతర్గతి
యమ శక్తుల తపశ్శక్తి నసాధారణంపు గతుల
నఖిలాంతర్యామిగాఁగ నందఁగలరు సర్వస్వము॥ 5133

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—159

ఋషిః—శిరిమ్బిఠో భారద్వాజః

దేవతా—అలక్ష్మీఘ్నమ్; 2-3-బ్రహ్మణస్పతిః; 5-విశ్వే దేవాః

ఛందః—అనుష్టుప్

(1) అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే ।

శిరిమ్బిఠస్య సత్వభిస్తేభిష్ట్వా చాతయామసి ॥ 1710

(2) చత్తో[1] ఇతశ్చత్తాముతః సర్వా భ్రూణాన్యారుషీ ।

అరాయ్యం బ్రహ్మణస్పతే తీక్ష్ణ[2]శృఙ్గోదృషన్నిహి ॥ 1711

(3) అదో యద్దారు ప్లవతే సిన్ధోః పారే[3] అపూరుషమ్ ।

తదా రభస్వ దుర్హణో తేన గచ్ఛ పరస్తరమ్ ॥ 1712

(4) యద్ధ ప్రాచీరజగన్తోరో మణ్డూరధాణికీః ।

హతా[4] ఇన్ద్రస్య శత్రవః సర్వే బుద్బుదయాశవః ॥ 1713

(5) పరీమే గామనేషత పర్యగ్నిమహృషత ।

దేవేష్వక్రత శ్రవః క[5] ఇమాగ్ం ఆ దధర్షతి ॥ 1714

---

1. చత్తోఽఇతః, 2. తీక్ష్ణ, 3. పారేఽఅపూరు, 4. హతాఽఇన్ద్రస్య, 5. కఽఇమాగ్ంఽఆ దధర్షతి. (వా.ప.)

## సూక్తము—159

ఋషి—శిరింబిఠుఁడు*

దేవత—అలక్ష్మీనాశకరార్థము; 2,3-బ్రహ్మణస్పతి; 5-విశ్వేదేవతలు*

(1)§సీ॥ దాన విరోధిని! ధరణీధరంబును జేరుమా! మమ్ములఁ జేరకుండఁ
గుత్సితదర్శన! కుధర రాజంబును జేరుమా! మమ్ములఁ జేరకుండ
వికృత శరీరిణి! విపుల పర్వతమును జేరుమా! మమ్ములఁ జేరకుండ
నాక్రోశకారిణీ! యవనీ ధరేంద్రంబుఁ జేరుమా! మమ్ములఁ జేరకుండ

తే॥గీ॥ జలద విలసిత మైనట్టి చారు జలము,వలన నీకు వినాశంబు కలుగఁజేయఁ
గలము దుర్భిక్ష దేవత! కరుణఁ బూని,యిచట నుండక గిరిపైకి నేగుమమ్మ! ॥ 5134

(2)§ఆ॥వె॥ ఈ యలక్ష్మి కడక నీ లోకముననుండి
నష్ట మయ్యెఁగాదె! స్పష్ట మాయె
మమ్ము విడిచిపెట్టి ముమ్మరంబుగ హింసఁ
బొందుఁగాక! నష్ట మొందుఁగాక! ॥ 5135

§ఆ॥వె॥ ఏ యలక్ష్మి మిగుల నెల్ల లతాఽంకూర
ములను గొట్టుచుండుఁ దొలఁగకుండ
నా యలక్ష్మి దేవ! యతి తీక్ష్ణ శృంగుఁడా!
దూరమునకుఁ ద్రోలి తొలఁగు మీవు! ॥ 5136

(3)§గద్యము ॥
విప్రకృష్టదేశమందున్నట్టియు, నిర్మాతృపురుషరహితమైనట్టియు, దారుమయమును, బురుషోత్తమాఖ్యము[1] నగు నే దేవతాశరీరము సముద్రతీరమందు జలముపైఁ బ్రవర్తించుచున్నదో! ఆ దారువును దుఃఖహననీయుఁడా! స్తోత! యుపాసింపుమా! ఆ దారుమయ దేవునివల్ల నతిశయ తరణీయ మగు నుత్కృష్ట వైష్ణవలోకమును బొందుమా! ॥ 5137

§గద్యము॥ అర్థాంతరము
దుష్టహననయుక్త! అలక్ష్మి! సముద్రతీరప్రాంతమందు జనవిహీన మైనదియు దూరదేశమందుండు నదియు నగు దారుమయ మగు నే నౌక గలదో! ఆ దారుమయ నౌకను బరిగ్రహింపుమా! ఆ దారువుచేత బ్రహ్మణస్పతివలనఁ బ్రేరితవై ద్వీపాంతరమునకుఁ బొమ్ము! ॥ 5138

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సిరింబిఠుఁడు" గాను, దేవత "దురదృష్టనింద" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

1. ఈ ఋక్కులో "పూరీ" అను నపరనామమునఁ బరఁగు శ్రీజగన్నాథక్షేత్రమునందలి పురుషోత్తముని ప్రస్తావన కలదన్న భావము సాయణాచార్యుల కున్నట్లున్నది.తన కాలమున సుప్రసిద్ధమై జగన్నాథక్షేత్రము వెలుఁగొందుచున్నందువల్ల నిట్లభిప్రాయపడియుండవచ్చును. ఈ యర్థము సాయణాచార్యులవారి భావమున కనుగుణ మైనది. చారిత్రకముగా బౌద్ధుల కాలమున స్థాపింపఁబడినదా? అన్న అనుమానమున కవకాశమున్న పూరీ జగన్నాథ క్షేత్ర మెక్కడ? ఋగ్వేద మెక్కడ?

(4)§గద్యము ॥
మండూకము వలెఁ గుత్సిత శబ్దమును జేయు నో యలక్ష్ములారా! మీరు హింసితులై యెపుడు
వచ్చెదరో! యపు డింద్రుని శత్రువు లెల్లరును బుద్బుదము వలె వ్యాపన శీలురై
హతు లయిరి నష్టు లయిరి ॥* 5139

(5)§తే॥గీ॥ పణి హృతములైన గోవులఁ బట్టు పట్టి
యంగిరస్సులకుం జేర్చి రమరవరులు
యాగము నిమిత్తమై యగ్ని నచ్చటచ్చట
స్థాపనముఁ జేసినారలు చాతురిమను ॥* 5140

§ఆ॥వె॥ ఇట్లు చేసిచేసి యింద్రాదులకు నన్న
మిచ్చి సురలు చాల మెచ్చుఁ గనిరి
సర్వ దేవతలను శత్రు పుత్రుం డెవ్వఁ
డభిభవింపఁగల్గు నతిశయించి ॥* 5141

## సూక్తము—159

ఋషి—శిరింబిఠుఁడు

దేవత—అలక్ష్మీనాశకరార్థము; 2,3-బ్రహ్మణస్పతి; 5-విశ్వేదేవతలు

### అర్థాంతరము—1

§(1) శత్రురూప తత్త్వమ్మున సర్వ ప్రకృతి హరియించుచు
వికటతతులఁ గాననాల విపుల గిరుల నావరించి
జలదమ్ముల జలవర్షక సంశక్తుల బాధించుచు
వ్యాప్తి నొందు దుష్టశక్తి వారించుచు సర్వగతుల
లక్ష్మీప్రద మౌను బ్రకృతి రంజిల్లఁగ సృష్టిలోన
దైవీయమ్మౌ భాగ్యము తనరారును మహాశక్తి ॥ 5142

(2)§క॥ లయ రూపమ్మౌ సర్వము
లయ కారక మౌను సృష్టి లక్ష్యాఽసంప
న్మయముగ వైష్ణవ మాయగ
వియత్తలాఽంతర్హితగతి విశ్వము వరలన్ ॥ 5143

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము

§(3) అపూరుషరూప మౌచు నఖిల సృష్టి రూప మౌచుఁ
బయోనిధిని దారు గతుల బ్రాహ్మ్య శక్తి వరలంగా
ననలాఽఽకాశాలు దాఁటి అఖిలమ్మును నధిగమించి
పరమపదము నొందు దివ్య ప్రాణి మహాశక్తి మెయిని ॥ 5144

§(4) చక్రగతుల సంవర్తన జలములలో సుడిగుండా
లసాధారణంపు గతుల నంతశ్శక్తిని వరలఁగ
ననల శక్తు లలరారఁగ నావిష్కృతమౌ బుద్బుద
సకలమ్మును నంతరించు సర్వమలిన సహితమ్మై ॥ 5145

§(5) సూర్యకిరణ సంశక్తులు సొరిది మేఘ జలము లొందు
శబ్దశక్తు లలరారఁగ సకల లోక గోళాలును
విశ్వేదేవత లెల్లరు విమలము లౌ దీప్తులతో
విద్యుదనిల సలిల పృథ్వి విపులాకాశ శక్తు లీయ ॥ 5146

## సూక్తము—159

ఋషి—శిరింబిఠుఁడు

దేవత—అలక్ష్మీనాశకరార్థము;2,3-బ్రహ్మణస్పతి; 5-విశ్వేదేవతలు

### అర్థాంతరము—2

§(1) ప్రకృతి సంపదలు సర్వము వరలుఁ బృథ్విగిరులలోనఁ
దరు లతలను సలిలమ్ములఁ దనరు సద్రూపములై
మలిన రహిత మహద్రూపపు మర్మసత్వ శక్తు లెల్ల
సహజ సంపదాశి గాఁగ సకల సృష్టి విరాజిలును ॥ 5147

§(2) ఆగ్నేయపు టోషధులై అఖిల సృష్టి పదార్థాలు
తనరంగా విశ్వమ్మున ననురూప చిద్గతు లవి
శాత్రవ శక్తుల నన్నిటి సంహరించుచుండు సదా।
తీక్ష్ణమైన జ్ఞాన దీప్తి దివ్యశక్తు లలరంగా। ॥ 5148

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(3) పార మెనయు సందర్భమ్మున బ్రహ్మదత్త మౌచు నిలిచి
తేలి యాడు పడవ పగిది దివ్య శబ్ద శక్తు లలర
నింగి జలధి నధిగమించి నిరత వరతరమ్మై వరలు
పరమపదము నొందు మహా ప్రాప్తి కాఁగ సకల సృష్టి ॥ 5149

§(4) సత్య పూర్ణ మహాజ్ఞాని నిత్య సృష్టి యజ్ఞమ్మునఁ
దపోరూప మహిత నిష్ఠఁ దల్లి దండ్రిగా వరలుచు
యమ నియమపు గతులు మీఱ నమరతత్త్వ శక్తులమై
నఖిలమ్మును బొందుచుండు నసాధారణంపు గతుల ॥ 5150

§(5) సహస్ర మార్గశక్తిగతుల సౌర శక్తి సంపదాళి
గుహ్యగతుల నాకళించి సహ్యముగాఁ బ్రకృతి యెల్ల
యమరతులను నఖిలమ్మును నసాధారణముగ నిల్పి
ఋషీశ్వరుల దివ్య శక్తి ధిషణ సవ్య శక్తు లొందు ॥ 5151

## సూక్తమ్—160

ఋషిః—కేతురాగ్నేయః
దేవతా—అగ్నిః
ఛందః—గాయత్రీ

(1) అగ్నిః హిన్వన్తు నో ధియః సప్తిమాశుమివాజిషు ।
తేన జేష్మ ధనంధనమ్ ॥ 1715

(2) యయా గా[1] ఆకరామహే సేనయాగ్నే తవోత్యా ।
తాం నో హిన్వ మఘత్తయే ॥ 1716

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. గా ఉ ఆకరా మహే. (వా.వ.)

(3) అగ్నే స్థూరం రయిం భర పృథుం గోమన్తమశ్వినమ్ ।
అఙ్ధి ఖం వర్తయా పణిమ్ ॥ 1717

(4) అగ్నే నక్షత్రమజరమా సూర్యం రోహయో దివి ।
దధజ్జ్యోతిర్జనేభ్యః ॥ 1718

(5) అగ్నే కేతుర్విశామసి ప్రేష్ఠః[1] శ్రేష్ఠ ఉపస్థసత్ ।
బోధా స్తోత్రే వయో దధత్ ॥ 1719

## సూక్తము—160

ఋషి—అగ్ని పుత్రుఁడు కేతువు*

దేవత—అగ్ని *

(1)§తే॥గీ॥ యుద్ధములయందు నశ్వంబు యోద్ధ లెట్లు
ప్రేరణము చేయుదురొ! యట్లు ప్రేరణంబు
చేయు నగ్నిని మా స్తుతుల్ శీఘ్రకరాగ్ని
వల్ల మే మెల్ల ధనమును బడయఁగలము ॥ 5152

(2)§ఆ॥వె॥ అగ్ని దేవ! యెట్టి యవనంబునన్ మేము
గో గణంబుతోడఁ గూడినాము!
ధనము మాకుఁ గలుగఁ దక్షణ మా యవ
నము నొసంగు! మాకు సముచితముగ ॥ 5153

1. ప్రేషః శ్రేష్ఠఽఉపస్థసత్. (వా.ప.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "కేతువు" గాను, దేవత "అగ్ని"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)§తే॥గీ॥ స్థూలమై వృద్ధ మౌచు సంశోభితాఽశ్వ
యుక్త మైనట్టి ధనమును నొసఁగు మాకు
నగ్ని వృష్టి జలంబుల నంతరిక్ష
సీమఁ దడుపుమ! దాతను జేర్చ కిచట। * 5154

(4)§తే॥గీ॥ సర్వమునకుఁ బ్రకాశంబు సరిగ నెసఁగ
సకల నక్షత్రముల సూర్యు నకలుషాఽంత
రిక్ష భాగంబునందుఁ బ్రత్యక్షముగను
స్థాపనముఁ జేసినాఁడవు! జ్వలన! నీవు॥* 5155

(5)§తే॥గీ॥ జ్ఞావయిత వౌటచేతనే జనుల కెల్లఁ
బ్రియతముండవు! శ్రేష్ఠత వెలుఁగవాఁడ
వీవు స్తుతియించు వానికి నెక్కుడైన
నన్నము నొసంగుమా! యజ్ఞమందు నగ్ని! ॥* 5156

## సూక్తము—160

ఋషి—అగ్ని పుత్రుఁడు కేతువు

దేవత—అగ్ని

### అర్థాంశము—1

(1)§రాధా వృత్తము ॥•
దివ్య సప్త వర్ణ దీప్తి తతు లలరంగా
నవ్య మైన అగ్ని నగ్న మహిత ప్రభాళుల్
భవ్య బుద్ధి శక్తి భాగ్య గరిమ లొసంగన్
అవ్యయంపు దివ్య యజ్ఞ మహిమలు మాకౌ! ॥ 5157

(2)§రవిశ్రీ వృత్తము। ‡
సూర్యసహిత మహితాగ్నుల సురిగి మెరఁగి దృశ్యగతుల
సర్వమ సవిత మహాద్భుత యమ నియమము నెల్ల జగతి
ధార్య గతులను మదీయ వితథ విరహిత సంపదల న
వార్యముల నిలిపి నింపుఁ బ్రభవ విభవ సుశక్తులమెయి ॥ 5158

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో సనూదితము.
•"శక్వరీ"ఛ్ఛందము-(14). ‡"ప్రకృతి"ఛ్ఛందము. (21)

(3)§అనల వృత్తము ॥♦
అగ్ని సూక్ష్మ మహితమ్మై అద్భుతమౌ రూపాలను
నగ్న గుహ్య గతు లొప్పన్ నైక మహాగోళాలను
దిగ్న గాల లఘు సూక్ష్మోద్దీప్త పదార్థా లన్నిట
రుగ్ణ నాశనవు సంపద్రూపముగా మా కొప్పుత! ॥ 5159

§(4) అనలము నక్షత్రమ్మై ఆకసమున వెల్గొందును
అజరత్వపు మాత గాఁగ సంతర్గతి నలరారును
దివ్యుల నైన సూర్య శక్తి దివ్య గతుల భరియించును
బ్రాజిలోక సర్వమునకు నమల నవ్య జ్యోతి నొసఁగు ॥ 5160

§(5) అనల కీల శక్తు లెల్ల నఖిలమునకు జ్ఞాన మిచ్చు
సృష్టి సర్వస్వమందు శ్రేష్ఠమ్ముగ జ్యేష్ఠమ్ముగ
స్తుతిరూపపు శబ్దశక్తి శుచిగాఁ బెంపొందఁ బెటుగు
బుద్ధి శక్తి పెంచివేయుఁ బూర్ణదీప్తి వెల్గొందుచు ॥ 5161

## సూక్తము—160
ఋషి—అగ్ని పుత్రుఁడు కేతువు
దేవత—అగ్ని

## అర్థాంతపము—2

(1)§క॥ గుప్తములౌ దివ్య రతుల
సప్తాఽగ్నులు విశ్వ సృష్టి జ్వలిత మ్మై ని
క్షిప్త మ్మౌ బహిరంతర
దీప్త గతుల ధనము శుభ ముదీర్ణత నొసఁగున్ ॥ 5162

(2)§ధీవృత్తము ॥♦
లోకాలను గోళాలను లోలువత్వ రీతులతో
నేకాలము సృష్టిష్టుల నెల్ల విశ్వ ప్రాకృత మై
ఆ కీలల రూపమ్ముల ఆకరమ్ము లై వెలయున్
ధీకారక శక్త్యాభలఁ దేజరిల్లుఁ జిన్మయ మై ॥ 5163

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"అష్టి"చ్ఛందము. (16)

§(3) అశ్వి శక్తు లలరారఁగ నఖిల సూక్ష్మ పృథు పదార్థ
సర్వ గోళ లోకాలను సకలాంతర్యామి గాఁగ
బహిఃప్రకాశమ్ము గాఁగఁ బరబ్రహ్మమందుఁ గూడ
ధన మౌచును ననలరూప! తనరారుదు! నిత్యమ్మును ॥ 5164

§(4) అమృత గతుల నజర మౌచు నగ్ని అలరి ఆకసాన
సూర్యమండలము సహితము సర్యముఁడై దాల్చి నిల్చి
సకల ప్రాణి లోకాలకు జనులకున్ సురాదులకును
దివ్యకాంతి ప్రసాదించుఁ దేజరిల్లఁజేయు సృష్టి ॥ 5165

(5)§ఆ॥వె॥ అనల కీల లెల్ల నఖిలమ్ము నన్ నిండు
సత్తు చిత్తు- లిచ్చు మిత్తి లేని
జవ్వనమ్ము నిచ్చు సంస్తుతి శబ్దాల
అక్షరాల శక్తు లక్షయముగ ॥ 5166

## సూక్తమ్—161

ఋషిః—భువన ఆప్త్యః,సాధనో వా భౌవనః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—ద్విపదా త్రిష్టుప్

(1) ఇమా ను కం భువనా సీషధామేన్ద్రశ్చ విశ్వే చ దేవాః ॥ 1720

(2) యజ్ఞం చ నస్తన్వం చ ప్రజాం చాఽఽదిత్యైరిన్ద్రః సహ చీక్లృపాతి ॥ 1721

(3) ఆదిత్యైరిన్ద్రః సగణో మరుద్భిరస్మాకం భూత్వవితా తనూనామ్ ॥ 1722

(4) హత్వాయ దేవా[1] అసురాన్ యదాయన్ దేవా దేవత్వమభిరక్షమాణాః ॥ 1723

(5) ప్రత్యఞ్చమర్కమనయఞ్ఛచీభిరాదిత్ స్వధామిషిరాం పర్యపశ్యన్ ॥ 1724

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. దేవాఽఅసురాన్. (వ్రా.ప్ర.)

## సూక్తము—161

ఋషి—ఆప్త్య పుత్రుఁడు భువనుఁడు లేక భువన పుత్రుఁడు సాధనుఁడు*
దేవత—విశ్వే దేవతలు*

(1)§తే॥గీ॥ విశ్వదేవ గణంబులు వేల్పు ఱేఁడు
సర్వభూత సమూహం బఖర్వ గతిని
బ్రీతి గాంచుచు మా కతిప్రేమ మెఱయ
సుఖము సాధించెదరుగాక! సురుచిరముగ॥ 5167

(2)§తే॥గీ॥ యాగకర్మను దనుపు పుత్రాదికమును
నదితి పుత్రులతోఁగూడు నమరవరుఁడు
నిశ్చయంబుగ వ్యాపార నిరతము లగు
నట్లు చేయునుగాక! నత్యాదరమున॥ 5168

(3)§తే॥గీ॥ అల మరుత్తులతోడను నదితి పుత్ర
సంఘములతోడ నింద్రుఁడు సహితుఁ డగుచు
మా శరీరంబులకుఁ గడు మాననీయ
రక్షకుండయి మెలఁగుత! రహిఁ జెలంగ॥ 5169

(4)§తే॥గీ॥ అసుర హననాది కార్యము లాచరించి
సహజ దామంబునకు నెప్డు చనిరొ! యప్డె
యమరగణ మెల్ల నాత్మీయమైన యమృత
తత్త్వమును బొంది యంతటఁ దనిసినారు॥ 5170

(5)§గద్యము॥
పరిచరణాత్మకము లగు కర్మలతోఁగూడ నర్చనీయ సాధన మగు స్తోత్రమును స్తోత లిందాదులను బొందింతురు. అపుడు గమన శీల మగు వృష్ట్యుదకమును జను లందఱును జూచుచున్నారు॥ 5171

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 155 సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "భువనము,సాధని" గాను, దేవత "విశ్వేదేవతలు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—161

ఋషి—ఆప్త్య పుత్రుఁడు భువనుఁడు లేక భువన పుత్రుఁడు సాధనుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

§(1) వైష్ణవీయ శక్తులతో వరలు విశ్వదేవాళులు
సుఖదుఃఖమ్ములు నిరతము నిఖిల భువన లోకాలను
వర్తిల్లఁగ దివ్యశక్తి భాగ్యగరిమ లిచ్చు జగతి
జ్ఞాన కర్మ లెల్ల సృష్టి జాగృతగతి విలసిల్లును ॥ 5172

(2)§ఆ॥వె॥ సూక్ష్మ మౌచు సర్వ సృష్టి బృహత్తర
మౌచు మహిత జగతు లమరుచుండు
నభవ శక్తు లలరు నాదిత్య వైష్ణవ
శక్తులొప్పఁ బ్రకృతి జన్న మౌచు ॥ 5173

§(3) ఆదిత్యులు వెలుఁగంగా నైంద్రి శక్తి గణాలతో
సప్త మరుత్ తతులు సృష్టి సర్వమ్మునఁ బరఁగంగా
నాకసమ్ము లనిలమ్ము లనలమ్ములు మరుదాళులు
తనురూపము లొందు నిఖిల తను బృహద్రూపాలను ॥ 5174

§(4) విశ్వ సృష్టి సర్వమ్మును విశ్వదేవ దివ్యశక్తి
దేవన ధర్మమ్ము మీఱ భావరూపగతుల మెయిని
రక్షించుచు- అసురాళుల శిక్షించుచు మహితశక్తి
నిత్య సత్య దేవత మై నిఖిలమ్మును ధరియించును ॥ 5175

§(5) ఐంద్రి మైన శచీశక్తి అర్ధాంగమ్మై వరలఁగ
సుందరతరమై సదాః విశ్వ సృష్టి యెల్ల వర్తిల్లును
అర్క- దీప్తు లొప్పంగా నఖిల యజ్ఞ తతు లలరఁగ
గతి శీలమ్మై జగతి కాల బద్ధ మై చరించు ॥ 5176

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—161

ఋషి—ఆప్త్య పుత్రుఁడు భువనుఁడు లేక భువన పుత్రుఁడు సాధనుఁడు

దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

§(1) పంచభూత రూపాలను వరలంగా సృష్టి యెల్ల
గోళాలును లోకాలును గూఢ శక్తులన్ దనరఁ
గాలబద్ధ మౌచు వరలుఁ గ్రాలంగా విశ్వదేవ
సర్వస్వము వైష్ణవీయ శక్తులతో విలసిల్లఁగ ॥ 5177

§(2) అతిసూక్ష్మ మై పరఁగుచు నఖిలమ్మును వ్యాపించుచు
నైంద్రమైన శక్తులతో నాదిత్యుల మహిమల మై
"నాభి"శక్తు లలరారుచు నానా సృష్టుల యజ్ఞము
నిరతమ్మును నెఱపుచుండు నిఖిల సామర్థ్యమ్ముల ॥ 5178

§(3) పంచభూత సంచయాలఁ బదిలమ్ముగ రక్షించుచు
ద్వాదశ రూపాదిత్యులు వరలంగా నిత్యమ్మును
మరుద్గణాల సర్వస్వము మహితమ్మై వెలయంగా
వైష్ణవీయమైన శక్తి ప్రభా దీప్త మౌను సృష్టి ॥ 5179

§(4) విశ్వ సృష్టిలోన వ్యాప్తి విషరూప మ్మొంది నిలుచు
దుష్టరాక్షసాళి నెల్లఁ దున్మాడుచు నిరతమ్మును
గాల ధర్మ బద్ధముగాఁ గ్రాలంగాఁజేసి నిలిపి
గతిమతిగా నిఖిలమ్మున ఋతగతులను వర్తిల్లును ॥ 5180

§(5) సర్వ సృష్టికర్త చేయు సకల కర్మ యజ్ఞమ్మున
ఆకసమ్ము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
మృత్ తతులును జలశీతలోష్ణగతుల కాలములై
చక్రనేమి క్రమముగాఁగ సంవర్తన మౌను సృష్టి ॥ 5181

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—162

ఋషిః—చక్షుః సౌర్యః

దేవతా—సూర్యః

ఛందః—గాయత్రీ; 2-స్వరాట్

(1) సూర్యో నో దివస్పాతు వాతో[1] అన్తరిక్షాత్ ।

అగ్నిర్నః పార్థివేభ్యః ॥ 1725

(2) జోషా సవితర్యస్య తే హరః శతం సవాగ్ం[2] అర్హతి ।

పాహి నో దిద్యుతః పతన్త్యాః ॥ 1726

(3) చక్షుర్నో దేవః సవితా చక్షుర్న[3] ఉత పర్వతః ।

చక్షుర్ధాతా దధాతు నః ॥ 1727

(4) చక్షుర్నో ధేహి చక్షుషే చక్షుర్విఖ్యై తనూభ్యః ।

సం చేదం వి చ పశ్యేమ ॥ 1728

(5) సుసన్దృశం త్వా వయం ప్రతి పశ్యేమ సూర్య ।

వి పశ్యేమ నృచక్షసః ॥ 1729

---

1. వాతోఽఅన్తరిక్షాత్, 2 సవాగ్ంఽఅర్హతి, 3. చక్షుర్నఽఉత. (వా.ప.)

## సూక్తము—162

ఋషి—సూర్యపుత్రుఁడు చక్షుస్సంజ్ఞుఁడు*
దేవత—సూర్యుఁడు*

(1)§తే॥గీ॥ దివమునందున సూర్యుఁడు దీప్తిఁ గొనుచు
మమ్ము రక్షించుఁగాకఁ దా మాన్య వాయు
వంతరిక్షమునందున నగ్ని పృథ్వి
యందు రక్షించెదరుగాక! సాదరమున ॥ 5182

§క॥ సేవింపుము! మా సంస్తుతి
తావక తేజస్సు సవిత! తనువును నిష్టిం
జేవ గల శక్తివల్లన్
గావుము! మము నీవు సహజ కరుణను గనుచున్ ॥ 5183

(2)§తే॥గీ॥ సవిత యనువాఁడు వాసవ సఖుఁడు కూడ
మాకుఁ జక్షుస్సు నిడుదురుగాక! మఱియు
ధాతయున్ మాకు జక్షుస్సు తప్పకుండ
నిచ్చుఁగావుత! మే మెల్ల మెచ్చునటులు ॥ 5184

(3)§తే॥గీ॥ అఖిల రూపములం జూడ నమల మైన
తేజము నొసంగుమా! మాకు దినకరుండ!
చక్షురింద్రియమును మాకుఁ జాతురిమను
నీవు మా కిమ్ము! సంప్రీత నిశ్చల మతి ॥ 5185

(4)§తే॥గీ॥ తావకం బౌ ప్రకాశంబు తరణి! మాకు
నీ వొసంగినచో దాన నిఖిలము కడుఁ
జూచి ద్రష్టల మగుదుము సూర్య! పిదప
వివిధమును జూచువార మై వెలయఁగలము ॥ 5186

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "చక్షుస్సు"గాను, దేవత "సూర్యుఁడు"గాను, శ్రీ సేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(5)§తే॥గీ॥ సుష్ఠు సందష్ట మైనట్టి సూర్య! నిన్ను
నెలమిఁ జూచెదమయ్య! ప్రత్యేకముగను
మానవాళికి ద్రష్టవ్య మైన వస్తు
జాతమును జూచెదము మేము పూతమతిని ॥* 5187

## సూక్తము—162

ఋషి—సూర్య పుత్రుఁడు చక్షుస్సంజ్ఞుఁడు
దేవత—సూర్యుఁడు

### అర్థాంతరము—1

(1)§దివాకర వృత్తము ॥♦
దివాకర దివ్యశక్తి తేజోఽన్విత మౌచు సృష్టి
నవారిత మైన అంతరిక్షాఽనిల చిత్రభాను
దివమ్ముల తోయ పృథ్వ్యాదీశాఽమల వేల లెల్ల
జవాఽన్విత మౌచు నిత్య సత్యమ్ముగ రక్ష నిచ్చు ॥ 5188

(2)§అర్యమ వృత్తము ॥‡
శబ్దశక్తి స్వీకరించి జ్వలియించుచు నిత్యమ్మును
నబ్దరూప సంచయాల నఖిలమ్మును జక్ర క్రమ
తాఽబ్ది మేఘరూప మౌచు నలరొందఁగఁ జేసి వేల
లబ్ద కాల బద్ధ మౌచు నరుణుం డలవోక వెల్గు ॥ 5189

(3)§ప్రభాకర వృత్తము ॥‡
సవిత చక్షు వౌను మాకు సర్వ దేవతాళి కౌను
నవితథమ్ముగా స్థితీశతాఽద్రి చక్షు వౌను దీప్తి
సవిత ధాత చక్షు వౌను సర్వ సృష్టి చక్షు వౌను
బ్రవిమలంపు దివ్య దృష్టి ద్వాదశాత్ముఁ డిచ్చు మాకు! ॥ 5190

(4)§విభాకర వృత్తము ॥ ǂ
అతిసూక్ష్మ చ్చొ రతులను నంతరాఽంతరములఁగూడ
నతిలోక మ్మైన మహిత హార్ద దివ్య సుచలనాల
నతివేల మ్మైన గతుల సార్థకంపు నయనంపు
యుతకమ్మును దివ్య ప్రభల నొప్పఁజేయు రవి దీప్తి ॥ 5191

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
♦"అష్టి"చ్ఛందము (16). ‡"అత్యష్టి"చ్ఛందము (17). ǂవరస్థాన విషమవృత్తము.

(5)§జగచ్చక్షు వృత్తము ॥•
అఖిల సృష్టిఁ జూచునట్టు లగ్ని దీప్తు లొప్పంగా
మఖ మహత్త్వ సూర్యదేవు మండు జ్వాలలన్ జూడన్
సుఖమయాఽమృతంపు దివ్య సూక్ష్మ చాంద్ర దృక్ఛక్తులు
విఖనసాఽద్భుతంపు శక్తి విశ్వమందు వెల్గొందును ॥ 5192

## సూక్తము—162

ఋషి—సూర్య పుత్త్రుఁడు చక్షుస్సంజ్ఞుఁడు
దేవత—సూర్యుఁడు

### అర్థాంతరము—2

(1)§హిమాఽంశు వృత్తము ॥*
హిమాఽంశు రూప దివ్యకాంతి నెన లేని తెలి వెన్నెల
లమాతృకంపు స్వర్గ సీమ నతివేలపు మహాగతి
సమాదృతిన్ మహాఽంతరిక్ష జల వాతాఽనిల పృథ్వీల
క్షమాధృతిన్ మమున్ సదా! విశద శక్త్యాళులఁ గావుత! ॥ 5193

(2)§సుధాంశు వృత్తము ॥‡
సవిత శత యజ్ఞములై శర్వ విష్ణు బ్రహ్మ లౌచు
నవికలిత దివ్య మహా హార్ద కాంతి పుంజ మెల్ల
దివి భువుల సర్వము నుద్భూత నిత్య నవ్య శక్తి
నవిరళత మై నఖిల మ్మందు రక్ష నిచ్చుఁ దాన్ ॥ 5194

(3)§కళానిధి వృత్తము ॥*
భగవంతుఁడు చక్షువుగా వరలునులే! మా కెప్పుడు
గగనేశుఁడు చక్షువుగాఁ గడిఁదిగ వర్తిల్లున్ గద!
అగ సంస్థితి చక్షువుగా నలరునులే! మా కెప్పుడుఁ
దగు ధాతయె చక్షువు మా తనువరమై యిచ్చున్ గృప ॥ 5195

(4)§శుభ్రాంశు వృత్తము ॥‡
చక్షువు మా కొసఁగుచుండు జగచ్చక్షు దివ్యశక్తి
చక్షువు మా సుతుల కిచ్చు సదా వంశ దీప్త కాంతి
చక్షువు సూక్ష్మమయి సృష్టి జగత్స్వరూప జాల
మక్షయమౌ నమృత దివ్య యమాఽస్వీత దృష్టి నిచ్చు ॥ 5196

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
• పరస్థాన విషమవృత్తము. *"ధృతి"చ్ఛందము (18). ‡"అత్యష్టి"చ్ఛందము (17).

(5)§శశిధర వృత్తము ॥♦
అమృతమైన నీ కాంతుల నమృతదృష్టి నొంది మేము
అమిత సూర్య దీప్తాఽజ్వలనయిన మాదు కన్ను లిందు।
తపము లేక నీ శక్తుల ధరణ ధారణంపు రీతి
శమ దమంపు సర్వస్వము జయము గాఁగఁ జూతు మేము॥ ॥ 5197

## సూక్తమ్—163

ఋషికా—పౌలోమీ శచీ
దేవతా—శచీ (ఆత్మానం తుష్టావ)
ఛందః—అనుష్టుప్

(1) ఉదసౌ సూర్యో[1] అగాదుదయం మామకో భగః ।
అహం తద్విద్వలా పతిమభ్యసాక్షి విషాసహిః ॥ 1730

(2) అహం కేతురహం మూర్ధా ఽహముగ్రా వివాచనీ ।
మమేదను క్రతుం పతిః సేహానాయా[2] ఉపాచరేత్ ॥ 1731

(3) మమ పుత్రాః శత్రుహణో ఽథో మే దుహితా విరాట్ ।
ఉతాహమస్మి సంజయా పత్యౌ మే శ్లోక[3] ఉత్తమః ॥ 1732

(4) యేనేన్ద్రో హవిషా కృత్వ్యభవద్ ద్యుమ్న్యుత్తమః ।
ఇదం తదక్రి దేవా[4] అసపత్నా కిలాభువమ్ ॥ 1733

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦""ధృతి"చ్ఛందము (18).

1, సూర్యోఽఅగాత్, 2. సేహానాయాఽఉపాచరేత్, 3. శ్లోకఽఉత్తమః, 4. దేవాఽఅసపత్నా. (వా.ప్ర.)

(5) అసపత్నా సపత్నఘ్నీ జయన్త్యభిభూవరీ ।
అవృక్షమన్యాసాం వర్చో రాధో[1] అస్థేయసామివ ॥ 1734

(6) సమజైషమిమా అహం సపత్నీరభిభూవరీ ।
యథాహమస్య వీరస్య విరాజాని జనస్య చ ॥ 1735

## సూక్తము—163

ఋషిక—పులోమ తనయ శచి*

దేవత—పులోమ తనయ శచి(ఆత్మ తృప్తి)*

(1)§తే॥గీ॥ సూర్యుఁ డుదయించె మామక సువతి సూర్య
రూపము నుదయ మయ్యెను జూపుతోడఁ
బతిని వశ్యని జేసి సపత్నులఁ గడు
నభిభవించితిఁగాదె! నే నతిశయముగ ॥ 5198

(2,3)§సీ॥ అఖిలంబునకు జ్ఞాతి నగుచుండి జగమును నిఖిల ప్రధాననై నెగడు దానఁ
గోప వశిష్ఠుఁడౌ నా పతి ప్రియ వచనాంచితుఁ గాఁ జేసి యమరు దాన
నా కనుకూలుఁడై నా భర్త మెలఁగెడునట్లు కావించుచు నరుగు దాన
నా మహా సూనులు నాదు సపత్నులఁ గొట్టెడు వారిగాఁ గూర్చు దాన
తే॥గీ॥ మఱియు నేను విపక్షుల కరమర నిడి,నభిభవంబును గూర్చుట నఱయు దాన
నిట్టి హేతువువల్లనే యింద్రునందు,నాదు కీర్తి విరాజిల్లు మోద మలర ॥ 5199

(4)§ఆ॥వె॥ ఏ హవిస్సుచేత నింద్రుఁడు కర్మకుఁ
గర్త యగుచు నుండి కాంతి యశము
కలిగియుండి మఱియు ఘనుఁ డౌచు నుండును
నా హవిస్సు నందుఁ డఖిల జనులు ॥ 5200

---

1. రాధోఽఅస్థే. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "శచి, పౌలోమి" గాను, దేవత "శచిపౌలోమి"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§తే॥గీ॥ అట్టి హవ్య రసంబునే యధిగమించి
వెలుఁగుచుండుటచేతనే విశ్వమందు
వివిధ శత్రు విహీననై వేడ్కఁ మెఱయఁ
గడు విరాజిల్లుచున్నాను ఘనతఁ జెంది ॥* 5201

(5)§గద్యము ॥
శత్రుహంత్రి నగుటచే జయమును బొందుచున్న దాననై అభిభవిత్రి నగుటచేత నేను శత్రుహీన నగుచున్నాను. అస్థిరతరులగు శత్రువుల ధన మెట్టు లప్రయత్నమున హరియింపఁబడునో; యట్లు నేను సపత్నుల తేజస్సును ధనమును హరియించితిని ॥* 5202

(6)§తే॥గీ॥ ఇంద్రునకుఁ దజ్జనాఽఽళికి నెల్ల రాజ
మాననై యుంటచే ననుమాన మెంత
యేని లేకుండ శత్రుల నెల్ల నభిభ
వించితిని నే మహాలోక మెంచునటులు ॥* 5203

## సూక్తము—163

ఋషిక—పులోమతనయ శచి

దేవత —పులోమతనయ శచి(ఆత్మ తృప్తి)

### అర్థాంతరము—1

(1)§తే॥గీ॥ సూర్యుఁ డుదయించు సౌభాగ్య శోభ లొప్ప
మాకు మాంగళ్య ప్రాప్తమ్ము మహిత మౌను
మాదు పతి మాకు జగతి సంవర్ధనుఁ డగు
మాదు వైరి సర్వస్వమున్ మట్టి కఱవ ॥ 5204

(2)§తే॥గీ॥ జ్వాల కేతువు లెల్లను వేల లెనసి
మూర్ధ దీప్తుల నుగ్రమై మూర్త మగును
సృష్టి క్రతువును ననుసరించి సువిశాల
ప్రకృతి కనురూప గతుల మై వరలు నగ్ని! ॥ 5205

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)§క॥ నావల్ల జనించు ననల
మ్మే వేలల నైనఁ బుత్రి వృత్తుల వోలెన్
బ్రావృడ్గతి నా దీప్తులు
వావిరి సృష్టిని విశాల భాగ్యము నొందున్ ॥ 5206

(4)§క॥ దివి భువులను విష్ణ్వధిపతి
హవిషమ్ముల నెల్ల నింగి నద్భుత గతి మైఁ
బ్రవిమల మౌ స్వీకృత కృతి
నవితథముగఁ బరిగ్రహించు నాకాశ గతిన్ ॥ 5207

§ఆ॥వె॥ పతి సుపత్నిఁ బోలి పర్వంగఁ బ్రకృతియె
దైవ రూప మైన ధర్మ గతుల
నలర సృష్టి యజ్ఞ మపురూప గతుల మైఁ
దనరు నిత్య సత్య జనన గతుల ॥ 5208

§(5) అనుబంధపు బంధాలను ననుబంధ శక్తుల మై
విధ్వస్తము కావించుచు విశ్వ సృష్టి వర్తిల్లఁగ
విజయ మొందు నిత్యమ్మును విపుల సృష్టి వృక్షము పైఁ
బ్రకృతి పురుష తత్త్వ మెనసి సుకృత మౌ నిత్యగతుల ॥ 5209

§(6) ప్రకృతుల పైఁ బురుషశక్తి వర్తిల్లఁగఁ బతి గతిగా
సృష్టిలోని ప్రాణరూప శివతత్త్వము తనరారును
దేజరిల్లు నరుణుని కే దివ్య పత్ని చందమామ
భాతి గాఁగఁ బ్రకృతిలోనఁ బర్వెద నేఁ బత్నిశక్తి ॥ 5210

§ఆ॥వె॥ విశ్వ ప్రకృతి పైని విమల శక్తులు మీఱఁ
బురుష శక్తి విజయ పూర్తి నొందుఁ
బురుష శక్తి నిండి పూర్ణ వికాసాల
బహు ముఖాల ఫలముఁ బ్రకృతు లిచ్చు ॥ 5211

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—163

ఋషిక—పులోమ తనయ శచి

దేవత—పులోమ తనయ శచి (ఆత్మ తృప్తి)

### అర్థాంతరము—2

§(1) విరాడూ్రప ప్రకృతిలోన వేవెల్గుల సూర్యుఁ డొప్ప
నుదయించును నిత్యమ్మును నుజ్జ్వలముగ నింగి ప్రకృతి
నా గగనము నగ్నమ్మై నవ్య కాంతు లొప్పారఁగఁ
బ్రకృతిలోన విషాఽమృతము లకృత గతుల వర్తిల్లును॥ 5212

(2)§క॥ నేనే! కేతువు నౌచును
నేనే! యీ విశ్వ సృష్టి వెలుఁగుల నౌదున్
నేనే! సువిరాట్పూరుషు
జ్ఞాన మహాక్రతువు గాఁగఁ జైతన్య గతిన్॥ 5213

(3)§క॥ నా కాంతుల పుత్రిలు మహ
దాకృతి శత్రుతతి జగతి నస్తంగతమై
ప్రాకృత గతి వర్తిల్లఁగ
వీఁకమెయిన్ విశ్వసృష్టి విలసిల్లు సదా!॥ 5214

§(4,5) హవిషకర్మ వాహకర్త అనలమ్మై అలరంగా
నుత్తమ గతి గగనమ్మది ఉండును లేకుండఁగూడఁ
బ్రకృతి పత్ని గాఁగ సృష్టి వరల దైవీయ సుశక్తులు
సపత్నిగాఁగ నిత్యమ్మును జ్వలితమ్మౌ పురుషగతుల
శత్రు రహిత శక్తులతో జయ రూపపు దీప్తులతో
నసపత్నతఁ బ్రకృతి వరల నా సపత్నత లంతరింప
విశ్వ సృష్టి ప్రకృతిలోన విమలమ్మౌ దివ్యశక్తి
ఆ అరుణుని మహాతేజమై తనరును నిత్యమ్మున్॥ 5215

(6)§ఆ॥వె॥ అఖిల సృష్టిలోన నలరు సపత్నిగాఁ
బ్రకృతిపైని బురుష భాగ్య గరిమ
విజయవంత మౌను విశ్వజ ప్రాణాల
వీర్య శక్తు లెల్ల విస్తరిలఁగ॥ 5216

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—164

ఋషిః—పూరణో వైశ్వామిత్రః

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) తీవ్రస్యాభివయసో[1] అస్య పాహి సర్వరథా వి హరీ[2] ఇహ ముంచ ।

ఇన్ద్ర మా త్వా యజమానాసో[3] అన్యే ని రీరమన్ తుభ్యమిమే సుతాసః ॥ 1736

(2) తుభ్యం సుతాస్తుభ్యము సోత్వాసస్త్వాం గిరః శ్వాత్ర్యా[4] ఆ హ్వయన్తి ।

ఇన్ద్రేదమద్య సవనం జుషాణో విశ్వస్య విద్వాగ్ం[5] ఇహ పాహి సోమమ్ ॥ 1737

(3) య[6] ఉశతా మనసా సోమమస్మై సర్వహృదా దేవకామః సునోతి ।

న గా[7] ఇన్ద్రస్తస్య పరా దదాతి ప్రశస్తమిచ్చారుమస్మై కృణోతి ॥ 1738

(4) అనుస్పష్టో భవత్యేషో[8] అస్య యో అస్మై రేవాన్ న సునోతి సోమమ్ ।

నిరరత్నౌ మఘవా తం దధాతి బ్రహ్మద్విషో హన్త్యనానుదిష్టః ॥ 1739

(5) అశ్వాయన్తో గవ్యన్తో వాజయన్తో హవామహే త్వోపగన్తవా[9] ఉ ।

ఆభూషన్తస్తే సుమతౌ నవాయాం వయమిన్ద్ర త్వా శునం హువేమ[10] ॥ 1740

---

1. వయసో౽అస్య, 2. వి హరీ౽ఇహ, 3. యజమానాసో౽అన్యే, 4. శ్వాత్ర్య౽ఆ, 5. విద్వాగ్ం౽ఇహ, 6. య౽ఉశతా, 7. న గా౽ఇన్ద్ర, 8. భవత్యేషో౽అస్య యో౽అస్మై, 9. గన్తవా౽ఉ. 10. హవేమ. (వ్రా.ప్ర.)

## సూక్తము—164

ఋషి—విశ్వామిత్ర పుత్రుఁడు పూరణుఁడు*
దేవత—ఇంద్రుఁడు*

(1)§తే॥గీ॥ తీక్ష్ణము మదకరంబయి తేజరిల్లు
సోమమును ద్రావుమా! యింద్ర! నీమ మలర
సరణ శీల రథాఽంచిత హరుల యజ్ఞ
మందు విడువుము! వాసవా! యంద మొప్ప ॥ 5217

§తే॥గీ॥ ఇతరు లైనట్టి యజమాను లెల్ల నీకు
సంతసము కూర్పకుండుత! నెంతయేని
నీ నిమిత్తమె సోమముల్ నిఖిల వంద్య!
యభిషుతములయి యంతట నమరుచుండు ॥ 5218

(2)§తే॥గీ॥ ఇంద్రుఁడా! నీ నిమిత్తమె యెల్ల సోమ
మభిషితం బయ్యె నంతట వ్యాప్తిఁ గాంచు
నాశు ధారగ వచ్చెడు నమల వాక్కు-
లెల్ల నినుఁ బిల్చుచుండె నీ యుల్ల మలర ॥ 5219

§తే॥గీ॥ ఇంద్రుఁడా! యిట్టి కాలాన నీ మహా స
వనము లోనగు కర్మలఁ గనుచు నీవు
సర్వ విజ్ఞాతవై యిట్టి సవనమందు
సోమమును ద్రావుమా! నీవు శోభకొఱకు ॥ 5220

(3)§గద్యము ॥
కామయమానమున వికలము నగు మనస్సుతో నింద్రుని గోరి యే యజమానుఁడు
సోమాఽభిషవమును జేయునో! వాని నింద్రుఁడు నశింపఁజేయఁడు. వానికి
శుభకరము కావుననే ప్రశస్తమైన ధనమునే ప్రసాదించుచున్నాఁడు ॥ 5221

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "పూరణుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(4)§చ॥ ఎవఁడు మహేంద్ర దేవునకు నిచ్చునొ సోమ రసంబు నట్టి మా
నవుని సుదృష్టినిం బడు ననారత మాతఁడు వాని కెంతయే
నవన మొసంగుచుండుఁ దన హస్తము నాతని కూత యిచ్చి యా
భువిఁ గలవాని శత్రువుల పొంక మడంచఁగ నుక్తుఁ డయ్యెడున్ ॥* 5222

(5)§సీ॥ అశ్వ సంతతుల నాశించుచున్ మేము సుఖ మొసంగెడు నిన్నుఁ జూడఁగలము
గో గణంబుల నెల్లఁ గోరుచుండెడు మేము సుఖ మొసంగెడు నిన్నుఁ జూడఁగలము
స్థిరతరాఽగ్నుల వెల్గఁజేయుచుండెడు మేము సుఖ మొసంగెడు నిన్నుఁ జూడఁగలము
బహ్వన్నమును బ్రీతిఁ బడయుచుండెడు మేము సుఖ మొసంగెడు నిన్నుఁ జూడఁగలము
గీ॥ వాసవుఁడ! సుప్రశస్తమై భాసమాన,మైన నీబుద్ధియందున నమరుచున్న
వారమై సౌఖ్య మిచ్చెడు పరమ దాత,వైన నినుఁ బిల్చెదము మే మవార్యగతిని ॥* 5223

సూక్తము—164
ఋషి—విశ్వామిత్ర పుత్రుఁడు పూరణుఁడు
దేవత—ఇంద్రుఁడు

అర్థాంతరము—1

(1)§ధామనిధి వృత్తము ॥♦
వివిధ కాల రథాలతో విశేషమైన దీప్తి తతులు
పరివిమలంపు సువీర్య భద్ర శక్తు లౌను సర్వప్రకృతి
అవిరళమ్మయి నిత్య సత్యగప్రసారముల్ వరలఁగఁ
బవిజ శక్తి మహేంద్ర! సర్వ శత్రుతండమున్ దునుముము! ॥ 5224

§(2) సృష్టి యెల్ల నీకొఱకే! సృష్టి స్థితి నీకొఱకే!
త్రికాలాల సకల దిశల ఋతగతులను వర్తిల్లెడి
శబ్ద నిశ్శబ్ద శక్తి సంచయాల నదమలముగ
నైహిక విద్వాంసు లెల్ల రమర శ్రుతిగ నుచ్చరించు
విమల మంత్ర రాజములన్ విశ్వ సృష్టి యజ్ఞమ్మున
విష్ణుదేవ! సోమాఽమృత వృష్టి నిచ్చి కాపాడుమ! ॥ 5225

§(3) దివ్య దేవ కామమ్ముల భవ్యయజ్ఞ తతు లొనర్చి
మనోరూప మహా శక్తి మహితమ్ముగ నజయ్యమై
అలరంగా మహావిష్ణు వఖిల గోళ లోకాలకు
నమృత శక్తి నిచ్చి సృష్టి నలరించును స్థితిగతులను ॥ 5226

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము
♦"అతిధృతి"చ్ఛందము. (19)

§(4) సోమాఽమృత మంత్రరాజ శుభ పదముల వినుచునుండి
ప్రత్యక్షర స్వచ్ఛ గతుల నిత్య సత్య శక్తి నిచ్చి
బ్రహ్మమ్మును ద్వేషించెడి పాపాత్ముల వధియించుచు
సచ్చిత్తుల తత్త్వమ్మును సర్వ గతుల నిల్పును హరి ॥ 5227

§(5) కాంతితతులు కోరి సదా! కైమోడ్పులు సేతు మీకు
సకల లోక సుఖముఁ గోరి అకలుషముగ దండ మిడుదు
మఖిల ప్రకృతి శుభముఁ గోరి యజ్ఞాఽగ్నుల జ్వలింపఁజేయు
సోమ శక్తు లొసఁగి విష్ణు! సృష్టి నెల్ల రక్షింపుమః ॥ 5228

## సూక్తము—164

ఋషి—విశ్వామిత్ర పుత్రుఁడు పూరణుఁడు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

§(1) విశిష్టమౌ సంచలనపు విలోలత్వ శక్తుల హరి!
కాల రథమ్ములను విడిచి కరుణ రక్షించు! సృష్టి
సద్భావపు సత్య గతుల సకలమ్మున నియమ రతుల
సంతానమ్మౌ సృష్టికి జనకుఁడుగా మాత గాఁగ! ॥ 5229

§(2) చరాఽచరమ్ములై వరలెడి సర్వ సృష్టి శబ్దతతులు
కాంతి జాల సర్వస్వము క్రతు వౌచును విష్ణుకి ప్రియగ
వర్తిల్లుచు నిత్యమ్మును బరమాఽమృత సోమమ్మది
విశ్వమ్మున వర్షించెదు! వెలుఁగఁజేసి జ్ఞాన ప్రకృతి ॥ 5230

§(3) సోమ పూర్ణ మనశ్శక్తి శుభ్ర సర్వ హృదంతరాల
దేవ కామ రూపాశుల దివ్యత్వము తెలియ నౌను
సకల శ్రేయఃకరమై సర్వ గోళ లోకాదులు
పరా ప్రాప్తిద చలనాలను బయనించును హరి కృపమై ॥ 5231

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(4) నిత్య స్పష్టతన్ వెలిఁగెడి నిఖిల ప్రకృతి సంపదగా
సోమాఽమృత దివ్య సృష్టి సృష్టి నెల్ల నవియింపఁగ
బ్రహ్మ విష్ణు మహేశ్వరాఽపవర్గ సర్వ విద్వేషుల
సంహరించి- సచ్చిత్తుల సదాః కాపాడునుః హరి ॥ 5232

§(5) సృష్టిలోనఁ బ్రసరించెడి వ్యష్టి సమిష్టి కాంతితతులు
సకల గోళ లోకాలును సంచరింప ధరించుచున్
నిత్య నవ మ్మైన సుమతి సత్యశక్తు లమరొందఁగ
హరి వర మై సృష్టి యజ్ఞ మలరారును ననునిత్యము
నఖిల జగతిః శుభద గతుల హవన మ్మై వర్తిల్లుదుః
ప్రకృతి సహజమైన అగ్ని ప్రజ్వలిఁగ దీధితులను ॥ 5233

## సూక్తమ్—165

ఋషిః—ప్రాజాపత్యో యక్ష్మనాశనః
దేవతా—ఇన్ద్రాగ్నీ, రాజయక్ష్మఘ్నం వా
ఛందః—త్రిష్టుప్; 5-7-అనుష్టుప్

(1) ముంచామి త్వా హవిషా జీవనాయ కమజ్ఞాతయక్ష్మాదుత రాజయక్ష్మాత్ ।
గ్రాహిర్జగ్రాహ యది వైతదేనం తస్యా[1] ఇన్ద్రాగ్నీ ప్ర ముముక్తమేనమ్ ॥ 1741

(2) యది క్షితాయుర్యది వా పరేతో యది మృత్యోరన్తికం నీత[2] ఏవ ।
తమా హరామి నిర్ఋతేరుపస్థాదస్పార్షమేనం శతశారదాయ ॥ 1742

(3) సహస్రాక్షేణ శతశారదేన శతాయుషా హవిషాహార్షమేనమ్ ।
శతం యథేమం శరదో నయాతీన్ద్రో విశ్వస్య దురితస్య పారమ్ ॥ 1743

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. తస్యాఽఇన్ద్రాగ్నీ, 2. నీతఽఏవ. (వా.ప్ర.)

(4) శతం జీవ శరదో వర్ధమానః శతం హేమన్తాఞ్ఛతము వసన్తాన్ ।

శత మిన్ద్రాగ్నీ సవితా బృహస్పతిః శతాయుషా హవిషేమం పునర్దుః ॥ 1744

(5) ఆహార్షం త్వావిదం త్వా పునరాగాః పునర్నవ ।

సర్వాఙ్గ సర్వం తే చక్షుః సర్వమాయుశ్చ తేఽవిదమ్ ॥ 1745

•(6) ఊర్ధ్వరేఖా వ్రి దహన్తే విష్ణురిమమిన్ద్రాగ్నీ అమృతం జుషేథామ్ ॥ 1746

•(7) మహ్యం దధానా ఉప దీర్ఘ మాయురస్మే ధత్తం పురుమజా పురన్ధిః ॥ 1747

## సూక్తము—165

ఋషి—ప్రజాపతి పుత్రుఁడు యక్ష్మ నాశనుఁడు*

దేవత—ఇంద్రాగ్నులు లేక రోగ నాశకము*

(1)§తే॥గీ॥ శ్రీలు గలుగంగ లోకానఁ జిరము బ్రతుకు
మోయి! యక్ష్మా ఽభిభూతుఁడా! హోమమునను
నీకుఁ గల యక్ష్మ రోగంబు[1] నిన్ను వేగ
విడుచు నట్టులు సేయుదు వివిధ గతుల॥ 5234

§ఆ॥వె॥ రాజ యక్ష్మనుండి యోజనుండా! నిన్ను
విడిచిపుచ్చు నపుడు వేగ గ్రహణ
శీలి దేవి రోగిఁ జేరు నద్దానిని
నగ్ని యడఁచుఁగాక! హరియు నటులె॥ 5235

•ఋగ్వేదము దశమమండలములోని యీ 165వ సూక్తములోఁ గొన్ని వ్రాతప్రతులలో 6,7 మంత్రములుగా రెండు ఋక్కు లధికముగాఁ గలవు. ఈ ఋక్కులను గొందఱు "ఖిల" మంత్రములుగా భావింపఁ, గొందరు పరిశిష్టము లనియుఁ, గొందరు పాఠాంతరము లనియు, మరి కొంద రధికపాఠము లనియు, వేరొక కొందరు ప్రక్షిప్తము లనియు భావించిరి. ("ఖిల" మంత్ర నిర్వచనమునకై 148వ పుట చూడ నగును.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "యక్ష్మనాశనుఁడు" గాను, దేవత "దుఃఖ నివారణము" గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

1.ప్రాచీనకాలమున నార్యులకు వచ్చెడి రోగములలో యక్ష్మరోగ మొకటి యున్నట్లు దీనినిబట్టి గ్రహింపవచ్చును. ఇయ్యది అస్థులందునుగూడ జనించుచున్నట్లున్నది.

(2)§సీ॥ పురుషుండు రోగ సంపూర్ణుండై యున్నను వానిని బ్రతికింపఁజూనఁగలను
భూ లోకముననుండి పోవంగనున్నను వానిని బ్రతికింపఁజూనఁగలను
క్షీణాయువును గల్గి క్షీణించియున్నను వానిని బ్రతికింపఁజూనఁగలను
యముని సమీపంబునందు మెలంగిన వానిని బ్రతికింపఁజూనఁగలను
తే॥గీ॥ బురుషు నిటువంటి వానిని బరమ మృత్యు,దేవికడనుండి వేగము తెచ్చి నూరు
వత్సరంబులు జీవింపవలయు బలము,కలుగువానిగఁ జేయుచుఁ బొలుత నేను ॥ 5236

(3)§గద్యము ॥
ఇంద్రుఁడీ పురుషుని నెట్లు శత వత్సరకాలము దుఃఖపారముఁ బొందించెనో! యట్లు బహు చక్షుస్కము, శత శారద వత్సరము, శతసంవత్సరపరిమిత జీవము గల హవ్యము చేయ యక్ష్మ గృహీత మానవుని రోగవిహీనునిగాఁ జేసెను ॥ 5237

(4)§తే॥గీ॥ యక్ష్మ రోగ విముక్తుఁడా! యహరహంబు
నీవు వృద్ధిని గాంచుచు నిశ్చల మతి
శత శరదృతు[1]కాలంబును సకల జీవ
సుఖద హేమంత శతకంబు నూటి మీఁదఁ
బ్రాణములఁ దాల్చియుండుమా! ప్రకృతియందు ॥• 5238

§తే॥గీ॥ అల బృహస్పతి సవితయు నగ్ని యనెడు
వాఁడు వాసవుండున్ శత వత్సర మిత
మైన యాయుస్సునకు హేతువౌ హవిస్సు
నొంది పురుషుని మాకయి యొసగిరికద! ॥ 5239

(5)§తే॥గీ॥ వ్యాధి ముక్తుఁడ! నిను మృత్యు బాధనుండి
నేను దప్పించినాఁడను నిశ్చల మతి
మఱియు నభినవతం దాల్చి పరమ తుష్టి
నీవు నాకడకున్ రమ్ము! నిశ్చయముగ ॥ 5240

§తే॥గీ॥ అవికలాంగ! సమంచిత! యమల పురుష!
నీవు నింద్రియ వర్గంబు నేఁటిమిమెయిఁ
బొందినాఁడవు! నీకు సంపూర్ణ జీవ
నంబు సంపాదితం బయ్యె దంబు మీఱ ॥ 5241

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరమున ననూదితము.
1. ఈ ఋక్కు కాలమునఁ జైత్రమున శరదృతు వుండియుండ నగు నని కొందఱు భావించిరి.
•పంచపాది.

§(6) ఇంద్రాగ్నుల నూర్ధ్వగతుల నెంతేనియు నణఁచివేసి
విష్ణుశక్తి నమృతమ్మును విశ్వమ్మున కొసఁగు సదా! ॥♦ 5242

§(7) పురోగతుల సంపదాశి పూర్ణమ్మై వరలంగా
నత్యంతము దీర్ఘమైన ఆయుర్దాయమ్ము నాకు
నలరింపుమ! విష్ణుదేవ! అఖిలమ్మును దత్తముగా! ॥♦ 5243

## సూక్తము—165

ఋషి—ప్రజాపతి.పుత్రుఁడు యక్ష్మనాశనుఁడు
దేవత—ఇంద్రాగ్నులు లేక రోగనాశకము

### అర్ధాంతపము—1

§(1) విశ్వ సృష్టి సంక్షేమము విమలమ్ముగ నెఱపుచుండు
ప్రజాపతి పుత్రుఁడవౌ రజనీ బాంధవ! చంద్ర!
సలిల సంక్షేమార్థమ్మై సదుదయ మగుము! సదా!
నీదు యక్ష్మ రోగ మ్మది నిర్మూలన మౌచు సృష్టి
వైష్ణవీయమైన నీ ప్రభా దీప్త దివ్య రుచులు
ప్రకృతిలోని ఓషధులను ప్రాణప్రదములుగఁ జేయును ॥ 5244

(2)§ఆ॥వె॥ పృథ్వి మీఁదఁగాని విశ్వమందేదైన
మృత్యు వంతిక గతి సత్య మగును
అయిన శత శరత్తు లాయురారోగ్యాల
బ్రతుక రోగహరత వరలుఁగాక! ॥ 5245

§(3) శత గుణాల వర్ధిల్లెడి శరచ్ఛక్తి ప్రకృతిలోన
సర్వ రోగ నివారిణిగ సదమలౌషధుల నొసంగు
విశ్వ దురిత పారమ్మును విధ్వస్తము కావించుచు
శత శరద్బుతు కాలము సదా! రోగ రహితమ్మౌ! ॥ 5246

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"ఖిల" మంత్రానువాదము. సామాన్యార్థము.

§(4) శత శరదాల్ జీవింపుమః శత హేమంతాలు ప్రకృతి
రోగ నాశక పదార్థాలు ఋత వసంత గతుల నీయ
నింద్రాఽగ్నుల ఆదిత్యుని బృహస్పతి దివ్యాయుష
శక్తులేః హవిషముగా శతాయువుగఁ బ్రసాదింప
శత సంవత్సర కాలము సంవర్ధన మొందుమోయిః ॥ 5247

§(5) నిత్య పునర్నవ మ్మైన నిర్మల యౌవన గతులను
రోగ రహిత శక్తులతో ఋత ఋతు రతు లొప్పంగా
సర్వ ప్రకృతి అంగములై సకల ప్రకృతి చక్షువులై
సర్వము నీ కాయువుగాఁ ఇందురుఁడాః తనరారుతః ॥ 5248

§(6) ఉపర్యుపరి గతులతోడ నుజ్జ్వలమౌ నింద్రాఽగ్నుల
శక్తులతో వెలుఁగొందఁగఁ జక్రపాణి సృష్టి నెల్లఁ
జంద్ర సంవర్ధకముగ సదాః నవదరించుచుండి
అమృతమయమ్ముగాఁగఁజేసి ప్రాణ స్థితి శక్తు లొసఁగు ॥♦ 5249

§(7) అంతికగతి నలరారుచు నమృత మాంగళ్య గతుల
నధిక మైన దీర్ఘాయువు నమరఁజేసి నాకు జగతి
నాపూర్ణమ్మైన దివ్య దీప చంద్రికల్ విరియఁగ
మహితాఽఽధారమ్ము లౌచు సుహిత మ్మై నిలుచు సదాః ॥♦ 5250

## సూక్తము—165

ఋషి—ప్రజాపతి పుత్రుఁడు యక్ష్మ నాశనుఁడు
దేవత—ఇంద్రాగ్నులు లేక రోగ నాశకము

## అర్థాంతరము—2

§(1) ప్రకటితాఽప్రకటిత మౌ బహుళ ప్రజాతతు లన్నిటిఁ
బారఁద్రోలి వెలుఁగొందెడ మేర లేని నిత్య శైత్య
చాంద్రిక లవి తనరంగా సకల ప్రకృతి ప్రాణద మై
త్రాణద మై యింద్రాఽగ్నుల రాజిత మౌ దివ్య శక్తి
వైష్ణవీయ గతుల మైని వరలఁగ జీవింతు నేను
విమలమ్ముగ క్షేమమ్ముగ నమల జీవనమ్ము లలర ॥ 5251

§రచయిత:—వాఙ్మయ మహోదధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"ఖిల" మంత్రానువాదము.

§(2) ఎంతకాల మున్నఁగాని మృత్యు వంతికమ్మునకే
చేరక తప్పదు ప్రతిదియు సృష్టిని బరిమితగతి నిల్పుచుఁ
గాలగతుల శతశరద్ వేల లెనసి స్థితి శక్తుల వరలి
నిర్వృతిహారకమై తుదికి నిఖిల భూతములఁ గలియును ॥ 5252

§(3) సహస్రాక్షుఁడైనఁగాని శతశరదమ్ములతో వరలెడి
శతాయుష కాలమునకు సంబద్ధుండై నిలుచును
హవిషమ్ముల హర్షముతో ననంతమైన కాలగతుల
దురిత పార దూరమ్మై దుష్టరోగ హారకమౌ
శతశరత్తుల మహాకాల సర్వస్వము విశ్వమ్మున
వైష్ణవీయ ఋతశక్తుల వరలును ఋతుతత్త్వమ్ముల ॥ 5253

§(4) వర్ధమాన ప్రకృతి శక్తి వరలు శతశరదమ్ముల్
శత హేమంతాలు వరఁగు శత వసంతాలు మించు
నింద్రాగ్నులు సవితృండు బృహస్పతియె సృష్టి యెల్ల
శత రూపమ్ములతోడను శతాయుషముగ వర్తిల్లును
బ్రకృతి పురుష శక్తు లెల్లఁ బ్రభవించును బెరుగు విరుగుఁ
బునఃపునర్జన్మలతోఁ బుట్టి పెరిగి గిట్టుచుండు ॥ 5254

§(5) నీవే! మహద్ధర్షముగా నీవే! సంతాపముగా
నీవే! యౌవన మౌచును నీవే! వార్ధక్య మౌచుఁ
బునర్నవత్వమ్ము లొప్పఁ బూర్ణ సృష్టి వరలుచుండు
సర్వాంగము లీ వౌచును సకలమ్మును నీ వౌచును
నీవే! నేత్రమ్ము లౌచు నిఖిలాయుష మౌచు నీవె!
అవిదితముగ నలరారుదు వఖిలేశా! అనంతరూప! ॥ 5255

§(6) ఆకసమున రేఖ గాఁగ నద్భుతముగ నలరును శశి
విష్ణులీల నింద్రాగ్నులు విలసిల్లుచు నమృతమ్మును
నఖిల సృష్టి స్రవియింతురు నిఖిల ప్రకృతి దాహమ్మును
నిరతమ్మును దీర్చి శక్తి నింపు స్థితి గతుల వెల్గ ॥♦ 5256

§(7) అనంత సుదీర్ఘ మౌ నాయుషమ్ము వరలంగా
నంత మెనయనట్టి సృష్టి అఖిల భారమున్ వహించి
బ్రహ్మ విద్య తత్త్వశక్తి భద్రతమై ధరియించుచుఁ
గృష్ణశక్తి నాలోపల ఋతగతులను నిల్పుఁగాక! ॥♦ 5257

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య “కళా-ప్రపూర్ణ”
♦“ఖిల” మంత్రావాదము.

## సూక్తమ్—166

ఋషిః—బ్రాహ్మో రక్షోహా
దేవతా—రక్షోహా*
ఛందః—అనుష్టుప్

(1) బ్రహ్మణాగ్నిః[1] సంవిదానో రక్షోహా బాధతామితః ।
అమీవా యస్తే గర్భం దుర్ణామా యోనిమాశయే ॥ 1748

(2) యస్తే గర్భమమీవా దుర్ణామా యోనిమాశయే ।
అగ్నిష్టం బ్రహ్మణా సహ నిష్క్రవ్యాదమనీనశత్ ॥ 1749

(3) యస్తే హన్తి పతయన్తం నిషత్స్నుం యః సరీసృపమ్ ।
జాతం యస్తే జిఘాంసతి తమితో నాశయామసి ॥ 1750

(4) యస్త[2] ఊరూ విహరత్యన్తరా దంపతీ శయే ।
యోనిం యో[3] అన్తరారేళ్హి తమితో నాశయామసి ॥ 1751

(5) యస్త్వా భ్రాతా పతిర్భూత్వా జారో భూత్వా నిపద్యతే ।
ప్రజాం యస్తే జిఘాంసతి తమితో నాశయామసి ॥ 1752

---

*ఈ సూక్తమునకు దేవత "గర్భసావ్రే ప్రాయశ్చిత్తమ్" అని సాయణ, మాక్సుముల్లర్ ప్రతులలో చేర్కొనబడినది.

1. బ్రహ్మణాగ్నిం, 2. యస్తఽఊరూ, 3. యోఽఅన్తరారేళిహ. (వ్రా.ప్ర.)

(6) యస్త్వా స్వప్నేన తమసా మోహయిత్వా నిపద్యతే ।

ప్రజాం యస్తే జిఘాంసతి తమితో నాశయామసి ॥ 1753

## సూక్తము—166

ఋషి—బ్రహ్మ పుత్రుఁడు రక్షోహ నామకుఁడు*

దేవత—గర్భరక్షణము*

(1)కతే॥గీ॥ మంత్ర రూపంబుతో నైకమత్య మంది
రాక్షసుల నెల్ల బాధించి రాజమానుఁ
డైన యనలుండు బహు రాక్షసాధికులకు
నధికముగ హింసఁ జేయుచు నమరుఁగాక! ॥ 5258

కఆ॥వె॥ ఎవఁడు రోగ రూప మెక్కువ కాంచుచు
గర్భమును హరించు నిర్భరార్శ[1]
రోగ రూపమునను నేగి తావక కుక్షిఁ
జెందు వాని నగ్ని చెఱచుఁగాక! ॥ 5259

(2)కఆ॥వె॥ అర్శ రోగ రూపుఁడైన యెవ్వఁడు నీదు
గర్భమున వసింపఁగలుగు నట్టి
పొలుసు తిండిపోతు పూర్ణాగ్ని హోతుఁడు
నష్టపెట్టుఁగాక! స్పష్టగతిని ॥ 5260

(3)కఉ॥ చక్కని నీదు గర్భమున సన్నిపతత్ కమనీయ బీజమున్
జిక్కులు పెట్టి దాని నతిశీఘ్రము గొట్టెడు వాని వెండియున్
గ్రక్కన మూని తచ్ఛిశువు గాఱియఁ బెట్టెడు నట్టి వాని నీ
చక్కటినుండి త్రోలెదను జానరో! నీకు హితంబు గోరుచున్ ॥ 5261

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "రక్షోహనుఁడు"గాను, దేవత "గర్భశ్రావ ప్రతిబంధి"గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

కరచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

కసాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

1. ప్రాచీనార్యులకు వచ్చిన రోగములలో యక్ష్మ రోగములతోపాటు అర్శరోగ మొకటి కలదు.

(4)§ఉ॥ చక్కని గర్భముం జెరిపి స్రావముఁ జేసెడు వాని నెంతయున్
మక్కువ మీఱ దంపతుల మధ్య వసించెడు వాని యోనియం
దెక్కువ వెల్గు బీజమును నెంతయుఁ ద్రుంచెడు నట్టి వాని నీ
చక్కటినుండి త్రోలెదను జానరొ! నీకు హితంబు గోరుచున్ ॥* 5262

(5)§ఉ॥ ఒక్కొక మారు భ్రాతగను నొక్కపరిం బతి రూప సంపదన్
మిక్కిలి వచ్చి నీదగు సమీపముఁ జేరెడు వాని జారుఁడై
నిక్కుచు నున్న వాని నొగి నీదు జనున్ దుఃమాడు వాని నీ
చక్కటినుండి త్రోలెదను జానరొ! నీకు హితంబుఁ గోరుచున్ ॥* 5263

(6)§ఉ॥ చక్కని నారి! నీదయిన స్వప్నమునందున నిన్ను నిద్రతోఁ
జిక్కులు పెట్టి నీ కిపుడు చేష్టను బోవఁగఁ జేసి పిమ్మటన్
మక్కువ తీర నిన్ గలిసి మాసముఁ గూల్చెడు నట్టి వాని నీ
చక్కటినుండి త్రోలెదను జానరొ! నీకు హితంబు గోరుచున్ ॥* 5264

## సూక్తము—166

ఋషి—బ్రహ్మ పుత్రుఁడు రక్షోహ నామకుఁడు
దేవత—గర్భ రక్షణము

### అర్థాంతరము—1

§(1) వైష్ణవాగ్ని సంవిదాన ప్రభా దీప్తు లలరంగా
రక్షిత మై చలనగతుల రాణించెడి సృష్టి యెల్లఁ
బ్రకృతిమాత గర్భముగా వరలఁ బంచ భూతాలను
ధాతువులకు ధామములై తనరారును విశ్వసృష్టి ॥ 5265

§(2) సదసత్తుల గర్భమ్మై సర్వమ్మును దనరారఁగ
ధాతు జన్మ భూమి యౌచుఁ దనరు సృష్టి యోని గాఁగ
ననల భరిత విష్ణు శక్తి నఖిలమ్మును నియమ గతుల
సృష్టి స్థితి లయ రతులను జెన్నొందఁగ సర్వస్వము ॥ 5266

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(3) రూపరహిత మహితమైన సృష్టి సృష్ట శక్తి యెల్ల
జన్మ పతన వృద్ధి క్షయ సంలీనపు మరణ గతుల
ననిలాఽనల సలిల మృదాకాశమ్ములలోనఁ గలియు
వశ్య మర్మ ధర్మ కర్మ దృశ్యాఽదృశ్య రూపగతుల ॥ 5267

§(4) ప్రకృతి పురుష రూపమ్ముగ వరలు నూరు శక్తులుగా
సర్వ భూత సంచయాల స్థాన మౌచు బ్రాహ్మ్య గతుల
నంతరిక్ష కుహరమ్మది అలర మర్మ సత్య రతులఁ
బాలనమ్ము నొనరించును వరల సృష్టి స్థితి లయాల ॥ 5268

(5)§క॥ నీవేః సృష్టిగఁ బతిగా
నీవేః సహజన్మ రూపి నీడవుఁ గాఁగన్
నీవేః కాంతి సరిత్తుగ
నీవేః ప్రాణుల కధిపతి వెన్నఁగను హరీః ॥ 5269

(6)§క॥ నీవేః స్వప్న తమస్సులు
నీవేః మోహమ్ము నౌచు నెగడుచు సృష్టిన్
నీవేః కాంతి సరిత్తుగ
నీవేః ప్రాణుల కధిపతి వెన్నఁగను హరీః ॥ 5270

## సూక్తము—166

ఋషి—బ్రహ్మపుత్రుఁడు రక్షోహా నామకుఁడు

దేవత—గర్భరక్షణము

## అర్థాంతరము—2

§(1) శైవాఽనల సంవిదాన సంశక్తులు బాధింపఁగ
రక్షశ్శక్తులు సర్వముః భ్రష్ట మౌను నాశ మౌను
శివంకరము గాఁగ విశ్వ సృష్టి స్థితి గర్భమ్మై
దశ దిశలను మర్మమ్మై తనరారును నిత్యమ్మును ॥ 5271

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) లయ శక్తులతోసహా క్రాలంగా నాకాశము
దిశ లెల్లను గుహ్యములై తేజరిల్ల గర్భముగా
నగ్ని పూర్ణ శివ శక్తులు నమల సద్భావరతుల
నిక్క మౌచు సృష్టిస్థితి నిరయ మౌచుఁ దనరారును ॥ 5272

§(3) జల రూపపు నాగమ్మై సర్వ సృష్టి వరలంగా
ననిలాఽనల మృత్తులును నాకసమ్ము లతిమర్మతఁ
బతన మౌచు స్థితిగతులను ఋత ఋతువుల వర్తిల్లుచు
జాత మౌచు హరీః నిన్ను సంసేవన మొనరించును ॥ 5273

§(4) ప్రకృతిపురుష శక్తి రూప సుకృత సంగమాల వరలి
ఊరు గతుల మర్మ రూప సృష్టి జనన శక్తు లలర
నంతరిక్ష శక్తులతో నఖిలాఽఖిల గోళ లోక
తిరోధాన పురోగతుల నరోధాల విరోధాల
సలిల సర్వ రూపాలుగ సకల భూత సంచయాలు
వర్తిల్లును సృష్టిలోన బహిరంతర్గతులు తోప ॥ 5274

§— అంతరిక్ష రూపమైన అదృశ్యంపు శక్తులతో
భూత సంచయాలు సృష్టిఁ బొందు నొందుచుండు సదా!
ప్రకృతి పురుష రూపాలుగ వరలుచు నా దంపతులై
విహరించును బ్రతికృతు లవి వెలయంగా సుకృతాలుగః ॥ 5275

§(5) అగ్ని సృష్టి గాఁగ నలరు నగ్ని భర్త గాఁగఁ దనరు
నగ్ని సహోదరత్వమ్మున నఖిలమ్మున నిండి నిలుచుఁ
గాంతి ప్రవాహమ్ము గాఁగఁ గ్రాలుచుండు సృష్టిలోనఁ
బ్రకృతి పురుష రూపాలను బాలించును నాధిపత్య
తేజాలను నిరతమ్మును దివ్య దేవః ఓ శ్రీహరిః ॥ 5276

§(6) నీ లీలా స్వప్నమ్మున నీ మాయా తిమిరమ్మున
నిఖిల జగతి మోహ మందు నిద్ర నిర్నిద్ర గతులఁ
గాంతి ప్రవాహమ్ముగాఁగఁ గ్రాలుచుండు సృష్టిలోనఁ
బ్రకృతి పురుష రూపాలను బాలించును నాధిపత్య
తేజాలను నిరతమ్మును దివ్యదేవః ఓ శ్రీహరిః ॥ 5277

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—167

ఋషిః—విభ్రాట్ కాశ్యపః
దేవతా—యక్ష్మనాశనమ్
ఛందః—అనుష్టుప్

(1) అక్షీభ్యాం తే నాసికాభ్యాం కర్ణాభ్యాం ఛుబుకాదధి ।

యక్ష్మం శీర్షణ్యం మస్తిష్కాజ్జిహ్వాయా వి వృహామి తే ॥ 1754

(2) గ్రీవాభ్యస్త[1] ఉష్ణిహాభ్యః కీకసాభ్యో[2] అనూక్యాత్ ।

యక్ష్మం దోషణ్యంమంసాభ్యాం బాహుభ్యాం వి వృహామి తే ॥ 1755

(3) ఆన్త్రేభ్యస్తే గుదాభ్యో వనిష్ఠోర్హృదయాదధి ।

యక్ష్మం మతస్నాభ్యాం యక్నః ప్లాశిభ్యో వి వృహామి తే ॥ 1756

(4) ఊరుభ్యాం తే[3] అష్ఠీవద్భ్యాం పార్ష్ణిభ్యాం ప్రపదాభ్యామ్ ।

యక్ష్మం శ్రోణిభ్యాం భాసదాద్భంససో వి వృహామి తే ॥ 1757

(5) మేహనాద్వనంకరణాల్లోమభ్యస్తే నఖేభ్యః ।

యక్ష్మం [4]సర్వస్మాదాత్మనస్తమిదం వి వృహామి తే ॥ 1758

---

1. గ్రీవాభ్యస్త ఉష్ణిహా, 2. సాభ్యో అనూక్యాత్, 3. తే అష్ఠీ, (వ్రా.ప్ర.), 4. సర్వస్మాదా. (సా.మా.)

(6) అంగాదఙ్గాల్లోమ్నోల్లోమ్నో జాతం పర్వణిపర్వణి ।

యక్ష్మం సర్వస్మాదాత్మనస్తమిదం వి వృహామి తే ॥ 1759

## సూక్తము—167

ఋషి—కాశ్యపుఁడైన వివృహా నామకుఁడు*

దేవత—యక్ష్మనాశనము*

(1)§సీ॥ యక్ష్మ పరీత! నీ యక్షిద్వయము నుండి యక్ష్మ రోగంబును నపనయింతు
ఘ్రాణేంద్రియమునుండి కర్ణద్వయమునుండి యక్ష్మ రోగంబును నపనయింతుఁ
జుబుకస్థలమునుండి శోభి మూర్ధమునుండి యక్ష్మ రోగంబును నపనయింతు
నీ శిరోఽంతర్వర్తి నిఖిల భాగమునుండి యక్ష్మ రోగంబును నపనయింతు
తే॥గీ॥ నీదు జిహ్వాతలంబున నిలచియుండి, బాధపెట్టుచు నున్నట్టి పరమ యక్ష్మ
రోగమును నుద్ధరించుచు రూపుతోడ, దాని వేరుగఁ జేసెదఁ దత్క్షణంబు ॥ 5278

(2)§గద్యము ॥
ఓ వ్యాధిగృహీతుఁడా! స్నిగ్ధము లైన గ్రీవలనుండి అస్థులనుండి అస్థుల సంధులనుండి యక్ష్మ రోగమును దొలఁగింపఁజేయుచున్నాను. నీ బాహువులయందు యక్ష్మమును నశింపఁ జేయుచున్నాను. నీ యంస భాగములనుండి యక్ష్మ రోగమును దొలఁగించెదను ॥ 5279

(3)§గద్యము
ఓయి! యక్ష్మాఽభిభూతుఁడా! అన్నపానముల కాధారభూత మగు భవదీయాంత్రమునుండి తత్సంధులనుండియు యక్ష్మ రోగమును వేరుచేయుచున్నాను. మతస్నములనుండియు, (పార్శ్వములయందుండు నమ్రిఫలాకృతులు గల వృక్కములనుండి) యక్నముల నుండియు, (హృదయ సమీపమందున్న కాల మాంస విశేషమైన యకృత్తునుండి) నింకను నన్యము లగు క్లోమ ప్లీహాది సంజ్ఞలు గల మాంసములనుండియు, యక్ష్మ రోగమును దొలఁగించుచున్నాను ॥ 5280

(4)§గద్యము ॥
ఓయి! రుగ్ణుఁడా! నీ యూరువులనుండి నీ జానువులనుండి యక్ష్మమును బోఁజేయుచున్నాను. పాదాఽపరభాగములనుండియుఁ దత్సంబంధ మగు పాయువునుండియు యక్ష్మ రోగమును వేరుచేయుచున్నాను ॥ 5281

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "వివృహుఁడు" గాను, దేవత "దుఃఖ నివారణము" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(5)§గద్యము ॥
శరీరమును బుట్టించు మేఢ్రమునుండి, లోమములనుండి, నఖములనుండి, యక్ష్మమును
దొలఁగించుచున్నాను. ఇపుడా యక్ష్మ రోగమును నీ సర్వ శరీరమునుండియు
వేరుపరచుచున్నాను ॥* 5282

(6)§గద్యము ॥
సర్వాంగములనుండి సర్వలోమములనుండి యవయవసంధుల జనించునట్టి యక్ష్మరోగమును
నశింపఁజేయుచున్నాను ॥* 5283

## సూక్తము—167

ఋషి—కాశ్యపుఁడైన వివృహా నామకుఁడు
దేవత—యక్ష్మనాశనము

### అర్థాంతరము—1

§(1) కన్నులకును ముక్కులకును గర్ణములకు నధరములతో
నాకసంపుఁ దత్త్వముతో ననిల రూప శక్తులతో
శీర్షమునకు క్షీణత్వము జిహ్వకు మస్తిష్కమ్మున
క్షీణత్వము లేకుండఁగఁ గృత పరమాత్మత వరలును ॥ 5284

§(2) బ్రహ్మ శక్తి కారణాన వరలు గ్రీవమ్మునకునై
ఊర్ధ్వముఖముగాఁగ వెలసి ఒప్పు ధమను లన్నింటిని
నెమ్ములకును బాహువులకు నెనయు నంసములకును
క్షయ దోషము లేకుండఁగ శంకరత్వ మలరింతును ॥ 5285

§(3) అమృతశక్తి తత్త్వమ్మున నాంత్ర తత్ సంధులలో
మతస్నమ్ములు వృక్కములనుండి మాంసరూపమై వెలిఁగెడి
వివిధ ప్రదేశములయందు విమల హృదయ గ్రంథులందు
నందకుండ క్షీణత్వము నతిగ నిరోధింతు నేను ॥ 5286

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్యభాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(4) అమృతత్వపు శక్తులతో నసాధారణ గతులమెయిని
బొడరు జానువులనుండి తొలఁగఁజేతు క్షీణత్వము
పాదోపరితలమునుండి పాయువునుండియుఁగూడను
క్షీణత్వము నశింపఁజేసి ప్రాణ త్రాణ శక్తు లిత్తు ॥ 5287

§(5) అమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల
మర్మ స్థానమ్ము లందు మట్టి రూపా౽వయవాల
నఖ రోమమ్ములనుండియు నాశ మ్మొనరింతు యక్ష్మ
మాంతర గతి క్షీణత్వ మ్మణు వైనను లేకుండఁగ ॥ 5288

§(6) అమృతత్వపు శక్తులతో నసాధారణంపుగతుల
నంగాంగములందునుండి అఖిల సంధులందునుండ
ప్రకృతిరూపమైన దేహ బహుళ లోక ప్రదేశాల
నుండి యక్ష్మ దుశ్శక్తిని జెండాడుదు నిర్మూలముగ ॥ 5289

## సూక్తము—167

ఋషి—కాశ్యపుఁడైన వివృహా నామకుఁడు
దేవత—యక్ష్మనాశనము

### అర్థాంతరము—2

§(1) ప్రకృతి పురుషా౽ర్ధనారీశ్వర సుస్వరూపంపు
శ్రోత్ర చక్షులు నాసిక చుబుక స్థలమ్ములనుండి
శిరమునుండి శిరో౽ంతర్వర్తి స్థలమ్ములందునుండి
నాలుకనుండి యక్ష్మశక్తి నాశన మొనరింతు నేను
అమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల ॥ 5290

§(2) ప్రకృతిపురుషా౽ర్ధనారీశ్వర సుస్వరూపంపు
గ్రీవలనుండి అస్థి సంధి కీళుల సర్వస్వమునుండి
బాహురూపమ్ములందునుండి బాహుమూలా౽ంకములనుండి
నాశ మ్మొనరింతు నేను నానావిధ యక్ష్మ శక్తి
నమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల ॥ 5291

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(3) ప్రకృతిపురుషాఽర్ధనారీశ్వర సుస్వరూపాన
నన్ని పాపాల కెల్ల నాధారభూత మైన
అంతమ్ము నుండి సంధి అంగమ్ములనుండి కూడ
మతన్నమ్ము నుండి వృక్క స్థితులనుండి హృదయ
సమీపస్థ కాల మాంసపు టమృత విశేషమ్ము నుండి
బహు రూపుల మాంసమ్మై వర్తిల్లెడి దానినుండి
నాశ మ్మొనరింతు నేను నానావిధ యక్ష్మ శక్తి
నమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల ॥ 5292

§(4) ప్రకృతి పురుషాఽర్ధనారీశ్వర సుస్వరూపాన
నూరు ద్వయమ్ము నుండి నొనరు జాను ద్వయమ్మునుండ
పాదాఽపరభాగమ్ములు పాయువునుండియుఁగూడను
నాశ మ్మొనరింతు నేను నానావిధ యక్ష్మ శక్తి
నమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల ॥ 5293

§(5) ప్రకృతి పురుషాఽర్ధనారీశ్వర సుస్వరూపాన
సృష్టికర్మ నొనరించుచుఁ జెలఁగు మర్మస్థానమ్ము నుండి
మృదూగ్రమ్మై పెరిగెడి రోమ నఖమ్ములనుండియు
సకలాఽవయవాలనుండి సర్వరూప యక్ష్మమ్ముల
నాశన మొనరింతు నేను నానావిధ గూఢరతుల
నమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల ॥ 5294

§(6) ప్రకృతిపురుషాఽర్ధనారీశ్వర సుస్వరూపాన
ఆకసాల రతులమైని ననిలమ్ముల రతులమైని
అనలమ్ముల రతులమైని నంబువుల రతులమైని
మృత్తుల రతుల మైని మిశ్రితమౌ పంచభూత
సంచయాఽవినాభావ స్వరూపమ్ముగా వరలుచు
దశదిశలను విస్తరిల్లి తనరారెడి లోకాలను
సకల సృష్టి అవయవాల సంధులలో సంభవించు
నానావిధ యక్ష్మశక్తి నాశ మ్మొనరింతు నేను
అమృతత్వపు శక్తులతో నసాధారణంపు గతుల ॥ 5295

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—168

ఋషిః—ప్రచేతా ఆంగిరసః

దేవతా—దుఃస్వప్ననాశనమ్

ఛందః—అనుష్టుప్;3-త్రిష్టుప్;5-పంక్తిః

(1) అపేహి మనసస్పతే ఉప క్రామ పరశ్చర ।

పరో నిర్‌ృత్యా[1] ఆ చక్ష్వ బహుధా జీవతో మనః ॥ 1760

(2) భద్రం వై వరం వృణతే భద్రం యుంజన్తి దక్షిణమ్ ।

భద్రం వైవస్వతే చక్షుర్బహుత్రా జీవతో మనః ॥ 1761

(3) యదాశసా నిఃశసాభిశసోపారిమ జాగ్రతో యత్ స్వపన్తః ।

అగ్నిర్విశ్వాన్యప దుష్కృతాన్యజుష్టాన్యారే[2] అస్మద్ దధాతు ॥ 1762

(4) యదిన్ద్ర బ్రహ్మణస్పతే ఉభిద్రోహం చరామసి ।

ప్రచేతా న[3] ఆంగిరసో ద్విషతాం పాత్వంహసః ॥ 1763

(5) అజైష్మాద్యాసనామ చాఽభూమానాగసో వయమ్ ।

జాగ్రత్స్వప్నః సంకల్పః పాపో యం ద్విష్మస్తం స[4] ఋచ్ఛతు యో నో ద్వేష్టి తమృచ్ఛతు ॥ 1764

---

1. నిర్‌ృతాఽఆచక్ష్వ, 2. జుష్టాన్యారేఽఅస్మద్, 3. ప్రచేతానఽఆంగిరసో, 4. సఽఋచ్ఛతు. (నా.ప.)

## సూక్తము—168

ఋషి—అంగిరసుఁడైన ప్రచేతుఁడు*
దేవత—దుస్స్వప్ననాశకదేవుఁడు*

(1)§తే॥గీ॥ ఓయి! దుస్స్వప్న దేవ! నీ వొదిగికొనుచు
విప్రకృష్టస్థలంబుల వేడ్కఁ మెఱయ
స్వేచ్ఛఁ బూనుచుఁ దిరుగుమా! చిత్త మలర
నన్యదేశములందైన నలరుమయ్య! ॥ 5296

§తే॥గీ॥ మమ్ము బాధింప వలదని సముచితముగఁ
బాప దేవతయైనట్టి పరమ మృత్యు
దేవితోడ వచించిన నీవు నాదు
మనసు బహ్వౌత్సుకంబయి ఘనతఁ గాంచు ॥ 5297

(2)§గద్యము ॥
సర్వజనులు భద్రము (శోభనమును) వరణీయము దుస్స్వప్నవినాశరూపమునగు ఫలమునుగాఁ బ్రార్థించుచున్నారు. ప్రవృద్ధ మగు ఫలమును బొందుచున్నారు. యమునియందు భద్రమునే చక్షుస్సుగాఁ గోరుచున్నారు. దుస్స్వప్నాధిదేవుఁ డగు వైవస్వంతుఁడు మముల బాధింప కుండుఁగాక! (ఈ లోకమునందు భద్రమునే అవస్థానలక్షణముగాఁ జేయుఁగాక!) ॥ 5298

(3)§సీ॥ మేల్కొనునప్పుడు మిక్కిలి కోర్కెతో నే దుష్కృతముఁ జేయ నేగినాము!
నిద్రఁబోయెడు వేళ నిఖిలాఽభిలాషతో నే దుష్కృతముఁ జేయ నేగినాము!
నిరభిలాషులమయి నిత్యము వర్తించి యే దుష్కృతముఁ జేయఁ నేగినాము!
సాఽభిలాషులమయి సమముగ మెలఁగుచు నే దుష్కృతము సేయ నేగినాము!
తే॥గీ॥ అప్రియము లౌచు నుండెడునట్టి సర్వ,దుష్కృతంబుల నెల్లను దోషహారి
యైన యనలుండు మాకు నత్యంతదూర,దేశమున నిల్పుఁగాకఁ దా దీక్షఁ బూని ॥ 5299

(4)§తే॥గీ॥ బ్రహ్మణస్పతి! యింద్రుఁడా! ప్రబలులైన
మీ కభిద్రోహ మేమేని మేము చేసి
యున్నచో దానివల్లను గ్రన్నన మము
మీరు రక్షింపుఁడీ! ప్రీతి మీఱ నిపుడు ॥ 5300

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ప్రచేతసుఁడు" గాను, దేవత "దుస్స్వప్ననివారణము"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§తే॥గీ॥ బంధుయుతుఁడు ప్రచేతస్సు వరుణుఁ డనెడు
వాఁడు శత్రువక్రమ్మైన పాపబాధ
దొలఁగఁజేయుచు నత్యంత తుష్టితోడ
మమ్ము రక్షించుఁగాకఁ దా నెమ్మి మీఱ ॥* 5301

(5)§గద్యము ॥
జయింపవలసినవన్నియు జయించితిమి. దుస్స్వప్న నాశాऽనంతరము పొందఁగలిగినవానిని బొందఁగలము. (అటులే మేము నిరపరాధుల మగుదుము.) జాగ్రత్ స్వప్నావస్థల సంబంధ పాపఫలరూప మగు సంకల్పము (దుస్స్వప్నాऽధ్యవసాయము) ఎవఁడు మము ద్వేషించునో! వానిని బొందుఁగాక! ॥* 5302

## సూక్తము—168

ఋషి—అంగిరసుఁడైన ప్రచేతుఁడు
దేవత—దుస్స్వప్న నాశక దేవుఁడు

## అర్థాంతరము—1

(1)§తే॥గీ॥ మనసు వైకల్యమయ మౌచు మాయ రతులఁ
బతన మౌనట్లు చేయక అతిపవిత్ర
శక్తి మీఱఁగ నిర్వృతి విషాద గతులఁ
దొలఁగఁజేసి బహుముఖాऽదృశ్య దృశ్య
జీవశక్తుల మనసు సంజీవ మగుత! ॥♦ 5303

§(2) వైవస్వతాऽగ్ని శక్తి వరలంగాఁ జతువులే
బహుళము లౌ విషయప్రకృతి పరిజ్ఞానావశులను
జీవింపఁగ మనశ్శక్తి చెన్నొందును భద్రమ్మై
శోభన ఫలయుక్తమ్మై సృష్టి వృద్ధి యుక్తమ్మై
సకల ప్రకృతి పురుషాऽధిప శంకరత్వ మలరఁగా ॥ 5304

§(3) మెలకువ తో స్వప్నమ్మున మే నెఱుఁగని నిద్రగతిని
సర్వ కాల సర్వాऽవస్థల సర్వస్వమున నే వేళను
బరాऽపకార పరత్వానఁ బాపాऽలోచన లేవియు
రాకుండఁగ నా వైశ్వాऽనరాగ్ని శక్తి రక్షించుత! ॥ 5305

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము
♦పంచపాది.

§(4) బ్రహ్మణస్పతిగాఁగను వరలు వైష్ణవీయ శక్తి
అమల మ్మౌ చిత్తమ్మున నమేయమౌ నగ్ని శక్తి
అభిద్రోహక్రియ లన్నిటి నఖిల ద్వేష పాపాళుల
నంతర్బాహిర గతులను నంతరింపఁ జేయుఁగాక! ॥ 5306

§(5) అజశక్తుల అద్భుతగతి నసమానపు గతులతోడ
నపాపత్వ తత్త్వమ్మున నభౌతికంపు రూపమ్మున
జాగ్రతగతి సంకల్పపు స్వప్నమాత్రి రూపమ్ములఁ
బాపమ్ముల దుష్క్రియలను బారఁద్రోలి దూరముగా
ద్వేషమ్మను రూపుమాపి విశ్వ సంక్షేమమ్ములు
సత్య శక్తు లలరారఁగ సర్వమ్మున విలసిల్లుత! ॥ 5307

## సూక్తము—168

ఋషి—ఆంగిరసుఁడైన ప్రచేతుఁడు

దేవత—దుస్స్వప్న నాశక దేవుఁడు

### అర్థాంతరము—2

§(1,2) పాపక్రియ భావమ్ములు రూపఱఁగా మనశ్శక్తి
అతీత మై అలరారును నజయ్యమౌ శక్తులతో
నిర్ఋతిమయ దుష్టరూప నిరయ గతులు తొలఁగిపోవ
విశ్వరూప మంది మనసు విహరించును సర్వమ్మున
సకల చక్షు రూప మ్మై సర్వ భద్రగతులు వరల
యమ శక్తులన్ జయించి అగ్ని వైవస్వతముగాఁగ
నఖిలమ్మున జీవించును నద్భుత మౌ గతులు మీఱ ॥ 5308

§(3) ఇచ్ఛాగతి నిచ్చ లేక యెల్ల దిశల నొంది మీఱి
సదసత్తుల కధీన మై సదసత్తుల కతీత మై
వర్తిల్లును హృచ్చక్షులు వైశ్వానరాఽగ్ని రతుల
సేవ్య మసేవ్యమ్ము నౌచు దివ్య దైవ శక్తుల మై ॥ 5309

§(4) బ్రాహ్మ్యశక్తి తత్త్వమ్మున వైష్ణవీయ దివ్య శక్తి
అనల రూప దివ్య తేజ మలరింపఁగ నకలుషంపుఁ
బవిత్రమైన మనశ్శక్తి పారఁద్రోలుఁ బాపమ్ముల ॥ 5310

§రచయిత:—వాఙ్మయ మహార్ణవ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(5) అనుద్భూత మనమాన మ్మసనామ మ్మనాగసము
నభూమ మై అలరునట్టి ఆ మహామహిత శక్తి
జాగ్రత్ స్వప్నావస్థల సంకల్పముగా నైనను
పాపకర్మ లొనరింపక పరమ ఋత శక్తులతో
అఘములనే నాశపరచి శుభతతులను నిల్పు! సతము ॥ 5311

## సూక్తమ్—169

ఋషిః—నైర్ఋతః కపోతః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) దేవాః కపోత[1] ఇషితో యదిచ్ఛన్ దూతో నిర్ఋత్యా[2] ఇదమాజగామ ।
తస్మా[3] అర్చామ కృణవామ నిష్కృతిం శం నో[4] అస్తు ద్విపదే శం చతుష్పదే ॥ 1765

(2) శివః కపోత[1] ఇషితో నో[5] అస్త్వనాగా దేవాః శకునో గృహేషు ।
అగ్నిర్హి విప్రో జుషతాం హవిర్నః పరి హేతిః పక్షిణీ నో వృణక్తు ॥ 1766

(3) హేతిః పక్షిణీ న దభాత్యస్మానాష్ట్ర్యాం పదం కృణుతే[6] అగ్నిధానే ।
శం నో గోభ్యశ్చ పురుషేభ్యశ్చాస్తు మా నో హింసీదిహ దేవాః కపోతః ॥ 1767

(4) యదులూకో వదతి మోఘమేతద్యత్ కపోతః పదమగ్నౌ కృణోతి ।
యస్య దూతః ప్రహిత[7] ఏష ఏతత్ తస్మై యమాయ నమో[8] అస్తు మృత్యవే ॥ 1768

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. కపోతఽఇషితో, 2. నిర్ఋత్యాఽఇదమా, 3. తస్మాఽఅర్చా, 4. నోఽఅస్తు, 5. నోఽఅస్త్వ, 6. కృణుతేఽఅగ్ని, 7. ప్రహితఽఏషఽఏతత్, 8. నమోఽఅస్తు. (వా.ప్ర.)

(5) ఋచా కపోతం నుదత ప్రణోదమిషం మదన్తః పరి గాం నయధ్వమ్ ।

సంయోపయన్తో దురితాని విశ్వా హిత్వా న[1] ఊర్జం ప్ర పతాత్ పతిష్ఠః ॥ 1769

## సూక్తము—169

ఋషి—నిర్ఋతి పుత్రుఁడు కపోతుఁడు*

దేవత—విశ్వేదేవతలు*

(1)§తే॥గీ॥ మృత్యుదేవికి దూతయై మెలఁగు నా క
పోతుఁ డస్మద్గృహంబున కరుగుదెంచె
వాని బాధను దప్పింపఁ బూని మేము
హవ్యమున మిమ్ముఁ బూజింతు మమరులార! ॥ 5312

§తే॥గీ॥ అల కపోత ప్రవేశంబుకలనఁ బుట్టు
దోషమును హవ్యము నొసంగి తొలఁగఁ జేతు
మందుచేత సుపుత్రుని నఖిల ధేను
ముఖ్యముల నెల్ల సౌఖ్యము పొందుఁగాక! ॥ 5313

(2)§చ॥ సురవరులార! మా గృహము చొచ్చి కపోత మపావ హేతువై
పరము వెలుంగుఁగాక నల పావకుఁ డస్మదశేష హవ్యమున్
స్థిరమతి మీ నిమిత్తమయి తెచ్చి భుజించెను నింక మీ కృపన్
ధురమును దాల్చి యద్ది మముఁ దూర్ణము వీడునుగాకఁ బోఁడిమిన్ ॥ 5314

(3)§సీ॥ హనన హేతు కపోత మస్మజ్జనంబుల హింసింపకయె వేగ నేగుఁగాక!
నడవియందుఁ గలట్టి యగ్ని స్థలమునందె యంచితంబుగ నివసించుఁగాక!
గో గణంబులనుండి గురుతర సౌఖ్యంబు లలితరీతిని మాకుఁ గలుగుఁగాక!
బురుషులవల్లను బూర్ణదోష విముక్తి యసదృశంబుగ మాకుఁ బొసఁగుఁగాక!
తే॥గీ॥ దేవతోత్తములార! యో ధీరులార!, మీ యనుగ్రహమును మేము పూనియుంట
నీ కపోతము మమ్ముల నెప్పుడైన,బాధ పెట్టకయుండుతఁ బలు విధముల ॥ 5315

---

1. నఊర్జం. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "కపోతము" గాను, దేవత "విశ్వేదేవతలు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(4)§గద్యము ॥
ఘూకసంజ్ఞకల పక్షి యే యమంగళవాక్కును బలుకుచున్నదో; యది నిష్ఫల మగుఁగాక।
కపోతముకూడ నే పదమును గృహమం దుంచుచున్నదో; యదియు నిష్ఫల మగుఁగాక।
ప్రహిత మగు నీ కపోత మే స్వామికి దూత యగుచున్నదో; మారయిత యగు నట్టి
యమునకు నా యీ ప్రణామ మగుఁగాక। ॥* 5316

(5)§గద్యము ॥
దేవతలారా! మంత్రముచే స్తూయమానులై బహిఃకర్తవ్య మగు కపోతపక్షిని మా గృహమునుండి
వెడలఁగొట్టుఁడు। కపోతమును జంపుటవలనఁ గలిగిన దోషములను బరిహరించుచు మే మిచ్చు
హవ్యములచే మదించినవారలై మాకు నన్నమును గోవును నొసంగుడు। మఱియు శీఘ్రో
త్పాదక మగు కపోతము మాకు నన్నమును విడిచిపెట్టి పక్షములచే నెగురుఁగాక। ॥* 5317

## సూక్తము—169

ఋషి—నిర్ఋతిపుత్రుఁడు కపోతుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

(1)§తే॥గీ॥ నిత్య వైరుధ్య భావాల నిర్ఋతి శక్తి
తనదు నడుపాజ్ఞల నిలిచి తనరునట్టి
ప్రాణముల్ హరించు కపోతభాతి వెల్గు
దుష్ట నక్షత్రములనుండి తొడరి ప్రాణ
నష్టములు మాకు రాకుండ నాల్గు రెండు
పదములన్ వెల్గు ప్రకృతులన్ దిద్రదశులార!
ప్రార్థన మ్మొనరింతుఁ గాపాడ మిమ్ము! ॥• 5318

(2)§ఆ॥వె॥ ఆ కపోతరూప భీకర నక్షత్ర
కీలలు ఖగ చక్ర గృహములందు
నావరించి కీడు నఖిల ప్రకృతులకున్
జేయకుండ శుభము చేయుఁడీరు! ॥ 5319

§ఆ॥వె॥ దైవశక్తు లొప్పఁ బావక జ్వాలలన్
బ్రాజ్ఞు లెల్ల మంత్రహవిష మొసఁగి
ఆ కపోత విషజ మపకృతి కారక
దుష్టకాంతి నెల్లఁ దునుముచుంద్రు ॥ 5320

§రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్యభాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
•సప్తపది.

§(3) ఆ నిరృతి దూతగాఁగ నలరు నా విష కపోత
ఋక్ష దుష్ట కాంతు లెల్ల సృష్టిఁ బ్రాణరూపమ్ముగ
హరించకుండ గగనాఽటవి నగ్ని పరమ్మానుగాక।
సకల గోళ లోకాలను బ్రకృతి పురుష శక్తులతో
మాతృ పితృ భావమ్ముల మహితశంకరత్వ మొప్ప
దివ్యమ్ముగ వెలుఁగుఁగాక। దేవాళులఁ గృహద్యుతిని ॥ 5321

§(4) జయ్యమైన దుశ్శక్తుల జముని దూతదూతగాఁగ
వరలు గుడ్లగూబ రిక్కలరి శక్తుల శబ్దించుచు
నా నిరృతి బానిసగా నదుపాజ్ఞల నిల్చు దుష్ట
కపోత రూప నక్షత్రపుఁ గాంతివల్లఁ జా వెపుడును
మా దరికే రాకుండఁగ మా వందన మా యమునకు ॥ 5322

§(5) ఋగ్రూపపు శబ్ద స్వర ఋతశక్తులు వ్యాప్తి చెంది
దుష్టకపోత దురిత కాంతి వ్యష్టి సమిష్టులుగ సృష్టి
నే లోకమ్ముల గోళమ్ముల నే మాత్రము వ్యాపింపక
అపకృతులను జేయకుండ నఖిల విశ్వ హితము చేయు ॥ 5323

## సూక్తము—169

ఋషి—నిరృతి పుత్రుఁడు కపోతుఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

§(1) ప్రేతకళను బ్రసాదించి విశ్వమ్మున నశుభద మై
ప్రకృతి పురుష శక్తులలోఁ బ్రాణత్రాణముల హరించు
ద్విగుణీకృత సౌర కాంతి విష శక్తులన్ హరించి
ఇహ పరాలఁ జతుర్దిశల నెల్లఁ గాపాడుచు నిత్యము
దేవాళులు కరుణించుత। దివ్య శుభము లొసఁగి సదా। ॥ 5324

§(2) ద్వైపీయపు వేదజ్ఞులు పావకులో హవిషమ్ముల
శుక్ల కృష్ణ పక్షాలను శుభ దీప్తులు హేతువుగా
ధామనిధి విషకాంతుల ధ్వంస మ్మొనరించుచుండు
దేవాఽఽళుల అనుగ్రహాన దివ్య శివపరంపరలు
ఖగోళ చక్ర రాశులలోఁ గ్రాలంగా నిత్యమ్మును ॥ 5325

§ రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(3) విష కపోత దీప్తిశక్తి విస్తృత మొనరించు సూర్య
విషకాంతులఁ గత్తులుగా విశ్వమ్మునఁ బ్రసరించును
ఆ కాంతుల సర్వస్వము నగ్ని యజ్ఞ దీప్తులతో
శబ్ద శక్తు లొప్పారఁగ సంహరించి సర్వ గోళ
లోకాలను బ్రకృతి పురుష ఋతశక్తుల నిల్పుచుండ్రు
దేవ వేద దివ్యజ్ఞులు దేవాఽఽఋల అనుగ్రహాన ॥ 5326

§(4) మృత్యు దేవతకు దూతగ మిన్నున వ్యాపించి సతము
పగలు రాత్రి మోఘ గతులఁ బ్రకాశించు రవిజ మైన
దుష్ట కాంతి సర్వస్వముఁ దున్మాడును శుచి శక్తులు
నియమ గతుల నిత్య మ్మా నియతికి నా కై మోడ్పులు ॥ 5327

§(5) ఋక్ ఛక్తుల దివ్య దీప్తి ఋత గోళ లోకాలను
సర్వమ్మున వ్యాప్తి చెంది సంహార మ్మొనరించును
విష కపోత కాంతితతుల విధ్వస్తము కావించుచు
దీప్త రవిజమౌ విషాఽమృత తేజమ్ముల విభజించుచు
విశ్వ విష దురితమ్ముల విరిచి శాంతి శుభము లొసఁగు ॥ 5328

## సూక్తమ్—170

ఋషిః—ఋషభో[1] వైరాజః, ఋషభః[1] శాక్వరో వా
దేవతా—సపత్నఘ్నమ్
ఛందః—అనుష్టుప్;5-మహాపంక్తిః

(1) ఋషభం మా సమానానాం సపత్నానాం విషాసహిమ్ ।
హన్తారం శత్రూణాం కృధి విరాజం గోపతిం గవామ్ ॥ 1770

(2) అహమస్మి సపత్నహేన్ద్ర[2] ఇవారిష్టో అక్షతః ।
అధః సపత్నా మే పదోరిమే సర్వే[3] అభిష్ఠితాః ॥ 1771

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1.వర్షభాఖ్యః.(సా.పా.), 2. హేన్ద్రఽఇవారిష్టోఽఅక్షతః, 3. సర్వేఽఅభిష్ఠితాః. (వా్ర.ప్ర.)

(3) అత్రైవ వో౽పి నహ్యామ్యుభే[1] ఆర్త్నీ ఇవ జ్యయా ।
వాచస్పతే ని షేధేమాన్ యథా మదధరం వదాన్ ॥ 1772

(4) అభిభూరహమాగమం విశ్వకర్మేణ ధామ్నా ।
ఆ వశ్చిత్తమా వో వ్రతమా వో౽హం సమితిం దదే ॥ 1773

(5) యోగక్షేమం వ[2] ఆదాయా౽హం భూయాసముత్తమ[3] ఆ వో మూర్ధానమక్రమీమ్ ।
అధస్పదాన్మ[4] ఉద్వదత మణ్డూకా ఇవోదకాన్మణ్డూకా ఉదకాదివ ॥ 1774

## సూక్తము—170

ఋషి—వైరాజైన ఋషభుఁడు లేక శాక్వరుఁడైనఋషభుఁడు*
దేవత—సపత్ననాశనరూపార్థము*

(1,2)§సీ॥ అస్మత్కులీనులయందు నన్నుఁ బ్రశస్తతమునిగాఁ జేయుట తగవు నీకు
నరిమండలంబును నభిభవించెడునట్లు నన్నుఁ జేయుట కడు నయము నీకుఁ
జతురుఁడవై నన్ను శత్రుహంతకునిగాఁ జేయుటయే ప్రీతి చేష్ట నీకుఁ
బరమ గోవుల కెల్లఁ బ్రతిగ నన్ జేయుటే కార్యము లోకంబున ఘనత నీకు
తే॥గీ॥ నిందుఁ డెవ్వని చేతను హింసితుండు,కాని పట్టులు నేనును గరము హింస
లనుభవింపకయుందును నఖిల వైరి,పంక్తి నాపాదములపైని బడునుగాక! ॥ 5329

(3)§తే॥గీ॥ కార్ముకము కోటి నే రీతిఁ గట్టఁబడునో!
నారిచే నట్లు శాత్రవ వీరు లెల్ల
రెట్టి దేశాన నుందురో! యట్టి దేశ
మందు వారలఁ గట్టెద నతిశయముగ ॥ 5330

---

1.నహ్యామ్యుభే౽ఆర్త్నీ౽ఇవ, 2. వః౽ఆదాయా౽హం, 3. భూయాసముత్తమ౽ఆ వో,

4. స్పదాన్మ౽ఉద్వదతమణ్డూకాహవోదకాన్మణ్డూకా౽ఉదకా. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అనిలుఁడు'' గాను, దేవత "శత్రునాశనము'' గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§తే॥గీ॥ ఓయి! వాచస్పతీ! మాకు నున్న శత్రు
వర్గ మెట్టులు సంరుద్ధ వాక్కు లగుచు
మెలఁగుదురో! యట్లు చేయుచు మీర లట్టి
వారలకు హింసఁ జేయుఁ డవారితముగ॥* 5331

(4)§ఉ॥ వైరిగణంబ! మిమ్ముల నవారిత తేజముతోడఁ గూడి నేఁ
జేరుచునున్న వాడఁ గడు శక్తిమెయిన్ భవదీయ ధైర్యమున్
గోరి హరియించువాఁడ నతికుత్సితమౌ భవదీయ సంఘమున్
భీరముఁ జూపు మీ వ్రతము బిట్టు గ్రహించెడువాఁడఁ జూడుఁడీ!॥* 5332

(5)§ఆ॥వె॥ ఓ సపత్నులార! యోగంబు క్షేమంబు
మీ సమక్షమందె మిగులఁ బొంది
యుత్తముఁ డన నొచు నోపి మీ శిరసును
బాదమున నడంచి పరఁగఁగలను॥* 5333

§ఆ॥వె॥ వృష్టి జలమువలెను వెలుఁగుచు నున్నట్టి
కప్ప లెట్లు ధ్వనిని గలుగఁజేయు
నట్లె యరచుచుండి యరులార! నా పాద
తలము క్రిందనుండి తనియుఁ డీరు!॥* 5334

## సూక్తము—170

ఋషి—వైరాజైన ఋషభుఁడు లేక శాక్వరుఁడైన ఋషభుఁడు
దేవత—సపత్ననాశనరూపార్థము

## అర్థాంతరము—1

§(1) ప్రకృతిమాతలందు నీవు పరమ శ్రేష్ఠమ్ముగాఁగ
నర్ధాంగత్వము తనరెడి ఆలి రూప ప్రకృతులలో
విష సహితముకాక నిలిచి విరిసి అమృత వృష్టి నెల్ల
శత్రుతతుల సంహరించి సర్వ గోళ లోకాలకు
స్వామి వౌచు నలరెదులే! సర్వ స్థితి రక్షక! హరి!॥ 5335

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(2) బహు ప్రకృతుల నధిష్ఠితమై వరలు పరబ్రహ్మశక్తి
అక్షతమై సృష్టిలోన నలరారును నిత్యమ్మును
బ్రకృతులలో శాత్రవతతి పాదాక్రాంతమ్ము గాఁగ
నదుపాజ్ఞల లొంగి నిలుచు నా దివ్య దైవమునకు ॥ 5336

§(3) ద్వంద్వప్రకృతి శక్తులలో వైరుధ్యము లేకుండఁగ
నాకసంపు టనిల సలిలాఽనలాఽవనీ రూపమ్ముల
సంరక్షించును దేవుఁడు శత్రుక్షితుల బారినుండి
సకల శబ్ద నిశ్శబ్దగ శక్తుల కధినేత యౌచు ॥ 5337

§(4) వ్యష్టి సమిష్టి రూపమ్ముల వ్రతగతులను నిత్యమ్మును
బంచ భూత తత్త్వాలే ప్రాణప్రద గతి వరలును
సచ్చిదానందమ్ముల శంకర మౌ ధామమ్ముగ
విశ్వకర్మ యైన మహావిష్ణుదేవు కరుణాఽఽదృతి ॥ 5338

§(5) ఉదకశక్తి మండూకము ఉసురులతో బ్రతుకు గతిని
మండూకపు శక్తులతో నిండు రీతి జలాఽఽశయాలు
దైవీయమ్మౌ లీలఁగఁ దనరారును విశ్వ ప్రకృతి
ఆదాన ప్రదానాల నఖిల యోగ క్షేమాలును
నలరంగా నుత్తమ గతి నా పరబ్రహ్మ శక్తి
నుపర్యభోగతులతోడ నపూర్వముగఁ దిరుగ సృష్టి ॥ 5339

## సూక్తము—170

ఋషి—వైరాజైన ఋషభుఁడు లేక శాక్వరుఁడైన ఋషభుఁడు
దేవత—సపత్నా నాశనరూపార్థము

## అర్థాంతరము—2

§(1) విష విరుద్ధ మౌచు సృష్టి విలసిల్లుచు నిత్యమ్మును
సర్వ ప్రకృతి శక్తులలో సకల పురుష శక్తులలో
నత్యంతము శ్రేష్ఠమ్మై అలరారుచు సత్య గతుల
నఖిల గోళ లోకాలకు నధిపతిగాఁ దనరారుచు
విరోధులను సంహరించి విరాజిలును బరాత్పరత ॥ 5340

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) బహుళ ప్రకృతి సపత్నత వరలు విష్ణుశక్తి మెయిని
సరిష్టాల నక్షతమై అలరుఁ బరబ్రహ్మ శక్తి
పురుషశక్తి పాదమ్ముల నెటి ప్రకృతులు వాలంగా
నభోగతిగ సమ్ముఖమై అఖిలసృష్టిఁ దనరారును ॥ 5341

§(3) ఆకసమ్ము విల్లు గాఁగ నఖిల ప్రకృతి నారి గాఁగ
అస్తి నాస్తి విచికిత్సల నలరుచుండు సృష్టి యెల్ల
వాచస్పతి శబ్దశక్తి ప్రభావాల నుపర్యధో
గతులతోడ లోక గోళ వితతు లెల్ల వర్తిల్లఁగ ॥ 5342

§(4) విశ్వకర్మ రూప మహా విష్ణుశక్తి దీప్తులతో
భరణశక్తి ధరణశక్తి వర్తిల్లును నియత గతుల
నా హృచ్ఛక్తుల బ్రహ్మయు నా పరబ్రహ్మమ్మును
సకల సృష్టి గోళ లోక సమితి తిరుగ వ్రతగతిగా ॥ 5343

§ఆ॥ వె॥ విశ్వకర్మరూపి విష్ణుపదము సృష్టి
సర్వమునకు సలరు స్థాన మౌచుఁ
గ్రాలుచుండు హృదయ గమ్య మౌచును సర్వ
గోళ లోకములకుఁ జాలనముల ॥ 5344

§(5) పరబ్రహ్మ దివ్యశక్తి పరిగ్రహించు హవిషాఽగ్నుల
వరల యోగక్షేమమ్ములు బ్రహ్మాండములలో సదా!
ప్రకృతిపురుష శక్తులకును బ్రసాదించు నిత్యమ్మును
శిరసావహించి విశ్వ స-క్షేమమ్ములు మీఱంగా ॥ 5345

§— పంచభూత రూపమ్ముల నెంచి మింగు నజగరముగ[1]
నున్నదాని నున్నట్లుగ నుపరిగతుల నదృశ్యముగ
నజగరమా[1] బ్రాహ్మ్యశక్తి యథావిధిగఁ దిరిగి యిచ్చు
నధోగతులఁ బునస్సృష్టి అమృతరతుల వరలంగా! ॥ 5346

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. అజగరము=నిర్మమత.

## *సూక్తమ్—171

ఋషిః—ఋషభో వైరాజః, ఋషభః శాక్వరో వా

దేవతా—శివః

ఛందః—త్రిష్టుప్

•(1) యేనేదం భూతం భువనం భవిష్యత్ పరి గృహీతమమృతేన సర్వమ్ ।

యేన యజ్ఞస్తాయతే సప్తహోతా తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1775

•(2) యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వన్తి విదథేషు ధీరాః ।

యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1776

•(3) యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవేతి ।

దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1777

•(4) యత్ ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరన్తరమృతం ప్రజాసు ।

యస్మాన్న ఋతే కిఞ్చన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1778

•(5) యస్మిన్నృచః సామ యజూంషి యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః ।

యస్మింశ్చిత్తం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1779

---

*"ఖిల"సూక్తము- ఋగ్వేదము దశమమండలము అష్టమాష్టకములోని అష్టమాధ్యాయములో 170వ సూక్తము తరువాత నిరువదియారు ఋక్కులతోఁ గొన్నివ్రాతప్రతులలో నీ 171వ సూక్తముగా "ఖిల"సూక్తమొకటికలదు. కొందరు దీనిని బరిశిష్టముగా భావింపఁ బ్రక్షిప్తమని మరికొందరును నధికపాఠ మని వేరొకకొందఱును భావించిరి. కల్పసూక్తములలో వినియోగము పేర్కొనఁబడనటువంటి మంత్ర సూక్తాదులు "ఖిల" మంత్ర సూక్తాదులుగా వ్యవహృతములైనట్లు కొందరు తలంచిరి. ఋషిపరంపరలోఁ బదక్రమాదిపాఠములు విలుప్తములై విస్మృతములై మూలము మాత్రమే పఠింపఁబడఁగా నది "ఖిల" భాగ మనఁబడినట్లు మరికొందరు భావించుటయు జరిగినది. కాని "పరశాఖీయం స్వశాఖాయా మపేక్షావశాత్ పఠ్యతే తత్ ఖిల ముచ్యతే ఇతి ఖిల లక్షణమ్" అని ప్రాచీనులు "ఖిల"లక్షణమును బ్రవదించిరి. ఇతర శాఖాగత మగు మంత్రముగాని, సూక్తముగాని, సందర్భవశమున నవసరముకొద్ది స్వశాఖలోనికిఁ బరిగృహీత మైనచో నది క్రమముగా "ఖిల"మంత్రము "ఖిల"సూక్త మనఁబరఁగును. అది సూక్తముమొత్తము కాక తదూన మగు మంత్రములుగఁ బరిగృహీత మైనచో "ఖిల"మంత్రము లగును. •"ఖిల" మంత్రము.

•(6) సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్ నేనీయతేఽభీశుభిర్వాజిన ఇవ ।
హృత్ప్రతిష్ఠం యదజిరం యవిష్ఠం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1780

•(7) యే పఞ్చ పఞ్చాశతః శతం చ సహస్రం చ నియుతం చార్బుదం చ ।
తే యజ్ఞచిత్తేష్టకాటం శరీరం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1781

•(8) వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
తస్య యోనిం పరిపశ్యన్తి ధీరాస్తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1782

•(9) యేన కర్మాణి ప్రచరన్తి ధీరా విప్రా వాచా మనసా కర్మణా వా ।
యత్ స్వాం దిశమను సంయన్తి ప్రాణినస్తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1783

•(10) యే మే మనో హృదయం యే చ దేవా యే అన్తరిక్షం బహుధా కల్పయన్తి ।
యే శ్రోత్రం చ చక్షుషీ సంచరన్తి తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1784

•(11) యస్యేదం ధీరాః పునన్తి కవయో బ్రహ్మాణమేతం వ్యావృణత ఇన్ద్రమ్ ।
స్థావరం జఙ్గమం చ ద్యౌరాకాశం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1785

•"ఖిల" మంత్రము.

•(12) యేన ద్యౌరుగ్రా పృథివీ చాన్తరిక్షం యేన పర్వతాః ప్రదిశో దిశశ్చ ।
యేనేదం సర్వం జగద్వ్యాప్తం ప్రజానత్ తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1786

•(13) అవ్యక్తం చాప్రమేయం చ వ్యక్తావ్యక్తపరం శివమ్ ।
సూక్ష్మాత్ సూక్ష్మతరం జ్ఞేయం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1787

•(14) కైలాసశిఖరే రమ్యే శంకరస్య గృహాలయమ్ ।
దేవతాస్తత్ ప్రమోదన్తే తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1788

•(15) ఆదిత్యవర్ణం తపసా జ్వలన్తం యత్ పశ్యసి గుహాసు జాయమానః ।
శివరూపం శివముదితం శివాలయం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1789

•(16) యేనేదం సర్వం జగతో బభూవ యద్దేవా అపి మహతో జాతవేదాః ।
యదేవాగ్ర్యం తపసో జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1790

•(17) గోభిర్జుష్టో ధనేన హ్యాయుషా చ బలేన చ ।
ప్రజయా పశుభిః పుష్కరార్థం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1791

•"ఖిల" మంత్రము.

•(18) యోఽసౌ సర్వేషు వేదేషు పఠ్యతేఽనద ఈశ్వరః ।
అకార్యో నిర్గుణో హ్యాత్మా తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1792

•(19) యో వేదాదిషు గాయత్రీ సర్వవ్యాపీ మహేశ్వరః ।
తదుక్తం చ యదా జ్ఞేయం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1793

•(20) ప్రియతప్రాణ ఓంకారం ప్రణవం చ మహేశ్వరమ్ ।
యః సర్వం యస్య చిత్ సర్వం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1794

•(21) యో వై వేద మహాదేవం ప్రణవం పురుషోత్తమమ్ ।
ఓంకారం పరమాత్మానం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1795

•(22) ఓంకారం చతుర్భుజం లోకనాథం నారాయణమ్ ।
సర్వస్థితం సర్వగతం సర్వవ్యాప్తం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1796

•(23) తత్ పరాత్ పరతో బ్రహ్మ తత్ పరాత్ పరతో హరిః ।
పరాత్ పరతరం జ్ఞానం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1797

•"ఖిల" మంత్రము.

•(24) అస్తి నాస్తి శయిత్వా సర్వమిదం నాస్తి పునస్తథైవ దృష్టం ధ్రువమ్ ।
అస్తి నాస్తి హితం మధ్యమం పదం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1798

•(25) అస్తి నాస్తి విపరీతో ప్రవాదో ఽస్తి నాస్తి గుహ్యం వా ఇదం సర్వమ్ ।
అస్తి నాస్తి పరాత్ పరో యత్ పరం తన్మే మనః శివసంకల్పమస్తు ॥ 1799

•(26) య ఇదం శివసంకల్పం సదాధీయన్తి బ్రాహ్మణాః ।
తే పరం మోక్షమాప్స్యన్తి తన్మే మనః శివసంకల్పమస్తు ॥ ‡ 1800

## *సూక్తము—171

ఋషి—వైరాజైన ఋషభుఁడు లేక శాక్వరుఁడైన ఋషభుఁడు
దేవత—శివుఁడు

§(1) ఏ శక్తి నీ పంచభూతా లెల్లఁ బరిగృహీత మౌను
ఆ అమృత సర్వశక్తి నలరారును సృష్ట్యఖిలము
ఏ శక్తిని సప్తహోత లిష్టి సతము నెఱపుచుందు
రా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5347

§(2) ఏ కర్మల విశ్లేషత నెనఁగించుచు యజ్ఞమ్ములఁ
బుణ్యవంతులైన ధీర పూత మనీషు లెల్ల
రా కర్మల సంపదాశి నపూర్వముగ నొందు జనాళి
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5348

---

•"ఖిల" మంత్రము. ‡ఇది ఋగాభాసమైన ప్రక్షిప్త శ్లోకము.
*"ఖిల" సూక్తము.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము.

§(3) ఏది జాగ్రదవస్థతో నెనయు దూరతీర దైవమ్మున్
ఏది సుప్తునికి నట్లె యెనయ దూరతీర దైవమ్మున్
జ్యోతులకును నేకమ్మౌ జ్యోతిగ దూరాన వెల్గు
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5349

§(4) ఏది ప్రజ్ఞానమ్మొ! యెయ్యది చిత్తమ్మొ!
ఏది ధృతియొ! మఱి యెయ్యది జ్యోతియొ!
అమృతమై యెది ప్రజ నంతర్గతి వర్తిల్లునొ!
అత్యల్ప కర్మక్రియలు నలరు నే ఋతశక్తిని
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5350

§(5) ఋక్ సామ యజుస్సులు నే శక్తిని వర్తిల్లునొ!
నే శక్తిని బ్రతిష్ఠితమౌ ఋక్ సామ యజుస్సులు
సృష్టి రథ నాభులుగా నెనఁగు నిశ్చయ జవమ్ములై
ఏ శక్తిని బ్రజలలోన నెనయుఁ జిత్త మద్భుత గతి
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5351

§(6) రథమును రథి వీథులలోఁ గ్రాలఁగ నే రీతి నడుపు?
మానవులను బ్రాణితతుల మహితశక్తి నడుపు నేది?
"అభి" శక్తుల నన్నింటిని శుభ వాజినముగ మార్చు నేది?
యేది హృత్ప్రతిష్ఠితమౌ నేది అజరమౌ సహజన్మత
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5352

§(7) ఏది పంచ పంచాశత మేది శతమొ! నియుత మర్బుదమ్మొ!
అదే! నీకు యజ్ఞ చిత్తు-అదే! నీకు అష్ట తను సంపద
లా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5353

§(8) అంధకార విరుద్ధమౌ ఆదిత్యవర్ణుఁ బురుషుఁ
బరబ్రహ్మమై మహాంతమై వరలు వేద రూపునికై
యోని గాఁగ ధీరవరులు దేనిని దీక్షగఁ జూతురొ!
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5354

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము. సామాన్యార్థము.

§(9) ఏ శక్తిని ధీరులు కర్మల నే వేళలఁ బ్రిచరింతురో!
విజ్ఞుల మనసున వాక్కుల విమల కర్మ లే శక్తిని
నొనరింతురో! యే శక్తిని నుత్సుకతను స్వయముగానె!
దిగ్గతులను పాణ్ణు లెల్లఁ దెలివిగ సంయమింతురో!
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5355

§(10) ఏ శక్తి నాలో మనసును హృదయమ్మును గల్పించెనో!
అంతరిక్ష మే దేవత అనేక విధాలఁ గల్పించునో!
యే శక్తి శ్రోత్రమ్ముల నెసఁగఁ జతువులఁ జరించు
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5356

§(11) దివ్య శక్తి గల ధీరులు దేనిని బూజించెదరో!
శశి రవులను స్థావరాల జంగమాల నన్నింటిని
ద్యారాకాశమ్ముల ఋషులు తగ నెఱుఁగుదు రే శక్తిని
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5357

§(12) ఏ శక్తిని నాకాశము పృథివీ ద్యో లోకమ్ములు
పర్వతాలు నల్ దిశలును బ్రిదిశ లెల్ల నుగ్రగతుల
వర్తిల్లును నే శక్తి వ్యాప్తమ్మౌ సర్వ జగతి
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5358

§(13) అవ్యక్తమ్ముగ నప్రమేయగతి వ్యక్తాఽవ్యక్త పర మ్మౌచు
అయి శివముగ సూక్ష్మమ్ముల నతి సూక్ష్మమ్మై జ్ఞేయ మ్మౌ
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5359

§(14) రమ్యమౌ కైలాసశిఖర రజితగిరి గృహమ్ముతో
దేవాళు లే శక్తిని దివ్య మోద మందెదరో!
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5360

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము. సామాన్యార్థము.

§(15) అగ్ని శక్తి జ్వలియించెడి ఆదిత్యుని వర్ణమ్మును
శివ రూపుని శివ ముదితుని శివాఽఽలయుని
గూఢమ్ముల జన్మించు నగుణరూపు నేది చూచు?
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5361

§(16) సర్వ జగము దేనివలన సంజనిత మ్మాయెనో!
జాతవేద మాయె మహిత సర్వసురలు దేనివలన?
నేది దేవుల కగ్ర్యమ్మై యేక జ్యోతిగ జ్వలించు
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5362

§(17) అయుస్సున బల ధనముల నఖిల గోళ జుష్టమ్మై
ప్రజలతోడఁ బశులతోడఁ గ్రాలు పుష్కరార్థ మెద్ది?
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5363

§(18) అనద ఆత్మ ఈశ్వరుఁడై అకార్య నిర్వ్రణ మై
యేది సర్వ వేదమ్ముల నెంతేనిఁ బఠింపఁబడునో!
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5364

§(19) ఎది వేదాదుల గాయత్రియో! యెది సర్వవ్యాపి మహేశుండో!
అది ఉక్తమ్మౌ నే గతి నెది జ్ఞేయ మ్మౌచు వరలు
నా శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5365

§(20) ప్రియత మ్మౌ ప్రాణము ప్రణవ మోంకారము నై
మహేశ్వర మై యేది చిన్మయమ్మౌను సకల మ్మై
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5366

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము. సామాన్యార్థము.

§(21) ఏది వేదమొ! మహాదైవమొ! ఏది ప్రణవమొ! పురుషోత్తమమొ!
ఓంకార మ్మేదియొ! ఒప్పు పరమాత్మ మేదొ!
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5367

§(22) ఓంకారము చతుర్భుజము సృష్టి లోక నాథమ్మై
సర్వస్థితమై సర్వగతమై సర్వవ్యాప్తి నెది నారాయణమొ!
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5368

§(23) అద్ది పరాత్పర బ్రహ్మ! అద్ది పరాత్పర హరియె!
పరాత్పరతరమ్మౌచు వరలును జ్ఞాన మ్మద్దియె
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5369

§(24) అస్తి నాస్తి పర మ్మౌచు నఖిలమ్మౌ నీ సృష్టియె
ధ్రువమ్ముగాఁ దిరిగితిరిగి దృష్ట మౌచుఁ గాకుండఁగ
అస్తి నాస్తి హిత మౌచును నలరు మధ్యమగతి పదమ్ము
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥ 5370

§(25) అనుకూల మ్మననుకూల మస్తి నాస్తి ప్రవాదమ్ము
ఈ సర్వస్వమ్మైన సృష్టి యెసఁగు నస్తి నాస్తి మర్మమ్ముల
అస్తి నాస్తి పర మ్మౌచు నలరు నేది పరాత్పరమై
ఆ శక్తియె నా మనసున నగు శుభసంకల్పముగ ॥ 5371

§(26) ఈ శివ సంకల్పము నెల్లప్పుడు నే విప్రులు
అధ్యయనము కావింతురొ! ఆ బ్రాహ్మణుల్ పరమును
మోక్షమ్మును బొందెదరు మూర్తిగొన్న శక్తిమెయిని
ఆ శక్తియె నా మనసున నగు శుభ సంకల్పముగ ॥♦ 5372

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము. సామాన్యార్థము.
♦ఋగాభాస ప్రక్షిప్త శ్లోకానువాదము.

## సూక్తము—171

ఋషి—వైరాజైన ఋషభుఁడు లేక శాక్వరుఁడైన ఋషభుఁడు

దేవత—శివుఁడు

### అర్థాంతరము—1

§(1) సప్తరూప దివ్యరతుల సకల లోకాలు వరల
నే దైవీయపు శక్తిని నెనఁగ గృహీతమౌ నఖిలము
నే శక్తిని సప్తహోత లెనయ యజ్ఞ రక్షితమౌ
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5373

§(2) ఏ కర్మల మనీషులు నెనఁగఁ ద్యాగ రూపమ్ముల
యజ్ఞమ్ముల మేధావులు విజ్ఞతమై నొనరింతురో!
అపూర్వమైన గుహ్యాశక్తి నమర యోగ కారకతలఁ
బ్రజలలోన బద్ధమౌచు రంజిల్లును నే శక్తి
అది నా మనసున నగును: నవినాశపు సంకల్పము ॥ 5374

§(3) ఏ జాగ్రదవస్థ నెనయు దూర దైవమ్మును
ఆత్మరూపమైన రస వ్యభిచార ప్రభావాల
జ్యోతులలో నేకమ్మౌ జ్యోతిగాఁగ దూర మేగు
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5375

§(4) ఏది సృష్టి చిహ్నమ్మౌ నేది చిత్తయజ్ఞమ్మగు
నేది ప్రజలఁ జంద్రకళగ నెనయు నంతర్జ్యోతిగ
దేనివలన మనోజ్ఞమౌ దివ్యఋత కర్మము లగు
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5376

§(5) దేనివల్ల ఋగ్దీప్తులు దేనివల్ల సామశబ్దకాలమ్ములు
దేనివల్ల శుక్లకృష్ణ దివ్యపక్ష యజుశ్ఛందుప్రి
లుష్ణ శీత జలనాభుల నొనరుఁ గాలరథ వేగము
లీ సర్వ ప్రజావశుల నెనఁగుఁ జిత్త మెందువలన
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5377

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(6) కాలరథపథిల్ జనులఁ గాలు నుసురు లే విధిగా
ఏ దైవీయపు శక్తిని నెనయు నభము శుభముగాఁగ
ఏది అజర మమృతమ్మై హృత్తునఁ బ్రతిష్ఠిత మౌనో!
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5378

§(7) ఏది పంచరూపమ్ముల నెది పంచాశతరూపాలను
ఏది శతము సహస్రమ్మై యేది నియుతాఽర్బుదమ్మౌ
అదె నీ యజ్ఞ హృత్తౌ శివ! అష్ట ధన రూపములౌ
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5379

§(8) వేదమునకుఁ బవలుగాఁగ వెలుఁగు పురుష మహాశక్తి
అంధకార భిన్నమైన ఆదిత్యుని వర్ణశక్తి
సంభవించెడి యోనిని సందర్శింతురు ధీరులు
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5380

§(9) వాచా మనసా కర్మలఁ బచరించుచు నేదో విధి
నే శక్తిని ధీర విప్రు లెల్ల కర్మ లాచరింతొరి!
ఏది స్వకీయమ్ముగాఁగ నేదు దిశా నంయమ పాణుల
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5381

§(10) ఏది నా మనస్సో! యేది నా హృదయమ్మో!
ఏది దేవతలో! యేది అంతరిక్షమ్మో!
ఏది బహుళ రూపుల నెనసి కల్పించు సృష్టి
నీని శ్రవణ నేత్రలను నెనఁగ సంచరించుచుండు
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5382

§(11) ఏ యీ రుచి ధీరులు ఋషులు గుర్తించుచుందొరి!
వైష్ణవీయ శక్తిగాఁగ వరలు సూర్యచంద్రికలుగ
స్థావర జంగమాలుగాఁగఁ జదలును దివిభువులుగాఁగ
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5383

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§"ఖిల" మంత్రానువాదము.

§(12) దేనివలన నెల్ల పృథ్వి దివులు నంతరిక్షమ్మును
బర్వతాలు దిశలు ప్రదిశలు దృఢత నిల్చు
అవతరించి సర్వజగము వ్యాప్తమౌ దేనివలన
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5384

§(13) అవ్యక్త మప్రమేయము వ్యక్తాఽవ్యక్త పర మౌచు
సూక్ష్మమ్ముల సూక్ష్మ సూక్ష్మతరమ్ముగా జ్ఞేయమై
పరిశుద్ధతా పవిత్రిత పరఁగు నఖిల సృష్టిలోన
నది నామనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5385

§(14) జ్ఞానరూప శిఖరమ్మున సౌందర్యము పూర్ణమై
శుభకరమౌ రాశులకును జొప్పడు నాలయమ్ముగాఁగ
అమరాళులు దానివలనఁ బ్రమోదమ్ము నొందుచుండు
అది నామనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5386

§(15) వైష్ణవీయ వర్ణముతో జ్వలించుచున్ ధర్మమై
ప్రభవించుచు సత్య పరమపవిత్రిత రూపమై
పవిత్రోత్పన్నమై పవిత్రాఽఽలయ మౌచు
తనరు దేనిని ఋషులు దర్శింతురో। గుహ్యగతుల
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5387

§(16) సర్వజగము దేనివల్ల సంభవించుచుండునో। మఱి
దేవాళి మహాజాత వేదాగ్నులు దేనివల్ల జనియించునో।
యేది తొట్టతొల్లిటిదో। యేది ధర్మైకజ్యోతియో।
అది నామనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5388

§(17) శబ్దశక్తి రూపమ్ముల సంపదాళి నాయువుతో
బలమ్మునను బ్రజల పశుల యోగార్థమై
జుష్ట మౌచు నిలుచును సృష్టి సర్వ మే శక్తిని
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5389

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(18) ఎవరు సర్వవేదమ్ముల నీశ్వరు నిత్యదాతను
అకార్యుని నిర్వాణు నే ఆత్మను బఠియింతురో।
అది నామనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5390

§(19) ఎది వేదాదుల వాగ్రక్షయో। ఎవరు సర్వవ్యాపు లౌదు
రా రూపోక్తమ్ము గాఁగ నఖిలము జ్ఞేయమ్మై తగు
నది నామనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5391

§(20) అత్యంతము ప్రాణమ్మై నిత్యనవమౌ నోంకారము
ఎది సర్వమో। మహేశ్వరమో। ఎవనికి సర్వము చిత్తగు
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5392

§(21) నిత్య నవ్యుఁ బురుషోత్తము నే విజ్ఞత మహాదేవు
నోంకారపుఁ బరమాత్మను నొనరఁ దెలియు నే జ్ఞానము
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5393

§(22) ఓంకారాఽఽకారమ్మై ఒనరు చతుర్భుజత్వాన
లోకనాథు నారాయణు సృష్టి లోలుపత్వమ్మున
సకల స్థితి సకలగతిని సకల వ్యాప్త దైవత్వము
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5394

§(23) అది ముఖ్యమ్ముల ముఖ్యబ్రహ్మ అది ముఖ్యమ్ముల ముఖ్యమ్మౌ హరి
ముఖ్యమ్ముల నలరారుచు ముఖ్యతరమ్మౌ జ్ఞానము
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5395

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(24) అస్తి నాస్తి పర మ్మొచు నలరు సృష్టి సర్వస్వము
లేకుండఁగఁ దిరిగి పుట్టి [1]దృష్ట మౌను ధ్రువమ్ముగా
మధ్యస్థితి పదగత మై మలఁగు అస్తి నాస్తి హితముగ
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5396

§(25) అస్తి ప్రవాద మ్మొచును నగును విపరీతమ్ముగ
నాస్తి ప్రవాద మ్మొచును నగును విపరీతమ్ముగ
అస్తి నాస్తి వికల్పతల నగు నీ సర్వము గుహ్యామె
అస్తినాస్తికతల ముఖ్య మగు ముఖ్యమ్ముల ముఖ్యమ్మౌ
నది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥ 5397

§(26) ఏ బ్రహ్మజ్ఞులు నిత్యము నీ పూత సంకల్పమ్మును
నధ్యయన మ్మొనరింతురొ၊ ఆ బ్రహ్మజ్ఞులు పరాన
ముఖ్యముగాఁ బొందెదరు మోక్షము నాత్మీయమ్ముగ
అది నా మనసున నగును నవినాశపు సంకల్పము ॥♦ 5398

## సూక్తము—171

ఋషి—వైరాజైన ఋషభుఁడు లేక శాక్వరుఁడైన ఋషభుఁడు
దేవత—శివుఁడు

### అర్థాంతరము—2

§(1) దేనివలన సత్యన్యాయాల నీను నీ సకలాకాశము
దైవత్వమ్మునఁ బుణ్యత తగఁ బరిగ్రహించు సర్వస్వము
దేనివలన సప్త హోత లాని యజ్ఞ మొనరింతురొ၊
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5399

§(2) ఏ కర్మల మనీషులు నెనయఁ జంచలత్వ మొప్పఁ
బుణ్యప్రద యజ్ఞమ్ములఁ బొనరింతురు ధీరవరులు
అంతర్గత గుహ్యమ్మై అపూర్వమౌఁ బ్రజలలోన
నది నామనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5400

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. 1. ఇక్కడ "లే-ఋ"లకు యతి.
♦ఋగాభాస ప్రక్షిప్త శ్లోకానువాదము.

§(3) ఏది జాగ్రిదవస్థలో నెనయు దైవ మభేదముగా
ఆ దైవము కూడఁ గలియు నభేదముగ నమ్మకముగ
దూరగమౌ జ్యోతులలోఁ దొడరి ఒకే జ్యోతి యాచు
నది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5401

§(4) ఏది బ్రిహ్మ పదార్థమోః యేది ధృతియోః చిత్తమ్మోః
యేది ప్రిజల నంతర్గతి నెనయు నమృతజ్యోతియోః
దేనివల్లఁ గామ్యసిద్ధిద కర్మా ఒల్పమ్మైన నౌ ఋతగతి
నది నామనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5402

§(5) దేనిలో ఋక్సామయజుస్సులు తేజరిలుచుఁ బ్రితిష్ఠమౌ
కాలరథము "నాభి"త్రియము గతిఁ గ్రాలు నా వేదమ్ములు
నిశ్చయమై ప్రివాహమై నిరుపద్రివ శివకరమౌ
దేనియందు సర్వశక్తి తేజరిల్లుఁ జిత్తమ్మై
అది నామనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5403

§(6) ఎది మనుజుల ప్రాణశక్తి నెనసి పట్టు రథాశ్వములుగ
నత్యంతము శుభదమ్మౌ నమర వాజినమ్ము గతుల
నెది హృత్తునఁ బ్రితిష్ఠితమౌ నెది అజరము యవిష్ఠమ్మౌ
నది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5404

§(7) ఏది పంచ- పంచాశతమోః శత మ్మేది సహస్రి నియుత మర్బుదమ్మోః
నీకు యజ్ఞ చిత్తమ్మున నిరత గుహ్య బద్ధరతి దేహమ్మౌ
ననంతమైన అఖిలగతుల నలరారును నిత్యమ్మును
నది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5405

§(8) వేదబ్రిహ్మమ్ముగాఁగ వెలుఁగు నీ మహాపురుషుఁ
దిమిర విరుద్ధమై తనరుచుఁ దేజరిలు నాదిత్యవర్ణము
దాని మూల జన్మరూప స్థానము ధీరులు దర్శింతురు
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5406

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(9) ధీమంతులు విప్రవరులు దేనివల్లఁ గర్మ లెల్ల
మనసుననో! వాక్కుననో! తను కర్మను బ్రచరింతురు
దేనివల్లఁ బ్రాణులు తమ దిశనే తా మనుసరింతొ్ర!
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము ॥ 5407

§(10) ఎవరు నాలో మనసును నెవరు నాలో హృదయము
ఎవరు నాలో దేవుల నెవరు నాలో గగనము
క్రాలంగా నేగతిఁ గల్పింతురో! బహు విధాలఁ
జకువులను శ్రోత్రమ్ముల సంచరించుచుందు రెట్లు
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము ॥ 5408

§(11) ఎవని యీ సర్వసృష్టి యెనఁగు నిత్యనవము కాఁగఁ
జేసి ఋషులు సత్యరతుల శివయాగము దైవగతుల
స్థావరాల జంగమాల ద్యారాకాశమ్ములను
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము ॥ 5409

§(12) దేనివల్ల దివిభువులును దేజరిల్లుచుండు నింగిఁ
బర్వతాలు దిశలు ప్రదిశలు దేన నిలుచుచుండు సదా!
సర్వము జగద్వ్యాప్తమ్మై జనించుచుండు దేనిపల్ల
నది నా మనసున నగును నవవర్గపు సంకల్పము ॥ 5410

§(13) అవ్యక్త మప్రమేయము వ్యక్తావ్యక్త పరమ్మను
శూన్య మ్మై సుఖద మ్మై శుభద మ్మై మోక్ష మ్మై
సూక్ష్మములకంటె మరీ సూక్ష్మతర జ్ఞేయమ్మౌ
నది నా మనసున నగును నవవర్గపు సంకల్పము ॥ 5411

§(14) రమ్యజ్ఞాన శిఖరమ్మున రాజ్యకారకు గృహాలయము
సుఖద శుభద మౌను సురలు ప్రమోద మొందఁగాను
నది నా మనసున నగును నవవర్గపు సంకల్పము ॥ 5412

---

§రచయిత:—వాఙ్మయ మహోద్యమ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(15) ఆదిత్యుని వర్ణముతో నలరు ధర్మ జ్వాలలతో
నేది గుహ్యస్థలాలనుండి యెనసి జాయమాన మౌన?
గగనోదితమ్మౌచును గగన రూపమై వరలుచు
గగనాలయమ్ము కాఁగఁ గ్రాలుచుండునో! యెయ్యది
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము॥ 5413

§(16) ఎందువల్ల జగమునుండి యీ సర్వమ్ముద్భవించె
మహిత జాతవేదాఽగ్నులు మహతోద్భవ వేదాలును
ఏది ఉన్నతోన్నతమో! యేది ఏక ధర్మ జ్యోతియో!
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము॥ 5414

§(17) అవృతమై కాంతులతో నాయుష్మన ధన బలాల
నాకసంపు యోగమునకు అలరు నెద్ది ప్రజలఁ బఱల
నది నా మనసున నగును నవవర్గపు సంకల్పము॥ 5415

§(18) ఏది సర్వవేదాలను నీశ్వర నిశ్శబ్దగతులఁ
బఠిత మౌచు నకార్యమై వరలు నిర్వ్రిణమ్ముగా
ఆత్మ సత్య శక్తులతో నాత్మయే కారణముగ
నది నా మనసున నగును నవవర్గపు సంకల్పము॥ 5416

§(19) ఎవరు వేదాదుల గాయత్రియో! ఎవరు సర్వవ్యాపియో!
ఎవరు మహాప్రభువౌ మరి ఏ విధి నెది జ్ఞేయమ్మో!
అది ఉక్తమ్మౌచు వరలు నాత్మ కారణమ్ముగాఁగ
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము॥ 5417

§(20) బ్రహ్మ విష్ణు శివదేవుల భావ ప్రియతప్రాణ మౌచు
నిత్య సవ్య మౌచు సత్య నిఖిల మహేశ్వరుఁ డెవరో!
యెవ్వరు సర్వమో! యెవనికిఁ జిత్ సర్వమ్ముగఁ
అది నా మనసున నగును నవవర్గపు సంకల్పము॥ 5418

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(21) బ్రహ్మకర్మసిద్ధిసృష్టి వరలును యజ్ఞాంగ మౌచు
మహాదేవుఁ బురుషోత్తము మహిత నిత్య నవశక్తిని
సృష్టి స్థితి లయకారకు నెఱిఁగి సత్య పరమాత్మగ
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5419

§(22) సృష్టి స్థితి లయకర్తను లోకనాథు నారాయణుఁ
జతుర్భుజుని సర్వ స్థితుని సర్వగతుని సర్వవ్యాప్తుని
సర్వ ప్రభువు కాఁగ వరలు సకలేశ్వరతా మహిమను
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5420

(23)§ఆ॥వె॥ ఆత్మ సత్యములకు నలరి సత్యమ్ముగా
బ్రహ్మగాఁ బరాత్పర హరి గాఁగ
సత్యములకె జ్ఞాన సత్యతర మ్మౌచు
నది మదీయ హృదిని నగు శివజము ॥ 5421

§(24) అస్తి నాస్తి హృదయగతుల నలరు నీ సర్వస్వము
నాస్తికతయె పునర్గతుల నస్తిత్వపు దృష్ట ధ్రువత
అస్తి నాస్తి హిత మౌచును నమరును మధ్యమ పదమై
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5422

§(25) అస్తి నాస్తి తత్త్వాలవి అమరు నధికాధికములై
అస్తి నాస్తి తత్త్వా లవి అబద్ధాలఁ బ్రవాదమౌ
అస్తి నాస్తి తత్త్వాలను నగును నిది గుహ్య మగుహ్య
మస్తి నాస్తి తత్త్వా లవి అగును బరాత్పరాలకుఁ
బరమ్మైన సత్యమంగాఁ బరఁగుచుండి సృష్టి నేది
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5423

§— ఉండియు లేనట్లై అగును ఉండక ఉనట్లై యౌను
ఉండియు నున్నట్లై యౌను ఉండక లేనట్లై యౌను
అస్తి నాస్తి తత్త్వా లవి అలరఁగ విపరీతములై
యీ సృష్టి సర్వస్వము నెసఁగ దృశ్యాऽదృశ్యగతుల
వైకల్పిక సత్యగతిని వరలును గుహ్యమ్ముగాఁగ
అది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥ 5424

---

§రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల" మంత్రానువాదము.

§(26) ఏ బ్రహ్మజ్ఞులు సతము నీ శూన్య సంకల్పము
సధ్యయనము కావింతురో! ఆ బ్రహ్మజ్ఞులు పరముసఁ
బరబ్రహ్మ రూప మౌచు వరలెదరు నివృత్తి మోక్షమున
నది నా మనసున నగును నపవర్గపు సంకల్పము ॥• 5425

## సూక్తమ్—172

ఋషిః—విశ్వామిత్రజమదగ్నీ
దేవతా—ఇన్ద్రః; 3-సోమ-వరుణ-బృహస్పతి-అనుమతి-
మఘవత్-ధాతా-విధాతారః
ఛందః—జగతీ

(1) తుభ్యేదమిన్ద్ర పరి షిచ్యతే మధు[1] త్వం సుతస్య కలశస్య రాజసి ।
త్వం రయిం పురువీరాము నస్కృధి త్వం తపః పరితప్యాజయః స్వః ॥ 1801

(2) స్వర్జితం మహి మన్దానమన్ధసో హవామహే పరి శక్రం సుతాఁ[2] ఉప ।
ఇమం నో యజ్ఞమిహ బోధ్యా గహి స్పృధో జయన్తం మఘవానమీమహే ॥ 1802

(3) సోమస్య రాజ్ఞో వరుణస్య ధర్మణి బృహస్పతేరనుమత్యా[3] ఉ శర్మణి ।
తవాహమద్య మఘవన్నువస్తుతౌ ధాతర్విధాతః కలశాఁ[4] అభక్షయమ్ ॥ 1803

(4) ప్రసూతో భక్షమకరం చరావపి స్తోమం చేమం ప్రథమః సూరిరున్మృజే ।
సుతే సాతేన యద్యాగమం వాం ప్రతి విశ్వామిత్రజమదగ్నీ దమే ॥ 1804

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•ఋగాభాస ప్రక్షిప్తశ్లోకానువాదము.

1. మధుమత్వం. 2. సుతాఁఽఉప, 3. బృహస్పతేరనుమత్యాఽఉ శర్మణి,

4. కలశాఁఽఅభక్షయమ్. (ప్ర.ప్ర.)

## సూక్తము—172

ఋషి—విశ్వామిత్ర జమదగ్నులు*
దేవత—ఇంద్రుడు; 3-సోమ,వరుణ,బృహస్పతి,అనుమతి,
మఘవంతుడు,ధాత,విధాతాదులు*

(1)§ఉ॥ ఈ విధమైన సోమము నింద్రుడ! నీకు మహాగ్నియందు నా
నావిధ భక్తితోడుత ఘనంబుగ నుంచియు దాని శ్రద్ధతో
నీవు గ్రహించి మాకయి యనిందిత పుత్రధనంబు నీయుమా!
నీవు తపస్సుచేసి యల నిర్భర లోక పతిత్వ మందవే! ॥ 5426

(2)§తే॥గీ॥ స్వర్గజేత మహాత్ముడు సరస సోమ
పాన సమ్మోదమానుడు పరమ కార్య
శక్తుడగు నింద్రదేవుని జారు సోమ
రసముగ్రోలంగ బిలుతుము చాల భక్తి ॥ 5427

§తే॥గీ॥ అమర! యాహూయమానుండ వగుచు నీవు!
యజ్ఞతల మిచ్చ టేగుని యధిగమింపు
మరి సమూహంబు నెల్లను నభిభవించు
నిన్ను యాచించుచున్నాము నిఖిల ధనము ॥ 5428

(3)§తే॥గీ॥ అల బృహస్పతి సంబంధి యజ్ఞమందు
వరుణ సంబంధ సురుచిర పరమ సోమ
యజ్ఞగృహమందు వర్తించి యతిశయముగ
నిన్ను స్తుతించుచున్నాను నిశ్చలమతి ॥ 5429

§తే॥గీ॥ ఓ విధాతృడ! ధాతృడా! యుష్మదీయ
మైన యజ్ఞముబొందుచు నాదరమున
గలశ శిష్ట సోమంబు లలిత రీతి
డాగియున్నాడ నే నప్డె తనివి తీర ॥ 5430

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "విశ్వామిత్రుడు, జమదగ్ని" గాను, దేవత "ఇంద్రుడు" గాను, శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(4)§తే॥గీ॥ ఇంద్ర! త్వత్ ప్రేరితుండనై యిష్టియందు
హవ్యమును సిద్ధపరచితి నాదరమునఁ
బ్రథమ సంస్తోతనై నేను బరమ నుతిని
బలుకుచున్నాను నీకయి లలిత రీతి ॥ 5431

(ఇపు డింద్రుఁడు అంతరాత్మరూపుఁడై సూక్తద్రష్ట లగు
విశ్వామిత్ర జమదగ్నులను సంబోధించి యిట్లు పలికెను.)•

§తే॥గీ॥ మీ నిమిత్తము సోమము మెఱయుచుండ
ధనముతోఁగూడి నే నెప్డుఁ దప్పకుండ
వచ్చెదనొ! యప్డు స్తోత్రంబు వలసినట్లు
చేయుఁడీ! మీరు మునులార! చిత్త మలర ॥ 5432

## సూక్తము—172

ఋషి—విశ్వామిత్ర జమదగ్నులు
దేవత—ఇంద్రుఁడు; 3-సోమ, వరుణ, బృహస్పతి, అనుమతి,
మఘవంతుఁడు, ధాత, విధాతాదులు

### అర్థాంతరము—1

§(1) సోమాఽమృత దివ్యశక్తి శుభ్ర కాంతి వర్ధిల్లఁగఁ
బ్రభాకరుఁడు జ్వలియించును రాజిత మౌ నవలాఽనిల
శక్తు లెల్ల దూతలుగా సదా సమర్పింప నింగిఁ
బ్రకృతి సంపదాళులతో భాసిల్లఁగఁ బుత్రునకే
కలశ రూప మధుద్రవము కార్లును నిత్యాఽమృతమై ॥ 5433

§(2) స్వర్గ విజిగీషితమైఁ జదలంపెడి తిమిరమ్మున్
సంహరించి హవిషమ్ముల జ్వాలలలో రూపుమాపి
రవికాంతుల తేజమ్ములు కార్లంగా సృష్టిలోన
జయగతులను దీప్తమ్మౌ జన్మమ్ములు సృష్టిని దగు ॥ 5434

§(3) చంద్ర సూర్యశక్తు లెల్ల జలదేవుని ధర్మమ్మున
మతినాథుని ననుమతిమై మహిత మౌచు స్థితిశుభాలు
ధాత విధాతగాఁగ సృష్టినేతగాఁగ విలసిల్లుచు
మధుకలశములోని అమృత మధుధారల నిత్యమ్మును
స్వీకరించు నింద్రస్తుతి రాకా శశి శుభ్ర శుక్ల
కౌముదు లవి ప్రకృతిపైని గ్రాల నర్తించి శక్తి నిచ్చు ॥ 5435

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•ఇదానీమింద్ర! అంతరాత్మరూపః సన్ సూక్తస్య ద్రష్టారావృషీ సంబోధ్య బ్రూతే. (సాయణాచార్యః).

§(4) సర్వ విశ్వ రూపమునకు శత్రు వౌచు వ్యాపించెడి
"అభి" శక్తుల నన్నింటిని నజయ్యంపు దీప్తులతో
నాశ మ్మొనరించి దివ్య నవ్య నిత్య ప్రాణ త్రాణ
శక్తితతుల సంసృష్టిని రక్తిమమైఁ బెంచును శుచి ॥ 5436

## సూక్తము—172

ఋషి—విశ్వామిత్ర జమదగ్నులు
దేవత—ఇంద్రుఁడు; 3-సోమ, వరుణ, బృహస్పతి, అనుమతి,
మఘవంతుఁడు, ధాత, విధాతాదులు

### అర్థాంతరము—2

§(1) ఐంద్రరూప దివ్యశక్తు లఖిలమ్మును నీ సేవల
నమృత సోమ మగ్నిరతుల నభిషేక మ్మొనరించుచు
విశ్వసృష్టి స్థితిగతులకు నగ్నిదీప్త సంక్షేమపు
మహాశక్తిఁ బ్రసాదించు మహావిష్ణు! నీ లీలగ ॥ 5437

§(2) గగనమ్మున వెలుఁగొందెడి అగణితమౌ దీప్తిగతుల
ఋక్ష గ్రహ సూర్యచంద్ర లక్షయగతి విలసిల్లఁగ
నమృత సోమశక్తులతో నఖిల జగతి అమల మౌచు
బల సంపద కలితమ్మై ప్రకృతు లెల్ల విలసిల్లును ॥ 5438

§(3) సకల జగదధిపతియౌ సర్వేశుని ననుమతిమై
వరుణ శక్తి ధర్మమ్మునఁ బ్రకృతిపైని స్రవియించెడి
సోమాఽమృత దివ్యశక్తి సృష్టి స్థితి శక్తులనే
ధాతకే విధాతకాఁగ సాతతముగఁ గాపాడును
అమృతకలశ పూర్ణమౌ నక్షయ మధు సోమ మలర ॥ 5439

§(4) ఋజుశక్తుల సృష్టిలోన సజగతులను వర్తిల్లును
దొట్టదొలుత సోమాఽమృత దురిత నాశకంపు శక్తి
విశ్వమున కమిత్రమౌ విధ్వంసపు విషశక్తుల
నఖిలమ్ముల సృష్టిష్టిని నద్భుత గతి నాశపరచి
సుతశక్తుల సహితమ్ముగ సృష్టి సంజనన భావ
భోగకర్తగాఁగ వరలి భోగ భోక్తగాఁగఁ బరఁగు ॥ 5440

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§— చరాఽచర ప్రపంచాస జడాఽజడ ప్రకృతులలో
సకలమౌ్మ పదార్థాల సదా! స్వీకరించును రవి
నిత్య సృష్టి యజ్ఞరూప సత్యాగ్నులకిరియలమెయిని
నద్భుతమౌ దైవీయపు టమృతగతుల(గాంతు లలర ॥ 5441

## సూక్తమ్—173

ఋషిః—అనిలో వాతాయనః
దేవతా—వాయుః
ఛందః—త్రిష్టుప్

(1) వాతస్య ను మహిమానం రథస్య రుజన్నేతి స్తనయన్నస్య ఘోషః ।
దివిస్పృగ్యాత్యరుణాని కృణ్వన్నుతో[1] ఏతి పృథివ్యా రేణుమస్యన్ ॥ 1805

(2) సం ప్రేరతే[2] అను వాతస్య విష్ఠా[3] ఐనం గచ్ఛన్తి సమనం న యోషాః ।
తాభిః సయుక్ సరథం దేవ[4] ఈయతే ఽస్య విశ్వస్య భువనస్య రాజా ॥ 1806

(3) అన్తరిక్షే పథిభిరీయమానో న ని విశతే కతమచ్చనాహః ।
అపాం సఖా ప్రథమజా[5] ఋతావా క్వ స్విజ్జాతః కుత[6] ఆ బభూవ ॥ 1807

(4) ఆత్మా దేవానాం భువనస్య గర్భో యథావశం చరతి [7]దేవ ఏషః ।
ఘోషా[8] ఇదస్య శృణ్విరే స రూపం తస్మై వాతాయ హవిషా విధేమ ॥ 1808

---

**§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"**

**1. న్నుతోఽఏతి, 2. రతేఽఅను, 3. విష్ఠాఽఐనం, 4. దేవఽఈయతే, 5. ప్రథమజాఽఋతావా,**

**6. కుతఽఆబభూవ, 7. దేవఽఏష, 8. ఘోషాఽఇదస్య. (ప్రా.ప్ర.)**

## సూక్తము—173

ఋషి—వాయుగోత్రిజుఁడు అనిలుఁడు*
దేవత—వాయువు*

(1)§సీ॥ గిరిగహ్వరములందు సురుచిర శబ్దంబు పుట్టించుచున్ గాలి పోవుచుండు
జంగమ స్థావర జాతంబు నంతయు భంజించుచున్ గాలి పారుచుండు
నాకాశ మంతట నతిశయంబుగఁ దాను వ్యాపించుచున్ గాలి యరుగుచుండు
వివిధ దిక్కుల నెల్ల వికృతమ్ము లౌనట్లు చేయుచు వాయువు చెలఁగుచుండు
తే॥గీ॥ భూమిపైఁ గల్గు ధూళిని బొందుచుండి, యంతటన్ జల్లుచున్ గాలి యమరుచుండు
నిట్టి వాయువు మాహాత్మ్య మెల్ల నేను,శీఘ్రముగఁ జెప్పుచున్నాఁడ శీఘ్రిలు చెలఁగ॥ 5442

(2)§గద్యము॥
విశేషముగ స్థితము లగు పర్వతాదులు వాయు వే ముఖముగ వీచునో! యా ముఖములుగఁ గంపించుచున్నవి.సంగ్రామమును వలె నీ వాయువును బడబలు పొందుచున్నవి.అట్టి బడబలతో యజమాన మగు నొక్క రథమునే యెక్కి దేదీప్యమానమగు వాయువు పోవుచున్నాఁడు.ఈ సమస్త భువనజాతమున వాయువు స్వామి యగుచున్నాఁడు॥ 5443

(3)§తే॥గీ॥అంతరిక్షంబునందున నఖిల మార్గ
ములను బోవుచు వాయువు మోద మలర
నొక్క దినమందు విశ్రాంతి నొందకుండ
సర్వదా సంచరించును దా సవిత పతిగ॥ 5444

§ఆ॥వె॥ ప్రథమజాతుఁ డౌచుఁ బరమ సత్యాత్ముఁడౌ
వాయు వెచటఁ బుట్టుఁ బాయకుండ
నెటులు వచ్చుచుండు నెట్టులు పోవునో!
యెవ్వ రీ జగాన నెరుఁగఁగలరు?॥ 5445

(4)§సీ॥ దేవాదులందున జీవరూపంబున నతిశయ వ్యాప్తిని నందునట్టి
భువనంబులకు గర్భభూతుఁడై లోలోన మెఱుఁగు సంపదలోడ మెలఁగునట్టి
స్వేచ్ఛా విహారంబుఁ జేయుచు నంతట నంచితంబుగఁ జరియించునట్టి
యొక్కెడ వేగము నొక్కెడ మాంద్యమ్ము నొక్కొక్క వేళల నొందు నట్టి
తే॥గీ॥ వాయు వొకతరి నొక్క నికాయమునను,బయలు వెడలుచునుండును హాయలు చెలఁగ
నొక్కని శరీరమును గడుఁ జక్కనిగతిఁ,బడయుచుండి యథేచ్ఛగఁ బారుచుండు॥ 5446

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 156 సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అనిలుఁడు" గాను, దేవత "శత్రు నాశనము" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పప్పమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—173

ఋషి—వాయుగోత్రిజుఁడు అనిలుఁడు
దేవత—వాయువు

### అర్థాంతరము—1

§(1) మహాకాల రథశబ్దము మరుచ్చలన శక్తులతో
విహాయసమున విహరించును విశద కామరూపగతుల
అరుణాత్మక రేణుతతులు ఆకసమునఁ బృథ్వీతత్త్వ
రూపమ్మున దశదిశలను వ్యాపితమౌ నిత్యమ్మును ॥ 5447

§(2) హ్రాదూ్రిపపు దివ్యశక్తి నెనఁగు ననల మరుత్తతులు
ప్రికృతిచలన పే్రిరకతల భానుదీప్తు లలరారఁగ
విశ్వ లోక గోళాలకు విమలాఽనిలాఽధిపతిగ
దైవీయమ్మౌ శక్తులఁ దనరారును గాలరథము ॥ 5448

§(3) అంతరిక్ష మూర్ధమ్మున నదృశ్యంపు గతులు మీఱ
ననిలమ్ములు సంచరించు నసాధారణంపు శక్తి
సత్యశక్తి ప్రిభావాల సంభవించి ప్రిథమమ్ముగ
సలిలాఽనల మృదాకాశ సఖిత్వమ్ము వరల నిల్చు ॥ 5449

§(4) దేవాళుల ఆత్మశక్తి దివ్యతత్త్వ మలరారఁగ
సర్వ భువన గర్భ మౌచుఁ బర్వును దేవాఽనుగతుల
రూపమ్మది లేకుండఁగ శ్రోి్రతుఽ్రి శ్రివణగతమ్మౌచు
స్పర్శ పరమ్మౌచు మరుచ్ఛక్తు లలరు సృష్టిలోన ॥ 5450

§— దేవాత్మగ ననిలమ్ములు ధృతలోక గర్భమ్మై
వరఁగు సర్వ మరుత్తతులు పరిశుభ్రిమ్మై వరలఁగ
గోప రహిత శబ్దతతుల నాపాత స్పర్శగతుల
నభ్యుదయ పూర్ణమ్మై యజ్ఞమ్ముల హవిషమ్మౌ ॥ 5451

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

## సూక్తము—173

ఋషి—వాయుగోత్రజుఁడు అనిలుఁడు
దేవత—వాయువు

### అర్థాంతరము—2

§(1) రకరకాల ఘోషలతోఁ గాలి విశ్వసృష్టిలోన
బహుళములౌ చలనగతులఁ బవనమ్ములు సంచరించు
నంతర్‌బాహిరగతులను నఖిల ప్రకృతి వ్యాప్తి చెంది
అనల సలిల పృథ్విరూప కణరేణువులౌ ధూళుల
నన్నింటిని స్వీకరించి అఖిలమ్మున వెదఁజల్లును ॥ 5452

(2)§ఆ॥వె॥ సర్వ లోక గోళ సంచయమ్ములు సృష్టి
ననిల గతులఁ దిరుగు నాకసాన
భూత రూప తతులఁ బృథ్వ్యాదు లెల్లను
బవన శక్తి నిల్చుఁ బ్రకృతు లౌచు ॥ 5453

§(3) ఋక్ష గ్రహ సూర్య చంద్ర ఋతశక్తుల వర్తిల్లుచు
అవిశ్రాంత చలనగతుల ననిలమ్ములు సంచరించు
నిరోధంపు శక్తులతో నిస్తబ్ధత వరలంగా
నిఖిలమ్మును సవితశక్తి మఖగతులను నిల్పివేయు
ననల సలిల సఖిత్వమ్ము నాకసంపు నేల చెలిమి
అఖిలమ్మున వర్తిల్లఁగ నాదిజమై తనరారును ॥ 5454

§ఆ॥వె॥ ఆవరించి సృష్టి నఖిలాఽంతరిక్షమ్ము
నిర్‌విరామ గతుల నిరత చలన
తత్త్వ మొప్ప గాలి తనరారు విశ్వాన
నఖిల ప్రకృతులందు నావరించి ॥ 5455

(4)§ఆ॥వె॥ సర్వ లోక గోళ సంధారకమ్మైన
వాయుతతుల వివిధ ప్రకృతు లలరు
సర్వ దేవతలకు సకల భూతాళికి
ననిల మలరుచుండు నాత్మ కాఁగ ॥ 5456

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§ఆ॥వె॥ శబ్దశక్తి మీఱ శ్రవణ గోచర మౌచు
రూపరహిత గతుల గోవ దీప
తత్త్వ మొప్పఁగ మరుదాళు లొప్పారును
జన్నములను హవిష సంవదలిడ॥ 5457

§— దేవతతికి ఆత్మ యౌచు దేవత్వపు తనరారఁగ
గర్భమ్మై భువనమునకుఁ గాలిచుండు కరువలియై
అఖిలమ్మున సంచరించు నవశమ్మౌ గతులతోడ
స్వరూపమ్ము లేకుండఁగ స్పర్శ శబ్ద శక్తులతోఁ
దనరారెడి మరుత్తులకుఁ దగును సృష్టి హవిష విధిగ॥ 5458

## సూక్తమ్—174

ఋషిః—శబరః కాక్షీవతః
దేవతా—గావః
ఛందః—త్రిష్టుప్

(1) మయోభూర్వాతో[1] అభి వాతూస్రా ఊర్జస్వతీరోషధీరా రిశన్తామ్।
పీవస్వతీర్జీవధన్యాః పిబన్త్వవసాయ పద్వతే రుద్ర మృళ॥ 1809

(2) యాః సరూపా విరూపా[2] ఏకరూపా యాసామగ్నిరిష్ట్యా నామాని వేద।
యా[3] అంగిరసస్తపసేహ చక్రుస్తాభ్యః పర్జన్య మహి శర్మ యచ్ఛ॥ 1810

(3) యా దేవేషు తన్వ౧మైరయన్త యాసాం సోమో విశ్వా రూపాణి వేద।
తా[4] అస్మభ్యం పయసా పిన్వమానాః ప్రజావతీరిన్ద్ర గోష్ఠే రిరీహి॥ 1811

---

§రచయిత:—వాఙ్మయ మహోద్యోత, డాక్టర్ పిడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1.భూర్వాతో=అభి వాతూస్రా=ఊర్జస్వతీ, 2.విరూపా=ఏక, 3. యా=అంగిరస, 4. తా=అస్మభ్యం. (వా.ప్ర.)

(4) ప్రజాపతిర్మహ్యమేతా రరాణో విశ్వైర్దేవైః పితృభిః సంవిదానః ।

శివాః సతీరుప నో గోష్ఠమాకస్తాసాం వయం ప్రజయా సం సదేమ ॥ 1812

## సూక్తము—174

ఋషి—కక్షవత్ పుత్రుఁడు శబరుఁడు*

దేవత—గోవు*

(1)§సీ॥ సుఖభావయిత యగు సురుచిర వాయువు గోవుల కెదురుగాఁ బోవుఁగాక!
ధేను గణంబులు దివ్యౌషధుల మృదు తృణసంచయంబును దినునుగాకఁ!
బ్రాణి సమూహంబు బ్రతికింపఁ జేసెడు నప్పులు గోగణ మానుఁగాక!
నతిప్రవృద్ధంబులై యంతటఁ జరియించు ధేనువుల్ జలమును బూనుఁగాక!
తే॥గీ॥ వీక్షణంబులచేతనే వివిధ రోగ,ములను హరియించు రుద్రుఁడా! మోద మలరఁ
బాదయుగ్ గోనమూహంబుఁ బట్టు పట్టి,నీవు సంతోష పెట్టుమా! నిర్మలమతి ॥ 5459

(2)§గద్యము ॥
ఏ గోవులు సమానరూపములో! యేవి విభిన్న రూపములో! యేవి వర్ణముచే నేకరూపములో! యే గోవుల నామములను యాగ హేతువుచే నగ్ని తెలుసుకొనుచున్నాఁడో! వేనిని సంగిరసులు పశుప్రాప్తి సాధనము లగు యాగాదిలక్షణములచే నీ లోకమును బుట్టించెనో! యా గోవుల కన్నిటికి నో పర్జన్యుఁడా! నీవు మహాసుఖము కలిగింపుము! ॥ 5460

(3)§గద్యము ॥
దేవతల పూజావేళ నే గోవులు తమ శరీరమును హవిరూపమునం బ్రేరేపించుచుండునో! యే గోవులు క్షీరాదిరూపములను సోముఁ డెఱుఁగుచున్నాఁడో! మా నిమిత్తమై క్షీరవర్ధమానము లగుటచే నే గోవులు వత్సములతోఁ గూడుకొనినవో! యా గోవులను నింద్రుఁడా! మా గోష్ఠమునకుఁ బంపుము! ॥ 5461

(4)§చ॥ ఇపు డల ధాత గోవులను నిచ్చుచు మాకు సమస్త దేవతాఽ
ధిపతిచయంబుతోడ నతిదీప్తిని నైక్యము దోపఁ బొందు నా
యపరిమితాఽచ్ఛగోవులను గాత్ర ప్రజంబును జేర్చుఁగాక మే
యపగత దోష ధేనువుల నందఁగలారము సర్వభంగులన్ ॥ 5462

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "శబరుఁడు" గాను, దేవత "గోవులు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—174

ఋషి—కక్షవత్ పుత్రుఁడు శబరుఁడు
దేవత—గోవు

### అర్థాంతరము—1

§(1) సకల సంక్షేమ రూప సదమలమౌ మరుత్తతులు
సర్వలోక గోళాలను సదా। కాపాడుఁగాక।
సుగంధాల శక్తులతో సృష్టిని బరివ్యాప్తి చెందు
దుర్గంధపు దుశ్శక్తులఁ దున్మాడుచు నోషధిగా
రుద్రశక్తు లొప్పారఁగ భద్రస్థితు లొసంగుచున్
జీవగతుల నిత్యము సంజీవనిగా వర్తిల్లును ॥ 5463

§(2) అవనిగోళ సలిలగోళ పవనగోళ శుచిగోళా
లలరంగా విభిన్నమై అఖిల భూత రూపాలవి
అవినాభావత్వ మొప్ప నభిన్నతలు వరలంగా
నే దైవీయపు శక్తిని నిన గోళా లెల్ల వెలిఁగి
దీప్తులతో సృష్టి నెల్ల దృశ్యమానముగఁ జేయునో।
ఆ శక్తులు విశ్వమునకు అఖిలశుభము లొసఁగుఁగాక। ॥ 5464

§(3) దేవాళుల దుగ్ధమ్ముగ దివ్యాఽమృతము వర్తిల్లఁగ
విశ్వ విజ్ఞానమునకు విమల రూప మిచ్చునట్టి
సోమాఽమృత దివ్యశక్తి సూర్యాదులు సంగ్రహింత్రు
అమృతాఽమల దీప్తులతో అఖిలమ్మును వెలుఁగఁ జేయు ॥ 5465

§— సృష్టి ప్రకృతి దుగ్ధమ్ముల సూక్ష్మగతుల స్వీకరించి
సౌర మండలాఽంతర్గత సకల లోక గోళాలవి
త్రాణశక్తి ప్రాణశక్తి తనరంగాఁ బ్రవృద్ధమై
క్రమగతులను వేల లెనసి క్రాలి సంచరించు సదా। ॥ 5466

§(4) అనిలభరిత కాంతితతుల నఖిలమ్మునఁ బ్రసరించుచు
నైక్యముగా భూతాఽఽళుల నసాధారణంపు రతులఁ
బృథ్వి సలిల గగనమ్ముల విషశక్తులఁ దున్మాడుచుఁ
బ్రాణికోటి దేహమ్ములఁ బ్రాణ త్రాణ శక్తు లిచ్చు ॥ 5467

---

§ రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§ఆ॥వె॥ విశ్వదేవతాళి పితృ సంవిదానంపు
శక్తు లలర బ్రహ్మ సర్వ సృష్టి
శివకరమ్ముగాఁగఁ జెలఁగ నర్ధాంగిత్వ
మలరఁజేసి నడుపు నఖిల జగతి ॥ 5468

## సూక్తము—174

ఋషి—కక్షవత్ పుత్రుఁడు శబరుఁడు
దేవత—గోవు

## అర్థాంతరము—2

§(1) యమమయమై వర్తిల్లెడి అనిలాఽమృత శక్తితతులు
ఊర్జశక్తు లొప్పారఁగ నుసురుల రూపమ్ము లొంది
రుద్ర రూప శక్తులతో ఛిద్ర క్షుద్ర విషాఽభిశక్తి
సర్వస్వము ధ్వంసపరచి శాంతి జీవ సుఖము లొసఁగు ॥ 5469

§(2) స్వరూపాల విరూపాల సకల సృష్టి గోశాలవి
ఏకరూప తత్త్వాలను నెసఁగు సగ్ని శక్తులతో
నభ్యుదయావహమ్ముగా నఖిలమ్మును దనరారఁగఁ
జడలునఁ బర్జన్యశక్తి సలిలమ్ములఁ బ్రసాదించి
మహీతలమ్మందు శర్మ మహత్త్వమ్ము లలరంగా ॥ 5470

§(3) తనుగతులను దేవాళులఁ దనరారెడి సోమాఽమృత
దివ్యశక్తి విశ్వరూప దీప్త విజ్ఞానదమై
సృష్టిరూప ప్రకృతులకై చెలఁగి జలరూప మౌచు
సేవ్యమాన మౌచు వరలి చెల్వారఁగ నింద్రశక్తి
విశ్వ గోశ లోకాలను విరాజిలును వేల లెనసి
బద్ధ మౌచు నిమ్నగమై నిబద్ధ మౌచు సంచరించు ॥ 5471

§(4) ప్రాణికోటి సర్వమునకుఁ బతిగాఁగను వెల్గొందెడి
దేవదేవుఁ డెల్ల విశ్వ దేవ పితృతతులతోడ
నీ సృష్టిని సంవిదాన మెనయించును నైక్యగతుల
నన్యోఽన్యపు సంబంధ మ్మవినాభావత్వ మలర ॥ 5472

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పట్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సీ— శివశక్తులతో సతులై అవిరళానుబంధాలను
సౌరమండలంపు పరిధి సంచరించు గోళమ్ములు
రవ్యాకర్షణశక్తులై దివ్యశక్తి హద్దులుగా
గోపాలకు మహతశక్తి గుప్తాధిదైవత్య మలర ॥ 5473

## సూక్తమ్—175

ఋషిః—విభ్రాట్ సౌర్యః
దేవతా—సూర్యః
ఛందః—జగతీ; 4-ఆస్తారపంక్తిః

(1) విభ్రాడ్ బృహత్ పిబతు సోమ్యం మధ్వాయుర్దధద్యజ్ఞపతావవిహ్రుతమ్ ।
వాతజూతో యో[1] అభిరక్షతి త్మనా ప్రజాః పుపోష పురుధా వి రాజతి ॥ 1813

(2) విభ్రాడ్ బృహత్ సుభృతం వాజసాతమం ధర్మన్ దివో ధరుణే సత్యమర్పితమ్ ।
అమిత్రహా వృత్రహా దస్యుహంతమం జ్యోతిర్జజ్ఞే[2] అసురహా సపత్నహా ॥ 1814

(3) ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరుత్తమం విశ్వజిద్ధనజిదుచ్యతే బృహత్ ।
విశ్వభ్రాడ్ భ్రాజో మహి సూర్యో దృశ[3] ఉరు పప్రథే సహ[4] ఓజో అచ్యుతమ్ ॥ 1815

(4) విభ్రాజంజ్యోతిషా స్వరగచ్ఛో రోచనం దివః ।
యేనేమా విశ్వా భువనాన్యాభృతా విశ్వకర్మణా విశ్వదేవ్యావతా ॥ 1816

---

సీరచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. యోఽఅభిరక్షతి, 3. జజ్ఞేఽఅసురహా, 3. దృశఽఉరు, 4. సహఽఓజోఽఅచ్యుతమ్. (వ్రా.ప్ర.)

## సూక్తము—175

ఋషి—సూర్యపుత్రుఁడు విభ్రాట్టు*

దేవత—సూర్యుఁడు*

(1)§చ॥ పరిభృఢ సోమరూపమును బానము చేయుచు దీప్తిఁ గాంచి తా
నరమర లేక మానవున కాయు వొసంగుచు వాయుపూర్తిచే
నిరతము ప్రేర్యమానుఁ డగు నిర్మల సూర్యుఁడు సర్వలోకమున్
విరివిగఁ గాచుచున్ వెలుఁగు వృష్టి నొసంగుచు జీవకోటికిన్ ॥ 5474

(2)§సీ॥ విభ్రాజమానమై వెలుఁగొందు తేజస్సు యజ్ఞంబునందున నమరుచుండుఁ
బ్రౌఢతమంబయి భాసిల్లు తేజస్సు యజ్ఞంబునందున నమరుచుండు
బలవర్ధకంబయి వెలిఁగెడు తేజస్సు యజ్ఞంబునందున నమరుచుండు
వాయువుచేతను వర్ధిల్లు తేజస్సు యజ్ఞంబునందున నమరుచుండు
తే॥గీ॥ సప్రియుల నెల్ల నడఁచుచు నరి సమూహ,హంత యగుచుండి దస్యుల నతిశయముగఁ
గూల్చుచు సహజ శత్రులఁ గూల్చుచుండు,సూర్య తేజస్సు జనియించు శుభకరేప్సి ॥ 5475

(3)§తే॥గీ॥ సౌర తేజస్సు శ్రేష్ఠమై సకల ఖచర
గణములన్ వెల్గఁజేయుచు ధన విజేత
యయి ప్రభూతమటంచుఁ దా మార్యు లెల్ల
రుచ్చరించుచునున్నార లుచ్చమతిని ॥ 5476

§ఆ॥వె॥ భ్రాజమానుఁ డైన భానుండు సమమైన
దర్శనార్థ మఖిల తమముఁ గొట్టు
నిత్య తేజ మనెడు నిఖిల బలంబును
వెలయఁజేయుచుండె విస్తృతముగ ॥ 5477

(4)§గద్యము ॥
సూర్యుఁడా! యెట్టి తేజస్సుచే సర్వభూతజాతము లన్ని విధముల బోషింపఁబడుచున్నవో!
అట్టి తేజస్సుచే సర్వమును వెలిగింపఁజేయుచు దివముయొక్క రోచనమును(కాంతిని)
బొందితివి! నీ తేజస్సు నిఖిల దేవతలకును హితమైనది ॥ 5478

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "విభరాజ్" గాను, దేవత "సూర్యుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—175
ఋషి—సూర్యపుత్రుఁడు విభ్రాట్టు
దేవత—సూర్యుఁడు

### అర్థాంతరము—1

§(1) అత్యంతము మధుర మ్మౌ అమృత సోమ రసమ్మును
స్వీకరించి కిరణాళుల సృష్టిఁ బ్రకృతి ప్రాణులకును
బ్రసాదించు నద్భుతముగఁ బ్రసరించుచుఁ గాంతితతుల
నాయురారోగ్యమ్ముల నరుణుం డపురూపమ్ముగ ॥ 5479

§(2) ధర్మశక్తి తనరారఁగఁ దరణి నింగి నలరారుచు
సత్యపర మ్మౌచు సృష్టి సదా! కాంతిఁ బ్రసాదించి
గ్రహోపగ్రహా లన్నిటిని గాపాడుచు నిత్యమ్మును
శత్రుతతుల దుష్టవృత్తి సంహరించి కాంతియజ్ఞ
సర్వమ్మును సూర్యవిజయశక్తి గాఁగ వెలుఁగొందును
దుష్కాల ప్రభంజనాలఁ దొడరి శుద్ధ మొనరించును ॥ 5480

§(3) జ్యోతులకే జ్యోతి కాఁగ సూర్యకాంతి ఉత్తమమై
జయించును విశ్వమ్మును సర్వధన సంపదలను
అత్యుత్తమమై ఓజస్సున నంబరమున నలరారుచు
విశ్వమునకుఁ దేజస్సుగఁ బృథ్వికే ప్రాణమ్ముగ
దృశ్యమాన మౌచుఁ గాంతి సృష్టిఁ బరివ్యాప్తి చెందఁ
దిమిరాళుల నాశపరచు దినమణి దీధితులు మీఱ ॥ 5481

§(4) భువి దివి లోకా లన్నిటిఁ బొనరు గ్రహ ఋక్షాలను
తేజోవంతములుగాఁగ భ్రాజమానమై వెల్గుచు
విశ్వకర్మ కర్త కాఁగ విశ్వకర్మ సాక్షిగ రవి
విశ్వగోళ లోకమ్ముల విహితమ్ముగ ధరియించును ॥ 5482

§ఆ॥వె॥ సకల ప్రకృతులకును సంక్షేమములు గూర్పఁ
బోషకమయమైన పూర్ణ కాంతి
నొసఁగుచుండి నిత్య మసదృశ గతులమై
వెల్గు వెలుఁగుగ రవి వెల్గు నింగి ॥ 5483

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

### సూక్తము—175
ఋషి—సూర్యపుత్రుఁడు విభ్రాట్టు
దేవత—సూర్యుఁడు

### అర్థాంతరము—2

§(1) నిత్య సత్య యజ్ఞమ్ముగ నిఖిల సృష్టిలోన వరల
సోమాఽమృత వృష్టి నెల్ల సూక్ష్మదీప్త చాంద్రికలుగఁ
జందమామ ప్రసాదించు సంక్షేమపు సంవర్ధన
సంశక్తులఁ బ్రకృతులను శక్తివంతమై పరఁగఁగ ॥ 5484

§(2) అతిలోకపు శక్తులతో ఋతగతులకు బద్ధమ్మై
ధర్మపూర్ణ మౌచు సకల ధరణీతలాల దివులఁ
బండు నిండు వెన్నెలలను బరఁగఁజేసి అమృతకిరణ
కాంతులతో సృష్టి నెల్లఁ గ్రాలఁజేయుఁ జందమామ ॥ 5485

§— వృత్రునితో సహా వెలయు శత్రుజాల శక్త్యాశల
సంహార మ్మొనరించుచు సర్వసృష్టిఁ గాపాడుచుఁ
జాంద్ర దీప్త కౌముదు లవి సౌరకాంతి ప్రభావానఁ
బ్రసరించుచుఁ బ్రకృతిలోనఁ బ్రాణత్రాణ శక్తు లిచ్చు ॥ 5486

§(3) ఈ కౌముది విశ్వమ్మున నెసఁగు శ్రేష్ఠతర మ్మౌచుఁ
గాంతుల కే కాంతికాఁగఁ గ్రాల నుత్తమ మ్మౌచును
నోజోగుణ పుంజాలను నొనర నచ్యుతమ్మౌ గతి
దృశ్యమాన మౌచును శశి దివ్యాఽమృత తేజమ్ముల
విశ్వజిద్ధనజిత్తుగ విశ్వమ్మున వెలుఁగుచుండు ॥ 5487

§— అతిశ్రేష్ఠమ్మౌ జ్యోతుల నలరారుచు నుత్తమమౌ
జ్యోతి గాఁగ వెల్గొందుచు యువశక్తులఁ బ్రకృతిలోన
నభివృద్ధిని బొందించుచు నభ్యుదయావహముగాఁగ
నచ్చిత్తులమయముగాఁగ సకలసృష్టి నిల్పును శశి ॥ 5488

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(4) అగ్ని గోళ సంచయాల నమృతశక్తి మండించుచు
దైవీయపు శక్తులతోఁ దనర దివ్య కాంతులతో
సకల గోళ లోకాలను సర్వప్రాణి ప్రకృతులకును
ప్రాణ త్రాణ శక్తితతులఁ బ్రసాదించు వెన్నెల లవి ॥ 5489

§— ప్రకృతిరూప సంపదలకు పరలు నోషధీతతికిని
బతిగాఁగను సంవర్ధక ఋతధారక శక్తు లలర
విశ్వ కర్మ కర్తకాఁగ విశ్వదేవ హితకారిగ
సర్వ లోక గోళాలను సంధారక సంభారక
సంవర్ధక శక్తులతోఁ జందమామ తాల్చుచుండు ॥ 5490

## సూక్తమ్—176

ఋషిః—ఇటో భార్గవః
**దేవతా—ఇన్ద్రః**
ఛందః—గాయత్రీ

(1) త్వం త్యమిటతో రథమిన్ద్ర ప్రావః సుతావతః ।
అశృణోః సోమినో హవమ్ ॥ 1817

(2) త్వం మఖస్య దోధతః శిరోఽవ త్వచో భరః ।
అగచ్ఛః సోమినో గృహమ్ ॥ 1818

(3) త్వం త్యమిన్ద్ర మర్త్యమాస్త్రబుధ్నాయ [1]వేన్యమ్ ।
ముహుః శ్రథ్నా మనస్యవే ॥ 1819

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. వన్యమ్. (పా.ప.)

(4) త్వం త్యమిన్ద్ర సూర్యం పశ్చా సన్తం పురస్కృధి ।
దేవానాం చిత్తిరో వశమ్ ॥ 1820

## సూక్తము—176

ఋషి—భృగుపుత్రుఁడు ఇటుఁడు*
దేవత—ఇంద్రుఁడు*

(1)§తే॥గీ॥ ఇటుఁడ నగు నాదు సురథంబు నెలమి మీఱ
నింద్రదేవుఁడ! నీవు నిస్తంద్ర వృత్తిఁ
బూని రక్షించితివి! కానఁ బూత మైన
సోమమును గల్గు నా పిల్పు నూటి వినుము! ॥ 5491

(2)§తే॥గీ॥ దేవతాతతికడనుండి తిరిగి పోవు
యజ్ఞపురుష శిరస్సును నాత్రఁ బూని
కొట్టియున్నాఁడ వింద్రుఁడా! కూర్మి మెఱయ
సోమి నైనట్టి నా పిల్పు నూటి వినుము! ॥ 5492

(3)§గద్యము ॥
ఇంద్రుఁడా! నీవు మనుష్యుఁ డగు నా పృథువును స్తోత్రమును గోరు అస్త్రబుధ్నునికొఱకు వశ్యునిగాఁ జేసియుంటివి! ॥ 5493

(4)§గద్యము ॥
దేవతలకుఁ గూడ దుర్విజ్ఞాతుఁడె. కాంతుఁడు నగు సూర్యుని నో యింద్రుఁడా! నీవు అస్తమయమందుఁ బశ్చాద్వర్తమానునిగఁ జేయుచున్నావు! ॥ 5494

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ఇతుఁడు"గాను, దేవత "ఇంద్రుఁడు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్యభాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—176

ఋషి—భృగుపుత్రుఁడు ఇటుఁడు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

§(1) విష్ణుదేవా! యీ సృష్టిని విలసిల్లెడి గ్రహరాజుల
రక్షించుచు నిత్యమ్మును గ్రాలు కాలరథము నడిపి
సోమాఽమృత శక్తుల మై సృష్టియజ్ఞ మొనరించుచు
నాజ్ఞాపింతువు! నిఖిల మ్మ జయ్యుండ వౌ జ్ఞానిగ ॥ 5495

§(2) విశ్వమ్మున వ్యాప్తి చెంది విష శక్తుల నన్నింటిని
దను గుణాల వేరు చేసి ధ్వంస మ్మొనరింతు వీవు!
సోమాఽమృతశక్తుల మై సృష్టియజ్ఞ మొనరించుచు
నాజ్ఞాపింతువు నిఖిల మ్మ జయ్యుఁడ వౌ జ్ఞానిగ ॥ 5496

§(3) మృత్ప్రాయపు శక్తితతిని ఋతగతులను నాశపరచి
పదే పదే పునర్జన్మ లదేపనిగ జరుగునట్లు
మనశ్శక్తులన్ నిల్పెద ననూనగతుల నో విష్ణూ! ॥ 5497

§(4) ఉచ్చరతుల నీచరతుల నొనరంగా సతతమ్మును
ఋరోగతులఁ దిరోగతులఁ బొందు నుదయాస్తమయాల
దేవాళుల చిద్గతులను దివ్యమ్ముగ వశమ్ముగా
నీ శక్తుల విష్ణుదేవ! నిఖిలమ్మును నడుచుచుండు ॥ 5498

§— ఐంద్రశక్తి నీ వగ్నిగ ననిలమ్ముగ నీరమ్ముగ
నింగి నేల లౌచు సృష్టి నెగడంగా సకలమ్మును
గ్రమగతులను నక్రమమౌ గతులతోడ దేవాళుల
చిద్గతులను విష్ణుదేవ! చెన్నొందును నీ వశమై ॥ 5499

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

### సూక్తము—176
ఋషి—భృగుపుత్రుడు ఇటుడు
దేవత—ఇంద్రుడు

### అర్థాంతరము—2

§(1) కాలరూప కాంతిరథము కాలుచు సచ్చక్తులతో
సకలమ్మును రక్షింపఁగ సదా! పంచభూతాలను
యజ్ఞాఽగ్నులు విషశక్తుల హరించుచుండి నిత్యమ్మును
సృష్టికర్త భర్త వౌచు హే విష్ణూ! వెల్గె దీవు! ॥ 5500

§(2) సృష్టి సర్వముఖమ్ము నకు శిరము శరీర మ్మొంచును
రక్షణ భారమ్ము నీవె అక్షయముగ వహించి సతము
యజ్ఞాఽగ్నుల విషశక్తుల హరించుచుండి నిత్యమ్మును
సృష్టి కర్త భర్త వౌచు హే విష్ణూ! వెల్గె దీవు! ॥ 5501

§(3) మంగళకర శుభశక్తికి భంగకరముగా వెల్గుచు
మృత్యురూప తత్త్వమునకు మిత్తిగాగఁ దనరు దీవు!
మరల మరల సృష్టిగతిని మనస్సంకల్ప రతులఁ
గల్పించుచు నిత్యమ్మును గాలెద వో విష్ణుదేవ! ॥ 5502

§(4) నీవే! ఓ విష్ణుదేవ! నెగడి సూర్యపాలకుఁడుగఁ
బూర్వాఽపర దిగ్రతులను జర్వితచర్వణగతులను
ఉదయాస్తమయాలు సర్వ[1]సృష్టిలోన వరలంగా
దేవాశుల చిద్గతులకు దివ్యమ్ముగ వశ మౌదువు! ॥ 5503

§— నాశసహిత నాశరహిత ధీశక్తుల దేవాశుల
వశ మౌచును నవశ మౌచు వర్తిల్లుదు! విష్ణుదేవ!
సూర్య చంద్ర రూపమ్ముల సొరిది దివారాత్రమ్ముల
నను నిత్యము కల్పించుచు నలరారుదు! నియమగతుల ॥ 5504

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
1. ఇక్కడ "ఉ-ఋ"లకు యతి.

## సూక్తమ్—177

ఋషిః—సంవర్త ఆంగిరసః
దేవతా—ఉషాః
ఛందః—ద్విపదా విరాట్

(1) ఆ యాహి వనసా సహ గావః సచన్త వర్తనిం యదూధభిః ॥ 1821

(2) ఆ యాహి వస్వ్యా ధియా మంహిష్ఠో జారయన్మఖః సుదానుభిః ॥ 1822

(3) పితుభృతో న తన్తుమిత్ సుదానవః ప్రతి దధ్మో యజామసి ॥ 1823

(4) ఉషా[1] అప స్వసుస్తమః సం వర్తయతి వర్తనిం సుజాతతా ॥ 1824

## సూక్తము—177

ఋషి—అంగిరసపుత్రుఁడు సంవర్తుఁడు*
దేవత—ఉషస్సు*

(1)§తే॥గీ॥ పీన ధేనువు లెల్ల సంప్రీతిఁ బొంది
లాగుచున్నట్టి యరదంబు లీల నెక్కి—
యో యుషోదేవి! మాకడ కోపి నీవు!
ధనమున నరుగుదెంచుమా! తప్పకుండ ॥ 5505

(2)§ఆ॥వె॥ ఓ యుషస్సు! నీ వమేయకర్మను గూడి
యరుగుదెంచు మిటకుఁ గరము ప్రీతిఁ
గల్యకాల మధిక ఘనదాతృతమమయి
యజ్ఞమును నొనర్చి యమరుచుండు ॥ 5506

---

1. ఉషాఽఅపస్య. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 156 సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సంవర్తుఁడు" గాను, దేవత "ఉషస్సు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(3)§తే॥గీ॥ "అన్న" భర్తల వలె మేము కష్టిన్నను గడు
దానములు గల్గువారమై మానకుండ
బ్రత్యుషో విస్తృతిని దగ బ్రబల పరచి
యజ్ఞమున దాని సేవించు చమరగలము ॥ * 5507

(4)§తే॥గీ॥ భగిని యైనట్టి రాతిరి ప్రబల తమము
సహజ తేజస్సుతో బ్రత్యుషస్సు కొట్టి
తన సుజాతత్వమును దగ దన రథంబు
బొందజేయుచు నుండె దా నంద మొప్ప ॥ * 5508

## సూక్తము—177

ఋషి—అంగిరసపుత్రుడు సంవర్తుడు

దేవత—ఉషస్సు

### అర్థాంతరము—1

§(1) సకలగోళ లోకమ్ములు సాగుచుండ గాలరతుల
బద్ధము లౌచు నాత్మ ప్రదక్షిణల బ్రదక్షిణల
గాంతికిరణ చక్రలను గ్రాలుచు నో ఉషోదేవి!
ప్రకృతి సిరి సంపతులు పరగ సత మ్ముదయింపుమ! ॥ 5509

§(2) అమేయమౌ ధీశక్తుల నధివసించు దేవతగా
మహితశక్తి సృష్టిరూప మఖమ్ములో నిత్యమ్మును
చైతన్యపు శక్తి కాగ జాగృత మై వర్తిల్లగ
నుదయింపుమ! సతతమ్మును ఉషోదేవి! సంపదగా ॥ 5510

§(3) శుభశక్తుల పూర్ణరతుల శుచి దీప్తుల తంతువులను
సర్వ ప్రకృతి రూపాలను సతము వరల జేయుచుండి
సృష్టిస్థల నఖిలమ్మును వ్యష్టి సమిష్టిగతుల మెయిని
నుషోదేవి ధరియించును నుజ్జ్వలంపు శక్తులతో ॥ 5511

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(4) అమృత కాంతి దీప్తులతో నలరారుచు నుషోదేవి!
లోక గోళ సకలమ్ముల రూపుమాపి తిమిరమ్మును
దేజశ్చక్రమ్ము నెల్ల దివ్యమ్ముగఁ గ్రమరతులను
గాలగతుల బద్ధ మౌచుఁ గ్రాలఁ ద్రిప్పుచుండుః సదాః ॥ 5512

## సూక్తము—177

ఋషి—అంగిరసపుత్రుఁడు సంవర్తుఁడు
దేవత—ఉషస్సు

### అర్థాంతరము—2

§(1) సప్తగగన సప్తానిల సప్తానల సప్తసలిల మృత్
తతుల మేళనమ్ములతోఁ దనరారెడి గోపదాలు
పొదుగులుగాఁ బ్రకృతులకు బ్రాహ్మ్యరూప శక్తులతో
సంచరించు సృష్టిలోన సదా! సంచలన గతుల ॥ 5513

§(2) కాంతికిరణతతులతోడఁ గ్రాల జీవ శక్తు లెల్ల
సృష్టియజ్ఞ కర్మలతో ఋతరూపుల ధీమహితపు
సత్పదార్థానుగతుల సర్వమ్మును వర్తిల్లఁగ
వసుశక్తుల సకలజగతి ప్రాభవాలఁ బ్రకాశించు ॥ 5514

§(3) కాంతికిరణ జాలమ్ములు తంతువులై విశ్వసృష్టిఁ
బ్రసరింపఁగ నిత్యమ్మును బరమ శుభకారకమై
బృహత్సూక్ష్మ రూపమ్ములఁ బృథ్వి లోక గోళాలకుఁ
బితృరూప వీర్యముగా సతతమ్మును వెల్గొందును ॥ 5515

§(4) చైతన్యపుఁ జలనరతుల సర్వప్రకృతి వరలంగాఁ
బెంజీకటి పుంజాలను విరిచి అదృశ్యమ్ముగాఁగ
ఉదయించును నుషోదయము ఉజ్వలమౌ రాగమ్ముల
సుజాతత్వ మలరారఁగ నజాండముల వెలుఁగు సతము ॥ 5516

---

§రచయిత:—వాఙ్మయ మహాద్యుత, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—178

ఋషి—అంగిరసపుత్రుఁడు ధ్రువుఁడు

దేవత—రాజు

## అర్థాంతరము—2

§(1) బ్రహ్మరూప శక్తులతో వరలంగా ధ్రువగతులు
సర్వ గోళ లోకాలును సంభవించు సంచరించు
విశ్వ సృష్టి సర్వస్వము విమలరాష్ట్ర మౌచుఁ బరిధు
లలరారఁగఁ బరఁగుచుండు నాధిపత్యగతుల నిల్చు ॥ 5532

§(2) స్వామి వౌచు విశ్వమునకుఁ జంద్రుండా! పర్తిల్లెదు
నపచ్యుతులు లేకుండఁగ నంతరిక్షమందు నిలిచి
నచలమ్ముగఁ దనరారుచు నలరి నీవె రవిగాఁగను
అఖిలమ్మును బోషింతువు! నిఖిలమ్మును ధరియింతువు! ॥ 5533

§(3) విమలమైన దీధితులను విరాజిలెడి సృష్టి ప్రభువు
సృష్టి విశ్వ సర్వమ్మును స్థిరతమైని ధరియించును
బ్రహ్మణస్పతి స్థితిశక్తులు పరఁగంగాఁ బుష్టిఁ దుష్టి
నా దేవుని కమృత సోమ మఖిలమ్మును వర్తిల్లును ॥ 5534

§(4, 5) ద్యులోకమ్ము గిరి పృథ్వులు ధ్రువము లౌచుఁ దనరారును
సకల జగము ధ్రువమ్మును సర్వశుభాఽఽవళుల కెల్ల
నధిపతియౌ నమృతసోముఁ డలరారును ధ్రువమ్ముగా
నచ్యుత! హరి! నీ కృపమై ననిలాఽనల సలిలమ్ములు
నాకసమ్ము మృత్ తతులును నలరారును ధ్రువగతులను ॥ 5535

§(6) స్థిరగతులను సృష్టివరల స్థిరాఽధిపతిగ హరి పరఁగును
బ్రాహ్మ్యమైన దివ్యశక్తి వరలంగా సకల సృష్టి
స్థితిశక్తుల కేవలతను జెన్నొందఁగ విశ్వ మూల
పదార్థమ్ము ప్రాణరతుల వరలు మహావిష్ణు! నీ కృప ॥ 5536

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—179

ఋషిః—అభీవర్త అంగిరసః
దేవతా—రాజా
ఛందః—అనుష్టుప్

(1) అభీవర్తేన హవిషా యేనేన్ద్రో[1]అభివావృతే ।
తేనాస్మాన్ బ్రహ్మణస్పతే ఽభి రాష్ట్రాయ వర్తయ ॥ 1831

(2) అభివృత్య సపత్నానభి యా నో[2] అరాతయః ।
అభి పృతన్యన్తం తిష్ఠాఽభి యో న[3] ఇరస్యతి ॥ 1832

(3) అభి త్వా దేవః సవితా ఽభి సోమో[4] అవీవృతత్ ।
అభి త్వా విశ్వా భూతాన్యభీవర్తో యథాసని ॥ 1833

(4) యేనేన్ద్రో హవిషా కృత్వ్యభవద్ ద్యుమ్న్యుత్తమః ।
ఇదం తదక్రి దేవా [5]అసపత్నః కిలాభువమ్ ॥ 1834

(5) అసపత్నః సపత్నహా ఽభిరాష్ట్రో విషాసహిః ।
యథాహమేషాం భూతానాం విరాజాని జనస్య చ ॥ 1835

---

1. యేనేన్ద్రోఽఅభి, 2. నోఽఅరాతయః, 3. యో నఽఇర, 4. సోమోఽఅవీవృత,

5. దేవాఽఅసపత్నః. (వా.ప.)

(4)§తే॥గీ॥ దివము స్థిర మగుచుండెను దీప్త పృథ్వి
స్థిరముగా నుండుఁ గొండలు స్థిరము లగును
విశ్వ మంతయు స్థిర మగు వివిధ జనుల
రాజు సుస్థిరుఁ డగుఁగాక! రాణ మిగుల ॥* 5521

(5)§తే॥గీ॥ ఘనుఁడు వరుణుండు నీ రాష్ట్రమును స్థిరంబు
గాఁగ ధరియించుఁగాకఁ! బ్రకాశ మొందు
నల బృహస్పతి ధ్రువముగా నట్టి రాష్ట్ర
మును ధరించునుగాకఁ! బ్రమోద మంది ॥* 5522

§తే॥గీ॥ రాజచంద్రమా! నీదైన రాష్ట్ర మెల్ల
నింద్రదేవుండు వహ్నియు నిరువురుఁ దగ
స్థిరముగా నుండునట్టులు కరముఁ బ్రీతిఁ
దాల్చుదురుగాక! నే వేళఁ దాము కరము ॥* 5523

(6)§క॥ స్థిర హవ్యయుక్త మగు సు
స్థిర సోమము దాల్పఁగలము శ్రీలు చెలంగన్
హరి! నీదు ప్రజలు నీకుం
గర మిచ్చెడున ట్లొనర్చి గ్రాలుత! రాజా! ॥* 5524

## సూక్తము—178

ఋషి—అంగిరసపుత్రుఁడు ధ్రువుఁడు

దేవత.—రాజు

### అర్థాంతరము—1

§(1) ఆనంద వికాసాల కంతర్గతి వెల్గుచుండి
ధ్రువశక్తికి నిత్యమ్మును నవితథగతిఁ బ్రదక్షిణల
నాత్మప్రదక్షిణలను అధిపతి ప్రదక్షిణలను
నొనరించుచు లోకపరిధి కుజ్జ్వలముగ శక్తి నిచ్చి
అమృతప్రాయమ్ముగాఁగ నఖిలమునకుఁ ద్రాణ నొసఁగి
విరిసెడి వెన్నెల దీప్తుల విరాజిలును జందమామ ॥ 5525

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(2) చలితాఽచలిత గతులతోడ సదా! వెలయు పర్వతముగ
గ్రిహరాజొక అధిపతిగా( గదలి కదలకుండ నిలుచు
ఋక్ష గ్రిహ గోళ లోక మెల్ల నంతరిక్షమందు
ననునిత్యము ప్రిదక్షిణగ నెన లేని క్రిమ శిక్షణ(
దిరిగి యింద్రి ధ్రివగతులను వరలు రాష్ట్రిశక్తులుగా ॥ 5526

§(3) ఐంద్రమైన దివ్యశక్తి అత్యంతము ధ్రివశక్తుల
ధ్రివమ్ముగా సృష్టి యెల్ల హవిషమ్ముగ స్వీకరించు
సోమాఽమృత మహాశక్తి శుభ సుఖ ప్రిదమ్ముగా
వైష్ణవీయ శక్తిగా(గ వరలు బ్రిహ్మణస్పతి ॥ 5527

§(4) ద్యోగతు లవి ధ్రివము లగును ధ్రివము లవును బృథ్వీగతులు
ద్యో వృథ్వులఁ బర్వతాలు ధ్రివమ్ములై తనరారును
నీ విశ్వము ధ్రివ మ్మౌను యీ జగమే ధ్రివ మ్మౌను
ఐంద్రిరాజ్యమయమ్ముగా సర్వమ్మును పర్తిల్లును ॥ 5528

§(5) చందమామ ధ్రివ మ్మౌను సలిలాఽధిపతి ధ్రివ మ్మౌను
బృహస్పతి ధ్రివ మ్మౌను నింద్రాిఽగ్నులు ధ్రివమ్ముగా
బ్రిహ్మశక్తి కారణముగ వరలు విశ్వ రాష్ట్రిమ్మును
ధరియించును ధ్రివ మ్మద్ది తనరఁ గ్రిమము తప్పకుండ ॥ 5529

§(6) ధ్రివశక్తులు కారణాన ధ్రివ మ్మౌను సృష్టి హవిష
మత్యంతము న్రివియించెడి అమృత సోమ శక్తు లెల్ల
బ్రిహ్మశక్తి కారణముగ వరలు నైంద్రిదీప్తి జగతిఁ
గేవలమ్ము బలి కాఁగను జీవగతుల నిలుచు సృష్టి ॥ 5530

§ఆ॥వె॥ వైష్ణవీయమైన ప్రిభలు ధ్రివగతులన్
వరలు మృత్తునుండి ప్రిభవ మొంది
చంద్రిశక్తు లెల్లఁ జలువల వెన్నెల
నఖిల జగతి నింపు నమృత శక్తి ॥ 5531

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"

## సూక్తమ్—178

ఋషిః—ధ్రువ ఆంగిరసః

దేవతా—రాజా

ఛందః—అనుష్టుప్

(1) ఆ త్వాహార్షమన్తరేధి ధ్రువస్తిష్ఠావిచాచలిః ।

విశస్త్వా సర్వా వాంఛన్తు మా త్వద్రాష్ట్రమధి భ్రశత్ ॥ 1825

(2) ఇహైవైధి మాప చ్యోష్ఠాః పర్వత[1] ఇవావిచాచలిః ।

ఇన్ద్ర[2] ఇవేహ ధ్రువస్తిష్ఠేహ రాష్ట్రము ధారయ ॥ 1826

(3) ఇమమిన్ద్రో[3] అదీధరద్ ధ్రువం ధ్రువేణ హవిషా ।

తస్మై సోమో[4] అధి బ్రవత్ తస్మా ఉ బ్రహ్మణస్పతిః ॥ 1827

(4) ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీ ధ్రువాసః పర్వతా[5] ఇమే ।

ధ్రువం విశ్వమిదం జగద్ ధ్రువో రాజా విశామయమ్ ॥ 1828

(5) ధ్రువం తే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః ।

ధ్రువం త[6] ఇన్ద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్ ॥ 1829

---

1. పర్వతఽఇవా, 2. ఇన్ద్రఽఇవే, 3. మిన్ద్రోఽఅదీధ, 4. సోమోఽఅధిబ్రవత్తస్మాఽఉ, 5. పర్వతోఽఇమే,

6. తఽఇన్ద్రశ్చా. (వా.వ.)

(6) ధ్రువం ధ్రువేణ హవిషా ఽభి సోమం మృశామసి ।

అథో త[1] ఇన్ద్రః కేవలీర్విశో బలిహృతస్కరత్ ॥ 1830

## సూక్తము—178

ఋషి—ఆంగిరసపుత్రుఁడు ధ్రువుఁడు*

దేవత—రాజు*

(1)§తే॥గీ॥ రాజచంద్రమ! మా మహారాష్ట్రమునకు
నిన్ను స్వామిగఁజేయుచు నిల్పినాము
కావునన్ నీవు నిత్యతఁ గలిగి యుండి
దీయ రాష్ట్రంబునందున నెలకొనుండు! ॥ 5517

§తే॥గీ॥ మాకు నీతఁడె రాజుగా మనవలెనఁక!
ననుచు ని న్నెన్నుదురుగాక యన్ని ప్రజలు
నీ వియోగంబు నొందక నిఖిల రాష్ట్ర
మవికలంబుగ నమరుత! నవపదాన ॥ 5518

(2)§తే॥గీ॥ రాజ! మా రాష్ట్రమున కెల్ల రాజ వగుచుఁ
బర్వతం బెట్లు నిశ్చలభావ మొంది
కరము వర్తించునట్టులు పరమ ధృతిఁ
జలనహీనుఁడవై తగ వెలుఁగు మీవు! ॥ 5519

(3)§తే॥గీ॥ ఇట్టి యభిషిక్త రాజును నింద్రుఁ డెంతగఁ
దాల్పుఁగావుత! సోముఁడు బ్రహ్మపతిని
గావుతన్! బ్రహ్మణస్పతి కలుగు రాజు
పైని సత్పక్షపాతంబుఁ జూపుఁగాక! ॥ 5520

---

1. అథో తఽఇన్ద్ర. (పా.వ.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 1636 సంఖ్య గల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ధృవుఁడు" గను, దేవత "రాజు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహోపాధ్యాయ, డాక్టర్ వఝ్ఝ్మూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—179

ఋషి—అభీవర్తుఁడు*

దేవత—రాజు*

(1)§గద్యము ॥

అభీవర్తసంబంధ మగు నే హవ్యసాధనమున నింద్రుఁడు సర్వమును బొందెనో! ఆ హవ్యమున నో బ్రహ్మణస్పతీ! మేము రాజ్యమును బొందునట్లుగా నొనర్పుము! ॥ 5537

(2)§తే॥గీ॥ మాకు దానంబు నీయని మనుజుల మఱి
మా సపత్నగణమ్మును మాకు నీర్ష్యఁ
జూపు వారి యయుత్సుని నూటి నభిభ
వించుమా! రాజచంద్ర! నీ వంచితముగ ॥ 5538

(3)§తే॥గీ॥ అంతటన్ వర్తమానుండ వౌచు నుంతు
నట్లు సవితయె భూతాళి యఖిల వంద్య
రాజ! నీకు మహారాజ్య రమను బ్రీతి
నొనఁగెదరుగాక! సత్వర ముచిత రీతి ॥ 5539

(4)§తే॥గీ॥ ఎట్టి హవ్యము నొందుచు నింద్రుఁ డఖిల
కర్త యగుచుండె శ్రేష్ఠతఁ గలుగుచుండె
నట్టి హవ్యము సురవరులార! నేను
సిద్ధముగఁ జేసియున్నాను శీఘ్రకరముగ ॥ 5540

(5)§తే॥గీ॥ మనుజ వర్గమునకు మఱి మంత్రిముఖుల
కీశ్వరుఁడనైనయట్టు లో యాఢ్య! నేను
శత్రుహీనుండ నగుదును సకల రాజ్య
భాక్కు నగుదును గొట్టుదు వైరిగణము ॥ 5541

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అభీవర్తుఁడు" గాను, దేవత "రాజు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—179
ఋషి—అభీవర్తుఁడు
దేవత—రాజు

## అర్థాంతరము—1

§(1) అత్యంతము శుద్ధమౌ అమృత హవిషపు రాజ్య
సంశక్తులను నిందుిఁ దంశుమంతుండుగా
నాకాధిపత్యమును ధీకలితముగఁ బొందు
రీతిగా మే మెల్ల ఋత రాజ్యమును బొంద
ననుగ్రహమింపుమ! అఖిలేశా! ఓ విష్ణూ! ॥ 5542

§(2) గ్రహము లుపగ్రహమ్ములును గాల్చివేయు "నభి"శక్తుల
అరిశక్తుల నన్నింటిని నద్భుతముగ ధ్వంసపరచి
అంతరాంతరములఁ జొచ్చి అమృతశక్తు లొప్పారఁగఁ
బ్రకృతిలోన సృష్టిశక్తి వరలఁజేయు నిత్యమ్మును ॥ 5543

§(3) సకలాధిపత్యమ్మున జ్వలియించుచుఁ గాంతితతుల
వివిధ లోక గోళాదులు విరాజిలుచు లోఁగి తిరుగ
మండలాధిపత్యమ్మున మహితమ్ముగ వెలిఁగెడి రవి
విక్రమ పరాక్రమంపు విపుల సోమ రాజ్య మిచ్చు ॥ 5544

§(4) ఏ హవిషపు శక్తులతో నెల్ల వామకర్మాఽఽశుల
విధ్వంసము కావించునో! విజేతగా దేవేంద్రుఁడు
ఆ హవిషము దేవాశుల అరిరహితులుగాఁ జేయును
సృష్టిలోన నత్యంతము నుత్కృష్టముగా వెల్గును ॥ 5545

§— భువులలోనె కాకుండఁగ దివులలోన సైతమ్మును
ఉత్తమమై అలరారెడి మిత్తిలేని హవిషశక్తి
ఇంద్రరూప మౌచు నిల్చి యెల్ల దేవాశులకును
వైరితతులు లేకుండఁగ వరలఁజేసి వర్ధిల్లును
వైష్ణవీయమైన దివ్య భవ సంస్తుతి పోషకతల ॥ 5546

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(5) సకల శత్రుతండాలను సంహరించి సృష్టిలోనఁ
బ్రకృతి రాష్ట్ర సర్వమునకుఁ బ్రభువుగాఁగఁ దనరారుచు
నమృత శక్తుల విషశక్తుల నఖిలము లౌ భూతమ్ముల
కధిపతిగా విరాజిలును నందరికిని నా విష్ణువు ॥ 5547

## సూక్తము—179

ఋషి—అభీవర్తుఁడు
దేవత—రాజు

## అర్థాంతరము—2

§(1) సకల బ్రహ్మాండాలకు సచ్చిత్తుల కధిపతిగా
లక్ష్య శుద్ధ లొప్పారఁగఁ గక్ష్యలలోఁ జరించుచున్
సృష్టి లోక గోళాలను వ్యష్టి సమిష్టి గతుల వెల్గఁ
గ్రమశిక్షణ నడుపుచుండుఁ గ్రాలంగా విశ్వరాష్ట్ర
రాజ్యమునకు నధిపతిగా రాజిలు నా విష్ణుశక్తి ॥ 5548

§(2) అంగరూప రహితమైన అజయ్యంపు శుభశక్తులు
"అభి"రూపపు విషశక్తుల నరిశక్తుల రూపుమాపు
నమృత దివ్య హృచ్ఛక్తులు నమేయమౌ నుత్సుకతల
వైష్ణవీయ మహామహిత పరిసర నిత్య సత్య జయాల ॥ 5549

§(3) సౌర చాంద్ర మండలాలు సకలమ్ము ను నీ కృప మై
నిరతమ్మున సంచరించు నింగిలోనఁ గక్ష్యల మై
నీ కృపమెయి విశ్వమ్మును నిఖిల భూత సంచయాలు
వాయుచలనగతులతోడ వర్తిల్లును గ్రమశిక్షణ
యథావిధిగ సతతమ్మును నఖిలమ్మున హే విష్ణూః ॥ 5550

§(4) ఆదిశేష శక్తులతో నమృతగతుల హవిష మ్మది
అఖిల సృష్టిలోన వరలు అమరోత్తమ తేజమ్ముగ
సురశక్తుల శత్రువుగా సృష్టిలోన వెలయుచుండు
దుష్టశక్తు లన్నింటిని దున్మాడును శుభకర మై ॥ 5551

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(5) జల పృథ్వుల రూపమ్ముల సదమల మౌ శక్తులతో
శత్రురహిత ప్రకృతిగాఁగ మిత్రాఽమృత సోమతత్త్వ
మలరారఁగ నవనిరాష్ట్ర మరి నాశక మై పరఁగును
దివ్య దేవాఽఽధిపత్య తేజశ్శక్తికి లోఁబడి ॥ 5552

§— ఆకసముల కనిలమ్ముల కనలములకు సలిలములకు
మృత్ తతులకుఁ బ్రాణులకును మిత్తి లేని బ్రాహ్మ్యమ్ముగ
నమృతశక్తి సృష్టిలోన నజయ్యమై వర్తిల్లును
శత్రునాశకమ్ముగాఁగ మిత్రశక్తి వర్ధిల్లును ॥ 5553

## సూక్తమ్—180

ఋషిః—ఊర్ధ్వగ్రావా సర్ప ఆర్బుదిః
దేవతా—గ్రావాణః
ఛందః—గాయత్రీ

(1) ప్ర వో గ్రావణః సవితా దేవః సువతు ధర్మణా ।
[1]ధూర్షు యుజ్యధ్వం సునుత ॥ 1836

(2) గ్రావాణో[2] అప దుచ్ఛునామప సేధత దుర్మతిమ్ ।
ఉస్రాః కర్త న భేషజమ్ ॥ 1837

(3) గ్రావాణ[3] ఉపరేష్వా మహీయన్తే సజోషసః ।
వృష్ణే దధతో వృష్ణ్యమ్ ॥ 1838

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. దుర్షు, 2. గ్రావాణోఽఅప, 3. గ్రావాణఽఉపరేష్వా. (ప్రా.ప్ర.)

(4) గ్రావాణః సవితా ను వో దేవః సువతు ధర్మణా ।

యజమానాయ సున్వతే ॥ 1839

## సూక్తము—180

ఋషి—అర్బుదుఁడైన సర్పపుత్రుఁడు ఊర్ధ్వగ్రావ*

దేవత—గ్రావలు*

(1)§ఆ॥వె॥ గ్రావలార! మిమ్ము ఘన సోమమును దీయ
సవిత హెచ్చరింపఁజాలుఁగాకఁ!
బ్రీతిఁ గాంచి మీరు ప్రాచ్యాదులన్ సోమ
మును గ్రహింతురుగాక! మోద మలర ॥ 5554

(2)§గద్యము ॥
ఓ గ్రావలారా! దుఃఖకారులు శత్రుభూతులు నగు ప్రజలను మా చెంతనుండి తప్పింపుఁడు! మాకు సుఖ మయ్యెడునట్లు భావింపుఁడు! ॥ 5555

(3)§గద్యము ॥
సోమమునకు వీర్య మిచ్చు గ్రావలు సంగతములై యభిముఖముఁ జేయుటకు నుండు నాల్గు పాషాణములయందుఁ బ్రకాశించుచున్నవి ॥ 5556

(4)§తే॥గీ॥ ఘనుని యాగ నిమిత్తమై గ్రావలార!
సోమమును దీయ మిమ్ముల నీమ మలర
సహజ మైనట్టి కర్మ చే సత్వరముగ
సవిత సంప్రీతిఁ బ్రేరింపఁజాలుఁగాక! ॥ 5557

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ఊర్ధ్వగ్రావ" గాను, దేవత "రోలు,పొత్రము" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—180

ఋషి—అర్బుదుఁడైన సర్పపుత్రుఁడు ఊర్ధ్వగ్రావ
దేవత—గ్రావలు (సూర్య చంద్రులు)

### అర్థాంతరము—1

§(1)[*] ఆదిత్యుని శక్తులపై నలరారెడి అమృతమ్మును
అఖిల పదార్థాలనుండి ఆకర్షణతన్ గ్రహించి
విశ్వసృష్టి ప్రకృతులపై విమలామృతశక్తి తతుల
రవిచంద్రులు ప్రసాదింతు రవిరళమౌ దివ్యగతుల ॥ 5558

(2)§ఆ॥వె॥ ప్రకృతిరూప తత్త్వ సకలమ్మునకు శత్రు
వవుచుఁ బరఁగు దుష్ట వివిధ రోగ
గుణగణాల నరుల ధనశక్తులన్ దున్మి
అరుణ శశులు నిత్య మలరుచుంద్రు ॥ 5559

(3)§ఆ॥వె॥ ఉపరగతుల నింగి నుదయించుచున్ సదా!
ఉజ్జ్వలముగ వరల నుషను సృష్టి
బలము వృష్టిశక్తి వెలయించుచు నమృత
స్రావ మొసఁగు సూర్య చంద్రు లెలమి ॥ 5560

§(4) ఆదిత్యుం డెనఁగునట్టి అమలమౌ శక్తులతో
ధర్మబద్ధమౌచు సృష్టిఁ దరణి చంద్రు లలరారుచు
మిత్తి లేని దీప్తులతో నుత్తమమౌ మార్గమ్ముల
నమృతమ్మును స్వీకరింతు రఖిల శుభప్రేరణలను ॥ 5561

§—[*] కాలధర్మ మొప్పంగాఁ గ్రాలుచుండు రవి శశులును
దివ్యమౌ శక్తులతో దీధితులను వరలంగా
ఆదిత్యుండైన విష్ణు వధిపతిగాఁ దనరారఁగ
నఖిలమ్మును నా దేవున కర్పితమౌ నిత్యమ్మును ॥ 5562

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—180

ఋషి—అర్బుదుఁడైన సర్పపుత్రుఁడు ఊర్ధ్వగ్రావ
దేవత—గ్రావలు (సూర్యచంద్రులు)

### అర్థాంతరము—2

§(1) ఆదిత్య స్వాభావికమౌ ధర్మము వర్తిల్లి
దివ్యమైన దేవశక్తిఁ దేజరిల్లు రవియు శశియు
నుత్తమమౌ క్రియలతోడ నుజ్జ్వలముగ సృష్టి వరల
నిత్య చైతన్యగతుల నిఖిల ప్రకృతి విలసిల్లఁగ ॥ 5563

§(2) చలనగతుల వర్తిల్లెడి సర్వప్రకృతిలో నిరతము
దుఃఖదాయకమ్ములైన దుష్ట పదార్థా లన్నిటి
దుర్మతిబుద్ధులతోసహా తున్మాడుచు బహుళ గతుల
సూర్య చంద్రు లౌషధముగ సృష్టిలోన వరలుచుంద్రు ॥ 5564

§(3) సత్యశక్తి తత్త్వమ్మున సంజనితమ్మై వరలెడి
రవిచంద్రులు నింగిలోనఁ గ్రాలుచుంద్రు మహితమ్ముగఁ
బ్రకృతి సంపదాళి కెల్ల బల దీప్తులఁ బ్రసాదించి
ఆదాన ప్రదానాల నలరంగా నమృత శక్తి ॥ 5565

§— జలశక్తుల స్వీకరించి చదలున మేఘాలుగాఁగ
సౌర చాంద్ర శక్తులతో సంభవించు వర్షమ్ములు
వర్షములకె వర్షమ్ములు వర్షించును విశ్వమ్మున
సలిలమ్ముల రాకడగా సలిలమ్ముల పోకడగా
వర్షమ్మే ధారకమౌ వర్షమ్మే హారకమౌ
సహజోద్భవమౌచు సృష్టి మహితభూతముల నిల్పును ॥ 5566

§(4) ఆదిత్యుండౌ విష్ణుం డలరఁజేయు యజ్ఞముగా
రవిచంద్రులు నఖిల సృష్టి నవితథముగ వర్తిలెదరు
ఆ దేవుఁడె లక్ష్యముగా నఖిల గోళ లోకాదులు
నుత్తమమౌ మార్గమ్ముల నుత్తరదిశఁ బయనించును ॥ 5567

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శతే॥గీ॥ చంద్ర సూర్యులు సృష్టిని జదలు నంటి
సంచరించుచు శీతలోష్ణ కిరణాఽఽళి
సవితృదేవు ప్రదక్షిణ లవితథముగ
దీక్ష నొనరింతు రాత్మ ప్రదక్షిణలను॥ 5568

## సూక్తమ్—181

ఋషిః—సూనురార్భవః
దేవతా—1-ఋభవః; 2-4-అగ్నిః
ఛందః—అనుష్టుప్; 2-గాయత్రీ

(1) ప్ర సూనవ [1]ఋభూణాం బృహన్నవన్త వృజనా।
క్షామా యే విశ్వధాయసో ఽశ్నన్ ధేనుం న మాతరమ్॥ 1840

(2) ప్ర దేవం దేవ్యా ధియా భరతా జాతవేదసమ్।
హవ్యా నో వక్షదానుషక్॥ 1841

(3) అయము ష్య ప్ర దేవయుర్హోతా యజ్ఞాయ నీయతే।
రథో న యోరభీవృతో ఘృణీవాంచేతతి త్మనా॥ 1842

(4) అయమగ్నిరురుష్యత్యమృతాదివ జన్మనః।
సహసశ్చిత్ సహీయాన్ దేవో జీవాతవే కృతః॥ 1843

---

శరచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ప్ర సూనవఽఋభూణాం. (వా.ప్ర.)

## సూక్తము—181

ఋషి—ఋభుపుత్రుఁడు సూనుఁడు*
దేవత—ఋభువులు, అగ్ని*

(1)§తే॥గీ॥ ఋభువులకుఁ బుత్రుఁడై యుండి వృద్ధిఁ గాంచు
సూనుఁ డను వాఁడు మిక్కిలి సూక్ష్మ గమన
మునను సంగ్రామమును దాను బొంది వేగ
జయము గాంచుచున్నాఁడు శక్తి మెఱయ ॥ 5569

§తే॥గీ॥ ప్రీణయితయైన గోవును బెయ్య పొందు
నట్లు విశ్వంబు నంతఁ దా నతిశయముగఁ
దాల్చుచున్నట్టి ఋభువె తాఁ దనివి తీర
భూమి వ్యాపించుచున్నాఁడు పూర్ణ శక్తి ॥ 5570

(2)§తే॥గీ॥ అమరులకు నెల్ల హవ్యంబు నందఁ జేయు
వాఁడు కావున దేవుఁడై పరమ కర్మ
గర్గి వేదితయై కడు వెల్గు నిట్టి
యగ్నిఁ బూనుఁడు! యజమానులార! మీరు ॥ 5571

(3)§సీ॥ వీఁడె దేవతలను బిల్చువారికి సదా! యజ్ఞంబు సమకూర్ప నరుగువాఁడు
వీఁడె యజ్ఞంబులు విలసిల్లు దేశంబుఁ బొందంగఁ దుష్టితోఁ బోవువాఁడు
వీఁడె రథంబున వెలుఁగుచు సందీపితుండయి ప్రీతితో నుండువాఁడు
వీఁడె హవ్యంబును వేగమె సురలకు సంగమింపఁగఁ జేయఁజాలువాఁడు
తే॥గీ॥ పావకుం డిట్టి గుణములఁ బరఁగుచుండి,యన్యుల యుపేక్ష లేకుండ నమరవర్గ
మునకు యాగంబుఁ జేయుట నాదరమునఁ, దెలిసికొనుచుండెఁ గడుఁ దేట తెల్లముగను ॥ 5572

(4)§ఆ॥వె॥ అమరభయమునుండి యగ్ని రక్షించెడు
కరణి మనుజభయము కలుగకుండఁ
జేయు బలము కలిగి జీవన హేతువు
కొఱకు బ్రహ్మకృతుఁడు కొమరు మిగుల ॥ 5573

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సూనుఁడు" గాను, దేవత "ఋభువులు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—181

ఋషి—ఋభుపుత్రుఁడు సూనుఁడు
దేవత—ఋభువులు, అగ్ని

### అర్థాంతరము—1

§(1) గ్రహ నక్షత్రమ్ముల కాంతులు క్రాలంగాఁ బుత్రులుగా
మహాశక్తివంత మౌచు మహి దివ్యాదులఁ జేరును
విశ్వ గోళ లోకాలకు విమల క్షమాశక్తి పెరుగ
మాతృభూతమూలశక్తి మహిమాన్వితమై వెలుఁగును ॥ 5574

§— ప్రకృతిరూప నారీమణిఁ బ్రగాఢముగఁ బురుషశక్తి
హొందురీతి గోళమ్ములఁ బొందుచుండు ఋభుశక్తుల
కాంతికిరణ కరాలతోఁ గరువలిమై నాలింగన
మొనరించుచు నాప్యాయత నుష్ణశక్తు లొప్పారఁగ ॥ 5575

(2)§తే॥గీ॥ అమలశక్తుల దివ్య దేవాలయములకును
బంచభూతాలకుఁ బవిత్రితాలంచిత మగు
నిత్య నూతన శక్తిని సత్య పూర్ణ
జాతవేదమ్ము హవ్యాన నవదరించు ॥ 5576

(3)§తే॥గీ॥ కాలరథ వేగమున నగ్ని క్రాలుచుండి
సృష్టియజ్ఞాన బహుముఖ శ్రీలు వెలుఁగ
జనన సంవర్ధన స్థితి సంచయ లయ
క్రియల వర్తిల్లు నిరతమ్ము ఋషగతుల ॥ 5577

§(4) అమృతశక్తితతులనుండి అమరాళులు పుట్టు రీతి
దైవీయ చ్మా శక్తులఁ దనరారుచు మహితమ్ముగ
విశ్వరూప ప్రకృతులలో వెలయంగా బల శక్తులు
జీవతతుల సృజించు సంజీవనిగా వర్తిల్లును ॥ 5578

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—181

ఋషి—ఋభుపుత్రుఁడు సూనుఁడు
దేవత—ఋభువులు, అగ్ని

### అర్థాంతరము—2

§(1) అగ్నిశక్తి ఋభువులలో నలరారుచు సూర్యుఁడుగా
నిత్య నవ్య దీప్తులతో నెగడుచుండు బృహద్గతులఁ
బంచభూత రూపా లవి వ్యాప్తముగాఁ బృథగ్గతుల
నవనూత మ్మైన ధేను భవశక్తుల క్షమాధృతుల ॥ 5579

§(2) దివ్యమ్మౌ ప్రకృతిపురుష ధీ రూపపు శక్తుల మై
ఖగోళంపు రతులు మీఱఁ గాంత్రిలు జాతవేదసమ్ము
సృష్టిలోని హవ్యమ్ములు వ్యష్టిసమిష్టిగతులతోడ
స్వీకరించి వ్యాప్తి చేయు నాకసమ్ము నావరించి
అఖిల శుభావహముగాఁగ నలరించును దీప్తిశక్తి ॥ 5580

§(3) ఈ సృష్టి స్థితి శక్తిని నెల్ల ప్రకృతి పురుషుల
సంశక్తుల యజ్ఞముకై జ్వలనదీప్త శక్తులతోఁ
గాంతిరథము నిత్యమ్మును గాలచక్ర వేగమ్ముల
నాదాన ప్రదానాల నలరఁజేయు హవిషమ్మును ॥ 5581

§(4) ఆధిభౌతికంపు శక్తి నాధిదైవికంపు శక్తి
నాధ్యాత్మక శక్తితోడ నపకృతులే లేకుండఁగ
సమర మ్మై అమల మ్మౌ నమృతాఽగ్నులు సృష్టిలోన
సత్యగతుల వెల్గొందుచు నిత్యమ్మును గాపాడును ॥ 5582

§— శక్తులకే శక్తిగాఁగ సచ్చిత్తుల సచ్చిత్తుగ
భగవంతుని దివ్యశక్తి భాగధేయ మలరంగా
సృష్టిరూప ప్రకృతిపురుష జీవతతులఁ గల్పించుచు
నిరతదీప్త రతుల వెల్గ నిఖిలమ్మున నిండి నిలుచు ॥ 5583

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—182

ఋషిః—పతంగః ప్రాజాపత్యః
దేవతా—మాయాభేదః
ఛందః—త్రిష్టుప్; 1-జగతీ

(1) పతంగమక్తమసురస్య మాయయా హృదా పశ్యన్తి మనసా విపశ్చితః ।
సముద్రే [1]అన్తః కవయో వి చక్షతే మరీచీనాం పదమిచ్ఛన్తి వేధసః ॥ 1844

(2) పతంగో వాచం మనసా బిభర్తి తాం గన్ధర్వోఽవదద్గర్భే [2] అన్తః ।
తాం ద్యోతమానాం స్వర్యం మనీషామృతస్య పదే కవయో ని పాన్తి ॥ 1845

(3) అపశ్యం గోపామనిపద్యమానమా చ పరా చ పథిభిశ్చరన్తమ్ ।
స సధ్రీచీః స విషూచీర్వసాన [3] ఆ వరీవర్తి భువనేష్వన్తః ॥ 1846

## సూక్తము—182

ఋషి—ప్రజాపతి పుత్రుఁడు పతంగుఁడు*
దేవత—మాయాభేదము*

(1)§గద్యము ॥
ప్రజ్ఞానసంబద్ధుఁ డగు సూర్యుని విద్వాంసులు నిరుద్ధమనస్సుచేఁ దెలిసికొనుచున్నారు. క్రాంత దర్శులు సూర్యమండలాంతర్గతుఁడగు హిరణ్మయ పురుషునిగూడఁ దెలిసికొనుచున్నారు. సూర్యోపాసనాకర్తలగు వారు రశ్ములకు స్థాన మగు సూర్యమండలమును నర్చించుచున్నారు. (పొందుచున్నారు.) ॥ 5584

---

1. సముద్రేఽఅన్తః, 2. గర్భేఽఅన్తః, 3. సానఽఆ. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "పతంగుఁడు"గాను, దేవత "మాయాభేదుఁడు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

అర్థాంతరము

§గద్యము ॥

జీవరూపమున నభివ్యక్త మగు పరమాత్మను వేదాంతాభిజ్ఞు లంతర్ముఖ మగు మనస్సు చేతఁ బరమాత్మను జూచుచున్నారు. ఉపాధి పరిత్యాగమున జీవాత్మలు పరమాత్మతోఁ దాదాత్మ్యమును సాక్షాత్తుగాఁ బొందుచున్నారు. క్రాంతదర్శులగు వేదాంతులు పరమాత్మ మధ్యమున సర్వదృశ్యజాతమును గనుఁగొనుచున్నారు. దృగ్వ్యతిరిక్త మగు సర్వము మిథ్య యగుటవలన విధాతలు వృత్తిజ్ఞానులకధిష్ఠానమగు సచ్చిత్సుఖాత్మ మగు పరబ్రహ్మ ప్రాప్తిని గోరుచున్నారు॥ 5585

(2)§గద్యము ॥

సూర్యుఁడు త్రయీరూపమును బ్రజ్ఞచే ధరించుచున్నాఁడు. ఆ వాక్కునే శరీరమధ్యమునఁ గలఁగంధర్వుఁడు (ప్రాణవాయువు) మధ్యమందుఁ బ్రేరేపించుచున్నాఁడు. ద్యోతమానయు స్వర్గహితయు నగు నా త్రయీవాక్కును సూర్యునిస్థానమందు మేధావు లగు ఋషులు అధ్యాపనమున మిక్కిలి రక్షించుచున్నారు ॥ 5586

అర్థాంతరము

§గద్యము ॥

సర్వోపాధిశూన్య మై వ్యాప్త మగు పరమాత్మ సృష్ట్యాదియందు వాక్కును, మనస్సుచే సకలార్థ ప్రతిపాదకమగు వేదమును,[1] బరామర్శించెను. హిరణ్మయ బ్రహ్మాండాఽంతర్ వర్తమానుఁడగు హిరణ్యగర్భుఁడు ఆ వాక్కును మొదట నుచ్చరించెను. అట్టి వాక్కును గ్రాంతదర్శులగు దేవులు బ్రహ్మ పదమందు రక్షించుచున్నారు ॥ 5587

(3)§గద్యము ॥

ఉన్నతమార్గమునఁ బోవు వానిని, బూర్వాహ్ణమున మనల లక్ష్యముఁ జేసికొని వచ్చువానిని, సాయం సమయమునఁ బరాఙ్ముఖముగఁ బోవువానిని, గోపాయితను, ఆదిత్యుని, నేను దెలిసికొంటిని. ఆ యాదిత్యుఁడు సర్వభూత జాతమును నుదయాస్తమయాదికర్మవలన రక్షించుచున్నాఁడు. ఆ సూర్యుఁడు నానాదిక్కులను స్వకాంతుల బ్రకాశింపఁజేయుచు లోకమధ్యమున నుదయ మొందుచు, నస్తమానమును బొందుచుఁ, దిరుగుచు, నంతటను వెలుఁగుచున్నాఁడు ॥ 5588

అర్థాంతరము

§గద్యము ॥

శరీర గోపాయిత, అవినాశి అభిముఖముగఁ బరాఙ్ముఖముగ నాడీలక్షణమార్గములచేఁ జరించు దానిని శరీరవర్తమాన మగు దాని ప్రాణమును నేను జూచితిని. సూర్యుఁడు ప్రాచ్యాదిదిశలలో సధ్రీచములైన ఉత్తమకాంతులలోను నాగ్నేయాదిమూలదిశలలో నసధ్రీచములైన విషూచికాంతులతోను బ్రకాశించుచు లోకముల అంతర్మధ్యోపరితలాలలోఁ జొచ్చి వర్తిల్లుచున్నాఁడు ॥ 5589

§రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

1. సృష్ట్యాదియందుఁ బరమాత్మవాక్కును, వేదమును, బరామర్శింపఁగా హిరణ్యగర్భుఁడు ఆ వాక్కును మొదట నుచ్చరించెను. ఆ కారణముచేతనేకాఁబోలు వేదము బ్రహ్మముఖమునుండి జనించె నని పురాణములలోఁగలదు.

సూక్తము—182
ఋషి—ప్రజాపతి పుత్రుఁడు పతంగుఁడు
దేవత—మాయాభేదము

## అర్థాంతరము—1

*(1) అంగమ్ములు పతనమైన నంతలోనె పునస్సృష్టి
నంగమ్ముల నొందు మాయాసుర శక్తితతుల
హృదగ్నుల మనోఽగ్నుల నెఱింగి విపశ్చితులు
సర్వ సముద్రాంతర్గత జ్వలన క్రాంతి దర్శిత్వము
వరలంగా మరీచ్యగ్ని బ్రహ్మపదము సమకూర్చును ॥ 5590

*(2) వాక్కు- మనసు పతంగమై వర్తిల్లును మాయాగతి
నంతర్గతమై వెల్గెడి ఆ గంధర్వ సుశక్తుల
స్వర్గతమును బుద్ధిగతము ప్రభా ద్యోతమానమ్మై
అదృశ్యంపు శక్తులతో నలరారును నమృతగతుల
మనీషాశి మహితశక్తి ననూహ్య దైవహృద్రతులను ॥ 5591

*(3) అదృశ్యంపు శక్తులతో ననూహ్యమైన శక్తులతో
గోపాలక శక్తులతో నేపారఁగ నిహ పరాల
పథమ్ములను సంచరించి పరమ పవిత్ర సద్రీచుల
విషూచులను విశ్వమ్మున విహరించును బహిరంతర
గతులతోడ హృచ్ఛక్తులు గగనరతుల నజయ్యమై ॥ 5592

సూక్తము—182
ఋషి—ప్రజాపతి పుత్రుఁడు పతంగుఁడు
దేవత—మాయాభేదము

## అర్థాంతరము—2

*(1) అసురాళుల మాయలకున్ అన లేమాత్రము లొంగక
హృద్దీప్తుల మనశ్శక్తి ఉపర్యధోగతులవలన
యోగముద్రాంతర్గతి నుజ్జ్వల మా మరీచులను
ధర్మపదము దర్శింతురు పరమవిపశ్చితులు సృష్టి ॥ 5593

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) మనశ్శక్తి దీప్తులతో మహితమ్మౌ పతంగమై
వాక్ఛక్తులు తనరారును వరలఁగ గాంధర్వరతులు
మృతాఽమృత పదమ్మున దృశ్యమాన మౌచు సృష్టి
గగనమ్మున వర్తిల్లును గాత్రింతి దర్శిత్వ మొప్ప ॥ 5594

§(3) అదృశ్యమ్ము నతిగుహ్యము నవినాశనమైన శక్తి
హృదూత్రిపమ్మున వరలుచు నిహ పర పథాలలోన
నజయ్యంపు గతులతోడ ననిలగతుల నఖండమై
నధీత్రిచిగ విష్వాచిగా సకలమ్మున నలరు నగ్ని ॥ 5595

§— ఉచ్చ నీచ మార్గమ్ముల నుపర్యధోలోకమ్ముల
నుత్తమాఽనుత్తమాల నొప్పు సర్వ జీవతతులఁ
బదార్థాల నంతర్గతి బాహిర మౌ గతులతోడ
నదృశ్యమ్ము నవినాశమః నైన శబ్ద శక్తులతో
లోక గోళ పాలకతలు లోలుపతల వర్తిల్లును ॥ 5596

## సూక్తమ్—183

ఋషిః—అరిష్టనేమిస్తార్క్ష్యః
దేవతా—తార్క్ష్యః
ఛందః—త్రిష్టుప్

(1) త్యమూ షు వాజినం దేవజూతం సహావానం తరుతారం రథానామ్ ।
అరిష్టనేమిం పృతనాజమాశుం స్వస్తయే తార్క్ష్యమిహా హువేమ ॥ 1847

(2) ఇన్ద్రస్యేవ రాతిమాజోహువానాః స్వస్తయే నావమివా [1]రుహేమ ।
ఉర్వీ న పృథ్వీ బహులే గభీరే మా వామేతౌ మా పరేతౌ రిషామ ॥ 1848

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. నావమివారుహమ్. (వా.ప్రపి.)

(3) సద్యశ్చిద్యః శవసా పంచ కృష్టీః సూర్య[1] ఇవ జ్యోతిషాపస్తతాన ।

సహస్రసాః శతసా[2] అస్య రంహిర్న స్మా వరన్తే యువతిం న శర్యామ్ ॥ 1849

## సూక్తము—183

ఋషి—తార్క్ష్యపుత్రుఁడు అరిష్టనేమి*

దేవత—తార్క్ష్యుఁడు*

(1)సీ॥ తృక్షపుత్రు సుపర్ణుఁ దృప్తి శుభము గల్గఁ బ్రియముగఁ గర్మలఁ బిలువఁగలము
దేవతా ప్రేరితు దివ్యాఽన్నవంతునిఁ బ్రియముగఁ గర్మలఁ బిలువఁగలము
వైరియాన విజేత బలము గల్గెడు వానిఁ బ్రియముగఁ గర్మలఁ బిలువఁగలము
బాధా విహీన సత్వరమాయుధవిశిష్టుఁ బ్రియముగఁ గర్మలఁ బిలువఁగలము
తే॥గీ॥ శత్రు సేనల నే వేళఁ జంపువాని,శీఘ్రగామిని నంతటఁ జెలఁగువాని
సుప్రసిద్ధుని గాంచిన సోమనేతఁ,బిలువఁగల్గుదు మిప్పుడే ప్రీతి మేము ॥ 5597

(2)తే॥గీ॥ మఘవ దానంబు వలె మేము మరల మరల
తార్క్ష్యదానంబు స్వస్తికై దాల్పఁగలము
నావ జలధిని దాఁటించు న్యాయమునను
దానమును బొంది దుఃఖంబు దాఁటఁగలము ॥ 5598

తే॥గీ॥ అధిక విస్తీర్ణ పృథ్వీః యో ప్రథిత బహుళ
దివమః గాంభీర్యయుక్తుఁడాః దీప్త తృక్ష
పుత్రుఁ డేతెంచు నప్పుడు పోవునపుడు
హింసితాత్ములు కాకుండుఁ డిపుడు మీరుః ॥ 5699

(3)సీ॥ ఆదిత్యుఁ డే రీతి నాత్మీయ మౌ తేజమునఁ బంచకృష్టుల కనవరతము
జలముఁ బుట్టించుచు వెలుఁగుచుండునోః తార్క్ష్యుఁ డా రీతి నాత్మీయ మైన బలము
చే నమృతంబులై చెలఁగు జలంబుల విస్తరింపఁగఁ జేసె విపుల తార్క్ష్య
గతి ధనదాతయై శత ధనదాతయై పరిధవిల్లును నట్టి ప్రబల గతిని
తే॥గీ॥ గార్మ కోన్ముక్త మగునట్టి ఘన శరమయ,బాణ మే రీతి వారింపఁబడదోః యట్టు
లెట్టి మహనీయుఁడైనను నెంతయేని,బలముతోనైన వారింపఁగలఁడెః చెపుమః ॥ 5600

---

1. సూర్యఽఇవ, 2. శతాసాఽఅస్య. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అరిష్టనేమి" గాను, దేవత "తార్క్ష్యుఁడు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—183

ఋషి—తార్క్ష్యపుత్రుఁడు అరిష్టనేమి
దేవత—తార్క్ష్యుఁడు

### అర్థాంతరము—1

§(1) బ్రహ్మశక్తి కారణముగఁ బ్రకృతిలోన పరలునట్టి
సువర్ణ రూప దివ్యశక్తి వివరీతమ్మై వెలయఁగ
సృష్టిగోప యజ్ఞమ్మున స్రష్ట చేయు హోమమ్ముగ
నరిశక్తులు నాశముగా నబాధితము శుభకరమ్ము
సుఖకరమ్ము నౌచు వెల్గు సోమాఽమృతసేచ దేవ
దివ్యశక్తి అజయ్యమై తేజరిల్లు సత్యగతుల ॥ 5601

§(2) ఐంద్రిశక్తి సృష్టిజలము లఖిలమ్మున కొసఁగు రీతి
సృష్టి హేతు కారణముగ ఋక్ష గ్రహ కాంతు లొప్ప
మృత్పదార్థ రూపమ్ముల నుర్వీలు బహుళమ్ములుగా
మాయాగతి గభీరమై మర్మగతుల భూతాఽఽకుల
నంతర్బాహిరగతులను నలరారును నిత్యమ్మును ॥ 5602

§(3) పంచభూత రూపాలను వరలుచు సచ్చిచ్ఛక్తుల
సూర్యునిగతి వెల్గొందెడి జ్యోతిస్సుల కాంతితతులు
సహస్రరూప మార్గమ్ముల శతరూపవు మార్గమ్ముల
నిత్య యౌవనంపు దీప్తి నిరతమ్మును వెల్గొందును ॥ 5603

## సూక్తము—183

ఋషి—తార్క్ష్యపుత్రుఁడు అరిష్టనేమి
దేవత—తార్క్ష్యుఁడు

### అర్థాంతరము—2

§(1) అరిష్టాలనేమిగాఁగ నఖిలమ్మున నావరించు
నసుర చక్ర వృతనశక్తి నజయ్యమౌ హృద్దీప్తుల
హరించుచున్ సృష్టిలోన నఖిల లోక సంక్షేమపు
దైవీయపు శక్తిగాఁగఁ దనరారును సకలమ్మునఁ
గాలరూపరథాలలోఁ గ్రాలుచుండు బ్రహ్మశక్తి ॥ 5604

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) వైష్ణవీయ మిత్రశక్తి వర్తిల్లఁగ విజయగతుల
దుర్గతులను దరియించును దుష్టత్వమ్ములు నశింప
నమాంగల్య కష్టద మౌ నభశక్తుల రూపు మాపి
అనేకమైన పృథ్వితలాల నవనులలో స్వస్తి వరల
గభీర మౌ ఋతశక్తులు కాంతిలు నిహవరాలలోన ॥ 5605

§(3) పంచభూత రూప కష్ట సంచయాల నన్నింటిని
సచ్ఛక్తియుఁ జిచ్ఛక్తియు సదాః రూపు మావఁగల్గు
సూర్యుఁడుగా దివ్యశక్తి జ్యోతిగాఁగ వెల్గొందును
శత సహస్ర విధాలుగాఁగ సర్వమ్మున వర్తిల్లుచు
జలగతమై చరగతమై చదలున బ్రాహ్మమ్ముగాఁగ ॥ 5606

## సూక్తమ్—184

ఋషిః—1-శిబిరౌశీనరః; 2-కాశిరాజః ప్రతర్దనః,
3-రౌహిదశ్వో వసుమనాః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్; 1-అనుష్టుప్

(1) ఉత్తిష్ఠతావ పశ్యతేన్ద్రస్య భాగమృత్వియమ్ ।
యది శ్రాతో జుహోతన యద్యశ్రాతో మమత్తన ॥ 1850

(2) శ్రాతం హవిరో ష్విన్ద్ర ప్ర యాహి జగామ సూరో[1] అధ్వనో విమధ్యమ్ ।
పరి త్వాసతే నిధిభిః సఖాయః కులపా న వ్రాజపతిం చరన్తమ్ । 1851

(3) శ్రాతం మన్య[2] ఊధని శ్రాతమగ్నౌ సుశ్రాతం మన్యే తదృతం నవీయః ।
మాధ్యందినస్య సవనస్య దధ్నః పిబేన్ద్ర వజ్రిన్ పురుకృజ్జుషాణః ॥ 1852

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. సూరోఽఅధ్వనో, 2. మన్యఽఊధని. (ప్రా.ప్ర.)

## సూక్తము—184

ఋషి—1-ఉశీనరపుత్రుఁడు శిబిరాజు; 2-కాశిరాజు ప్రతర్దనుఁడు;
3-రౌహిదశ్వుఁడైన వసుమనస్సు*
దేవత—ఇంద్రుఁడు*

(1, 2)§సీ॥ యజమానవరులార! యతిశయ మూర్ధ్వంబుగానుండి ప్రీతితోఁ గ్రోలుఁడీరు!
లీల వసంతాది కాలంబులందున నింద్రభాగంబును నెఱుఁగుఁడీర
లా భాగమతి పక్వమైనచో దానిని విమలాఽగ్నియందున వేల్చుఁడీర
లది యపక్వంబైన యతిశయ స్తుతులతోఁ బూర్ణమౌ సంతుష్టిఁ బొందుఁడీరు!
తే॥గీ॥ వాసవా! తత్సుహవ్యంబు పక్వమయ్యె,నీవు శీఘ్రమ్ముగా రమ్ము! నీవు యాగ
మునకు సూర్యుఁడు మార్గమధ్యను వెలుఁగు,చున్నవాఁడదె! లోకాళి నున్న జనుల ॥• 5607

§క॥ కులమునకు రక్షకులు పు
త్రులు గృహపతి సేవఁజేయఁదొడరిన యట్లే!
యిల నింద్ర! నీకు సోమం
బులు సేవలు చేయుచుండెఁ బూర్ణ ప్రతిభన్ ॥• 5608

(3)§గద్యము॥
గోవు ఊధస్సునందు నీ దధి ఘర్మాఖ్య మగు హవిస్సు పయోరూపమునఁ బక్వమైనది యని
తలంచుచున్నాను. దుగ్ధము పయోఽగ్నియందుఁ బక్వమైనది. ఇవు డగ్నియందుఁ బచ్య
మగుచున్నది. కాఁబట్టి యది సుపక్వ మని తలఁచెదను. కావున నీ హవిస్సు సత్యభూత
మైనదియు నూతనమును నగుచున్నది. ఓ వజ్రీ! ఓ బహుకర్మవంతుఁడా! ఓ
యింద్రుఁడా! ప్రీయమానుఁడవై నీవు మాధ్యందిన సవనమందు
దధిఘర్మాఖ్య హవిస్సును దాగ్రవుము! ॥• 5609

## సూక్తము—184

ఋషి—1-ఉశీనరపుత్రుఁడు శిబిరాజు; 2-కాశిరాజు ప్రతర్దనుఁడు;
3-రౌహిదశ్వుఁడైన వసుమనస్సు
దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

§(1) ఐంద్రమైన దివ్యశక్తి అఖిలమ్మున వ్యాప్తి చెందు
సమయమ్మున యజ్ఞాగ్నుల జ్వలియింపుము! యథావిధిగ
ఐంద్రమైన దివ్యశక్తి అఖిల వ్యాప్తి నొందకుండ
నశక్తమై మందగతుల నలరునపుడు వ్యాప్తశక్తి
వర్ధిల్లెడు యజ్ఞమ్ముల వరలఁజేయు సృష్టికర్త ॥ 5610

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15ం సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "శిబి, ప్రతర్దనుఁడు, వసుమనస్సు" గాను, దేవత "ఇంద్రుఁడు" గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(2) సృష్టరూప దివ్యశక్తి సౌర మహాదీప్తులతో
సంతతిగా సృష్టిలోన సంభవించుఁ జరాఽచరాల
సౌర చాంద్రి శక్తులతో జనన మొందు ప్రకృతు లెల్ల
గూఢ ప్రాణ త్రాణ శక్తిఁ గుల పాలకతన్ నిల్చును ॥ 5611

§(3) రవి ధేనువు పొదుగునుండి క్రాలంగా జాలువారు
కాంతి క్షీరధారలు శశిగాత్రము నూధస్సునఁ
బ్రవేశించి సృష్టిలోక ప్రకృతిపైనఁ దెలిచలువల
వెన్నెలలౌ పాలధార లన్ని దిశల మిన్నులలోఁ
గుఱియించుచుఁ బ్రాణ త్రాణ గూఢశక్తు లిచ్చుచుండు
వజ్రరూప దివ్యశక్తి వరలంగా సృష్టిలోన ॥ 5612

## సూక్తము—184

ఋషి—1-ఉశీనర పుత్రుఁడు శిబిరాజు; 2-కాశిరాజు ప్రతర్దనుఁడు;
3-రౌహిదశ్వుఁడైన వసుమనస్సు
దేవత—ఇంద్రుఁడు

## అర్థాంతరము—2

§(1) వైష్ణవీయమైన ఐంద్రి వర్ధనంపు మహాశక్తి
సృష్టి గోళ లోకాళులు వ్యష్టి సమిష్టిగతులతోడ
గగనాఽంతరాళమ్మునఁ గ్రాలంగా నుచ్చగతుల
నిత్యమ్మును సంచరించు సత్యశక్తి ప్రభావాల ॥ 5613

§(2) మైత్రి కల్గు పదార్థాల మహితములౌ వసునిధులకు
అధిపతులై సూర్యచంద్రవిధి మండల గతములైన
ఋక్ష గ్రహ వ్రజపతిని ఋత శక్తుల సేవించుచు
సృష్టిలోని బ్రత్యణువును శీర్ణాఽశీర్ణ రూపమ్ముల
హవిష మ్మై గగన విమధ్యమాఽధ్వగాఽంతరాఽంతరాల
నధోగతుల నఖిలమ్మున నైంద్రశక్తి వర్తిల్లును ॥ 5614

§(3) చంద్రాఽమృత రూపమైన చలువల వెన్నెల శక్తుల
క్షీరమ్ముల ఘనశక్తుల స్వీకరించి రవి కిరణాల్
నిత్య నవ్య దీప్తమైన సత్యాఽమృతాఽగ్నులుగా
జ్వలియించుచు సర్వప్రకృతి కలవోకగ వెలుఁగులొనఁగి
సృష్టి స్థితి లయశక్తుల నిష్టి కాఁగ నిరతమ్మును
మధ్యందిన దీప్తులమై మఖవంతుని క్రియ నెఱపును ॥ 5615

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్డమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—185

ఋషిః—జయ ఐన్ద్రః
దేవతా—ఇన్ద్రః
ఛందః—త్రిష్టుప్

(1) ప్ర ససాహిషే పురుహూత శత్రూంజ్యేష్ఠస్తే శుష్మ[1] ఇహ రాతిరస్తు ।
ఇన్ద్రా భర దక్షిణేనా వసూని పతిః సిన్ధూనామసి రేవతీనామ్ ॥ 1853

(2) మృగో న భీమః కుచరో గిరిష్ఠాః పరావత[2] ఆ జగన్థా పరస్యాః ।
సృకం సంశాయ పవిమిన్ద్ర తిగ్మం వి శత్రూన్ తాళ్హి[3] వి మృధో నుదస్వ ॥ 1854

(3) ఇన్ద్ర క్షత్రమభి వామమోజో ఽజాయథా వృషభ చర్షణీనామ్ ।
అపానుదో జనమమిత్రయన్తమురుం దేవేభ్యో[4] అకృణోరు లోకమ్ ॥ 1855

## సూక్తము—185

ఋషి—ఇంద్రపుత్రుఁడు జయుఁడు*
దేవత—ఇంద్రుఁడు*

(1)§క॥ పురుహూతః శత్రుగణముల
వెరవున హరియింతు వీవుః విపుల బలంబున్
సురుచిర మగు నీ దానము
వరమంగళ మిడునుగాకః వరుసను మాకున్ ॥ 5616

---

1. శుష్మ ఽ ఇహ, 2. పరావత ఽ ఆ, 3. తాళిహ, 4. దేవేభ్యోఽ అకృణోరు. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "జయుఁడు" గాను, దేవత "ఇంద్రుఁడు" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§తే॥గీ॥ దక్షిణకరంబుచేతను ధనము మాకు
నింద్రదేవుఁడా! కొనితెచ్చి యిమ్ము! మాకు
సకల ధనముల రాజిల్లు స్యందమాన
నదులకున్ స్వామి వగుదువు! ముదితుఁడవయి॥ 5617

(2)§తే॥గీ॥ కుత్సితముగాఁ జరించుచుఁ గుధర వాసి
యైన సింహము చందాన నతిభయంక
రుండవై యింద్ర! దివమునుండి యిటకు
నీవు రారమ్ము! వేవేగ నిశ్చయముగ॥ 5618

§ఆ॥వె॥ వచ్చి సరణశీల వజ్రంబు నతితీక్ష్ణ
ముగ నొనర్చి మీవు! తగినయటుల
నట్టి వజ్రమునను నరిగణంబుల నెల్లఁ
దుంచు మోయి! యింద్ర! [1]తృప్తి వెలయ॥ 5619

(3)§క॥ వననీయము క్షాత్రంబును
ఘనమౌ నోజస్సు జగతిఁ గల్పింపఁగ నీ
వొనరఁగఁ బుట్టితి వింద్రా!
పనిపూనుచు లోకమందుఁ బంతం బలరన్॥ 5620

§తే॥గీ॥ కామవర్షిత! మా కిలఁ గలుగు శాత్రి
వుఁడుగ నున్నట్టి మానవుఁ బొడిచినావు!
దేవతలకయి యతిశయ దీప్తి కలుగు
స్వర్గమును సృష్టిఁ జేసితి! వాసవుండ!॥ 5621

§క॥ అభకర మౌ దుశ్కృత్తులు
పరిభవింపఁగ సృష్టిలోక భాగ్యము లుడుపన్
నభమున వామాఒఒచారము
నభిభవ మొనరించి విష్ణు వభయ మొసంగున్॥ 5622

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
1. ఇక్కడ "దుం-తృ"లకు యతి మైత్రి.

## సూక్తము—185

ఋషి—ఇంద్ర పుత్రుఁడు జయుఁడు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—1

(1)§తే॥గీ॥ ఇంద్రదేవుఁడు దాక్షిణ్య చంద్రుఁ డగుచు
నష్ట వసువుల పతి యౌచు సమల సుధన
రాశియుక్తుండునై శత్రురాజి నెల్ల
సంహరించును వర్ష ప్రసాద మొసఁగి ॥ 5623

§(2) దుష్టరతులఁ జరియించెడి దుర్మార్గగ మృగరూపపు
గూఢ క్రూర శక్తులనే గుహ్య దీప్తగతుల మెయిని
సంహరించి సర్వలోక శాత్రవాఽఽశల నెల్లను
సృష్టిలోని మహితధర్మ చిత్సత్తుల నిల్పును హరి ॥ 5624

§(3) వృషభరాశి కుపరితలాన నోజశ్శక్తుల మీఱఁగ
వామాఽఽచారాఽభి విషధామాగ్నుల నన్నింటిని
విధ్వస్తము కావించుచు విశ్వమునకు విశేషముగ
జలధారల నొసఁగి లోక సంవర్ధన మొనరించును
మిన్నంటఁగ దేవాశుల మిత్రరూప శక్తులుగా
బలీయ మౌచు నింద్రశక్తి వర్ధిల్లఁగ నిత్యమ్మును ॥ 5625

## సూక్తము—185

ఋషి—ఇంద్ర పుత్రుఁడు జయుఁడు

దేవత—ఇంద్రుఁడు

### అర్థాంతరము—2

§(1) జలనాభిని హరించి వైచి పద లెల్ల విషాగ్ని వాయు
పరివృతముగ వ్యాపింపఁగ వర్ధిల్లెడి "అభి"శక్తిని
సృష్టి విశ్వ వైరితతుల జ్యేష్ఠుఁడుగా సంహరించి
సలిలమ్ముల నష్ట వసు సంపదాశిఁ గాపాడును
సురనాథుఁడుగా నింద్రుం డసురనాశకుండై తగు ॥ 5626

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) అతిభయంకర మై వరలెడి ఆ సింహపు గర్జనలను
విద్యుద్రూపాల నురిమి వెల్గు మేఘరాజి యెల్ల
నల్దిశలను వ్యాపించుచు నానారూపాలతోడ
నిర్జించుచు శత్రుతతుల నిఖిలమునకు జలము లొసఁగు
సృష్టి స్థితి సంశక్తులు చిరకాలము వర్ధిల్లఁగ ॥ 5627

§(3) విశ్వసృష్టి శత్రుతతుల వినాశన మ్మొనరించుచుఁ
జరాఽచర పదార్థాల జడాఽజడ ప్రకృతులలో
విద్యుత్తును నిల్పుచుండి విమలమైన ఓజోగుణ
సర్వస్వము దేవాళి కుజ్జ్వలగతిఁ బ్రసాదించి
లోకోద్ధరణమ్ము చేయు లోకేశుం డౌ నిందుఁడు ॥ 5628

## సూక్తమ్ — 186

ఋషిః—1-ప్రథో వాసిష్ఠః, 2-సప్రథో భారద్వాజః, 3-ఘర్మః సౌర్యః
దేవతా—విశ్వే దేవాః
ఛందః—త్రిష్టుప్

(1) ప్రథశ్చ యస్య సప్రథశ్చ నామాఽఽనుష్టుభస్య హవిషో హవిర్యత్ ।
ధాతుర్ద్యుతానాత్ సవితుశ్చ విష్ణో రథన్తరమా జభారా వసిష్ఠః ॥ 1856

(2) అవిన్దన్తే[1] అతిహితం యదాసీద్యజ్ఞస్య ధామ పరమం గుహా యత్ ।
ధాతుర్ద్యుతానాత్ సవితుశ్చ విష్ణోర్భరద్వాజో బృహదా చక్రే[2] అగ్నేః ॥ 1857

(3) తేఽవిన్దన్ మనసా దీధ్యానా యజుః ష్కన్నం ప్రథమం దేవయానమ్ ।
ధాతుర్ద్యుతానాత్ [3]సవితుశ్చ విష్ణోరా సూర్యాదభరన్ ఘర్మమేతే ॥ 1858

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. అవిన్దన్తేఽఅతి హితం, 2. చక్రేఽఅగ్నేః, 3. సవితశ్చ. (వా.ప్ర.)

## సూక్తము—186

ఋషి—1-వసిష్ఠపుత్రుఁడు ప్రథుఁడు; 2-భరద్వాజపుత్రుఁడు సప్రథుఁడు;
3-సూర్యపుత్రుఁడు ఘర్మఁడు*
దేవత—విశ్వే దేవతలు*

(1)§గద్యము ॥
ఏ వసిష్ఠునకుఁ బ్రథుఁడు పుత్రుఁడో! యే భరద్వాజునకు సప్రథుఁడు పుత్రుఁడో! వారి యిద్దరిలో వసిష్ఠుఁడు అనుష్టుప్ ఛందస్సుతోఁ గూడిన ఘర్మాఖ్యుని హవిరాపాదక రథరంహసాధన మగు నే సామముగలదో! యా సామమును ధాతృసంజ్ఞగల దేవునినుండి, ద్యోతమానుఁ డగు సవితనుండి, విష్ణువునుండి కొనితెచ్చెను ॥♦ 5629

(2)§గద్యము॥
ఏ బృహత్ సామము ఘర్మని హవిస్సంస్కారక మై తిరోహిత మయ్యెనో! దానిని నా విధాత్రిదులు పొందిరి. ఆ విధాత్రితాదులవల్లను నగ్నివల్లను బృహత్ సామమును భరద్వాజఋషి సంపాదించెను ॥♦ 5630

(3)§గద్యము ॥
ఆ విధాత్రిదులు దీవ్యమానులగుచు యాగసాధనుఁడు నా సేచనీయుఁడును ముఖ్యుఁడును దేవతాప్రాప్తి సాధనుఁడును నగు ఘర్మని ద్యోతమానసవితనుండి సూర్యునినుండి ఋత్విజులు తెచ్చిరి ॥♦ 5631

## సూక్తము—186

ఋషి—1-వసిష్ఠపుత్రుఁడు ప్రథుఁడు; 2-భరద్వాజపుత్రుఁడు సప్రథుఁడు;
3-సూర్యపుత్రుఁడు ఘర్మఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—1

§(1) విశాలమైన మహాశక్తి విశ్వ సృష్టి సర్వస్వము
అంతర్గత రథశక్తుల నఖిలమ్మున వ్యాపించెడి
అనుష్టుబ్ రూప మ్మొ ననమానపు సామ గాన
మంత్రశక్తు లొప్పారఁగ మహిత ధాతాదిత్యుల
విష్ణుదేవు నర్చించుచు వెలుఁగుఁ బ్రకృతి పురుషశక్తి ॥ 5632

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "ప్రథ, సప్రథుఁడు, ఘర్మఁడు"గాను, దేవత "విశ్వే దేవతలు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(2) అతిబృహత్ కాలచక్ర మంతరిక్షమునఁ దనరఁగ
బ్రహ్మ విష్ణు మహేశులు వరలంగా సృష్టిపరత
విశ్వదేవభువనాలను వివిధ లోక గోళాలను
బరఁగఁ జేయు ననంత మౌ పరమగుహ్యశక్తి కాఁగ
నఖిలసృష్టి మూలశక్తి అంతరహితమై అలరును ॥ 5633

§(3) దేవయాన రూపమ్మున దివ్యాఽమృత శక్తులమైఁ
జందమామ వెన్నెలలవి చలువలుగాఁ బ్రకృతి విరియ
వైష్ణవీయమైన శక్తిఁ బరఁగంగా నాదిత్యుఁడు
బ్రహ్మాదుల కర్మలుగాఁ బ్రభాకర్మ ధర్మములుగా
నంతరహిత మౌచు సృష్టి అలరుఁ జక్రనేమిక్రమత ॥ 5634

## సూక్తము—186

ఋషి—1-వసిష్ఠపుత్రుఁడు ప్రథుడు; 2-భరద్వాజ పుత్రుఁడు సప్రథుఁడు;
3-సూర్యపుత్రుఁడు ఘర్ముఁడు
దేవత—విశ్వే దేవతలు

### అర్థాంతరము—2

§(1) బ్రహ్మ రథమ్మునకుఁ బరఁగెడి బాహిరశక్తికి
వైష్ణవీయ రథమ్మునకు వరల నంతర్గతిశక్తికి
మాతృభూత మై వెల్గెడి మహిమాన్విత దివ్యశక్తి
సచ్ఛక్తిగ సచ్ఛక్తిసుసంపద సంవలితముగా
హవిషమునకు హవిస్సుగా నలరారుచునుండు నగ్ని
అదియె శూన్య మౌచు నిలిచి అనుసరణీయమై తగు ॥ 5635

§(2) అత్యంతము హిత మ్మౌచు నవిదిత మ్మౌచు సృష్టి
సత్యనిత్య యజ్ఞమునకు సదా ధామమౌచు వెలిఁగి
పరమ గుహ్యమౌచు నేది వరలుచుండు విశ్వసృష్టి
మూలరూప ధాతుకలితమూర్తి ఆదిత్యుఁ డఖిల
భారకుఁడై ధారకుఁడై వైష్ణవీయమైన దివ్య
శక్తి సృష్టి స్థితిలయాల చక్రనేమిక్రమత వరల ॥ 5636

§(3) ఏరికైనఁ దెలియరాని యెనలేని మనశ్శక్తి
వైష్ణవీయ సృష్టిస్థితి బ్రాహ్మ్యకర్మ లలరంగా
సర్వసూర్య మండలాల సదా ధరించు ధర్మముగా
ధాతుద్యుతియుక్తుండై తనరారును నాదిత్యుఁడు ॥ 5637

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—187

ఋషిః—తపుర్మూర్ధా బార్హస్పత్యః
దేవతా—బృహస్పతిః
ఛందః—త్రిష్టుప్

(1) బృహస్పతిర్నయతు దుర్గహా తిరః పునర్నేషదఘశంసాయ మన్మ ।
క్షిపదశస్తిమప దుర్మతిం హన్నథా కరద్యజమానాయ శం యోః ॥ 1859

(2) నరాశంసో నోఽవతు ప్రయాజే శం నో[1] అస్త్వనుయాజో హవేషు ।
క్షిపదశస్తిమప దుర్మతిం హన్నథా కరద్యజమానాయ శం యోః ॥ 1860

(3) తపుర్మూర్ధా తపతు రక్షసో యే బ్రహ్మద్విషః శరవే హన్తవా[2] ఉ ।
క్షిపదశస్తిమప దుర్మతిం హన్నథా కరద్యజమానాయ శం యోః ॥ 1861

## సూక్తము—187

ఋషి—తపుర్మూర్ధానుఁడు బార్హస్పత్యుఁడు*
దేవత—బృహస్పతి*

(1)§తే॥గీ॥ అమరవరులకుఁ బతియౌ బృహస్పతి కడుఁ
బాలయిత యౌచుఁ దా నతిలీలతోడ
దుర్గమునిహంతయై కృతదోషములను
సత్వరమ్ముగఁ ద్రుంచుత౦ జటుల దీక్ష ॥ 5638

---

1. శంనోఽఅస్త్వ, 2. హన్తవాఽఉ. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో ఈ సూక్తమునకు ఋషి "తపుర్మూధానుఁడు" గాను, దేవత "బృహస్పతి"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము

§తే॥గీ॥ మా కనర్థంబు గల్పించు మనుజునివయి
విడుచుఁగాక! మహాయుధవిలసనంబు
దుర్మతిని శాత్రవునిగూడ దూరమునకుఁ
ద్రోలుఁగాక! బృహస్పతి తొడరి తాను ॥* 5639

§తే॥గీ॥ మఱియుఁ గీర్తిని గాంచని మనుజ శత్రు
పుత్రుఁ బ్రేరించుఁగాకఁ తాఁ బూర్ణశక్తి
దుష్టరోగంబులను నెల్ల దుష్టభయముఁ
బరిహరించుత నా బృహస్పతియె యిపుడు ॥* 5640

(2)§గద్యము ॥
నరాశంసాగ్ని మమ్ము రక్షించుఁగాక! ఆహ్వానములు ప్రవర్తిల్లఁగా నరాశంసుఁడు మాకు సుఖమును జేయుఁగాక! బృహస్పతియు నయశస్వి యగు శత్రుని మాచెంతనుండి తప్పించునుగాక! దుర్బుద్ధిని దుంచునుగాక! రోగశమనమును జేయుఁగాక! భయమును గొట్టుఁగాక! ॥* 5641

(3)§గద్యము ॥
తాపక శిరస్కుఁడగు బృహస్పతి బ్రహ్మ ద్వేషు లగు రాక్షసులను దహించుఁగాక! హింసకుఁడగు రాక్షసాధిపతిని నశింపఁజేసినపిదపఁ బాపమునుగూడ హరించుఁగాక! మఱియు నయశస్వి యగు శత్రుని మాచెంతనుండి తప్పించునుగాక! దుర్‌బుద్ధిని దుంచునుగాక! రోగములను శాంతింపఁజేయుఁగాక! భయమును బోఁగొట్టునుగాక! ॥* 5642

## సూక్తము—187

ఋషి—తపుర్మూర్ధానుఁడు బార్హస్పత్యుఁడు
దేవత—బృహస్పతి

### అర్థాంతరము—1

(1)§హరిదశ్వవృత్తము ॥
ప్రకృతిమాత పొదుగునుండి ప్రభవించును గోశమ్ములు
సుకృత సప్త వివిధహోత సుతశక్తుల సృష్టిష్టుల
వికృత మోచు నిల్చి సత్యభృతరక్తుల సంచారపు
టకృతకాల సహజ దివ్యయత యానము లొప్పారును ॥ 5643

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§— దుర్మతులను బోనాడెడి నిర్మలమౌ ద్యుతు లెల్లను
బృహస్పతి రూపమ్ముగఁ బృథ్వ్యాదుల వరలుచుండుఁ
జక్రనేమిక్రమత జనన మరణగతు లొప్పఁగఁ
గరణకర్మ క్రియలనేమిఁ గ్రాలునులే! సర్వసృష్టి ॥ 5644

(2) §వివస్వంతవృత్తము ॥
పంచభూత పదార్థాలువరలి దివ్యదీప్తులతో
నంచితాచ్ఛమహాతేజ మలర ధీసురూపగతుల్
సంచరింప సదా కాంతి సదమల ప్రసారగతిన్
మించి శుద్ధపదార్థాల మితుల సృష్టి వర్తిలెడున్ ॥ 5645

§— అగ్నిదీప్తశక్తులతో నలరారును నెల్ల సృష్టి
సకల సంపదాశులతో సర్వేశుని యజ్ఞమ్ముల
నభోవర్తనంపుఁ బ్రకృతి శుభావహముగా వెల్గఁగ
దుఃర్మతిమయ దుశ్శక్తులఁ దున్మాడును నిరతమ్మును ॥ 5646

(3) §క॥ పితృభూతమ్మౌ శక్తుల
నతులితగతిఁ దంతువులను నలరఁగఁ గాంతుల్
సతతము ప్రసరింపంగాఁ
బ్రతిలేని రతులను సృష్టి వరలు నిరతమున్ ॥ 5647

§— అగ్నిశక్తిమూర్ధమ్మున అమరాఽమరశక్తులతో
నభోవర్తనంపుఁ బ్రకృతి శుభావహముగా వెల్గఁగ
దుర్మతిమయ దుశ్శక్తులఁ దున్మాడును నిరతమ్మును
స్థితిరూపపు సృష్టిశక్తి చెండాడఁగ బ్రాహ్మ్యవైరి ॥ 5648

§క॥ జలశక్తుల సంగతిమై
నిలాతలాలు సకల దివు లెల్ల నిరతమున్
జలితములై సృష్టి హవిష
ఫలములుగా వరలు జన్మభాగ్యము లొచున్ ॥ 5649

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—187

ఋషి—తపుర్మూర్ధానుఁడు బార్హస్పత్యుఁడు
దేవత—బృహస్పతి

## అర్థాంతరము—2

(1)§వివర్తనవిషమవృత్తము ॥•
దివ్యమ్మౌ దైవీయపుఁ దేజోమయ శక్త్యాఽఽశికి
భవ్యాఽన్వితమ్మై తగు భాగ్యోచ్ఛగ విశ్వాఽఖిల
నవ్య నిత్య శక్తులమెయి నానాప్రకృతుల బృహస్పతి
గవ్యమ్మౌ దుర్మతిగతి ఖండించును దున్మాడును ॥ 5650

§(2) బ్రహ్మవిష్ణుమహేశ్వరుల పరాశక్తు లలరంగా
సృష్టిస్థితిలయగతు లవి చెన్నారును నిరతమ్మును
శుభరూపములౌ శక్తుల విభవమ్ముల హవిషాళుల
సకలాధిపత్యముగా సత్పథ మలరారుచుండి
గవ్యమ్మౌ దుర్మతిగతి ఖండించును దున్మాడును ॥ 5651

§(3) అనలమూర్ధ శక్తులతో నమృత సత్పదార్థ మలరి
బ్రహ్మద్వేషుల నఖిల రాక్షసాళి నంహరించి
సృష్టి లోక గోళాలను స్థితిశక్తుల రక్షించును
గవ్యమ్మౌ దుర్మతిగతి ఖండించును దున్మాడును ॥ 5652

## సూక్తమ్—188

ఋషిః—ప్రజావాన్ ప్రాజాపత్యః
దేవతా—1-యజమానః; 2-యజమానపత్నీ; 3-హోతాశిషః
ఛందః—త్రిష్టుప్

(1) అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో విభూతమ్ ।

ఇహ ప్రజామిహ రయిం రరాణః ప్ర జాయస్వ ప్రజాయా పుత్రకామ ॥ 1862

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•పరస్థానవిషమవృత్తము.

(2) అపశ్యం త్వా మనసా దీధ్యానాం స్వాయాం తనూ[1] ఋత్వ్యే నాధమానామ్ ।
ఉప మాముచ్చా యువతిర్బభూయాః ప్ర జాయస్వ ప్రజయా పుత్రకామే ॥ 1863

(3) అహం గర్భమదధామోషధీష్వహం విశ్వేషు భువనేష్వన్తః ।
అహం ప్రజా[2] అజనయం పృథివ్యామహం జనిభ్యో[3] అపరీషు పుత్రాన్ ॥ 1864

## సూక్తము—188

ఋషి—ప్రజాపతిపుత్రుఁడు ప్రజావంతుఁడు*
దేవత—1-యజమానుఁడు; 2-యజమానపత్ని; 3-హోత*

(1)§తే॥గీ॥ కర్మముల నెల్ల నెఱుఁగుచు నిర్మలంపు
వ్రతమువల్ల జనించుచు వ్యాప్తి గాంచు
నిన్ను యజమానుఁడా! నేను నిశ్చలమతిఁ
జూచియున్నట్టివాఁడను సురుచిరముగ ॥ 5653

§తే॥గీ॥ పుత్రకాముఁడ! నీ విప్డు పుత్రపౌత్ర
ముఖ్యుల ధనచయంబును బొందఁగోరు
చుండి పుత్రాదులను గడు గండు మెఱయఁ
బుట్టఁజేయుము! లోకానఁ బూజ్యుఁడవయి ॥ 5654

(2)§ఆ॥వె॥ పత్ని! దీవ్యమానభవదీయ తనువున
గర్భమును ధరించు కర్మఁగూర్చి
భర్తృ సంగమంబు భావించుచున్నట్టి
నిన్నుఁ గాంచియుంటి నెనరుతోడ ॥ 5655

---

1. తనూఽఋత్వ్యే, 2. ప్రజాఽఅజనయం, 3. జనిభ్యోఽఅపరీషు. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "పర్జన్యుడు" గాను, దేవత "యజమాని, యజమానిని, హోత" గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§ఆ॥వె॥ పుత్రికామ! నన్నుఁ బొందుచు మిక్కిలి
యువతి వగుము! నీవు యువతి వగుచుఁ
బుత్రవరులఁ బ్రీతిఁ బొందుచు జగమున
వెల్గుచుండవలయు వేడ్క తోడ ॥* 5656

(3)§తే॥గీ॥ హోతనై యోషధులయందు భూతతతుల
యందు గర్భము ధరియింతు నవనియందు
మనుజులను స్త్రీలయందున మంచి పుత్ర
వరులఁ బుట్టించెదను నేను బరమప్రీతి ॥* 5657

## సూక్తము—188

ఋషి—ప్రజాపతిపుత్రుఁడు ప్రజావంతుఁడు
దేవత—1-యజమానుఁడు; 2-యజమానపత్ని; 3-హోత

### అర్థాంతరము—1

§(1) అజయ్యమౌ మనశ్శక్తి అనలజాత మౌచు నిలిచి
అనల విభూతమ్ముగాఁగ నలరారును నభేద్యమై
ప్రకృతిలోనఁ బ్రాణశక్తి వరలంగాఁ బ్రభవగతుల
దివ్య సంపదాళులమైఁ దేజరిల్లు సృష్టియెల్ల ॥ 5658

§(2) నింగి గాలి నిప్పు నీరు నేల లన్నింటిలోన
నతిలోకపు వేగమ్మున నలరారును మనశ్శక్తి
సత్యసత్త్వశక్తు లొప్ప సర్వానాథమానముగాఁ
బ్రకృతిలోనఁ బ్రాణశక్తి వరలంగాఁ బ్రభవరతుల
నిత్యయౌవనంపు శక్తి నెగడు సృష్టిఁ దనుగతులను ॥ 5659

§(3) బ్రాహ్మ్యశక్తి మూలమ్మై వరలంగా గర్భశక్తి
గోళ లోక విశ్వములను గూఢరతుల నంతర్గతి
నలరుచుండి పృథ్వ్యాదుల ననుస్యూతజననశక్తి
నఖిలప్రకృతి పురుషశక్తు లలరఁజేయు నిరతమ్మును ॥ 5660

---

§రచయిత:—వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వఠ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—188

ఋషి—ప్రజాపతిపుత్రుఁడు ప్రజావంతుఁడు

దేవత—1-యజమానుఁడు; 2-యజమానపత్ని; 3-హోత

### అర్థాంతరము—2

§(1) నిర్మలమౌ సృష్టిశక్తి నిఖిలమ్మున వర్తిల్లును
సంజననపు శక్తులమై సంవర్ధన దీప్తులమై
నసాధారణంపుగతుల నన్యోఽన్యత లలరంగాఁ
బ్రకృతి పురుష శక్తితతులు వరలు సర్వేశు కృపను ॥ 5661

§(2) పురుషశక్తి మనోరతుల ప్రకృతిరూప మనోగతులు
సృష్టిలోన సూక్ష్మములై ఋతశక్తుల వర్తిల్లును
సకలాఽఽధిపత్యమ్ముగ సర్వయౌవనంపు దీప్తి
నాత్మరూప పునర్జన్మ మలర నఖిల ప్రకృతులలో ॥ 5662

§— సత్యశక్తి మనశ్శక్తి సర్వప్రకృతి పురుషులలో
నీ నా భేదమ్ములతో నిరత మవశ్యమ్మై తగి
నేతృత్వము వరలంగా నిఖిల పదార్థాళి నడుపు
యువభూతమ్మైన శక్తి నుజ్జ్వలముగ విస్తరిలఁగఁ
బ్రకృతి పురుష ప్రాణిరతులు సుకృతాళిగ నవతరించు ॥ 5663

§(3) ఆకసాల ననిలాలను ననలమ్ముల సలిలమ్ముల
మృత్తతులను నోషధులను సృష్టిగోళలోకాలను
బ్రాహ్మ్య రూప దివ్యశక్తి వరలంగా గూఢగతుల
గర్భమ్మై జనియించును గ్రాలఁ బృథ్వివరమ్మౌచు ॥ 5664

§ఆ॥వె॥ బ్రాహ్మ్య మౌచుఁ దనరు వరలు నీ సృష్టియే
బ్రాహ్మ్య మౌను నఖిల ప్రకృతి పురుష
భువన లోక గోళ వివిధముల్ బ్రాహ్మ్యమై
పుట్టుఁ బెరుగు మఱుఁగుఁ బుతశక్తి ॥ 5665

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్—189

ఋషిః—త్వష్టా గర్భకర్తా, విష్ణుర్వా ప్రాజాపత్యః; 4-6-త్వష్టా రూపకర్తానేజమేషః,
దేవతా—1-విష్ణు-త్వష్ట-ప్రజాపతి-ధాతారః-2-సినీవాలీ-సరస్వత్యశ్వినః,
3-అశ్వినౌ; 4-5-6-విష్ణుః
ఛందః—అనుష్టుప్

(1) విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు ।
ఆ సించతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే ॥ 1865

(2) గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి ।
గర్భం తే[1] అశ్వినౌ దేవావా ధత్తాం పుష్కరస్రజా ॥ 1866

(3) హిరణ్యయీ[2] అరణీ యం నిర్మన్థతో[3] అశ్వినా ।
తం తే[1] గర్భం హవామహే దశమే మాసి సూతవే ॥ 1867

•(4) నేజమేష పరా పత సుపుత్రః పునరా పత ।
అస్యై మే పుత్రకామాయై గర్భమా ధేహి యః పుమాన్ ॥ 1868

•(5) యథేయం పృథివీ మహ్యుత్తానా గర్భమాదధే ।
ఏవం తం గర్భమా ధేహి దశమే మాసి సూతవే ॥ 1869

---

1. గర్భంతేఽఅశ్వినౌ, 2. హిరణ్యయీఽఅరణీ యం, 3. నిర్మన్థతోఽఅశ్వినా. (వ్రా.ప్ర.)

•ఋగ్వేదము దశమమండలములోని యీ 189వ సూక్తములో 4,5,6 ఋక్కులుగా మూఁడు మంత్రములు కొన్ని వ్రాతప్రతులలో నధికముగాఁ గలవు. వీటిని కొందరు "ఖిల" మంత్రములుగా భావింప మరికొందరు పరిశిష్టము లనియు వేరొకకొందరు అధిక పాఠములనియు నింకఁగొందరు ప్రక్షిప్తము లనియు భావించిరి.

•(6) విష్ణోః శ్రేష్ఠేన రూపేణా ఽస్యాం నార్యాం గవీన్యామ్ ।

పుమాంసం [1]పుత్రానా ధేహి దశమే మాసి సూతవే ॥ 1870

## సూక్తము—189

ఋషి—త్వష్ట లేక విష్ణువు*

దేవత—1-విష్ణువు, త్వష్ట, ప్రజాపతి, ధాత; 2-సినీవాలి, సరస్వతి, అశ్వినులు;
3-అశ్వినులు; 4,5,6-విష్ణువు*

(1)§తే॥గీ॥ విష్ణుదేవుఁడు యోనిని వేడ్క మీఱఁ
కల్పనముఁ జేయుఁగాక ననల్పబుద్ధి
స్త్రీత్వపుంస్త్వంబులం జూపు చిహ్నములను
త్వష్ట పుట్టించుఁగాక నా తనువులందు ॥ 5666

§తే॥గీ॥ అల ప్రజాపతి రేతస్సు నట్టి యోని
యందు విడచునుగాకఁ దా నల్ల ధాత
గర్భపరిణత రేతస్సు కడక నచట
నంచితంబుగ సతి ధరియించుఁగాక ॥ 5667

(2)§తే॥గీ॥ ఓ సినీవాలి యను దేవి! యో సరస్వ
తీ! నిషిక్తసుగర్భముఁ దివిరి దాల్చుఁ
డో సి జాయ! భవద్గర్భ మొనర నశ్వి
లిద్దరును జేయుదురుగాక నెలమి మీఱ ॥ 5668

(3)§ఆ॥వె॥ ఎట్టి గర్భమునకు హేమారణుల నశ్వి
వరులు తఱచినారొ! కరము జాయ!
దశమమాసమందుఁ దగు ప్రసూతిని గోరి
పిలుతు మట్టి గర్భ మెలమి నీకు ॥ 5669

---

•"ఖిల"మంత్రము. 1. దశాస్యాం పుత్రానా. (వ్రా.ప్ర. పాఠాంతరము)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "త్వష్ట లేక విష్ణువు"గాను, దేవత "గర్భస్థపిండాశీర్వాదము"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(4) నైజగతుల మేషశక్తి భ్రాజమానమై వరలఁగ
వైష్ణవీయ మహాశక్తి పరావాసమై తనరఁగఁ
బ్రకృతిలోనఁ బురుషత్వము ప్రభవించును దిరిగితిరిగి
కామ్యమాన మౌచు జగతిఁ గ్రాల గర్భమూలమ్మై ॥• 5670

§(5) ఈ పృథ్వీరూప మెట్లు లెనసి గర్భ మొసంగునో!
ఆ రీతిగ నీ సృష్టిని నలర గర్భమూలకమై
పది నెలలున్ వరలి సర్వప్రకృతిలోనఁ బ్రభవగతులఁ
బరఁగు నఖిల పదార్థాలు ప్రభాదీప్తరతుల నిల్చు ॥• 5671

§(6) వైష్ణవీయ దీప్తగతుల పరలు శ్రేష్ఠరూపమ్ముల
వివిధ లోక గోళమ్ముల వెలయు ప్రకృతిరూపశక్తు
లఁ:రంగాఁ బురుషరూప జ్వలన పుత్ర శక్తు లెల్లఁ
బది నెలలున్ బరఁగు సర్వప్రకృతిలోనఁ బ్రభవగతుల ॥• 5672

## సూక్తము—189

ఋషి—త్వష్ట లేక విష్ణువు
దేవత—1-విష్ణువు, త్వష్ట, ప్రజాపతి, ధాత; 2-సినీవాలి, సరస్వతి, అశ్వినులు;
3-అశ్వినులు; 4,5,6-విష్ణువు

### అర్థాంతరము—1

§(1) ప్రకృతి పురుష రూపమ్ములఁ బ్రభవింపఁగఁజేయు సత్య
మూలభూతమైన యోనిమూర్తినుండి త్వష్ట రూప
సంచయమ్ము ప్రభవించుత! సర్వప్రజాపతిగ ధాత
సకలప్రకృతి ప్రసవశక్తి సదా! గర్భ ధారకమౌ ॥ 5673

(2)§క॥ గర్భ మ్మొసఁగును శ్రీపతి
గర్భమ్ము నొసఁగును శబ్ద గత్యక్షరమై
దుర్భర శుభగత్త్వాలను
నిర్భర తేజాల దేవనీరగ సృజమౌ ॥ 5674

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
•"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము.

§(3) వీర్యశక్తి అరణి కాఁగ విమలమథన శక్తులలో
దివ్యమైన కాంతితతులు తేజరిలుచు వర్తిల్లఁగ
నా వైష్ణవ శక్తితోడ నలరంగా నీకు గర్భ
మతియుతమై దశదిశలను నావిర్భవ మొందుఁ బ్రకృతి! ॥ 5675

§(4) నైజమ్మై సృష్టిశక్తి నానారూపాల నిలువ
శుభగతి నావాసమ్మై శుభదమ్మై ప్రకృతి కెల్లఁ
బునఃపునారతులతోడఁ బుట్టఁగ స పుత్రశక్తి
ఆత్మపునర్జనన శక్తి నఖిలప్రకృతికి గర్భ మొసఁగి
పురుషరూప శక్తులతోఁ బుట్టించును గాంతిశక్తి ॥♦ 5676

(5)§క॥ ఈ కాంతుల శక్తులతోఁ
బ్రాకృతమౌ పృథ్విగర్భభావ సురూప
మ్మాకృతి దాల్చుచు దశ మా
సాకరమై ప్రభవ మొందు హర్యజు మాయన్ ॥♦ 5677

§(6) ప్రకృతి రూప వివిధగోళ సకల లోక భువనాళల
వైష్ణవీయమైన శ్రేష్ఠ వరశక్తులు తనరారఁగఁ
బురుషశక్తు లలరారుచుఁ బునర్భవత్వానఁ బుత్రి
దశలలోనఁ జంద్రుఁడుగాఁ దనరారును నిత్యమ్మును ॥♦ 5678

## సూక్తము—189

ఋషి—త్వష్ట లేక విష్ణువు

దేవత—1-విష్ణువు, త్వష్ట, ప్రజాపతి, ధాత; 2-సినీవాలి, సరస్వతి, అశ్వినులు; 3-అశ్వినులు; 4,5,6-విష్ణువు

## అర్థాంతరము—2

§(1) ఆకాశము ననిలమ్మును ననలమ్మును సలిలమ్మును
పృథ్విఁ బంచభూతమ్ములు యుతగతులను నన్యోన్యత
నవినాభావత్వ మొప్ప నలరు సృష్టియోనిగాఁగఁ
బ్రకృతి యౌచు సంజననపుఁ బ్రకృతిమాయగాఁగఁ దనరి
త్వష్ట వివిధరూపమ్ములఁ దనరఁజేయు సృష్టిలోనఁ
బ్రజాపతి గర్భమ్మును బ్రభవింపఁగఁజేయు జనత ॥ 5679

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"ఖిల"మంత్రానువాదము.

§(2) నెలపొడుపౌ చాంద్రశక్తి నిండు అమావాస్యమాయ
గర్భ మొనఁగు జలశక్తుల గర్భ మెనయు వాక్ఛక్తుల
నగ్ని తేజముల గర్భ మ్మలరారును దైవీయపు
శక్తులతోఁ బ్రకృతి వరల సకలపుష్కర స్రజము ॥ 5680

§(3) అనలదీప్తి వీర్యశక్తు లరణులలో మథితమ్ముగ
గర్భరూపయజ్ఞమ్మును గ్రాలఁజేయు శ్రీవిష్ణువు
సర్వసంజననశక్తి సకలమునకు దశమగతుల
నమావాస్యగా నిలుచుచు హరియించును నఖిలసృష్టి ॥ 5681

§(4) అవృత్తియె లేకుండఁగ నమృతసత్యశక్తుల మై
సంజననపు సంవర్ధన సంస్థితిగతి లయ శక్తులఁ
బ్రకృతి పురుష రూపమ్ముల వరల స్త్రీపుం స్త్వమ్ములు
పునరావృత్తిగఁ బరఁగఁగఁ బ్రసాదించు గర్భమ్మును
బ్రభవ ప్రసవ కామ్యమ్ముల వరలఁజేయు పుంస్త్వమ్ముల ॥♦ 5682

§(5) మృచ్ఛక్తుల భూగోళము మింటి గర్భమున నిల్చెను
వైష్ణవీయ దివ్యశక్తి వరలఁగ నాధారమ్మై
గర్భమ్మై చంద్రుఁడుగాఁ గ్రాలు నమవస నిశి
నసాధారణంపు గతుల నలరఁ బ్రకృతి సంపదలుగ ॥♦ 5683

§(6) గోళ లోక స్త్రీ ప్రకృతులఁ గూడు వివిధ రూపమ్ముల
శ్రేష్ఠగతుల విష్ణువు చెన్నొందఁగఁజేయు సదా!
రాత్రిందివములఁ బురుషులఁ బ్రకృతులఁ బ్రసవించు వివిధ
దశలతోడ సంతతులు తనరు విశ్వసృష్టిలోన ॥♦ 5684

§ఆ॥ వె॥ వివిధ రూపములను విష్ణువు శ్రేష్ఠుఁడై
విశ్వరూప మూచు నశ్వగతుల
వరలి గౌళ లోక వరణీయ గర్భమై
పుంస్త్వశక్తు లొప్పఁ బుట్టుచుండు ॥♦ 5685

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
♦"ఖిల"మంత్రానువాదము.

## సూక్తమ్—190

ఋషిః—సత్యధృతిర్వారుణిః
దేవతా—ఆదిత్యః (స్వస్త్యయనమ్)
ఛందః—గాయత్రీ

(1) మహి త్రీణామవోఽస్తు ద్యుక్షం మిత్రస్యార్యమ్ణః ।
దురాధర్షం వరుణస్య ॥ 1871

(2) [1]నహి తేషామమా చన నాధ్వసు వారణేషు ।
ఈశే రిపురఘశంసః ॥ 1872

(3) యస్మై పుత్రాసో[2] అదితేః ప్ర జీవసే మర్త్యాయ ।
జ్యోతిర్యచ్ఛన్త్యజస్రమ్ ॥ 1873

## సూక్తము—190

ఋషి—వరుణపుత్రుఁడు సత్యధృతి*
దేవత—ఆదిత్యుఁడు*

(1)§గద్యము ॥
దీప్తమగుటచే నన్యుల బాధించుటకు శక్యము కానట్టియు గొప్పదియు నగునట్టియు మిత్రార్యమ వరుణత్రయపు టవనము మాకుఁ గలుగుఁగాక! ॥ 5686

---

1. నిహితేషా, 2. పుత్రాసోఽఅదితేః. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సత్యధృతి"గాను, దేవత "అదితి"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ" §సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(2)§గద్యము॥
గృహములందును వరుణమిత్రార్యములకుఁగాని తత్‌స్తోత్రకర్తలకుఁగాని యనర్థమును గల్పించు రిపువు హింసించుట కిష్టపడఁడు. పురుషులు నివారింపఁబడు మార్గములయందు శత్రువు నివారించుటకు నిష్టపడఁడు ॥* 5687

(3)§తే॥గీ॥ దీన కాకుండనుండెడు దేవమాత
పుత్రమిత్రాది వర్గ మే పురుషవరుఁడు
బ్రతుకుటకు జ్యోతి నిచ్చుచుఁ బరఁగువాఁడొ।
వాని కీశ్వరుఁ డగునెట్లు పరమవైరి ॥* 5688

## సూక్తము—190

ఋషి—వరుణపుత్రుఁడు సత్యధృతి
దేవత—ఆదిత్యుఁడు

### అర్థాంతరము—1

§(1) ఆకసమున కనిలమ్మున కనలమునకు సలిలమునకుఁ
దావలమై మహీతలము తనరారును సృష్టిలోన
నబాధితమైన శక్తి సర్యమ మిత్రవరుణులు
సృష్టియజ్ఞ హవనమ్మున వ్యష్టిసమిష్టిగతుల నిల్చు ॥ 5689

§(2) ఆదిత్యుని దివ్యశక్తి అంధకారమున్ ద్రుంపదు
అస్తమింపఁజేయుచుండు నావిష్కరణమ్ము చేయు
సృష్టిలోని వైరుధ్యపు వ్యష్టిసమిష్టి శక్తి తతుల
సంహరింపకుండ నిలుపు సర్వమునకు నీశత మై ॥ 5690

§(3) ఆదిత్యుని మూలప్రకృతి అలరారఁగ సృష్టిశక్తి
మృద్‌రూపపు జీవులకును జ్యోతిశ్శక్తుల నొసఁగును
బరమవైరి శక్తితతులు ప్రభవించుచు నంతరించు
నచ్ఛక్తుల మహిమలమై ననచ్ఛక్తు లస్తమించు ॥ 5691

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వర్ణమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—191

ఋషి—వాతగోత్రుఁడగు ఉలస్యుఁడు
దేవత—వాయువు

### అర్థాంతరము—1

§(1) ప్రాణరూపమైన వాయు ప్రతతి ఔషధమ్ము కాఁగ
శక్తి శుభంకర మ్మౌచు సదమలతన్ హృద్గత మై
నిత్య నవ్య శుద్ధత త్త్వ నేజ చలనగతులు మీఱఁ
బ్రాణితతుల నిల్పుచుండుఁ ద్రాణదీప్తు లొప్పారఁగ ॥ 5698

§(2) వివిధవాయు శక్తితతులు అవిశథముగ నాడుచుండు
విశ్వసృష్టి స్థితిశక్తుల విమలమ్ముగ వృద్ధిపరచుఁ
బితవోలెను భ్రాలవోలె వెలుఁగు సత్యసఖుండుగా
జీవమ్ముల వెలుఁగఁజేయు వేవేలౌ రూపమ్ముల ॥ 5699

§(3) సృష్టిగృహమునం దనిలము వ్యష్టిసమిష్టిగతుల మెయిని
నమృతనిధికి హిత మ్మౌచు ననవరత మ్మలరారుచు
విశ్వసృష్టిలోని ప్రాణి వితతి కెల్లఁ బ్రాణ మిచ్చి
తతశక్తుల సృష్టిస్థితి రత రక్తుల నిల్పుచుండు ॥ 5700

## సూక్తము—191

ఋషి—వాతగోత్రుఁడగు ఉలస్యుఁడు
దేవత—వాయువు

### అర్థాంతరము—2

§(1) బ్రహ్మరూప సృష్టిమయము వైష్ణవీయ స్థితిమయమ్ము
శైవీయపు లయమయమై సంతతమ్ము నలరారుచు
నఖిలమ్మున ననిలమ్ములు ప్రాణములై ఆయుష్షుకుఁ
గారకమ్ము లౌచు వరలు ధారకమై తారకమై ॥ 5701

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§(2) జననకారకత్వ మొప్ప సహజీవన మలరారఁగ
నన్యోఽన్యత లమరంగా నఖిలభూతములతోడన్
ననిల నఖిత్వమ్ము పరఁగు నసాధారణంపుగతుల
సృష్టిఁ జరాచరమ్ములకు జీవాఽఽధారమ్ముకాఁగ ॥ 5702

§(3) అత్యంతము పరిశుద్ధత లలర సృష్టిగృహమ్మందు
నమృతనిధికి హిత మొ్మాచు ననిల మ్మలరారుచుండు
మరుచ్ఛక్తి కారణాన మహితగతుల సకలదేహ
జాలము లవి చరియించుచు సంవర్ధన మొందుచుండు ॥ 5703

## సూక్తమ్—192

ఋషిః—ఆగ్నేయో వత్సః
దేవతా—అగ్నిః
ఛందః—గాయత్రీ

(1) ప్రాగ్నయే వాచమీరయ వృషభాయ క్షితీనామ్ ।
స నః పర్షదతి [1]ద్విషః ॥ 1877

(2) యః పరస్యాః పరావతస్తిరో ధన్వాతిరోచతే ।
స నః పర్షదతి [1]ద్విషః ॥ 1878

(3) యో రక్షాంసి నిజూర్వత్యగ్నిస్తిగ్మేన శోచిషా — యో రక్షాంసి నిజూర్వతి వృషా [2]శుక్రేణ శోచిషా ।
స నః పర్షదతి [1]ద్విషః ॥ 1879

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. ద్విషః, 2. శుక్రేణ (వా.ప్ర.)

(4) యో విశ్వాభి విపశ్యతి భువనా సం చ పశ్యతి ।

స నః పర్షదతి [1]ద్విషః ॥ 1880

(5) యో[2] అస్య పారే రజసః శుక్రో[3] అగ్నిరజాయత ।

స నః పర్షదతి [1]ద్విషః ॥ 1881

•(6) అనీకవన్తమూతయేఽగ్నిం గీర్భిర్హవామహే ।

స నః పర్షదతి [1]ద్విషః ॥ 1882

## సూక్తము—192

ఋషి—అగ్నిపుత్రుఁడు వత్సుఁడు*

దేవత—అగ్ని*

(1)§తే॥గీ॥ మనుజులకుఁ గాంక్షితంబుల ఘనతఁ గూర్చు
నట్టి యగ్నికి స్తోత! నీ వమలమైన
సూక్తి పఠియింపుమా! నీకు శోభ కలుగ
నగ్ని మా ద్వేష్టలను నెల్ల నణఁచఁగలఁడు ॥ 5704

(2)§తే॥గీ॥ అతిశయిత దూరమునసుండి యగ్నిప్రా ప్త
బంధమును గల్గు మరుభూమి పరమవేగ
ధాటి మండుచునున్నాఁడు నూటి నట్టి
యగ్ని మా ద్వేష్టలను నెల్ల నణఁచఁగలఁడు ॥ 5705

---

1. ద్విషః, 2. యోఽఅస్య, 3. శుక్రోఽఅగ్ని. (వ్రా.ప్ర.)

•ఋగ్వేదము దశమ మండలములోని యీ 192వ సూక్తములో నారవ ఋక్కుగాఁ గొన్ని వ్రాతప్రతులలో నొక మంత్ర మధికముగాఁగలదు. దీనిని గొందరు "ఖిల" మంత్రముగా భావింపఁ గొందరు పరిశిష్ట మనియు మరికొందరు అధికపాఠ మనియు వేరొక కొందరు ప్రక్షిప్తమనియు భావించిరి.

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి"వత్సుఁడు" గాను, దేవత "అగ్ని"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§గేయిత:—వాఙ్మయ మహాధ్యక్ష. డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము

(3)§తే॥గీ॥ ఎవఁడు వర్షితయై కడు నిద్ధ తేజ
మును మహేష్టి పరిద్వేషిగణముఁ గూల్చు
చున్నవాఁ డౌచు వెలుఁగొందుచుండు నట్టి
యగ్ని మా ద్వేష్టలను నెల్ల నణఁచఁగలఁడు ॥* 5706

(4)§తే॥గీ॥ ఎవఁడు సూర్యుని రూపుతో నెల్ల భూత
జాతమును వెల్గఁజేయునో। శక్తి నెల్ల
భువనములఁ దెల్సికొనుచుండెఁ బూజ్యుఁ డట్టి
యగ్ని మా ద్వేష్టలను నెల్ల నణఁచఁగలఁడు ॥* 5707

(5)§తే॥గీ॥ అంతరిక్షంబుపై నెవ్వఁ డమలుఁ డగుచు
విద్యుదాకారముననొ। తా వేఁడివేల్పు
రూపుననొ। పుట్టుచుండు నిరూఢి నట్టి
యగ్ని మా ద్వేష్టలను నెల్ల నణఁచఁగలఁడు ॥* 5708

(6)§ఆ॥వె॥ శబ్దశక్తు లలర జ్వలిత మౌ నగ్నుల
పుంజ మెల్ల హవన పూర్ణగతుల
దైత్యశక్తితతుల దహన మొనర్చుచున్
అగ్ని మాదు నరుల నణఁచఁగలఁడు ॥♦ 5709

## సూక్తము—192

ఋషి—అగ్ని పుత్రుఁడు వత్సుఁడు
దేవత—అగ్ని

## అర్థాంతరము—1

§(1) ప్రికర్ష మైన అగ్నిశక్తి ప్రిజ్వలిలుత। వాక్ఛక్తుల
వైష్ణవీయ శక్తులతో వరలు వృషభ చక్రమునకు
నచ్ఛక్తుల సమకూర్చును సదా। సృష్టిలోన దుష్ట
విద్వేషపు విషశక్తుల వినాశన మ్మొనరించును ॥ 5710

---

§రచయిత:—వాఙ్మయ మహాద్యుష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
♦"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము.

§(2) పురోగమన తిరోగమన పూర్ణప్రాణశక్తులతోఁ
బరాశక్తి కాత్మ యౌచు వరలు ధనూరూపాఽగ్నిశక్తి
సచ్ఛక్తుల సమకూర్చును సదా। సృష్టిలోన దుష్ట
విద్వేషపు విషశక్తుల వినాశన మ్మొనరించును ॥

§(3) శుక్రశక్తులు మీఱ శుభ్రాఽగ్ని దీప్తులన్
ధర్మశక్తులవల్ల దనుజ శక్తులఁ దున్మి
సచ్ఛక్తుల సమకూర్చును సదా। సృష్టిలోన దుష్ట
విద్వేషపు విషశక్తుల వినాశన మ్మొనరించును ॥

§(4) విశ్వమ్మును వెల్గులతో వీక్షించును ననలశక్తి
అఖిలమ్మౌ భువనాళుల నభేదముగ వెల్గు నగ్ని
సచ్ఛక్తుల సమకూర్చును సదా। సృష్టిలోన దుష్ట
విద్వేషపు విషశక్తుల వినాశన మ్మొనరించును ॥

§(5) ఏ ప్రదేశ రజశ్శక్తి నెనయు శుక్ర మనలమ్మును
ఆవిర్భవ మొందుచుండు నా శక్తిని శుచి వీర్యము
సచ్ఛక్తుల సమకూర్చును సదా। సృష్టిలోన దుష్ట
విద్వేషపు విషశక్తుల వినాశన మ్మొనరించును ॥

§(6) దివ్యశబ్ద శక్తులతోఁ దిరుగు వాయ్వనీకమ్ము
అనలమ్ముల కిచ్చుచుండు నసాధారణంపు స్థితుల
సచ్ఛక్తుల సమకూర్చును సదా। సృష్టిలోన దుష్ట
విద్వేషపు విషశక్తుల వినాశన మ్మొనరించును ॥♦

§— అగ్నిశక్తిమై శబ్దము లమల దీప్తు లొప్పారఁగ
ఋషి కవితాగిర్వాణిగ విషహరమై వర్తిల్లును
వాక్ఛక్తుః హవమ్ములై వర్తిల్లఁగఁ బ్రకృతిలోన
సృష్టి నిత్య యజ్ఞమ్మును జెలఁగఁజేయు ననీకముగ ॥♦

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

♦"ఖిల"మంత్రానువాదము.

## సూక్తము—192
ఋషి—అగ్ని పుత్రుఁడు వత్సుఁడు
దేవత—అగ్ని

### అర్థాంతరము—2

§(1) ప్రకర్షాగ్ని దీప్తులతో వరలు చాంద్ర కౌముదు లవి
ధర్మదీప్తి శక్తులకై తనరుచుండుఁ జదలులోన
క్షితులలోన శుభకరమై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥ 5717

§(2) పరమాత్మ పర మ్మొదు వరల నావృత్తి లేని
ధనుస్థిరత నతిజ్వలతఁ దనరారును నిరత మగ్ని
క్షితులలోన శుభకరమై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥ 5718

§— అఖిలసృష్టి కతీతమై అలరారుచుఁ బరమాత్మగ
స్థిరపరతను మహాదీప్తిఁ దేజరిల్లుచుండు నగ్ని
క్షితులలోన శుభకరమై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥ 5719

§(3) పరమపుణ్యదీప్తమైన పవిత్ర శుక్ర రోచిస్సుల
నే జ్వలనుఁడు రక్షస్సుల నిద్ధతేజములఁ ద్రుంచునో•
ధర్మరూపమైన దివ్య కర్మ శుక్రిశుచు లొప్పఁగ
రక్షణగా సృష్టిలోనఁ బ్రజ్వలిల్లు మహాదీప్తి•
క్షితులలోన శుభకరమై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥ 5720

§(4) సత్యపథ సంగతమున సంగమించి భూతతతుల
భువనాళుల విశ్వమ్మును బూర్ణదృష్టిఁ జూచు నగ్ని
క్షితులలోన శుభకరమై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥ 5721

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

•"యో రక్షాంసి" ఇత్యాది ఋక్కులోని తొలి పాదమునకు నీ పద్యములో "పరమపుణ్య" ఇత్యాది మొదటి రెండు పాదాలలో నొక అర్థమును, "ధర్మరూపమైన" ఇత్యాది రెండు పాదాలలో వేరొక అర్థమును బోధ్రక్తములైనవి.

§(5) అవిచ్ఛిన్న గతుల మెయిని నావిర్భవ మొందు నగ్ని
స్పష్టి శకర్రజము నొంది ఋత రూపముగా నిల్చుచు
క్షితులలోన శుభకర మై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥ 5722

§(6) అనిలసమూహయుక్తమైన అనలమ్ములు దివ్యశబ్ద
శక్తులతో విశ్వమ్మున సదాః హవన మొనరించును
క్షితులలోన శుభకర మై చెన్నొందుచు సత్యపరత
ద్వేషించెడి దుష్టప్రకృతిని విధ్వస్త మ్మొనరించును ॥* 5723

## సూక్తమ్—193

ఋషిః—ఆగ్నేయః శ్యేనః
దేవతా—జాతవేదా అగ్నిః
ఛందః—గాయత్రీ

(1) ప్ర నూనం జాతవేదసమశ్వం హి[illegible]త వాజినమ్ ।
ఇదం నో బర్హిరాసదే ॥ 1883

(2) అస్య ప్ర జాతవేదసో విప్రవీరస్య [1]మీళ్హుషః ।
మహీమియర్మి సుష్టుతిమ్ ॥ 1884

(3) యా రుచో జాతవేదసో దేవత్రా హవ్యవాహనీః ।
తాభిర్నో యజ్ఞమిన్వతు ॥ 1885

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ఖిల"మంత్రానువాదము.

1. మీళహుషః. (వా్ర.ప్ర.)

## సూక్తము—193

ఋషి—అగ్ని పుత్రుఁడు శ్యేనుఁడు*
దేవత—జాతవేదోగుణకుఁ డగు నగ్ని *

(1)§తే॥గీ॥ వ్యాపితంబైన బర్హిస్సుపై వసింప
జాతవేదిత యగుచుండి జ్వలనుఁ డగుచుఁ
గర్మలన్ వ్యాప్తిఁ గాంచుచు ఘనతరాఽన్నుఁ
డైన యగ్నిని సేవింపుఁ డార్యులార ॥♦ 5724

(2)§ఆ॥వె॥ జాతవేది యగుచు సకల మేధావులన్
ఋత్విజులఁ గల్గి పూర్ణసేక్త
యైన యట్టి యగ్ని కతిశయస్తుతులను
నేఁ బఠించుచుంటి నిశ్చలముగ ॥♦ 5725

(3)§గద్యము ॥
ఏ యగ్ని ఋక్కులు (సప్తజిహ్వలు)దేవతలకు హవ్యవాహిను లగుచున్నవో యట్టి ఋక్కులు మా యాగసాధన హవిస్సును దేవతను బొందించుఁగాఁక ॥♦ 5726

## సూక్తము—193

ఋషి—అగ్ని పుత్రుఁడు శ్యేనుఁడు
దేవత—జాతవేదోగుణకుఁ డగు నగ్ని

### అర్థాంతరము—1

§(1) అత్యంతము నిశ్చయమౌ నతిలోకపు దీప్తులతో
జాతవేదాఽనలము జ్వలియించును సతతమ్మును
సృష్టిలోని యజ్ఞమ్ముల వ్యష్టిసమిష్టిగతులమైని
నలరారుచు విష్ణుదేవు నాలయముగ వెల్గొందును ॥ 5727

---

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "శ్యేనము"గాను, దేవత "అగ్ని, జాతవేదస్సు"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

♦సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

§(2) విజ్ఞానపు వీరత్వము వెలుఁగంగాఁ బ్రయోగాల
జాతవేదాఽగ్ని శక్తి సదాః వర్తిల్లుఁ బ్రకృతి
అంతర్గత జ్వలనశక్తి నలరారుచు జర్ఘురిణిగ
నతివేల ప్రవాహగతుల నద్భుతముగ వెల్గుచుండు ॥ 5728

§(3) ఏ రుచులను జాతవేదు లెంతేనియు దివ్యశక్తి
హవ్యవాహనులుగ వెల్గి అఖిలసృష్టి యజ్ఞమ్ములఁ
దనరారునొః ఆ యగ్నియె అణువణువున విశ్వమ్మున
నిత్యయజ్ఞకర్మమ్ముల నెఱపుచుండుఁ బ్రకృతిలోన ॥ 5729

సూక్తము—193
ఋషి—అగ్ని పుత్రుఁడు శ్యేనుఁడు
దేవత—జాతవేదోగుణకుఁ డగు నగ్ని

అర్థాంతరము—2

§(1) అగ్ని యుండియు లేనట్లుగ నంతరాంతరముల నెల్ల
సూక్ష్మాఽతిసూక్ష్మమై చోద్యమౌ జ్వలనగతుల
జాతవేదసాఽగ్ని సృష్టిఁ జరియించును మహితమై
అసాధారణంపు గతుల నద్భుతమౌ శక్తులతో ॥ 5730

§(2) విజ్ఞానపు రూపమై వెలిఁగి వీర్యశక్తులతొ
జాతవేదాఽనలముగ సదాః తనరారుచుండు
మహితమ్మౌ సృష్టిలోన నిహవరాల ప్రకృతులతో
నంతర్బాహిరగతులను నలరు నసాధారణముగ ॥ 5731

§(3) దైవీయపు శక్తులతోఁ దనరారుచు హవిష్మ్మును
వహియించెడి జాతవేద ప్రభాకాంతిపుంజా లవి
ప్రకృతిలోన స్వయముగా నె అక్మతాఽనూనగతుల
సృష్టియజ్ఞ సంచయాలఁ జెన్నొందఁగఁ జేయు నగ్ని ॥ 5732

---

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పిడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తమ్ —194
ఋషికా—సార్పరాజ్ఞీ
దేవతా—ఆత్మా, సూర్యో వా
ఛందః—గాయత్రీ

(1) ఆయం గౌః పృశ్నిరక్రమీదసదన్మాతరం పురః ।
పితరం చ ప్రయన్త్స్వః ॥ 1886

(2) అన్తశ్చరతి రోచనా ఽస్య ప్రాణాదపానతీ ।
వ్యఖ్యన్మహిషో దివమ్ ॥ 1887

(3) త్రింశద్ధామ వి రాజతి వాక్ పతంగాయ ధీయతే ।
ప్రతి వస్తోరహ ద్యుభిః ॥ 1888

## సూక్తము—194
ఋషిక—సార్పరాజ్ఞి*
దేవత—ఆత్మ లేక సూర్యుఁడు*

(1)§తే॥గీ॥ గంత తేజోఽభివృద్ధిని గలుగువాఁడు
సూర్యుఁ డుదయంబు నొందుచు సూటి పూర్వ
దిక్కునం బృథ్విఁ బొందుచు దివము పిదప
పొందుచున్ శీఘ్రముగఁ బ్రీతి నరుగుచుండు ॥ 5733

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 156 సంఖ్యగల సంపుటములోని ఋషిదేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సర్పరాజ్ఞి"గాను, దేవత "సర్పరాజ్ఞి లేక సూర్యుఁడు"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.
§రచయిత:—వాఙ్మయ మహావృక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

(2)§గద్యము ॥
ఈ సూర్యుని దీప్తి నాడులచే నూర్ధ్వముగ వాయు నిర్గమనమును, నాడులచే నవాజ్ముఖముగ
వాయు నిర్గమనమును జేయుచు శరీరమధ్యమున ముఖ్యప్రాణాత్మగాఁ జరించుచున్నది.
లేక ద్యావాభూముల మధ్యమున నీ సూర్యుని దీప్తి ఉదయానంతర మస్తమయమును
బొందుచుఁ బోవుచున్నది. ఇట్టి దీప్తిచేఁ గూడుకొనిన మహాసూర్యుఁ డుదయాస్త
మయముల మధ్యమందు నంతరిక్షమును బ్రకాశింపఁజేయుచున్నాఁడు ॥* 5734

(3)§గద్యము ॥
వాసరమునకు (అహోరాత్రమునకు) నవయవీభూతము లగు త్రింశద్ధామములు
సూర్యదీప్తులచే వెలఁగింపఁబడుచున్నవి. సూర్యునికొఱకు స్తుతిరూప వాక్కు
స్తోత్రలచేఁ బఠింపఁబడుచున్నది ॥* 5735

## సూక్తము—194

ఋషిక—సార్పరాజ్ఞి
దేవత—ఆత్మ లేక సూర్యుఁడు

### అర్థాంతరము—1

§(1) రవి గుహ్యస్థానముగా రాజిల్లును సృష్టిలోనఁ
బూర్వమ్మున నుదయించుచు భూతలాల వెల్గు నింపు
మధ్యాహ్నపుఁ గాలమ్మున మహితగతుల భిన్న గోళ
లోకాలను నుదయించును ఋతశక్తుల దీప్తులొనఁగి ॥ 5736

§(2) ప్రాణాఽపాన శక్తులతో వరలుచుండు దివిభువుల క
నంతర్గతి నలరుచుండి అఖిలములౌ ప్రాణతతుల
దివ్యమైన దీప్తులతోఁ దేజరిలుచు నిరతమ్మును
నంతరిక్షరూపమ్మున నాత్మ జగతిఁ దనరారును ॥ 5737

(3)§క॥ ముప్పదియా♦ స్థానమ్ముల
నొప్పఁగ దీప్తుల నిరతము నుజ్జ్వల గతులన్
ఎప్పుడును శబ్ద శక్తులు
చొప్పడఁగా ద్యుతిపతంగ శోభల వెల్గున్ ॥ 5738

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.
♦చంద్రపరమైన శుక్లపక్షమునకు సంబంధించిన పాడ్యమ్యాది పదునేను (15) తిథులకును- కృష్ణపక్షమునకు సంబంధించిన పాడ్యమి మొదలైన పదునేను (15) తిథులకును మూలభూతములైన ముప్పది స్థానములు.

## సూక్తము—194
ఋషిక—సార్పరాజ్ఞి
దేవత—ఆత్మ లేక సూర్యుఁడు

### అర్థాంతరము—2

(1)కం॥ ప్రాణప్రదమై చంద్రుఁడు
త్రాణమ్ముల నమృతశక్తితతుల నొసంగున్
రాణించి తండ్రి వోలెన్
శాణమ్మై వాయువాహ సద్గతి నలరున్ ॥ 5739

(2)కం॥ అంతర్గతి నలరారుచుఁ
గ్రాంతిని బ్రాణద మవుచును గ్రాలుచుఁ బ్రకృతిన్
అంత మొనర్చును గోముదు
లెంతేని నపానవాయు హీనముఁ జేయున్ ॥ 5740

(3)కం॥ ముప్పదియౌ తిథుల గతుల
మెప్పొందెడి వెన్నెల చలి మింటి వెలుంగుల్
ఉప్పరమై తగు చంద్రుం
డప్పుల వాక్కుల పతంగ యజ్ఞమ్మౌ లేః ॥ 5741

## సూక్తమ్—195
ఋషిః—మాధుచ్ఛన్దసోఽఘమర్షణః
దేవతా—భావవృత్తమ్
ఛందః—అనుష్టుప్

(1) ఋతం చ సత్యం చాభీద్ధాత్ తపసోఽధ్యజాయత ।
తతో రాత్ర్యజాయత తతః సముద్రో[1] అర్ణవః ॥ 1889

రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. సముద్రోఽర్ణవః. (వా.ప్ర.)

(2) సముద్రాదర్ణవాదధి సంవత్సరో[1] అజాయత ।

అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ ॥

(3) సూర్యాచన్ద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్ ।

దివం చ పృథివీం చాఽన్తరిక్షమథో స్వః ॥

## సూక్తము—195

ఋషి—మాధుచ్ఛందుఁడైన అఘమర్షణుఁడు*

దేవత—సృష్టి*

(1)§గద్యము॥

యదార్థకల్పనమును యదార్థభాషణమును నింక శాస్త్రీయ ధర్మసమూహమును బ్రహ్మ
తపస్సువలనఁ బుట్టెను. అట్టి యీశ్వరునివల్ల సముద్రుఁడును♦ నంతరిక్షమును నుద్భవిం

(2)§తే॥గీ॥ సృష్ట మైనట్టి యర్ణవశ్రీకిఁ దొలుత
కాల మంతయుఁ బుట్టెను లీలమాత్ర
నీశ్వరుఁడు భూతజాతంబు నెల్లఁ జేసి
నిమిషయుత లోకమున కెల్ల నేత యయ్యె ॥

---

1. సంవత్సరోఽఅజాయత. (ప్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "అఘమర్షణుఁడు"గాను, దేవత "సృష్టి"గాను శ్రీ నేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

♦ఈశ్వరునివల్ల సముద్రము నంతరిక్షమును బ్రారంభమునఁ బుట్టినవి. ఇట్టు లేదియో ద్యశ్యతత్వమున ఉత్పన్నమైనదని ఋగ్వేదమునందు వేర్వేరుగా వర్ణింపఁబడినట్లు ప్రాచీనకాలమునఁ గొందరు భావించిరి. ఋ వర్ణితమగు నీ మూలద్రవ్యముతోనే అనఁగా జలముతోనే ప్రారంభమున సర్వము నుండెను. "ఆపో వా సలిల మాసీత్". (తై.త్తి.బ్రా.) –సర్వమును దొలుత సత్తుగనే యుండెను. "అసద్ వా ఇద మగ్రే ఆసీత్." అని యిట్టి సృష్టి క్రమము వేర్వేరుగఁ జెప్పఁబడెను. మైత్ర్యుపనిషత్తునందు "తమో వా ఇద మగ్ర ఆసీత్ సర్వమును బ్రారంభమునఁ దమస్సుగా నుండె ననియుఁ గూడ సృష్టిక్రమము చెప్పఁబడినది.

(3)§తే॥గీ॥ సూర్యునిన్ జంద్రమప్పను సురుచిర మగు
నంతరిక్షంబుఁ బృథ్విని నధికసుఖము
నిచ్చు దినమును సర్వంబు నెట్లు తొల్లి
ధాత సేసెనో! యట్లిప్పు ధాతఁజేసె ॥* 5744

## సూక్తము—195

ఋషి—మాధుచ్ఛందుఁడైన అఘమర్షణుఁడు
దేవత—సృష్టి

### అర్థాంతరన్యాసం—1

§(1) సంగమంపు సద్ధ్వనియును సద్రూపపు సత్యగతియు
నఖిలేశుని అధ్వరమున నావిర్భవ మొందెఁ దొలుత
నగ్ని దీప్త శక్తులతో ననంతరము రాత్రి పుట్టె
హద్దు లెనయ నట్టి జలధి అవతరించె నా పిదపన్ ॥ 5745

§(2) అవధు లున్న జలధికంటె నాదిలోనె నద్భుతముగ
సంవత్సరరూపమైన చలనకాల ముద్భవించె
నహోరాత్రు లవతరించె నఖిలమ్మును విశ్వేశుని
వశ మౌచునె మిషగాఁగను వర్తిల్లును సర్వస్వము ॥ 5746

§— ఆకసంపు రూపమ్మౌ నంబుధిలోఁ దొలుతొల్తను
సకల చరాఽచరమ్ములకు సంవత్సర రూపమైన
చంద్రసూర్యు లుద్భవింప సంభవించె నహోరాత్రు
లఖిలేశుని మిషగాఁగను నఖిలమ్మును వశ్యమ్ముగ ॥ 5747

§(3) సకలసృష్టి ధారకుఁడౌ సర్వేశుఁడు శక్తులమై
సూర్య చంద్ర దివి పృథ్వుల నన్యాంతరిక్షమ్ము నెల్లఁ
దేజోమయ పదార్థాలఁ దిమిరాఽఽవృత పదార్థాల
నాదిలోనె నద్భుతముగ నావిర్భవ మొందఁజేసె ॥ 5748

---

§రచయిత:—వాఙ్మయ మహాద్రష్ట, డాక్టర్ పెద్దమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—195

ఋషి—మాధుచ్ఛందుఁడైన అఘమర్షణుఁడు

దేవత—సృష్టి

### అర్థాంతరము—2

§(1) సత్యరూప కాంతిశక్తి సచ్చక్తుల కాంతిశక్తి
సృష్టకంటెఁ బూర్వమ్మే సంభవించె ననలదీప్తి
నా పిదపను నవతరించె ననచ్ఛక్తిరూపమైన
నిశీథమ్మే అవలఁ బుట్టె నింగిరూపమైన జలధి ॥ 5749

§(2) ఆకసంపు టంబుధిలో నవతరించె నతివేలపు
టధిగతులను సంవత్సరాఽతీత మై కాలము
అఖిలేశుని మిషగాఁగను అహోరాత్రు లలరుచుండు
సర్వమ్మును సంభవించు సకలమ్మును వశమ్మౌచు ॥ 5750

§(3) లయస్థితులకుఁ బూర్వమ్మున రాజిల్లెనోః యెట్లు సృష్టి
ఆ విధిగనె తరువాతను నావిర్భవ మొందుచుండు
నరుణ శశులు దివి పృథ్వులు నంతరిక్ష మవతరించుఁ
గాంతి తిమిరతతులు పరఁగఁ గాత్రిలు ధాతక్రియగ నెల్ల ॥ 5751

## సూక్తమ్—196

ఋషిః—సంవనన ఆంగిరసః

దేవతా—1-అగ్నిః; 2-4-సంజ్ఞానమ్

ఛందః—అనుష్టుప్; 3-త్రిష్టుప్

(1) సంసమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య[1] ఆ ।
ఇళస్పదే సమిధ్యసే స నో వసూన్యా భర ॥ 1892

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

1. విశ్వర్యఽఅ. (వా.ప్ర.)

(2) సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।

దేవా భాగం యథా పూర్వే సంజానానా[1] ఉపాసతే ॥ 1893

(3) సమానో మన్త్రః సమితిః సమానీ సమానం మనః సహ చిత్తమేషామ్ ।

సమానం మన్త్రమభి మన్త్రయే వః సమానేన వో హవిషా జుహోమి ॥ 1894

(4) సమానీ వ[2] ఆకూతిః సమానా హృదయాని వః ।

సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి ॥ 1895

## సూక్తము—196

ఋషి—ఆంగిరసుఁడైన సంవననుఁడు*
దేవత—1-అగ్ని; 2,3,4-సంజ్ఞానము*

(1)§గద్యము ॥

ఓ కామవర్షితా! యగ్నీ! యీశ్వరుఁడవగు నీవు స్వామివి! నీవు భూతజాతములను గలుపుచున్నావు! (దేవతల మధ్య నీవే భూతజాతముల నన్నిటిని వ్యాపింపఁజేయుచున్నావు!) పృథ్వీస్థానమందు ఋత్విజులచే వెలిఁగింపఁజేయఁబడుచున్నావు! అట్టి నీవు మాకు ధనమును దెమ్ము! ॥ 5752

(2)§గద్యము ॥

ఓ స్తోతలారా! మీరు కలసియుండుఁడు! పరస్పరము విరోధమును విడచి యొక విధమగు వాక్యమునే పలుకుఁడు!• మీ మనస్సులను నేక విధానముగనే యాలోచింపనిండు! పురాతనులగు దేవత లైకమత్యమును బొంది వారివారి హవిర్భాగములను నెట్లు స్వీకరించెదరో! యట్లే మీరును వైమత్యమును విడనాడి ధనమును స్వీకరింపుఁడు! ॥ 5753

---

1. సంజానానాఽఉపాసతే, 2. సమానీవఽఆకూతిః. (వ్రా.ప్ర.)

*శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 15b సంఖ్యగల సంపుటములోని ఋషి దేవతల పట్టికలో నీ సూక్తమునకు ఋషి "సమోనానుఁడు"గాను, దేవత "అగ్నిసమానత్వము"గాను శ్రీనేమానివారు వ్రాసిరి.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

§సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

•భిన్నార్థముల వివాదము లున్నట్టు లీ సందర్భమునుబట్టి గ్రహింపనగును.

(3)§గద్యము ॥

ఏకకర్మయందుఁ బ్రవృత్తు లగు ఋత్విజుల స్తోత్రల గుప్తసంభాషణము సమానమగుఁగాక! ఈ సమితియందఱికిని సమానము. మననసాధన మగు నంతఃకరణమును మీకు సమాన మగుఁగాక! మన కందరికిని సమాన మగు నిశ్చయమును దెలుపుచున్నాను. మన మందరమును సమాన మగు హవిస్సుతో నారాధింతుము ॥♦ 5754

(4)§గద్యము॥

యజమానులార! మనసంకల్పము సమాన మగుఁగాక! మన హృదయములు సమానము లగుఁగాక! మన యంతఃకరణము సమాన మగుఁగాక! మనకు శోభన సాహిత్యము సమాన మగుఁగాక ॥♦* 5755

---

*§సీ॥ ఏ వాక్కునైన స్వవాఙ్మయామృతమందు నయగార మొలుకంగ నమక చమక
స్వాహాగతు లెనయ సధ్యవస్థితి నిల్పు చక్షయమ్ముగ వెల్గ నవని వేద
మొల్ల నెనయకయె నే మూలనో యుంచుఁ బాడి నొప్పెడి మహాప్రాణశక్తి
నే గోప్రశక్తుల నేపాటి యెరిఁగెనో! యిల సాయణుండు తాఁ బ్రాకృతమతిఁ
తే॥గీ॥ దృష్ణమెయి వ్రాసె భాష్యాలు తియ్య నొచు, బ్రతుకు సంస్కృత శవజీవ భాషలోన
నందు ఋగ్వేదమును దాను నాంధ్రభాష, నిలిపె నేమానివంశజుం డరసియరసి
సరస వేంకట నరసింహశాస్త్రి చాలఁ, గావ్యతీర్థ బిరుద మొప్పఁ గాల గతిని
బోవఁ బూర్తిగా నక్షరభూతయతిని, నిల ద్వితీయుండుగను నద్వితీయమతిని ॥

దశమ మండలము సంపూర్ణము

ఆంధ్ర ఋగ్వేద సంహిత సమాప్తము

శ్రీవేంకటేశాయనమః

ఇయ్యది

శ్రీభారద్వాజగోత్ర శ్రీవేంకటేశ్వరపౌత్ర సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి

ముక్తాయమాన నేమాని వేంకట నరసింహశాస్త్రి విరచిత కృతులలో

శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సర్వము

సంపూర్ణము

బ్రహ్మార్పణమసు

శ్రీ నేమానివారి శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత శేషభాగ పూరణగా 1957 సంవత్సరములో సాయణాచార్యభాష్యానుసారముగా నేను విరచించిన అష్టమాధ్యాయము చివర "ఏ వాక్కునైన" ఇత్యాది నాల్గు సీసపాదములను అష్టపదిగా గీతమును విరచించి పైముగింపు గద్యలు వ్రాసితిని. ఇవి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వప్రాచ్యలిఖిత గ్రంథాలయం_పరిశోధనాలయంలో భద్రపరచఁబడిన శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతులలోని Acc. No. 3790. Call. No.T-20-46 పుస్తకము 95_96పుటలలో నున్నవి ఈ శేషభాగము మత్ప్రణీత మే అయినను నన్నయభట్ట విరచిత ఆంధ్రమహాభారత అరణ్యపర్వ శేషభాగమును ఎఱ్ఱాప్రగడ విరచించి నన్నయరచనగానే ఆశ్వాసాంత్యగద్యలు వ్రాసినపద్ధతిలో నేనును అష్టమాధ్యాయాంత్య గద్యశ్రీ నేమానివారిరచనగానే వ్రాసితిని. కాని 95వపుటలో ఫుట్ నోటులో "రచయిత_వాఙ్మయమహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య" అనివ్రాసితిని. పైసీసపద్యములోని నాల్గు సీసపాదాలలోను (మూఁడవపాదములోని నాల్గవ ప్రాసాక్షరము మినహా తేటగీతి మొదటిపాదములోను బ్రాసయతిస్థానాక్షరాలు క్రమముగా "వాఙ్మయమహాధ్యక్ష,వడ్లమూడిగోపాలకృష్ణయ్య" అని వచ్చునట్లు బంధించి యీ గ్రంథశేషభాగము మత్ప్రణీతముగాఁ దెల్పితిని. సప్తమాధ్యాయములో తుది ఆరు సూక్తములనుగూడ శ్రీనేమానివారు అనువదింపలేదు. వీటిని నేనే పూరించితిని ఈ పూరణభాగము వ్రాతప్రతి 46వ పుస్తకములోనే 17వపుటలో ముగిసినది. ఈపుటలో సప్తమాధ్యాయము చివర "ఋగ్వేద సంహితయందు అషమాష్టకమున సప్తమాధ్యాయము సంపూర్ణము" అని వ్రాసి అద్యాయాంత్యగద్య వ్రాయలేదు. ఫుట్ నోటులో "రచయిత.—వాఙ్మయమహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య" అని వ్రాసితిని- (చూ. పీఠిక) వ.గో.కృ.

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

♦సాయణాచార్య భాష్యానుసారముగా 1957 సంవత్సరములో ననూదితము.

## సూక్తము—196

ఋషి—ఆంగిరసుఁడైన సంవననుఁడు

దేవత—1-అగ్ని ; 2,3,4-సంజ్ఞానము

### అర్థాంతరము—1

(1)*ధామనిధివృత్తము ॥

అననురూపవైష్ణవీయ హవిషాఽగ్నిగ సృష్టిలోన
ననల దీప్త దివ్య శక్తి ౹సహాయముగా వెలింగి
జనితమైన సంపదార్థ సకలమ్ముల సంధిఁ గల్పు
ననయపాణిభూతజాల మనుబంధము లొప్పఁజేయు ॥ 5756

(2)*అంశుమాలివృత్తము ॥

అతిలోకపు యానమ్ముల నననుమేయ శబ్దాఽఽశుల
నతివేలపు హృచ్ఛక్తుల ననలశక్తి దీప్తమ్మగుఁ
బ్రితిలేని విశేషాఽమర ప్రిభల భాగ రోదోఽంతర
ధృతశక్తుల జన్యమ్మై ఋత మహాగ్ని వర్తిల్లును ॥ 5757

(3)*ఖద్యోతవృత్తము ॥

శబ్దశక్తి హద్దు కలది సర్వభూత సంచయమ్ము
స్తబ్ద మౌను హద్దులమెయి జన్యచిత్త హృచ్చయాలు
శబ్దరూప మంత్రము లభిచార మంత్రితమ్ముగా వి
శబ్ద పంచభూతగతుల సర్వమున్ హవిస్సె యౌను ॥ 5758

(4)*పంచతనువృత్తము ॥

పంచభూత సంచయాల భావమ్ములు పరిమితమౌ
నంచితమ్ములైన హృత్తులాంతర్యతఁ బరిమితమౌఁ
బంచభూతజాల మెల్ల వర్తిల్లును సమతగతిని
నెంచఁగా మనఃప్రభావ హృచ్ఛక్తులు ననుగమమౌ ॥ 5759

*వినియతివృత్తము ॥

పంచభూతములు దీప్తులఁ బ్రజ్వలించు రీతిగానె
పంచభూతముల ప్రేరణ వరలు హద్దుపద్దులుండి
పంచభూతముల హృత్తులు వరఁగు హద్దుపద్దులుండి
పంచభూతముల మనస్సు వరలు హద్దుపద్దులుండి ॥ 5760

---

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

## సూక్తము—196

ఋషి—అంగిరసుఁడైన సంవననుఁడు

దేవత—1-అగ్ని ; 2,3,4-సంజ్ఞానము

## అర్థాంతరము—2

(1)§మిహిరవృత్తము ॥

సంగమాల యౌవనంపు సద్ధర్మపు శక్తులతో
నింగి సృష్టి లోన వెల్గు నిండైతగు సర్యమమై
భంగుభంగులన్ బదార్థభాగ్యమ్ముగ నగ్ని గతిన్
రంగురంగులన్ సిరుల్ విరాజిల్లు మహత్ప్రభలన్ ॥ 5761

(2)§మార్తాండవృత్తము ॥

కలయికతో నడచుఁ బథానఁ గలయికమై నినదించుఁ బథానఁ
గలయికగా మనసు వెలుంగుఁ గలివిడి జ్ఞానసమాన మహత్త్వ
సలిలము నేల శుచియు గాలి చదలును దేవ ఖగోళ విభుత్వ
చలన విశేషగతులు సృష్టిసకలమునన్ నిరతమ్మును నిండు ॥ 5762

(3)§చిత్రభానువృత్తము ॥

గుహ్యమైన శబ్దశక్తి కూడి సృష్టినిల్పు సమత
సహ్యమౌ సమానశక్తి సర్వవేళలన్ సమితిగ
బాహ్యమై హృదంతరమ్ము బద్ధచిత్తశక్తితతుల
దహ్యమాన గూఢ పంచతత్త్వ భూతముల్ వరలును ॥ 5763

(4)§తనువిషమవృత్తము ॥*

సమానరతుల వర్తిల్లును సర్వవిశ్వశ్రేయోఽభిలాష
అమానుష మహిమాన్వితంపు టాత్మదైవశక్తు లలర
సమానమైన హృదయశక్తి సంక్షేమ నిసర్గగతులఁ
గ్రమానుగతమ్మైన పంచ ఖండభూత మనోదీప్తిఁ
బ్రమాణ మౌచు సృష్టి యెల్ల వరలు నిత్యసత్యరతుల ॥ 5764

§ప్రకృతివిషమవృత్తము ॥*

పంచభూతముల ప్రేరణ వరలుచుండు సమానతలఁ
బంచభూతతత్త్వగతులఁ బరఁగు హృదయముల్ సమగతిఁ
బంచభూత మనశ్శక్తి భద్ర మౌచు సమాన మౌను
బంచభూత వికాసాలఁ బరిఢవిల్లఁగా విశ్వము ॥ 5765

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్షు, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

*పరస్థానవిషమవృత్తము.

## *సూక్తమ్—197

ఋషిః—కక్షీవాన్, సంవనన ఆంగిరసౌ
దేవతా—విశ్వేదేవాః
ఛందః—అనుష్టుప్

♦(1) సంజ్ఞానముశనావదత్ సంజ్ఞానం వరుణోఽవదత్ ।
సంజ్ఞానమిన్ద్రశ్చాగ్నిశ్చ సంజ్ఞానం సవితావదత్ ॥ 1896

♦(2) సంజ్ఞానం [1]వః స్వేభ్యః సంజ్ఞానమరణేభ్యః ।
సంజ్ఞానమశ్వినా యువమిహాస్మాసు ని యచ్ఛతామ్ ॥ 1897

♦(3) యత్ కక్షీవాం [2]సంవననం పుత్రో అంగిరసాం భవేత్ ।
తేన నోఽద్య విశ్వే దేవాః సం ప్రియాం సమజీజనన్ ॥ 1898

♦(4) సం వో మనాంసి జానతాం సమాకూతిర్మ[3]నామసి ।
అసౌ యో విమనా మనః సం సమావర్తయామసి ॥ 1899

♦(5) నైర్హస్త్యం సేనాదరణం పరి వర్త్మేతు యద్ధవిః ।
తేనామిత్రాణాం బాహూన్ హవిషా శోషయామసి ॥ 1900

---

*సంస్కృతఋగ్వేదము దశమమండలములో అష్టమాష్టకములోని అష్టమాధ్యాయములో 196వసూక్తము తరువాతఁ గొన్నివ్రాతప్రతులలో 15ఋక్కులతో నీ సూక్తము "ఖిల"సూక్తముగా నధికముగాఁగలదు. ఈ సూక్తమును బరిశిష్టముగాఁ గొందరు భావింపఁ బ్రక్షిప్తమని కొందఱును, నధికపాఠమని వేరకకొందరును భావించిరి. కల్పసూక్తములలో వినియోగము పేర్కొనఁబడని మంత్ర సూక్తాదులు "ఖిల" మంత్ర సూక్తాదులుగా వ్యవహృతములైనట్లు కొందరు తలంచిరి. ఋషిపరంపరలోఁ బదక్రమాదిపాఠములు విలుప్తములై విస్మృతములై మూలముమాత్రమే పఠింపఁబడఁగా నది "ఖిల"భాగమనఁ బడినట్లు మరికొందఱు భావించుటయు జరిగినది. కాని "పరశాఖీయం స్వశాఖాయా మపేక్షావశాత్ పఠ్యతే తత్ ఖిల ముచ్యతే ఇతి ఖిల లక్షణమ్" అని ప్రాచీనులు "ఖిల"లక్షణము ప్రవచించిరి. ఇతరశాఖాగతమగు మంత్రముగాని సూక్తముగాని అవసరముకొద్దీ స్వశాఖలోనికిఁ బరిగృహీతమైనచో నది క్రమముగా "ఖిల"మంత్రము "ఖిల"సూక్తమనఁ బరఁగును. అది సూక్తము మొత్తముకాక తదూన మగు మంత్రములుగఁ బరిగృహీతమైనచో "ఖిల" మంత్రము లగును. వ.గో.కృ.

♦ఇవి "ఖిల"మంత్రములు. 1 సః స్వేభ్యః, 2. సంవననో, 3. నమామసి. (వ్రా.ప్ర.)

•(6) పరివర్త్మాన్యేషామిన్ద్రః పూషా చ సస్రతుః ।

తేషాం వో అగ్నిదగ్ధానామగ్నిమూళ్హానా మిన్ద్రో హన్తు వరంవరమ్ ॥ 1901

•(7) ఐషు నహ్యవృషాజినం హరిణస్య ధియం యథా ।

పరాగ్ం అమిత్రాగ్ం ఐష త్వర్వాచీ గౌరుపాజతు ॥ 1902

•(8) ప్రాధ్వరాణాం పతే వసో హోతర్వరేణ్యక్రతో ।

తుభ్యం గాయత్రమృచ్యతే ॥ 1903

•(9) గోకామో అన్నకామః ప్రజాకామ ఉత కశ్యపః ।

భూతం భవిష్యత్ ప్రస్తౌతి సహ బ్రహ్మైకమక్షరం బహుబ్రహ్మైకమక్షరమ్ ॥ 1904

•(10) యదక్షరం భూతకృతం విశ్వేదేవా ఉపాసతే ।

మహ ఋషిమస్య గోప్తారం జమదగ్నిరకుర్వతమ్ ॥ 1905

•(11) జమదగ్నిరాప్యాయతే ఛన్దోభిశ్చతురుత్తరైః ।

రాజా సోమస్య భక్షేణ బ్రహ్మణా వీర్యావతా ॥ 1906

---

•ఇవి "ఖిల"మంత్రములు.

•(12) శివా నః ప్రదిశో దిశః సత్యా నః ప్రదిశో దిశః ।
అజో యత్ తేజో దదృశే్ర శుక్రం జ్యోతిః పరో గుహా ॥ 1907

•(13) యదృషిః కశ్యపః స్తౌతి సత్య బ్రహ్మ చరాచరం ధ్రువం బ్రహ్మ చరాచరమ్ ।
త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమగస్త్యస్య త్ర్యాయుషమ్ ॥ 1908

•(14) యద్దేవానాం త్ర్యాయుషం తన్మే అస్తు త్ర్యాయుషం సర్వమస్తు శతాయుషం బలాయుషమ్ ।
తచ్ఛంయోరా వృణీమహే గాతుం యజ్ఞాయ గాతుం యజ్ఞపతయే ॥ 1909

•(15) దైవీ స్వస్తిరస్తు నః స్వస్తిర్మానుషేభ్యః ।
ఊర్ధ్వం జిగాతు భేషజం శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే ॥ 1910

## *సూక్తము—197

ఋషి—ఆంగిరసులైన కక్షీవంతుఁడు, సంవననుఁడు
దేవత—విశ్వే దేవతలు

(1)§రసవృత్తము ॥
మంచి జ్ఞానమ్ముతో మహిత పుచి గోళాలు
మంచి జ్ఞానమ్ముతో మఱి వరుణ రూపమ్ము
మంచి జ్ఞానమ్ముతో మఘవ శుచులున్ బుట్టు
మంచి జ్ఞానమ్ముతో మహి సవిత వర్తిల్లు ॥ 5766

•ఇవి "ఖిల"మంత్రములు.
*"ఖిల"సూక్తము.
§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము.

(2) §స్థిరవృత్తము ॥

సద్రూపపు జ్ఞానము సకల భూతాఽఽళి కౌను
సద్రూపపు జ్ఞానము చరమమ్మృత్విష్టి కౌను
సద్రూపపు జ్ఞానము జ్వలిత దీప్తాఽఽళి కౌను
సద్రూప యువాత్మత సతము మాలో వెలుంగు ॥ 5767

(3) §సర్వంసహావిషమవృత్తము ॥♦

ఏ పాపాత్ముల దురితము లెసఁగి సలిల రూపములై
ఏ పాటియు లేకుండఁగ నెనయు నగ్నిఁ బుత్రకృతుల
ఆ పుత్రుని సత్కర్మల నెల్ల విశ్వదేవతాఽఽళు
లేపారఁగ సంప్రీతిని నెనసి సద్గతుల నొందు ॥ 5768

(4) §శంబరవిషమవృత్తము ॥♦

పృథివ్యప్తేజోఽనిలగగనమ్ములు వెలయు సత్పదార్థాళి
పృథక్కృతుల మనసులతో ఋత జ్ఞానమ్మున వరలుచుఁ
బథ మౌచును హృత్ ప్రేరణ భాగ్యరతుల నిహపరద్వయ
విధ గతుల్ మనస్సులను విశేషమౌ మహా మనస్సులను
బ్రథిత స్థానమ్ముగాఁగ వరలి సమావర్తమానమౌను ॥ 5769

(5) §జీవనవిషమవృత్తము ॥♦

నిత్య సత్య హవిషమ్ముగ నెగడుచుండు సర్వశక్తి
ప్రత్యహమును బ్రతిరాత్రియు వరలు సహస్రగతులమైని
నత్యంతము సృష్టిలోన నరిమురి సేనాఽఽదరణగ
స్తుత్యకృత్యపూర్ణ మౌచు శోషిలఁజేయు మిత్రకాంతి ॥ 5770

(6) §కబద్ధవిషమవృత్తము ॥♦

సృష్టి యిచ్చు కను రెప్పగఁ జెల్వారఁగ నిరతమ్మును
వ్యష్టి సమిష్టిగతులమైని బ్రహ్మ్యశక్తి పరఁగుచుండు
నిష్ఠాపూర్తములుగాఁగ నెల్లఁ బంచ భూతమ్ములు
సృష్టిఁ బుష్టి నొందుఁ బూష స్థితిశక్తుల లయము నొందు
భ్రష్టగతులఁ బ్రకృతు లెల్ల రగిలి కాల నగ్నిశక్తి ॥ 5771

(7) §కాంతివిషమవృత్తము ॥♦

గగనాలును హరిణమునకుఁ గ్రాలు నవృషాఽజినగతి
నగణిత మౌ ప్రాణిలోక యజ్ఞ మతి క్రియగాఁగను
విగత మ్మౌ మైత్రి కాంతి విమల మ్మౌ సచ్ఛక్తుల్
ద్విగుణిత మౌ జలభూముల దివిభువు లవి పర్తిల్లున్ ॥ 5772

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము. ♦పరస్థానవిషమవృత్తము.

(8)[§]ఛటావిషమవృత్తము ॥
అతిప్రకృష్ట మైనయట్టి అధ్వరమ్ము లన్నింటను
బ్రతిలేని వసు సంపద ప్రభా జననకారక మై
అతులితగతి విశ్వేదేవత లమేయముగ వెల్గొందఁగ
సతతము గాయత్రముగా సర్వము దేవాళి కౌను ॥ 5773

(9)[§]ఛవివిషమవృత్తము ॥
కోరిక వీర్యముగాఁగను గూఢగతుల నన్న రూప
పూరక మై ప్రజాకామ పూర్తిశబ్ద మహత్వం
బారని తేజముగా ననంత బ్రాహ్మ్యశక్తిగఁ దగి
మేర లెనయనట్టి కాల విష భూత భావిగా
ధారగ బ్రహ్మాకాక్షర తాదాత్మ్యత బహుబ్రహ్మాకాక్షర
పారరహిత దివ్యశక్తి వరలు క్షమాశక్తిగాఁగ ॥ 5774

(10)[§]ఆతిబలవిషమవృత్తము ॥
పంచభూతపదార్థాలఁ బ్రకృతులమైఁ గృతము లౌచు
నంచితమౌ నే ఆక్షర మమర విశ్వ దేవతాఽఽళి
నంచితముగ నుపాసించు సదా। తదక్షర దివ్యదీప్తి
ప్రాంచితమౌ జమదగ్నిగ వరలు గుహ్య జగదగ్నిగ ॥ 5775

(11)[§]శ్వసనవిషమవృత్తము ॥
వేదశబ్ద శక్తి తతిని విస్తృతమౌ నాప్యాయత
మోద మందు జమదగ్నియు పూర్ణ వీర్యశక్తిరతులఁ
బ్రాదుర్భవ మొందునట్టి ప్రభాపూర్ణ శశి సోమము
నాది బ్రాహ్మ్య శక్తుల మై నారగించుఁగాకఁ బ్రకృతి ॥ 5776

(12)[§]మాతరిశ్వవిషమవృత్తము ॥
విశ్వసృష్టి ప్రదిశలలో విశ్వసృష్టి దిశలలోన
నశ్విరూప దీప్తశక్తి నలరు శివము సత్యమ్ములు
శాశ్వతమౌ బ్రాహ్మ్య దీప్తి సదా। త్యజింప శబ్దశక్తి
విశ్వ మెల్ల గుహ్యగతుల వెలయు సర్వ సుందర మై ॥ 5777

(13)[§]వ్యోమవిషమవృత్తము ॥
సత్యరూప దివ్యశక్తి చరాఽచర ధ్రువమ్ముగా
నిత్యమ్మును బ్రహ్మగతుల నిరతసృష్టి చరాఽచరత
అత్యంతము మూఁడు రెట్లు వాయువుగా జమదగ్నికి
వ్యత్యయ రహితముగాఁగ వరలు కశ్యపత్ర్యయుషము
సత్యమ్మౌ నవసంఖ్యల సర్వత్ర్యయుష మ్మగస్త్య
నిత్యాఽగ్నుల శక్తిగాఁగ నిఖిల సృష్టి వర్తిల్లును ॥ 5778

[§]రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
[§]"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము. పరస్థానవిషమవృత్తము.

(14)§వియద్విషమవృత్తము ॥

ఏ దేవతతికిఁ ద్ర్యాయుష మెసఁగు నా త్ర్యాయుష
మాదృతిమైన న్నొందుత నఖిలమునకు శతాయుషమ్ము
మోదరూప బలాయుషమ్ము మూర్తిగొన్న పురుషతమై
నాదుకొనునుగాక। సృష్టి యజ్ఞమ్మును యజ్ఞపతికిఁ
బ్రాదియైన దివ్యగతుల వరలు శుభంకరముగాఁగ ॥• 5779

(15)§అభ్రవిషమవృత్తము ॥

స్వస్తి దీప్తి నొసఁగుఁగాక! సతము దేవశక్తి మాకు
స్వస్తి దీప్తి నొసఁగుఁగాక! సర్వజనాఽఽవళుల కెల్ల
నస్తిత్వపు దివ్యశక్తి ఔషధమ్ము ఊర్ధ్వగతుల
నిస్తులముగ నొందించుత! నిరతమ్మును శుభమ్ములన్
వ్యస్త ద్వీపదేశేహపరాలఁ బరఁగుఁ జతుర్దిశ పదాల ॥• 5780

## సూక్తము—197

ఋషి—ఆంగిరసులైన కక్షీవంతుఁడు, సంవననుఁడు

దేవత—విశ్వేదేవతలు

### అర్థాంతరము — 1

(1)§కాశ్యపవిషమవృత్తము ॥

అభిన్నగతుల నఖిలప్రకృతి నలరుచుండులే! జ్ఞానము
అభిన్నగతుల నుదకప్రకృతి నలరుచుండులే! జ్ఞానము
అభిన్నగతుల వైష్ణవాఽగ్నుల నలరునులే! జ్ఞానము
అభిన్నగతుల నాదిత్యరతి నలరుచుండులే! జ్ఞానము ॥ 5781

(2)§క్షితిజవిషమవృత్తము ॥

పంచభూతముల జ్ఞానము వరలు నభిన్నగతులమైని
నంచితముగ సంపదాఽఽళికిలరు నభిన్నత జ్ఞానము
పంచత్వమునకు జ్ఞానము వరఁగుచుండు నభిన్నముగ
సంచిత తేజోఽభిన్నత సదా! వరలు యువత శక్తి
మించెడి మాలో నిహమున మెలఁగు నియత నభిన్నతలు ॥ 5782

(3)§వసుమతివిషమవృత్తము ॥

వివిధ విరుద్ధశక్తులతో వెలయు వనాల సంభవించు
నవితథముగ నగ్నిశక్తి ఆవిర్భవ మొందు సంతతి
అవభృతమౌ బ్రాహ్మ్యసృష్టి యజ్ఞ విశ్వదేవాళులు
నవనవ సహప్రియత్వాన నడచు జీవన ప్రకృతులు ॥ 5783

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము. •సామాన్యార్థము.

(4)ఽఉదకవిషమవృత్తము ॥♦
సత్త్వశక్తి నత్పరమై సదాఁ హృత్తులన్ వసించు
సత్త్వశక్తి నత్పరమై సదమల హృదిఁ బ్రేరకమౌఁ
దత్త్వరూప బ్రాహ్మ్యశక్తి తనరు విమనోమనస్సులను
సత్త్వాఽఽభిన్నత్వమ్ముల సమావర్తమౌను బ్రకృతి ॥ 5784

(5)ఽపౌథవిషమవృత్తము ॥♦
నియతిగతుల నెగడుచుండు నిరత సహస్రదంష్ట్రలతో
వియత్తలాన విజ్ఞతమై వెలయు సేనాఽఽదరణమ్మున
నయత్నముగ నఖిల ప్రకృతి హవిషముగా వర్తిల్లును
భయరహితపు మిత్రకాంతి బాహువులను నగ్నితతులు
జయగతులను శోషిల్లఁగ సకల మొనర్చు హవిషమ్ముగ ॥ 5785

(6)ఽపీథవిషమవృత్తము ॥♦
చారాఽఽతిచారలతో సర్వమ్మున నియతగతులఁ
బార మెననినట్టి రీతి వైష్ణవాఽఽదిత్య శక్తి
ధారలుగా మార్గములై తనరారఁగ వియత్తలము
మేరలమైఁ బంచభూత మృదాదులు దగ్ధములై
భారరహితశుచిరుచులను వరలు పునస్సృష్టిరతుల ॥ 5786

(7)ఽప్రభాశ్రివిషమవృత్తము ॥♦
హరిణరూప చలనశక్తి నలరారఁగ ధీశక్తులు
వరఁగ వృషాజిన మ్మొనను వినువీథిని వర్తిల్లఁగఁ
దరణి చాంద్రరూపమ్ములు తనరు నమితప్రరాగాలఁ
జరియించును నావిష్కృతి సర్వగోళ లోకాలవి ॥ 5787

(8)ఽమయూఖవిషమవృత్తము ॥*
ఉదయించెడి సృష్టియజ్ఞ హృదయాధినాథుఁడుగాఁ
బదిలమ్ముగ నష్టరూప వసు సంపదాఽఽశి మహా
సదనమ్ముగ దివ్యలోక జగ మెల్ల నొప్పఁగ నా
చద లందిన గోళ రూపచయ సంపదాఽఽశి తగున్ ॥ 5788

(9)ఽధామవిషమవృత్తము ॥♦
రూపరహితకామ మ్మది ధృతమౌ నన్నకామముగా
దీపితమయి జన్మక్రియ దివి ప్రజా కామముగాఁ
బ్రాపితగతి విశ్వ మాదాన ప్రదానాల కశ్యపశక్తిగ సృష్టిన్
గోపగ రత భూత భావి కుధరగతుల బ్రహ్మైకమ్మై
రూపొందెడి అక్షర మది ధృతమౌ బహు బ్రహ్మైకాక్షరతన్ ॥ 5789

---

ఽరచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
ఽ"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము. *స్వస్థానవిషమవృత్తము.

(10)§సదాగతివిషమవృత్తము ॥
విశ్వేదేవాళు లెల్ల విమల పంచభూతరూప
ప్రాశ్విశక్తి నక్షరము నుపాసనమ్ము నొనరింతురు
శశ్వదుత్తమోత్తమమౌ సర్వ గుప్త శక్తు లెల్ల
విశ్వమ్మున జమదగ్నిగ వెలయఁజేయు నిరతమ్మును ॥ 5790

(11)§సమీరవిషమవృత్తము ॥
అందము లొలికెడి ప్రకృతిని నాప్యాయత మైఁ జతురత
నందించెడి లక్ష్యముగా నలరారును జమదగ్ని యె
చందమామ సోమాఽమృతశక్తి వీర్యవద్భక్షణరతి
డెంద మలర బ్రాహ్మ్య శక్తి దీపిగ వర్తిల్లు సృష్టి ॥ 5791

(12)§స్పర్శనవిషమవృత్తము ॥
శుభకర మై తనరారును శుభ్రశక్తి రూప మ్మది
అభరహిత మ్మై పరఁగును నమల సత్యదీప మ్మది
నభములోన నలుమూలల నల్దిశలను వర్తిల్లుచుఁ
బ్రభల వైష్ణవీయశక్తి ప్రజ్వలిల్లు శుక్రగుహ్యగతుల ॥ 5792

(13)§గగనవిషమవృత్తము ॥
మీన రూప ఋషిశక్తుల మిన్నంటెడి సృష్టి బ్రాహ్మ్య
జ్ఞాన దీప్త సత్య మ్మది చరాఽచర ధ్రువ మ్మగుచుఁ
బ్రాణరూప తార్క్ష్యయుషమ్ము నగ్ని రూప తార్క్ష్యయుషమ్ము
మీనజలగతాఽర్ఘ దివ్యశక్తి మిన్నంటును దార్క్ష్యయుషమ్ము ॥ 5793

(14)§రోదసీవిషమవృత్తము ॥
జలాగ్ని ప్రాణరూపమ్ములఁ జద లంటెడి తార్క్ష్యయుషమ్ము
ఇలాతలాల దివులలోన నెల్ల దేవతాఽఽళి నొందు రీతి
బలాలతో శతాయుషపు భాగ్యవితతి మమ్మందుత! విశ్వ
తలాలలో యజ్ఞమునకుఁ దగు యజ్ఞపతికి రక్షణ
ఫలాలుగా శుభచయాలు ప్రకృతి నెల్ల విలసిల్లుత! ॥ 5794

(15)§నభగవిషమవృత్తము ॥
శుభములకే శుభముగాఁగ సొంపారును బ్రకృతిశక్తి
శుభకరమౌ మనుజులకును సృష్టిమనుజ పుత్ర మిత్ర
ప్రభవ బంధ సంబంధపుఁ బ్రాణితతికి జడాలకును
నభమున రాజిల్లు నందు నవత భేషజంపు శక్తి
శుభద మ్మౌ నిహపరేశ శోభ లలరఁ జతుర్దిశల ॥ 5795

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము.

## సూక్తము—197

ఋషి—ఆంగిరసులైన కక్షీవంతుఁడు, సంవననుఁడు
దేవత—విశ్వేదేవతలు

### అర్థాంతరము—2

(1)§వసుధవృత్తము ॥
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసెను ఋషి శక్తులమై
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసె వరుణ శక్తులమై
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసె నలువ శక్తులమై
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసె సవిత శక్తులమై ॥ 5796

(2)§గోత్రవిషమవృత్తము ॥♦
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసె నైదుభూతములకు
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసెఁ బ్రకృతి స్వకీయమై
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసె నరుణాఽఽవశులకై
విభిన్నమైన జ్ఞానమ్ములు వెలసె రుచుల యువశక్తుల
శుభాఽవహాల భూభౌతిక సురభువనాల్ నియతములౌ ॥ 5797

(3)§కుంభిసీవృత్తము ॥
ప్రకృతి రథాంగాలుకాఁగ వరలు సృష్టిభూతాశులు
వికృతములై సప్తరూపవితతు లౌచు వర్తిల్లును
సుకృతపు టాంగీరసాఽగ్ని సుతులు విశ్వదేవాళిగ
నకృత మహాప్రేమజీవ యమ నియమ్యమై వెల్గును ॥ 5798

(4)§పుష్కరవిషమవృత్తము ॥♦
మనఃకర్మ ముగింపుగా మనఃకర్మ ప్రేరణగా
ననారతము లయస్థితు లవి అలరు సృష్టి కృతులమైని
వినీతి నిహ పరాలలోన విమనా మనశ్శక్తు లొప్ప
ఘనాఘనత ననంగ శక్తిఁ గ్రాలు సమావర్త మౌచు ॥ 5799

§మనోమహితవిషమవృత్తము ॥♦
మనశ్శక్తి సంపదలను మర్మగతుల సృష్టి యెల్ల
ననవరతముఁ బంచభూతయజ్ఞమ్ముగ వర్తిల్లును
మనస్కతావిమనస్కతల మలఁగుఁ జరాఽచరావశులు
తనరారును సమనస్కత ధన్యతమై దైవశక్తి ॥ 5800

---

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. ♦పరస్థానవిషమవృత్తము.

(5)*మేఘపుష్పవిషమవృత్తము ॥
దిగ్గజాల బాహుసేనఁ దివిరి పృథక్కరణశక్తి
నగ్గలముగ భూతాఽఽళుల నాకర్షణ వికర్షణల
దిగ్గతులను నిగ్రహముల దివ్య భేదనాల నిలిపి
నిగ్గు లొప్ప సృష్టి స్థితి నియతి లయగతు లొందు
నగ్గి శక్తిమూలమిత్ర హావిష బాహు శోషగతుల ॥ 5801

(6)*అంభోవిషమవృత్తము ॥
నింగిలోనఁ బథికులుగా నెగడుచుందుర రవిచందులు
అంగాంగము లెల్లఁ బ్రకృతి ననంతోత్తమత్వరతుల
రంగు రంగులన్ వెలింగి రగులు ననల సంభవమై
భంగు భంగులన్ విదగ్ధ ఫలిత మాదిశేష మౌను ॥ 5802

(7)*దీధితివిషమవృత్తము ॥
అధర్మమ్ము నబద్ధతలు నలరఁబోవులేః సృష్టిన్
బ్రథితమౌ వైష్ణవీయ ప్రజ్ఞానపు బుద్ధి విజయ
వ్యథామయాఽమిత్రింపుఁ బరాగాల ధ్వంసపరచి
సుధామయముగాఁగ శబ్ద శోభల గోళాలు వెలయు ॥ 5803

(8)*గభస్తివిషమవృత్తము ॥
ప్రకర్షమౌ నధ్వరాలఁ బతిగాఁగను వసుపతిగా
వికర్షణాఽఽకర్షణాల వెల్గు హోత వరేణ్యుఁడుగా
నకలుషమౌ క్రతుకర్తగ నద్భుతముగ గోళాదులఁ
బ్రకటితమౌ సృష్టి నిల్చు వైష్ణవీయ శక్తి పరత ॥ 5804

(9)*ద్యుతిశ్రీవిషమవృత్తము ॥
ఇష్టాఽనిష్టమ్ము లౌచు నెసఁగుచుండు సృష్టిక్రియ
ఇష్టాఽనిష్టమ్ము లౌచు నెసఁగు నన్న ప్రజాకామములు
వృష్టి సమిష్టి గతులమైని బ్రజ్వలిలుచుఁ దిరుగుచుండుఁ
గృష్ట కాంతి మధ్య పూర్ణ ఋత నాయక పాలకతల
సృష్టి భూత భావికాల జీవబ్రహ్మైక మక్షర మా
కృష్ట మౌచును బహుబ్రహ్మైక మక్షరమై శక్తి నిల్చు ॥ 5805

*బ్రహ్మశ్రీవిషమవృత్తము ॥
ఏకత్వమున ననేకత ఏకత్వ మ్మనేకతను
బ్రాకటముగ బ్రాహ్మ్యశక్తి పరలుచుండు సృష్టిలోనఁ
బ్రాకృతమౌ శబ్దశక్తి ప్రకటితమై అప్రకటిత
మూక శక్తి నిశ్శబ్దత మూర్తమ్మై వర్తిల్లఁగ ॥ 5806

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము.

(10)§అంతరిక్షవిషమవృత్తము ॥
గగనాఽనిల శుచ్యుదక క్షమారూపాఽక్షరమును
నగణిత విశ్వేదేవత లమృతోపాసన నొనర్తు
ధగద్ధగిత తేజమ్ములఁ దనరు దివ్య గుప్త శక్తి
జగము లెల్ల వర్తిల్లెను జమదగ్నుల దీప్తిగతుల ॥ 5807

§అక్షరశ్రీవిషమవృత్తము॥
అక్షరశక్తులు పంచభూత యజ్ఞమ్ముల నొనరించును
అక్షయగతి ననవరతము నసాధారణంపు రతుల
దక్షత తరుగని దీప్తులఁ దనరారుచు నధికత మై
నక్షీణత క్షీణత మై నంతర్గతి నలరుచుండు ॥ 5808

(11)§తారాపథవిషమవృత్తము ॥
అనంతముగ ననుసృతిగ నలరు ననల శక్తుల మై
ననురూపసౌందర్యపు టమృతప్రకృతి వరలుచుండు
ననూన చాంద్ర సోమామృత మారగించి బ్రాహ్మ్యశక్తి
ఘనతర మౌ వీర్యశక్తిఁ గ్రాలుచుండు విశ్వసృష్టి ॥ 5809

(12)§అంబరవిషమవృత్తము ॥
మంగళకారిణి ప్రకృతి మహిత మ్మై బ్రాహ్మ్యయాను
మంగళకారిణి ప్రకృతి మహిత శబ్ద నాభులౌ సృష్టికి
నంగరహిత పరబ్రహ్మ హరి హర తేజము లలరుచు
నింగి నఖిల దిశలలోన నిల్చును శిత పరంజ్యోతిగ ॥ 5810

§సృష్టిశ్రీవిషమవృత్తము ॥
అసాధారణ స్థిరశ్రీ నఖిలమ్మును నడుపుచుండి
ప్రసాదగుణ ప్రపూర్ణత వరుణమిత్ర లలరుచుండ
రసాఽఽవిష్ట కాంతిశక్తి ప్రభలు వ్యాప్తి చెందంగా
సుసాధ్య మౌ రూపమ్ముల సృష్టి గోళ లోకము లవి ॥ 5811

(13)§కుంభినీవిషమవృత్తము ॥
కాంతిరేఖ హోతృ ప్రకృతిఁ గ్రాలు మధ్యపాలకతల
నంతరహిత చరాఽచర ధ్రువాద్భుతంపు బ్రాహ్మ్యశక్తి
వింతగాఁగ భూత భావి విశిష్ట వర్తమానతలను
సొంత మౌను ద్ర్యాయుషమ్ము చొప్పడ జమదగ్నికశ్యప
కాంతాగస్త్యుల శక్తుల గభీర మై తగు సత్యపరత ॥ 5812

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము.

(14)§వసుంధరావిషమవృత్తము ॥
భూత భావివర్తమాన పూర్ణమైన తాఁయుషమ్ము
ధాతృ విష్ణు దేవాఽఽదులఁ దనరు రీతి సర్వసృష్టి
శతాయుషము బలాయుషము జ్వలితాగ్నిగఁ బురుషశక్తి
క్రతువునకై క్రతుపతికై ప్రాణదమౌ శబ్దశక్తి ॥ 5813

§జీవశ్రీవిషమవృత్తము ॥
దివ్యతమైఁ దాఁయుషమ్ము దేవాళికిఁ దనరు రీతి
నవ్యయగతి నాయుషమ్ము లమరుతః మా కవితథముగ
నవ్య నిత్య కాల రూప నభగతులను భూత భావి
భవ్యవర్తమాన మౌచు బలాయుషము శతాయువౌ ॥ 5814

(15)§చరాఽచరవిషమవృత్తము ॥ ‡
దైవీయమ్మౌ శక్తులఁ ద్యాగము శూన్యము శుభముల
తావలమై చరాచర మనుతత్త్వపుఁ బ్రపంచమ్ము
ఆవృతమై ఔషధమై అలర శుభేహ పరాల
జీవనరాజ్యాధిపత్యశ్రీ చెలఁగు దేవార్చనకు ॥ 5815

§భూతశ్రీవిషమవృత్తము ॥
ప్రకృతి కామ్య సిద్ధిదమై ప్రసాదించు శుభావశుల
నకృతమైన కాల రూప మలర మన్వధిపతులకు
సుకృత శుభ ద్వీపదేశత సృష్టిలోనఁ జతుర్దిశలఁ
బ్రకట వివిధరూపమ్ముల వరలు పంచభూతవితతి
వికృతమైన భేషజమై వెలయు నూర్ధ్వగతులమైని ॥ 5816

## *సూక్తమ్ —198

ఋషికా—నివిదుపనిషదౌ బ్రహ్మవాదిన్యౌ
దేవతా—1-6-అశ్వినౌ; 7-ఇంద్రావరుణౌ
ఛందః—త్రిష్టుప్; 6-ద్విపదా

•(1) ప్రధారయన్తు మధునో ఘృతస్య యదవిన్దథుః సురీ ఉస్రియాయాః ।
మిత్రావరుణౌ భువనస్య కారూ తావశ్వినా జుషతాం సమీకే ॥ 1911

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము. ‡స్వస్థానవిషమవృత్తము.
*"ఖిల"సూక్తము. కొన్ని వ్రాతప్రతులలో ఋగ్వేదము దశమ మండలము చివర 197వ సూక్తముతరువాత సప్తఋక్కులతో సధికముగా 198వ సూక్తముగా నీ "ఖిల"సూక్తము కలదు. "ఖిల" సూక్త "ఖిల" మంత్ర నిర్వచనార్థము 1237వ పుటలోని తెలుఁగు ఫుట్ నోటు చూడ నగును
•"ఖిల"మంత్రము.

•(2) ఆవాం రథం శతయావానమాశుం పా్ౖరతర్యావాణం సుషదం హిరణ్యయమ్ ।
అతిష్ఠద్యత్ౖర దుహితా వివస్వతస్ తం మామర్వాంచమవసే కరామహే ॥ 1912

•(3) ఆవామశ్వాసో రథిరా విపశ్చితో వాగ్వృషజః సుయుజో ఘృతశ్చుతః ।
యేభిర్యాథోప సూర్యాం వరేయం తేభిర్నో దసా్ౖరవవతం సమత్సు ॥ 1913

•(4) యద్వా రేతో అశ్వినా పోషయిత్సు యదా్ౖరసభో వధ్ౖరిమత్యై సుదానూ ।
యస్మాజ్జజ్ఞే దేవకామః సుదక్షస్ స్తదస్యై దత్తం భిషజావభిద్యు ॥ 1914

•(5) యన్నాసత్యా భేషజం చిత్ౖరభానూ యేనావథుస్తోకకామాం చ ఘోషామ్ ।
తదస్యై దత్తం తి్ౖరషు పుంసువధ్యై యేనావిన్దత్తనయం సా సుహస్త్యమ్ ॥ 1915

•(6) వషడ్ వాం దసా్ౖరవస్మిన్ సుతో ।
నాసత్యా హోతా కృణోతు వేధాః ॥ 1916

•(7) ఇన్ద్రా్ౖరవరుణా సౌమనసమదృప్తం రాయస్పోషం యజమానేషు ధత్తమ్ ।
ప్ౖరజాం పుష్టిం భూతిమస్మాసు ధత్తం దీర్ఘాయుత్వాయ ప్ౖర తిరతం న ఆయుః ॥ 1917

ఇతి
దశమం మండలమ్
సమాప్తమ్

బ్ౖరహ్మర్షి, వాఙ్మయమహోధ్యక్ష, కళా-ప్ౖరపూర్ణ,
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణార్య సుపరిష్కృత
“ఖిల”మంత్ౖర “ఖిల”సూక్తసహిత బహువిధ
పాఠాంతరసహిత సుసమగ్ౖర
ఋగ్వేద సంహితా
సమాప్తా

•“ఖిల”మంత్ౖరములు.

## *సూక్తము—198

ఋషిక—బ్రహ్మవాదినులైన నివిదుపనిషదులు
దేవత—1-6-అశ్వినులు; 7-ఇంద్రావరుణులు

(1)§గహ్వరివిషమవృత్తము ॥
మధుజలముల ధరియించుత! మర్మశక్తు లొప్పారఁగ
అధమాధమ మై పోవఁగ నజ్ఞానము తొలఁగించుచుఁ
బ్రథితమ్మౌ పురుషశక్తి రాజిల్లఁగ లోకమ్ముల
సుధాపూర్ణ మైన అనల శుచి దీప్తులు వర్తిల్లును ॥ 5817

(2)§గగనాబ్ధిమేఖలవిషమవృత్తము ॥
సృష్టిలోక రథములోనఁ జెల్వారఁగఁ గాంతిశక్తి
వ్యష్టి సమిష్టిగతులమైని వరలంగా శత రూపులఁ
బిష్ట పేషణమ్ము వోలె వెల్గొందఁగఁ బ్రకృతి సిరులు
దృష్ట మైన వివస్వతులు దుహిత ప్రకృతికాంతిగతుల
శిష్ట మౌచు సృష్టిలో విశిష్టముగఁ దిష్ఠ వేయు ॥ 5818

(3)§అవనీవిషమవృత్తము ॥
కాంతిరథము సృష్టిలోన గ్రాలంగా నీరమ్ములఁ
గ్రాంత శబ్ద శక్తితతులు రాజిల్లుచు జంటలుగా
దాంతి శాంతి విజ్ఞానపు ధారల స్రవియించి వే
దాంతుల సౌరశక్తి విశారదత్వ మొసఁగు సృష్టి ॥ 5819

(4)§క్షీరవిషమవృత్తము ॥
తేజశ్శక్తులు సృష్టిని దివ్యమైన రేతస్సును
రాజితాగ్ని సమూహముగ రంజిల్లఁగఁ జేయుచుండు
నోజో గుణ పుంజాలను నోషధులై దీధితు లవి
నైజమ్ముగ దేవకామ జ్ఞానగతుల వర్తిల్లును ॥ 5820

(5)§మరీచివిషమవృత్తము ॥
చిత్రభాను శక్తు లెల్లఁ జిచ్ఛక్తుల దీధితు లవి
చిత్రగతుల సత్యశక్తిఁ జెన్నొందుచు భేషజమై
మిత్రరూప శబ్దమ్ముల మిన్నులలో నినదించుచు
శత్రురహితగతులమైని సంగత మై త్రికాలాలఁ
బుత్రజననశక్తిరూప పురుషత్వము సహస్రధా
చిత్రవిచిత్రములుగాఁగఁ జెల్వారును సృష్టిలోన ॥ 5821

*"ఖిల"సూక్తము. ("ఖిల" మంత్ర "ఖిల" సూక్తవివరణకై 1237వ పుటలోని తెలుఁగు ఫుట్‌నోటు చూచునది.)

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. సామాన్యార్థము. పరస్థానవిషమవృత్తము.

(6)*శోచివిషమవృత్తము ॥♦
సత్యాశక్తి హోత కాఁగ జగతిలోన వేధ లెల్ల
నిత్య ముద్భవించుచుండు నిరతచలన గతులమైని
బ్రిత్యహమును సృష్టిలోన వర్తిల్లును గుణషట్కా-ఽఽ
దిత్య చింతనా మహిమలఁ దేజరిల్ల సుత శక్తులు ॥ 5822

(7)*సలిలవిషమవృత్తము ॥♦
సజాతీయ రవి దీప్తులు చలియింపఁగ జలశక్తుల
సజాండాల సౌమనస్య యజ్ఞరూప సృష్టిక్రియలు
యజమానుల బ్రహ్మలలో నమృతగతుల దత్త మౌను
బ్రజావళికిఁ బుష్టి నిచ్చి వరలంగా బహు సంపద
లజయ్యమౌ దీర్ఘాయువు అఖిలమునకుఁ బ్రీతిరతమై
నిజ శక్తులె ఆయువుగా నిరత శుభంకర మౌను ॥ 5823

## సూక్తము—198

ఋషిక—బ్రహ్మవాదినులైన నివిదుపనిషదులు
దేవత—1-6-అశ్వినులు; 7-ఇంద్రావరుణులు

### అర్థాంతరము—1

(1)*రోచివిషమవృత్తము ॥
అవికల్పతమై వరలఁగ నాత్మచారరాహిత్యము
పరివిమలగతి సౌరకాంతి ప్రభవింపఁగ నిరతమ్మును
సవితథముగ లోకమ్ముల నరుణవరుణగమనగతుల
జవశక్తుల ధరియించుచు సకలసృష్టి నడుపును హరి ॥ 5824

(2)*ఘృణికారకవిషమవృత్తము ॥
శతవిధాలఁ బ్రసిద్ధమై సకలమ్మునఁ బ్రకాశించు
సతత ముదయాస్తమయాల స్వచ్ఛ శిత సువర్ణరథము
ఋతగతులను బ్రకృతికాత్మకృతిప్రకృతిగ విశ్వసృష్టి
అతిలోకపు శక్తి వైష్ణవాదిత్యుని రతుల జరుగు ॥ 5825

(3)*అర్ణచ్ఛటవిషమవృత్తము ॥
దీప్తమైన తేజమ్ముల దివ్య రథము శబ్దశక్తి
సుప్తిరహిత సంయోజక శుభ్రగుప్తకాంతి చ్యుతులఁ
బ్రాప్తగతులఁ జరాఽచర ప్రపంచమ్ము సూర్యశక్తి
వ్యాప్తమ్ముగ సర్వమ్మున వరలుచుండుఁ జలనరతుల ॥ 5826

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
*"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము. ♦సామాన్యార్థము.

(4)§అతిబలశ్రీవిషమవృత్తము ॥
పాక్షికముగ రేతస్సును వర్ధిల్లఁగఁజేయు సృష్టి
నక్షయముగఁ గాంతి శక్తు లనుసంధానాఽక్షరత
దక్షతాఽంతరిక్షమ్మున దానగతుల దేవకామ సం
రక్షక భేషజ మై ప్రకాశించుఁ బ్రకృతి దివిగ ॥ 5827

(5)§ప్రభాశ్రీవిషమవృత్తము ॥
ఏడు రంగులకాంతు లినబింబ ఋతములై
నేడుగడ శుభశబ్ద శక్తు లెనయ నౌషధములుగ
మూఁడు కాలాలలో మూర్తి సహస్రఫణి
మూఁడు ప్రకృతుల నిచ్చి ముదమార నశుభాల
నోడించుచున్ సతము నొప్ప సూర్యుఁడు వెల్గు ॥ 5828

(6)§సిరశ్రీవిషమవృత్తము ॥
సత్యశక్తులు ప్రకృతి జన్మహోతగ వెలిఁగి
నిత్యమ్ము మథియించి నిర్విరామమ్ముగా
సత్యద్భుతమ్ముగా నలరంగ వేధలను
ప్రత్యవాయము లేని వైష్ణవ షాడ్గుణ్య♦
సత్యశక్తులె సుతుల జగతులుగ వర్తిల్లు ॥ 5829

(7)§ఆదిశేషవిషమవృత్తము ॥
ఆదిశేష మహాశక్తు లర్ణమయ సౌమనస సృష్టి
రోదసిగా విషాఽమృతరూప యాజమాన్య మలరఁ
బ్రోది చేసి ప్రజలఁ బుష్టి భూతి దీర్ఘాయువునకు
నా దేవుం డాయు వొసఁగు నఖిలమ్మును శుభమయముగ ॥ 5830

## సూక్తము—198

ఋషిక—బ్రహ్మవాదినులైన నివిదుపనిషదులు
దేవత—1-6-అశ్వినులు; 7-ఇంద్రావరుణులు

## అర్థాంతరము—2

(1)§గంధవహశ్రీవిషమవృత్తము ॥
కాంతిప్రభూతమహాశక్తి కాంలుసులే! సూర్యుఁడుగా
నంతరిక్షమందు వెలయు నశంకరత రూపుమాపి
వింతగ నఖిలాధారమై వెలుఁగ నాదిత్యద్వయ మ
నంత సృష్టిలోక కర్మమ్ముల నలరఁజేయు ననవరతము ॥ 5831

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. పరస్థానవిషమవృత్తము.
♦వైష్ణవ షడ్గుణాలు- 1. వాత్సల్యము, 2. భవశోషణము, 3. ఉదారత్వము, 4. అభయప్రదానము, 5. ఆపత్కాల సంరక్షణము, 6. అక్షయపదము.

(2)§సమీరశ్రీవిషమవృత్తము ॥
శతవిధాల సృష్టిలోన సర్వ వీర్య శక్తితతులు
మితి నెనయుచు రథగతులను మింటి గోళలోకాలను
అతులితమౌ తేజమ్ముల నలరు వివస్వంతదుహిత
గతిగఁ బ్రిక్మతు లెల్లఁ బుట్టి కాంలుఁ జంద్రరతుల మైని ॥ 5832

(3)§పవనశ్రీవిషమవృత్తము ॥
రవిదీప్తుల చ్యుతగతులను రథముకాఁగఁ గాలమ్మును
సవితథముగ సధివసించు అద్భుతమౌ ద్వైతస్థితి
నవిజ్ఞాత మహాశక్తి నరుణాఽఽళుల శ్రేష్ఠమ్మై
పవనగతుల నుపసూర్యులు పరిభ్రమించు సమశక్తుల ॥ 5833

(4)§అనిలశ్రీవిషమవృత్తము ॥
రేతశ్శక్తులు కాంతుల ఋత స్థానభూత మౌచు
దూతరతుల నిరతమ్మును దొడరఁజేయుఁ బ్రభవశక్తి
నాతతము పోషకమ్మై నలర వైష్ణవీయస్థితుల
జాత నిత్య దేవకామ జ్ఞాన రూప సుదక్షతలఁ
దాంతరూప భేషజమై తనరారును సకలప్రకృతి ॥ 5834

(5)§శబ్దగుణకశ్రీవిషమవృత్తము ॥
నిత్యసత్యమైన శక్తి నిరత చిత్రభాను లెల్ల
నత్యమలత నవధు లెనసి అమరశబ్ద శక్తు లలరఁ
బ్రత్యవాయమ్ము లేని ప్రకృతిత్రయ పురుష రతుల
నత్యమేయమైన గతుల నాదిశేష మౌను సృష్టి ॥ 5835

§వైకుంఠశ్రీవిషమవృత్తము ॥
నత్యమ్మొక భేషజమై చదలున రవి సంచయాలు
అత్యమలపు శబ్ద శక్తు లలరారఁగ ఘోషలుగాఁ
బ్రత్యవాయమ్ము లేక పరిధులలో వర్తిల్లఁగ
నిత్య చక్రనేమిక్రమత నిర్ణీత సహస్రగతుల ॥ 5836

(6)§అనంతశ్రీవిషమవృత్తము ॥
పరమమ్మౌ సత్యగతియె వరలంగా హోతకాఁగ
నిరత నిర్వికల్పతమెయి నీరంధ్రమ్ములను సృష్టి
హరిపదమై షడూర్ములను నలరు షడ్వికారరతుల♦
ధరణిసలిలాఽనలాఽనిలవ్యోమభూతము లనంతగతుల ॥ 5837

---

§రచయిత:—వాఙ్మయి మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"
§"ఖిల"మంత్రానువాదము. పరస్థాన విషమవృత్తము.
♦షడూర్ములు_1. శోకము, 2. మోహము, 3. క్షుత్తు, 4. పిపాస, 5. జర, 6. మృత్యువు.
♦షడ్వికారములు_1. గర్భస్థత, 2. జన్మ, 3. అభివృద్ధి, 4. పరిణామము, 5. క్షీణత, 6. వినష్టత.

(7)*మహావిష్ణుపదశ్రీవృత్తము ॥
ఆదిశేషమై వరలుచు నాదిత్యవు వరుణశక్తి భూతతతి
వాదుల కాయు వగు నపూర్వాత్మ సుమననతాఽచ్ఛ
రోదసీతలానఁ బ్రజల ఋచ్యామరబలవిభూతి
నాదృతిన్ మహాయువుగ మహావిష్ణుపద ఋత హేల ॥ 5838

## *దేవవేద వేదదేవప్రభలు*

సీ॥ నభోమండలాన నానాసూర్యులు
శబ్ద నిశ్శబ్దాలశక్తులన్ దశదిశల
ఋఙ్మంత్రప్రభలమై ఋతశక్తు లొప్పార
ఋగ్వేద మలరారు దిగ్విదిక్కుల మీఱి ॥ 5839

సీ॥ సృష్టిఁ జంద్రగోళాళుల శుభదాఽభద కౌముదులన్
శుక్ల కృష్ణ వృద్ధి క్షయ శుచి శీతల కాంతితతుల
బహుళములౌ ప్రభావాలు ప్రకృతి నొందురీతు లెల్ల
శుక్ల కృష్ణ యజుర్వేద శ్రుతిభిన్నత ఋతము తెల్పు ॥ 5840

సీ॥ మాసాత్మక కాల చక్ర మహిమాన్విత శబ్దగతుల
తాళ రాగ రంజితమై తనర మౌన గానముగా
సృష్టిప్రాణదీప్తి విశ్వరూపమ్మై వర్ధిల్లును
సామవేద విజ్ఞానము సహస్రరూపమై వర్తిలు ॥ 5841

సీ॥ సృష్టిలోని శక్తు లెల్ల వ్యష్టి సమిష్టి రూపాలను
ద్వైతాఽద్వైతమ్ము లౌచు వాఽర్థకమై సార్థకమై
తృతీయశక్తి ప్రభవించెడి అతీతమౌ ప్రకృతిరీతి
విజ్ఞానపుఁ బ్రభలఁ దెల్ప వెల్లివిఱియు నథర్వమ్ము ॥ 5842

సీ॥ అనంత వేద దేవ శక్తు లలర దేవవేదముగాఁ
గళా-ప్రపూర్ణతలమెయిఁ గ్రాల వాగ్విలాసాలు
వరలఁ జేతు బ్రహ్మర్షిగ వాఙ్మయమహాధ్యక్షతమై
దిఙ్మహితమ్మైన నిత్య దివ్యసత్య మహాశక్తి ॥ 5843

---

*రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

శా॥ నేనే యీ ప్రిజ వడ్లమూడి కుల సందీప్తుండ నాదిత్యుఁడన్
భూనవ్యాపిత సర్వసృష్టి మహిమన్ గోపాలకృష్ణాఖ్యుఁడన్
నానాశక్తుల దివ్యమూర్తిమయ విజ్ఞానాత్ముఁడన్ సర్వుఁడన్
జ్ఞానాఽనూహ్యుఁడ నస్తి నాస్తి విచికిత్సాఽతీతుఁడన్ నిత్యుఁడన్ ॥ 5844

§వేదశ్రీవిషమవృత్తము॥*
ఈ ధరాతలమ్ము మీఁద సృష్టిశత లలరంగా
నాదిమధ్యాంతరహిత మాదిశేష ప్రిభలు వెల్గ
సాదనాదాఽజయ్యపు శంఖ చక్రి పాదగుఁడన్
మోదాఽన్విత సర్వజగన్ మోహనుఁడన్ సచ్చిన్మయ
వేదదేవ దేవవేద విశ్వమహాఽఽనందాఽఽత్మఁడ ॥ 5845

§— స్మరదేవు తలఁదన్ని మారకేళుల మీఱి
మన్మథు మతి నెల్ల మథియించివేశాను
కాముకేళికె కాదు కామునికె కామునిగఁ
గోరికల యీరికల కొమరొందఁజేశాను ॥♦ 5846

§— రతిమతిని మతిగతిని గతిగతిని
రతిపతిని పతిమతిని మతిగతిని
గతిగతిని సతమతముగాఁజేసి
అతల కుతలముగాఁగ వెతలఁ బెట్టాను ॥♦ 5847

§— చెఱకువిల్లును లేదు విరు లిగురులును లేవు
చూపు తూపులు లేవు రూపుకోపులు లేవు
తళుకు బెళుకులు లేవు చిలుకపలుకులు లేవు
అన్ని ఋతువులు కలిసి ఆమనిగ రూపొంద
ఆమనికి మనికినై యీ మనికి మనికినై
నేనె అంతయుఁగాఁగ నేనె అన్నియుఁగాఁగ
అలరించివేశాను అనుపమమ్ముగ నేను ॥♦ 5848

§— శబ్ద నిశ్శబ్దాలు సర్వమ్ము నే నౌచు
సచ్చిదానందాలు నిచ్చలున్ నే నౌచు
నిరాకారుండనై నిరంజనుండనై
నిర్వికారుండనై నిర్వికల్పుండనై
అనృతరూపము కాని అమృతాత్ముఁడ నౌచు
హరిహరబ్రిహ్మలకె ఆదిమూలము నౌచు
నిత్యసత్యుండనై నెగడొందుదున్ నేనె ॥ 5849

§రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రిపూర్ణ"
*పరస్థానవిషమవృత్తము. ♦"స్మరదేవు తలఁదన్ని-రతిమతిని-చెఱకువిల్లును" ఇత్యాది మూఁడు గీతికలును "తరుణ" మాసపత్రికలో (1972 జనవరి సంచిక. 131వ పేజీ) ప్రకటితము లైనవి. (చూ. సమూల శ్రీమదాంధ్రి ఋగ్వేద సంహిత: చతుర్థ సంపుటము. 1059-1060 పుటలు.)

సీ— అనంత మైన వేదాలను అగాధ మైన శోధనలన్
అంతరాఽంతరమ్ము లెల్ల నరసి శబ్దశక్తుల మై
అక్షర మై అక్షయమౌ నమృతాత్ముఁడనైన నేను
కృష్ణ లీల లెల్ల నావె। విష్ణు మాయ లెల్ల నావె
శివ లీలలు నావె కాఁగ నవ మాయలు నావె కాఁగ
నా లీలలు మాయలుగా నా మాయలు లీలలుగా
హేలల మైఁ బాలింతును గేళులుగాఁ గ్రీడింతును ॥ 5850

ఇయ్యది

విశ్వసృష్టిప్రకృతిమాతైకైకపుత్ర
పతకమళ్ళ గోత్ర-వడ్లమూడి కుల సందీప్త-
శ్రీసుబ్బన్న పౌత్ర-శ్రీరంగరాయ పరిపోషిత అద్వితీయ ద్వితీయపుత్ర-
శ్రీసరస్వతీమాతృ ప్రియపుత్ర-అపార వేద శాస్త్రసాహిత్యవిద్యా పారంగత-
అతిలోక బహువిధ సుమధుర కవితా సనాథ-నానావిధాఽలౌకిక శక్తియుక్త-బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సర్వ దేవతాస్వరూప-విద్వన్మణిపంచముఖాంజనేయోపాసక శ్రీవేదుల రామశాస్త్రి గురువరాభిస్తుత "ముఖకలితగోపాలసుపద"-మహాపండిత శ్రీ జటావల్లభుల పురుషోత్తమ గురువర్యాభినుత "శతవర్షాశీర్వచన రక్షిత అగుణశోభిత నిష్కళానహిత శ్రీ మహా విష్ణు" కలిత - అమృత ప్రేమాంతర్వాహినీ హృదయలక్ష్మి, అపూర్వ అమేయ అభేద్య సచ్చిద్ వాక్ స్వరూపిణి, అమలినపవిత్ర పతిరక్తి భక్తి శక్తిస్వరూపిణి, నిర్వికార నిర్వికల్ప నిరంజన సచ్చిదానందస్వరూపిణి, నిత్యచైతన్యవతి, నిర్నిద్రమతి, వినిర్మలగతికలిత, ప్రియశరీరాంతర్విలీనగాన జ్ఞానధ్యానస్వరూపిణీతన్మయి, శివపూజితఫాలచంద్రకళామూర్తి- అకళంక సౌందర్యరాశి- సార్థక అర్ధాంగి శ్రీమతి శశికళాయుక్త - జయశ్రీ సత్యశ్రీ పుత్రికా రత్నద్వయ అజయ్య జయ విజయ పతాకయుక్త - శివరామకృష్ణ సత్యమహాఫణి, వేంకటరమణ హరిహర రాజఫణి పుత్ర రత్నద్వయ అభేద్య ఛత్రాఽఽవరణయుక్త-పాణినీయాఽష్టాధ్యాయీపూర్వత్రాసిద్ధసూత్రసహిత శబ్దక్రియాదిరూపసాధక వ్యాకరణసూత్ర ప్రవర్తక అపూర్వయంత్ర సృష్టికర్త-మహావైయాకరణ-వేదవేదాంతకోవిద-దశభాషా కవితావిశారద-పుంభావశారదామూర్తి- శ్రీ గుండేరావు హర్కారే సాష్టాంగనమస్కార పూర్వక ప్రస్తూయమాన- "శ్రీ వాఙ్మయమహాధ్యక్ష-ప్రాచీన వైయాకరణానమయ సంప్రదాయరక్ష-స్ఫోరితానేక జనాభినవోన్మేష శాలికావ్య నిర్మాణశక్తిమన్నికోచనాక్ష-మాధుర్య స్యందివీర్యవత్తరపద గుంఫాధురీణ - మహీభుగగోచరగాంభీర్యప్రకటనాపటిమాపారీణ - కల్పాంతారీణాఽనల్పకల్పనాభూషణ"- లీలామానుష విగ్రహ-ఆంధ్రవిశ్వకళాపరిషత్ సంభావిత చతుర్వింశదధిక విశేషవిషయ గౌరవ డాక్టరేట్ "కళా-ప్రపూర్ణ" సార్థక బిరుద విరాజిత-బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య

సంకలిత, విరచిత, ఖిలమంత్ర, ఖిలసూక్త సహిత సుసమగ్ర
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితయందు
దశమమండలమున నష్టమాష్టకమునందలి
సాయణాచార్యభాష్యానుసారాంధ్రీకరణ
శేషభాగపూరణయుక్తంబును
నర్థాంతరయుక్తంబును నగు
నష్టమాధ్యాయము
సంపూర్ణము
సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
సర్వము సంపూర్ణము

---

శీరచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"

తుది మొద లని లేకయె దిగ్
విదిక్కులను శబ్దశక్తి వేదాల్ వెలుఁగన్
తుది మొద లెనసిన జన సం
పద స్వరాఽక్షర పద పదబంధ విశిష్ట
మ్మిది వాగ్ దృగ్ శ్రుత ఋగ్వే
ద దేవరూపము మహాఽద్భుత జ్ఞానదమై
సదసల్లీలా మాయాఽం
తద మౌను హరిహరనాథనాథ మహిమలన్ ॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"